# ఆధునిక ప్రపంచ నిర్మాతలు-
# జీవితాలలో చీకటి వెలుగులు

## గబ్బిట దుర్గాప్రసాద్

ప్రచురణ:

**సరసభారతి**

ఉయ్యూరు, కృష్ణాజిల్లా

# ADHUNIKA PRAPAMCHA NIRMATHALU-JEEVITHALALO CHEEKATI VELUGULU

by

## Gabbita Durga Prasad

First Edition: **December 2017**

Copies: 500



Price. Rs.**400/-**

Cover Design: **Kalasagar**

For Copies: **Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Type Setting: **"Ramya Bharathi"** vja

Printed : **Rainbow Graphics,** vijayawada-2

# అంకితం

స్వర్గీయ

డా.శ్రీ పరుచూరి రామకృష్ణయ్య గారికి

- గబ్బిట దుర్గాప్రసాద్



# స్వర్గీయ డా॥ శ్రీ పరుచూరి రామకృష్ణయ్య గారికి అంకితం

**లూ**యీ అంటర్ మేయర్ ఆంగ్లంలో రాసిన బృహద్గ్రంథం "మేకర్స్ ఆఫ్ ది మోడరన్ వరల్డ్" ఆధారంగా నేను దాదాపు సంవత్సరన్నర కాలంగా అంతర్జాలంలో 245 ఎపిసోడ్లుగా 91 మంది మహానుభావులపై రాసిన "ఆధునిక ప్రపంచ నిర్మాతలు జీవితాలలో చీకటి వెలుగులు"ను ఎవరికి అంకితం ఇవ్వాలా అని ఆలోచిస్తుండగా ఆప్తమిత్రులు, సరసభారతి శ్రేయోభిలాషి ఆత్మీయులు శ్రీ మైనేని గోపాలకృష్ణగారు (అమెరికా) తమ బావమరది ప్రపంచ ప్రముఖ స్టాటిస్టిక్స్ గణిత శాస్త్రవేత్త వితరణ శీలి, సుమనస్కులు స్వర్గీయ డా. శ్రీ పరుచూరి రామకృష్ణయ్య గారికి ఇంతటి విశిష్ట రచన అంకితమిస్తే గ్రంథ ప్రాముఖ్యత ద్విగుణీకృతం అవుతుందని సూచించి నా అనుమతిని కోరటం, నేను క్షణం కూడా ఆలోచించకుండా ఆమోదించటం క్షణాల మీద జరిగిపోయింది. ఈ గ్రంథాన్ని సరసభారతి ద్వారా ముద్రించటానికి అవసరమైన ధనాన్ని శ్రీ మైనేని గోపాలకృష్ణ శ్రీమతి సత్యవతి దంపతులు రేపల్లె వాస్తవ్యులు కీ.శే.పరుచూరి భావాన్నారాయణ చౌదరి చారిటబుల్ ట్రస్ట్ చైర్మన్ శ్రీపరుచూరి శ్రీనాథ్ గారిని సంప్రదించి వారి ఆమోదాన్ని నాకు తెలియబరచారు. ఇంతటి బృహత్ గ్రంథానికి బృహత్ప్రోత్సాహం నన్ను సంతృప్తి పరచింది. ఇంతటి ఆచూకీ గ్రంథం అంటే రిఫరెన్స్ పుస్తకం సరసభారతి 28వ గ్రంథంగా వెలువడటం నేను రాసిన 15వ పుస్తకం కావటం మహదానందంగా ఉన్నది.ఒక సర్వశ్రేష్ట గ్రంథం ఒక సర్వశ్రేష్ట మహోన్నత వ్యక్తి స్వర్గీయ డా. శ్రీ పరుచూరి రామక్రష్టయ్యగారికి అంకితం ఇస్తున్నందుకు సంతోషిస్తూ వారి గురించి వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను.

### స్టాటిస్టిక్స్‌లో శాశ్వత కీర్తి నార్జించిన స్వరీయ డా. శ్రీ పరుచూరి రామకృష్ణయ్యగారు జనన విద్యాభ్యాసాలు

శ్రీ పరుచూరి రామక్రష్టయ్యగారు ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరు జిల్లా రేపల్లె దగ్గర నల్లూరు అనే చిన్న గ్రామంలో 15-7-1932న మధ్యతరగతి రైతు కుటుంబంలో శ్రీపరుచూరి భావన్నారాయణ చౌదరి శ్రీమతి రత్నమాణిక్యమ్మ దంపతులకు జన్మించారు. వీరి బాల్యవిద్యాభ్యాసం నల్లూరు, రేపల్లెలో జరిగింది. నేటి ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో

సెకండరీ విద్యపూర్తి చేశారు. మద్రాస్ లయోలాకాలేజిలో ఇంటర్ చదివి ప్రెసిడెన్సీ కళాశాలనుండి గణిత శాస్త్రంలో "స్టాటిస్టిక్స్" అభిమాన విషయంగా బి.ఎస్.సి.ఆనర్స్ డిగ్రీ పొందారు. అమెరికాలోని మిన్నెసోటా యూనివర్సిటిలో చేరి తమ అభిమాన స్టాటిస్టిక్స్ సబ్జెక్ట్ (గణాంక శాస్త్రం)లో ఎం.ఎస్.ను పి.హెచ్.డి.సాధించారు. 1956లో నార్త్ కరోలిన యూనివర్సిటి ప్రొఫెసర్ శ్రీఎస్.యెన్. రాయ్ మిన్నెసోటా సందర్శించినపుడు కృష్ణయ్యగారిని "మల్టీ వేరియేట్ స్టాటిస్టికల్ అనాలిసిస్ కోర్స్"లో చేరమని ప్రోత్సహించగా కొలరాడోలోని బోల్డర్‌లో ఉన్న ఐ.ఎం.ఎస్ సమ్మర్ ఇన్స్టిట్యూట్‌లో 1957లో స్టూడెంట్ మెంబర్‌గా చేరారు. ఇక్కడ ఉండగానే అనాలిసిస్ ఆఫ్ వేరిఎన్స్, దానికి సంబంధించిన సమస్యలపై జరిగిన సెమినార్‌లలో బోస్, కెంప్థోర్నే కృస్కాల్, "షెఫే మొదలైన ప్రొఫెసర్‌ల ప్రభావంతో తన ప్రతిభకు రాణింపు తెచ్చుకొన్నారు. ఏడాది తర్వాత మిన్నెసోటాలో జరిగిన మరొక సెమినార్‌లో శ్రీ కృష్ణయ్య "రాంకింగ్ అండ్ సెలెక్షన్ ప్రాబ్లెమ్స్"పై ఆకర్షితులయ్యారు. ఈ మూడు ప్రత్యేక విషయాలే ఆ తర్వాత ఆయనకు కన్సల్టేషన్ పబ్లికేషన్‌కు బాగా తోడ్పడినాయి. 1959–60లో ఆయన ఛాపెల్ హిల్‌లో ఒక ఏడాది గడిపి ఈ సబ్జెక్ట్‌లపై ప్రొఫెసర్ రాయ్‌తో విస్తృతంగా చర్చించారు.

## గణిత శాస్త్ర మేధావి –పరిశోధన

మిన్నెసోటా యూనివర్సిటిలో విద్యార్థిగా 1955–60 వరకు బ్యూరో ఆఫ్ ఎడ్యుకేషనల్ రిసెర్చ్ డిపార్ట్‌మెంట్‌లో "స్టాటిస్టికల్ అనలిస్ట్"గా సేవలందించారు. 1960–నుండి 1962 వరకు పెన్సిల్వేనియాలో బ్లూబెల్‌లో ఉన్న రెమింగ్టన్ రాండ్ కంపెనీలో సీనియర్ స్టాటిస్టీషియన్‌గా పనిచేశారు. 1963 నుంచి 1976 వరకు ఒహాయోలో డేటన్ లోని రైట్ పాటర్సన్ వైమానిక స్థావరం మాథమాటికల్ స్టాటిస్టీ పియన్‌గా ఉండి గణిత శాస్త్ర పరిశోధన అభివృద్ధిలో కృషి చేశారు. 1976 లో పిట్స్ బర్గ్ యూనివర్సిటి స్టాటిస్టిక్స్ శాఖలో ప్రొఫెసర్‌గా బోధనా వృత్తిలో ప్రవేశించి ఉత్తమ ఆచార్యునిగా గుర్తింపు పొందారు. స్టాటిస్టిక్స్‌లో ఆధునిక ప్రోగ్రాం రూపొందించి స్టాటిస్టిక్స్‌లో అమెరికాలో విశేషమైన విశిష్ట స్థానాన్ని చేకూర్చారు. ఎన్నో ప్రభుత్వ ప్రైవేట్ రిసెర్చ్ ప్రాజెక్ట్‌లకు నిర్దుష్టంగా ప్రపోజల్స్ తయారుచేసి, సకాలంలో వాటిని పూర్తిచేసి వందల వేల డాలర్ల ఫండ్‌ను డిపార్ట్‌కు సమకూర్చి ఆర్థిక పరిపుష్టికి తోడ్పడి అడ్మినిస్ట్రేషన్ వారి గౌరవ ప్రశంసలకు ప్రీతిపాత్రులై, ఆ శాఖకు, యూనివర్సిటికి గొప్ప పేరు ప్రతిష్టలను చేకూర్చారు. ఇక్కడితో ఆగిపోకుండా "మల్టి వేరియేట్ విశ్లేషణా కేంద్రం"ను 1982లో స్థాపించి

వ్యవస్థాపక డైరెక్టర్‌గా ఉంటూ గ్రాద్యుయేట్ స్కూల్ ఆఫ్ బిజినెస్‌లో ప్రొఫెసర్‌గా కార్నిగీ మెల్లన్ విశ్వవిద్యాలయంలో కన్సల్టంట్‌గా వ్యవహరించారు. మల్టి వేరియేట్ విశ్లేషణపై 1965, 68, 72, 75.78.1983 సంవత్సరాలలో 6 అంతర్జాతీయ సింపోజియంలను నిర్వహించిన మనత శ్రీరామ క్రష్టయ్యగారిది. ఈ సింపోజియం "ప్రొసీడింగ్స్"ను ప్రచురించి శాశ్వతం చేశారు. అందులో మొదటి సమావేశ ప్రొసీడింగ్‌ను ఈ రంగంలో తమకు విశేష అభిరుచి కలిగించి మార్గదర్శనం చేసిన ప్రొఫెసర్ ఎస్.యెన్.రాయ్ జ్ఞాపకార్థం ప్రచురించారు. తరువాతి వాటిని తమ అభివృద్ధికి సాయపడిన హెచ్.హోటెల్లింగ్, పి.సి మహలనోబిస్, హెచ్.షెఫేలకు కృతజ్ఞతగా అంకితమిచ్చి ఋణం తీర్చుకున్నారు. దీనిపై భావధార కోసం ఒక ప్రత్యేక పత్రిక "జర్నల్ ఆఫ్ మల్టి వేరియేట్ అనాలిసిస్" స్థాపించి, దానికి అంతర్జాతీయ గుర్తింపు కలిగించారు. నార్త్ హాలండ్ ప్రచురించిన "హాండ్ బుక్ ఆఫ్ స్టాటిస్టిక్స్"కు జనరల్ ఎడిటర్‌గా ఉన్నారు. ఇవి కాక "స్టాటిస్టికల్ ప్లానింగ్ అండ్ ఇన్ఫరిన్ "కు ఎడిటోరియల్ బోర్డ్ సభ్యులుగా, నార్త్ హాలండ్ సిరీస్ "స్టాటిస్టిక్స్ అండ్ ప్రాబబిలిటీస్"కు కోఆర్డినేటింగ్ ఎడిటర్‌గా సేవలందించారు. నిరంతర పరిశోధన, అమలు వీరి అభిమాన విషయాలు. "ప్రాబబిలిటి అండ్ మాథమాటికల్ స్టాటిస్టిక్స్"పై రష్యాలోని వెల్నియస్‌లో జరిగిన మూడు అంతర్జాతీయ సమావేశాలకు ఆహ్వానింపబడి విలువైన ప్రొఫెషనల్ పత్రాలను సమర్పించి దిశానిర్దేశనం చేశారు. 1981లో చైనాలో యూనివర్సిటీల ఆహ్వానంపై మూడు వారాలు పర్యటించారు. జపాన్ సొసైటీ ఫర్ ప్రమోషన్ ఆఫ్ సైన్స్ ఫెలోషిప్ అందుకోవటానికి 1986-87లో ఒక నెల రోజులకు ఆహ్వానించగా కేన్సర్ వ్యాధితో తీవ్ర అస్వస్థులైనందువలన వెళ్ళలేకపోయారు. 1966లో ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్స్టిట్యూట్‌కు విజిటింగ్ ప్రొఫెసర్‌గా వార్సాలోని బె నాక్ సెంటర్‌కు పోలిష్ అండ్ యు.ఎస్ నేషనల్ అకాడెమి ఆఫ్ సైన్సాస్‌కు చెందిన మాథమాటిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ డిపార్ట్‌మెంట్‌కు విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉన్నారు. 1960లో ఆంధ్రా యూనివర్సిటి మాథమాటిక్స్ డిపార్ట్‌మెంట్ 1988లో మద్రాస్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మాథమాటికల్ సైన్సెస్ యాజమాన్యాల ఆహ్వానం మేరకు "మాథమాటికల్ మరియు స్టాటిస్టికల్ సైన్సెస్‌లో నూతన పరిణామాలు"పై ప్రసంగాలు చేశారు.

## వివాహం- సంతానం

శ్రీరామకృష్ణయ్య గారు 1960లో పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు వాస్తవ్యులు

ప్రముఖ న్యాయవాది శ్రీ కానుమిల్లి రామచంద్రరావు శ్రీమతి లీలావతి గార్ల జ్యేష్ఠ పుత్రిక శ్రీమతి ఇందిర బి.ఏ.గారిని వివాహమాడారు. ఈ దంపతులకు శ్రీరఘురాం, శ్రీ నిరంజన్ రాం అనే ఇద్దరు కుమారులు, చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయిన వీరిద్దరినీ ఆదర్శసతీమణి శ్రీమతి ఇందిరగారు మాతృమూర్తిగా వారికి సద్బుద్ధులు గరపి తీర్చిదిద్దిన ఆదర్శమూర్తి. వీరిద్దరూ తమకు అభిమానమున్న ప్రముఖ విద్యాపారిశ్రామిక రంగాలలో రాణిస్తూ వివాహాలు చేసుకొని సత్సంతానంతో అభివృద్ధి చెంది, తండ్రి గారి పేరు నిలబెడుతూ, తల్లిగారిని గౌరవ పేమాభిమానాలతో కంటికి రెప్పలాగా కాపాడుకొంటూ జీవితాలను సార్ధకం చేసుకొని ధన్యులై కుటుంబగౌరవాన్ని చక్కగా కాపాడుకొంటున్నారు. శ్రీమతి ఇందిరగారు ప్రస్తుతం పిట్స్ బర్గ్ కమ్యూనిటికాలేజిలో డెవలప్‌మెంట్ రీడింగ్ ఇన్స్ట్రక్టర్‌గా ఉన్నారు. శ్రీ రామకృష్ణయ్యగారి పేరులోని "కృష్ణయ్య" పదం ఇప్పుడు వారికీ వారి వారసులకు ఇంటిపేరు (ఫామిలి నేం)గా మారిపోయి స్థిరపడిపోయి గౌరవాన్ని కలిగించింది.

## గ్రంథ ప్రచురణ-పరిశోధకులకు చేయూత

తమ అభిమాన స్టాటిసిక్స్‌లో ఆధునిక నైపుణ్యాలను వివరిస్తూ వీరి సంపాదకత్వంలో అనేక విశిష్ట గ్రంథాలను ప్రచురించారు. పిట్స్ బర్గ్ యూనివర్సిటిలోని డిపార్ట్‌మెంట్ ఆఫ్ మాథమాటిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ అభివృద్ధికి కీలకపాత్ర పోషించారు. ఎన్నో యూనివర్సిటీలు ఆహ్వానించినా ప్రొఫెసర్ సి.ఆర్.రావుగారిని ఒప్పించి ఈ డిపామెంట్‌కు ఆహ్వానించి వారి సేవలను అందింపజేయటంలో రామకృష్ణయ్యగారి పాత్ర కృషి అద్వితీయమైనది, ఆయన బహుముఖ ప్రతిభకు ఉదాహరణలే "థీరిటికల్ అండ్ కంప్యుటేషనల్ స్టాటిస్టిక్స్. సిగ్నల్ ప్రాసెసింగ్ పాటర్నిరికగ్నిషన్ మెడికల్ స్టాటిస్టిక్స్ ఎకనామెట్రిక్స్‌లలో ఆయన అమోఘ సృజనాత్మక కృషి అనేక రంగాలలోని సైంటిస్ట్ లకు 30 ఏళ్ళు విలువైన సంతృప్తికరమైన సేవలు అందించారు శ్రీరామ కృష్ణయ్య గారు. మూడవ ప్రపంచ దేశాలలో సైంటిఫిక్, హెల్త్, అల్లైడ్ రిసెర్చ్ ఎడ్యుకేషన్ల కోసం అంకిత భావంతో కృషి చేస్తున్న లాభాపేక్ష లేని స్వచ్ఛంద సంస్థ "SHARE"సంస్థకు అధ్యక్షులుగా రామకృష్ణయ్యగారు మరణించే వరకు సేవ చేశారు. ఆయన 19 విలువైన గ్రంథాలకు, మోనోగ్రాఫ్లకు సంపాదకులుగా ఉన్నారు. రెండు రిఫరన్స్ గ్రంథాలను రచించారు. 1976 నుండి చనిపోయేదాకా పిట్స్ బర్గ్ యూనివర్సిటీకు రిసెర్చి కాన్ట్రాక్ట్స్‌కు ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్‌గా ఉన్నారు, థీరిటికల్ స్టాటిస్టిక్స్ ఆయన అభిమాన విషయమే

అయినా అప్లికేషన్ ఆఫ్ స్టాటిస్టిక్స్‌ను ఎప్పుడూ దృష్టిలో ఉంచుకొనేవారు. గణిత శాస్త్రంలో పరిశోధన చేసే అనేకమంది విద్యార్థులకు వేలాది డాలర్ల స్కాలర్షిప్‌లను మంజూరు చేస్తూ ప్రపంచ వ్యాప్త ప్రశంసలను అందుకున్నారు. వీరి పర్యవేక్షణలో డాక్టరేట్ పొందిన విద్యార్థులు పలు దేశాలలో ప్రముఖ శాస్త్రజ్ఞులుగా రాణిస్తూ గౌరవం పొందుతున్నారు, ఆరోగ్య రంగంలో డాక్టర్ల నైపుణ్యం పెంచటానికి అమెరికన్ షేర్ సంస్థ ఏర్పరచి తాము చైర్‌పర్సన్‌గా ఉన్నారు. దీనికి అనుబంధంగా ఇండియాలో హైదరాబాద్‌లో ఒక శాఖను ఏర్పాటు చేశారు. వీరి సేవానిరతికి గుర్తింపుగా అమెరికాలో పెన్సిల్వేనియా యూనివర్సిటిలో "పెన్‌– రామకృష్ణయ్య ఫండ్"ను ఏర్పరచి విద్యార్థులకు ఉపకార వేతనాలు అందజేస్తూ విద్యాభివృధికి కృషి చేస్తున్నారు.

## గౌరవ పురస్కారాలు

డా. రామకృష్ణయ్యగారి బహుముఖీన ప్రతిభను గుర్తించి అంతర్జాతీయ స్టాటిస్టికల్ సంస్థ, అమెరికా స్టాటిస్టికల్ అసోసియేషన్ అమెరికా సైన్స్ పురోభివృద్ధి అసోసియేషన్, స్టాటిస్టికల్ విద్యాసంస్థ మొదలైనవి సభ్యత్వమిచ్చి గౌరవించి వారి సేవలను అందుకొన్నాయి. శ్రీ కృష్ణయ్య రూపొందించిన స్టాటిస్టికల్ టెస్ట్ "కృష్ణయ్యాస్ ఫై నైట్ ఇంటర్ సెక్షన్ టెస్ట్"గా వారి పేర గౌరవంగా నామకరణం చేయబడి ప్రసిద్ధి చెందింది. భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ 1980 దశకంలో శ్రీ రామకృష్ణయ్య గారితో పాటు ప్రముఖ శాస్త్రవేత్తలను ఢిల్లీలో సత్కరించి వారి విశిష్ట సేవలకు గుర్తింపు కలిగించారు. 1985లో అమెరికాలోని తెలుగు సంస్థ "తానా" శ్రీరామ క్రష్ణయ్యగారిని "గొప్ప శాస్త్రవేత్త"గా గుర్తించి ఘనంగా సన్మానించింది. శ్రీ రామకృష్ణయ్యగారు మద్రాస్ పెసిడెన్సి కాలేజి విద్యార్థిగా ఉన్నప్పుడు "సత్యాగ్రహం" నాటికలో బాపూజీగా నటించి వాస్తవికత కోసం తలవెంట్రుకలు తీయించుకొని (గుండు చేయించుకొని) నటించి, అందరి ప్రశంసలు అందుకొన్నారు.

## "చిరంజీవి" డా.పరుచూరి రామకృష్ణయ్య

డా. పరుచూరి రామకృష్ణయ్యగారి స్మృతులను శాశ్వతం చేయటానికి 1992లో పెన్సిల్వేనియా స్టేట్ యూనివర్సిటిలో "విజిటింగ్ స్కాలర్స్ ప్రోగ్రాం"ను ప్రారంభించి శ్రీ రామకృష్ణయ్య స్మారక ఉపన్యాసాలను, లేక ఈ ప్రోగ్రాంలో రిసెర్చ్ వర్కులో పాల్గొనే కార్యక్రమాన్ని "పి.ఆర్.కృష్ణయ్య మెమోరియల్ లెక్చర్" అని నామకరణం చేసి అసాధారణ

ప్రతిభా విశేషాలున్న వారిని ఆహ్వానించి ప్రసంగాలు చేయిస్తూ గౌరవిస్తూ రామకృష్ణయ్య గారిని స్మృతి పథంలో చిరంజీవిని చేస్తున్నారు. ఈ ప్రోగ్రాంలో పాల్గొని ఉపన్యసించి గౌరవ పురస్కారాలు అందుకున్న విజిటింగ్ స్కాలర్స్-

1- 1992- వర్ డెవిడ్ ఆర్ కాక్స్
2- 1993- హెర్మన్ చెనాఫ్
3- 1994- బ్రాడ్లీ ఎఫ్రాన్ మరియు పీటర్ జే బ్రికేట్
4- 1995- శ్రీనివాస ఆర్.ఎస్.వర్ధన్
5- 1999- డేవిడ్ మంఫోర్డ్
6- 2000- డేవిడ్ ఎల్ డోనోహో
7- 2001- లియో బ్రీమన్
8- 2003- జేమ్స్ ఒ బెర్జర్
9- 2006- జీన్ హెచ్.గోలబ్
10-2008- ఎలిజబెత్ థాంప్సన్
11-2013- స్టీఫెన్ ఫీన్ బెర్స్
12-2015- నాన్సీ రీడ్
13-2017- సతీష్ అయ్యంగార్

## కుటుంబానికి ప్రోత్సాహం

వీరి అన్నగారు శ్రీ సుదర్శనరావు గారు "పరుచూరి వారి పాకశాస్త్రం" రాసి ప్రచురించారు. ఈ పుస్తక విక్రయం వలన లభించిన వేలాది డాలర్లనుపై ఫండ్‌కు అందజేసి తమ వితరణ శీలత్వాన్ని ప్రకటించుకున్నారు. రామకృష్ణయ్యగారు తమ అన్నగారినీ, నలుగురు తమ్ముళ్ళను ఇద్దరు అక్కచెల్లెళ్ళను అమెరికాకు తీసుకొని వచ్చి అక్కడే స్థిరపడేట్లు చేశారు. శ్రీరామకృష్ణయ్య గారిది నిష్కల్మష, నిర్మల, నిష్కపట గుణం. వీరిది అతిసుకుమారమైన చిన్నపిల్లల మనస్తత్వం. ఊహలో కూడా ఎవరికీ హాని తలపెట్టని సంస్కారం వారిది. మొదటి నుండి తండ్రి గారి కష్టసుఖాలలో పాలుపంచుకొని కుటుంబ సభ్యుల సన్నిహితుల మేలుకోసం పరితపించిన విశాల, ఉన్నత గుణ సంపన్నులు శ్రీ రామకృష్ణయ్యగారు. "తెలుగుదేశం నుండి అమెరికా వెళ్ళిన వారికి రామకృష్ణయ్యగారు సహాయ సహకారాలు అందించి ఆదుకున్నారు. 1977లో దివిసీమ ఉప్పెన బీభత్సం వలన సకలం కోల్పోయిన వారి కుటుంబాల కడగండ్లను స్వయంగా చూసి చలించిన

శ్రీ రామకృష్ణయ్య గారు రేపల్లె సమీపంలో నగరంలో ఉన్న వెలగపూడి రామకృష్ణ కాలేజి వారితో కలిసి, నష్టపోయిన ఆ ప్రాంతంలోనూ, దివి తాలూకాలోను తమ శాయ శక్తులా సహాయ సహకారాలు అందించి మానవత్వానికి ఎత్తిన పతాకగా నిలిచిన మహోదారులు.

## మహాప్రస్థానం

ఇండియాలో ఒక చిన్న పల్లెటూరులో జన్మించి తమ మేధాసంపత్తి చేత స్టాటిస్టిక్స్ గణిత శాస్త్రంలో అంతర్జాతీయ ప్రముఖులై ఎందరికో విద్యాదానం చేసి ప్రపంచ వ్యాప్త గుర్తింపు పొందిన మేధావి వితరణశీలి సుమనస్కులు డా.పరుచూరి రామ కృష్ణయ్యగారు 1-8-1987న 55వ ఏట కేన్సర్ వ్యాధితో మరణించటం దురదృష్టకరం.

**"అయం నిజ పరో వేది గణనాలఘు చేతసాం**
**"ఉదార చరితానాం తు పురుషాణాం వసుదైక కుటుంబకం"**

భావం- వీడు నా వాడు, వాడు పరాయివారు అనే బుద్ధి అల్ప మనస్కులకే ఉంటుంది. ఉదాత్త చరిత్ర కల పురుషులకు విశ్వమంతా తన కుటుంబమే ననిపిస్తుంది,

**శ్రీ పరుచూరి రామకృష్ణయ్య గారి సంగ్రహ జీవిత చరిత్రకు ఆధారం**

1-20వ శతాబ్దపు తెలుగు వెలుగులు -2-ప్రొఫెసర్ ఎం.ఎం.రావు మరియు పద్మవిభూషణ్ ప్రొఫెసర్ సి, ఆర్, రావు గార్లు రచించిన గ్రంథం 3- శ్రీరామ కృష్ణయ్యగారి అర్ధాంగి శ్రీమతి ఇందిర గారు సోదరులు శ్రీపరుచూరిశ్రీనాథ్ గార్లు అందజేసిన సమాచారం 4-వీకీపీడియా 5-అన్నిటికి మించి శ్రీ రామకృష్ణయ్య గారి బావగారు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు శ్రీమతి సత్యవతి దంపతులు సమకూర్చిన అత్యంత విలువైన సమాచారమే కాక ప్రతి విషయంలో నిర్దుష్టతకు చేసిన మార్గ దర్శనం.

**- గబ్బిట దుర్గా ప్రసాద్**

14-3-17

ఉయ్యూరు



# గ్రంథ ప్రాయోజకులు

సౌజన్యశీలి, సహృదయులు ఆత్మీయులు

## శ్రీ మైనేని గోపాలకృష్ణ

**జననం - విద్యాభ్యాసం**

శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు కృష్ణాజిల్లా ఉయ్యూరుకు సమీపంలోని కుమ్మమూరు గ్రామంలో శ్రీ మైనేని వెంకట నరసయ్య, శ్రీమతి సౌభాగ్యమ్మ దంపతులకు 10-1-1935న ఆరవ సంతానంగా జన్మించారు. వీరి అన్నగార్లు స్వర్గీయ సూర్యనారాయణ, స్వర్గీయ తాతయ్య అనే రాజశేఖర్, అక్కయ్యలు శ్రీమతి అన్నపూర్ణాదేవి, స్వర్గీయ శ్రీమతి కనక దుర్గాదేవి, శ్రీమతి భారతీదేవి. చెల్లెళ్ళు శ్రీమతి హేమలతా దేవి, శ్రీమతి సత్యవాణి. బాల్యంలోనే పిల్లల చదువుకోసం తండ్రిగారు కుటుంబాన్ని ఉయ్యూరుకు మార్చారు. ప్రాధమిక విద్యను గోపాలకృష్ణ గారు కీ.శే. కోట సూర్యనారాయణ శాస్త్రి గారి వద్ద నేర్చారు. కోటమాస్టారు అంటే మైనేని వారికి అమితమైన గౌరవం భక్తి. వారి పేరు చెబితే పులకించి పోతారు. 1950 వరకు తాడంకి స్కూల్‌లోచదివి ఎస్. ఎస్. ఎల్.సి. పాసై, తరువాత విజయవాడ ఎస్.ఆర్.ఆర్.కాలేజిలో ఇంటర్ చదివి 1954లో ఉత్తీర్ణులయ్యారు. కొంతకాలం నాటకాలు, సోషలిస్ట్ పార్టీ సభలతో కాలేజీకి డుమ్మా కొట్టారు. బెజవాడ హోటల్ వర్కర్స్ యూనియన్‌తో చేరి, వర్కర్ల జీవన పరిస్థితులను మెరుగు పరచటానికి వారిని యాజమాన్యం గౌరవంగా చూడటానికి కృషి చేశారు.

**ఉన్నత విద్య - వివాహం - మొదటిసారి అమెరికా ప్రయాణం**

1953-54లో ఉయ్యూరులో డ్రమాటిక్ అసోసియేషన్ స్థాపించి ఆత్రేయ గారి యెన్.జి.వో నాటికను ప్రాక్టీస్ చేశారు. 1955-58 కాలంలో విశాఖ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఫిలాసఫీ మెయిన్ సబ్జెక్ట్‌గా ఎడ్యుకేషనల్, సోషల్ అండ్ చైల్డ్ సైకాలజీ

మైనర్ సబ్జెక్టులుగా తీసుకొని చదివి 1959లో ఏం.ఎ.సెకండ్ క్లాస్‌లో పాసైనారు. 1960లో గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా నల్లూరు గ్రామవాసి కీ.శే. పరుచూరి భావ నారాయణ చౌదరి, శ్రీమతి రత్నమాణిక్యమ్మ దంపతుల కుమార్తె శ్రీమతి సత్యవతిని వివాహం చేసుకొన్నారు. 1960–61లో అమెరికా వెళ్లి మిన్నియా పోలీస్‌లోని మిన్నెసోటా యూనివర్సిటిలో ఎడ్యుకేషన్ సైకాలజీ, స్టాటిస్టిక్స్‌లో కొంత కోర్సు వర్క్ చేశారు. గోపాలకృష్ణ గారు 1961–62లో మాడిసన్‌లోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో ఇండియన్ స్టడీస్‌కు అనుబంధంగా ఉన్న తెలుగు గ్రంథాలను కేటలాగ్ చేయటానికి సహాయ పడుతూ, కొన్ని లైబ్రరీ కోర్సులు పూర్తి చేశారు. 1962లో ఇండియా తిరిగి వచ్చి కొంతకాలం చిరు ఉద్యోగాలు చేస్తూ, కొంతకాలం నిరుద్యోగిగా ఉంటూ, కొంతకాలం ఉయ్యూరు కే.సి.పిలో అతి చిన్న ఉద్యోగం చేసి, స్థిరమైన రాబడి లేక కుటుంబాన్ని పోషించలేక ఇబ్బంది పడుతూ మంచి రోజుల కోసం ఎదురు చూస్తూ 1968వరకు ఆరేళ్ళు గడిపారు.

## తలపు తట్టిన అదృష్టం లైబ్రరీ సైన్స్ కోర్స్ –ఉద్యోగం

అదృష్టం తలుపు తట్టగా 1969లో అమెరికా వెళ్లి టెన్నేసిలో లైబ్రరీ సైన్స్‌లో ఎం.ఎస్.చేసి, అందరి ఆదరాభిమానాలు పొంది డిగ్రీ తీసుకొని సంతృప్తి చెందారు. సుమారు ఏడేళ్ళు పడిన మానసిక వేదనకు, శారీరక శ్రమకు విముక్తి కలిగింది. కోర్సులో ఉండగానే కెంటకీలోని లూవిల్ యూనివర్సిటిలో కేటలాగర్ అండ్ ఇన్ స్ట్రక్టర్ ఇన్ లైబ్రరీ సైన్స్‌కు ఎంపికై, పదవీ బాధ్యతలు చేబట్టారు. అమెరికన్ లైబ్రరి ఆఫ్ కాంగ్రెస్, న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరి, ఇతర విశ్వ విద్యాలయాల లైబ్రరీలను సందర్శించారు. మెషీన్ రీడబుల్ కేట లాగింగ్‌కు ఇన్ హౌస్ ట్రెయినింగ్ ఇచ్చారు. ఆంగ్లో అమెరికన్ కేటలాగింగ్ రూల్స్‌పై వర్క్ షాప్ నిర్వహించారు. ఆబ్ స్ట్రాక్ట్ ఆఫ్ అకడేమిక్ ప్లాన్ అండ్ బిల్డింగ్ ప్రోగ్రాంకు సహకరించారు. లాంగ్ రేంజ్ బడ్జెట్, పర్సనల్ అండ్ రిసోర్సెస్ ప్రాజెక్షన్‌కు సహాయకుడిగా సేవలందించారు. యూనివర్సిటి ఆఫ్ లూయీ విల్ లైబ్రరి సిస్టంకు టెక్నికల్ సిస్టం అందించటంలో ప్రముఖ పాత్ర పోషించారు. మైనేనిగారి బాస్ ప్రోత్సాహంతో కేటలాగింగ్ కన్సల్టంట్‌గా 1974నుంచి 76 వరకు రెండేళ్ళు యునైటెడ్ స్టేట్స్ డిపార్ట్ మెంట్ ఆఫ్ డిఫెన్స్ ఫోర్ట్ నాక్స్ లైబ్రరీ, నేషనల్ ఆర్కైవ్స్, సన్స్ ఆఫ్ అమెరికన్ రివల్యూషన్ లో 1976–78 వరకు సలహాదారుగా, కెంటకీలోని లూయీ విల్‌లో ఉన్న లైబ్రరీ ఆఫ్ వరల్డ్ ఫెయిత్ సెంటర్‌లో 1980–82 వరకు ఎంతో సంతృప్తిగా సేవలందించారు. తనపై బాస్ కున్న నమ్మకానికి ఎంతో కృతజ్ఞత చూపిస్తారు శ్రీ

గోపాలకృష్ణ.  పై ఉద్యోగులచేత ప్రశంసలు, సహోద్యోగుల చేత ఆత్మీయ మిత్రులుగా అభినందనలు పొందారు. 1997లో అసోసియేట్ ప్రొఫెసర్ అండ్ స్పెషల్ అసిస్టంట్ టు యూనివర్సిటి లైబ్రేరియన్‌గా పదవీ విరమణ చేశారు.

**కుటుంబం**

మొదటి నుండి సత్యం ధర్మం న్యాయంలపై మక్కువ ఉన్న గోపాలకృష్ణగారు కెంటకీ సదరన్ బాప్టిస్ట్ దియలాజికల్  సెమినరి, ముర్రె స్టేట్ యూనివర్సిటీలలో హిందూధర్మంపై ప్రసంగాలు చేశారు.  లూయివిల్ యూనివర్సిటిలో రెలిజియస్ స్టడీ డిపార్ట్‌మెంట్ ఆహ్వానంపై బౌద్ధధర్మంపై దార్మికోపన్యాసమిచ్చి అందరి మన్ననలు అందుకొన్నారు. అతిధులను గౌరవంగా ఆదరించటం.  బాధితులకు సానుభూతి సహవేదనలను చూపటం మైనేని వారికి తలిదండ్రుల నుండి సంక్రమించిన గొప్ప సుగుణం.  గోపాలకృష్ణ దంపతులకు ఇద్దరు కుమారులు.  పెద్దకుమారుడు శ్రీ కృష్ణ, కోడలు శ్రీమతి రమ. మనుమరాళ్ళు  చి॥ శ్రేయ, సెరీన.  చిన్న కుమారుడు శ్రీ రవి, కోడలు శ్రీమతి కవిత. మనుమడు చి॥ కిరణ్.  మనుమరాళ్ళు చి॥ రియా, కరీనా.    మన సాంప్రదాయం ప్రకారం వివాహాలు చేసుకొని సంతానం పొంది, అమెరికాలోనే తాము ఎంచుకొన్న వృత్తిలో రాణిస్తూ, తలిదండ్రులను కనిపెడుతూ ఆదర్శంగా ఉంటూ సంతోష పెడుతున్నారు.  గోపాలకృష్ణగారు భార్య శ్రీమతి సత్యవతి గారితో  అనుకూల దాంపత్యం వలన సుఖ సౌఖ్య ఆనందమయ జీవితాన్ని గడుపుతున్నారు.

**ఉయ్యూరుపై అభిమానం – వితరణ**

అమెరికాలో ఉన్నా గోపాలకృష్ణ గారికి ఉయ్యూరుపై అభిమాన, మమకారాలు ఏ మాత్రమూ తగ్గలేదు.  ఇక్కడి విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకొంటూనే ఉంటారు. దక్షిణ భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా ఏర్పడిన ఉయ్యూరు ఏ .సి .లైబ్రరీకి వారి తలిదండ్రులు కీ.శే. మైనేని వెంకట నరసయ్య, శ్రీమతి సౌభాగ్యమ్మ గార్ల పేరు మీద 5లక్షల రూపాయలు భూరి విరాళం ఇచ్చి మరో లక్ష రూపాయల విలువైన రిఫరెన్స్ గ్రంథాలను బహూకరించి, లైబ్రరీ ప్రారంభోత్సవ సభకు మరో లక్ష రూపాలు ఖర్చు చేసి ఘనంగా నిర్వహించారు.  మచిలీపట్నం కృష్ణా విశ్వవిద్యాలయానికి ఇరవై వేల రూపాయలు, భగవద్గీతలో రాణిస్తున్న చి॥ మాదిరాజు బిందు దత్తశ్రీకి ఉన్నత విద్యాభ్యాసం కోసం 15 వేల రూపాయలు, ఉయ్యూరులోని హిందూ స్మశానవాటిక (స్వర్గ పురి)ని ఆధునీకరిస్తూ అభివృద్ధి చేస్తున్న ఉయ్యూరు రోటరీ క్లబ్ వారికి 25 వేల రూపాయలు

సరస భారతి ద్వారా అందజేయించారు.

## పెద్దల యెడ గౌరవం

పెద్దలను ఎలా గౌరవించి సత్కరించాలో గోపాలకృష్ణ గారిని చూసి మనం నేర్చుకోవాలి. ప్రపంచ ప్రసిద్ధ ఆర్ధికవేత్త ఉయ్యూరు వాసి, ప్రస్తుతం అమెరికా నివాసి శ్రీ ఆరిగపూడి ప్రేమ్‌చంద్ గారిని ఉయ్యూరు రప్పించి, ఖర్చు అంతా భరించి వారికి మాతో ఘనసన్మానం చేయించి ఆనందించారు. బౌద్ధ ధర్మ ప్రచారకులు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి గారికీ ఇలాగే గొప్ప సత్కారం చేయించారు. బాపు రమణలు అంటే గోపాలకృష్ణ గారికి అమితమైన ఆరాధనాభావం. వారిద్దరితో మంచి పరిచయం ఉన్నవారు. ఉత్తర ప్రత్యుత్తరాలు, ఫోన్ సంభాషణ జరిపేవారు. రమణ, బాపుల మరణం తర్వాత బాపు-రమణల స్మారక నగదు పురస్కారాన్ని మొట్టమొదటిసారిగా ఏర్పాటు చేసి ప్రముఖ కథకులు శ్రీ వేదగిరి రాంబాబుకు అయిదు వేలు, ప్రఖ్యాత చిత్రకారులు కవి శ్రీ శీలా వీర్రాజు గారికి 10వేల రూపాయలు సరస భారతి ద్వారా అందజేశారు. ప్రముఖ కథకులు శ్రీ కాళీ పట్నం రామారావు గారు నిర్వహిస్తున్న 'కథా నిలయం'కు 15 వేల రూపాయలు, ప్రఖ్యాత ఆధ్యాత్మిక గురువులు, సాహిత్య సాంస్కృతిక ధార్మిక కార్యక్రమ నిర్వాహకులు స్వర్గీయ సద్గురు శివానందమూర్తి గారి 'సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్ట్'కు 11,116 రూపాయలు అందజేసిన సంస్కారి. 'ఇండియన్ పికాసో' అని పిలువబడే అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన గుడివాడ వాసి అమెరికాలో స్థిరపడిన నైరూప్య చిత్రకారులు పద్మశ్రీ ఎస్.వి.రామారావు గారికి సరసభారతి, స్థానిక శ్రీనివాస విద్యా సంస్థలు ఆధ్వర్యంలో 1-9-16న ఆ కాలేజి సెమినార్ హాల్ లో ఎం.ఎల్.సి. శ్రీ వై.వి.బి.రాజేంద్ర ప్రసాద్ చేతుల మీదుగా ఘన సన్మానం చేయించి, శ్రీ రామారావు గారికి 11,116 రూపాయలు నగదును కానుకగా అందింపజేసిన కళాప్రియులు శ్రీ గోపాలకృష్ణ గారు. ఇవన్నీ వారు అమెరికాలో ఉంటూ సరసభారతి చేత చేయించిన సత్కారాలు, సత్కార్యాలు.

తన జీవితానికి మార్గదర్శి స్నేహితులు, ఆత్మీయులు అయిన శ్రీ కోగంటి సుబ్బారావు గారికి 11-1-2015న నభూతోగా సరసభారతి చేత సన్మానం చేయించి ఆ కుటుంబంలోని వారందరికీ నూతన వస్త్రాలను కొనిపించి, అందజేయించి నేను రాసిన 'దర్శనీయ దైవ క్షేత్రాలు' గ్రంథాన్ని శ్రీ సుబ్బారావు గారికి అంకితమిప్పించి, జన్మ ధన్యమైందని కృతజ్ఞతలు తెలిపి, దీన్ని లైవ్ టెలికాస్ట్ చేయించి చూసి పరవశించిన మహోన్నతులు మైనేని గారు. ఈ కార్యక్రమానికి మొత్తం ఖర్చు తానే భరించిన సజ్జన

హృదయులు శ్రీ గోపాలకృష్ణ గారు.

70 ఏళ్ళ క్రితం ప్రాథమిక విద్య నేర్పిన గురుదేవులు కీ.శే. కోట సూర్యనారాయణ శాస్త్రి గారిని మర్చిపోక, వారి కుమారుల చిరునామాలు సేకరించి ఫోన్‌లో మాట్లాడి 5-9-15 ఉపాధ్యాయ దినోత్సవం రోజున వారందరినీ సకుటుంబంగా ఆహ్వానించి గురువుగారి చిత్రపటాన్ని ప్రముఖ ఆర్టిస్ట్ టి.వి.ఎస్.బి.శాస్త్రి (ఆనంద్) చిత్రింపజేసి, శాసన మండలి సభ్యులు శ్రీ వై వి బి రాజేంద్ర ప్రసాద్‌తో ఆవిష్కరింపజేసి, ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీమతి సింగరాజు కల్యాణి, శ్రీమతి కాళీపట్నం ఉమా గార్లచే సంగీత కచేరీ జరిపించి గురుపూజోత్సవంగా సరసభారతి చేత ఘనంగా నిర్వహింపజేయించి, వారందరికీ నూత్న వస్త్రాలు అందజేయించి కార్యక్రమాన్ని ప్రత్యక్ష ప్రసారం చేయించి అమెరికాలో చూసి తన్మయం చెంది తన జన్మ చరితార్థమైం నదని సంతృప్తి చెందిన ఆదర్శ వ్యక్తి శ్రీ గోపాలకృష్ణ గారు. తమ ప్రియ తమ గురువులు స్వర్గీయ కోట సూర్యనారాయణ శాస్త్రి గారి స్మారక నగదు పురస్కారాన్ని ఏర్పాటుచేసి ఇద్దరు అతి పేద ప్రతిభగల హైస్కూల్ విద్యార్థికి, విద్యార్థినికి ఒక్కొక్కరికి 10వేల రూపాయల 2014, 2015, సంవత్సరాలలో అందజేసిన వితరణ శీలి శ్రీ గోపాలకృష్ణగారు. 3-9-16న శ్రీ కోట గురువరేణ్యుల గురుపూజోత్సవాన్ని సరసభారతి, స్థానిక ఉయ్యూరు పబ్లిక్ స్కూల్ సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహింపజేసి గురు పుత్రులకు, ఉపాధ్యాయులకు సన్మానాలు చేయించి పేద ప్రతిభ గల విద్యార్థినికి విద్యార్థికి 10 వేల రూపాయలు ఒక్కొక్కరికి అందజేయించిన వదాన్యులు. 2015, 2016, 2017లలో జరిగిన ఈ గురుపూజోత్సవాలలో ప్రేరణ పొందిన మా గురుపుత్రులు శ్రీ కోట సోదరులు శ్రీ కోట చంద్ర శేఖర శాస్త్రి, శ్రీ సీతారామాంజనేయులు, శ్రీ గాయత్రి ప్రసాద్ గార్లు ఇంటర్ చదువుతున్న పేదరికం ప్రతిభ ఉన్న విద్యార్థినికి తమ తలిదండ్రుల పేరిట స్మారక నగదు బహుమతి 10 వేల రూపాయలు తమ చేతుల మీదుగా ఈ రెండు సంవత్సరాలు అందజేసి, ఇక ముందు కూడా ఇస్తామని తెలియ జేసి మాతా, పితరుల యెడ తమకు గల అనన్య భక్తిని చాటి, విద్యకు ప్రోత్సాహం కలిగించారు. అంతటి ప్రేరణ శ్రీ మైనేని గారు కల్గించారు.

**సరసభారతికి ఆత్మీయులు**

సరసభారతికి పరమ ఆత్మీయులు శ్రీ గోపాలకృష్ణ గారు. తాను స్పాన్సర్‌గా ఉండి, నా రచనలు, సరసభారతి ప్రచురణలు అయిన 'సిద్ధ యోగి పుంగవులు', 'మహిళా మాణిక్యాలు', 'పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు', 'దర్శనీయ దైవ క్షేత్రాలు', గ్రంథాలను వరుసగా తమ తల్లిగారు కీ.శే. మైనేని సౌభాగ్యమ్మ గారికి, తమ ప్రియతమ అర్ధాంగి

శ్రీమతి మైనేని సత్యవతి గారికి, తమ బావ గారు డా. శ్రీ రాచకొండ నరసింహశర్మ- ఎం.డి.గారికి, తనకు మార్గదర్శి, మెంటార్ అయిన కోగంటి సుబ్బారావు గారికి అంకిత మిప్పించి వారిపై తన కున్న గౌరవ ఆత్మీయ అనురాగాలను, కృతజ్ఞతను చాటుకొన్న ఉదార హృదయులు మైనేని వారు. అందుకనే వారికి తెలియకుండా, చెప్పకుండా 'గీర్వాణ కవుల కవితా గీర్వాణం-1 మొదటి భాగం' అనే బృహత్ గ్రంథాన్ని శ్రీ గోపాలకృష్ణ గారికి ఆన్‌లైన్ అంకితమిచ్చి నా ఋణం తీర్చుకొన్నాను. ఈ పుస్తకాన్ని వారి మేనకోడళ్ళు మేనల్లుళ్ళు స్పాన్సర్ చేసి సరసభారతి చేత ముద్రింపజేసి తమ ప్రియతమ 'కృష్ణ మామ' ఆదరాన్ని, ఆశీస్సులను అందుకొన్నారు.

నాపై శ్రీ గోపాలకృష్ణ గారికి అమితమైన ఆత్మీయత ఉంది. ఎన్నో అమూల్యమైన గ్రంథాలు నేను చదవాలని భావించి, కొని, పోస్ట్‌లో పంపుతూనే ఉన్నారు. నా పుట్టిన రోజు పండుగనాడు, గీర్వాణం ఆవిష్కరణ రోజున వారు అందజేసిన బహుమానాలు 'అమూల్య'మైనవి..నేనెప్పుడూ ఋణం తీర్చుకోలేనివి. వారి అవ్యాజాను రాగానికి కృతజ్ఞతలు. దైవ భక్తి, పెద్దల యెడ గౌరవం, సనాతన ధర్మం పై అభిమానం ,ఆచరణలో శుద్ధ మనస్కత, సర్వ జనుల సౌభాగ్య చింతనాశీలి, 'దైవ చిత్తం' గ్రంథానికి స్పాన్సర్‌గా తానే ఉండాలి అని ముందుకొచ్చిన శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి అంకిత మివ్వటం సముచితం అని భావించి, సరసభారతికి వారిపై ఉన్న గౌరవాదరణలకు నిదర్శనంగా వారికి మనస్ఫూర్తిగా అంకితమిచ్చాను. ఇప్పుడు గీర్వాణ కవుల కవితా గీర్వాణం రెండవ భాగానికి తామే స్పాన్సర్‌గా ఉంటామని మొదటి నుంచీ చెబుతూ ఈ బృహద్గ్రంథం వెలువడటానికి సౌజన్య సహాయ సహకారాలు అందజేసిన శ్రీ మైనేని గోపాలకృష్ణ శ్రీమతి సత్యవతి దంపతుల ఔదార్యానికి, సరసభారతిపై వారికున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

"ఆధునిక ప్రపంచ నిర్మాతలు- జీవితాలలో చీకటి వెలుగులు" అనే ఈ బృహద్గ్రంథం తమ బావమరిది, ప్రపంచ ప్రఖ్యాత గణితశాస్త్రవేత్త కీ॥ శే॥ డాక్టర్ పరుచూరి రామకృష్ణయ్య గారికి అంకితమిస్తే సముచితముగా ఉంటుందని సూచించి, అంకితమిప్పించి, ఈ గ్రంథాన్ని సరసభారతి చేత ప్రచురింపచేయటానికి కావాలిసిన ఆర్థికాన్ని అందించి తామే ప్రాయోజకులుగా ఉంటామని స్వచ్ఛందంగా ముందుకు వచ్చి సరసభారతిపై తమకున్న అపార ఆదరాన్ని సాహిత్యంపై మక్కువ తెలియజేసిన ఆప్తులు శ్రీ మైనేని గోపాలకృష్ణ, వారి అర్థాంగి శ్రీమతి సత్యవతి గారికి కృతజ్ఞతలు.

**- గబ్బిట దుర్గాప్రసాద్**

# ఆధారం- లూయీ అంటర్ మేయర్ రాసిన "మేకర్స్ ఆఫ్ ది మోడరన్ వరల్డ్"

## మనవి-

సుమారు సంవత్సరన్నర క్రితం రాయటం ప్రారంభించిన "ఆధునిక ప్రపంచ నిర్మాతలు-జీవితాలలో చీకటి వెలుగులు" ధారావాహిక 245 ఎపిసోడ్‌లలో 91 మంది ప్రముఖుల జీవితాలను గురించి రాసే అదృష్టం నాకు దక్కింది. ఈ పుస్తకాన్ని నాకు నామీద అభిమానంతో ఆప్తులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు (అమెరికా) నేను కోరిందే తడవుగా కొని నాకు 20-10-2014న అందేట్లుగా పంపారు. వెంటనే చదవటం ప్రారంభించి 760 పేజీలున్న ఈ బృహత్ గ్రంథాన్ని 23-1-2015 నాటికి చదివి పూర్తి చేశాను. వెంటనే దీన్ని తెలుగులో రాస్తే బాగుంటుంది అనిపించి శ్రీ గోపాలకృష్ణ గారికి మెయిల్ రాస్తే "నేనే చెబుదామనుకొన్నాను. మీకూ అదే ఆలోచన వచ్చింది కనుక ప్రారంభించండి" అన్నారు. వెంటనే అంతర్జాలంలో రాయటం ప్రారంభించాను. మధ్య మధ్యలో మరెన్నో వాటిపై దృష్టి పెట్టటం వలన సుమారు సంవత్సరన్నర కాలం పట్టింది పూర్తి అవటానికి. అంటర్ మేయర్ రైట్ సోదరులను విడివిడిగా రాసి 92 మందితో పుస్తకం రాస్తే, నేను రైట్ సోదరులను ఇద్దర్నీ కలిపి 'రాయటం వలన సంఖ్య 91 అయింది. అంటర్ మేయర్ చాలా వివరణాత్మకంగా గ్రంథం రాశాడు. దాదాపు ఆయన చెప్పిన దానిని దేనినీ వదలకుండా నేను తెలుగులోకి తెచ్చాను. అయినా నాకు సంతృప్తి కలగక వీకీ పీడియాలో ఎన్ సైక్లో పీడియా బ్రిటాన్నికాలో కూడా వెతికి మరింత సమాచారాన్ని చేర్చి సంతృప్తి చెందాను. ఇందులోని మహనీయ వ్యక్తులపై ముందుతరం లేక సమకాలీనుల ప్రభావం, వీరి ప్రభావం ఉన్న తరువాతి తరం వారి గురించి, ఆ మహానుభావులకు ప్రభుత్వాలు, సంస్థలు ఇచ్చిన గౌరవమర్యాదలు, వారిపై ఏర్పడిన స్మృతి చిహ్నాలు, వారిపై తదనంతరం వచ్చిన గ్రంథాలను గురించి కూడా రాసే ప్రయత్నం చేశాను. వీటితో కొంత వరకు సమగ్రత చేకూరి ఉండవచ్చు. అంత మాత్రం చేత ఇది పూర్తిగా సమగ్రమూ సంపూర్ణమూ అని నేను అనుకోవటం లేదు. ఇంకా చెప్పవలసింది, విశ్లేషించ వలసినది చాలా ఉండే ఉంటుంది. ఆ మహానుభావులను పరిచయం చేయటానికే నేను ప్రయత్నం చేశాను. ఇందులో నాకు తెలియని వారు చాలా మందే ఉన్నారు. చాలామంది వీరి గురించి విని ఉండక పోవచ్చు కూడా. వీరంతా తమ కార్యకలాపాలతో ఆధునిక యుగ నిర్మాణానికి తోడ్పడినవారే. అన్ని రంగాలకూ చెందిన వీరి కార్య క్షేత్రాలు కళ, సంస్కృతీ, రాజకీయం, శిల్పం, సంగీతం

నాట్యం వేదాంతం ఆర్కి టెక్చర్, కవిత్వం, సినిమా, నాటకం, సైన్స్, టెక్నాలజీ మొదలైనవి. ఏదో ఒక రంగం గురించి ఏదో కొంచెం ఆవగింజలో అరవై భాగం మాత్రమే తెలిసిన నాకు ఇన్ని రంగాలలోని విషయాలు తెలుసుకొని అర్థం చేసుకొని అందరికి తెలిసేట్లు రాయటం బ్రాహ్మ ప్రళయమే అయింది. నా శక్తి యుక్తులన్నీ పణంగా పెట్టి రాయాల్సి వచ్చింది. దీనిలో నేను ఎంతవరకు సఫలీకృతుడిని అయ్యానో మీకే తెలుసు. ఏదైనా, ఒక మంచి ప్రయత్నం చేశాను అన్న సంతృప్తి మాత్రం నాకు లభించింది.

ఈ మహామహులపై మరింత పరిశోధన చేసేవారికి ఇది కొంత వరకు కరదీపిక అవుతుందని నమ్ముతున్నాను. అంటర్ మేయర్ ఆంగ్లంలో రాసిన గ్రంథాన్ని నాకు పంపి చదివించి తెలుగులోకి అంతర్జాలంలో దాన్ని తెచ్చే ప్రయత్నానికి నన్ను ప్రేరేపించిన, ప్రేరణ నిచ్చిన శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి కృతజ్ఞుడను. ప్రతి ఎపిసోడ్ చదివి, స్పందించి ప్రోత్సహించిన వారి ఋణం తీర్చు కోలేనిది. అసలు దీన్ని పూర్తి చేయగలనా అని అనుమానం వచ్చింది. 70 మంది మీద రాసే దాకా నమ్మకం కుదరలేదు. ఇక లాభం లేదని సుమారు నెల రోజులనుండి పగలూ, రాత్రి విడవ కుండా మిగిలిన వారిపై రాసి ఇవాల్టితో పూర్తి చేసి ఊపిరి పీల్చుకొని అమ్మయ్య అనుకొన్నాను. ఒక రకంగా భగీరథ ప్రయత్నమే ఇది.

అంటర్ మేయర్ ఆంగ్లకవులపై రాసిన పుస్తకాన్ని పూర్వం నాకు పంపగా, చదివి "పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు"గా నేను నెట్‌లో వారి ప్రోత్సాహంతోనే ధారావాహికంగా రాయటం, దానికి తామే పూనుకొని గ్రంథ రూపంలోకి తెచ్చి వారి బావగారు శ్రీ డా.రాచకొండ నరసింహ శర్మ ఎం.డి.గారికి 'అంకితమిప్పించటం మీకు తెలిసిందే. వారికి నాపై ఉన్న ఆత్మీయతకు ఇంత కంటే నిదర్శనమేముంది?

**అంకితం–** "ఆధునిక ప్రపంచ నిర్మాతలు–జీవితాలలో చీకటి వెలుగులు" అన్న ప్రపంచ గతిని తమ కృషితో మలుపు తిప్పిన 92 మంది మనీషులపై అంతర్జాలంలో నేను రాసిన ఈ ధారావాహికను, అందులోని 92 మంది మహానుభావుల అసామాన్య కృషికి, వీరినందరిని తన పుస్తకంలో ఆవిష్కరించిన అమెరికన్ ఆంగ్ల రచయిత "లూయీ అంటరర్ మేయర్" మేధస్సుకు, రచనా పాటవానికి, శైలికి ముగ్ధుడనై ఏమీ చేయలేక సవినయంగా నమస్కరిస్తూ కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. దీన్ని చదివి ఆనందించి, ఆదరించిన సాహితీ బంధువులకు, సాహిత్యాభిమానులకు వినయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

మీ

**– గబ్బిట దుర్గా ప్రసాద్**

3–8–16

ఉయ్యూరు.



# సాహిత్యమే శ్వాసగా జీవించిన అమెరికా ఆస్థానకవి లూయీ అంటర్ మేయర్

వందకు పైగా గ్రంథాలు రాసిన లూయీ అంటర్ మేయర్ అమెరికా కవి, జీవిత చరిత్రకారుడు అగ్ర శ్రేణి విమర్శకుడు, ప్రముఖ పత్రికా సంపాదకుడు అమెరికా దేశపు 14 వ ప్రభుత్వ ఆస్థానకవి అయిన బహుముఖ ప్రజ్ఞాని. వెయ్యేళ్ళ ఆంగ్ల కవిత్వంలో, కొత్తదారులు తొక్కి మార్గదర్శకులైన ఇగ్లాండ్, అమెరికా దేశ కవుల కవిత్వం జీవిత సరళి గురించి "లీవ్స్ ఆఫ్ ది పోఎట్స్" ఉద్గ్రంథాన్ని 1959లో రాశాడు. భావుకత పుష్కలంగా ఉన్న కవి అంటర్ మేయర్. ఫస్ట్ లవ్ ఫ్రెంచ్, చాలెంజ్ సెంచరీ, వన్ అండ్ వన్ అండ్ వన్ అండ్ వన్ , మొదలైన 20కి పైగా కవితా సంపుటాలను, "ఫ్రం అనదర్ వరల్డ్", బైగాన్స్ అనే స్వీయ చరిత్రనూ రాసుకొన్నాడు. "ప్లే ఇన్ పోయెట్రి, ది లోయెస్ట్ ఫారం ఆఫ్ విట్, ది పర్సూట్ ఆఫ్ పోయెట్రి మున్నగు 6 వ్యాస సంపుటాలను రచించాడు. మోజెస్ నవల, ది డాగ్ ఆఫ్ పంపే మొదలైన 7 కాల్పనిక సాహిత్య గ్రంథాలనూ రాసి పాఠకులకు సన్నిహితుడయ్యాడు. ట్రెజరీ ఆఫ్ గ్రేట్ పోయెమ్స్, మోడరన్ అమెరికన్ పోయెట్రి, మోడరన్ బ్రిటిష్ పొయెట్రి, న్యు సాంగ్స్ ఫర్ న్యు వాయిసెస్, గెలాక్సీ ఆఫ్ వెర్స్, ట్రెజరీ ఆఫ్ లాఫ్టర్, ఆంథాలజి ఆఫ్ న్యు ఇంగ్లాండ్ బెస్ట్ పోయెట్స్, హ్యూమర్ యాన్యువల్, ది గోల్డెన్ బుక్ ఆఫ్ పోయెమ్స్ ఫర్ ది వెరి యంగ్, మేకర్స్ ఆఫ్ ది మోడరన్ వరల్డ్ మొదలైన 30కి పైగా జీవిత చరిత్రలు కూర్చాడు. వండర్ఫుల్ అడ్వెంచర్స్ ఆఫ్ పాల్ బన్యన్, ఈసప్స్ ఫేబుల్స్, వరల్డ్స్ గ్రేట్ స్టోరీస్ వగైరా అనువాద గ్రంథాలు డజనుకు పైగా వెలువరించాడు. బాల సాహిత్యాన్నీ లూయీ సుసంపన్నం చేసి తాను స్పృశించి స్వర్ణమయం చేయని ప్రక్రియ లేదని నిరూపించాడు.

1885 అక్టోబర్ 1న అమెరికాలో న్యూయార్క్ నగరంలో జన్మించిన మేయర్, ఒక జామెట్రి లెక్క చేయ లేక పోయినందుకు గ్రాడ్యుయేట్ కాలేక పోయాడు. ఇరవై ఏళ్ళ

తీవ్ర కృషి చేసి సాహిత్య, సంస్కృతులను స్వయంగా అభ్యసించి, ఏ యూనివర్సిటీలో చదివిన దానికంటే అధిక జ్ఞానాన్ని సాధించాడు. ఇంగ్లాండ్ వెళ్లి కొంత కాలం గడిపి, ఆస్ట్రియ, ఇటలీలు చూసి, అమెరికా తిరిగి వచ్చి, రచనా వ్యాసంగం, సాహిత్యోపన్యాసాలు, వ్యవసాయంతోనూ కాలం గడిపాడు. అనేక యూని వర్సిటీలలో "పోయెట్ ఇన్ రెసిడెన్స్" గౌరవం పొందాడు. యుద్ధ సమాచార రచయితగా, ఆర్మ్డ్ సర్వీసెస్ ఎడిషన్‌లకు సంపాదకుడిగా ఉన్నాడు. తర్వాత ప్రముఖ టి.వి.చానల్‌లో ముఖ్య ప్రోగ్రామర్ భూమికను గొప్పగా పోషించాడు. అమెరికా లైబ్రరి ఆఫ్ కాంగ్రెస్‌కు ఆంగ్ల కవిత్వంలో కన్సల్టెంట్‌గా వ్యవహరించాడు. లూయీ రాసిన "మోజెస్" నవల విశ్వ విఖ్యాతమైంది. అతని ఉద్గ్రంథాలన్నీ పలు ప్రచురణలు పొంది ప్రాచుర్యం పొందాయి. 92వ ఏట లూయీ అంటర్ మేయర్ 18-12-1977న మరణించాడు. పేరులోని మేయర్ పదానికి సాహిత్యంలో, మేయరై మేరువై ప్రకాశించాడు.

## మేకర్స్ ఆఫ్ ది మోడరన్ వరల్డ్ ప్రత్యేకత

ఈ గ్రంథానికి ముందుమాట రాస్తూ అంటర్ మేయర్ "మన కాలంలోని ప్రముఖ వ్యక్తులందరి గురించి రాయటానికి నేను దీన్ని మొదలు పెట్టలేదు. 92 మంది ప్రముఖ స్త్రీ, పురుషులకు మాత్రమే నేను తీసుకొన్నాను. వారు గత శతాబ్దంలో నూతనత్వానికి దారి చూపారు, మన సాంస్కృతిక తీరు తెన్నులను మార్చారు, మన జీవిత విధానాన్నే సమూలంగా మార్చేశారు. వీరంతా బీజాణువులవంటి వారు. "కదిలించి చైతన్యం తెచ్చినవారు – మువర్స్ అండ్ షేకర్స్ అన్నమాట. వారిని అనుసరించిన వారిపై వారి ప్రభావం స్పష్టం, అమోఘం అద్వితీయం. వారి భావాలు, విప్లవాత్మక ఆలోచనలు, వ్యక్తీకరణ వలననే ఆధునిక ప్రపంచం ఇప్పుడున్న రీతిలో ప్రకాశమానమై ఉన్నది.

వీరిపై రాయటానికి నేను చాలా జాగ్రత్త తీసుకోవాల్సి వచ్చింది. కొందరు దారి తప్పించే ప్రయత్నం చేశారు. కాని వారిలోని ప్రయోగశీలతను, మార్గ దర్శకత్వానికి మాత్రమే నేను మొగ్గు చూపాను. తటస్తుల మాట వినక తప్పలేదు ఇందులో కళా జీవితంలో సృజనాత్మకంగా నూతనత్వాన్ని ఆవిష్కరించినవారు అధిక్షేపించ బడ్డారు, చులకన పాలయ్యారు కూడా. సృజనకారులైనవారు, సైంటిస్ట్‌లు, ఆటవిక అవహేళనకు ఎదురు నిలిచి వీరుల్లా యుద్ధం చేయాల్సి వచ్చింది. అందరూ నడిచేదారి నుంచి వైదొలగినవారు, లేక కట్టుబాటును కాదన్నవారందరూ, అచంచల విశ్వాసం, పట్టుదల, అపనమ్మకం, అడ్డంకులను ఎదుర్కొని ప్రపంచవ్యాప్త నిరసన వ్యతిరేకతను చవి చూశారు. సమాజం ఎప్పుడూ యధాస్థితినే కోరుకొన్నది. దానికి భంగం కలిగించిన వారిని అనుమానంతో క్షమించలేదు. స్పష్టమైన అభివృద్ధి, కొత్త ఆలోచనలతోనే స్థిరంగా సాధ్యపడుతుంది. దీనివలన వ్యక్తిగత శతృత్వం, సాదారణవ్యతిరేకత తప్పదు. తర్వాత

విరుద్ధం నిరంతరం సాగి, చివరికి అవహేళన చేసి హింసించిన ప్రపంచమే వారిని అర్థం చేసుకొని మహాగొప్పగా ఆరాధిస్తుంది. ఈ 92 మంది మహానుభావుల జీవిత చిత్రణలో ప్రపంచం కృతజ్ఞత చూపలేకపోయిన వారినీ ఇందులో రాశాను. వారి ప్రభావం ఈ శతాబ్దంపై చాలా మొరటుగా, హింసాత్మకంగా, అత్యంత అధికార క్రూర రాక్షస ఆధిపత్యాన్ని చెలాయించిన వారిని కూడా వారు విస్మరించ తగరు అని భావించి వారి గురించీ రాశాను.

ప్రముఖుల ఎన్నికలో వారిని తప్పని సరిగా రాయాల్సి రావటం మాత్రమే కాక వారి ప్రాధాన్యత కూడా గణనలోకి తీసుకున్నాను. చరిత్ర రాయాలి అని మాత్రమే కాక రాస్తూనే ఉండాలి అనే నియమం ఉన్నది. ఇందులో కొందరి గురించి పదేళ్ళ క్రితం తిరిగి రాశాను. అంతమాత్రం చేత మిగిలిన వారి విషయంలో విశ్లేషణలో ప్రాధాన్యాన్ని ఏమీ తగ్గించలేదు. డార్విన్, వాన్ గొ, ఫ్రాస్ట్ ఐన్ స్టీన్, ఎడిసన్‌ల కృషి వారి కాలానికి ఉన్న ప్రాధాన్యతను తెలియజేస్తుంది. చార్లీ చాప్లిన్, ఇసడోరా దంకన్ జీరార్డ్ మాన్లి హాప్కిన్స్ వంటి వారు అత్యవసరం అని పించక పోవచ్చు కాని, వారి రంగాలలో వాళ్ళ ప్రభావం చాలా విలక్షణమైనది.

కొందరు ప్రముఖులను వదిలేశాను. ఎందుకు అని ప్రశ్నిస్తే – వారిని చేరిస్తే వచ్చే ప్రశ్నలు అధికమౌతాయనే. రిచర్డ్ స్ట్రాస్‌ను గురించి నేను రాయలేదు. దీనికి కారణం ఆయన రిచార్డ్ వాగ్నర్ నుంచి అంగుళం కూడా కదిలి ముందుకు, ప్రక్కకు కాని పోలేదు. పైగా ఆయన "రిచార్డ్ ది సెకండ్" అని ముద్ర పడ్డాడు కనుక. చెవులకింపైన సంగీతం కూర్చిన గ్రీగ్, చెకోవ్ స్కిలు గొప్ప ప్రతిభా వంతులే కాని, ప్రాచుర్యం పొందినవారే కాని ఈ త్రయంలో ఏ ఒక్కరూ కొత్త సంగీత శబ్దజాలాన్ని సృష్టించనే లేదు. సృజనకారులైన స్కాన్బెర్గ్, బార్టోక్ ల, ప్రభావం విస్మరించ తగనిదే బాగా ప్రత్యేమైనదేకాని వదిలేయాల్సి వచ్చింది.

కవులలో కారల్ సాండ్ బర్గ్, వాలెస్ స్టీవెన్స్, మేరియాన్నే మూర్‌ల కృషి గొప్పదే కాని వారు సెల్ఫ్ ఎంక్లోసేడ్, సెల్ఫ్ కంప్లీట్‌గా గిరి గీసుకొని ఉండిపోవటంతో వదిలేశాను. కొందరు పియానో వాద్యకారులను కూడా వదిలేయాల్సి వచ్చింది. కారణం వీరి కృషిని కొందరు ముందే ఊహించి చెప్పటమే. లిస్టర్ పరిశోధనలు పాశ్చర్ అధ్యాయంలో తెరమరుగై పోయాయి.

ఇందులో ఉన్న స్త్రీ, పురుషులలో వారి ముఖ్య గుణగణాలను గురించే రాశాను. యదార్ధానికి అత్యంత సన్నిహితంగా ఉండాలన్నదే నా ధ్యేయం. కాని వ్యాఖ్యాత దృష్టికోణం కాదు. రచయిత నిష్పాక్షికంగా ఉండాలన్నది నా లక్ష్యం. నేను ఏ ఒక్క ఆలోచనా సంప్రదాయానికి అనుచరుడిని కాని, లేక ఎవరికీ శిష్యుడను కూడా కాను. ఏదో ఒక సిద్ధాంతాన్ని రుబ్బి రుచి చూపించేవాడినీ కాను. న్యాయమైన సూక్ష్మబుద్ధితో సత్యాలనే

వెతికి రాసి అంతిమ విలువకు ప్రాధాన్యమిచ్చే వాడినే తప్ప, ఊహాగానాలతో సంచారం చేసే వాడిని కాదు.

పుస్తకంలో కవులు, చిత్రకారులు, ఫిలాసఫర్లు, ఫిజిసిస్ట్‌లు, రాజకీయ నాయకులు మొదలైన శీర్షికలు ఎందుకు నేను పెట్టలేదు అనే ప్రశ్న రావచ్చు. దీనికి ముఖ్య కారణం ఇందులో చాలామంది ఒకే కేటగిరిలో ఇమిడేవారు కాదు. బెర్ట్రాండ్ రసెల్ గణితంలో అతి ప్రతిభావంతుడు మాత్రమేకాక గొప్ప ఫిలాసఫర్ కూడా.. టి ఎస్.ఇలియట్ కవి మాత్రమేకాదు, మహా నాటక రచయితా వ్యాసకర్త కూడా. అలాగే గాంధీని రాజకీయ నాయకుడిగా మాత్రమే చిత్రించి ఆయన ఇతర రంగాలలోని సేవా కార్య కలాపాలను ఆయన మహోన్నత వ్యక్తిత్వాన్ని విస్మరించలేము. ఆల్బర్ట్ స్వీట్జర్‌ను "సెయింట్స్"లో పెట్టి, ఆయన మిగిలిన విశేషాలను వదిలేయ లేము. కనుక శీర్షికలు పెట్టలేదు. వారి బహుముఖీయ ప్రతిభను పరిమితం చేయలేకనే శీర్షికలు పెట్టలేదు.

నేను కూర్చిన దానిలో ఒక మంచి సమతుల్యత, ఒక ప్రత్యేక విరుద్ధత కూడా ఉన్నాయి. ఎకడమిక్ విషయాలు తక్కువగా ఆసక్తికర విషయాల ప్రాధాన్యతతో మార్పుల ఒడిదుడుకులను దృష్టిలో ఉంచుకొని రచించాను. కాలాన్ని అనుసరించి రాయటం వలన సంఘటనలు ఆ కాలానికి ప్రాతినిధ్యం వహించటమేకాక వాటి ప్రభావం కూడా తెలుసుకొనే వీలున్నది. దీనివలన చారిత్రాత్మక అభివృద్ధి నేపథ్యం వరుసగా సోపానాలుగా దర్శనమిచ్చి వారి వ్యక్తిత్వాలకు మెరుగుపెట్టినట్లు అవుతుంది. పుస్తకం మొదటి నుంచి చివరిదాకా స్వతంత్రమైన క్రాస్ రిఫరెన్స్‌లను అందజేసి చదువరికి ప్రభావాల మెరుగు తరుగులను అర్థం చేసుకొనే వీలు కల్పించాను. ఇలాంటి అంతర్గత సంబంధాలు నీషే, వాగ్నర్, హిట్లర్‌లలో బాగా కనిపించి "అన్ని వైపులా రచయిత చూసి రాశాడు" అనే అభిప్రాయాన్ని కలిగించాను. ఇందులో మరీ ప్రత్యేకంగా కర్క్ గార్డ్, కాఫ్కా, సార్త్రేలలో ఇది బాగా కనిపిస్తుంది.

ఈ గ్రంథం స్పెషలిస్ట్‌ల కోసమో, విమర్శనా దృష్టితో చూసే విద్యావేత్తలకో కాదు. వారికి నా అంచనాలు స్పష్టంగా, అసంపూర్ణ నమూనాలుగా అని పించవచ్చు. కాని దీనికి విరుద్ధంగా కొంత విషయజ్ఞానం, ముందు ఊహ, సైంటిఫిక్ సాంకేతికాలలో ఉన్నవారికి సాహిత్య టెక్నిక్ ఉన్నవారికి ఉపయోగపడుతుంది. ఈ 92 మంది ప్రభావం ఇప్పుడున్న మనం ఉంటున్న కాలంపై ఎలా ఉంది అని నిర్వచించాలను కోవటం సహజమే. అందుకని వారి కృషి రసాన్ని వడబోయాల్సి వచ్చింది. ఈ బృహత్తర రచన కోసం నేను 600 గ్రంథాలను తిరగేయటమో వాటినుండి అభిప్రాయ సేకరణ చేయటమో జరిగింది. అందుకని నాకు ముందు రాసిన జీవిత చరిత్ర కారులకు విమర్శక విశ్లేషకులకు, నేను ఎంతో రుణపడి ఉన్నానని సవినయంగా మనవి చేస్తున్నాను. వారి

వివరాలన్నీ గ్రంథం చివర పొందుపరచాను. ఈ గ్రంథంలోని కొన్ని పేరాలు పూర్వం నేను రాసిన వ్యాసాలలో కనిపించి ఉండవచ్చు. వాటిని నేను యధాతథంగా వాడుకోవటానికి అనుమతించిన ఆ పబ్లిషర్లు "హార్ కోర్ట్ బ్రెస్ అండ్ కంపెని", కంపెని ఫర్ మోడరన్ అమెరికన్ అండ్ బ్రిటిష్ పోయెట్రి, ది కాలేజ్ సర్వే ఆఫ్ ఇంగ్లీష్ లిటరేచర్, హెన్రి హోల్ట్ అండ్ కంపెని, జార్జి మేకీ కంపనీస్ మొదలైన వారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. ఈ గ్రంథం రాస్తూ ఉండగా నాకు ఎన్నో సలహాలనిచ్చి ప్రోత్సహించిన జాక్ గుడ్ మాన్, ఫిలిప్ వాండోరన్ స్టెర్న్, మెర్రిల్ మూర్, స్టాన్లీ బర్న్ షాలకు కృతజ్ఞతలు. నా రిసెర్చ్ లో సహాయపడిన అల్రిక్ కాషెల్, ఎలైన్ లార్బర్, బీట్రిస్ బ్రాడే, మా కోడలు నార్మా ఆన్చిన్ అంటర్ మేయర్ లకు ఏమిచ్చి ఋణం తీర్చు కోగలను? కృతజ్ఞతలు చెప్పటం తప్ప.

ముఖ్యంగా సైంటిఫిక్ డేటా విషయంలో సేకరించిన విషయాలను చెక్, కౌంటర్ చెక్ చేసుకోవాల్సి వచ్చింది. దీనికి నాకొడుకు జాన్ మూర్ చాలా సహాయం చేశాడు. ప్లాంక్, ఎడ్డింగ్టన్‌లపై రాసిన చాప్టర్లలో అతను అందజేసిన విలువైన సమాచారం ఉంది. సంపాదకత్వంలో చక్కని చతురత, నిపుణత ఉన్న నా భార్య బ్రినా ఐవెన్స్ నా వెన్నంటి ఉండి నడిపించి ఈ మహత్తర గ్రంథాన్ని గట్టెక్కించటానికి చేసిన తోడ్పాటుకు ఆమెకు జీవితాంతం కృతజ్ఞుడను" అని అతి స్పష్టంగా అత్యంత వినయంగా తన ప్రణాళికను వివరించి, సహకరించినవారందరికి పేరు పేరునా కృతజ్ఞతలు తెలిపిన సహృదయ మూర్తి లూయీ అంటర్ మేయర్. "మేకర్స్ ఆఫ్ ది మోడరన్ వరల్డ్" బృహద్గ్రంథాన్ని 1955లో అంటర్ మేయర్ ప్రచురించి లోకానికి మహోపకారం చేశాడు. అది 20-10-2014న అంటే సుమారుగా 60 ఏళ్ళకు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి ద్వారా నాకు చేరింది. దీన్ని ఆ రోజునుంచే చదవటం ప్రారంభించి 23-1-2015కు అంటే 3 నెలల లోపు చదివి పూర్తి చేశాను. ఆతర్వాత కథ అంతా ముందే వివరించాను. ఇంతమంచి ఉపయుక్త గ్రంథాన్ని అనుసరించి తెలుగులో "ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు"గా అంతర్జాలంలో రాసి, ఇప్పుడు పుస్తక రూపంలో అందజేస్తున్నందుకు ఆనందంగా ఉంది. దీనికి సహకరించిన వారందరికీ మరో మారు కృతజ్ఞతలు. ఇందులోని గుణాలన్నీ అంటర్ మేయర్‌కు, దోషాలన్నీ నాకు దక్కుతాయని సవినయంగా మనవి చేసుకొంటున్నాను.

మీ

**గబ్బిట దుర్గాప్రసాద్**

24-3-17

ఉయ్యూరు



# జగదభ్యుదయాభివృద్ధి కారకులకు జేజేలు

- మైనేని గోపాలకృష్ణ
హంట్స్ విల్-యు. ఎస్.ఏ.

**జ**గదభ్యుదయాభివృద్ధి కారకులకు జేజేలు!

19, 20 శతాబ్దాలను ప్రభావితం చేసి జగత్ అభివృద్ధి అభ్యుదయాలకు కారణభూతులైన మహానుభావులను గురించి తెలుసుకొని అవగాహన కలిగించుకోవటానికి "ఆధునిక ప్రపంచ నిర్మాతలు-జీవితాలలో చీకటి వెలుగులు" గ్రంథం నేటి యువతరానికి ఉపయుక్తంగా ఉంటుంది. ఇందులోని మహనీయులు జీవితంలో ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొన్నారు. కాని తమ లక్ష్యాన్ని మాత్రం విస్మరించక ముందుకు సాగారు, అనుకొన్నది సాధించారు. అవహేళనలు అవమానాలు వారికి పూలదండలే అయ్యాయి. వీరి సిద్ధాంత, ప్రయోగ, ప్రవచనాలను అర్థం చేసుకొన్నవారు కొందరైతే, అపార్థం చేసుకొన్నవారు మరికొందరు. అయినా లక్ష్యపెట్టక ముందుకే ముందుకే సాగిపోయారు. అందుకే చిరస్మరణీయులై ఆరాధనీయులయ్యారు. వారి జీవితాలు స్ఫూర్తిదాయకాలు మాత్రమే కాదు, వారు వేసిన తప్పటడుగులు మనం వెయ్యకుండా జాగ్రత్తపడాలి. నిశితంగా వ్యక్తులను పరిశీలించి విమర్శించటం నేర్చుకోవాలి. లేకుంటే వారి అభివృద్ధి మార్గానికి అవరోధం కలిగించిన వారమవుతాం. కొత్తది అంతా మోతా, పాతది అంతా రోతా అనుకోకూడదు. రెంటిలోని మంచినీ గ్రహించి ముందుకు అడుగు వేయాలి. ఆత్మ సాక్షిగా మాత్రమే వీరు అభ్యుదయ మార్గం లోపయనించారు. అందుకే వీరిని చదవాలి, అర్థం చేసుకోవాలి. మన ప్రయత్నంలో స్ఫూర్తి నింపుకోవాలి. వీటికి ఈ గ్రంథం కరదీపికగా నిలుస్తుంది.

డార్విన్ తాత మన ఆలోచనా విధానంలోనే గొప్పమార్పు తెచ్చాడు. ఎన్నో జీవిత సత్యాలను పరిణామ సిద్ధాంతం ద్వారా వ్యాప్తి చెందించాడు. మార్కొని వైర్ లెస్ కనుక్కొని ప్రసార వ్యవస్థలో కీలక వ్యవస్థకు రూపకల్పన చేశాడు. బాక్టీరియా అంటే హాని కలిగించేవి మాత్రమే కావని అందులోనూ మన జీవికకు ఉపయోగపడేవీ రోగ నిరోధక శక్తి కలిగించేవి ఉన్నాయని లూయీ పాశ్చర్ కనుగొని ఉండకపోతే ప్రపంచం

శవాల గుట్టగా మారి ఉండేది. పెన్సిలిన్ మందు కనిపెట్టి ఫ్లెమింగ్ మానవాభ్యుదయాన్ని కొత్తదారి పట్టించాడు. అకాల మరణాలను ఆపి, జీవన అభివృద్ధి రేటుకు, రోగ రహిత సమాజానికి బాటలు వేశాడు. మేడం క్యూరీ రేడియం మొదలైన ధాతువులను కనిపెట్టి రోగ నిర్ణయం రోగ నివారణలకు నూతన ఆవిష్కారం చేసింది. మహామేధావి ఐన్‌స్టీన్ సాపేక్ష్య సిద్ధాంతం ఆధునిక భౌతిక శాస్త్ర చరిత్రనే మార్చేసింది. రైట్ సోదరుల పుణ్యమా అని ఇవాళ ప్రపంచమంతా "లోహ విహంగ" – ఎయిరోప్లేన్స్‌లలో గంటల్లో ప్రపంచం చుట్టి వస్తున్నాం. ప్రపంచాన్ని ఒక కుగ్రామమే చేసేశాం. నిమిషానికో విమానం గగన తలంలో ఎగురుతుంటే పక్షులేమోననే భ్రమ కలుగుతోంది. ఎడిసన్ మహాశయుడే లేకుంటే ఇంకా చీకట్లోనే బ్రతుకులు తెల్లారేవి. అందరికి వెలుగు వెన్నెలలు పంచిపెట్టాడు ఆ నిరంత పరిశోధక సృజనశీలి. మాక్స్ ప్లాంక్ క్వాంటం థీరీ వేల మైళ్ళు ముందుకు నడిపించింది. వీరంతా సైన్స్ ద్వారా మానవ సమాజంలో, జీవితాలలో గణనీయమైన మార్పులు తెచ్చినవారు.

మానవుడు భౌతికంగా ఎదగటమేకాదు ఆధ్యాత్మికంగానూ ఎదగాలి అన్న సత్యాన్ని ఆవిష్కరించే వారు తత్వవేత్తలు. వారి అంతరంగం స్వచ్ఛం, నిర్మలం. వీరిలో ఎన్నో సిద్ధాంతాలు ఉండవచ్చు. కాని వారివి మానవ మానసిక అభివృద్ధి మార్గాలు. అంతరంగాన్ని ఆవిష్కరించే పథాలు. కిర్క్ గార్డ్ అస్తిత్వవాదం, సైకాలజీ ద్వారా మార్పు తెచ్చిన విలియం జేమ్స్, నీషే, ఫ్రీవిల్ చెప్పిన బెర్గ్ సన్, వ్యవహారిక సత్తావాద ప్రముఖుడు జాన్ డ్యుయీ, విధిపై మానవ విజయాన్ని చెప్పిన మార్క్స్ అందరూ అందరే. ఆదర్శ ప్రాయులే.

అడవులలో తపస్సు చేసుకొనే మునీశ్వరులకు శాంతం భూషణం. అహింస వ్రతం. కాని నిత్య జీవితంలో దాన్ని అమలు చేయటం అసాధ్యమనిపిస్తుంది. సాధ్యం చేసి చూపాడు గౌతమ బుద్ధుడు ఆనాడు. నేటి రాజకీయాలలో అందునా పరాయి బ్రిటిష్ పాలనలో ఉంటూ భారత స్వాతంత్ర్యం కోసం వారిపై నిత్య పోరాటం చేస్తూ శాంతి అహింసలకు పట్టాభిషేకం చేసి, అదే సత్యవ్రతంగా దీక్ష చేబూని సత్యాగ్రహాలతో బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడ లాడించి స్వాతంత్ర సిద్ధిని సుసాధ్యం చేసిన అహింసా మూర్తి భారత జాతిపిత పూజ్య బాపూజీ మనకే కాదు విశ్వవంద్యుడయ్యాడు, ప్రాత స్మరణీయుడయ్యాడు. ఆయనపై థోరో ప్రభావం ఉన్నా దాన్ని సమస్యల సాధనకు ఆయుధంగా మార్చి విజేత అయి, నెల్సన్ మండేలా, మార్టిన్ లూథర్ కింగ్, ఆన్ సాంగ్ సూకీ వంటి వారికి ఆదర్శమైనాడు మహాత్మాగాంధీ. ఆయన సాధించిన శాంతి విప్లవం ప్రపంచ చరిత్రలోనే సువర్ణాధ్యాయం.

## ఆధునిక ప్రపంచ నిర్మాతలు- జీవితాలలో చీకటి వెలుగులు

ఆధునిక రష్యా నిర్మాతలు లెనిన్, స్టాలిన్, చైనా భవిష్యత్తు తీర్చిదిద్దిన సన్యట్ సేన్, బ్రిటిష్ ప్రధాని చర్చిల్ నిశిత బుద్ధి, యుద్ధతంత్ర నైపుణ్యం, న్యు డీల్‌తో అమెరికా భవితవ్యాన్నే మార్చేసిన అమెరికా అధ్యక్షుడు రెండవ ప్రపంచ యుద్ధంలో కీలక పాత్ర పోషించిన రూజ్ వెల్ట్‌లు స్మరణీయులు. వీరు రాజకీయ నాయకులేకాదు- వరల్డ్ ఫేమస్ గ్రేట్ స్టేట్స్ మెన్ కూడా.

చిత్రలేఖనంలో వినూత్న మార్గాలకై అన్వేషించి, నూత్న మార్గాలకు మార్గ దర్శులై కళలో సంపూర్ణత్వం కోసం జీవితాంతం కృషిచేసిన పికాసో, మాటిస్సే, సిజేన్, రేనార్డ్, మహాశిల్పి రోడిన్, ఆర్కిటెక్ట్ లాయడ్ రైట్ మొదలైనవారు ముళ్ళ బాటలలో ప్రయాణించి పూలబాటలలో హారతులందుకొన్నారు. వారి సృజనే వారి కీర్తికి కిరీటం పెట్టింది. రష్యన్ స్వరకర్త ఇగార్ స్ట్రా విన్స్కి, ఫ్రెంచ్ సంగీతాన్ని బంగారు ఉయ్యాలలో ఊపిన రిచార్డ్ వాగ్నర్ ఆల్బర్ట్ స్క్విజర్, సంగీతానికి ఎల్లలు లేవని నిరూపించారు. నవ్వుకే ఒక కొత్త అర్ధాని సృష్టించి, నవ్వుకు డిక్షనరీ అనిపించి, హాస్య సర్వస్వం అని తన మూకాభినయంతో ప్రపంచాన్నే ఆకర్షించిన నవ్వుల రేడు చార్లీ చాప్లిన్‌ను మర్చిపోగలమా? అతడు ఏ దేశం వాడో మనకు అవసరమా? ఆ ప్రభావం అలాంటిది. విశ్వ జనహృదయ విజేత చార్లీ చాప్లిన్. నృత్యంలో విప్లవం సాధించిన ఇసడోరా డంకన్ సాహసమే ఊపిరిగా జీవించిన అమెరికన్ నృత్యకళాకారిణి.

సాహిత్యంలో కవిత్వం విషయానికి వస్తే గడ్డిపరకలతో వెంటి పేని ఏనుగునే బంధించవచ్చు. అలాంటి "గడ్డిపరకలు" అంటే లీవ్స్ ఆఫ్ గ్రాస్‌కు సాహిత్య గౌరవం తెచ్చి, అట్టడుగు వర్గాలవారిని హీరోలను చేసి, అభ్యుదయ మార్గాన్ని పట్టించి మానవీయతకు పట్టాభిషేకంచేసి అమెరికన్ జాతీయ కవి మహర్షి అనిపించుకొన్న వాల్ట్ విట్మన్ ప్రభావం పడని దేశం లేదు. ఎమిలీ డికేన్సన్, శతాబ్దాల వారధి హార్డీ, సింబాలిజంతో మనసుదోచిన పాల్ వేర్లేన్, స్ప్రింగ్ రిధంకర్త మాన్లి హాప్కిన్స్, నేటివిజాన్ని నెత్తికెత్తుకొన్న రాబిన్సన్, వ్యావహారిక భాషా కవిత్వ సారధి రాబర్ట్ ఫ్రాస్ట్, చైతన్య స్రవంతికి ప్రాణంపోసిన జేమ్స్ జాయిస్, ప్రతీక కవిత్వ మార్గదర్శి ఎజ్రా పౌండ్, ఆధునిక కవిత్వ రధసారధి ఇలియేట్, కవిత్వ సంకెళ్ళు తెగగొట్టిన ఆడెన్, జ్వలించే విప్లవ భావ కవి డిలాన్ థామస్ ప్రపంచ కవులలో ఎన్నదగిన వారిలో ఉన్నారు.

అమెరికన్ ఆధునిక సాహిత్యానికి ఆద్యుడు మార్క్ ట్వేన్, కథ, నవలకు జీవం పోసిన హెమింగ్వే, ఫాక్నర్ ఫిట్జెరాల్డ్, అంతఃకరణకు విలువనిచ్చిన నవలా రచయిత డి.హెచ్.లారెన్స్, ప్రభావశాలి కాఫ్కా, స్టీఫెన్ క్రేన్, యేట్స్, సైంటిఫిక్ ఫిక్షన్‌కు దారి వేసిన హెచ్ జి వెల్స్, ఎమిలీ జోలా, బెర్నార్డ్ షా ప్రపంచ వ్యాప్త అభిమానులున్న రష్యా

నవలారచయిత, టాల్‌స్టాయ్ ఫారం స్థాపించిన రష్యన్ రచనా మహర్షి టాల్‌స్టాయ్, చిన్నకథల చెకోవ్, రియలిజం వ్యాప్తి చేసిన ఫ్లాబర్ట్, నేటివ్ అమెరికా నాటకానికి ఆద్యుడు యూజీన్ ఓ నీల్, నార్వేజియన్ నాటక పిత ఇబ్సన్ మొదలైనవారున్నారు. స్త్రీ జన హక్కులకోసం పోరాడిన సుశాన్ ఆంథోని, క్రిస్టియన్ సైన్స్ ఉద్యమకారిణి మేరీ బేకర్ ఎడ్డీ, సామాన్యుడికి కారు ఎక్కే అదృష్టం కల్పించిన హెన్రిఫోర్డ్, ఆధునిక జర్నలిజానికి ప్రతీక థామస్ ఉల్ఫ్ వంటి సృజనశీలురు, ప్రాతిభాసంపన్నులు, భావితరాలకు, ప్రపంచ దేశాలకు ఆదర్శమూర్తులు అందరు మీకు ఒక్కచోటే దొరుకుతారు. చదివి ప్రేరణ పొందటం మీ కర్తవ్యం. వీరంతా ప్రపంచాభివృద్ధికి అభ్యుదయానికి కారకులు. వారందరికీ జేజేలు.

91 మంది మహనీయుల జీవిత చరిత్రలలో వెలుగుతోపాటు చీకట్లనూ ఆవిష్కరించి, సరళమైన భాషలో, అందరికి అందుబాటులో ఉండేట్లు రాశారు మిత్రులు శ్రీ దుర్గా ప్రసాద్ గారు. దీని ఆంగ్ల మాతృక రచయిత అమెరికాకు చెందిన లూయీ అంటర్ మేయర్. దానికి పరిపుష్టి కలిగించారు తెలుగులో, తెలిగింపులో శ్రీ దుర్గా ప్రసాద్. దీన్ని సరసభారతి ద్వారా ప్రచురిస్తున్నందుకు, ప్రపంచ ప్రసిద్ధ స్టాటిస్టిక్స్ గణిత శాస్త్రవేత్త కీ.శే. డా.శ్రీ పరుచూరి రామకృష్ణయ్యగారికి అంకితం ఇవ్వటం చాల సముచితంగా ఉంది. ఇంతటి ఉత్కృష్ట రచన సరసభారతి ద్వారా ముద్రింప జేయటానికి మా దంపతులం ప్రాయోజకులుగా ఉండటం మాకు దొరకిన అరుదైన అవకాశంగా అదృష్టంగా భావిస్తున్నాము. ఇది తెలుగు సాహిత్యంలో నూతన మార్గానికి ఆవిష్కరణ అవుతుంది అనటంలో సందేహం లేదు.

**- మైనేని గోపాలకృష్ణ**

12-11-17



# దారి చూపే వెలుగు దివ్వెలు

- సవరం వెంకటేశ్వరరావు

There are Greater Things in Life than the "Life itself". జీవితానికి మించి జీవితంలో ఉన్నతమయినవి ఉన్నాయి. సామాన్యుడి దృష్టిలో జీవితం అంటే సుఖంగా, సౌఖ్యంగా, ఆనందంగా జీవించడం. ఇంతకు మించి పరిధి విస్తృతం చేసుకొని జీవితాన్ని చరితార్థం చేసుకొన్న వాళ్ళే సామాన్యులుగా జన్మించి, అసమాన్యులుగా పరిణమించి, మాన్యత పొందుతున్న మహనీయులు అయ్యారు.

ఆ కొందరిలో మనందరికీ స్ఫూర్తి ప్రదాత సంస్కారి, బహుముఖ ప్రజ్ఞాశాలి, ఉన్నత విద్యావంతులు, బహుభాషాకోవిదులు, ఉత్తమ ఉపాధ్యాయులు, అర్ష విజ్ఞాన ఘని, ప్రాశ్చ్య, పాశ్చాత్య, సాహిత్య, తర్క, వైజ్ఞానిక పరిజ్ఞానాన్ని ఆకళింపు చేసుకొన్న దార్శనికుడు, నిత్యపరిశోధకుడు, సాధకులు, నిష్కళంక సౌజన్యమూర్తి, నిరాడంబరులు, మూర్తీభవించిన మానవతామూర్తి, మాన్యశ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ మాష్టారు గారు తాను బోధిస్తున్న పాఠ్యాంశం కన్నా దాన్ని బోధిస్తున్న ఉపాధ్యాయుడు (గురువు) ఉన్నతంగా, ఆదర్శవంతుడుగా గోచరించినంత కాలమే ఆ ఉపాధ్యయుడు శిష్యులకు మార్గదర్శకుడు అవుతాడు. గౌరవానికి పాత్రుడవుతాడు.

నాగరికత, సాంస్కృతిక పరిణామ దశలో మానవుడు తన తోటి సమాజానికి అనేక రూపాల్లో అనేక అమూల్య వస్తువులను, బహుమతులుగా ఇచ్చారు. అయితే అన్నింటికన్నా విలువైనది మానవ సమాజానికి వారసత్వంగా సంక్రమించిన అమూల్య సంపద 'విద్య-జ్ఞానం' మాత్రమే. నిజానికి విద్య అంటే పుస్తకాలు, పరిజ్ఞానం- విషయ జ్ఞానం, "నైపుణ్యాలు-సంపాదన-సామార్థ్యాలు" కాదు. మరి మానవుడు తనసాటి సమాజానికి అందించే అత్యంత విలువైన సంపద- అర్థవంతంగా జీవించడం నేర్పించడమే.

ఆదర్శ ఉపాధ్యాయుడుగా, ప్రధానోపాధ్యాయుడుగా నాలుగున్నర దశాబ్దాలు గుణాత్మక విద్యను అందించి, ఉత్తమ విద్యార్థులుగా తీర్చిదిద్దిన మాష్టారు రచనా వ్యాసంగాన్ని నిష్టగా కొనసాగించడానికి కారణం, బహుశా ఆయన టి-వై (టి మైనస్ వై) కాన్సెప్ట్‌ను విశ్వసించడమే కావచ్చు.

నిన్నటికన్నా ఈ రోజు మరింత అర్థవంతంగా, జ్ఞానవంతంగా, ఆనంద మయంగా జీవించడమే- టి-వై.కాన్సెప్ట్ ఉద్యేశ్యం.

ఒక మంచి అనుభూతిని హృదయానికి గానీ కాస్త జ్ఞానాన్ని మెదడుకు గాని ఇవ్వకుండా ఒక్కరోజు గడిచింది అంటే ఆ రోజు ఆ వ్యక్తి మృగంగా బ్రతికాడు అన్నమాట.

మాష్టారు గారి నిత్య చైతన్యవంతమైన ఆధ్యాత్మిక, రచనా వ్యాసంగాన్ని గమనిస్తే మనకు స్ఫూర్తినిచ్చేది 'టి-వై' కాన్సెప్ట్.

గుణాత్మకత అనేది ఆకాశం నుండి ఆకస్మికంగా సంక్రమించేది కాదు. గుణాత్మకత అంటే రోజూ చేసే పనుల్ని నిన్నటికన్నా ఈ రోజు మెరుగ్గా చేయగలనేమోనని ప్రయత్నించడమే. బహుశా మాష్టారు గారిలోని ఆ గుణాత్మకత ఏడు పదుల వయస్సులో ప్రతి క్షణాన్ని నిర్మాణాత్మకంగా గడపడమే కాక మనకూ స్ఫూర్తి కలిగిస్తుంది.

ఇక అసలు విషయం మాష్టారుగారు తన రచనా వ్యాసంగం ద్వారా మనకు అందించిన కానుకలు అమూల్యం. కలకాలం మనల్ని నిత్య చైతన్యవంతులను గావించే జ్ఞాన సంపద అపారం.

"మనిషి దీపమయినా కావాలి. లేదా అద్దమయినా కావాలి". ఒకటి వెలుగు నిస్తుంది. మరొకటి దాన్ని ప్రతిబింబిస్తుంది. ప్రతి వారు దీపం కాలేకపోవచ్చు. కాని అద్దం కాగలరు. తనకు తెలిసిన జ్ఞానాన్ని మరొకరికి పంచడమే జీవితం- అన్నటువంటి తాత్వికుడు అరిస్టాటిల్ మాటలను ఆచరణలో అనుస్టించిన సద్గురు శ్రీ దుర్గాప్రసాద్ మాష్టారుగారు.

భారతీయ సనాతన ధర్మం రాగద్వేషాలకు అతీతంగా మానవుని పారలౌకిక చింతనను ప్రచోదితం చేయడమే గాక, లౌకిక జీవితంలోని సత్యసత్యాలను విశ్లేషించి, విశదీకరించే కర్తవ్యశాస్త్రం. పురుషార్థాలకు, పరమార్థాలకు సహేతుక భాష్యం చెప్పుతున్న విజ్ఞాన శాస్త్రం.

భారతీయ వాఙ్మయం అంతా సమగ్ర జీవన విధానాన్ని నిర్దేశిస్తుంది. విచక్షణలతో కూడిన ఆలోచనా ధోరణిని, తార్కిక ప్రజ్ఞను ప్రోత్సహిస్తుంది. "మనిషిలోని భావపరిణామం, విషయ పరిజ్ఞానం, విశ్వ పరిజ్ఞానం, సిద్ధాంత పరిజ్ఞానం" అనేవి పాక్షిక ధోరణులకు అతీతంగా పెరగాలని ప్రభోదిస్తుంది. మతాల పేరిట మానవులు

పరస్పర శత్రువులు కారాదు అంటుంది. మతం మూఢ నమ్మకాలకు ఆజ్యంపోయక మనిషిలోని విజ్ఞతను, మానవత్వాన్ని పరిమళింప చేయమంటుంది- భారతీయ ఆర్షజ్ఞానం. ఒక్కమాటలో చెప్పాలంటే "ఏకంసద్విప్రా బహుధా వదంతి" సర్వోన్నత సత్యం ఒక్కటే అయితే ప్రాజ్ఞులు, విజ్ఞులు, తమ అవగాహన మేరకు రకరకాలుగా వ్యాఖ్యానిస్తారు.

ఆత్మ జ్ఞానానికి మూలం జిజ్ఞాసతో కూడిన భారతీయ తత్వశాస్త్రం. అయితే భౌతిక, ఆధునిక జ్ఞాన మీమాంసకు మూలం ఐరోపాతత్వశాస్త్రం.

సార్వత్రిక అస్తిత్వవాదమే సత్యానికి పునాది అన్న ప్లేటో మహాశయుడు తన గురువు సోక్రటీస్, మరో జ్ఞాని ప్రొథాగరస్ మధ్య సంభాషణను రికార్డు చేశాడు.

నిపుణులైన వారిని ఉత్పత్తి చేసే కార్ఖానాలుగా మన విశ్వవిద్యాలయాలు మారుతున్న దశల్లో మనం వీరి సంభాషణ నుంచి గ్రహించాల్సింది చాలా వుంది. ప్రోథాగరస్ వాదన ప్రకారం నైపుణ్యం కంటే ఉన్నతంగా "శీలం- ధర్మం" వున్నాయి. మానవాళికి వాటిని అందించటమే విద్య, జ్ఞానం యొక్క పరమార్థం" అంటాడు. అయితే సొక్రటీస్ వ్యక్తిగత జిజ్ఞాస లేకుండా "శీలం-ధర్మం" ఏ ఒక్కరికి అందించేది కాదు. స్వతహాగా వుండాలి అంటాడు.

అసలు నైపుణ్యానికి మించిన పరిశుద్ధ జ్ఞానం ఉంటుందా! జ్ఞానమనేది ఏదో ఒక రూపంలో నైపుణ్యమే కదా!

ఇలా ఎడతెగని చర్చోపచర్యలు కొనసాగుతున్న దశలో మాష్టారు గారి అనువాద గ్రంథం "ఆధునిక ప్రపంచ నిర్మాతలు- జీవితాలలో చీకటి వెలుగులు" అంతర్జాలం ద్వారా వ్రాస్తు అధ్యయనం చేయమని ఆధ్యాత్మిక మాష్టారు నన్ను మార్గనిర్దేశం చేశారు. శారీరక రుగ్మతలు, వృత్తిపరమైన ఒత్తిడిలు, వ్యక్తిగత అవాంతరాలు నడుమ నత్తనడకన అధ్యయనం పూర్తి చేశాను.

స్వభావరీత్యా పఠనం కంటే అధ్యయనం చేసే అలవాటు మేరకు సమగ్రంగా, సాకల్యంగా అధ్యయనం చేయటానికి నెలలు పట్టింది. ఇక ఆకళింపు చేసుకొని భావపొందికను రూపొందించుకోవడం అసాధ్యమనిపించింది.

కారణం, ఎక్కడి నుండి ఎలా ప్రారంభించాలి అనేది కాదు. గ్రంథనామం "ఆధునిక ప్రపంచ నిర్మాతలు- జీవితాల్లో చీకటి వెలుగులు" అయినప్పటికీ పాఠకుడిగా మనో జ్ఞాననేత్రాన్ని తేజోమయం చేసే ఈ అమూల్య గ్రంథాన్ని ఎలా విశ్లేషించగలను. నాకున్న అర్హత? అన్న ప్రశ్నకు జవాబు దొరకలేదు. అయినా ప్రారంభించాను. విశ్లేషణ కాదు, సమీక్ష కాదు. కేవలం నా మనో స్పందన మాత్రమే.

లూయీ అంటర్ మేయర్ వ్రాసిన Makers of the Modern World

గ్రంథానికి అనువాదం అయినప్పటికీ, మాష్టారుగారు స్వయంగా వ్యక్తం చేసినట్లు చాలావరకు వ్యక్తిగత పరిశోధన ద్వారా సమకూర్చిన అదనపు సమాచారం గ్రంథమునకు పరిపుష్టి చేకూర్చినది.

ఆధునికం అనగానే నా మదిలో రేకెత్తే ప్రశ్నలు. అసలు ఆధునికం అంటే ఏమిటి? సమకాలీనతలో వచ్చే ఏ మార్పు అయినా ఆధునికమా! అంటే మారిన పరిస్థితులో వచ్చిన సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థల్లో వచ్చిన మార్పు ఆధునికతా! లేక దృక్పథాల్లో వున్న అవగాహన, ఆలోచనల్లో వున్న నవ్యత అనే వాటిని ఆధునికంగా తీసుకోవాలా! ఇలా ఆలోచిస్తే భారతీయతకు మించిన ఆధునికత ఏ నాగరికతల్లోను లేదు.

"A Nation Lives by the Memories of its Heroes" ఒక జాతి తన వీరులను స్మరించుకోవడం ద్వారా మాత్రమే సజీవంగా వుంటుంది. తమ పూర్వీకులు సాధించిన విజయాలకు గర్వపడలేని వాడు తమను గర్వించుకోగల ఏ ఘనకార్యాన్ని సాధించలేడు.

సాహిత్యం, సంగీతం, నాట్యం, శిల్పం, నాటకం, వేదాంతం, రాజకీయం, శాస్త్ర, సంకేతిక విజ్ఞానం కార్యక్షేత్రాలుగా మహనీయులు తమ తమ రచనల్లో చేసిన విశిష్ట కృషి ద్వారా ఆధునిక యుగ నిర్మాణానికి తోడ్పడినవారే.

భారతీయ ధార్శనిక భాండాగారంలో చతుషష్టి కళలు నుండి మహావాక్యం 'అహం బ్రహ్మాస్మి' వరకు సంఖ్యాపరమైన సాధికారికత గలదు. అలాగే మాష్టారు 91 మంది ప్రముఖుల జీవితాల్లో ఉద్దాన పతనాలను ఆవిష్కరించారు. వాస్తవానికి ఆయా వ్యక్తుల చీకటి వెలుతురు పార్శ్వాలను ఆవిష్కరింప చేసే నేపథ్యంలో వారి జీవితాలు, వ్యక్తిత్వాలను, ఆలోచనలను ప్రభావితం చేసిన సంఘటనలను, సన్నివేశాలను వర్ణించిన సందర్భాలు పాఠకులను ఆలోచింపచేస్తాయి.

19, 20 శతాబ్దాలకు చెందిన వారిలో ఆధునిక ప్రపంచానికి ఎలా స్ఫూర్తి కలిగించారు అనే విషయాన్ని అత్యంత సాధికారికంగా, తులనాత్మకంగా, సంగ్రహంగా, సూటిగా వ్రాయడమే కాదు, మనల్ని పునరాలోచనల్లోకి తీసికెళ్ళడం మాస్టారు గారి కలం ప్రత్యేకత.

"ఆరిజన్ ఆఫ్ స్పెసీస్" ద్వారా జీవపరిణామ సిద్ధాంతానికి నూతన భాష్యం చెప్పిన చార్లెస్ డార్విన్ జీవితంలోని మలుపులను ఆవిష్కరిస్తూ సూటిగా ప్రకృతి రహస్యాన్ని డార్విన్ మాటల ద్వారా మన మష్కిష్కాలను పదును పెట్టమన్నారు.

ఈ విశ్వంలో ఇంకా నశ్వరం కాకుండా వున్న జీవుల రహస్యం వాటి బలం

కాదు, ప్రజ్ఞ కాదు. మార్పుకు అనుగుణంగా సర్దుకకుపోవటం లేదా స్పందించడం అనే జీవన సూత్రం నిత్యసత్యం కదా!

సామ్యవాద మహర్షి కారల్‌మార్క్సు మిగులు విలువ సిద్ధాంతాన్ని విశ్లేషించిన మాష్టారు చాలా ఆశ్చర్యకర ఉపమానం ప్రయోగించారు. జీవితంలో ఎక్కువ భాగం లైబ్రరీలలో గడిపి, యదార్ధావాదాన్ని, రోమాంటిక్ వాదానికి వ్యతిరేకంగా వ్యాప్తిచేసి, తన జీవితాన్ని మాత్రం “నిత్య పెళ్ళి కొడుకుగా అనుభవించినవాడు మార్క్సు. ప్రపంచగిరిని కొన్ని దశాబ్ధాలు ప్రభావితం చేసిన ‘దాస్ కాపిటల్, వర్గ పోరాటం’ ద్వారా మార్క్సు చెప్పాలనుకున్న దాన్ని సూటిగా విశ్లేషించారు.

ఆలోచన, సమాలోచన, ప్రత్యామ్నాయ ఆలోచనలకు ప్రాతిపదికగా ఆధునిక యుగం అనేక సాహితీ ప్రక్రియలకు ఆద్యులయిన శాశ్వత దిగ్గజాలను, వారి తార్కిక, తాత్విక, భావజాలన్ని అద్భుతంగా ఆవిష్కరించారు. రష్యా విప్లవానికి పరోక్షకారకుడైన శాంతికముకుడు లియోటాల్ స్టాయ్ గాని, కవిత్వమే ఊపిరిగా బ్రతికిన రచయిత్రి ఎమిలీడికెన్స్. నవలా సామ్రాజ్యానికి ఆద్యుడు మార్క్‌ట్వేన్. వాస్తవికతకు సాహిత్య గౌరవం తెచ్చిన ఎమిలీ జోలా, సున్నిత హాస్యం ద్వారా జీవన సత్యాలను వివరించిన జార్జ్ బెర్నార్డ్ షా. సాహిత్యంలో చైతన్య స్రవంతి ప్రతిపాదించిన జేమ్స్ జాయిస్. ఆధునిక కవిత్వాన్ని దిశదశ నిర్దేశం చేసిన టి.యస్.ఇలియట్. అస్తిత్వ వాదాన్ని ఖచ్చిత ప్రమాణాలతో సాహిత్యంలో విశ్లేషించిన జీన్‌పాల్ సాత్రే. తన పొరపాటున అస్తిత్వంలో జీవితం నరకప్రాయం చేసుకున్న భావచిత్ర కవిత్వ వ్యాప్తి చేసిన ఎజ్రాసౌండ్. ముఖ్యంగా నేటి తరం, అమెరికా భూతల స్వర్గంగా భావిస్తుంటే ఎజ్రాపౌండ్ అమెరికా ఒక పిచ్చివాళ్ళ శరణాలయం అని విమర్శించాడు.

ఇలా మహాకవుల సాహిత్య సృజనను, వారెదుర్కున్న పరీక్షలను అద్భుతంగా చిత్రించారు మాష్టారు.

బలమున్న వాడిదే రాజ్యం అని విర్రవీగిన అడాల్ఫ్ హిట్లర్, ప్రజాభిమానానికి పాత్రుడై నాలుగుసార్లు అమెరికా అధికార పీఠమెక్కిన అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్. ఇనుప తెర వేసిన రష్యా ఉక్కు నియంత జోసెఫ్ స్టాలిన్ ఆలోచనల వెనుక అంతరంగాలను సాధికారికంగా వివరించారు. అన్నింటికి మించి భారతజాతి పిత గాంధీజి తత్వచింతన లోని వాస్తివికతను, వ్యక్తిత్వం విశిష్టతను తులనాత్మకంగా ఆవిష్కరించారు.

ఇక శాస్త్రరంగంలో రేడియో ఆక్టివిటీ కనిపెట్టిన తొలిమహిళ మేరీక్యూరీ నుండి విమానయానానికి శ్రీకారం దిద్దే ఆవిష్కరణ చేసిన రైట్ సోదరులు వరకు, రేడియో కనిపెట్టిన మార్కోనీ మొదలు, క్వాంటం సిద్ధాంతకర్త మాక్స్ ప్లాంక్, వాక్సినేషన్,

పెర్మింటేషన్ కనుగొన్న లూయీ పాశ్చర్ నుండి, మానవాళి ప్రాణాలు కాపాడే పెన్సిలిన్ కనుగొన్న అలెగ్జాండర్ ఫ్లెమింగ్ వరకు మానవాళికి మహోపకారం చేసిన శాస్త్రవేత్తల కన్నీళ్ళ వెతలను, ఆయా ఆవిష్కరణల వెనుక తపనను స్ఫూర్తి కలిగించేలా వ్రాసారు.

ఇలా సంగీతం, శిల్పం, నృత్యం, నాటకం తదితర రంగాలలో చైతన్యవంతమైన పాత్ర పోషించిన మహనీయుల జీవనగాథలు వారు అనుభవించిన కష్టాలు, విజయాలు సమ్మిళితంగా మనముందించారు.

విద్య అన్నది జీవితాలో ఒక భాగం మాత్రమే. చదువే జీవితం కాదు. విద్యను బోధించడానికి, బాధించడానికి అనేక విద్యాసంస్థలు వున్నాయి. సంస్కారం, సమయ స్ఫూర్తి, తెలివి, చురుకుదనం, చిరునవ్వు, ప్రేమ, టైము మేనేజ్‌మెంట్, బద్ధకంపై గెలుపు, టెన్షన్ అదిగమించడం, ఆత్మన్యూనతా అధిగమించడం మర్యాద, మాట్లాడే విధానం ఇవి ఏ పాఠశాలలో నేర్పరు. తల్లిదండ్రులుగా మనమే నేర్పాలి. మనం నేర్పాలంటే మనకు తెలియాలి.

మనకు తెలియాలి అంటే మనం ఆలోచించాలి. మనం ఆలోచించాలంటే ఇలాంటి పుస్తకాలను చదవాలి. చదువు అంటే మనకు కావాలసినది తెలుసుకోవడం. జ్ఞానం ఉంటే మనకు అవసరం లేనిది వదిలిపెట్టడం.

అలాంటి జ్ఞానాన్ని మన సొంతం చేసుకోవడానికి మాస్టారు దుర్గాప్రసాద్ గారు అవిశ్రాంత యోధుడిగా "కలం", "గళం"తో మనకు ప్రాణపదంగా మార్గనిర్దేశం చేస్తున్నారు,

నువ్వు బొమ్మ ఎంత బాగా గీసావన్నది ముఖ్యం కాదు. ఏ పర్స్పెక్టివ్‌తో గీసావన్నది ముఖ్యం. అలాంటి పర్స్పెక్టివ్ వున్నది కాబట్టి పికాసోని అంత గొప్ప చిత్రకారుడు అంటుంది ఈ లోకం.

"ఆధునిక ప్రపంచ నిర్మాతలు– జీవితాలలో చీకటి వెలుగులు– నిజానికి మనకు దారి చూపే వెలుగు దివ్వెలు. మనలో అజ్ఞానాన్ని పటాపంచలు చేసే కాంతి రేఖలు. జీవితం పట్ల అవగాహన పెంపొందించే గ్రంథం. సమకాలీన సమాజానికి మార్గ నిర్దేశం చేసే అడుగుజాడ. ఆలోచనలకు పదును పెట్టడమే కాదు, ఆదర్శాలకు ప్రేరణ కల్పించడమే కాదు, ఆచరణాత్మక వ్యూహానికి, నిర్మాణాత్మక కార్యాచరణకు శ్రీకారం దిద్దే మణిదీపిక– కరదీపిక ఈ ఉద్గ్రంథం.

**– సవరం వెంకటేశ్వరరావు**

**15-11-2017**



## ఆధునిక ప్రపంచ నిర్మాతలు-జీవితాలలో చీకటి వెలుగులు -

సాహితీ బంధువులకు రథసప్తమి, అరవైవ గణతంత్ర దినోత్సవ శుభాకాంక్షలు.

నాకు, సరస భారతికి శ్రీ మైనేని గోపాల కృష్ణ గారు (అమెరికా) అత్యంత ఆత్మీయులు అన్న సంగతి మీకు తెలిసిన విషయమే. ఎప్పుడూ ఆయన తనకు నచ్చి చదివిన పుస్తకం నేను కూడా చదవాలన్న ఉద్దేశ్యంతో కొని, నాకు పంపటం దాదాపు పదేళ్లుగా జరుగుతున్న విషయం. ఎప్పటికప్పుడు నాకేదైనా పుస్తకం కావాలంటే నిస్సంకోచంగా తనకు తెలియ జేయమని చెబుతూనే ఉంటారు. కాని నేను ఏనాడూ ఆ అవకాశం ఉపయోగించుకోలేదు. నిరుడు ప్రముఖ అమెరికన్ రచయిత "లూయీ అంటర్ మేయర్" రాసిన "లైవ్స్ ఆఫ్ ది పోయెట్స్" పంపటం వెంటనే నేను చదివి "పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు"గా నెట్‌లో రాయటం, దాన్ని వారు స్పాన్సర్ చేస్తే పుస్తకరూపంలో సరసభారతి తీసుకురావటం తెలిసిందే. ఆ తర్వాత ఎప్పుడో నెట్‌లో వెతుకుతుంటే లూయీ రాసిన "మేకర్స్ ఆఫ్ ది మోడరన్ వరల్డ్" అనే పుస్తకం చూశా. మైనేని గారికి రాసి ఆయన చదివారేమో అడిగా. చదవలేదని చెప్పటం, వెంటనే కొని నాకు పంపటం, అది కిందటి అక్టోబర్ ఇరవైన నాకు చేరటం చక చకా జరిగిపోయాయి. ఆరోజే చదవటం ప్రారంభిచాను. అందులో "గుజ్జు" ఉందనిపించింది. దాన్ని సమయం ఉన్నప్పుడు చదువుతూ నెమ్మదిగా మూడు నెలలు చదివి ఈ ఇరవై తేదీకి పూర్తి చేశాననిపించాను.

1909లో జన్మించిన చార్లెస్ డార్విన్‌తో ప్రారంభించి 1914లో పుట్టిన డిలాన్ థామస్‌తో పూర్తి చేసి వందేళ్ళ కాలంలో మధ్యలో ఎందెరెందరో రాజకీయ, వేదాంత, ధార్మిక,

ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక చిత్రలేఖన, సాహిత్య, నాటక సినిమా, సంగీతాది రంగాలలో చరిత్రను మలుపు తిప్పిన 91 ప్రముఖుల జీవితాలను, వారు సాధించిన విజయాలను, పొందిన కీర్తిని అపకీర్తిని, పడిన కష్టాలను అన్నిటినీ కళ్ళకు కట్టేట్లు లూయీ అంటర్ మేయర్ తన ప్రతిభా సర్వస్వంగా మహా గొప్పగా చిత్రించాడు. వీరిని ఆయన "movers and shakers" అన్నాడు. అంటే కదిలించి చైతన్యం తెచ్చిన వారన్నమాట. ఇందులో ఎందరో నాకు తెలియని వారే ఉన్నారు. వారిని ఈ పుస్తకం ద్వారానే తొలిసారి తెలుసుకొన్నాను. కనుక మీకూ వారి విశేషాలను అందించాలనే ఆలోచన కలిగి "ఆధునిక ప్రపంచ నిర్మాతలు– జీవితాలలో చీకటి వెలుగులు"అనే శీర్షిక తట్టి మైనేనిగారికి మెయిల్ రాస్తే శుభస్య శీఘ్రం అని ఆశీర్వదించారు. ఇవాళ రధ సప్తమి, భారత రిపబ్లిక్ దినోత్సవం కలిసి వచ్చిన శుభ సందర్భంగా ఈ ధారావాహికను ప్రారంభిస్తున్నాను. ఇందులోని వారి జీవితాలలో సాధించిన జయాపజయాలకే ప్రాధాన్యం ఇస్తున్నాను. వారెక్కడ ఎప్పుడు పుట్టి ఎక్కడెక్కడ ఏమేం చదివారో వగైరా ల జోలికి పెద్దగా పోదలచుకోలేదు. సంక్షిప్తంగా, సూటిగా మాత్రమే రాస్తున్నాను. ఆదరిస్తారని భావిస్తున్నాను

**– గబ్బిట దుర్గా ప్రసాద్**

## వినయంతో విన్నపం

రిసెర్చ్ కృషిలాంటి ఈ బృహద్గ్రంథం "ఆధునిక ప్రపంచ నిర్మాతలు– జీవితాలలో చీకటి వెలుగులు" ప్రచురణలో నాకు, సరసభారతి, ప్రాయోజకులకు, అంకితం పొందుతున్న వారికీ ఎవరికీ ప్రతిఫలాపేక్ష, వ్యాపార దృష్టి లేదని ప్రపంచ పురోగతికి మార్గదర్శకులైన మహనీయుల జీవిత విశేషాలు సాధించిన ఘనవిజయాలను, తెలియని వారికి, ముఖ్యంగా నేటి యువతకు, అభిరుచి ఉన్న ఆసక్తిగల పాఠకుల దృష్టికి తెచ్చి, ఇంతటి సమాచారాన్ని అందుబాటులో ఉంచటమే మా ప్రధాన లక్ష్యమని మనస్ఫూర్తిగా తెలియ బరుస్తున్నాను. ఇది సరసభారతి 27వ ప్రచురణ. నా 15వ గ్రంథం అని మనవి చేస్తున్నాను.

**– గబ్బిట దుర్గాప్రసాద్**

1-11-2017

# ఎందరో మహానుభావులు...

"ఆధునిక ప్రపంచ నిర్మాతలు- జీవితాలలో చీకటి వెలుగులు" అనే గ్రంథానికి ఆధరాభిమానాలతో ముందుమాటలు రచించిన మచిలీపట్నం హిందూ కాలేజీ హిస్టరీ హెడ్ డా.శ్రీ సవరం వెంకటేశ్వరరావు గారికి– అభిలషణీయమైన ఆకర్షణీయమైన ముఖచిత్రాలను డిజైన్ చేసిన శ్రీ కళాసాగర్ గారికి, డిటిపి చేసి సరసభారతి తరపున అందంగా ముద్రింపజేసి, అందజేసిన ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం ప్రదాన కార్యదర్ధి, రమ్యభారతి సంపాదకులు, సరసభారతి ఆత్మీయులు శ్రీ చలపాక ప్రకాష్ గారికీ, కీ.శే. డా. శ్రీ పరుచూరి రామకృష్ణయ్య గారికి అంకితమిప్పించి సార్థకత కల్పించి, ప్రాయోజకులుగా సరసభారతి తరపున గ్రంథ ముద్రణకు తోడ్పడిన ఆత్మీయులు శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి (అమెరికా) దంపతులకు, నాతోపాటు అడుగులేస్తూ సహకరిస్తున్న సరసభారతి కార్యవర్గానికి కృతజ్ఞతలు. నా రచనలకు ప్రోత్సాహమిస్తున్న నా అర్ధాంగి శ్రీమతి ప్రభావతికి, నా కుటుంబ సభ్యులకు అభినందనలు.

**– గబ్బిట దుర్గాప్రసాద్**

## వదాన్యులకు వందనాలు

**ఉ**య్యూరు శ్రీ సువర్చలాంజనేయస్వామి వారల సేవలకు భక్తితోను, సరసభారతి కార్యక్రమాలకు, గ్రంథ ముద్రణలకు ఆదరాభిమానాలతోనూ విరాళాలు అందజేసిన దాతలకు కృతజ్ఞతలు. **– గబ్బిట దుర్గాప్రసాద్**

1. శ్రీ వేలూరి పవన్, శ్రీమతి రాధ దంపతులు– అమెరికా– రూ. 15,000
2. శ్రీ వేలూరి వివేకానంద్, శ్రీమతి దుర్గ దంపతులు– హైదరాబాద్– రూ. 13,116
3. శ్రీ కోమలి సాంబవధాని, శ్రీమతి విజయలక్ష్మి దంపతులు– అమెరికా– రూ. 10,000
4. శ్రీ అడుసుమిల్లి రాంకీ, శ్రీమతి ఉష దంపతులు– అమెరికా– రూ. 9,000
5. శ్రీ గబ్బిట సంకల్ప్– అమెరికా– రూ. 7,500
6. శ్రీ గౌడ రఘు, శ్రీమతి సురేఖ దంపతులు– అమెరికా– రూ. 7,000
7. శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి దంపతులు– అమెరికా– రూ. 7,000
8. శ్రీ వీలూరి రామకృష్ణ, శ్రీమతి పద్మజ దంపతులు– అమెరికా– రూ. 6,600
9. శ్రీ జగ్గా లోకనాధ్, శ్రీమతి సురేఖ దంపతులు– అమెరికా– రూ. 6,000
10. డా. శ్రీ బండారు రాధాకృష్ణమూర్తి,
    డా. శ్రీమతి సులోచన దంపతులు– అమెరికా– రూ. 6,000
11. శ్రీ వాసుకి, శ్రీమతి మాలిని దంపతులు– అమెరికా– రూ. 5,000
12. శ్రీ సుంకర కోటేశ్వరరావు, శ్రీమతి సరోజిని దంపతులు– అమెరికా–రూ. 5,000
13. శ్రీ రావి శరత్, శ్రీమతి ఉష దంపతులు– అమెరికా– రూ. 5,000
14. శ్రీ గోసుకొండ నరేంద్ర, శ్రీమతి అరుణ దంపతులు– అమెరికా– రూ. 4,000
15. శ్రీ గంధి హరి, శ్రీమతి విజయలక్ష్మి దంపతులు– అమెరికా– రూ. 3,500
16. శ్రీ వేలూరి హరికిషన్, శ్రీమతి శారిక దంపతులు– అమెరికా– రూ. 3,000
17. శ్రీమతి వేణి దంపతులు– అమెరికా– రూ. 2,500
18. శ్రీ అడుసుమిల్లి పవన్ సాయి, శ్రీమతి పద్మశ్రీ దంపతులు– అమెరికా–రూ. 2,500
19. శ్రీమతి పసుమర్తి లక్ష్మి– అమెరికా– రూ. 2,000
20. గార్లపాటి ప్రసావధాని, శ్రీమతి అనసూయ దంపతులు– అమెరికా–రూ. 1,500
21. శ్రీ నాగరాజు, శ్రీమతి రంజని దంపతులు– అమెరికా– రూ. 1,250
22. శ్రీ వేలమూరి నాగేశ్వరరావు దంపతులు– విజయనగరం రూ. 516
23. శ్రీ శంభుని శ్రీరామచంద్రమూర్తి,
    శ్రీమతి సీతామహాలక్ష్మి దంపతులు– ఖమ్మం– రూ. 500
24. శ్రీమతి చతుర్వేదుల జానకి– విజయవాడ– రూ. 500
25. శ్రీ కూచిభొట్ల రాజగోపాల కృష్ణమూర్తి,
    శ్రీమతి సీతారామమ్మ దంపతులు– ఉయ్యూరు– రూ. 500/–

# విషయ సూచి -



# ఆధునిక ప్రపంచ నిర్మాతలు-
# జీవితాలలో చీకటి వెలుగులు

## 1. జీవ పరిణామ సిద్ధాంతం చెప్పిన -చార్లెస్ డార్విన్ (1809 -1882)

చార్లెస్ డార్విన్ రాసిన "పరిణామ సిద్ధాంతం'-"ది ఆరిజిన్ ఆఫ్ స్పెసీస్"పై సాంప్రదాయవాదులు తిరగబడితే, నవీనులు సమాదరించారు. ఆరేళ్ళప్పుడే తల్లిని కోల్పోయాడు. జంతువులంటే చిన్నతనం నుంచే అమితమైన ప్రేమ ఉండేది. రక్తాన్ని చూస్తే బెదిరిపోయేవాడు. ప్రతిదీ తెలుసుకోవాలన్న తపనతో సైన్స్ మీద దృష్టిపెంచుకొన్నాడు. దక్షిణ అమెరికాకు పరిశోధన కోసం వెడుతున్న బీగిల్ అనే ప్రభుత్వ నౌకలో నేచరిస్ట్ అయిన డార్విన్‌కు అవకాశం ఇచ్చి ఆహ్వానిస్తే వెళ్ళాడు. దొరికిన లక్షణాలను బట్టి ఆ జీవి రూపు రేఖలు, ప్రవర్తన నిర్ణయించ వచ్చుననే వాడు. దీన్ని నౌక కెప్టెన్, మరియు "ఫ్రేనాలజిస్ట్" అయిన ఫైజ్ రాయ్ ఈసడిస్తూ "ఈకల్ని బట్టి పక్షి సంగతి చెప్పే నీ ముక్కు మాత్రం నాకు నచ్చ లేదు" అన్నాడు. రెండేళ్ళు అనుకొన్న ఈ పరిశోధన అయిదేళ్ళు పట్టింది .

ఈ సుదీర్ఘ ప్రయాణంలో సరైనా తిండి లేక, పడక లేక చాలా దారుణ పరిస్థితుల్లో గడిపాడు. సముద్ర జ్వరంతో బాధ పడ్డాడు. ఆరోగ్యం బాగా దెబ్బతిని జీవితాంతం బాధ పడ్డాడు. కాని ఈ ప్రయాణం తన జీవితంలో గొప్ప విద్యను అందించిందని సంబరపడ్డాడు. డార్విన్ ఇప్పుడు "సెర్చింగ్ బయాలజిస్ట్" అవతారం ఎత్తాడు. ఎప్పుడూ

అనారోగ్యం, జ్వరం, కడుపు నొప్పి, వాంతులు మొదలైన వాటితో బాధలు పడుతూ సంసారం చేస్తూ అయిదుగురు కొడుకుల్ని ఇద్దరు అమ్మాయిల్ని కన్నాడు. యాభై వ ఏట ఆరిజిన్ ఆఫ్ స్పెసీస్ ప్రచురించాడు. దీని ప్రభావం సోషల్ సైన్స్, వేదాంతం, మతం మొదలైన వాటిపై పడి గణనీయమైన మార్పులు చెందాయి అవి. దీనితో డార్విన్ ప్రాభవం పెరిగిపోయి "న్యూటన్ ఆఫ్ బయాలజీ" అని డార్విన్‌ను అందరు కీర్తించారు. థామస్ హక్స్లీ కూడా డార్విన్ ఫాన్‌గా మారిపోయాడు.

ఆరిజిన్ ఆఫ్ స్పెసీస్‌ను అధిక్షేపించటమే కాకుండా నిషేధానికి గురి చేశారు. అలాంటి పాఠాలు స్కూళ్ళలో బోధించ రాదన్నారు. డార్విన్ చెప్పినవి బోధిస్తున్న జాన్ థామస్ స్కోప్ అనే ఉపాధ్యాయుడిని అరెస్ట్ చేశారు. దీనిపై ప్రజా సంఘాలు మండిపడి ఎదురుతిరిగినాయి. కోర్టు కేసులు నడిచి ఆ ఉపాధ్యాయుడిని ఎన్నో ఇబ్బందులకు గురి చేసింది. వేసవిలో కోర్టుకు హాజరైన ఆ మేస్టారి ప్రాణాలు హరీ మన్నాయి పాపం. నిజం చెప్పిందుకు ఇంతటి శిక్ష అనుభవించాడు ఆ పూర్ క్రీచర్ టీచర్.

దేనికీ వెరవని డార్విన్ తన పుస్తకాన్ని పెంచి రాస్తూనే ఉన్నాడు, మెరుగులు దిద్దుతూనే ఉన్నాడు. డార్విన్ చెప్పిన పరిణామ సిద్ధాంతాన్ని గురించి రాసిన పాల్‌సియర్స్ అనే ఆయన "the immediate effect of Darwin on science was one of magnificent release. It was not ,properly speaking, a stimulus --the vast unexplored world of the unknown was stimulus enough, and curiousity was straining to under stand it. Darwin cut the leash, and the human mind leaped a head. He wrought mightily, and others with him, for a newer and greater faith --in universal order, whose secrets open themselves to men truly free to question" అని గొప్ప కాంప్లిమెంట్ ఇచ్చాడు.

నూట ఇరవై జాతులకు, తొమ్మిది ఉపజాతులకు డార్విన్ పేరుపెట్టి గౌరవించాడు. ఆయన కనిపెట్టిన గాలాపగాస్ దీవులకు "డార్విన్ ఫించేస్" అనే గౌరవనామం పెట్టి గుర్తించారు. ఇతరులు కనిపెట్టిన పరిణామాత్మక విషయాలకు "డార్వినిజం" అని పేరు పెట్టారు. రాయల్ సొసైటీ రాయల్ మెడల్ ఇచ్చి సన్మానించింది.

డార్విన్ 2-12-1809లో ఇంగ్లాండ్‌లో జన్మించి, డెబ్భై మూడవ ఏట 19-4-1882న చనిపోయాడు. మతాన్ని మత నమ్మకాలను ఒక మలుపు తిప్పిన జీవ శాస్త్ర వేత్త చార్లెస్ డార్విన్. జీవ పరిణామ సిద్ధాంతం నవ శాస్త్ర సూర్యోదయానికి నాంది పలికింది.



## 2. అస్తిత్వ వాద పిత - సోరేన్ కీర్క్ గార్డ్(1813-1855)

పందొమ్మిదవ శతాబ్దపు దేనిష్ వేదాంతి కీర్క్ గార్డ్. జీవితకాలంలో బాగా వ్యతిరేకతను ఎదుర్కొన్నాడు. అసలు పేరు సోరెన్ ఆబె కీర్క్ గార్డ్. దాదాపు మూడు వందల సంవత్సరాలు అతన్ని అందరూ మర్చేపోయారు. ఆ తర్వాత అతని గొప్ప తనాన్ని తెలుసుకొని ఆరాధించటం ప్రారంభించారు. క్రైస్తవ మిస్టిక్‌గా భావించారు. ఆయన చెప్పిన కొత్త వేదాంతం చాలా వ్యతిరేకతను పొందింది. అస్తిత్వవాదాన్ని తెరపైకి తెచ్చాడు. 5-5-1813లో కోపెన్ హాగెన్‌లో జన్మించిన నూట ఇరవై నాలుగు ఏళ్ళ వరకు ఆయన రాసిన దానికి దేనికీ ఇంగ్లీష్ అనువాదం రాలేదు. ఆయన గురించిన కనీస సమాచారమూ తెలియనే లేదు. అదృష్టం బాగుండి 1940లో ఆయన ప్రతిభను గుర్తించి సెయింట్ ఆగస్టేన్ తర్వాత కీర్క్ గార్డ్ వంటి మత ప్రవక్త, మనస్తత్వ శాస్త్ర వేత్త జన్మించలేదని ప్రశంసించారు. చర్చి ధోరణిలోని నిరంకుశత్వాన్ని ఎదిరించాడాయన. కఠిన నియమ నిబంధనలను కాదన్నాడు.

తండ్రి గొప్ప పవిత్ర వ్యాపారవేత్తయే కాని ప్రైవేట్ జీవితంలో పెద్ద పాపి. కొడుకును మతంలోకి లాగే ప్రయత్నం చేశాడు. నరక లోకం అగ్ని గురించి చెప్పి భయ పెట్టేవాడు తండ్రి. ఆ వాతావరణం అతనికి సరిపడలేదు. "నేను పుట్టినప్పుడే ముసలివాడిని"అని చెప్పుకున్నాడు. తనకు పసితనం బాల్యం యవ్వనం దూరమైనాయని వ్యధ చెందేవాడు. తండ్రి అంటే భయం, కోపం, పగ, ద్వేషం అతనిలో నరనరాన వ్యాపించాయి. దీనితో ఏ ఆనందాన్ని అనుభవించలేక పోయాడు. ప్రేమించటం అంటే ఏమిటో తెలియనే తెలియదు. అమ్మాయిలు ఐ లవ్ యు చెప్పినా , ఆ మధురానుభూతి కలిగేదికాదు. ప్రేమించిన అమ్మాయి ఈయన దగ్గర్నుంచి లవ్ సిగ్నల్స్ రాకపోతే వేరొకడిని పెళ్లి చేసేసుకొన్నది. ఈ భావాలను ఒక గొప్ప రచనగా "యైదర్ ఆర్" పేరిట రాశాడు.

మత వేదాంతంపై దృష్టి పెంచుకొని మారుపేర్లతో వరుసగా అనేక గ్రంథాలు రాశాడు. అందులో "ది కాన్సెప్ట్ ఆఫ్ ఐరనీ", "ఫియర్ అండ్ ట్రెంబ్లింగ్" వగైరాలున్నాయి. అతని దృష్టిలో ప్రతి నిర్ణయం రిస్క్‌తో కూడినదే. అనంతత్వం చేతిలో నడిచే మనిషి తన నిర్ణయాన్ని సర్వం -శూన్యంల మధ్య ఏదో దాన్ని ఎన్నుకోవాలి అన్నాడు. ఈ

భావాన్నే ఇబ్సన్ "బ్రాండ్" మొదలైన నాటకాలలో ప్రతిఫలింప జేశాడు. ముప్ఫైవ ఏట మతతత్వ శాస్త్రాన్ని గురించి తీవ్రంగా ఆలోచించి రాశాడు. ఈ భావాలు పాశ్చాత్య బుర్రల్ని వేడెక్కించింది, కలవరపరచింది. వ్యంగ్యం, సందేశం కలగా పులగం చేసి విజృంభించి రాశాడు. వ్యవస్థీకృతమైన ప్రతి వ్యవస్థ మీద తిరగబడ్డాడు. అధిక్షేపణ, అవహేళనలతో వారి మన స్థిమితాన్ని దెబ్బ తీశాడు. యాంత్రిక యుగంలో మనిషి నిస్సహాయుడే కాకుండా నిరాశా వాదిగా మారిపోతున్నాడని బాధపడ్డాడు. "man became helpless and hopeless" అన్నాడు. మనిషికి ఉన్న ఒకే ఒక ఆశ ఏమిటంటే తన ఉనికిని అర్థం చేసుకోవటం మాత్రమే అని చెప్పాడు. మత బోధనలు ఆచారాలు మనిషిని దేవుడి దగ్గరకు చేర్చలేవని మనిషి స్వయంగా సూటిగా భగవంతునితో సంబంధం పెట్టుకొన్నప్పుడే అది సాధ్యం అన్నాడు. మనిషికి ఉన్న జ్ఞానం, తెలివి తేటలు అతని అణకువకు నిదర్శనంగా ఉండాలన్నాడు. వాటిని త్యాగం చేసుకొని దేవుని సమీపాన్ని పొందాలి అని చెప్పాడు. "the existent individual is not a Being but a Becoming 'అనే సత్యాన్ని విశదీకరించాడు .క్రైస్తవ మతంకూ "is a Becoming --an endless progress through anxiety ,in security ,and suffering .It ceases to be Christianity when it sinks complacently into peace of mind" అని రావాల్సిన మార్పును ఖచ్చితంగా సూచించాడు కీర్క్ గార్డ్.

క్రైస్తవ ఫాదరీల దౌష్ట్యాన్ని, అవివేకాన్ని, పెత్తనాన్ని, డబ్బు మనస్తత్వాన్ని ఎండగట్టాడు. ఏసు క్రీస్తు చెప్పిన పరమ సత్యాలను వీరందరూ నీరు గార్చి స్వంత వ్యాఖ్యానాలతో ప్రజలకు మతాన్ని దూరం చేస్తున్నారన్నాడు". చర్చి -క్రిష్టియానిటీని పూర్తిగా బహిష్కరించింది. "hurch has practically abolished Christianity in the name of Christ" అని నిర్మోహమాటంగా చెప్పాడు కీర్క్‌గార్డ్. క్రీస్తును అడ్డం పెట్టుకొని ఆడే దొంగాటల వల్ల క్రైస్తవం పరువు గంగలో కలుస్తోందని వాపోయాడు. మత పెత్తనంపై విమర్శగా "అటాక్ అపాన్ క్రిసెండం" రాశాడు. మతాధికారుల పద్ధతి ఎలా ఉందంటే "for them Christianity does not exist --and yet they live on it" అని కడిగిపారేశాడు.

సమకాలీన జీవితంలో అసంబద్ధతను వ్యతిరేకించి తిరస్కరించి ప్రక్షాళన కోసం పాటుబడ్డ మత వేదాంతిగా కీర్క్ గార్డ్ చరిత్ర పుటల్లో నిలిచాడు. ఈ విధంగా ఇంత నిర్మోహమాటంగా మాట్లాడితే మతపెద్దలు సాహిస్తారా? ఎదిరించారు, అణగ దొక్కే ప్రయత్నాలు చేశారు. పత్రికల వాళ్ళూ ఎదురు దాడి చేశారు. కార్టూనిస్ట్‌లకు చేతినిండా పని దొరికింది. ఆయన బాహ్య ఆకృతిపై వ్యంగ్యాత్మక కథనాలు, కార్టూన్లు గుప్పించారు. కీర్క్ గార్డ్ సింప్లిసిటిని, హుమిలిటిని కోరాడు. "man is a social paradox, he

is his own reason for being and yet he is nothing without the transcendent power of God" అని మనిషి శక్తిని చెప్పాడు. మనిషి కాలంలో జీవిస్తాడని, కాని అతను తప్పకుండా కాలాతీతమైన భావన కలిగి ఉండాలని, ఉత్కృష్టత వైపు పయనం సాగించాలని మానవ మేధకు పరిమితికి మించిన జ్ఞానాన్ని పొందే ప్రయత్నం నిరంతరం చేయాలని కోరాడు.

తాను ఏమి కోరుకొంటున్నాడో చెబుతూ "what I require is a voice as piercing as a lynx;s eye, as terrible as the sigh of a giant , as persistent as a cry of nature in order to deliver my self of what is in my mind ,to shake the bowels of anger , sympathy ,and understanding అన్నాడు. పరిస్థితులు చాలా తెలికైపోయాయని వాటిని కష్టతరం చేసే ప్రయత్నాలు కావాలని కోరుకొన్నాడు కర్క్ గార్డ్. ఇంతగొప్ప వేదాంతి, నలభై మూడవ ఏట రోడ్డుమీద నడుస్తూ మూర్ఛ వచ్చిపడి పోయాడు. చూసిన వారు ఆస్పత్రిలో చేర్చారు. అప్పటికే నడుమునుంచి కింది భాగ మంతా పక్షవాతం వచ్చింది. కదలలేని పరిస్థితి. మళ్ళీ గుండెపోటు వచ్చి 11-11-1855లో కర్క్ గార్డ్ నలభై మూడవ ఏట మరణించాడు.

సందట్లో సడేమియాలా మత పెద్దలు తమను కీర్క్ గార్డ్ వ్యతిరేకించ బట్టే పక్షవాతం పాలైనాడని తమ పక్షపాత బుద్ధి పొనిచ్చుకోకుండా కూశారు. తగిన శాస్తి జరిగిందని సంబరాలు చేసుకొన్నారు. సమకాలీనుల మెప్పు పొందకపోయినా ఈ కాలంలో కర్క్ గార్డ్ తిరుగులేని మత వేదాంతిగా ఆరాధింప బడుతున్నాడు. "వాస్తవం"పై ప్రశ్నలు సంధించాడు. అతని భావనలు ఆధారంగా ఫ్రాంక్ కాఫ్కా, థామస్ మాన్‌లు అనేక రచనలు చేసి గుర్తింపు పొందారు. నకిలీ క్రైస్తవాన్ని ఎదిరించాడు. "man's affirming existence is greater than all the concepts of his intellect" అన్నది కీర్క్ గార్డ్ నిశ్చితాభిప్రాయం. దీన్ని ఆధారం చేసుకొని నోబెల్ ప్రైజ్ విన్నర్ జీన్ పాల్ సాత్రే అస్తిత్వవాదాన్ని అభివృద్ధి చేశాడు. ఆధునిక మానవుడు ప్రకృతికి దూరమైపోతున్నాడని, శాస్త్ర సాంకేతికలతో భగవంతుని నుండి తొలగిపోయాడని కీర్క్ గార్డ్ బాధ పడ్డాడు. "ఇవాళ మానవుడు ఒక స్థాన భ్రంశం చెందిన మనిషి "displaced person" అని సానుభూతి చెందాడు.

కీర్క్ గార్డ్ ప్రభావం మనవ మనస్తత్వ శాస్త్రం మీద చాలా ఉంది. క్రిస్టియన్ సైకాలజీ. ఎక్సిస్టెన్షియల్ సైకాలజీ, థెరపీలకు ఆద్యుడు. అస్తిత్వవాదమే మానవవాదం అన్నాడు. "ఫాదర్ ఆఫ్ ఎక్సిం స్టలిజం" అంటారు గార్డ్‌ను. అస్తిత్వ వాదంతో మతాన్ని కొత్తమలుపు తిప్పి, దేవునికి మనిషికి మధ్య చర్చి, చర్చిపెద్దలు అడ్డుగోడలని భావించి ఆ గోడల్ని కూల ద్రోసే ప్రయత్నం చేసి చరిత్ర ప్రసిద్ధుడైనాడు కీర్క్ గార్డ్.❋



## 3. ఆధునిక సంగీత నిర్మాత - రిచార్డ్ వాగ్నర్ (1813 -1883)

తండ్రికి ఉన్న తొమ్మిది మంది సంతానం లో చివరివాడుగా లీప్ లిజ్ లో పుట్టి, పుట్టిన కొన్ని నెలలకే తండ్రిని కోల్పోయి, ఇరవై ఏళ్ళకే ప్రపంచ దృష్టి అలవడి తన పేరు విల్ హెమ్ రిచార్డ్ వాగ్నర్‌లో మొదటి భాగాన్ని తీసేసుకొన్నాడు. కుటుంబానికి సన్నిహితుడు చిత్రకారుడు, నటుడు నాటక రచయిత, జ్యూ అయిన లుడ్విగ్ గేయర్‌ను తల్లి మళ్ళీ పెళ్ళాడింది. కొత్త మొగుడు వలన ఒక కూతురును కన్నది. వాగ్నర్ మారుటి తండ్రి కుటుంబాన్ని చాలా ఆప్యాయంగా బాధ్యతాగా పెంచాడు. ఇతనిపై ప్రత్యేక శ్రద్ధ వహించాడు కూడా. ఇదొక విశేషమే. కుటుంబం డ్రెస్ డేయిన్‌కు మారింది. గేయర్ వాగ్నర్‌ను స్కూల్‌లో చేర్చి రిచార్డ్ గేయర్ అని పేరు నమోదు చేశాడు. పద్నాలుగో ఏట పుకార్లు షికార్లు చేసి చెవిన పడి రిచార్డ్ వాగ్నర్‌గా పేరు మార్చుకొన్న స్వతంత్ర జీవి. పది హేనేళ్ళ వయసులో షేక్స్ పియర్ రచనలు చదివి హేమ్లెట్ నాటకం ప్రభావంతో "లీ బాల్డ్ అండ్ అడిలైడ్" నాటకం రాశాడు. అందులో వచ్చే పాత్రలనన్నిటిని మొదటి అంకాలోనే చంపేశాడు. నాటకం ట్రాజెడీ కావటానికని వాళ్ళని మళ్ళీ చివర్లో బతికించి ప్రయోగం చేశాడు. గ్రీకు ట్రాజెడీలపై ఆరాధన ఏర్పడింది. హోమర్ సాహిత్యాన్ని పన్నెండు భాగాలు అనువాదం చేశాడు. అప్పటిదాకా సంగీతం అంటే పెద్దగా ఇష్టం ఉండేది కాదు.

వెబర్ రాసిన "ఫ్రీస్చిట్జ్" గురించి విన్న తరవాత సంగీతంపై విపరీతమైన మోజు ఏర్పడింది. వాటిని తన పియానో మీద వాయించి తృప్తి చెందాడు. సోనాటాలు సింఫనీలపై దృష్టి పడింది. షెక్స్పియర్‌ను బీతొవెన్ మొజార్ట్‌ను కలలలో కలుసుకొని మాట్లాడానని వాగ్నర్ చెప్పుకొన్నాడు. అంటే మనసంతా వాళ్ళే నిండిపోయారన్న మాట. పదహారో ఏట సంగీతంలో మెళకువలు గ్రహించి సంగీతకర్త అయ్యాడు. మనసులోని భావాన్ని హార్మనితో పలికించటం, బీతోవన్ నుంచి కౌంటర్ పాయింట్‌ను పొందటం జరిగింది. కుటుంబం వారెవ్వరూ వాగ్నర్ సంగీతకర్త అవటానికి అభ్యంతరం చెప్పలేదు. అతని పెద్దక్క అప్పటికే ఒపేరా గాయనిగా ప్రసిద్ధి పొందింది. కంపోసర్‌గా కంటే గాయకుడిగా స్థిర జీవితం అతనికి లభిస్తే బాగుంటుందని మాత్రం వాళ్ళు

ఆశించారు.

తల్లి పియానో, వయోలిన్ విద్యలో కొడుకు ఆరితేరాలని కోరుకొన్నది. గురువుల వద్ద నేర్పించింది. కాని నేర్పిన గురువు "వాగ్నర్‌ను" వరస్ట్ ఫెలో –తెలివిగాలాడే కాని బద్ధకిస్టు" అన్నాడు. ఈ రెండిటినీ సంపూర్తిగా నేర్వనే లేదు. పద్దెనిమిదో ఏట లీప్ జిగ్ యూనివర్సిటిలో చేరి సంగీతకర్త బాష్ వారసుడైన థియోడర్ వీన్లిగ్ దగ్గర సంగీతం నేర్చాడు. గురువు శిష్యుడు చేసిన పియానో సొనాటా, పోలోనైజ్ అనే రెండు కంపోజిషన్‌లను ముద్రించే ఏర్పాటు చేసి ప్రోత్సహించాడు. యూనివర్సిటీకి రెగ్యులర్‌గా వెళ్ళేవాడు కాడు. తాగి తందనాలాడేవాడు. జూదం ఆడేవాడు. తల్లి కొచ్చే పెన్షన్ డబ్బుల్ని విచ్చల విడిగా ఖర్చు చేసి ఎప్పుడూ అప్పుల అప్పారావు అవతారంలోనే ఉండేవాడు. కాని సంగీతంలో ప్రయోగాలు చేస్తూనే ఉండేవాడు.

సి మేజర్‌లో చేసిన స్వర సమ్మేళనం అంటే కంపోజిషన్ ప్రేగ్‌లో ప్రదర్శించాడు. మొదటి ఒపేరా "ది వెడ్డింగ్" స్వరాలు కూర్చి నచ్చక మంటల్లో తగల పెట్టేశాడు. ఇరవై రెండవ ఏట రెండవది "ది ఫెయిరీస్" ప్రారంభించాడు. ఇది జర్మన్ కవి గోతే రాసిన 'ఫాస్ట్' కూర్పులా ఉంటుంది. ఇదీ ప్రదర్శనకు నోచుకోలేదు. అప్పటికే సంగీతంలో పండిపోయాడు. ప్రొఫెషనల్ అనిపించుకొన్నాడు. వాగ్నర్ సోదరుడు స్టేజి మేనేజర్‌గా ఉన్నాడు. ఇతనికి కోరస్ మాస్టర్‌గా అవకాశం ఇచ్చి ఒక గుర్తింపు తెచ్చాడు. తిండికి ఇబ్బంది లేని ఉద్యోగం దొరికింది. ఇప్పుడు మూడవ ఒపేరా "దిలవ్ బాన్" కోసం ప్రయత్నం చేశాడు. ఇందులో షేక్స్పియర్ రాసిన "మెజర్ ఫర్ మెజర్" ఇతివృత్తాన్ని వాడుకొన్నాడు. దీనితో కీర్తి వచ్చిమాగ్దేబర్గ్‌లోని చిన్న దియేటర్ డ్రామా కంపెనీకి సంగీత దర్శకుడయ్యాడు. ఆ ప్రదేశం కాని, అక్కడి జనం కాని నచ్చక మళ్ళీ లీప్ జిగ్‌కు వెళ్ళిపోయాడు.

ఇక్కడ మన వాడి కద మలుపు తిరిగింది. ఆరేళ్ళ కూతురున్న మిన్నా ప్లానర్ అనే పెద్దగా సంస్కారం లేని ఆమెతో పరిచయం ప్రేమగా మారి పెళ్లిదాకా వచ్చింది. ఆమె నాటకరంగంపై అభినివేశం నిర్వహణా సామర్ధ్యం ఉన్నావిడ. పెళ్లి అయింది కాని వాగ్నర్ తిక్క కుదర్లేదు. బాధ్యతారాహిత్యంగా, ప్రవర్తిస్తూ ఆడంబరాలకు పోయి భార్య డబ్బంతా తిరుక్షవరం చేసి అప్పులపాలై మునిగి ఆమెతో పోట్లాడుతూ జీవితం నరకం చేసుకొని చేశాడు. వీడిని భరించలేక ఆరు నెలలకాపురానికే విసిగిపోయి వదిలేసి ఆమె మానాన ఆమె వెళ్లి పోయింది. మనవాడు "అత్తారింటికిదారేది? అని వెతుక్కోని చేరి సయోధ్య చేసుకొన్నా అది తాత్కాలికమే అయింది. మళ్ళీ గొడవ, విడిపోవటం. చివరికి వాగ్నర్ రీగాలో సంగీత దర్శకుడైన తర్వాత ఆమె వచ్చి చేరింది. సంగీతం కూరుస్తూనే ఉన్నాడు. ప్రదర్శిస్తూనే ఉన్నాడు. వచ్చిన రూపాయి నిలవటం లేదు. మళ్ళీ అప్పులే అప్పులు. తిప్పలే తిప్పలు. ఈ బాధ భరించలేక స్నేహితుడికి ఉత్తరం

రాస్తూ తనకు డబ్బు కావాలని లేకపోతే పిచ్చివాడినై పోతానని చెప్పుకొన్నాడు. డబ్బు మంచి నీళ్ళ ప్రాయంగా ఖర్చు చేసేవాడిని ఎవరు ఎంతవరకు ఎన్నిసార్లు ఆదుకొంటారు? అధిక వడ్డీలకు డబ్బు తేవటం తీర్చలేక మళ్ళీ అప్పులు చేయటం అదీ అతని పరిస్థితి. నిండా మునిగిపోయాడు. ఉద్యోగం ఊడింది. పరువు గంగ పాలైంది. నెత్తిన గుడ్డ వేసుకొని రీగా నుండి రష్యాకు కుటుంబంతో వెళ్ళిపోయాడు. సరస్వతి ఉన్నా, లక్ష్మీ ప్రసన్నం అయినా, ఖర్చుశని వాగ్నర్‌ను పట్టుకొనిపీడించి పిప్పి చేసింది.

అప్పుల వాళ్ళను తప్పించుకోవటానికి రష్యా నుండి కుటుంబంతో పారిపోయిన వాగ్నర్ సముద్రం అల్ల కల్లోలంగా ఉండటం వలన వారం రోజుల్లో చేరాల్సిన ఓడ మూడు వారాలు పట్టింది ఇంగ్లాండ్ చేరటానికి. సముద్ర భీభత్సం, ప్రకృతి అతనిలో అలజడి రేపి మూడవ ఒపెరా "ఫ్లైయింగ్ డచ్ మాన్"కు నేపధ్యం దొరికింది. అంతకు ముందే హీన్స్ రాసిన "మేమాయిర్స్ ఆఫ్ శ్నాబెలోస్కి" చదివి ఉన్నాడు. కనుక ఈ నల్లని మబ్బులతో నిండిన ఆకాశం, గర్జించే సముద్రం ఒక నేపధ్యం గా దానికి చేకూర్చాలని భావన కలిగింది. ఈ కొత్త సంఘటనల ముద్ర మనసులో గాఢమై అలజడి రేపింది. లండన్ నుంచి మధ్య ప్రాచ్యంలోని బోలోన్ చేరి అక్కడ తన రీన్జీని మెచ్చిన మేయర్ బీర్‌ను కలిశాడు. ఒక నెల గడిపి పారిస్ చేరాడు. చేరిననా ఊరుకోకుండా తనకు ఎక్కువ అప్పిచినవాడికి "మీకు రుణపడి ఉండటం నాకు ఏంతో సంతోషంగా ఉంది" అని ఉత్తరం గిలికి అయిదేళ్ళ తర్వాత తాను కూర్చిన "జూడాయిజం ఇన్ మ్యూజిక్"లో అతనిని అతనితో పాటు అప్పులిచ్చిన మిగిలిన యూదుల్ని తీవ్రంగా దూషించాడు.

పారిస్ వచ్చాడే కాని వాగ్నర్ బతుకు పెనం మీంచి పొయ్యిలో పడినట్లయింది. నరకం అనుభవించాడు. కటిక దరిద్రాన్ని అనుభవించారు. ఈ పరిస్థితులన్నీ అతని మనో ఫలకం పై తీవ్ర మైన చెరగని ముద్రనే వేశాయి. ఒక గదిలో ఉంటే లాడ్జి వాడొచ్చి ఆక్రమించుకొని ఇబ్బంది పెట్టటమే కాదు వాగ్నర్ భార్య మిన్నాతో బూట్లు కూడా తుడిపించుకొని అవమానించాడు. అప్పటికే భార్య దగ్గర ఉన్నది అంతా ఊడ్చిపారేసిన వాగ్నర్ ఇంకా అడుగూ బొడుగూ ఉన్నాయేమోనని డబ్బు కోసం పీడించి చివరికి ఆమె కట్టుబట్టలు తప్ప ఏమీ లేకుండా చేశాడు ఈ మహానుభావుడు. రొట్టె కొనుక్కోవటానికీ చేతిలో చిల్లి గవ్వ లేని నికృష్ట పరిస్థితి. పొట్టగడవాలి కనుక ఫ్రెంచ్ కవితలకు పియానో ట్యూన్లు కట్టాడు, ప్రూఫ్ రీడింగ్‌లు చేశాడు. లిబ్రేట్టోలను అనువాదం చేశాడు. చిన్న నవలలు స్కెచ్ లు వ్యాసాలూ పుస్తక సమీక్షలూ చేశాడు. చివరికి మురికి కూపంగా ఉన్న ఒక చిన్న దియేటర్‌లో కోరస్ గ్రూప్‌లో స్థానం పొంది పాడాడు కాని ఆర్కెస్ట్రా యజమాని వాగ్నర్ పాట సరిగ్గా పాడలేదని, పాడటం రాదని గ్రహించి తీసేశాడని వాగ్నరే చెప్పుకొన్నాడు. ఇలా పారిస్ బులపాటం తీరింది.

తిండిలేక మాడుతూ దుర్భర ఒంటరి జీవితం గడుపుతూఉన్నా "రీంజి"కి సంగీతం కూరుస్తూనే ఉన్నాడు. దీనిని ప్రదర్శించటానికి డ్రెస్ డేయిన్‌లోని ఒపేరా హౌస్ అంగీకరించింది. బెర్లిన్‌లో హిట్ అయిన "దిప్లైయింగ్ డచేస్"ను కూడా ప్రదర్శించే ఏర్పాటు జరిగింది. ఈ డచేస్ ప్రతి ఒపేరా హౌస్‌లో ప్రతిధ్వనిస్తూనే ఉంది. తన జీవితపు చీకటిని ప్రతిఫలింప జేశాడు. భర్తకోసం సర్వస్వాన్ని త్యాగం చేయటానికి హక్కు కోరిన స్త్రీ కథ అది. ఒక విధంగా ఇది వాగ్నర్ జీవిత చరిత్రే జర్మనీలో ఉండటానికి నోచుకోలేక పారిస్‌లో కనీసం ఉండటానికి ఇల్లుకూడా లేని జీవిత పరిస్థితి. మూడేళ్ళ ఈ దీన, హీన, నికృష్ట దుర్భర జీవితానికి తెరపడి ఆశా సూర్యోదయం అయింది. జీవితంలోచీకటి పోయి వెలుగు రేఖలు ప్రసరించటం ప్రారంభమైంది.

అప్పు చేసి ప్రయాణం టికెట్లు కొనుక్కొని రీంజి ప్రదర్శన కోసం డ్రెస్ డేయిన్ వెళ్ళాడు. ప్రదర్శన విపరీతమైన విజయాన్ని సాధించి బీద వాడిని భాగ్య వంతుడిని చేసింది. డచేస్ కూడా ప్రదర్శింపబడి ఆదాయాన్ని పెంచింది. ముప్ఫై రెండేళ్ళ నిరాశలో మగ్గిన వాడికి ముప్ఫై మూడవ ఏట అదృష్టం తలుపు తట్టింది. "రాయల్ కండక్టర్" ఉద్యోగం వరించింది. హాయిగా కాలు కదల్చకుండా కూర్చునే ఉద్యోగం గౌరవం. కాని మనవాడికి సంతృప్తి తక్కువ. ఆరేళ్ళు ఇక్కడే గడిపాడు. రొటీన్‌గా రోజూ రిహార్సల్స్, ప్రదర్శనలతో బోర్ కొట్టింది గురుడికి. సమకాలీన సంగీతకర్తలు మెండేల్సాన్, షూమన్‌లతో పెద్దగా పరిచయం పెట్టుకోలేదు. కారణం వారిని తనకు పోటీదార్లుగా భావించటమే. జీతం బాగానే ముడుతోంది. కాని విలాసాలకు మరిగి వచ్చింది చాలటం లేదు. మళ్ళీ అప్పుల ఊబిలో నిలువునా కూరుకుపోయాడు. "జేసేస్ ఆఫ్ నజారేత్", "ఫ్రెడరిక్ బార్బరోసా" అనే రెండు సంగీత నాటకాలకు సంగీతం చేయాలనుకొన్నాడు కాని రెండిటినీ వదిలేశాడు. చివరికి డ్రెస్ డేయిన్‌లో "ట్రాన్స్ హేజర్"కు తర్వాత "లోహేన్గ్రిన్"లకు మాత్రం సంగీతం చేశాడు. ఇటాలియన్ శైలి ఒపెరాను "దుస్తుల్లో కచేరి "concert in costume"అని గేలి చేసేవాడు.

వాగ్నర్ కూర్చే సంగీతంలో సంగీతం సాహిత్యం, నటన పూర్తిగా కలిసిపోయి ఉండేవి. అతనిలోని నాటక కవి పురివిప్పి నాట్యం చేసేవాడు. అతని ఊహ అత్యద్భుతం. అతని పాత్రలు రక్తమాంసాలతో సజీవంగా ఉంటాయి. ఆ కాలంలో వాగ్నర్ తన "లోహెన్ గ్రిన్"లో శక్తి యుక్తులన్నీ విజ్రుమ్భింభింప జేసి ఉన్నత శిఖరం చేరాడని విమర్శకులు ఆకాశానికి ఎత్తేశారు. అది "వాగ్నర్ యుగం" అన్నారు. ప్రశాంతమైన కాలం అని కితాబిచ్చారు. ఎంత గొప్ప పేరు వచ్చిందో అంతే గొప్పగాడ్రెస్ డేయిన్‌లో "అప్పుల డ్రెయిన్"లో దిగిపోయాడు. డ్రెస్ డేయిన్ ఆర్కెస్ట్రాలో తీవ్రమైన మార్పులు చేయాలని సూచించేవాడు కాని ఎవరూ పట్టించుకోలేదు. సంస్కరణ చేద్దామంటే ఒప్పుకోక పోయే సరికి తిరుగుబాటుదారుడిగా అవతారం ఎత్తాడు వాగ్నర్. రష్యా

అరాజకవాది అంటే అనార్కిస్ట్ అయిన బకూనిన్‌తో కలిసి "సీగ్ ఫ్రీడ్స్ డెత్" అనే మహాకావ్య కథను తీసుకొని సంగీతం కూర్చాడు. అరిస్టాక్రసికి వ్యతిరేకంగా సాగే కథగా తీర్చాడు. 1849లో దేశంలో అశాంతి నెలకొని ప్రజలు తిరుగుబాటు చేశారు. వీధులన్నటికి బారికేడ్స్ పెట్టి సైన్యం పహరాకాసింది. తిరుగుబాటు దారులపై సైన్యం తుపాకీ గుళ్ళ వర్షం కురిపించింది. వాగ్నర్ విప్లవవాదుల పక్షంలో చేరి పాల్గొన్నాడు. తిరుగుబాటును సైన్యం అణచేసి నాయకులను అరెస్ట్ చేసింది. వాగ్నర్ ఒక "కోచ్ వాలా" వేషంలో వీమర్‌కు పారిపోయాడు. అక్కడ ఫ్రాంజ్ లిజ్ అనే తన "ట్రాన్స్ హేజర్ "ను ప్రదర్శించిన అతని దగ్గర శరణార్థిగా ఉందామనుకొన్నాడు. ఆయన ఒప్పుకోలేదు. జర్మనీలో ఎక్కడా ఉండటానికి నీడ దొరక లేదు. అతన్ని అరెస్ట్ చేయటానికి పోలీస్ వారంట్ సిద్ధంగా ఉంది. లీజ్ చూపిన ఔదార్యంతో ఎవరికీ తెలియకుండా జూరిచ్ చేరి భార్య మిన్నాను కలుసుకొన్నాడు. ఇక్కడే పదేళ్ళు ప్రవాస జీవితం గడిపాడు ఆ సంగీతకర్త వాగ్నర్.

. వాగ్నర్ "ఆర్ట్ వర్క్ ఆఫ్ ది ఫ్యూచర్", "ఆర్ట్ అండ్ రివల్యూషన్", "ఒపెరా అండ్ డ్రామా"లను "జూడాయిజం ఇన్ మూజిక్"తో పాటు రాశాడు. మొదటిదానిలో తన గొప్పతనాన్ని డబ్బా కొట్టుకొంటే రెండో దానిలో తన జీవిత దుఖాన్ని ఆరబోసుకొన్నాడు. క్రమంగా ధోరణిమార్చి ఎక్కువమంది ఇష్టపడేదాన్ని చేతిలో రూపాయి పడేదాన్ని ఎంచుకొని రాయసాగాడు. 1848-53 మధ్య కాలం అతని వదిలేసిన కాలం వృధాగానే గడిచిపోయిందని విమర్శకులు భావించారు. కాని ఆ కాలంలో ఖాళీగా ఏమీలేదు. లవ్ అఫైర్స్‌లో మునిగి తేలాడు. 35ఏళ్ళ వయసులో 22 ఏళ్ళ అమ్మాయిని ముగ్గులోకి దించితే ఆమె ధనిక భర్త, తల్లీ వ్యతిరేకిస్తే ఆమెతో లేచిపోదామని ప్లాన్ వేసి ఆమె భర్త వాగ్నర్‌ను కాల్చిపారేస్తానని భయపడితే, ఆ చిన్నది సాహసం చేయలేకపోతే తనను ఆదుకోవటానికి ఆమె చేసిన ప్రయత్నం ఒక చిన్నపిల్ల మనస్తత్వం అనుకుని సర్దుకుపోయాడు. మనవాడిని వలచిందీ మనవాడు వలచిందీపెళ్లి అయిన భార్యలే. భర్త ఉన్న ఇంకో ధనవంతురాలితో ప్రేమాయణం సాగించి ఆ భార్యా భర్తల వలన తన సంగీతానికి ప్రచారం తెచ్చుకొన్నాడు.

"మై లైఫ్" అనే పుస్తకం వాగ్నర్ రాసి తన జీవిత విశేషాలను పొందుపరచాడు. ఈ సమయంలోనే "రింగ్" అనే దానికి సంగీతం కూరుస్తూ ఆ కుటుంబంతో సాన్నిహిత్యం పెరిగి ఆమెను ప్రేమించి దగ్గరయ్యాడు. దీనితో "రింగ్"ను పక్కన పెట్టాడు. భార్యా పిల్లా తిరిగి వచ్చి ఇతన్ని చేరాక ఈ తాత్కాలిక ప్రేమకు తెరపడింది. వెనిస్ వెళ్లి "ట్రిస్టాన్" పూర్తిచేశాడు. భార్య డ్రెస్ డేయిన్ వెళ్లి భర్తకు క్షమాభిక్ష కోసం ప్రయత్నించింది. ఆరేళ్ళు కస్టపడి ట్రిస్టాన్‌ను పూర్తిచేశాడు. భార్య ప్రయత్నం ఫలించి వాగ్నర్‌కు క్షమా భిక్ష లభించి జర్మనీలో ఉండే అవకాశం ఏర్పడింది.

జెర్మనీ స్పిరిట్‌తో ఇంకా బాగా సంగీతంలో దూసుకుపోవాలన్న కోరిక బలీయమైంది. అంకిత భావంతో పనిచేసి 'డస్క్ ఆఫ్ దిగాడ్స్', 'డై వాకీర్', 'ది రైన్గోల్డ్' చేసి హిట్లు కొట్టాడు. ఇలాంటి సంగీతం అంతకు ముందు ఎన్నడూ ఎవరూ ఎక్కడా విని ఉండలేదని గొప్పగా కీర్తించారు. అందులో వేగం, ధృతి, పెద్ద ధ్వనితో ఉన్నా అద్భుతమైన శ్రావ్యత ఉండటం వాగ్నర్ సంగీతంలో ప్రత్యేకత. ఛందస్సు బంధాలు తెంచేశాడు. సంప్రదాయాన్ని దూరం చేశాడు. ఉదాత్త అనుదాత్తాత్తలతో తీవ్ర సంచలనమే సృష్టించాడు. చెవులకు ఇంపైన సంగీతాన్ని ఆర్కెస్ట్రాలో మాధ్యమంగా చేసుకొని సృష్టించిన ఈ సంగీతం కొత్త రికార్డు సృష్టించింది. ఏక వాద్య సంగీతం కాక సామూహికంగా ఇంతటి మాధుర్యాన్ని సృష్టించటం అనితర సాధ్యం అని అందరూ మెచ్చుకొన్నారు.

"ది లీడింగ్ మోటివ్"లో ఆర్కెస్ట్రాతో సర్కసే చేయించాడు. "లీట్ మోటివ్" అనే సంగీత రూపకం "is the embodiment of a person or an idea. It identifies with figure, comment upon action, and explains the fluctuating emotions and state of mind" అని పేరుపొందింది. శ్రోత చెవులకు ఇబ్బంది కలుగ కుండా దృశ్యాలు కనుల ముందు కదిలిపోయేట్లు తీర్చాడని అదొక సంగీత చిత్రం 'musical portrait' అనీ తెగ మెచ్చారు. ట్రిస్టాన్ ను పారిస్ లో ప్రదర్శిద్దామనుకొంటే "తన్హాహీసర్"ను వాళ్ళు సెలెక్ట్ చేయటం ఆశ్చర్య పరచింది వాగ్నర్ని. ఇంకో ఆశ్చర్యకరమైన వార్త విన్నాడు. గ్రాండ్ ఒపేరా హౌస్‌లో బాలెట్ లేకుండా ఒపేరా ప్రదర్శన ఉండదు. తాను రాసిన దానిలో బాలడ్ లేదు. అందుకని దానికోసం సంగీతం తయారు చేశాడు. ఏంతో కష్టపడి కూర్చాడు. కాని పారిస్ వనితలు పెదవి విరిచారు. గోల, అల్లరి, ఆగంతో ప్రదర్శన సాగలేదు. మూడోసారి చేసిన ప్రయత్నమూ ముందుకు వెళ్ళక నిరాశ చెందాడు. పారిస్ అంటే రోత పుట్టింది. రైన్ నదీ తీరంలో బీబ్రిచ్‌లో ఉన్నాడు.

యాభై ఏళ్ళ వయసులో అపజయాలు బాధించి కలవరపెట్టాయి. స్వదేశంలో మళ్ళీ తన ప్రతిభ నిరూపించుకోవాలనుకొన్నాడు. ఇంకో అమ్మాయిని లైన్‌లో పెట్టి పెళ్ళాడాడు ప్రబుద్ధుడు. ఇద్దరిపెళ్ళాల ముద్దుల మొగుడు. ఎవరి మీద దృష్టి పెట్టాలో తెలియక తబ్బిబ్బయ్యాడు. ఇంటిలోని పోరుకు దూరం అవటానికి బెర్లిన్, ప్రేగ్, మాస్కో వగైరా ప్రదేశాలలో కచేరీలతో కాలక్షేపం చేశాడు. వలచి వలపించటం ఎక్కడికెళ్ళిన మానలేదు. మళ్ళీ రుణ బాధల్లో పీకల్లోతు కూరుకుపోయాడు. దీనిలోంచి బయటపడే గొప్ప సదవకాశం వెతుక్కొంటూ వచ్చింది. మ్యూనిచ్‌లో బ్రవేరియా రాజు దర్బార్‌లో పందొమ్మిదేళ్ళ లుడ్విగ్‌తో సమానంగా హోదా లభించింది. అక్కడొక అమ్మాయితో ఎఫైర్ సాగించి గుప్పుమన్నది. డబ్బు వస్తోంది గదిలో అతి విలాసమైన రగ్గులకు కర్టెన్‌లకు, మాంచి ఖరీదైన సిల్క్ డ్రెస్‌లకు డబ్బు బోలెడు ఖర్చు చేశాడు. ఇలాంటి

సిల్క్ డ్రెస్సులు ఇరవై నాలుగు ఉండేవి. అంత ఆడంబరం ఒలక పోశాడు సంగీత గురుడు. వాగ్నర్ విలాస జీవితం సామాన్యులు ఈసడించారు. దానికి మనవాడి సమాధానం "నేను అరవై వేల ఫ్రాంకులను దుబారాగా ఖర్చు చేయటంలో గొప్ప చాకచక్యం కలవాడిని. కాని "ఆ డబ్బు సంపాదించటంలో కాదు" అని గొప్పలు పోయేవాడు. ఇవన్నీ చూసి కుర్ర రాజు అసహ్యించు కొన్నాడు. చర్చి అధికారులూ అయిష్టత చూపారు. అతనిలోని విప్లవ భావాలకు కలత చెంది అందరూ క్రమంగా దూరమైపోయారు. అధికారులు వాగ్నర్ జీవితం ప్రమాదంలో ఉందని రాజుకు చెప్పగా విని లుడ్విగ్ కన్నీరు పెట్టుకొని గురువును మ్యూనిచ్ వదిలి వెళ్ళిపొమ్మని బ్రతిమిలాడాడు. అక్కడి నుండి స్విట్జెర్లాండ్ వెళ్లి రాజు ఇచ్చిన పెన్షన్‌తో స్వంత ఇల్లు ఏర్పరచుకొని ఆయన ఉదారత వలన బతికిపోయాడు.

ఇంత చేసినా వాగ్నర్ సంగీతం "కళకు, సౌందర్యానికి వ్యతిరేకమే కాక కామన్ సెన్స్‌కు కూడా వ్యతిరేకమే" అన్నారు విమర్శకులు. "టాన్ హీసర్"కు కూర్చిన సంగీతం అంతా రణగొణ ధ్వానియే" అంది లండన్ టై మ్స్ పత్రిక. "ట్రిస్టాన్ కు చేసిన సంగీతం" ఒక బాంబు పేలి సంగీత స్వరరాగాలను విచ్ఛిన్నం చేసినట్లుంది" అన్నది. జర్మన్ విమర్శకుడు ఇంకొంచెం ముందుకు వెళ్లి వాగ్నర్ సమకూర్చినది ఏదీ మిగలదు నిలవదు అని ఖచ్చితంగా చెప్పాడు. చార్లటాన్ "హంబగ్" –కౌంటర్ పాయింట్‌ను విషపూరితం చేశాడు– సంగీత విద్యా మూర్ఖుడు, శత్రువు" అని శాపనార్థాలు పెట్టాడు. "ఇంపు సొంపు పిచ్చి చేష్టలకు బలైనాయి" అన్నాడొక ప్రబుద్ధుడు. వాగ్నర్‌కు సంగీత వరస కట్టటం రాదనీ, అతనిలో హాస్య ప్రియత్వం లేదని, అణకువ అసలే ఉండదని, ప్రతిదాని లోను రూపాన్ని రూపశూన్యంలోకి లాక్కెళ్ళాడని, అతనిదంతా పెద్ద మోత తప్ప చెవులకు ఇంపైనది ఏదీ లేదన్నాడు బెక్ మేసర్. "it could be cruel to judge such trash by any known literary standard"అని "విమర్శ కుండ" పగల కొట్టాడు స్టాతాన్.

వాగ్నర్ భార్య హార్ట్ అటాక్‌తో చనిపోయింది. పెళ్ళాడిన కోసిమా ఇతనికి ముగ్గురు పిల్లని కనిపెట్టింది. కోసిమాలో ప్రేమ ఆపేక్ష కనిపించాయి. ఆమె ఆరాధనకు మురిసిపోయాడు. పిల్లలకు తన సంగీత పాత్రల పేర్లు –ఐసాల్డ్, ఈవా, సీగ్ ఫ్రీడ్ అని పెట్టుకొన్నాడు. అనూహ్యంగా వాగ్నర్ కు కొండంత అండగా నిలబడ్డాడు ప్రఖ్యాత ఫిలాసఫర్ "Friedrich Neitzsche" వాగ్నర్ విశ్వాన్ని అతి సూక్ష్మంగా చేశాడు" అని కీర్తించాడు. ఈ ఇద్దరి మధ్య అపూర్వ ఆకర్షణ ఏర్పడింది. నీషే క్రిష్టియానిటికి వ్యతిరేకంగా ఉన్నాడు. వాగ్నర్ కూడా అలాగే చేశాడని భావించాడు. వాగ్నర్ సంగీతం ప్రజలకు తీయని మత్తు మందు అని సంస్కృతికి ద్రోహం చేస్తున్నదని, మత్తుమందుతో మభ్య పెడుతున్నాడని దియేటర్ యజమాలు గోల పెట్టారు.

ఇంతటి వ్యతిరేక పరిస్థితులలో వాగ్నర్‌కు విజయాలు నెమ్మదిగా చేరువైనాయి. జర్మనీలో ఇం ఇంపీరియలిజం వ్యాపించింది. తమ గడ్డపై జన్మించిన వాడిని గౌరవించాలన్న బలమైన కోరిక ఏర్పడి అతని ప్రదర్శనలు బ్రహ్మ రథం పట్టటం ప్రారంభించారు. 59వ ఏట "బే రూత్ ఫెస్ట్ ఫీలస్"కు శంకుస్థాపన చేశాడు. అరవై మూడవ ఏట బేరూత్ ఉత్సవాలు ఘనంగా నిర్వహింప బడ్డాయి. ఇద్దరు చక్రవర్తులు, ఒక రాజు కొందరు ఉన్నతాధికారుల సమక్షంలో రింగ్ సర్కిల్ "దిరింగ్ ఆఫ్ దనీబే లంగ్స్" ప్రదర్శించాడు. ఇది అత్యంత విజయవంతం అయింది. అయినా అప్పుల్లో మునిగి, తీర్చటానికి కచేరీల కోసం దేశాటన చేశాడు. అప్పటికే జీవితంలో అలసి పోయాడు. కాని మత ఉత్సవానికి సరిపడా ఆలోచనలతో 'పార్సీ ఫాల్' చేయాలని బుర్రనిండా ఆలోచనలతో ఉన్నాడు.

పర్సిఫాల్ ఉపోద్ఘాతంను ప్రదర్శించే టప్పుడు వాగ్నర్ వయసు అరవై అయిదు. నరాల వ్యాధి వచ్చింది. గుండె జబ్బు చోటు చేసుకొన్నది. దద్దుర్లు వచ్చాయి ఒళ్ళంతా. ఇటలీలోని ప్రశాంత చల్లని వాతావరణంలో ఉండాలని వెళ్ళాడు. ముందు నేపుల్స్ చేరి తర్వాత పలేర్మో వెళ్లి అక్కడ పార్సిఫాల్ సంగీతం పూర్తి చేశాడు. అక్కాడ హార్ట్ ఏటాకులు వచ్చి మళ్ళీ జర్మనీ వచ్చేశాడు. ఉండలేక వెనిస్ వెళ్ళాడు. అక్కడ వెండ్రామిని పాలెస్‌లో "సింఫనీ ఇన్ సి" మీద పని చేసి "ఆన్ ది ఫెమినైన్ ఇన్ హ్యూమన్ నేచర్"పై ఒక కరపత్రం రాశాడు. తీవ్రమైన పని ఒత్తిడిలో ఉండగా చివరిసారిగా గుండెపోటు వచ్చి 13-2-1883న వాగ్నర్ 70వ ఏట మరణించాడు. అతని నోటి వెంట వచ్చిన చివరిమాటలు "లీబ్ -ట్రాజిక్" అంటే "ప్రేమ- విషాదం" అనే మాటలు. ఈ రెండే అతని జీవితంలో పెనవేసుకొన్న విషయాలు.

వాగ్నర్‌లోని రచయితను అతనిలోని సంగీతాన్ని వివిడిగా చూడలేము. "the poet is a poor second best" అన్నారు అందుకే. పురాతన ఉత్తర గాథా కవిత్వాన్నిఎంచుకొని, స్కోపెంహార్ ఫాటలిజం అంటే విధిబలీయం, జరిగేది జరక్క మానదు అనేదాన్ని కలిపాడు. అతని సంగీతాన్ని "instinctive antipathy" అన్నారు అతనికవిత్వంలో మార్మికత ఎక్కువై ప్రజలకు సన్నిహితం కాలేక పోయిందన్నారు. కొన్ని సందర్భాలలో జర్మన్ ఫిలాసఫర్ కవి "గోదే"ను కూడా మించి ముందుకు వెళ్ళాడు. కాని అతని సంగీతం ప్రపంచాన్ని ముంచేసింది. ముఖ్యంగా ఒపేరా సంగీతానికి కొత్త ద్వారాలు తెరిచాడు. అంతకు పూర్వం ఎన్నడూ లేని మహోన్నత వైభవాన్ని సాధించి దిగ్భ్రాంతి కల్గించాడు. తరువాతి వారు మొదట్లో అతని శైలిని కాదనుకొన్నా అంతకు మించి ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేక పోయారు. వాగ్నర్ స్టైల్ కు ఉన్న శక్తి అమోఘం. ఆర్కెస్ట్రాకు ఉన్న వనరులనన్నిటినీ విస్తృత పరచాడు. సృజనాత్మక కళకు ప్రాదాన్యమిచ్చాడు. మానసికంగా గుండెలోతుల్ని స్పృశించింది వాగ్నర్ సంగీతం. కొత్త

సంగీత రూపాన్ని ఆవిష్కరించి సంగీతానికి అర్కెస్ట్రాకు ప్రాధాన్యత తెచ్చి మార్గదర్శి అనిపించుకొన్నాడు. "The establishment of new musical form, the invention of a vast musical language, and the total splendor of his achievement have the assurance of timelessness" అలాంటి కాలాతీత సంగీతాన్ని అందించి చిరస్మరణీయుడైనాడు రిచార్డ్ వాగ్నర్.

వాగ్నర్ మధుర శ్రావ్య సౌష్టవ సమ్మేళనాన్ని సాధించాడు సంగీతంలో. సాంప్రదాయక ధ్వని వాద్యాల పరిధులను విస్తరింప జేశాడు. తాళానికి స్వరానికి ప్రాధాన్యతనిచ్చాడు. వాటి ఉనికికి కొత్త అర్థాలు వెతికి ప్రదర్శించాడు. ఇదే ఇరవైవ శతాబ్దపు "ఎటోనాలిటీ" అయింది. అంటే సంప్రదాయ స్వరాలకు మంగళం పాడి స్వర రాహిత్యానికి పట్టాభిషేకం చేశాడన్నమాట. అందుకే ఆధునిక పాశ్చాత్య సంగీతానికి వాగ్నర్ జనకుడు అని, అతని "ట్రీస్టాన్స్"లో దీన్ని సృష్టించాడని అన్నారు. అందుకని దీన్ని "ట్రీస్టాన్ కార్డ్" అన్నారు. అంటే "ట్రీస్టాన్ శృతి అన్నమాట.

వాగ్నర్ కచేరీల నిర్వహణలో, అభ్యాసంలో, ప్రదర్శనలో ఉత్తమ విలువలతో కూడిన సిద్ధాంతాలను జోడించి ఆదర్శంగా నిలిచాడు. సంగీత సమ్మేళనంతో ఒక అపూర్వమైన అభిరుచిని, ఆనందాన్ని మానసిక తృప్తిని, పరిధికి మించిన అలౌకిక ఆనందాన్ని కల్గించాడు. అతనంటే ఇష్టపడని వాళ్ళే అతని ప్రతిభకు జోహార్లు పలికి అంతకంటే ఇంక ఏమీ లేదని చెంపలేసుకొన్నారు. జర్మన్ బ్యాండ్ రామెస్టేన్ ఎలెక్ట్రానిక్ కంపోజర్ క్లాస్, శుజ్ మొదలైన వారందరూ వాగ్నర్‌ను అనుసరించిన వారే.

" protean abundance meant that he could inspire the use of literary motif in many a novel employing interior monologue; ...... the Symbolists saw him as a mystic hierophant; the Decadents found many a frisson in his work. వాగ్నర్ సంగీత ప్రభావం 20, 21 శతాబ్దపు సినిమాపై విపరీతం. హిట్లర్ స్వయంగా వాగ్నర్ కచేరీలకు హాజరై అందాన్ని అనుభవించేవాడు. తాను కోరుకొంటున్న జర్మనీని వాగ్నర్ సంగీతంలో సృష్టిస్తున్నాడని మెచ్చాడు. వాగ్నర్ భావాలు నాజీలు అనుకరించారు. 1933-34లో నాజి కాన్సన్ ట్రేషన్ కాంప్‌లలో వాగ్నర్ సంగీతాన్ని వినిపించి బంధితుల ఆలోచనా సరళిలో మార్పు తెచ్చి వారిలో జాతీయ భావం కలిగించేవారట. రెండవ ప్రపంచ యుద్ధ నాజీ డెత్ కాంప్‌లలో వాగ్నర్ సంగీతం వినిపించేవారట. ఇదీ ఆధునిక సంగీత సృష్టికర్త రిచార్డ్ వాగ్నర్ జీవితం.❁



## 4. సామ్య వాద మహర్షి - కారల్ మార్క్స్ (1818-1883)

జీవితంలో ఎక్కువ భాగం లైబ్రరీలలో గడిపి, యదార్ధ వాదాన్ని రొమాంటిక్ వాదానికి వ్యతిరేకంగా వ్యాప్తి చేసి, తన జీవితాన్ని మాత్రం "నిత్య పెళ్లి కొడుకు"గా అనుభవించిన వాడు కారల్ మార్క్స్. హృదయం లేని వాడు, అవతల వాడి గోడు పట్టించుకోని రకం. తన భావాలను వ్యతిరేకించే వారిని సహించని మనస్తత్వం. మధ్య తరగతి మహా రచయిత, ఆలోచనా పరుడు. ఏనాడూ కనీసం కూలి పనికూడా చేయని కార్మిక నాయకుడు. మొదటి ప్రపంచ కార్మిక సంఘానికి అధ్యక్షుడు. పుట్టింది జర్మనీలో అయినా ఎక్కువకాలం జీవితాన్ని గడిపింది ఇంగ్లాండ్‌లో. ఇన్ని వైరుధ్యాలున్న మనిషి మార్క్స్. ఆయన ప్రభావం రష్యాలోను దూర ప్రాచ్య దేశాలలోను ఎక్కువ. అయన రాసిన ఉద్గ్రంధం ఆధునిక చరిత్రను మలుపు తిప్పింది. కాని దాన్ని ఎవరూ చదివిన దాఖలాలు లేవు.

అసలు పేరు హీన్రిచ్ కారల్ మార్క్స్. యూదు కుటుంబం. లా చదివినా, వారికి కోర్టులో ప్రవేశం లేకపోవటంతో క్రైస్తవం తీసుకొన్నారు. పెద్దకుటుంబంలో రెండవవాడు. కొడుకు కవిగా వెలగాలని కోరుకొన్నాడు. బాన్ యూనివర్సిటీలో చేరి గురువు గార్గ్ విల్లెం హెగెల్ ప్రేరణతో ధియాలజీ తీసుకొన్నాడు. మతం కంటే న్యాయ శాస్త్రం మీద మక్కువెక్కువ. తీసుకొన్న చాయిస్, గురూజీ సెలెక్షన్ రెండూ నచ్చలేదనిపించింది. యుక్త వయసు రాకముందే చిన్ననాటి స్నేహితురాలు అందకత్తె తనకంటే నాలుగేళ్ళ పెద్ద అమ్మాయిని వలచి, ఆమె ప్రేమకూ లైన్ క్లియర్ తెచ్చుకొన్నాడు. ఆమె ఎందరో ప్రేమికుల్ని ఇతని కోసం వదిలేసింది. కాని ఆమె తండ్రికి ఇష్టం లేకపోవటంతో ఆరేళ్ళు ఆగి, ఆయనా పచ్చజెండా ఊపిన తర్వాత పెళ్లి చేసుకున్నారిద్దరూ.

దేనిలోనూ సరిగా ఇమడలేక తండ్రి మనసు బాధపెట్టాడు కారల్. బెర్లిన్ పంపితే వెళ్లి ధర్మ శాస్త్రం (జూరిస్పుడేన్స్) చదివి ప్రాక్టిస్ చేయటం ఇష్టం లేక చరిత్ర, తత్వ శాస్త్రంలో పడ్డాడు. క్రమంగా హెగెల్ చెప్పిన హేతువాదంపై ఆకర్షణ పెంచుకొన్నాడు. హెగెల్ భావ పరిధిని దాటి ముందుకు దూసుకు పోయాడు. "డయలేక్టిక్ మెటీరియలిజం" వ్యాప్తికి కారకుడయ్యాడు. జీవితంలో చావు దాక్కుని ఉంది అన్నది హెగెల్ భావన.

దీన్ని ఆర్థిక, తాత్విక తత్వ శాస్త్రాలకు అనుసంధించాడు. భావాలను వాటి ప్రభావాలను మరువలేదు. ఉన్నది ఉన్నట్లుగానే ఉండాలి అన్న దానిపై పునరాలోచన చేశాడు. ఏవో అస్పష్టభావాలున్నాయి కాని అవి స్పష్టం కావటం లేదు. కాని నోట్సుపుస్తకాలన్నీ తన ప్రియురాలిపై కవిత్వంతో మాత్రం నింపి పారేశాడు. టీచర్ అవాలనే కోరిక ఉండేది. తత్వ శాస్త్రంలో డాక్టరేట్ పొందాడు. కాని ఇతని విపరీత భావనలకు ఏ యూనివర్సిటీ అతనికి ఉద్యోగం ఇచ్చే సాహసం చేయలేదు. తత్వశాస్త్రం కూడు, గుడ్డ సమకూర్చదని గ్రహించి జర్నలిజంలో వేలుపెట్టాడు. రాడికల్ జర్నల్స్ ఆతను రాసినవి బాగానే ప్రచురించి వ్యాప్తి చెందించాయి. కాని తన సిద్ధాంతాలకు ఒక రూపం ఇవ్వాలనే తలంపుతో పారిస్ వెళ్ళాడు.

పారిస్‌లో తనకన్నా రెండేళ్ళు చిన్న వాడైన ఫ్రెడరిక్ ఎంగెల్స్‌కు శిష్యుడైనాడు. కలిసిపని చేశాడు. చివరికి మార్క్స్ మరణానంతర సాహిత్యాన్ని ఏంగిల్స్ ప్రచురించాడు కూడా. ఎంగెల్స్ సంపన్నుడు. మార్క్స్ ఆలోచనా పరంపరకు మద్దతు నిచ్చి ప్రోత్సహించాడు. సంపన్నులు పేదకార్మికుల పొట్టకొడుతున్నారని ఇద్దరూ ఆలోచించారు. దీనికి భరత వాక్యం పలకాలని భావించారు. కారల్ మార్క్స్ ఇక్కడే కమ్యూనిస్ట్ మేనిఫెస్టో రచన ప్రారంభించాడు. అందులో ప్రసిద్ధ వాక్యం "All history is the history of class struggle". పారిస్ నగర జీవితం రాజకీయంగా అస్పష్టంగా ఇబ్బందిగా ఉంది. ఇక్కడే మొదటి కూతురు పుట్టింది. పరిస్థితులు అనుకూలించక, బ్రసెల్స్ వెళ్లి ఏంగెల్స్‌ను కలిశాడు. జర్మన్ వర్కింగ్ మెన్ అసోసియేషన్ ఏర్పడటంలో ఏంగేల్స్‌కు భాగస్వామి అయ్యాడు. మొదటిసారిగా కమ్యూనిస్ట్ మానిఫెస్టో "అంతర్జాతీయ సామ్యవాదం" విడుదల చేశాడు. ఫ్రెంచ్ భాషలో ఫ్రెంచ్ ఆర్థిక వేత్త ప్రౌధాన్ రాసిన "ఫిలాసఫీ ఆఫ్ పావర్టి" గ్రంథానికి జవాబుగా మార్క్స్ ఫ్రెంచ్ భాషలోనే "ది పావర్టి ఆఫ్ ఫిలాసఫీ" రాశాడు.

ఫ్రాన్స్‌లో విప్లవం 1848లో అణగారి పోయింది. కాని రాజకీయ పరిస్థితులు దారుణమైనాయి. సోషలిస్టు భావ వ్యాప్తి చేసినవారిపై నిఘా పెరగటంతో అండర్ గ్రౌండ్ యాక్టివిటీస్ మాత్రమే శరణ్యం అయ్యాయి. బలీయమైన ప్రష్యన్ సైన్యం అడుగడుగునా జల్లెడ పడుతోంది. మార్క్స్‌తో సహా సోషలిస్ట్‌లను అరెస్ట్ చేసి జైల్లో వేశారు. దేశ ద్రోహం నేరం మోపారు. కాని రుజువుకాక వదిలేసినా ప్రష్యా అధికారంలో ఉన్న భూమి నుండి బహిష్కరించారు. మళ్ళీ పారిసే గతి అయింది. ఏదో ఒక చిన్న ప్రాంతంలో ఉండటమో లేక ఫ్రాన్స్ వదిలే పెట్టి వెళ్ళటమో తేల్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. గత్యంతరం లేక కుటుంబంతో ఇంగ్లాండ్ వెళ్లి జీవితాంతం అక్కడే ఉండిపోయాడు.

మార్క్స్ గొప్ప వక్త కాదు. నెమ్మదిగా పొడి పొడి వాక్యాలతో మాట్లాడేవాడు. అవతలివాడు చెప్పింది వినే తత్త్వం లేదు. తను చెప్పిందే చివరిమాట అనే ధోరణిలో ప్రసంగాలు చేసేవాడు. "దాస్ కాపిటల్ " గ్రంథం రాసి 1867లో ప్రచురిస్తే మార్క్స్ మరణా నంతరం ఏంగెల్స్ 1885లో మిగిలిన భాగాలను ప్రచురించాడు. మార్క్స్ ఒక "రాజకీయ ఆర్థికవేత్త". ఇంకో రకంగా ప్రాఫెట్ –దార్శనికుడు. తత్వ వేత్త మాత్రం కాదు. భార్య మరణంతో కుంగిపోయాడు. పార్శ్వ నెప్పితో బాధ పడ్డాడు. లండన్‌లో అరవై అయిదవ ఏట 14–3–1883న మార్క్స్ మరణించాడు. జన్మదినం 5–5–1818.

సత్యాన్వేషకుడు అని అనుయాయులు ఆరాధిస్తే "అబద్ధాల పిత" అని నిందించారు గిట్టనివాళ్ళు. కార్మికుల పాలిటి దేవుడు– మెసయ్యా అని కొందరంటే క్రైస్తవ విరోధి అన్నారు మరికొందరు. మార్క్సిస్టులు "దాస్ కాపిటల్"ను " ఆధునిక టెస్టమెంట్" అన్నారు. అయిదవ భాగం బాగా రాయలేదన్నారు. అందులో పద్ధతీ పాడూ ఏమీ లేదన్నారు. కొందరు దాన్ని "కార్మికుల బైబిల్ అని ఆకాశానికి ఎత్తేశారు. భవిష్యత్తును బాగా ఊహించాడు అని అంటే ఆయన చెప్పింది ఇంగ్లాండ్‌లోనే జరగలేదు అని చెవులు కొరుక్కున్నారు. రష్యాలోని బోల్షేవిక్కులు దాస్ కాపిటల్‌ను తిరస్కరించారు. ఏమైనా ఆయన భావాలకు "మార్క్సిజం" అనే ముద్ర పడి సజీవంగానే ఉన్నాయి. మానవ చరిత్రలో అత్యధిక ప్రభావశీలి కారల్‌మార్క్స్ అన్నది నిర్వివాదం. ప్రపంచ వ్యాప్త కార్మిక సంఘాలు రాజకీయ పార్టీలు మార్క్స్ ప్రభావానికి లోనై పని చేశాయి, చేస్తున్నాయి.

"Communism is for us not a state of affairs which is to be established, an ideal to which reality will have to adjust itself. We call communism the real movement which abolishes the present state of things. The conditions of this movement result from the premises now in existence." అని కమ్యూనిజం గురించి మార్క్స్ వివరించాడు. మార్క్స్‌ను ప్రభావితం చేసిన వారిలో హేగేల్స్, ఆడం స్మిత్, రూసో. మార్క్స్ ప్రభావితం చేయని రంగమే లేదు. మానవ ప్రకృతిని బాగా అర్థం చేసుకొన్నవాడు మార్క్స్.❁



## 5. ఆధునిక అమెరికా జాతీయ కవి-వాల్ట్ విట్మన్ (1819-1892)

పన్నెండు పేరు లేని కవితలతో వచ్చిన చిన్ని పుస్తకం ఒక సంస్కృతి బాటను పూర్తిగా మార్చేసి నూతన సంస్కృతి దారిపట్టించింది. ఈ చిన్ని పుస్తకం జులై 4న అమెరికా పరాయిపాలన నుండి విముక్తి చెంది స్వాతంత్ర్య డిక్లరేషన్ విడుదల చేసిన రోజునే వెలువడటం యాదృచ్ఛికమే అయినా, అదే ప్రభావాన్ని సాహిత్యంలోనూ చూపటం విశేషం. అదే ప్రఖ్యాత అమెరికా కవి వాల్ట్ విట్మన్ రాసిన "లీవ్స్ ఆఫ్ గ్రాస్" కవితా సంపుటి. పాత సంప్రదాయాన్ని వదిలేసి కవిత్వం కొత్త సంప్రదాయాన్ని ఎన్నుకొని దారిచూపి ఆధునిక కవిత్వానికి మార్గదర్శి అయ్యాడు విట్మన్. అమెరికన్ దేశీయ కవిత్వం విట్మన్‌తోనే ప్రారంభమైంది. అప్పటిదాకా బ్రిటిష్ కవిత్వ ధోరణే అమెరికా కవిత్వంలో ప్రతిధ్వనించింది. దీనితో పూర్తిగా స్వంత కాళ్ళపై అమెరికన్ కవిత్వం నిలబడింది. తన జాతి జీవనాన్ని జీవితాన్ని ప్రపంచానికి చాటింది అందులోని జవసత్వాలను తెలియ జేసింది. అమెరికన్ ప్రజలే అందులో ప్రతిఫలించారు. వాళ్ళ వేషం, భాషా, అలవాట్లు, వృత్తులు అన్నిటికీ ఆ కవిత్వం అద్దం పట్టింది. ఘన విజయాన్ని సాధించి అమెరికా జాతీయ కవిగా గుర్తింపు పొందాడు వాల్ట్ విట్మన్.

తొమ్మిదిమంది సంతానంలో విట్మన్ రెండవ వాడు. తల్లి అంటే వీరాభిమానం, ఆరాధన ఉన్నవాడు. క్వేకర్‌ల మధ్య అమెరికా లాంగ్ ఐలాండ్‌లో పెరిగాడు. సుఖమయ బాల్యం గడప లేదు. తల్లి జబ్బు మనిషి. చదువు లేనిది. తండ్రి ఇళ్ళు కట్టేవాడు. పెద్దగా అందులో బాగు పడిందేమీ లేదు. ఒక చెల్లెలు నరాల వ్యాధితో బాధ పడేది. ఒక తమ్ముడు ప్రయోజకుడై ఇంజినీర్ అయ్యాడు. పదకొండేళ్ళకే స్కూలు చదువు అయిపొయింది. ఇక బతకటానికి ఏ పని దొరికితే అది చేసేవాడు. పన్నెండేళ్ళకు ఒక ప్రింటర్ దగ్గర సహాయకుడిగా టైప్ చేయటం నేర్చాడు. లాంగ్ ఐలాండ్ స్టార్ పత్రికలో ప్రెస్‌లో కొద్దికాలం ఉన్నాడు. టీనేజి అంతా దొరికిన ప్రతి పనీ చేసి రెస్ట్ లెస్ అయి ఊర్లు తిరగటంతోనే సరిపోయింది. తిరుగుడు వంట బట్టి జీవితమంతా అదే ధోరణిలో నడిచింది. "బతకటం" మాత్రమే తాను చేస్తున్నానని చెప్పేవాడు. తర్వాత న్యుయార్క్‌లో ప్రెస్ కంపోజర్ అయ్యాడు. ఇక జర్నలిజం మొహం మొత్తి టీచర్ కావాలనుకొన్నాడు.

ఏడు పల్లెటూళ్ళ స్కూళ్ళలో చదువు చెప్పి యువ విట్మన్ ఆ బులపాటమూ తీర్చుకొన్నాడు. పిల్లల ఇంటిలోనే ఉండి భోజనం, వసతి పొందేవాడు.

బుద్ధి మారి మళ్ళీ ఎడిటర్ అవ్వాలనిపించింది. ఒక చిన్న ప్రెస్ కొని తన స్వగ్రామం హంటింగ్టన్ "లో లాంగ్ ఐలాండర్" అనే స్వంత పత్రిక ప్రారంభించి నడిపాడు. కూర్పు, ప్రింటింగ్ అన్నీ తానే చేసి పేపర్ రిలీజ్ చేసేవాడు. బోర్ కొట్టి చేతులు కాలి ఉద్యోగం కోసం వెతికాడు. ఆరేళ్ళు ఆరు వేర్వేరు పత్రికలలో పని చేసి బతకటానికి సంపాదించాడు. చివరికి ఎడిటర్ అవ్వాలన్న కోరిక ఇరవై ఏడవ ఏట తీరి "బ్రూక్లిన్ ఈగిల్" పత్రికా సంపాదకుడయ్యాడు. అప్పటికే ఏదో కవిత్వమో వచనమో రాస్తూ ఉండేవాడు. అవి ప్రచురణ భాగ్యమూ పొందాయి కూడా. వాటిశీర్షికలూ తమాషాగానే పెట్టాడు. అందులో కొన్ని – "వన్ వికేడ్ ఇమ్పల్స్", "డెత్ ఇన్ ది స్కూల్ రూమ్", "రివెంజ్ అండ్ రిక్విటల్", "ఏ టేల్ ఆఫ్ ఏ మర్డరర్ ఎస్కేప్డ్" వగైరా. చెత్త కవిత్వాలే ఇవి. సంప్రదాయ రైమ్‌లోనే రాశాడు. సెంటిమెంట్ వండాడు. టెక్నిక్ అంటూ ఏమీలేదు.

ముప్ఫై ఏళ్ళు వచ్చాక తండ్రి బిల్డింగ్ పనుల్లో సాయం చేస్తూ తోచిందేదో రాస్తూ కాలక్షేపం చేశాడు. నాటక శాలలకు, ఒపెరాలకు వెళ్ళేవాడు. సెంటిమెంట్ థ్రిల్లర్స్ కొన్ని రాశాడు. ఈ వయసులో "సోగ్గాడు"గా వేషంలో ఉండేవాడు. ఫ్రాక్ కోట్ వేసి, ఎత్తైన టోపీ పెట్టి చేతిలో చిన్న బెత్తం పట్టుకొని చొక్కా గుండీ దగ్గర పువ్వు పెట్టుకొనేవాడు. తమ్ముడు జెఫ్‌ను వెంటేసుకొని అమెరికా దక్షిణ ప్రాంతం ఆల్ఫేరీస్, ఒహాయో మిసిసిపి తిరిగొచ్చాడు. న్యు ఆర్లియాన్స్‌లోను, క్రెసెంట్ పత్రికలో ఏదో మొక్కుబడి జర్నలిస్ట్ ఉద్యోగాలే చేశాడు. ఏదీ కడుపు నిండా తిండి పెట్టినవి కావు. ఆ అసంతృప్తి పీడిస్తోంది. మళ్ళీ బ్రూక్లిన్ చేరి "ఫ్రీమాన్" వార పత్రిక ఎడిటర్ అయ్యాడు విట్మన్. హోమో సెక్సువల్ అయి, అనామక పిల్లలతో సెక్స్ జరిపాడని అభియోగం ఎదుర్కొన్నాడు. "డార్క్ లేడీ"తో గడిపాడని పుకార్లు రేగాయి. కాని ఏవీ నిజం కాదని తేలిందని విట్మన్ చరిత్రకారుడు రాశాడు.

ముదురు ముప్ఫైవ ఏట కవిత్వపు శైలి విట్మన్‌కు అలవడింది. అది అప్పటి కాలంలో కొత్తది కాకపోయినా విట్మన్‌కు మాత్రం కొత్తదే. తాను ఇదివరకు రాసిన వాటికి పూర్తిగా భిన్నంగా ఇప్పుడు రాస్తున్నాడు. విషయంలో స్వేచ్ఛ ఉంది. లయలో మార్పు ఉంది. అంత్యాను ప్రాసకు మంగళం పాడాడు. చెవులకు కింగ్ జేమ్స్ రాసిన బైబిల్ పాదాలలాగా వినిపించాయి. హీబ్రూ కవిత్వపు పోకడలు కన్పించాయి. ఛందో నియమం ఏమీ పాటించనే లేదు. 35వ ఏట ఈ ప్రయోగాలన్నీ ఒక రూపు దాల్చి వాల్ట్ విట్మన్ కవిత్వంగా ముద్ర వేసుకొని ఉప్పొంగి ప్రవహించింది. అప్పటిదాకా "వాల్టర్ విట్మన్ జూనియర్" గా ఉన్న పేరునూ "వాల్ట్ విట్మన్"గా మార్చుకొని కవిత్వంతో

పాటు పేరులోనూ నూతన వరవడి సృష్టించాడు. ఈ పేరే నిలిచిపోయింది చిర స్థాయిగా. తండ్రిలో కొంత అంశాన్ని తీసుకొని మిగిలినదంతా నూతన విధానాన్ని ఆవిష్కరింప జేసుకొన్నాడు. దీనితోనే "లీవ్స్ ఆఫ్ గ్రాస్"ను బ్రూక్లిన్ ప్రింట్ షాప్‌లో ప్రింట్ చేసి, దేశం మీదికి వదిలాడు. అమెరికా ఆత్మతో మమేకం అయి "ప్రజాస్వామ్య పచ్చిక" మొలిపించాడు. ప్రజాస్వామ్య మూలికల దివ్యౌషధం (డెమోక్రాటిక్ హీర్బ్‌జ్) జనాలకు అందజేశాడు. ఈ పుస్తకం ముఖ చిత్రంలోనూ విట్మన్ కవి బాహ్యస్వరూపం పూర్తిగా మారిపోయింది. ఫ్రాక్ కోట్, చేతిలో బెత్తం మాయమైనాయి. ముతక కార్మికుల బట్టలేసుకొన్నాడు. ట్రౌజర్‌కు బెల్ట్ పెట్టుకొన్నాడు. హిప్ బూట్లు ధరించాడు. కేర్లెస్ పోజ్‌తో కోటు లేకుండా మెడ దగ్గర చొక్కా ఓపెన్ అయి, లోపలి రంగు అండర్ షర్ట్ కనిపిస్తూ బేఫర్వాగా దర్శనమిచ్చాడు. దీనితో "వాల్ట్ విట్మన్ కల్చర్" ప్రారంభమైందిజ ఆరాధనీయు డయ్యాడు. ఐడల్ అనిపించుకొన్నాడు. రోల్ మోడల్‌గా మారాడు. కవిత్వంతోబాటు వేష భాషలన్నిటిలోనూ సమూలమైన మార్పు రావాలని చెప్పటమే కాదు. తాను ఆచరించి చూపి మార్గదర్శి అయ్యాడు విట్మన్. అదీ "విట్మనీయం".

తాను కార్మిక సోదరుడిని చెలికాడినని, స్నేహితుడిని అని చెప్పుకొన్నాడు. అక్షరజ్ఞానం లేని వారి సహచరుడిని అని ప్రకటించు కొన్నాడు. వారి ఆత్మీయుడిని అన్నాడు. తనను తాను పరిచయం చేసుకొంటూ "of pure American breed ,large and lusty --age thirty six years --never once using medicine-never dressed in black, always dressed freshly, and cleanly in strong clothes --neck open, shirt collar flat, and broad, red beard with white hair ike hay beloved and looked toward especially by young men and the illiterate --one who does not associate with literary people --never on platforms amid the crowds of clergy men or aldermen or professors, rather down ni the bay with fishers in the fishing smacks or riding on Broadway omnibus, side by side with the driver or with a band of loungers over the open grounds of the country. Has the easy fascination of what is homely and accustomed --as of something you knew before and waiting for --there you have Walt Whitman, the begetter of a new offspring in literature" అని తెలియ జేసుకొన్నాడు. ఇది చదివి జనాల "మైండ్ బ్లాక్" అయింది. తమ వాడు,తాము కావాలనుకొన్నవాడు, తమకోసం వచ్చాడని మురిసిపోయారు. అదీ విట్మన్ సాధించిన నూతనత్వం. ఇప్పటిదాకా కార్మిక, కర్షక వర్గాన్ని పట్టించుకొన్న అమెరికన్ కవే లేదు. ఇప్పుడు వారి బాధలను గాఢంగా చెప్పే ఆత్మీయుడు లభించాడన్న

పరమానందాన్ని ప్రజలు పొందారు, ఆరాధించారు. తమ కోసమే "కలంపట్టిన వీరుడ"ని కీర్తించారు. ఇదొక చారిత్రాత్మక విప్లవమే అమెరికన్ సాహిత్యం లో ముఖ్యం గా కవిత్వంలో. "ıf you are American, then Walt Whitman is your imaginative father and mother, even if, like myself, you have never composed a line of verse. You can nominate a fair number of literary works as candidates for the secular Scripture of the United States. They might include Melville' Moby-Dick, Twain Adventures of Huckleberry Finn, and Emerson two series of Essays and The Conduct of Life. None of those, not even Emerson, are as central as the first edition of Leaves of Grass" అని ప్రముఖ అమెరికన్ విమర్శకుడు హారాల్డ్ బ్లూమ్ విట్మన్‌ను ఆవిష్కరించి సాహిత్యంలో ఆయన స్థానం ఏమిటో తెలియజేశాడు.

అమెరికా పేపర్లన్నీ విరుచుకుపడ్డాయి. "A mass of mombast ,,egotism ,vulgarity ,and nonsense" అన్నాయి. విట్మన్ రాసిన "లీవ్స్ ఆఫ్ గ్రాస్"ను నిజంగానే "గడ్డిపరకల" కింద జమకట్టాయి. ఇంకొంచెం ముందుకు వెళ్లి "the author should be kicked from all decent society as below the level of the brut" అన్నారు. విదేశాలలో సైతం ఇదే విమర్శలొచ్చాయి. "ది లండన్ క్రిటిక్" ఇంత అమర్యాద కవిని అమెరికా ఎలా భరిస్తోందో?" అని ఛీత్కరించింది. న్యూయార్క్ టైమ్స్ పత్రిక "గడ్డిపరకల రచయిత సగం మనిషి సగం మృగం. అతని మూలాలు పంది దొర్లే బురద గుంటలో ఉన్నాయి" అన్నది. వీటికి అతీతంగా మొదటి గుర్తింపు, ప్రశంసా న్యూ ఇంగ్లాండ్ ప్యూరిటన్ చార్లెస్ ఇలియట్ నార్టాన్" నుంచి లభించింది. "whitman is a new light in poetry" అంటే, "ఎడ్వార్డ్ ఎవెరెట్ హేల్ అనే బోస్టన్ క్లెర్జిమన్" కొత్తదనంతో కవిత్వం వచ్చింది. తాజాగా ఉంది. చాలా సాధారణంగా ఉంది. మనసులోని భావాలను మాటల్లో ఎలా చెబుతామో కవిత్వంలో అలాచేప్పి కొత్త దారి తొక్కాడు" అన్నాడు.

వీటన్నిటికి మించి గొప్ప కవి రచయితా దార్శనికుడు ఎమర్సన్ "Dear sir ,I am not blind to the worth of the wonderful gift of" Leaves of Grass" I find it the most extraordinary piece of wit and wisdom that America has yet contributed. I am very happy in reading it ,as great power makes us happy -- I give you joy of your free and brave thought. I agree you at the beginning of a great career" అని ఆ కొత్త గొంతుకను మెచ్చి వెన్ను తట్టాడు. ఆ దార్శనికుని అభినందన కోటి ఏనుగుల

బలమైంది విట్మన్‌కు. అంతే ఇక వెనక్కి తిరిగి చూసుకోవాల్సిన అవసరమే కలగలేదు. ఈ భవిష్యత్ దీవన ఫలించటానికి మరికొంతకాలం పట్టింది. మధ్యలో అనేక అవాంతరాలు అడ్డంకులు కల్లోలాలు ఎదురు దెబ్బలు వైఫల్యాలు ఎదుర్కోవాల్సి వచ్చింది.

విట్మన్ దృష్టిలో సెక్స్ అనేది మనిషి జీవితం నుంచి దూరం పెట్టాల్సిన విషయం కాదు. జీవితంలో భాగమే. ఇప్పటి మన "జగన్" లాగా అందర్నీ కౌగలించుకొని ఓదార్చేవాడు. సానుభూతి చూపేవాడు. నుదురు మెడ వక్షోజాలు అన్నీ తాకి ఆడా మగా తేడా లేకుండా హత్తుకొని వారితో కలిసిపోయేవాడు .అందరు అతని ఓదార్పులో కరిగి నీరయ్యేవారు. దుఖోపశమనం పొందేవారు. హృదయంలో ఉన్న బాధాగ్నిని అతని చల్లని స్పర్శ చేత పోగొట్టుకోనేవారు. అంటే అతనిది "హీలింగ్ టచ్" అన్న మాట. "సాంగ్ ఆఫ్ మై సెల్ఫ్"లో తన మనోభావాన్ని "I celebrate my self, and sing my self --And what I assume you shall assume --For every atom belonging to me, as good belongs to yo" అని వారితో అభేదాన్ని పొందాడు. తాదాత్మ్యత చెందాడు. సహ వేదన చూపాడు. సానుభూతి ప్రదర్శించాడు. మమేకం అయ్యాడు. అమెరికా చరిత్రలో ఒక కవి ఇంతగా ప్రజా సన్నిహితుడు అవటం ఇంతకూ ముందెన్నడూ లేదు. ఇదే మొదలు అందుకే ఆరాధనీయుడయ్యాడు. దీనజన బాంధవుడయ్యాడు. అదో జగత్ సహోదరులకు ఆప్తుడయ్యాడు. శ్రీ శ్రీ లాగా కవిత్వం రాసి వారి మానాన వారిని వదిలేయ లేదు. వారిలో ఒకడయ్యాడు. అదీ విట్మన్ ప్రత్యేకత.

గడ్డిపరకల సంఖ్య క్రమంగా పెరుగుతూనే ఉన్నాయి. కొత్తవి చేర్చి ప్రచురిస్తూనే ఉన్నాడు. మూడవ ముద్రణ తర్వాత 456 పేజీలతో 124 కొత్త కవితలను చేర్చి ప్రచురించాడు. 1891 విట్మన్ కంటితో చూసుకొన్న తొమ్మిదవ ప్రచురణ వచ్చింది. పేజీలు ముద్రణ సంఖ్యా పెరుగుతోందే కాని, ఆదాయం దానిపైన ఏమీ పెద్దగా రాలేదు. దాదాపు రెండేళ్ళు నిరాహారంగా ఉండిపోయాడు అంటే ముక్కున వేలేసుకొంటాం. లాభం లేదని మళ్ళీ జర్నలిజం గడప తొక్కాడు. బ్రూక్లిన్ డైలీ టైమ్స్ ఎడిటర్ అయ్యాడు. బాగా రాసి దూసుకుపోతుండగా అమెరికన్ రాష్ట్రాల మధ్య అంతర్ యుద్ధం వచ్చి సోదరుడు జార్జి ఫ్రెడరిక్ బర్గ్ యుద్ధంలో తీవ్రంగా గాయపడితే అతనికోసం బ్రూక్లిన్ వదిలి వెళ్ళ వలసి వచ్చింది.

అప్పటికే నలభై రెండేళ్ళు వచ్చిన విట్మన్ ముసలాడినని భావించటం క్వేకర్ భావాలుండటం వలన ఆయుధం పట్టకూడని సైనికుడుగా నమోదు కాలేదు. గాయాలపాలైన జార్జికి కట్టు కడుతూ వాషింగ్టన్‌లోనే 12ఏళ్ళు ఉండిపోయాడు. అంతకు ముందే బ్రూక్లిన్, న్యుయార్క్‌లలో సైనికుల గాయాలకు సేవ చేసిన అనుభవం ఉంది. దీనితో వాషింగ్టన్ హాస్పిటల్‌లో మానవత్వంతో అసహాయుల పాలిటి సేవకుడై

సేవలందించాడు. "హాస్పిటల్ విజిట్స్" అనేదానిలో రాస్తూ "there is something in personal love, caresses, and the magnetic flood of sympathy" అని రాసుకొన్నాడు. దీనివలన మందులకంటే సైనికులకు విట్మన్ చూపిన ఆదరణ ఆత్మీయతలే గొప్పమందుగా పని చేసి కోలుకొన్నారు. అధికారుల పత్రాలను కాపీ చేసిపెట్టాడు, పత్రికలకు ఏదో విషయంపై రాసి వచ్చేడబ్బును గాయపడి కోలుకొంటున్న సైనికులకు పళ్ళు, పొగాకు, స్టాంపులు, చేతి అవసరాలకు డబ్బు పండ్ల రసాలు, పుస్తకాలకోసం ఖర్చుచేసి అందించి వారికి మానసిక సంతృప్తి కలిగించి తానూ ఆనందం పొందేవాడు మానవీయ విట్మన్. క్షతగాత్రుల ప్రక్కలో కూచుని చక్కగా సంభాషించి ఊరటకల్గించేవాడు. వారు రాయమన్న ఉత్తరాలు బంధువులకు రాసి పంపేవాడు. ఇవన్నీ చాలా హృదయ విదారకంగా ఉండేవి. వీటిని అక్షరబద్ధం చేసి సీరియల్‌గా రాసి పత్రికలకు పంపుతూ గడిపాడు. ఇదంతా దయనీయమైన బాధామయమైన అనుభవమే. ఇతరులకోసం జీవించటం అనే గొప్ప మానవీయ కోణాన్ని విట్మన్ ఆవిష్కరింప జేసుకొన్నాడు. జీవితంలో టెర్రర్‌ను, ప్రేమను అనుభవైక వేద్యంగా "డ్రం-టాప్స్" (మద్దెల దరువులు) రాసి చలించేట్లు చేయగలిగాడు. ఏదో దేశ భక్తి రచనలు చేసి చేతులు దులుపుకోలేదు. యదార్ధ సంఘటనలకు మానవీయతను జోడించి రాసి స్పందింప జేశాడు. తోటివారితో సహజీవనం చేసిన మహా మనిషిగా మార్పు చెంది మాననీయుడనిపించుకొన్నాడు.

ఇప్పటికి పత్రికలూ కళ్ళు తెరచి అతనిలోని మానవత్వాన్ని అర్ధం చేసుకొన్నాయి. లెంపలేసుకొన్న "టైమ్స్" తన కథనంలో "Whitman s devotion to the most painful of duties in the hospitals at Washinton during the war will confer honor on the memory when "leaves of grass" are withered and when the drum --taps have ceased to vibrate" అన్నది. ప్రభుత్వమూ అతన్ని గుర్తించి "ఇండియన్ బ్యూరో ఆఫ్ ది డిపార్ట్ మెంట్ ఆఫ్ ది ఇంటీరియర్"లో ప్రెసిడెంట్ అబ్రహాం లింకన్ కేబినేట్‌లో గుమాస్తా ఉద్యోగం ఇచ్చింది. కొంతకాలానికి ఇంటీరియర్‌కు సెక్రెటరిగా ఉన్న జేమ్స్ హార్లాండ్ ఒక ప్రైవేట్ డ్రాయర్ సొరుగులో విట్మన్ లీవ్స్ ఆఫ్ గ్రాస్ పుస్తకం చూసి కొంపలు మునుగుతాయేమోనన్న భయంతో ఎవరికీ చెప్పకుండా విట్మన్‌ను ఉద్యోగం నుంచి తప్పించాడు. దీన్ని జీర్ణించుకోలేని విట్మన్ కవి అభిమానులు విలియం డగ్లాస్ కానేరీ నాయకత్వంలో "ది గుడ్ గ్రే పోయెట్" అనే పేర ఒక కరపత్రం ముద్రించి పంచారు. తప్పు తెలుసుకొన్న అధికారులు విట్మన్‌ను అటార్నీ జెనరల్ ఆఫీస్‌కు బదిలీ చేశారు. యాభై మూడవ ఏడు వచ్చేదాకా ఇక్కడే హాయిగా విట్మన్ ఉద్యోగం చేశాడు. కాని జీతం చాలకు తన పుస్తకాలు స్వయంగా అమ్ముకొని బతికాడు కవి.

తలలో నొప్పుల బాధలు అనుభవించాడు. రోగులకు సేవ చేసినప్పుడు కొన్ని క్రిములు చేరి ఉంటాయని భావించాడు. వాషింగ్టన్ నగరమంటే చెప్పరాని మక్కువ ఏర్పడింది. సైనిలను ఒక తల్లిలాగా పలరించేవాడు ఆదరించేవాడు. అతనిలోని ఆ మాతృ భావనకు వాళ్ళ హృదయాలు కరిగిపోయేవి. మరింత సన్నిహితులయ్యేవారు. “I think to be a woman is greater than to be a man” అని మహిళా శ్రేష్టతను, మాతృత్వ గరిమను చెప్పాడు విట్మన్. పీటర్ దయోల్ అనే బాలుడికి తల్లి వాత్సల్యంతో ఉత్తరాలు రాసి అతనికి జీవితేచ్ఛ కల్గించి ఆదుకొన్నాడు. అతనితో పన్నెండేళ్ళు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి మాతృ వాత్సల్యం పంచిన మహా మానవీయకవి వాల్ట్ విట్మన్.

అనుకోకుండా అకస్మాత్తుగా విట్మన్‌కు వార్ధక్యపు చాయలు చోటు చేసుకొన్నాయి. నడక మందగించిది. శరీర బాధలు ఇబ్బంది పెడుతున్నాయి. అశక్తత పెరిగింది. శక్తి క్షీణించింది. అప్పుడప్పుడు ఉద్రేకానికి లోనౌతున్నాడు. సరస్వతి కరుణించినా లక్ష్మీ ప్రసన్నం కాలేదు. కాండెన్ వీధుల్లో బాక్సులలో పుస్తకాలు మోసుకొంటూ హోమ్ డెలివరీ చేస్తున్నాడు. నడవ లేకపోయేవాడు. బరువు మోయటం అసాధ్యమైపోయింది. యాభైవ పడిలో వచ్చిన స్ట్రోక్ ఆరోగ్యాన్ని దెబ్బతీసి ఇంకో ఇరవై ఏళ్ళు అలాగే జీవితాన్ని లాగేలా చేసింది. అరవైలో కొంత కుదుటబడ్డాడు. అతి దూరంగా ఉన్న కొలరాడో వెళ్లి లింకన్‌పై ప్రసంగాలు చేశాడు. అక్కడ “when Lilacs last in the dooryard Bloomed” కవిత చదివి అందరిని సమ్మోహితుల్ని చేశాడు. దాన్ని “నేటివ్ క్లాసిక్”అన్నారు.

అరవై అయిదో ఏట ఒక చిన్న గదిలో రైల్వే క్రాసింగ్ దగ్గర న్యూస్ పేపర్ల మధ్య గడిపాడు. రైళ్ళ మోత, ఫాక్టరీల రసాయనిక వాయువులు చిమ్నీలనుండి వెదజల్లే దుర్గంధంలో నరకం అనుభవించాడు. ఒక టైలర్ విధవ భార్య వండి పెట్టేది ఇంటిని చూసేది. చినిగిన చొక్కాలు, పాంటులకు అతుకులు వేసేది. విట్మన్ వీరాభిమానాలు ముప్ఫై రెండుమంది ఒక గుర్రబ్బగ్గీ కొనిచ్చారు. ఈ బృందంలో శామ్యూల్ ఇ క్లేమిన్స్ కూడా ఉన్నాడు. అరవై తొమ్మిదో ఏట కొత్తగా పక్షవాతం ప్రవేశించింది. నరాల బాధ పెరగటమే కాక కిడ్నీ ట్రబుల్ కూడా వచ్చిపడింది. మూలిగే నక్కపై తాడి పండు చందం అయింది ఆ మహా కవి బతుకు. డెభ్భైవ పుట్టిన రోజుకు లేచి నిలబడ్డాడు. ఆ తర్వాత ఓపిక తెచ్చుకొని దగ్గరలోనే ఉన్న ఫిలడెల్ఫియాలో లింకన్ లెక్చర్ ఇచ్చాడు. మిగిలిన కాలమంతా ఇంటి పై భాగానకాని, కాండేన్‌లో మికిల్ స్ట్రీట్ లోకాని గడిపాడు. చనిపోతున్నా ఓడిపోలేదు. శరీరం వేడి చేసుకోవటానికి స్టవ్ దగ్గర గంటల కొద్దీ ఏ ఆలోచనా లేకుండా కూర్చుని పోయేవాడు. చావు వచ్చి మీద పడుతోందని గ్రహించాడు. తుది యాత్రకు ప్లాన్ సిద్ధం చేసుకొంటున్నాడు.

72 ప్రవేశించింది. 1891లో చివరి ఎడిషన్ గా "లీవ్స్ ఆఫ్ గ్రాస్"ను 300కు పైగా కవితలతో ప్రచురించాడు. దీనినే "డెత్ బెడ్ ఎడిషన్" అంటారు. అందులో తనను తాను "hard cased dilapidated ,grim ,ancient selfish or time banged conch --no legs ,utterly un locomotive --cast up high and dry on the shore sands" అని వర్ణించుకొన్నాడు. 1891లో న్యుమోనియా సోకింది. దీనికి తోడూ క్షయ ముదిరిపోయిందని రిపోర్టులు తెలిపాయి. వింటర్ గడిచింది. 26-3- 1892న 73వ పుట్టిన రోజు ఇంకొక రెండు నెలలు ఉందనగా అమెరికన్ ఆధునిక మహాకవి వాల్ట్ విట్మన్ భువి నుండి దివికి చేరాడు.

పెళ్ళికాని ముదురు బ్రహ్మ చారి విట్మన్. ఎక్కడా లవ్ అఫైర్ లేనివాడు. ఆయన పుస్తకమే "ఒక వర్డ్" అంటే శాసనం. "ప్రజాస్వామ్య బైబిల్" అన్నారు లీవ్స్ ఆఫ్ గ్రాస్ పుస్తకాన్ని. "a better ,fresher ,busier sphere ,a wide ,untried domain awaits --demands you"అని అభయమిచ్చి పిలిచాడు. ఆధునిక కవిత్వ పరిధిని పెంచినవాడు విట్మన్. అతని సాంకేతిక సృజన అతి వేగవంతమైన నాగరకతకు అనునాదం. అతనికవిత్వం భాషలో గొప్ప ప్రయోగం. వాడుక భాషకు అందం కూర్చి అందలం ఎక్కించాడు. దాని మూలాలు అతి విస్తృతమై భూమికి దగ్గరై, ప్రజా హృదయాలకు చేరువైంది. అట్టడుగు జన ఘోషకు దర్పణమైంది. ఆ భాషాచాతుర్యం అనితర సాధ్యం చేశాడు. గుండెలకు తాకే కవిత్వం విట్మన్ ది. నీ, నా, మనందరి భావాలకు ఆలవాలం.

తాను వివాదాస్పదుడినే అని చెబుతూ "very well .I contradict my self. I am large --I contain multitudes" ప్రపంచం అంతా నాలో ఉన్న విశ్వ రూపుడిని అన్నాడు. తన గడ్డిపరక "is no less than the journey work of the stars" అని దాని విస్తృత ప్రయాణాన్ని తెలిపాడు. అందుకే ఎమర్సన్ మహాశయుడు "I expected him to make the songs of the nation --but he seems content to make the inventories"అని విట్మన్ ప్రతిభా విస్తృతికి నీరాజనం పలికాడు. మంచిని చెడుని అందాన్ని వికారాన్ని సమానంగా ఆదరించాడు. లీవ్స్ ఆఫ్ గ్రాస్ "monumental mountanious book" అంటారు. అనేక శృంగాలతో పార్శ్వాలతో దేదీప్యమానంగా వెలిగే పుస్తకం. ఆ శిఖరాలు మిరుమిట్లు గొలుపుతాయి. వాటిని చేరటం, అధిగమించటం ఎవరి వల్లా సాధ్యం కాదు. "అది ఒక మనిషి", "the book is the man". వాల్ట్ విట్మన్ తన కాలం లోనే కాదు నేటికాలం లో కూడా "టైటానిక్ ఫిగర్".



## 6. అమెరికా ద్రష్ట, మహోన్నత నవలా సృష్టికర్త – హెర్మన్ మెల్విల్లి (1819–1891)

ఆమెరికా సాహిత్య చరిత్రలో అత్యద్భుత అత్యున్నత నవలా నిర్మాతగా, ద్రష్టగా, కవిగా విజయవంతమైన రచయితగా పేరొందిన వాడు హెర్మన్ మెల్విల్లీ. ఇంత గొప్పవాడు చనిపోయే ముందు ఒక అజ్ఞాత వ్యక్తిగా ఉండిపోవటం దురదృష్టకరం. అయన ఇంటి నుంచి పారిపోయి నరమాంస భక్షకులతో కలిసి జీవించాడని మాత్రమే అమెరికన్ జనాలు గుర్తుపెట్టుకొన్నారు. మిగిలినవన్నీ మర్చే పోయారప్పటికి. అమెరికా గర్వించదగిన ఉన్నత కుటుంబంలో 1-8-1819లో న్యూయార్క్ సిటిలో జన్మించాడు. తలిదండ్రులిద్దరి వైపు వారూ అమెరికన్ రివల్యూషనరీ యుద్ధంలో వీరోచిత పోరాటం చేసిన వారే. పాల్గొన్నవారే. తాత బోస్టన్ టీ పార్టీ నిర్వహణ సమయంలో మేజర్‌గా ఉంటె, మాతామహుడు పీటర్ గేంస్ వర్త్ ఫోర్ట్ స్టాన్విక్స్‌ను బ్రిటిష్ మూకల దాడి నుండి కాపాడి రక్షించిన యోధుడు. తల్లివైపు వారిది డచ్ – అమెరికన్ సంప్రదాయం. గాల్వనిస్ట్ విధానాన్ని తూ చా గా పాటించే వారు. ఎనిమిది మంది సంతానంలో మెల్విల్లీ మూడవవాడు. ఇల్లు మంచి వాతావరణంలో తలిదండ్రులు నడుపుతున్నారు. హంగూ ఆర్భాటాలు లేవు. తండ్రి దిగుమతి వ్యాపారస్తుడు. కమీషన్ వ్యాపారి. ఎప్పుడూ ఇతర దేశాలు తిరిగే వాడు. మంచి స్కూల్ లో చేర్పించి మెల్విల్లీని చదివించాడు. తండ్రితో అప్పుడప్పుడు ఇతర ప్రదేశాలు వెళ్లి చూసేవాడు.

కాలం ఎప్పుడూ ఒకే రీతిగా ఉండదు. ఓడలు బళ్ళు బళ్ళు ఓడలు అవటం సహజం. 1830లో దేశంలో డిప్రెషన్ వచ్చి వ్యావారాలన్నీ దెబ్బతిన్నాయి. మెల్విల్లీ తండ్రి దివాలా తీశాడు. కుటుంబాన్ని ఆల్బనికి, తల్లి బంధువుల సమీపానికి మార్చాడు. అక్కడ ఫర్ బిజినెస్ చేసి అప్పుల్లో నిండా మునిగిపోయాడు. శారీరక మానసిక ఆరోగ్యం కోల్పోయాడు. మానసిక వ్యాధి కూడా వచ్చింది. ఆకస్మాత్తుగా గుండెపోటు వచ్చి నలభై ఏళ్ళకే చనిపోయాడు. అన్న గాన్సూవేర్ట్ తండ్రి వ్యాపారాన్ని బుజాన వేసుకొని నిర్వహించాడు. అన్న వ్యాపారమూ లాభించలేదు. హెర్మన్ చిన్న చిన్న ఉద్యోగాలు

చేస్తూ పొట్ట పోషించుకొంటూ కుటుంబాన్ని ఆదుకొనేవాడు. పద్దెనిమిదో ఏట టీచర్‌గా చేరాడు పిట్స్ ఫీల్డ్‌లో. కుటుంబం లాన్సింగ్ బర్గ్‌కు చేరింది. ఇంజినీర్ అవ్వాలనే ఉద్దేశ్యంలో మెల్విల్లీ సర్వేయింగ్‌లో చేరాడు. స్థానిక పత్రికలలో వ్యాసాలూ రాసేవాడప్పుడప్పుడు. 1839లో లివర్ పూల్ వెళ్ళే సెయింట్ లారెన్స్ నౌకలో కేబిన్ బాయ్‌గా నమోదయ్యాడు. అతనితోపాటు అందులో పని చేసేవాళ్ళు "రఫ్ అండ్ టఫ్" టైపు మనుషులు. అల్లకల్లోల సముద్రం, భయానక ప్రయాణం అతని మనసుపై ముద్ర వేసింది. హృదయం అల్లకల్లోలమైంది సముద్రంతో పాటు. ఎన్నో కొత్త కొత్త భావాలు ఊపిరి సలపనివ్వకుండా ముసురుతున్నాయి. నౌకలో అతని పని కోడి పిల్లల్ని మాంసం కోసం శుభ్రం చేయటం, పందులకు పడుకొనే సదుపాయం కలిగించటం. "గాడిద చాకిరి చేయించేవారు నన్ను" అని చెప్పుకొన్నాడు. చాలా నీచంగా క్రూరంగా డబ్బున్న మనుషులు హీనంగా "అలబామాలో ఉన్న ఆఫ్రికన్" లాగా చూసేవారు. ఇంత హీన నీచ పరిస్థితులలో పని చేస్తున్నా, ఏమాత్రం అసహ్యించుకోకుండా గాడిద చాకిరీ చేస్తూనే ఉన్నాడు. దీనికి ముఖ్య కారణం సముద్ర ప్రయాణం మీద ఉన్న మోజే. ఈ వింత విపరీత విషయాలన్నీ మెల్విల్లీ రాయబోయే బృహత్తర నవలలకు ముడి సరుకైంది. ఈ మొదటి విదేశీ ప్రయాణంలో నాలుగు నెలలు గడిపాడు మెల్విల్లీ. లివర్ పూల్‌లో దుర్భర జీవితాన్నే గడిపాడు. మళ్ళీ న్యూయార్క్ చేరాడు. కాని జీవితం అనిశ్చితం అనిపించింది. పల్లెటూరి స్కూళ్ళలో టీచర్‌గా పని చేశాడు. దీనితో గ్రామీణ వాతావరణానికి బాగా అలవాటు పడ్డాడు. ఈ నేపథ్యంలో కొన్ని రచనలు చేశాడు. దీని "అప్రెంటిస్ వర్క్" అన్నారు.

ఎన్ని ప్రయత్నాలు చేసినా సరైన ఉద్యోగం రాలేదు అందుకని "ఆషు నెట్" అనే "వేలింగ్ షిప్"లో ప్రయాణించటానికి సభ్యుడైనాడు మెల్విల్లీ. ఇది సుదీర్ఘ ప్రయాణం. తెరచాపలు అల్లాడు. "వేల్ వేట"లో ఆనందం పొందాడు. ప్రతి చిన్న విషయాన్ని గుర్తుంచుకొని పదేపదే మననం చేసుకొనేవాడు. రాయబోయే చారిత్రాత్మక విశేష నవల "మోబీ డిక్"కు కావలసిన విషయమంతా మనసులో సుళ్ళు తిరిగింది. నౌకలోంచి సముద్రంలోకి దూకేవాడు. నౌక మీద విపరీతంగా శ్రమపడి అసలైన ట్రెయినింగ్ పొందాడు. దాన్ని గురించి తెలియ జేస్తూ "వేల్ షిప్ అంటే హార్వర్డ్, నావెల్ కాలేజి" అన్నాడు. అంత పరస్పర సంబంధం ఉందని అన్నాడన్నమాట. "ఆషునేట్ షిప్" 1841 జనవరి మూడున మాసచూసేట్స్‌లోని న్యు బెడ్ ఫోర్డ్ నుండి బయల్దేరింది. బాగా కిక్కిరిసిన జనంతో బయల్దేరింది. కెప్టెన్ ఒక కిరాతకుడు. మూడీ ఫెలో. ప్రయాణీకులూ మూడీ ఫెలోస్‌గానే ఉన్నారు. ఏడాదిన్నర ప్రయాణం చేసి మార్క్వేయాస్ చేరింది. అప్పుడు మెల్విల్లీ ఇంకో తోటి మనిషితో కలిసి నౌకను వదిలేశారు. నూకూ హివా అనే మారుమూల ప్రదేశానికి పారిపోయారు. అక్కడి టైపీస్ జాతి నరమాంస

భక్షకుల మధ్య గడిపారిద్దరూ. వీరిద్దరిని బందీలుగా చేసి గౌరవంగానే చూశారు.

మెల్విల్లీ "కానిబాల్స్" ఆటవిక జాతులతో కలిసిపోయాడు. వాళ్ళ బట్టలే వేసుకొన్నాడు. వాళ్ళలాగే నగ్నంగా సముద్ర స్నానాలు చేసేవాడు. ఇవన్నీ "టైపీ" నవలలో అచ్చంగా జరిగింది జరిగినట్లు రాశాడు. ఈయన సమక్షంలో ఆ జాతివారు తమ నర మాంస భక్షణ చేయలేదు. వాళ్ళ పండుగా పబ్బాలలో వారిలాగే పాల్గొని ప్రవర్తించాడు. ఆ జాతి మనుషులు సౌందర్యారాధకులు. "సెక్సానందం"లో నిష్ణాతులు. నిజంగా అదొక స్వప్న లోకమే. అందులో ఉండిపోవాల్సి వచ్చింది మెల్ విల్లీ. "బంగారు యుగంలో కంచుబంగారు మనుషుల" తో గడిపాడు. రెక్కాడితేకాని డొక్కాడని జీవులు వారు. వ్యాపారం వర్తకం తెలీని అమాయకులు. ఈ సంస్కృతిని మెల్విల్లీ "స్నివిలై జేషన్" అన్నాడు సరదాగా. అదునాతన అమెరికా వాసి అనామక ఆటవిక జాతి మధ్య అదే ఆటవిక జీవితం గడపటం వింతల్లో వింత. ఇష్టపడే అక్కడ ఉన్నా ఇంటి బెంగ పట్టుకోంది కొంతకామైన తర్వాత. కాలికి గాయం అయి వాళ్ళు ఎన్నిరకాల మందులు వేసినా నయం కాక బాధ ఎక్కువైంది. వాళ్ళ విపరీతమైన ఆపేక్ష, నిఘాలను ఎలాగో అలాగా వాళ్ళ మనిషి సాయం తోనే తప్పించుకొని బయటపడ్డాడు. అక్కడ నుండి ఆస్ట్రేలియన్ వేలింగ్ షిప్ "లూసీ ఆన్" ఎక్కి పారిపోయాడు.

ఈ నౌక ప్రయాణమూ మహా ఘోరంగానే ఉంది. కెప్టెన్ తాగుబోతు, జగడాల మారి. షిప్ – పాపిటే చేరగానే సిబ్బందిని అందర్నీ బందీలుగా పట్టుకొన్నారు. మెల్విల్లీని వదిలేశారు కాలిగాయం ఉండటం వలన. రెండుసార్ల సముద్రయానం ఏమీ లాభించలేదని తిమింగిల వేటకు సిద్ధపడ్డాడు. చార్లెస్ అండ్ హెన్రి నౌకా ప్రయాణానికి రిజిస్టర్ చేయించు కొన్నాడు. ఇది అతని మూడవ వేల్ హంట్ షిప్. హవాయ్ చేరాక ఒక ఇంగ్లీష్ స్టోర్ కీపర్ దగ్గర గుమాస్తాగా చేశాడు. ఏదైనా చిలక కొట్టుడే కాని కాసుల వర్షం రాలలేదు. హోనోలూలు చేరాడు. అక్కడా అదృష్టం వెక్కిరించింది. వేల్ హంట్ బోర్ కొట్టింది. నాలుగు నెలలు హవాయిలో గడిపి అమెరికా ప్రయాణానికి బయల్దేరాడు.

పద్నాలుగు నెలలు నేవీలో సైలర్ గా ఉండి మళ్ళీ మార్క్వేస్ దీవి మీదుగా దక్షిణ అమెరికా వెళ్ళాడు. అక్కడ శిధిల , అవినీతిమయమైన లిమా సిటీ చూశాడు. ఆ అనుభవం జీవితంలో ఎన్నడూ మరచిపోలేదు. కొద్ది మంది స్నేహితుల సాయంతో ఓడ ఎక్కాడు. నావికా సిబ్బంది పాశవికంగా ప్రవర్తించేవారు. 1844 అక్టోబర్ 3న అమెరికాలోని బోస్టన్ చేరుకొన్నాడు. నేవీ సర్వీస్ నుండి విడుదలయ్యాడు. దాదాపు పాతికేళ్ళు ఏ రకమైన ఉత్సాహ ప్రోత్సాహాలు, స్థిరాదాయం లేకుండా గడిపాడు దుర్భర జీవితాన్ని.

అపార అనుభవం మాత్రం వచ్చింది. రాయటం మొదలు పెట్టాడు. పదాలు

దూసుకొచ్చి కాగితాలు నిండిపోతున్నాయి. అదొక మానసిక చేతనా వస్థ. నూకు – హియా దీవి అనుభవాలతో "టైపీ" నవల రాశాడు. ఇందులో మెల్విల్లీ జీవిత చిత్రణ ఏదో, కల్పన ఏదో తెలియనంత అద్భుతంగా సాగి అందరికి నచ్చింది. "Herman Melvillie is the morning of the imagination"అన్నాడు లెవిస్ మంఫోర్డ్. ఆయనే హెన్రి డేవిడ్ తోరోతో పోల్చాడు. ఇద్దరూ వాస్తవానికి రూపు కట్టించారని మెచ్చాడు. నేటివిటికి ప్రాణం పోశారిద్దరూ. అనాగరక జాతుల మధ్య తిరిగినా అమెరికా మామూలు సంస్కృతీ సంప్రదాయంలోకి చేరారు. అమెరికా నిత్య జీవితాన్ని కొంత ఏవగింపుతో అక్షరబద్ధం చేసిన రచయితలు ఈ ఇద్దరు. టైపీ నవల సెన్సేషనల్ హిట్ కొట్టింది. విపరీతమైన క్రేజ్‌తో జనం కొని చదివి ఆనందించారు, రచయితను బాగా ప్రోత్సహించారు. టిప్పీ జాతి మనుసుల మధ్య మెల్విల్లీ గడిపిన ఈవితం ఏంతో ఆసక్తిగా ఉండటం అలా అంతకు ముందు ఏ రచయితా ఆ జాతి జీవుల గురించి ఆచార వ్యవహారాల గురించి రాయకపోవటం చదువరులను ఏంతో బాగా ఆకర్షించి అభిమానులయ్యారు మెల్విల్లీకి. సూపర్ డూపర్ హిట్ అయింది టైపీ. ఇరవై ఎనిమిదేళ్ళనాటికే ఈ అపూర్వ విజయం హెర్మాన్‌కు దక్కింది. రెండో పుస్తకం బిల్లీ బాడ్ రాసి ప్రచురించాడు.

క్రమంగా మెల్విల్లీకి సాహిత్యాభిమానులు స్నేహితులు ఏర్పడ్డారు. వారు అతన్ని ఒక "ఐకాన్"గా భావించారు. గతాన్ని హాయిగా మర్చిపోయి కొత్త ఉత్సాహంతో ముందుకు దూసుకొని వెళ్ళే అవకాశం నమ్మకం వచ్చింది. ఎలిజ బెత్ షా అనే చిన్న నాటి నుండి తెలిసిన అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. అందంగా లేకపోయినా అభిమాన వతి అయిన భార్య. భర్తపై ఆరాధనా భావం ఉన్నభార్య. రచనే తన జీవిత సర్వస్వం అని మెల్విల్లీ భావించి రాస్తున్నాడు. అతని దృక్పధాన్ని అర్ధం చేసుకొని ఆమె సహకరిస్తోంది. డబ్బు అప్పుతెచ్చే నగలు అమ్మో అతని రచనా వ్యాసంగానికి ఇబ్బంది లేకుండా సంసారం గడుపుతోంది. భార్యపై మెల్విల్లీకి అమిత ఆపేక్ష, ప్రేమ స్నేహభావం. ఆమెతో రోజూ వాకింగ్ చేసేవాడు. తను రాసింది చదివి వినిపించేవాడు. హడావిడి హనీమూన్ పూర్తి చేసుకొని మళ్ళీ పూర్తిగా రచనలో మునిగిపోయాడు మెల్విల్లీ. భర్తకు అవసరమైన కొత్త రాతబల్లా, కుర్చీలు, సౌకర్యాలు ఆమె చూసేది.

మెల్విల్లీ మూడో నవల "మెర్డి" ప్రచురించాడు. తాను ఇరవై తొమ్మిదో ఏడు దాకా మహాకవి షేక్స్పియర్ గురించి తెలుసుకోనందుకు బాధ పడ్డారు. ఆయన జీసస్‌తో సమానం అని భావించాడు. మహాకవి రచనలన్నీ చదివి జీర్ణించుకొన్నాడు. ఇప్పుడు రాసే దానిలో ఆయన ప్రభావం కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. మార్డి నవల ఒక సెటైర్ వేదాంతంగా, కవితగా, దృష్టాంతంగా కలగలుపుగా సాగింది. దీని నేపధ్యం దక్షిణ సముద్రమే. అందులోని మితికల్ దోమినారో ఇంగ్లాండ్‌కు, ప్రాఫెర్రో. ఈజిప్ట్‌కు,

ఫ్రాంకో ఫ్రాన్స్‌కు వివెంజా అమెరికాకు చెందిన పాత్రలు. మార్డి విమర్శకులను అప్రతిభులను చేసింది కాని రీడర్స్‌ను చేరలేక పోయింది. నిరాశ మిగిల్చింది. మళ్ళీ సముద్రయాన సాహసాల కథలు రాయటం మొదలుపెట్టాడు. "రెడ్ బరన్" పేరిట మొదటి యూరప్ పర్యటనలో షిప్ బాయ్‌గా అనుభవాలు రాశాడు. అంతగా "పేలలేదు" కాని సముద్ర ప్రయాణ జీవితం బాగా వచ్చింది. డబ్బుకోసమే దీన్ని రాశానని చెప్పుకొన్నాడు. కొడుకు పుట్టాడు. ఖర్చులు పెరిగాయి. పొగాకు కొనుక్కోవటానికైనా డబ్బు లోస్తాయని రాశానన్నాడు. అందులో మెల్విల్లీ నిజాయితీ అడుగడుగునా ప్రత్యక్షమై విపరీతమైన సానుభూతి వచ్చి మార్డీ నవల కంటే రెట్టింపు అమ్మకాలు జరిగాయి. తర్వాత "వైట్ జాకెట్ " మూడుభాగాలుగా రాశాడు. ఇందులో యునైటెడ్ స్టేట్స్" అనే నౌకపై తన నేవీ అనుభవాలను రాశాడు. కొంత సింబాలిజం కూడా జోడించి వైట్ జాకెట్ వండాడు.

41వ ఏట మేల్విల్లీ తన ప్రతిభా సర్వస్వం అయిన "మోబీ డిక్" నవల రాయటం ప్రారంభించాడు. ప్రసిద్ధ రచయిత నథానియల్ హతారన్‌తో గొప్ప స్నేహమేర్పడింది. ఆయనను ఆదర్శంగా తీసుకొన్నాడు. ఇద్దరు బాగా సన్నిహితులయ్యారు. మెల్విల్లీకి పెద్దన్నగా సలహాలిస్తూ మార్గదర్శిగా ఉండేవాడు హతారన్. కష్టపడి రాసిన మోబీ డిక్ నవల 1851లో విడుదలైంది. ఇలాంటి పుస్తకం అమెరికన్ సాహిత్యంలో అంతకు ముందెన్నడూ రాలేదు. ట్రెండ్ సెట్టర్‌గా నిలిచింది. బైబిల్‌లోని "call me Ismaael"అనే వాక్యాన్నిమొదటి వాక్యంగా అర్థవంతంగా ఉపయోగించాడు. ఇస్మాయిల్ అనే వాడు ప్రపంచంలోని అసంతృప్తి అశాంతిల నుండి పారిపోతూ అన్నమాట అది. ఆ ప్రయాణంలో ఆత్మ హననం కూడా ఉంది. ఆహాబ్ అనే పాత్ర తన కాలికి గాయం చేసిందనే పగా ప్రతీకారంతో తెల్ల వేల్‌ను చంపటానికి సిద్ధ పడతాడు. కాని ఆ తిమింగిలమే ఆహాబ్‌ను చంపేస్తుంది. వాడి నౌక కూడా నాశనమవుతుంది. నౌకలో మిగిలిన ఒకే ఒకడైన ఇస్మాయిల్ ఈ కదా అంతా చెప్పటానికి మిగిలి ఉంటాడు.

చరిత్ర చర్విత చర్వణం అవుతుందనే గొప్ప ఫిలాసఫీ ఈ నవలలో పొదిగాడు. నవలలో లొపాలు అనేకం ఉన్నా ఈ తరహా కథా, కథనం కొత్తది అవటంతో గొప్ప విజయాన్ని సాధించింది. "Melvilllle has great genius ,but little telent" అన్నారు కొందరు. కాని మోబీ డిక్ లోని ఎపిక్ లక్షణాన్ని ఎవరూ కాదనలేదు. దానికి అదే సాటి అనిపించింది. మోబీ డిక్ పరమోత్కృష్ట, మరమోన్నత నవలగా చరిత్రలో మిగిలిపోయింది. కొద్ది మంది విమర్శకులు కొందరు అభిమానులకు ఈ నవల నచ్చలేదు. వాళ్ళంతా "టైపీ" వంటినవలె మళ్ళీ రాస్తే బాగుండు ననిపించింది. న్యు మంత్లీ మేగజైన్ "mad as a March hare. gibbering, screaming" అని ఈసడించింది.

తన శక్తి సర్వస్వం ఖర్చు చేసి మెల్విల్లీ మోబీ డిక్ రాశాడు. ఇక ఆయనలో ఏమీ

మిగలలేదు. శక్తితోపాటూ ఆరోగ్యమూ తగ్గిపోయింది అప్పులూ వెంబడించాయి. ఇక తాను బతకటానికి ఆదాయం తెచ్చే ఏ రచనా చేయలేనేమోననే నిరుత్సాహం ఆవరించింది. విధి వెక్కిరిస్తోందని అనిపించి "Dollars damn me and the malicious Devil is forever grinning in upon me, holding the door ajar" అని బాధ వెల్ల గక్కాడు. బుద్ధి పెట్టి రాస్తే ప్రభుత్వం బాన్ చేస్తోంది అన్నాడు. చేతిలో డబ్బు ఆడటం లేదు. డబ్బు అవసరాలు ఎక్కువైనాయి. ఏడోనవల "పియర్రీ ఆర్ ది యాంబిగ్యుటీస్" మొదలు పెట్టాడు. రెండోకొడుకు పుట్టాడు. ఈ నవలలో ఒక తల్లీ కొడుకు ఉంటారు. వారిద్దరూ అక్కా తమ్ముడులాగా ఉండటం ఇందులో ప్రత్యేకత. ఎవరికీ ఆనలేదు. అప్పు చేసి మామగారు చెప్పిన చోట ఒక వ్యవసాయ క్షేత్రాన్ని పిట్స్ ఫీల్డ్ దగ్గరే కొని అందులోనే పదహారేళ్ళున్నాడు. ఉన్నత హిమాయ శృంగం లాంటి మోబీ డిక్ నవల ముందు పియర్రీ ఒక పిగ్మాలియన్ అయింది. పాపం ఆర్థికంగా ఏమీ లాభించనూ లేదు. దీనితో మెల్వి ఉత్కృష్ట దశ పతనారంభమైంది. తరువాతి నలభై ఏళ్ళూ అసౌకర్యంగా అసంతృప్తిగా అశాంతిగా బతికాడు. ఒంటరితనంలో ఉండిపోయాడు.

దీనికి తోడూ సయాటిక్ రుమాటిజం వ్యాధి పీల్చేస్తోంది. నరాల బలహీనతా పట్టుకోంది. పెద్ద కొడుకు పద్దేనిమిదేళ్ళకే ఆత్మ హత్య చేసుకోవటంతో దిగాలు పడిపోయాడు. మేల్విల్లీ సృజన అంతా అతని 26-31 ఏళ్ళ వయసులోనే జరిగి, వట్టిపోయింది. "ది కాన్ఫిడెన్స్-మాన్" అనే నవలా కొన్ని చిన్న కథలు రాశాడు. రాయాలనే కోరిక పూర్తిగా నశించింది. మానసికానందం కోసం మామగారిచ్చిన డబ్బుతో గ్రీస్ టర్కీ ఈజిప్ట్ ఇటలీ ఇంగ్లాండ్‌లు సందర్శించాడు. లెక్చర్లు ఇచ్చి ఏదైనా "ఒడుక్కుందా" మనుకొని ప్రయతించి విఫలుడైనాడు. వచనం వదిలి అదృష్టాన్ని కవిత్వంలో వెతుక్కోన్నాడు. ఆ ప్రయత్నమూ బెడిసికొట్టింది. అసలైన అవగాహన లేకుండా రాసి అభాసుపాలయ్యాడు. రెండు వందల కవితలు రాశాడు. అందులో వేళ్ళమీద లెక్కించ దగినవి మాత్రం మిరుమిట్లు గొలిపాయి. తన సంతృప్తి కోసమే కవిత్వం రాసుకొన్నాడు.

47 వయసులో కస్టమ్స్ ఇన్స్పెక్టర్‌గా ఉద్యోగం వచ్చింది. న్యూయార్క్‌కు కుటుంబం మార్చాడు. బాగా కష్టమైన పనే. కానీ ఏమీ అనకుకోకుండా చేశాడు. దీనిలో 25 ఏళ్ళు అలాగే బండీ లాగాడు. వయసు అరవై ఏడు వచ్చింది. భార్య అతని పరిస్థితి అర్థం చేసుకొని ఉద్యోగం మానేసి మళ్ళీ గ్రంథ పఠనంపై దృష్టి పెట్టమని సలహా ఇచ్చింది. మనుమలు పుట్టారు. చరమాంకంలో బెర్మూడాకు యాత్రగా వెళ్ళాడు. "జాన్ మేరీ అండ్ ఆదర్ పోయెమ్స్" రాసి ప్రచురించాడు. ఇదే ఆఖరి రచన. గుండె వ్యాకోచంతో మెల్విల్లీ 28-9-1891న 72వ ఏట మరణించాడు. పేపరు వాళ్ళు ఆయన చావు గురించి "death of a once popular author"అని మాత్రం రాసి

ఇంకు దులుపుకొన్నారు.

మెల్విల్లీ చనిపోయిన పాతిక సంవత్సరాల వరకు ఆయన అభిమానులు తప్ప ఎవరూ ఆయన్ను గుర్తుపెట్టుకోలేదు. 1921లో వీవర్ అనే రచయిత ఒక పబ్లిషర్‌ను బ్రతిమిలాడి "హీర్మాన్ మెల్విల్లీ – మారినర్ అండ్ మిస్టిక్" అనే గ్రంథాన్ని వెలువరించాడు. అప్పుడు జనాలకు చురుకు పుట్టింది. ఈ వేడి ఆయన పుట్టిన అమెరికాలో అనుకొంటే తప్పులో సారీ పప్పులో కాలేసినట్లే. అది ఇంగ్లాండ్‌లోని లండన్‌లో సాగింది. మూడేళ్ళలో పదహారు గ్రంథాలు వెలువడ్డాయి. ఇదే మెల్విల్లీ పునరాగమనానికి అంటే రినైసేన్స్‌కు దారి తీసింది. ఆ తర్వాత వరుసగా మూడు దశాబ్దాలు అందరూ మెల్విల్లీపై అనేక కోణాలలో రచనలు చేసి ఆయన మహోన్నత వ్యక్తిత్వాన్ని రచనా సామర్థ్యాన్ని లోకానికి తెలియజేశారు. ఎన్నో జీవిత చరిత్రలు వచ్చాయి. ఈ చరిత్రలలో అనేక అసందర్భాలు చోటు చేసుకొన్నాయి. అవగాహనలో తేడాలు వచ్చాయి.

మహా రచయితది హెచ్ లారెన్స్ "the whale Moby Dick is the deepest blood being of the white race, our deepest blood nature and he is hunted hunted and hunted by the maniacal fanatism of our white mental consciousness" అని కుండ పగల కొట్టినట్లు చెప్పి "we get dark races and pale to help us red yellow, and black" అన్న నిజాన్ని చెప్పాడు. మోబీ డిక్ లో ఆహాబ్ అంటే మనిషే అని "man sentient, speculative, religious, standing his full stature against the immense mystery of creation" అని ఎల్లరీసేడ్ విక్ అన్నారు. మోబీ డిక్ చెడుకు సంకేతం అని ఆహాబ్ మోబీతో పోరాటం మంచికి చెడుకు పోరటమేనని చివరికి మంచి తుడిచి పెట్టుకుపోతుందని ఇంకోఆయన వ్యాఖ్యానించాడు. భగవద్గీతపై ఎన్ని వ్యాఖ్యానాలొచ్చాయో అన్నీ మోబీ డిక్ మీద వచ్చాయి. ఎవరి దృక్పథం వారిది. అయినా ఇంకా మోబీ డిక్‌ను చదువుతూనే ఉన్నారు మెల్విల్లీని ఆరాదిస్తూనే ఉన్నారు.

మెల్విల్లీకి ఉన్న విలువలు ఆయన తరం నాటివి కాదు. పేరుకు, ఖ్యాతికి ఆయన ఇష్ట పడనే లేదు విషాదానికి పో కవి లాంటి వాళ్ళు ఎలాగో, మెల్విల్లీ కూడా అంతే. చాలెంజెర్ నంబర్ వన్‌గా మిగిలాడు. ఎమర్సన్ ప్రశాంత ఇంద్ర ధనుస్సుకు వ్యతిరేకంగా మెల్విల్లీ పిడుగులు కురిపించాడు. వాల్ట్ విట్మన్ సూర్య దీప్తికి బదులు సాహసవీరోచిత నల్లతనాన్ని ఆహ్వానించాడు. మెల్విల్లీ ప్రతిష్ట, వ్యక్తిత్వం నానాటికీ పెరుగుతూనే ఉంది. "Melville not only measures up to the American giants but towers darkly above them" అన్న లూయీ అంటర్ మేయర్ మాట ముమ్మాటికీ నిజం.❃



## 7. మహిళా నెపోలియన్ - సుసాన్ బ్రౌనేల్ ఆంథోని (1820-1906)

అమెరికాలో డెబ్బై అయిదేళ్ళ మహిళా పోరాటం వలననే స్త్రీలకూ స్వాతంత్ర్యం, విద్య, ఉద్యోగం స్వంత ఆస్తి, పిల్లలపై అధికారం లభించాయి. వీటిని సాధించటానికి చేసిన ఉద్యమ పోరాటాలలో సింహ భాగం సుసాన్ బ్రౌనేల్ ఆంథోనీకి దక్కుతుంది. ఆమె జీవితం మహిళా సాదికారతకే అంకితమైంది. ఆమె లేని ఉద్యమం లేదు. ఆమె పాల్గొనని సభ కనిపించదు, చేయని పోరాటం లేదు. నిర్భయంగా మగదీరులను ఎదిరించి వారు చెప్పే కుంటి సాకులకు దీటుగా సమాధానాలు చెప్పి చట్ట సభలలో తమ హక్కుల బిల్లు రూపొందించటానికి కృషి చేస్తూ త్యాగమయిగా జీవించి, మహిళా శక్తిని సమీకరించి గుండె ధైర్యంతో ముందుకు నడిచి "మహిళా నెపోలియన్"గా పేరు ప్రఖ్యాతులు పొందిన మహిళా మాణిక్యం సుసాన్.

అమెరికాలోని మాసా చూసేట్స్ రాష్ట్రంలో 15-2-1820న ఆడమ్స్‌లో జన్మించిన సుసాన్ ఆంథోని ఎనిమిది మంది సంతానంలో రెండవది. తండ్రి క్వేకర్ ఉద్యమ నాయకుడు అయినా బాప్టిస్ట్ స్త్రీని పెళ్లి చేసుకొన్నాడు. నవ వధువు భర్త క్వేకర్ ఉద్యమానికి పూర్తి మద్దతు పలికి సహకరించింది. కూతురు సుసాన్‌ను క్వేకర్ విధానంలో చదువు చెప్పించింది. పిల్లలకు గృహకృత్యాలలో తర్ఫీదు నిస్తూ, చదువుకోనేట్లు చేసేది. ఇంటివద్ద గవర్నేస్‌లను ఏర్పాటు చేసి చదివించారు. సుసాన్ ఫిలడెల్ఫియాలో పెద్దగా డబ్బు ఖర్చు లేని స్కూల్‌లో చదివింది. 1938 ఆర్ధిక సంక్షోభంలో సుసాన్ తండ్రి దివాలా తీశాడు. కుటుంబాన్ని న్యూయార్క్‌లోని బాటెన్ విల్‌కు మార్చాడు. ఇక్కడే పదేళ్లున్నారు. తండ్రి న్యూయార్క్ లైఫ్ ఇన్సూరెన్స్ కంపెనీలో ఉద్యోగం చేశాడు. డిప్రెషన్ ప్రభావం పడిన ఉన్నత కుటుంబాలలోని స్త్రీలు ఇంటి నుంచి బయటికి వచ్చి పురుషులతో సమానంగా గౌరవింపబడాలని హక్కులు పొందాలని అభిప్రాయపడ్డారు. వీరిని సక్రమమైన మార్గంలో నడిపించే ఆలోచనలోపడి సుసాన్ టీచర్‌గా పని చేయాలనుకొన్నది. న్యు రోషేల్లీ లోని బోర్డింగ్ స్కూల్‌కు అసిస్టంట్ ప్రిన్సిపాల్‌గా పని చేసింది. పది హేను వారాలకు ముప్పై డాలర్ల జీతం పొందింది. తర్వాత మగ టీచర్‌కు వారానికి పది డాలర్లు ఇచ్చే పల్లెటూరి స్కూల్‌లో వారానికి రెండున్నర డాలర్లు మాత్రమే జీతం పొందుతూ

పని చేసింది. అదీ వివక్షత ఆడకూ మగకూ.

ఇలా పని చేస్తూ క్రమంగా ఎదుగుతూ, కనజాహోరి అకాడేమిలో బాలికా విభాగంలో పనిచేసి గృహానికి దూరంగా ఒంటరిగా స్వంత ఆదాయంపై జీవిస్తోంది సుసాన్. ఇవి క్వేకర్ విధానాలకు వ్యతిరేకమే అయినా సాహసంగా ముందుకు వెళ్ళింది. పొడవుగా ఉండి, వెడల్పు భుజాలతో తీక్ష్ణ దృష్టితో యువకులకు అత్యంత ఆకర్షణీయంగా ఉన్నా ఆమె ఎవరినీ వరించలేదు. "కనజహోరిలో చురుకైన ధీశక్తి గల మహిళ"గా గుర్తింపు పొందింది. మద్యపాన నిషేధ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నది. మహిళా ఉద్యోగ ఉద్యమంలోనూ తన వంతు పాత్ర నిర్వహించింది. సమాజంలో మహిళా సాధికారికత కోసం పెద్ద ఉద్యమం చేయాలనే కాంక్ష బలీయంగా మనసులో నాటుకొని అవకాశం కోసం ఎదురు చూస్తోంది. ఎలిజబెత్ కాండీ స్టాన్టన్ మహిళల కోసం అప్పటికే ఉద్యమంలో ఉంది. సుసాన్ "డాటర్స్ ఆఫ్ టెంపరెన్స్" ఉద్యమంలో చేరింది. స్థానిక నాయకురాలిగా ఉండి క్రమంగా రాష్ట్ర నాయకు రాలైంది. ధారాళంగా మాట్లాడకపోయినా శక్తివంతమైన పలుకులతో ఉగ్రత లూగించేది. వాదనా సామర్ధ్యంతో అవతలి వారిని ఒప్పించించేది. బ్రహ్మాండమైన రచయిత్రి కాకపోయినా రాసిన దానిలో స్పష్టత, వాడి వేడి ఉండేవి. ఉద్యమం మందకొడిగా సాగటమే కాదు పురుషాధిక్యం వలనా వారి వ్యతిరేకతవలనా మందగించింది. మగవారు ఆడవారిని తమతో సమానంగా పని చేయటానికి పూర్తిగా వ్యతిరేకించేవారు. మహిళలను పబ్లిక్ మీటింగులలో చూడటమే కాని, వారిమాట వినటానికి ఇష్టపడే వారు కాదు. ఆనాడు మహిళల హక్కు అంటే మండి పడేవారు మగాళ్ళు. ఎలిజబెత్‌తో యాభై ఏళ్ళ బంధం నుండి విడిపోయి స్వంతంగా స్త్రీ హక్కులకోసం పోరాడాలని నిర్ణయించింది. మొదటిసారిగా న్యూయార్క్ స్టేట్ టీచర్స్ అసోసియేషన్‌లో మాట్లాడి మహిళా టీచర్లకు అన్నిసదుపాయాలూ, అన్ని విషయాలలో సంప్రదించే హక్కు కలిగేట్లు తీర్మానం చేయించ గలిగింది. దట్ ఈజ్ సుసాన్.

1853లో సుసాన్ పూర్తిగా మహిళాహక్కులకోసమే అంకితమై పని చేయటం ప్రారంభించింది. మొదట్లో స్టాన్టన్‌కు సహాయకురాలిగా ఉన్నా, తర్వాత ఆమెకే గైడ్‌గా మారి మార్గ దర్శనం చేసింది. ఆమెతో, లాయరైన ఆమె భర్త తోకలిసి ఉద్యమాలు నిర్వహించింది. కలిసి ఉపన్యాసాలు రాసింది. అప్పటికే ఎలిజబెత్ ఏడుగురు పిల్లల తల్లి. స్త్రీల డ్రెస్ విధానంలోను మార్పు రావాలని భావించి జుట్టు కత్తిరించుకొన్నది. సంప్రదాయ డ్రెస్ వదిలి తక్కువ పొడవున్న డ్రెస్ ధరించింది. ఇది కొంత ఇబ్బంది కలిగించి స్త్రీ సమస్యలపై కంటే వారి డ్రెస్ పైనే దృష్టి కేంద్రీకృతం అవుతున్నట్లు గ్రహించి, మళ్ళీ "రోడ్లను ఊడ్చే పాదాల దాకా పాకే" పాత డ్రెస్‌లనే వేసుకోంది.

ఉద్యమాల నిర్వహణకు డబ్బు అవసరం. అది వీరి వద్ద లేదు. దీనికి ముఖ్య కారణంఏమిటి అని ఆలోచిస్తే స్త్రీలకూ డబ్బు దాచుకొనే హక్కు కూడా లేదని గ్రహించింది.

దీనికోసం సభలు సమావేశాలు నిర్వహించి న్యూయార్క్ స్టేట్ లెజిస్లేచర్‌లో మహిళా హోదా కల్పించటానికి ఎన్నోసార్లు ప్రయత్నించి చివరికి ఆ బిల్ పాస్ అయ్యేదాకా పోరాటం సాగించి హక్కు సాధించింది. ఇది పదేళ్ళ పోరాట ఫలితం. దీక్షగా ఆ పదేళ్ళు ఒకే డ్రెస్ ధరించి సుదూర ప్రాంతాలు అన్ని రకాల వాతావరణాలలో, విపరీత విపత్కర పరిస్థితులలో పర్యటించి, మహిలలో చైతన్య దీప్తి రగిలించి, సమీకృతం చేసి ఉద్యమాలు నిర్వహించి సాధించిన ఫలితం ఇది. 1860లో శాసన సభలో బిల్లు పాసై చట్టం వచ్చి మహిళలకు ఆస్తిహక్కు, స్వంత సంపాదన హక్కు, పిల్లలపై భర్తతో సహా హక్కు మొదలైనవన్నీ సుసాన్ కోరినట్లే లభించాయి. ఇది చారిత్రాత్మక విజయం.

ఈ విజయాలతో పాటు కొన్ని అపజయాలు చవి చూసింది సుసాన్. ఒక మతాధికారి "వుమెన్స్ సఫ్రేజ్ –ది రిఫార్మ్ ఎగైనెస్ట్ నేచర్" అనే పుస్తకం రాసి పుండుమీద కారం చల్లాడు. అందులో సుసాన్‌ను చాలా నీచంగా వర్ణించాడు కూడా. అమెరికా సివిల్ యుద్ధంలో ఉడికిపోతోంది. అబ్రహాం లింకన్ ఎన్నిక అబాలిష నిస్ట్‌లకు ఊతం ఇచ్చింది. మొదట్లో సుసాన్ లింకన్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేసినా, తర్వాత ఆయన బానిసత్వ నిర్మూలనా సిద్ధాంతం నచ్చి ఆయనకే ప్రచారం చేసింది. సివిల్ యుద్ధ కాలంలో స్త్రీ హక్కు ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలిపేశారు. తండ్రికున్న ఫారంలో కాలక్షేపం చేసింది. బ్రౌనింగ్ రచనలు, ఇలియట్ సాహిత్యాన్ని చదువుతూ గడిపింది ఆ సమయంలో. బానిసత్వ నిర్మూలన, స్త్రీ విముక్తి కోసం పథకాలు, అవి అమలవ్వాల్సిన తీరుపై దీర్ఘంగా ఆలోచించింది. నీగ్రోలకు హక్కులు ఇచ్చే చట్టం వచ్చింది కాని అందులో మహిళల గురించి లేదు. మళ్ళీ ఉద్యమించి ఎలిజబెత్‌తో కలిసి స్త్రీ లను సంఘటిత పరచి పోరాడింది. అల్బనిలో మహిళా వోటుహక్కు కోసం పోరాడింది. న్యూయార్క్ స్టేట్ లెజిస్లేచర్‌లో మహిళా వోటుహక్కు బిల్లు పాస్ కాకుండా మగవారందరూ అడ్డుపడ్డారు. దీనితో బాగా కలత చెందింది సుసాన్.

సుసాన్ –"రివల్యూషన్" అనే వార్తా పత్రికకు సంపాదకత్వం వహించింది. ఆ పత్రిక ద్వారా ఉద్యమాన్ని ఉత్తేజపరచింది. సహించలేని మగ పురుషులు పత్రికను సస్పెండ్ చేయించారు. అధైర్య పడలేదు సుసాన్. పత్రికకు ఉన్న పది వేల డాలర్ల అప్పును తన స్వంత డబ్బుతో తీర్చేసింది. ఈ కాలంలో తండ్రి వదిలిపెట్టిన కొద్ది ఆస్తితో జీవిక సాగించింది. 1872 ప్రెసిడెంట్ ఎన్నికలో వోటు వేసింది. రాజ్యాంగానికి విరుద్ధంగా వ్యవహరించినందుకు సుసాన్‌పై నేరం మోపి వంద డాలర్ల జరిమానా విధించారు. వీలున్నప్పుడల్లా తన "హిస్టరీ ఆఫ్ వుమెన్ సఫ్రేజ్" పుస్తకం రాసి మహా గ్రంథాన్ని పూర్తి చేసింది. సుసాన్ ఉద్యమం "నేషనల్ అమెరికన్ వుమన్ సఫ్రేజ్ అసోసియేషన్"గా రూపు మారింది. ఒక రకంగా సుసాన్ "అమెరికా దేశం మనసును మార్చిన మహిళ" "the woman who changed the mind of the Nation"

అని రేటా చైల్డ్ డోర్ర్ రాశాడు.

యూరప్ వెళ్లి అక్కడా ప్రసిద్ధి చెందింది. అక్కడ మహిళా ఉద్యమం ప్రారంభ దశలో ఉంటే దాన్ని చైతన్య పరచి ముమెంటం తెచ్చింది సుసాన్. డెబ్భై ఏళ్ళు మీదపడ్డాయి. సోదరి బలవంతం మీద రోచెస్టర్‌లో ఆమెతో కలిసి ఉంది. రోచస్టర్‌లోని "పొలిటికల్ ఈక్వాలిటి లీగ్" సుసాన్‌కు గృహాన్ని సమకూర్చి, ఆమె మహిళా సేవకు సార్ధకత చేకూర్చి గౌరవించారు. కాని నిరంతర ప్రయాణాలు సభలూ చర్చలతో గడిపే ఆమె అక్కడ ఎక్కువ కాలం ఉండలేదు. ఎనభైవ ఏట వుమెన్ సఫ్రేజ్ అసోసియేషన్‌కు ప్రెసిడెంట్‌గా రిటైర్ అయింది. ఆమె జీవిత చరిత్ర పూర్తయి ప్రచురణ పొందింది. అమెరికా మహిళలకు ఫెడరల్ రాజ్యాంగ సవరణ చేసి మాత్రమే వోటు హక్కు కల్పించాలని, రాష్ట్రాల లెజిస్లేచర్‌లలో కాదని స్పష్టంగా చెప్పింది. 1904లో "ఇంటర్నేషనల్ వుమన్ సఫ్రేజ్ అలయన్స్" అనే సంస్థ ఏర్పడింది. ప్రపంచ మహిళలందరూ సుసాన్ తమ నాయకురాలు అని ఏకగ్రీవంగా తీర్మానించారు. చివరి సమావేశంలో మాట్లాడుతూ "మన పోరాటం ఆగదు. అది ఆగకుండా చేయాల్సిన బాధ్యత మీ అందరిదీ" అని సందేశం ఇచ్చింది. 86వ పుట్టిన రోజున వాషింగ్టన్‌లో ఆమెకు సన్మానం చేశారు. పెద్ద డిన్నర్ ఇచ్చారు. అప్పుడు "failure is impossible" అన్న మహా మంత్రాన్ని ఉపదేశించింది. అయినా విజయం రావటానికి ఇంకా చాలాకాలం నిరీక్షించాల్సి వచ్చింది దేశం. 13-3-1906న మహిళోద్యమ నాయకురాలు, మహిళా సాధికార ఉద్యమ సారధి మరణించింది. అమెరికా పతాకం అవనత చేసి గౌరవించారు. "the champion of a lost cause" అని కీర్తించారు. ఆమె కోరిన మహిళా హక్కులన్నీ క్రమంగా తీరాయి. 21-5-1919 అమెరికా ఫెడరల్ రాజ్యాంగ సవరణ చట్టం ప్రకారం మహిళలకు సర్వ తంత్ర పౌరసత్వహక్కు, లభించింది. ఈ సవరణకు "సుసాన్ బి ఆంథోని అమెండ్ మెంట్" అని పేరుపెట్టి ప్రభుత్వం గౌరవించింది ఆ పోరాట యోధురాలిని.❋



## 8. ఆధునిక ప్రతీక వాద రచయిత - చార్లెస్ బాడేలేర్ (1821-1867)

ఆధునికత అనే పదానికి సృష్టికర్త, సింబాలిజంకు ఆద్యుడు, ది ఫ్లవర్స్ ఆఫ్ ఈవిల్ నవల ద్వారా ప్రపంచ దృష్టి నాకర్షించిన ఫ్రెంచ్ రచయిత చార్లెస్ పియరీ బాడేలేర్. 19వ శతాబ్దపు ఫ్రెంచ్ రచయితలు కొరడా దెబ్బలు కొట్టుకొని పాఠకులనూ అలానే కొట్టారు. వాళ్ళమనసులోని కోపం, డిప్రెషన్‌లను వ్యక్తిగత సెన్సేషనలిజం, బాహ్య ప్రదర్శనంగా మార్చుకొన్న విపరీత మనస్కులు. అందులో బార్లీ డీ ఆర్విల్ సముద్రపు ఎండ్రకాయలాగా జీవిస్తూ అది సముద్రపు రహస్యాలు తెలుసుకోగలదని దాని హృదయం అతి పవిత్రమైనదని అన్నాడు. బాడేలేర్ వీధుల్లోనే యెర్ర ఈకలతో చేసిన దాన్ని మెడ చుట్టూ కట్టుకొని తిరిగితే, ఇంకో ఆయన రింబాడ్ దైవ దూషణ రాతలను పార్కు బెంచీల మీద పిచ్చ పిచ్చగా వంకర టింకరగా "షిట్ - గుడ్ బై" (Merde a Dieu) అని రాసేవాడు. బాడేలేర్ చాలాబాధలు అనుభవించాడు. సమకాలీన రచయితల కంటే ఎక్కువగా స్వయంకృత దయాబాలిజం అంటే దెయ్యాల భయంతో, అపరాధ భావంతో క్షోభ చెందాడు. ఇవే మనసంతా నిండిపోయి "ఫ్లవర్స్ ఆఫ్ ఈవిల్" అనే ప్రఖ్యాత నవల రాశాడు. దీనిని సమీక్షిస్తూ ప్రముఖ విమర్శకుడు డీ ఆర్విల్ "డాంటే స్వయం గా నరకం సందర్శిస్తే, బాడేలేర్ ఆ నరకం నుండే వచ్చాడు" అన్నాడు.

పారిస్‌లో 1821 ఆగస్ట్ 9న బాడేలేర్ పుట్టేనాటికి తండ్రి వయసు 62, తల్లి వయసు 26. అంత వ్యత్యాసం ఉంది. ఒక్కడే పిల్లడు కనుక సంపన్నుడైన తండ్రి తన వెంట మ్యూజియంలకు తిప్పుతూ ఎన్నో కథలను చెబుతూ వాత్సల్యాన్ని కురిపిస్తూ, ఉత్సాహం కలిగించాడు. ఈ ఆనందం ఎక్కువ కాలం నిలవలేదు. ఏడవ ఏటనే తండ్రి చనిపోగా, తల్లి యువ కమాండర్‌ను ప్రేమించి పెళ్ళాడింది. బాడేలేర్‌కు ఈ కొత్త తండ్రిపై ద్వేషమే కలిగి హామ్లెట్ లాగా తల్లిమీదా అది ప్రతిఫలించి ఆమె తనకు నమ్మక ద్రోహం చేసిందని నిశ్చయించుకొన్నాడు. మాతృప్రేమను కోల్పోయానని బాధపడ్డాడు. ముప్ఫై ఏళ్ల తరువాత అమ్మ ఒడిలోని మాధుర్యాన్ని, ఆమె చూపించిన శ్రద్ధ, వాత్సల్యాలను అనుభూతిని గుర్తుకు తెచ్చుకొని రాసుకొన్నాడు.

స్కూల్‌లో చదువులో సాధారణంగా ఉండేవాడు. సాహిత్యం తప్ప మిగిలిన విషయాలేవీ అతన్ని ఆకర్షించలేదు. లాటిన్ పద్యాలకు బహుమతి వస్తే, అవిధేయతకు శిక్ష పొందాడు. మళ్ళీ చేరి పరీక్ష పాసై తోచిందేదో రాస్తూ కాలక్షేపం చేశాడు. కుర్రాడు చెడు సావాసాలుపట్టి పాడై పోతాడేమో అని భావించి మారుటి తండ్రి సుదీర్ఘ ప్రయాణంతో కలకత్తాకు పంపించాడు. నౌక ఒకసారి ఘోర తుఫాను ప్రమాదానికి గురైతే ప్రయాణం విరమించి మారిషస్‌లో అక్కడి ట్రాపికల్ సీనరీ, రెచ్చగొట్టే అమ్మాయిలూ బాగా నచ్చి, లోపల దాగి ఉన్న కవిత్వానికి ప్రేరణ లభించగా కొద్దికాలం ఉండిపోయాడు. మళ్ళీ పారిస్ చేరి కుర్రగాంగ్‌తో కలిసి‘ “బోహీమియన్ అరిస్టోక్రసి” అని పేరుపెట్టుకొని జీవించాడు. నీటైన సోగ్గాడు బాడేలేర్ విలాసంగా వారిమధ్య కాలం గడిపాడు. బార్బీ డీ ఆర్విల్ అనే వాడు తన వింత చేష్టలతో జత కలిసి ఉన్నాడు. క్రమంగా ఈ బాచీ సంఖ్య పెరిగింది. డబ్బు మదించిన వాళ్ళే వీళ్ళు. థియేటర్‌లో చిన్న వేషాలు వేసే ఒక పిల్లను చూసి వ్యభిచారిణి కాదని చేరదీసి పెళ్ళాడాడు బాడేలేర్. ఏ క్షణానికి తోచిన భావాన్ని అప్పటి అప్పుడే కవిత్వీకరించటం ప్రారంభించాడు. కలిగిన ప్రతిమానసిక భావాన్ని అక్షర బద్ధం చేశాడు. అప్పుడప్పుడు వచన రచనా చేశాడు. తటస్థపడిన ప్రతి స్త్రీపైనా కవితలు రాసినా, జీన్ డవాల్ అనే ఆమె బాగా ప్రేరణ కలిగించింది. ఆమెనే “డార్క్ వీనస్” అన్నాడు. ఆమె అంగాంగ సౌందర్యాన్నీ కవిత్వ బద్ధం చేశాడు. ఎంత త్వరగా ప్రేమించి దగ్గరికి చేర్చుకొనే వాడో అంతే స్పీడ్‌గా వారితో పోట్లాడి దూరం చేసుకొనేవాడు. కాని జీన్ అతని జీన్స్‌నే పట్టుకొన్నది. మనవాడి క్షణికోద్రేకాలకు విసిగి వేసారి ఒక సారి ఆమె అతన్ని వదిలి వెళ్లిపోతానన్నది. ఆమె వియోగాన్ని భరించలేకపోయాడు. 14 ఏళ్ళు కలిసి మెలసి ఉన్న ఆమె తనను వదిలి వెడితే జీవించలేనని తల్లికి ఉత్తరం రాశాడు. కాని ఎడబాటు జరగ లేదు. ఇరవై ఏళ్ళు జెన్నీ బాడేలేర్ ‘జీవిత’ నాట్య నాగిని’గా ఉండిపోయింది. “అందాల రాక్షసిగా”, కాంతి దేవతగా “అతనిమనసులో ఉండిపోయింది. ఆమె అందానికి ఆకర్షణకి ఆరాధనకి కరిగిపోయాడు. అందం స్వర్గం నుండి భూమికి దిగివస్తుందో నరకంకూపం నుండి వెడలి వస్తుందో నిర్ణ యించలేకపోయాడు. దీనినే కవితాపరంగా “viens du ciel profound ou sors-tu de abime” అని రాసుకొన్నాడు.

విపరీతంగా పిచ్చపిచ్చగా ఆడంబరంగా విచ్చల విడిగా డబ్బు ఖర్చుచేస్తున్నాడు బాడేలేర్. సంక్రమించిన సంపదలో సగం ఖర్చై పోయింది. ఇలా అయితే చేతికి చిప్పేగతి అని మిగిలిన ఐశ్వర్యం ఇలా దుబారా కాకుండా అతనికి ఫైనాన్సియల్ గార్డియన్‌గా ఒక నోటరీని ఏర్పాటు చేసింది తల్లి. అప్పటి నుంచి ప్రతి రూపాయి ఖర్చుకోసం నోటరీ దయా దాక్షిణ్యంపై ఆధార పడాల్సి వచ్చింది. ఖర్చు అలవాటైన ప్రాణం కదా విలవిల లాడుతోంది. అప్పులు చేస్తున్నాడు విపరీతంగా. అప్పిచ్చే

వాళ్లకు ఎరగా మారిపోయాడు. డాబు దర్పం మాయమయ్యాయి. గుండ్రని అందమైన సున్నితమైన ముఖం గట్టి పడిపోయింది. నవ్వుతూ హాళ్ళూ పెళ్ళూగా ఉండేవాడు ముభావంగా ఉంటున్నాడు. చెక్కులు చిక్కిపోయాయి. అందమైన ఖరీదైన ధగధగలాడే బట్టలు వదిలేసి నల్ల బట్టలు కడుతున్నాడు. నల్ల బ్రాడ్ క్లాత్ మాత్రమే వేసుకొంటున్నాడు. దావీదు మహిమ కాదు ఇది ధనమహిమ. దనం చేతిలో ఆడక వచ్చిన పరిస్థితి కాదు. సృష్టించుకొన్న స్థితి, దుస్థితి. బోహీమియన్ సంస్కృతీ వదిలి పెట్టేశాడు. బూర్జువా ముఠాకు దూరంగా ఉంటున్నాడు. 1848 జూన్ రివల్యూషన్‌కు సాయం చేశాడు. బారికేడ్‌ల నిర్మాణంలో సాయపడ్డాడు. స్వయంగా "we must shoot General Aupick" అనే బానర్ "నేశాడు ". సాధారణ సైనికుడి స్థాయి నుండి జెనరల్ పదవికి ఆ తర్వాత రాయబారి పదవికి ఎదిగిన వాడిపై ద్వేషం మాత్రం పోలేదు.

విప్లవ పత్రిక "సాల్ట్ పబ్లిక్" స్థాపించి నడపటంలో రాజీలేని వాస్తవ చిత్రకారుడైన గుస్టేవ్ కూర్బేట్‌కు, హెరాన్ దీమార్ అనే విమర్శకుడికి సహాయపడ్డాడు. విప్లవానికి ఇన్ని రకాల ఊపిరులు ఊదినా అది విఫలమై చప్పగా చల్లారి పోవటంతో మానసిక క్షోభ చెందాడు బాడేలేర్. "సెకండ్ ఎంపైర్" అధికారానికి వచ్చింది. రాజకీయం అంటే రోత పుట్టింది. వీధుల్లోకొచ్చి విప్లవ నినాదాలిచ్చి ఉద్రేకంతో ఊగి, ఊగించిన "మాబ్" వింత, విపరీత ప్రవర్తనకు అసహ్యమేసింది. ఉదాసీనత మనసులో, శరీరంలో ప్రవేశించి నిష్క్రియా పరుడయ్యాడు బ్రాడేలేర్.

ఇరవై ఏడవ ఏట డిప్రెషన్ నుంచి బయట పడ్డాడు బాడలేర్. తనలాగే జీవితం లో దుఃఖ శోకాలనుభావించిన అమెరికా కవి బహుముఖ ప్రజ్ఞాశాలి, రచయితా "ఎడ్గార్ అలాన్ పో"ను రెండేళ్ల క్రితమే చదివి ఆయన రచనలను ఫ్రెంచ్ భాషలోకి తర్జుమా చేయాలనే మంచి కోరిక కలిగింది. "నేనెందుకు పోను అనువదిస్తున్నానో తెలుసా? అతని పోలికలు నాలో ఉన్నాయి, నా మానసిక ఆధ్యాత్మిక బంధువు అనిపిస్తాడు. మొదటిసారి నేను ఆయన పుస్తకం తెరచి చదివినప్పుడు దిగ్భ్రాంతికి లోనైనాను. నేను ఏ విషయాలపై రాయాలని కలలు కన్నానో, ఏ వాక్యాలు ఎలా రాయాలనుకోన్నానో, అవన్నీ పో మహానుభావుడే రాసేశాడు" అని తన ఆరాధనా భావాన్ని తెలియజేసుకొన్నాడు. కేథలిక్ మత వారసుడిగా బాడేలేర్‌కు అసలైన పాపం అంటే ఏమిటో తెలుసు. చెడు మానవ ప్రకృతిలో అంతర్గతమై ఉందని పో గుర్తించినట్లే ఈయనా గుర్తించాడు. ఆరేళ్ళు తీవ్రంగా కష్టపడి తన సృజనకు పదును పెట్టి పో కథలను అయిదు భాగాలుగా ఫ్రెంచ్ భాషలోకి అనువదించాడు. కాని ఒక్క కవిత జోలికి కూడా పోలేదు. ఒకే ఒక అమెరికన్ కవిత లాంగ్ ఫెలో రాసిన "హయవాత" మాత్రం ఫ్రెంచ్‌లోకి అనువాదం చేశాడు. ఇలా పో కవితో తాదాత్మ్యం చెంది రచనా సృష్టి చేసిన తర్వాత తాను రాయాలను కొన్న విషయాలపై దృష్టి పెట్టాడు.

శైలి మార్చుకొన్నాడు. కామ భావనలు తగ్గి శోక భావాలు పెరిగాయి. ప్రేమ కవిత్వంలో అంతకు ముందు ఎవరూ రాయనంత గొప్ప కవిత "అన్ వాయెజ్ ఏ సైటర్" రాశాడు. అందులో పిచ్చి మోహం పెల్లుబికింది. భయంకర భీభత్స భయానకంగా దాన్ని సమాప్తి చేశాడు. "in thine isle O Venus, I found only upthrust-A calvary symbol whereupon my image hung --Give me Lord God, to look upon that dung --my body and my heart, without disgust" దీనిపై మాన్సేల్ జోన్స్ స్పందిస్తూ "సాహిత్య ప్రభావం కోసం కాకుండా పాపం అనేది మానవ అంతరాత్మ స్వభావం" అన్న విషయాన్ని బాడేలేర్ తెలియజేశాడన్నాడు. కవితలో విశ్రుంఖలత క్రమంగా తగ్గి బాలెన్స్ స్తితిలో ఉంటున్నాడు మనకవి. ఆత్మవిమర్శ చేసుకొని జాగ్రత్తగా అడుగులేస్తున్నాడు. 1857లో "లెస్ ఫ్లువర్స్ దు మాల్" రాసి ప్రచురించాడు. దీన్ని అమ్మకానికి పెడితే పబ్లిక్ ప్రాసిక్యూటర్ దీన్ని ఖండించగా, కాపీలన్నీ పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. ఈ విషయం తల్లికి ఉత్తరం ద్వారా తెలిపాడు. ఆ పుస్తకంపై తన స్పందన తెలియ జేస్తూ "I have put all my tenderness, my hate, and my religion into the book. Iam proud of having written a book that inspired nothing but fear and horror of evil" అన్నాడు. పుస్తకంలో ఏదో కొద్దిగా చదివి నిర్ణయానికి రాకూడదని మొత్తం చదివి అర్ధం చేసుకోవాలని కోరాడు. కోర్టుకు వెళ్ళాడు. కోర్టు అతనిపక్షమే తీర్పు చెప్పినా ఆ పుస్తకంలో దైవ దూషణ లేదని, కాని బూతు అశ్లీలం ఉన్నాయని బహిరంగ అమ్మకానికి అనుమతించమని అందులోని లెస్బియన్‌పై ఉన్న ఆరు కవితలను తీసేసి ప్రచురిస్తే అనుమతిస్తామని తీర్పు చెప్పారు. దీనికి ఒప్పుకొని అలానే చేసి మరో 35 కవితలు చేర్చి రెండవ ముద్రణలో వాటిని తీసేసి ముద్రించాడు. కాని తాను ఆశించిన పుస్తక శిల్ప నిర్మాణం (ఆర్కి టేక్చర్) దెబ్బ తిన్నాడని తెలుసుకొన్నాడు.

బాడేలేర్ భావనలో కవిత్వ పరమార్ధం రెండు రకాలుగా ఉంటాయని "the distinction between good and the beautiful, the discerning of beauty in evil" చెప్పాడు. "no where in literature has there been found a more astonishing mixture of radiance and what Baudelaire called% "spleen% 'Ñ%of the macabre and the magnificent". కవిత్వం ,విమర్శ విరుద్ధమైనవికావు అని చాలామంది అన్నదానిని ఒప్పుకోలేదు. కవి గొప్ప విమర్శకుడు అన్నాడు. విమర్శకుడు కాకపోతే సగం కవి మాత్రమే అవుతాడు అన్నాడు. కవి భావాలను ప్రసారం చేసే వాడు మాత్రమే కాదు, అన్ని కళలను సమన్వయము చేసి అతీత శబ్దాలను సృష్టించేవాడు. సాహిత్య, కళ, సంగీతం, సౌందర్యంలపై బాడేలేర్ రాసినవిషయాలన్నీ అతని సృజనశక్తి, అన్వేషణ ఫలితాలే. అవి ఆనందాన్ని ఇస్తూనే జ్ఞానాన్ని పెంచేవే.

"the material objects exist in this world only because they have their origin in the world of spirit. the artist should decipher the hidden writings of nature and to interpret the mysteries of the universe" అని హితవు చెప్పాడు. కళ అనేది పరమ ఉత్కృష్టమైనది మాత్రమే కాకుండా ప్రపంచంలో అందాన్ని ప్రభావితం చేసేది. అందం అంటే మానసిక వాస్తవికత – దీనినే ఆర్టిస్ట్ సృష్టించి దర్శింపజేస్తాడు. ఆర్టిస్ట్ దృష్టిలో అందం వస్తువులోఉండదు, దానికి ఆర్టిస్ట్ తెచ్చే అందంలోనే ఉంటుంది.

ప్రచురించిన పుస్తకం ఆర్థికంగా లాభించక పోవటమేకాక ఆరోగ్యంపైనా ప్రభావం చూపి, రెండో ముద్రణలోనూ ప్రోత్సాహం రాక కుంగిపోయాడు. ప్రచురణ కార్త్ దివాలా తీసి అప్పుల వాళ్ళ బాధ పడలేక బెల్జియం పారిపోవటం మరీ బాధించింది. లెక్చర్లు దంచి డబ్బులు వెనకేసుకొందామని ప్రయత్నిస్తే అదీ దారుణంగా విఫలమైంది. బెల్జియంలో ఉండగా ఆరోగ్యం మరింత క్షీణించి మొదటిసారి ఎటాక్ వచ్చింది. యవ్వనంలో విలాసంగా అన్నిరకాల సుఖాన్ని అనుభవించటంతో సంక్రమించిన సుఖ వ్యాధి పీల్చి పిప్పి చేస్తోంది. శారీరక బాధలను మానసిక కుంగు బాటును మరిచిపోవటానికి నెమ్మదిగా డ్రగ్స్‌కు అలవాటు పడ్డాడు. భరించలేని పరిస్థితులలో ఆత్మహత్యకూ ప్రయత్నించాడు. దీనితో మానసిక స్థితి అదుపు తప్పి "the wind of the wings of madness" అనుభూతికి లోనయ్యాడు. 43 ఏళ్ళ నడి వయసులోనే ఈ సుఖాలు దుఖాలు బాధలూ అవమానాలు అన్నిటిని మరిచిపోయే శాశ్వత నిద్రలోకి జారు కోవటానికి ముందు రెండేళ్ళు బెల్జియంలో దయనీయ స్థితిలో ఉండిపోయి, నెమ్మదిగా పారిస్ చేరాడు బాదేలేర్. ఇక్కడ కొత్తగా కండరాల బలహీనత, విస్మృతి ఏర్పడ్డాయి. మాట్లాడలేక పోయేవాడు. శరీరభాగాలేవీ పని చేయక పక్షవాత స్థితిలో ఉండిపోయాడు. కాని మెదడు సురక్షితంగానే ఉంది. చివరికి మృత్యువే జయించి అతని బాధలన్నీ తీర్చి అక్కున చేర్చుకొని 31-8-1867న శాశ్వత విముక్తినిచ్చింది.

అతని అంత్యక్రియలు అత్యంత హీనంగా పదిమంది మాత్రమే హాజరవగా జరిగాయి. సాహిత్య సాంస్కృతిక సంఘాల వారెవరూ హాజరుకాలేదు. బాదేలేర్ పుస్తకాన్ని అంకితం పొందిన మహానుభావుడూ గైర్ హాజరయ్యాడు. సాహిత్య పత్రికలేవో కంటి తుడుపుగా నాలుగు ముక్కలు రాసి దులిపేసుకోన్నాయి. ఆతను జీవంచి ఉండగా వచ్చిన మంచి రివ్యూ మూడు భాగాలు పాల్ వేర్లేన్ అనే 22ఏళ్ళ యువ కవి రాసింది పెద్దగా ప్రాచుర్యం లేని "L Art" మేగజైన్ లో వచ్చింది. బతికి ఉండగా పట్టించుకోకుండా వదిలేశారు అతన్ని. కాని చనిపోయాక నాలుగేళ్ళకు బాదేలేర్ కవితలందరి చేతులలో అలంకారా లైనాయి. ఇష్టపడి చదివి ఆరాధించటం మొదలుపెట్టారు. స్విన్ బరన్ కవి అతనిని "ఫైర్ స్కార్డ్ స్పిరిట్" అన్నాడు. అతని కవితలు మన హృదయాలను మంటలతో తృప్తి

పరుస్తాయన్నాడు. బాడేలేర్‌కు స్మృతిగీతం రాస్తూ స్విన్ బరన్ "thou sawest, in thine own singing season, brother --secrets and sorrows unbeheld of us --fierce loves, and lovely leaf-buds poisonous --bare to thy subtler eye but for none other" అంటూ నివాళులర్పించాడు.

సింబాలిక్ అనబడే ప్రతీక వాద కవులు బాడేలేర్‌ను తమ మార్గదర్శిగా భావించారు. కవిత్వాన్ని సాంకేతికతతోను, సంగీతంతోనూ సంపన్నం చేశాడని పరవశిస్తారు. రూపకాలంకారాలు, భావ చిత్రాలుతో సింబాలిక్‌గా విషయాన్ని చెప్పాడని మెచ్చారు. ఆధునికులు అతనిలో సృజన, విధ్వంసం అనే రెండుకళలున్నాయన్నారు. మతాధికారులు "he transformed a seemingly insatiabe appetite for sin into a hunger for spiritual sustenance" అని విశ్లేషించారు. దాదాపు ఇరవైకి పైగా పుస్తకాలు రాశాడు.

అయితే ఇవాళ బాడేలేర్‌ను ఏ భావ జాలం వాళ్ళు తమవాడు, ప్రేరకుడు మార్గదర్శి అని చెప్పటం లేదు. అతని ప్రభావం ,ప్రేరణ ఉత్తేజం అన్ని రకాల భావజాలాలోకి చొచ్చుకుపోయి కలిసి కరిగిపోయాయి. శృంగార విరాగాలలో కలిసి పోయాయి. బాడేలేర్ చెప్పిన అసలు సూక్తి ఏమిటి అంటే "heaven or Hell what does it matter. Let us plunge into the depths .In the very pit of the unknown, we will find the New". మార్సెల్ ప్రాస్ట్, ఆల్ఫ్రెడ్ డీ విన్గీ మొదలైన ఫ్రెంచ్ కవులు అతని ప్రభావానికి లోనయ్యారు. ఇంగ్లీష్ కవులలో ఎడ్మండ్ విల్సన్, ఇలియట్ మొదలైన వాళ్ళు సింబాలిజాన్ని పోషించారు. సెక్స్‌ను చావును గురించే ఎక్కువ చెప్పాడు. అవే "స్కాండలస్ సాహిత్యం"గా ముద్రపడ్డాయి. లెస్బియన్ శృంగారం చాలా పవిత్రమైనది ఆరోగ్యమైనది అని చెప్పాడు. ప్రేమ ఆరాధన గురించి, రూప పరివర్తన, శోకం, నగరాలలో అవినీతి పైకవిత్వం రాశాడు. జీవించలేని దుర్భర పరిస్థితులను చూసి చలించాడు -

"If rape or arson, poison or the knife
Has wove no pleasing patterns in the stuff
Of this drab canvas we accept as life—
It is because we are not bold enough!
(Roy Campbell' translation) ❁



## 9. క్రిస్టియన్ సైన్స్ ఉద్యమకారిణి – మేరీ బేకర్ ఎడ్డీ (1821–1910)

అమెరికాలో న్యు హాంప్ షైర్ లో బౌ అనే చోట 16–7–1821న జన్మించిన మేరీ బేకర్ ఎడ్డీ జీవితంపై ఎన్నో అభూతకల్పనలు అసంబద్ధ రాతలు వచ్చాయి. అన్నిటిని ధైర్యంగా ఎదుర్కొని తాను నమ్మినదానినే చెప్పి, రాసి, ముందుకు సాగిన జీవితం ఆమెది. సత్యాన్వేషణలో మూలాలను తరచిన సూక్ష్మ బుద్ధి ఆమెది. మార్క్ ట్వేన్ ఆమెపై ఒక పెద్ద పుస్తకమే రాశాడు. ఆమె రాసిన క్రిస్టియన్ సైన్స్‌ను హంబగ్ అని ఈసడించి రెచ్చిపోయి రాసిన వారూ ఉన్నారు. నిరుపేద జీవితం గడిపి కానీకి ఠికాణా లేని స్థితి లోంచి, కోట్లకు పడగలెత్తిన ఐశ్వర్య సంపన్నురాలైంది. అదీ క్రిస్టియన్ సైన్స్ అనే వినూత్న విధానంతో. ఆధునిక ప్రపంచ నిర్మాతలలో తానూ ఒకరి చరిత్ర సృష్టించింది.

ఈమె పూర్వీకులు స్కాట్‌లాండ్, ఇంగ్లాండ్ దేశీయులు. తల్లి విద్యావంతురాలు. రుజు ప్రవర్తన ఉన్న మహిళ. మగవారితో సమానంగా కష్టపడి పని చేసే ఓర్పు నేర్పు ఉండేది తల్లికి. తండ్రి చాలా పవిత్రుడైన కాంగ్రి గేషనలిస్ట్. అంటే వ్యక్తిగత శుద్ధత ద్వారానే ఉన్నత స్థితిని, దైవ సాన్నిధ్యాన్ని పొందవచ్చు అనే మెథడిస్ట్ పద్ధతికి దగ్గర భావాలున్నవాడు. మత ధర్మాలను చాలా నిష్ఠతతో పాటించేవాడు.

మేరీ చిన్నతనం నుంచి ఏదో ఒక జబ్బుతో బాధపడేది. మూర్ఛలు వచ్చేవి అకస్మాత్తుగా. తీవ్ర స్వభావం ఉండటం వలన ఈ ఫిట్స్ ఆమెకు ఒక శాపమే అయింది. బాల్యం నుండి మత విషయాలలో చురుకుగా ఉండేది. "ఎవరో నన్ను పేరు పెట్టి మూడు సార్లు పిలిచినట్లు అంతరాత్మలో అనిపించింది" అని తన అనుభవాన్ని రికార్డ్ చేసింది. తనను "జోన్ ఆఫ్ ఆర్క్" గా భావించుకొనేది. ఆమెతో బంధుత్వం ఉన్నట్లు ఊహించుకోనేది. పన్నెండవ ఏటనే బాల యేసులాగా తానూ చర్చి పెద్దలతో వాదించానని చెప్పుకొనేది. కాని యవ్వనం వచ్చేసరికి వీటికి విరుద్ధంగా ఆమె సంచరించింది.

పిల్ల ఆరోగ్యం కోసం తండ్రి కుటుంబాన్ని ఈనాడు సాన్ బారంటన్ బ్రిడ్జ్ అని పిలువబడే టిల్టాన్‌కు మార్చాడు. మేరీ ఆరోగ్యం కొంత మెరుగైంది. తానూ ఒక కవిని అని ఊహించుకొని ఏకాంతంలో కవిత్వం రాసేది. అందులో మంత్రాలనూ కలిపి

రాసేది. 19 వ ఏట సోదరుడు ఆల్బర్ట్ చనిపోవటంతో డిప్రెషన్‌కు లోనైంది. రెండేళ్ళ తర్వాత ఆల్బర్ట్ స్నేహితుడు అయిన ఒక తాపీ పని వాడిని పెళ్లి చేసుకొన్నది. భర్త స్టోన్ మేసన్‌గా వ్యాపారమూ చేసేవాడు. సౌత్ కరోలినాలోని చార్లేస్టన్‌కు నవ వధువును తీసుకొని వెళ్లి కాపురం పెట్టాడు. అతనితో ఎన్నోసార్లు బిజినెస్ ట్రిప్‌లలో పాల్గొనేది. భర్తకు ఎల్లో ఫీవర్ వచ్చి అకస్మాత్తుగా చనిపోయాడు .చేతిలో పెన్నీ కూడా లేని గర్భ దరిద్రంలో అప్పుడు మేరీ ఉంది. పుట్టింటికి చేరి ఒక కొడుకును కని తండ్రి పేరు పెట్టుకొన్నది.

చిన్నతనంలోనే గర్భం దాల్చటం వలన పిల్లాడు పుట్టేలోపే ఆమె ఆరోగ్యం మరీ క్షీణించి ఇక బతకదేమో ననిపించింది. అందువల్ల పసిపిల్లాడిని సాకే పని కూడా చేయలేకపోయేది. నరాల బలహీనత ఆమె ఆరోగ్యాన్ని తరచుగా దెబ్బ తీసేది. కుటుంబ సభ్యుల తోడ్పాటుతో, ఆసరాతో ఆమె బతికింది. ఇలాంటి స్థితి లోకూడా కవిత్వం రాసింది వీలైనప్పుడల్లా. పిల్లాడిని పెంచలేననే అధైర్యం ఆమెను కమ్ముకొంటే విలేజ్ బ్లాక్ స్మిత్ భార్య చేతిలో కుర్రాడి సంరక్షణ బాధ్యత పెట్టింది. ఇరవై ఏళ్ళకు తల్లి చనిపోయింది. తండ్రి వేరొక అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. తండ్రి ఇంట ఇప్పుడు కూడా ఒంటరి జీవి అయిపోయింది. మగ వారి విషయంలో ఆమె చాలా దురదృష్టవంతురాలు. బార్లేట్ అనే అతన్ని ప్రేమిస్తే, అతను కాలిఫోర్నియాకు వెళ్లి చనిపోయాడు. ఆ దుఖమూ కుంగ దీసింది. కొడుకును మారుటి తండ్రి దూర ప్రాచ్యానికి తీసుకెళ్ళిపోయి పుత్ర ప్రేమకు దూరం చేశాడు. కొడుకు తనకే దక్కాలన్న అరాటమూ ఆమెలో లేదు. కారణం తన పొట్టనే తాను పోషించుకోలేని దైన్యమే. కొడుక్కి 35 ఏళ్ళు వచ్చి భార్యా ఇద్దరు పిల్లలతో ఉన్నాడని తెలిసి "మదర్స్ డార్లింగ్" అనే కవిత రాసింది. "Thy smile through tears ,as sunshine over the sea --Awoke new beauty in the surge;s roll --Oh !life is dead ,bereft of all,with theee --Star of my earthly hope,babe of my soul" అని తన ఆవేదనను వెళ్ళ గక్కింది .

ముప్ఫైలలో మళ్ళీ వివాహ సన్నాహాలలో పడింది. డేనియల్ పాటర్సన్ అనే డెంటిస్ట్‌ను పెళ్లి చేసుకొన్నది. ఆమె అనారోగ్యం గురించి అతనికి పూర్తిగా తెలుసు, కానీ అతని అభిరుచులు వేరు. జీవన వైవిధ్యాన్ని ఆమె కోరుకోలేక పోయింది. అతని పాశవిక చేష్టలకు తట్టుకోలేక పోయింది. వైట్ మౌంటేన్స్ దగ్గరున్న నార్త్ గ్రాటన్‌లో ఉన్నారిద్దరూ. అక్కడా ఒంటరిదైపోయిందిమళ్ళీ. నిరంతరం సంచార వైద్యంలో ఉండే ఆతను ఇంటిదగ్గర భార్యను వదిలేసి వెళ్ళిపోయేవాడు. ఆమె ఇతరు లెవరితోనూ స్నేహం చేసేదికాదు.

నలభైవ ఏట. పోర్ట్ లాండ్‌లోని మైమ్‌లో ఫినియాస్ పి.క్విమ్బి అనే ఆయన మెస్మరిజంతో వ్యాధులు నయం చేస్తున్నాడని విన్నది. ఆయనే తన వ్యాధికి దిక్కు అని

నమ్మి అక్కడికి చేరింది. మొదటి సెషన్ లోనే క్విమ్బి– మేరీ శారీరక ఆరోగ్యాన్నేకాదు మానసిక ఆరోగ్యాన్నీ బాగు చేశాడు. ఆమెలో ఉన్న అసాధారణ ప్రజ్ఞ ఆసక్తికి ముచ్చటపడి ఆయన తనకు వచ్చిన సర్వ విద్యనూ ఆమెకు నేర్పించాడు. కొద్ది కాలంలోనే ఆయనతో బాటు సమాన మైన విద్య నేర్చి చాంపియన్ అనిపించింది. ఆయన రాసిన గ్రంథాలన్నీ చదివింది. ఆయన ప్రతిభావిశేషాలను పత్రికలో వ్యాసాలుగా రాసి ప్రచారం చేసింది మేరీ బేకర్. ఆయన హిప్నటిజం తోకాని లేక "యానిమల్ మాగ్నేటిజం"తో కాని రోగుల వ్యాధులను నయం చేయటం లేదని ఒక శాస్త్రీయమైన, ఎవరికీ తెలియని విధానంలో నయం చేస్తున్నాడని తెలియజేసింది. శిష్యురాలి అకుంఠిత దీక్షకు మద్దతునిచ్చి ఆమెను తీర్చిదిద్దటంలో క్విమ్బీ ఎక్కువ సమయం గడిపాడు. ఆమె రాసిన వాటిని "సైన్స్ అండ్ హెల్త్" పేరిట ముద్రించింది.

మేరీ ఆరోగ్యం బాగుపడటమేకాదు, ధైర్యం సాహసం, ఆలోచన, మనో నిబ్బరం యేర్పడి మానసిక వ్యాధులను కూడా నయం చేయగలిగే స్థితిలోకి వచ్చింది. వీటిని స్మృతి గీతాలుగా రాసి "lines on the Death of Dr .P .P. Quimby ,who healed with the Truth that Christ Taught in contra distinctions to all Isms" పేర వెలువరించింది. కొంతకాలానికి ఆమె నడుస్తూ పడిపోయి విపరీతంగా గాయాలైనాయి. అప్పుడు జీసస్ చెప్పిన "physician heal thy self!"వాక్యాలను మననం చేసుకొని రెండు రోజుల్లోనే లేచి నిలబడి నడవటం ప్రారంభించింది. దీనినే "క్రిస్టియన్ సైన్స్" అన్నది. 1866 ఫిబ్రవరిలో తనకు" డివైన్ మెటా ఫిజికల్ హీలింగ్ అబ్బిందని దీనినే "క్రిస్టియన్ సైన్స్" అన్నాని రాసింది మేరి. అన్ని శారీరక బాధలకు మనసే కారణం అని అన్నిటికి ప్రధానం మైండ్ అనీ నిర్ణయించింది. ఇక్కడి నుండి ఆమె జీవితం మలుపు తిరిగి ఉచ్చ స్థితికి చేరింది.

తన కొత్త మతాన్ని సంస్థాపించటానికి ముందు మేరి బెకర్ ఎన్నో అవరోధాలను ఎదుర్కొన్నది. డాక్టర్ పాటర్సన్ నుండి ఏడాదికి రెండు వందల డాలర్ల పెన్షన్ తప్ప ఇంకే ఆదాయమూ లేదు. ఉండటానికి స్వంత ఇల్లే లేదు. ఎవరో ఒక ఇల్లాలి మానసిక స్థితిని సరిచేసి వారింట్లో ఆ రోజు ఆతిథ్యం పొందుతూ సంచారి జీవితం గడిపింది. ఇలా ఉంటున్నా క్విమ్బీ జీవిత విశేషాలను రాస్తూనే ఉంది. నాలుగేళ్ళు బాధ దుఖం, బీదరికం ఒంటరితనంలో జీవించి చివరికి మొదటి డ్రాఫ్ట్ "extracts from doctor P.P.Quimby's writings" పూర్తి చేసింది. ఇది బాధా నివృత్తి చేసేదేకాక భరించలేని మానసిక సంక్షోభానికి పరిష్కారంగా కూడా ఉన్నది. దీనితో ఆమె అసలైన క్రిస్టియన్ సైన్స్ ఆవిర్భావానికి మార్గం సుగమమైంది. దీనితో బాటు ప్రేమించటం గురించి బోధించేది.

మొదటిసారిగా ఆమె శిష్యులు బాధానివారణ చేయటంలో ప్రసిద్ధులవటంతో ఆమె

కీర్తి నెమ్మదిగా ప్రపంచమంతా పాకింది. అదే ఆమె విజయానికి తొలి మెట్టు అయింది. వారికి బోధించటానికి ఫీజు వసూలు చేసేది. దీనితో అనేక సంస్థలేర్పడ్డాయి. వారిలో భేదాలు తారా స్థాయికి చేరాయి. 57 ఏళ్ళ వయసులో పాటర్సన్‌కు విడాకులిచ్చి గిల్బర్ట్ ఎడ్డీని పెళ్ళాడింది. 456 పేజీల ఉద్గ్రంధాన్ని పూర్తి చేసి 1875లో విడుదల చేసింది. క్విమ్బీ పద్ధతిని “ది సైన్స్ ఆఫ్ హెల్త్” అన్నది. దానికి “విత్ కీ టు స్క్రిప్చర్స్” అని జోడించింది. పది హేనేళ్ళు దానినెప్పటి కప్పుడు కొత్తవి చేస్తూ ఆధునీకరిస్తూనే ఉంది. ఆ పుస్తకం లక్షా యాభై వేల కాపీలు అమ్ముడు పోయి రికార్డ్ సృష్టించింది. తన స్వంత చర్చిలోని ప్రతి వ్యక్తీ ఒక కొత్త కాపీ కోనేట్లు చేసింది. అమ్మకాలపై ప్రతి పుస్తకానికి ఒక డాలర్ రాయల్టీ పొందింది.

పదార్థంపై మనసు ఆధిక్యతను ఆధారంగా రాసిన పుస్తకం అది. చెడు అనేది లేదని అంటుంది. చెడు అనేది భయం వలన ఏర్పడే ఒక మానసిక స్థితి అన్నది. ఆమె రాసిన పుస్తకంలో విరుద్ధ విషయాలెన్నో ఉన్నాయి. కాని శిష్యులపై ఆమెకు గొప్ప పట్టు ఉండేది. 55 వయసులో “క్రిస్టియన్ సైన్స్ అసోసియేషన్” ఏర్పాటు చేసింది. మూడేళ్ళ తర్వాత “ది చర్చ్ ఆఫ్ క్రైస్ట్, సైంటిస్ట్”ను స్థాపించింది. రెండేళ్ళ తర్వాత ఇందులోని ఎనిమిది మంది చార్టర్ సభ్యులు రాజీనామా చేశారు. 61 వయసులో తన చర్చిని బోస్టన్ నగరానికి మార్చింది. ఆమె ప్రతి కదలికా ఒక వార్తా సంచలనమే అయింది. దాన్ని బాగా కాష్ చేసుకొంది కూడా. తన మాటకు చేష్టకు ఆమె పురాణ గ్రంథాలనుండి ఆధారాలు చూపి అప్రతిభులను చేసేది. అపోకలిప్స్ చెప్పిన “and there appeared a great wonder in heaven, a woman clothed with the sun and the moon under her feet, and upon head a crown of twelve stars” అనే మాటలను తనకే అన్వయించుకునేది.

క్రిస్టియన్ సైన్స్ కొద్దికాలంలోనే గొప్ప వ్యాప్తి పొందింది. ఈ అతి వ్యాప్తిని చూసి మహా రచయిత మార్క్ ట్వేన్ “ఇలా అయితే క్రిస్టియన్ సైంటిస్టులు 1920కి పది మిలియన్లు, 1930కి వారంతా బలమైన శక్తిగా రూపొంది ప్రతి రాజకీయ నిర్ణయాన్ని ప్రభావితం చేస్తారు. 1940 నాటికి రిపబ్లిక్ అధికారాలు చేబట్టి అధికారంలో పాతుకు పోయే అవకాశం ఉంది” అని రాశాడు. ట్వేన్ మాటలు పూర్తిగా ఉత్ప్రేక్షలే అభూతకల్పనలే అయ్యాయి. 1950 నాటికి మేరీ స్థాపించిన మదర్ చర్చ్ బ్రాంచీల సంఖ్య మూడు వేలు అని ఎన్ సైక్లో పీడియా బ్రిటానికా తెలియ బర్చింది. అందులో రెండు వేల రెండొందల బ్రాంచీలు అమెరికా కెనడాలలో ఉన్నాయి.

ముసలితనం మీద పడుతున్నకొద్దీ ఎడ్డీ బలం, అధికారం మరీ పెరిగాయి. ఒక యునిటేరియన్ మినిస్టర్ సాయంతో తన పుస్తకానికి తుది మెరుగులు దిద్ది తన అనుచరులకు బైబిల్‌కు ప్రత్యామ్నాయమయేట్లు చేసింది. దేశంలో సంచారం చేస్తూ

ఉపన్యాసాలిస్తూ తన మతంలోకి జనాలను చేర్పిస్తూ మదర్ చర్చ్‌ను బలీయం చేసింది. ఒక భారీ సంస్థకు ఆర్గనైజర్‌గా ఎదిగిపోయింది. అత్యంత సంపన్నుల జాబితాలో చేరిపోయింది .మగ పురుషులతో అంత సఖ్యతగా లేక పోయినా సంస్థా గత విషయాలకు వారిపైనే ఆధార పడాల్సి వచ్చేది. డెబ్బైవ పడిలో 41ఏళ్ళ ఒక హోమియో పతి డాక్టర్‌ను చేర దీసింది. అయిదేళ్ళ తర్వాత అతన్ని విసర్జించింది. అల్లాగే ఎవరినో దగ్గరకు తీయటం కొద్దికాలానికే వారికి గుడ్ బై చెప్పటం అలవాటైపోయింది ఆమెకు. ఆమె శీలాన్ని శంకించారు. చనిపోయిన వారి మరణానికి ఆమె చికిత్స వికటించాయి అనే ప్రచారమూ బాగా బలపడింది. పూర్తిగా ఆమెపై వ్యతి రేకత కాదు. ఆమె చుట్టూ ఉన్న కోటరీపై వ్యతిరేకతే అది. సంస్థాగత వ్యవహారాలపై ఆమె పట్టు కోల్పోయిందనే ప్రచారం సాగింది. ఆమె స్వచ్ఛ ప్రవర్తనపై అపనమ్మకం కలిగింది. ఆమెను ఒంటరి దాన్ని చేసి పిచ్చిదానికింద జమ కట్టేశారు. 86 ఏళ్ళ వయసులో కూడా ఆమె తన సంస్థను పూర్తి నియంత్రణలో ఉంచుకోగలిగింది. తొంభై ఏళ్ళు వచ్చాయి. వృద్ధాప్యం వలన నే మేరీ బెకర్ ఎడ్డీ 3-12-1910న తను నమ్మిన క్రీస్తును చేరుకొంది. పేదరికంలో అతి సాధారణ రైతు కుటుంబంలో పుట్టిన ఆమె చనిపోయేసరికి ఒక పెద్ద సువిశాల సంస్థకు అధికారిణి అయి, మూడు మిలియన్ డాలర్ల ఆస్తికి వారసురాలై చరిత్ర సృష్టించింది. ఈ ఆస్తి అంతా ఆమె తను పెంచి పోషించిన చర్చికే దక్కేట్లు చేసి, భౌతికవాదాన్ని రూపుమాపి, పదార్ధ వాదాన్ని లేకుండా చేసేందుకే వినియోగించేట్లు చేసింది మేరీ బేకర్ ఎడ్డీ.

భారతీయ వేదాంతానికి క్రిస్టియన్ సైన్స్‌కు అవినాభావ సంబంధం ఉందని మేరీ 33వ ఎడిషన్‌లో చెప్పింది. భగవద్గీతలోని అనేక శ్లోకాలను అందులో చేర్చింది. తర్వాత తీసేశారు. తర్వాత కాలంలో భారతీయమైన అన్ని విషయాలను ఆ పుస్తకం నుండి తొలగించారు. ఎడ్డీ జీవితాంతం మార్ఫిన్ వాడుతూనే ఉందని ఒక రిసెర్చర్ తెలిపాడు. ఆమె చర్చ్ బ్రాంచీలు 76 దేశాలలో వ్యాపించి ఉన్నాయి ఆమె శత జయంతికి ఆమె జన్మించిన బౌ గ్రామంలో 100 టన్నుల గ్రానైట్ పిరమిడ్‌ను నెలకొల్పి ఘనంగా నివాళు లర్పించారు. దాదాపు 16 పుస్తకాలు రాసింది మేరీ.❋



## 10. ప్రపంచ ప్రసిద్ధ రష్యన్ నవలా రచయిత – ఫియోదర్ దాస్టో విస్కీ (1821–1881)

జీవితం అంతా యుద్ధ రీతి పోరాటమే బాధలే, అణచివేతలే, లోపలి పీడన, బాహిర వేదన, ఏదో సుదూర స్వప్నాల తీరాలు అందుకొనే ఆరాటం ఆవేదన పోరాటమే డాస్ట విస్కీ అని పిలువబడే ఫియోదర్ మిఖైలోవిచ్ దాస్టో విస్కీ జీవితం. పగటి కలలు. ఆకలల సాకారానికి ఆరాటం. భరించ లేని వేదన, దాని సాఫల్యతకు నిరాశా పూరక పోరాటం. పుట్టిన నాటి నుండీ ఇదే తీరు. 27 ఏళ్ళ వయసులో ఉరిశిక్ష ఆఖరి క్షణంలో రద్దు అయి మనకోసం బతికాడు. ప్రపంచ ప్రసిద్ధ నవలా రచయితగా మిగిలాడు.

30–10–1821 మాస్కోలో మురికి చిన్న పబ్లిక్ హాస్పిటల్‌లో తండ్రి స్టాఫ్ ఫిజీషియన్‌గా ఉన్న చోట ఏడుగురు సంతానంలో ఒకడుగా పుట్టాడు. బాల్యంలో పేదరికం, జబ్బులు, అకస్మాత్తు చావుల వార్తలే ప్రతి రోజూ వినేవాడు. తండ్రి తాగుడుకు విపరీతంగా బానిసై ఉద్యోగాన్ని పోగొట్టుకొంటే ప్రైవేట్ ప్రాక్టీస్ చేసి కొద్దో గొప్పో సంపాదించి కుటుంబాన్ని పోషించాడు. ఎనిమిదో ఏటనే దాస్టోవిస్కి కి దుఃఖం, దౌర్భాగ్యం అంటే ఏమిటో తెలిసింది. ఈ సమస్య బైబిల్‌లోని నీతికథ అతని జీవితాంతం గుర్తుండిపోయాయి. 54 వ ఏట భార్యకు జాబు రాస్తూ "బుక్ ఆఫ్ జాబ్ చదువుతున్నా. అది మళ్ళీ నాలో పాత దుఃఖం వేదన దుస్థితి జ్ఞప్తికి తెచ్చింది చదవటం ఆపేసి పుస్తకం పక్కన పారేసి పచార్లు చేశా. నా కన్నీళ్లు ధారాపాతంగా కురుస్తూనే ఉన్నాయి. బలవంతంగా ఆపుకోగాలిగాను. ఈ పుస్తకమే మొట్ట మొదటిసారిగా నన్ను ఆకర్షించి పట్టేసుకొన్నది" అని రాశాడు.

16 ఏట సోదరుడు మైఖేల్‌తో బాటు సెయింట్ పీటర్స్ బర్గ్‌లోని మిలిటరీ ఇంజినీరింగ్ స్కూల్‌లో చేరాడు నాలుగేళ్ళు చదివాడు. రోజూ కవాతు భరించలేకపోయాడు. ఖాళీ దొరికినప్పుడల్లా దొరికినన పుస్తకం చదివాడు. పుష్కిన్ కవిత్వంపైనా, బాల్జాక్ వచన రచన రచన మీదా విపరీత మైన అభిమానమేర్పడింది. బాల్జాక్ రచన "యుజినీ గ్రాన్ డేట్"ను అనువదించాడు. 20కి ఆర్మీలో సెలెక్ట్ అయ్యాడు. కాని ఇంకో ఏడాది స్కూల్‌లోనే చదివాడు. తర్వాత రెండేళ్ళు మిలిటరీ

ఇంజినీరింగ్ లో తప్పని సరిగా ఉద్యోగం చేయాల్సి వచ్చి చేశాడు. ఇంతలో తండ్రి హత్యకు గురైనాడు. జాగ్రత్త లేకపోవటం వలన సంపాదించిన డబ్బంతా వృధాగా ఖర్చు చేసేశాడు. బాల్జాక్‌ను చదవటం వలన "రష్యన్ హ్యూమన్ కామెడి" రాయాలని కలలు కనేవాడు. ఆరు నెలలు కష్టపడి రాసి "పూర్ ఫోక్" మొదటి నవల పూర్తిచేసి ప్రచురించాడు.

మొదటి నవలే అయినా అది బాగా అందర్నీ ఆకర్షించి నేక్రసోవ్ అనే విమర్శకుడు గోగోల్‌తో సమానంగా రాశాడని కీర్తించి "ఇంతకీ నువ్వేమి రాశావో నీకైనా తెలుసా?" అని ప్రశ్నించాడు. ఈ విషయాన్ని 30 ఏళ్ళ తర్వాత గుర్తుకు తెచ్చుకొని డాస్టో విస్కి "నా జీవితం లో దీనిని మించిన గొప్ప ఆనందం ఎప్పుడూ అనుభవించలేదు" అని చెప్పుకొన్నాడు. పూర్ ఫోక్‌లో లో పాత్రలన్నీ ఉత్తరాల ద్వారా విషయాలను ఆకలితో అలమటిస్తూ, కొంచెం పాలు చిన్న రొట్టెముక్క తింటూ బతుకుతూ తెలియజేస్తాయి. ఈ నవల ఇన్ స్టంట్ సక్సెస్ సాధించటంతో రచయితగా పేరొచ్చింది. అథోజగత్ సహోదరుల జీవితాలే అతని కథా వస్తువులైనాయి. 27 వయసులో మెలో డ్రామా జోడించి విషాదపాత్రలతో రెండోనవల మొదలుపెట్టాడు. కొన్నేళ్ళతర్వాత యువ రాడికల్స్‌తో పరిచయమేర్పడి ఫోరియర్ రచనలు చదివి సోషలిజం గూర్చి వాళ్ళతో చర్చించాడు. 1848 రష్యా విప్లవ కాలంలో ఇలాంటి చర్చలు దేశద్రోహ నేరం. డాస్టోవిస్కితో పాటు అతని స్నేహితులను కూడా అరెస్ట్ చేసి పీటర్ అండ్ పాల్ ఫోర్ట్రెస్‌లో బంధించి విచారించారు. ఉరి శిక్ష ఖాయం చేశారు. వధ్య స్థలానికి ఒకరొక్కరినే తీసుకు వెడుతున్నారు. శిక్షను చదివి వినిపించి ఒక్కొక్కరినే ఉరి తీస్తున్నారు. అందరిలో నిరాశా నిస్పృహా నిర్వేదం నిండి ఉన్నాయి. ఉరి తీయబడేవారి వరుసలో ఆరో వాడు డాస్టో విస్కి. కళ్ళు మూసుకొన్నాడు. ఆ సంఘటన గురించి తరవాత రాస్తూ "ఒక్క నిమిషమే నాకు బతికే కాలం మిగిలి ఉంది. ఒక తెల్ల గుడ్డముఖంపై కప్పారు. సైనికులు వెనక్కి వెళ్లి నిలబడ్డారు. ఇంతలో జార్ చక్రవర్తి మా అందరికి ప్రాణ భిక్ష పెట్టినట్లు వార్త చదివారు". ఉరి శిక్ష నాలుగేళ్ల సైబీరియా కఠిన జైలు శిక్షగా మార్చారు. ఇది ఒక వ్యక్తి జీవితంలో అత్యంత ఉత్కంఠ భరిత సన్నివేశం. ఊహించలేనిది, రానిది. అలా మృత్యు ముఖం నుండి డాస్టో విస్కీ బయటపడి ప్రపంచ ప్రఖ్యాత రచయిత అయ్యాడు. మనసులో పడిన ఈ మచ్చ జీవితాంతం మరచిపోలేదు.

ఇరవై ఎనిమిదేళ్ళ వయసులో సైబీరియాలో శిక్ష అనుభవించాడు. 38 వయసులో మళ్ళీ సెయింట్ పీటర్స్ బర్గ్ చేరాడు. సృజన జీవితంలో మూడవ వంతు ప్రవాసిగా గడిపిన దురదృష్టవంతుడు డాస్టో విస్కి . కోటార్గా, ఓంస్ నేర బందికానాలలో ఉండగా రాళ్ళు పగల కొట్టించారు, రాళ్ళు మోయించారు. ఏ పుస్తకమూ చదవ నివ్వలేదు ఒక్క అక్షరం కూడా రాయనివ్వలేదు. ఒక్క బైబిల్ చదవటానికి మాత్రమే పర్మిషన్ ఉండేది. ఆ దుర్భర నరక వేదన గురించి ఆయన మాటల్లోనే తెలుసుకొందాం "eternally in chains, eternally under guard,eternally behind bolts

and bars and never alone! Total suppression of the mind --that was life in the fortress"ఎన్నో భావాలు వచ్చేవి. అవన్నీ వాహిక లేక ఇంకిపోయేవి. ఏదేదో రాయాలనిపించేది కాని రాయటానికి పేపర్ కూడా నిషేధమే. ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిని మూర్ఛరోగం వచ్చింది.

జైలు నుంచి విడుదల చేశారుకాని సైబీరియన్ టౌన్ సెమి పాలటిన్ స్క్ కు చేరాడు. కొంత ఆరోగ్యం కుదిరింది. నాలుగేళ్ళు జన జీవితానికి దూరమై ఉన్నాడు బైబిల్ ఒక్కటే అతనికి ఊరటగా ఉండి దైవానికి దగ్గర చేసింది. రాడికల్ భావాలు మార్చుకొన్నాడు. ఆ స్నేహితులకు దూరమైపోయాడు. ఆలోచనా విధానంలో పెద్ద మార్పు వచ్చింది. ప్రపంచాన్ని సోషలిజం ద్వారా ఉద్ధరిద్దామన్న భావన తొలగి పోయింది మనసు నుండి. మతానికి చేరువైపోయాడు. ప్రజలు నమ్మారు కనుక తానూ నమ్మాను అని చెప్పాడు.

సెమి పాలంట్ నిస్కి లో మిలిటరీకవాతు చేస్తూ ఖాళీ సమయంలో రచనావ్యాసంగం కొనసాగించాడు. అప్పుడే ఒక పిల్లాడి తల్లి అయిన మేరియా డిమిత్రివాన ఇసఏవాను ప్రేమించాడు. ఆమె భర్తను వదిలి రావటం కష్టమైంది. భర్త చనిపోయిన తర్వాత ఆమె వేరొకరిని మనసిచ్చి మనవాడికి నిరాశ కలిగించింది. కాని ఆమె అంటే ఆరాధనమాత్రం తగ్గలేదు. ఆమెనే పెళ్లి చేసుకొని ఆమె కొత్త భర్తను, కొడుకును, ఆమెను పోషించాడు. ప్రభుత్వం పూర్తిగా క్షమ ప్రసాదించి పీటర్స్ బర్గ్‌లో మామూలు జీవితాన్ని గడపటానికి అంగీకరించింది. రష్యాలో సంస్కరణ ఉద్యమం ఊపులో ఉంది. సోదరుడు మైకేల్‌తో కలిసి డాస్టో విస్కి "వ్రేమ్యా" (టైం) మేగజైన్‌ను నడిపాడు. రెండు విలువైన పుస్తకాలు "ది ఇన్ సల్టెడ్ అండ్ ఇంజూరేడ్ "ది హౌస్ ఆఫ్ ది డెడ్" రాశాడు. రెండవ నవలను టాల్ స్టాయ్ బాగా మెచ్చాడు. ఇది ఆయన జైలు జీవితమే జీవిత పోరాటంలోనే జీవిస్తున్నాడు. ఆగిన సృజన ప్రవాహాన్ని కదిలించి వేగవంతంగా రాసేస్తున్నాడు. జర్మని ఫ్రాన్స్ ఇంగ్లాండ్ టూర్ చేశాడు. అక్కడి భౌతిక వ్యామోహంపై ఏవగింపు కలిగి "వింటర్ నోట్స్ ఆన్ సమ్మర్ ఇంప్రె షన్స్" రాశాడు వాటిపై. మొదట్లో ఆంక్షలు విధించినా తర్వాత వదిలేశారు అప్పటికే జరగరాని నష్టం జరిగిపోయింది. 40లో మూర్ఛ తీవ్రమైనది. జ్ఞాపకశక్తి క్షీణించింది. స్థలమార్పు అవసరమన్న డాక్టర్ సూచనపై విదేశీ యానం చేశాడు. పోలినా సుస్లోవా అనే పిల్లపై పారిస్‌లో వ్యామోహంలో పడ్డాడు. చేతిలో చిల్లిగవ్వలేని స్థితిలో ఉన్నాడు. జాక్ పాట్ కొట్టి ఏదో లబ్ధి పొందాలని జర్మన్ గాంబ్లింగ్‌లో దిగాడు. గెలుపు ఓటమిల దోబూచులాటలో పడి అదే వ్యామోహమై తాను ఎందుకిక్కడికి వచ్చాడో మర్చేపోయాడు. పారిస్ చేరాడు. ప్రేమించిన పోలినా లవర్ ఆమెను మోసం చేసి జంప్ జిలానీ. ఆమె పోషణ కూడా మీదేసుకొన్నాడు మన విశాల హృదయుడు. ఆమెతో వీస్ బెడేన్ వెళ్లి మళ్ళీ వీల్ ఆఫ్ ఫార్చ్యూన్‌లో కూరుకుపోయాడు. ఇంటిదగ్గర భార్యకు తీవ్ర అనారోగ్యంగా ఉందని తెలిసి రష్యా చేరాడు. భార్యకు పిచ్చెక్కి చనిపోయింది. కొంతకాలానికి తాను అధికంగ ప్రేమించిన

సోదరుడూ చనిపోయాడు. మళ్ళీ డిప్రెషన్‌లో పడ్డాడు. మైకేల్ చేసిన విపరీతమైన అప్పులు తీర్చాలనే సంకల్పంతో విపరీతంగా వేగంగా రాశాడు, గాంబ్లింగ్ ఆడాడు. ఉన్నదంతా ఊడ్చుకు పోయింది పోలినాడబ్బును కూడా క్షవరం చేశాడు. కాండిల్స్ కొనే స్తోమత కూడా లేక రాత్రుళ్ళు చదవటం రాయటం మానేశాడు. ఒక్క రూబుల్ అప్పుకోసం వీధుల వెంబడి మూడేసి రోజులు తిరిగిన సందర్భాలెన్నో ఉన్నాయి.

అదృష్టం ఒక్క సారిగా తలుపు తట్టింది "ది గాంబ్లర్" క్రైం అండ్ పనిష్మెంట్ (నేరము శిక్ష) నవలలు రాయటానికి పబ్లిషర్‌తో ఒప్పందం కుదుర్చుకొని గడువు లోపల పూర్తి చేయటానికి అన్నా గ్రిగేరేవ్నా "అనే స్టెనో గ్రాఫర్‌ను పెట్టుకొని పూర్తి చేసి చివరికి ఆమె ప్రేమబంధంలో చిక్కి పెళ్లి చేసుకొన్నాడు. "నేరము శిక్ష" గొప్ప విజయాన్ని సాధించి, కాసుల వర్షమే కురిపించింది. అప్పులవాళ్ళు మీద పడి ఉన్నదంతా ఊడ్చుకెళ్ళారు. చిప్ప చేతిలో పట్టుకొని కొత్త భార్యతో రాష్యా వదిలి జెర్మని స్విట్జర్లాండ్ ఇటలీలు తిరిగాడు. సుఖం ఆనందం పొందలేక పోయాడు. స్వంత ఇల్లు ఏర్పరచుకోవాలనే కోరిక కలిగింది. అందులో కూర్చుని హాయిగా స్వేచ్ఛగా రాసు కోవాలనుకొన్నాడు. రష్యా గాలి ఆ నీరే తనకు బలవర్ధకం అనుకొన్నాడు. ఫిట్లు, గాంబ్లింగు జోరైనాయి. శక్తి క్షీణించిపోతోందని సృజన మందగించిందని బాధపడ్డాడు. సరదాగా మొదలైన జూదం వ్యసనమై పీల్చి పిప్పి చేసింది ఇడియట్, దిపోసేసింగ్ నవలలు రాస్తున్నాడు. జెనీవాలో భార్య గర్భవతిగా ఉన్నప్పుడు చేతిలో 5 ఫ్రాంకులు మాత్రమే ఉన్నాయి. మొదటి బిడ్డ మరణం రెండో బిడ్డ డ్రెస్డేన్‌లో జననం. తన దీన స్థితి ని తెలియ జేస్తూ స్నేహితునికి "నా భార్య ఒక పిల్లాడిని పోషించాలి. నేను ఎందుకూ పనికి రాని వాడినైపోయాను. ఎప్పుడూ ఆకలితో ఉంటున్న నేను ఏమి ఎలా రాయగలను. ఆకలి రాక్షసినన్ను కొరికి తినేస్తోంది. చదరంగం ఆడి డబ్బు సాధించటం తప్ప గత్యంతరం లేదు" అని రాశాడు.

వేదనా, బాధ, దరిద్రం నిర్లక్ష్యం పెనవేసుకు పోయి అతనితో చదరంగం ఆడాయి. ఓడిపోయాడు అన్ని ఆటలలో. విముక్తి భావాలను గాలికి వదిలేశాడు. చాందసం పెరిగింది. మతం నరనరానా పాకింది. గురూగారికి 50 ఏళ్ళకు మోకాలిలోని మెదడు అసలు స్థానానికి చేరి చేసిన తప్పులకు చెంపలేసుకొని పశ్చాత్తాపపడి జూదానికి గుడ్ బై చెప్పి మళ్ళీ రష్యాలో అడుగు పెట్టాడు. అప్పులాళ్ళు అతని రచనలకు అడ్డుపడలేదు. స్వేచ్ఛగా రాయనిచ్చారు. ఊపిరి తీసుకొని మహా రచనలని పించుకొన్న "ది పోసేసేడ్", "ది ఎటర్నల్ హస్బండ్", "ది బ్రదర్స్ కర్మ జావ్"లను క్షణం తీరిక లేకుండా గాంబ్లింగ్‌లో వృధా చేసుకొన్న కాలాన్ని సద్వినియోగం చేసుకొని తీక్షణంగా రాశాడు. అధిక శ్రమ చేశాడు. చావు మీద పడిన వాడైపోయాడు అలసటతో.

60 మీద కొచ్చాయి. మూడు నెలల తర్వాత మృత్యువు కబళించింది. మనసులో అనుకొన్న పుస్తకాలు రాయటానికి ఇంక ఎక్కువ కాలం బతికితే బాగుండును అనుకొన్నాడు. బ్రదర్స్ నవల చివరి భాగం రాస్తూ పెన్ను చేతిలోనుంచి జారిపడి

డాస్టో విస్కి 28-1-1881న మరణించాడు. రష్యా రచయితలు చాదస్తంగా రాస్తారనే అపప్రథ లోకంలో ఉంది. కాని డాస్టో విస్కి మనసుపెట్టి రాశాడని, ప్రతివారితోను మాట్లాడినట్లు రచన చేశాడని మెచ్చుకొంటారు. అతని గొప్ప ఫాన్ అయిన వర్జీనియా ఉల్ఫ్ "his novels are seething whirlpools, gyrating sand storms, water spouts which hiss and boil and suck us in. the y are composed purely and wholly of the stuff of the soul. The elements of the soul are seen not separately but streaked, invoved, inextricably confused, a new panorama of the human mind is revealed" అంటూ పరవశంతో చెప్పింది. ఆయన రచనలు పాపులు నేరస్తులు, ఆత్మ పరాధీనుల గురించే రాశాడు. ఒక కొత్త ప్రపంచాన్ని సృష్టించాడు. సెయింట్ అల్యోశా లాంటి పాత్రలు సృష్టించాడని సోమర్సెట్ మాం పొగిడాడు. ప్రపంచంలో జరిగే ప్రతినేరానికి మన బాధ్యతా ఉంది మన ప్రమేయం లేకపోయినా అనుభవించాల్సి వస్తోంది అంటాడు డాస్టో విస్కి.

కథా నవలా రచయితగా, జర్నలిస్ట్‌గా ఫిలాసఫర్‌గా గుర్తింపు పొందాడు. మత ఆధ్యాత్మిక వేదాంత విషయాలను గురించి రాశాడు. ఎపిగ్రామ్స్ కవితలూ రాశాడు. నవలలో జీవిత చరిత్రను జోడించాడు. తాను ఫిలాసఫీలో బలహీనుడిని అని చెప్పుకొన్నా డాస్టో విస్కీ రచనలలో ఫిలాసఫీయే ఎక్కువగా కనిపిస్తుంది. రష్యన్ స్వర్ణ సాహిత్య యుగంలో టాల్ స్టాయ్, డాస్టో విస్కీ లే అధిక ప్రాచుర్యం పొందారు. ప్రఖ్యాత గణిత విజ్ఞాన శాస్త్రజ్ఞుడు అయిన్ స్టీన్ అతన్ని "గొప్ప మత రచయిత" "who explores the mystery of spiritual existence" అన్నాడు. ఆధునిక వచనానికి ఆద్యుడు డాస్టో విస్కి అన్నాడు జేమ్స్ జాయిస్. "ఆతని రచనల్లో నమ్మేవి నమ్మలేనివీ ఉన్నా చదువుతూ పోతే తను చెప్పినవన్నీ యదార్ధమే అనిపిస్తాయి" అన్నాడు మరో అమెరికన్ లిజెండ్ హెమింగ్ వే. కాఫ్కా "నాకు రక్త బంధువు డాస్టో విస్కి" అన్నాడు. ఫ్రాయిడ్ "కర్మజారో నవల ఇంతకు ముందెన్నడూ రాని మహత్తర నవల" అని పొంగిపోయాడు. సర్రియలిస్ట్ లు, సింబలిస్ట్ లు ఎక్సేన్షియలిస్ట్ లు, బీట్ సంగీతం వాళ్ళు తమకు ప్రేరణ డాస్టో విస్కి అన్నారు.

1956లో రష్యా ఆయన పేర పోస్టల్ స్టాంప్ విడుదల చేసింది. ఆయన పేర మ్యూజియం ఏర్పరచారు. బుధ గ్రహం మీద ఒక క్రేటర్‌కు ఆయన పేరు పెట్టారు. 1991లో కనుగొన్న చిన్న గ్రహాన్ని ఆయన పేరుతో పిలిచారు. ఆయన పేరుమీద ఎన్నో సంస్థలు ఎన్నో రకాల అవార్డులు అందజేస్తున్నాయి. 170 ప్రపంచ భాషలలోకి ఆయన రచనలు అనువాదాలయ్యాయి. ఎన్నో సినిమాలు తీశారు. మొత్తం మీద పదిహేను నవలలు నవలికలు రాశాడు. రష్యా విప్లవంలో రెండు మూడు పేరాలు కుదించారు. 17 చిన్నకథలు, 5 అనువాదాలు చేశాడు. ❋



## 11- లిటరరీ రియలిజంకు ఆద్యుడు గుస్టేవ్ ఫ్లాబర్ట్ (1821-1880)

"మంచి, చెడు అనే విషయాలు, శైలీ అనేవి లేవు. వస్తువులను మనం చూసే దృష్టిని బట్టే అవి ఏర్పడతాయి" అని ఫ్లాబర్ట్ అన్నా కూడా ఆయన రాసిన సబ్జెక్ట్ వల్లనే ప్రసిద్ధి చెందాడు. ఇదే ఆయన వ్యతిరేకులకు విమర్శనాయుధంగా మారింది కూడా. ఫ్రాన్స్ దేశంలో నార్మండిలోని రోఎన్‌లో 12-12-1821న అక్కడే స్థిరనివాసంగా ఉంటున్న ఫిజీషియన్ చీఫ్ సర్జన్ అయిన తండ్రికి జన్మించాడు. తల్లి తండ్రి అయిన తాత కూడా గ్రామ వైద్యుడే. అందుకే పాత్రలను చక్కగా వైద్య రీతిలో కత్తిరించి సొగసు చేకూర్చ గలిగాడు ఫ్లాబర్ట్. ఫ్రెంచ్ "లిటరరీ రియలిజంకు ఆద్యుడు" ఫ్లాబర్ట్. మొదటినవల "మేడం బావేరి"తో విఖ్యాతుడయ్యాడు. అనితర సాధ్యమైన శైలీ విన్యాసం, సౌందర్య దిదృక్ష ఫ్లాబర్ట్ సొంతం. అన్న అచిల్లీ తండ్రి వారసత్వాన్ని నిలబెట్టి డాక్టర్ అయ్యాడు. దీనికి విరుద్ధంగా ఫ్లాబర్ట్ చిన్నతనం నుండి రచనా వ్యాసంగంలో ఉన్నాడు. స్నేహితుడికి ఒక ఉత్తరం ఆనాడే రాస్తూ తనతో కలిసి రచనకు చేయూత నిమ్మని కోరాడు. ఫ్లాబర్ట్ యవ్వన దశలో ఆల్బర్ట్ లీ పోటేవిన్, లూయీ బుల్ హెర్ట్, మాక్సిం డుకాంప్‌లతో సాన్నిహిత్యం పెంచుకొన్నాడు. అందులో ఆల్బర్ట్ 27 ఏళ్ళకే చనిపోతే తట్టుకోలేకపోయాడు. లూయీ కవి. మాక్సిం జర్నలిస్ట్.

19 వయసులో లా చదివాడు. ఆ పాత్య గ్రందాలంటే విపరీతమైన విసుగు, అసహ్యం వచ్చింది. సివిల్ కోడ్‌ను "నాన్సెన్స్" అన్నాడు. నాటక శాలకు క్రమం తప్పకుండా హాజరవుతూ దానిపై వ్యామోహం పెంచుకొన్నాడు. తనకొచ్చే అలవెన్స్ డబ్బులన్నీ సరదాగా దీనికే ఖర్చు చేసేవాడు. స్త్రీ వ్యామోహంలో మాత్రం పడలేదు. కాని మిగిలిన జల్సాలన్నీ అనుభవించాడు. అందంగా ఆకర్షణీయంగా ఫ్లాబర్ట్ ఉండటంతో అమ్మాయిలూ బాగానే "వలపుల వల" విసిరే ప్రయత్నాలు చేసేవారు. "యువ గ్రీకు వీరుడు"గా ఉండేవాడని మనసుపారేసుకొన్న ఒకావిడ అన్నది. అతనిది "హీరోయిక్ బ్యూటీ". రోమన్ సైనికులతో వీరోచితంగా పోరాడిన "గాలిక్ చీఫ్"లాగా ఉండేవాడని ఒకామె కామెంట్ చేసింది. అప్పటికే ఫ్లాబర్ట్ ఒకసారి లోతుగా ప్రేమ వ్యవహారంలో దిగి కూరుకుపోయాడు. పదిహేనేళ్ళ వయసులో కుటుంబంతో వేసవిని ట్రౌవిల్‌లో

గడపటానికి వెళ్ళినప్పుడు పెళ్లి అయి, పిల్లను సాకుతున్న ఇరవై ఆరేళ్ళ ఎలీషా ష్లేసిన్గర్ అమ్మాయికి మనసు పారేసుకొన్నాడు. ఆమె భర్త మన ప్రేమపిచ్చోడి వాలకం కనిపెట్టి తనతో నౌకాయానం చేయించాడు. ఆరేళ్ళ తర్వాత పారిస్‌లో చదువుతున్నప్పుడు ఆ దంపతులు ఒక సాయం వేళ తమతో గడపటానికి ఆహ్వానించారు. సిగ్గుల మొగ్గై ముడుచుకు పోయాడుకాని ఆంతర్యాన్ని ఆవిష్కరించ లేకపోయాడు ఫ్లాబర్ట్. ఆమె మాత్రం ఇతని నిజాయితీని, నిష్కపట ప్రేమను, ఆరాధనను గుర్తించింది. ఆమె జీవితంలో చోటు చేసుకోలేక పోయినా జీవితాంతం ఎలీషా అంటే పరమ ప్రేమారాదనాభావం మాత్రం వదలలేదు. ఆ తర్వాత మూడేళ్ళ దాకా ప్రేమా సెక్సూ లేకుండానే గడిపేశానని రాసుకొన్నాడు. చచ్చేదాకా అలానే ఉన్నానని ఎక్కడో రాసుకొన్నాడు. 23 ఏళ్ళదాకా వర్జిన్ బాయ్ లానే ఉన్నాడు. కాని ఒక పని చేసే అమ్మాయితోనో లేక ఏదో హోటల్ లో ఉంటె వేరొక అమ్మాయితోనో ఒక రాత్రి గడిపాడు అనే పుకారు పారిస్ అంతా షికారు చేసింది.

చదువు మీద దృష్టిపెట్టి ఉన్నా, అది అబ్బక పరీక్షలు తప్పాడు. ఏదో తన్ను ఆవహించిన ఫీలింగ్ లో ఉండేవాడు. దాని నుంచి బయటపడినప్పుడు ఆ విషయాలను తెలియజేసేవాడు. ఏవో కాంతులు మెరుపులు అస్పష్ట ధ్వనులు అపస్మారక స్థితిలో వినిపించేవని చెప్పేవాడు. ఇవి ప్రముఖ అమెరికన్ రచయిత ఎడ్గార్ అలెన్ పో, సెయింట్ తెరెసా, జర్మన్ పో అనిపించుకొన్న ఇ .టి .ఏ .హాఫ్మన్‌ల ఫాంటసీ కథల్లా అనిపించేవి. ఇతన్ని పరీక్షించిన డాక్టర్లు మూర్ఛ లక్షణం కాదని అతని ప్రవర్తన "A plethora vitality"అన్నారు ఇదే క్రమంగా హిస్టీరియో-ఎపిలెప్టిక్" ఎటాక్స్‌గా మారతాయని చెప్పారు. దీనికి తండ్రి చేసిన వైద్య ప్రక్రియ దారుణంగా ఉండేది. రక్తం వచ్చేట్లు కొట్టేవాడు. అన్నం లేకుండా మాడ్చేసేవాడు. ఎప్పుడూ తలనిండా స్నానాలు చేయించేవాడు. ఈ లక్షణం ఫ్లాబర్ట్ బతికి ఉన్నంతకాలం వెటనంటే ఉండిపోయింది పాపం. తల్లి నిరంతరం అతన్ని కనిపెట్టుకొనే ఉండేది. ఇవన్నీ నెర్వస్ వీక్నెస్‌కు, దానినుంచి డిప్రెషన్‌కు దారి తీశాయి. చాలాకాలం తర్వాత జీవితం అంటే తనకు భయమేస్తోందని జార్జ్ సాండ్‌కు తెలుపుకొన్నాడు.

సంపాదించిన సొమ్ముతో తండ్రి క్రాసేట్‌లో ఒక ఇల్లుకొనుక్కొని కుటుంబాన్ని ప్రకృతి సౌందర్య విలసిత ప్రదేశానికి మార్చాడు. ఒకటి రెండుసార్లు తూర్పు దేశ పర్యటనలు తప్ప మిగిలిన కాలమంతా ఫ్లాబర్ట్ ఇక్కడే గడిపాడు. ఒక్కమాటలో చెప్పాలంటే "ఇంట్లోనే ఉండి రాశాడు". కొద్దికాలం తర్వాత తండ్రి కేన్సర్‌తో మరణించాడు . కొన్ని నెలల తర్వాత సోదరి ప్రసవించి చనిపోయింది. ఈ రెండూ కుంగదీశాయి ఫ్లాబర్ట్‌ను. దురదృష్టం వెంటాడుతోంది అని భావించాడు. లోపల ఏదో ఆందోళన భయ పెడుతోంది. మేకుల బూట్లతో మనుషులు విపరీత శబ్దం చేస్తూ మేడ మెట్లు

దిగుతున్నట్లు, సోదరి కరోలిన్ నల్ల వస్త్రదారణతో తలనిండా గులాబీలతో చాలా పొడవుగా కనిపించినట్లు భావించేవాడు.

ప్రాడీర్ స్టూడియోలో గడపటానికి పారిస్ వెళ్ళినప్పుడల్లా లూయీ కోలేట్ ను కలిసేవాడు. అప్పటికే ఆమెకు పెళ్లి అయి ఆరేళ్ళ కూతురుతో ముప్ఫై ఏళ్ళ వయసులో ఉండేది. మనవాడివయసు ఇరవైనాలుగు. ఆమె సెలెబ్రిటి అనిపించేది. భర్త నుండి విడాకులు పొంది ఫిలాసఫర్ ఎకడేమీషియన్ అయిన విక్టర్ కజిన్స్‌కు మిస్ట్రేస్‌గా ఉన్నది. ఆయన ప్రోత్సాహంతో ఆమె అనేక అకాడెమీ ప్రైజులను కవిత్వానికి పొందింది. ఆమె తానను తాను ప్రాచీన గ్రీకు కవయిత్రి సాపోగా భావించుకొనేది. ఆమెను అందరూ గొప్ప ప్రేరకురాలిగా భావించేవారు. కజిన్స్ ఫ్లాబర్ట్‌ను ఆమె అపార్ట్‌మెంట్‌కు ఆహ్వానించాడు. తన కవిత్వాన్ని కమ్మగా చదివి వినిపించి మురిపించింది. ఇలా కొంతకాలం జరిగి ఇద్దరూ ప్రేమలో పడిపోయారు. ఫ్లాబర్ట్‌ను పారిస్ వచ్చి తనతో ఉండి పొమ్మని కోరింది. స్వంత ఇంటినీ ఊరిని తల్లినీ వదిలి వెళ్లాలని పించలేదు ఫ్లాబర్ట్‌కు. "ప్రేమించటం కంటే ప్రేమించబడటం"కు ఫ్లాబర్ట్ ప్రాధాన్యతనిస్తాడు. అప్పుడప్పుడు వెళ్లి లూసీ దర్శనం చేసి సంతృప్తి పడేవాడు. ఆమెతో తరచూ ఉత్తర ప్రత్యుత్తరాలు రాస్తూ ఉంటానని వాగ్దానం చేసి నిలబెట్టుకొన్నాడు ఫ్లాబర్ట్.

లూసీని ఎలా ఎందుకు ఫ్లాబర్ట్ ప్రేమించాడో అర్ధం కాక అతని మిత్రులు జుట్టు పీక్కున్నారు. ఆమె స్వతం ప్రకటనా చాతుర్యంలో దిట్ట అని, అందరి దృష్టిని ఆకర్షించటానికే తాపత్రయ పడుతుందని "she had a natural lack of naturalness" అని బల్ల గుద్ది మరీ చెప్పారు .ఇవేమీ మనవాడికి కనిపించలేదు ఆమె అంటే ఒక విపరీతమైన ఫాసినేషన్ మాత్రమే ఉంది..తండ్రిని ,సోదరిని కోల్పోయి శూన్యం లో బతుకుతున్న ఫ్లాబర్ట్ ను ఆమె "he was sexually aroused .as an un tamed buffello from the wild of America". అయినా ఫ్లాబర్ట్ చాలా జాగ్రత్తగానే వ్యవహరించాడు. మొదటిసారి ఆమెతో ప్రేమ విహార యాత్ర చేసి తిరిగి వచ్చాక "నాకు భౌతిక ప్రేమ రెండవ స్థానం. నేను ఆనందాన్ని కల్గించిన మొదటి స్త్రీవి నువ్వే. ఇంకెవరూ లేరు. చివరిదాకా నన్ను అర్థం చేసుకొంటావని ఆశిస్తున్నాను. నా దారిలో నిన్ను ప్రేమించే అవకాశం ఇవ్వు. నా కోపాలు తాపాలు ఉద్రేకాలు అన్నీ భరించగలవు అనుకొంటాను. నన్ను బలవంతంగా ఏ పనీ చెయ్య నివ్వద్దు. అప్పుడే నేను ఏదికావాలన్నా చేయగలను" అని కుండ బద్దలు కొట్టి సారీ "గుండె బద్దలు కొట్టి" చెప్పేశాడు. ఇలా పూర్తిగా కొనసాగిందో లేదో కాని ఆమె బలవంత పెట్టినప్పుడు సంకోచించాడు, ఆమె బాగా అడ్వాన్స్ అయితే వెనక్కి తగ్గాడు. తన తల్లికి ఇబ్బందికలిగించే ఏ పనీ చేయటానికి మాత్రం సాహసించ లేదు ఫ్లాబర్ట్. ఆమెను తల్లికి తన "లిటరరీ ఫ్రెండ్" అనే చెప్పాడు.

ప్రేమ వ్యవహారాలను గురించి రాసే విషయంలో ఫ్లాబర్ట్ కొంత ఆత్మరక్షణతోనూ కొంత తప్పించుకొనే పద్ధతిలోను రాశాడు. ఎవరు ఎలాంటి వారైనా ఫ్లాబర్ట్ కోరుకొన్నది ఏకాంతమే "ఏ కాంతనూ" కాదు. ఎవరో ఒకరు భార్యగానో మిస్ట్రెస్‌గానో ఉండటం అతనికి నచ్చని పని. తనను తానూ పూర్తిగా పుస్తకాలకే అర్పించుకొన్న వ్యక్తి ఫ్లాబర్ట్" మంచి పరిశుభ్రమైన గది, వెచ్చదనం, కావలసినంత విశ్రాంతి అందుబాటులో అనంతమైన సాహిత్యం ఉంటే నాకు ఇంక ఏమీ అక్కరలేద"న్నాడు. అతన్ని మురిపించటానికి మర్చిపోలేదని తెలియ జేయటానికీ లూసీ అప్పుడప్పుడు కానుకలు, తన బెడ్ రూమ్ స్లిప్పర్లు అనేక రకాల జుట్టు కత్తిరింపులు పంపేది. వీటికి బదులుగా ఫ్లాబర్ట్ ఆమెకు ఏమీ పంపేవాడుకాడు. కొత్త సంవత్సరం గిఫ్ట్ గా "కిస్" అందజేస్తున్నట్లు రాసేవాడు. ఆమెలో "ప్రేమ త్రాచు" బుసలు కొట్టేది. 20 మీద పడినా ఫ్లాబర్ట్ ఇంకా ఒక్క పుస్తకమూ ప్రచురించలేదు. ఆతను ప్రాధమికంగా రచయిత, ఆ తర్వాతే ప్రేమికుడు. సన్నివేశాలు, సంఘటనలు, అనుభవాలు, భావోద్రేకాలు అన్నిటిని జాగ్రత్తగా అక్షర బద్ధం చేశాడు ''మేడం బోవరి'' నవలలో. ఈ రచనా వ్యాసంగంలో పూర్తిగా అంకితమైపోయి ప్రేమకు క్రమంగా దూరమైపోయాడు.

రెండు పుస్తకాలు ''సెంటిమెంటల్ ఎడ్యుకేషన్'', "టెంప్టేష న్స్ ఆఫ్ సెయింట్ ఆంథోని" అన్న పుస్తకాల మీద తీవ్రంగా దృష్టిపెట్టాడు. స్నేహితుడు దూకాంప్‌తో తూర్పు దేశాలు తిరిగి వచ్చాడు. అలేక్సాండ్రియ, నైల్ నది, సిరియా, కాన్ స్టాంటి నోపుల్, రోమ్ మొదలైనవన్నీ తిరిగి చూశారు. తల్లి అనుజ్ఞ ఇచ్చింది. ఈ టూర్ అతని ఆరోగ్యానికి మేలు చేస్తుందని డాక్టర్లు సలహా ఇవ్వగా కొడుకు డిప్రెషన్ లోంచి బయటపడతాడని తల్లి ఆశించింది. చాలాకాలం గడుపుదామనుకొన్నా ఇంటి బెంగపడి త్వరలోనే తిరిగి వచ్చాడు. నార్మండిలో ఉండగా నైల్ నదిని కలగనేవాడు. ఈ పర్యటనకు ముందే దూకాంప్ ను ఇంటికి పిలిపించుకొని తాను రాస్తున్న టెంప్టేషన్స్ చాప్టర్లు చదివి వినిపించాడు. ఇందులో "రోమాం టిజం"ను పీకల్లోతుగా రాశాడు. ఫాంటసీ దట్టించాడు. దీన్నే "ఫాంట స్మ గోరియా ఆఫ్ మిత్స్" అన్నారు. ఇందులో దెయ్యం, రుషి కథ పురాతనమైనదే, నరకతీవ్రతలు, ఒలింపస్ దేవతలు, హిందూ దేవ, దేవతలు, క్రిస్టియన్ మత ప్రీస్టులు, భవిష్యత్ చెప్పే సూద్ సేయర్స్, నాగారాధకులు, అమరవీరులు, అద్భుతాలు స్పినిక్స్ వగైరా మసాలా అంతా దట్టించి నూరాడు. ఇదంతా చదివితే "ప్రోజ్ పోయెం" అన్న అనుభూతి కలుగుతుంది. ఇవన్నీ చదివి వినిపించాడు దూకాంప్‌కు. చదవటం పూర్తవగానే అంతా నిశ్శబ్దమే రాజ్యం చేసింది. చివరికి దూకాంప్ తల ఊపి షేక్ హాండ్ ఇచ్చి "నువ్వు సంగీతం సృష్టించాలనుకొన్నావు. కాని రణగొణ ధ్వని తప్ప ఏమీ సాధించ లేకపోయావు" అన్నాడు. అప్రతిభుడైనాడు కాని దీన్ని ఒప్పుకోలేదు. బౌలీట్ కూడా ఇదే అభిప్రాయం చెప్పాడు. ఏకీభవించని ఫ్లాబర్ట్

ఇరవై ఏళ్ళు అతనితో మాట్లాడలేదు. చివరికి మళ్ళీ తిరగ రాసి ఏడేళ్ళు దాచిపెట్టాడు దాన్ని. 1876 మార్పులు చేర్పులు పూర్తయ్యాక ప్రచురించాడు.
ముప్ఫై వయసులో మన్మధ సౌందర్యంతో చుక్కల్లో చంద్రుడిగా వెలిగిపోయాడు ఫ్లాబర్ట్. లూసీ మళ్ళీ ఊరిస్తూనే ఉంది. అతని తిరస్కారాన్నేమీ లెక్క చెయ్యలేదామె. ముగ్గులో దించే ప్రయత్నం మానలేదు. టటనువ్వు నా హృదయం వెనక గదిలో కొలువై ఉన్నావ్" అని చెప్పి అతని తల్లి కి దగ్గరై ప్రయత్నాలు చేయ ప్రారంభించింది. ఆమె ఉన్న ఇంటికి వెళ్లగా తలుపు దగ్గరే నిలవరించి ఫ్లాబర్ట్ ఆమెను వెనక్కి పంపేశాడు. ఇంతమాత్రం చేత ఆమెకు ఉత్తరాలు రాయటం మాత్రం మానలేదు ఫ్లాబర్ట్. టెంప్టేషన్ "సబ్జెక్ట్ లాంటిదికాక వేరొక ప్రాజెక్ట్ మీద ఆలోచిస్తున్నాడు. ఫ్లాబర్ట్ స్నేహితుడు డాక్టర్ డిలానీ భార్య వలన ఇబ్బందులు పడి ఆత్మహత్య చేసుకోన్నాడని తెలిసి మనసు కలత చెంది నాలుగేళ్ళు బాధా తప్త హృదయంతో గడిపి మేడం బావరి" రాశాడు. అంతకు ముందెన్నడూ చూడని గొప్ప సాహిత్యానికి సృష్టికర్త అనిపించుకొన్నాడు. ప్రపంచంలోనే గొప్ప నవలా రచయిత అని ప్రసిద్ధి చెందాడు. యదార్ధ వాదిగా అవతారం ఎత్తాడు ఫ్లాబర్ట్. దీన్ని చదివి సోమర్సెట్ మాం గొప్పగా స్పందించి "Flaubert created the modern realistic novel and directly or indirectly influenced all writers of fiction since his day. The characters are drawn with consummate skill. It never occurs to us that they are figures in a novel. Homais is a creature as humorous as Mr Micawber as familiar to the French as Micawber is to the English" అన్నాడు.

ఫ్లాబర్ట్‌ను మేడం బోవరీ పాత్ర ఎవరు అని అడిగితే నిర్మొహమాటంగా "Madame Bovary is me" అని స్పష్టంగా చెప్పాడు. ఆ పాత్రలో ఉన్న అన్ని మంచి చెడు లక్షణాలన్నీ ఫ్లాబర్ట్ వే నన్నమాట. ఫ్లాబర్ట్ జీవితంపై రాసిన హేన్రీజేమ్స్ "ఫ్లాబర్ట్ జీవితం ముత్యపు వేటగాని జీవితమే. అంతులేని నిధికోసం ఊపిరి సలపకుండా సాగే కార్యక్రమమే. ఎప్పటికప్పుడు మార్పులు చేస్తూ స్పష్టతనిస్తూ, పునరుక్తిని పరిత్యజిస్తూ రచనకు అందం తెచ్చాడు" అన్నాడు. తగిన మంచి మాట దొరికే వరకూ ఆలోచిస్తూనే ఉండేవాడు. ఒకసారి రెండు దిద్దుబాట్లకు మూడు రోజుల సమయం తీసుకొన్నానని స్వయంగా ఫ్లాబర్ట్ చెప్పాడు. ఏంతో గొప్పగా రెండు లైన్లు చెప్పాలని పరితపించి సాధించాడు. బోవరీ నవల లేటెస్ట్‌దే అయినా అదే అతని ప్రధమ ముద్రణ రచన అయింది. 45 వయసులో దీని విషయమే కోర్టు కేసు నడిచింది. అందులోని కొన్ని చాప్టర్లు అసంబద్ధం అని తొలగించాలని ప్రభుత్వం వాదించింది. ఎమ్మా బోవరి మరణ దృశ్యాలు మరీ ఇబ్బందికరంగా ఉన్నాయన్నారు. దీనికి ఫ్లాబర్ట్ లాటిన్‌లో ఉన్న ఒకే ఒక్క పేజీని ఫ్రెంచ్ భాషలో రాశానే తప్ప తానేమీ అసంబద్ధంగా రాయలేదన్నాడు.

బోవరి రాసి ప్రచురించిన మూడు నెలలకు బాడేలేర్ రాసిన ఫ్లూర్స్ దూ మాల్ ప్రచురింపబడింది.

బోవరిలోని రచనా శైలికి చదువరి పెద్దగా అబ్బురపడ లేదుకాని దానిపై వచ్చిన దుమారంతో బాగా పాప్యులర్ అయింది నవల. జనం నాలుకల మీద ఫ్లాబర్ట్ పేరే నర్తించింది. పాప్యులారిటీ విపరీతంగా పెరిగింది. ఈ ఊపులో "సలమ్బో" నవల ప్రారంభించాడు. దీని ప్లాట్ కోసం ఆఫ్రికా సందర్శించాడు. ఇందులో మొదటి ప్యూనిక్ యుద్ధం కథ ఉంది. తాను రాయబోయే సబ్జెక్ట్‌పై తీవ్ర పరిశోధన చేశాడు వందలాది పుస్తకాలు చదివి అర్థం చేసుకొన్నాడు. ప్లినీ, ధియోడరస్, హెర డోటస్, పసానియాస్, ఫిలస్ట్రాటస్ మొదలైన క్లాసికల్ రచయితల రచనలన్నీ ఆకళింపు చేసుకొన్నాడు. "నా మనసులో యేవో అస్పష్టభావనలున్నాయి. అవి స్పష్టమైన రూపంలోకి రావటానికి చాలాకాలం నిరీక్షించాను" అన్నాడు.

సెంటిమెంటల్ ఎడ్యుకేషన్ పుస్తకాన్ని రాశాడు. ఇరవై ఏళ్ళనుంచి ఆ సబ్జెక్ట్ మనసులో ఉంది. వయసు నలభైలో ఉండగా పబ్లిష్ చేశాడు. ఇందులో "సైంటిఫిక్ రియలిజం"లోకి మళ్ళీ ప్రవేశించాడు. పర్శియన్ ఉన్నత, మధ్యతరగతి జీవుల కథ ఇది. క్రమంగా ఫ్లాబర్ట్ జీవితంలోకి దురదృష్టం దొంగచాటుగా ప్రవేశించిది. యాభైవ పడిలో స్వంత దేశాన్ని ప్రష్యన్లు ఆక్రమించారు. ఫ్రాన్స్ పరాజయాన్ని ప్రపంచ పరాజయంగా భావించాడు. ప్రపంచం అంతమైపోతోందని వ్యధ చెందాడు. అతని దృష్టిలో పగానిజం, క్రిష్టియానిటి, కాంప్లసన్సి (సంతృప్తి) అనేవి మానవ చరిత్రలో మూడు పరిణామాలు (ఇవల్యూషన్స్). 1869లో స్నేహితుడు బౌలేట్ మరణించాడు. "నా ఆలోచనలను నా కంటే విస్పష్టంగా అర్థం చేసుకొన్నవాడు బౌలేట్" అన్నాడు. అతనిమరణం ఆశనిపాతమే అయింది. ఇంతలో తల్లి చనిపోయింది. మరీ కుంగిపోయాడు. విధి క్రూర పిశాచం అన్నాడు. ఎలీషా శ్లీసిన్గర్ మానసిక వ్యాధితో శరణాలయంలో ఉంటే ఫ్లాబర్ట్‌ను అతని నీస్ దగ్గరుండి సపర్యలు చేసింది. ఎమిలీజోలా టర్గనీవ్, మపాసాలు వచ్చి చూసి వెళ్ళారు.

పుస్తకాలలోనే కూరుకు పోయి ఉతర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉన్నాడు ఫ్లాబర్ట్. 55 వయసులో "ఏ సింపుల్ హార్ట్" అనే చిన్న కథ రాశాడు. ఇతరులకోసం జీవిస్తూ, విశ్వాసం, మంచితనం, ప్రేమ గుణం మూర్తీభవించిన వాడి కథ ఇది. బావార్డ్ అండ్ పెకూచేట్ అనే రచనపై తీవ్రంగా కృషి చేస్తున్నాడు. కాని పూర్తిచేసే లోపే మరణించాడు. ఇందులో సగం ఫార్స్ సగం సెటైర్ ఉంది. 56 వయసులో పాత జబ్బులు తిరగ బెట్టాయి. నిత్యం నరకమే అనుభవించాడు. అయినా రచనలో శైలికోసం ఆరాటం మాత్రం మానలేదు. బోవార్డ్ నవల సగం పూర్తయింది, "అపాప్లేక్సీ" జబ్బు వచ్చి ఒక రోజు పనిమనిషి ఆహారం తీసుకోచ్చేసరికి లైబ్రరీలో ఆఖరి శ్వాస పీలుస్తూ ఉన్నాడు.

ఏరకమైన సహాయం అందించే అవకాశం లేకుండాపోయింది. యాభై తొమ్మిదేళ్ళ వయసులో 8-5-1880 వాస్తవ సాహిత్య సృష్టికర్త గుస్టేవ్ ఫ్లాబర్ట్ వాస్తవంగా ఇహలోకాన్ని వీడాడు. పన్నెండు రచనలు చేసి కీర్తి పొందాడు.

సంపూర్ణమైన శైలికి ఫ్లాబర్ట్ ఉదాహరణగా నిలిచాడు. అతని రచనలో రోమాన్స్‌తో బాటు వాస్తవికత కూడా ఉన్నది. చనిపోయిన తర్వాత అతని సాహిత్యకీర్తి మరీ విస్తరించింది. ఫ్రాంజ్ కాఫ్కా కొట్జీ, నేబకోవ్ వంటి ఇరవైవ శతాబ్దపు రచయితలపై ఫ్లాబర్ట్ ప్రభావం బాగా ఎక్కువ. ముఖ్యంగా ఫ్లాబర్ట్ వారసుడు ఫ్రాంజ్ కాఫ్కా అని చెప్పటంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. అందరూ ఒప్పుకొన్న సత్యమే ఇది. "సింగ్యులర్ పోఎటిక్ ఎఫెక్ట్" అనేది ఫ్లాబర్ట్ సాధించిన ఘన విజయం. మేడం బోవరి నవలను మొదట్లో ఎవరూ సరిగ్గా అర్థం చేసుకోలేదు. చనిపోయే నాటికి "ఫ్రెంచ్ రియలిస్ట్ రైటర్"గా ప్రసిద్ధి పొందాడు ఫ్లాబర్ట్. ఇరవైవ శతాబ్దపు అన్ని రంగాలలోని మేధావులు ఫ్లాబర్ట్‌ను పొగడకుండా ఉండలేక పోయారు. అదీ తను సాధించిన అద్భుత విజయం.

Novelists should thank Flaubert the way poets thank spring; it all begins again with him. There really is a time before Flaubert and a time after him. Flaubert decisively established what most readers and writers think of as modern realist narration, and his influence is almost too familiar to be visible. We hardly remark of good prose that it favors the telling of brilliant detail; that it privileges a high degree of visual noticing; that it maintains an unsentimental composure and knows how to withdraw, like a good valet, from superfluous commentary; that it judges good and bad neutrally; that it seeks out the truth, even at the cost of repelling us; and that the author' fingerprints on all this are paradoxically, traceable but not visible. You can find some of this in Defoe or Austen or Balzac, but not all of it until Flaubert"అన్నాడు జేమ్స్ వుడ్ అనే విమర్శకుడు "హౌ ఫిక్షన్ వర్క్స్" గ్రంథంలో.❁



## 12. వాక్సినేషన్, ఫెర్మెంటేషన్ కనిపెట్టిన ఫ్రెంచ్ మైక్రోబయాలజిస్ట్ - లూయీ పాశ్చర్ (1822-1895)

### బాల్యం

నిశ్చయమైన పట్టుదల, అనంతమైన సహనం- కోమల స్వభావి అయిన లూయీ పాశ్చర్‌ను ముందుకు నడిపించి అద్భుతాలు సాధించేట్లు చేశాయి. “'will, work, wait” అనే మూడుమాటలు మంత్రాలుగా అయన కృషికి తోడ్పడ్డాయి. ఫ్రాన్స్ దేశంలో జూరా ప్రాంతం డోల్‌లో 27-12-1822 జన్మించిన పాశ్చర్ తండ్రి నెపోలియన్ సైన్యంలో ఒక సాధారణ సైనికుడిగా “పెనిన్సులర్ వార్”లో పాల్గొన్నాడు. తర్వాత కులవృత్తి అయిన తోళ్ళ పరిశ్రమ (చర్మకార వృత్తి) లోనే ఉండిపోయాడు. తల్లి తోటమాలి కుటుంబంలోంచి వచ్చింది. ఈ దంపతులకు ఇద్దరు కూతుళ్ళు పుట్టినా లూయీ ఒక్కడే ఒక్కగానొక్క కొడుకు. కొడుకు పుట్టిన తర్వాట కుటుంబాన్ని ముందు మార్మోజ్‌కు తర్వాత “టేనరింగ్” పరిశ్రమకు అనుకూలమైన ఆర్బోయిస్‌కు తండ్రి మార్చాడు. ఇక్కడికొచ్చాక లూయీ చదువుపై శ్రద్ధ తగ్గి చేపల వేటలో కాలక్షేపం చేసేవాడు. అక్కడి భౌగోళిక పరిస్థితులను అధ్యయనం చేసేవాడు. అక్కడ ఉన్న నిక్షిప్త నిధి “కోసం అన్వేషించేవాడు. చదువుకంటే బొమ్మలు గీయటం మీద ఆసక్తి ఎక్కువ కనపరచాడు. కొడుకు ఆర్టిస్ట్ అయిపోతాడేమోనని తలిదండ్రులు బాధ పడేవారు.

### చదువు

పారిస్‌లోని సెయింట్ లూయీ సెకండరీస్కూల్‌లో 16వ ఏట చేరాడు. ఇంటి బెంగతో ఇబ్బందిపడి, నిజంగానే జబ్బుపడి “తోళ్ళవాసన ఒక్కసారిపీలిస్తే ఆరోగ్యం కుదుట బడుతుంద” చెప్పి ఇంటికొచ్చేశాడు. స్కూల్ మాన్పించేశాడు తండ్రి. మనవాడి చాక్ పీస్ బొమ్మలూ, ఫిషింగ్, అన్వేషణ మళ్ళీ మొదలయ్యాయి. మళ్ళీ స్కూల్‌కు వెళ్ళాడు. సంతోషించి తలిదండ్రులు అభినందించారు. తండ్రికి కొడుకు గిఫ్ట్ పంపాడు కొన్ని రోజుల తర్వాత. అందుకున్న తండ్రి “నీ గిఫ్ట్ అందింది దీనికోసం ఖర్చుచేసిన

డబ్బు నీదగ్గరే ఉంటె వెయ్యి రెట్లు నీకు ఉపయోగపడేది. స్నేహితులతో సరదాగా హోటల్‌కు వెళ్లి ఆనందించే వాడివి ఇలా కొడుక్కి రాసే తలిదండ్రులు లోకంలో అరుదుగా ఉంటారు కన్నా. నా సంతృప్తి మాటలతో చెప్పలేనిది అని గ్రహించు" అని రాశాడు.

**ఉద్యోగం**

19 వయసులో "స్టూడెంట్– టీచర్" అయ్యాడు పాశ్చర్. జులాయితనం పోయింది. తన జీవితానికి విజయాన్ని నిర్దేశించు కొన్నాడు. ఇదే మొదటిమంత్రం "విల్". అక్కలకు ఉత్తరం రాస్తూ "మనసులో భావించటం గొప్ప విషయం. అప్పుడే కార్యాచరణ, పని అనుసరిస్తాయి. పనిని విజయం అనుసరిస్తుంది. "will open the doors -- work passes them --and success is waiting to crown one;;s efforts" ఇదీ పాశ్చర్ జీవితంలో అనుసరించి విజయాలు సాధించటానికి కీలకమైనాయి. ఇరవైవ ఏట ప్రసిద్ధ కెమిస్ట్ జే. బి.డ్యూమాస్ ఉపన్యాసాలు విని ప్రభావితుడయ్యాడు. బీసంకాన్ లోని రాయల్ కాలేజ్‌లో అసిస్టంట్ మాధమాటికల్ ఇంస్ట్రక్టర్‌గా చేరాడు. అక్కడే చదివి సైన్స్ లో డిగ్రీ పొందాడు. అతని కెమిస్ట్రి ఆసక్తి దీనికి సరిగ్గా సరిపోయింది. 25 వయసులో పారిస్‌లోని ఈకోల్ నార్మేల్ నుండి గ్రాడ్యుయేట్ అయ్యాడు. 1848లో డిజియన్‌లో ఫిజిక్స్ ప్రొఫెసర్ అయి, తర్వాత స్ట్రాస్ బర్గ్ యూనివర్సిటీలో కెమిస్ట్రీ ప్రొఫెసర్‌గా చేరాడు.

**ప్రేమాయణం– పెళ్లి**

ఈ యూనివర్సిటీలో చేరినతర్వాత రెక్టార్ మారెంట్ ప్రభావంలోనూ, ఆయన కూతురు మేరీ ప్రేమలోనూ పడ్డాడు. ఆమెకు తన కుటుంబ విషయాలను ఏమాత్రం దాచకుండా తండ్రి చర్మకారుడని తల్లి చనిపోయిందని అక్కయ్యలే తండ్రిని కనిపెట్టుకొని స్వగ్రామం ఆర్బోయిస్‌లో ఉంటున్నారని తమది దురదృష్టవంతమైన కుటుంబమని, తమ కుటుంబ ఆస్తి యాభై వేల ఫ్రాంకులు మాత్రమేనని, తనకు వచ్చే వాటాను తన అక్కయ్యలకే ఇచ్చేయాలని ఏనాడో నిర్ణయించు కొన్నానని, కనుక ప్రస్తుతం అదృష్ట హీనుడినని, తనకున్నవి ప్రస్తుతం మంచి ఆరోగ్యం, కొద్దిగా ధైర్యం, యూనివర్సిటిలో ఇప్పుడున్న ఉద్యోగం మాత్రమేనని, భవిష్యత్తులో పారిస్‌లో కెమికల్ రిసెర్చ్ చేయాలనే సంకల్పంలో ఉన్నానని, తాను అందులో ఏదైనా ఘనత సాధిస్తే తన తండ్రి తన దగ్గరకు వచ్చి స్ట్రాబెర్గ్‌లో ఉంటాడని, అప్పుడు తన వివాహ విషయం మాట్లాడుతాడని, తనదగ్గర అమ్మాయి ప్రేమించటానికి తగిన ప్రత్యేక విషయం ఏదీ లేదని పూస గుచ్చినట్లు దాపరికం ఏ మాత్రం లేకుండా ఉత్తరం రాశాడు.

ఈ ఇరవై ఆరేళ్ళ కుర్రాడు ఆ అమ్మాయికంటే ఆమె తండ్రి అయిన రెక్టార్‌కు బాగా నచ్చాడు. తండ్రి అనుమతితో ఆమె ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేది. అందులో మనవాడు

తనను తాను కొంచెం కించపరచుకొంటూ రాసేవాడు. తొందరపడి నిర్ణయం తీసుకోవద్దని, తనను అపార్ధం చేసుకోవటమూ తగదని కాలమే తమనిద్దరిని కలుపుతుందని అంతదాకా ఓపిక పట్టటం మంచిదని రాసేవాడు పాస్చర్. మామగారు లైన్ క్లియర్ ఇచ్చి పెళ్ళికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు. 29-5-1848 ముహూర్తం నిర్ణయించారు. మన కుర్ర సైంటిస్ట్ "ప్రయోగం చేస్తూ సగంలో వదిలి పెట్టి రావటానికి ఇష్టపడక "పెళ్లి ముహూర్తానికి ఆలస్యంగా వచ్చి చరిత్ర సృష్టించాడు.

**అనుక్షణ ప్రయోగశీలి**

ప్రయోగాలే జీవిత పరమావధి అయ్యాయి పాశ్చర్‌కు. స్ఫటికాలమీద, సూక్ష్మాతి సూక్ష్మ జీవులమీద ప్రయోగాలు పరిశోధనలు చేస్తున్నాడు. 29లో "టార్టారికాసిడ్", "రేసిమిక్ యాసిడ్"లపై తీవ్రంగా అధ్యయనం చేశాడు. "I shall go to the end of the world. I must discover the source of racemic acid. i must follow up the tartars to their origin"అని నిశ్చయ సంకల్పంతో ఉన్నాడు. ఈ ప్రయోగ పరంపరలోనే "కిణ్వన ప్రక్రియ" అంటే ఫెర్మెంటేషన్ (పులియుట)పై దృష్టి కూడా సారించాడు. 1854లో లిల్లీలోని న్యూ ఫాకల్టి ఆఫ్ సైన్స్‌కు ప్రొఫెసర్ అయ్యాడు పాశ్చర్. ఇక్కడ చేసిన ప్రయోగాలే అద్భుత ఫలితాలనిచ్చి రసాయన శాస్త్ర గమనాన్నే మార్చేశాయి.

**జీవావిర్భావం యాదృచ్ఛిక సంఘటన అన్న సంప్రదాయ వాదం**

ఈ ప్రయోగ ఫలితాలకు పూర్వం "జీవం అనేది యాదృచ్ఛిక ఆవిర్భావం life could originate by spontaneous generation"అన్నదే యదార్ధం అనే నమ్మకంగా ఉండేది. చనిపోయిన లేక కుళ్ళిన పదార్ధాలనుండే జీవులు పుడతాయని నమ్మారు. పూర్వమేదావులైన ఓవిడ్, ప్లిని, లూక్రేటస్, విర్జిల్ వగైరా అందరూ "స్పాంటేనియస్ జెనరేషన్"నే నమ్మారు. అదే తిరుగు లేని నిజం అని చెప్పారు. ఎద్దు మృత కళేబరం నుండి "బీస్" పుట్టినట్లు వర్జిల్ చెప్పాడు. బ్యునాన్ని అనే ఇటాలియన్ శిధిలమైన కర్రలో నుంచి సీతాకోక చిలుకలు ఆవిర్భవించినట్లు చెప్పాడు. వాన్ హెల్మాంట్ ఒక జార్‌లో కుళ్ళిన గుడ్డముక్కల్ని వేసి కొంచెం గోధుమలు, జున్నుముక్కలు కలిపి అందులోంచి ఎవరైనా సరే ఎలుక పిల్లల్ని (మైస్) సృష్టించవచ్చునన్నాడు. ఇవన్నీ పాశ్చర్ మనసులో సుళ్ళు తిరుగుతున్నాయి.

ఒక బిల్డింగ్ కొని దాన్ని పరిశోధనాలయంగా మార్చాడు. మెట్ల కింద ఒక ఒక స్టవ్ ఏర్పాటు చేశాడు. అక్కడే పగలూ రాత్రీ జీవుల సృష్టికోసం ఎదురు చూశాడు. ఫెర్మెంటేషన్‌కు సహకరించే పదార్ధం కోసం అన్వేషిస్తున్నాడు. ఆల్ప్స్ పర్వతాలు ఎక్కి ఎత్తు పెరిగిన కొద్దీ జీవరాశి తక్కువగా ఉన్నట్లు పరిశోధించి తెలియజేశాడు.

**జీవం నుండే జీవం పుడుతుంది అన్న పాశ్చర్**

వయసు నలభైలో యెడ తెగని పరిశోధనలలో మునిగి తేలాడు. "జీవరాసి ఆవిర్భావం యాదృచ్ఛిక సంఘటన కాదు" అని రుజువు చేయటమే లక్ష్యంగా ఉన్నాడు. జీవం అంటే ఒక సూక్ష్మ జీవి (జర్మ్), కనుక జీవించిన దానినుండే మరొక జీవి ఆవిర్భవిస్తుంది అని భావించాడు. సంప్రదాయవాదులు ఈ సిద్ధాంతాన్ని అంగీకరించలేదు. పాశ్చర్ పరిశోధనా ఫలితాలు ఒక మాకరి అంటే ఎగతాళి, వెక్కిరింపు అని ఈసడించారు. వీటిని వేటినీ లెక్క చేయలేదు. అమితమైన ఓపిక పట్టాడు. సంయమనం పాటించాడు. ఈ లోగా తన సంకల్ప బలాన్ని నమ్మి ముందుకే వెళ్ళాడు. "A man of science may hope for what may be said of him in the future but he can not stop to think of the insults --or the compliments --of his own day" అన్న జీవిత సత్యాన్ని చెప్పాడు. ఇది అందరికి ఆదర్శనీయం, అనుసరణీయం.

**పట్టు పరిశ్రమను కాపాడిన తీరు**

ఆ సమయంలో ఫ్రాన్స్ దేశంలో పట్టు పరిశ్రమ పట్టుపురుగులకు సోకిన వ్యాధులవల్ల బాగా దెబ్బతినిపోయింది. నష్టాలతో బెంబేలెత్తి పోయారు. సుమారు మూడు వేలమంది "సేరి కల్చరిస్టులు దీనిపై ఆలోచించి పరిష్కారం కనుక్కొనే ప్రయత్నం లో ఉన్నారు. అందులో పాశ్చర్ గురువు. సెనేటర్ పాశ్చర్‌ను ఈ కల్లోలం గురించి ఆలోచించమని కోరాడు. దానికి సమాధానంగా పాశ్చర్ వాళ్ళ కోరిక మంచిదేనని ఉన్నతమైనదేనని కాని తాను అంతవరకూ పట్టు పురుగును చూడనైనా చూడలేదని తెలిపాడు. స్వయంగా రంగంలోకి దిగి పట్టు పరిశ్రమ కేంద్రాలు చూసి పట్టుపురుగుల పెంపకాన్ని వాటికి వచ్చే వ్యాధులకు వారు వాడుతున్న ఫలితాలనివ్వని మందులనీ పరిశీలించాడు. పట్టుగుడ్లను లార్వాను పురుగులను సేకరించి అధ్యయనం సాగించాడు. వెంటనే పరిష్కారం సూచించలేదు. ముందుగా జబ్బుపడ్డవాటినుంచి ఆరోగ్యకరమైన వాటిని వేరు చేయించాడు. విత్తన వ్యాపారస్తులు పాశ్చర్ చర్యలను విమర్శించారు. కొందరైతే ఆయనమీద రాళ్ళే విసిరారు. వీటినన్నిటికీ చాలా ఓపికగా భరించి వాళ్ళతో "మీరు సంయమనం పాటించాలి. నాతొ పాటు ఇక్కడే ఉండిచూడండి" అన్నాడు. పాశ్చర్‌కు నాలుగేళ్ళు పట్టింది వ్యాధికి కారణం కనుక్కోవటానికి. లక్షణాలను రికార్డ్ చేసేవాడు. వ్యాధి సోకిన వాటిని వేరు చేసి ఆరోగ్యవంతమైన వాటి నుండి కొత్త విత్తనాలు అభివృద్ధి చేశాడు. చివరికి కథ సుఖాంతమై జబ్బుల నుండి పట్టుపరిశ్రమను కాపాడగలిగాడు. దీనినే "పాశ్చర్ సీడింగ్ ప్రాసెస్" అన్నారు. ఏ ఇబ్బందీ జబ్బూ లేని పట్టుకాయలను (కకూన్స్) ఏర్పరచటమే "పట్టు పంట" అని రుజువు చేశాడు. ఈ పద్ధతిలో పట్టు పురుగులను పెంచి మొదటి సారిగా లాభాలు గడించటానికి 10 ఏళ్ళ సమయం పట్టింది.

అదే పాశ్చర్ చెప్పిన రెండవ మంత్రం "wait".

**కుటుంబంలో విషాదం**

"ఈ ఫలితాలు సాధించే కాలంలో ఆతను ఎన్నో కుటుంబ వ్యధలను బాధలను అనుభవించాడు. పెద్దకూతురు జీనే టైఫాయిడ్‌తో మరణించింది. రెండేళ్ళ చిన్న పిల్ల కామిల్లీ అంతుపట్టని జ్వరానికి లోనైతే, పన్నెండేళ్ళ సిసిలీ టైఫాయిడ్ జ్వరం వచ్చి కొన్ని రోజులకే చనిపోయింది. పాశ్చర్‌కు "సెరిబ్రల్ హేమరేజ్ వచ్చి పాక్షికంగా పక్షవాతం వచ్చి ఎడమ బుజం కదల్చలేక పోయే వాడు. దాన్ని గురించి చెబుతూ "నా ఎడమ భుజం సీసం ముక్కలా మొద్దుబారి పోయింది ఎవరైనా దాన్ని కోసేస్తే బాగుండును" అన్నాడు అప్పటికే అధికశ్రమ చేసి ఉండటం ఈ కుటుంబ మరణాలు కలత చెందించాయి. కుంగి పోయాడు. కాని మానసికంగా కుంగిపోకుండా ఉండటానికి స్మైల్స్ రాసిన "సెల్ఫ్ హెల్ప్ ",బాసూట్ రాసిన" "ఆఫ్ ది నాలెడ్జ్ ఆఫ్ గాడ్ అండ్ ఆఫ్ సెల్ఫ్" గ్రంథాలు చదివి ఉత్తేజం పొందేవాడు.

**పాశ్చ రైజేషన్**

నలభైవ పడిలో పాశ్చర్ కనపడటమే ఒక శక్తిగా భావన పొందేవారు జనం. ముఖంలో ప్రశాంతత, కళ్ళల్లో కాంతితో రగులుతున్న శక్తి కేంద్రంగా కనిపించేవాడు. పరిశోధనలను కొనసాగిస్తూ "మైక్రోస్కోపిక్ జీవులను" కనిపెట్టాడు. అవే సారాయి అమ్లాన్ని, తయారు చేస్తాయని చెప్పాడు. అయితే దాన్ని తాగలేమన్నాడు. వైన్‌ను వేడి చేసి అన్నిరకాల వ్యాదులనుండి కాపాడతానని చెప్పి, దాన్ని కొద్దినిమిషాలు 50-60 డిగ్రీల సెంటి గ్రేడ్ వద్ద ఉంచాడు. ఈ ప్రక్రియే తత్వాత "పాశ్చరైజేషన్" అన్న పేరును పొందింది. దీనితర్వాత "బీరు"లో ఉండే హానికరమైన సూక్ష్మజీవులు వాటివలన మానవులకు కలిగే వ్యాధులుపై ద్రుష్టి సారించాడు. ప్రతి విషయాన్ని నోట్‌బుక్‌లో వివరంగా రికార్డ్ చేశాడు. ఇలాంటి జీవులు మనుషులలోనూ జంతువులలోను ఉండవచ్చునని ఊహించాడు. కాని తన భావాలను తెలియ జేస్తూ "if we are inclined to believe that it is so because we think it likely, let us remember before we affirm it, that the greatest disorder of the mind is to allow the will to direct the belief" అని జాగ్రత్త పడ్డాడు.

**యుద్ధ సైనికుడైన కొడుకును కలుసుకొన్న దృశ్యం**

వైన్‌లో బీరులో, మానవులలో ఉండే వైరస్‌లనుండి ఫెర్మెన్టేషన్‌ను చేసే ప్రక్రియపై అధ్యయనం చేసేముందు 1870 యుద్ధం ఎన్నో అవాంతరాలను కలిగించింది. ఒక్కగానొక్క కొడుకు యుద్ధంలో పాల్గొన్నాడు. ఎక్కడున్నాడో అతని జాడ తెలియలేదు. తానే స్వయంగా వెదకటానికి బయల్దేరాడు. రోడ్లన్నీ పరాజిత సైనికులతో, క్షతగాత్రులతో

నిండి ఉన్నాయి. కాలు కదిపేట్లు లేని దృశ్యం. దారిలో తనకొడుకు పనిచేసే స్టాఫ్ ఆఫీసర్ కనిపించి అబ్బాయి క్షేమంగానే ఉన్నాడన్న వార్త తెలియజేయగా ఊరట కలిగింది. అయినా అతనెక్కడున్నాడో వెతుకుతుంటే దారిలో చచ్చిపడి ఉన్న గుర్రాలు, మనుష్యుల పోగులు హృదయ విదారకంగా ఉన్నాయి. చివరికి నీరసంతో శక్తి కోల్పోయి, జీవచ్ఛవంగా ఉన్న కొడుకును కలుసుకొన్నాడు తండ్రీ కొడుకులు విపరీతమైన ఉద్విగ్నతకు లోనైనారు. అది భీకర కల్లోల కాల సముద్రంలో ఒక చిన్న ఆనందపు అల లాగా అనిపించింది.

**స్టెరిలైజేషన్**

ఈ యుద్ధ సైనికుల అకాల మరణాలు హాస్పిటల్‌లో జరిగే మరణాలకంటే వేగంగా తీవ్రంగా ఉన్నట్లు గమనించాడు పాశ్చర్. దాన్ని "A pin prick is an open door to Death" అన్నాడొక ఫ్రెంచ్ సర్జన్. గాయపడిన వారికి ఆపరేషన్ చేస్తుంటే ఫలించటం లేదు, మరణిస్తున్నారు. దీనితో అసలు ఆ జోలికే వెళ్ళకుండా డాక్టర్లు నిస్తేజులయ్యారు. ఇన్ఫెక్షన్‌ను ఆపలేని పరిస్థితి ఏర్పడింది. పాశ్చర్ ఇప్పుడు దీన్ని గురించే తీవ్రంగా ఆలోచించసాగాడు. గాయాలకు డ్రెస్సింగ్ యెంత ముఖ్యమో, వాటికి వాడే పరికరాలు బాండేజేస్‌లను పెర్ఫెక్ట్‌గా "స్టెరిలైజేషన్" చేయాల్సిందేనని సూచించాడు. లేకపోతే ఇన్ఫెక్షన్‌ను అరికట్టలేమని వివరించాడు

మైక్రోబ్స్ గుర్తింపుఃఆధునిక శస్త్ర చికిత్సకు ప్రివెంటివ్ మెడిసిన్‌కు మార్గదర్శనం. అంతకు ముందే జోసెఫ్ లిస్టర్ పాశ్చర్‌కు జాబు రాస్తూ అతని సూక్ష్మక్రిముల పరిశోధనను శ్లాఘిస్తూ, ప్రస్తుత ఉపద్రవం అయిన ఇన్ఫెక్షన్‌పై పాశ్చర్ దృష్టిని బలపరచాడు. దీనిని పూర్తిగా సాధించటానికి "యాంటి సెప్టిక్ సిస్టం" చాలా అవసరమని తెలిపాడు. దీని అంతు తేల్చాలని తీవ్ర ఆలోచన చేశాడు పాశ్చర్. ఆక్సిజన్ కాని వేరే ఇతర వాయువుకాని ఈ ఇన్ఫెక్షన్‌కు కారణం కాదని, గాలిలో వేలాడే సూక్ష్మాతి సూక్ష్మ జీవులే దీని వ్యాప్తికి కారణమని పాశ్చర్ కనిపెట్టాడు. ఇదే "ఆధునిక శస్త్ర చికిత్స"కు ద్వారాలు తెరచింది. "ప్రివెంటివ్ మెడిసిన్"కు నాంది పలికింది.

**వాక్సిన్**

యాభై అయిదు వయసులో పాశ్చర్ చాలా ప్రసిద్ధ వ్యక్తి అయ్యాడు. క్షణం తీరిక లేకుండా బిజీ అయ్యాడు. సాధించినవాటి గురించి ఎక్కువ ఆలోచించరాదు అన్నది ఆయన సిద్ధాంతం. ఇంకా సాధించాల్సింది ఎంతో ఉన్నదన్న భావనతో శ్రమించేవాడు. ఇప్పుడు చూపు అంతా బాక్టీరియాలజీ మీదనే కేంద్రీకరించాడు. దీనికి కారణం గొర్రెలకు ఒక కొత్త ప్లేగులాంటి జబ్బు వచ్చి తుడిచుపెట్టుకు పోయాయి. వందలో ఇరవై ఈ వ్యాధికి గురై చనిపోయాయి. ఈ జబ్బును "స్ప్లీనిక్ ఫీవర్" లేక యాంత్రాక్స్ అన్నారు.

కొన్ని జిల్లాలలో చనిపోయిన గొర్రెల శాతం ముప్పై నుంచి నలభై దాకా ఉంది. దీనిపై అధ్యయనం చేయటానికి పాశ్చర్ "చార్ట్రేస్"కు వెళ్ళాడు. వ్యాధితో చనిపోయిన గొర్రెల కళేబరాల నుండి రక్తం తీసి గినియా పందులకు, చిట్టెలుకలకు ఎక్కించాడు. మళ్ళీ దీనిపై వైద్య బృందం తీవ్రంగా విరుచుకుపడింది పాశ్చర్ మీద. పాశ్చర్ చేసిన ఈ "జర్మ్ థీరీ"ని వారు వ్యతిరేకించారు. మతాదిపతులూ వారికి వంతపాడారు. ఒక మినిస్టర్ గారు ఇంకొంచెం ముందుకు వెళ్లి పూర్వం ఈజిప్షియన్‌లను శిక్షించటానికి భగవంతుడు ఇలాంటి ప్లేగు వ్యాధినే కలిగించాడు అన్నాడు. దేనికీ చలించని పాశ్చర్ తానూ చేబట్టే ప్రక్రియలో రక్తం ఎక్కించబడిన జంతువులలో "యాంటి బాడీస్" ఏర్పడి రోగకారక సూక్ష్మ జీవులతో యుద్ధం చేసి సంహరిస్తాయని చెప్పాడు. దీనిపై అనేక పరిశోధనలు చేశాడు. చివరికి ఒక కల్చర్‌ను సాధించాడు. ఇందులో ఆ వ్యాధి కారకాలు చాలా స్వల్పంగా ఉండేట్లు రూపొందించాడు. ఇవి ఆ జీవుల్ని చంపటానికి బదులు రక్షించటానికి తోడ్పడుతాయని రుజువు చేశాడు. ఈ వైరస్‌ను ఒక వాక్సిన్‌గా రూపొందించి గొర్రెల ప్లేగు వ్యాధికి గొప్ప మందు తయారు చేశానని ప్రకటించి తన లక్ష్యాన్ని నేరవేర్చుకొన్నాడు.

**అరుదైన గౌరవం**

1881లో ఈ సీరంను యాన్ థ్రాక్స్ బారిన పడిన 25 గొర్రెలకు ఇంజెక్షన్‌గా ఇచ్చాడు. అవన్నీ మళ్ళీ ఆరోగ్యాన్ని పొంది సజీవంగా నిలిచి వైద్య చరిత్రలో ఆశ్చర్యాన్ని కలిగించాయి. పాశ్చర్ కల సాకారమైంది. పాశ్చర్ సాధించిన ఈ ఘన విజయం సంపూర్ణమైనదే కాదు, నవ్యాతి నవ్యమైనది. వైద్య చరిత్రనే తిరగ రాసిన అపూర్వ ఘట్టమై చరిత్రలో నిలిచిపోయింది. ఆయన్ను వ్యతిరేకించిన వారంతా ఇప్పుడు వచ్చి వీరాభిమానులై శిష్యులైపోయారు. ఫ్రాన్స్ ప్రభుత్వం ఈ ఘన విజయాన్ని గుర్తించి "లీజియన్ ఆఫ్ ఆనర్" ఇచ్చి సత్కరించింది. ఫ్రెంచ్ అకాడెమీలో ఏర్పడిన "ఇమ్మో ర్టల్ సిర్కిల్"కు ఎన్నికయ్యాడు. ఈ సిర్కిల్ పాశ్చర్‌ను ప్రముఖ రచయిత అలెక్సాండర్ డ్యూమాస్‌ను సందర్శించమని కోరితే డ్యూమాస్ తానే వచ్చి పాశ్చర్ సందర్శనం చేస్తానని చెప్పి వచ్చాడు. పాశ్చర్‌కు కృత్రిమ పొగడ్తలు మెచ్చులూ మెహర్బానీలు నచ్చవు. వీటికి సహజంగా దూరంగానే ఉంటాడు.

**హైడ్రోఫోబియాకు మందు**

"సాధంచిన దానికి సంతృప్తిని చెందీ అదే విజయమని అనుకోకోయ్" అన్న శ్రీ శ్రీ పాటకు తగ్గట్లే పాశ్చర్ జీవిత విధానం ఉండేది. ఆనాడు అందర్నీ భయ పెట్టిన జబ్బు హైడ్రో ఫోబియా. ఇది ఆంత్రాక్స్ కంటే ప్రమాదమై పోయింది. పిచ్చి కుక్క కరచిన వాడికి వారం రోజుల దాకా ఏ ప్రమాద లక్షణాలు కనిపించవు. ఆ తర్వాత లక్షణాలు

బయటపడి దారుణంగా ఉంటాయి. స్థిరంగా ఉండలేక పోవటం, ఊపిరి పీల్చలేకపోవటం లోపలికి ఏదీ తీసుకోలేక పోవటం మింగుడు పడక పోవటం, మూర్ఛ, అపస్మారకం మొదలైనవాటికి గురై చివరికి చనిపోవటం జరిగేది. దీనికి విరుగుడు కనిపెట్టాలనుకొన్నాడు పాశ్చర్. ముందుగా రోగకారక క్రిమిని వేరు చేసి దానితో రోగ జీవుల్ని సమర్ధవంతంగా చంపగలిగే కల్చర్ తయారు చేసే పనిలో పడ్డాడు. ఆయన దగ్గరకు రెండు పిచ్చి కుక్కల్ని తెప్పించాడు. వాటి పళ్ళను రంపాలతో కోయించేశాడు. చాలా జాగ్రత్తగా తానే భయం లేకుండా మాలిమి చేసుకొన్నాడు. గినియా పందులకు కుందేళ్ళకు ఈ వ్యాధికారక "రేబిస్" ఇంజెక్షన్ ఇచ్చాడు. ఈ రేబిస్ వల్లనే పిచ్చికుక్క కరిచినపుడు విషం మానవ శరీరంలోకి ప్రవేశించి నీటి భయం అంటే హైడ్రో ఫోబియా ఏర్పడ్తుంది. పాశ్చర్ చేసిన సాహసాన్ని వర్ణించాడు ఒక బయాగ్రఫార్ "ఒక రోజు పాశ్చర్ ఒక పిచ్చికుక్క నుంచి చొంగ (సలైవా) సేకరించే ప్రయత్నంలో ఉన్నాడు. ఇద్దరు అసిస్టంట్‌ల చేత ఒక పిచ్చెక్కిన బుల్ డాగ్‌ను బాగా చొంగ కారుస్తుండగా బోనులో నుంచి బయటికి తీయించి ఒక టేబుల్ మీద దాన్ని పదుకో బెట్టించి తన పెదవులమధ్య ఒక రబ్బరు గొట్టం కొనను ఉంచుకొని రెండవ కొనను ఆ పిచ్చి కుక్క మూతి దగ్గర పెట్టి దాని ప్రమాద భరిత సలైవాను పీల్చి ఒక గ్లాసులోకి పట్టాడు. ఒళ్ళు గగుర్పొడిచే సన్నివేశమిది.

ఒక ఏడాదిదాకా తన ప్రయోగ ఫలితాలను బయట పెట్టలేదు. సందిగ్ధంలో ఉన్నాడు. 1885లో పిచ్చి కుక్క కాటుకు విపరీతంగా రక్తం కారుతున్న ఒక ఆల్సేషియన్ కుర్రాడిని పాశ్చర్ లేబరేటరీకి తీసుకొచ్చారు. ఆ కుర్రాడి పరిస్థితి చూసి పాశ్చర్ చలించిపోయాడు. వణికి పోయాడు కూడా. ఇంతవరకు మనుషులకెవరికీ ఆపరేషన్ చేయలేదు పాశ్చర్. తాను తయారు చేసిన సీరం ప్రభావం ఎంతో తెలీదు. ఆపరేషన్ చేస్తే తర్వాత పరిస్థితి ఏమవుతుందో సందేహం. ఇక ఉపేక్షించి మీన మేషాలు లెక్క పెడుతూ కూర్చోవటం మంచిదికాదని ఆకుర్రాడి దయనీయ పరిస్థితికి ఏదో చేసి ప్రాణం కాపాడాలని నిశ్చయానికి వచ్చి తాను సేకరించిన సీరంను రోజుకు ఒకసారి వంతున పది రోజులు ఇంజెక్షన్‌గా ఆకుర్రాడికి ఇచ్చాడు. ప్రతిరోజూ డోసు పెంచి చేశాడు. కుర్రాడి పని కొద్దిగా ఆశాజనకంగా కనపడింది. రాత్రులు పాశ్చర్‌కు కంటి మీద కునుకు ఉండేది కాదు. కుర్రాడు ఆయాసపడేవాడు. చేతులారా వాడిని చంపేస్తు న్నానేమోనని బాధ పడేవాడు. నెల రోజుల నిరంతర ప్రక్రియ వలన ఆ అబ్బాయి బతికి బయట పడ్డాడు. హైడ్రో ఫోబియాకు విరుగుడుగా గొప్ప మందు కనిపెట్ట గలిగానని అప్పుడు ధైర్యంగా ఉత్సాహంగా ప్రకటించాడు పాశ్చర్ మహాశయుడు. అదీ ఆయన సహనం.

**గుర్తింపు - గౌరవం**

ఈ సంఘటన దేశమంతా ప్రచారమైపోయింది. ఇప్పటికే ఫ్రాన్స్ ప్రజల ఆరాధ్య దైవం అని పించుకొన్న లూయీ పాశ్చర్‌ను అనేక విశేషణాలతో కీర్తించటం ప్రారంభించారు జనం. "రక్షకుడు, ప్రాణదాత, భయంకర వ్యాధుల పాలిటి కాల యముడు. చావునుండి తప్పించే దైవం" అన్నారు. దేశ విదేశాలలో పాశ్చర్ పేరు మారు మోగింది ఆయన కీర్తి దిక్కులదాకా విస్తరించింది. సైంటిస్టులు డాక్టర్లు అందరూ వచ్చి అభినందించారు. ఆయన్ను తమ "మాస్టర్"అని గౌరవించారు. వారందరికీ "అపోజిల్"గా అంటే "ప్రవక్త"గా ఉండమని ప్రాధేయ పడ్డారు. "ది న్యూ యార్క్ ట్రిబ్యూన్" ఒక కాలం రాయటం ప్రారంభించి వర్కింగ్ క్లాస్ పిల్లలకు ట్రీట్మెంట్ కోసం పాశ్చర్ దగ్గరకు పారిస్‌కు పంపింది. ఇంగ్లాండ్ నుంచి రేబిస్ బాధితులు వచ్చి పాశ్చర్ ఇల్లంతా నిండిపోయారు. అలాగే హంగేరి, స్పెయిన్, హాలండ్ రష్యాల నుండి వ్యాధి గ్రస్తులు వచ్చి ట్రీట్మెంట్ చేయించుకొని జబ్బు నయమై నవ్వు ముఖాలతో స్వదేశాలు చేరేవారు. ఈ దేశాల వారికి తెలిసిన ఒకే ఒక ఫ్రెంచ్ మాట ఏమిటో తెలుసా? "పాశ్చర్" అన్న ఒకే ఒక్కమాట. అంతగా పాప్యులర్ అయ్యాడు పాశ్చర్.

14-11-1887లో "పాశ్చర్ ఇన్ స్టి ట్యూట్" ఏర్పడింది. ఎందరో దాతలు ఎన్నో దేశాలు విరాళాలిచ్చి దానికి తోడ్పడ్డారు. రష్యా ఎంతో ఆర్ధిక సాయం అందించింది. బీద జనం లెక్కలేనంత మంది ముందుకొచ్చి విరాళాలు అందజేశారు. అయిదేళ్ళ తర్వాత పారిస్‌లోని సార్బోనే థియేటర్‌లో అసంఖ్యాకంగా అనేక సైంటిఫిక్ సోసైటీలవారు, ఫ్రెంచ్ అకాడెమీ సభ్యులు, స్థానిక ప్రొఫెసర్లూ, విదేశీ ప్రముఖులు హాజరై పాశ్చర్‌ను ఘనంగా సన్మానించి ప్రతిభా విశేషాలను కీర్తించారు. ఎంతో మంది శ్లాఘించినా అందులో లిస్టర్ చెప్పిన "శతాబ్దాల కాలం నుండి ఇన్ఫెక్షన్ బారిన పడిన వారి కష్టాలకు తెర వేశావు. పుండ్లకు చేసే చికిత్సకు కొత్తపద్ధతిని ప్రవేశ పెట్టావు. నీ నిరంతర పరిశోధన చీకటిలో ఇప్పటిదాకా మగ్గిపోయిన సర్జరీపై కొత్త వెలుగులు ప్రసరింప జేశావు'' అన్నమాటలు చిరస్మరణీయాలుగా నిలిచిపోయాయి. ఉద్విగ్న భరితంగా ప్రసగించిన లిస్టర్ పాశ్చర్ దగ్గరకు వెళ్లి ఆప్యాయంగా కౌగిలించుకోవటం చారిత్రాత్మక ఘట్టమే అయింది. ఇద్దరూ పసి పిల్లలై ఆప్యాయాన్ని ఆత్మీయతను ప్రేమను ఆరాధనను పంచుకొన్నారు.

**టాక్సిన్స్ - యాంటి టాక్సిన్స్**

రెండేళ్ళ తర్వాత పాశ్చర్ టాక్సిన్ యాంటి టాక్సిన్‌లపై పరిశోధన చేశాడు. డిఫ్తీరియా వ్యాధికి మందు కని పెట్టే ప్రయత్నంలో ఉన్నాడు. అకస్మాత్తుగా పాశ్చర్‌కు "యురేమిక్ పాయిజనింగ్'' జరిగింది. రెండునెలలు చాలా ఇబ్బంది పడ్డాడు. చావుకు

దగ్గరయ్యాడేమో ననిపించింది. కొంచెం కుదుటపడ్డాక. డాక్టర్ల సలహా మేరకు లేబరటరీకి వెళ్లి శిష్యుల పరిశోధనా ఫలితాలను తెలుసుకోనేవాడు. ఇక పాశ్చర్ పరిశోధనా శకం ముగిసినట్లే. పాశ్చర్ ఇన్నిట్యూట్ బయట లాన్‌లో తాపీగా కూర్చునేవాడు. తన స్వగ్రామం విల్లెనీవ్ యిటాంగ్‌కు వెళ్లి విశ్రాంతి జీవితం గడిపాడు. రేబీస్‌పై ఇంకా పరిశోధన చేయాలి.

**ప్రాణదాత మరణం**

గుర్రపు శాలల్లో ఉంటూ డిఫ్తీరియా వ్యాధి మందుకోసమే ఆలోచించేవాడు. అవే పరిశోధనాలయాలయ్యాయి. క్రమంగా ఆరోగ్యం తగ్గిపోతోంది. 75 వచ్చేసరికి మృత్యు సమీపాన ఉన్నాడు, మాట్లాడలేక పోతున్నాడు. సెప్టెంబర్ నాటికి తలకూడా కదల్చలేని బలహీనుడయ్యాడు. పాలకప్పు అందిస్తే తాగలేనని తల ఊపేవాడు. దిండుమీద వాలిపోయేవాడు. ఇరవై నాలుగు గంటల కాలం కోమాలో ఉండి 28-9-1895 జీవరాశికి ప్రాణదానం చేసిన ప్రాణదాత లూయీ పాశ్చర్ 73 వ ఏట మరణించాడు. ఎనిమిది గ్రంథాలు రాశాడు.

కొన్నేళ్ళ తర్వాత ఫ్రెంచ్ ప్రజల హీరో ఎవరు అని ఒపీనియన్ పోల్ సేకరిస్తే లూయీ పాశ్చర్ మొట్ట మొదటి వ్యక్తిగా నియంత నెపోలియన్ అయిదవ వ్యక్తిగా నిలిచారు. అంతగా ప్రజా హృదయాలలో చోటు దక్కించుకొన్న చరితార్థుడు పాశ్చర్. ఫ్రాన్స్ జాతీయ నాయకుడుగా గుర్తింపు పొందాడు "worship the spirit of criticism. Without it, every thing is fallible. It always has the last word" అన్న మహా వ్యక్తి పాశ్చర్. మానవ జీవితాన్ని రెండుమార్గాలు ప్రభావితం చేస్తాయి ఒకటి రక్తపాతం, చావు. ఇవి ఎప్పుడూ వినాశానాన్నే కోరతాయి. దేశాలమధ్య విద్వేషాలు పెంచి ఎప్పుడూ యుద్ధానికి సన్నద్ధం చేస్తాయి. రెండవ మార్గం శాంతిమార్గం. ఇందులో పని, ఆరోగ్యం, సృజన, కొత్తమార్గాలు కనిపెట్టి మానవ ఉపయోగానికి తోడ్పడటం ఉంటాయి. మొదటిమార్గం హింసాత్మక విజయం. రెండవది మానవాళికి మనశ్శాంతిని, ఉపశాంతినీ కల్గించేది. ఇందులో ఏది చివరిదాకా నిలుస్తుందో దేవుడే చెప్పగలడు. కాని "science will have tried, by obeying the law of humanity to extend the frontiers of life" అన్నది శాంతి కాముకుడు, ప్రజా సంక్షేమంమూ కోరే లూయీ పాశ్చర్ అభిప్రాయం. అదే మానవాళికి శ్రేయోదాయకమైన మార్గం.❋



## 13. వాస్తవికత పిత, ఆధునికతకు ఆద్యుడైన నార్వేజియన్ నాటక రచయిత - ఇబ్సెన్ (1828 -1906)

**పరిచయం**

ఆధునికులకు ఇబ్సెన్ రచనలలో సమకాలీన సమాజంలో పాతుకు పోయిన వాటిని కూల్చే సెన్సేషన్ కనిపించాడు. ఆయన తీర్చిన పాత్రలు తన ప్రభావానికి లోనైన బెర్నార్డ్ షా, చెకోవ్, పిరాండేల్లో సృష్టించిన పాత్రల్లకు భిన్నంగా సర్వ సాధారణంగానే ఉంటాయి. సంప్రదాయానికి బద్ధుడుగా కనిపిస్తాడు. అంగీకరించిన నిజాలకు నిజరూపాలుగా మాత్రలను మలిచిన నేర్పు ఇబ్సెన్ స్వంతం. కాని 19వ శతాబ్దపు చివరి భాగంలో ఇవే మిరుమిట్లు గొలిపాయి ఊహాతీత విజయాలకు కారణమయ్యాయి.

**సంకీర్ణ కుటుంబ నేపథ్యం**

హెన్రిక్ ఇబ్సెన్ 20-3-1828న నార్వే దేశపు దక్షిణభాగాన ఉన్న స్కీన్‌లో జన్మించాడు. అతని కుటుంబం స్కాండినేవియన్, ట్యుటోనిక్, గేలిక్ మిశ్రమ సంజాతం. తండ్రి తరపు పూర్వీకుడొకాయన డేనిష్ జాతికి చెందిన నౌకా కెప్టెన్. ఇంకోకాయన స్కాటిష్ రక్త సంబంధీకుడు. తల్లి జర్మన్ జాతికి చెందింది. మొదటి నుండీ ఇబ్సెన్ కుటుంబం సంపన్న తరగతికి చెందిన వారే. ఇబ్సెన్ తండ్రి సమాజంలో గౌరవ ప్రతిష్టలున్న ముఖ్య వ్యక్తి. ఆర్థికంగా సుస్థిరుడు.

**తండ్రి దివాలా - కుటుంబ ఆర్థికం ఛిద్రం**

దురదృష్ట వశాత్తు ఇబ్సెన్ ఎనిమిదవ ఏట తండ్రి దివాలా తీశాడు. భవిష్యత్తు కోసం వేసిన ప్రణాళికలు దెబ్బతిని జీవితం అంధకార బందురమైంది. గత్యంతరం లేక విలాస వంతమైన భవనం నుండి కుటుంబాన్ని మురికి కూపంగా ఉండే వ్యవసాయ క్షేత్రానికి మార్చాల్సి వచ్చింది. కుర్రాడైన ఇబ్సెన్ మనస్సులో ఈ ఆర్థిక కల్లోలం, అసమానత ముద్రగా పడ్డాయి. వీటినే ఆధారంగా చేసుకొని తార్వాతి కాలంలో.

"డాల్స్ హౌస్", "జాన్ గేబ్రియల్ బార్క్ మన్", "దివైల్డ్ డక్" నాటకాలు రాశాడు.

**మందులషాపులో పని - సెటైర్ కవిత్వ రచన**

తండ్రి అసమర్థతపై ఇబ్సెన్‌కు కోపంగా ఉండేది. కుటుంబ పునాదులు కూలి పోవటానికి తండ్రే కారణంగా భావించాడు.
ఇంటి దగ్గర ఉండాలనిపించలేదు. ఇల్లు వదిలి వెళ్లి పోయాడు. మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చిన దాఖలాలు లేవు. 16 ఏళ్ళ వయసులో గ్రిం స్టాడ్ చేరాడు. ఇది నార్వేలో దక్షిణ తీరపు చిన్న నౌకాశ్రయం. అక్కడ మందుల దుకాణంలో అప్రంటిస్‌గా చేరాడు. అయిదేళ్ళు అక్కడే ఉండి కవిత్వం రాశాడు. అందులో గ్రామస్తుల ప్రవర్తనపై సెటైర్ దట్టించేవాడు. పోయిన కుటుంబ ప్రాభవం మరలా దక్కాలని ఆశించేవాడు. తనకన్నా పదేళ్ళ పెద్దదైన పని అమ్మాయికి కడుపు చేసి ఒక బిడ్డకు తన 18 ఏట జన్మనిచ్చి తండ్రి అయ్యాడు. ఇది తెలిసిన కుటుంబం మండిపడింది. ఉత్తర ప్రత్యుత్తరాలు బందయ్యాయి. ఇబ్సెన్‌ను సాంఘిక బహిష్కృతుని చేసింది కుటుంబం. బిడ్డ సంరక్షణ బాధ్యత స్వీకరించినా జీవితాతం ఈ తప్పు అతన్ని వెంబడిస్తూనే ఉంది. గిల్టీగా ఫీలయ్యేవాడు.

**తిరుగు బాటు - నాటక ప్రక్రియ - దర్శకత్వం**

సంప్రదాయ జీవనంలో ఇబ్సెన్ చేసింది తప్పు అయింది. అందరు అతన్ని ద్వేషించ సాగారు దీనితో సంఘంపై తిరుగుబాటు చేశాడు మెజారిటీ తీరకుండానే. ఈ భావాలతో తాను కీర్తి పొందాలని "కేటిలిన్" అన్న నాటకం రాశాడు. పెద్దగా ఆదరణ పొందక పోయినా అతని భావావేశాలకు నిలయమైంది. ఒక స్నేహితుడు దీన్ని ప్రింట్ చేశాడు. ఎవరూ కొనలేదు. చిత్తు కాగితాల క్రింద అమ్మేయాల్సొచ్చింది. దీనిపై స్పందిస్తూ ఇబ్సెన్ "ఒక రచయిత ఈ రకంగా కూడా డబ్బు సంపాదించి పొట్టగడుపుకోవచ్చునని ఆ డబ్బుతో తర్వాత పుస్తకాన్ని ప్రింట్ చేసుకోవచ్చునని తెలిసింది" అని చమత్కరించాడు. ఈ సంఘటన అతనిని క్రిస్టియానాకు వెళ్ళేట్లు చేసి యూనివర్సిటీలో చేరటానికి దోహద పడింది. పరీక్ష "గుంట కొట్టి గంట వాయించింది" లాభం లేదని జర్నలిజం వైపు కదిలాడు. ఇరవై మూడవ ఏట నార్విజియన్ నాటకశాల మేనేజర్‌గా ఉద్యోగంలో చేరి బీదరికపు అంచుల నుండి బయటపడ్డాడు ఇబ్సెన్. క్రమంగా డైరెక్టర్ అయ్యాడు. 34 ఏళ్ళు వచ్చేదాకా ఇక్కడే అదే పదవిలో క్రిస్టి యానాలో ఉన్నాడు.

**పెళ్లి- నాటక ప్రయోగం - నేచురల్ రైటర్**

29వ ఏట సుసానా తోరేసేన్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఆమె ఒక గొప్ప రచయితకు మారుటి కూతురు. ఇబ్సెన్ నాటక రచనలో ప్రయోగాలతో బిజీగా 25 ఏళ్ళ వయసు

నుండి 34వ ఏట వరకు గడిపాడు. అరడజను జానపద నాటకాలు రాశాడు. దీనితో స్వాభావికతకు అద్దంపట్టి "నేచురల్ రైటర్"గా పేరు తెచ్చుకొన్నాడు. వీటిలో హీరోయిజం ఎక్కువ. రొమాంటిక్ టచ్ కూడా జోడించాడు. వీటిలో "లవ్స్ కామెడి" ఒక్కటి మాత్రమే ఇబ్సెన్ ప్రతిభకు నిదర్శనంగా నిలిచింది. ఇదులో ప్రేమ, పెళ్లిల ఐరని ఉండటం కొత్తగా అనిపిస్తుంది. సెటైర్, సెంటిమెంట్, త్యాగం వగైరాలన్నీ ఉన్నాయి.

**థియేటర్, ఆదాయం లేని డైరెక్టర్, రచయిత**

35 ఏళ్ళు వచ్చాయి. డైరెక్టర్ అని పించుకున్నాడు కాని, స్వంత దియేటర్ మాత్రం లేదు. దాని వలన నాలుగు వేళ్ళూ నోట్లోకి వెళ్ళే పరిస్థితి మాత్రం పూజ్యం. తండ్రిగా, పుట్టిన కొడుకు పోషణ, రచయితగా ఏది రాసినా చూసే వారు కరువైన స్థితి. ఇక ఇక్కడ ఉండటం నిరర్ధకం అనుకొన్నాడు. జెండా పీకాలని పించేసింది. తన సృజనకు ఇక్కడ ఆదరణ లేదని ఇక్కడి జనం హృదయాలు ఇరుకు మురికి కూపాలని అనిపించింది. సరాసరి రోమ్ నగరానికి చేరుకొన్నాడు.

**రోమ్ నగర అనుభవం**

రోమ్ చేరి అయిదేళ్ళున్నాడు. జీవన భృతికోసం నాటకాలు రాసిపారేస్తూనే ఉన్నాడు. డ్రమాటిక్ పోయెం, పోయేటిక్ డ్రామాలను రాశాడు. ఇబ్సెన్ కొత్త ఆగంతకుడు. అతని వేషం ఆహార్యం జనాలకు నచ్చాయి. "నత్త తన గుల్లలోకి శరీరాన్ని ముడుచుకున్నట్లు" కనిపించేవాడని చూసినవారన్నారు. బిగ్గరగా మాట్లాడితే మాత్రం చీకటిలో చెట్టుమీద కూర్చుని బిగ్గరగా కూసే గుడ్ల గూబ అరుపులా వినిపించేదిట. రోమ్ చేరిన కొత్తలో రెండు ప్రసిద్ధ నాటకాలు "బ్రాండ్", "పీర్ గింట్"లు రాసి ప్రదర్శించి మాస్టర్ పీసెస్ అనిపించుకొన్నాడు. ఇదే మొట్టమొదటి విజయం. రెండిటిని వచనంలోనే రాశాడు. కాని ఆర్ధికంగా గిట్టుబాటు కాలేదు. తర్వాత "ఆల్ ఆర్ నథింగ్" కర్క్ గార్డ్ రాసిన "యైదర్ ఆర్"కు సమానం అన్నారు. కొందరు బ్రాండ్ నాటకం కర్క్ గార్డ్ను దృష్టిలో పెట్టుకొని రాసిందే అన్నారు. పీర్ గింట్ మాత్రం బ్రాండ్‌కు వ్యతిరేకం. ఇది చట్టం న్యాయం లేని మనసుకు ఏది తోస్తే అది చేసే పాత్ర. బ్రాండ్ మాత్రం ఇబ్సెన్ నడవడికలో ఉన్నదే అన్నారు. ఆయనా దాన్ని ఒప్పుకొన్నాడు. బ్రాండ్ తన భావాలను ఆడ, మగా అందరిపై రుద్దే స్వభావం ఉన్న పాత్ర. పీర్ గింట్ మాత్రం తన భావాలను తనలోనే ఉంచుకొనే పాత్ర.

**జర్మనీ యాత్ర- ప్రపంచ చారిత్రాత్మక నాటకం**

రోమ్ వదిలి నలభైవ ఏట జెర్మనీ చేరాడు ఇబ్సెన్. మ్యూనిచ్‌లో కాపురం. అప్పుడప్పుడు ఇటలి వెళ్లి వచ్చేవాడు. డ్రెస్ డ్రెయిన్‌లో మూడవ కవిత్వ రచన చేశాడు. రోమ్‌లో ఉండగా ప్రారంభించిన "ఎమ్పరర్ అండ్ గలీలియన్" జర్మనీలో పూర్తి చేశాడు.

ఇందులో నాలుగవ శతాబ్దానికి చెందిన పాగానిజం – క్రిష్టియానిటి మతాల మధ్య ఉన్న విద్వేషమే కథ. దీన్ని "ప్రపంచ చారిత్రాత్మక నాటకం" అన్నాడు ఇబ్సెన్. (world historical drama) చారిత్రక నేపధ్యం ఉన్నా నైతిక ఐక్యతను బోధించాడు ఇందులో. మనిషి తనను తాను నమ్మనంత వరకు ఇతరులను నమ్మలేడు అన్న సిద్ధాంతాన్ని తెలిపాడు. ఇందులోని పాత్రలన్నీ తమను తాము మోసం చేసుకొని అపరాధులైనవే. Ibsen was a self divided person, an idealist who distrusted abstract ideals ,an iconoclastic truth --teller who forced himself to see the destructive power of the truth" అని ఇబ్సెన్‌ను ఆవిష్కరించాడొక విమర్శకుడు.

యాభై వయసులో ఈ రకమైన రేటరిక్ రొమాంటిక్ కవిత్వ డ్రామాలను వదిలేశాడు. వాస్తవిక వచన రచనలపై దృష్టి పెట్టాడు. ఆధునిక ప్రపంచ జీవితంలోని విషయాలను కథా వస్తువులుగా స్వీకరించాడు. ఈ మార్పునే బెర్నార్డ్ షా "exposing the mischief of idealism" అన్నాడు. ఇక్కడి నుండి ఇబ్సెన్ రచనా ప్రస్థానం కొత్త పుంతలు తొక్కి మార్గదర్శనం చేసింది.

**మొదటి రియలిస్టిక్ డ్రామా**

మొట్టమొదటి రియలిస్టిక్ డ్రామా "పిల్లర్స్ ఆఫ్ సొసైటీ" ఇది "ఐరానిక్ టైటిల్". అందులో సమాజంలోని అసహ్యమైన వంచనను బహిర్గతం చేసే కథ ఉంది. చీకటి వ్యాపారులు, డబ్బే ప్రధానంగా జీవించేవారు, అబద్ధాల కోరులు వగైరా నీతిబాహ్యుల బండారం బయటపెట్టాడు. మధ్యతరగతి గౌరవం మీద ఇబ్సెన్‌కు గౌరవం లేదు. పై ముతా ధృత రాష్ట్ర కౌగిలిలో గిజ గిజా తన్నుకుంటున్న సామాన్యుడి గురించిన ఆరాటమే ఇబ్సెన్ ది. ఇది ఆనాటి దేశ రాజకీయ పరిస్థితికి ప్రతి బింబమే. సామాన్యుడికి శత్రువైన ప్రభుత్వ తీరు తెన్నులపైనే ఇబ్సెన్ దృష్టి పెట్టాడు. తనకు సంప్రదాయసిద్ధమైన కానుక లేదన్నాడు. స్వేచ్ఛ అన్నిటికంటే ప్రథమం, ఉత్తమం అన్నాడు. "destroy the false ideal --the State --make willingness and spiritual kinship the only essentials of unity --and you have the beginning of a liberty that has the same value" అని సమాజానికి తెలియజేశాడు.

తర్వాత రాసిన "ఏ డాల్స్ హౌస్", "ఘోస్ట్స్" నాటకాలు రెండూ సమాజంలో పాతుకు పోయిన సంప్రదాయాలను మరింత తీవ్రంగా అధిక్షేపించినవే. "పెళ్లి ఒక పవిత్ర కార్యం" అన్న భావానికి విరుద్ధమైనవే. డాల్స్ హౌస్‌లో హేల్మేర్స్ హాయిగా సెక్స్ సుఖాలను పొందాడు. నిజాయితీ ఉన్న లాయరు అయినా, మంచి కుటుంబంలో నుంచి వచ్చినా భార్య నోరా ఆదర్శ భార్యగా కొంచెం చిలిపిగా చూపాడు. భర్తకు తనమీద కంటే సంప్రదాయం మీదే ఆసక్తి ఎక్కువ అని ఆమె భావించింది. తాను ఇక ఏమాత్రం "వుమన్లీ వుమన్"గా ఉండదలచుకోలేదు. 'భర్త మనస్తత్వానికి' అద్భుతాలకే

అద్భుతమైన విషయమై తన వ్యక్తిత్వాన్ని గుర్తించే దాకా తిరిగి రాను అన్నది. భర్త భార్యను అర్థం చేసుకొని అన్యోన్యంగా మెలగితేనే దాంపత్య జీవితం ఆనందమయం అనే భావన తెలియ జేశాడు ఇబ్సెన్. మనుష్యులలో పరివర్తన రావాలని ఆశించాడు.

రెండవ నాటకం ఘోస్ట్స్ విషాదాంత నాటకం. ఒక భార్య బిడ్డకు తల్లిఅయిన ఒక స్త్రీ ఆల్వింగ్ తన కుటుంబ బంధం సంప్రదాయ ఉక్కు కౌగిలిలో నలిగి నశించటం ఇందులో కథ. "లోకం ఏమనుకొంటుందో" అనే భయం ఆమెను వెంటాడి కొడుకును రక్షించుకోలేక కోల్పోతుంది. భర్తమీద కుటుంబం మీద ఒక తీవ్రమైన అపనింద మోపితే, న్యాయంగా కొడుకునైనా రక్షించుకోవాల్సిన ఆమె తండ్రినుండి సంక్రమించే సిఫిలిస్ వ్యాధితో కొడుకు బతక రాదనుకోన్నది. అది ఆనాడు సంఘంలో నిషేధమైనదే.

## విమర్శల జడివాన

ఈ రెండు నాటకాలను పత్రికలూ, ప్రజలూ తీవ్రం గా వ్యతిరేకించినవే. డాల్స్ హౌస్‌ను "ఇమ్మోరల్" అన్నారు. సంఘంలోని అన్ని మర్యాదలను మంట గలిపింది అన్నారు. జర్మనీలో నాటకం తప్పనిసరిగా సుఖాంతం అవ్వాలి. బెర్లిన్, హాం బర్గ్, వియన్నాలలోని నాటకప్రియులు ఆ నాటకాన్ని తమకోసమైనా సుఖాంతం చేయమని ప్రాధేయపడ్డారు. తప్పనిసరి పరిస్థితిలో ప్రింట్‌లో మార్పు తెచ్చాదు ఇస్బెన్. విమర్శకులు ఘోస్ట్ నాటకంపైన కురిపించిన విమర్శల జడివాన, వాడిన అసభ్య పదజాలం భయంకరంగా ఉందని ఇబ్సెన్ జీవిత చరిత్రకారుడు ఇబ్సెన్‌కు ఆంగ్ల అనువాదకుడు విలియం ఆర్చేర్ వాటిని సేకరించి వీటిని "dictionary of Abuse"లో చేర్చటానికి దాచిపెట్టాడు. దీనికి "ఘోస్ట్స్ అండ్ గిబ్బరింగ్స్" అని పేరు పెట్టాడు. ఇది తర్వాత పాల్మాల్ గెజిట్‌లో 1891లో అచ్చుయింది.

## వ్యంగ్య వైభవం

వివాహం సంప్రదాయ విధానాలుపై తన కున్న అభిప్రాయాలను ఇబ్సెన్ ఖచ్చితంగా చెబుతూనే "యాన్ ఎనిమీ ఆఫ్ ది పీపుల్" అనే మరో నాటకం రాసి మరికొన్ని సంప్రదాయాలను చీల్చి చెండాడాడు. శీర్షిక వ్యంగ్య వైభవంతో విషాదంగా ఉన్నది. దీనిపై వాద ప్రతివాదాలు తారా స్థాయిలో జరిగాయి. జార్జ్ బ్రాండ్స్ మెజారిటీప్రజల అభిప్రాయాలు సరైనవి, వాటినే అనుసరించాలి అని ఇబ్సెన్‌కు హితోపదేశం చేస్తే "the minority is always right" అని ప్రతిగా సమాధానమిచ్చాదు ఇబ్సెన్. యాభైలో ప్రవేశించాడు. ఇబ్సెన్ సాహిత్య ప్రయాణం రొమాంటిక్ మలుపు దాటి రియలిస్టిక్ దారిలో ప్రయాణిస్తోందిప్పుడు. "వైల్డ్ డక్" నాటకం రాశాడు. ఇందులో దంపతులు తమ పాత జీవితాలను రోజూ తవ్వకొని పోట్లాడుకుంటూ జీవితాన్ని దుర్భరం చేసుకొనే ఆలోచనలో ఉంటారు. దీనిలోంచి బయటపడి ఐక్యతతో జీవించాలనే సందేశమిచ్చాడు.

ఇందులోని స్త్రీ "most impassioned, purposeful, and enigmatic woman" అన్నారు విమర్శకులు. జనం బాగానే రిసీవ్ చేసుకొన్నారు. మరోనాటకం "ది లేడీ ఫ్రం ది సీ"లో చక్కని సుఖాంతం ఉంది. ఇలా రాసినవి తక్కువ నాటకాలే ఉన్నాయి. "హెడ్డా గేబ్లెర్" అనే మరో నాటకంలోని స్త్రీ పాత్ర చాలా పవర్ ఫుల్‌గా ఉంటుంది. ఒంటరితనంతో బోర్ కొట్టి, అసూయ పీడిస్తూ, పెత్తనం కోసం పాకులాడుతూ ఉండే స్త్రీని గొప్పగా చిత్రించాడు. ఆమె "నార్వేజియన్ లేడీ మేక్ బెత్" అనిపిస్తుంది. ఈ నాటకంతో మరింత తీవ్ర విమర్శకు గురయ్యాడు.

**ముసలాయనకు దసరా పండగ**

ముసలాయనకు అరవై మీద పడ్డాయి. పది హేడేళ్ళ పడుచుపిల్ల ఎమిలీ బార్డాక్‌తో మోహంలో పడి "ముసిలోడికి దసరా పండగ" అనిపించుకొన్నాడు. ఆమెను "The May sun of my September life" అని చెప్పుకొని జీవితంలోకి ఆహ్వానించాడు. పెళ్లి, వెంటనే పెటాకుల్లా విడాకులు అయిపోయి ముసలాయన ప్రపంచ యాత్రకు బయల్దేరాడు. అక్కడక్కడ ప్రేమ భామలు తగిలినా వెంటపడకుండా జాగ్రత్త పడి కొంపకు తిరిగి వచ్చాడు.

**ప్రపంచ ప్రసిద్ధి**

ఇంకా పదిహేనేళ్ళు బతకాల్సి ఉంది ఇబ్సెన్. ఈ కాలంలో రాసినవి మూడే మూడు నాటకాలు. "దిలిటిల్ యియోల్ఫ్", "జాన్ గేబ్రియల్ బార్క్ మన్", "వెన్ వు డెడ్ అవేకేన్". మూడూ ట్రాజేడీలే. మొదటిది దిక్కుమాలిన విరమణ. రెండోది మృత్యు నాట్యం. మూడోది పునరుద్ధానికి ఆశగా కనిపించినా చివరికి విషాదమే, ఇప్పటికే ఇబ్సెన్‌కు ప్రపంచ ప్రసిద్ధ నాటకకర్తగా గుర్తింపు వచ్చేసింది. అంతర్జాతీయంగా అయన నాటకాలు అన్నిభాషల్లోకి అనువాదం పొందాయి. లండన్‌లో ఇబ్సెన్ నాటకాలు ప్రేక్షకులచేత క్రోధాగ్ని కురిపించాయి. ఇస్బెన్‌ను వెనకేసుకొచ్చి బెర్నార్డ్ షా సుదీర్ఘమైన సమాధానాలు చెప్పి వాటిలోని గొప్పతనాన్ని ఆవిష్కరించాడు. తనకు మించిన ప్రసిద్ధ నాటకకర్త ప్రపంచంలోనే లేడనే తిరుగు లేని నిజాన్ని ఇబ్సెన్ చాలాకాలం విన్నాడు.

**చరమ దశ**

72 వయసులో మొదటిసారిగా గుండె పోటు వచ్చింది. రెండవ సారి స్ట్రోక్ వచ్చినప్పుడు మెదడు, శరీరమూ దెబ్బ తిన్నాయి. దేనిపైనా దృష్టి పెట్టలేక పోయాడు. రోజుకు అయిదారు పేజీలకంటే చదవ లేకపోయాడు. రాయటం అనేది అసాధ్యమే అయింది. అక్షరాలను కూడబలుక్కోవలసి వస్తోంది. మూడవసారి గుండెపోటు వచ్చి ఇది కూడా దూరమై 78వ ఏట మే నెల 23న 1906లో ఇబ్సెన్ మరణించాడు.

నార్వేజియన్ నవలాకారుడు, విమర్శకుడు కౌంట్ హామ్సేన్ "A book keeper

of dramatic art" అన్నాడు. ఇబ్సెన్ మరణానంతరం ఎవరూ ఆయన స్థానాన్ని గురించి కామెంట్ చేయనే లేదు. మానవ అంతరాత్మకు సూటిగా సోకిన నాటకాలు ఇబ్సెన్ రాశాడు. సంఘంలో అప్పటిదాకా గౌరవింపబడ్డ నైతిక విలువలను సంప్రదాయాలను ప్రశ్నించాడు. "Ibsen disturbed the accepted concepts of conduct, proposed new moral values, and in his very dramas of disaster and defeat, suggested the imperative need as well as the inevitable triumph of truth" అన్నాడు గ్రంథకర్త లూయీ అంటర్ మేయర్.

నాటకశాలలో ఆధునికతను ప్రవేశ పెట్టిన మొట్టమొదటి వాడు ఇబ్సెన్. షేక్స్పియర్ నాటకాలు ఆడినంత గొప్పగా ప్రపంచం మొత్తం మీద ఇబ్సెన్ నాటకాలే ఆడాయి. డాల్స్ హౌస్ నాటకం ఇరవైవ శతాబ్దంలో ప్రపంచం మొత్తం మీద అనేక ప్రదర్శనలు పొంది రికార్డ్ సృష్టించింది. ఐరోపా సంప్రదాయంలో గొప్ప నాటకకర్తగా గుర్తింపు పొందాడు. పీర్ గింట్ నాటకంలో సర్రియలిజ ధోరణి కూడా ఉంది. షేక్స్పియర్ తర్వాత ఇబ్సెన్‌కు మాత్రమే ప్రసిద్ధ నాటక రచయితగా గుర్తింపు వచ్చింది. ఇబ్సెన్ ప్రభావం బెర్నార్డ్ షా, ఆస్కార్ వైల్డ్, ఆర్థర్ మిల్లర్, జేమ్స్ జాయిస్, యూజీన్ ఒ నీల్ వంటి ప్రసిద్ధ నాటకకర్తలపై అమితంగా ఉంది. 1902, 1903, 1904లలో అంటే మూడేళ్ళూ ఇబ్సెన్ పేరు నోబెల్ ప్రైజ్ కోసం నామినేట్ చేయబడింది. కాని దక్కలేదు.

ఇబ్సెన్ తన రచనలు డేనిష్ భాష అంటే నార్వే, డెన్మార్క్ దేశాల భాషలోనే రాశాడు. ఆ భాషలోనే ముద్రణ పొందాయి. డ్రామా నిబంధనలను రియలిజంతో తిరగ రాసిన సాహసి ఇబ్సెన్. దీన్నే చెకోవ్ మొదలైనవారు అనుసరించారు. అవే ఇప్పుడు దియేటర్‌లో రూల్స్‌గా చెలామణీ అవుతున్నాయి. వినోదాన్ని మించి సాంఘిక ప్రయోజనాన్ని నాటకాల ద్వారా అందించాలన్న ధ్యేయమే ఇబ్సెన్ కుండేది. జేమ్స్ జాయిస్‌పై అమిత ప్రభావం కలిగించాడు. ఇబ్సెన్ నుపాత్ర చేసి జాయిస్ "స్టీఫెన్ హీరో" నవల రాశాడు నార్వే సమాజంలో ప్రముఖమైన మంచి మార్పులన్నిటికీ ఇబ్సెన్ కారణభూతుడయ్యాడు. ఆధునికత నాటక రంగానికే కాదు జీవితంలోను రావటానికి ప్రధాన కారణం ఇబ్సెన్.

2006లో ఇబ్సెన్ శత జయంతి జరిగింది దాన్ని "ఇబ్సెన్ యియర్"గా గౌరవించారు. ఇబ్సెన్ మ్యూజియం మళ్ళీప్రారంభమైంది. మొత్తం 27 రచనలు చేశాడు. ఎడ్మండ్ గూస్‌కు స్వదస్తూరితో ఇంగ్లీష్‌లో ఇబ్సెన్ రాసిన ఉత్తరం.

"Letter from Ibsen to his English reviewer and translator Edmund Gosse: "30.8.[18]99. Dear Mr. Edmund Gosse! It was to me a hearty joy to receive your letter. So I will finally personally meet you and your wife. I am at home every day in the morning until 1 o'clock. I am happy and surprised at your excellent Norwegian! Your amicably obliged Henrik Ibsen"❋



## 14. సంస్కరణ, వాస్తవ వాది శాంతికాముకుడు రష్యన్ రచయిత లియో టాల్ స్టాయ్ (1828 -1910)

**పరస్పర విరోధభావాల లియో**

"తన సుఖం మాత్రమే కోరే మనిషి చెడ్డవాడు, ఇతరుల అభిప్రాయమే తనది అని చెప్పేవాడు బలహీనుడు, ఇతరుల సుఖాన్ని కోరేవాడు ఉత్తముడు, అన్నిటా భగవంతుడే అని భావించేవాడు మహా గొప్పవాడు" అని ఇరవై అయిదవ ఏటనే ఈ మహా వాక్యాలు రాసిన మహా రచయిత లియో టాల్‌స్టాయ్. ఆయన నీతి మార్గమేమిటో దీనిలో కన్పిస్తుంది. యుద్ధము - శాంతి, అన్నా కరీనీనా అనే రెండు నవలలతో ప్రపంచ ప్రసిద్ధి చెందాడు. ఆయన చెప్పినవన్నీ ఆయనకే వర్తించటం బహు తమాషా. జూదం, విలాసం, అధికారం చెలాయించటంలో ఆయన చాలా చెడ్డవాడు. కీర్తికోసం తాపత్రయం, తప్పు చేస్తున్నానని తెలిసినా అదే దారిలో నడవటం ఆయన బలహీనత. తోటి వారి పట్ల ప్రేమ, దయ, సానుభూతి కలిగి ఉండటం ఉత్తమ లక్షణం. దైవంపై ఆరాధన, ఆయన రచనలన్నిటా చూపటం టాల్‌స్టాయ్‌ని మహోన్నతుని చేసింది. తాను ఎవరైనా కానీ ఆయనే అన్నిటా ఉండటం ప్రత్యేకత. వీటికి తానే వ్యతిరేకి అవటం పారడాక్స్. విరుద్ధ భావాలు ఆయన నరనరానా వ్యాపించి ఉన్నాయి. సుఖంపై మోజు, తిండిపై వ్యామోహం ఆత్మ తిరస్కారం అన్నిటా ఆయనే ముందు. లాజిక్‌తో మేజిక్ చేసే దమ్మున్నవాడు. తనదే రైట్ అని ఇతరులను నమ్మించే పట్టుదల ఉన్నవాడు. ఆడవాళ్ళను చెదపురుగులులాగా తిరస్కరించటం ఉన్నా, రచనలో కాంతి ప్రసరించి మిరుమిట్లు గొల్పే చాకచాక్యమున్నవాడు. దూకుడు స్వభావం ఉన్నా, ప్రపంచ కథకుల్లో అగ్రస్థానాన నిలచిన ఉత్తమ కథకుడు టాల్ స్టాయ్. సృజనాత్మక రచనలతో నైతికత స్థాయి పెంచిన దార్శనికుడు. 1899లో టాల్ స్టాయ్ తీవ్రంగా జబ్బు పడ్డప్పుడు మరో రష్యన్ కథకుడు చెకోవ్ "ఆయన బతికి ఉన్నప్పుడు సాహిత్యంలో చెడు జుగుప్స, కన్నీరు, అనాగరక భావాలనన్నిటినీ దూరంగా పెట్టాడు. టాల్ స్టాయ్ రాకతో రచయితలు కావలసినవారికి మహదానందం, తేలిక అయింది. అన్నీ కష్టపడి టాల్ స్టాయ్ చేసి ఉంచాడు కనుక మాలాంటి రచయితల

పని సులువైంది" అన్నాడు.

**తండ్రి దివాలా-తల్లితో మళ్ళీ మహా రాజభోగం**

కౌంట్ లియో నికోలావిచ్ టాల్ స్టాయ్ 28-8-1828 మాస్కోకు ముప్ఫై మైళ్ళ దూరంలో ఉన్న బహు సంపన్నమైన యాస్నాయ పోలియాన ఎస్టేట్‌లో జన్మించాడు. అప్పటికి వీరి కుటుంబంలో ఇరవై తరాలు గడిచి పోయాయి .వీరిలో 17 వ శతాబ్దికి చెందిన ఆంఢ్రియో విచ్ టాల్ స్టాయ్ రష్యా రాజు 'పీటర్ ది గ్రేట్'కు గొప్ప అభిమాని. టాల్ స్టాయ్ తండ్రి అదే రాచమర్యాదాలతో పెరిగాడు. నెపోలియన్‌ను ఓడించిన యుద్ధదళంలో సభ్యుడు కూడా. ఖైదీగా పట్టుబడి పారిస్ జైలులో ఉండి, విడుదలై వచ్చాక తండ్రి చనిపోయాడు. ఎస్టేట్ అప్పుల ఊబిలో కూరుకుపోయింది. అ అప్పులతో తనకేమీ సంబంధం లేదన్నాడు టాల్ స్టాయ్ తండ్రి. తల్లి పోషణ భారాన్ని మాత్రం స్వీకరించి ఆనాటి రష్యా సంపన్న కుటుంబీకుల మాదిరి బాగా డబ్బు, సంపదా ఉన్న అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. భార్య ధనికురాలే కాదు రాయల్ ఫామిలీకి చెందింది. ఆమె పేరు ప్రిన్సెస్ మార్యా నికోలా యేవ్నా వోల్ కోన్స్కి. అందగత్తె కాదు. భర్త కంటే అయిదేళ్ళు పెద్దదికూడా. పెళ్ళి నాటికి ఆమె వయస్సు "ముప్పీ రెండు". ఐదు భాషలలో నిష్ణాతురాలు. యాస్నాయా పోల్యానాలో ఉన్న ఎనిమిది వందల శేర్ఫ్‌లను, కౌలు దార్లను చాలా తేలికగా మేనేజ్ చేసే సామర్థ్యం ఉన్నది. భర్త కు అయిదుగురు సంతానాన్ని "కన్నది". అందులో లియో నాలుగోవాడు. చివరగా కూతురు పుట్టింది.

**బాల్యం-పరాయి పెంపకం**

టాల్ స్టాయ్ రెండేళ్లప్పుడు తల్లిని, తొమ్మిదో ఏట తండ్రినీ కోల్పోయాడు. బంధువుల మహిళలే పెంచారు. ఇంటి దగ్గర ట్యూషన్ ఏర్పరచి చదివించారు. బాగా చదివి టీచర్ల మెప్పు పొందాడు. మనిషి అందంగా ఉండడు. అది మనసులో కెలుకుతూ ఉండేది. వయసు పెరిగినకొద్దీ పెడసరంగా, గర్విష్టిగా మారాడు. వీటితో పాటు ఆత్మపరిశీలనా దృష్టీ పెరిగింది. అందంగా ఉండే తండ్రి పోలిక రాకుండా అందవిహీనురాలైన తల్లి పోలిక వచ్చినందుకు మనసులో ఎప్పుడూ బాధపడేవాడు. దీనితో సిగ్గు వచ్చి మనుషులకు దూరంగా ఉండేవాడు. అంతరాత్మ ప్రబోదానికి లోనై హుందా తనం లేకుండా ఉండేవాడు. వీటివలన స్నేహితులను సంపాదించుకోలేక పోయాడు. తనకున్న కొన్ని ప్రత్యేకతల వలన అతి కొద్దిమంది మాత్రమే టాల్ స్టాయ్‌కి సన్నిహితులు కాగలిగారు.

**విద్య**

లియోకు గార్డియన్‌గా వ్యవహరించిన అలేక్సాండ్రియా-లియో 13వ ఏట చనిపోయింది. దీనితో ఆంట్ పెలగేయా వీరి కుటుంబాన్ని తన స్వగ్రామం కజాన్‌కు

మార్చింది. లియో కజాన్ యూనివర్సిటిలో చేరి, టౌన్‌లో బాగా పేరు ప్రఖ్యాతులు పొందాడు 17 ఏళ్ళకే. దసరా బుల్లాడిలాగా డ్రెస్‌ల గొడవే కాని అందాల రాముడిలాగా అడ పిల్లలను ఆకర్షించలేక పోయాడు. పెళ్లి అయినవారితో కాని, కాని వర్జిన్స్‌తో కాని "లవ్వాయణం" లాగించలేదు. డబ్బు, అధికారం, రాజరికం ఉన్నవాడు కనుక "పడుపు కత్తెల"తో పడక సుఖం అనుభవించేవాడు. 19 ఏళ్ళప్పుడే సుఖాన్ని కొనుక్కున్నానని డైరీలో రాసుకొన్నాడు. దీని ఫలితమైన "గనేరియా" తగులుకొని బాధపడ్డాననీ నిజాయితీగా డైరీలో నోట్ చేశాడు. రెండో సంవత్సరం చదువు పూర్తికాకుండానే యూనివర్సిటీ వదిలేశాడు. చాలా తక్కువ మార్కులు రావటం, అక్కడ తను నేర్చుకొన్నది అతి తక్కువ అని భావించటమే నిష్క్రమణకు కారణం. తాను ఉండాల్సినది తన ఎస్టేట్ అయిన యాస్నయా పోల్యానాలో మాత్రమే అనే భావం బలమైనది. అక్కడికి వెళ్లి తన సమర్థత చూపించి గొప్ప లాండ్ లార్డ్‌గా రుజువు చేసుకోవాలనుకొన్నాడు. వేదాంతపరమైన ఆలోచనలూ దీనికి దోహదం చేశాయి. తనకు నచ్చిన రీతిలో ప్రయోజనాత్మకమైన అర్ధవంతమైన జీవితం గడపాలనుకొన్నాడు టాల్ స్టాయ్.

**టాల్ స్టాయ్ ఎస్టేట్**

తన ఎస్టేట్లో సెర్ఫ్‌ల విస్తరణ ప్రారంభించాడు. దీనికోసం డబ్బు చాలాఖర్చు పెట్టాడు. అప్పుల్లో చిక్కుకొన్నాడు. ఇదికాదు అనుకోని మరో కొత్త విధానం ప్రవేశ పెట్టటం చేతులు కాల్చుకోటం మళ్ళీ మరోదానికి పాకులాట ఇలా గడిచింది ఎస్టేట్‌లో. తన మనోభావాలన్నిటినీ డైరీలో భద్రం చేశాడు. లోపల్లోపల యెంత కుమిలి పోయేవాడో అవి చదివితే తెలుస్తుంది.

**యుద్ధ అనుభవం-సెక్స్ అనుభవం**

23 వయసులో "జెంటిల్మన్ వాలంటీర్" అయ్యాడు. సోదరుడు నికోలాయ్ అప్పటికే యుద్ధ సైనికుడుగా ఉన్నాడు. కకాసాస్‌కు కేడెట్‌గా వెళ్ళాడు. యుద్ధ కాంప్‌లో ఉన్నా పాత అలవాట్లు మార్చుకోలేదు. సరైన విధానాలలో నడవలేదు. జూదం ఆడి పోగొట్టుకొని, అప్పుల అప్పారావు అవతారం ఎత్తి ఎస్టేట్‌లో కొంత భాగం అమ్మాడు. కకాసియన్ అమ్మాయిలతో సెక్స్ జరిపి సుఖ వ్యాధి బాధించి తగ్గటానికి మందు పుచ్చుకొన్నాడు. తనకున్న మూడు దుర్గుణాలను వదిలించుకోటానికి తీవ్ర యత్నం చేస్తున్నట్లు గురూగారు డైరీలో రాసుకొన్నారు. ఆ మూడు మోహాలే జూదం, ఇంద్రియ లోలత్వం ఆడంబరం (gambling sensuality and vanity) యుద్ధ భూమిలో ప్రత్యక్షంగా యుద్ధ భీభత్సాన్ని చూశాడు. శత్రువులపై తుపాకి గురిపెడుతుండగా ఒక బులెట్ వచ్చి తుపాకికి తగిలి దాదాపు ప్రాణం పోయేంత ప్రమాదం జరిగి బయటపడ్డాడు. ఇంకోసారీ ప్రమాదం అంచుమీద నుండి తప్పించుకొన్నాడు. ప్రాణాపాయాన్ని. అందుకే

ధైర్య సాహసాలు చూపినందుకు సెయింట్ జార్జ్ క్రాస్‌ను బహూకరించాలని ప్రభుత్వం నిర్ణయించింది. మర్నాడు ఉదయమే బహుమతి ప్రదాన ఉత్సవం. కాని బాగా నిద్రపోయి ఫంక్షన్‌కు వెళ్ళలేక పోయాడు. అ అవార్డ్‌ను ఇవ్వకుండా గార్డ్ హౌస్‌కు పంపారు. సైనికులందరితో చాలా కలుపుగోలుగా ఉండేవాడు. పొట్టి బుదం కాయలా ఉన్నా బలిష్టంగా ఉండేవాడు. నేల మీద పడుకొని రెండు చేతులూ సాచి వాటిమీద ఇద్దరు సైనికులను నిలబెట్టుకొని పైకి లేపేవాడట. అంతటి సామర్థ్యం ఉండేది. గురూగారి ముక్కు చాలా వెడల్పు. పెదిమలు మొద్దుగా పెద్దగా ఉండేవి. కళ్ళు చిన్నవి. కాని ఆకళ్ళు మహా పవర్‌ఫుల్. ఎన్నోభావాలకు ఆలవాలంగా ఉండేవి. నవ్వే పెదిమలతో అందరికీ ఆకర్షణీయంగా ఉండేవాడు టాల్‌స్టాయ్.

**రచయిత టాల్ స్టాయ్**

అప్పటికి ఇంకా రచన వ్యాసంగంపై దృష్టి పెట్టలేదాయన. ఈవిషయాలు డైరీలో రాశాడు. తన ఆంట్‌కు ఉత్తరం రాస్తూ ఆమె తనను నవల రాయమని కోరిన సంగతి గుర్తు చేశాడు. 1852 జూలైలో "కాంటెంపొరరి" అనే ప్రముఖ సాహిత్య పత్రికా సంపాదకుడికి "చైల్డ్ హుడ్" అని తాను రాసిన జీవిత చరిత్ర భాగాన్ని పంపాడు. వెంటనే అది ప్రచురణ పొంది అభిమానుల్ని సంపాదించింది. ఇరవై నాలుగేళ్ల ఈ కుర్ర రచయితను చూసి అతనిలో "un known and remarkable talent" ఉందని మెచ్చుకొన్నారు. కొద్దిగా కల్పన ఉన్నా అది టాల్ స్టాయ్ జీవితమే. అ తర్వాత ఏది రాసినా స్వీయ జీవిత చరిత్రయే అయింది. ఇప్పటికే గొప్ప శైలి అలవడింది. అది అంతటా హాయిగా ప్రవహించింది. సంఘటనలన్నీ యదార్థమైనవే కావటంతో రియలిస్టిక్ రచయితగా మంచి గుర్తింపు వచ్చింది.

**ఆర్మీకి రాం రాం**

విపరీత భావాలతో విసిగిపోయి, మిలిటరీ కేడేట్‌గా ఉండలేక మిలిటరీ మాన్ అని పించుకోటానికి ఇష్టపడక సమయాన్ని చదవటంలో రాయటంలో గడిపాడు టాల్‌స్టాయ్. అనేక భాషల్లో ప్రావీణ్యం సాధించాడు. ఫ్రెంచ్ భాషలో హాయిగా రాశాడు. గ్రీక్‌ను స్వయంగా అభ్యసించి, ఆ భాషలో చేసిన అనువాదాలు మహా మహా గ్రీకు ప్రొఫెసర్ల అనువాదాలకంటే మిన్నగా ఉన్నాయని పించుకొన్నాడు. రష్యా టర్కీ యుద్ధ సమయంలో తనను బదిలీ చేశారని తెలుసుకొని విభ్రాంతి చెందాడు. సేవేస్టపోల్ రక్షణ బాధ్యతలో ఉన్నాడిప్పుడు. ఈ కాలంలో పొందిన అనుభవాలతో సైన్యం అన్నా, యుద్ధం అన్నా, అసహ్యం కలిగింది. 27 వయసులో సైన్యానికి రాజీనామా చేశాడు. యుద్ధ అనుభవంతో "సేవేస్ట పోల్ కథలు" రాశాడు. ఇప్పటికే రచనలో ప్రసిద్ధు డనిపించుకొన్నాడు. బోహీమియా అరిస్టాక్రటిక్‌గా లేదు. తన అభిరుచులకు అనుకూలంగా లేదని భావించి

మళ్ళీ "పీఛే మూడ్"గా యసన్యా పోల్యానాకు చేరాడు. కుర్రవయసులో ప్రశాంత జీవితాన్ని అనుభవించే స్థితిలో లేడు. మనసు స్థిమితంగా లేదు. ఏమి చేయాలో పాలు పోవటం లేదు. అస్తిమితత్వం బాధిస్తోంది. చివరికి యూరప్ టూర్ చేయటానికి బయల్దేరాడు. తిరిగి వచ్చి పెళ్లి చేసుకోవాలనుకొన్నాడు. తనకు కావాల్సిన భార్య కోసం ప్రయత్నించాడు. అలాంటివారెవరూ తారసడ లేదు. దాదాపు కాలమంతా డెస్క్ దగ్గరే గడుపుతూ రాసుకొంటూ కూర్చున్నాడు. రాత విసుగని పించి రాత మానేద్దామనుకొన్నాడు. టాల్ స్టాయ్ ఊహించిన తీరులో రచనలు చేయటం అసాధ్యం అన్నారు విమర్శకులు. వాళ్ళ అభిప్రాయాన్ని మార్చే ప్రయత్నమేమీ చెయ్యలేదాయన.

**పిల్లల స్కూల్ ఏర్పాటు - విద్యపై అభిప్రాయాలు**

31 వయసులో తన సంస్థానంలోని పిల్లలకోసం ఒక స్కూల్ ప్రారంభించాలను కొన్నాడు. అంతకు ముందు చదువురాని కూలీలను విద్యా వంతుల్ని చేసే ప్రయత్నం చేసి విఫలుడయ్యాడు. తనకు ఈ విషయాలలో ఉన్న సామర్థ్యం తక్కువ అని తెలుసుకొన్నాడు. మళ్ళీ యూరప్ ట్రిప్ చేసి అక్కడి విద్యా విధానాలను అధ్యయనం చేశాడు. విద్య ఉచితంగా స్వచ్ఛందంగా అందించాలనే అభిప్రాయానికి వచ్చాడు. విద్యవలన నైతికత పెరగాలని ఆశించాడు. శీల సంపదను పెంచి స్వయం అభివృధికి తోడ్పడాలి. స్వీయ ప్రతిభకు ఊతమివ్వాలి. సృజనను ప్రోత్సహించాలి. తరగతిగది స్వేచ్ఛకు, విముక్తికి ఆధారమై ప్రయోగ శాలగా ఉండాలని భావించాడు.

**మలుపు తిరిగిన జీవితం**

1862లో టాల్ స్టాయ్ జీవితం అనూహ్యమైనపూర్తి మలుపు తిరిగింది. బెర్స్ కుటుంబం చాలాకాలంగా ఆయనకు తెలుసు. తండ్రి డాక్టర్ తల్లి ఆతిధ్యంలో సమర్ధురాలు. పిల్లలు ఉత్సాహవంతులు. సంతానంలో మధ్య పిల్ల పద్దెనిమిదేళ్ళ సోన్యా బెర్స్‌పై మనసుపడ్డాడు. 31 వయసులో అకస్మాత్తుగా ఆమెపై ప్రేమలో పడ్డానని గ్రహించాడు. చాలాకాలం సందేహం, ఊగిసలాట సాగి చివరికి ఆమెను ప్రొపోజ్ చేయటం ఆమె అంగీకరించటం జరిగిపోయాయి. టాల్ స్టాయ్ అప్పటికే సోన్యా అభిమాన రచయిత. ఆయన్నే ఆరాధించేది. ప్రేమలేఖలతో బాటు డైరీలూ మార్చుకొన్నారు. ఇద్దరి మధ్య రహస్యాలే లేవు. ఆదర్శ దాంపత్యం అనిపించారు. ఒకరికోసం ఒకరు అన్న భావన ఏర్పడింది. ఈ హాయైన అనుబంధం 16 ఏళ్ళపాటు దివ్యంగా కొనసాగింది. భార్య సోన్యా భర్త టాల్ స్టాయ్ రచనకు ప్రేరణగా నిలిచింది. ఆయన రాసిన అనంత సాహిత్యాన్ని స్వదస్తూరీతో కాపీ చేసింది. ఆయన్ను సామాన్య విధులనుండి రిలీఫ్ కలిగించి తానే బాధ్యతలు చేబట్టింది. టాల్ స్టాయ్‌కి 13 మంది పిల్లలను 'కని' పెట్టింది. ఏడాది కేడాది గర్భిణీగా ఉండటంతో బాహిర ప్రణయ

సౌఖ్యాన్ని అందించ లేకపోయింది. ఆయన సెక్స్ దాహాన్ని తీర్చలేక పోయేది.

**యుద్ధము-శాంతి.-అన్నా కేరేనీనా**

కాని ఆయన రచనా వ్యాసంగం నిర్విఘ్నంగా కొనసాగుతూనే ఉంది. ఎన్నో రాసిన తర్వాత మనసులో "యుద్ధము-శాంతి" నవలకు బీజంపడి మొలకెత్తి మహా వృక్షమైపోయింది. ఈ నవలలో టాల్ స్టాయ్ పియర్రీగా ప్రిన్స్ ఆండ్రీగా రెండు విభిన్న పాత్రలు పోషించాడు. కాని అందరు మగ వాళ్ళూ మెచ్చిన, ప్రేమించిన నతాషా పాత్ర మాత్రం భార్య సోన్యాకు పోలిక లేకుండా ఆమె చెల్లెలు తాన్యా లాతీర్చి దిద్దాడు. దీన్ని రాయటానికి ఏడేళ్ళు పట్టింది. ప్రచురణ పొందిన తర్వాత ఈ నవల బృహత్తర మహా రచనగా ఆధునిక ఇతిహాసంగా గుర్తింపు పొందింది. రష్యా సాహిత్య చరిత్రలో డి.ఎస్ .మిర్స్కి రాస్తూ "చాలా ముందుచూపున్న మహా రచన అని, కాల్పనిక సాహిత్యపు అవధిని పెంచిందని, యుద్ధం అవాంఛనీయమని, సాధారణ మానవుని మహోన్నతంగా మలిచాడు" అని కీర్తించాడు. మనుషుల సాధారణ స్వభావాలను చాలా చక్కగా చిత్రించాడు ఇందులో. "war and piece is a panoramic spectacle and social drama. The horror of battle, the death throe struggle of great armies, the accidents of war and the sense of fatality are depicted on the largest scale ever attempted by a novelist. but here also are superbly detailed domestic situations, illuminations of a society which is both effete and barbarous and the intricately tangled lives of human beings who are un forgettable". వ్యక్తిలోని సమాజంలోని నిజజీవితాన్ని వైరుధ్యాలను ప్రతిబింబింప జేశాడు. చరిత్ర, వేదాంతపు లోతులను తరచాడన్నారు. చరిత్రలో జరిగే సంఘటనలు నెపోలియన్‌లాంటి ఏ ఒక్క వ్యక్తి కోరికననుసరించి జరగవని, అవి ముందే నిర్ణయించబడి ఉంటాయని అంటాడు. చరిత్ర అనేది రాజుకు బానిస కాదని అన్నాడు. చరిత్ర సంఘటన వెనుక ఎప్పుడూ ఒకే ఒక కారణం ఉండదు, అనేక కారణాలు ఉండచ్చు. అవన్నీ ఏ ఒక్క వ్యక్తి అధీనంలోనూ ఉండవు.

ఈ చారిత్రాత్మక నవల రాస్తూనే అనేక కథలను, వ్యాసాలను రాశాడు టాల్ స్టాయ్. ఫస్ట్ గ్రేడ్ విద్యార్ధులకోసం పుస్తకం రాశాడు. ఇందులో రష్యా జానపద కథలను చేర్చాడు. దీనిని సంప్రదాయవాదులు అడ్డుకొన్నారు. రష్యన్ మెసెంజర్ పత్రికలో అన్నా కేరేనీన నవల ధారావాహికంగా రాస్తున్నాడు. అయిదేళ్ళ తర్వాతా ఇదంతా నవలగా వెలువడింది.

**కరేనిన ప్రాముఖ్యత**

వార్ అండ్ పీస్ లాంటి విస్తృత కాన్వాస్ లేకపోయినా అన్నా కేరేనినా తక్కువ

పాత్రలతో, నగరంలోని అపరిశుభ్రత మొదలైన విషయాలకు ప్రాదాన్యమిచ్చాడు లియో. ఇందులో అంతర్గత సంఘర్షణలున్నాయి. నైతికతపై ఆలోచనలున్నాయి. రష్యా ఉన్నత వంశానికి చెందిన ఒక మహిళ విషాద గాథ. ఇది యవ్వనంలో అందంగా ఉన్న సున్నిత మనస్కతకల ఒక అమ్మాయికి తనకంటే చాలా పెద్ద వయస్కుడైన వాడితో పెళ్లి జరిగింది. పరిస్థితుల ప్రాబల్యం వలన ఆమె ఒక యువ ఆఫీసర్‌ను ప్రేమించింది. ఇటు ప్రేమ, అటు భర్తతో సంసారం. ఈ రెండిటి మధ్య నలిగిపోతుంది. తేల్చుకోలేక, ముందుకు సాగలేక, సమాజాన్ని ఎదిరించలేక నిరాశా నిస్పృహలతో రగిలిపోయే కేరేనినా పాత్రను చిరస్థాయిగా నిలిచేట్లు మలచిన తీరు అసదృశంగా కనిపిస్తుంది. "Anna Karenina is all encompassing stern and compassionate, understanding, yet merciless, one of the supreme novels of the century".

**టాల్ స్టాయ్ కొత్త మతం**

నిజ జీవితంలో కూడా టాల్ స్టాయ్ అంతస్సంఘర్షణకు లోనయ్యాడు. తప్పు చేస్తున్నానేమోనని చింతించాడు. చావు భయం వెన్నాడుతోంది. మానసులోని భావాలను అణచుకోలేక పోతున్నాడు. జీవించటానికి ఆధారమూ గోచరించటం లేదు. సమైక్యత, కనీస న్యాయం, నైతికత స్థిరత్వం వైపు మొగ్గపైనే దృష్టి పెట్టాడు. మతంలో సామాన్య రైతుకు అభయం, మరణానికి సంసిద్ధ మయ్యే ప్రశాంతత ఉన్నాయనుకొన్నాడు. దీనికి తనకు పూ ఆధ్యాత్మిక భావాలే శరణ్యమనిపించింది. మొదట సంప్రదాయ చర్చిపై ఆధార పడాలనుకొన్నాడు. కాని వారిలోని ఛాందస భావాలు, కర్మకాండలు నచ్చలేదు. చివరికి తన ధోరణిలో ఒక కొత్త మతాన్ని గురించి ఆలోచించాడు. ఈ విషయాలన్నీ "కన్ఫెషన్స్‌ఆఫ్ సెయింట్ ఆగష్టిన్"లో చర్చించి రాశాడు. ఆయన మతంలో దేవుడు అంటే అంటే అన్నిరకాల నమ్మకలున్నవారికీ చెందినవాడు. ఏదో ఒక భావానికి మాత్రమే చెందినవాడు కాదు. అంటే "యూని వర్సల్ గాడ్" జీసస్ అంటే ఒక లిజేండరి ఫిగర్ మాత్రమే. అన్ని కాలాలకు గొప్ప బోధకుడు. విజ్ఞానానికి పరాకాష్ట. ఆయన చెప్పిన "సేర్మాన్ ఆన్ ది మౌంట్"లో ఉత్తమ జీవికా విధానాలున్నాయి. అందులో చెప్పిన "resist not him that is evil" అనేది శాంతికి ప్రవచనంగా భావించాడు.

టాల్‌స్టాయ్‌ని రూసోతో పోల్చటం ఉంది. ఇద్దరి జీవన విధానాలు వేరే. "మనిషిలోని దైవానికి" సేవ చేయాలనే తత్త్వం లియోది. వ్యక్తిగతమైన ఇష్టం బలహీనత అన్నాడు. పనిలో మనమెవరమో మర్చిపోవాలి. కళ మానవ సహోదరత్వానికి మాధ్యమంగా ఉండాలి అన్నాడు. ప్రతిదీ కళాత్మకంగా ఉండాలని అంటాడు. చదువులో, పనిలో, వ్యక్తిగత భావాలలో, ప్రభుత్వంలో పబ్లిక్ సెంటిమెంట్ అన్నిటిలో కళ కనపడాలి. కళతోనే అన్నిటినీ కొలిచేవాడు. వీటినే "దిలివింగ్ కార్ప్సు", "దిపవర్, ఆఫ్ డార్క్ నెస్" మొదలైన నాటకాలలో నిక్షిప్తం చేశాడు. ప్రసిద్ధమైన కథలు "ది డెత్ ఆఫ్ ఇవాన్", "ఇల్యోవిచ్,

ది క్రాత్రడ్జ్ సోనాటా"లలో కూడా పోదిగాడు". "రిసరక్షన్" అనే నవల "వాట్ ఈజ్ ఆర్ట్"లు పూర్తిగా నైతికతను సమర్ధించేవే.

**మారిన మనిషి**

టాల్ స్టాయ్‌లో అంతులేని మార్పులు వచ్చాయి. వస్త్రధారణా మారింది. ముతక బట్టలు కట్టటం మొదలు పెట్టాడు. పాద రక్షలు లేకుండా నడిచాడు. ఇతరుల శ్రమ మీద జీవించటం నేరంగా భావించాడు. అన్నిరకాల వ్యసనాలకు, "ఆకళ్ళ"కు దూరంగా ఉన్నాడు. పొగ తాగటం మానేశాడు. శాకాహారంపైనా, తీవ్ర శిక్షల రద్దు పైనా పుస్తకాలు రాశాడు. డబ్బు బంధాల నుండి, ఆస్తి సంకెళ్ళ నుండి విడిపడాలని ఆలోచించాడు. ఇవన్నీ "అయ్యవారికి" బాగున్నా "అమ్మవారు సోన్యా"కు నచ్చలేదు. వీటిపై ఆలోచించటానికే ఆమె ఇష్ట పడలేదు. భార్య పూర్తిగా మతాన్ని చర్చిని సమర్ధించే వ్యక్తి. అందువల్ల టాల్ స్టాయ్ ఊగిసలాట ధోరణి భార్యకు అసలు నచ్చలేదు. ఆమె స్వతహాగా రైతు కాకపోవటం "కౌం టేస్" కావటం, ఆస్తిని విస్తృతపరచాలనే ఆలోచనలో ఉండటం, ఎస్టేట్ ను సంపన్నం చేయటానికి, పిల్లలకోసం ఎస్టేట్ రాబడి, సంపద వృద్ధి చేయాలనే ఆలోచనా ఆమెది. స్వచమైన తల్లిగా ఉండటమే ఆమె ఆదర్శం. ఆమెకు విరుద్ధంగా ప్రవర్తించలేక, తన భావాలను ఒదులుకోలేక సతమతమవుతున్నాడు. నిర్ణయాలను వాయిదాలపై వాయిదాలు వేస్తున్నాడు. తన ఆస్తినంతా ఆమె పేరున రాసేశాడు. తన పుస్తకాలపై వచ్చే ఆదాయం హక్కులు జనానికి ఇవ్వటానికి బదులు, ఆమెకే చెందేట్లు రాయటం చేసేశాడు. సోన్యా స్వంతంగా పబ్లిషింగ్ హౌస్ ఏర్పాటు చేసి భర్త రచనలను స్పెషల్ ఎడిషన్స్‌గా ముద్రించింది. వ్యాపార ధోరణి బాగా ఉన్న ఆమె దీనితో డబ్బు బాగా గడించి లాభాలు తీసింది.

**టాల్ స్టాయ్ అనుచర గణం**

టాల్ స్టాయ్ చాలా నిష్టగా ఉన్నాడు కాని భోగాలమధ్యే జీవిస్తున్నాడు. పూర్వానుభవాలు, బలహీనతలకు లోంగి పోతున్నాడు. తనను తానూ నియంత్రించు కోలేకపోతున్నాడు. యాత్రికుల సందర్శన పెరిగింది. అడపాదడపా పుస్తకాలు బూట్లు రిపైర్ చేసే బెంచిపై కూర్చుని రాస్తున్నాడు. ఇలా అనేక విధాల స్థిమిత జీవితం లేకపోయినా కుటుంబంలోను బయటా ఆయన ప్రతిభా కీర్తి పెరుగుతూనే ఉన్నాయి. ప్రజలకు ఆయన బోధలపై విపరీతమైన గురి ఏర్పడింది. ఆయన బోధనలను అమలు పరచటానికి కాలనీలు ఏర్పడ్డాయి. రష్యా యువకులు తమ గురూజీ టాల్ స్టాయ్ అనే చెప్పుకొన్నారు. తమను "టాల్ స్టాయన్స్"గా పిలుచుకొన్నారు. ఆయన రచనలు ప్రపంచ భాషల్లోకి అనువాదం పొందాయి. వాటి ప్రభావం ఇంకా పెరిగింది.

**కరువు - సహాయ పనులు**

1891లో రష్యాలో వచ్చిన భయంకర కరువును ఎదుర్కోవటానికి బాధితులకు సహాయ సహకారాలు అందజేయటానికి నడుం బిగించి అంకిత భావంతో రిలీఫ్ వర్క్‌ను చేబట్టాడు. దేశ విదేశాలనుండి కరువు నివారణకు అందుతున్న నిధులను గ్రామాలకు గ్రామాలకే ఆహారం సరఫరా చేయటానికి ఖర్చు పెట్టాడు. దీనితో టాల్ స్టాయ్ సేవానిరతి ప్రపంచమంతా పాకిపోయి ప్రపంచంలోనే గొప్ప గౌరవనీయుడు ఆరాధనీయుడయ్యాడు.

**అరిస్టోక్రసికి సింహస్వప్నం**

ఆయన జీవితంలో చివరి ఇరవై ఏళ్ళు రష్యన్ అరిస్టోక్రసికి సింహ స్వప్నం అయ్యాడు. ఆయన రచనలనేకం నిషేధించబడ్డాయి. దొంగచాటుగా ప్రింట్ చేసి సొమ్ము చేసుకొన్నారు. ఆయన సమర్ధకులను జైల్లో పెట్టి హింసించారు. ఆయననూ పోలీసు నిఘాలో ఉంచారు. 75వ ఏట చర్చి కూడా బహిష్కరించింది ఆయనను. సంప్రదాయ క్రిస్టియన్ మతాన్ని కాదన్నాడనేదే అభియోగం. ఆయనకున్న పరపతిని తగ్గించాలన్నదే ఆశయం.

**అహింసా పరమో ధర్మః**

ప్రభుత్వం పెట్టె హింసలను చూపించే దౌర్జన్యాలను ఆయన పరమ ప్రశాంత చిత్తంతో అహింసా మార్గంలో ఎదుర్కొన్నాడు. ఆయన విప్లవానికి పూర్తి వ్యతిరేకి. ప్రభుత్వ చేష్టలను తీవ్ర స్వరంతో నిరసించాడు. అన్యాయాలను అడ్డుకున్నాడు. ప్రతిపనిపైనా పూర్తిగా విచారణ జరిపి మాత్రమే చర్య తీసుకోవాలని ప్రభుత్వానికి తెలియజెప్పాడు. ఆ నాటి ప్రజల మనోభావాలకు టాల్ స్టాయ్ అద్దంపట్టాడు. విప్లవానికి టాల్ స్టాయ్ యెంత వ్యతిరేకి అయినా ఆయన మరణం తర్వాత 7 ఏళ్ళకు చివరి రివల్యూషన్ రష్యాలో జరిగింది.

**మహాత్ముడికి ఆదర్శం**

రష్యాలోని యాస్నాయ పోల్యానా దక్షిణ అమెరికాకు అర్ధ ప్రపంచం దూరంలో ఉంది. అక్కడ మోహన్ దాస్ కరం చంద్ గాంధి "the kingdom of God is within you" అని ప్రకటించాడు. టాల్ స్టాయ్‌కి జాబు రాస్తూ తాను ఆయన విశ్వాసపాత్రుడైన అనుచరుడిని అని చెప్పుకొన్నాడు. ఇద్దరి మధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు చాలాకాలం జరిగాయి. 1910 చివరలో టాల్ స్టాయ్ మహాత్ముడికి ఒక సుదీర్ఘమైన లేఖ రాశాడు. అందులో క్రిష్టియానిటి క్రీసు బోధనలను అనుసరించటం లేదని బాధ పడ్డాడు. అందులోనే చాలా తీవ్రంగా "the longer I live, and especially

now when I vividly feel the nearness of death, I want to tell others what I feel so very clearly and what to my mind is of great importance --namely that which is called passive resistance, but which in reality is nothing less than the teaching of love, uncorrupted by false interpretations. A s soon as force was admitted into love, love was no longer the law of life. And as there was no law of love, there was no love at all, except violence --that is the power of the strongest. Thus Christian mankind has lived for nineteen centuries" అని కుండ బద్దలు కొట్టి మరీ చెప్పాడు. ఇవే మహాత్ముడికి ప్రేరణ మంత్రాలైనాయి భారత దేశ స్వతంత్ర సాధనకు. అవే మార్టిన్ లూథర్ కింగ్‌కు ఆదర్శాలూ అయ్యాయి.

**సందర్శకుల సందడి**

ఈ ముసలివయసులో అన్నిరకాల అభిప్రాయాల వారి సందర్శనతో టాల్ స్టాయ్ క్షణం తీరిక లేకుండా గడిపాడు. ప్రముఖ కవులు, భక్తులు, రాజకీయ నాయకులు, రాజ్య పాలకులు అందరూ క్యూకట్టి దర్శనాలు చేసుకొని సర్వ సంగ పరిత్యాగి అయిన ఆ మహాను భావుడిని అర్చించేవారు. సన్మానించి గౌరవించేవారు. "సత్యం కోసం బాహ్య విషయాలను త్యాగం చేయటమే పరమార్ధం అని బోధించాడు లియో. ఇంట్లో ఈగల మోత బయట పల్లకీ మోత ఇంట్లో ఈగల మోత బయట పల్లకీ మోతలాగా తయారైంది టాల్ స్టాయ్ బతుకు. ప్రపంచమంతా ఆరాదిస్తూనే పూజిస్తున్న మహా రచయితా దార్శనికుడికి ఇంటిపోరు అదే దామాషాలోఅనులోమంగా పెరిగి ఇంట్లో పరువు విలోమంగా తగ్గిపోయింది సంతానాన్ని గారాబంగా చూసుకొంటూ వాళ్ళతో ఆటలాడుకొంటూనే ఉండే వాడు ఒకప్పుడు. వారికీ తండ్రిపై వల్లమాలిన గౌరవ ప్రేమలుండేవి. కాని ఇప్పుడు అంతా "ఉల్టా సీదా" అయిపోయింది. పిల్లల్లో స్వార్ధం పెరిగింది. తండ్రి త్యాగనిరతిని వాళ్ళు అర్ధం చేసుకోలేక గొడవపడ్డారు. పలకరింపులే లేవు. సానుభూతి ఎండమావి అయిపోయింది కుటుంబంలో. చిన్న కూతురు అలేక్సాంద్రా మాత్రమే తల్లినెదిరించి తండ్రి పక్షాన నిలిచింది. మిగతా వారంతా బద్ధ విరోధులైపోయారు.

**సుఖము లేదంతే**

సాధారణంగా మానవ జీవిత చరమాంకంలో సుఖ శాంతులతో వర్ధిల్లటం అందరూ కోరుకొనే వరం. పాపం ఈ ముసలాయనకు అది శాపంగా మారింది. అందరూ ఆయన్ను వ్యక్తిగతంగా బాధించారు హింసించారు, పీడించారు. భార్య సోన్యాకు లియో

అనుచరుడు వి.జి.చేర్కొవ్‌కు మధ్య "టగ్ ఆఫ్ వార్" కొనసాగింది. చేర్కొవ్ పెద్ద లాండ్ లార్డే. సంస్థానంలో ఉండే రైతుల జీవితాలను బాగు చేయాలనుకోన్నవాడే. రెండు విషయాలే తగాదాకు కారణాలై నిలిచాయి. మొదటిది తన రచనల మీద కాపీ రైట్ హక్కులు ప్రజలకు ఇవ్వకుండా భార్యకు దఖలు పరచటం. చరమాంకంలో ఉన్న మాస్టర్ లియోను ఆ హక్కులు ప్రజలకు దక్కేట్లు వీలునామాలో పొందుపరచమని చిలక్కి చెప్పినట్లు చెప్పాడు, ఇలా చేస్తే సోన్యాకు, ఆమె వారసులకు హక్కులు దక్కవు. రాయల్టీలు రావు. టాల్ స్టాయ్ చాలా రహస్యంగా భద్ర పరచిన డైరీలు చేర్కొవ్ అధీనంలో ఉండటం. చివరికి చిలికి చిలికి గాలివానైంది ఈ డైరీల విషయం లోనే.

**సోన్యా మానసిక స్థితి**

ఇంటిలోని పోరు గురించి ఆయన రాసుకొన్న ఎనిమిది డైరీలున్నాయి. సోన్యా మానసిక పరిస్థితి కూడా బాగా లేదు. మెనోపాజ్ బాధలెక్కువైనాయి. హిస్టీరికల్‌గా మారింది కూడా. భర్త రాసుకొన్న డైరీలలో తన అనారోగ్య విషయాలేమైనా ఉన్నాయేమోనని ఆమె అనుమానం అపోహ. భర్త చనిపోతే వాటిని ప్రచురించే హక్కు ఎవరికి దక్కుతుంది అనేదానిపై సందిగ్ధం ఆమెను పీడిస్తోంది. ఎప్పుడూ ఇంట్లో ఆమె ఏడుపులు పెడ బొబ్బలుగా ఉంది. ఇల్లు నరకప్రాయమై పోయింది. తరచుగా ఆత్మహత్యా ప్రయత్నాలూ చేసింది. భర్త ప్రతి కదలిక పైనా నిఘా పెట్టింది. చెప్పరాని రాయలేని అనేక నేరాలు ఘోరాలు ఆయనపై మోపి మానసిక క్షోభ పెట్టింది. 82 ఏళ్ళ ముదుసలి భర్తకు చేర్కొవ్‌తో అక్రమ సంబంధాన్నీ అంట గట్టింది. ముప్ఫై ఏళ్ళు భార్యకు లొంగి బతికాడు. ఇక ఏమాత్రమూ సహించలేక పోయాడు. స్వేచ్ఛ కావాలని పించింది. రాజీ ప్రశ్నే లేదన్నాడు.

**ఇంటి నుంచి బయటి ప్రపంచంలోకి – అటునుంచి అనంత లోకాలకు**

28-10-1910 ఉదయం 6 గం లకు అక్టోబర్ చలిగాలిలో తెల్లవారుజాముననే టాల్ స్టాయ్ లేచి తన స్వంత ఎస్టేట్ యాస్నా పోల్యానా వదిలి బాహ్య ప్రపంచంలోకి వచ్చేశాడు. ఎక్కడికి వెళ్ళాలో తెలియదు. ఎక్కడికి వెడుతున్నాడో తెలియదు .తన ఇంట్లో ఇంక ఒక క్షణం కూడా ఉండలేనని, ఉండరాదని మాత్రం నిశ్చయించుకొని బయట పద్దాడు ఆ మహా రచయిత. అయనను అమితంగా ఆరాధించే కూతురు అలేక్సాండ్రా తండ్రిని ఆయన సోదరి ఉండే ఒక కాన్వెంట్ దగ్గర కలుసుకోగలిగింది. మర్నాడు తండ్రీ కూతురు కలిసి తెలియని దూర తీరాలకు ప్రయాణం చేశారు. లియో చలితో వణికి పోతున్నాడు. జ్వరం తీవ్రంగా ఉంది. వీళ్ళు ఎక్కిన రైలు ఆస్టా పోవో స్టేషన్‌లో ఆగింది. స్టేషన్ మాస్టర్ దయ తలచి తను ఉంటున్న ఇంటిలో ఆతిధ్యమిచాడు. అప్పటికే న్యుమోనియా సోకి బాధపడుతున్నాడు. టాల్ స్టాయ్ ఇల్లు వదిలి వెళ్లి

పోయాడన్న వార్త గుప్పుమన్నది. ప్రపంచం అంతా ఆయన పక్షాన నిలిచింది. ఆస్టాపోవో గ్రామం అంతా జనసముద్రమై ఉప్పొంగింది. విలేకరులు, ఫోటోగ్రాఫర్లు, అధికారులు, గూఢచారి పోలీసులు, శిష్యులు, కొడుకులు, కూతుళ్ళు బంధుజనం అభిమానులు ఆసక్తి పరులతో అంతా హడావిడిగా ఉంది. భార్య సోన్యా కూడా చూడటానికి వచ్చింది కాని భర్త ఆమెను తన రూమ్ లోకి రానివ్వ వద్దని ఆంక్ష విధించాడు. మర్నాడు నవంబర్ 7 ఉదయం టాల్ స్టాయ్ స్పృహ కోల్పోయే దాకా ఆమెను లోనికి రానివ్వలేదు. ఆ తర్వాతే అనుమతించారు. కొన్ని గంటల తర్వాత ఆయన ఆయాస పడి, గాలి పీల్చుకోవటానికి చాలా కష్టపడి చివరికి అంతిమ శ్వాస వదిలాడు.

టాల్ స్టాయ్ తప్పులేమీ చేయని వాడూ, మహోన్నతుడూ కాకపోయినా ఆయన రష్యాసాహిత్య చరిత్రలో ఒక విస్తృత విశాల మానవుడు, అంతకు మించి అత్యంత గొప్ప నైతిక బలమున్నవాడు అనటంలో సందేహం లేదన్నాడు రచయిత లూయీ అంటర్ మేయర్.

**టాలెస్ట్ రైటర్, ఫిలాసఫర్ పసిఫిస్ట్ టాల్ స్టాయ్**

నవలాకారులలో అత్యున్నతుడు లియో అంది వర్జీనియా ఉల్ఫ్. జేమ్స్ జాయిస్ "he is never dull, never tired, never pedantic, never theatrical" అన్నాడు. డాస్టో విస్కీ "సజీవనవలాకారుల్లో గొప్పవాడు" అంటే, ఫ్లాబర్ట్ వార్ అండ్ పీస్ చదివి "ఆయనలో కళాకారుడు, సైకాలజిస్టూ" ఉన్నారన్నాడు. "seldom art work so much like nature" అని పొగిడాడు థామస్ మాన్. ప్రౌస్ట్, ఫాక్నర్, నబకోవ్ లదీ ఇదే అభిప్రాయం.

టాల్ స్టాయ్ ప్రైవేట్ ప్రాపర్టీ కింద భూములు ఉండటానికి ఇష్టపడలేదు. ఫాదర్ సేర్జియాస్‌ను చెకోవ్‌కు గోర్కీకి చదివి వినిపిస్తూ చివర్లో టాల్ స్టాయ్ కన్నీళ్లు ఆపుకోలేక కార్చేశాడు. ఆయన గాంధీగారికి రాసిన ఉత్తరం "లెటర్ టు ఎ హిందూ" పేరున ప్రసిద్ధి చెందింది. మహాత్ముడు ఆయనను "the greatest apostle of non violence that the present age has produced" అని శ్లాఘించాడు. దక్షిణాఫ్రికాలో ఏర్పాటు చేసిన రెండవ కాలనీకి గాంధీగారు "టాల్ స్టాయ్ కాలని" అని గౌరవ నామ కరణం చేశాడు. అంతర్జాతీయంగా భాషలన్నిటికి ఏక భాష "ఎస్పరాంటో" ఉండాలని ఆశించాడు లియో. డొకో భోర్ 1895లో తమ వద్ద ఉన్న ఆయుధాలను తగల బెట్టి శాంతి ఉద్యమాన్నిచేయటాన్ని సమర్ధించాడు. వారి భావాలను అంతర్జాతీయ వేదికపై చర్చించాడు కూడా. డొకో బోర్లు కెనడాకి వలసపోవటానికి సహాయ పడ్డాడు లియో. 1904 జపాన్-రష్యా యుద్ధాన్ని వ్యతిరేకించిన శాంతి కాముకుడు టాల్ స్టాయ్.❋



## 15. కవిత్వమే ఉపశమనంగా జీవించిన ఎమిలి డికిన్సన్ (1830-1886)

అమెరికన్ కవయిత్రి ఎమిలీ డికిన్సన్ రాసినవి ఎనిమిది వందల కవితలైనా జీవితకాలంలో ప్రచురింపబడిన కవితలు ఏడు మాత్రమే. దీనికి ఆమె చుట్టూ వ్యాపించిన అంతుతెలియని మిస్టరీయే కారణం. యదార్ధం కాని అనేక జీవిత చరిత్రలు ఆమె చుట్టూ అల్లేశారు. అందులో ఊహాగానాలే ఎక్కువై అసలు నిజం మరుగున పడి పోయింది. అయినా శతాబ్దాల కాలం ఆమె అజ్ఞాత వ్యక్తిగా జనం వెంట బడి వదలలేదు. బాలికగా ఉండగానే అద్భుత సౌందర్య వతి అనిపించుకొంది. అబ్బాయిల గుండెల్లో గాలమై గుచ్చుకొన్నది. మొదటరాసిన కవిత్వంలో శృంగారమే ఎక్కువ. కాని ముఖంలో ఏభావమూ జ్యోతకమయ్యేది కాదు. ఆకర్షణ తక్కువైనా మనిషి కొట్టొచ్చినట్లు కనిపించటం ఆమె ప్రత్యేకత. నల్ల కంచు రంగు కళ్ళు, తెల్లటి శరీరంతో టైటాన్‌లాగా అగుపించేది. ఫోటో తీయటానికి ఒప్పుకోని ఎమిలీ తానే స్వంతంగా తన చిత్రాన్ని మధుర జ్ఞాపికగా చిత్రించుకొన్నది. "నా ఫోటోలు ఏవీలేవు. నేను రేన్ అంటే ముక్కు వంకరగా పొట్టి రెక్కలతో గుండ్రని కురచ తోకతో సన్నని కాళ్ళతో కొంచెం మాత్రమే పొడవుగా ఉన్న "జీవ రాయి పిట్ట" (కంప చిట్ట పిట్ట) లాంటి చిన్నదాన్ని" అని చెప్పుకొన్నది. ఇలా తన గురించి చెప్పుకొన్న విషయాలు చాలా అరుదుగా మాత్రమే ఉన్నాయి.

### ఒంటరి జీవితం

ఎమిలి డికిన్సన్ అమెరికాలో మాసా చూసేట్స్ రాష్ట్రంలో ఆమ్ హెర్స్ట్‌లో 1830లో డిసెంబర్ 10న జన్మించింది. ఏ ఇంటిలో పుట్టిందో ఆ ఇంటిలోనే జీవించి ఆ ఇంట్లోనే మరణించింది. ఎప్పుడైనా కొద్దికాలం బయటిప్రదేశాలకు వెళ్ళినా ఆమె అక్కడే ఉండేది ఎప్పుడూ. బాల్యం ఆనందంగా గడిచింది. అన్న విలియం ఆస్టిన్, చెల్లెలు లవీనియా ఉండేవారు. ఇరవై ఏళ్ళు వచ్చాక ఒంటరి జీవితానికే అలవాటు పడిపోయింది. కాలక్షేపంగా యెడ తెగకుండా లెక్కలేనన్ని కవితలు రాసేది. కాని వాటిని ప్రచురించటానికి ఒప్పుకోనేదికాదు. బయటి ప్రపంచంతో సంబంధమే ఉండేదికాదు ఆమెకు. బయటి

ప్రజలపై ఏవగింపు కవితలలో కనిపించేది. తానెవ్వరికి చెందని దానినని బయటివారూ అలాంటివారే అయితే వారితో జతకట్టగలనని ఇది బయటికి చెప్పద్దని చెబితే ఇద్దర్నీ వెలి వేస్తారని రాసుకొన్నది. ఆకవితలు చూద్దాం –

"I am no body !Who are you ?-Are you nobody, too --Then there is a pair of us --don-t tell! -They would banish us, you know"

"How dearly to be somebody! How public, like a frog --To tell your name the livelong day --To an admiring bog"

**కుటుంబ నేపధ్యం**

ఎమిలీ తండ్రి కౌంటీలాయర్, శాసన సభ్యుడు, గవర్నర్ కౌన్సిల్ మెంబర్. పిల్లలు విద్యలో ఉన్నతి సాధించారు. ఎమిలి మాత్రం ఆటగోలు తనంతో, ఏదీ పట్టని దానిలాగా ఉండేది. దేవుని గూర్చి తండ్రి గురించి చెప్పేది. ఆమె చెప్పిన దాన్ని బట్టి చూస్తే తండ్రి ఎడ్వర్డ్ డికిన్సన్ అచ్చంగా బ్రౌనింగ్ కవి భార్య అయిన ఎలిజబెత్ బార్రెట్ తండ్రి మౌల్టన్ బారేట్‌లాగా ఉండేవాడనిపిస్తుంది. కాని కవయిత్రి ఎలిజబెత్‌లా కాకుండా, ఎమిలి బాల్యం నుండి తిరుగుబాటు ధోరణితో ఉండేది. ఎమిలీ ఆమ్ హీర్స్ట్ అకాడెమీ లోను, మౌంట్ హోలీ యోక్ ఫిమేల్ సేమినరిలోను చదివింది. శ్రద్ధగా చదివినట్లు కనిపించేది కాదు. ఏదీ పట్టనట్లే ప్రవర్తించేది. లెక్కలు, జామెట్రీ, కెమిస్ట్రి, ఆస్ట్రానమిలలో బాగా అభివృద్ధి కనపరచినా ఆమెకు చర్చి కట్టుబాట్ల విషయంలో ఇష్టం ఉండేదికాదు. ఆటగోలు తనం, ఉండేదని క్రిస్టియన్‌గా ఉండటానికి అభ్యంతరం చెప్పేది కాదని, ఆత్మ న్యూనతా భావం ఉండేదని ఆమె స్నేహితులు చెప్పేవారు. ఈ మాటే తండ్రితో "నేను చెడ్డ దాన్నే నాన్నా!" అని చెప్పి ఒక్క ఏడాదిలోనే హోలీ యోక్‌కు గుడ్ బై చెప్పేసింది.

**ఇరవైలలో ఏదో జరిగి ఉంటుంది**

ఎమిలీకి ముప్ఫై ఏళ్ళు వచ్చాక అన్నిటినీ పూర్తిగా విసర్జించేసింది. కాని ఆమె జీవితంలో ఇరవై ముప్ఫై ఏళ్ళమధ్య ఏదో
సంథింగ్ జరిగి ఉంటుందని చరిత్రకారుల నమ్మకం. అందుకే ప్రపంచానికి దూరంగా బతకటం అలవాటు చేసుకొన్నది అని భావన. కనుక శారీరక మానసిక ఉపశమనం కోసం ఏకైక విధానంగా కవిత్వం రాయటం ప్రారంభించి కడదాకా కొనసాగించింది. ఆమె భద్రంగా రహస్యంగా రాసుకొని దాచుకొన్న డైరీ వలన ఈ విషయాలన్నీ వెలుగులోకి వచ్చాయి. ఆమె జీవితంలో ఓడిపోయిందని అర్ధమవుతుంది. దాన్ని ఆమె "ప్రపంచానికి లేఖ" అని పేరు పెట్టింది. ఇంకేముంది ఊహలు చేసే వారికి చేతినిండా పని దొరికింది. అనేక పుక్కిటి పురాణాలు ఆమె చుట్టూ అల్లారు. అందులో నిజమెంతో కల్పన ఎంతో

తెలియనంత జటిలమైపోయింది ఆమె యదార్ధ జీవితం. 1930లో "the life and mind of Emily Dickinson" అనే పుస్తకాన్ని జేనేవీవ్ టగ్గార్డ్ అనే రచయిత రాసి ప్రచురించాడు. ఎమిలీ జీవితంలో ఇద్దరు ప్రేమికులు ఉన్నారని వారి వలననే ఆమెలోని శృంగార భావం తెగిపోయిందని తెలియజేశాడు. అందులో ఒకడు లియోనార్డ్ హంఫ్రీ అనే అతను ఆమెకు ఇరవై ఏళ్ళు రాకముందే చనిపోయాడు. రెండవ వాడు జార్జి గౌల్డ్. ఇతను ఆమె తండ్రికి భయపడి దూరమై ఆమెను ఒంటరిదాన్ని చేసి ఇంటి గార్డెన్‌కే పరిమితమయ్యేట్లు చేశాడని. కాని ఎమిలీకి అతను అంటే గుండె నిండా ప్రేమ ఉండేదని, కాని బహిర్గతం కాకుండా అణచు కొన్నదని రాశాడు. కనుక బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా "Nun of Amherst"గా మిగిలిపోయిందని చెప్పాడు.

అదే ఏడాది జోసేఫిన్ పోలేట్ అనే ఆతను "ఎమిలీ డి కిన్సన్ –ది హ్యూమన్ బాౕగ్రౌండ్" పేర ఒక పుస్తకం రాసి మూడో వ్యక్తిని చెప్పి అతని వలననే ఆమె ప్రేమ జీవితం భగ్నమైపోయిందన్నాడు. ఆ భావాలే ఆమె కవిత్వంలో చోటు చేసుకొన్నాయని తేల్చాడు. ఇతడు ఎమిలీ కుటుంబానికి అతి సన్నిహితురాలైన హెలెన్ హంట్ భర్త ఎడ్వర్డ్ హంట్. రెండేళ్ళ తర్వాత "ఎమిలి డి కిన్సన్ ఫేస్ టు ఫేస్" పుస్తకం రాసిన మార్తా డి కిన్సన్ బియాంచి అంటే ఎమిలీ మేనకోడలు ఎమిలికి పెళ్లి అయిన ఒకబ్బాయితో ఎఫైర్ ఉండేదని అతని భార్యకు అన్యాయం చేయలేక ఎమిలి కుమిలిపోయి, ఇంటికీ, ఏకాంతానికి అంకితమైపోయిందని వివరించింది. 1938లో మరొక పుస్తకం "దిస్ వజ్ ఏ పోయెట్" రాసిన జార్జ్ ఫ్రిస్బీ విచేర్ ఈ గాసిప్‌లకు స్వస్తి పలికాడు. సూటిగా విషయ పరంగా పరిశోధన చేసి ఆమె జీవితాన్ని ఆవిష్కరించాడు. ఇందులో ఎమిలికి ఇరవై – ముప్ఫై ఏళ్ళ మధ్యకాలంలో రెండు పెద్ద నష్టాలు జరిగాయని. మొదటగా ఆమె చేత "డియర్ ఫ్రెండ్ అండ్ టీచర్" అని పించుకొన్న బెంజమిన్ ఫ్రాన్క్లిన్ న్యూటన్ అనే గొప్ప సారస్వతారాధకుడు, కాలానికంటే ముందు ఆలోచించే బుద్ధిజీవి. ఆమె ఇతని ప్రభావంలో పడేనాటికి అతని వయసు ఇరవై ఏడు – ఆమెకు పద్దెనిమిది. కాని మూడేళ్ళ తర్వాత న్యూటన్ తనకంటే పన్నెండేళ్ళు పెద్దదైన మరో అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. దురదృష్ట వశాత్తు న్యూటన్ రెండేళ్ళ తర్వాత క్షయ వచ్చి చనిపోయాడు. ఈ విషయాన్ని థామస్ వెంట్ వర్త్ విడ్డింగ్ టన్ అనే ఒక విద్వాంసుడికి ఉత్తరం రాస్తూ ఎమిలీ "నేను చిన్నపిల్లగా ఉన్నప్పుడు నాకు ఒక స్నేహితుడు ఉండేవాడు. అతను నాకు అమరత్వం (ఇమ్మోర్టాలిటి) బోధించాడు. దానికి దగ్గరవుతున్న సమయంలో అతను మళ్ళీ తిరిగి రాలేదు. తర్వాత నా గురువు మరణించాడని తెలిసింది, అప్పటినుంచి నాకు అక్షరమే నా మిత్రమైంది. మరొకాయన నా జీవితంలో ప్రవేశించాడు. కాని ఆయనే నన్ను గురువుగా అనుకొని సంతృప్తి పడక ఈ దేశం వదిలి వెళ్ళిపోయాడు". ఈ రెండు నష్టాలు ఆమె కవిత్వాన్ని భర్తీ చేశాయి. తరచుగా ఆమె రాసిన లైన్లు "I

never lost as much but twice"ఈ విషయాన్ని ధృవీకరిస్తాయి. కాని ఆ రెండుకవితలు బాగా ప్రాచుర్యం పొందాయి.

1. "My life closed twice before its close --It yet remains to see --If immortality unveil --A third event tome"

2. "So huge so hopeless to conceive --As these that twice befell -.Parting is all we know of heaven --And all we need of hell"

**మూడో ప్రేమా మొగ్గలోనే వాడిపోయింది**

రెండవసారి జరిగిన సంఘటనతో ఎమిలీ డికిన్సన్ మరీ కుంగిపోయింది. తండ్రితో కలిసి ఫిలడెల్ఫియా వెళ్ళింది. అక్కడ రివరెండ్ చార్లెస్ వాడ్స్ వర్త్ గారి బోధన విన్నది. ఆయన అంటే అభిమానం, ప్రేమ ఆరాధనా కలిగాయి. ఆయన బోధనలు బాగా నచ్చి ప్రేమలోపడింది. అప్పటికే అతనికి పెళ్లి అయి నలభై ఏళ్ళ వయసులో ఉన్నాడు. ఆమె వయసు ఇరవై మూడో ఇరవై నాలుగో ఉంటుంది అప్పుడు. అతను ఆర్చ్ స్ట్రీట్ ప్రెస్ బిటేరియన్ చర్చికి పాస్టర్గా ఉన్నాడు. చాలా అంకితభావంతో పనిచేస్తున్నాడు. తాను తన బోధనకు ఆకర్షితురాలైన ఎమిలీ గుండెల్లో ప్రేమ జ్వాల రగిలించి నట్లు ఆయనకు తెలియనే తెలియదు. అం హర్స్టుకు తిరిగి వచ్చేసింది. కాని ఆ మధుర భావనలు ఆమెను వదిలిపెట్టలేదు. అపస్మారకంగా ఆ పాస్టర్ ఆమె మనసులో ఉండిపోయాడు. ఆ తర్వాత ఒకటి రెండు సార్లు ఫిలడేల్ఫియాకు వెళ్ళింది. కాని అంగుళం కూడా ప్రేమ రథం ముందుకు సాగలేదు. అతని మనసు మార్చలేకపోయింది. అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేదని ఆ గ్రామ ప్రజలు చెప్పుకొనేవారు. ప్రేమ కవాటం మూసుకు పోయింది. చేసేదిలేక ఈ సంఘటనలను నాటకీయంగా కవితలలో చొప్పించింది. కలలో ఆతనితో సాంగత్యం జరిగినట్లు కవితలు రాసింది. ఇంత చేసినా చివరికి ఎమిలీకి నిరాశే మిగిలింది. "అంతా భ్రాంతి యేనా జీవితానా నిరాశేనా" అని దేవదాసులో పార్వతిలాగా పాడుకోవటమే మిగిలింది. తన దుఃఖాన్ని విరహాన్ని చాలా హై పిచ్‌లో వ్యక్తం చేసుకొన్నది. అది వాస్తవం కాకపోయినా కలల సౌధంలో విహరించి ఆత్మతృప్తి పడింది. అందుకోసమే అంటే ఆత్మోపశమనం కోసమే కవిత్వం రాసింది ఎమిలీ డికిన్సన్. తనను తాను ఆయనకు అంకితమైపోయినట్లు, దేవుడు అందరికి అన్నీ ఇచ్చి తనను నిర్లక్ష్యం చేశాడని బాధ భరించలేనిదని కవితలలో వాపోయింది.

ఎమిలీ మాటలలోనే ఆమె దుఖాన్ని బాధను ప్రేమారాధనను తెలుసుకొందాం – "I gave my self to him", "mine by the right of the white election", "God gave a loaf to every bird, just a crumb to me", "the heart

asks pleasure first", "I can not live with you", "pain has an element of blank", "the element of blank grew wider", "the fugitive whom to know was life" అని భావించిన వాడ్స్ వర్త్‌ను 20 ఏళ్ళు చూడనే లేకపోయింది. 1880 వేసవిలో ఒకసారి అతను వచ్చాడు. ఆ తర్వాత రెండేళ్లకే అతను చనిపోయాడు. అతని చిత్రం అతను బోధించిన సెర్మన్‌ల గ్రంథం ఎమిలీ డికిన్సన్ పదిలంగా గుప్తంగా దాచుకొని భద్రపరచిన దాచుకొన్న వాటిలో దొరికాయి.

**25 ఏళ్ళు తనకోసమే తాను జీవించిన ఎమిలి**

ఇరవై అయిదేళ్ళు ఎమిలి డికిన్సన్ తనకోసమే తాను జీవించింది. సంగీతం అంటే ఆమెకు అభిమానం. కాని ఇతరులతో కలిసిపాడటానికి ఒప్పుకోనేదికాదు. వాళ్ళు అక్కడమ్యూజిక్ రూమ్‌లో సమూహంగా గానం చేస్తుంటే బయట హాల్‌లో ఒంటరిగా కూర్చుండిపోయేది. ఇంటి ప్రక్కల ఉన్నవారికి చిన్న చిన్న కవితలు పూలు పంపేది కాని వాళ్ళ ఇళ్ళకు ఎన్నడూ వెళ్లేది కాదు. ప్రేమికుడు వడ్స్ వర్త్ మరణించిన తర్వాత మరీ ఒంటరిదై పోయింది. అతడు మరణించాడని ఆమె అనుకోలేదు. తనలో శ్వాసిస్తున్నాడని భావించేది. తమకు ఎడబాటు అనేది లేదనుకోనేది. "do not yet fathom that he had died and hope I may not till he assist me in another world" అని రాసుకొన్నది. ఎనిమిది నెలల తర్వాత ఆమెకు నెర్వస్ బ్రేక్ డౌన్ వచ్చింది. చివరి రోజులలో తండ్రికి స్నేహితుడైన "జడ్జ్ లార్డ్"తో సన్నిహితంగా ఉండేది. ఆయన కూడా ఎమిలీకంటే ముందే చనిపోయాడు. బ్రైట్స్ డిసీజ్ అనే వ్యాధి 55వ ఏట సోకింది ఎమిలీకి. 15-5-1886న ఎమిలీ డికిన్సన్ మరణించింది.

**మరణానంతరం కవితా సేకరణ ముద్రణ**

జీవించి ఉండగా ఏ పుస్తకాన్నీ అచ్చు వేయటానికి ఎమిలీ ఒప్పుకోలేదు. ఆమె మరణం తర్వాతే వాటిని ముద్రించటం జరిగింది. ఇది చాల కష్ట సాధ్యమైన పని అయింది. ఆమె రాసిన వెయ్యి కవితలు వేర్వేరు ప్రదేశాలలో లభించాయి. అవి చిందర వందరగా గజిబిజిగా రసీదుల వెనకా బ్రౌన్ పేపర్‌ల మీదా రాయబడి ఉన్నాయి. ఒకే పాదానికి అనేక రూపాలూ ఉండేవి. ఒకే పదానికి వేర్వేరు మాటలుకూడా రాయబడి అందులో దేన్నీ స్వీకరించాలో తెలియని సందిగ్ధత కూడా ఏర్పడింది. ఎమిలీ చివరి సంవత్సరాలలో సన్నిహితంగా ఉన్న ప్రక్కింటి యజమాని మేబెల్ లూమిస్ టాడ్ తో ఎమిలీ అన్న కూతురు లవినియ డికిన్సన్ కలిసి ఎలాగో అలాగా కొంత పరిష్కరించి మొదటి భాగంగా 115 కవితలతో "Poems of Emily Dickinson" పేరుతో 1890లో ముద్రించింది. అప్పుడే చిన్న డిక్షనరీ "DICKINSONIANA" ప్రచురణ

జరిగింది. తర్వాతా ఆమె పూర్తి కవితలన్నీ ముద్రణకు వచ్చాయి. ఎమిలీ రాసిన ఉత్తరాలు అచ్చు అయ్యాయి. ఆమెపై అనేక జీవిత చరిత్రలు వచ్చాయి. 1950లో ఎమిలీ మొత్తం కవితలు ఉత్తరాల వ్రాత ప్రతులన్నీకొని సేకరించి హార్వర్డ్ యూనివర్సిటికి అందజేశారు. వీటిని పుస్తకాలుగా ప్రచురించినా, సాహిత్యాభిమానులకు సంతృప్తి కలుగలేదు. ఇంకా నాణ్యమైన అధీకృత ప్రచురణలు రావాలని డిమాండ్ చేశారు. చివరికి ఈ బాధ్యతను ప్రముఖ విద్యావేత్త అమెరికా దేశపు మొట్ట మొదటి ముఖ్య కవి ఎడ్వర్డ్ టేలర్ కవితలను ప్రచురించిన థామస్ హెచ్ జాన్సన్‌కు అప్పగించారు. ఆయన జాగ్రత్తగా ఎడిట్ చేసి ఎమిలీ కవితలను 1939లో ప్రచురించాడు.

**ఏది నిజం ఏది కల్పన**

ఎమిలీ కవితలలో నిజం ఎంత? కల్పనా ఎంత అని ఇంతవరకు ఎవరూ విడమర్చి చెప్పలేకపోతున్నారు. విలియం స్టాన్లీ "Emily was a spirit that emerged independent of the material event" అన్నాడు. సంఘటనను అనుభవాన్ని జోడించి అత్యద్భుతంగా రాసిన కవిగా మరో విమర్శకుడు చెప్పాడు. ఆమెలో శైలీ భేదాలు చాలా ఉన్నాయన్నారు. ఆమె ఒక సృజనశీల కవి అన్నారు కొందరు. న్యు ఇంగ్లాండ్ అంటే మాసా చూసేట్స్‌కు చెందిన హైమ్స్‌ను కొత్త తరహాలో కొత్త ధ్వనులతో అమెరికన్ కవిత్వంలో ప్రవేశపెట్టి కొత్త వొరవడి సృష్టించింది. సమకాలీన కవులకు దిగ్భ్రమ కల్గించి, అభిమానులకు ప్రేరణ కలిగించి రెండు తరాల తర్వాత కవిత్వ పటుత్వంతో మెప్పించింది. సస్పెండేడ్ రైమ్స్, స్లాంట్ రైమ్స్ హాఫ్ రైమ్స్‌కు ఆద్యురాలైంది. కొత్త కవిత్వ పరిభాషను సృష్టించింది. ఎన్నో భావచిత్రాలను సృష్టించింది. "No other poet has accomplished more dazzling comprehensions -- emotional tension is tightened in", "death,"stiff stare" 'in the word zero to describe the feeling of horror upon encountering a snake", "zero at the bone" అని ఆమె ప్రత్యేకతను కీర్తించారు.

శోక తప్త వనితగాను, ఆనందంతో చిందులు వేసే చిన్నపిల్లగాను రెండు విధాలా కవిత్వం రాసింది. అప్పుడప్పుడు ఆమె "స్పాయిల్డ్ చైల్డ్" అన్న భావనా చదివే వారికి కలిగిస్తుంది. చివరగా ఒక మిస్టరి మిగిలిపోయింది అంటారు రచయిత లూయీ అంటర్ మేయర్ "The mystery of Emily Dickinson is not the way she lived, but the way she wrote, a mystery which enabled a New England recluse (lonely) to charge the literature of her country with poems she never cared to publish"

"A solemn thing -- it was -- I said --
A Woman -- White -- to be --
And wear -- if God should count me fit --
Her blameless mystery --
Emily Dickinson, c. 1861[83]

They shut me up in Prose --
As when a little Girl
They put me in the Closet --
Because they liked me ", "still"
Still! Could themself have peeped --
And seen my Brain -- go round --
They might as wise have lodged a Bird
For Treason -- in the Pound --

A solemn thing -- it was -- I said --
A Woman -- White -- to be --
And wear -- if God should count me fit --
Her blameless mystery --

They shut me up in Prose --
As when a little Girl
They put me in the Closet --
Because they liked me "still"
Still! Could themself have peeped --
And seen my Brain -- go round --
They might as wise have lodged a Bird
For Treason -- in the Pound --



## 16. అమెరికా ఆధునిక నవలా సాహిత్యానికి ఆద్యుడు – మార్క్ ట్వేన్ (1835 –1910)

అమెరికా సాంప్రదాయ సాహిత్యం (క్లాసిక్ లిటరేచర్) ఎమర్సన్, లాంగ్ ఫెలో, థోరో, హతారన్ వలన 19వ శతాబ్దపు మధ్యభాగంలో బాగా స్థిరపడింది. అమెరికా సివిల్ వార్ తర్వాత న్యు ఇంగ్లాండ్ అంటే మాస చూసేట్స్ రాష్ట్ర సంస్కృతిని, పెద్దరికాన్ని చాలెంజ్ చేసే ఇద్దరు మహా రచయితలు వచ్చారు. అందులో న్యు యార్క్ నివాసి పెద్ద గొంతుకతో తిరస్కార గర్జనలు చేసి అసలైన అమెరికా కవిత్వానికి "లీవ్స్ ఆఫ్ గ్రాస్"తో ఆద్యుడై నిలిచినవాడు "వాల్ట్ విట్మన్" కవి. రెండవ వాడు మిస్సోరీ రాష్ట్రానికి చెందిన స్థానిక భాషా సంప్రదాయాలకు పట్టం కట్టిన మార్క్ ట్వేన్ అని అందరు పిలిచే "సామ్యుల్ లాంగ్ హార్న్ క్లేమేన్స్" ఈ ఇద్దరితో అసలైన అమెరికా కవిత్వం, నవల, సాహిత్యంలో ప్రవేశించాయి. వారిద్దరూ అమెరికా జాతీయ కవిగా జాతీయ నవలా రచయితగా గుర్తింపుపొంది తరతరాలుగా అమెరికా సాహిత్యాన్ని ప్రభావితం చేస్తున్నారు. అచ్చమైన అమెరికా దేశీయ సాహిత్యం వీరిద్దరితోనే ప్రారంభమైంది.

### బాల్యం–తండ్రి సంచార జీవితం

శామ్యూల్ క్లేమేన్స్ అనే మార్క్ ట్వేన్ వర్జీనియాకు చెందిన – జాన్ మార్షల్ క్లేమేన్స్ , కెంటకి కి చెందిన జెన్ లాంటన్ క్లేమేన్స్ దంపతుల సంతానంలో ఆరవ వాడు. 30–11–1835న మిస్సోరీకి సరిహద్దులో ఉన్న ఫ్లారిడాలో జన్మించాడు. ఆనాడు ఆ గ్రామ జనాభా వందమంది మాత్రమే. ట్వేన్ తండ్రి చాలా సూటిగా నిజాయితీగల లాయర్ మాత్రమె కాక వ్యాపారి కూడా. దేనిలో చెయ్యిపెట్టినా ఉప్పు నిప్పు అయ్యేది. అన్నిరకాల వ్యాపారాలలో చేతులు కాల్చుకొన్న ఘటం. ముక్కు సూటి మనిషి ఈ లక్షణాలే మార్క్ ట్వేన్‌కూ సంక్రమించాయి. వీరి కుటుంబం బ్రిటిష్, ఐరిష్ రక్తంతో కలిసిపోయింది. వీరి పూర్వీకులు అరిస్టో క్రట్స్ అని తెలుస్తోంది. స్థిమితంగా స్థిరంగా ఒకచోట ఉండలేదు వారు. జీవితం ఎప్పుడూ అభద్రతా భావంతోనే వారికి గడిచింది. క్వేకర్ సంప్రదాయంలో పెరిగిన వంశాలు వారివి.

మార్క్ ట్వేన్‌కూ ఈ అస్థిరత తప్పలేదు. ట్వేన్ పుట్టటానికి కొన్ని నెలల ముందే తండ్రి వీరి కుటుంబాన్ని టేన్నేసే నుండి ఫ్లోరిడాకు మార్చాడు. లాగ్ కేబిన్‌లలో క్లాప్ బోర్డ్ ఇళ్ళల్లో ఉన్నాడు. తండ్రి ఆదాయం ఏమంత పెద్దగా ఉండేది కాదు. అందుకని మళ్ళీ కుటుంబాన్ని మిస్సోరిలోని "హానిబాల్"కు క్లేమేన్స్ నాలుగో ఏట మార్చాడు. ఇక్కడే మార్క్ 18 ఏళ్ళు వచ్చేదాకా ఉన్న జ్ఞాపకం. కాని జీవితాంతం ఇక్కడే ఉండిపోవాలనుకొన్నాడు.

**కళ్ళముందు చరిత్రనే నవలగా మార్చిన ఘనుడు**

హానిబాల్ జనాభా 500. ఇదే తాను పుట్టిన ఊరుగా ఆయన భావించేవాడు. ఆ గ్రామ పద్ధతులను, వాతావరణాన్ని, ప్రజలని మనసులో బలంగా నిలుపుకొన్నాడు. ఆ విషయాలలో ఏ రకమైన మార్పులూ రాలేదని ఆయన రాసిన నవలలో మనకు కనిపిస్తుంది. "టాం బ్లాం కెన్ షిప్" అనే తిరుగుబోతు కుర్రాడు ఎప్పుడూ నదిలో కాలక్షేపం చేసేవాడు, ఆ ఊరి పెద్ద తాగుబోతు కొడుకు అమెరికా దేశపు నవలా చరిత్రలో "హకిల్ బెర్రిఫిన్"గా మార్క్ ట్వేన్ చేత అవతారం దాల్చాడు. ఆకుర్రాడు నాగరిక లక్షణాలు తనకు వద్దనే తత్త్వం వాడు. అలాగే శామ్యూల్ తల్లి ఆ నవలలో "ఆంట్ పోలీ" అయింది. తమ్ముడు హెన్రి ఆదర్శవంతామైన సిడ్ అయ్యాడు. ఎంతో కాలంగా బానిస బతుకు హీనంగా బతుకుతూ బానిస క్వార్టర్‌లలో ఉంటున్న నీగ్రో – ఈ నవలలో "జిం" అయ్యాడు. సగం మొరటుతనం సగం నాగరికత ఉన్న వితంతువు హక్ అనుచరి "మిసెస్ హాలిడే" కాస్తా నవలలో "విడో డగ్లాస్" అయి కూర్చుంది. ట్వేన్‌తో ఆడి పాడి తిరిగిన స్నేహిత బృందం కూడా డ్యూక్, డాఫిన్ వగైరా వేర్వేరు పాత్రల ద్వారా నవలలో స్థానం సంపాదించుకొన్నారు. వేసవికాలాలు గడిపిన ఫారం హౌస్ ఆయన రాసిన అనేక నవలలో సజీవమై శాశ్వతంగా నిలిచిపోయింది. ఇవన్నీ నవలా పుటలలో చేరిపోయాయి. దీనికి కారణం అది అంత పెద్ద విశాలమైన ఫారం హౌస్ కాకపోవటమే అన్నాడు మార్క్ ట్వేన్. ఇదీ ట్వేన్ మార్క్ నవల. అదే అమెరికా అసలైన సాహిత్యమై చరితార్ధమయింది. కాదు అలా చేశాడు మార్క్ ట్వేన్. నేటివిటికి పట్టం కట్టాడు. ఎక్కడో ఇంగ్లాండ్‌లోనో ఫ్రాన్స్‌లోనో లేక ఏ ఇతర వలసవాదుల కథలను కాక తాను పుట్టి పెరిగిన తన తోటి జీవించిన వ్యక్తుల, పరిసరాలను సాహిత్యంలోకి ఎక్కించి ఇదీ అసలైన అమెరికా జనజీవితం అని చూపించిన ఘనత సాధించాడు మార్క్ ట్వేన్.

**తండ్రి మరణం – కుటుంబ బాధ్యత**

ట్వేన్‌కు 12 ఏళ్ళు రాగానే తండ్రి చనిపోయాడు. అప్పటికి కుటుంబ ఆర్ధిక

పరిస్థితి పరమ దయనీయంగా ఉంది. చేతిలో చిల్లిగవ్వ నిలవ చేయకుండా తండ్రి చనిపోయాడు. అప్పటికి ఎలిమెంటరి స్కూల్‌లో మాత్రమే చదివిన ట్వేన్ అర్ధాంతరంగా చదువుకు స్వస్తి చెప్పాల్సి వచ్చింది. చేసేది లేక పెద్దన్న ఓరియన్ దగ్గర "ప్రింటర్స్ డెవిల్"గా అప్రెంటిస్ చేశాడు అంటే, అచ్చు అక్షరాలూ కూర్చటం, అచ్చు అయినదానిలో తప్పులు సరిచేయటం అంటే ప్రూఫ్ రీడింగ్ చేస్తూ ఉండే వాడన్న మాట. అందుబాటులో ఉన్న ప్రతిపుస్తకాన్ని చదివేవాడు. ఇరవైవ ఏడు వచ్చేసరికి ఇంగ్లీష్ క్లాసిక్ సాహిత్యమంతా చదివేశాడు. నైపుణ్యం గల ప్రింటర్‌గా యాత్రీకుడిగా మంచిపేరు పొందాడు. తూర్పు వైపున్న న్యుయార్క్, ఫిలడెల్ఫియా వగైరా ప్రాంతాలన్నీ తిరిగి చూశాడు. మళ్ళీ అన్న ఓరియన్ పనిలో చేరాడు. అప్పుడు అన్న అయోవాలో "కియోకుక్"లో ఒక పత్రికను నడుపుతున్నాడు. జర్నలిజం అంటే ఇష్టమే ఉన్నా పెద్దగా ఆసక్తి లేదు అన్నదమ్ములిద్దరికి. కాని అదే వారిద్దరినీ విద్యావంతుల కంటే ఎక్కువ చదువు వచ్చేట్లు చేసింది అనటంలో అతిశయోక్తి లేదు. తనగురించి రాసుకొంటూ "నేను న్యూస్ పేపర్ రిపోర్టర్ గా నాలుగేళ్ళు నగరాలలో పని చేశాను. అప్పుడు ప్రతి విషయంలోను ఉన్న లోపలి విషయాలను క్షుణ్ణంగా పరిశీలించ గలిగాను. శాసనసభకు రిపోర్టర్‌గా రెండు సమావేశాలకు పని చేశాను. అప్పుడు నేను "చిన్న బుర్రల పెద్ద మనుషుల్ని" ముగ్గుర్ని చూశాను. వారిలో ఉన్న అతి స్వార్థబుద్ధి, పిరికితనం జీర్ణించుకుపోయిన మనసులుతో ఉన్న "దేవుడు చేసిన మనుషుల"ను చూశాను" అని యాభై ఏళ్ళ వయసులో మార్క్ ట్వేన్ ఒక కరస్పాండెంట్‌కు రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు. ఇలాంటి వారి దుష్ప్రవర్తన ప్రభావం వలనకాని లేక ఏదో సాహసం చేయాలన్న తలంపుతో కాని దక్షిణ అమెరికా వెళ్లి సంపద సాధించాలనన్న కోరికతో గాని ఉండేవాడు. కానీ ఇవన్నీ ఊహా ప్రపంచపు గాలి సౌధాలేనని తెలుసుకొని వాటి జోలికి పోకుండా ఒక మిసిసిపి పైలట్ దగ్గర అప్రంటిస్‌గా చేరాడు.

## స్టీం బోట్ పైలట్

ఇరవై రెండేళ్ళ వయసులో మార్క్ నావ పైలట్ అయ్యాడు. స్టీం బోట్ వాళ్ళతో పరిచయం బాగా ఏర్పడింది. జాతి భేదం లేకుండా అందరూ సన్నిహితులయ్యారు ఈ అనుభవాలను వ్యాసాలూగా రాస్తూ "నేను చిన్నపిల్లాడుగా ఉన్నప్పుడు" అని మొదలు పెట్టి "ఓల్డ్ టైమ్స్ ఆన్ ది మిసిసిపి" ధారావాహికంగా రాశాడు. అది పెరిగి పెరిగి "లైఫ్ ఆన్ ది మిసిసిపి"గా బృహద్రూపం దాల్చింది. మిసిసిపినది పడమటి తీరంలో ఉన్న ఆయన గ్రామస్తులందరికీ దీనితో బోట్ యాత్ర చేయాలనే కోరిక పెరిగింది. ఇంకా చాలా గొంతెమ్మ కోరికలు ఉండేవి. కాని అవి సుప్తంగానే ఉండిపోయాయి. అప్పుడు ఊళ్లోకి ఒక సర్కస్ వచ్చింది అది చూసి సాం ముతా అంతా అందులో ఉండే

బఫూన్ (క్లౌన్) లాగా ఉండాలనుకొన్నారు. మొదటి నీగ్రో వచ్చి బాధలన్నీ ఏకరువు పెడితే అలాంటి జీవితాన్ని అనుభవించాలని అనుకొన్నారు. చిన్నతనం కనుక ప్రతిదీ మనసు ఆలోచన మీద ప్రభావం చూపేది. తాము మంచిగా జీవిస్తే దేవుడు తమలని సముద్రపు దొంగలుగా (పైరేట్స్ )గా మారుస్తాడనే విశ్వాసమూ కలిగింది. ఇలాంటి ఎన్నో ఆలోచనలు సముద్ర తరంగాలుగా వచ్చిపోతూ ఉండేవి ఆ వయసులో. కాని స్టీం బోట్మన్ అవాలన్న కోరిక మాత్రం స్థిరంగా ఉండిపోయింది. ఈ రకమైన ఆలోచనల వలన మార్క్ ట్వేన్‌లో అనేక విషయాలపై ఆసక్తి కలవాడని వాటిలో నైపుణ్యం ఉండేదని కష్టమైన పనుల్ని చేయటానికి ఎప్పుడూ వెనకడుగు వేయలేదని తెలుస్తోంది అని ఆయన జీవిత చరిత్రకారులు అన్నారు. ఈ ఆలోచనలే అమెరికా దేశపు స్థూల రూపాన్ని ఆవిష్కరించింది. అనేక తరహా మనుషులతో పరిచయాలు కలిగించాయి. మనుషుల అంతరంగాలను పరిశీలించే మహా నేర్పు అలవడింది. రివర్ పైలట్‌గా ఉండిపోయేవాడే. బాగా డబ్బు వచ్చి మీద పడేదే. ధనికుడిగా చెలామణీ అయ్యేవాడే కాని నాలుగేళ్ల తర్వాత అమెరికా అంతర్యుద్ధం వచ్చి పైలటింగ్‌కు మంగళం పాడింది.

**బానిస వ్యతిరేకత**

పైలట్ నుండి తొలగింప బడ్డాక ట్వేన్ యుద్ధ సైనికుడయ్యాడు. అనుకోకుండా కాన్ఫడరేట్ సైనికుడయ్యాడు. ఆయన పైలట్ స్నేహితుడు న్యూయార్క్‌వాడు. సౌత్ కరోలినా రాష్ట్రం యూనియన్ నుంచి వేరైపోయింది అని తెలిసింది. మిత్రుడు యూనియన్‌ను సమర్థించాడు కనుక తానూ దానినే సమర్థిస్తున్నానని చెప్పాడు. ఈ విషయాన్ని సగం నవ్వు సగం హేళన ధ్వనించేట్లు “the Private History of a Campaign that Failed”అన్నాడు. తానూ యెంత వాదించినా మిత్రుడు వినిపించుకోలేదు. దీనికి కారణమన్ తన తండ్రికి బానిసలున్నారు. తండ్రి ఒకసారి ఈ కఠోర సత్యాన్ని ఒప్పుకొని బానిసత్వం హేయం అన్నాడని తన దగ్గరున్న ఒకే ఒక నీగ్రో బానిసను విడుదల చేస్తానని చట్టవీ ఒప్పుకొంటే అతనికి ఆస్తికూడా ఇస్తానన్నాడని గుర్తుచేశాడు. ఇలాంటి తాటాకు మంటలేవీ పని చేయవు అన్నాడు మిత్రుడు. కొంతకాలానికి దిగువ మిసిసిపి ప్రాంతం విడిపోయే ఆలోచనలోకి పూర్తిగా వచ్చింది. అప్పుడు తానూ ఎదురు తిరిగానని చెప్పాడు. తనతో బాటు మిత్రుడూ చేయి కలిపాడు. ఆతను బిగ్గరగా బానిస వ్యతిరేకతను చాటేవాడు. కాని తనను అలా చేయవద్దని వారించేవాడు.

**యుద్ధ సైనికుడు- యుద్ధ వ్యతిరేకత**

సివిల్ యుద్ధపు దారుణాలు మార్క్ ట్వేన్‌లో కొత్త ఆలోచనలకు దారి తీశాయి.

తుపాకీతో కాలుస్తున్న దృశ్యాలు ఎప్పుడూ వెన్నంటి ఉండేవి. యుద్ధం అంటే ఒకర్ని ఒకరుకాల్చుకొని చనిపోవటమే తప్ప అందులో విచక్షణ లేదనిపించింది. అవతలివాడిపై శత్రుత్వం లేకపోయినా, స్వార్ధం కోసం కాకపోయినా కొత్తవారిని కాల్చి చంపటమే అవుతోంది. వాళ్ళు ఆపదలో ఉంటే సాయం చేసే ప్రవృత్తి మనకు అవసరమైతే వాళ్ళు సహకరించే విధం నశించి మానవత్వం కోల్పోయి చంపుకోవటమే యుద్ధం అనిపించింది.

## సెక్రటరికి సెక్రెటరి–స్పెక్యులేషన్ –పత్రికా రచన – మార్క్ ట్వేన్ అవతారం

యుద్ధం నుండి క్లేమేన్స్‌ను “ఆశక్తుడు”గా భావించి విడుదల చేశారు. పడమటి తీరం చేరి అన్న ఒరియాన్ నెవాడా రాష్ట్ర సెక్రెటరి అయ్యాడని తెలిసి, కలిసి అన్నకు సెక్రెటరి అయిపోయాడు. కొన్ని రోజులకు సెక్రటరికి విధులు నిధులు పూజ్యం అని తెలుసుకొన్నాడు. అదృష్టాన్ని పరీక్షించుకోవాలనిపించి గనుల త్రవ్వకంలో కాలు పెట్టాడు. గని లోతుకు మునిగిపోయాడు పాపం. క్వార్జ్ మైనింగ్‌లో వేలు పెట్టి కలిసిరాక స్పెక్యులేషన్ వదిలేసి ఆకాశ విహారం మానేసి నేల మీద కాలు ఆనించి నడవటం నేర్చుకొన్నాడు. ఇవేవీ అచ్చిరాలేదని పూర్వపు వ్యాసంగం అయిన న్యూస్ పేపర్ మాన్ గా అవతారమెత్తాడు. వర్జీనియా నగరం నుండి వెలువడే “టెరిటోరియల్ ఎంటర్ ప్రైజెస్” పత్రికలో చేరి హాస్య వ్యంగ్య రచనలనెన్నిటినో రివర్ పైలట్‌గా ఉన్నప్పుడు నచ్చిన మాట “మార్క్ ట్వేన్”ను కలం పేరుగా పెట్టుకొని రాశాడు. అప్పటినుంచి క్లేమేన్స్ తెరమరుగై మార్క్ ట్వేన్‌గా విజ్రుంభించాడు.

19వ శతబ్ది మధ్యలో హాస్య రచయితలెవరూ స్వంత పేరు పెట్టుకొని రాయలేదు. ఆ తర్వాతే రాయటం మొదలెట్టారు. దీనికి కారణం వారు రాసిన హాస్యాన్ని చదివి నవ్వేవారు కరువవ్వటమే. అందుకే సిగ్గుపడి స్వంత పేరుతో రాయటానికి జంకేవారు. అదీ రహస్యం. ఒకాయన ‘‘పెట్రోలియం వేసూవియాస్ నాస్బి’’ అనే పేరుపెట్టుకొని రాసేవాడు. నిజానికి ఈయన సీరియస్ ప్రింటర్. అసలుపేరు డేవిడ్ రాస్ లాక్. రాబర్ట్ హెచ్ న్యుఎల్ “ఆర్ఫియాస్ సి .కార్ అంటే ఆఫీస్ సీకర్ పేరు పెట్టుకొని రాసేవాడు ఈయన ఒక మేగజైన్ ఎడిటరేకాక వర్ధమాన రాజకీయ నాయకుడు కూడా. హెన్రి వీలర్ షా అనే రైతు, బొగ్గుగనుల నిర్వహణాధికారి, రియల్ ఎస్టేట్ వ్యాపారి, వేలంపాట ఏజెంట్ కూడా “జోష్ బిల్లింగ్స్” పేరుతో కామిక్ విషయాలు రాసేవాడు. “ఆల్మనాక్ వార్డ్” అనే బిరుదూ పొందాడు.

కానీ శాం క్లెమెన్స్ మార్క్ ట్వేన్ అవతారం ఎత్తాకపై వారినెవరినీ అనుకరించలేదు. వార్డ్‌తో పరిచయమయ్యాక ట్వేన్ కొన్ని రోజుల్లోనే ఆయన్ను అన్నిటా మించిపోయే కామిక్ రచనలు చేసి మెప్పించాడు. “సమకాలీన బాక్ వుడ్ హ్యూమర్”ను పండించాడు. పెద్దకథలు రాశాడు. ముతక హాస్యమూ మితిమీరి రాశాడు. వార్డ్ కంటే గొప్ప

హాస్యాన్ని సృష్టించానని చెప్పుకొన్నాడు. కాని పత్రికా జనం అంతగా పట్టించుకోలేదు. టాం సాయర్, హకిల్ బెర్రిఫిన్‌లకు వచ్చినంత ప్రాచుర్యంపై వాటికి రాలేదన్నది నిజం. ఆ కాలంలో సమాజంలో ఉన్న వెర్రి మొర్రి విపరీత ధోరణులుకు అవి అద్దం పట్టాయి. బడా బాబుల బండారం బయట పెట్టాయి. కారికేచర్ మీద ఎక్కువ దృష్టిపెట్టి రాశాడు. పాత విషయాలనే కొత్త మూసలో కొత్త తరహాలో హాస్యం వ్యంగ్యం మేళవించి రాయటం మార్క్ ట్వేన్ ప్రత్యేకత. మాండలికానికి పెద్ద పీట వేశాడు. వ్యావహారికాన్ని నెత్తి కెత్తుకొన్నాడు. స్థానికతకు ప్రాధాన్యమిచ్చాడు. ఇవన్నీ కలిసి "హోమ్ స్పన్", "స్వదేశీనేత"గా గుర్తింపు తెచ్చుకొన్నది, హీరోలు జీరోలు అందరూ తన చుట్టూ ఉన్నవాళ్ళే. పరిసరాలు అవే. అందుకే అంతటి పేరొచ్చింది. సహజత్వాన్ని ఇంత వరకు ఎవరూ కథల్లో నవలలో చొప్పించలేదు. వాల్ట్ విట్మన్ కవి కవిత్వంలో సహజత్వం తెస్తే, హాస్య వ్యంగ్య రచనలో నవలలో కథల్లో మార్క్ ట్వేన్ సహజత్వాన్ని చూపించి ఆధునిక అమెరికన్ నవలా సాహిత్యానికి ఆద్యుడనిపించుకొన్నాడు. పత్రిక హాస్య రచయిత కాస్తా సాంఘిక వ్యంగ్య రచయితగా అవతారమెత్తాడు మార్క్ ట్వేన్ –"the news paper humorist grew into the social satirist".

**శాన్ ఫ్రాన్సిస్కో జీవితం–జాతీయ రచయితగా గుర్తింపు**

ఇరవై తొమ్మిదో ఏట ట్వేన్ ఎంటర్ ప్రైజెస్ అన్నీ వదిలేసి "మార్నింగ్ కాల్" పత్రికలో ఉద్యోగం పొంది శాన్ ఫ్రాన్సిస్కో చేరాడు. అక్కడ హార్టే, చార్లెస్ వారెన్ మొదలైన పడమటి తీర మేధావుల పరిచయమేర్పరచుకొన్నాడు. ఇదే మొట్టమొదటిసారిగా సాహిత్య జీవులతో మాత్రమే పొందిన అరుదైన పరిచయం. అనేక కాలిఫోర్నియా పత్రికలకు హాస్య వ్యంగ్య రచనలు చేస్తూ ఆర్టిమస్ వార్డ్ సలహాపై కొన్ని రచనలను తూర్పు తీరపత్రికలకు కూడా పంపేవాడు. జిం స్మైలీ అండ్ హిస్ జంపింగ్ ఫ్రాగ్ "న్యు యార్క్ సాటర్ డే ప్రెస్"లో అచ్చయింది. ఇదే తరవాత ప్రసిద్ధమైన "జంపింగ్ ఫ్రాగ్ ఆఫ్ కలేవరస్ కౌంటి"గా 1865లో ముద్రణ పొంది బాగా ప్రాచుర్యం పొందింది. ఒక్కసారిగా సెన్సేషన్ సృష్టించి దేశ వ్యాపితంగా మార్క్‌ట్వేన్ అంటే ఏమిటో తెలిసింది. అకస్మాత్తుగా అందరూ ఉదాహరించే గొప్పగా చెప్పుకొనే రచయిత అయిపోయాడు. అమెరికా జాతీయ రచయితగా ఎదిగిపోయాడు. ఆనాడు శాండ్ విచ్ ఐలాండ్స్ అని పిలువబడిన నేటి హవాయి ద్వీపానికి న్యూస్ పేపర్ కరస్పాండెంట్‌గా మార్క్ ట్వేన్‌ను పంపారు. యూరప్ పర్యటన చేసి మెడిటరేనియన్, పాలస్తీనాలు తిరిగి తన అనుభవాలను "హిలేరియస్ ఇన్నోసేన్ట్స్ అబ్రాడ్" పేరుతొ రాశాడు. ఇవి అచ్చు అయ్యేనాటికి ట్వేన్ వయసు 34 మాత్రమే.

**రాతో రాత**

రచయితగా విజయాలు సాధించి స్థిరపడ్డాడు. అభిమానులు గణనీయంగా పెరిగిపోయారు. ఉపన్యాస చక్రవర్తిగా అవతారం ఎత్తి ఇందులోనూ తనకు సాటి లేరనిపించుకొన్నాడు. ఒలీవియా లాంగ్ డన్ అనే న్యు యార్క్‌లోని ఎల్మైరా పౌరుడైన ధనిక ప్రముఖుని అమ్మాయి ఫోటోను చూసి పీకల్లోతు ప్రేమలో పడి వెంటనే ఆమెను కలిసి ఆ వెనువెంటనే పెళ్లి చేసేసుకొన్నాడు. అప్పుడు నివాసాన్ని ఈస్ట్‌కు మార్చాడు. "బఫెలో ఎక్స్ ప్రెస్" పత్రికకు సగం యజమానిగా ఉండి నిర్వహించి, 37వ ఏట కనెక్టికట్ లోని హార్ట్ ఫోర్డ్‌కు చేరాడు. ఇక్కడ ఉండి రాసిన పుస్తకాలలో సెంటిమెంటల్ రచనలతో బాటు నిర్లక్ష్యంగా, సందర్భ శుద్ధి లేకుండా రాసినవీ ఉన్నాయి. వయసు మీదపడిన కొద్దీ కోపం, ప్రపంచ ద్వేషం పెరిగిపోయాయి. కాని ఏదిరాసినా వాస్తవానికి అతి సన్నిహితంగా నేటివ్ స్పిరిట్‌తో నిజాయితీగా, పాత్రల స్వభావాలను పూర్తిగా తీర్చి దిద్ది రాశాడని అనిపించాడు.

**అన్నిట్లో వేలు**

ఎక్కడో పల్లెటూరి కుర్రాడు ఇప్పుడు జాతీయ హీరో అయ్యాడు. విజయాలు కూడా ఒకదాని తర్వాత మరొకటి వెంటపడి వచ్చాయి. అమెరికా దేశంలోనే "గ్రేటెస్ట్ ఆఫ్ ది గ్రేట్" అనిపించుకొని, దేశ మేధావుల సరసన చేరిపోయాడు. స్పెక్యులేషన్ బుద్ధి మాత్రం ఆయన్ను వదలలేదు. అదృష్టాన్ని పుస్తక ప్రచురణలో పరీక్షించుకొందామని పబ్లిషర్ అయ్యాడు. తాను రాసిన పుస్తకాలే కాకుండా, "మెమోయిర్స్ ఆఫ్ యు. ఎస్. గ్రాంట్" అనే ఆనాటి ప్రసిద్ధ గ్రంథాన్ని కూడా ముద్రించాడు. కొంతలాభం కనిపించే సరికి మెకానికల్ టైప్ సెట్టర్‌పై ఉన్న డబ్బు అంతా ఖర్చు చేసేశాడు. అదృష్టం కలిసి వస్తే కోట్లాది డాలర్లు సంపాదించి ఉండేవాడు. కాని అది పని చేయక మొండి చేయి చూపేసరికి నష్టాల్లో కూరుకుపోయి దివాలా తీశాడు. దీనికి తగ్గట్టు కుటుంబంలో కూడా దురదృష్ట సంఘటనలు తోడైనాయి.

**వరల్డ్ లెక్చర్ టూర్ - ఆశనిపాత వార్తలు**

పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయి అందులో నుంచి బయట పడటానికి అరవైవ ఏట ప్రపంచ లెక్చర్ టూర్ ప్రారంభించాడు. ఇది మాత్రం అనుకోని విజయాలను సమకూర్చి ఆర్థికంగా బాగా లాభించింది. నిరంతరం తిరుగుతూ ఉండటంతో డబ్బు వచ్చింది కాని ఆరోగ్యం దెబ్బ తిన్నది. కొడుకు పసిప్రాయంలోనే చనిపోయి మనోవ్యథ మిగిల్చాడు. ఇతర దేశ పర్యటనలో ఉన్నప్పుడే బాగా అభివృద్ధిలో ఉన్న పెద్ద కూతురు సూసీ కూడా అకస్మాత్తుగా చనిపోవటంతో చాలా కుంగి పోయాడు. వియన్నాలో

ఉండగా అన్నగారు ఓరియన్ చనిపోయినట్లు తెలిసింది. అదృష్టం ఎలా వెంటపడిందో ఇప్పుడు దురదృష్టం కూడా అలానే వెంటపడి తరిమింది పాపం. ప్రజలు బ్రహ్మరథం పట్టి కనక వర్షం కురిపిస్తున్నారు. కాని కుటుంబంలో ఆశినిపాతం లాంటి విషాద వార్తలకు తట్టుకోలేక పోయాడు. అనేక మైన గౌరవ డాక్టరేట్లు బిరుదులూ వస్తూనే ఉన్నాయి. ఎన్నో కాలేజీలు, యూనివర్సిటీలు సన్మానించి గౌరవిస్తున్నాయి. డి.లిట్.ఇచ్చి ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి సన్మానించింది. కాని తరువాతి జీవితం చీకటిగా అసంతృప్తిగా దుఃఖ భాజకంగా గడిచిపోయింది ఆ మహా రచయితకు. ఆయనకు అరవై తొమ్మిదో ఏట భార్య కూడా మరణించి మానసిక దుఖాన్ని మరింత పెంచింది. ఆ తర్వాత కొన్నేళ్ళకే ఇంకొక కూతురు జీన్ "ఎపిలేప్సి" వ్యాధితో చనిపోయింది. ఇలా దెబ్బ మీద దెబ్బ తగిలింది మార్క్‌ట్వేన్‌కు. ఎలా తట్టుకోన్నాడో ఆ మహానుభావుడు.

**మానవత్వ ద్వేషి - మానవ హితైషి**

ఈ రకమైన కుటుంబ విషాదాలు మార్క్ ట్వేన్ జీవితంలో మార్పులు తెచ్చాయి. మనుష్య ద్వేషిగా సర్వ ప్రపంచ ద్వేషిగా ఉన్న ఆయన సమతుల్యతలో పడ్డాడు. జీవిత చరమాకంలోని 15 ఏళ్ళు, పూర్వ జీవితంలో ఎంత రాశాడో అంతే కాక ఎక్కువ కూడా రాశాడు అదీ ట్వేన్ గొప్పతనం. అయితే ఇవి సగం సగం రాతలుగా మిగిలాయి. వీటిలో మానవ ప్రవృత్తి, విధి, గౌరవం, నీతి ఎక్కువ. అన్ని రకాల ఫీలింగ్‌లకు స్థానం కల్పించాడు. అమెరికా దేశపు రిపబ్లిక్ పాలన మిగిలిన దేశాల పూర్వపు రిపబ్లిక్‌లాగే అంతరించిపోతుంది అనుకొన్నాడు. దీనికి కారణాలు అవినీతి, పిరికితనం మానవ స్వభావంగా భావించాడు. "వాట్ ఈజ్ మాన్" అని ఒక పుస్తకం రాశాడు. శతాబ్దం మారిన తోలి రోజుల్లో రాసిన ఈ పుస్తకం 1906లో ముద్రణ పొందింది. కార్య కారణాల చర్చ చేశాడు ఇందులో. "He castigated humanity but he loved people ,especially the people of his time and place". "ప్రిన్స్ అండ్ పాపర్ (రాజు –పేద) నవలలోను", " జోన్ ఆఫ్ ఆర్క్"లో ఫ్రెంచ్ చరిత్రను చేర్చాడు. ఈ రెండు తన అద్భుత నవలలు అన్నాడు మార్క్ ట్వేన్. కాని ఫలితాలు ఆశావహంగా రాలేదు. అమెరికాలో ఉన్నంత హాయి, గుర్తింపు ఇతర దేశాలలో పొందలేక పోయాడు.

**స్వచ్ఛతకు మారుపేరు తెల్లని వస్త్రధారణ**

అరవైలలో నల్లని చిక్కని జుట్టు పల్చబడి తెల్లబడింది. మొదటి నుండి అలవాటైన తెల్లని వస్త్రాలే ధరించేవాడు. కళ్ళల్లో చురుకుదనం తగ్గలేదు. మీసం ఆయన వ్యక్తిత్వానికి చిహ్నంగా మారింది. బతికి ఉన్న ఒకే ఒక కూతురు క్లారా పియానిస్ట్ ఆసిప్ గాబ్రిలోవిచ్‌ను పెళ్లి చేసుకొన్నప్పుడు మాత్రం తెల్ల వస్త్రాల బదులు ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి డాక్టర్ ఆఫ్

లిటరేచర్ ప్రదానం చేసినప్పుడు ధరించిన స్కార్లెట్ రంగు బట్టలు కట్టుకొన్నాడు. కనెక్టికట్ లో రెడ్డింగ్ వద్ద తనకు కావలసిన రీతిలో చక్కని ఇల్లు కట్టుకొన్నాడు. కాని ఇక్కడ ఎక్కువ కాలం ఉండకుండానే చనిపోయాడు. తన జీవితం హెయిలీ తోక చుక్కతో ముడి పడి ఉంది అని భావించేవాడు. అది కనిపించినప్పుడు జన్మించి మళ్ళీ 75 ఏళ్ళకు కనిపించిన తర్వాత 21-4-1910న మరణించాడు.

**అమెరికా కొత్త సాహిత్య ప్రపంచ సృజన**

అమెరికన్ సాహిత్య సరిహద్దు అన్వేషకుడు మార్క్ ట్వేన్. విషయంలో, శైలిలో అద్వితీయుడే. కొత్త సాహిత్య ప్రపంచాన్నే సృష్టించాడు. తాను చూసింది తెలుసుకొన్నది అంతా తన రచనలలో నిక్షిప్తం చేశాడు ప్రజల జీవన విధానం, భాష, ప్రవర్తన అలవాట్లు, భయాలు, విశ్వాసాలు, కోరికలు, అంతరంగాలు అన్నీ అందులో పొదిగాడు. ఆ ప్రజల ప్రతినిధిగా రాశాడు. అమెరికా రాష్ట్రాల ప్రజల మనోభావాలకే ఆయన రచనలు ప్రతినిధులైనాయి. నేటివిటి ప్రతి రచనలో ప్రతి ఫలించింది. ఇదే ఇతరులకు మార్గదర్శకమైంది. “all modern American literature comes out of one book by Mark Twain called" "Huckleberry Finn. All American writing comes from that. There is nothing before. There has been nothing as good since” అని మరో అమెరికన్ ప్రసిద్ధ నవలా రచయితా నోబెల్ ప్రైజ్ విన్నర్ ఎర్నెస్ట్ హెమింగ్ వే చెప్పాడు.

ఇది అక్షర సత్యం .

భాష మీద అనితర సాధ్యమైన పట్టు సాధించి దానిలోనూ మార్గ దర్శి అయ్యాడు మార్క్ ట్వేన్ .తన మార్క్ ను సృష్టించు కొన్నాడు. మాట్లాడే భాషకు రాసే భాషకు ఉన్న అనేక అంతరాలకు స్వస్తి పలికి మాట్లాడే భాషనే రాసేభాషగా తీర్చి దిద్ది కొత్త సాహిత్యభాషకు ఒరవడి పెట్టాడు. అంతకు ముందు ఏ రచయిత ఈ సాహసం చేసి ఉండలేదు. అదీ అతని క్రెడిట్ .నూతన సాహిత్య పరిభాష హాస్యంలో కొత్తపద సృష్టి, వ్యంగ్యంలో వినూతనత్వం ఆయన తెచ్చినవే. చాల సులభంగా అతి సహజం గా భాషను వాడాడు. భాషలో జీవం నింపాడు. ప్రజలలో వ్యాపించి ఉన్న పదాలకు సాహితీ గౌరవం కలిగించాడు. ఈ పదాలు మనవే మనం మర్చిపోయాం అని గుర్తు చేశాడు. మన భాష ఇంత మహత్తరమైనదా అని ఆశ్చర్యపోయేట్లు రాశాడు. అతని రచనలో వ్యంగ్యపు చురుకు పాలు అవహేళన చెన్నాకోలు దెబ్బలు ఉంటాయి. చురుక్కుమన్నా మహా సంతోషంగా ఉంటుంది. ఆయన పదాలు పదబంధాలు గొప్ప ఉదాహరణలుగా సాహిత్యంలో నిలిచిపోయాయి. ఆయన ఏది రాసినా, ఏది చెప్పినా ఒక సాహిత్య క్రీడగానే భావించారు. అమెరికా జాతి మానవ మనసులను, మనుష్యులను ఇంత

గొప్పగా ఆవిష్కరించిన రచయిత అంతకు ముందు ఎవ్వరూ లేరు. ఆయనకున్న ఆలోచనా ఎవరికీ రాలేదు. అందుకే చరితార్ధుడు, చిరస్మరణీయుడు అయ్యాడు మార్క్ ట్వేన్. ఆయన సృజనకు జోహార్లు.

మార్క్ ట్వేన్ చేసిన చమత్కారాలు చూపిన చెమక్కులు ఎన్ని చెప్పినా తనివి తీరదు. కొన్ని ఆయన మాటల్లో చదివితేనే అందులోని సొగసు చూడగలం. అవి ఆనాటి నుండి సాహిత్యంలో గొప్ప ఉదాహరణలుగా కోటబుల్ కోట్స్‌గా చలామణిలో ఉన్నాయి.

1. To be good is noble ,but to show others how to be good is nobler and no trouble.
2. Good breeding consists in concealing how much we think of ourselves and how little we think of the other person.
3. Of all God's creatures there is only one that can not be made the slave of the lash. That one is the cat. If man could be crossed with the cat it would improve man but it would deteriorate the cat.
4. If you pick up a starving dog and make him prosperous, he will not bite you this is the principal difference between a dog and a man.
5. man is the only animal that blushes. or needs to
6. prosperity is the best protector of principle
7. In the first place God made idiots .This is for practice.
8. When in doubt tell the truth.

**మార్క్ ట్వేన్ ప్రభావం**

మార్క్ ట్వేన్ జీవించిన కాలంలో ఆయన ప్రభావం ఎంత ఉండేదో చెప్పటం కష్టం. ఈనాడు మాత్రం "ది అడ్వెంచర్స్ ఆఫ్ టాం సాయర్" మాత్రం బాలసాహిత్యంలో మహోత్కృష్టమైనదిగా గుర్తింపు పొందింది. కాని దానినే 1877లో రివ్యు చేసి "అనవసర చెత్త" అన్నారు. యాభై ఏళ్ళ వయసులో ట్వేన్ రాసిన హకల్ బెరిఫిన్ నవల పెద్దగా సంచలనం సృష్టించలేదు. ఇది టాం సాయర్ వచ్చిన తొమ్మిదేళ్ళకు వచ్చింది. దీన్ని టాంకు సీక్వెల్ అనుకొన్నారు. సాంకేతిక దృష్ట్యా హకల్ బెరిఫిన్ భాషా శాస్త్ర పరంగా గొప్ప విజయమే సాధించింది. మాండలికం అమెరికన్ సాహిత్యంలో మొదటిసారిగా ప్రవేశించింది ఈ నవల ద్వారానే. అదొక ఘన విజయం. ఇందులో ఏడు రకాల మాండలీకాలున్నాయని పరిశోధనలో తెలిసింది. ఒక్కవాక్యం లో దీన్ని "half comic,

half perilous saga, a boy's odyssey which has become a national myth" అన్నారు.

మార్క్ ట్వేన్‌కు కౌమార దశ అంటే అమితమైన అభిమానం. అది అప్పుడే జరిపోయిందే అనే బాధ కూడా ఉండేది. అదొక స్వర్గసీమ అనుకొనేవాడు. ఆయన తాను వివాహ ద్వేషి (misogynist) స్త్రీ ద్వేషి అని ధైర్యంగా చెప్పుకోలేని పిరికివాడు అన్నారు విమర్శకులు. కాని మగవారి గురించి ఎంత రాశాడో ఆడవారి గూర్చికూడా అలానే రాశాడు. అయితే చీము నెత్తురు రక్తం మాంసం ఉన్న వ్యక్తిత్వం గల మహిళలు ఆయన రచనలో కనిపించరు అనే అభియోగం ఉంది. కాని మార్క్ ట్వేన్ తన భార్య దృష్టిలో ఎప్పుడూ "యూత్"యే.

మార్క్ ట్వేన్ సాహిత్య పదాలలో "soil and soul" ప్రతి చోటా దర్శనమిస్తాయి. లూయీ అంటర్ మేయర్ మార్క్ ట్వేన్‌ను "paradox is the very key to the conflicts which while they made Mark Twain creatively mature, kept him from growing up emotionally. A self confessed, self divided spirit, holding all the contra dictions together, there remains the rude but loving skeptic, the free and un flinching chronicler who was also the innocently swaggering, endlessly resourceful, and eternally impressive boy"ను అభివర్ణించాడు.

**శాస్త్ర సాంకేతిక జ్ఞానం**

శాస్త్రీయ పరిశోధన అంటే మార్క్ ట్వేన్‌కు అమితాసక్తి. స్నేహితుడు నికోలా టెస్లా తోకలిసి టెస్లా కున్న లేబరేటరిలో పరిశోధనలు జరుపుతూ గంటలకొద్దీ కాలం గడిపేవారు. మూడు పరిశోధనలకు పేటెంట్ హక్కు పొందాడు. ఆయన రాసిన "కనెక్టికట్ యాంకీ ఇన్ కింగ్ ఆర్థర్స్ కోర్ట్" నవలలో "టైం ట్రావెల్" విషయాన్ని ప్రస్తావించాడు. ఇది అప్పటి సమకాలీన ఆవిష్కరణ. ఆర్థర్ గారి ఇంగ్లాండ్‌లో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశ పెట్టాడు. ఇదే తర్వాతా సైన్స్ ఫిక్షన్‌లో "ఆల్టర్ నేట్ హిస్టరీ"గా గుర్తింపు పొందింది. 1909లో ప్రముఖ శాస్త్రీయ పరిశోధకుడు ఎడిసన్ మార్క్ ట్వేన్ నివసిస్తున్న కనెక్టికట్‌లోని రెడ్డింగ్‌కు వచ్చి అతని పరిశోధనపై రెండు రీళ్ల షార్ట్ ఫిలిం షూట్ చేశాడు. అదొక్కటే ట్వేన్ జీవితం పై చిత్రించబడిన ఒకే ఒక్క ఫిలిం.

**మని కలెక్టింగ్ స్పీకర్**

సునిసిత మైన హాస్యాన్ని వ్యంగ్యాన్ని జోడించి స్పాంటేనియస్‌గా మాట్లాడటం మార్క్ ట్వేన్ గొప్పతనం. ఇదే తర్వాత కాలంలో "స్టాండప్ కామెడి"గా గుర్తింపు పొందింది.

ఎన్నో క్లబ్బులలో "పెయిడప్ టాక్స్" ఇచ్చాడు. లండన్ సావేజ్ క్లబ్ లో కూడా మాట్లాడి గౌరవ సభ్యునిగా ఎన్నికయ్యాడు. ఇంతటి అరుదైన గౌరవం పొందినవారు ప్రిన్స్ ఆఫ్ వేల్స్‌తో సహా ముగ్గురే ముగ్గురు. వియన్నా వెళ్లి అక్కడి క్లబ్‌లో "జర్మనీ భాషలో దారుణాలు'' (హారర్స్ ఆఫ్ జెర్మని లాంగ్వేజ్) అనే విషయంపై మాట్లాడి అందరిని మెప్పించాడు. ప్రిన్స్ టన్ యూనివర్సిటీలో ఉపన్యసించి దాని గౌరవ సభ్యుడయ్యాడు.

**బాలికల క్లబ్**

ఆడ పిల్లలను కోల్పోయిన మార్క్ ట్వేన్ 1906లో "ఏంజెల్ ఫిష్ అండ్ ఆక్వేరియం క్లబ్" స్థాపించి బాలికలను ఆహ్వానించి తన దియేటర్‌లో నాటికలు ఆడామని సంగీత కచేరీలు చేయమనేవాడు. "నా జీవిత ముఖ్య ఆనందం ఈ క్లబ్" అని రాశాడు. 1908లో ఏంజిల్ ఫిష్ బాలికలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు.

**ఘన నివాళి**

మార్క్ ట్వేన్ మరణానికి సంతాపం ప్రకటిస్తూ ఆనాటి అమెరికా ప్రెసిడెంట్ విలియం హోవార్డ్ టాఫ్ట్ మార్క్ ట్వేన్ "బౌద్ధిక విజ్ఞానాన్ని హాస్య వ్యంగ్య ఆనందాన్ని లక్షలాది ప్రజలకు అందజేశాడు. ఇంకా ఎందరినో ప్రభావితం చేశాడు. ఆయనది అమెరికా హాస్యం. ఆయన రచనలను ఇంగ్లాండ్ దేశంతో సహా అనేక దేశాలు చదివి అభినందించాయి. అమెరికా సాహిత్యానికి అరుదైన గుర్తింపు మార్క్ ట్వేన్ వలన లభించిందన్నది పరమ సత్యం" అని ఘన నివాళులర్పించాడు.

**అందరివాడు**

ఇంపీరియలిజానికి మార్క్ ట్వేన్ వ్యతిరేకి. స్పష్టంగా దీన్ని తెలియజేశాడు. జాతి వివక్షత ను కాదన్నాడు. మహిళాహక్కులు కావాలన్నాడు. స్త్రీలకు వోటుహక్కు ఉండాలని "వోట్స్ ఫర్ వుమెన్" అనే ఉపన్యాసంలో చెప్పాడు. అంధ రచయిత "హెలెన్ కెల్లర్" విద్యా పురోభివృద్ధికి సహకరించాడు. "లైఫ్ ఆన్ ది మిసిసిపి"లో రాసిన బోటింగ్ ఇండస్ట్రిలోని "యూనియన్"ల గురించి రాసిన వాటిని ఇప్పటికీ యూనియన్ హాళ్ళలో చదువుతున్నారంటే ఆయన రచనా ప్రభావం ఎంతటిదో తెలుస్తోంది. ''కార్మిక ఉద్యమం''ను మార్క్ ట్వేన్ ప్రోత్సహించాడు. ❁



## 17. పోస్ట్ ఇంప్రెష నిస్ట్ ఫ్రెంచ్ పెయింటర్ - పాల్ సిజేన్
(Paul cizanne)- (1838-1906)

**ఆధునిక కళాపిత**

19వ శతాబ్దపు కళా కృషికి, దీనికి విరుద్ధమైన 20వ శతాబ్దపు భావ తీవ్రవాదుల కళకు యుగ సంధికి చెందిన పోస్ట్ ఇంప్రెషనిస్ట్ ఫ్రాన్స్ దేశపు చిత్రకారుడు పాల్ సిజేన్. అన్వేషణాత్మకమైన, పదే పదే వాడే బ్రష్ స్ట్రోక్స్‌తో అత్యంత విశిష్ట లక్షణాలతో, ప్రత్యేకతతో అతని కళాఖండాలు వెలిగిపోతాయి. వర్ణ తలాలను చిన్న బ్రష్ స్ట్రోక్‌లతో సంక్లిష్ట చిత్రాలుగా తీర్చిదిద్దాడు. చిత్రింపబడే వాటి అంతరిక ప్రవృత్తిని బహిర్గతం చేయటం అతని చిత్రాల ప్రత్యేకత. 19వ శతాబ్ది ఇంప్రెషనిజంకు 20వ శతాబ్ది అత్యాధునిక క్యూబిజంకు సిజేన్ వారధి. ప్రఖ్యాత చిత్రకారులు మాటిస్సే పికాసోలు “సిజేన్ మా కళా పిత” అని ఆరాధనా భావంతో కీర్తించారు.

**బాల్య విద్యాభ్యాసాలు**

పాల్ సిజేన్ 19-1-1838న ఫ్రాన్స్‌లోని ఎక్స్ యెన్ ప్రావిన్స్‌లో సెయింట్ సావియర్ పట్టణంలో జన్మించాడు. ఫిబ్రవరి 22న ఎగ్లైజ్ డిలా మేడేలిన్‌లో, అమ్మమ్మ మేనమామలు గాడ్ పేరెంట్స్‌గా బాప్టైజ్ అయ్యాడు. తర్వాత కేధలిక్ మతానికి పూర్తిగా అంకిత మయ్యాడు. తండ్రి సెయింట్ జేకారి గ్రామస్తుడు. బాంకింగ్ ఫర్మ్ వ్యవస్థాపక భాగస్వామి. ఇదే మన కళాకారుడిని జీవితాంతం ఆదుకున్నది. ఆనాటి సాటి కళాకారులెవ్వరికి లేని ఆర్థిక భద్రత, వారసత్వ సంపద దక్కింది సిజేన్‌కు.

తల్లి ఆన్నె ఎలిజబెత్ ఆనరిన్ ఆబర్ట్ ఆకర్షణీయ, చైతన్య స్ఫూర్తికల, త్వరగా తప్పు కొనే స్వభావం కలది. తల్లి దగ్గర నుండే సిజేన్ జీవిత దృక్పధాన్ని, దృష్టిని ఏర్పరచుకున్నాడు. చెల్లెళ్ళు మేరీ, రోజ్‌లతో కలిసి స్కూల్‌కు వెళ్ళేవాడు. 10వ ఏట

ఐక్స్‌లో ఉన్న సెయింట్ జోసెఫ్ స్కూల్‌లో చేరాడు. 1852లో బార్బాన్ కాలేజిలో చేరాడు. అక్కడే ప్రసిద్ధ రచయితలూ ఎమిలీ జోలా, బాప్టిస్టిన్ బెయిలీలతో గాఢ పరిచయమేర్పడింది. ఎక్కడ చూసినా ఈ ముగ్గురూ కలిసె కనిపించేవారు. ఈ ముగ్గురు మిత్రులను "విడదీయ రాని త్రయం" (ఇంసేపరబుల్ ట్రయో) అనేవారు. ఆరేళ్ళు ఆ కాలేజిలో చదివాడు చివర ఏడాది డే స్కాలర్‌గా ఉన్నాడు.

**కళపై మక్కువ**

1857లో ఐక్స్‌లో ఉన్న ఫ్రీ మునిసిపల్ డ్రాయింగ్ స్కూల్‌లో చేరాడు. స్పానిక్ ముని జోసెఫ్ గిల్బర్ట్ వద్ద డ్రాయింగ్ అభ్యసించాడు. తండ్రి సలహాపై 1958-61 వరకు ఐక్స్ యూనివర్సిటిలా స్కూల్‌లో డ్రాయింగ్ క్లాసులకు హాజరౌతూనే లా చదివాడు.

బాంకర్ అయిన తండ్రి మాటకు విరుద్ధంగా వారించినా ఆగకుండా ఐక్స్ వదిలేసి కళపై విపరీతమైన వ్యామోహంతో 1861లో పారిస్ చేరాడు. అతని నిర్ణయం తీసుకొనేట్లు బాగా ప్రభావితం చేసింది అప్పటికే పారిస్‌లో స్థిరపడిన ఎమిలీ జోలాయే. తండ్రి కూడా కొడుకు కోరికను మన్నించి ఆర్ధిక సాయం చేసి ప్రోత్సహించాడు. తరువాత తండ్రి నుంచి భారీమొత్తంలో 4 లక్షల ఫ్రాంక్‌లు వారసత్వ ధనంగా చేతికొచ్చింది. దీనితో చేసిన అప్పులన్నీ తీర్చి రుణ విముక్తుడయ్యాడు.

**అర్కిటెక్చురల్ శైలి**

పారిస్‌లో కామిల్ పిసారియో అనే ఇంప్రెషనిస్ట్ ఆర్టిస్ట్‌తో పరిచయాం కలిగింది సిజేన్‌కు. 1960లో వారిద్దరి మధ్య గురు శిష్య సంబంధమేర్పడింది. ఈ యువ ఆర్టిస్ట్‌పై పిసారో ప్రభావం బాగా పడింది. ఒక పుష్కర కాలం కలిసి లాండ్ స్కేపులు గీశారు. పెయింటింగ్ ఎక్స్‌కర్షన్‌లు చేశారు. క్రమంగా ఇద్దరు మమేకమయ్యారు. మదతలో సిజేన్ లాండ్ స్కేప్‌లో బొమ్మ ఉండేది. తరువాత అనేక మందికి చోటు కల్పించేవాడు. అతని ఒహాత్మకత సృజన అద్భుత మనిపించేది. క్రమంగా రంగుల ప్రభావం తగ్గించి తేలికగా చిత్రాలు గీశాడు. ఆ తర్వాత శిల్పాకృత పెయింటింగ్స్ శైలి (ఆర్కి టేక్చురల్ స్టైల్)కి రూపకల్పన చేశాడు. తాను లోకంలో చూసిన దానిని చిత్రంలో అత్యద్భుతంగా చూపేవాడు. తేలిక రంగులతో ఫలితాలు రాబట్టాడు. "want to make of impressionism something solid and lasting like the art in the museums", [17] అని చెప్పేవాడు. his contention that he was recreating Poussin "%after nature" underscored his desire to unite observation of nature with the permanence of classical composi-

tion..

## పారిపోయి పల్లెటూరి అమ్మాయితో రహస్యంగా పెళ్లి

1870లో ఫ్రాన్స్‌కు ప్రష్యా దేశానికి జరిగిన యుద్ధం అందర్నీ యుద్ధ సైనికులుగా చేసింది. ఈ బాధ భరించలేక సిజనే ఎస్తేనే అనే చిన్న టౌన్‌కు పారిపోయాడు. అక్కడ తన అసమాన చిత్రకళా నైపుణ్యంతో ఆ కళకు అమరత్వం సిద్ధింపజేశాడు. అక్కడే మోడల్‌గా పని చేసిన హార్టెన్స్ ఫికేట్‌తో సాన్నిహిత్యం పెరిగి వివాహం చేసుకొన్నాడు. ఆమె జూరా ప్రాంత రైతు కుటుంబానికి చెందిన అమ్మాయి. ఆమెకు 19ఏళ్ళు. మన పెయింటర్ కంటే 11 ఏళ్ళు చిన్నది. రెండేళ్లకు కొడుకు పుట్టాడు. వాడికి తనపేరు పాల్ అని పెట్టుకొన్నాడు. తన ప్రేమ వ్యవహారానికి తండ్రి ఉగ్ర నరసింహం అవుతాడేమోనని భయపడి ఆ విషయాన్ని రహస్యంగా ఉంచాడు. తండ్రివి దేగ కన్నులు. వ్యవహారం పసిగట్టాడు. అగ్గి మీద గుగ్గిలమై కొడుక్కు ఇచ్చే అలవెన్స్ డబ్బు కట్ చేసేశాడు. అమెతో కాపురం చట్ట సమ్మతం చేయటానికి, కుటుంబాన్ని ఒప్పించటానికి ఆమెను పది హేడేళ్ళ పరిచయం తర్వాత పెళ్లి చేసుకొన్నాడు. అయినా ఆమెపై ప్రేమ క్రమంగా తగ్గిపోయింది. ఆమెతో అరుదుగా గడుపుతూ సిటీ జీవితానికి అలవాటు పడిపోయాడు. ఆమె నుంచి తప్పించుకోవటానికి తరచుగా ప్రయాణాలు చేసేవాడు. దీనికి సాకుగా "మా ఆవిడ స్విట్జర్లాండ్‌ను, నిమ్మకాయాలను మాత్రమే అతి జాగ్రత్తగా చూసుకొంటుంది" అని చెప్పాడు.

## క్రమబద్ధత లేని జీవితం

పెళ్లి కాక పూర్వం నుంచీ కూడా సిజనే మామూలు జీవిత సౌఖ్యాలకు దూరంగా ఉండటం అలవాటు చేసుకొన్నాడు. అతని అలవాట్లు లాగానే అతని స్టూడియో కూడా అస్తవ్యస్తంగా ఉండేది. అంటువ్యాధుల కూడలిగా ఉండేది. 30వ ఏట చాలా పొడవుగా, బుజాలు కొద్దిగా ఒంగి, చిన్నగడ్డముక్కుతో, మోసం చేసేట్లుండే కళ్ళతో కనిపించేవాడు. కొత్తగా వచ్చిన వారికి గట్టిగా మాట్లాడినట్లు ఆ మాటలు గుబురు నల్ల గడ్డం లోంచి వస్తున్నట్లుగా ఉండేది. 40 ఏళ్ళు వచ్చేసరికి మనిషి చిరుబురులాడుతూ దుస్టుడేమో అని పించేవాడు.

## విమర్శకుల దారుణ విమర్శ

ఇంప్రెషనిస్ట్‌లంటే అభిమానం పెరిగింది. కాని పత్రికలు విమర్శల చేన్నాకోల్‌తో ఝుడిపించేవి. అతని చిత్రాలు పల్లెటూరి మూర్ఖుడి చిత్రాలని, అతనొక మాంసం కొట్టే

బుచర్ అనీ అతని పెయింటింగ్స్ చిన్నపిల్లలు ఆకతాయి తనంతో సీతాకోక చిలకలను పట్టుకొని జిగురుతో పుస్తకంలో అంటించినట్లున్నాయని ఈసడించారు. అతనంటే ద్వేషం పెరిగిపోయింది. ప్రాచుర్యం పోయింది. మూడవ ఇంప్రెషనిస్ట్ ప్రదర్శనలో విమర్శకులు అరుపులు కేకలు నిరసనలతో హోరెత్తించారు. ఈ సంఘటనపై జోలా "హాండ్ కర్చీఫులు అడ్డం పెట్టుకొన్నా నవ్వులు పెదిమలలోంచి పగిలి బయటికొచ్చాయి, రెచ్చిపోయిన కుర్రకారుపై చొక్కాలు విప్పేసి అట్టహాసాలతో కోపాన్ని ప్రదర్శించారు. చర్మాన్ని మాంసం రంగుతో ఆకుపచ్చ, పసుపు షేడ్‌లతో చిత్రించటం ఎవరూ హర్షించలేకపోయారు. సేజనే ఒక అపస్మారక స్థితిలో ఉండి వీటిని పెయింట్ చేశాడేమో అని ఎద్దేవా చేయటమేకాక గర్భిణీ స్త్రీలను సేజనే చిత్రాలు చూడవద్దు అని కూడా చెప్పారు. చూస్తే వాళ్ళకు పుట్టే పిల్లలు ఒళ్లంతా మచ్చలతో పుడతారని ఝుడిపించారు కూడా. అంత వ్యతిరేక ప్రచారం జరిగింది.

సిజనే వర్ణాలపై చేస్తున్నప్రయోగాలను చూసి హర్షించిన మరో విమర్శకుడు "విజ్లర్ కూడా విమర్శిస్తూ" ఒక ఆరేళ్ళ పిల్లాడు సేజనేలాగా వాళ్ళ చెల్లెల్ని చిత్రిస్తే, అతని తల్లి మంచి తల్లి అయితే అతడిని కొట్టిపారేసేది" అన్నాడు. యాభై ఏళ్ళ తర్వాత ఒక లక్ష డాలర్లకు అమ్ముడుపోయిన సిజనే లాండ్ స్కేప్ చిత్రాలు ఆనాడు నలభై నుంచి ఎనభై ఫ్రాంకులకు మించి ఎవరూ కొనలేదు. అదీ మన చిత్రకారుని సమకాలీన సమాజపు విపరీత వింత పోకడ. అసలు వీటి నెవరూ పట్టించుకోను కూడా పట్టించుకోలేదు ప్రదర్శనలో. "ఒక లుక్ వేద్దాం" అని కూడా ఎవరూ అనుకోకపోవటం దారుణం అంటారు.

ఇలాంటి తిరస్కారాలకేమీ స్పందించకుండా సిజనే తన పనేదో తానూ చేసుకు పోతున్నాడు. ఇంప్రెషనిజం టెక్నిక్కులు వాడాడు. తర్వాత వారితో విభేదించినా వారి సిద్ధాంతాలను అంగీకరించాడు. "ప్రకృతిలో గీతలు అనేవి లేనేలేవు" అని సిజనే నిశ్చితాభిప్రాయం. "ప్రతిదీ లైట్ అండ్ షేడ్‌ల ఏర్పాటే. రంగులమార్పిడి భావవ్యక్తీకరణాలే" అంటాడు. "the main thing is the modeling --and a better word for modeling is modulation" అని అతని నిర్వచనం. చారిత్రాత్మక, పౌరాణిక జానపద గాథల చిత్రాలను "bad literature" అనేశాడు. ఎట్టకేలకు 1882లో అతని 43వ ఏట సిజనే గీసిన ఒక చిత్రాన్ని "సెలూన్" అంగీకరించింది. ఇదికూడా ఒక కుట్రలో భాగమే, వంచనా శిల్పమే. అంటోన్ గిలిమేట్ అనే స్నేహితుడు సెలూన్‌లో జూరీ మెంబర్. అతను ఒక విద్యార్థి చిత్ర ప్రదర్శన ఏర్పాటు చేస్తూ, ఆ ప్రదర్శనా చిత్రాల కేటలాగ్‌లో "Cezanne --a pupil of Guillimet" అని పేర్కొన్నాడు.

**అందరూ ఉన్నా ఏకాకి జీవితమే – చుక్కల్లో చంద్రుడు**

వయసు పెరిగిన కొద్దీ అంతర్ సంఘర్షణలకు సిజనే ఎక్కువగా లోనయ్యాడు. ఈ విషయాలపై విన్ ట్రాప్ సార్జంట్ రాస్తూ "he painted women both as portraits and as nudes , yet he was so frightened by women that he often could not bear to remain in the same room with his female models"అని చెప్పాడు. ఆ రోజుల్లో ఉన్న సెలూన్ పెయింటర్స్ అంటే సిజనేకు ఈర్ష్య ఎక్కువ. కాని వారి ఆమోదం కోసమే ఎదురు చూసేవాడు. అతను పూర్తిగా కేథలిక్ మతానికి చెందినవాడు. కాని ప్రీస్ట్ ల చెడుప్రవర్తనపై నిప్పులు కక్కేవాడు. సమాజం అంటే భయపడేవాడు. తోటివారు ఏదో ప్రలోభపెట్టి తనను గేలాలతో బంధించి వారితో లాక్కు పోతారనే భయం బాగా ఉండేది. "%Humanity was horrible. Nature was reassuring but it was loveliest when it was inanimate" ఇదీ సిజనే మనస్తత్వం. కాని ఎమిలీ జోలా అంటే చాలా అభిమానం. అతనికి విధేయుడుగా ఉండేవాడు. జోలా రాసిన నవల "L'oeuvre"లో హీరో గా తననే చిత్రించాడేమోననే అనుమానం ఉండేది. అందులో హీరో అపజయాల పెయింటర్ పిరికి. తనను తాను విశ్వజనంతో కలుపుకోకుండా ఏకాకిగా ఉండేవాడు. కాని తనలాంటి వారు చాలా అరుదని చెబుతూ "ప్రతి శాసన సభలో రెండు వేల మంది శాసన సభ్యులు ఉండవచ్చు. కాని సిజానే లాంటి వాడు రెండు శతాబ్దాలకు ఒక్కడు మాత్రమే ఉంటాడు" అని ఘంటాపథంగా చెప్పగల ధీరుడు సిజనే.

**పీచే మూడ్**

1895 తర్వాతా మాత్రమే 20ఏళ్ళ చిత్ర కళాజీవితంలో నాలుగు మాత్రమే ప్రదర్శనలు ఏర్పాటు చేశాడు సిజనే. అప్పటికి వయసు 56. వోలార్డ్ అనే డీలర్ చాలా చిత్రాలు పెట్టాడు కాని అప్పటికీ పబ్లిక్ అతన్ని తిరస్కారంతోనే చూశారు. సానుభూతి ఎక్కడా రాలేదు. సెలూన్ సామ్రాట్టులూ పెదవి విరిచారు. ఇక పారిస్ మీద విసుగు పుట్టి తన స్వగ్రామం చేరుకున్నాడు. అక్కడే తల్లితో కాలం గడిపాడు. స్నేహితులు అంటే అసహ్యమేసింది. సిగ్గుపడి వారికి మొహం చూపించ లేకపోయాడు. హింస ఫోబియాలో ఉండిపోయేవాడు. "ఈ ప్రపంచం నన్ను అర్థం చేసుకోవటం లేదు. నేను కూడా ప్రపంచాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాను. అందుకే దానికి దూరంగా ఉండిపోతున్నాను. మనుషుల చీచ స్వభావం చూసి సహించలేక పోతున్నా వారితో ఏకీభ వించ లేకపోతున్నా. జీవితం భయ పెడుతోంది నన్ను" అని కొడుకుకు ఉత్తరం రాశాడు. మానసిక భయం బాగా పట్టుకొని పీడించింది. డిప్రెషన్ నుండి బయట

పడాలని విశ్వ ప్రయత్నం చేశాడు. "సెరిబ్రల్ టెన్షన్" అతన్ని పీడిస్తోంది. ఏ పని అయినా భరించలేక పోయాడు. అయినా "ఫారం, కలర్"లపై పోరాటం మానలేదు. "I am old and ill --but I am determined to die painting" అని కలవరించేవాడు.

**తండ్రి మరణంతో ఆర్థిక పుష్టి- అయినా దిన కూలీ జీవితమే**

1886లో సేజనే తండ్రి మరణించటంతో ఆస్తిలో వాటా లభించి ఆర్థిక పుష్టి కలిగింది. ఆర్థిక భద్రత లభించి ధనవంతుడని పించుకొన్నా కూడా. దిన కూలీ లాగానే సాధారణ జీవితం జీవించాడు. గుర్రబ్బండీ కూడా కొనుక్కోలేదు. బయటికి తనను తీసుకొని వెళ్ళటానికి ఒక కిరాయి బండిని మాత్రం ఏర్పాటు చేసుకొన్నాడు. ఇది కూడా విలాసమే అనేవాడు.

**ఆగిపోయిన బ్రష్**

కూలి విషయంలో ఒకసారి వాడితో గొడవపడి, 67 ఏడేళ్ళ వయసులో నడిచి పోతానని భీష్మించాడు. అనుకోకుండా తుఫాను వచ్చి గాలి వేగానికి రోడ్డుమీద కూలిపోయాడు. పూర్తిగా తడిసిపోయాడు. ఒక లాండ్రీ వాగన్ ఆయన్ను ఇంటికి చేర్చింది. మర్నాడు ఉదయం తాను వేస్తున్న పోర్ట్రైట్‌కు మెరుగులు దిద్దాడు. అప్పటికే డయాబెటిస్ ఉంది. ఒకవారం తర్వాత 22-10-1906న 67వ ఏట సిజనే పెయింటర్ చనిపోయాడు. అతని బ్రెత్‌తో పాటుపెయింటింగ్ బ్రష్ కూడా ఆగిపోయింది. చనిపోయే ముందు కొన్ని చిత్రాలపై ఫిర్యాదులు రాశాడు. ఆస్తిని భార్యను మినహాయించి కొడుక్కు దఖలు పరచాడు విల్లు రాసి.

**సిజనే చిత్ర ప్రత్యేకత**

సిజనే అంతర్ సంఘర్షణలు మాత్రం అతని చిత్రాల్లో ప్రతి ఫలించలేదు. ప్రశాంతమైన ప్రభావం కోసమే తపన పడ్డాడు. తనకు నచ్చని చిత్రాలను నేలమీదే బ్రష్‌లతోబాటు పడేసేవాడు. లేకపోతే పాలెట్ కత్తితో వాటిని చించేసేవాడు. వాన్ గొఫ్ చిత్రాలలో కనిపించే మానసిక సంఘర్షణ సిజనా ఫినిషింగ్ కాన్వాస్‌లలో కనిపించదు. సిజనే కోరింది ప్రశాంతత (సెరినిటి) మాత్రమే. అదీ అతని ప్రత్యేకత. అతని రేంజ్ అంత గొప్పదేమీ కాదు. అంటే వైవిధ్యం ఎక్కువ లేదని అర్థం. ఎప్పుడు గీసినా అవే చెట్లు కొండలు పూలు పళ్ళు పేకాట ఆడేవాళ్ళులనే చిత్రించేవాడు. అతని రంగుల ప్రస్తారమూ హద్దులోనే ఉండేది. "ఎప్పుడు గీసినా మూడే మూడు ప్రాథమిక రంగులతో, వాటి నుండి వచ్చిన రంగులతోనే చిత్రించు" అని చెప్పిన గురువు "పిసార్రో"

మాటకు కట్టుబడి చిత్రించాడు. నలుపు, కారునలుపు, సియన్నా మొదలైన రంగుల జోలికి పోలేదు. తాను సృష్టించుకొన్న రంగుల సామరస్యానికే (హార్మని) కట్టుబడ్డాడు. మూడే మూడు రంగులతో తన కళా విశ్వరూపాన్ని చూపాడు అవే నీలం, ఆకుఅచ్చ, ఊదా రంగులు. (blue green pink tan) అవే అతని రంగుల సర్వస్వం. “he used these colors not mere accents in a design or as decorative units but as blocks of pure form ,basic elements of structure” అని అతని పై పరి శోధన విశ్లేషణా చేసిన వారు చెప్పారు. ఇంప్రెష నిస్ట్ లు సంప్రదాయం గా వస్తున్న లైట్ అండ్ షేడ్ లను తిరస్కరించి ముందుకు సాగారు .కాని సిజనే "modulated his pigments and defined his objects not by outlines but by subtly contrasting planes and patches of color, a continual change and "de composition" of light అని అతను తొక్కిన కొత్తదారిని గురించి వివరించారు. లాండ్ స్కేప్‌లలో సాధారణత ఉన్నా, ఏదో ఒక నియమానికి సూత్రానికి బద్ధుడై చిత్రించలేదు. తాను చిత్రించిన వాటిలో “క్యూబికల్, కోనికల్ ఆకారంలో ఉన్నవి తర్వాత కాలంలో అందరికి ప్రేరణగా నిలిచి క్యూబిక్ ఆర్ట్‌గా పేరు తెచ్చుకొంటుందని “ప్రకృతి ప్రధానంగా రేఖాగణితంలాగా ఉంటుంది” అనే నిర్వచనం వస్తుందని సిజనేకు తెలిస్తే అమితాశ్చపోయేవాడు.

నిత్య జీవితంలోని విషయాలను విశ్వ సత్యాలకు అనుసంధానం చేశాడు చిత్రాలలో. అతిని నిశ్చల చిత్రాలలోనే కాదు లాండ్ స్కేప్‌లు కూడా ప్రేమ మయంగా ఉండటం అతని ప్రత్యేకత. యాపిల్ పళ్లను ఆరంజ్‌లను చిత్రించటంలో సాధారణ వస్తువులలో ఉన్న ఆశ్చర్యానుభూతిని, వాటికున్న పరస్పర సంబంధాన్ని తెలియజెప్పాడు. అతని దృష్టిలో ఒక జగ్, ఒక మగ్, రుమాల పండుముక్క చిత్రంలో తాత్కాలికంగా చోటు దక్కించుకొని ఒక పర్వతానికున్న ప్రాధాన్యతను పొందుతుంది అంటాడు. దీన్ని చూసే శ్రీశ్రీ “కుక్క పిల్లా సబ్బు బిళ్ళా కాదేదీ కవితకనర్హం” అన్నాడేమో! అతని దృష్టిలో “literature express itself by abstractions, where as painting, by means of drawing and color, gives concrete shape not only to perception but sensations” అని అభిప్రాయపడ్డాడు. సాహిత్యం ఇవ్వలేని ఆకృతిని నిండుతనాన్ని చిత్రం ఇవ్వ గలుగుతుంది అని భావించాడు. ఈ సెన్సేషన్ అంటే ఇంద్రియానుభవమే చిత్రకారుడు సిజనే సాధించిన అద్భుత విజయం. దీనికి అతను ప్రకృతి ఉన్నతికి, అర్థంకాని విషయాలకు వినమ్రుడౌతాడు. అతని చిత్రాలు బ్రోకెన్ వర్ణాలకు తనకు ఇష్టం లేని, తాను లక్ష్య పెట్టని ఈ ప్రపంచానికి దూరంగా ఉండి సంతోషించటానికి మార్గ దర్శకాలయ్యాయి. అవన్నీ శాంతికి ప్రశాంతికి మహా చిహ్నాలుగా

నిలిచిపోయి చరితార్ధతను సాధించాయి. ఎక్కడా ఆటవికత ఉండదు. అందులో ఒక క్రమ దృష్టి ఉండి పవిత్రత తో శాశ్వతత్వాన్ని బోధిస్తాయి. ఈ ప్రశాంతత ఆతను పడిన మానసిక వేదన అంతర్ జ్వలన నిరాశ వలన లభించినదే. అందుకే తనకు మొదటి డీలర్‌గా ఉన్న వోలార్డ్‌ను తనపై నమ్మకం ఉంచుకోమని చెప్పాడు. కాని 115 స్టింగ్‌ల తర్వాతా కూడా తాను గీసిన పోర్ట్రెట్ సంతృప్తినివ్వ లేదు. “he had failed to realize his sensations and could not coalesce his color planes into a solidly perfected form " Still" he conceded "the shirt --front is not bad" అన్న పెర్ ఫెక్షనిస్ట్ పెయింటర్ పాల్ సిజనే.

**పతన ఉత్థానాలు-చీకటి కాలం**

1861-1870 కాలం సిజనే చిత్రకళా జీవితానికి చీకటి రోజులు - మూడవ నెపోలియన్ సెలూన్‌ల సంఖ్య తగ్గేట్లు కొందరి చిత్రాల్ని తిరస్కరించేట్లు చేశాడు. తిరస్కరింపబడిన వారిలో ఇంప్రెష నిస్టులు కూడా ఉన్నారు. వారిని విప్లవకారులుగా భావించాడు. వారి శైలికి ప్రభావితుడయ్యాడు. కాని వారితో స్నేహానికి దూరంగా ఉన్నాడు సిజనే. సిగ్గు, మొరటుతనం, కోపంలు చుట్టుముట్టి డిప్రెషన్‌లోకి వెళ్ళాడు. ఈ కాలంలో వేసినవన్నీ నల్ల రంగు చిత్రాలే. 1867లో కూర్బేట్ ప్రభావానికిలోనై “పాలెట్ నైఫ్”తో చిత్రాలు గీశాడు. వీటినే తర్వాతి కాలంలో “un couilarde” అంటే ”విరిలిటి” అంటే మగతనం ఉన్న చిత్రాలు అన్నాడు. పాలెట్ నైఫ్‌తో సిజనే గీసిన చిత్రాలు “ఆధునిక ఎక్స్ప్రెషనిజం”కు నాంది పలికింది అని, అతనే సృష్టికర్త అని రాస్తూ లారెన్స్ గోయింగ్ “although it was incidentally that, the idea of art as as an emotional ejaculation made first appearance in this moment” అన్నాడు. ఇందులో అతని శైలి పరిపక్వమై నిలిచింది. ఇదే అతని చీకటికాలం ఈ కాలంలో గీసినవన్నీ “ఈరోటిక్, వయోలేంట్” విషయాలు అంటే కామ, హింసాత్మకాలే నన్నమాట.

**ఇంప్రెషనిస్ట్ కాలం**

1870-78 కాలం అతను ఇంప్రెష నిస్ట్ అనిపించాడు. పారిస్ వదిలి మార్సేల్స్‌కు చేరిన తర్వాత లాండ్ స్కేప్‌లకు ప్రాధాన్యమిచ్చాడు. యుద్ధం ముగిసిన తర్వాత పారిస్ చేరి పిసాగ్రో తోకలిసి లాండ్ స్కేప్‌లు గీశాడు. తనను పిసాగ్రో శిష్యుడనని చెప్పుకొన్నాడు అతన్ని “గాడ్ ది ఫాదర్” అని కీర్తించాడు. పిసారో ప్రేరణతో నల్ల రంగులు వదిలేసి మెరిసే రంగులు వాడాడు పారిస్, ప్రావెన్స్‌ల మధ్య తిరిగాడు.

మొదటి ఇంప్రెష నిస్ట్ ప్రదర్శన 1877లో ఇచ్చాడు. కొన్ని అమ్ముడుపోయి కొంత ధనలాభం కలిగింది. ఇందులో వ్యంగ్యం అధిక్షేపణ అధికం. వీటిని చూసిన గర్భిణీ స్త్రీలకు ఎల్లో ఫీవర్‌తో పుట్టే బిడ్డను కనటం ఖాయం అన్నారు విమర్శకులు.

**పరిపక్వ దశ**

1878-90 కాలం సిజనే చిత్రకళా జీవితంలో పరిపక్వ దశగా భావిస్తారు. ప్రావెన్స్‌లోనే ఉండేవాడు 1885-88 కాలం అతని నిర్మాణ దశ. 1886 గొప్ప మలుపు తెచ్చింది. ఎమిలీ జోలాతో స్నేహానికి దూరంగా ఉన్నాడు. జోలా నవలలో తనను ఒక పాత్రగా రాయటంతో చిన్ననాటి స్నేహానికి స్వస్తి చెప్పాడు .జోలా నమ్మక ద్రోహం చేశాడని భావించాడు

**అంతిమకాలం**

1890-96 కాలంలో పెయింటింగ్‌లకు దూరంగా ఉండిపోయాడు. కాని అతని పెయింటింగ్‌లకు ప్రాచుర్యం బాగా వచ్చి నవతరానికి చెందిన యువ చిత్రకారులు సిజనేను తమ ఆదర్శ చిత్రకారుడని భుజాలకెత్తుకొన్నారు. 1903 నుంచి తన స్టూడియోలోనే చిత్రాలు గీశాడు.

సిజనే చనిపోయాక పెట్టిన ప్రదర్శనలో అతని చిత్రాలు హాట్ కేక్స్‌లాగా అమ్ముడు పోయాయి. అతని శిష్యులు సిజనే "క్యూబిజానికి ఆద్యుడు" అని అంటూ అతని ప్రతిభను " "Cézanne is one of the greatest of those who changed the course of art history. From him we have learned that to alter the coloring of an object is to alter its structure. His work proves without doubt that painting is not—or not any longer—the art of imitating an object by lines and colors, but of giving plastic [solid] form to our nature" (Albert Gleizes and Jean Metzinger in Du "Cubisme", 1912) [37] అని ప్రశంసించారు. సిజనే ప్రభావం పికాసో, బ్రేక్, మెట్జిన్జర్, గ్లీజేస్, గ్రీస్ మొదలైన ప్రముఖ చిత్రకారులమీద అధికంగా ఉంది. సిజనేను జీనియస్ అన్నారు. అతని పేర ఒక మెడల్ ఏర్పాటు చేశారు.❋



## 18. వాస్తవితకు సాహిత్య గౌరవం తెచ్చిన ఫ్రెంచ్ రచయిత - ఎమిలీ జోలా (1840-1902)

**సవ్యంగా సాగని బాల్యం**

తన రచనలన్నిటిని వారసత్వాన్ని (హెరిడిటరి) ఆధారంగా చేసుకొని రాసి సాహిత్యంలో రియలిజానికి పట్టం కట్టిన ఎమిలీజోలాది మాత్రం మిశ్రమ వారసత్వం. తండ్రి ఫ్రాన్సిస్కో జోలా సగం ఇటాలియన్ సగం గ్రీకువాడు. ఇంజనీర్‌గా సాహసిగా పేరున్నవాడు. తల్లి కోర్ఫు ఐలాండ్‌కు చెందినది. ఆమె తండ్రి తాలూకు వారు వెనిస్ దేశస్థులు ఆమె పేరు ఫ్రాంకో ఎమిలే ఆబర్ట్. పారిస్ దగ్గర డౌర్డాన్ గ్రామంలో పుట్టింది. పారిస్‌లో జోలా 2-4-1840న జన్మించాడు. అసలుపేరు "ఎమిలీ ఎడౌర్డ్ చార్లెస్ ఆంటోని" పుట్టగానే బ్రెయిన్ ఫీవర్‌తో బాధపడి రెండేళ్లకు కోలుకొన్నాడు. దీనికి తగ్గట్లు కళ్ళకు షార్ట్ సైట్ (హ్రస్వ దృష్టి) ఉండేది. దీనితో ఎడమకన్ను కొంచెంపైకి లేచినట్లు కనిపించేది. ఈ పరిస్థితులలో ధనికుడైన తండ్రి కుటుంబాన్ని దక్షిణ ఫ్రాన్స్‌కు తరలించాడు. పెళ్లి అయ్యే దాకా అక్కడే ఉన్నాడు. అక్కడ ఒక కాలువ తవ్వాలని ప్లాన్‌లో ఉండేవాడు. అనుకోకుండా తీవ్రమైన చలి జ్వరం వచ్చి ప్లూరసి జబ్బుతో బాధపడి చనిపోయాడు. కుటుంబానికి తండ్రి మిగిల్చింది ఐక్స్ సిటీ మీద వేసిన ఒక దావా మాత్రమే. ఈ కేసులో తండ్రికున్న ఆస్తి చాలాభాగం అమ్మేయాల్సి వచ్చింది. చాలా తక్కువ ఆస్తి మాత్రమే కుటుంబానికి మిగిలింది. ఎమిలీ యవ్వన జీవితం అంతా ఈ ఆర్ధిక లేమి వలన డిప్రెషన్‌తో గడిచిపోయింది. తక్కువ ఖరీదైన లాడ్జిలలో ఉంటూ తరచుగా ప్రదేశాలు మారుతూ గడిపాడు. చివరికి తల్లి అతన్ని ఐక్స్‌లోని ఒక బోర్డింగ్ స్కూల్‌లో చేర్పించింది.

**ముగ్గురు మిత్రులు**

మిగిలిన సహ విద్యార్థులకంటే వయసులో పెద్దవాడుగా ఉన్న జోలా స్కూల్‌లో పెద్దగా పేరు తెచ్చుకోలేక పోయాడు. తోటి విద్యార్థులు అతని ఎగుడు దిగుడు కన్నులను చూసి వెక్కిరించేవారు. అతని పారిస్ నగర ఉచ్చారణ విని హేళన చేసేవారు. దీనితో పిరికితనం వచ్చి ఆత్మ రక్షణలో పడాల్సి వచ్చింది. కాని ఇద్దరు ఆత్మీయ మిత్రులను మాత్రం సంపాదించుకోగలిగాడు. అందులో బాగా తెలివిగల ఐక్స్ లోపుట్టిన పాల్ సిజనే, సిజనే స్నేహితుడైన బైలీలు. పది హేనేళ్ళ ఈ ముగ్గురూ కలిసి పల్లె ప్రాంతపు అందాలను అనుభ విస్తూ పరిశోధన చేస్తూ కాలవలలో ఈతలు కొడుతూ నదిగట్ల మీద విక్టర్ హ్యూగో, ఆల్ఫాన్సో డిలామర్టిన్, ఆల్ఫ్రెడ్ డి మ్యూసేట్‌ల రొమాంటిక్ రచనలు చదువుతూ కాలక్షేపం చేశారు. వీటికన్నిటికి ప్రేరకుడు సిజనే. తర్వాత అయిదేళ్ళలో సిజనే రంగుల బొమ్మలు గీస్తూ గడిపాడు. ఎమిలీ జోలా కవిత్వంతో, బాలడ్స్ రాస్తూ మూడు అంకాల నాటకాలు రాస్తూ కాలక్షేపం చేశాడు. తోటి మిత్రులకు రాబోయే సాహిత్యాన్ని గురించి తెలియజేస్తూ కళకున్న బాధ్యతను వివరిస్తూ చదువు పై శ్రద్ధ పట్టలేక పోయాడు జోలా.

**ఆర్థిక కుంగుబాటు**

ఇంటి దగ్గర తల్లి పరిస్థితులూ బాగాలేవు. దరిద్రం పెరిగి పోయింది. తినటానికి తిండి కూడా దొరకని పరిస్థితి వచ్చింది. ఆమె తలిదండ్రులే ఇప్పటిదాకా అండగా నిలిచారు. కాని వారూ ఇక ఏమీ చేయ లేని నిస్సహాయులైపోయారు కూతురికీ, మనవడికీ. చిల్లిగవ్వ కూడా చేతలేక జోలా తల్లి నిస్సహాయురాలైంది. ఎవరో పుణ్యాత్ముల దగ్గర అప్పుగా కొన్ని ఫ్రాన్కుల డబ్బు తీసుకొని భర్త తాలూకు బంధువులు ఏదైనా సాయం చేస్తారనే ఆశతో పారిస్ వెళ్ళింది. కొడుకు జోలాను ఇంట్లో మిగిలిన కర్రా బుర్రా కూడా అమ్మేసి మూడవ తరగతి మెట్రో రైల్ టికెట్ కొనుక్కొని పారిస్ వచ్చి తనను కలవమని చెప్పింది.

**కవిత్వంపై పిచ్చి**

18 వ ఏటా జోలా పారిస్ చేరాడు. అది విలాసవంతమైన పై డాబుల నగరం. మూడవ నెపోలియన్ దాన్ని పునర్నిర్మించాడు. లాభాల వేటగాళ్లకు, పరాన్న భుక్కులకు నిలయం. అసాంఘిక చర్యలకు అడ్డా. తాను వచ్చిన పల్లెటూరికి, దీనికి ఆస్తి మశకాంతరం ఉందనిపించింది జోలాకు. పారిస్‌ను చూసి షాక్ అవటమేకాక ఆనందం కూడా పొందాడు. ఇక్కడ స్కాలర్‌షిప్ వచ్చి లీసీ సెయింట్ లూయీలో చేరాడు.

అక్కడ అతను ఇష్టం లేని వాడుగా, అక్కడివాళ్లు అతన్ని ఒప్పుకోలేని వారుగా కనిపించారు. ఇక్కడ కూడా అతని పారిస్ ఉచ్చారణకు మొదట అవహేళన జరిగినా అతను స్థానికుడు కనుక సరిపోయింది. చదువు మీద దృష్టి పెట్టలేదు. స్నేహితుల్ని పట్టించుకోలేదు. సాహిత్యం చదవటం, రాయటం అనే రెండు విషయాల మీదే దృష్టిని కేంద్రీకరించాడు. అవే అతని శ్వాస, ఊపిరి అయ్యాయి. కవిత్వమే అతని ప్రేయసి అయి మురిపించింది లోకాన్ని మరిపించింది. ఆ తర్వాత నేచరిస్ట్ రచయితలలో అగ్రగామి అని పేరొచ్చినా అతనికి కవిత్వం మీద అభిమానం మాత్రం పోలేదు. ఇరవై ఏళ్ళ వయసులో కవిగా గుర్తింపు మాత్రమేకాదు, రొమాంటిక్ ఫిగర్ గానూ గుర్తింపు వచ్చింది. 'టమన ఆకలి తీర్చుకోవటానికి తిందాం తాగుదాం కాని మన ఆత్మలను పవిత్రంగా దూరంగా ఉంచుకొందాం" అని చెప్పేవాడు.

**మరణం అంచు లోంచి బైటికి**

19 వ ఏట జోలా మళ్ళీ చావు దగ్గరకు వెళ్ళాడు. తీవ్రంగా టైఫాయిడ్ జ్వరం వచ్చి రెండు నెలలు మంచం మీదనే ఉండి పోయాడు. కొంచెం కోలు కొనే సమయంలో నోరు అంతా అల్సర్లతో నిండిపోయి మాట్లాడ లేకపోయాడు. మానసికంగా బాగా కుంగి పోయాడు. హైపో కాండ్రియాకు అది తర్వాత దారి తీసింది. ఈ వ్యాధి వలన రచనా విధానంలో మార్పు వచ్చింది. సిజనే కూడా కావితలు రాసేవాడప్పుడు. అతనికి జాబు రాస్తూ జోలా "ఒరే ముసలి మూర్ఖా! నువ్వు నాకంటె గొప్పగా కవిత్వం రాయగలవు. నీ కవిత్వం కంటే నా దానిలో వాస్తవికత ఉండచ్చు కాని నీదానిలో కవితా స్పర్శ ఎక్కువ. నువ్వు హృదయంతో రాస్తావు. నేను మనసుతో అంటే బుద్ధితో రాస్తాను. నీది హృదయవాదం నాది బౌద్ధికవాదం" అన్నాడు.

**అనేక ఆలోచనలు**

టైఫాయిడ్ నుంచి కోలుకొన్నాడు కాని స్కూల్ అంటే మరీ చిరాకేసింది. లాయర్ అవ్వాలనిపించింది పరీక్ష రాసి తప్పాడు. డిప్లమా రాలేదు దీనిపై "the open sesame to all the professions" అనుకొన్నాడు. దీనిపై దీర్ఘ కవిత రాశాడు. ఒక షాడో బిజినెస్ మాన్ అవతారం ఎత్తాలనుకొన్నాడు. ఈ విషయమై బైలీకి రాస్తూ "ఏదో ఒక సంస్థలో గుమాస్తాగా చేరాలని ఉంది. ఇది నా నిరాశా దృక్పథంతో తీసుకొన్న నిర్ణయం. నా భవిష్యత్తు చిద్రమైపోతుంది. ఆఫీసులో పని చేసినా భవిష్యత్తు లేదు నైతిక పతనంతో చీకటిలోకి జారిపోవటమేనేమో" అన్నాడు. అనుకోన్నట్లే నెపోలియన్ డాక్స్‌లో బుక్ కీపర్ ఉద్యోగం వచ్చింది. రోజూ రెండుమైళ్ళు నడిచి ఉద్యోగానికి

వెళ్ళాలి. జీతం నెలకు ముప్ఫై ఫ్రాంకులు. చేరి, జీతం చాలక, నడవ లేక రెండు నెలలకే మానేసి మళ్ళీ ఉద్యోగాన్వేషణలో పడ్డాడు.

**ఇరుకు గదిలో ఇద్దరు**

ఉద్యోగం కోసం ఎదురుచూపులు మానేసి అప్పుచేసి దాంతో పోట్టకింత తింటూ ఒక మేడమీదపై భాగంలో చిన్నగది బాడుగకు తీసుకొని, ఎత్తు మెట్లు ఎకుతూ దిగుతూ అక్కడ ప్రోఫెషనల్ బోహీమియన్ లా ఉన్నాడు. బద్ధకం గురించి చెబుతూ "బద్ధకం మహా గొప్పది. దానివలన ఎవరూ చచ్చిపోరు" అంటాడు. తన పూర్వ స్నేహితులిద్దర్నీ తనతో కలిసి వచ్చి లాటిన్ క్వార్టర్‌లో ఉండమని ఆహ్వానించాడు. కాని సిజానే మాత్రం మూడేళ్ళ తండ్రితో తీవ్ర యుద్ధం చేసి వచ్చి చేరాడు. ఆ చిన్న ఇరుకు గదిలోనే ఇద్దరూ సర్దుకున్నారు. సిజనే కొచ్చే అలవెన్స్‌తోనే ఇద్దరూ గడిపారు. ఇద్దరికీ విసుగనిపించి వేర్వేరుగా గదులు తీసుకొని వేరైపోయి ఉన్నారు. ఐక్స్‌లో సిజానే ఇబ్బంది పడుతూ ఇంటికి వెళ్లిపోయాడు. జోలా ఒంటరిగా పేదరికంలో మగ్గుతూ గడిపాల్సి వచ్చింది. రోమాంటిసిజంను ఇంకా పట్టుకొని వేలాడుతూనే ఉన్నాడు అవి ఏమీ ప్రతి ఫలాన్ని పిండటం లేదు. "ఈ నగరంలో విశ్రుంఖల వేశ్యా విహారం తప్ప ఏమీలేదు. పోనీ పల్లెటూళ్ళల్లో ఏదైనా ఉందనుకొంటే అక్కడ అంతా మూర్ఖత్వమే" అన్నాడు జోలా.
కనిపించిన ప్రతి చోట ప్రేమ కోసం అన్వేషించాడు. కాని అదీ ఆకాశ కుసుమమే అయింది. "everywhere sex but nowhere woman" అనుకొన్నాడు. ఉద్యోగం వెన్నులో వణుకు పుట్టిస్తోంది. అవి తనను పూడ్చి పెట్టనిమ్మనుకొన్నాడు.

**పిచికల్ని కాల్చుకు తిన్న అతి దరిద్రం**

కొంతకాలం దరఖాస్తు పెట్టకుండా ఉద్యోగం వేట చేశాడు. అతని ఆకారం, దుస్తులు, చూపులు చూసిన వారెవ్వరూ ఇంటర్వ్యూ చేయటం, ఉద్యోగం ఇస్తానన్న సాహసం చేయలేకపోయారు. తనకు తాను అంచనా వేసుకొన్నాడు. తాను వేసుకొన్న మార్కులు కూడా చాలా పూర్. కవి, స్వేచ్ఛా ప్రేమతో ఉన్న బోహీమియన్ అనుకొనేవాడు. ఇరవై ఒక ఏడాది వరకు అస్కలిత ఘోటక బ్రహ్మ చారిగా ఉన్నాడు. ఒక వేశ్య దొరికితే ఆమెతో కొన్ని నెలలు గడిపాడు. ఈ కలయిక సుఖాన్ని ఏమీ అందించలేదు. బీదరికాన్ని, బీద జనాన్ని చీదరించుకొనే జోలా, సంఘాన్ని తిట్టిపోశాడు, కాని దాన్ని సహించాడు. చాలీ చాలని దుస్తులు, ఎప్పుడూ కడుపులో ఆకలి మంటలు. కళ్ళల్లో క్రోధం అదీ జోలా పరిస్థితి. రాయటానికి అసలు ఇష్టపడే వాడు కాదు. గైడీ మొపాసా అనే ప్రముఖ రచయిత రాసిన దాన్నిబట్టి జోలా గదిలో పిచ్చుకలు గూళ్ళు కట్టుకొని ఉండేవి.

వాటిని కర్టెన్ రాడ్ మీద ఉడికించుకొని ఆత్మా రాముడికి శాంతి కలిగించేవాడు. అంతటి దుర్భర దారిద్ర్యం అనుభవించాడు జోలా. లేకపోతే అవి తెచ్చుకొని వదిలేసిన రొట్టె ముక్కల్ని దక్షిణ ప్రాంతం నుండి పంపిన ఆలివ్ ఆయిల్‌లో ముంచుకొని తినేవాడు. మరీ దారుణంగా పతనమై పోయాడు ఆర్థికంగా. అప్పుడు తెలిసింది ఒక స్నేహితుని ద్వారా తన తండ్రి ఒక పబ్లిషింగ్ కంపెనీలో ఒక ఉద్యోగాన్ని కుదిర్చాడని.

**ఉద్యోగం – మొదటి కథాపుస్తకం – మొదటి నవల**

ఆ మాట విని "విశ్వాసం మళ్ళీ వచ్చింది. నిజమే అని నమ్మాను. ఇప్పుడు నాకు నవ్వు వస్తోంది" ఆ కంపెనీ అధికారి మన్సూర్ హేచాటీ జోలా రచయిత అని తెలుసుకొని ప్రొమోషన్ ఇచ్చి అడ్వర్ టైజ్ డిపార్ట్‌మెంట్‌లో ఎక్కువ జీతం ఇచ్చి ప్రోత్సహించాడు. ఈ విషయాన్ని సిజానేకు రాస్తూ తన పాత రచనలపై అభిప్రాయాలకు మెరుగులు దిద్దాలనుకొన్నానని చెప్పాడు. బాగా వినిపించాలని బాగా చూడాలని అనిపిస్తోందన్నాడు ఇదివరకు లేని కొత్తభావాలు తనలో వికసిస్తున్నాయన్నాడు. ప్రకృతిలో చాలా కవిత్వం ఉంది అలా కనిపిస్తుంది కూడా అన్నాడు. ఇది వరకు రాసిన రొమాంటిక్ కథలను అన్నిటినే సేకరించి మేగజైన్స్‌లో ప్రచురించేట్లు చేశాడు. మిగిలినవీ రాశాడు. వీటినన్నిటిని కలిపి "స్టోరీస్ ఫర్ నినాన్" పేరుతొ ప్రచురించాడు. ఇదే జోలా మొదటి పుస్తకం. అప్పటికి ఆయన వయసు 25. తర్వాత వేశ్యతో తాను గడిపిన అశాంత జీవితాన్ని ఒక నవలగా "కన్ఫెషన్స్ ఏ క్లాడ్" రాశాడు. దీన్ని తన ప్రియ మిత్రులైన సిజనే, బైలీలకు అంకితమిచ్చాడు. ఈ నవల సిగ్గుమాలిన నవల అని అందరూ ముందు అన్నా తర్వాత విపరీతమైన విజయాన్ని సాధించి ఉత్సాహాన్నిచ్చింది. ఈ సందర్భంగా సిజనే – జోలా చిత్రాన్ని గీసి బహూకరించాడు. అందులో జోలా లోని కల, నిశ్చయం రెండూ సమతూకంలో కనిపిస్తాయి.

ఫ్లాబర్ట్ చెప్పే నేచురలిజం చూసి దాని ప్రచారం విని తెలుసుకొని తన రచన చాలా పేలవంగా, జీవం లేనిదానిలా ఉందని జోలా గ్రహించాడు. "మాడంబోవరీ" రాసినందుకు ఫ్లాబర్ట్‌ను అందులో అనైతికత ఉందని కోర్టుకు లాగారు. అందులో అన్నీ చాలా వివరంగా ఫ్లాబర్ట్ రాశాడు. "మంచి అభిరుచి" చదువరులకు అందించాలనే ఆలోచన వచ్చింది. ఇదే నేచరిలిజంకు దారి తీసింది. "zola envisioned a kind of writing which would shock the world by its power and range, a series of books from which nothing could be excluded" అనే ఒక ఆలోచనలోకి వచ్చాడు. ఈ సందర్భంలో జోలా "When I attack a subject, I want to force the whole universe into it"అ ని చెప్పుకొన్నాడు. జోలా పని చేస్తున్న కంపెనీ దాని అధికారి హచాటీలవి భిన్న ఆలొచనలుగ ఉండేవి.

తన జీవిత చరిత్రగానే రాసిన "కన్ఫెషన్స్" నవల అతని కంపెనీలో ద్వేషాలు పెంచింది. మూడేళ్ళు అలాగే లాక్కొచ్చి రాజీనామా చేసేశాడు. వెంటనే చారిత్రాత్మకంగా గొప్ప నవల "ది ఇస్స్యు"ను ధారావాహికంగా పారిస్ వార్తాపత్రికకు రాశాడు. దీన్ని మెచ్చిన సంపాదకుడు ఆ పత్రికలో రెగ్యులర్ కాలం రాయమని కోరాడు. "A young man versed in all the arts whose books, few but excellent, have already produced a sensation" అని మెచ్చుకొన్నాడు కూడా.

### ప్రేమ వ్యామోహం

దీనికి రెండేళ్ళ ముందే జోలా గాఢం గా ప్రేమలో పడ్డాడు. 1864లో ఎడమ గట్టు మీద కొత్త లాడ్జింగ్ వెతుక్కొని వెళ్ళిపోయాడు. అప్పటి నుంచి అలేక్సాంద్రిన్ మేస్లీతో పిచ్చి మోహంలో పడ్డాడు. ఆమె తలిదండ్రులు అద్దెకిచ్చిన గదిలోనే ఉన్నాడు. ఆమె ఒక మెడికల్ స్టూడెంట్‌కు కొత్త భార్య. ఆమెను వేసవికి ఇంటిదగ్గర వదిలి భర్త వెళ్లిపోయి మళ్ళీ తిరిగి రాలేదు. ఆమె జోలాను ముగ్గులో దించినా ఓపిక పట్టి ఆమె భర్త తిరిగి వస్తే జరిగే పరిణామాలను గురించి ఆలోచించాడు. ఒక వేళ ఆమె ప్రియుడు తిరిగి వస్తే అలేక్సాంద్రిన్‌పై అతనికే మొదటి హక్కు ఉంటుంది కదా అనుకొన్నాడు. ఈ స్థితిలో సుఖంగా గడపాల్సిన రాత్రులన్నీ ఈ సంక్షోభంతో కరిగిపోయాయి జోలాకు. అతనే తిరిగి వస్తే తనకు ఆమె మొదటి ప్రేమికుడికి మధ్య ద్వంద్వయుద్ధం జరుగుతుందేమో ననుకొన్నాడు. అనుకోన్నట్లే కొన్ని నెలల తర్వాత ఆ మెడికల్ స్టూడెంట్ తిరిగి రానే వచ్చాడు. వీరిద్దరి ప్రేమ గ్రహించిన ఆ మెడికో జోలాకు అలేక్సాంద్రిన్‌ను స్వయంగా అప్పగించేశాడు. కొత్త దంపతులు విశాలమైన ఇంటికి కాపురం మార్చారు. అప్పుడు జోలా తల్లి వచ్చి కొడుకు కోడలుతో ఉంది. హాయిగా ఆనందంగా జీవితం గడిపారు ముగ్గురూ. ఆరేళ్ళ తర్వాత ఆమెను చట్టబద్ధంగా జోలా పెళ్లి చేసుకొన్నాడు.

### ఇంప్రెష నిస్ట్

రెండేళ్ళ తర్వాత తన సాహిత్య క్షేత్రాన్ని జోలా విస్తరించాడు. సెన్సేషనల్‌గా వాస్తవానికి దగ్గరగా ఉండే ఒక గొప్ప నవల రాయటానికి తీవ్రంగా ప్లాన్ తయారు చేసుకొన్నాడు. అప్పటికే "మై హేట్స్" (my hates) అనే వ్యాస సంపుటిని ప్రచురించాడు. చివరి సారిగా తాను రోమాంటిజంను త్యజిస్తున్నానని ప్రకటించాడు. యువ చిత్రకారుల భుజం తట్టి వారి ఇంప్రెష నిజానికి మద్దతు పలికాడు సిజానేతో కలిసి. సెలూన్ జూరీ దీనికి అనుమతించలేదు. "పిక్నిక్ ఆన్ ది గ్రాస్" అనే చిత్రాన్ని గీసిన మానేట్‌ను అభినందించాడు. దాన్ని "పోకిరి" చిత్రం అని విమర్శకులు దాడి చేస్తే జోలా "A

work of art is a corner of creation, seen through a temperament" అని జవాబు చెప్పాడు. "తెరేసి రాక్విన్" ప్రచురించేటప్పటికి జోలా వయసు 27. ఈ నవలలో తాను సెక్స్, హత్య, పశ్చాత్తాపం మొదలైన వాటిని చర్చించానని జోలా చెప్పాడు. అశ్లీలంగా జంతు ప్రేమకు పరాకాష్టగా ఉందని విమర్శకులు అన్నా, రెండవ ముద్రణ పొందింది.

**25 ఏళ్ళ పరిశోధనా కృషి ఫలితమే రోగాన్ - మాక్వార్ట్**

నిశ్చయత్వంలో పూర్తిగా మునిగి పరిసరాలు, హెరేడిటిల ప్రభావాలను చర్చించాడు. వాటి ప్రభావాన్ని గణితం చెప్పినంత కరెక్ట్‌గా చెప్పగలిగాడు. ఫిక్షన్ రచనలలోని వ్యక్తుల ప్రవర్తనను వారి జీవిత నేపధ్యం దృష్టిలో రాశాడు. ఇందులో పెంపకం, రక్తం, ఏయే ప్రభావాలు కలగజేస్తాయో క్లినికల్ లేబరేటరీలో పరీక్ష చస్తే వచ్చే ఫలితాలు ఎంత స్పష్టంగా ఉంటాయో అంత స్పష్టంగా చెప్పగలిగాడు. బాల్జాక్ రాసిన "కామెడీ హ్యూమనే" ఆధారంగా మరో గొప్ప నవలకు ప్లాన్ తయారు చేసుకొన్నాడు. లైబ్రరీలలో కూర్చుని మోనోగ్రాఫులు, కేస్ హిస్టరీలు, మానసిక అధ్యయనం, వ్యవహార పత్రాల పరిశీలనను అతి జాగ్రత్తగా అధ్యయనం చేసి వాటిని తనకున్న మనోభావాలతో విశ్లేషించి వివరించాడు. సమాజంపై తనకున్న భావాలు వ్యక్తుల ప్రవర్తన, వారి మానసిక శారీరక స్థితిలపై చేసిన ఈ పరిశోధన 25 భాగాల "రోగాన్-మాక్వార్ట్" నవలలకు సరిపడ సామగ్రిగా లభించింది. ఈ బృహత్తర గ్రంధ రచనకు 25 ఏళ్ళు పట్టింది ఇవన్నీ 90 రాత ప్రతులలో భద్రం చేశాడు. రోగాన్-మక్వార్ట్ కుటుంబాలకు చెందిన 32 మంది వ్యక్తుల సమగ్ర రిపోర్ట్ ఇది. దీనికోసం ఎందరో వ్యక్తుల మహళ్లకు, మురికి కూపాలకు అడ్డాలకు అనేక సార్లు వెళ్లి వచ్చేవాడు. పోలీసు రికార్డులు పరిశీలించాడు. తన రచన చాలా నిర్దుష్టంగా సంపూర్ణంగా దోష రహితంగా ఉండాలన్న తపనే ఇదంతా.

ప్రతి పుస్తకాన్ని వేరుగా ఒక యూనిట్‌గా ఉంచాడు. ఒక బ్రహ్మాండమైన బిల్డింగ్ నిర్మాణానికి రాళ్ళు ఎలా అవసరవో ఇవి ఆయన బృహత్తర నవలకు మూలాధారాలయ్యాయి. దీనిపై హెన్రి బార్బాస్ స్పందిస్తూ "in the entire history of intellectual creation there is scarcely another example of a man seeing so far in advance with such precision the concrete contours of a multi form work" అని గొప్పగా విశ్లేషించి చెప్పాడు.

**నిరుపేద సంపన్నుడయ్యాడు**

ఈ సిరీస్ లో వచ్చిన నవలలు జోలాకు గౌరవాన్నికాని ఆర్ధిక లాభాలను కాని తెచ్చి పెట్టలేదు. కాని ఏడవ భాగమైన "ది డ్రాం షాప్ అండ్ ది బరూం" చాలా

సంచలం తెచ్చి అభియోగం మోపేంత దాకా తెచ్చింది. విమర్శల జడివానే కురిసింది. "literary street cleaner", poet of the disgusting", purveyor of muck" అంటూ విశేషణాలు తగిలించారు. కాని పుస్తకం రికార్డ్ స్థాయిలో అమ్మకం కొనసాగించి జోలా ఫ్రాన్స్ దేశంలో అందరికి సుపరిచతమైన రచయిత అయిపోయాడు. పిచ్చికల్ని కాల్చుకు తిన్న దరిద్రం పోయి అధిక సంపన్నుడయ్యాడు. విలాసవంతమైన ఇంట్లో ఉంటున్నాడు. అతని ఆకలి మాత్రం అదే స్థాయిలో పెరిగిపోయింది. చాలాఖరీదైన ఆహారం తింటున్నాడు. అరుదుగా లభించే వైన్ సంపాదించి తాగుతున్నాడు. పిట్టాలా ఉండే వాడి పొట్టపెరిగి బలిసి చాలాలావుగా, వైభవోపేతంగా దర్జాగా కనిపిస్తున్నాడు. డబ్బు తెచ్చిన మార్పులివి. సంభాషణలు దైవ వాక్యాలుగా, ప్రామాణికాలుగా భారీగా ఉంటున్నాయి. రచన జిలేబీ చుట్టల్లా ఉండి, ముతకగా మారింది.

**సాంఘిక సంస్కర్త జోలా**

అయితేనేం విజయ పరంపర సిరీస్‌లో 13వ దైన "జేర్మినల్" వరకు కొనసాగి జోలా సాంఘిక సంస్కర్త అవతారం ఎత్తాడు. బొగ్గు గని కార్మికుల జీవన స్థితి వారి సమ్మెలు హక్కుల పోరాటాలు ప్రోలిటరేనియన్ సంస్కృతీ అన్నీ అందులో ప్రతిఫలింప జేశాడు. దీనితో రచయితల దృక్పథమే మారిపోయింది. ఇదే తర్వాతా ప్రోలిట రేనియన్ నవలకు నాంది పలికింది. రావి శాస్త్రి గారి నవలలకూ విషయమైంది. జేర్మినల్ నవలలో మార్క్స సిద్ధాంతాన్నీ జోడించాడు. దీన్ని గూర్చి సోషల్ సైన్సెస్‌కు చెందిన విజ్ఞాన సర్వస్వం "zola implanted in its readers a faith in the revolution as an investable catastrophe which must precede the happier era when rival classes will be supplanted by a society of free individuals bound only by ties of cooperative labor and love"అని విశ్లేషించి రాసింది.

**జోలా "నానా" నవల**

ఈ సిరీస్ లో వచ్చిన నవల "నానా" ఉత్క్రుష్టం అని పించుకోలేదు కాని సెన్సేషనల్ నవలగా పేరొంది. ఇప్పటికీ బాగా ప్రాచుర్యంలోనే ఉంది. జోలా అంటే "నానా" నవలే గుర్తొస్తుంది. దీని తర్వత "రైతు జీవితంపై రాసిన "లాటెర్రె" కూడా ఆధారం పొందింది. దీని ఇంగ్లీష్ అనువాదంలో కార్మికుల పోరాటం వారందరూ భూమిలోకి చేరిపోవటం విషయంలో చాలా బలమైన మాటలుండటంతో ఇంగ్లీష్ వారికి నచ్చక దీన్ని నిషేధించారు. అనువాదకుడిని జైల్లో పెట్టారు. ఆ పుస్తకం ఆంగ్లానువాదం

దాదాపు యాభై ఏళ్ళు ఇంగ్లీష్ చదివే వారికి అందుబాటులో లేకుండా చేశారు. ఒకప్పుడు రైతులంటే ఇష్టపడని జోల వారిపై సంచలనాత్మక నవల రాసి వారికీ చేరువైనాడు. "లా డిబాకిల్" నవలలో సెకండ్ ఎంపైర్ అని పిలువబడే నిరాశ నిస్పృహలతో ఓడిపోయినా సైన్యానికి సంబంధించిన విషయాలు రాశాడు. జోలా ధోరణి మారింది. "An artist must learn to be lavish and live at top pitch"అన్నాడు. నీతి జాడ్యానికి చికిత్స చేసే వాడుగా జోలా కనిపిస్తున్నాడన్నారు. దీనికి సమాధానంగా తన రాతలు విద్య నేర్పించాటానికే కనుక నీతితో ఉండటం సహజం అన్నాడు. "సంఘ రాజకీయ శరీరానికి" తాను డాక్టర్ను అని చెప్పుకొన్నాడు. ఆయన వెలువరించిన తీవ్ర విషయాలను "కల్చరల్ అటాప్సీలు" (సాంస్కృతిక స్వీయ వీక్షణలు) అన్నారు.

**నడి వయసులో ఘాటు ప్రేమ**

1888లో తన సీరియళ్ళ సీరియస్ ప్రచురణలో ఉండి అమాంతం "జినీ రోజెరాట్" అనే తన ఎస్టేట్ సర్వెంట్తో ప్రేమలో పడ్డాడు. మనోడికి నలభై అయిదు ఆమెకు ఇరవై లోపు వయసు. "జోలా అండ్ హిస్ టైం"లో మాథ్యూ జోసేఫ్సన్ రాస్తూ ఆమె చాలా అరుదైన సౌందర్యం కలిగి ఉండేదని రాశాడు. పల్లెటూరి ప్రాంతం నుంచి వచ్చిన పిల్ల. ఇప్పుడిప్పుడే ఇంటి పనులు చేయటం నేర్చుకొన్నది. మన రచయితలో ఇప్పటిదాకా ఆనకట్ట వేయబడిన శృంగారం గేట్లు తెంచుకొని ఉరకలెత్తి అడ్డూ ఆపూ లేకుండా. పారింది. ఈ శృంగారం ఫలించి జోలాకు ఇద్దరు పిల్లని కన్నది. ఈ వ్యవహారాన్ని జోలా భార్య అలేక్సాండ్రిన్ మొదట వ్యతిరేకించినా చివరికి రాజీపడి ఆమోదించింది. జోలా చనిపోయిన తర్వాత అతని భార్య చేత అనుమతి పొంది ఈ పిల్లలకు జోలా పేరు పెట్టుకొన్నది కొత్త పెళ్ళాం. వారే జోలా వారసులయ్యారు.

**డ్రేఫస్ అఫైర్-దోషి అని ముద్రపడిన కెప్టెన్ డ్రేఫస్ను నిర్దోషిగా నిరూపించిన జోలా**

జోలాకు యాభైవ ఏడు వచ్చేసరికి ఫ్రాన్స్ దేశంలో కెప్టెన్ ఆల్ఫ్రెడ్ డ్రీ ఫేస్ దేశానికి ద్రోహం చేశాడని నేరం ఆరోపింపబడి, శిక్ష అనుభవించటానికి "డెవిల్స్ ఐలాండ్"కు పంపారు. ఈ కేసునే "డ్రీఫాస్ అఫైర్" అంటారు ఫ్రాన్స్ దేశపు అవినీతి, రాజకీయ కుళ్ళు దీనితో అందరికి తెలిసింది. తర్వాత ఈ కేసును అందరూ మర్చే పోయారు. చివరికి రెండేళ్ళ తర్వాతా ఎమిలీ జోలా తన వద్ద ఉన్న పూర్తి ఆధారాలతో డ్రీఫాస్ నిరపరాధి అని నిరూపించాడు. సైన్యంలోని కొందరు పెద్దలు జర్మనీకి రహస్య విషయాలను చేరవేశారని వారే అసలైన నిందితులని చెప్పాడు. అప్పటి వరకూ జనసామాన్యానికి డ్రీఫాస్పై సానుభూతి లేదు. ఏది ఏమైనా తన పట్టు విడువ కుండా

స్థైర్యంగా డ్రీఫ్రాస్ వైపు నిలబడ్డాడు జోలా. ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫెలిక్స్ ఫారెకు జోలా ఒక బహిరంగ లేఖ రాయటంతో కద క్లైమాక్స్‌కు చేరింది. తన దగ్గర ఉన్న డాక్యుమెంట్ల ద్వారా ఒక్కో అధికారి గుట్టు బయటపెట్టి ముచ్చెమటలు పట్టించాడు. తాను ఇదంతా ఎందుకు చేస్తున్నాడో తెలియబర్చాడు. మానవత్వం కోసం మానవ హక్కుల పరిరక్షణ కోసమేనని చెప్పాడు. దీనిపై క్రోధం పూనిన సైన్యం అధికారులు సైన్యాన్ని అవమాన పరచాడనే అభియోగం మోపి జైలులో పెట్టారు. నేరం రుజువైందని చెప్పి మూడు వేల ఫ్రాన్కుల జరిమానా ఒక ఏడాది జైలు శిక్ష విధించారు. ప్రజా బలం జోలా వైపే ఉంది అయినా సైన్యానికున్న సర్వాధికారాలు ఉపయోగించి, పత్రికల నోళ్ళు మూయించారు. ప్రజల దృష్టిలో జోలా అమరవీరుడయ్యాడు. సైన్యానికి వ్యతిరేకంగా ప్రజలు ఆగ్రహ జ్వాలలు కురిపించారు. కాని ఏమీ ప్రయోజనం లేకుండా పోయింది.

కేసును పునర్విచారించారు. జోలాకు దేశ బహిష్కార శిక్ష విధించారు. 1898 జులైలో రహస్యంగా లండన్ చేరి ఒక ఏడాది మారు పేరుతో ప్రవాస జీవితం గడిపాడు. జోలా నిరంతర పోరాట ప్రయత్నం వలన మళ్ళీ కేసు విచారణకు వచ్చి కెప్టెన్ డ్రేఫాస్‌పై నేరాన్ని ఉపసంహరించి అతనికి క్షమా భిక్ష పెట్టింది ప్రభుత్వం. అప్పుడు జోలా పారిస్‌కు తిరిగి వచ్చాడు. ఆయన హీరో గానూ లేక గాయపడిన వాడుగానూ ఉండలేదు. పగ ద్వేషం అనే అగ్ని నుండి బయటపడ్డాడు. శుద్ధ మనస్కుడు అనిపించాడు. ఈ సందర్భంగా "truth having been vanquished, justice reigning at last I am re born and take my place again upon French soil" అన్నాడు. ఇలా ఏ విషయమైనా అంతలోతుగా అధ్యయనం చేసే సామర్థ్యం ఉన్నవాడు ఎమిలీ జోలా. జోలా అంటే చాంపియన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్.

**అసంపూర్తి నవల-విషాదంగా సంపూర్ణమైన జీవితం**

ఇంగ్లాండ్‌లో ఉండగా జోలా "ది ఫోర్ గాస్పెల్స్" అనే కొత్త సీరియల్ రాయటం ప్రారంభించాడు. ఈ నవల గురించి చెబుతూ "about a humanity enlarged for the needs of tomorrow', a Utopia of social harmony a dramatization of the Dreyfus case, and justice" అన్నారు విమర్శకులు. కాని దీన్ని పూర్తి చేయలేక పోయాడు. ఒక ఆటం రోజు రాత్రి జోలా చలికి తట్టుకోవటం కోసం సేవకులు అసాధారణమైన మంట వేశారు నెగడులో. కాని ఫైర్ లో గాలి వెళ్ళే మార్గంలో ఏదో లోపం ఉంది ఎవరూ గమనించలేదు. అందుకని రాత్రి వేళ చిమ్నీలోంచి గాలి అసలు బయటికి పోలేదు లోపలే ఉండిపోయింది. కనుక జోలా ఆ రాత్రి అంతా గదిలో ఉండిపోయిన కోల్ గాస్‌తో నిండిన విషపు గాలినే అంటే కార్బన్ మోనాక్సైడ్‌నే పీల్చాడు పాపం. తెల్లారి సేవకులు వచ్చి తలుపులు పగల కొట్టి చూసేసరికి జోలా

చనిపోయి ఉన్నాడు.అ  ప్పటికి ఆయన వయస్సు 62.  మరణించిన తేది 19-9-1902.

**అంతిమ యాత్ర**

ఎమిలీ జోలా అంత్య క్రియలకు రికార్డ్ స్థాయిలో ముప్ఫై వేలమంది జనం హాజరయ్యారు. "మినిస్టరూ, ప్రెసిడెంట్ ఆఫ్ ది సోఅసైటీ ఆఫ్ మెన్ ఆఫ్ లెటర్స్" జోలాపై గొప్ప ఉపన్యాసం ఇచ్చాడు. మిగిలిన పెద్దలూ ఉపన్యసించారు. జోలా సహచం  ప్రముఖ రచయిత అనటోల్ ఫ్రాంక్ చివరగా నివాళులర్పిస్తూ "Zola was a fighter for justice as well as an author .He has honored his country and the world with an immense work a magnificent action. Envy him his destiny and his heart, which made his lot that of the greatest. He was a moment's embodiment of humanity "s conscience" అని ప్రశంసించాడు.

**జోలాను కుట్రతో చంపారు**

ఎమిలీ జోలా మరణంపై అనేక అనుమానాలున్నాయి. ఆయన ప్రత్యర్థుల కుట్రవల్లనే కార్బన్ మోనాక్సైడ్ లీక్ అయిందని అంతకు ముందు రెండు మూడుసార్లు వారు హత్యాప్రయత్నం చేశారని అన్నారు. కాని ఇది రుజువుకాలేదు ఒట్టి అపోహ మాత్రమే నని తేలింది. కొన్ని దశాబ్దాల తర్వాత పారిసాన్ రూఫర్ మరణ శయ్యపై ఉండి తానే రాజకీయ కారణాలవలన జోలా ఉన్న ఇంటి చిమ్నీ మూసేశానని చెప్పాడు. జోలాను మొదట పారిస్‌లోని క్లేమేటోరి డీ మాంట్ మెట్రి శ్మశాన వాటికలో ఖననం చేశారు. నాలుగేళ్ల తర్వాత అలేక్సాండర్ ద్యూమాస్ విక్టర్ హ్యూగోలను ఖననం చేసిన పాంధియన్ లో అవశేషాలను భద్రపరచారు. 1953లో ఒక విచారణ సంఘం పూర్తి విచారణ చేసి ఎమిలీ జోలా ది హత్య మాత్రమేనని, ప్రమాదవశాత్తు జరిగిన మరణం కాదని  తేల్చింది. చిమ్నీ స్వీపర్ హెన్రి బూరోన్ ఫెన్స్ తానే రాజకీయ వాదుల కోరికపై చిమ్నీని మూసేశానని ఒప్పుకొన్నాడు. కనుక ఇది కోల్డ్ బ్లడెడ్ మర్డర్ అని తేలింది.

**రెండు కుటుంబాల కథ**

జోలా రాసిన 20 భాగాల రోగాన్ మాక్వార్ట్ నవల సెకండ్ ఫ్రెంచ్ ఎంపైర్‌కు చెందిన విషయం అని ముందే చెప్పుకొన్నాం. 1851-71 మధ్య ఉన్న ఇరవై ఏళ్ళలో జరిగిన ఒక కుటుంబ గాధ అది. ఇందులో మూడొందల అధ్యాయాలున్నాయి. ఇది

రోగాన్ మరియు మాక్వార్ట్ అనే రెండు కుటుంబాల కథ. దీనికి జోలా పెట్టిన ఫ్రెంచ్ పేరుకు ఇంగ్లీష్ పేరు “the natural and social history of a family, under the second empire” దీన్ని ఫ్రెంచ్ మూడవ రిపబ్లిక్ కాలంలో రాశాడు. మూడవ నెపోలియన్ కాలంలో ఫ్రెంచ్ సైన్యం దారుణంగా ఓడిపోవటమే ఇందులోని విషయం. నానా నవలలో కూడా దీని గురించి రాశాడు.

**శాస్త్రీయ పరిశోధనా నవలకు ఆద్యుడు జోలా**

“లి రోమన్ ఎక్స్ పెరిమెంటల్” నవలలో నేచరలిస్ట్ నవల ధోరణి ప్రారంభమై, సైంటిఫిక్ పరిశోధనా నవలగా పేరు తెచ్చుకొన్నది. క్లినికల్ ఫిజియాలజికి దారి తీసింది. జోలా దృష్టిలో “no character should appear larger than life “Although Zola would not accept that it was either scientifically or artistically justifiable to create larger-than-life characters, his work does present a number of larger-than-life symbols which, like the mine Le Voreux in Germinal, take on the nature of a surrogate human life. The mine, the still in' Assommoir and the locomotive La Lison in La Bête humaine impress the reader with the vivid reality of human beings. The great natural processes of seedtime and harvest

జోలా ఒక రచయిత, కవి సైంటిస్ట్ మాత్రమే కాక ఆశావాది. “పాజిటివిజం” అంటే మక్కువ. మానవాభ్యున్నతిపై అచంచల విశ్వాసం ఉన్నవాడు జోలా. ఆయన జీవితంపై సినిమా కూడా తీశారు. “wish to explain how a family, a small group of human beings, conducts itself in a given social system after blossoming forth and giving birth to ten or twenty members, who, though they may appear, at the first glance, profoundly dissimilar one from the other, are, as analysis demonstrates, most closely linked together from the point of view of affinity. Heredity, like gravity, has its laws” అని తన సీరియల్స్‌కు ముందుమాట రాశాడు జోలా. సంఘంలో ఉన్న పరిసరాల పరిస్థితులు, హింస, తాగుడు వ్యభిచారం ఏ విధంగా ప్రజలను “సెకండ్ వేవ్ ఆఫ్ ఇండస్ట్రియల్ రివల్యూషన్” కాలంలో ప్రభావితం చేశాయో వివరించాడు. బ్రెజిల్ ఫ్రాన్స్ దేశాల రచయితలపై జోలా ప్రభావం అధికం. అయిదుగురు నేచరలిస్ట్ రచయితలకు జోలా ఆదర్శనీయుడు.❁



## 19. పందొమ్మిది ఇరవై శతాబ్దాల వారధి - థామస్ హార్డీ (1840-1928)

### నెల తక్కువ పిల్లాడు

19-20 శతాబ్దాలకు వారధి వంటి కవి థామస్ హార్డీ, అతని కవిత్వంలో సగం రొమాంటిక్‌గా మిగిలిన సగం రియలిస్టిక్‌గా ఉండటానికి ఇదే కారణం. ఇదే విక్టోరియా యుగపు ఆఖరి లక్షణం. హార్డీ రాసిన చురుకైన, చిక్కని కవిత్వమే ఆధునిక కవిత్వానికి మార్గదర్శనం చేసింది. 2-6-1840లో ఇంగ్లాండ్‌లోని డార్ చెస్టర్‌లో పుట్టిన హార్డీ గ్రామం గొప్ప లాండ్ స్కేప్‌లకు నిలయం. దీనికే తర్వాత వేస్సెక్స్ అనే పేరొచ్చింది. అతని కవిత్వానికి నేపథ్యం ఈ ప్రదేశమే. అతని కుటుంబ వృక్షపు వ్రేళ్ళు ఇక్కడే బలంగా పాతుకు పోయి ఉన్నాయి. తల్లి తరపు వారిది వ్యవసాయ వృత్తి. తండ్రిది రాతి పని చేసే తాపీ పని. హార్డీకి తలిదండ్రుల నుండి మొరటు తనం అబ్బలేదు. నెలలల కంటే ముందే పుట్టటంతో ఒక నర్సు అతడిని బతికించింది. రోగిష్టి అవటంతో స్కూల్‌కు పంపలేదు. ఇంటిదగ్గరే తల్లి రక్షణలో ఉండి ఆమె చెప్పిందే నేర్చాడు. ఈ "నెల తక్కువ వాడు" ఆరేళ్ళ కంటే బతకడు అని అందరూ "దీవిస్తే" సుబ్బరంగా 88 ఏళ్ళు జీవించి అందరినీ ఆశ్చర్యపరచాడు. భూమ్మీద పడిన నాటి నుండి సంచలనమే సృష్టించాడు హార్డీ.

### భవన నిర్మాణం-పెళ్లి

ఎనిమిదో ఏడు రాగానే అయిష్టంగానే బడికి పంపారు. ఏది నేర్చినా తల్లి దగ్గరే ఎక్కువ నేర్చుకొన్నాడు హార్డీ. 16 ఏళ్ళకు మామూలు విద్య పూర్తి చేశాడు. కొడుకును ఒక ఆర్కిటెక్ట్ దగ్గర తండ్రి పనిలో కుదిర్చాడు. ఆ తర్వాత ఆర్కిటెక్చర్‌లో నిపుణుడైన మరో వ్యక్తి వద్ద చేర్చాడు. 20వ ఏట రాయల్ ఇన్ స్టిట్యూట్ ఆఫ్ బ్రిటిష్ ఆర్కిటెక్ట్స్ నుంచి ఒక అవార్డ్ వచ్చింది. ఇది అతని విద్యను చూసి ఇచ్చిందేకాని ఆర్కిటెక్చర్ పనికి మెచ్చి ఇచ్చింది కాదు. బిల్డింగ్‌లు నిర్మించటం కన్నా బుక్స్ మీద ఆసక్తి ఉండేది. కాని 27వ ఏట ఆర్కిటెక్ట్‌గా ప్రాక్టీస్ మొదలు పెట్టాడు. 30వ ఏట కారన్ వాలిస్ వెళ్లి ఒక చర్చిని పునర్నిర్మించాడు. అక్కడ వికార్ వదిన ఏమ్మా గిల్ ఫోర్డ్‌తో ప్రేమలో పడి

పెళ్ళాడాడు.

**కవిత్వం నుంచి నవలకు జంప్**

అప్పటికే హార్డీ కవిత్వం రాస్తున్నాడు. కాని పత్రికలూ మాత్రం ప్రచురించలేదు. రాళ్ళల్లో సూక్తుల సరస్వతీ కటాక్షం ఉన్నా కడుపుకు తిండి పెట్టె లక్ష్మీ కటాక్షం లేదని గ్రహించి. ఆర్కి టెక్చర్‌కు గుడ్ బై చెప్పేశాడు. రచనలతోనే సంపాదన పొందాలని భావించాడు. కవిత్వం డబ్బేమీ చేపటం లేదని గ్రహించి ఫిక్షనుకు ఫిక్స్ అయ్యాడు. "ది పూర్ మాన్ అండ్ ది లేడి" అనే మొదటి నవల రాశాడు. కాని ఇందులో ప్లాట్ ఏమీ లేదని పబ్లిషర్ ప్రచురించ లేదు. కోపం వచ్చి రాసిన దాన్ని తగల బెట్టి మరో నవల "డేస్పెరేట్ రేమిడీస్" రాశాడు. ఇందులో వస్తువు పాత్రల్ని డామినేట్ చేసింది. స్వంత చిలుం వదిలించుకొని అచ్చేసి వదిలాడు. కాని వ్యతిరేకమైన సమీక్షలు మరీ నీరు గార్చాయి. లెక్కచేయకుండా "అండర్ ది గ్రీన్ వుడ్ ట్రీ", "ఏ పైర్ ఆఫ్ బ్లూ ఐస్" అనే రెండు నవలలు రాసి వదిలాడు. దీనితో తాను ఒక రచయితను అనే నమ్మకం కలిగింది. ఆ తర్వాత ఒక మేగజైన్ నవల రాయమని హార్డీని కోరింది. ఇప్పటికి తానేమిటో లోకం అర్థం చేసుకొన్నదనుకొన్నాడు. దీని ఫలితమే "ఫార్ ఫ్రం ది మాడేనింగ్ క్రౌడ్" నవల. ఈ నవల ఆర్ధికంగా విజయాన్నిచ్చి సాహిత్యంలోనూ పేరును నిలబెట్టింది. జార్జి ఇలియట్‌కు ఘోస్ట్ రచయిత హార్డీ అని ఒకడు బాంబు పేల్చాడు. హార్డీ నవలలో వేస్సెక్స్ గ్రామీణ వాతావరణాన్ని, మనుష్యుల తీరు తెన్నులను చాలా శక్తి వంతంగా ప్రదర్శించాడు. కాని సబ్జెక్ట్ మీద పూర్తి అథారిటీ రాలేదు.

ముప్ఫై ఏళ్ళ వయసులో చూడటానికి పెద్దగా ఆకర్షణీయంగా ఉండేవాడు కాదు. సాధారణ పొడవుతో, నీలి కళ్ళతో, పల్లెటూరి రై(బై)తు లాగా కనిపించేవాడు. భార్యతో కొంతకాలం లండన్‌లో కాపురమున్నాడు. నలభైలలో వరుసగా గుండెపోట్లు రావటం ప్రారంభించి బతుకే ప్రమాదం అనే స్థితికి వచ్చింది. అయినా మరో నవల చాలా తీవ్రంగా రాస్తూనే ఉన్నాడు.

**బాక్ టు పెవిలియన్**

ఈ నవలతో ఆపేసి తాను మొదటి నుంచి మక్కువ పెంచుకొన్న కవిత్వంతోనే కాలం గడపాలని నిర్ణయానికి వచ్చాడు. రెండేళ్ళ తర్వాత లండన్ వదిలి తన స్వగ్రామం డార్చేస్టర్ చేరి మళ్ళీ ఆర్కిటెక్ట్ అవతారం ఎత్తి స్వంత ఇల్లు "మాక్స్ గేట్" నిర్మించుకొన్నాడు. దీన్ని చూడటానికి ఎందరో సందర్శకులు వస్తూంటారు. కొంచెం సిగ్గూ, ఒంటరితనం ఇష్టపడే హార్డీ లండన్‌లోని పబ్లిక్ జీవితంకంటే ప్రైవేట్ జీవితంలోనే ఆనందం ఉందని భావించి డార్చేస్టార్‌కు వచ్చానని చెప్పుకున్నాడు.

**బెడిసి కొట్టిన నవలలు**

1874-1890 మధ్య పదహారేళ్ళ కాలంలో ఎనిమిది నవలలు 30 చిన్నకథలు రాశాడు. అన్నీ డబ్బును వర్షించాయి. యాభైవ ఏట "టేస్స్ ఆఫ్ ది డి అర్బేర్ విల్లీస్" నవల రాసి ప్రచురించాడు. దీనిపై విమర్శకులు విరుచుకు పడ్డారు. మేగజైన్‌లో ప్రచురణార్హం కాదన్నారు. దీనికి సమాధానంగా "జూడే ది అబ్ స్క్యూర్" రాశాడు. ప్రకృతి ధర్మాలకు విరుద్ధంగా రాశాడని అనైతికతను ప్రోత్సహించాడని ఈసడించారు. మనిషి అంతర్ సంఘర్షణకు, బాహ్య క్రూరత్వానికి బలై చనిపోవటం ఇందులో కథ. దీన్నే అమెరికాలో "జూడే ది అబ్ సీన్"గా ప్రచురించినా విమర్శల జడివాన తప్పలేదు. దాన్ని నిరసించారు అవహేళన చేశారు. "ఫిల్ది నావెల్" అన్నారు. ఒకాయన ఆ నవలను తగలబెట్టి దాని బూడిద పార్సెల్ చేసి హార్డీకి పంపి కోపం తీర్చుకొన్నాడు. దీనితో ఇక నవలల జోలికి వెళ్ళకూడదనే నిర్ణయానికొచ్చాడు. ఈ విషయాన్నే హార్డీ "have to give up verse for prose in order to make a living in later life referred to my novels as' pot boilers "and "wretched stuff "and I returned with joy as well as relief to poetry" అని చెప్పుకొన్నాడు.

**బాక్ టు పెవిలియన్- మహత్తర బృహన్నాటకం**

సుమారు అరవైవ వసంతంలో హార్డీ మొదటి కవితా సంపుటి "వేస్సేక్స్ పోయెమ్స్" ప్రచురించాడు. ఇందులో 30 ఏళ్ళుగా రాసిన లిరిక్కులు బాలడ్లూ కలిసి ఉన్నాయి. జనానికెవరికీ పట్టనే లేదు. నాలుగేళ్ల తర్వాత "పోయెమ్స్ ఆఫ్ ది పాస్ట్ అండ్ ప్రెసెంట్" సంపుటి వెలువరిస్తే కొంత మెరుగైన ప్రోత్సాహం లభించింది. ఇక ఈ ముసలాడి పని అయి అయిపోయింది. ఇక రాసే దమ్ము లేదు అని అందరూ అనుకొంటూ ఉండగా ఆశ్చర్యపరుస్తూ "ది డైనాస్ట్స్"అనే నాటకం మొదటి భాగాన్ని వదిలి, నాలుగేళ్ళ తర్వాత దాన్నిమూడు భాగాలతో పూర్తి చేశాడు. ఇందులో నెపోలియన్ యుద్ధాలకు సంబంధించిన విషయాలు పరమ నాటకీయంగా ఉన్నాయి. 19 అంకాలతో, 130 సీన్లతో బృహత్తరంగా ఉన్న నాటకం ఇది. విమర్శకుల నోళ్ళు మూసుకు పోయాయి. అప్పటిదాకా హార్డీ మీద ఉన్న అభిప్రాయాన్ని మార్చుకొన్నారు. లండన్ టైమ్స్ "the dynasts combines, as only a work of genius could combine, a poetic philosophy with minute historical knowledge and a shrewd eye for the tragical and comical ways of men and women" అని అభివర్ణించింది. లాసేల్లెస్ ఆబెర్ క్రోమ్బీ అనే ప్రముఖ విమర్శకుడు "the biggest and most consistent exhibition of fatalism in literature" అని కీర్తించాడు. "ఫాటలిజం" అంటే జీవితంలో జరిగే సంఘటనలు ముందే దైవ నిర్ణయాలై ఉంటాయి. వాటిని మనం మార్చలేము అని అర్థం. ఫేట్‌కు సంబంధించింది ఫాటలిజం మన భాషలో "విధి లిఖితం".

**దూషణలకు బదులు భూషణలు-పురస్కారాలు**

ఇప్పటిదాకా అంటీ ముట్టనట్టు ఉన్న సమాజం ఒక్కసారి హార్డీని గుర్తించింది. కీర్తి కిరీటం పెట్టింది. విమర్శల జడివాన పోయి పొగడ్తల పూలవాన కురిపించారు. అభినందనల వెల్లువ సాగింది. సన్మాన పరంపర, సత్కార హోరూ పెరిగాయి. లండన్ రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ వారి స్వర్ణ పతకం, ఆర్డర్ ఆఫ్ మెరిట్ అందుకొన్నాడు హార్డీ. ఆక్స్ ఫర్డ్, కేంబ్రిడ్జ్, బ్రిస్టల్ యూని వర్సిటీలు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసి గౌరవించి సత్కరించాయి. రాయల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ బ్రిటిష్ ఆర్కి టెక్ట్స్ వారు హార్డీకి ఫెలో షిప్ అందజేశారు. తన డార్ చెస్టర్ స్వగ్రామం ఇంతటి ఘన విజయాలను సాధించి ఇచ్చింది అనుకొన్నాడు. 72 ఏళ్ళ వయసులో భార్య చనిపోయింది. ఎంతో కాలంగా తన దగ్గర సెక్రటరిగా పని చేసిన అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు హార్డీ. ప్రఖ్యాత రచయిత సోమర్ సెట్ మాం రాసిన "కేక్స్ అండ్ ఏల్" నవల హార్డీ కుటుంబ జీవితమే అని విశ్లేషకుల భావన.

**మరణం దాకా కవే**

మళ్ళీ కవిత్వ ప్రవేశం చేసిన హార్డీ కొత్త శక్తీ ఉత్సాహ ప్రోత్సాహాలతో జీవిత చరమకం వరకూ రాస్తూనే ఉన్నాడు. ఎనభై ఏళ్ళు వచ్చాక ఆయన అతి విలువైనకవితా సంపుటులు విడుదలయ్యాయి. కవిత్వ రచన కొనసాగిస్తూనే ఉన్నాడు. చాలా అర్ధవంతమైన వివాద రహితమైన అద్భుతమైన కవితలు రాశాడు దాదాపు తొంభై ఏళ్ళు వచ్చేదాకా. 88వ సంవత్సరంలో గొంతు బాగా బొంగురు పోయింది. శీతలం కమ్మింది. 11-1-1928న 88 వ ఏట థామస్ హార్డీ చనిపోయాడు. ఆయన చితా భస్మాన్ని వెస్ట్ మినిస్టర్ ఆబేలో భద్ర పరచారు. కాని ఆయన రాసుకొన్న విల్లు ప్రకారం ఆయన గుండెను మాత్రం స్వగ్రామం డార్ చెస్టర్‌లో ఖననం చేశారు.

**హార్డీ మనసులోని భావనలు**

తను చూస్తున్న సత్యాన్ని, తన చుట్టూ ఉన్న హీన పరిస్థితులను అర్ధం చేసుకొన్నాడు హార్డీ. విక్టోరియన్ కాలానికి చెందిన విలువలు, మాధుర్య ప్రకాశ వంతమైన జీవితం ఉన్నది అన్నదాని ఒప్పుకోలేదు. ఆ కాలపు కవిత్వాన్నీ పెద్దగా మెచ్చ లేదు. మరణశయ్యపై ఉండి కూడా భార్యను తనకు అత్యంత ఇష్టమైన రుబాయత్‌ను చదవమని కోరాడు. డార్విన్ సిద్ధాంతాన్ని అంగీకరించిన హార్డీ మానవుడు ఈ విశ్వానికి ఆధారం అన్నమాటను తిరస్కరించి సైన్స్‌ను కవిత్వంలో పొదిగాడు. పంచభూతాలు మనిషికి శత్రువులూ కారు, మిత్రులూ కారు అన్నాడు. వ్యత్యాసం అనేది సృష్టిలో ఉన్న లక్షణం అన్నాడు. వర్డ్స్ వర్త్ మహా కవి చెప్పిన "ప్రకృతి ప్రేమకు", బ్రౌనింగ్ "ఆశావాదానికి", స్విన్ బరన్ "విశ్వం దైవంతో ముడిపడిలేదు" అన్నదానికి జవాబుగా "ఫాటలిజం"ను చెప్పాడు హార్డీ. కర్షకుని కష్టాలకు మనిషిని జంతువుగా చూసే విధానాన్ని తప్పు పట్టాడు. విశ్వాన్ని ఎవరో పాలిస్తున్నారు అన్నదానికి బదులు దాన్ని అనుకోని సంఘటనలే

పాలిస్తున్నాయన్నాడు. దేవుడికి మానవుల మీద ఉన్న మమకారాన్ని మర్చి పోయాడన్నాడు. దైవం యొక్క అపజయాలలో ఇదొకటి అంటాడు. క్రూరత్వమో కారుణ్యమో ప్రపంచాన్ని పాలించటం లేదు. చాన్స్ అంటే అవకాశాలే పాలిస్తున్నాయి. “grass casualty obstructs the sun and rain” అని భావించాడు హార్డీ. “Hardy accepted the stern realities without joy” కుంచించుకు పోతున్న ప్రపంచాన్ని గురించే హార్డీ రాశాడు. మానవ నాటకం మీద పెద్దగా ఆసక్తి చూపలేదు. సానుభూతిలేని ప్రపంచాన్ని అసహ్యించాడు. గౌరవంగా జీవించాల్సిన మానవుడు బతుకు పోరాటంలో ఒక నేరస్తుడిలా విషాదం పాలౌతున్నాడని అంటాడు. "Hardy realized that the true satisfaction of life lies in imaginative conflict. What ever their ultimate purpose, men are alive only while they struggle.. When they grow aware of the futility of their effort, and yet strive to fashion some thing from it, they become noble” అని సీగ్ ఫ్రీడ్ ససూన్ అన్నాడు. డబ్ల్యు ఆడెన్ “his hawk' s vision, his way of looking at life from a great height” అని విశ్లేషించాడు.

హార్డీ రాసిన “the dark eyed gentleman” కవిత జానపద సాహిత్యాన్ని పోలి ధారాపాతంగా ఉంటుంది. కవిత్వంలో వాడి వేడి సంభాషణాత్మక జాతీయాలు వాడి, ఆధునిక కవిత్వానికి దారి చూపాడు హార్డీ. కవిత్వానికి కొత్త రక్త మాంసాలు ఇచ్చాడు. జార్జి ఇలియట్‌కు చెందిన “విక్టోరియన్ రియలిస్ట్” హార్డీ .నవలలో కవిత్వంలో వర్డ్స్ వర్త్ రోమాంటిజం ప్రభావం ఉంది. హార్డీపై చార్లెస్ డికెన్స్ ప్రభావమూ ఎక్కువే. డికెన్స్‌లాగే విక్టోరియ సమాజపు అవశేషాలను ఏవగించాడు.

డి. హెచ్ లారెన్స్‌ను అత్యంత ప్రభావితం చేసినవాడు హార్డీ. హార్డీ భావనలనే పెంచి లారెన్స్ తన పాత్రలను సృష్టించాడు. అమెరికా నాటకకర్త క్రిస్టఫర్ దురాంగ్ నాటక పాత్రలపై హార్డీ ప్రభావం అధికం. సుమారు 18 నవలలు రాశాడు. 14 కవితా సంపుటులు తెచ్చాడు. మూడుభాగాలది డైనాస్టి అనే బృహన్నాటకం రాశాడు. 30కి పైగా కథలూ రాశాడు.

“The irony and struggles of life and a curious mind led him to question the traditional Christian view of God:
The Christian god -- the external personality -- has been replaced by the intelligence of the First Cause……the replacement of the old concept of God as all-powerful by a new concept of universal consciousness. The “tribal god, man-shaped, fiery-faced and tyrannous" is replaced by the "unconscious will of the Universe", "which progressively grows aware of itself andÑÑ, "%ultimately, it is to be hoped, sympathetic”. [41]❁



## 20. 19వ శతాబ్దపు ఫ్రెంచ్ మహాశిల్పి – అగస్టీ రోడిన్ (1840–1917)

అగస్టీ రోడిన్ శిల్పాలను మొదట తిరస్కరించిన వారే ఆ తర్వాత మహా గొప్ప శిల్పి అని ఆరాధించారు. గౌరవించారు సత్కరించారు. మళ్ళీ అతి తక్కువ చేసి మాట్లాడారు. దూషణ భూషణలు ఆయన జీవిత సముద్రంలో కెరటాలయ్యాయి. పావు శతాబ్దికాలం ఆయన సృజన అంతా పెద్దగా ఆమోదం పొందలేదు. పై పెచ్చు అలక్ష్యం చేశారు కూడా. కొన్నేళ్ళ తర్వాత ప్రతిభను గుర్తించి అగ్రాసనం మీద కూర్చో బెట్టారు. అంతే కాదు 19వ శతాబ్దపు అత్యుత్తమ శిల్పి అని, అన్నికాలాలలోని మహా శిల్పులలో ఒకడు అని వీర తాళ్ళు వేశారు. ఇదీ లోక రీతి .

**మట్టి బొమ్మల శిల్పి**

12–11–1840లో పుట్టిన ఫ్రాన్కోస్ అగస్టీ రెనో రోడిన్ ఫ్రాన్స్ లోని పారిస్‌లో పురాతన గోథిక్ లక్షణాలున్న జన సమూహం ఉన్న ప్రాంతంలో పుట్టాడు. తల్లి లోరైనీ నుండి తండ్రి నార్మన్ జాతికి చెందిన పని వారి కుటుంబంలోంచి వచ్చారు. ఆ జిల్లాలో రోడీన్లు అతి పేదవారుగా గుర్తింపు పొందారు. రోడిన్‌కు అందువల్లనే 13వ ఏట నుండి సరైన స్కూల్ విద్య నేర్చుకొనే అవకాశం లేకపోయింది. చిన్నతనం నుండి డ్రాయింగ్ బొమ్మలు గీయటం అతనికి అంది వచ్చిన వరం అయింది. తల్లి గ్రోసరీ షాప్ నుండి తెచ్చే సరుకుల పొట్లాల పేపర్లపై ఉన్న కామిక్ బొమ్మలను చూసి రోడిన్ కాపీ చేసేవాడు. తర్వాత వాటిని తన స్వయం కృషితో బాగా గీసేవాడు. ఇది గమనించిన తలిదండ్రులు రోడిన్ మాంచి కమర్షియల్ ఆర్టిస్ట్ అవుతాడని సంబరపడ్డారు. ఇంటి దగ్గర స్పెషల్ టీచర్స్‌ను పెట్టి అతని చిత్ర నైపుణ్యాన్ని పెంచే స్తోమత వారికి లేదు. అందుకని అతని ఆసక్తికి ఊతంగా డెకరేటివ్ ఆర్ట్ లో శిక్షణ నిచ్చే" పెటైట్ ఈకోల్"లో చేర్పించారు. పెన్సిల్ డ్రాయింగ్ అంటే అసలు ఇష్టపడని రోడిన్ మట్టి బొమ్మలు చేయటంలో ఆసక్తి చూపించి అదే తన జీవిత గమ్యం అనుకొన్నాడు.

**పోర్సిలీన్ శిల్పి**

18వ ఏట ఈకోల్ బీక్స్ ఆర్ట్సులో చేరటానికి ప్రయత్నించి పరీక్ష రాశాడు కాని ఫలితాలు దారుణంగా ఉన్నాయి. మూడు సార్లు ప్రవేశ పరీక్షరాసి తప్పాడు. ఇది చూసిన తలిదండ్రులు నీరు కారిపోయారు. అరకొర సంపాదనతో బతుకు బండీ ఈడుస్తున్న తండ్రి కొడుకును ఆ సంస్థకు పంపటం మానేశాడు. రోడిన్ తన కాళ్ళ మీద తాను నిలబడాల్సిన పరిస్థితి వచ్చింది. ఏదో ఉద్యోగం చేసి పొట్టపోసుకోవాలి. మట్టి బొమ్మల తయారీలో అప్రంటిస్‌గా, జర్నీమాన్‌గా, ఆర్నమెంట్ వర్కర్‌గా పని చేశాడు. కాపీయిస్ట్‌గా, స్పైరల్ స్క్రోల్స్ తయారీలో అనేక చోట్ల పని చేశాడు. ప్రముఖ జంతు శిల్పి ఆటోయిన్ లూయీ బారీ దగ్గర పని చేసి తాను బారీ శిష్యుడిని అని చెప్పుకొనేవాడు. తర్వాత "మోల్డర్" అవతారం ఎత్తాడు. తర్వాత సెవ్రెస్‌లో ఉండే పోర్సీలీన్ ఫాక్టరీకి డిజైన్లు తయారు చేసే కారియర్ బెల్లీస్ దగ్గర చేరాడు. ఇక్కడే చిన్న చిన్న విగ్రహాలు తయారు చేయటం, జంతు భాగాలు కూర్చటం, బొమ్మలకు అలంకరణ చేయటం నేర్చుకొన్నాడు. తర్వాత మూస పని (మోల్డింగ్) అలవాటు అయింది. ఈయన దగ్గరే అయిదేళ్ళు ఉన్నాడు. రెండు డాలర్ల నెల అద్దె ఇచ్చి ఒక గుర్రపుశాలలో గడిపాడు. అది చీకటి గుయ్యారం. దానికి ఒక చివర పెద్ద బావి ఉంది. తాను ఇక్కడే ఉండి పని చేయాల్సిన వాడు కనుక తానే ఆ నూతిని పూడ్చేశాడు రోడిన్. ముక్కు తెగిన మనిషి బొమ్మవయసు ఇరవై అయిదు వచ్చింది. నాగలి పట్టి దున్నే వాడుగా మొరటుగా కనిపించేవాడు. ముక్కు ఫ్లాట్‌గా ఉండేది. ఒక బస్ట్ విగ్రహాన్ని చేసి "ముక్కు తెగిన మనిషి" అని పేరు పెట్టి 1864లో సెలూన్‌కు తీసుకెళ్ళాడు. దాన్ని వాళ్ళు తిరస్కరించటమే కాదు తిట్టి పంపించారు. యదార్థాన్ని ప్రతి బించి చేసిన శిల్పాన్ని వాళ్ళు మెచ్చుకోలేక పోయారు. అతను "far too naturalistic and that he had mistaken the medium" అన్నారు విమర్శకులు. నిరాశ తోమళ్ళీ గురువు గారి దగ్గర చేరి, కొన్నేళ్ళు పని చేశాడు. తన ప్రజ్ఞను కనబరుస్తూ లలితమైన, అనుకరణాత్మకమైన చిన్న చిన్న బొమ్మలు తయారు చేసి అమ్మి జీవనోపాధి పొందాడు. 1870లో పర్షియన్ వాళ్ళు పారిస్ ఆక్రమణ కోసం చేసిన దాడిలో నేషనల్ గార్డ్‌గా పని చేశాడు. ఫ్రాంకో పర్షియన్ యుద్ధం ముగియగానే బెల్జియం వెళ్ళాడు. అక్కడ బెల్జియన్ శిల్పి వాన్ రాస్ బోర్గ్ దగ్గర శిల్ప నిర్మాణంలో మెళకువలు నేర్చాడు.

**మోడల్ భార్య**

ఒక సారి పారిస్ అవతల ఒక బిల్డింగ్ వర్క్ చేస్తుంటే అందమైన కళ్ళున్న అమ్మాయి కనిపించింది. ఆమెకు 19. పేరు రోజ్ బ్యూరేట్. "రోజ్ అంత బ్యూటీ" అనుకొన్నాడు. ఆమె కుటుంబం వారు చాంపేన్‌లో రైతులు. పారిస్‌లో సీమ్స్ట్రెస్‌గా

పని చేయటానికి వచ్చింది. ఆమెను మోడల్‌గా పెట్టుకొని బొమ్మలు తయారుచేస్తూ ఇద్దరూ ప్రేమలో పడగా ఆమె అతనికో పిల్లాడిని "కని" పెట్టింది. ఈమెను అతని తలిదండ్రులు ఆదరించారు. అందరూ కలిసి బతికారు. ఆమె సైనికులకు చొక్కాలు కుట్టి సంపాదించేది. ఆ డబ్బుతో కొడుకును సాకేది. అప్పుడప్పుడు మొగుడు పెళ్ళాలు పోట్లాడుకోనేవారు. ఆమెలో సహనం ఎక్కువ. రోడిన్ మాత్రం బాధ్యతా రాహిత్యంగా ప్రవర్తించేవాడు. అతని తలిదండ్రులు ఆమె పక్షంగా మాట్లాడేవారు. కాలం గడిచిన కొద్దీ తాను "ప్రకాశించే సూర్యునికి ఛాయ మాత్రమే" అని గ్రహించింది. అతను ఆమెను మంచీ చెడు తెలిసిన ఇల్లాలు అని కోపం అసూయ, అనుమానం ఉన్నా ప్రేమ గుణం ఉందని, సత్యాసత్య వివేకం తెలిసిన దొడ్డ ఇల్లాలని చెప్పాడు. వారిద్దరిది అలౌకిక ఆత్మీయ ప్రేమ అంటారు. మోడల్‌గా వచ్చిన అమ్మాయి" మోడల్ భార్య" అయింది రోడిన్‌కు.

### సహజం నుండి అసహజానికి

1877లో సలూన్ రోడిన్ శిల్పాన్ని ప్రదర్శించటానికి అనుమతి నిచ్చింది. దానిపై 18 నెలలు తీవ్రంగా దృష్టి పెట్టి పని చేశాడు. దీనికి "కంచు యుగం" (ఏజ్ ఆఫ్ బ్రాంజ్) అని మొదట పేరు పెట్టి తర్వాత "ప్రకృతికి మానవుడి జాగృతి" (మాన్ ఎవేకేనింగ్ టు నేచర్) అని మార్చాడు. దీన్ని చూసిన నిర్వాహకులు పెదవి విరిచారు. వారికి కావాల్సిన లలిత సుందర నగ్న శిల్పం కాదు అది. వెంటనే తిరస్కరించి "too precise, too realistic" అని వ్యాఖ్యానించారు. అది సృజనాత్మక శిల్పం కాదని అన్నారు. ఆ రోజుల్లో ఇవి సాధారణమే. నకిలీ శిల్పాలు చేస్తున్నకాలమే అది. ఈ ఆరోపణను చాలెంజ్‌గా తీసుకొన్నాడు రోడిన్. ఒక నాయకుడి శిల్పాన్ని తయారుచేసి మామూలుగా జీవితంలో కనిపించే నగ్నత్వం కన్నా ఇంకా ఎక్కువ నగ్నంగా తీర్చిదిద్ది "నడుస్తున్న మనిషి" అని పేరు పెట్టాడు. కాని శిల్ప విశ్లేషకుడు అక్టేవియాన్ మిరాబూకు ఇది "సెయింట్ జాన్" పోలికలున్న శిల్పం అనిపించింది. ఈ జాన్ గారే తర్వాత "సెయింట్ జాన్ బాప్టిస్ట్"గా ప్రసిద్ధుడయ్యాడు. సుప్త స్థితిలో ఉన్న శిల సజీవ చైతన్య రూపం దాల్చింది రోడిన్ చేతిలో. రోడిన్‌లో ఆత్మ స్థైర్యం ఒక్కసారిగా పెల్లుబికింది.

### మానవ శరీరం సర్వం సుందరమే

వాల్ట్ విట్మన్ మహాకవికి లాగానే రోడిన్‌కు కూడా మానవ శరీర భాగాలలో అందంగా ఉండనిది ఏదీ లేదనే భావం ఉంది. జీవితంలోని అతి సూక్ష్మ విషయాల పరిశీలన కూడా అవసరం అనేవాడు. రోడిన్‌కు సెక్రెటరిగా పని చేసిన రైనర్ మారియా రిల్కే "Rodin grasped life in its smallest details --he observed it and it

followed him --he awaited it at the cross roads where it lingered, he over took it as it ran before him --he found it in all places equally great, equally powerful, and over whelming" అని అతని తత్వాన్ని బాగా అధ్యయనం చేసి చెప్పాడు. రోడిన్ శరీరం అనేక పరీక్షలకు లోనైంది. ఎడారులు అందులో ప్రాకాశించాయి. ఆకలి దాన్ని బాధగా చూపింది. దప్పిక కూడా వదలలేదు. ఇవన్నీ తట్టుకొని నిలబడి గట్టి వాడయ్యాడు. అతను వంగితే పటకారలాగా కనిపిస్తాడు. నడుస్తుంటే ప్రపంచ దూరాలన్నీ అతని తోనే ఉన్నాయనిపిస్తుంది. అతని అడుగు బలంగా దృఢంగా పడేది. అటూ ఇటూ ఊగుతుంటే అతని బాహువులు అతని అడుగులను గురించి మాట్లాడుతున్నట్లుండేది. గాలిలో తేలిపోయినట్లు నడిచేవాడు.

**మార్బుల్ మాస్టర్**

కళలో ఎదుగుతున్న కొద్దీ రోడిన్ సున్నితత్వాన్ని శిల్పాలలో తెచ్చాడు. ఇంప్రెషనిస్ట్ చిత్రకారుడుగా అనిపించేవాడు. అతని తీరును నిశితంగా పరిశీలించిన అమెరికా విమర్శకుడు జేమ్స్ హన్కర్ "the edges of certain parts were amplified, deformed, and falsified to ensure the undulating appearance of life" అని చెప్పాడు. అతని ఆలోచన అస్పష్టం అనిపిస్తుంది. శిల్పంలో ఒక ధ్యానయోగం ఉంటుంది. అదే అతని గొప్ప చిత్ర నిర్మాణ విధానం. అతనికి పాలరాయి అంటే మార్బుల్ అంటే మహా ఇష్టం. ఆ ఇష్టమే అతడిని శిల్ప నిర్మాణంలో పరాకాష్టకు చేర్చింది. అతను రూపొందించిన శిల్పాల శిరస్సులు, శరీర భాగాలు పుష్ప సౌందర్యాన్ని సున్నితత్వాన్ని గుర్తుకు తెచ్చి మార్బుల్ అతని చేతిలో మట్టి, మైనం అయి అనేక రూపాలు దాల్చిందే మోననిపిస్తుంది. అంత లావణ్యంగా రోడిన్ శిల్పాలుంటాయి.

**శిలా మహా కావ్యం**

నలభై ఏళ్ళ వయసులో రోడిన్ పొట్టిగా ఉన్నా ఆకర్షణీయంగా ఉండేవాడు. అతని గడ్డం మాత్రం భలే తమాషాగా ఉండేది. అది నెరసిన తర్వాత ఓల్డ్ టెస్ట్ మెంట్ ప్రాఫెట్ లాగా కనిపించేవాడు. ఇంకా బాగా చెప్పాలంటే 'టగాలిక్ హాన్స్ సాచ్" లా ఉండేవాడు. అద్భుత కళాఖండాలు సృష్టించాలని భావించాడు రోడిన్. అందుకోసం మొదట "గేట్ ఆఫ్ హెల్" అనే భారీ ప్రాజెక్ట్ తీసుకొని ఇరవై ఏళ్ళు దానిపైనే పని చేశాడు. ఆ శిల్పంలోని సౌందర్యాన్ని ఆస్వాదించనవారు దాన్ని "ఎపిక్ ఇన్ స్టోన్" అన్నారు. అంటే "శిలా మహాకావ్యం" అని వేనోళ్ళ కీర్తించారు. డాంటే కలగన్న అన్ని భావాలకు ఈ శిల్పం ప్రతీకగా ఉందని మెచ్చుకొన్నారు. విషయ స్పృహలో నుంచి

అలౌకిక స్పృహకు దారి తీసింది ఆ శిల్ప చాతుర్యం. దీని తర్వాత అనేక అద్భుత శిల్ప రచన చేశాడు రోడిన్. అందులో "ఆడం అండ్ ఈవ్", "పోలో అండ్ ఫ్రాన్సిస్కా", "ఉగాలినో" వరుస శిల్పాలను మిగిలినవాటిలో ముద్దు వంటివి (కిస్ అమాంగ్ అదర్స్) అంటారు. దీనినే రోడిన్ "నోవాస్ ఆర్క్" అన్నాడు. కొందరు మాత్రం లాస్ట్ జడ్జిమెంట్‌కు భయంకర రూపం అన్నారు. మరికొందరు మైకెలాంజిలో మెడిసి కోసం డిజైన్ చేసి రూపొందించిన అసంపూర్తి సమాధులు అన్నారు.

### త్యాగధనుల శిల్ప సృష్టి

యాభైలలో రోడిన్ కాలం బహు ఫలవంత మైన కాలం. పోర్ట్రైట్, కంచు విగ్రహాలు, స్మృతి చిహ్నాలు తయారు చేయటానికి చాలా ఆర్డర్లు వచ్చాయి. నగరాలు, అక్కడి హీరోల, చారిత్రిక పురుషుల విగ్రహాలు తయారు చేసి వారికీర్తిని ఇనుమడింప చేయమని కోరాయి. అలాంటి వాటిలో నాన్సీ టౌన్ క్లాడ్ లోర్రైన్ స్మృతి చిహ్నం ఒకటి. డాం విల్లర్స్ కోసం బాస్టిన్ లేపెజ్ విగ్రహం, కలైస్ కోసం "దిబర్గర్స్ ఆఫ్ కలైస్" శిల్పించి అమోఘం అనిపించుకొన్నాడు. వీళ్ళందరూ కూడా చారిత్రాత్మక మహా పురుషులే. వీరు పద్నాలుగో శతాబ్దంలో నగరం ఆకలి బారిన పడకుండా మూడవ ఎడ్వర్డ్ రాజుకు తమల్ని తాము బలిగా ఆత్మ త్యాగం చేసుకొన్న వీరులు, ధీరులు, ధీరోదాత్తులు, త్యాగధనులు, మహా పురుషులు. ఈ ఆరుగురిని ఒక బృందంగా ముందు శిల్పించి ఆ తర్వాత విడివిడిగా ప్రతి ఒక్కరినీ తీర్చిదిద్దాడు. వారి త్యాగాలను అజరామరం చేశాడు రోడిన్. అందర్నీ ఒకే వరుసలో కాకుండా రెండు నాటకీయ వరుసలలో ఉంచి అందులో ప్రతి ఒక్కరూ ఒక గొప్ప ప్రదర్శనలో పాల్గొని తమ ప్రత్యేకతను ప్రదర్శిస్తూ సామూహికంగా కదులుతున్నట్లు చేశాడు ఈ ప్రతిభకే అందరూ జేజేలు పలికారు. చిరస్మరణీయం చేశాడు వారి జీవితాలను రోడిన్. శిల్ప విషయమై చెబుతూ రోడిన్ "sculpture is the heart of hole and the lump"అన్నాడు. ఈ హోల్ మరియు లంప్ అనే పదాలను మొదటిసారిగా సృష్టించి, ప్రయోగాలు చేసి శాశ్వత కీర్తి పొందారు. శిల్పించి వాటి ప్రభావం ఎలాంటిదో చూపించాడు రోడిన్. రోడిన్ సిజాన్నేలు అలౌకిక కాంతి నిర్మాణంలో అజరామరమయ్యారు. ఈ ఇద్దరు శిల్ప మేధావులకు మనం ఎంతో ఋణపడి ఉన్నాం అన్నారు విశ్లేషకులు. రాబిన్ "క్యూబిక్ ట్రూత్"కు ప్రాధాన్యత నిచ్చాడు. ఇదే స్థల దేశాలకు గణిత పరమైన గౌరవం అత్యంత ఉత్కృష్టమైన సమతుల్యత తెచ్చాయి. రోడిన్ గొప్పతనాన్ని "he carved the air as well as the surface of the stone to bring out' the latent heroic in every natural movement" అని గొప్పగా అభివర్ణించారు.

**అసాధారణ శిల్ప నైపుణ్యం**

మిగిలిన కళాకారులు రోడిన్ శక్తి సామర్థ్యాలతోపాటు అతని విధానాలను ఇప్పుడు బాగా అర్థం చేసుకొన్నారు. విమర్శకులు రోడిన్‌ను పొగడ్తలతో ముంచేస్తున్నారు. కాని అందులోనూ కొంత జాగ్రత్తా పాటించారు. అతని సాహిత్య ప్రజ్ఞ తక్కువ అన్నారు. అతని సూటి నిజాయితీ తనాన్ని మెచ్చ కుండా ఉండలేక పోయారు. "కళాకథ" అనే పుస్తకంలో ఎస్ రీనాక్ "రోడిన్ చేసిన వ్యక్తిగత సామూహిక శిల్పాలు" దోనటేల్లో "శిల్పాల స్ఫూర్తి నిస్తున్నాయి. మార్బుల్‌లో రోడిన్ తన మనోభావాలన్నీ గొప్పగా ప్రదర్శించాడు. భారీతనం ఆకారాలలోనే కాదు అందంలో భావ వ్యక్తీకరణలో అసాధారణంగా ఉంది" అని రాశాడు.

**న్యూడ్ హ్యూగో**

ఈ అసాధారణం అనే పదం రోడిన్‌కు యాభై ఆరేళ్ళు వచ్చిన తర్వాత విక్టర్ హ్యూగో శిల్ప ప్రదర్శననాడు మళ్ళీ బయటికొచ్చింది. పాంథియన్‌లు ఆర్డర్ చేస్తే దీన్ని శిల్పీకరించాడు రోడిన్. ఇందులో నేటివ్ సెన్స్‌ను చూపించాడు. కవి నవలా రచయిత అయిన హ్యూగోను భారీ శిల్పంగా నగ్నంగా వదులైన బట్టతో చూపించాడు. కాని వాళ్ళు కోరింది ఫ్రాక్ వేసుకొని దర్జాగా కనిపించే హ్యూగో. ఇది చూసి వాళ్ళు అ రోడిన్ అభిరుచిని తిట్టిపోశారు. శిల్ప సౌందర్యం తెలియని ఎద్దు మొద్దు అన్నారు. జుగుప్స కలిగించే భంగిమలకు ఆకర్షితుడు అని దుయ్యబట్టారు.

**సాంస్కృతిక ఇంప్రెష నిజం - తిరస్కరింప బడిన బాల్జాక్ శిల్పం**

మరో రెండేళ్ళ తర్వాత నాటకకర్త బాల్జాక్ భారీ శిల్పాన్ని 1898లో న్యు సెలూన్‌లో ప్రదర్శించాడు. దీన్ని "సొసైటీ ఆఫ్ మెన్ ఆఫ్ లెటర్స్" సంస్థ ఆర్డర్ చేసింది. రోడిన్ గీసిన బాల్జాక్ శిరసు స్కెచ్‌ను చూడగానే వాళ్ళు అగ్గిమీద గుగ్గిలమై తిరస్కరించారు. ఆ విగ్రహం మెట్రోపాలిటన్ మ్యూజియంలో ఇప్పుడు ఉంది. కాని రోడిన్ ఇందులో "సాంస్కృతిక ఇంప్రెష నిజం"ను ప్రవేశ పెట్టాడు. అందువల్ల పురాతన గ్రీకు శిల్పంలా కనిపించింది. కొందరికి ప్రాథమిక గోథిక్ శిల్పంలా తోచింది. మరికొందరికి చరిత్రకు పూర్వం ఉండే నిలబడ్డ పొడవైన శిలలాగా (మెనిర్స్) అనిపించింది. నిరాశ చెంది రోడిన్ బాల్జాక్ శిల్పాన్ని ఏమీ మార్చ లేదు తన ధోరణిలోనే చెక్కాడు. పొట్టిగా లావుగా ఉండేఅసలైన బాల్జాక్‌ను శిల్పీకరించలేదు. కాని సింహ శిరసు చైతన్యంతో చెక్కాడు దీన్ని అర్థం చేసుకొన్న విశ్లేషకుడు "లామేన్ ట్రైన్", "thi figure of an element" అన్నాడు. పేపరు వాళ్ళు కాకిగోల చేశారు. మునిసిపాలిటీవాళ్ళు క్షమించరాని అవమానం అన్నారు. దీనిపై ఎన్నో కథనాలు అల్లి దూషించారు. ఒకప్పుడు చాలా రియలిస్టిక్‌గా

చేస్తున్నాడు రోడిన్ అన్న వాళ్ళే ఇప్పుడు అతనికి నేచురల్‌గా ఉండటం అంటే ఏమీ తెలియదు అని అన్నారు. ఈరకమైన వ్యతిరేక ప్రదర్శన రోడిన్‌ను మనస్తాపానికి గురి చేయటమేకాదు ఆరోగ్యం పైనా ప్రభావం చూపింది.

**చైతన్య పరాకాష్ట**

రోడిన్ చేతిలో ఇంకా ఎన్నో అద్భుతాలు ఆవిష్కరింప బడాలి. ఎన్నో చిరకాలం గుర్తుంచుకోదగిన చిత్రాలు, శిరస్సులు ఆయన చేయాలి అందులో ముఖ్యంగా జార్జి బెర్నార్డ్ షా, గుస్టేవ్ మాలర్, చార్లెస్ బాదర్లె, జోసెఫ్ పులిట్జర్ మొదలైనవి. ఇవన్నీ సజీవ చైతన్యం తోణికి సలాడేట్లు నిర్మించాడు. చివరగా "పోప్ బెనడిక్ట్ -15", "పరమాద్భుత శిల్పం, ఇవికాక 1909-11 మధ్య కాలంలో ఎన్నో చిన్న చిన్న కంచు విగ్రహాలు, నాట్యం చేసేవారిని తయారు చేసి ప్రాణ ప్రతిష్ట చేశాడు. ఇంత గొప్పగా, ధైర్యంగా, చురుగ్గా అంతకు ముందెప్పుడూ దూసుకు వెళ్ళలేదు. న్యు యార్క్ ట్రిబ్యూన్ పత్రికలో ఎమిలి జేనార్ రివ్యు రాస్తూ "they reach far out into space ,so they delineate not so much a specific dance in motion or a pair of acrobats as they do a flowering --out of dynamic energy expressed through the metal forms and the space they measure" అని కీర్తించారు.

**గౌరవ ఆదరాలు**

అరవైలలో రోడిన్‌ను పారిస్‌లోని గ్రేట్ ఎక్సిబిషన్‌లో సత్కరించటం ప్రారంభించారు. అప్పటికి ఇంకా ఆయన శిల్పిస్తున్న "నరక ద్వారం" పూర్తి కానేలేదు. తిరస్కరింపబడ్డ బాల్జాక్ శిల్పంతో బాటు వందలాది శిల్పాలు చిత్రాలను ఒక ప్రత్యేక భవనంలో పెట్టి దానికి "రోడిన్ పెవిలియన్" అని పేరు పెట్టారు. తాను చేస్తున్న మాధ్యమానికి రోడిన్ కొన్ని సూత్రాలు రాశాడు. అసలైన శిల్పి బాహ్య సౌందర్య ప్రదర్శనలో తృప్తి చెందడు. అందులో దూసుకు వచ్చే పదార్ధాన్ని ఆస్వాదించేట్లు చేయాలి అన్నాడు. "నేనేదీ కొత్తగా సృష్టించలేదు. సృష్టిలో ఉన్నదానినే మళ్ళీ కనుగొన్నాను. ప్రతిదీ ప్రకృతిలోనే ఉంది. కళాకారుడు ప్రకృతిని అనుసరిస్తే అన్నీ అందుకోగలడు. మనవ శరీరం దేవాలయ యాత్రలాంటిది. దేవాలయంలో ఉన్నట్లే ఒక మధ్య బిందువు ఉంటుంది. దాని చుట్టూ అంతా అల్లుకు పోయి విస్తరిస్తుంది. ఆధునికులు చాయను అనుసరించారు. పూర్వీకులు కాంతిని దర్శించారు. మనకు మైకేలాన్జేలోలోని ఆధ్యాత్మిక ప్రాధాన్యం తెలిస్తే గ్రీకులలాగా ప్రవర్తిస్తే అతని శిల్పాలలో అవిశ్రాంత చైతన్యాన్ని దర్శించగలం. ఫలితం ఆశించకుండా చేసే కృషిని మనసును అర్ధం చేసుకోగలం" అన్నాడు రోడిన్. చివరగా "the martyrdom of the creature tormented by un reliable

aspirations" అన్నాడు.

**హద్దులు మీరిన అభిమానం**

తాను భావించిన విషయాలన్నిటినీ జీవితకాలంలో ముసలితనంలోనే సాధించాడు రోడిన్. తన శిల్పాలు తనకాలపు ఆధ్యాత్మిక భావనలకు ప్రకటనలే అంటాడు. మొదటి ప్రపంచ యుద్ధప్రారంభం రోడిన్‌ను నిరాశ పరచింది. అది అతని జీవశక్తికి విఘాతం కలిగించి చావుకు కారణం అయింది. ఫ్రాన్స్ దేశంలో ఇంధనం కొరత బాగా ఏర్పడింది. రోజ్ రోడిన్ దంపతులు చలికి వణికిపోయేవారు. 1916 జులై 10న రోడిన్‌కు తల తిరిగినట్లు అనిపించింది. మేడ మెట్ల నుంచి జారి పడ్డాడు. మంచం మీదనే ఉండిపోయాడు. ఎందరెందరో మహిళలు ఆయన అభిమానులు వచ్చి విపరీతంగా అయన చుట్టూ మూగారు. ఆయన ఆరోగ్యం గురించి పట్టించుకోకుండా కబుర్లతో కాలక్షేపం చేశారు. భార్య రోజ్ వీళ్ళను చూసి కొంత అసూయ కొంత జుగుప్స కోపంతో భర్తకు దూరంగా ఉంది. వాళ్ళ కోలాహలం భరించలేక పోయింది వాళ్ళ అభిమాన శిల్పి మరణశయ్యమీద ఉన్నాడని వాళ్లకు స్పృహ లేకుండా పోయినందుకు విచారించింది కాని ఆ విషయం "మాస్టర్"కు చెప్పే సాహసం చేయలేక పోయింది. నిస్సహాయంగా నిశ్చేష్టంగా ఉండిపోయింది. రోడిన్ చుట్టూ చేరిన ఆడవాళ్ళు తమలో తాము కలహించుకొని జుట్టూ జుట్టూ పట్టుకొని పోట్లాడుకొన్నారు. తిట్టుకొన్నారు కొట్టుకొన్నారు. చాలా అసభ్యంగా ప్రవర్తించారు. చివరికి జూడిత్ క్లాడ్ వచ్చి పరిస్థితిని చక్క బరచాల్సి వచ్చింది.

**యాభై ఏళ్ళ కాపురం తర్వాత రోజ్‌ను పెళ్ళాడిన రోడిన్**

సెప్టెంబర్‌లో రోడిన్ కు ప్రభుత్వ పెన్షన్ ఇచ్చారు, ఈ పెన్షన్‌తో రోజ్‌తో జీవితం గడవటం కష్టం అనిపించింది రోడిన్‌కు. ఆమెను వివాహమాడి భార్య అని తెలియజేస్తేనే ఆమెకు న్యాయం చేసిన వాడిని అవుతాననుకొన్నాడు. అప్పుడే చట్టప్రకారం తనకున్నదంతా ఆమెకు దక్కుతుందని భావించాడు. 1917 జనవరిలో రోజ్‌ను రోడిన్ పెళ్ళాడాడు యాభై ఏళ్ళు ఆమెతో కలిసి జీవించి తన 68వ ఏట రోజను పెళ్లి చేసుకొని ఆమెకు చట్ట భద్రత కల్పించాడు. ఈ వివాహ వేడుక ముగియగానే రోజ్‌కు విపరీతమైన దగ్గు వచ్చి, గదులను వెచ్చ చేసుకోవటానికి బొగ్గు కూడా లేకుండా గడిపి కొన్ని వారాల తర్వాత రోజ్ మరణించింది.

**మహా శిల్పి మహాభి నిష్క్రమణం**

భార్య రోజ్ మరణం తర్వాత రోడిన్ ఎనిమిది నెలలు మాత్రమే జీవించాడు. వాతావరణం

తట్టుకోలేనిదిగా ఉండేది. విపరీతంగా దగ్గు తెరలు తెరలుగా వచ్చేది. చలి మరీ విజ్రుంభించింది. గడ్డకట్టే చలి బాధించింది. వేడి చేసుకొనే బొగ్గు లేదు. ఈ నరక యాతన భరిస్తూ చివరికి 17-11-1917న 77 ఏళ్ళ వయసులో అమరశిల్పి రోడిన్ మరణించాడు. మాదన్‌లో రోజ్ సమాధి దగ్గరే రోడిన్ సమాధిని కూడా ఏర్పాటు చేశారు. వారి సమాదులమీద కంచు శిల్పం "ది థింకర్"ను ఉంచారు.

**రోడిన్ "సర్ఫేస్ మోడలింగ్ కళ"**

1870లో ఇటలీ యాత్ర తర్వాత అనుకోకుండా రియలిజంకు మారాడు. 1900 నాటికి రోడిన్ ఫ్రాన్స్ దేశపు మహాశిల్పి అని పించుకొన్నాడు. తర్వాత ప్రపంచ మహా శిల్పులలో ఒకడై ప్రపంచవ్యాప్త కీర్తిని పొందాడు. ధన సంపన్నులెందరో ఆయనకు మహా శిల్పాలు తయారు చేసే బాధ్యతలు అప్పగించారు. దాన్ని సార్ధకం చేసుకొన్నాడు.

నేచరిస్ట్ అయిన రోడిన్ భావ వ్యక్తీకరణకు ప్రాధాన్యత నివ్వకుండా, వ్యక్తిత్వానికి ఎమోషన్‌లకు మాత్రమే విలువ నిచ్చాడు. తరతరాల సంప్రదాయాన్ని, గ్రీకుల ఆదర్శ వాదాన్ని వదిలేసి, బోరోక్ నియో బోరోక్‌ల డేకరేటివ్ కళను కూడా దూరం చేసుకొని తనదైన రీతిలో వృద్ధి చేశాడు. ప్రతి శిల్పం రక్తమాంసాలతో వ్యవహరిస్తున్నట్లుగా తీర్చిదిద్దాడు. భావోద్రేకాలను అతి స్పష్టంగా వ్యక్త పరచాడు. మనిషి మానసిక స్వభావాలు అతని భౌతిక స్వరూపాలకు ప్రతిబింబాలు అని భావించాడు. రోడిన్ ది "సర్ఫేస్ మోడలింగ్ కళ" అంటారు. అతను సృష్టించిన "థింకర్" శిల్పాన్ని గురించి రోడిన్ "అందులోని మనిషి మెదడుతోనే కాక నుదురు, ముక్కు పుటాలు, బిగబట్టిన పెదిమలు, చేతులు కాళ్ళలోని ప్రతి కండరం, ముడిచిన పిడికిలి బిగపట్టిన మడమలు అన్నీ ఆలోచిస్తాయి" అంటాడు.

**శిల్పంలో సర్వ సత్తాక స్వేచ్ఛ**

రోడిన్ శిల్పాలే కాదు శిల్ప ఖండాలు కూడా సర్వ సత్తాక స్వేచ్ఛను వ్యక్తం చేస్తాయి. శిల్ప ఖండాలైన బాహువులు లేకుండా కాళ్ళు లేకుండా, తలలేకుండా, చేసినవి అనూచానంగా వస్తున్న సంప్రదాయానికి తిరస్కరణలే. ఒకే మాదిరి మూస పోకడ నుండి తమకు తాము వ్యక్తిత్వంతో ప్రకాశించేట్లు చేశాడు. వీటికి ఉదాహరణలే వాకింగ్ మాన్, మెడిటేషన్ విదౌట్ ఆర్మ్స్, ఐరిస్, మెసెంజర్ ఆఫ్ ది గాడ్స్ శిల్పాలు.

బాధ ,సంఘర్షణ ఆధునిక కళకు "హాల్ మార్క్" అన్నాడు రోడిన్. "Nothing, really, is more moving than the maddened beast, dying from unfulfilled desire and asking in vain for grace to quell its passion" అన్నాడు రోడిన్.

**సంగీత కళాభిమానం**

రోడిన్‌కు వీర ఆరాధకుడు కవి బాడరెల్. రోడిన్‌కు సంగీతం ఇష్టం. గ్లాక్ చేసిన ఒపేరా మ్యూజిక్ అంటే అభిమానం. ఫ్రెంచ్ కేతడ్రిల్స్‌పై గ్రంథం రాశాడు రోడిన్. అందరూ మర్చిపోయిన "ఎల్ గ్రీకో", అప్పటికి ఇంకా ప్రాధాన్యం పొందని "వాన్ వొఘ్"ల సంగీతాన్ని స్వంతం చేసుకొన్నాడు రోడిన్.

**రోడిన్ శిల్పకళలో పరిణామం**

తన శిల్పాన్ని తయారు చేయించుకొంటూ జార్జి బెర్నార్డ్ షా రోడిన్ ముందు కూర్చున్నాడు. అప్పుడు రోడిన్‌ను బాగా గమనించిన ఆయన "రోడిన్ అనేక అద్భుతాలను ఆవిష్కరించాడు" అన్నాడు. తన బస్ట్ శిల్పం తయారీలోని వివిధ దశలను గమనించిన షా "కళావిర్భావ పరిణామ దశలన్నీ చూపించాడు రోడిన్" అని శ్లాఘించాడు. "మొదటగా బైజాంటిన్ మాస్టర్ పీస్ లాగా, బెర్నిని ని లాగ, తర్వాత గొప్ప హూడన్‌ల కళా సంవిధానం దర్శింపజేశాడు. అతని చేతులు ఒక శిల్పి శిల్పించే చేతుల్లా ఉండవు. "ఎలాన్ వైటల్" చేత లాగా అంటే అంతరాత్మ చేతలాగా ఉంటుంది అన్నాడు. "ది గాడ్ ఆఫ్ హాండ్" అనేది రోడిన్ చేతి పనే.

**రోడిన్ వర్కింగ్ మోడల్**

ఏ శిల్పం చేసినా మొదట మట్టితోనే చేసేవాడు దీనికి అతి నిపుణులైన సహాయకులను పెట్టుకొనేవాడు. తర్వాత ప్లాస్టర్‌తో చివరికి కంచుతో చేసేవాడు. అదీ అతని పని తీరు. ఈ విధంగా 19వ శతాబ్దపు శిల్పకళ దానికి ప్లాస్టర్‌ను వాడే తీరుకు నాంది పలికాడు రోడిన్.

**రోడిన్ ప్రత్యేకత**

శిల్పకళను సంప్రదాయ విధానానికి భిన్నంగా తీర్చిదిద్దాడు రోడిన్. రిపిటీషన్ నుంచి దాన్ని తప్పించాడు. 20వ శతాబ్దపు శిల్పకళకు దారి చూపాడు. His popularity is ascribed to his emotion-laden representations of ordinary men and women -- to his ability to find the beauty and pathos in the human animal. రోడిన్ జీవితకాలంలో అతన్ని మైకేల్ ఆంజేలోతో పోల్చేవారు. ఆ యుగపు గొప్ప శిల్పి అని భావించారు. రోడిన్ చనిపోయిన మూడు దశాబ్దాల కాలంలో ఆయన్ను అందరూ మర్చిపోయారు. 1950 నుంచి రోడిన్ ఆరాధన మళ్ళీ ఊపు అందుకొన్నది. ఆధునికకాలపు మహాశిల్పి అని గుర్తించారు. రోడిన్ చేసిన "వాకింగ్ మాన్" శిల్పం 20వ శతాబ్దపు "అముక్త కళ" అంటే ఆబ్ స్ట్రాక్ట్ స్కల్ ప్చర్ ఆర్ట్‌కు మార్గదర్శకమైంది.❁



## 21. ప్రముఖ ఫ్రెంచ్ ఆధునిక ఇంప్రెషనిజం చిత్రకారుడు – అగస్టే రేనార్ (1841–1919)

**చిత్రం వినోదం**

20 ఏళ్ళ వయసులో ఆగస్టే రేనార్ తాను గీసిన కొన్ని చిత్రాలను "గ్లేయిర్" అనే పెయింటర్‌కు చూపించాడు. ఒకసారి చూసి "చేతకాని పనిచేసి పెయింట్‌తో నిన్ను నువ్వే వినోద పరచుకొన్నట్లున్నాయి" అన్నాడు. కుర్రాడు వెంటనే "నాచిత్రం నాకు వినోదం కలిగించక పోయిన రోజు పెయింటింగ్ వేయటం ఆపేస్తాను" అన్నాడు. చిత్రాలలో వినోదానికి అంత ప్రాధాన్యత నిచ్చాడు రేనార్. అన్ని రకాల చిత్రాలు గీశాడు. అవి వినోదాన్నే కాదు ఆశ్చర్యాన్నీ కలిగించాయి. అనేక శైలులలో చిత్రించాడు. వైవిధ్యం అతని ఊపిరి. పాలెట్ నైఫ్ టెక్నిక్ దగ్గర్నుంచి, ఎకడమిక్ డ్రాయింగ్‌ల దాకా అన్నీ చేశాడు. సాధారణం నుంచి సంక్లిష్టం దాకా ప్రయాణించాడు. నగ్న చిత్రాలు, కుటుంబ చిత్రాలు కూడా గీశాడు. సూర్య కాంతిలో మెరిసే ప్రకృతి దృశ్యాలు, స్నాన ఘట్టాలలో విషయాలు, చిన్నారుల నవ్వుల అందాలు అన్నీ అతని చిత్రాలలో జీవం పోసుకోన్నాయి.

**సంగీతం నుంచి చిత్రలేఖనానికి**

మొదటిసారిగా రేనార్ కాన్వాస్ మీద చిత్రం గీయ లేదు. పోర్సేలీన్‌తో చేశాడు. ఫ్రాన్స్ దేశంలో లిమోజేస్ అనేచోట రేనార్ 24-2-1841 జన్మించాడు. అసలు పేరు పియరీ అగస్టే రేనార్. కూలి పని చేసుకొనే అతని తలిదండ్రులు పారిస్‌కు మారారు. కొడుకు సంగీత విద్వాంసుడవుతాడని ఆశించారు. గురువు సంగీతం మేస్టారు. కాని రేనార్ చేతులకు పియానో వాయించటం కంటే పెన్ను తీసుకొని రాయటానికే ఇష్టంగా ఉండేది. 14వ ఏట పారిస్‌లోని చైనా ఫాక్టరీలో అప్రంటిస్‌గా చేరాడు. కుండలు, జాడీలపై చేతితో పెయింటింగ్ వేసేవాడు. కాని ఇది ఎక్కువ కాలం సాగలేదు. వాణిజ్యపరమైన డిజైన్లు రూపొందించాడు. ఫాన్ లకు, ట్రేలకు డిజైన్లు వేసి బాగానే డబ్బు కూడ బెట్టి గ్లేయర్ ఆర్ట్ క్లాసుల్లో చేరాడు. ఇక్కడే సిసిలీ మోనేట్ అనే అతనితో

పరిచయమై స్నేహితుడయ్యాడు. అతను ఇతన్ని కళా ప్రపంచపు ద్వారాలు తెరిచి చూపించాడు. కేథలిక్ అయినా కనిపించిన ప్రతిదానిలో అందాన్ని చూసేవాడు. స్టూడియోలకు సెలూన్‌లకు వెళ్లి విషయాలు అర్ధం చేసుకొనేవాడు. తాను లోవర్ మధ్య ఉన్నట్లు ఫీల్ అయ్యేవాడు. నిజానికి అతను ఉన్నది మౌంటెన్ బ్లీన్ ఫారెస్ట్ దగ్గర. ఆ అరణ్యం అతన్ని బాగా ఆకర్షించింది.

**యువ ఆర్టిస్ట్సు అసోసియేషన్**

24 వయసులో రేనార్ గీసిన రెండు చిత్రాలను సెలూన్ మెచ్చి ఆహ్వానించింది. కాని తన విధానంలో తాను వేసి చిత్రాలను పంపిస్తే తిరస్కరించింది సెలూన్. కానీ అది వైఫల్యం కాదు. పోర్ట్రైట్లకు కమీషన్ వచ్చేది. మురికి కూపంలోంచి మకాం రూ సెయింట్ జార్జ్‌కి మార్చాడు. ఒంటి మీదకు 33 వచ్చాయి. స్వంత కాళ్ళ మీద నిలబడే సత్తా వచ్చింది. ఇరవై మంది ప్రయోగకులతో కలిసి ఒక సొసైటీ ఏర్పాటు చేశాడు. ఇందులో డేగస్, పిస్సరొ, మొనేట్, సిజన్నే కూడా సభ్యులే. వీరందరూ కలిసి మొదటి చిత్ర ప్రదర్శన ఏర్పాటు చేశారు. చూసినవాళ్ళు పిల్లికూతలు అరుపులు కేకలతో నిరుత్సాహ పరచారు. మళ్ళీ రెండో ప్రదర్శన పెడితే మొదటిదాని కంటే భీభత్సం జరిగింది. రేనార్ చిత్రాలను చూసి మొనేట్ అతనికి ప్రతిభ లేదని ఆ విషయం అతనితో చెప్పమని రేనార్ స్నేహితుడికి చెప్పి ఇంక పెయింటింగ్ జోలికి రేనార్‌ను వెళ్ళనీయ వద్దు అని ఒక ఉచిత సలహా పారేశాడు.

**ఇంప్రెషనిస్టులు**

ఈ కొత్త ఆర్టిస్ట్ గ్రూప్‌ను చీదరించుకొన్నారు, అవహేళన చేశారు అందరూ. మొనేట్ ఒక కాన్వాస్‌పై "ఇంప్రెషన్- సన్ రైజ్" చిత్రించాడు. దీన్ని తీవ్రంగా వ్యతిరేకించి ఈ గ్రూపుకు "ఇంప్రెష నిస్టులు" అని ముద్ర వేశారు. ఈ పేరును ఈ గ్రూపు తిరస్కరించలేదు. ఆహ్వానించారు. "treating a subject in terms of the tone and not of the subject itself is what distinguishes the Impressionists from other painters" అని తమ భాష్యం చెప్పుకొన్నారు. వాస్తవానికి ప్రతిబింబం కాదుకాని దాన్ని మరో రకంగా ఆవిష్కరించటమే వారు చేసిన పని. జ్ఞానేంద్రియ జ్ఞానానికి ప్రాధాన్యమిచ్చి, ప్రకాశవంతమైన చిత్రాలు గీయటమే ధ్యేయంగా పని చేశారు. పెయింట్ స్ట్రోక్‌లతో ఫలితాలు రాబట్టారు "they succeeded in in blurring the out lines of objects and merging them with the surroundings .This method permitted the introduction of one color into the area of another without degrading or losing it --thus enriching the color

effects .The technic of vivid strokes seemed best to their efforts at retaining rapidly changing aspects''అని ''the history of impressionism"లో రేవాల్డ్ రాశాడు కాంతికి, ఛాయకు ఉన్న అనంతమైన మార్పుల్ని గుర్తించటం వాటిని కొత్తగా పిగ్ మెంట్ భాషలో చూపటం ఇందులో ప్రత్యేకత. దీనితో స్టూడియోలకే పరిమితమైన చిత్రకళ బాహ్య ప్రపంచంలోకి వచ్చి పొలాలు అడవులు సరసులు, సుడులు తిరుగుతున్న నీటి ప్రవాహాలు చిత్రాలలో దర్శన మిచ్చాయి. మొనేట్ ఏకంగా ఒక పడవ మీదే స్టూడియో నిర్మించుకొన్నాడు. చీకటి వెలుగుల చిందులాట దర్శించి చిత్రించాడు. సిజన్నే లాగా రేనార్ కూడా "దిఆర్ట్ ఆఫ్ ఇమ్మీడిఎట్"ను అభినందించాడు. ఇదే సెన్సిటివ్ ఫస్ట్ ఇంప్రెషన్ అన్నారు. ఒక ఆకు అంతర్నిర్మాణం ఎలా ఉందొ చెప్పటానికి దాన్ని చిత్రవధ చేయక్కరలేదు "స్పాంటేనియస్ విజన్" ఉంటే చాలు అంటాడు.

**ప్రకృతికి పరవశం**

ముప్ఫైలలో రేనార్ పట్టుదలతో మరింత శక్తి యుక్తులతో రంగుల వైభవం చూపించాడు. ఇప్పుడు విమర్శకులు ఆ రంగుల ప్రపంచాన్ని ఆహ్వానించి ఆరాధించారు. మిగిలిన సహచరుల కన్నా కాంతి సమ్మేళనంలో చిత్రాలకు వృత్తాకార నిర్మాణం చేసి ముందుకు దూకాడు. వారు ఇతన్ని చేరుకోలేక పోయారు. నలభైలలో ఆ గ్రూప్‌తో సంబంధాలు వదిలేసుకొన్నాడు. ఇంప్రెషనిజం బాగా పెరిగిపోయి, బాగా అనిశ్చితమై, రంగుల విషయంలో స్పష్టత లేకుండా, చిత్ర నిర్మాణంలో శ్రద్ధ లేకుండా తయారై పోయిందని గ్రహించాడు. కనుక ముందు తనను తాను కరెక్ట్ చేసుకొన్నాడు. తన వర్ణాలు చాలా మృదువుగా డిజైన్లు మరీ ప్రకాశ వంతంగా, పరమ శాంతంగా ఉన్నట్లు అనిపించింది. ఇంతకంటే బలీయంగా రంగులు ఉండాలని శక్తివంతంగా కనిపించాలని నిర్ణయించాడు. అవి "solid and enduring"గా ఉండాలనుకొన్నాడు. దీనికోసం దక్షిణ దేశమంతా తిరిగాడు. అల్జీరియాలో సమ శీతోష్ణ స్థితికి అబ్బురపడ్డాడు. క్రీస్తుకు ముందున్న రోమన్ ఫ్రేస్కోలను పామ్పేలో చూశాడు. మైకేలాన్జేలో, రాఫెల్ వర్ణ సరస్సులో రోమ్ ఫ్లారెన్స్ లలో మునక లేశాడు. ఎక్కడ ప్రకృతి పరవశంగా కనిపిస్తే దాన్ని అంతటినీ మనసులో భద్ర పరచుకొన్నాడు. చూడటమే కాదు వాటిని అధ్యయనం చేశాడు. వాటికి అబ్బురపడ్డాడు. "nothing can be taken for granted ,nothing is stereotyped" అన్న ఎరుక కలిగింది. "the sections of an orange ,the leaves of a tree, the petals of a flower, are never identical. It would seem that beauty derives its charm from this very diversity" అన్నాడు రేనార్.

**మోడల్‌తోనే పెళ్లి**

యువకుడిగా రేనార్ బక్కగా బలహీనంగా విశాలమైన కను బోమలతో చిన్న మీసం తో కనిపించేవాడు. జట్టు వెనక్కి దువ్వేవాడు. మిగిలిన చిత్రకారులకంటే నెమ్మది స్వభావి. ఏదిచ్చినా సంతృప్తి పొందే మనస్తత్వం. వయసు మీద కొచ్చాక మనిషిలో గాంభీర్యం, హుందాతనం వచ్చాయి. తన దగ్గర మోడల్స్‌గా ఉన్నవారిలో మరీ అందగత్తె ఎలీన్ చారిగాట్‌ను ఎంచుకొని పెళ్లి చేసుకొన్నాడు. హాయిగా ఆనందంగా ఇద్దరూ సామరస్యంతో గడిపారు. ముగ్గురు కుమారులు పుట్టారు. అందులో జీన్ సినీ దర్శకుడిగా గొప్ప విజయాలు సాధించాడు.

**ఆర్థిటిస్‌తో ఆర్టిస్ట్**

యాభైలలో రేనార్‌ను కీళ్ళ నెప్పులు బాగా బాధించాయి. అరవైలలో ఇవి పెరిగి మరీ బాధ పడ్డాడు. ఆర్థిటిక్ బాధ అనంత వేదనే అయింది. నడవలేక పోయేవాడు. చివరికి చక్రాల బండీయే శరణ్యం అయింది. చేతులు మరీ దెబ్బతిన్నాయి. బొటన వ్రేలుతో, చూపుడు వేలును కలపలేక పోయేవాడు. కాని పెయింటింగ్ ను మాత్రం మానలేదు. చిత్రాలు ఇదివరకు లాగానే తేజో వంతంగా వేస్తున్నాడు. ఒక క్లాంప్ ఆధారంగా వ్రేళ్ళను కదిలించి చిత్ర రచన చేశాడు తన తండ్రి అని కొడుకు చెప్పాడు. కాని చరిత్రకారుడు రేనార్ వ్రేళ్ళు బ్రష్ పట్టుకోలేనంత బలహీనంగా ఏమీలేవు. చాలా స్పష్టంగా గీసేవాడు అన్నారు. ఆ రంగులు చర్మానికి తగిలి ఇరిటేషన్ కలిగించేవి. తర్వాత అవే కండరాల నెప్పులుగా మారాయి. తన "పక్క"ను చూసి "this ridiculous invention" అన్నాడు. ఎందుకు ఆధునిక సైన్స్ ఈ వృద్ధ జంబుకాలను "జాడీలో ఊరగాయ"లాగా భద్ర పరుస్తోందో అర్థం కావటం లేదన్నాడు.

**రేనార్ విధానం**

ఆ తర్వాత కాలంలో వేసిన కాన్వాస్‌లు మరింత బలీయంగా, సంపన్నంగా ఉండేవి. ముదురు ఊదా రంగు బాగా ఇష్ట పడేవాడు. బర్గండి ఎరుపు రోజ్– పర్పుల్ కలర్లు ఎక్కువగా వాడేవాడు. 65వ ఏట రేనార్‌ను అమెరికన్ పెయింటర్ క్రిటిక్ వాల్టర్ పాష్ అతని విధానం ఏమిటి అని ప్రశ్నించాడు. దానికి రేనార్ "I want red to be sonorous to sound like a bell. If it does not turn out that way, I put on more reds or other colors till I get it. I have no rules and no methods. I look at a nude, there are myriads of tiny tints. I must find the ones that will make the flesh on my canvass live and quiver. Shall I tell you what I think are the two qualities of art? i

must be indescribable and it must be inimitable"అని స్పష్టంగా చెప్పాడు.

కీళ్ళనొప్పులు పెరిగిన కొద్దీ రేనార్ చిత్రకళా పెరిగింది. ఒక సహాయకుడిని పెట్టుకొని శిల్పాలనూ తయారు చేశాడు. వాటిని అత్యున్నతంగా ప్రతిభావంతంగా శిల్పీకరించాడు. ఎవరూ అతని శిల్పకళను విమర్శించ లేదు. అజాగ్రత్త, నిస్తేజలను దూరం చేసుకొన్నాడు. 1919లో కూడా ఇంకా కొత్త విషయాలు నేర్చుకొన్నాడు. "నేనింకా అభి వృద్ధిలోనే ఉన్నాను" అన్నాడు 78 వ ఏట. ఆ మర్నాడే 1919 డిసెంబర్ 3న చిత్రాకారుడు శిల్పి అగస్టీ రేనార్ చనిపోయాడు.

జీవితం చివర్లో రూపొందించిన పెద్ద నగ్న శిల్పాలు వెచ్చని స్ట్రా బెర్రీ జూస్‌లో స్నానించినట్లున్నాయి అన్నారు. అతని స్త్రీలు "warm and lush" కాని పసి మనస్తత్వంతో అమాయకంగా ఉంటారు అన్నారు. అతను దేన్నీ బ్రష్‌తో ముట్టుకొంటే అది ఒక కళా ఖండమే అయింది. అతని శైలి బాగా ప్రాముఖ్యత ప్రాచుర్యం పొందింది . "ఇంప్రెషనిజం" ఆ తర్వాత ఉధృతమైన ఉద్యమంగా మారింది. అవసాన దశలో మాటిస్సా వచ్చి రేనార్‌ను చూసి "అతని ప్రతి స్ట్రోకు ఎక్కువ నొప్పుల్ని కలిగిస్తోంది" అన్నాడు. "ఎందుకు ఇంకా పని చేస్తున్నావు?" అని ఆయన అడిగితే రేనార్ "నెప్పులు మాయమవటానికే" అని చెప్పి "the pleasure --the creation of beauty remains" అన్నాడు రేనార్.

"ఫెమినైన్ సెన్సుయాలిటీ" రేనార్ ప్రత్యేకత. "Renoir is the final representative of a tradition which runs directly from Rubens to Wattea. రేనార్ చిత్రాల అమ్మకం 70 మిలియన్ డాలర్లు దాటింది. Renoir mastered the ability to convey his immediate visual impressions, and his paintings showed great vitality, emphasizing the pleasures of life despite the financial worries that troubled him. Several of his masterpieces date from this period: La Loge (1874; "The Theatre Box"), Le Moulin de la galette (1876), The Luncheon of the Boating Party (1881), and Mme Charpentier and Her Children (1878). Charpentier organized a personal exposition for the works of Renoir in 1879 in the gallery La Vie Moderne.

అతని పెయింటింగ్స్‌లో "డాన్స్ ఎట్ లీ మోలిన్ డీ లా గెలేట్ " ప్రసిద్ధమైనది. ఇందులో ఒక డాన్స్ గార్డెన్‌లో ఆరు బయట క్రిక్కిరిసిన జనం కనిపిస్తారు. ఇక్కడే రేనార్ నివసించేవాడు. వేలాది చిత్రాలు గీశాడు.❋



## 22. ఫాదర్ ఆఫ్ అమెరికన్ సైకాలజీ - విలియం జేమ్స్ (1842-1910)

అమెరికా వేదాంతి, సైకాలజిస్ట్, డాక్టర్ అయిన విలియం జేమ్స్ అమెరికాలో మొట్టట మొదటిసారిగా సైకాలజీ కోర్సును ప్రవేశ పెట్టిన ఘనుడు. 19వ శతాబ్దపు మేధావులలో ఒకరుగా గుర్తింపు పొందాడు. అమెరికాలో ప్రసిద్ధ వేదాంతులలో అప్పటి వరకు అంతటి గొప్ప వేదాంతి జన్మించలేదని అంటారు. ఆనాటి ప్రముఖ వేదాంతులైన విలియం సాండర్స్ పియర్స్, జాన్ డ్యూయీ సరసన నిలిచిన మహా వేదాంతి. వీరి సిద్ధాంతం "ప్రాగ్మాటిజం" అంటే పరిస్థితులను బట్టి సమస్యలను గురించి ఆలోచించి పరిష్కారం కలిగించే విధానం. దీనితో "ఫంక్షనల్ సైకాలజీ" నిర్మాతలలో ప్రసిద్ధుడైనాడు. ఇరవైవ శతాబ్దపు సైకాలజిస్ట్‌లలో పద్నాలుగవ శ్రేణిలో నిలిచాడు. అందుకే విలియం జేమ్స్‌ను "ఫాదర్ ఆఫ్ అమెరికన్ సైకాలజీ" అని పిలుచుకొన్నారు.

**మేధావుల కుటుంబం**

జేమ్స్ కుటుంబం అంతా మేధావి వర్గమే. థియాలజి, ఫిలాసఫీ, సాహిత్యాలలో హెన్రి జేమ్స్, సీనియర్ విలియం జేమ్స్ హెన్రి జేమ్స్ జూనియర్ అగ్రశ్రేణిలో ఉన్నారు. అందరూ బహు సంపన్నులే. వీరి తాత వ్యాపారి, ఫైనాన్షియర్ కూడా. మూడు వేల మిలియన్ డాలర్ల ఎస్టేట్‌ను అప్పగించాడు. వీరిలో సీనియర్ హెన్రి ఆకుటుంబంలో చాలా తమాషా మనిషి స్వీడెన్ బర్గ్ అనుచరుడు, జీవితాంతం మత గ్రంథాలు చదువుతూ, మతపరమైన సమస్యలకు పరిష్కారాలు చెబుతూ, ముఖ్యంగా సృష్టికి సంబంధించిన మెటా ఫిజిక్స్‌పై దృష్టి పెట్టి జీవించాడు అన్నాడు బెర్నార్డ్ షా. తన తండ్రి నిజంగా థియలాజికల్ కాలంలో పుట్టి ఉంటే, ఆయన దేవునికి మానవునికి ఉన్న సంబంధం, దైవ సృష్టి, అందులోని మిస్టరిలను వెలికి తీసి, ఉంటే ప్రపంచానికి మార్గ దర్శనం చేసిన మహానుభావులలో ఒకడై తీర్చి దిద్దే వాడై ఉండేవాడు" అన్నాడు విలియం జేమ్స్.

తండ్రి ఒక మత ప్రవక్త అని, మహా మేధావి అని అన్నాడు.

**సాగని చదవు**

సీనియర్ హెన్రి జేమ్స్, భార్య మేరీ రాబర్ట్ సన్‌లకు నలుగురు కుమారులు, ఒక కూతురు. విలియం జేమ్స్ న్యూయార్క్ సిటీలో 11-1-1842 జన్మించిన పెద్ద కొడుకు. అక్కడే ప్రైవేట్ స్కూల్‌లో చదివి ఇక్కడి స్కూలు చదువులు నచ్చక తండ్రి కుటుంబాన్ని యూరప్‌కు మార్చేశాడు. లండన్, పారిస్, బోలాన్ స్విట్జర్లాండ్, జెర్మనిలలో ప్రైవేట్ మాస్టర్లు, గవర్నసేస్‌లు చదువు చెప్పారు మధ్య మధ్యలో మార్పులు కనుక పిల్లల చదువు వరుస క్రమంలో సాగలేదు. విలియమ్స్‌కు జర్మన్, లాటిన్ ఇటాలియన్ భాషలలో గొప్ప పాండిత్యం అలవడింది.

**అస్థిర నిర్ణయాలు**

పద్దెనిమిదేళ్ళ వయసులో విలియం జేమ్స్ అమెరికాకు వచ్చాడు. యూరప్ అతడిని మృదు స్వభావిని చేయలేక పోయింది. అక్కడ తిట్లు శాపనార్థాలే నేర్చుకొన్నానని తండ్రితో చెప్పాడు. 17 వయసులో పెయింటర్ అవుదామనుకొన్నాడు. ఒక కొడుకు ఆర్టిస్ట్ మరొకడు నావలిస్ట్ అవాలని తండ్రి భావించాడు. అయిన కొడుకులకు నిర్ణయించుకొనే స్వేచ్ఛ ఇచ్చాడు. విలియమ్స్ పారిస్ చేరి న్యు పోర్ట్ ఐలాండ్‌లో ఒక ఇంట్లో ఉండి అభిమాన చిత్రకారుడు విలియం హంట్ బృందంతో ఉన్నాడు.

**మళ్ళీ మెడిసిన్**

ఒక ఏడాదికే చిత్ర లేఖనం మొహం మొత్తింది. ఆర్ట్ వదిలేసి హార్వర్డ్‌లో లారెన్స్ సైంటిఫిక్ స్కూల్‌లో చేరాడు. మూడేళ్ళ తర్వాత హార్వర్డ్ మెడికల్ స్కూల్‌లో చేరాడు. ఏడాదికే తాను సిద్ధాంతకర్తనే కాని ప్రాక్టికల్ మనిషిని కాదని గ్రహించాడు. లూయీ అగస్సి అతని గురువయ్యాడు ఆ స్కూల్‌లో. అగస్సి బ్రెజిల్‌కు ఒక అన్వేషణలో బయల్దేరితే, విలియం అనుసరించాడు. అక్కడ మొక్కలు వగైరా సేకరించటం వర్గీకరించటం బోరు కొట్టి మళ్ళీ మెడిసిన్ చదవటం మొదలు పెట్టాడు. ఈ మార్పు మానసిక సంఘర్షణ కలిగించింది. అప్పుడప్పుడు నరాల జబ్బు వచ్చి బాధ పడేవాడు. ఈ నరాల వ్యాధి నుంచి తనను తాను కాపాడుకోవాలని నిర్ణయించుకొన్నాడు. ఆరోగ్యం కోసం జర్మని వెళ్ళాడు. మెడిసిన్ పాసై మంచి ఉద్యోగం వస్తే చేరాలనుకొన్నాడు.

డాక్టర్ జేమ్స్ - మొదట బెర్లిన్‌లో చేరాడు. జీర్ణ స్థితి దెబ్బతింది. తలనెప్పి

బాధించింది. డిప్రెషన్ లోపడిపోయాడు. గదికే పరిమితమైనాడు. కాలక్షేపానికి పుస్తకాలు విస్తృతంగా చదివాడు. ఏదో కొత్త మార్పు రావాలని తండ్రికి రాశాడు. డాక్టర్ తాఫ్లిట్జ్ స్నానాలు చేయించమన్నాడు. చేశాడు కాని మార్పేమీ రాలేదు. స్విట్జర్లాండ్ ఫ్రాన్స్‌లు తిరిగాడు ఉపన్యాసాలు విన్నాడు. ఇవీ పని చేయలేదు. మళ్ళీ అమెరికా చేరి హార్వర్డ్ నుంచి మెడికల్ డిగ్రీ పొంది కేంబ్రిడ్జిలో నాలుగేళ్ళున్నాడు.

**ఫ్రీవిల్ మహాత్మ్యం**

మానసికంగా బాగా కుంగిపోయాడు. సడెన్‌గా తనలాంటి వారెందరో ప్రపంచంలో ఉన్నారనే ఎరుక కలిగింది. అంతే దెబ్బకు జబ్బు తగ్గింది. రేనోవీర్ రాసిన "ఫ్రీ విల్" వ్యాసం చదివాడు. అది మంచి ప్రభావాన్ని కలగ జేసింది. ఫ్రీవిల్‌పై అవగాహన ఏర్పడింది. ఆ రోజు నుంచే తన జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమైందని రాసుకొన్నాడు. "తన అస్తిత్వంపై నమ్మకం కలిగి సృజనాత్మకశక్తికి ప్రాధాన్యమిచ్చాడు. దీనితో ఆరోగ్యం బాగై శారీరక మానసిక స్థితి అద్భుతంగా మెరుగైంది. జీవితం అంటే భయం, చావుపై ఆరాధనా పోయాయి.

**ప్రొఫెసర్ విలియం జేమ్స్**

ముప్ఫై ఒకటవ సంవత్సరంలో హార్వర్డ్‌లో అనాటమీ ఫిజియాలజీ ఇంస్ట్రక్టర్‌గా ఉద్యోగంలో చేరాడు. ముప్ఫై ఏడవ ఏట ఫిలాసఫీ బోధించాడు. నలభై మూడులోపే ప్రొఫెసర్ అయ్యాడు. ఆలీస్ హౌ గిబెంస్‌ను పెళ్ళాడి అయిదుగురు పిల్లల్ని కన్నాడు. టీచర్‌గా మంచి పేరొచ్చింది. "ఫిలాసఫీ ఆఫ్ ఇవల్యూషన్"పై కొత్త కోర్సు ఏర్పాటు చేశాడు. అమెరికాలో ఇదే మొదలు. ఇందులో ఫిజియాలజీ సైకాలజీ మధ్య ఉన్న సంబంధంను చేర్చాడు. విద్యార్ధులతో ఫ్రీగా కలిసిపోయేవాడు. సందేహ నివృత్తి చేసి మానసిక దీపం వెలిగించేవాడు.

**సైకాలజీలో ప్రధమ గ్రంథం**

నలభై ఎనిమిది రాక పూర్వమే మొదటిపుస్తకం "ప్రిన్సిపుల్స్ ఆఫ్ సైకాలజీ" రాసి ప్రచురించాడు. సైకాలజీ మీద అదే మొట్ట మొదటి పుస్తకం. అంతే కాదు, ఆధునిక సైకాలజీకి ఆధారభూతమైనది కూడా. ఏడేళ్ళ తర్వాత "ది విల్ టు బిలీవ్" గ్రంథం రాశాడు. ఆ తర్వాత వెంట వెంటనే చాలా పుస్తకాలు రాశాడు. "హ్యూమన్ ఇమ్మోరాలిటి", "ది వెరైటీస్ ఆఫ్ రెలిజియస్ ఎక్స్పీరియేన్స్", "ప్రాగ్మాటిజం" అనే మూడు గ్రంథాలు రచించాడు. ప్రాగ్మాటి జంకు "ఏ న్యు నేం ఫర్ సం ఓల్డ్ వేస్ ఆఫ్ థింకింగ్" అని టాగ్

పెట్టాడు. దీనికి సీక్వెల్‌గా "ది మీనింగ్ ఆఫ్ ట్రూత్" రాశాడు. "ఏ ప్లూరలిస్టి క్ యూని వర్స్" మొదలైనవి మరణానంతరం వచ్చాయి. వీటిలో ఏది చదివినా అట్టడుగు మనిషికి అర్ధమయేట్లు ఉంటుంది. ఫిలాసఫీని ఫిక్షన్‌లాగా రాసిన ఘనత విలియం జేమ్స్ దే". "philosophy is thinking about things in the most comprehensive possible way" అంటాడు జేమ్స్.

విలియం జేమ్స్ చెప్పిన వస్తువుల గురించి ఆలోచనను మూడు శీర్షికలుగా అర్ధం చేసుకోవాలి. మీలియోరిజం (వృద్ధి చేయటం) ప్రాగ్మాటిజం (వ్యవహార విషయం) ప్లూరలిజం (అనేకత్వం) మిలియోరిజం గురించి చెబుతూ "జీవితంలో అనేక క్రూర సంఘటనలతో అన్యాయంతో ఉన్నా, మనం ఆలోచించి శ్రమించి దాన్ని బాగు పరచగలం. "జీవన విధానాలలో ఉత్కృష్టమైన మార్పులు తెస్తే ఇది సాధ్యమే" అన్నాడు. సంపదలో వ్యత్యాసంను అందరికి సమానంగా పంచి మార్పు తేవచ్చు. యుద్ధాన్ని నివారించటానికి నైతిక సమానత్వం మోరల్ ఈక్వివలేంట్ అవసరం అంటాడు. చిత్తడి భూములను బాగుచేయటం కాలువలు తవ్వించటం, వ్యాధులను నిరోధించటం, కరువు నివారించటం మొదలైన వాటిలో మానవుల సామర్ధ్యాలను వినియోగించితే యుద్ధం ఊసు ఉండదు అన్నాడు.

ప్రాగ్మాటిజం గురించి చెబుతూ శుద్ధ కారణం ప్యూర్ రీజన్‌ను గురించి చెప్పాడు. మన భావాలను విస్పష్టంగా చెప్పాలి. దానికోసం కొత్త మార్గం కావాలి. అదే ప్రాగ్మాటిజం 'ఇది పాత సిద్ధాంతాలపై తిరుగుబాటు మాత్రమే కాదు. పాతుకుపోయిన సిద్ధాంతాల కీలక భావనలలో మార్పు కూడా. కీట్స్ కవి చెప్పిన అందమే సత్యం సత్యమే అందం అన్నదాన్ని జేమ్స్ అంగీకరించాడు. కాని రెండూ సాపేక్షమే అన్నాడు. మంచితనం అన్నది ప్రాధమికమూకాదు, అందరానిదీ కాదు.

ఇక మూడవది ప్లూరలిజం. ఇది ఏకత్వానికి సమాధానం. అనేక పరిష్కార మార్గాలున్నాయి అంటాడు. అన్నిటి గురించీ ఆలోచించాలి ఒకే సమస్యకు ఒకటే పరిష్కారం కాదు. అనేకం ఉంటాయని గ్రహించమన్నాడు. యాభై ఎనిమిదవ ఏట జేమ్స్ గిల్ ఫోర్డ్ లెక్చర్లు ఇవ్వటానికి ఎడిన్ బర్గ్ వెళ్ళాడు. ఈ ఉపన్యాసాల సారాంశమే అతని "వెరైటీస్ ఆఫ్ రెలిజియస్ ఎక్స్పీ రియేన్స్" పుస్తకం. "సోసైటీ ఆఫ్ ఫిజికల్ రిసెర్చ్"ను ఏర్పరచి అధ్యక్షుడయ్యాడు. అరవై అయిదేళ్లకు హార్వర్డ్ ప్రొఫెసర్ షిప్ నుంచి తప్పుకొన్నాడు. అరవై ఎనిమిదిలో మళ్ళీ అమెరికా వచ్చాడు. ఇక్కడికి రాగానే ఇంగ్లాండ్‌లో తమ్ముడు హెన్రి తీవ్రంగా జబ్బు పడ్డాడని తెలిసింది వెంటనే వెళ్లి తీసుకొచ్చాడు. మొదటిసారి గుండెపోటు వచ్చింది. తట్టుకున్నాడు. న్యు హాంప్షైర్‌లోని

స్వగ్రామం కోకోరువా చేరే లోపలే గుండె ఆగి 26-8-1910లో 68 ఏళ్ళకే మరణించాడు విలియం జేమ్స్.

"James saw life as a continuous experiences, a progress in which things and thoughts objects and their relations were equally integrated". అతని ఫిలాసఫీని "ఫిలాసఫీ ఫర్ ఫిలిష్టి న్స్" అన్నారు అంటే సంస్కృతీ కళలకు వ్యతిరేకమైనవారి ఫిలాసఫీ అని అర్ధం.

**విలియం ప్రభావం**

విలియం జేమ్స్ ప్రభావం అమెరికా ప్రెసిడెంట్లు ఉడ్రోవిల్సన్, రూజ్ వెల్ట్‌ల ఆలోచనా ధోరణిపై అధికం. శాంతాయన జేమ్స్ ఫిలాసఫీకి ఆకర్షితుడు. జేమ్స్ కొత్త శకానికి శంకుస్థాపన చేశాడు. ఎపిస్టమాలజి మెటాఫిజిక్స్, సైకాలజీ, విద్య మతం మిష్టిజం లపై ఎన్నో ఉద్గ్రంథాలు రాశాడు. ఫిలాసఫీలో అతను రాసిన "రాడికల్ ఇంపేరిసిజం" ఉత్కృష్టగ్రంథం "an thing short of god is not rational, and every thing more than god is impossible" అని నమ్మాడు. "First, it is essential that God be conceived as the deepest power in the universe, and second, he must be conceived under the form of a mental personality"

"థీరీ ఆఫ్ ఎమోషన్" అనేదాన్ని కార్ల్ లాంజ్ నుండి గ్రహించి విస్తృత పరచాడు. "[W]e must immediately insist that aesthetic emotion, pure and simple, the pleasure given us by certain lines and masses, and combinations of colors and sounds, is an absolutely sensational experience, an optical or auricular feeling that is primary, and not due to the repercussion backwards of other sensations elsewhere consecutively aroused. To this simple primary and immediate pleasure in certain pure sensations and harmonious combinations of them, there may, it is true, be added secondary pleasures; and in the practical enjoyment of works of art by the masses of mankind these secondary pleasures play a great part. The more classic oneÐs taste is, however, the less relatively important are the secondary pleasures felt to be, in comparison with those of the primary sensation as it comes in. Classicism and romanticism have their battles

over this point.

“Jamesian theory of self[edit]

William James developed a theory of self that was divided into two main categories. The first was the "Me" self, and the second was the "I" self.[48] The "me"self refers to the aspects of someone that come from that person's experiences. James broke the "me" self down into three sections, The Material Self, The Social Self, and The Spiritual Self.[49]For James, the" "self was classified as the thinking self. James linked this self to the soul of a person, or what we now think of as the mind.[50] The Pure Ego was the name given to the"I" self.[49]

Free will[edit]

In The Will to Believe, James simply asserted that his will was free. As his first act of freedom, he said, he chose to believe his will was free. He was encouraged to do this by reading Charles Renouvier, whose work convinced James to convert from monism to pluralism. In his diary entry of April 30, 1870, James wrote,

I think that yesterday was a crisis in my life. I finished the first part of Renouvier's second Essais and see no reason why his definition of free will "the sustaining of a thought because I choose to when I might have other thoughts' need be the definition of an illusion. At any rate, I will assume for the present—until next year—that it is no illusion. My first act of free will shall be to believe in free will.[25] ❋




## 23.19వ శతాబ్దపు వాస్తవిక సాహిత్య సృష్టికర్తలలో ఒకడు -హెన్రి జేమ్స్ (1843-1916)

హెన్రి జేమ్స్ తరువాత ఏ ఆధునిక రచయితా అంతకుమించి గొప్ప ఫిక్షన్‌ను సృష్టించలేదు. అతని పోర్ట్రైట్ ఆఫ్ ఎ లేడి, ది వింగ్స్ ఆఫ్ ది డవ్, ది ఎమ్బాసడర్స్, దిగోల్డెన్ బౌల్‌కు మించిన నవలలు లేవు. ఐర్లాండ్ నుంచి వలసవచ్చిన తాత మూడు మహా గొప్ప ఐశ్వర్యాలను ఇచ్చాడు. తండ్రి బిజినెస్‌లో దెబ్బతిని మిస్టిక్ అయ్యాడు. స్వీడెన్ బర్గ్ శిష్యుడైనాడు. తాత నుండి సంపదపై అభిమానాన్ని, తండ్రి నుండి దానిపై ఏవగింపును పొందాడు హెన్రి జేమ్స్.

15-4-1843లో అమెరికా న్యూయార్క్‌లో తండ్రికి రెండవవాడుగా పుట్టాడు. ఇతనికన్న ఏడాదిదపెద్ద విలియం జేమ్స్ ఫిలాసఫర్ సైకాలజిస్ట్ అయ్యాడు. అమెరికా, యూరపు దేశాల్లో దేన్ని ఎంచుకోవాలో తెలియక సందిగ్ధంలో కొన్నాళ్ళున్నాడు. ఏడాది వయసులోనే తండ్రితో అనేక దేశాలు తిరిగాడు. అన్నతోబాటు పారిస్, లండన్ జేనీవాలలో చదివాడు. కాస్మాపాలిటన్ జీవితంలో పెరిగాడు. ఏదేదో అవుదామనుకొంటే తండ్రి వ్యాపారంలో కుదేలయ్యాడు. ప్రిస్టేజ్ దెబ్బ తిన్నది.

చిన్నతనం నుంచే రాయటం అలవాటైంది. పద్నాలుగో ఏటనే కొడుకు రచనలు చూసి తండ్రి తల్లితో అద్భుత నవలలు రాస్తున్నాడు మనవాడు అని చెప్పి మురిసిపోయాడు. పద్దేనిమిదో ఏట ఒక అగ్నిప్రమాదాన్ని ఆపుతూ గాయపడ్డాడు. అది జీవితాంతం బాధించింది. పందొమ్మిదో యేట అందగాడుగా ఉండేవాడు. మాసాచూసేట్స్ లోని జేమ్స్ రసెల్ లోవెల్ అనే మహా రచయితను చూసి తానూ అంతవాడిని కావాలనుకొన్నాడు. ఇరవై ఒకటవ ఏడాది నార్త్ అమెరికన్ రివ్యూలో ఒక పుస్తకాన్ని సమీక్షించాడు. రాసిన మొదటి కథ అట్లాంటిక్ మంత్లిలో వచ్చింది. యవ్వన దశలో అనేక ప్రాంతాలు తిరిగాడు. యూరప్ బాగా ఆకర్షించింది. అక్కడే ఉండి రచనలో పేరు తెచ్చుకోవాలనుకొన్నాడు.

రెండేళ్ళ తర్వాత కేంబ్రిడ్జ్ తిరిగి వచ్చాడు. మళ్ళీ యూరప్ వెళ్లి తర్జనేవ్, జోలా, ఫ్లాబర్ట్‌లను కలిశాడు. వారంతా హెన్రి కథల్ని మెచ్చుకొన్నారు. లండన్‌లో పుట్టి ఉంటే బాగుండేది అనుకొన్నాడు. పారిస్ మోహం పెంచింది. వదల్లేక పోయాడు. ఇంగ్లాండ్ తనిల్లు కావాలని కల కన్నాడు. నేర వేర్చుకొన్నాడు. లండన్‌లో స్థిరపడి అంతర్జాతీయ పరిస్థితులపై నవలలు రాశాడు. పాత, కొత్త తరానికి వారధి కావాలనుకొన్నాడు. "అంతర్జాతీయ రచయిత" అనిపించుకోవాలని ఉండేది. మొదటి నవల వచ్చిన పదేళ్లకు "రోడరిక్ హడ్సన్" అనే నవల రాశాడు. అతని రచనలలో మూడు దశలున్నాయి. మొదటిజేమ్స్ రెండవ జేమ్స్, పాతకాలపు నటజేమ్స్.

జీవిత మధ్యకాలంలో రాసిన పోర్ట్రెట్ ఆఫ్ ఏ లేడి కొత్తదనంతో మిరుమిట్లు గోలిపింది. ఇంగ్లీష్ ఫిక్షన్‌కు కొత్త వొరవడి దిద్దింది. తరువాత వచ్చిన వింగ్స్, గోల్డెన్ బౌల్ నవలలు క్లిష్టమైనవి. కాని గొప్ప కళా ఖండాలనిపించాయి. వాటి నిర్మాణం ఆశ్చర్యపరిచింది. ముప్ఫయారేళ్ళ వయసులో "డైసీమిల్లర్" రాసి పేరు తెచ్చుకొన్నాడు. 1882లో తల్లీ తండ్రిచనిపోగానే అమెరికా తిరిగి వచ్చాడు. కొద్ది కాలంలోనే మళ్ళీ ఇంగ్లాండ్ వెళ్ళిపోయాడు. మళ్ళీ 21 ఏళ్ళదాకా అమెరికా వెళ్ళలేదు. ప్రముఖ డ్రమటిస్ట్ అవాలని అనుకొన్నాడు. కాని రాసిన నాటకాలు ఫలించలేదు. జ్ఞానోదయం అయి నాటకానుభవంతో నవలను తీర్చిదిద్దాడు.

జీవితాంతం హెన్రి పెళ్లి చేసుకోలేదు. కాని చాలామందిని వలచాడు. అరవైయేళ్ళు వచ్చేసరికి జీవిత ప్రవాహం చాలా దూరం ప్రవహించింది అనిపించింది. అపజయాలు బాధిస్తున్నాయి. తన జీవిత చరిత్రగా "ది ఎంబాసడర్స్" రాశాడు. "live all you can It is a mistake not to. It does not so much matter what you do in particular, as long as you have your life —-live" అనేది హెన్రి సిద్ధాంతం ముసలితనం మీద పడుతున్న కొద్దీ రచనలో పటుత్వం తగ్గింది. ఒకా అపరాధ భావం ఏదో మనసులో మెదిలింది.

1907లో న్యూయార్క్‌లో "నావల్స్ అండ్ టేల్స్" రావటం ప్రారంభమైంది. ఆ తర్వాత ఇరవైఆరు పుస్తకాలు రెండేళ్లలో వెలువడ్డాయి. హెన్రి చనిపోయిన తర్వాత ముప్ఫై ఆరు పుస్తకాలుగా ఆయన రచనలు ప్రచురితమైనాయి.

మొదటి ప్రపంచ యుద్ధం హెన్రిని కలవర పరచింది. జర్మనీపై అసహ్యం ఇంగ్లాండ్‌పై దేశభక్తికి కారణమైంది. బ్రిటిష్ పౌరునిగా ఇంగ్లాండ్ స్వీకరించింది. 1916 జనవరి ఒకటిన "ఆర్డర్ ఆఫ్ మెరిట్" పతకం అందుకొన్నాడు. కాని ఈ ఆనందం ఎక్కువ కాలం నిలవ లేదు. అన్నలాగానే హార్ట్ ఎటాక్ వచ్చింది. దానిపై న్యుమోనియా

సోకింది. డెబ్బై మూడేళ్ళు రాకముందే 8-2-1916 చనిపోయాడు హెన్రి జేమ్స్. చనిపోయిన తర్వాత అతని రచనలు కొన్ని వెలుగు చూశాయి. వందదాకా కథలు చిన్న నవలలు రాశాడు. పెద్దనాటకాలు ఎనిమిది రాశాడు. ట్రావేలోగ్స్ రాశాడు.

హెన్రి అంటే ఇష్టం లేనివారు అతని శైలిని వస్తువును దూషించారు. వ్యంగ్య వైభవం కోసం కొన్ని మర్యాదలను కాదన్నాడు అన్నారు. ఇలియట్ "his mastery over, his baffling escape from ideas,—a mind so fine that no idea could violate it" అన్నాడు. అతని శైలిపై ఎక్కువ మంది విరుచుకు పడ్డారు. అతనిది "warm manner saying nothing in infinite sentences" అన్నాడు థామస్ హార్డీ. అతనిది రంగుల రాత అన్నారు. కాని ఆధునిక విమర్శకులు మాత్రం మొదటిరకం ఇంగ్లీష్ నవలా రచయిత అని మెచ్చారు. రెండు స్థాయిలలో కథలు చెప్పాడు అన్నారు. "hippopotamas rolling a pea"లాగా అతని స్టైల్ ఉందన్నాడు హెచ్.జి .వెల్స్". ఇంగ్లాండ్ దేశం నైతిక పతన దశలో ఉన్నప్పుడు మళ్ళీ సవ్య మార్గంపై నడిపించినవాడు హెన్రి.

చనిపోయిన తర్వాతా హెన్రి జేమ్స్‌ను మరల కనుగొన్నారు. "James was not only America;s few great novelists ,but one of the very first to use a fine sensibility as a weapon against the blunt insensibilities of the age"

హెన్రి చివరికాలపు రచనలను ఇంప్రెషనిస్ట్ పెయింటింగ్‌లతో పోలుస్తారు. అతని పాయింట్ ఆఫ్ వ్యూ, ఇంటీరియర్ మోనోలోగ్, అన్ రేలియబుల్ నారేటర్స్ చాలా విలక్షణమైనవి. హెన్రి సాహిత్య విమర్శకు ఎంతో సేవ చేశాడు. రచయితలకు ప్రపంచాన్ని గురించి చెప్పే విషయాలలో స్వేచ్ఛ ఉండాలని హెన్రి జేమ్స్ అభిప్రాయం. మంచి నవలలు అంటే మంచి పనితో ఉండే జీవితం అంటాడు "a work of art must lift up the hear"అన్నది అతని సిద్ధాంతం. మూడుసార్లు నోబెల్ ప్రైజ్‌కు నామినేట్ అయ్యాడుకాని లభించలేదు.❋



## 24. ఫ్రెంచ్ సింబాలిక్ కవిత్వ ఘనుడు- పాల్ వె ర్లేన్ (1844 -1896)

విషయవాంఛలను బాగా అనుభవించినా స్వచ్ఛమైన కవిత్వం రాసిన ఫ్రెంచ్ కవి పాల్ వేర్లేన్. 30-3-1844 ఫ్రాన్స్‌లోని మెత్జ్‌లో పుట్టాడు. తండ్రి నికొలాస్ అగస్టేవేర్లేన్ నెపోలియన్ సైన్యంలో కాల్బలానికి కెప్టెన్‌గా ఉన్నాడు. లీజియన్ ఆఫ్ ఆనర్ గౌరవం పొందాడు. 1851లో కుటుంబం పారిస్‌కు మారింది. పాల్ చదువులో బాగా దూసుకుపోయాడు. సాహిత్యంలో, అలంకార శాస్త్రాలలో, మృత భాషలలో ఆనర్స్ డిగ్రీ సాధించాడు 'లైస్ బోనపార్టే' నుండి డిగ్రీ పొంది సిటి అడ్మినిస్ట్రేషన్‌లో అకౌంట్ డిపార్ట్‌మెంట్‌లో క్లార్క్‌గా చేరాడు. ధ్యాసమాత్రం కవిత్వం మీద ఉండేది. పదమూడో ఏటనే బాడలేర్‌పై ఆసక్తి కలిగింది. తను అతనికంటే ఇంకా బాగా రాయగలను అనుకొన్నాడు.

ఇరవైలో కుర్ర బోహీమియన్ గాంగ్‌తో కలిసి ఒక జట్టును ఏర్పరచాడు. వీళ్ళు తమను "పార్నాస్సియన్లు"గా పిలుచుకొన్నారు. నాయకుదు లేకంటే డీ లిజిల్. ఆంక్షలు లేని రోమాంటిజంను వ్యతిరేకించారు. మళ్ళీ క్లాసిజం రావాలి అని కోరుకొన్నారు. అదీ చాలా స్పష్టమైన విధానలో టెక్నిక్‌తో ఉండాలని ఆశించారు. దీనికి తగినట్లు వేర్లేన్ కవిత్వం రాసి దారి చూపించాడు. మొదటి పుస్తకం "పోయెమ్స్ సాచుర్నీస్" ప్రచురించాడు. ఇరవై ఏళ్ళకే అ పేరులోని సాచురిన్‌ను సార్ధకం చేసుకొన్నాడు. కవిత్వంలో సున్నితమైన నిర్మాణం, మంద్ర స్వరం చూపాడు. సంగీత స్వరంలాగా కవితలు ఆకర్షించాయి. అందులో స్వచ్ఛత కనిపించింది. పవిత్రత దర్శనమిచ్చింది. వయోలిన్ శబ్దం లాగా దీర్ఘంగా, చిరుగాలి సవ్వడిలా హాయిగా మాధుర్య విలసితంగా కవిత్వం రాశాడు. ఇంతవరకు బాగానే ఉంది.

అయ్యగారు మేజర్ అయ్యేసరికి దురలవాట్లలో పడిపోయి హోమో సేక్సువల్‌గా మారి విపరీతంగా తాగి పూర్తిగా దారితప్పాడు. తండ్రి చనిపోయాడు. తల్లి బాగా ఆప్యాయంగా చూసింది. మధ్య తరగతి గౌరవాన్ని చాలెంజ్ చేశాడు. ప్రీస్ట్‌లను అవహేళన చేశాడు. నాస్తిక జెండా ఎగరేశాడు. సమాజం పట్ల అసహ్యం, ప్రయోగాలతో రెండవ పుస్తకంగా "గాలేంట్ ఫెస్టివల్స్" రాసి అచ్చేశాడు. ఇవి మొజార్ట్ సంగీత

ధ్వనుల్లా ఉన్నాయన్నారు. అదే ఏడాదిలో మేటేల్డీ మాటీ డీ ఫ్లార్వేల్‌తో ప్రేమాయణం సాగించి పెళ్లాడాడు. మంచి జోడీయే అని అంతా భావించారు. పెళ్ళితోనైనా దారిన పడతాడు అనుకొన్నారు. మనవాడికి ఇరవై అయిదు. ఆ అమ్మాయి ఇతనికంటే చాలా చిన్నది. కాని బాగా అన్యోన్యంగా ఉన్నారు. ఈ ఆనందాన్ని "ది గుడ్ సాంగ్" కవితలలో పోదిగాడు. ఈ సుఖ జీవితం ఎక్కువ కాలం లేదు.

పెళ్ళయినన ఏడాదికే ఫ్రాంకో – ప్రష్యన్ యుద్ధం 1870లో వచ్చింది. గురూగారు మళ్ళీ డోసుపెంచి తెగ తాగి వీరంగం వేస్తున్నాడు. పాత చెడు అలవాట్లకు బానిసైపోయాడు. ఉద్యోగం హుళక్కి అయింది. దీనికి తోడు తల్లి దురాశతో ఉన్న డబ్బు అంతా స్పెక్యులేషన్‌పై పెట్టింది. అంతా తిరు క్షవరమై చేతికి చిప్ప మిగిలింది. వేర్లేన్‌కు అత్తవారు ఒక ఇల్లు ఇచ్చారు. ఒక రోజు పోస్ట్‌లో ఒక అద్భుత కవిత్వం వచ్చింది రాసినవాడు కొత్త కుర్రాడు ఆర్ధర్ రిమ్బాడ్ వాడు. ఇతని దగ్గరకు చేరి ఇద్దరూ "ఒకటై పోయారు".

అర్ధర్ తండ్రికూడా మన కవి తండ్రిలాగా ఆర్మీ ఆఫీసర్. తల్లి కోపిష్టి. పదిహేనవ ఏట ఆర్ధర్ తను పార్నాస్సియన్ అయిపోయాన నుకొన్నాడు. విచిత్రంగా పారిస్ కమ్యూన్‌లో చేరి అకస్మాత్తుగా వదిలేసి తానుఒక యోగిని అని ప్రకటించాడు. అప్పుడే వేర్లేన్‌ను కలవటానికి తాను రాసిన వందలైన్ల కవిత్వాన్ని వెంట తెచ్చాడు. ఇక్కడే తిష్ట వేశాడు. ఇల్యూమినేషన్స్ పేరు మీద ఏదో భ్రమలో రాసిన కవిత్వం అది. మురికి బట్టలు మార్చేవాడు కాదు. సంఘాన్ని గూర్చి పట్టించుకోనేవాడు కాదు. మాజిక్, తంత్రాలు నేర్చి ప్రయోగించేవాడు. రిమ్బాద్ చేసేది అంతాపరమ పవిత్రమైనదిగా వేర్లేన్ భావించాడు. వాడినే ఆరాధించాడు. పెళ్ళాం సంగతి పట్టించుకోలేదు. ఆమె కుటుంబం వాళ్ళు ఒకసారి వీళ్ళ ఇద్దరిపై విరుచుకు పడ్డారు. వేర్లేన్ ఇల్లువదిలి బాయ్ ఫ్రెండ్ రిమ్బాడ్‌తో కలిసి వెళ్ళిపోయాడు.

తమల్ని తాము "సూర్య పుత్రులు"గా భావించి ఈ జంట లండన్ చెక్కేశారు. ఇద్దరి పోషణాభారం వేర్లేన్ తీసుకొని ఫ్రెంచ్ భాష నేర్పుతూ లండన్‌లో ఇంగ్లీష్ లెక్చర్లు ఇస్తూ సంపాదించాడు. తర్వాత బెల్జియం చేరారు. ఏడాదికే "మగ దాంపత్యం" ముగిసింది. తాగిన మైకంలో ఒకరినొకరు తిట్టుకొన్నారు కొట్టుకొన్నారు. సహజంగా రిమ్బాడ్ హోమో సేక్సువల్ కాదు. మన కవి గారి కపి చేష్టలకు బలైనాడు" కోపో ద్రేకంతో బ్రస్సెల్స్‌లో వేర్లేన్ వాడిపై కాల్పులు జరిపాడు. కాల్పుగాయం చిన్నదే కాని వేర్లేన్ పడిపోయాడు. తల్లి, పెళ్ళాం వచ్చి వాడితో స్నేహం వదులుకోమన్నారు. సరేనని వాళ్ళతో కలిసి వెళ్ళిపోతూ మరో రౌండ్ గుళ్ళు పేల్చాడు వేర్లేన్. ఇది బహిరంగమై అరెస్ట్ అయి రెండేళ్ళు చువ్వలు లేక్కేశాడు.

ఈలోగా రిమ్బాడ్ భ్రమ కవిత్వాలు రాసి "ఏ సీజన్ ఇన్ హెల్" ప్రచురించాడు.

ఈ వింత విపరీత ధోరణి కవిత్వమే తర్వాత సర్రియలిస్ట్‌లకు “బైబుల్” అయింది. అపస్మారకంలో రాసిన కవిత్వం అని ముద్రపడింది. రాసిన ఇరవై ఏళ్ళకు కాని ముద్రణ భాగ్యం పొందలేదు. రిమ్బాడ్ ఉద్యోగాలనేకం మారి దేనిలోనూ స్థిర పడకండా టీచర్‌గా, సర్కస్ లోను, డాక్ వర్కర్‌గా, డచ్ ఆర్మీ సైనికుడిగా సైప్రస్ క్వారీలో కూలీగా అనేక అవతారాలెత్తాడు. విసుగెత్తి ఆఫ్రికా వెళ్లి ఫ్రెంచ్ ఎక్స్పోర్టింగ్ కంపెనీలో ఉద్యోగం చేశాడు. బంగారం, దంతం దిగుమతి ఎగుమతిలో పని చేశాడు. వెబ్ రివర్‌ను, అబిసీనియాలోని ఆగాదాన్ ప్రాంతాన్ని అన్వేషించాడు. ఆయుధ సామగ్రి దొంగిలించి స్థానికులకు అమ్మాడు. బానిసలను అమ్మేవాడనీ రూమర్ ఉంది. అబిసీనియా అమ్మాయితో బ్రహ్మాండమైన భవంతిలో విలాసంగా జీవించాడు. అంతా బాగానే ఉంది అనుకుంటూ ఉండగా, అతనికి సంక్రమించిన సిఫిలిస్ వ్యాధి ప్రాణాంతకమైంది. కాలికి గాయమై మానలేదు. యూరప్ వెళ్లి కాలికి శస్త్ర చికిత్స చేసుకోవాలనుకొన్నాడు. ఆపరేషన్ సక్సెస్ కాని పేషెంట్ డైడ్.సిఫిలిస్ ముదిరి మార్సిల్లిస్ హాస్పిటల్‌లో 1-8-1896 మరణించాడు. అప్పటికి వయసు ముప్పై ఏడే రిమ్బాడ్‌కు.

వేర్లేన్ జైలు నుంచి విడుదలయ్యాడు. వయసు ముప్పై ఒకటి. నాస్తికత్వాన్ని వదిలేసి చిన్ననాటి పరిస్థితులకు వచ్చాడు. భార్యను తల్లిని వచ్చి తనను తీసుకు వెళ్ళమని కోరాడు. పాపం నుండి విముక్తి పొందినవాడుగా మారాడు. భార్య ఇతను జైల్లో ఉండగానే విడాకులు తీసుకొన్నది. నమ్మలేదు ఇతనిని. మైండ్ బ్లాక్ అయి మళ్ళీ రిమ్బాడ్‌ను జేర్మనీ నుంచి వచ్చి తనతో ఉండమని కోరాడు. వాడికి అప్పటికే జ్ఞానప్రకాశం కలిగి మళ్ళీ ఈ రొంపిలోకి దిగటానికి ఇష్టపడలేదు.

జైలులో ఉండగానే వేర్లేన్ కొన్ని పాటలు రాశాడు. వాటిని “రొమాన్సెస్ విదౌట్ వర్డ్స్” పేరుపెట్టి ప్రింట్ చేశాడు. అది జానపద సాహిత్యంలా సరళంగా సూటిగా ఉంటూ నర్మగర్భితంగా ఉంది. సెంటిమెంట్‌తో వండిన కవితలివి. ఎందరినో ప్రభావితం చేశాయి. “take rhetoric and wring its neck” అని తోటికవులను ప్రబోధించాడు. (అలంకార శాస్త్రాన్ని తీసుకొని దాని మెడ పిండండి) అని భావం.

వేర్లేన్ జీవితంలో చివరి పద్దెనిమిది ఏళ్ళు నరకం అనుభవించాడు. చేసిన తప్పులు మనసును కల్లోల పరచాయి. పశ్చాత్తాప దగ్ధుడయ్యాడు. వర్జిన్ గాడ్ ఆఫ్ హెవెన్‌కు గ్రీన్ గాడెస్‌కు మధ్య ఊగిసలాడాడు. టీచర్‌గా పని చేశాడు. కాని పాత తప్పులు కెలికి బాధించారు. రిజైన్ చేశాడు. భూమి పుత్రుడిలా ఉండాలనుకొన్నాడు. కానీ అనుభవం లేదు. ఒకసారి తాగిన మైకంలో తల్లినే బాదిపారేశాడు. అరెస్ట్ చేసి జైల్లో పెట్టారు. విడుదలైన తర్వాత బారు గడపలు తొక్కుతూ తిరిగాడు. జ్ఞానోదయం కలిగింది. ఈ సారి అది పక్కాగా నిలబడింది. కాని వ్యభిచారంలో దిగిపోయాడు. ఈ స్థితిలోను కవితలు రాశాడు. ఏ పబ్లిషర్ కూడా ప్రింట్ చేయటానికి సాహసించలేదు.

'కఫేల చుట్టూ తిరిగాడు. కప్పు కాఫీకి, పెగ్గు డ్రింక్‌కీ, ఒక పోస్టల్ స్టాంప్‌కీ'.

నలభైలలో నరాల బలహీనత వచ్చింది. వాతరోగం వచ్చింది. జుట్టురాలిపోయి బట్టతలయింది. వాగబాండ్‌లా ఉన్నాడని అనటోల్ ఫ్రాంక్ అన్నాడు. అతని పాటలు విలన్ మాటల్లా ఉన్నాయన్నారు. రాసింది ఏదీ క్లిక్ కాలేదు. మరీ దల్ అయ్యాడు. అయినా రాస్తూనే ఉన్నాడు. రాసిన దానికి మెరుగు పెడుతూనే ఉన్నాడు. పబ్లిష్ చేస్తూనే ఉన్నాడు. 'కొంత స్పష్టత కొంత అస్పష్టత, కొంత లోతు, కొంత బోలుతనం ఉండేది. అవే ఆధునిక కవిత్వానికి దారి చూపాయి. తన పందొమ్మిదవ కవితా సంపుటి గురించి కలలు కంటుండగా కిడ్నీ ట్రబుల్, జీర్ణాశయ వ్యాధి వచ్చాయి. చేతిలో పెన్నీ కూడా లేని కడు బీద తనంలో ఉన్నాడు. 8–1–1896లో యాభై రెండేళ్లకే మరణించాడు పాల్ వేర్లేన్. అప్పటికే అందరూ అతన్ని మర్చేపోయారు.

అతను జీవించిన కాలాన్ని "ఫిండీ సీకిల్" అన్నారు. అంటే విలువల పతనకాలం అని అర్థం. అతన్ని శాపగ్రస్త (కర్సేడ్ పోయెట్) అన్నారు. ఇలాంటివారు మలార్మే, రిమ్బాడ్, ఆలీస్ డీ చామ్బెరీర్. వీరంతా కవితా సంప్రదాయాన్ని దిక్కరించినవారే. దానివలన ప్రజల ఆగ్రహ అవమాన అవహేళనకు గురయ్యారు. కాని 1896 "సింబలిస్ట్ మానిఫెస్టో" విడుదల అయిన తర్వాత సింబాలిజం అనే కొత్త మాట ఆవిష్కారమైంది. అదే నూతన సాహిత్య ఉద్యమంగా వచ్చింది. వేర్లేన్, రిమ్బాడ్, మలార్మే మొదలైన వారిని సింబలిస్ట్ కవులుగా గుర్తించారు. వీరంతా కోపెంహాన్ ఈస్తటిక్స్‌ను ఆరాదించినవారే. విల్, అన్ కాన్షస్ మొదలైన పదాలను, సెక్స్ విషయాలను వాడినవారే. డేలిరియం, నార్కొటిక్స్, ఆల్కహాల్ బాధితులే. మిడీవల్ సెట్టింగ్ చూపినవారే.

వేర్లేన్ కవిత్వం సంగీతకర్తలకు బాగా ఉపయోగపడింది. దాన్ని చక్కగా స్వరపరచి వాడుకొన్నారు. కాలం మర్చిపోయిన ఈ కవిని మళ్ళీ కనుక్కున్నారు. అతని వేషం భాష వారికి ఆరాధ్యమైనాయి. అందుకే "ప్రిన్స్ ఆఫ్ పోయేట్స్" అని కీర్తించారు అభిమానులు. "In poetry, the symbolist procedure—as typified by Verlaine—was to use subtle suggestion instead of precise statement (rhetoric was banned) and to evoke moods and feelings through the magic of words and repeated sounds and the cadence of verse (musicality) and metrical innovation.❀



## 25. ఛందశ్శాస్త్రవేత్త - (స్ప్రంగ్ రిథం సృష్టికర్త) జెరార్డ్ మాన్లి హాప్కిన్స్ (1844-1889)

తనకాలంలో గుర్తింపు పొందకపోయినా పుట్టిన వందేళ్ళకు జెసూట్ టీచర్ హాప్కిన్స్ కవి 1930-40- కాలపు రాడికల్ కవులపై తీవ్ర ప్రభావాన్ని చూపాడు. ఈ కవి చనిపోయిన ముప్పై ఏళ్ళ తరువాత కాని అతని కవితలు ప్రచురింపబడలేదు. అందులోని శైలి అందరూ దిగ్భ్రమ చెందారు. ఈ కవి దారిలో ఆడెన్, స్పెండర్ డిలాన్ ధామస్ మొదలైన ఇరవయ్యవ శతాబ్దపు కవులు కవిత్వం రాశారు. చూడగానే ఇంప్రెస్ అయేట్లు ఉండటం ఈ కవిత్వ లక్షణం. రూకాలంకారాలకు పట్టం కట్టాడు. సంక్షిప్త అర్ధంతో కవితలల్లాడు.

హాప్కిన్స్ లండన్‌లోని స్ట్రాఫోర్డ్ ఎసేక్స్‌లో 11-6-1844న పుట్టాడు. పదహారో ఏట కవిత రాసి ప్రైజ్ కొట్టేశాడు. మరో రెండేళ్లకు హీరోయిక్ కప్లేట్స్ రాసి మళ్ళీ ప్రైజ్ నొక్కాడు. వయసు పద్దెనిమిదిలో బాలియోల్ కాలేజిలో చేరి వాల్టర్ పాటర్స్‌లాగా కవిత్వం రాశాడు. అప్పటికే సంగీతం చిత్రలేఖనలలో నైపుణ్యం ఉంది. మతంతో మమేకమయ్యాడు. మత పద్ధతులను అత్యంత భక్తిశ్రద్ధలతో పాటించేవాడు.ఇరవై మూడవ ఏట కేథలిక్ మతాన్ని తీసుకొన్నాడు. కార్డినల్ న్యూమాన్ అయాడు. అప్పటి నుంచి అంకిత భావంతో ప్రీస్ట్‌గా పని చేశాడు. రాసిన కవితలన్నీ తగల బెట్టేశాడు. కవిత్వం ఒక విలాసం అని త్యజించాడు. క్రిస్టల్ ఫీల్డ్ ఆక్స్ ఫర్డ్, డబ్లిన్‌లలో ప్రచారాలు నిర్వహించాడు. నలభై ఏళ్ళు వచ్చాక డబ్లిన్ రాయల్ వర్సిటిలో గ్రీక్ బోధించాడు. మరింత కఠిన నియమాలతో జీవించాడు. మురికి వాడల్లోని జనం జీవన పరిస్థితులకు చలించి అక్కడికి వెళ్లి సేవచేయటం మొదలు పెట్టాడు. ఇక్కడే టైఫాయిడ్ జ్వరం వచ్చి నలభై అయిదవ ఏట 8-6-1889 మరణించాడు.

కవిత్వం మళ్ళీ రాయటం ప్రారంభించాక రాసినది అంతా ప్రకాశ మానంగా రాశాడు. సడలని విశ్వాసం ఆరాధనతో రాశాడు. తన జీవితానికి అన్వయించుకొంటూ

రాశాడు. మానవ ప్రపంచం కాదు ఆయనకు కనిపించింది దైవ ప్రపంచమే. మానవ ప్రపంచంలో భయం, అనుమానం కనిపించాయి. స్నేహితుడు రిచర్డ్ వాట్సన్ డిక్సన్‌కు జాబు రాస్తూ నగర జీవితంలోని పేదల జీవితాలు దుర్భరంగా ఉన్నాయని చలించి పోతున్నానని, తన జాతి పతనం కలవర పరుస్తోందని ఆ శతాబ్దపు నాగరకతలో బోలుతనం గోచరిస్తోందని తెలియజేశాడు. ఆస్థాన కవి అయిన రాబర్ట్ బ్రిడ్జికి ఉత్తరం రాస్తూ త్వరలోనే ఒక మహా విప్లవం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయని తన భావనలు కమ్యూనిస్ట్ భావనలుగా ఉన్నాయేమోనని కాని అది నిజమని, ధనిక దేశమైన ఇంగ్లాండ్ కష్టాలపాలై గౌరవ మర్యాదలు, విజ్ఞానం, సుఖం ఆశలు కోల్పోయి జీవించే రోజులు దగ్గరలోనే ఉన్నాయని చెప్పాడు. అట్టడుగు వర్గాలవారికి విద్య నేర్పకపోతే తాము సర్వనాశనమైపోతున్న విషయం తెలుసుకోలేరని వ్యధ చెందాడు. ఇవన్నీ కాకపోయినా ఇందులో కొన్ని భావాలు కవితల్లో దించాడు. సానేట్స్ రాసి అందులో అనారోగ్య సంతోష విషాదాన్ని రాశాడు. దైవ ప్రపంచాన్ని ప్రస్తుతించాడు. తను రాసినదాన్ని తిరస్కరిస్తారేమోనన్న భయమూ అతన్ని పీడించి ప్రచురించటానికి సాహసం చేయలేక పోయాడు. ఇవన్నీ అద్భుత కవిత్వాన్ని ఆవిష్కరించినవే అయినా చనిపోయేదాకా ప్రచురితానికి నోచుకోలేదు.

భౌతిక వాద విజృంభణ మతపరమైన యదార్ధతల మధ్య అగాధాన్ని గమనించాడు హాప్కిన్స్. తనలోని ఆధ్యాత్మిక వ్యక్తిని జాగృతం చేశాడు. తాను రాసినవి తన సన్నిహిత మిత్రుడు బ్రిడ్జెస్‌కు ఇచ్చాడు. అందులోని కవితాపంక్తుల్ని చదివి దిగ్భ్రమ చెందాడు బ్రిడ్జెస్. "పోయెమ్స్ ఆఫ్ జేరార్డ్ హాప్కిన్స్" పేరుతొ విడుదల చేశాడు. అందులో హాప్కిన్ చెప్పిన "స్ప్రుంగ్ రిధం" గురించి వివరించాడు. హాప్కిన్స్‌కు గొప్ప శ్రోతలు ఉండేవారు. అందులోని చందోరీతుల్ని ఆస్వాదించేవారన్నాడు హాప్కిన్స్. పదమూడేళ్ళ తర్వాతహాప్కిన్ చెప్పినదానిలో సత్యాన్ని యువకవులు గుర్తించారు. రెండవ ఎడిషన్‌లో హాప్కిన్‌ను అర్ధం చేసుకొని స్వాగతించారుజ

"a poetic metre approximating to speech, each foot having one stressed syllable followed by a varying number of unstressed ones" అని స్ప్రంగ్ రిధంను నిర్వచించారు. "the poetical language of an age should be the current language heightened to any degree and unlike itself but not an absolete one" అంటాడు హాప్కిన్స్. తన కవిత్వంలో కొన్ని తప్పులు దొర్లి ఉండవచ్చునని క్రమంగా దోష రహితమై మిల్టన్ శైలిని అందుకొంటుందని రిడ్జేస్‌కు రాశాడు. హాప్కిన్స్ దైవం ఆవహించి రాయలేదు ప్రతీకలో

మునిగి రాశాడు. ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించి భగవంతుని ఉత్కృష్టతను ఆవిష్కరించాడు. ఉదాహరణకు ఒకటి చూద్దాం– “glory be to God for drappled things --For skies of couple color as a brinded cow

for rose moles all in stipple upon trout that swim --fresh fire coal chestrnut falls ,finches wings

land scape plotted and pieced --fold fallow and plough and all trades their gear and tackle and trim” అంతేకాదు మరో కవితలో “man must begin know this ,where nature ends-nature and man can never be fast friends” అని ఆనాడే హెచ్చరించాడు. మెటఫర్‌లను బ్రేకింగ్ పాయింట్ దాకా సాగదీసి వదిలేవాడు హాప్కిన్స్. ఒకోసారి స్విన్ బరన్ కవిని మించిపోయి రాసేవాడు. “I caught this morning morning ;s minion ,king—Dom and day light ;s Dauphin ,dapple dawn drawn falcon in his riding”

1935కు హాప్కిన్ ప్రాముఖ్యం ఏమిటో లోకానికి తెలిసింది. అతని కవితల కొత్త ఎడిషన్ తెచ్చారు. రాసిన ఉత్తరాలను ప్రచురించారు. “ఏ హోప్ ఫర్ పోయిట్రీ”లో సి .డే .లేవిస్ – హాప్కిన్స్ ప్రతిభ ఏమిటో వివరించాడు. “no poet since Donne has drawn his material from so wide a radius. By him the language which his prosody swings to the other extreme, for it is based on the rhythms of common speech. he is a true revolutionary poet”అన్నాడు. హాప్కిన్స్ ది స్వేచ్ఛా స్వరమే కాని హద్దులలోనే ఉంది. ప్రయోగాత్మక కవుల పై అధిక ప్రభావం చూపాడు. వాళ్ళు ఆధునిక కవిత్వాన్ని అతని సంప్రదాయాలను జాతీయాలను చేర్చి పుష్టి కలిగించారు. అతనిప్రయోగాలు మరింతా లోతుగా అన్వేషించటానికి తోడ్పడ్డాయి. అందుకే ఆ తరంలో పూర్వీకుడిగా హాప్కిన్స్ జేజేలు అందుకొన్నాడు. మరింత సరళీకృత కవిత్వ భాషకు నాందిపలికాడు. అతను వాడిన ఆడంబర పదజాలం నేడు అత్యవసరం, తప్పనిసరి అయ్యాయి. భావోద్రేకాల పొంగుకు అతనికవిత్వం నిలయమైంది. రచయిత లూయీ అంట ర్ మేయర్ “the world was prodigal with vision. Nature was a divine turmoil and God an eternal exuberance”అని చెప్పిన మాటలు పూర్తి యదార్థం.❁




## 26. సాంస్కృతిక విమర్శక శిఖామణి ఫ్రీడ్రిక్ నీషె (Friedrich Nietzsche) (1844 -1900)

ఫిలాసఫర్ అని అందరూ ఆయన్ను అన్నా, నీషే విశ్వవ్యాప్త దార్శనికుడు. సామాన్య మానవుని అంతం దగ్గరపడిందని చెప్పినవాడు. సూపర్మాన్ ఆవిర్భావం తప్పదన్నవాడు, పెద్ద అరిస్టాక్రాటిక్‌గా ప్రపంచాన్ని యేలినవాడు. జీవితం అంటే అంతా చెడ్డదే అని విషాదాంతమని నమ్మినవాడు. ఏ క్షణానికి ఆక్షణం మనిషి హీరోగా పాత్ర పోషించాలనేవాడు.

జర్మనీ దేశంలో ఫ్రీడ్రిక్ వీల్ హెల్మ్ నీషే. సంప్రదాయ మతాను సరణ మధ్య తరగతి కుటుంబం లోరాకేన్‌లో 15-10-1844న రాజుగారి పుట్టిన రోజున జన్మించాడు. ఇది పర్శ్యన్ భాగంలోని సాక్సనీలో ఉంది. తండ్రి లూథరన్ పాస్టర్‌కు పెద్దకొడుకు. తండ్రి రాజుగారిపేరు ఫ్రీడ్రిక్ వీల్ హెల్మ్‌ను కొడుక్కి పెట్టి ఆ రోజున పెద్ద ఉపన్యాసమిచ్చాడు. ఇతని చెల్లెలే నీషే జీవిత చరిత్ర రాసిన ఎలిజబెత్.

పుట్టిన అయిదేళ్లకే తండ్రి చనిపోగా కుటుంబం నాంబర్గ్ చేరింది. ఇక్కడ అతని జీవితం మంచి పవిత్రులైన తల్లి అమ్మమ్మ చెల్లెలు ఇద్దరు మైడన్ స్త్రీల మధ్య గడిచింది. ఇతని పూర్వీకులు సాధారణ జీవితం గడిపినవారే. కాని తాను పోలిష్ నీషా అరిస్టాక్రాటిక్ వంశానికి చెందిన వాడిని అని చెప్పుకొనేవాడు. జర్మనీ తన మాతృదేశమని కారణం అందులో పోలిష్ రక్తం కలిసి ఉందని చెప్పేవాడు. మధ్యవయసులో పోలులతో పోల్చుకోనేవాడు. వీరు కేథలిక్ దేశంలో ప్రొటేస్టంట్‌లుగా జీవించారని గర్వించేవాడు.

బాలమేధావి అయిన నీషే నాలుగేళ్ళకే చదవటం, అయిదుకు రాయటం, ఆరేళ్ళకు బీథొవెన్ స్వరాలు పాడటం చేశాడు. పదేళ్లలోపే మత కవిత్వం రాశాడు. పియానోలతో సంగీత స్వరాలు కట్టాడు. వీధిబడిలో చదవటానికి వెళ్ళినప్పుడు నీషెను తోటిపిల్లలు “లిటిల్ పాస్టర్” అనేవారు. బైబిల్‌లోని కొన్ని అధ్యాయాలపై చర్చ చేసేటప్పుడు అక్కడి టీచర్లకు పన్నెండేళ్ళ జీసస్ లాగా అనిపించేవాడు. తోటిపిల్లలు శుద్ధశుంఠలని తనకు

సరిజోడు కాదని భావించి స్నేహం చేసేవాడు కాదు. అతని ప్రవర్తన అందరికి ఆశ్చర్యం వింత గొలిపాయి. పద్నాలుగేళ్ళ వయసులో ఫోర్టా బోర్డింగ్ స్కూల్‌లో చేరి ఫైలాలజి, వాగ్నేర్ మ్యూజిక్ లమీద దృష్టి పెట్టాడు. ఈ రెండు తనని అమితంగా ప్రభావితం చేశాయి. మత గ్రంథ రచనపై ఆసక్తి పెంచుకొన్నాడు. ఆరేళ్ళ తర్వాత బాన్ యూనివర్సిటిలో చేరి కొద్దికాలం చదివి అక్కడి కుర్రకారు విలాస జీవితాన్ని చూసి దూరంగా ఉన్నాడు. తాగుడు సిగరెట్‌లకు అలవాటుపడ్డాడు. ప్రేమలో పడ్డాడు, వలచాడు వలపించాడు. వ్యభిచార గృహాలను పావనం చేశాడు. తిరుగుబోతు తాగుబోతు అనిపించుకొన్నాడు. ఒక వేశ్యా గృహానికి వెళ్ళినప్పుడు అతనికి శారీరక మానసిక వికాసం కలిగింది. ఇరవై అయిదు వయసులో సుఖవ్యాధి అంటుకొని బాగ ఏడిపించింది. త్వరలోనే దీనినుండి విముక్తి పొందాడు.

మొదటినుంచి కంటిచూపు సరిగ్గా ఉండేది కాదు. కాంతి పడేదికాదు కళ్ళకు. సూర్యకాంతిలో మసకగా తలదిమ్ముగా ఉండేది. లేత చీకటిలో బాగా పని చేయగలిగే వాడు. ఏది చేసినా కళ్ళకు శ్రమ అనిపించేది. కనుక ఒక రుషి జీవితం అలవాటు చేసుకొన్నాడు. తాగుడు స్మోకింగ్ పూర్తిగా వదిలేశాడు. పుస్తకాలలో మునిగి తేలేవాడు. ఇది తలనెప్పి తెచ్చేది. ఇరవై ఒకటవ సంవత్సరంలో లీప్జిగ్ యూనివర్సిటికి బదిలీ అయ్యాడు. కోపెన్ హార్‌ను ఆవిష్కరించాడు. "ది వరల్డ్ యాజ్ ఐ విల్ అండ్ ఐడియా'' చదివాక పూర్తిగా మారిపోయాడు. దాన్ని పదే పదే చదివాడు. జీర్ణించుకొన్నాడు. కోపెంహార్ తనకోసమే రాసినట్లు తనతో మాట్లాడుతూ చెప్పినట్లు అనిపించింది. అతన్ని స్వయంగా దర్శించిన అనుభూతి పొందాడు. జీవితంలో మొదటి స్వానుభవం అనేక భావాలకు దారితీస్తుంది అనుకొన్నాడు. పుస్తకం చదివి ఆనందం పట్టలేక అరిచాడు, కేకలు పెట్టాడు. మనసు మనిషిని ఉత్థానానికి తీసుకు వెడుతుంది.

ఇరవై నాలుగవ ఏట వాగ్నర్‌ను కలుసుకొన్నాడు. అతనిలో కోపెంహార్‌ను దర్శించాడు. అతని కలల ప్రతిరూపమే వాగ్నర్ అనిపించింది. అప్పటికే ముసలివాడైన వాగ్నర్‌కు శిష్యుడైనాడు. ఇద్దరూ కలిసి స్విట్జెర్లాండ్‌లో తిరిగారు. 1867లో బెసెల్ యూనివర్సిటిలో క్లాసికల్ భాషలకు అధిపతి అయ్యాడు. నీషే రాసిన మొదటి పుస్తకాన్ని గురువు వాగ్నర్‌కు అంకితమిచ్చాడు. దీని పేరు "ది బర్త్ ఆఫ్ ట్రాజెడి ఫ్రం ది స్పిరిట్ ఆఫ్ మ్యూజిక్". నీషే వేదాంతం బాగా ప్రాచుర్యం పొందాక దీనికి "హెలినిజం అండ్ పెసిమిజం" అని పేరు మార్చాడు.

కోపెంహార్ సిద్ధాంతాన్ని తన సిద్ధాంతంలో పొదిగాడు. "the more knowledge the more virtue" అన్నది ఆయన సిద్ధాంతం. వాగ్నర్ సంగీత రూపకాలలో పురాతన గ్రీకు ట్రాజడీలను చూశాడు. గ్రీకు డయోనేషియాస్ సింబాలిజం కంటే గొప్ప సింబాలిజం లేదన్నాడు. క్రిష్టియానిటి వలన నైతిక పతనం వచ్చింది అంటాడు.

ఈ భావనలతో క్రైస్తవ పెద్దలు ఎదురు తిరిగి అతని ప్రొఫెసర్ పదవి మంగళం పాడించారు. ముప్పైవ ఏట నీషే వ్యక్తిగా గొప్ప మార్పు చెందాడు. మనిషిలోను మార్పు వచ్చింది. అతను ఏ విషయంపైనా చెప్పిన మాట చివరిది అంతిమ నిర్ణయమే అయి గౌరవం పొందింది. 1970 ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంలో నీషే ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. అమ్బులన్స్ డ్యూటీ చేసేవాడు. న్యుమోనియా వచ్చింది. మత్తుమందుకు బానిసయ్యాడు. సిఫిలిస్ తగ్గిన తర్వాత ఏదో ఒక జబ్బు వెంటాడింది.

యూనివర్సిటి నుంచి కొద్ది పెన్షన్ వచ్చేది. దానితోనే గడిపాడు, తిరిగాడు, రాశాడు. ఒక రష్యన్ ఫిన్నిష్ అమ్మాయితో ప్రేమలో పడ్డాడు. పెళ్లి చేసుకొందామనుకొన్నాడు, కాని ఆమె కాదని అంది. "కలిసిఉందాం" అన్నాడు. తనను కాదన్న వారంటే అతనికి కోపం. భరించలేక పారి పోయిందామె. అలాగే వాగ్నర్‌తో సంబంధమూ బెడిసింది. అతను చేసిన "ది రింగ్ ఆఫ్ ది నీబెలాంగ్" గొప్ప విజయం సాధించింది. వాగ్నర్ కొత్త సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నాడను కొన్నాడు. అతనిపై ద్వేషం పెరిగింది. దీన్ని "ది కేస్ ఆఫ్ వాగ్నర్", "ది ట్విలైట్ ఆఫ్ ది గాడ్స్", "నీషె కాంట్రా వాగ్నర్" రచనల్లో వెళ్ళ గ్రక్కాడు.

నలభైవ ఏట "అన్ టైమిలీ థాట్స్", "హ్యూమన్ ఆల్ టూహ్యూమన్", "ది డాన్ ఆఫ్ ది డే", "ది జాయ్ ఫుల్ సైన్స్", "దస్ స్పోక్ జొరాస్ట్ర" గ్రంథాలు రాసి ప్రచురించాడు. ఇవి బాగా ప్రసిద్ధి చెందాయి. తర్వాత "బియాండ్ గుడ్ అండ్ ఈవిల్". "ది జీనాలజి ఆఫ్ మోరల్స్" స్వీయ చరిత్రగా "ఈకే హోమో" రాశాడు. చనిపోయాక ప్రచురితమైన గ్రంథం "ది యాంటి క్రైస్ట్అండ్ ది విల్ టు పవర్". దీనికి "హౌ టు ఫిలాసఫైజ్ విత్ హామర్" అని టాగ్ తగిలించాడు. వచ్చే రెండు శతాబ్దాల చరిత్ర రాయాలను కొన్నాడు.

నీషేకి నలభై అయిదవ ఏట అకస్మాత్తుగా జబ్బు చేసింది. వీధిలో కూలిపోయాడు. బెసేల్ హాస్పిటల్‌లో చేర్చాడు. తర్వాత జేనాలో శరణాలయంలో చేర్చారు. మెదడు దెబ్బతిన్నా ఒక ఏడాది జీవించాడు. తల్లి, చెల్లి వచ్చి కనిపెట్టుకొని ఉన్నారు. వాళ్ళ ముఖాలలో విచారం చూసి ఏడవటం దేనికి సుఖంగా లేమా అని అడిగాడు. 25-8-1900లో యాభై ఆరవ ఏట నీషే మరణించాడు. నీషే చెప్పిన విల్ టు పవర్‌కు ప్రేరణ పొంది, హిట్లర్ రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభించాడు. ఈ యుద్ధం వస్తుంది అని నీషే ముందే ఊహించి చెప్పాడు. "within fifty years the governments will clash in a gigantic war for the markets of the world. "the blond beasts, the race of conquerors and masters, shall rise again from the ashes of men --they shall rise in mightier more deadly form" అని చెప్పిన దార్శనికుడు నీషే.

రచయితగా జర్మనీలో ఉత్తమ సృజనకర్తన్నారు. కొందరు బ్రూటల్‌గా పొగరుబోతు

తనంగా రాశాడు అన్నారు. జొరాష్ట్ర పుస్తకానికి "ఏ బుక్ ఫర్ ఎవిరి వాన్ అండ్ నో వన్" అని ఉప శీర్షిక పెట్టాడు. జీవిత చివరిభాగంలో నీషే అదృష్టం వక్రించింది. కాని చనిపోయాక మళ్ళీ ప్రాభవం పొందాడు. క్రిస్టియానిటీలోని బానిస నైతికతను ఎదిరించాడు. "blood is the spirit of man. Of all that is written, I love only that which is written in blood" అన్నాడు నీషే. ఆధునిక యాంత్రికత మనిషిని పశువును చేస్తుందని దానిపై నియంత్రణ ఉండదని కనుక తస్మాత్ జాగ్రత అని ముందే చెప్పాడు నీషే.

స్లేవ్ మొరాలిటి శూన్యవాదానికి దారితీస్తుందన్నాడు నీషే. బానిసపై యజమాని పెత్తనాన్ని సమర్ధించాడు. అతని గాడ్ ఈజ్ డేడ్‌లో నిరీశ్వర వాదం ఉంది. పాసివ్ నిహిలిజంను సమర్ధించాడు. "A nihilist is a man who judges that the real world ought not to be, and that the world as it ought to be does not exist. According to this view, our existence (action,suffering, willing, feeling) has no meaning: this' 'in vain', 'is the nihilists' pathos—an inconsistency on the part of the nihilists.

—Friedrich Nietzsche, KSA 12:9 [60], taken from The Will to Power, section 585, translated by Walter Kaufmann

For it was Nietzsche's historic achievement to understand more clearly than any other philosopher...not only that what purported to be appeals of objectivity were in fact expressions of suCritique of mass culture[edit]

Friedrich Nietzsche held a pessimistic view on modern society and culture. His views stand against the concept of popular culture. He believed the press and mass culture led to conformity and brought about mediocrity. Nietzsche saw a lack of progression, leading to the decline of the human species. According to Nietzsche, individuals needed to overcome this form of mass culture. He believed some people were able to become superior individuals through the use of will power. By rising above mass culture, society would produce higher and healthier human beings. bjective will, but also the nature of the problems that this posed for philosophy.[1] దాదాపు ఇరవై గ్రంథాలు రాశాడు నీషే.❁



## 27. అమెరికన్ ఇన్వెంటర్ - థామస్ ఆల్వా ఎడిసన్ (1847-1931)

**ఇన్వెంటర్ బిజినెస్ మాన్**

తనకాలపు మేదావులకన్నా గొప్పవాడు కాకపోయినా కాలంతో చక్కగా శ్రుతికలిపిన శాస్త్రవేత్త, పరిశోధకుడు, పక్కా వ్యాపారి థామస్ ఆల్వా ఎడిసన్. అతని పరిశోధనా ఫలాలు నూతన పారిశ్రామికాభివృద్ధికి అనేక క్షేత్రాలలో ప్రతిఫలించాయి. కాంతికే వెలుగునిచ్చి ఎలక్ట్రిక్ బల్బ్‌ను కనుక్కొని ధ్వని రికార్డింగ్ యంత్రాన్ని తయారుచేసి కొత్త పుంతలు తొక్కాడు. ఫలితాలను స్వర్గంలో ఉండి చూసుకోకుండా భూమిపై జీవించి ఉండగానే చూసుకొని ఆనందించిన అరుదైన శాస్త్రజ్ఞుడు. చనిపోయే నాటికి అయన కనిపెట్టిన అనేకానేక పరిశోధనల వలన పొందిన దనం లెక్క వేస్తె కళ్ళు మిరుమిట్లు గొలిపే 25.683,544.343 డాలర్లు అని తెలిస్తే గుండె ఆగిపోతుంది. సైన్స్‌తో అంత గొప్పగా వ్యాపారం చేయగల సమర్ధుడు అని ఆశ్చర్యపోతాం. ఎడిసన్ మెదడు సాధించిన చారిత్రాత్మక ఘన ధన విజయం ఇది. అనితర సాధ్యం చేశాడు.

**కుటుంబ నేపధ్యం**

ఎడిసన్ కుటుంబం వారు అమెరికన్ రివల్యూషన్ ముందు నుంచే అమెరికాలో ఉన్నారు. సామ్యూల్ ఎడిసన్ డచ్ వాడు, అతని పూర్వీకులు కాలనీ రాష్ట్రాలకు చెందిన హాలండ్ దేశీయులు. ముందుగా కెనడా చేరారు. ఈరీ సరస్సు ఉత్తర భాగంలోని వియన్నాలో సామ్యూల్ ఉండేవాడు. అప్పుడే స్కాటిష్ జాతికి చెందిన నాన్సీ ఇలియట్‌ను పెళ్లి చేసుకొని హోటల్ కీపర్‌గా ఉన్నాడు. ప్రజా సంబంధాలు బాగా ఉన్న వ్యక్తి . కనుక రాజకీయాలలోకి లాక్కు రాబడ్డాడు. తీవ్రవాది అవటం వలన రాడికల్ రిఫార్మ్ కోసం ప్రయత్నించాడు. ఇది కెనడా ప్రభుత్వానికి ఇబ్బంది కలిగించింది. తీవ్రవాదులను కట్టడి చేసే ప్రయత్నం చేస్తుండగా నెమ్మదిగా ఎవరికీ తెలియ కుండా సరిహద్దు దాటి

1842లో అమెరికాలోని ఒహాయోలోని మిలన్ సిటీలో స్థిరపడ్డాడు. చిన్నా చితకా వ్యాపారాలు చేసి డబ్బు సంపాదించి కెనడాలో ఉన్న భార్యకు పంపేవాడు.

**ఎడిసన్ బాల్యం**

ఎడిసన్ కుటుంబంలో చివరివాడుగా ఆల్వా ఎడిసన్ మిలన్‌లో 11-2-1847 జన్మించాడు. రివల్యూషనరీ వార్‌లో పని చేసిన ముత్తాత పేరైన థామస్‌ను ఇతనికి పెట్టారు. అతని తల్లిని కెనడా నుంచి ఒహాయో చేర్చిన కెప్టెన్ ఆల్వా బ్రాడ్లీ కి కృతజ్ఞతగా ఆల్వా పేరునూ చేర్చారు. ఎడిసన్ పుట్టేనాటికి తండ్రికి నలభై మూడు తల్లికిముప్పై ఏడు వయసు ఉంది. మంచి కుటుంబ వాతావరణంలో పెరిగాడు. తల్లి ఈ చిన్ని కొడుకు అవసరాలు బాగా తీర్చేది. ఇతని ఏడవ ఏట కుటుంబం మిచిగాన్‌లోని పోర్ట్ హర్టన్ చేరింది. అక్కడ లంబర్ బిజినెస్ బాగా కలిసి వచ్చింది. కొత్త విశాలమైన భవంతి తీసుకొని ఉన్నారు. కొడుకును స్కూల్‌కు పంపారు. అందరికంటే కొడుకు బాగా చదివి వృద్ధిలోకి రావాలని ఆశించారు తల్లి తండ్రి. స్కూల్‌లో మనవాడు "కలల బేహారి"గా కనిపిస్తే చదువు మీద శ్రద్ధ లేదనుకొన్నాడు టీచర్.

**ప్రధమ గురువు తల్లి**

వెంటనే స్కూల్ మాన్పించేసింది తల్లి. కొడుకును దగ్గరే పెట్టుకొని అతనికి కావలసిన చదువు తానే నేర్పింది. ఇష్టపడి అతనూ నేర్చుకొన్నాడు. ఆమె నేర్పిన దాని ప్రభావం వల్ల టాం పన్నెండో ఏటికే గిబ్బన్ రాసిన "డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ రోమన్ ఎంపైర్", బర్టన్ రచన "అనాటమీ ఆఫ్ మెలాస్కలి" చదివి జీర్ణం చేసుకొన్నాడు. "డిక్షనరీ ఆఫ్ సైన్సెస్" చదివి ప్రయోగాలు చేసేవాడు. బాగానే కాకుండా వేగంగా చదవటం ఆల్వా అలవాటు చేసుకొన్నాడు. సాధారణంగా అందరూ ఒక లైన్ చదివి అర్థం చేసుకొంటే, అదే సమయంలో పేజీలోని పదార్థ సారాన్ని జీర్ణించుకొన్న మేధావి. చదివింది ఏదీ మర్చిపోయే వాడు కాదు. ఎప్పుడు ఏది కావాలన్నా వెంటనే స్పురణకు తెచ్చుకోగల అపూర్వ జ్ఞాపక శక్తి ఎడిసన్‌కు అలవడింది.

**సేల్లారే పరిశోధన శాల - మోడల్ యంగ్ హీరో**

చదువుతోబాటు ప్రయోగాలూ సాగించి వాటి ఫలితాలూ వెంటనే పొందేవాడు. ఒకసారి స్నేహితుడికి గాలిలో ఎగరటం కోసం అధిక డోసులో "సీడ్లిట్జ్ పౌడర్" ఇచ్చాడు. అది గాస్‌ను సృష్టించి గాలిలో ఎగరటానికి తోడ్పడుతుందని నమ్మాడు. టీన్ ఏజ్‌లోనే సెల్లార్‌లో షెల్ఫ్‌లో గ్లాసులు, సీసాలు, డబ్బాలు వగైరా పెట్టి అదే తన లాబ్ అని

చెప్పేవాడు. అక్కడే ప్రయోగాలు పరీక్షలు చేసేవాడు. పరిశోధన అని చెప్పేవాడు. ఇదే తర్వాత ఊహించని శాస్త్ర బిజినెస్‌కు రాచబాట వేసింది. ఇంకా బోలెడు పుస్తకాలు, సామాన్లు అవసరమనిపించాయి. దీనికి డబ్బుకావాలి కనుక తాను బిజినెస్ ప్రారంభిస్తున్నానని తలిదండ్రులకు చెప్పాడు. వాళ్ళు ఇచ్చిన డబ్బుతో డబ్బు రాబట్టే పనులు ప్రారంభించాడు. పదమూడవ ఏట పేపర్లు వేసే కుర్రాడిగా, కాండీ బుచర్‌గా పని చేశాడు, పోర్ట్ హర్టన్ నుంచి డెట్రాయిట్ దాకా రైల్లో పిప్పరమెంట్లు అమ్మాడు. సెకండ్ హాండ్ ప్రింటింగ్ ప్రెస్ కొని వార్తలు సేకరించి అచ్చువేసి అమ్మాడు. పోర్ట్ హర్టన్‌లో ట్రక్ గార్డెన్ పెట్టి తనకింద కొంత మంది కుర్రాళ్ళను నియమించుకొని బిజినెస్ చేశాడు. ఇప్పటికే అతడు "విజేత" అనిపించుకొన్నాడు. హొరాషియో ఆల్గేర్‌కు ఎడిసన్ "మోడల్ యంగ్ హీరో"గా అనిపించాడు.

**కుర్ర బిజినెస్ మాన్ - సాహసమే ఊపిరి**

ఎడిసన్ "డబ్బు ను మంచి జాగ్రత్త అయిన ఆలోచన చేసి సంపాదించవచ్చు" అని చెప్పాడు. అమెరికన్ సివిల్ వార్‌లో వార్తా పత్రికల హాట్ హాట్ కథనాలకు గిరాకీ పెరిగింది. డెట్రాయిట్ ఫ్రీప్రేస్‌కు వెళ్లి తనకు వెయ్యి కాపీలు కావాలని కోరాడు. వాళ్ళు ముక్కున వేలేసుకొన్నారు. ఒప్పుకొని ఇచ్చారు. తన టెలిగ్రాఫ్ మిత్రులకు ముందే సందేశాలు పంపి రైల్వే స్టేషన్‌లలో నోటీసులు అంటించమన్నాడు. యుద్ధం మొదటి రోజు వార్తలను కవర్ చేసిన పేపర్లను ట్రెయిన్‌లో తెచ్చి అన్ని స్టేషన్లలోను జనాలకు అందజేశాడు. జనం విరగబడి స్టేషన్లకు చేరారు. ఒక నికెల్ ఉన్న రేటును పది సెంట్లు చేసి పేపర్లు అమ్మాడు. డిమాండ్‌ను బట్టి పదిహేను సెంట్లు తర్వాత పాతిక సెంట్లకు అమ్మాడు. చివరికి ముప్పై అయిదు సెంట్లకు అమ్మాడు. ఒక్కరోజులోనే వంద డాలర్ల లాభం సాధించాడు పదిహేనేళ్ళ కుర్ర బిజినేస్ మాన్ ఎడిసన్.

**రైలు పెట్టే ప్రయోగశాల**

టెలిగ్రఫీ నేర్చినందుకు ఈ బిజినెస్ గొప్పగా చేయగలిగానని చెప్పాడు ఎడిసన్. ఇతని సాహస గాథలు కథలు కథలుగా చెప్పుకొన్నారు. ఒకసారి మౌంట్ క్లిమేన్స్ స్టేషన్‌లో ఉండి స్టేషన్ మాస్టర్‌తోనూ టెలిగ్రాఫర్‌తోను మాట్లాడుతున్నాడు ఎడిసన్. ఇంతలో టెలిగ్రాఫర్ మెకంజీ కొడుకు ట్రాక్‌కు అడ్డంపడి వస్తున్నాడు అప్పుడే ఒక బాక్స్ కార్ వస్తోంది ట్రాక్ మీద. అకస్మాత్తుగా ప్లాట్ ఫాం నుంచి కిందికి దూకి ఆ కుర్రాడిని ఎత్తుకొని పరిగెత్తుకొచ్చి ప్లాట్ ఫాంపైకి చేర్చాడు. కాని ఆ కారు ఎడిసన్ భుజాలు ఒరుసుకుకుంటూ పోయింది. మెకంజీ కృతజ్ఞత చెప్పి తనకు టెలిగ్రాఫ్ ఆపరేషన్

పూర్తిగా రాదనీ ఒప్పుకొని నేర్పమని బ్రతిమిలాడాడు. దీనికి ముందు మరో సంఘటన జరిగింది. రోజూ జర్నీ చేసి ట్రెయిన్‌లో రాత్రికిపోర్ట్ హర్టన్‌లోని ఇంటికి చేరుకోనేవాడు. ట్రెయిన్ అతని రెండవ ఇల్లు అయింది. ఒక సంచిలో ప్రయోగ సామగ్రి పెట్టుకొని ట్రెయిన్ ఎక్కేవాడు. ఎక్కడ ఒక అరగంట ఖాళీ దొరికితే అక్కడే టెస్ట్ ట్యూబులతో ప్రయోగాలు చేసేవాడు. ఒకసారి ఆసిడ్స్‌తో ప్రయోగం చేస్తే మంటవచ్చి ప్రయాణించే కార్ తగలబడింది. కండక్టర్ తంటాలుపడి నిప్పునార్పి చెవులు పిండి బుద్ధి చెప్పాడు. ఇదే మొదటి చెవి గాయం జీవితంలో. ఇంకోసారి కూడా రైల్ ప్రయాణంలోనే జరిగింది. ఒకసారి ఒక స్టేషన్‌లో దిగి పేపర్లు అమ్ముతుండగా రైలు బయల్దేరే విజిల్ వేశారు. బండి కదిలింది. పరిగెత్తి ఎక్కబోయాడు. ఒక బాగర్ కార్ అటెండెంట్ ఎడిసన్ చెవులు పట్టుకొని రైలు ఎక్కించాడు. చెవులకు పెద్దగాయమే అయింది. నయమైనా వినికిడి తగ్గినట్లని పించింది క్రమంగా చెవిటి వాడయ్యాడు.

### సంచార ఉద్యోగ జీవితం

బుర్రనిండా సంపాదనా పరమైన ఆలోచనలే ఎడిసన్‌కు. పదహారవ ఏటనే బాగా పరిణతి చెందాడు. స్వతంత్రంగా ఆలోచించటంలో దిట్ట అనిపించాడు. టెలిగ్రాఫ్ ఆపరేటర్‌గా విజయాన్ని సాధించి కెనడాలో మొదటిసారిగా ఉద్యోగంలో చేరాడు. కష్టపడి పని చేసేవాడు. తీరిక లేకుండా వ్యాపకంలో ఉండేవాడు. తరువాత అయిదేళ్ళు సంచార జీవితమే. ఏదో ఒక ప్రదేశానికే పరిమితమై పని చేయటం నచ్చక చాలా ఉద్యోగాలు కోల్పోయాడు. ఎక్కడ ఏపనిలో ఉన్నా సైంటిఫిక్ పరిశోధనలు మాత్రం మానలేదు. అతని ఉద్యోగేతర వ్యాపకాల వలన అర్ధ రాత్రి దాకా మేల్కొని పని చేసేవాడు. మనుషులు నిద్రతోనే ఎక్కువ కాలం గడుపుతున్నారని కామెంట్ చేసేవాడు.

### నైట్ షిఫ్ట్ ఉద్యోగం

వయసు ఇరవై ఒకటి వచ్చింది. తిరిగింది ఇక చాలులే అనుకొన్నాడు. జీవితాన్ని మలుపు తిప్పుకోవాలని నిర్ణయించుకొన్నాడు. బోస్టన్ చేరి అక్కడే ఎక్కువ కాలం ఉన్నాడు. వెస్టెన్ యూనియన్ టెలిగ్రాఫ్ ఆఫీస్‌లో నైట్ షిఫ్ట్ డ్యూటీలో చేరాడు. పగలంతా ఒక అద్దె గదిలో లాబ్ ఏర్పాటు చేసుకొని పరిశోధనలు చేశాడు. కాసేపు ఖాళీ దొరికితే కునుకు తీసేవాడు. ఆ రోజుల్లో రోజుకు నాలుగు గంటలే ఎడిసన్ నిద్ర పోయేవాడు. టెలిగ్రాఫ్ పరికరాలను ఎన్నిటినో తయారు చేశాడు. కాని ఇది ఎవరికీ పట్టేది కాదు.

**వోట్ రికార్డింగ్ మెషిన్**

ఇది కాదనుకొని వోట్‌లను రికార్డ్ చేసే యంత్రాన్ని స్వయంగా కనిపెట్టాడు. 1868లో మొదటిసారిగా దీనికి పేటెంట్ హక్కు పొందాడు. అమెరికన్ కాంగ్రెస్ దీన్ని కొంటుందేదేమో అనే ఆశతో వాషింగ్టన్ వెళ్లి కమిటీ ముందు దాన్ని ప్రదర్శించి చూపించాడు. దాని అవసరం తమకు లేదని వాళ్ళు తేల్చి చెప్పారు. అధికారులకు పని కొచ్చేవి చేసేదానికంటే ప్రజలకు బాగా ఉపయోగపడేవి తయారు చేయాలని నిశ్చయించుకొన్నాడు. న్యూయార్క్ వెళ్ళాడు.

**న్యూయార్క్ లో ఫోర్మన్ జీవితం**

న్యూయార్క్‌లో ఎడిసన్ కాలు పెట్టేసరికి జేబులో పెన్నీ కూడా లేదు. అతని టెలిగ్రాఫ్ మిత్రులు ఒక డాలరు అప్పు ఇచ్చారు. దానితో గోల్డ్ ఇండికేటర్ కంపెనీలో బాటరీ రూమ్‌లో ఉన్నాడు. ఈ కంపెనీ గోల్డ్ మార్కెటింగ్ చేసేది. ఎప్పటికప్పుడు గోల్డ్ రేట్ నుస్టాక్ బ్రోకర్లకు కోట్ చేసే కీబోర్డ్‌ను వైర్ సిస్టంతో పని చేయించేవారు. ఒకసారి టాం గోల్డ్ ఇండికేటర్ ఆఫీసులో ఉన్నాడు. అనుకోకుండా ఆ మెషిన్ పని చేయటం ఆగిపోయింది. ఎక్కడ లోపం ఉందో ఎవరూ కనిపెట్టలేక పోయారు. ఎడిసన్ ఆ కంపెనీ ప్రెసిడెంట్ దగ్గరకు వెళ్లి మెషీన్‌లో లోపం ఎక్కడ ఉందో తాను కనిపెట్టగలనని చెప్పాడు. "అయితే ఏదు వెంటనే" అన్నాడు కట్ అండ్ డ్రైగా. కంపెనీ ఇంజినీర్ల బుర్రలకు, కళ్ళకు కనిపించని లోపం టాం కు కనిపించింది. అందులో రెండు గేర్ వీల్స్‌ను కలిపే ఒక స్ప్రింగ్ విరిగి పడిపోయిందని తెలుసుకొన్నాడు. దాన్ని మార్చి మెషీన్ పని చేసేట్లు చేసి టికర్‌లు మళ్ళీ పని చేసేట్లు చేశాడు. అంతే ఎడిసన్‌ను ఆ కంపెనీ ఫోర్‌మన్‌గా వెంటనే నియమించాడు ప్రెసిడెంట్. నెలకు మూడు వందల డాలర్లు జీతం.

**అవాక్కు చేసిన యంత్రం ధర**

ఈ జీతంతో వర్క్ షాప్, దానికి కావాల్సిన పరికరాలకు ఖర్చు చేశాడు. అతని ఉద్దేశ్యం ఈ మొత్తం టికరింగ్ సిస్టంను సమూలంగా మార్చాలని ఉండేది. ఉద్యోగానికి గుడ్ బై చెప్పి స్వంతంగా ఈ యంత్ర నిర్మాణం పై దృష్టి పెట్టాడు. వాల్ స్ట్రీట్ పత్రిక కొద్దిమార్పులతో ఇదే యంత్రాన్ని వాడింది. టాం తాను తయారు చేసిన యంత్రాన్ని పాత యజమానికి అమ్మాలని వెళ్ళాడు. ధర ఏంతో చెప్పమని అడిగితే మనవాడు నత్తురు నత్తురు మన్నాడు. అయిదు వేలా లేక మూడు వేలు చెప్పాలా అని సందేహిస్తూ ఉంటే కంపెనీ యజమాని "నలభై వేల డాలర్లు ఇస్తాను నీకు సంతృప్తేనా?" అన్నాడు.

అవాక్కైన ఎడిసన్ నోట మాట పెగల్లేదు. అప్పటికి ఈకుర్ర సైంటిస్ట్ వయసు ఇరవై రెండు మాత్రమే.

### పరిశోధనా పరమేశ్వరుడు - 122 పేటెంట్ హక్కులు

ఈ డబ్బుతో ఒక ప్లాంట్‌ను నిర్మించి స్టాక్ టికరింగ్ యంత్రాల ఉత్పత్తి ప్రారంభించాడు. ఈ యంత్రంపై క్రేజ్ పెరిగి విపరీతంగా ఆర్డర్లు వచ్చాయి. అన్ని యంత్రాలు తయారు చేయటానికి తగిన స్టాఫ్‌ను పెట్టుకొని పగలు రాత్రి షిఫ్ట్‌లు పని చేయించి అందజేశాడు. అతను ఎంతకష్టపడినాడో, ఎన్ని గంటలు నిద్రపోయాడో తెలియదుకాని, అతని సృజనలు తామర తంపరగా రాసాగాయి. 1876కు ఎడిసన్ ఏకంగా 122 పరికరాలకు పేటెంట్ హక్కులు పొంది అందర్నీ ఆశ్చర్యపరచాడు. ఇతని జీవిత చరిత్ర రాసిన గార్డెన్ గార్బెడియన్స్ చెప్పినదాని ప్రకారం ఒకే సమయంలో ఎడిసన్ 45 వేర్వేరు సృజనల మీద దృష్టి పెట్టి పని చేశాడు. ఇది సామాన్య మానవులకు అందుబాటులో ఉండే విషయం కాదు. దటీజ్ ఎడిసన్. పరిశోధనా పరమేశ్వరుడు అనిపించాడు. టెలిగ్రఫీ పని విధానంలో కూడా అనేక పరిశోధనలు చేశాడు.

### లక్ష డాలర్లు - టెలిఫోన్ యుద్ధం

ఇరవై నాలుగవ ఏట ఎడిసన్ మేరీ స్టిల్ వెల్ అనే లాబ్ అసిస్టంట్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఎన్నో ఇన్వెన్షన్లు చేసి రికార్డ్ సృష్టించిన ఎడిసన్ ముగ్గురు పిల్లల్ని కన్నాడు. ఒకమ్మాయి ఇద్దరబ్బాయిలు. పిల్లలు పుట్టాక కుటుంబాన్ని న్యుజెర్సీలోని మెన్లో పార్క్‌కు మార్చాడు. ఇంటిదగ్గరే వర్క్ షాప్ పెట్టాడు. టెలిగ్రాఫిక్ కోడ్ ద్వారా పంపే విధానానికి స్వస్తిపలికి మనిషి చేసే శబ్దంనే పంపే ఏర్పాటు చేశాడు. అలేక్సాండర్ గ్రాహం బెల్. పేటెంట్ కూడా పొందాడు. బెల్ టెలిఫోన్ అని పిలువబడే ఈ పరికరం థీరీలో బాగానే ఉంది ప్రాక్టికల్‌గా ఫెయిల్ అయింది. దీన్ని పరి పుష్టిచేయాలి అనిపించిన ఎడిసన్ కార్బన్ ట్రాన్స్ మీటర్‌ను తయారు చేసి వాడాడు. స్పష్టమైన శబ్దం వచ్చింది. దీనికి గాను వెస్ట్రెన్ యూనియన్ ఎడిసన్‌కు లక్ష డాలర్లు ఇచ్చారు. ఇంతడబ్బు వస్తే మళ్ళీ దాన్ని ప్రయోగాలకోసం, లాబ్ కోసం ఖర్చు చేస్తానేమోననే సందేహంతో ఆ కంపెనీని ఏడాదికి ఆరు వేల డాలర్లను పదిహేడేళ్ళు ఇవ్వమని కోరాడు. పేటెంట్ విషయంలో బెల్ వాళ్లకు వెస్ట్రెన్ వాళ్లకు గొడవలు వచ్చాయి. అంతులేని కథలా సాగింది యవ్వారం. చివరికి వెస్ట్రెన్ వాళ్ళు ఎడిసన్ ఇన్వెన్షన్‌ను బెల్ వాళ్ళకే తమ వ్యాపారంతో సహా ఇచ్చేసి ఇరవై శాతం రాయల్టిని బెల్ సిస్టంకు అందజేశారు.

**సౌండ్ రికార్డింగ్ అండ్ రీప్రోడ్యూసింగ్ యంత్రం - ఫోనోగ్రాఫ్**

ఎడిసన్ చెవుడు మాట దేవుడెరుగు కాని మనిషి మాట్లాడిన మాటను రికార్డ్ చేయటంపై దృష్టి సారించాడు. ముప్ఫై ఏళ్ళ వయసు లోపలే. టెలిఫోన్ ట్రాన్స్‌మీటర్ కనిపెట్టిన తర్వాత ఒక రోజు అకస్మాత్తుగా గాలి తరంగాలను రికార్డ్ చేయచ్చునని వాటిని మళ్ళీ వినిపించవచ్చునని ఐడియా వచ్చింది. ఒక ఎలక్ట్రో మేగ్నెటిక్ పికప్‌ను రివాల్వింగ్ టేబుల్‌కు అమర్చి దాని ద్వారా పారఫిన్ మైనం రాసిన ఒక సన్నని కాగితాన్ని దూర్చాడు. అద్భుతం అనిపించి "వహ్వావాహ్వా" అని అరిచాడు ఆశ్చర్యంగా. ఆ పేపర్ను వెనక్కి నడిపి చూశాడు తాను అరచిన శబ్దం ఏ మాత్రం తేడా లేకుండా తిరిగి వినిపించింది. ఈ విషయాన్ని డైరీలో 18-7-1877 తేదీతో సమీప భవిష్యత్తులో ఏదోఒక రోజు తాను మానవ శబ్దాలను రికార్డ్ చేసి మళ్ళీ స్పష్టంగా వినిపించగలను అనే నమ్మకం కలిగింది అని రాసుకొన్నాడు. ఆ రోజు వెంటనే వచ్చేసింది.

ఒక నెల తర్వాత మెకానిక్ జాన్ క్రేసుని పిలిచి 18 డాలర్ల పని అప్పగిస్తున్నాను చేయమన్నాడు. ఒక సాధారణ బొమ్మ మోడల్ గీసి దానిప్రకారం ఒక పరికరం తయారు చేయమన్నాడు. ఒక టిన్ ఫాయిల్ తీసుకొని ఒక సిలిండర్ చుట్టూ మిఠాయి పొట్లం లాగా చుట్టి దానికి ఒక పిన్ను అమర్చాడు క్రాంక్ వీల్ ఆధారంగా సిలిండర్‌ను తిప్పాడు. చిన్నప్పటి నర్సరీ రైం లను మౌత్ పీస్‌లో పాడాడు. పాట అవగానే పిన్నును రి ప్రోడ్యూసింగ్ డయాఫ్రంకు ఆనేట్లు సరిచేశాడు. సిలిండర్ ను మళ్ళీ తిప్పగానే అతను చెప్పిన "మేరీ హాడ్ ఏ లిటిల్ లాంబ్ - ఇట్స్ ఫ్లీస్ వజ్ వైట్ యాజ్ స్నో" అని స్పష్టంగా వినిపించింది. ఎడిసన్ అనుభూతిని అణచుకొన్నాడు కాని మెకానిక్ క్రేసు "గాడ్ ఇన్ హెవెన్" అని బోల్డు ఆశ్చర్యపడ్డాడు. ఇలా ధ్వని రికార్డింగ్ అండ్ రిప్రోడ్యూసింగ్ చేశాడు. ఇదే ఫోనోగ్రాఫ్.

ఎడిసన్ పద్ధతి చాలా నిదానంగా పెర్ఫెక్ట్‌గా ఉంటుంది. అవసరం లేనివాటిని తొలగించి బాగా ఉపయోగపడే వాటినే ఉంచి ఎన్నో ప్రయోగాలు చేసి విజయం సాధించాడు. ఫోనోగ్రాఫ్ నిర్మాణంతో ఎడిసన్ కీర్తి దేశ విదేశాలలో మారు మోగింది. ఎడిసన్ బయాగ్రాఫర్ ఫ్రాన్సిస్ ట్రవలేన్ మిల్లర్ "నేను ఏది వచ్చినా బెదిరలేదు వెనక్కి తగ్గలేదు. ప్రయోగం మొదటిసారే విజయవంతమైతే భయమేసేది" అని ఎడిసన్ డైరీలో రాసుకొన్నాడని తెలియజేశాడు. తన సృజనలలో ఫోనోగ్రాఫ్ అద్భుత విజయంగా భావించాడు. తనకున్న చెవుడు నష్టం కలిగించకపోగా పైపెచ్చు లాభమే కలిగించిందన్నాడు. దానివలన కేంద్రీకరణ పెరిగి అందరికి వినిపించని ధ్వనులు ఆయనకు వినిపించేవి. స్టెనో గ్రాఫర్ సహాయం లేకుండా "లెటర్ రైటింగ్" పేరుతో

పేటెంట్ పొందాడు. గుడ్డివారి కోసం "ఫోనోగ్రాఫ్ బుక్స్" రాశాడు. అవి వారిపాలిటి కల్పతరువులే అయ్యాయి. వారి ప్రయత్నం లేకుండానే గుడ్డివారితో అవి మాట్లాడి జ్ఞానవంతుల్ని చేశాయి. దీన్ని స్పెక్టాక్యులర్ వండర్ అన్నారు. వక్తృత్వాన్ని నేర్పేవిగా, సంగీతాన్ని పునః సృష్టి చేసేవానిగా ఫోనోగ్రాఫ్ నాలుగు రకాల సేవలు అందించింది.

## ఎలెక్ట్రిక్ బల్బ్ నిర్మాత – మెన్లో పార్క్ మాంత్రికుడు

ఫోనోగ్రాఫ్ పనిపూర్తి అయ్యాక ఎలెక్ట్రిక్ లైట్ పని మీద ఉన్నాడు. అప్పటిదాకా విద్యుత్తు వలన కాంతి వస్తుందని ఎవరికీ తెలియదు. కాంతి గురించి అనేక పుస్తకాలు చదివి అర్థం చేసుకొన్నాడు ఎడిసన్. రెండు వందల పెద్ద పెద్ద బైండ్ పుస్తకాలలో తాను చదివిన వాటి సారాంశాన్ని నలభై వేల పేజీలలో రాసుకొన్నాడు. అవసరమైన చిత్రాలు కూడా గీశాడు. కరెంట్‌కు నిరోధాన్ని తగ్గించటానికి బదులు నిరోధం పెంచుతూ ప్రయోగాలు చేశాడు. ఫిలమెంట్ కోసం అనేక పదార్థాలను ఉపయోగించి చివరికి వాక్యూం బల్బ్‌లో కార్బన్ ఫిలమెంట్ వాడి కావాల్సిన ఫలితం సాధించాడు. 1879 డిసెంబర్ 31 అంటే కొత్త సంవత్సరానికి ముందు రోజు సాయంత్రం వందలాది జనం సమక్షంలో ఎలెక్ట్రిక్ బల్బ్ వెలగటాన్ని ప్రదర్శించి చూపి అప్రతిభులను చేశాడు. ఇదే ప్రజాసమక్షంలో నిర్వహించిన తొలి ప్రయోగం. గ్రాండ్ సక్సెస్. బల్బ్ కాంతి తగ్గకుండా చాలాసేపు వెలిగింది. దీనితో ఎడిసన్‌ను "మెన్లోపార్క్ మాంత్రికుడు" అన్నారు సరదాగా. ముప్ఫై రెండేళ్లకే జాతీయ గౌరవం, గుర్తింపు అందుకొన్నాడు ఎలక్ట్రిక్ బల్బ్ నిర్మాత థామస్ ఆల్వా ఎడిసన్. అప్పటి నుంచి ఎడిసన్ అంటే ఎలక్ట్రిక్ బల్బ్ అనే పేరు వచ్చింది.

## ఎలెక్ట్రిక్ రైల్వే రూపకల్పన

ఎడిసన్ అంటే ఎలక్రిక్ బల్బ్‌కు పర్యాయ పదం అయింది. ఆ బల్బును మరింత మెరుగు పరచాలని ఆలోచించాడు. మంచి ఫిలమెంట్ కోసం ప్రయోగాలు చేస్తున్నాడు. వెదురు ఫిలమెంట్‌ను ప్రయత్నించాడు. ఇందులో ఏ రకమైన వెదురు శ్రేష్టమో అని ప్రయోగాలు చేసి లక్ష డాలర్లు ఖర్చు చేశాడు. ఆరు వేల స్పెసిమెన్‌లు పొందాడు. అందులో మూడు మాత్రమే కరెక్ట్ రిజల్ట్ ఇస్తాయని భావించాడు. కొత్త డైనమో, కొత్త పరికరాలు తయారు చేశాడు. కొత్త సంస్థను నెలకొల్పాడు. అదే తర్వాత కన్సాలిడేటెడ్ ఎలెక్ట్రిక్ కంపెనీ అయింది. ఎలెక్ట్రిక్ లైట్ ఒక్కటి మాత్రమే అతని ఆశయం కాదు. మాగ్నెటిక్ ఖనిజంను వేరు చేసే యంత్రం సాధించాడు. ఎలెక్ట్రిక్ రైల్వే రూపకల్పన

చేశాడు. దీనినే తర్వాత న్యూయార్క్ సిటీ సబ్ వేలో ఉపయోగించారు.

**భార్య మరణం**

ముప్పై ఏడవఏట ఎడిసన్ ఒంటరి వాడయ్యాడు. 1884లో టైఫాయిడ్‌తో చనిపోయింది. ముగ్గురు పిల్లలు అమ్మమ్మగారింటికి వెళ్ళారు. ఎడిసన్ ఎక్కువ కాలం న్యూయార్క్ ఆఫీస్‌లో గడిపాడు. పెద్ద ఉత్పత్తి కేంద్రం యూనియన్ కాలేజి నుంచి ప్రారంభించాడు.

**కొత్త భార్య**

భార్య చనిపోయిన ఎడాదిన్నరకు వ్యవసాయంలో సృజనాత్మక పరిశోధన చేసిన లూయిస్ మిల్లర్ కుమార్తెతో పరిచయమై ఆమెకు మోర్స్ కోడ్ నేర్పి ప్రేమ మెసేజ్ పంపితే ఆమె ఒప్పుకున్నట్లు తిరుగు టపా మేసేజ్ పంపింది. వివాహమైన తర్వాత పిల్లలతో సహా న్యుజెర్సీలోని ఆరంజ్ మౌన్టేన్స్‌లో ఒక వ్యవసాయ క్షేత్రాన్ని కొని కాపురం పెట్టాడు. నలభైలలో అంతర్జాతీయ ఖ్యాతి వచ్చింది.

**మోషన్ పిక్చర్ కెమెరా**

ఫోనోగ్రాఫ్, ఎలెక్ట్రిక్ లైట్‌లతో ప్రసిద్ధి చెందిన ఎడిసన్ వాటిని సామాన్యులకు అందుబాటులోకి తెచ్చాడు. ఇప్పుడు దృష్టిని మోషన్ పిక్చర్ కేమేరాపై పెట్టి కృషి చేసి సాధించాడు. ఈ మూడు ఎడిసన్ చేసిన వందలాది సృజనలను మరపించేట్లు చేశాయి.

**మరిన్ని సృజనలు**

చనిపోయే దాకా కొత్త ఆవిష్కణల కోసం తాపత్రయ పడుతూనే ఉన్నాడు. మొట్టమొదట వచ్చిన టైప్ రైటర్‌ను మెరుగు పరచాడు. కొత్త రకమైన మిమియోగ్రాఫ్ మెషీన్ తయారు చేశాడు. పోర్ట్ లాండ్ సిమెంట్ తయారీలో పెద్ద బట్టీని తయారు చేశాడు నిర్దుష్టమైన. ఆల్కలిన్ బాటరీని తయారు చేశాడు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో కార్బాలిక్ యాసిడ్ కొరత ఏర్పడితే జర్మనీ నుంచి దిగుమతి చేసుకొనేవారు. దీనికి ప్రత్యామ్నాయ సింథటిక్ యాసిడ్ తయారు చేయటం అసాధ్యం అని అమెరికన్ సైంటిస్టులు అన్నారు. దీన్ని చాలెంజిగా తీసుకొని ఎడిసన్ పద్దెనిమిది రోజుల్లో సింథటిక్ యాసిడ్ తయారుచేసి చూపించాడు. రబ్బర్‌కు మూలకం ఏమిటో తెలుసుకోవాలను కొన్నాడు. జీవిత చరమాంకంలో రబ్బర్‌ను వల్కనైజింగ్‌ను బంగారు కడ్డీ ఆధారంగా

చేశాడు.

**ఎడిసన్ హాబీ – "పని"**

ఎడిసన్ హాబీ ఏమిటి అంటే "వర్క్" మాత్రమే. "work heals and ennobles" అన్నాడు ఎడిసన్ తన డెబ్బై ఏడవ. పుట్టిన రోజు నాడు. అతని జీవిత ఫిలాసఫీ ఏమిటి అని అడిగితె "work brings out the secrets of nature and applies them for the happiness of men" అని తన ఫిలాసఫీ గురించి చెప్పాడు.

**గౌరవ పురస్కారాలు**

1928లో "కాంగ్రెషనల్ మెడల్ ఆఫ్ ఆనర్" అందజేసింది అమెరికా ప్రభుత్వం. ఏడాది తర్వాత అతని ముఖ్య స్నేహితుడు హెన్రి ఫోర్డ్ ఎలెక్ట్రిక్ బల్బ్ ఆవిష్కరణ యాభైవ వార్షికొత్సవం మిచిగాన్‌లోని డియర్ బారన్‌లో జరిపించాడు. మెన్లో పార్క్‌లోని లాబ్‌ను ఇక్కడ పునర్ వ్యవస్తీకరించాడు ఫోర్డ్. చివరిదాకా హుషారుగా ఉత్సాహంగా పని చేస్తూ థామస్ ఆల్వా ఎడిసన్ 18-10-1931లో ఎనభై నాలుగేళ్ళకు చనిపోయాడు. ప్రపంచానికి ఎలక్ట్రిక్ కాంతినందించిన ఎడిసన్ జీవిత కాంతి ఆరిపోయింది. చనిపోవటానికి ముందు అమెరికా ప్రభుత్వ పేటెంట్ ఆఫీస్ 1098 విడి విడి పేటెంట్‌లను ఎడిసన్‌కు పంపించింది.

మానవ సంక్షేమం కోసం ఎడిసన్ తాపత్రయ పడ్డాడు. కనిపెట్టినదానికి ఆర్థిక సౌష్టవం కలిపించటమే తన ధ్యేయం అన్నాడు. అంతమాత్రం చేత డబ్బు సంపాదించే మెషీన్ అను కొంటె పెద్ద పొరబాటే. షేక్స్పియర్‌ను టాం పైన్‌ను ఇష్టపడి చదివేవాడు. విపరీతంగా పుస్తకాలు చదివేవాడు. వయొలిన్ అద్భుతంగా వాయించేవాడు. ఎడిసన్ "కొత్తగా కనిపెట్టింది ఏదీ లేదు. ఉన్నదాన్ని బాగు చేశాడు" అని అతన్ని విమర్శించారు. దానికి సమాధానంగా "through all the years of experimenting and research ,I never once made a discovery. I start where the last man left off. Al l my work is deductive and the results I achieved were those of invention pure as simple" అని నిర్మొహమాటంగా చెప్పాడు. ❁




## 28. మానవత్వాన్ని మాత్రమే చిత్రించిన మహోన్నత చిత్రకారుడు – విన్సెంట్ వాన్ గో (Vincent Van Gogh)-(1853-1890)

37ఏళ్ళకే తనను తాను చంపుకొని, పదేళ్ళు మాత్రమే చిత్రకారుడిగా ఉన్నా తరాలు గుర్తుండిపోయే అతి అరుదైన స్వీయమైన చిత్రాలు గీసి, జీవితం అంటే భయం, ప్రేమలో విషాదం అనుభవించి వాటినే కాన్వాస్‌పై ప్రతిఫలింపజేసిన అరుదైన హాలండ్ చిత్రకారుడు విన్సెంట్ వాన్ గో. అందం, ఆనందం కోసం కాకుండా బాధ నివృత్తి కోసం పెయింటింగ్ వృత్తి చేబట్టాడు. అందం, అపరిశుభ్రత, ఔన్నత్యం, దుఖంలను కలగలిపి నిరాశను ఆశాత్మక సృజనకోసం ప్రయత్నించిన వాడు విన్సెంట్. “want to paint humanity, humanity and humanity” అని మానవత్వం కోసం అర్రులు చాచిన చిత్రకారుడు.

30-3-1853న హాలండ్ దేశంలోని బ్రాబాంట్ ప్రాంతంలో గ్రూట్ జండర్ట్ గ్రామంలో విన్సెంట్ జన్మించాడు. సంతానంలో పెద్దవాడు. తండ్రి పాస్టర్ కనుక ఇంట్లో వారందరూ మత పద్ధతులను పాటించాలి. మిగిలిన పాస్టర్‌లకంటే ఇతని తండ్రి కడు పేదవాడు. కనుక కొడుకును బిజినెస్‌లో పెట్టాలనుకొన్నాడు. ముగ్గురు బాబాయిలు ఆర్ట్ డీలర్స్. విన్సెంట్‌కు పదహారేళ్ళ వయసులో ఒక బాబాయ్ తన గూపిల్ అండ్ కంపెనీలో పెట్టాడు. దీనికి దేశ విదేశాలలో బ్రాంచీలున్నాయి. తండ్రిలోని పిరికితనం తల్లిలోని మూర్ఖత్వం వారసత్వంగా వచ్చి విన్సెంట్ ఆర్ట్ సేల్స్‌మన్‌గా విజయం సాధించాడు. అందుకే బాబాయి హేగ్ ఆఫీస్ నుంచి పారిస్ ఆఫీస్‌కు, తర్వాత లండన్‌కు మార్చాడు. ఎవరితోనూ స్నేహం చేయలేదు. విన్సెంట్‌కు అనుయాయుడు తమ్ముడు థియో మాత్రమే. థియోకు ఆర్ట్ డీలర్ అవాలనే కోరిక ఉండేది. అన్నదమ్ములిద్దరిమధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు ఆ తర్వాత ఒక గొప్ప మానవ డాక్యుమెంట్‌గా చరిత్రలో నిలిచిపోయింది.

లండన్‌లో విన్సెంట్‌కు మొట్టమొదటిసారి తిరస్కరణ జరిగింది. తాను ఉంటున్న ఇంటి యజమాని కూతురిపై ప్రేమ ఒలకబోసుకొని ఆమె కూడా తాన అంటే తందానా అంటుందని ఆశపడి ఆమె ఎదురు తిరిగితే అవాక్కయ్యాడు. విన్సెంట్ అందవిహీనుడు.

పెద్దతల ఎర్రటి జుట్టు. నీలి కళ్ళు చూసి ఆమె భయపడి పోయింది. అదీకాక అప్పటికే ఆమెకు ఇంకోరితో ఎంగేజ్ మెంట్ జరిగిపోయింది. దీనితో హృదయం తీవ్రంగా గాయపడి కోపం పెరిగి బాబాయి కంపెనీ కస్టమర్లపై చూపించాడు. వాళ్ళు కోనేదంతా చెత్త అన్నాడు. అవమానించాడు కూడా. మనోడేకదా అని జాలితో పారిస్ బ్రాంచ్‌కు మార్చాడు. అక్కడ కూడా తీరు మారలేదు. కంపెనీ ఇతని ప్రవర్తన చూసి నోటీసు ఇచ్చింది.

ఇక లాభం లేదని ఉద్యోగం వదిలి ఇంగ్లాండ్ వెళ్లి చిన్న ఊరు రామ్స్ గేట్లో చిన్న స్కూల్‌లో లాంగ్వేజెస్ చెప్పి పొట్ట పోషించుకొన్నాడు. తాను ఇంకా మతంలోనే ఉన్నానని గుర్తు చేసుకొని మెథడిస్ట్ పుస్తకాలు ఐసిల్ వర్త్‌లో ఉండి చదివాడు. మినిస్ట్రీ పరీక్షలో పల్టీకొట్టినా ఆశ పోలేదు. పాస్టర్ కాలేనని గ్రహించి బెల్జియంలో బోరినేజ్‌లో ప్రీచర్‌గా ఉన్నాడు. అది బొగ్గుగని కార్మికులు ఉండే చోటు. అందరూ అండర్ గ్రౌండ్ మనుషులే. వాళ్ళతోనే కలిసి వాళ్ళల్లో ఒక్కడుగా పెరిగి వాళ్ళ తిండే తింటూ వాళ్ళ కన్నాలలోనే పడు కొన్నాడు. వాళ్లతో కలిసి బాధలు పంచుకొన్నాడు. వాళ్లకు జబ్బు వస్తే సేవ చేశాడు. గాయాలైతే కట్టుకట్టాడు. వాళ్ళ పిల్లలకు చదువు చెప్పాడు. తనకొచ్చే జీతం తన బట్టలు వాళ్లకు పంచిపెట్టేవాడు. తన మంచం మీద వాళ్ళను పడుకో బెట్టుకోనేవాడు. వాళ్ళు జీతనాతాలకోసం సమ్మె చేస్తే వారిని సమర్దించేవాడు. ఇదంతా బ్రసెల్స్‌లో ఉండే అధికారులకు నచ్చలేదు. అతని అత్యుత్సాహం, చొరవ, వైట్ కాలర్‌గా ఉండాల్సినవాడు వాళ్ళతో కలిసి ఉండటం వాళ్లకు ఇష్టం లేకుండా పోయింది. ఉద్యోగం కాలపరిమితి అవగానే వారు అతని ఉద్యోగాన్ని పొడిగించలేదు. మత బోధ కూడా చేయద్దని ఆంక్ష విధించారు.

మనసు దెబ్బ తిన్న విన్సెంట్ తండ్రిని చేరి ఆ వాతావరణంలో ఇమిడిపోదామనుకొంటే చర్చి గౌరవాన్ని మంట గలిపిన కొడుకుకు ఇంట్లో స్థానం లేదన్నాడు. కాలినడకన ఎన్నోమైళ్ళు నడిచి జూల్స్ బ్రిటన్ అనే పెయింటర్ దగ్గరకు వెళ్లి సలహా కోరుదామనుకొన్నాడు. ఆ దేవేంద్ర భవనం లాంటి ఇల్లు వాతావరణం చూసి తలుపు కొట్టకుండానే వెనుదిరిగి వెళ్ళిపోయాడు. నిరాశా నిస్పృహా అవమానం ఆవేదన నిండిన మనసుతో ఎక్కడ బయల్దేరాడో మళ్ళీ అక్కడికే బోరినేజ్ చేరాడు.

ఒక మైనర్ ఇంట్లో ఒకభాగం అద్దెకు తీసుకొని విషాదంలో పడిపోయాడు. తమ్ముడు థియోకు లెటర్ రాసి అందులో అయిదేళ్లుగా ఏ పనీ లేకుండా నిరాశతో బతుకుతున్నానని, తాను చదివిన చదువు దేనికీ పనికి రాకుండా పోయిందని తెలిపాడు. యూనివర్సిటీ ఎందుకు మానేశావని అడిగితే తాను సహజమైన చావును కోరుకొంటున్నానని వర్సిటీ చావు కాదని రాశాడు. తనలో ప్రేమ పెల్లుబికి వస్తోందని అయితే ఈ ప్రేమ స్వంతప్రేమ కాదని, అదొక అవగాహనా విషయమైన ప్రేమ అని, బౌద్ధిక ప్రేమ అని దానితో ఏదో

సృష్టించి దాన్ని అందరికి ప్రసారం చేయాలన్నదే తన ధ్యేయం అని విన్సెంట్ రాశాడు. హృదయాన్ని విశాలం చేసుకొని మనసును లోతుగా అధ్యయనంలో ఉంచుకొని నిరంతరం అభివృద్ధి చేసుకొంటూ, విజ్ఞానాన్ని పెంచుకొంటూ ఉంటే అదే దైవ మార్గం అవుతుంది అని తన మనసులోని భావ పరంపరను కాగితంపై పెట్టి తమ్ముడికి తెలియజేశాడు.

విన్సెంట్ బైబిల్ చదివాడు. మైకేలేట్ రాసిన ఫ్రెంచ్ విప్లవం చదివాడు. హ్యూగో, జోలా, డికెన్స్ మొదలైన విఖ్యాత రచయితలు అట్టడుగు వర్గం వారి గురించి అణచబడిన వారి గురించి రాసిన రచనలను ఔపోసన పట్టాడు. సృజన మీద మళ్ళిన బుద్ధిని తన చుట్టూ బోరినేజ్ గ్రామంలో ఉన్న పరిస్థితులను చిత్రాలుగా గీశాడు. గనికార్మికులే అతని మోడల్స్. ఇతరులు వేసిన చిత్రాలను ప్రయోగాత్మకంగా కాపీ చేశాడు. పారిస్‌లోని చిత్రాల నకళ్లను తనకు పంపమని తమ్ముడిని కోరాడు. కాని తమ్ముడు థియో ఇప్పుడిప్పుడే బిజినెస్‌లో ఎదుగుతున్నాడు. అన్నగారు అన్నీ వదిలేసి జీవితంలో ఎదగాలనే కోరిక చూపిస్తున్నందుకు సంతోష పడి నెలకు వంద ఫ్రాంకులు పంపే ఏర్పాటు చేశాడు తమ్ముడు. బోరినేజ్‌లోని ఆచీకటి ఇరుకు బొక్క వదిలేసి బ్రసెల్స్‌లో చిత్రలేఖనం చదవటానికి ఏర్పాటు చేశాడు.

ఇరవై అయిదేళ్ళ వయసులో విన్సెంట్ జీవితంలో తాను విఫలమయ్యానని అనుకొన్నాడు. ఆర్ట్ డీలర్‌గా, టీచర్‌గా, మత బోధకుడుగా ఫెయిల్యూర్. దేనిలో చెయ్యి పెట్టినా మసే. ఉద్యోగం లేకుండా ఉండటమే అలవాటు చేసుకొన్నాడు. చివరికి ఆర్టిస్ట్ అవాలనే భావం నిశ్చయమైంది. తన ధైర్యాన్ని ఒక మీడియంలో అందునా చిత్ర లేఖనంలో చూపించాలను కొన్నాడు. తన జీవితానికి కృతజ్ఞత కూడా చూపించాలనుకొన్నాడు. వెంటనే పెయింటింగ్ ప్రారంభించలేదు. సంగీతం ఇచ్చే మానసికోల్లాసం లాగా పెయింటింగ్ కూడా ఇవ్వాలి అనుకొన్నాడు. అసలే శూన్యం ఆవహించిన ప్రపంచంలో ఏదో దైవ విభూతిని దర్శింప జేయాలనుకొన్నాడు. చివరికి ఏదో ఒకటి గీసేవాడు అవి ఆకర్షణగా ఉండేవి కావు. చిన్నపిల్లల పిచ్చి గీతల్లా అనిపించాయి. "మాన్యూల్ ఆఫ్ డిజైన్" అనే గ్రంథం చదివాడు. "సైన్స్ ఆఫ్ అనాటమీ" చదివి వ్యాపార దృష్టిని వదిలి చిత్రాలు వేశాడు. మిల్లెట్ చిత్రాలను చాలా కాపీలు చేశాడు. అతని సోవర్, మాన్ విత్ ది హో, గ్లీనర్స్ మొదలైన రైతు కుటుంబ సంబంధ చిత్రాలను కాపీ చేశాడు.

విన్సెంట్ తాను గొప్ప చిత్రకారుడు అనిపించు కోవాలనే ఆలోచనలో లేడు. కష్టజీవుల ముఖ కవళికలు చిత్రించాలన్న ఆరాటమే ఆయనది. వారిలో తానూ ఒకడినే అనే భావనలో ఎప్పుడూ ఉండేవాడు. చాలాకాలం తర్వాత చలికాలంలో తలిదండ్రుల్ని చూడటానికి వెళ్ళాడు. అప్పుడే ఒక బంధువులమ్మాయి వారింటికి వచ్చింది. విన్సెంట్ కంటే పెద్ద పిల్ల. ఆమెను ప్రేమిస్తున్నానని చెప్పేశాడు .ఆమె నిరుత్సాహ పరచింది

.ఆమెను అనుసరించి ఆమ్ స్టర్ డాం కు వెళ్ళాడు .ఆమె తలిదండ్రులు మరీ మొండిగా ఇతన్ని ఆమెతో మట్లాడటానికే ఒప్పుకోలేదు. ఆయిల్ లాంప్ మీద చెయ్యిపెట్టి విన్సెంట్ కనీసం ఒక్కసారైనా ఆమెను చూడాలని కోరాడు. చెయ్యి కాలిపోయింది కాని ప్రయత్నం ఫలించలేదు. ఈ రకంగా రెండవసారి కూడా ప్రేమ విఫలమైంది. తన కుటుంబం వారి సానుభూతి కూడా పొందలేక పోయాడు. తమ్ముడు థియో మాత్రమే అన్నకు విశ్వాసంగా ఉన్నాడు.

హేగ్‌కు వెళ్లి మావే అనే బంధువు దగ్గర పెయింటింగ్ నేర్చుకొన్నాడు. అతడు లాండ్ స్కేప్ పెయింటింగ్‌లో సిద్ధ హస్తుడు. మావే విన్సెంట్‌తో బ్రష్ పట్టించి ఆయిల్ పెయింటింగ్ నేర్పించాడు. స్టిల్ లైఫ్ చిత్రాలు గీయటం నేర్పాడు. ఇంటిలోని వస్తువులను చిత్రించటం అలవాటు చేశాడు. తమ్ముడు డబ్బు పంపి సాయం చేస్తున్నాడు. ఒక మోడల్‌ను డబ్బుతో కుదుర్చుకొని పెయింటింగ్ సాగించాడు. అడుక్కునే వాళ్ళను వేశ్యల్ని కూలీలను మోడల్స్‌గా చేసి చిత్రాలు వేశాడు.

ఒక వేశ్యను మోడల్‌గా చేసుకొని చిత్రాలు గీస్తూ ప్రేమలో పడ్డాడు మూడోసారి. ఆమె కాదన లేదు. ఆమెకు అప్పటికే ఒక కొడుకు, మళ్ళీ గర్భిణీ. ఆమె చాలా ముతక, రోగిష్టి, వికారి చుట్టలు తాగేది. ముప్ఫై ఏళ్ళ మనవాడు ఆమెను పెళ్లి చేసుకొంటానని చెప్పి మురికి కూపంలాంటి ఆవాసంలోంచి మార్పించి తెచ్చుకొన్నాడు. కొన్నిరోజులు సంతోషంగానే గడిపారు. నెమ్మదిగా ఆమెతో మాట్లాడటం మానేశాడు. వారిద్దరికీ విషాదకర జీవితం తప్ప ఏమీ పోలికలు లేవు. నిరక్షర కుక్షి ఆమె. విన్సెంట్ స్నేహితులు అతనితో గడపటానికి వస్తే తనను నిర్లక్ష్యం చేస్తున్నాడని అనుకొనేది. ఆమె తల్లి పరిస్థితిని మరీ దారుణంగా మార్చింది. ఈ ఒంటరి జీవితం కంటే మురికివాడలో బ్రోతేల్ హౌస్ జీవితమే మేలు అని నూరిపోసేది తల్లి. క్రమంగా మనవాడి నుంచి జారుకొని పాత జీవితంలో ప్రవేశించింది. మళ్ళీ విన్సెంట్ వాన్గో ఒంటరివాడయ్యాడు.

షేక్స్పియర్ "రైపెంస్ ఈజ్ ఆల్" అనే కవితకు "ఎమోషన్ ఈజ్ ఎవిరి థింగ్" అన్నది కలిపాడు. ప్రతి వస్తువులోను ఎమోషన్‌నే చూశాడు. తారసపడిన ప్రతివాడిలోనూ, ముట్టుకున్న ప్రతిదాంట్లోను ఎమోషన్‌నే దర్శించాడు. పైకి కనిపించేది కాకుండా అంతరాంతరాల్లోకి చొచ్చుకుపోయి, జీవిత పరమార్థాన్ని గ్రహించాడు. గురువు మావే చూడని దాన్ని శిష్యుడు విన్సెంట్ చూసి గురువుకే కళ్ళు తిరిగేట్లు చేశాడు. కాని ఇంకా రంగులలోని మిస్టరీని ఛేదించలేక పోయాడు. వాటిలోని రహస్యాలను గ్రహించాడు. ఆకురాలు కాలంలోని సూర్యాస్తమయాన్ని చిత్రించి తమ్ముడికి విషయం తెలియజేస్తూ "the main thing is to get the depth of color, the enormous source and solidly of the ground, I did not realize until I came to paint how much light even in the dark parts. I had to catch the light yet

convey the depths of solid" అని తెలియ జేశాడు. చెట్లను వాటి వ్రేళ్ళను ట్యూబ్ లద్వారా సారాన్ని లాగి, బ్రష్‌తో మోడల్స్‌గా చిత్రించాడు. అతని చిన్నారి చెట్లు నిటారుగా వ్రేళ్ళవలన స్థిరంగా నిలబడి ఉండేవి.

విన్సెంట్ తలిదండ్రులు న్యునేన్‌లోని బాబంట్ గ్రామానికి మారారు. ఆ ఇంట్లో వాషింగ్ రూమ్‌లోనైనా తనకు చోటు కలిపిస్తే, చిత్రాలు వేసి బతుకుతానని బతిమాలాడు. మట్టిమనిషిగా ఉందామనుకొన్నాడు. చోటిచ్చారు. దున్నిన పొలాలను, మట్టికోట్టుకొని పోయిన పూరి గుడిసెలని, మగా ఆడ చేసే త్రవ్వకాన్ని, నేత నేస్తున్న కార్మికుడిని, సాయంకాలం అన్నం తింటున్న శ్రామిక జనాలను చిత్రించాడు. ఈ మట్టిమనుషులు మట్టి రంగులో, సంసార పక్షంగా, తాము తినే మట్టిలోని బంగాళాదుంపల్లాగా ఉన్నట్లు చిత్రించాడు. వాళ్ళ దుస్తులలో హావ భావాలలో ఒరిజినాలిటి తెచ్చాడు. ఇదంతా శ్రామిక జన కళ్యాణ దీక్ష. తనలాగే తిరస్కృత అయిన తన కన్నా పెద్దదైన ఒకావిడతో స్నేహం చేసి తన బాగోగులు చూడటానికి ఏర్పాటు చేసుకొన్నాడు. సోమరి అని భావించి దమ్మిడీ సంపాదన లేని వాన్‌తో ఉండటం ఇష్టంలేక ఒకసారి చంపే ప్రయత్నమూ చేసింది. మళ్ళీ స్త్రీ చేత దగా పడినవాడై చీకట్లో కూరుకు పోయాడు. తమ్ముడు కూడా ఏమీ సహాయం చేయలేక పోయాడు. సాయం చేయటానికి తన దగ్గర ఏమీ లేదన్నాడు. కాని థియోనే గతి అనిపించింది. పారిస్‌లో ఉన్న తమ్ముడి దగ్గరకు విన్సెంట్ 1886 ఫిబ్రవరిలో చేరాడు.

పారిస్‌లో తను ఊహించిన దానికంటే కొత్త ప్రపంచాన్ని చూశాడు. ఫ్రెంచ్ ఇంప్రెషనిస్టుల స్వర్గంలాగా కనిపించింది. పిసారో, హ్యురేట్, సిగ్నే, గగాల్న్, లేట్రేస్ మొదలయిన వారి కాన్వాసుల ముందు నిలబడి గమనించాడు. అంతా కొత్త పోకడలు కన్పించాయి. సంప్రదాయానికి భిన్నంగా వారు చిత్రాలు గీస్తున్నట్టుగా గమనించాడు. సరిహద్దులను చెరిపేసి రంగులను విడదీసి కాంతితో ఆడుకున్నట్టుగా ఉన్నాయి వారి చిత్రాలు. జపనీస్ ప్రింట్ల షో చూసి వాళ్ళ ధైర్యానికి ఆకర్షితుడయ్యాడు. అందులో అవాస్తవికత, వర్ణ సమ్మేళనం కన్పించాయి. సమతలంగా ఉండే రంగు విస్తరించి వాటిని కాపీ చేయకుండానే తన ఆవిష్కరణలతో వాటిని మించి చిత్రించాడు. భారమైన రిథంను ఉత్తరపు ధృడత్వాన్ని వదిలిపెట్టలేదు. దీనితో అతని చిత్రాలకు శక్తి, ప్రభావం పెరిగాయి. డచ్ సాలిడి కి ఇది వ్యతిరేకం. అతని పాలెట్ చాల తేలిక. రంగుల కలయిక మరీ సున్నితం. బ్రష్ స్ట్రోక్ లు విశాలం, విచ్ఛేదకరం. డాట్ లు, డాష్ లు, డాన్సింగ్ పాయింట్లతో అంతా సమ్మిశ్రం చేశాడు. కాంతివంతమైన చిన్న డిజైన్లను అసలు వస్తువులో ఒదిగేటట్లు చేయగలిగాడు. అతని చిత్రాలు జీవంతో కళకళ లాడుతాయని అన్నారు. ఒకదాని తరువాత ఒకటి విభిన్న ప్రయోగాలతో రూపొందించాడు. మామూలువే అయినా టేబులు, కుర్చీ, బెడ్రూము, యువతీ జపనీస్

బొమ్మలలాగా ఉన్న అనుభూతిని కలిగించాయి. కూర్చున్న పోస్ట్ మెన్, అపస్మారక శక్తితో ఊగిపోతున్నట్లుగా కన్పిస్తాయి.

ఎంత చేసినా విన్సెంట్ పనితనానికి ఎక్కడా ఆదరణ రాలేదు. కాని తోటి ఆర్టిస్టులు ముఖ్యంగా గాగిన్ విన్సెంట్ అంటే అభిమానం చూపాడు. వాళ్ళ ప్రోత్సాహం, పోషకత్వం విన్సెంట్ ఆశించలేదు. థియో కొన్ని బొమ్మల్ని అమ్మే ప్రయత్నం చేశాడు కానీ ఎవరూ, ఏ డీలరూ కొనటానికి ముందుకు రాలేదు. ఒక్క సారిగా పారిస్ అంటే అసహ్యం పుట్టింది. శైలి, టెక్నిక్కుల గురించి విని విని విసిగిపోయాడు. తాను మొదలు పెట్టిన పనిని పూర్తి చేయటానికి చాలాసమయం ఉంది అనుకున్నాడు. అంత కొత్తగా ప్రారంభించాలి అనిపించింది. తాను చాలా కిందికి దిగి భూమి పుత్రుడుగా నగ్నంగా పని చేయాలనిపించింది. తనకింకా 3,4 ఏళ్ళు మాత్రమే ఉందనుకున్నాడు. మళ్ళీ ఒక గొప్ప ప్రయత్నం చేయాలని అనిపించింది. ఎక్కడో ఆకాశం కింద తాను వెతుకుతున్నది కన్పిస్తుంది అనుకున్నాడు. అక్కడి గాలిని అనుభవించాలని అన్పించింది. అది తన శరీరానికి తాకాలని పారిస్‌లో తన వస్తు జ్ఞానం అంతా నశించిందని తన చర్మం కొద్దికొద్దిగా క్షయమైపోతోందని అనిపించింది. తను కోరుకున్న కళాస్వర్గం దక్షిణ దేశంవైపు ఉన్నట్లుగా భావించాడు. తన చిత్రాలను గోడలకు తమ్ముడు థియో కోసం తగిలించి వదిలి, అపార్ట్మెంట్ ఖాళీ చేసి ఎరీస్‌కు వెళ్ళాడు.

దక్షిణ దేశంలో తన కాన్వాసులతో సహా నదీస్నానం చేశాడు. పూర్వం కంటే శక్తి, ఉత్సాహం వచ్చాయి. కనిపించిన ప్రతి దానినీ చిత్రించాడు. నదిలో బట్టలు ఉతికే చాకలిని, నదిపై బ్రిడ్జిని నీటి ఊటలను, సన్ ఫ్లవర్‌లను, తన చిత్రాలను, అన్ని రకాల మనుషుల చిత్రాలను వేశాడు. పది రోజులు ఏక దీక్షగా పుష్ప ఉద్యానవనాలను చిత్రీకరించాడు. మొదట్లో ఇవన్నీ కళాభివృద్ధిగా కనపడేవి. అతని రూపాలకు మరింత జీవకళ అబ్బింది. అతని జీవిత చరిత రాసిన మీర్ గ్రేస్వీ అతనొక రోమాన్‌ంటిస్టని అతని వికసనంలో తుఫాన్లు ఉన్నాయని రాశాడు. అతని చూపు ప్రతి దానిలోకి చొచ్చుకు పోతుందని చెట్టు, మట్టి, గొడ్డలి కూడా అతనికి ప్రత్యేకంగా కన్పిస్తాయని. గాలిని కూడా ఒక ఘనపదార్థంగా మార్చే శక్తి కలవాడని అన్నారు. పసుపు రంగుతో కనిపించేదంతా అదే రంగుతో చిత్రీకరించాడు. వాటిని చూస్తే రంగు, రుచి వాసన స్పర్శ కన్పిస్తాయి. రాళ్ళను చిత్రిస్తే అవి మనతో మాట్లాడుతున్నంత గొప్పగా ఉంటాయి. క్రమంగా చెట్లను వదిలేసి వాటి ఎదుగుదలను అస్తిత్వాన్ని చిత్రించాడు. అవి విచ్చుకున్నట్లు కాదు వికసిస్తున్నట్లుగా కన్పిస్తాయి. అతని బ్రష్ స్ట్రోక్‌లో నిర్ణయాత్మక శక్తి కనిపిస్తుంది. ఒక సజీవ తాదాత్మ్యం గోచరిస్తుంది. అతని పాలెట్ నుండి అగ్ని శిఖలు సృష్టించాడు. అతని పెయింటింగ్‌లలో గుడ్డి వెలుగు గొప్పగా ఉంటుంది. అవి అతని గత కాలపు జీవితానికి గుర్తులు.

విన్సెంట్ కలర్ సింబాలిజంను అభివృద్ధి చేసాడు. "ది నైట్స్ కేఫ్" అనే చిత్రం గురించి చెబుతూ అతను దానిని "To express the terrible passions of humanity by means of red and green. I have tried to express the ideas that the café is a place where one can ruin one", s self, run mad or commit a crime. So I have attempted as it were to show the powers of darkness in a low drink --shop by a soft Louis XV green and malachite, contrasting with a yellow green and hard blue greens- all this in an atmosphere like a devil", "s furnace of pale sulphur" అని వివరించాడు. ఎరిస్ లో గాగిన్ వచ్చి తనతో చేరతాడని తెలిసి సంతోషించాడు. అతని ఆర్ట్ కాలనీలో వీరిద్దరే ఉన్నప్పటికీ మిగిలినవారకు చోటు ఉన్నదని చెప్పేవారు. వాన్ గో గాగిన్ యొక్క నమ్మకాన్ని సహకారాన్ని అనుభవించాడు. తనకంటే అతను తక్కువ స్థాయి ఆరిస్ట్ అని తెలుసుకోలేదు. గాగిన్ శిష్యుడినే అని అనుకునే వాడు. కొద్ది కాలం తర్వాత అభిప్రాయ భేదాలు వచ్చి కలసి ఉండలేక పోయారు.

గాగిన్ డబ్బు పెట్టుబడి పెట్టే మనిషి. గొప్ప స్టాక్ బ్రోకర్. పెయింటింగ్‌ను హాబీగా చేసుకున్నాడు. వాన్ గో బీదరికంలో జీవిస్తూ గాగిన్ ప్రవర్తనకు అభిరుచులకు విసిగిపోయాడు. గాగిన్ బోహీమియన్‌లాగా ఉంటే వాన్ గో భయపడుతున్నట్లుగా ఉండేవాడు. గాగిన్ సాటి కళాకారులను చులకనగా చూసేవాడు. వాటిని బహిర్గతము చేసేవాడు. వాన్ గో సెంటిమెంటల్ ఫెలో. తరచు పోట్లాడుకునే వారు ఇద్దరూ. గాగిన్ తీవ్ర స్వభావానికి వాన్ గో అల్లల్లాడి పోయేవాడు. రోజు రోజుకూ నిరుత్సాహం పెరిగే పోయేది. అతని విపరీత చేష్టలకు విసిగి ఒకరోజు ఒక గ్లాసు అతనిపై విసిరివేసాడు. దాన్ని చేత్తో పట్టుకున్న గాగిన్ కఫే లోంచి ఇతన్ని బయటకు లాక్కొచ్చాడు. తననెవరో వెంబడిస్తున్నారని గాగిన్ అనుకునేవాడు. ఒక రోజు వాన్ గో కత్తితో తన వెంట ఉండటం గాగిన్ చూశాడు. భయపడిన వాన్ గో పరిగెత్తి తన రూముకు చేరి అపస్మారకంగా పడిపోయాడు. అతని తలకు రక్తపు మరకలున్న టవల్ చుట్టబడింది. తన చెవిని ఒకదాని కోసి అతనికి పరిచయమున్న వేశ్యకు పంపాడు. అది క్రిస్టమస్ కానుక అని చెప్పాడు. ఈ విధంగా వాన్గో విపరీత ప్రవర్తనలో ఉండిపోయాడు. తమ్ముడు థియో వచ్చి అన్న విన్సెంట్‌ను హాస్పటల్‌లో చేర్చాడు. అప్పుడప్పుడు అపస్మారకంలో పడుతూ కొద్ది కాలానికి ఆరోగ్యం చేకూర్చుకున్నాడు. మళ్ళీ తన ఎల్లో హౌస్‌కు చేరి దానినే సింబల్ హోమ్‌గా భావించాడు. అతన్ని చూసి జనం కూడా భయపడుతున్నారు. నిఘా ఉంచారు. పిల్లలు గేలి చేసే వారు. పెద్దలు కిటికీ లోనుంచి తొంగి చూసేవారు. ఒకరోజు ఇంటి ముందు చాల మంది చేరితే కిటికీ

లోంచి వాళ్లకు ఉపదేశం చేశాడు. తర్వాత అరుపులు, కేకలు పెడుతూ ఉండగా తాళం వేసిన గదిలో గొలుసులతో ఇనప మంచంమీద బంధించారు. ఒంటరి గదిలోకి తర్వాత మార్చారు. తనను ఒక ప్రశాంత ప్రదేశానికి తీసుకు వెళ్ళమని అర్థించాడు. ఒక శరణాలయంలో తన భ్రమలకు నివారణ లభిస్తుందని చెప్పాడు. 1889 మేలో అతను పిచ్చివాడని సెయంట్ రెమీ హాస్పటల్ వాళ్ళు సర్టిఫికేటు ఇచ్చారు. ఈ హాస్పటల్‌లోనే మూర్ఛతో బాధపడ్డాడు. స్కిజోఫ్రేనియా వచ్చి ఇబ్బంది పడ్డాడు. గొప్ప పెయింటర్‌గా ఉన్న వాన్ గోకు ఈ స్థితి కలిగింది. ఈ స్థితి లోనూ పెయింటింగ్‌లు వేస్తూనే ఉన్నాడు. అవి బాగా కదిలించేవిగా ఉండేవి. ఒంటరి గదిలో చెక్క బొమ్మలు, లితోగ్రాఫ్‌లు చేస్తూ ఉండేవాడు. ఇదివరకంటే ఇప్పటి పెయింటింగ్‌లలో మరింత శక్తి కన్పించేది. అతని అపూర్వ సృష్టికి ఇవి గొప్ప ఉదాహరణ. అతని "ది స్టార్రి నైట్" చిత్రం పెయింటింగ్‌గా చెప్పుకోలేనప్పటికి గొప్ప వైభవంగా కన్పిస్తుంది. దీనిలో అతనికి స్వర్గాలు కనిపించాయి. నక్షత్రాలు స్థిరంగా ఉండవు, ప్రకాశించవు, మినుకు మనవు, కానీ అవి మండుతూ భ్రమణం చెందుతూ అంతరిక్షంలో కన్పిస్తాయి. ఆకాశమంతా వాటి కోసం పరిగెత్తుతున్నట్లు అనిపిస్తాయి. మేఘాలు సుళ్ళు తిరిగే జల ప్రవాహాలుగా కాంతివంతమైన పదార్థంగా గోచరిస్తాయి. ఆందోళనతో కూడిన గాలి నుంచి ఆకుపచ్చని ఫౌంటెన్లు ఎగ జిమ్ముతున్నట్లు కన్పిస్తాయి. రాత్రివేళ కనిపించని శక్తులన్నీ బహిర్గమవుతాయి. అవన్నీ విపరీతమైన వేగంతో చరిస్తున్నట్లు అన్పిస్తాయి.

అతని మూర్ఛలు పెరుగుతూనే ఉన్నాయి. ఆరోగ్యం కుదుటపడుతుందని అన్నదమ్ములు భావించారు. ప్రదేశం మారిస్తే మంచిదని అయిస్ నది ఒడ్డున ఆవేర్స్‌కు మకాం మార్చారు. కొంత నయం. పారిస్‌లో ఉన్న థియోకు ఇరవయ మైళ్ళ దూరంలో మాత్రమే ఇది ఉన్నది. విన్సెంట్ డాక్టర్ "గాచచేట్" గొప్ప కళాభిమాని. అతనిపై సానుభూతి బాగా చూపించేవాడు. అతని ప్రతి సృజనను మెచ్చుకున్నాడు. వాన్ గో తన డాక్టరును విచార వివర్ణ వదనంతో చిత్రించాడు. అతనిది కాని అతని చూపును అందులో ఒదిగాడు. అందులో "The heart broken expression of our time" ఉందని అందరూ భావించారు. చివరి చివరికి వేసిన చిత్రాలన్నీ ఒంటరి తనాన్ని, చీకటిని, విషాదాన్ని చూపాయి. అతనిలో విషాదం పెరిగి పోయింది. తాను ఇక ఏమాత్రం తమ్ముడికి భారంగా ఉండకూడదని భావించి తన బాధను తనలోనే అణచుకున్నాడు. కాకుల్ని చంపటానికి ఒక రివాల్వర్ తీసుకుని పొట్టలో కాల్చుకున్నాడు. విషయం తెల్సిన తమ్ముడు పరిగెత్తుకు వచ్చాడు. అతనితో "మనందరి మంచి కోసం ఈ పని చేశాను" అని చెప్పి 29 -7-1890న 37వ ఏట విన్సెంట్ వాన్ గో మరణించాడు. ఈ విషాదాన్ని తమ్ముడు భరించలేక పోయాడు. 6 నెలల తర్వాత థియో కూడా మతి

స్థిమితం లేక హాలండ్‌లో చనిపోయాడు. అన్న దమ్ములిద్దరినీ అయిస్ అవేర్స్ చర్చిలో ఖననం చేసారు.

వాన్ గో జీవిత కాలంలో ఒకే ఒక సానుకూలమయిన వ్యాసం చూడగల్గాడు. రెండే రెండు పెయింటింగులను అమ్మాడు. వాటికి కొన్ని వందల ఫ్రాంకులు మాత్రమే వచ్చాయి. అతని మరణానంతరం అరవై ఏళ్ల తర్వాత పదేళ్ళలో అతను వేసిన డ్రాయింగులు, చిత్రాల విలువ 30 మిలియన్ డాలర్ల విలువ ఉంటుందని నిర్ణయించారు. సంప్రదాయానికి భిన్నంగా అతను చిత్రించిన చిత్రాలు పిగ్మెంట్స్ ద్వారా ఎంత బలంగా శక్తివంతంగా భావాలు తెలియచేయవచ్చో తెలియచేస్తాయి. అవి "Those terrible things, men;s passions"కు దృష్టాంతాలు. చూసేవాని చూపే కాక అతని భాగస్వామ్యం కూడా చిత్రాలలో కన్పిస్తుంది. "He lifts emotions to a pitch of almost unbearable excitement and communicates the intensity which brought him to the breaking point" అని అతని చిత్రాలకు భాష్యం చెప్పారు. "Instead of driving to reproduce exactly what I have before my eyes, I use color more arbitrarily so as to express myself more forcibly" అని విన్సెంట్ తన చిత్రాలగురించి చెప్పుకున్నాడు. అతని చిత్రాలు అబద్ధాలుగా కన్పించినా అందులో యదార్థం ఉందనిపిస్తాయి. అంతకు ముందు ఏ చిత్రకారుడూ చేయని ప్రయోగాలు చేసాడు విన్సెంట్. సామాన్య వస్తువులలో కాంతి పుంజాలను, రేడియేషన్ ను చూపగల్గిన అత్యంత ప్రతిభావంతుడు విన్సెంట్. ఇది ఎవరికీ లభించని అసాధారణ శక్తి. మనిషి టెన్షన్‌ల మధ్య అవాస్తవాల మధ్య జీవిస్తున్నాడు అనటానికి సజీవ ఉదాహరణలు అతని చిత్రాలు. డాస్టోవిస్కీ, కాఫ్కా ప్రాఫెట్ల తర్వాత కళను ఆదిశలో నడిపించినవాడు "To a confused world his vital images have what he desired above all else the power to reveal and to console"

రేమ్బ్రాంట్, అల్గికోలను వదిలేస్తే వాన్గో గొప్ప డ్రమాటిక్ పెయింటర్. అంతటివాడు పుట్టలేదు, పుట్టబోడు. రేమ్బ్రాంట్ సాధారణ వెలుగుతో డ్రామాను నిరంతరంగా నాటకంగా మారిస్తే అల్గికో దాన్ని అణచబడిన హింసతో సాధించాడు. కానీ వాన్గాన్ ప్రతి స్పర్శలో డ్రామా కన్పిస్తుంది. అందులో గీతలు నిండి సుళ్ళు తిరిగే రంగుల ప్రవాహంగా ఉన్నతోన్నతంగా దర్శనమిస్తాయి. "Van Gogh seized to be concerned with the troubled human comedy, even in his paroxysms he responded to its moral force. Every thing he did was another attempt to add moral passion and pity to the immortal humanity of Art" ❋



## 29. మానసిక విశ్లేషణ పిత - సిగ్మండ్ ఫ్రాయిడ్- (1856-1939)

వియన్నా దేశపు సిగ్మండ్ ఫ్రాయిడ్ మనిషి భావోద్రేకాలకు ప్రతిదిన పరిసరాలకు సంబంధముందని పరిశోధనాత్మకంగా రుజువు చేశాడు. దీనితో సృజనాత్మకమైన ప్రతి రంగంపై ప్రభావం చూపాడు. ఒక తరాన్ని అత్యధికంగా ప్రభావితం చేసిన వ్యక్తి ఫ్రాయడ్. కొందరు శిష్యులు, కొందరు వ్యతిరేకులు ఉన్నా మానవత్వపు అంచనాలను సాహిత్యపు విలువలను భాషా వైశాల్యాన్ని విపరీతంగా విస్తరింపజేశాడు. నరాల జబ్బుపై పరిశోధన చేసినా అతని అధ్యయనం సాధారణ పనివారిపై, వ్యాపార రంగం వారిపై విశేషంగా ఉండేది. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ (న్యూనతా భావం), ఇనిబిషన్ మొదలైన శబ్దాల సృష్టికర్త అయినాడు. అంతకు ముందు ఎవరూ వినని "సైకాలజీ అఫ్ ఎవరీ డే లైఫ్" ఆవిష్కర్త. మాల్ అడ్జస్ట్ మెంట్, రిప్రేషన్, ఫిక్సేషన్, ట్రాన్స్ఫరేన్స్, డిఫెన్స్ మెకానిజం, ఓవర్ కాన్ఫి డేన్స్, సప్రేస్డ్ డిజైర్, లిబిడో అనే కొత్త పదాలను ఆవిష్కరించాడు. దీనితో వైద్య పరిభాష మారిపోయింది.

సైకో అనాలసిస్ పిత అని పిలవబడే సిగ్మండ్ ఫ్రాయడ్ 6-5-1856 పూర్వపు ఆస్ట్రియా ప్రస్తుత జెకోస్లోవేకియా మొరావియా లోని ఫ్రీబెర్గ్‌లో జన్మించాడు. తండ్రి జూయిష్ వర్తకుడు. ఫ్రాయడ్ 4 ఏళ్ల వయసులో కుటుంబం వియన్నాకు చేరింది. తండ్రి రెండవ భార్యకు జన్మించిన 8 సంతానంలో ఫ్రాయడ్ పెద్దవాడు. అతన్ని చూసి అందరూ గర్వపడేవారు. కేమిస్ట్రీ, బాటనీలో అసాధారణ నైపుణ్యం చూపేవాడు. డార్విన్ అనువంశిక సిద్ధాంతానికి ఆకర్షితుడయ్యాడు. దీనితో ప్రతి విషయాన్ని సూక్ష్మగా విచారించే అలవాటు పెరిగింది. కానీ జర్మన్ ఫిలాసఫర్ మహా రచయిత గోతే "నేచర్"పై రాసిన వ్యాసం చదివి ప్రభావితుడయ్యాడు. దాని వలన మానవ విజ్ఞానం సాధించడానికి కృత నిశ్చయడయ్యాడు. ఇంగ్లీష్ భాష నేర్చి ఆసాహిత్యపు ఆనందాన్ని అనుభవించాడు. పదేళ్ళు ఇంగ్లీషు సాహిత్యానికే అంకితమయ్యాడు. షేక్స్పియర్ సాహిత్య శాస్త్రాన్ని మిల్టన్ ప్యూరిటన్ శక్తిని ఆసాంతం అర్థం చేసుకోగలిగాడు.

17 ఏళ్ల వయసులో మెడికల్ స్కూల్లో చేరి యాంటీ సెమిటిజం మీద వ్యతిరేకత పొందాడు. తన జాతిపై ఎందుకు అవమానమో అర్థం కాలేదు. "సెల్ఫ్ పోర్ట్రయిట్"

అనే దానిలో తన ఆలోచన ఫలితాలను పొందుపరచాడు. తన గమ్యమే మిటో తెలుసుకున్నాడు. మెజారిటీ జనం ముందు మైనారిటీ వాళ్ళు ఓడిపోరాదు అని అనుకున్నాడు. కనుక స్వతంత్ర నిర్ణాయక శక్తి, తీర్పు అవసరమని భావించాడు. యూనివర్సిటీలో చేరి నాడీ వ్యవస్థ శాస్త్రంపై పరిశోధనలు చేసాడు. 20వ ఏట నుండి 29వ యేట వరకు ఇన్స్టిట్యూట్ ఆఫ్ సెరిబ్రల్ అనాటమీలో పనిచేశాడు. తాను ఒక సాధారణ వైద్యునిగా ఉండాలని అనిపించలేదు. కానీ వియన్నాలోని ప్రసిద్ధ అల్జిమిఏన్ క్రాన్కే హాస్ (జనరల్ హాస్పటల్) క్లినికల్ న్యూరాలజిస్ట్‌గా పని చేశాడు. అప్పటికే రోగుల నిజమైన తత్వానికి, ఊహలకు (ఫాంటసీ) వ్యత్యాసం గమనించాడు. రోగుల రోగలక్షణాలను గమనించాడు. అతని సహచరులు ఫ్రాయడ్ చేసిన నాడీ వ్యవస్థ వలన కలిగే జబ్బుల గురించి విని సంతోషించారు. రోగి మెదడులోకి లోతుగా చొచ్చుకుని పోయే విధానం గురించి ఆలోచించాడు. 29వ ఏట ఒక పరిష్కారం లభించింది. ఒక వియన్నా డాక్టరు హిస్టీరియా రోగులకు హిప్నటైజ్ చేసి నయం చేశానని ప్రకటించాడు. మానసిక అసమతుల్యాలను బయటపెట్టటానికి ఇది ఒక మార్గం అనిపించింది. పారిస్ వెళ్లి జీన్ మెరీ చార్కాట్ దగ్గర చదివాడు. అప్పటికే ఆయన న్యూరలాజికల్ క్లినిక్‌లను ఏర్పాటు చేసి హిప్నాటిజం రోగాలను కుదిర్చి ప్రపంచ ప్రసిద్ధి పొందాడు. ఫ్రాయడ్ ఈయన దగ్గర ఒక ఏడాది విద్యార్థిగా, అనువాదకునిగా ఉన్నాడు.

30వ ఏట వియన్నా చేరి మార్తా బెర్న్‌ను పెళ్ళాడి ప్రైవేట్ ప్రాక్టీస్ మొదలుపెట్టాడు ఫ్రాయడ్. మొదట్లో గురువు చార్కాట్ బోధించినట్లే ప్రాక్టీస్ చేసాడు. చాలా తీవ్రంగా ఆ పద్ధతిలో రోగ నిదానం చేశాడు. అతన్ని సమతుల్యత లేని వెర్రివాడిగా బీరాలు పలికే వాడిగా ముద్ర వేశారు. ఎంత జాగ్రత్తగా వైద్యం చేస్తున్నా తన పరిశోధనలను ఎప్పటికప్పుడు సమీక్షిస్తున్నా ఈ మాటలు జీవితాంతం వెంటాడాయి. అది ఫిజికల్ థెరపీ కాలం అని ఆనాటి డాక్టర్లకు రోగి మానసిక విషయాలు పట్టేవి కావని ఫార్ములా ప్రకారమే ప్రతిదానిని నిర్ణయించే వారని రోగ లక్షణాలను సజీవ సిద్ధాంతంగా భావించేవారని కాని రోగి మానసిక ఆందోళనలు ఎవరికీ పట్టేవి కావని చికిత్స లోపభూయిష్టమైన అవగాహనతో మందులతో హైడ్రో దెరపీతో ఎలక్ట్రో థెరపీతో మాత్రమే ఆనాటి డాక్టర్లు చేసేవారని ఫ్రాయడ్ జీవిత చరిత్ర “ది బేసిక్ రైటింగ్స్ ఆఫ్ సిగ్మండ్ ఫ్రాయడ్” రాసిన డాక్టర్ ఎ.ఎ.బ్రిల్ రాసాడు. సంప్రదాయ చికిత్సా విధానం నుంచి వైద్య విధానాన్ని మార్చాలని ఫ్రాయడ్ అభిప్రాయం. హిప్నోటిక్ థెరపీపై ప్రయోగాలు చేసాడు. స్మృతి లోపం (ఆమ్నేసియ), మూగతనం– (అఫెసియ)లపై పనిచేస్తున్నా హిప్నాటిజంతో, సలహాలతోనే నయం చేయవచ్చని భావించాడు. ఈ కొత్త కష్టతరమైన విధానంలో పని చేస్తూ రోగి గత జీవితాన్ని గుర్తు చేసుకునే పద్ధతిని ప్రవేశపెట్టాడు. రోగి మనసులో దాగి ఉన్న జ్ఞాపకాలను బయట పడేట్టు చేసేవాడు. ఈ విధానానికి

మానసిక విశ్లేషణ (సైకో అనాలసిస్) అని పేరు పెట్టాడు. దీనిని నమ్మని ఇతర డాక్టర్లు, మనుషులు ఫ్రాయడ్‌ను క్రూర హింసా వాదిగా భావించారు. దీని వల్ల బాగుపడ్డ వారు ఫ్రాయడ్ ఒక కొత్త శాస్త్రీయ విధానాన్ని ఆవిష్కరించాడని సంబరపడ్డారు.

ఫ్రాయడ్ చేసిన సైకో అనాలసిస్ లో హిస్టీరియా మొదలైన రోగాలకు మూల కారణాలు రోగి మరచిపోయిన, లేక అణచుకున్న సంతోష రహిత విషయాలే కారణమని అన్నాడు. తనను బాధించిన ఈ విషయాలు రోగి మరచి పోయుంటాడు. అందుకని ఫ్రాయడ్ సమాధి చేయబడిన ఆకారణాలను అతని అపస్మారక స్థితిలోంచి బయటపడేట్లు చేసేవాడు. ఈ అణచివేత రోగికి చాలా నష్టం కలిగించేది. ఇది సాధారణ మానసిక ప్రతిచర్యను అడ్డగించేది లేక నిషేధించేది. దీనితో భౌతికమైన రోగం వస్తుందని భావించాడు. ఈ అణచివేత అసలు బాధను గుర్తించేది అవుతుంది. దీనిని విడుదల చేస్తే రోగం నయమవుతుంది అనేది ఫ్రాయడ్ సైకో అనాలసిస్ సిద్ధాంతం.

ఎక్కువ భాగం భౌతిక ఆందోళనలు వ్యక్తీ కల్పితాలే. ఫ్రాయడ్ తన కాలాన్ని మైండును ఒక ఆర్గానిక్ సిస్టంగా భావించి దాని ద్వారా శరీరానికి వైద్యం చేసేవాడు. ఇందులో అనేక కష్టాలను ఎదుర్కోవలసి వచ్చేది. రోగి సహకరించేవాడు కాదు. బాధాతప్త గత జీవితాన్ని గుర్తుచేసుకోవటం ఇష్టం ఉండేది కాదు. సాధ్యమైనంత వరకు దీని నుండి తప్పించుకుపోవటానికి, పారిపోవటానికి ప్రయత్నం చేసేవాడు. అందుకని ఫ్రాయడ్ రోగికి నేస్తంగా సన్నిహితునిగా మెలుగుతూ విషయాన్ని రాబట్టేవాడు. అణచబడిన అంతరాత్మకు బహిర్గతం కాని అంతరాత్మకు తీవ్ర సంఘర్షణ జరిగేది. అంటే ఇచ్ఛ లేదా సంకల్పానికి సహజ జ్ఞానానికి (విల్/ఇన్స్టింక్ట్) మధ్య సంఘర్షణ అన్నమాట. ఈ సంఘర్షణ నుండి రోగిని ఫ్రాయడ్ తన విశ్లేషణ ద్వారా బయటపడేటట్లు చేసేవాడు. రోగి కలలను చిహ్నాలుగా వికారాలను తీరని కోరికలను తీరాలనే కోరికలను ఫ్రాయడ్ బయటపెట్టేవాడు. కలలకు అర్థాలను వెతికి చెప్పేవాడు. వాటిలో రోగి దాచుకున్న ఆందోళనలను వెతికి వెలికి తీసేవాడు. దీనిపై ఫ్రాయడ్ "A dream frequently has the profoundest meaning in the very places where it seems most absurd. Dreams behave in real life like the prince who in the play pretends to be a mad man. Hence we may say of dreams what Hamlet said of himself- substituting an unintelligible jest for the actual truth", " I am but mad North North West when the wind is southerly. I know a hawk from a handsaw". పదేళ్ళు దీనిపై ఒంటరిగా శ్రమించి ఫ్రాయడ్ "ఇంటర్ ప్రిటేషన్స్ అఫ్ డ్రీమ్స్" అనే కలలపై తొలి గ్రంథాన్ని రాసాడు. ఇది మానసిక శాస్త్రంపై వచ్చిన తొలి అపూర్వ అద్భుత గ్రంథంగా పేర్కొంటారు. దీనిపై ఫ్రాంజ్ అలక్జాండర్ సమీక్ష చేస్తూ ఈ గ్రంథ

ప్రచురణ మానవ విజ్ఞాన అభ్యుదయంలో ఒక మైలు రాయి అన్నాడు. ప్రతి వ్యక్తీ కలలు కంటాడు. వాటికి అర్థాలుంటాయి. వాటిని గుర్తించి వైద్యంలో చేరిస్తే రోగి సుఖపడతాడు.

ఫ్రాయడ్ కొత్తగా పొడిచేసి కొత్త సిద్ధాంతం కనిపెట్టలేదని అన్నవారు కూడా అతని విధానాన్ని మెచ్చకుండా ఉండలేకపోయారు. మానసిక ఉద్రేకం వలన కలిగిన గాయం ఏదో ఒక వ్యాధికి కారణభూతం అవుతుంది. దానికి సెక్స్ కూడా కారణం కావచ్చు. చిన్నతనంలో సెక్స్ వలన కూడా కొన్ని రోగాలు వచ్చే ప్రమాదం ఉందన్నారు. దీనిపై ఎమిల్ లుడ్విగ్ తీవ్రంగా విమర్శిస్తూ "Freud' opium endangers our generation"అన్నారు. ప్రతిబాలుడికి చిన్నతనంలో తల్లితో అనుబంధం ఎక్కువగా ఉంటుందనీ తండ్రికి దూరంగా ఉంటాడని దీనినే "ఈడిపస్ కాంప్లెక్స్" అంటారని, ప్రతి బాలికకు తండ్రిని ఆరాధించే "ఎలక్ట్రా కాంప్లెక్స్" ఉంటుందని ఫ్రాయడ్ చెప్పాడు. ఇవి యవ్వన దశలో వారికి ఇబ్బందికరంగా మారతాయి. కనుక యవ్వన దశలో నిరుత్సాహం ఆవహించి కలలలో లేక భయంకర భ్రమల్లో పడిపోతారు. భయం పెరిగిపోయి సామాన్య బాధ్యతలనుండి తప్పుకోడానికి ప్రయత్నం చేస్తారు. ఇలాంటి అసాధారణ విషయలపైనే కాకుండా సెక్స్ కోరికపైన కూడ పైన పరిశోధించాడు. దానికి ఉన్న ప్రాముఖ్యతను, సంపూర్ణ మానవ వ్యక్తిత్వానికి, సెక్స్‌కూ గల సంబంధంపై అధ్యయనం చేసాడు. "Three contributions to the theory" అనే ఫ్రాయిడ్ ఆంగ్ల అనువాద గ్రంథానికి ముందుమాట రాస్తూ జేమ్స్ పుట్నం "మానవ జీవితంలోని ప్రతి దశను లోతుగా చొచ్చుకుపోయాడని మానవ శీలాభివృద్ధికి కృషి చేసాడని సైకో న్యూరాటిక్ వ్యాధులకు కారణాలను ఆవిష్కరించాడని" మెచ్చుకున్నాడు.

ఫ్రాయడ్ సాధించిన విజయాలను కొందరు తక్కువగా అంచనా వేసినప్పటికీ వియన్నా యూనివర్సిటీ పదవీ గౌరవం కల్పించనప్పటికీ ఫ్రాయడ్ రాసిన పుస్తకాలు వేలాదిమందినీ స్పెషలిస్టులను ఆకర్షించి ఉత్తేజం కలిగించాయి. నలభై ఏళ్ల నడి వయస్సులో ఫ్రాయడ్ ఒక తుఫాన్ కేంద్రమయ్యాడు. ఆయన దగ్గర చదువుకోటానికి కార్ల్ జంగ్, ఆల్ఫ్రెడ్ ఆడ్లర్, ఆటో రాంక్, థియోడార్ రీగ్, ఎ.ఎ.బ్రిల్, ఎర్నెస్ట్ జోన్స్, విల్హేం స్టేకేన్, ఆన్నస్ స్టాచ్ మొదలగు ప్రసిద్ధులు వచ్చారు. వీరిలో అందరూ ఎవరి స్థాయిలో వారు గొప్పవారే. ఇందులో చాలామంది ఆయనతో విభేదించి వాదానికి దిగినా ఆయనను తండ్రిగా, దేవునిగా భావించి ఆరాధించారు. ఫ్రాయడ్ సిద్ధాంతాలను మెరుగుపరచడానికి తోడ్పడ్డారు. ముఖ్యంగా జంగ్ ఫ్రాయిడ్ చెప్పిన సెక్షువల్ సైకలాజికల్ ఇన్స్పిరేషన్‌ను అంగీకరించలేదు. ఇతను సామూహిక అంతరంగాన్ని గురించి కొత్తగా చెప్పారు. ఇవి మనిషి ప్రాథమిక దశలోని జ్ఞాపకాలు, వ్యక్తిత్వంలోని భాగాలు. ఎడ్లర్ సెన్స్ అఫ్ ఇనాడిక్వసీ డెవలప్ మెంట్ ప్రమాదంగా భావించాడు. రాంక్ పుట్టుకలోని

గాయాలపై దృష్టి పెట్టాడు. దీని వలన జరిగే షాక్ జీవితంలో తర్వాత ఆందోళనలుగా మారతాయని రక్షణ నుండి విడిపోతారని పోరాటానికి దూరమైపోతారని అన్నాడు. ఎవరు ఏరకంగా చెప్పినా ఫ్రాయడ్ మూల సిద్ధాంతాన్ని కాదనలేదు.

50వ ఏట ఫ్రాయడ్ సంప్రదాయ అసూయగల టీచరులాగా కన్పించేవాడు. బలహీనమైన శరీరం, చిన్న గడ్డం, తీక్షణమైన కళ్ళు ఇందులో ధ్యాన మగ్నత కన్పించేవి. అతని భార్య పిల్లలు ఇంటిని చక్కగా దిద్దుకునేవారు. పిల్లలు జ్యూస్ లాగా పెరిగారు. యాంటి సేమిటిజం కాలంలో ఇలా పెంచటం కష్టంగా ఉండేది. దీనిపై స్పందిస్తూ ఫ్రాయడ్ "life is a problem for everybody. Besides you can', 't expect to be a Jew for nothing" అన్నాడు. అరవై పడిలో ఈ జ్యూయిష్ సైంటిస్ట్ శారీరక, మానసిక క్షోభను అనుభవించాడు. మొదటి ప్రపంచ యుద్ధం మానసికంగా ఎదురు దెబ్బ తగిలించింది. హేతువుపై పిచ్చితనం విజయం సాధించి నాశనం చేసింది. దానితో పాటు స్వయంగా కూడా నష్టపోయాడు. ఇద్దరు కొడుకులు జర్మనీ తరపున యుద్ధం చేశారు. స్నేహితులు, శిష్యులు ఎవరి నమ్మకం ప్రకారం వాళ్ళు పోరాడారు. చలి, ఆకలి పరిస్థితులను మరింత కష్టతరం చేసి విషాద వేదాంతిగా మారిపోయాడు. మోసగించక, మోసగింపబడక జీవితానికి ఎదురీదాడు. అరవై ఏడావ ఏట మరింత లోతుగా అధ్యయనం చేశాడు. మొదటి ఆపరేషన్ దవడ ఎముక కాన్సర్‌కు చేయించుకోవలసి వచ్చింది. ఆ తర్వాత అనేక ఆపరేషన్స్ జరిగాయి. మనిషి మానసిక స్థితిని గురించి అధ్యయనం చేస్తూనే ఉన్నాడు. సాంస్కృతిక పరాక్రమానికి అతని సృజనాత్మకతలపి దృష్టి సారించాడు. తన జీవిత ధ్యేయం "Making life long detour through the natural sciences medicines and psycho therapy" అని చెప్పాడు. 1925లో స్వీయ జీవిత చరిత్ర రాస్తూ తనను యవ్వనంలో ఆకర్షించిన సాంస్కృతిక సమస్యలపై దృష్టి పెట్టాను అన్నాడు. ముసలి సైంటిస్ట్ యువ దార్శనికుడు కలిసిపోయారు.

కొంతకాలం తర్వాత ఆటో బయోగ్రఫీ రాస్తూ అజ్ఞాత మానసిక స్థితి (id), అహంపై అధ్యయనం చేస్తూ అస్వాధీనమైన శక్తులు యదార్థాన్ని సాధించడం అహం పెరిగి విపరీత అహం ఏర్పడి హింసాత్మక చర్యకు పాల్పడుతుందని చెప్పాడు. ఇక తాను సైకో అనాలసిస్‌పై నిర్ణయాత్మక విధానాలేమీ చెప్పకర్లేదు అని చెప్పాడు. ఇప్పటిదాకా చెప్పినదానిపై అనవసరమైనది కూడా ఉండి ఉండవచ్చని దీనిపై ఎవరో ఒకరు కొత్త విషయాలు చేర్చవచ్చని అన్నాడు. ఇది కొంచెం తనను తాను తక్కువ చేసి చెప్పుకున్నట్లు ఉన్నప్పటికీ 71వ ఏట "The Future of an illusion"ను రాసి ప్రచురించాడు. 74 వ ఏట "సివిలైజేషన్ అండ్ ఇట్స్ డిస్ కన్టేన్ప్ (నాగరికత–అసంతృప్తి)పై విచారించాడు. తనకు తెలిసిన ప్రపంచం కూలిపోతోందదేమో అని భయపడ్డాడు. జంగ్ మొదలైన

సైంటిస్టులు మానవతకు పూర్తి వ్యతిరేకులయ్యారు. కానీ నిజానికి ఫ్రాయడ్ వియన్నాలో అతి ప్రమాదకర పరిస్థితుల్లో ఉన్నాడు. మొదటిసారిగా జనం మధ్య అనార్యులకు చెందిన పుస్తకాలను తగలపెడుతూ ఫ్రాయడ్ పుస్తకాలను 1933లో అగ్నికి ఆహుతి చేశారు. దీనిపై "Atleast I have been burnt in good company" అని స్పందించాడు. 77వ ఏట ఆకస్మిక ఆపద మీదపడింది. అయినా తట్టుకుని ఉన్నాడు. 81వ ఏళ్ళు వచ్చాక హిట్లర్ ఆస్ట్రియాను ఆక్రమించాడు. జర్మన్ సామ్రాజ్యంలో కలిపాడు. ఫ్రాయడ్ పాస్‌పోర్ట్‌ను నాజీలు లాగేసుకున్నారు. డబ్బును దోచుకుని అతని ప్రచురణ సంస్థను నాశనం చేశారు. స్నేహితులు ఫ్రాయడ్ లండన్ పారిపోవటానికి సహకరించారు. 82వ ఏట తన సైకో అనాలసిస్‌పై రాస్తూ దాని ఉద్దేశ్యం "Naturally not compel belief or to establish conviction" అని వివరణ ఇచ్చాడు. 83వ ఏట ప్రవాసంలోనూ బాధలు ఎక్కువయ్యాయి. క్రమంగా బలహీనుడై 83వ పుట్టినరోజు జరిగిన నాలుగు నెలల తర్వాత హామ్ స్టెడ్‌లోని సొంత ఇంట్లో ఒక్కసారిగా కుప్పకూలి పోయాడు. 23-9-1939న మానసిక విశ్లేషణ పితామహుడు మరణించాడు.

ఫ్రాయడ్ మరణం తర్వాత అతని సిద్ధాంతాలు ప్రతి మానవ ఆలోచనను ప్రభావితం చేశాయని భావించారు. ఫ్రాయడ్ తర్వాత మానవాళిని ప్రభావితం చేసిన ఇద్దరు మహా వ్యక్తులు కార్ల్ మార్క్స్, ఆల్బర్ట్ ఐన్ స్టీన్ మాత్రమే అని చెప్పవచ్చును. వీరు ముగ్గురు తమ జీవితకాలంలోనే మరియు తర్వాత ప్రభావం చూపగలిగారు. 1950 నాటికి ఫ్రాయడ్ సైకో అనాలసిస్ మీద నాలుగు వేల ఏడూ వందల ముప్పై తొమ్మిది రచనలు చేసినట్లుగా గుర్తించారు. 1950కి ఈ సంఖ్య రెట్టింపైంది. ఇంగ్లాండ్ అమెరికా మొదలగు దేశాలలో సైకో అనలటికల్ జర్నల్స్ వచ్చాయి. మానవ ప్రయత్నంపై అనేక రంగాలలో ఫ్రాయడ్ ప్రభావం ఉందని

కనుగోన్నారు. మొదట వ్యతిరేకించినా అందరూ అంగీకరించారు. ఫ్రాయడ్ రాసిన "Totem and Taboo" గ్రంథం కొత్త సైకో అనలటికల్ ఆన్త్రోపాలజీలో ఏర్పరచింది. అతని "ivilisation and discontent"లో మనిషి నైతిక శిక్షణకు లోపలి అనైతికతకు మధ్య పోరాటాన్ని తెలియచేసింది. ఆయన రాసిన "The future of an illusion" మరియు "Moses and Monothisms "Opened one of the most passionate and revealing and instructive debates on the problem of religious faith" అని విశ్లేషించారు. మనిషిని అతని ప్రేరణను వేరుచేసి శక్తివంతుడిని చేసి అతని బాధ్యతలను పరిపూర్ణంగా గుర్తించప జేసి పనిచేయించటమే ఫ్రాయిడ్ చేసిన ఆలోచన. ఈ విషయాలపై అనేక నాటకాలు, గ్రంథాలు వచ్చాయి. ఫ్రాయడ్ ప్రభావం జేమ్స్ జాయిస్‌పై పడి అతని "స్ట్రీం అఫ్ కాన్షస్ నెస్" (చైతన్య స్రవంతి)కు కారణమైంది. అలాగే డి.హెచ్.లారెన్స్‌పై కూడా ప్రభావం చూపింది. ప్రముఖ నాటక

కర్త యూజీన్ ఓ నీల్‌పై ప్రభావం కల్గించి అతని "ఇంటీరియర్ మోనోలోగ్" నాటకాల సృష్టికి కారణమయ్యాడు. థామస్ మాన్ కూడా "పవర్ ఆఫ్ అన్ కాన్షస్" పై అనేక రచనలు చేసాడు. సైకాలజీని అవాస్తవికతను కవిత్వాన్ని, విశ్లేషణను కలిపి రాసానని మాన్ చెప్పాడు. "We shall one day recognize in Freud' life work the corner stone for the building of new anthropology" అని ఘంటాపథంగా చెప్పాడు మాన్. స్వేచ్ఛ గల అంతరాత్మతో మానవాళి జీవించాలని ఫ్రాయడ్ ఉద్దేశ్యం. ఆధునిక శాస్త్ర జ్ఞానం మనిషి తనపై ఉన్న విశ్వసాన్ని పెంచింది. డార్విన్ సిద్ధాంతానికి ఫ్రాయడ్ సిద్ధాంతం అదనపు ఆకర్షణ అయ్యింది. "It was Freud who replaced Locke's essentially blank aesthetically and emotionally empty soul and Darwin' merely biological behavioristic man with an emotional being a being of whom passion is the essence. This is the kind of scientifically conceived person with whom the arts and their emotional and vivid esthetic material can best function".

ఇంత గొప్ప పని చేసినా ఫ్రాయడ్ పై పొగడ్తల కంటే తెగడ్తలే ఎక్కువ. అతని సైకో అనాలసిస్‌ను కమ్యూనిస్టులు బూర్జువా తత్వంగా భావించి రష్యాలో అనుమతించలేదు. కాథలిక్ చర్చ్ విషపు బోధనలగా భావించి ఫ్రాయడ్ సిద్ధాంతం నమ్మిన వారు పాపాల పాలౌతారని హెచ్చరించింది. మానసిక శాస్త్రవేత్తలు ఏకమై ఆయన పూర్వ శిష్యులతో కలిసి ఫ్రాయడ్ నిర్ణయాలపై దాడి చేసారు. "The case against psycho analysis" అనే పుస్తకంలో అంద్రూ సాల్టర్ "ఫ్రాయడ్ మానసిక పాఠం తప్పుల తడక అని చిత్రమైనదని అవి కొలంబస్ ముందున్న న్యూ వరల్డ్ మేపుల వంటివి" అన్నాడు. ఫ్రాయడ్ స్థితిని హాస్యాస్పదమైనదని పూర్తి అశాస్త్రీయమైనదని అవివేకమైనదని అన్నాడు. ఎమిల్ లుడ్విగ్ తీవ్రంగా స్పందిస్తూ "Humanity has been robbed of all decency by the sexual pre-occupations of a man who 'groping in unknown regions has set himself as dictator" అని ఘాటైన విమర్శలు చేశాడు. ఇవన్నీ ఫ్రాయడ్ ముందు ఊహించినవే. ఆయనది శాస్త్రీయ దార్శనికత ప్రయోగం పరీక్ష పునరాలోచన. ఫ్రాయడ్ "The trouble with psycho analysis is the psycho analyst" అని ముందే ఊహించి చెప్పాడు. ఎన్ని అవాంతరాలు, అడ్డంకులు, ఆక్షేపణలు ఉన్నా ఫ్రాయడ్ సిద్ధాంతం అనేక రంగాలలో పరిశోధనలను చేయించింది. మేధోచర్యలను ప్రేరేపించింది. విజ్ఞానాన్ని బంధించకుండా స్వేచ్ఛగా ఎదగాలని భావించినవాడు ఫ్రాయడ్. అతని కృషి అనితర సాధ్యమైనది. "Freud' s contribution the extension of the imaginative recognition of a human being of himself and his sympathetic understanding of the another" అని రచయిత లూయి అంటర్ మేయర్ అంటాడు.❁



## 30. నోబెల్ బహుమతి అకాడెమీ అవార్డ్ పొందిన - జార్జి బెర్నార్డ్ షా (1856-1950)

94 ఏళ్ళు జీవించి ఎదురులేని నాటక రచయతగా పేరుపొంది ఆ శతాబ్దపు యువ మేధావిగా ప్రసిద్ధి చెందిన ఐరిష్ నాటక రచయిత జార్జ్ బెర్నార్డ్ షా 2-11-1950లో మరణించాడు. మహోన్నతులలో చివరి వాడు నిజమైన మొదటి సంస్కారవంతుడైన వ్యక్తి బెర్నార్డ్ షా అని నాటక నవలా రచయిత అయిన జె .బి. ప్రీస్ట్లీ అభివర్ణించాడు. షా నాటకాలతో ప్రసిద్ధి చెందటమే కాక మహాగొప్ప విమర్శకుడు కూడా. ఒక్క మాటలో అతనిని "మూవర్ అండ్ షేకర్" అని అనాలి. అన్ని రకాల భేషజాలకు బద్ధ వ్యతిరేకి. ఆయన వ్యంగ్య రచయత మాత్రమే కాదు సంస్కరణవాది కూడా. అయితే దేనికీ నిబద్ధుడైన వ్యక్తి కాదు. అతనివి అనేక పార్శ్వాలు. ఉపాధ్యాయుడు, ప్రతి దానినీ ఖండిస్తూ దేనిని అంగీకరించేవాడు కాదు. అతనిది యుద్ధ క్షేత్రం. అతనిలో విశ్వ భావనలు ఉన్నాయి. డాన్ క్విక్సోట్‌కు ఉన్న పోరాట పటిమ కలవాడు. డాన్ జువాన్ లాగా ప్రభావితం చేయగల వ్యక్తి. పశ్చిమ ప్రపంచ నైతికతను ఛాలెంజ్ చేసినవాడు.

జార్జి బెర్నార్డ్ షా ఐర్లాండ్‌లోని డబ్లిన్‌లో 26-7-1856న తండ్రి జార్జి కార్ షాకు ముగ్గురి సంతానంలో ఒకే ఒక మగ పిల్లవానిగా జన్మించాడు. తండ్రి అసమర్ధపు సివిల్ ఉద్యోగి. తల్లి లుసిండా ఎలిజబెత్ గర్లీ షా ఒక భూస్వామి కుమార్తె. తండ్రి నుండి షాకు ఐరిష్ తెలివి, విలాసం సంక్రమించాయి. మద్యపానం మాత్రం అబ్బలేదు. తండ్రిని తాగుబోతుగా చెప్పుకున్నాడు షా. అంతే కాక భరించరాని వాడుగా తయారయ్యాడని చెప్పుకున్నాడు. తల్లి గాయకురాలు, కళలపై అభిమానం కలది. కొడుకుకు సంస్కృతిపై అభిమానం కల్గించింది. ముఖ్యంగా సంగీతం, చిత్రలేఖనం. డ్రామాలపై గొప్ప అభిరుచిని కల్గించింది. షా సాధారణ విద్య పరిమితమైనది. 13వ ఏట వేస్లియన్ కన్వెన్షనల్ స్కూల్లో చేరాడు. తర్వాత డబ్లిన్లోని సెంట్రల్ మోడల్ బాయ్స్

స్కూల్లో చదివాడు. ఈ స్కూల్ అంటే అతనికి పరమ యావగింపు. 80 ఏళ్ల కాలం వరకు ఎక్కడా ఆస్కూల్ ఊసు ఎత్తలేదు. భార్యకు కూడా చెప్పలేదు. దానిని గురించి తర్వాత చెబుతూ షా "It was to me what the blacking warehouse was to Dickens" అన్నాడు. ఈ స్కూల్లో ఏడాదే చదివి 1871లో కమర్షియల్ డే స్కూల్లో చేరాడు. తండ్రి దమ్మిడీ కూడా సంపాదించలేక కుటుంబ పోషణను వదిలేశాడు. తల్లి మ్యూజిక్ టీచరుగా పని చేస్తూ చదివించింది. 15వ ఏట డబ్లిన్ లోని ఒక లాండ్ ఏజెంట్‌కు సహాయకునిగా పని చేశాడు. ఇష్టం లేకపోయినా ఇబ్బంది పడుతున్నా అక్కడే 27 ఏడూ వచ్చే దాక కాషియర్‌గా పని చేశాడు. తల్లి తాగుబోతు భర్తను వదిలేసింది. ఆమె ప్రోత్సాహంతో రచయతగా మారాలని అనుకున్నాడు. తల్లి ఆసరాతో తాను ఒక మనిషిగా నిలబడాలని భావించానని చెప్పుకున్నాడు. పెన్నును నమ్ముకున్న ఈ మేధావి అడ్డం వచ్చిన ప్రతిదాన్ని పెన్నుతో పొడిచి చీల్చి చెండాడాడు. 5 నవలలు రాసినా ఎవరూ ప్రచురించే సాహసం చేయలేదు. షా ప్రముఖ వ్యక్తి అయిన తర్వాత అమెరికా పబ్లిషర్లు వీటిని దొంగతనంగా ముద్రించారు. 9 కఠిన సంవత్సరాలు గడిపి మొదటిసారిగా 35 డాలర్ల రాబడి సాధించాడు. అందులో 25 డాలర్లు ఒక పేటెంట్ మందుకు ప్రకటన రాయటం వలన వచ్చిందే.

దరిద్రంతో బాధపడుతున్న షా చాలా అవమానకర పరిస్థితుల్లో జీవించాడు. బూట్లు అరిగి చినిగిపోయి ఉండేవి. దుస్తులు అసహ్యంగా మురికితో ఉండేవి. చేతి కఫ్ లు చీలికలు పేలికలుగా ఉండి ఎప్పుడూ కత్తెర దెబ్బలు తింటూ ఉండేవి. మార్ఫోక్ జాకెట్టు వేసుకుని నికర్స్ బ్రోకర్స్ లాగ బ్రిటిష్ మ్యూజియంలో గడిపేవాడు. అక్కడ మార్క్స్ రాసిన దాస్ కాపిటల్, జర్మనీ సంగీతజ్ఞుడు వాగ్నర్ రాసిన "Tristan Und Isolde" చదివాడు. ఇబ్సన్ నాటకాల విమర్శకుడు, అనువాదకుడు విలియం ఆర్చర్‌తోనూ, సిడ్నీ వెబ్ అనే యువ సివిల్ సర్వెంట్‌తోనూ పరిచయం కల్గింది. వాళ్ళతో షా ఆదర్శ ధామ భావాలను (Utopian Ideas) సిగ్గుపడుతూ పంచుకునే వాడు. హెన్రీ జార్జ్ గురించి విని సోషలిస్టు భావాలను పెంచుకున్నాడు. షెల్లీని చదివి శాకాహారి అయ్యాడు. ఆయనకు మశూచికం సోకి గడ్డం గీసుకోలేక గడ్డం పెంచి షా అంటే గడ్డం మనిషి అన్పించాడు. ఇరవై ఏట ఆ గడ్డమే శోభనిచ్చింది. 30వ ఏట గడ్డం బిరుసెక్కింది. దానిని ఎప్పుడూ దువ్వుకుంటూ మాకీవిల్లీలాగా దుస్తులు ధరించేవాడు. కీర్తి ప్రతిష్టలు వ్యాపించిన తర్వాత తన నకిలీ మేఫిష్టోలియన్ రూపాన్ని చూసి గర్వ పడేవాడు. గడ్డం పూర్తిగా తెల్లబడి తర్వాత బక్క పలచని శాంతాక్లాజ్ లాగా కన్పించేవాడు లేదా "దైవరూప సైతాను"లాగా కన్పించేవాడు.

ఆర్చర్ దయ వల్ల షాకు ఒక పత్రికలో పుస్తకాల సమీక్ష చేయటం మరొక దాన్లో

కళాప్రదర్శనలు సమీక్ష చేయటం ఉద్యోగం దొరికింది. 29వ ఏట సంగీత విమర్శకుడు అయ్యాడు. "కోర్నో ది బెసేటో" అనే మారు పేరుతో ఈ సమీక్షలు రాసేవాడు. ఆరేళ్ళు సంగీత కచేరీలు, ఒపెరాలపై రచనలు చేసాడు. అందులో హాస్యం, వ్యంగ్యం బాగా పండేవి. ఆయనకు సంగీతం జన్మతహా వచ్చిందని చెప్పుకునేవాడు. 15వ ఏటే మొజార్ట్, హాండేల్. బీతొవెన్, మెండేల్సన్, రోసినీ , వెర్డిల సంగీత స్వరాలపై అవగాహన కల్గిందని చెప్పాడు. షా రాసిన "ద పెర్ఫెక్ట్ వాగ్నరైట్" ఆ సంగీతజ్ఞుని సంగీత విధానాన్ని ఆవిష్కరించిన గొప్ప పుస్తకం. "Ring of the Nibelings" అనే పుస్తకంలో గ్లాక్, వెర్డీల విస్తృత రచనలన్నింటి గురించి రాశాడు. ఇన్నేళ్ళుగా రాస్తున్నప్పటికీ బీదరికం మాట్లాడుతూనే ఉంది. కానీ అతనిలోని హాస్యం మాత్రం తగ్గలేదు. ఒకసారి బజారులో వెడుతూ ఉండగా ఒక గాయకుడు డబ్బు కోసం తన టోపీని చేత్తో పట్టుకోగా దానిని "నొక్కు" అని చెప్పి షా వెళ్ళిపోయాడు. 1894లో సంగీత విమర్శకునిగా రాజీనామా చేసి ఫ్రాంక్ హారీష్ పత్రిక సాటర్ డే రివ్యూలో డ్రామా క్రిటిక్ గా చేరాడు. ఇబ్సన్ నాటకాలతో అధిక ప్రేరణ పొందిన షా సొంతంగా సమస్యలపై నాటకాలు రాయటం ప్రారంభించాడు. నాలుగేళ్ళు నాటకాలు ఎలా రాయాలి అన్నదానిపై అనేక వ్యాసాలూ రాసాడు. అసంబద్ధమైన ముగింపులు ప్రొఫెషనల్ హీరోలను అసహ్యించుకున్నాడు. సార్డో రాసిన యాంత్రిక విధానపు నాటకాలను విమర్శించాడు. "It is the capacity for making good or bad art a personal matter makes a man a critic. The plain working truth is that it is not only good for the people to be shocked occasionally but absolutely necessary to the progress of the society that they should be shocked pretty often" అని నాటకాలపై తన అభిప్రాయం చెప్పాడు. ఇబ్సన్ నాటకాలు ప్రమాదకరం అని భావించినప్పుడు షా నాటక రచయితగా ముందుకు వచ్చాడు. ఇబ్సన్ సమకాలీన నాటకాన్ని చాలా గొప్పగా ప్రభావితం చేసి నాటక రంగ చరిత్రలో సువర్ణాధ్యయాన్ని నెలకొల్పాడని "The Quintessence of Ibsenism" అన్నదాంట్లో వివరించాడు.

1884లో చివరి ఐదవ నవల రాస్తూ తన రచనలు 50 లేదా 60 తిరస్కరింపబడినాయని దేనిని అంగీకరించలేదని ఇక నవలలు చాలు అన్పించిందని చెప్పుకున్నాడు. అప్పటికే సోషలిస్టు అయిన షా కొత్తగా ఏర్పడిన రోమన్ జనరల్ ఫెబియాస్ పేరు మీద ఏర్పడిన "ఫేబియన్ సొసైటీ"లో చేరాడు. ఈ సంస్థ క్రమగా ఊహా స్వర్గ విధానాన్ని వదలి శాస్త్రీయ సోషలిజం వైపు అడుగులు వేసింది. వారి నినాదం "Educate Agitate Organise". ఈ సంస్థకు నియమ నిబంధనలను షా రాసాడు. బాధ పడటం కంటే ఇంకొక అంతర్యుద్ధాన్ని ఎదుర్కుంటాం అని ఆ

సంస్థ చెప్పేది. స్వేచ్ఛ, సర్వ జనోపయోగం కోసం ఈ సంస్థ పని చేసింది. షా గొప్ప పాంఫ్లెటీర్ మాత్రమే కాని వక్తగా తడబడే వాడు. నెమ్మది నెమ్మదిగా తనను తాను తీర్చి దిద్దుకుని మహా వక్త అయ్యాడు. వారానికి మూడు సార్లు పార్కుల్లో, వీధులమూలల్లో ఖాళీ హాళ్ళలో లెక్చర్లు ఇస్తూ 12 ఏళ్ళు గడిపాడు. ప్రతి స్థాయిలోని శ్రోతలను అలరించటానికి కావలసిన మసాలా అంతా సమకూర్చుకునేవాడు. ఈయనపై పోలీస్ నిఘా కూడా ఉండేది. ఒకసారి ఉపన్యాసం ఆపటానికి ప్రభుత్వం అరడజన్ మంది పోలీసులను పంపించింది. చట్టాన్ని కాపాడే వారు మాత్రం షాను అభినందించేవారు. రెండు సార్లు స్వచ్ఛందంగా జైలుకు వెళ్ళాడు. ఫ్రీ స్పీచ్ కోసం పట్టు బట్టేవాడు. ప్రభుత్వ అనుమతి లభించేది కాదు. తాను సోషలిస్టు ప్రాపగాండా చేసేవాడినే కాని సంయమనం కోల్పయేవాడిని కాను అని చెప్పుకున్నాడు.

షా లోని నాటకకర్త 1892 వరకు బయటపడలేదు. కానీ 1885లో 29 ఏళ్ల వయసులో విలియం ఆర్చర్ అనే తోటి విమర్శకుడు, స్నేహితునితో కలసి పారిషియన్ విధానంలో ఒక మంచి నాటకం రాశాడు. అది వినోద ప్రధానమైనదిగా ఉంది. అది సాంఘిక ప్రచారంగా సాంఘిక సంస్కరణగా భావించాడు. ఆర్చర్ తప్పుకున్నాడు. షా తనలోని భావాన్ని ఆపుకోలేదు. ఏడేళ్ళ తర్వాత అదే "Widows Houses"గా వచ్చింది. "Plays Unpleasant" అనే శీర్షికలో వచ్చిన మొదటి నాటకం ఇది. ఇందులో హాస్యం, వివాదం ఉన్నాయి. ఒక కొత్త రకపు విదూషకుని జీతానికి కుదుర్చుకుని అతనితో సాంఘిక విషయాలపై చర్చించేవాడు. "విడోస్ హౌసెస్" నాటకం మధ్య తరగతి గౌరవాన్ని మురికివాడల వారి బీదతనాన్ని బహిర్గతం చేసింది. తెర దించేసిన తర్వాత నాటకంలోని పాత్రలు ప్రేక్షకులకు గుర్తుఉండిపోవాలని షా భావించాడు. ఒకే రకపు ప్రేక్షకులుంటారని అనుకోలేదు. ప్రతి మనిషి అతడు వెధవ అయినా మహర్షి అయినా ఒక దృక్పథం కలిగి ఉంటాడని అదే అతని తీరును సమర్థిస్తుందని ఇతరులకు కూడా అలాంటి అభిప్రాయలు ఉంటాయని నమ్మాడు. పుండాకోర్ కూడా అతని దృష్టిలో కొన్ని సిద్ధాంతాలు ఉంటాయి. సంఘం ఈ పుండాకోర్ తనాన్ని అతను తనను తాను తెలుసుకునేదాకా పెకలించలేదు. ఈ పనే సంఘానికి షా చేయాలనుకున్నాడు. ఈ పుండాకోర్లను అభిశంసించటం కాని పుండాకోర్లు కానివారిని పొగటం వల్ల కాని మార్పు రాదు. వాళ్ళు అలాగే బతుకుతూ ఉంటారు, చరిస్తూ ఉంటారు, తమను తాము గొప్పవారుగా చాటుకుంటారు.

విడోస్ హౌసెస్ నాటకం రాసిన మూడేళ్ళకు ఆరు విభిన్నమైన నాటకాలు షా రాసాడు. అందులో రెండు అసహ్యకరమైన నాటకాలు. ది ఫైలాండరర్స్ గొప్ప సటైర్ తో కూడిన నాటకం. "మిసెస్ వారెన్స్ ప్రొఫెషన్" నాటకం వ్యభిచారాన్ని వాణిజ్యపరం

చేసింది. అది బూర్జువా సొసైటీ వాణిగా సాంఘిక నేరంగా దానికి సంఘం మొత్తం భాగస్వామ్యం అయ్యిందని నిరూపించాడు. ఇందులోని విషయం విక్టోరియన్ ఇంగ్లాండ్ భావాలకు విరుద్ధమైనవి. దీనికి పరిణామాలు తీవ్రం. ప్యూరిటన్ ధర్మంపై వ్యతిరేకమైనదని దీనిని ప్రదర్శన ఆపేయించారు. తర్వాత నిషేధించారు. అమెరికాలో కూడా నిషేధించబడింది. తర్వాత వచ్చిన నాలుగు నాటకాలు "Arms and the Man, Candida, The man of destiny, You never can tellలు షా రాసిన గొప్ప ఆహ్లాదకరమైన ప్రసిద్ధి చెందిన కామెడీలు. "మాన్ అండ్ సూపర్ మాన్" లో స్త్రీ పురుషుల సెక్స్ విషయాన్ని చాలా మేధావంతంగా చిత్రీకరించాడు. ఈ ఏడు నాటకాలు ఒక సంపుటిగా వెలువడిన తర్వాత వీటిని అసంబద్ధమైన బాధ్యతా రాహిత్యంతోకూడిన విరక్త ఆడంబరంగా భావించారు. అమెరికా సమీక్షకులు అభ్యంతకరమైన భాషా నాటకాలుగా ముద్ర వేసారు. 1898 జూన్ 18 నాటి న్యూయార్క్ టైమ్స్ పత్రిక షా యొక్క పనికిమాలిన ఫిలాసఫీ సొంత డబ్బాలపై విరుచుకుపడింది. ఈ సోషలిస్టును "జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్" అని ముద్ర వేసింది. తన దృష్టి కోణాన్ని ఎవరూ అర్థం చేసుకోలేకపోయారని షా బాధపడ్డాడు. షాకు ఉన్న ఒకే లోపం కవిత్వ భాష తెలియకపోవటం. టైమ్స్ పత్రిక అతని అభిప్రాయాలను రచనలను చీదరించుకుని ఫోటో వేయటానికి కూడా నిరాకరించింది. ఈ రకమైన విమర్శలు అడపా దడపా వస్తూనే ఉన్నాయి. మరొక ఇరవై ఏళ్ల దాకా ఈ దాడి కొనసాగింది.

విరుద్ధభావాల వ్యక్తిగా అతన్ని భావించారు. విన్ స్టన్ చర్చిల్ "చాటర్ బాక్స్ ఆఫ్ సోషలిజం" అన్నాడు. మైకేల్ ఆండర్సన్ "Shah is a ready philosopher but no dramatist. His characters are exaggerations his situations farcical" అన్నాడు. రెండేళ్ళ తర్వాత షా రాసిన "బ్యాక్ టు మేతుసేల్లా" నాటకంపై గిల్బర్ట్ సేల్డర్స్ సమీక్షిస్తూ షా ఒక కళాకారుడు కాదు కనక అతని సృజన బతకదు అని తేల్చి చెప్పాడు. వీటన్నిటికీ కారణం షాకు ఉన్న తీవ్ర స్వభావం, తన గురించి విరుద్ధ నిర్ణయాలు. తన రచనలకు తాను సిగ్గుపడటం లేదని, రాసిన విధానం గురించి కూడా చింత్రించటం లేదని షా చెప్పేవాడు. తన రచనల బాగోగులను మెజారిటీ ప్రజలు చెప్పాలి కాని ఒకరిద్దరు విమర్శకులు కాదని అనే వాడు. తాను డ్రైడేన్ లాగా ఉపోద్ఘాతాలు రాసేవాడినని వాగ్నర్ లాగా గ్రంథాలు రాశానని ఇవన్నీ చేయగలసమర్ధుడినని చెబుతూ "I would give half a dozen of Shakespeare's plays for one of the preface he ought to have written" అని రాసుకున్నాడు. "ఏన్శేంట్ మారినర్" లాగా తాను గుర్తుండి పోతానని తన కథను తాను వినోదాత్మకంగా చెప్పుకుంటూ పోతానని ఇతరులు తప్పు చేస్తుంటే తాను సరైన

పద్ధతిలో నడవడం తన ప్రత్యేకత అని చెప్పుకున్నాడు. "Nobody likes me. Capable persons are never liked. I am not likeable but I am indispensible" అని గర్వంగా ప్రకటించుకున్నాడు. స్వంత డబ్బా కొట్టుకోడంపై షా స్పందిస్తూ "The spontaneous recognition of really original work begins with a mere handful of people and propagates itself so slowly that it has become a common place to say that genius demanding bread is a given a stone until after its possessorÑ s death. The remedy for this is sedulous advertisement" అందుకనే తను గురించి తాను గొప్పలు చెప్పుకోవలసి వస్తుందని తానింకా మధ్య వయసులోనే ఉన్నానని తాను "ఫ్లయింగ్ డచ్ మాన్" లాగా ఒక లెజెండ్ నని దర్పంగా తెలియపరచాడు. తన నాటకాలలోని విదూషకునిలాగా అప్పుడప్పుడు బయటపడేవాడు. తాను సత్యాన్ని తెలియపరచటానికే 'జోకుతూ' ఉంటానని అన్నాడు. "The truth is the one thing that nobody will believe" అని ఘాటుగా చెప్పాడు. కనక తనను జనం వినాలంటే కొన్ని పిచ్చి ప్రవర్తనలు తప్పవని అన్నాడు. ఈ ఇబ్బందులన్నీ సరైన విషయాన్ని తెలియచేయటం దానిని అత్యంత ఉన్నత స్థాయిలో చెప్పటం తన లక్ష్యం అన్నాడు.

స్వయం వ్యక్తిత్వంతో షా లెజెండ్ తో పాటు అల్లరి, ఆగం కూడా పెరిగాయి. సంప్రదాయంపైనా వ్యతిరేకంగా ఉన్న భావాల వలన షా కుంభ కోణాలకూ కేంద్రమయ్యాడు. ఆయన నిజంగా ఉన్నత నైతికతో జీవించాడు. ఆయన ప్లేటానిక్ ప్రేమలు, భావోద్రేకాలు. అన్నీ కాగితం మీదనే నిజ జీవితంలో కాదు. అతనిది "సెక్స్ లెస్ వాకింగ్ బ్రెయిన్" అన్నాడు ఫ్రాంక్ వారిస్. ఈ మాట ముప్పై యేదు వచ్చే వరకు నిజమే. విలియం మారిస్ అనే కవి కూతురు మే మారిస్ పై మోజు పడ్డాడు. ఆధ్యాత్మికంగా "అనీబ్ సెంట్"కు దగ్గరగా ఉండేవాడు. థియాసఫీకు భాష్యకారుడు. ఇరవై తొమ్మిదవ ఏట జెన్ని పీటర్సన్ షాను ముగ్గులోకి దించింది. షాకు "రతి కార్యం" విసుగు, అవాస్తకమైనది అని అనిపించేది. ఆమెకు ఆ కోరిక ఎక్కువ. నటీమణులు ముగ్గురికి సుదీర్ఘమైన ప్రేమ లేఖలు రాసేవాడు. అందులో ఫ్లొరెన్స్ ఫార్ అనే ఆమె సాధారణ అమెచ్యూర్ రచయిత్రి, గాయకురాలు మరియు ఈజిప్టా లజిస్ట్ తూర్పు దేశపు మార్మిక భావాలకు ఆమె ఆకర్షితమైంది. ఆమె ఇంగ్లండ్ వదలి ఇండియా వచ్చి చనిపోయింది. ఎలాన్ కెర్రీతో కూడా తొమ్మిదేళ్ళు లేఖాయణం సాగించాడు. ఆమెను కలవటానికి భయపడేవాడు. "షా టెర్రీల లేఖలు"కు ముందుమాట రాశాడు. అందగత్తె మిసెస్ పాట్రిక్ కాంప్ బెల్‌తో కూడా చనువుగా ఉత్తరాలు రాసేవాడు. ఇరవై ఎనిమిదేళ్ళు ఈ లేఖా స్రవంతి సాగింది. తన ప్రేమంతా పోస్టు ద్వారా పొంగి పొరలిందని

చెప్పుకునేవాడు. "పిగ్మాలియన్" నాటకం రిహార్సల్స్ జరిగే రోజుల్లో "one of these days Shaw will eat a breakfast and God help all women" అని గుసగుసలాడేవారు. నలభై ఏడు వచ్చే సరికి పెళ్లి చేసుకోవాలనే తలపు పెరిగింది. అప్పుడు కూడా ప్రేమాయణం సాగించాడు. కానీ తటపటాయించాడు. ఐర్లాండ్‌కు చెందిన గొప్ప సంపదకు వారసురాలైన షార్లెట్ పెన్ టౌన్ సెండ్ అనే తెలివి గల అమ్మాయితో గడిపి ఆమె డబ్బు ఈయన అనుమానాలతో అది బెడిసిగోట్టింది. షార్లెట్‌తో ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఆమెకు టైప్ వచ్చు కనక షా రాసిన షార్ట్ హాండ్‌ను టైప్ కొట్టేది. ఇద్దరి మధ్య గొడవలు, పోట్లాటలు జరుగుతూ ఉండేవి. ఎంగేజ్మెంటు రద్దు చేసుకున్నారు. వెబ్స్‌తో పాటు షార్లెట్ ప్రపంచ యాత్రకు వెళ్లాలని నిర్ణయించుకుంది. అధిక శ్రమ వలన షా ఆరోగ్యం దెబ్బతింది. ఆమె తిరిగి వచ్చి అతను ఉన్న చీకటి ఫ్లాటు నుండి మార్చి ఆరోగ్యం కుదుటపడే దాకా సేవ చేసింది. 1897లో "The Devil' s disciple" అమెరికాలో గొప్ప విజయం సాధించి డబ్బు చేతికొచ్చి షార్లెట్ సంపద కంటే ఎక్కువ సాధించాడు. ఇప్పుడు ఈ జంట 1898 జూన్ ఒకటిన పెళ్లి చేసుకున్నారు. నలభై ఐదేళ్ళు కాపురం చేశారు. హనీమూన్‌లో ఉండగా షా ఏంటి రొమాంటిక్ నాటకం "సీజర్ అండ్ క్లియోపాత్రా" రాశాడు.

మానవ సంబంధాలు ఆనందాన్ని వాయిదా వేసుకోవడం వలన వృద్ధి చెందుతాయని షా భావన. "ది ఆపిల్ కార్ట్" అనే నాటకంలో అనైతిక సెక్స్ దట్టించారు. ఏభై ఏళ్ళు వచ్చేసరికి 17 నాటకాల కర్త అయ్యాడు. లెక్కలేనన్ని కరపత్రాలు వివాదాస్పద వ్యాసాలూ అనేక విమర్శనా వ్యాసాలూ రాసాడు. ఒకసారి దూషణ, మరోసారి భూషణలకు గురయ్యే వాడు. షా అంటే "A dialectician who was a dynamo a storm center in the theatre and rudely energizing force in all contemporary culture" అనిపించుకున్నాడు. నలభై మూడవ ఏట "సీజర్ అండ్ క్లియోపాత్రా" నాటకం రాసి అందులో భావావేశాన్ని హేతువు మందలించినట్లుగా రాశాడు. ఇది షేక్స్పియర్ యొక్క "ఆంటోని అండ్ క్లియోపాత్రా"కు జవాబుగా కన్పిస్తుంది. నలభై నాలుగేళ్ల వయసులో "aptain Brassbound's conversion" పూర్తి చేసి బ్రిటిష్ ఇంపీరియలిజంను కళ్ళకు కట్టినట్లు చూపించాడు. నలభై ఐదులో "మాన్ అండ్ సూపర్ మాన్" అనే శక్తివంతమైన నాటకం చేశాడు. ఈ నాటకం చాలా సీరియస్ నాటకం. "Masterpiece of intellectual dramaturgy which broke not only with the English drama but English thinking" అని రుజువు చేసింది.పురుషుడిని "retreating quarry"గా స్త్రీని "Disguised but remorseless pursuer crying to the universe"గా అభివర్ణించాడు. "సూపర్ మాన్ కి

పిత" అయిన షా ఎంతో మంచి చెప్పినా సంతృప్తి చెందలేదు. నాటకంలో అంతర్నాటకం అతని ప్రత్యేకత. ఆయన పోప్ కవి చాటుపద్యాలను వాడాడు. అందులో కొన్ని ముఖ్యమైనవి "He who can does. He who can not teaches. DonÑ t do unto others as you would that they should do unto you" వంటివి చాలా ఉన్నాయి. "స్వేచ్ఛ అంటే బాధ్యత" అంటాడు షా. అందుకనే ఎక్కువ మంది భయపడతారు అన్నాడు. "Marriage is popular because it combines the maximum of temptation with the maximum of opportunity" అన్నాడు. సంపద అంటే దొంగతనం అనే అర్థం చెప్పాడు. జీవితం అందరి మనుషులను సమానం చేస్తుంది. చావు ప్రతిభను బయటపెడుతుంది లాంటి సామెతలను ఎన్నో ప్రయోగించాడు. చెడును అర్థం చేసుకున్నావారు దానిని క్షమిస్తారని దాన్ని కాదన్నవారు నాశనం చేస్తారని చెప్పాడు.

మాన్ అండ్ సూపర్ మాన్‌లో ఒక భాగం ప్రదర్శన యోగ్యం కాదు, అర్ధ శతాబ్ది కాలం అది ప్రదర్శింపబడలేదు. నాటక రంగ చరిత్రలో డాన్ జువాన్ నరకంలో ఉన్న మూడవ అంకం చాలా సుదీర్ఘంగా ఉండటం వలన పక్కన పెట్టేశారు. షా మరణం తర్వాతా పాతిక మంది నటులు అమెరికా వెళ్లి ఒక మిలియన్ జనాలకు రెండు గంటలు సైన్స్, సెక్స్ యుద్ధం, మతం, సంగీతం, రాజకీయం, విముక్తి మున్నగు అంశాలపై అవగాహన కల్పించారు. డాన్ జువాన్ అనేపాత్ర పలికిన అనేక విషయాలు షా మాత్రమే రాయగలడు అవి "they are not dignified, they are only fashionably dressed, They are not moral, they are only conventional. They are not virtuous, they are only cowardly. They are not prosperous, they are only rich..They are not loyal, they are only servile, not dutiful, only sheepish, not public spirited, only patriotic, not courageous, only quarrelsome, not determined, only obstinate not masterful, only domineering" అని రాక్షసుల స్నేహితులగురించి అనిపిస్తాడు. వీరంతా ఆనాటి ఆయన సమకాలీనులే.

"మేజర్ బార్బర మరియు డాక్టర్స్ డైలమా నాటకాలు షాలో ఉన్న అమిత శక్తిని ఆవిష్కరించాయి. మొదటిది సాల్వేషన్ ఆర్మీకి సంబంధించింది. మతానికి వ్యతిరేకంగా రాసిన కామెడి. మానవులకు ఉండాల్సిన మంచితనం గురించి బోధించింది. రెండవది ఫార్స్‌తో ఉన్న ట్రాజేడి. సుదీర్ఘ సంభాషణలు ఇబ్బంది పెడతాయి. ఆర్టిస్ట్‌ను చంపి అస్తిత్వ రాహిత్యాన్ని బతికిస్తాడు (Shaw allowed the non entity to live and the artist to die). యాభై ఏళ్ళనాటికి షా18నాటకాలు రాశాడు. ఇందులో

"Misalliance" అనే కామెడీ కూడా ఉంది. కుటుంబంలో తలిదండ్రులకు సంతానానికి మధ్య ఉన్న సంతోష రహిత సంబంధాలను వివరించాడు. షా రాసిన "పిగ్మాలియన్" నాటకం అనూహ్య విజయం సాధించింది. షా అంటే "పిగ్మాలియన్" అనే పేరొచ్చింది. దీన్ని సినిమాగా తీశారు. బాగా మాట్లాడటానికి ఫోనేటిక్స్‌ను దట్టించాడు. ఇంగ్లీష్‌లోని 42అక్షరాలకు దేనికి దానికి ఒక నిర్దుష్ట నాదం ఉంది అని తీవ్రంగా వాదించేవాడు. కాని మాటలు అడ్డు గోడలుగా స్థాయిల మధ్య (క్లాస్) నిలిచి మంచి కామెడీని దేశంలో పండించాయి.

వయసు పెరిగిన కొద్దీ షా మరింత ఆలోచనా పరుడయ్యాడు. మరింత విచారణ చేశాడు. సహనం పెరిగింది. సువ్యవస్థితమైన ప్రతి దానిపై తిరుగుబాటు బావుటా ఎగరేశాడు. అరవై ఏళ్ళ వయసులో చాలా సంపన్న జీవితం అనుభవించాడు. "హార్ట్ బ్రేక్ హౌస్" నాటకం రాశాడు. ఇది షా నాటకాలలో అత్యుత్తమమైనదని విమర్శకాభిప్రాయం. ఇది యుద్ధం ముందు స్థితి గతులకు దర్పణం అన్నారు. ఐరోపా నావ అంతూ దరీ లేని సముద్రంలో చుక్కాని లేని నావగా కొట్టు మిట్టాడుతున్నట్లు చిత్రించాడు. దీనిని సెంటిమెంటల్ డ్రామా అనాలి. నాటక కర్త సాంకేతిక నైపుణ్యానికి పరాకాష్ట. చెకోవ్ ఆవహించిన షా లాగా రాశాడన్నారు. ఆ తర్వాత ఐదేళ్ళు రెండు నాటకాలపై దృష్టి పెట్టాడు. అందులో ఒకటి "back to Methuselah"- ఒక గొప్ప నీతి కథ- రెండవ సృష్టి పరిణామం గురించిన కథ. మనుషులు కలకాలం జీవించే కథ. ఇది ఒక ఫాంటసీ. మార్మికతను జోడించి రాశాడు. షా దృష్టిలో లైఫ్ ఫోర్స్ లేక దేవుడు మనిషి లాంటి వాడే. అనంపూర్ణ మనిషి సంపూర్ణత కోసం ప్రయత్నించే వాడే. ఈ నాటకం బృహత్తరమై షా కన్న కలలన్నీ నెరవేర్చిందని భావిస్తారు. అరవై ఏడవ ఏట "సెయింట్ జోన్" అనే కదలించే కవితాత్మకమైన నాటకం రాశాడు. మనిషి ఆధ్యాత్మికతను జయించటం ఇందులో కథ. ఇంతకు ముందు చెప్పిన నాటకం వేదాంత సౌందర్యంగా ఉంటే ఈ నాటకం సాధారణంగా సహజంగా మానవ ఆత్మకు చాంపియన్‌గా నిలిచింది. రెండేళ్ళ తర్వాత షాకు సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది.

సెయింట్ జోన్ రాసిన తర్వాత నాటకకర్త షా లోని జీనియస్ క్రమంగా తగ్గింది. కానీ కరపత్ర రచయితగా విజ్రుంభి స్తున్నాడు. కొంతమంది దృష్టిలో పుస్తకాలకు షా రాసిన ఉపోద్ఘాతాలు ఆయన నాటకాల కంటే గొప్పవి. ఆ నాటకాలు థియేటర్ మోజు ఉన్నవాళ్లకే పరిమితం అంటారు. ఈ విమర్శలను లెక్క చేయకుండా అతి ముఖ్యమైన "ది యాపిల్ కార్ట్" నాటకాన్ని డెబ్భై మూడవ ఏట రాశాడు. ఆ తర్వాత డజను నాటకాలు రాసినా తళుకు, బెళుకు తక్కువ. అయితే వైవిధ్యం మాత్రం కనిపిస్తుంది. 1952లో సినీ నటి కాతరిన్ హెప్ బర్న్ షా ఎనభై ఏళ్ల వయసులో రాసిన "The

Millionairess"లో నటించి గొప్ప విజయాన్ని చేకూర్చింది.

రెండు ప్రపంచ యుద్ధాలు షాలో పాత భావాల స్థానంలో కొత్త భావాలకు ఆస్కారం కలిగించాయి. ఆయనలోని పాసిఫిజం గట్టిబడింది. పాట్రిక్ కాంప్ బెల్ అనే ఆమె తన ఒకానొక కొడుకు నటనలో చనిపోయాడని మత ప్రచారకుడు అభినందిస్తూ పెద్ద ఉత్తరం రాశాడని షాకు ఉత్తరం రాసింది. దీనికి కోపం సానుభూతి కలగలిపి షా "It is no use. I cant be sympathetic. These things simply make me furious. I want to swear. I do swear. Killed just because people blasted fools.A Chaplain too to say nice things about it. It is not his business to say nice things about it but to shout that' "the voice of thy son' blood crieth unto God from the ground" అని జవాబు రాసాడు. 75వ ఏట సోషలిస్టు కాని సోషలిస్టు అయిన షా రష్యా సందర్శించాడు. రెండేళ్ళ తర్వాత ప్రపంచ పర్యటన చేశాడు. ఎప్పుడు అమెరికాకు ఆహ్వానించినా తిరస్కరించే షా రెండుసార్లు అక్కడ ఆగాడు. మొదటిసారి పసిఫిక్ తీరంలో సాన్ సిమ్యాన్ రాంచ్ అఫ్ విలియన్ రండాల్ఫ్ హర్ స్ట్‌ను చూసినప్పుడు. ఈయన షాకు రచనలను కొన్ని సిండికేట్ చేశాడు. రెండవసారి న్యూయార్క్‌లో ఒక రోజు ఉండి మెట్రోపాలిటన్ ఒపేరా హౌస్‌లో ఉపన్యసించాడు. అప్పుడు మాట్లాడుతూ అమెరికా బ్యాంకులను జాతీయం చేయాలని పెట్టుబడిదారులను దూరం చేయాలని యుద్ధపు అప్పులన్నీ రద్దు చేయాలని కోరాడు. అక్కడి నుండి తన స్వగ్రామం హయాత్ సెయింట్ లారెన్స్‌కు తిరిగి వచ్చాడు. ప్రజాస్వామ్య విధానాలపై తనకున్న నమ్మకాలను ప్రకటించాడు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో షా తనను "General consultant to man kind"గా చెప్పుకున్నాడు.

నాన్ స్టాప్ గా రాస్తూనే 82వ ఏట 50వ నాటకం "జెనీవా" రాశాడు. 91లో "Beoyanat Billions" నాటకాన్ని పూర్తిచేసి మరొక కామెడీని ప్రారంభించాడు. ఆయన రచనా వర్క్ షాప్ పేరు "ది షెల్టర్". 93వ ఏట "Rhyming picture guide to Ayot Saint Lawrence" తయారు చేసాడు. షా గొప్ప ఫోటోగ్రాఫర్. ఇందులో ఫోటోలన్నీ తానే తీసిపెట్టాడు. ఇందులోని ప్రాసలు "స్కైలార్కింగ్ రైమ్స్"గా పేరు తెచ్చుకున్నాయి. వందేళ్ళకు పైగా బతుకుతానని అనుకున్నాడు. కానీ ఒక పండ్ల చెట్టుకు కుదురు చేస్తూ 1950 సెప్టెంబరు 10న పడిపోయాడు. తుంటి ఎముక విరగటం కారణంగా మరణం రాలేదు కానీ 94 ఏళ్ల ముసలితనంలో ఎముకలు చక్కగా అతుక్కున్నాయి. ఆ షాక్‌కు మాత్రం ఆయనకు కిడ్నీ ఇన్ఫెక్షన్ తెచ్చింది. రెండు ఆపరేషన్స్ జరిగినా ఫలితం లేకపోయింది. 2-11- 50న మహా నాటక రచయిత

బెర్నార్డ్ షా మరణించాడు. చనిపోయే నాటికి చాలా గొప్ప సంపన్నుడుగా ఉన్నాడు. అయన ఎస్టేట్ విలువ మిలియన్ డాలర్ల పైనే ఉంటుందని అంచానా వేశారు.

షా చనిపోయిన తర్వాత కూడా ఆయన ప్రేతాత్మ మాట్లాడుతూనే ఉంది. తనను వెస్ట్ మినిస్టర్ అబేలో ఖననం చేయొద్దని కోరుకున్నాడు. తనది, తన భార్య చితాభస్మాన్ని తమ గార్డెన్‌లో వెదజల్లమని కోరాడు. తన బ్రతుకు ఎంత సత్యమో తన మరణం కూడా అంతే అన్నాడు. షా "క్రియేటివ్ ఇవల్యూషన్"– సృజనాత్మక పరిణామంను నమ్మాడు. తనకు ఏ స్మృతి చిహ్నం నెలకొల్పవద్దని కోరాడు. తనపై రక్తతర్పణానికి చిహ్నమైన క్రాస్–శిలువను ఉంచవద్దని చెప్పాడు. కానీ నాటి ప్రధాని అట్లీ మాట్లాడుతూ "shaw was not only our greatest entertrainer but our greatest teacher"అని శ్రద్ధాంజలి ఘటించాడు. షాను "ఫైటింగ్ ఐడియలిస్ట్" అంటారు. షా నాటకాలు "అధిక ప్రాసంగిక సంభాషణలు". ఇందులో "వెంట్రి లోక్విజం" ఎక్కువ. సంప్రదాయాన్ని అస్థిరపరచిన దార్శనికుడు షా. ప్రతి దానిని లోతుగా తరచి అభిప్రాయం చెప్పేవాడు. ప్రశ్నలకంటే ఆయన సమాధానాలు ఇబ్బందికరంగా ఉండేవి. ఆయన భావనలు అరిస్టో ఫేనస్‌కు దగ్గరలో ఉంటాయి. "ది అకార్నియాన్స్" నాటకంలోని కోరస్ ఇరవై శతాబ్దపు ప్రేక్షకులనుద్దేసించి చెప్పబడింది. అదే "As for you never loose him. We will always fight for the cause of justice in his comedies. He promises you that his precepts will lead you to happiness though he uses neither flattery not intrigue nor bribery nor deceit. Instead of loading you with praise he will point you to the better way".

జీవితకాలంలో షా అరవైమూడు నాటకాలు రాశాడు కథ, నవలా రచయిత. వ్యాసాలూ కరపత్రాలు పుంఖాను పుంఖంగా రాశాడు గొప్ప విమర్శకుడు. సాంఘిక సమస్యలకు కామెడీజోడించి రాశాడు. పనివారల శ్రమ దోపిడీని వ్యతిరేకించాడు. స్త్రీ పురుషులకు సమాన హక్కులకు ఉద్యమించాడు. ప్రైవేట్ ఓనర్ షిప్‌కు వ్యతిరేకి. అందరికి ఆరోగ్యవంతమైన సుఖ జీవనం అందించటం ప్రభుత్వ లక్ష్యంగా ఉండాలని చెప్పాడు. కొంతకాలం స్థానిక రాజకీయాలలో పాల్గొన్నాడు. మానవజాతి అభివృద్ధికి తనదైన "యుజేనిక్స్" రాశాడు. నియంతృత్వ వ్యవస్థను వ్యతిరేకించి ప్రజాస్వామ్య విలువలను ఆరాధించాడు. 1925లో సాహిత్యంలో నోబెల్ ప్రైజ్‌ను, 1938 అకాడెమి అవార్డ్‌ను పొందినఏకైక సాహిత్య కారుడు షా. నోబెల్ అందజేస్తూ ఆయన్ను "marked by both idealism, humanity. its stimulating satire often being infused with a singular poetic beauty" అని శ్లాఘించారు. నైట్ హుడ్ఇస్తానంటే

వద్దన్నాడు షా. ఆర్డర్ ఆఫ్ మెరిట్ ఇస్తానంటే తిరస్కరించాడు. 1938 పిగ్మాలియన్‌కు ఆస్కార్ అవార్డ్ లభించింది.

షేక్స్ పియర్ నాటక నిర్మాణ లోపాలను ఎలుగెత్తి చాటాడు. షా వాటిలో ఎడిటింగ్ ఉండకూడదన్నాడు 'లండన్‌లోని రాయల్ కోర్ట్ థియేటర్‌లో షా రాసిన "జాన్ బుల్స్ అదర్ ఐలాండ్" నాటకం 1904లో ప్రదర్శించినపుడు ఏడవ ఎడ్వర్ రాజు చూసి పగల బడి నవ్వుతూ కుర్చీ విరగ్గొట్టాడట. అంతగా ఆయన ఎంజాయ్ చేశాడన్నమాట. పిగ్మాలియన్ నాటకం వేలాది ప్రదర్శనలతో విజయం పొందింది. 1998 మొదటిసారి షా కేమేరాకొని అమెచ్యూర్ ఫోటోగ్రాఫర్‌గా పేరు తెచ్చుకొన్నాడు. ఫోటోగ్రఫీని "సీరియస్ ఆర్ట్ ఫారం"గా ప్రచారం చేశాడు. ఎన్నో ఫొటోగ్రాఫిక్ ప్రదర్శనలపై రివ్యూలు రాశాడు.

రష్యావెళ్లినప్పుడు స్టాలిన్‌ను చూసి ఆయన విధానాలకు జేజేలు పలికాడు షా. "ఆన్ దిరాక్స్" నాటకంలో స్టాలిన్ భావాలను పోదిగాడు. యూజేనిక్ (సుజన విజ్ఞాన శాస్త్రం) సిద్ధాంతకర్త అయిన షా దాన్ని ఉద్యమంగా బాగా ప్రచారం చేశాడు. మాన్ అండ్ సూపర్ మాన్ నాటకంలో యుజేనిక్స్ సిద్ధాంతాన్నే ఆవిష్కరించాడు. సోషలిజంతో యుజేనిక్స్‌ను మిశ్రితం చేసి వ్యాప్తి చెందించాడు షా. షా కీర్తి ఖండాంతర వ్యాప్తి చెందింది ఆయన వ్యంగ్యానికి "షావియన్" అనే పేరు సార్ధకమైంది. ఇంగ్లీష్ స్పెల్లింగ్‌లలోని విరుద్ధతలపై జనానికి అవగాహన కల్పించాడు. తన సంపాదనలో కొంత భాగాన్ని ఆంగ్ల సాహిత్యంలో కొత్త ఫోనేమిక్ ఆల్ఫబేట్ తయారు చేయటానికి కేటాయించాడు ఆ ధనం చాలలేదు. కొంతకాలం దానిపై ఉపేక్ష వహించారు. పిగ్మాలియన్ మొదలైన వాటివలన రాయల్టీ బాగా పెరిగింది. కోర్టులో దావా జరిగి చివరికి షా తలబెట్టిన కార్యానికి కోర్టు 860 పౌండ్ల ధనాన్ని ఇవ్వాలని తీర్పు నిచ్చింది. దీనితోషా కన్న కల "షావియన్ ఆల్ఫబెట్" తయారు చేశారు.

షా నివసించిన గృహం "షా కార్నర్"గా ప్రసిద్ధి చెందింది. కెనడాలోని ఒంటారియోలో నయాగర సరస్సుపై టటషా ఫెస్టివల్" నిర్వహిస్తున్నారు. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌కు వ్యవస్తాపకులలొ షా ఒకడు. షా అయిదునవలలు రెండు కథా సంపుటాలు, అరవైమూడు నాటకాలు రాశాడు. ఇక కరపత్రాలు, విమర్శలు, వ్యాసాలూ లెక్క లేనన్ని. సంగీతవిమర్శపై పది ఉద్గ్రంథాలు రాశాడు జార్జి బెర్నార్డ్ షా. ❁



## 31. స్పష్టమైన వినిమయం కోసం నినదించిన అమెరికా ఆర్థికవేత్త - థార్ స్టెయిన్ వెబ్లెన్ (1857-1929)

థార్ స్టెయిన్ బుండే వెబ్లెన్ 30-7-1857న అమెరికాలోని విస్కాన్సిన్ ఫారంలో పన్నెండుడుగురు సంతానంలో ఆరవ వాడుగా పుట్టాడు. తలిదండ్రులిద్దరూ నార్వేజియన్ ప్రవాసీయులే. తండ్రి కార్పెంటర్. వ్యవసాయదారుడు కూడా. కాని దీనికి ఇష్టపడడు. మిగిలిన రైతుల్లాకాకుండా మగ పిల్లలతోబాటు ఆడపిల్లల్నీ కాలేజిలో చేర్పించాడు. కుటుంబం మిన్నేసోటాకు మారింది. అప్పటికే ఎనిమిదేళ్ళ వెబ్లెన్ ఇంగ్లీష్ లోకాకుండా నార్వేజియన్ భాషలోనే మాట్లాడేవాడు. ఇంగ్లీష్ అతనికి "విదేశీ భాష" అని పించింది. వెబ్లెన్ కుటుంబీకులు వ్యవసాయ క్షేత్రంలోనే పెరిగినా, పల్లెటూరి రైతులను పీడించే నగర వ్యాపారవేత్తల మధ్య తగాదాలలో భాగస్వాములయ్యేవారు. పదిహేడవ ఏట వెబ్లెన్ ను తండ్రి నార్త్ ఫీల్డ్‌లోని చార్లేటాన్‌లో ఉన్న ఒక చిన్న మత శాస్త్రం బోధించే సంస్థకు పంపాడు. ఇక్కడ మూడేళ్ళు, కాలేజిలో మూడేళ్ళు చదివాడు. ఫిలాసఫీలో బాగా రాణించినా అతనికి ఫైలాలజి అంటే భాషాతత్వ శాస్త్రం, బయాలజీ , ఆర్థికశాస్త్రంలపై అభిరుచి ఏర్పడింది. ఇరవైమూడేళ్ళ గ్రాడ్యుయేట్ అయ్యాడు. జాన్ హాప్కిన్‌కు పోస్ట్ గ్రాడ్యుయేషన్ కోసం వెళ్ళాడు. అక్కడ నుండి ఏల్ యూనివర్సిటికి బదిలీ చేయబడి పిహెచ్ డి ని 27ఏళ్ళకే పొందాడు.

ఏల్‌లో ఉండగానే భవిష్యత్తు గురించి ఆలోచించాడు. టీచింగ్‌లో చేరాలనుకొన్నాడు. కాని ఇతని నార్వేజియన్ ఇంగ్లీష్, దుందుడుకు స్వభావం, లెక్కలేని తనం, మూర్ఖత్వం అతని ఉద్యోగానికి అడ్డుగోడలై నిలిచాయి. చేసేది లేక మళ్ళీ మిన్నెసోటా చేరి వ్యవసాయం చేస్తూ చార్లేటాన్ కాలేజి ప్రెసిడెంట్ కూతురు ఎల్లెన్ రోల్ఫ్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఏడేళ్ళు ఇక్కడే ఆశగా ఉద్యోగం కోసం ఎదురు చూస్తూ తండ్రితో దీర్ఘ సంభాషణలు చేస్తూ, పుస్తకాలు చదువుతూ గడిపాడు. వెబ్లెన్ కంటే అతని కుటుంబమే ఎక్కువ కలత చెందింది. ఎన్నో కౌన్సెలింగ్‌లు ఇచ్చారు బాగుపడతాడేమోననే ఆశతో. చివరికి

ఆతను ఆర్థిక రంగంలో విజయం సాధిస్తాడని నమ్మకం కలిగింది. ఫిలాసఫర్‌గా కంటే ఎకనామిస్ట్‌గా రాణించ గలననే నమ్మకంతో "కార్నెల్"కు వెళ్ళాడు.

ముప్ఫై అయిదేళ్ళ వయసులో వెబ్లెన్ సాధారణ కూలీ కోటు, ముతకనూలు ట్రౌజర్లు, కూన స్కిన్ కాప్‌తో ఎకనామిక్స్ ప్రొఫెసర్ ప్రోఫెసర్ లారెన్స్ లాఫ్లిన్ ఆఫీసులో అడుగుపెట్టి "నేను థార్ స్టెయిన్ వెబ్లెన్" అని పరిచయం చేసుకొన్నాడు. అతని సూటితనం గాంభీర్యంలకు ముచ్చటపడి లాఫ్లిన్ కార్నెల్‌లో ఫెలోషిప్ ఇచ్చాడు. చికాగోలో కొత్తగా ప్రారంభించే యూనివర్సిటీలో చేరబోతూ తనతోబాటు వెబ్లెన్‌ను కూడా తీసుకొని వెళ్ళాడు. అక్కడ టీచింగ్ ఫెలోగా ఏడాదికి 520 డాలర్ల జీతంతో చేరాడు. నలభై ఆరవ ఏట జీతం వెయ్యి డాలర్లు అయింది. చికాగోలో అనేకమంది ప్రముఖులతో పరిచయమేర్పడింది. కాని వారికి దూరంగా ఒంటరిగా ఉండేవాడు. బోధనపై విసుగూ కలిగింది. రొటీన్ జీవితం పరమ బోర్ అనిపించింది. మెటీరియల్ లేబర్‌లోని నాణ్యతపై పేపర్లు రాశాడు. డ్రెస్ విషయంలో పొదుపు, క్లాస్‌లలో ఎకనామిక్స్‌ను బోధించటంలో రావాల్సిన సమూలమైన మార్పులు అన్నిటిపై ఆచరణాత్మకమైన విధానాలు రాసేవాడు. ఇంతగా రాసినా నలభై రెండవ సంవత్సరం వరకు వెబ్లెన్ గురించి పబ్లిక్‌కు ఏమీ తెలియదు. 1899లో వెబ్లెన్ మొదటి పుస్తకం "ది తీరీ ఆఫ్ ది లీజర్ క్లాస్" రాసి ప్రచురించాడు.

ఆ తర్వాత ఒక డజన్ దాకా పుస్తకాలు రాసినా ఈ పుస్తకాని కొచ్చిన పేరు దేనికీ రాలేదు. ఇందులో ధనాన్ని ఎలా దుర్వినియోగం చేస్తున్నారో, ధనవంతుల వెంట మధ్యతరగతి వాళ్ళు ఎందుకు వ్యామోహం చూపిస్తున్నారో పూర్తిగా వివరించాడు. చాలా స్పష్టమైన సాదారణ భాషలో రాయటం దీనికి ప్లస్ పాయింట్ అయింది. అతని "conspicuous consumption" అంటే స్పష్టమైన వినిమయ విధానం అందరిని ఆకర్షించింది. డబ్బును కాలాన్ని, ప్రయత్నాలను దుబారాగా ఖర్చు చేయటంపై తీవ్రంగా విరుచుకు పడ్డాడు. అమెరికా చరిత్రలో ఏ రచయితా అంతకు ముందు ఎప్పుడూ అమెరికా ధనవంతులు తెలివి తక్కువగా ప్రిస్టేజ్‌ని కొనుక్కోవటానికి డబ్బును ప్రవాహంలా ఖర్చు చేయటంపై రాయలేదు. అలా రాసి మేల్కొలిపిన మొదటి వ్యక్తీ వెబ్లెన్ అయ్యాడు. ఒక ఫ్రాన్స్ రాజు సమావేశాలకు తానూ కూర్చునే సీట్ కోసం ఎంతో డబ్బు వృధా చేయటం, క్రిస్టియన్ మతగురువుల ఆశీస్సు అభిమానం పొందటంపైనా చెలరేగి రాశాడు.

ఈ పుస్తకానికి సీక్వెల్‌గా అయిదేళ్ళ తర్వాత "ది థీరీ ఆఫ్ బిజినెస్ ఎంటర్ ప్రైజెస్" రాశాడు వెబ్లెన్. ఇందులో బడా పారిశ్రామిక వేత్తలు డబ్బును కూడబెట్టు కోవాటానికి, అధికారం పొందటానికి తాపత్రయ పడుతున్నారని ఇదివారి వ్యాపార లక్షణానికి శత్రువు

అని నిర్మొహమాటంగా చెప్పాడు. విలువలతో కాక సరుకుల నాణ్యత తోకాక వస్తువుల రేట్లతో, ధన సంపాదన చేయటం హేయం అన్నాడు. లాభాపేక్షతో ఉత్పత్తిని ద్వంసం చేస్తున్నారని, సామాన్యునికి అండగా నిలబడకుండా వాళ్ళ అమాయ కత్వంతో వ్యాపారం చేసి లాభ పడుతున్నారని ఆక్షేపించాడు. దీనికోసం సమాజంలోని ఇంజినీర్లతో ఒక కొత్త కంట్రోల్ విధానం అమలు చేయాలని కోరాడు. యంత్రానికున్న సాంఘిక ఉపయోగాన్ని అందరి దృష్టికి తెచ్చాడు.

వెబ్లెన్ అభిప్రాయాలకు అవాక్కయ్యారు. బడా బిజినెస్ మెన్ లతోబాటు యూనివర్సిటి ట్రస్టీలు కూడా వెబ్లెన్ ఆలోచనలు చాలా ప్రమాదకరం అని ఎలుగెత్తి చాటారు. దీనికి తోడు అతని ప్రైవేట్ జీవితమూ ఒడిదుడుకుల పాలైంది. భార్య అనేకసార్లు వదిలి పెట్టి వెళ్ళింది. కొన్ని అభూతకల్పనలూ వచ్చాయి. ఒక పేపరు ఆతను ఒకమ్మాయితో అట్లాంటిక్‌లో ఉండటం చూశానని కథనం అల్లింది. తిరిగి వచ్చాక రాజీనామా చేయమనే ఒత్తిడి పెరిగింది. అప్పటికే వయసు నలభై తొమ్మిది. లేలాండ్ స్టాన్ఫోర్డ్ వెళ్లి మూడేళ్ళున్నాడు. అందం, ఆకర్షణ ఉండటంతో ఎక్కడికి వెళ్ళినా అమ్మాయిలు వెబ్లెన్ అంటే వ్యామోహంతో వెంటపడేవారు. తప్పించు కోలేక పోయేవాడు. అదీ అతని పరిస్థితి. అతనిపై స్కాండల్స్ ప్రచారం జోరై పోయింది.

వీటిని తప్పించుకోవటానికి ఒక మౌంటేన్ కాబిన్‌లో ఉన్నాడు. కావాల్సిన ఫర్నిచర్ తనకు తోచినట్లుగా ముతకగా తయారు చేసుకొన్నాడు. డ్రెస్ విషయంలో శ్రద్ధ చూపించలేదు. ఏది దొరికితే దాన్నే ధరించాడు. సూట్‌లకు ఇస్త్రీ లేదు "చెంబు ఇస్త్రీ" తప్ప'. కోట్ బటన్ ఊడితే సేఫ్టి పిన్ పెట్టు కొనేవాడు. సగం జుట్టుతెల్లబడి రంగులేనిదైనది. గడ్డం గీయటం మీసం దువ్వటం లేనేలేవు. ముఖంపై ముడుతలు మరీ వయసు మీద పడేట్లు చేసింది. 56 ఏళ్ళకే ముసలివాడైపోయాడు. స్నేహితుడు హెర్బర్ట్ డావెన్ పోర్ట్ ప్రోద్భలంతో మిస్సోరీ యూనివర్సిటి కి వెళ్ళాడు ఆర్ధికవేత్త వెబ్లెన్.

1911లో భార్య పూర్తిగా విడాకులిచ్చి వదిలేసి వెళ్ళిపోయింది. ఏడేళ్ళు మిస్సోరీలో ఉన్నాడు. క్లాసులకు క్రమం తప్పకుండా వెళ్ళేవాడు కాని ఇష్టంతో బోధించలేక పోయేవాడు. స్నేహితుడు డేవేన్ పోర్ట్ సెల్లార్‌లో కాలమంతా ఏదో రాస్తూ గడిపేవాడు. ఉద్యోగ జీవితం ఉపయోగపడకపోయినా ఒక కొత్త పుస్తకం "ది హయ్యర్ లెర్నింగ్ ఇన్ అమెరికా" రాశాడు. దీనికి టాగ్ గా "ఏ స్టడీ ఇన్ టోటల్ డేప్రేవిటి" (పూర్తీ భ్రష్టత్వంలో అధ్యయనం) అని పెడదామనుకొన్నాడు కాని చివరికి తానే వెనకి తగ్గి ఆ టాగ్ తగిలించలేదు. ఇందులో పిరికి కాలేజి ప్రెసిడెంట్‌లు, టీచర్లు, డబ్బుకోసమే ఉండే ట్రస్టీలు గురించి ఏకేశాడు. అమెరికాలో ఉన్నధైర్యవంతులైన అన్వేషకులు, ఇంజినీర్లు

గురించి పూర్తిగా చర్చించాడు. అమెరికా యూనివర్సిటీ బోర్డ్ ప్రెసిడెంట్‌లు పక్కా బిజినెస్‌మెన్ అని, కనసర్వేటివ్ దృక్పధం ఉన్నవాళ్ళని ఎత్తి చూపించాడు. ఇలాంటి వారితో కూరుకుపోయిన యూనివర్సిటీలు సామాన్యులకు ఏమీ చేయలేక పోయాయని ఆవేదన చెందాడు.

మిస్సోరీలో ఉండగానే వెబ్లెన్ "the instinct of Workmanship, imperial Germany and the industrial revolution, an enquiry into the nature of peace and the terms of its perpetuation, the vested interests and the state of the industrial art" మొదలైన గ్రంథాలు రాసి ప్రచురించాడు. వీటిలో తీవ్రమైన అధ్యయనం, వ్యంగ్యం కనిపిస్తాయి. యాభై ఏడేళ్లకు మళ్ళీ పెళ్లి చేసుకొన్నాడు. రెండోభార్య మొదట్లో బాగానే ఉన్నా తర్వాత మతి స్థిమితం కోల్పోయి శరణాలయంలో ఉంచాల్సి వచ్చింది. మళ్ళీ ఎదురు దెబ్బలు, వెనకడుగులు తప్పలేదు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో "యాన్ ఎంక్వైరీ ఇంటూ ది నేచర్ ఆఫ్ పీస్" పుస్తకం వెలువడింది. సమయానికి తగిన రచనగా గుర్తింపు పొంది మంచి పేరు తెచ్చింది. ప్రొఫెషనల్ రాజకీయవేత్తలు ఏ విధంగా నిజమైన దేశభక్తిని స్వలాభానికి వాడుకొంటారో వివరించాడు. అంతర్జాతీయంగా మంచి గుర్తింపు వచ్చినప్పటికీ ఏ పబ్లిషర్ కూడా ప్రింట్ చేయటానికి ముందుకు రాకపోతె వేబ్లెన్ 700 డాలర్లు చేతి చమురు వదిలించుకొని ముద్రించాడు. తర్వాత అయిస్ లాండ్ దేశీయుల "లాక్స్ డేలా సాగా" అనే మధ్యయుగ ఇతిహాసకావ్యాన్ని (ఎపిక్ ) ఆంగ్లంలోకి అనువాదం చేసి ప్రచురించి మళ్ళీ ప్రవాసానికి వెళ్ళిపోయాడు.

మిస్సోరిలో ఏమంత అభిమానం పొందలేకపోయిన వెబ్లెన్ న్యూయార్క్ చేరాడు. "ది డయల్" అనే లిబరల్ మాసపత్రిక ఎడిటర్ అయ్యాడు. బరువైన వ్యాసాలూ రాసినా పత్రిక నిలబడలేక పోయింది. యుద్ధ సమయంలో వాషింగ్ టన్‌లో తాత్కాలిక చిన్న ఉద్యోగి అయ్యాడు. అతని భావాలు చాలా ముందు చూపుతో ఉండటంతో వదిలేయాల్సి వచ్చింది. సోషల్ రిసెర్చ్ కోసం న్యు స్కూల్లో లెక్చర్లు ఇచ్చాడు. భావోద్వేగంతో మాట్లాడటంతో ఎవర్నీ ఆకర్షించలేక పోయాడు. క్లాస్ రూమ్‌లో కూడా అతను పాఠం చెబుతూంటే వినేవాడు ఒక్కడూ ఉండేవాడు కాదు. అతని "ఎంక్వైరీ ఇంటు ది నేచర్ ఆఫ్ పీస్"ను చాలామంది తిరస్కరించారు. విధ్వంసకర విధానాలను ప్రచారం చేస్తున్నాడని అన్నారు. దీనితో ఏ పదవీ అతనిని వరించలేక పోయింది. డెప్రెషన్ పడిలో ఉన్నాడు. శారీరక మానసిక ఆరోగ్యాలు కోల్పోయాడు. క్షయ కూడా సోకింది. కాలి ఫోర్నియాకు వెళ్ళాడు. అక్కడ అడవిలో కేబిన్‌లో ఉన్నాడు. ఒంటరి జీవితము, నిరాశా నిస్పృహలతో శుష్కించిపోయి అక్కడే వెబ్లెన్ 3-8-1929న

చనిపోయాడు. ఒక నోట్‌లో నిస్పృహతో ఉన్న మనిషి టెస్ట్‌మెంట్‌గా ఇలా రాశాడు చనిపోయే ముందు "నాకు స్మృతి చిహ్నం కాని శిల్పం కాని చిత్తరువుకాని ఏర్పాటు చేయద్దు. శిలాఫలకం కాని దానిమీద రాత కాని ఇప్పుడు కాని మరెప్పుడూ కాని ఏర్పాటు చేయద్దు. నాపై జీవిత చరిత్ర రాయద్దు. నేను రాసినవి నాకు ఎవరైనా రాసినవి ఉత్తరాలు ప్రింట్ చేయవద్దు. ఇంకేరకంగానూ కాపీ చేయటం ప్రచారం చేయటం నాకు ఇష్టం లేదు" అని అందులో స్పష్టంగా రాశాడు.

తాను తన విదానాల విషయంలో విఫలమయ్యానని భావించాడు. చెడును ఎదిరించటానికి మంచిని సమాయత్త పరచలేక పోయానని వ్యధ చెందాడు. తనకు తాను సమీకృతం కాలేకపోయినందుకు బాధ పడ్డాడు. "దిపోర్టబుల్ వెబ్లెన్" పేరుతో మాక్స్ లేర్నేర్ రాసిన పుస్తకంలో వెబ్లెన్ వ్యతిరేకించిం. వ్యవస్థలనే కాని వ్యక్తులను కాదు అన్నాడు. రూసో తత్వవేత్త భావాలనే వెబ్లెన్ నమ్మాడు. ఈ విషయంలో కారల్ మార్క్సను వ్యతిరేకించాడు. కేపిటలిజం యుద్ధం కలిసి నడుస్తాయి అనేదాన్ని కాదన్నాడు. సర్ప్లస్ వాల్యును ఒప్పుకోలేదు. కాపిటల్‌కి లేబర్‌కి మధ్య పోరాటాన్ని ఒప్పుకోలేదు. క్లాస్ వార్ ఉండదని, లేబరే యజమానులౌతారని అన్నాడు. "వెబ్లెన్ విప్లవం" వస్తుందని ఊహించాడు. దీనితో కొత్త తెలివితేటలున్న మెకానిక్స్ ఉన్నత శ్రేణి టెక్నో క్రాట్స్, అరిస్టోక్రసీ ఇంజనీర్లు వస్తారన్నాడు. అసాధ్యాలు అనిపించినా అవి ఆహ్వానింప దగిన విషయాలే.

వెబ్లెన్ చనిపోయినప్పుడు అతన్ని తప్పుడు భావాల ప్రాఫెట్ అని, క్షమించరాని ఆర్ధికవేత్త అని అన్నారు. చనిపోయినవాడికి చూపించాల్సిన కనీస మర్యాద కూడా చూపలేదు. రాడికల్ మార్పులను వెబ్లెన్ ఆహ్వానించక పోవటం లోపమైంది. కానీ అతనిని "ఇన్ స్టిట్యూషనల్ ఎకనామిక్స్" ఉద్యమానికి నాయకుడుగా గుర్తించారు. వ్యవస్థలకు, టెక్నాలజీకి మధ్య ఉన్న అంతరానికి "వెబ్లెన్ డైకోటేమి" అని పేరు పెట్టారు. అభివృద్ధి యుగంలో ప్రోగ్రెసివ్ అనిపించాడు. లాభాలకోసమే ఉత్పత్తి అనేదాన్ని వ్యతిరేకించాడు. అతని "కాన్షిక్యుయస్ కన్సంషన్" సిద్ధాంతం సోషలిస్ట్ నాయకులను బాగా ఆకర్షించింది. మార్క్సిస్ట్ వ్యతిరేక కేపిటలిజంను కోరేవారందరికి వెబ్లెన్ ఆరాధ్య దైవమే అయ్యాడు.

వెబ్లెన్‌ను ప్రభావితం చేసిన వారిలో "జర్మన్ హిస్టారికల్ స్కూల్" ఒకటి. చరిత్రలో మానవులందరూ ఒకే రకంగా ప్రవర్తిస్తారు అన్నది ఇద్దరి అభిప్రాయం. రెండవది డార్విన్ సిద్ధాంతంలోని కాజువాలిటి అంటే యాదృచ్ఛిక సంఘటన. డార్విన్ సిద్ధాంతం ఆధారం చేసుకొని తన స్వంత ఆలోచనలను పెంచి వెబ్లెన్ ఆర్థిక సిద్ధాంతాలను వ్యాప్తి

చేశాడు. మూడవది ప్రాగ్మాటిజం అంటే స్వేచ్ఛా పూరితమనసు సంఘం అభివృద్ధిని కోరుతుందని చెప్పేదాన్ని నమ్మి తన ఆర్ధిక పరిణామ సిద్ధాంతాన్ని బలపరచుకొన్నాడు. నాల్గవది మార్క్సిజం. అందులో కూలీకి యజమానికి మధ్య ఉన్న పోరాటంను కాదని కూలీలు యజమాని మనసు మార్చేయాలన్నాడు. టెక్నాలజీకి పెద్ద పాత్ర ఉందన్నాడు వెబ్లెన్.

వెబ్లెన్ చెప్పిన "కాన్షిక్యుయస్ కన్సమ్షన్" సిద్ధాంతం అంటే డబ్బును అనవసరంగా వస్తువుల విలువకంటే ఎక్కువగా ఖర్చుపెట్టటం. ఇది రెండవ రెండవ పారిశ్రామిక విప్లవ కాలంలో ఏర్పడింది. "కాన్షిక్యువస్ లీజర్" సిద్ధాంతమూ చేశాడు వెబ్లెన్. ఐశ్వర్యాన్ని, అధికారాన్ని ఉత్పత్తి పనిగా చూపించటం అన్నమాట. దీన్ని వ్యతిరేకించాడు. లీజర్ క్లాస్‌ను చెప్పాడు. సూటిగా ఆర్ధిక భాగస్వామ్యం లేకుండా ఉన్నత స్థాయి గౌరవం పొందటం ఆక్షేపణీయం అని దీని సారాంశం. అది ఆర్ధిక గ్రంథాలు దాదాపు పాతిక వ్యాసాలూ రాసి ఆర్ధిక సిద్ధాంతాలకు పరిపుష్టి చేకూర్చాడు.

Quotes

Conspicuous consumption of valuable goods is a means of reputability to the gentleman of leisure.

Invention is the mother of necessity.

Born in iniquity and conceived in sin, the spirit of nationalism has never ceased to bend human institutions to the service of dissension and distress.❋



## 32. క్వాంటం సిద్ధాంతం కనుగొన్న - మాక్స్ ప్లాంక్ (1858-1947)

ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం ఎంతటి బ్రహ్మపదార్ధమో మాక్స్ ప్లాంక్ క్వాంటం దీరీ కూడా అలాంటిదే. జర్మనీ దేశంలో కీల్ నగరంలో 23-4-1858న మాక్స్ ప్లాంక్ జన్మించాడు. అతని జీవితకాలం జర్మన్ సామ్రాజ్య ఉత్థాన పతనాలతో ముడిపడి ఉంది. తండ్రి కాన్స్టి ట్యూషనల్ లా లో ప్రొఫెసర్. సైన్సుకున్న మానవీయ బాధ్యతలను కొడుక్కి ఎప్పుడూ గుర్తు చేస్తుండేవాడు. దేనినైనా ప్రయోగాత్మక పరిశోధనతోనే నమ్మాలి అని బోధించేవాడు.

యువ ప్లాంక్ మ్యూనిచ్‌లోని మాక్సి మిలీనియం జిమ్నేషియంలో లెక్కలు ముఖ్య విషయంగా చదివాడు. చిన్నప్పటి నుండి ఈ ప్రపంచం మనిషికంటే ఎదోరకమైన స్వతంత్రాన్ని కలిగి ఉంది అనిపించేది. తండ్రితో బాటు అతని హైస్కూల్ టీచర్ మూలర్ కూడా ప్రోత్సహించాడు. హాస్యాన్ని మిళితం చేస్తూ ఆయన బోధించే విధానం ప్లాంక్‌కు బాగా నచ్చింది. "కన్సర్వేషన్ ఆఫ్ ఎనర్జీ"ని చాలా చక్కగా ఉదాహరణగా బోధించిన తీరు మర్చిపోలేదు. మూలర్ దాన్ని వివరిస్తూ "ఒక పెద్ద రాయిని కట్టే బిల్డింగ్ మీదకు మనం ఎంతో శక్తి వినియోగించి చేర్చాలి. శక్తి ఎప్పుడూ నశించదు అది దానిలో కొన్నేళ్ళవరకు నిలవ ఉంటుంది. దురదృష్టవశాత్తు అది ఒకవేళ ఏదో ఒక రోజు అక్కడ పట్టు తప్పి వదులైతే, దాచుకున్న శక్తినంతా దారినపోయే దానయ్య నెత్తిమీద పడి బుర్ర బద్దలు చేస్తుంది"అని చెప్పాడు ప్లాంక్‌ను ప్రభావితం చేసినవాడు

మూలర్.

హైస్కూల్‌లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి మొదట మూడేళ్ళు మ్యూనిచ్ యూనివర్సిటిలో, మరో ఏడాది బెర్లిన్ యూనివర్సిటిలో చదివాడు. బెర్లిన్‌లో హెల్మ్ హొల్ట్జ్ దగ్గర చేరాడు. ఆయన ఫిజియాలజిస్ట్ మాత్రమే కాక ఫిజిసిస్ట్ కూడా. కాని బోధన ఆకర్షణీయంగా ఉండేది కాదు. ఆయన క్లాస్ అంటే బోర్ అనిపించేది. కాని ఫిజికల్ కెమిస్ట్ అయిన కిర్చాఫ్ ప్లాంక్‌కు థర్మో డైనమిక్స్‌పై ఆసక్తి కలిగించాడు. అందులో ముఖ్యంగా రెండవ థర్మో డైనమిక్స్ లా పై అధిక ఆసక్తి కలిగించాడు. దీనినే పరిశోధన అంశంగా తీసుకొని 1879లో డాక్టరేట్ పొందాడు. ఈ సూత్రమే మిగిలిన పరిశోధనలకు కేంద్రమైంది. అతని తెలివితేటలకు ప్రతిఫలంగా కీల్ యూనివర్సిటిలో 28 ఏళ్ళకే అసోసియేట్ ప్రొఫెసర్ అయ్యాడు. కిర్చాఫ్ మరణం తర్వాత బెర్లిన్ యూనివర్సిటిలో "ప్రొఫెసర్ ఎక్స్ట్రా ర్డినరస్" అయిపోయాడు.

1879 నుండి 1899 వరకు ఇరవై ఏళ్ళు ప్లాంక్ "థర్మల్ రేడియేషన్" సమస్యపై తీవ్రంగా పరిశోధనలు చేశాడు. అప్పటికి తెలిసిన విషయం ఏమిటి అంటే వేడి వస్తువులు ఉష్ణ వికిరణం (రేడియేషన్) చేస్తాయి. ఉష్ణం ఇంకా పెరిగితే కాంతిని వెదజల్లుతాయి. వేడి ఎక్కువైతే ఈ కాంతి కనపడని ఇన్ఫ్రారెడ్ నుండి, కాంతిహీన ఎరుపుకు, సిందూరం ఎరుపుకు (స్కార్లెట్) చివరికి పసుపు రంగుకు మారుతుంది. ఇంకా వేడి ఎక్కువైతే "తెల్లని వేడి" (వైట్ హాట్)గా మారతాయి. ప్రతి ఉష్ణోగ్రత వద్ద వెలువడే రేడియేషన్‌ను ప్రిజం (పట్టకం) ద్వారా విశ్లేషించ వచ్చు. అది కొన్ని రంగుల సమూహంగా, ప్రతి రంగుకు ఒక నిర్దిష్ట వేవ్ లెంగ్త్ (తరంగ దైర్ఘ్యం)తో వెలువడుతుంది. ఉదాహరణకు ఒక ఇనప ముక్కను ఇలా పసుపు రంగు వచ్చేదాకా వేడి చేస్తే, అప్పుడది నిజంగానే రెడ్, ఆరంజ్, ఎల్లో, గ్రీన్ బ్లూ రంగుల సముదాయాన్ని ఇస్తుంది. అందులో గ్రీన్ బ్లూ చాలా తక్కువ కాంతితో ఉంటే ఎల్లో చాలా ప్రకాశ మానంగా ఉంటుంది.

కిర్చాఫ్ శాస్త్రవేత్త ఇలా కనిపించే రంగులనే కాక, రంగుల పంపకం ఉష్ణం మీదనే తప్ప పదార్ధం మీద ఆధారపడి ఉండదు అని కనుక్కున్నాడు. ఈ స్వతంత్రం టెంపరేచర్, వేవ్ లెంగ్త్‌లకే చెందిన ఒక ప్రకృతి సిద్ధాంతానికి దారి తీసింది. దీనిపై చాలా పరిశోధనలు జరిగాయి సిద్ధాంతాలు వచ్చాయి. కలర్ డిస్ట్రిబ్యూషన్ విషయంలో ఏదైనా ఫార్ములా ఉండి ఉండాలని అనిపించింది. ఈ డిస్ట్రిబ్యూషన్ వర్ణమాల (స్పెక్ట్రం)లో ఏదో కొద్ది మేరకే ఉన్నట్లు గమనించారు.

ఇప్పుడు మాక్స్ ప్లాంక్ ఒక కొత్త సూత్రం కనిపెట్టే పనిలో మునిగిపోయాడు. బ్లాక్ బాక్స్ అంటే బోలుగా ఉండే వస్తువు రేడియేషన్‌పై పరిశోధన సాగించాడు. దాన్ని

వేడి చేస్తే దాని లోపలి ఒకవైపు గోడలు రేడియేషన్‌ను వెదజల్లితే, ఎదురుగా ఉండే గోడలు రేడియేషన్‌ను హరించి (అబ్సార్బ్)నట్లు గమనించాడు. ఈ బ్లాక్ బాడీ లేక కేవిటీ రేడియేషన్ కోసం "మెథడ్ ఆఫ్ లిమిట్స్"ను ఉపయోగించక తప్పదనుకున్నాడు. ఇది ఫిజిక్స్, లెక్కలలో బాగా శక్తివంతమైన ఆయుధం వంటిది. ఎప్పుడైతే సూటిగా గణనకు (కంప్యుటేషన్) కండిషన్లు ఉపయోగపడవో అప్పుడే దీన్ని సంజీవినిలాగా వాడుతారు. ఇది ఒక కృత్రిమ నియమాన్ని (కండిషన్)ను ఏర్పరచి మనం సాధించాలనుకొనే ఫలితానికి తోడ్పడుతుంది. అప్పుడు మనకు కావాల్సిన ఫార్ములా వస్తుంది. ఇందులో అవాస్తవిక ఊహ (ఫాల్స్ అసంప్షన్) కూడా ఉంటుంది. క్రమంగా కృత్రిమతను తగ్గించుకుంటూ సున్నా దాకా పోతారు. అప్పుడు మనం కోరుకొనే ఫార్ములా వస్తుంది. అందులో కల్పించిన కృత్రిమత ఉండదు. ఇదే సరైన మాధానం గా అన్ని పరీక్షలకు తట్టుకొని నిలబడుతుంది.

ప్లాంక్–బ్లాక్ బాడీ రేడియేషన్ నిరంతర ప్రవాహం అని, ప్రతిరంగు శక్తితో ఉంటుందని నమ్మాడు. ఇక్కడే ప్లాంక్ పొరబడ్డాడు. నిరంతర రేడియేషన్ ప్రవాహంగా కనిపించే దానిలో. చిన్న చిన్న శక్తి విస్ఫోటనాలు (బరస్ట్) ఉన్నాయి. ప్రతి విస్ఫోటనానికి నిర్ణీత శక్తి ఉంటుంది. ముందు ఫార్ములా సాధించి తర్వాత వీటి సంగతి చూద్దాం అనుకొన్నాడు. చివరికి ప్లాంక్ ఫార్ములా ఖచ్చితంగా ప్రయోగాత్మక కొలతలకు సరిపోయింది. ఈ దశలో కొందరు శాస్త్రవేత్తలు తమ కృత్రిమ ఊహలు నిజంగానే నిజమయ్యాయని భావించారు. కాని ప్లాంక్ పిరికి వాడుకాదు. తన పరిశోధన కృషిలో, ప్రామాణికతపై అపార నమ్మకమున్నవాడు. అందుకే అన్ని రేడిఎంట్ ఏనర్జీలు విస్ఫోటనాలుగానే, వాటివాటి నిర్దిష్ట శక్తిప్రమాణాలతో ప్రయాణం చేస్తాయి అని గట్టిగా చెప్పాడు. నిజంగా ప్రతి రంగుకు ఎనర్జీ ఫిక్స్ అయ్యే ఉంది. అది hc/lamdaకు సమానం. ఇందులో "c" అంటే కాంతివేగం, "లామ్డా" అంటే ప్రతిరంగుకు ఉండే వేవ్ లెంగ్త్, "h"అంటే యూనివర్సల్ కాన్ స్టంట్ ఆఫ్ నేచర్. ఇప్పుడు దీన్నే "ప్లాన్క్స్ కాన్స్టంట్" అంటున్నారు. ఈ గణిత సూత్రానికి భావం ఏమిటంటే – నియాన్ బల్బ్‌లోని వేడి ఆటం ఒక బ్లూ విస్ఫోటనం ఇవ్వటానికి, రెడ్ లైట్ ఇవ్వటానికంటే ఎక్కువ ఎనర్జీని తీసుకొంటుంది. కారణం బ్లూ లైట్ కి వేవ్ లెంగ్త్ తక్కువ. దీనిని బట్టి కొంత ఎనర్జీ ఉన్న ఆటం దొరికితే, ఒకే రంగుగల కాంతిని వెలువరించ వచ్చు. ఇది పిండితార్థం.

అంతకుముందే ప్రేరణ పొందిన (ఎక్సైటేడ్) ఆటం పదార్థాన్నిబట్టి రంగులను వెలువరిస్తుందని, సోడియం వేపర్‌కు దట్టమైన పసుపు రంగు, స్వచ్ఛ నియాన్ ఎరుపురంగు, మెర్క్యూరీ వేపర్ పర్పుల్ కలర్ ఇస్తాయని తెలుసుకొన్నారు. ఇప్పుడు ఈ పరిశోధన

వలన ఆటం స్పెక్ట్రంను చూసే అవకాశమేర్పడింది. వేవ్ లెంగ్త్‌కు ఎనర్జీకి ఉన్న సంబంధం వలన అయిన్ స్టీన్ ఫోటోఎలేక్ ట్రిక్ ప్రభావ సూత్రం కనిపెట్టాడు. దీనితో ఘనపదార్థాల ఉష్ణ గ్రాహక శక్తిని కొలవ గలిగారు. ఎక్స్ రేస్ సుఖచ్చితంగా నియంత్రించ గలిగారు. సరైన కెమికల్ రియాక్షన్ సమయాలను గణించ గలిగారు.

ఈ భిన్నమైన శక్తి స్వభావాలు అంటే "క్వాంటి జేషన్"లను పదార్థానికి, రేడియేషన్‌కూ అప్లై చేశారు. దీనితో "వేవ్ మెకానిక్" ఏర్పడి కాంతి తరంగాలకు ఉన్న భిన్న స్వభావాలు అటామిక్ కణాలకూ ఉంటాయని తెలిసింది. మరింత పరిశోధనా ఫలితంగా రేడియో యాక్టివిటిపై మరింత విజ్ఞానం లభించి, న్యూక్లియర్ రియాక్షన్‌లను ఊహించి (ప్రిడిక్ట్) చేసి చెప్పగలిగారు. ట్రాన్సిస్టర్లను డిజైన్ చేయగలిగారు. ఇంకొంచెం ప్రగతి సాధించి "హీజేన్ బెర్గ్ అన్ సర్టెన్ ప్రిన్సిపుల్"కు చేరుకొన్నారు. పదార్థంలోని కణాలు తరంగాల కుండే ధర్మాలు కలిగి ఉంటాయని తేలింది. కాని దాని స్థానం ఎక్కడ ఉంటుందో ఖచ్చితంగా చెప్పలేక పోయారు. సరస్సులో నీటి తరంగాలుగా ఉంటాయేతప్ప ఒకేచోట ఉంటుందని అనిపించలేదు. ఈ విషయాన్నే "అన్ సర్టేనిటి ప్రిన్సిపుల్" (అసం భావ్యత సూత్రం) చెప్పింది. కొన్ని సబ్ అటామిక్ పార్టికల్స్‌లో ఈ లక్షణం ఉంది. దీని ఫిలసాఫికల్ ప్రాముఖ్యం మాత్రం బాగా విస్తరించింది.

హేతుత్వం (కాసువాలిటి) గ్రీకుల కాలం నుండి వస్తున్న పదమే. న్యూటన్ కాలంలో దాని ప్రభావం పెరిగింది. ఏదైనా కొంత సమాచారం ఇస్తే జరుగబోయే దాన్ని ఊహించి (ప్రిడిక్ట్) కార్య కారణ సంబంధం ఆధారంగా చెప్పవచ్చు. గ్రహణాలు ఎప్పుడేర్పడేది ముందే చెప్పవచ్చు. కాని కాజువాలిటీ దీన్నిదాటి చాలా ముందుకు వెళ్ళింది. చేతిలోంచి విసిరే పావులని ఆచేయి అన్నికోణాలను అర్థం చేసుకొంటే చెప్పవచ్చు. మనిషి భవిష్యత్తును గతంలో అతని భౌతిక మానసిక స్థితిని అధ్యయనం చేసి చెప్పవచ్చు. అలాగే ఖచ్చితంగా ఆకాశంలో నక్షత్రాలలోని సూత్రాలను ఎలా చెప్పగాలిగారో అలాగే పరమాణువులోని వాటినీ చెప్పవచ్చు. మనిషి మెదడులో నాడీ స్పందన ప్రారంభం, ఆగిపోవటంలను బట్టిఅతని కొత్త ఆలోచనను పసిగట్టవచ్చు.

అసంభావ్య సూత్రం కాజువాలిటికున్న అడ్డంకుల్ని తొలగించింది. ఫిలసాఫికల్ ఆలోచన చర్చకు దానినుంచి స్పెక్యులేషన్‌కు దారి తీసింది. కొందరు సైంటిస్ట్‌ల దృష్టిలో మన సాధారణ విశ్వం "పరమాణువుల చాన్స్ మోషన్" వలన మార్పు చెందింది. ఐన్ స్టీన్ లాంటి వారు "దేవుడువిశ్వంతో పావుల ఆట ఆడడు" (God lays dice with the universe) అని నమ్మారు. ప్లాంక్ ఈ ఇద్దరి భావాలలో మధ్యేమార్గాన్ని అనుసరించాడు. కాజువాలిటికి కొత్త పాజిటివిజంకు మధ్య ఉన్న తగాదా ఫిలసాఫికల్

ఆలోచనలకే కాక, సైన్స్‌కు ఉన్న వాస్తవ బాధ్యతలకూ చాలా అవసరం అని భావించాడు. తన "క్వాంటం థీరీ"ని నీరు గార్చటానికి ఒప్పుకోలేదు. ఆయన "ఇప్పటికి సైన్స్ సామాన్య మానవ ఆలోచనలను మించి ముందుకు వెళ్ళింది. ఇప్పటిదాకా జరిగిన పరిశోధనల పరిధి కూడా దాటి అభివృద్ధి చెందింది. ఇలా ఇదే వేగంతో ఇవే శక్తి సామర్ధ్యాలు, ముందు చూపుతో ముందుకు వెళ్లి నా ప్రకృతిలోని మిస్టరిని చేదించలేము. దీనికి కారణం ఇప్పటివరకు మనం చూసిన విరుద్ధత (డి స్క్రేపెన్సీ) ప్రకృతికి, కాజువాలిటి ప్రిన్సిపుల్‌కి మధ్య ఉన్నది కాదు. మనం గీసిన ప్రకృతి చిత్రానికి, వాస్తవంగా మనం చూస్తున్న ప్రకృతికి మధ్య ఉన్నది మాత్రమే అన్నాడు ప్లాంక్.

మాక్స్ ప్లాంక్‌కున్న నిజాయితీ, ఆలోచనలు, నమ్మకాలను గుర్తించి ఆయన్ను "సైంటిస్ట్ లకే సైంటిస్ట్" అని గౌరవమిచ్చారు. సమకాలీనులే కాక అన్ని దేశాలవారూ ప్లాంక్‌ను అభినందించారు. 1918లో ప్లాంక్‌కు నోబెల్ ప్రైజ్ ఇచ్చినప్పుడు మహా మేధావి ఐన్ స్టీన్, నీల్స్ బోర్, రూధర్ ఫోర్డ్, హీసేన్ బెర్గ్ లాంటి హేమా హేమీ సైంటిస్ట్ లందరూ ఏకగ్రీవంగా ఆమోదం తెలిపి అభినందించారు. ఇదొక చారిత్రాత్మక ఘట్టమే అయింది ఆనాడు. న్యాయంగా పై వారిలో ప్రతిఒక్కరూ ఆనాడు నోబెల్ ప్రైజ్‌కు అర్హులే అంతటి కృషి చేసినవారే. కాని ప్లాంక్‌కు ఇవ్వాలన్న దానిలో ఎవరికీ ఆక్షేపణ లేకపోవటం గమనార్హం.

బిరుదులూ, గౌరవాలు వచ్చి మీదపడుతున్నా అరవై ఏళ్ళకు ప్లాంక్ విచార గ్రస్తుడయ్యాడు. మొదటి ప్రపంచ యుద్ధం ఆయనకు వ్యక్తిగతంగా, జనసామాన్యానికి కూడా విషాదం మిగిల్చింది. 1916 వెర్దాం యుద్ధంలో ప్లాంక్ పెద్దకొడుకు కారల్ చనిపోయాడు. రెండవ ప్రపంచ యుద్ధం మరీ సంక్షోభం కలిగించింది. రెండవ కొడుకు ఎర్విన్ జర్మన్ టెర్రరిజానికి బలైనాడు. విమాన దాడిలో ప్లాంక్ ఇంటిమీద బాంబులు పడి, జీవితకాలం అంతా సాధించి దాచుకొన్న అపూర్వ విలువైన గ్రంథాలున్న ఆయన స్వంత లైబ్రరీ అగ్ని జ్వాలలకు ఆహుతై పోయింది. వీటిని అన్నిటినీ భరించే శక్తి లేకపోయింది. కాస్సెల్‌లో లెక్చర్ ఇస్తూ విమానదాడి నుండి రక్షించుకొనే షెల్టర్లో కొన్ని గంటలు ఉండిపోవాల్సి వచ్చింది. 1945 మే నెలలో ఒక అమెరికన్ జీపు చూసి ఆయన్ను కాపాడి అమెరికా ఆక్రమిత సురక్షితమైన గూటెన్ బెర్గ్‌కు తీసుకొని వెళ్ళింది. ఇక్కడే మాక్స్ ప్లాంక్ 4-10-1947న 90 జన్మ దినోత్సవానికి కొన్ని నెలలముందే ప్రాణాలు విడిచాడు. సుదీర్ఘకాలం, ఆదర్శవంతమైన సమర్ధమైన జీవితం గడిపాడు ప్లాంక్. ఆయన జీవితకాలంలోనే తన క్వాంటం మెకానిక్స్ ఫిజిక్స్‌ను డామినేట్ చేయటం చూసి ఆనందించిన అదృష్టవంతుడు ప్లాంక్. ఆయన క్వాంటం మెకానిక్స్

గగుర్పొడిచే సత్యం. అది భౌతిక శాస్త్రాన్ని, ఫిలాసఫీని బాలన్స్ చేసి, విశ్వవ్యాప్తమైంది.

పది ఉత్తమ విజ్ఞానశాస్త్ర గ్రంథాలు రచించాడు ప్లాంక్. "నమ్మటం అంటే సత్యాన్ని గుర్తించటమే". సైన్స్ అభివృద్ధి చెందుతున్న కొద్దీ మిరకిల్స్ క్రమక్రమగా వెనకడుగు వేస్తాయి. మత విశ్వాసాలు బాగా ఉన్నా ఏదో ఒక దేవుడు అంటే అభిమానం నాకు లేదు" అన్నాడు. ప్లాంక్ నేతృత్వంలో కైజర్ వేల్హాం సొసైటీ నాజీయిజానికి వ్యతిరేకంగా పోరాడలేదు. అమ్మోనియాను కృత్రిమంగా ఉత్పత్తి చేసిన జ్యూ అయిన హేబర్ శాస్త్రవేత్త విషయంలో ఉదారంగా వ్యవహరించమని ప్లాంక్ హిట్లర్‌ను కోరినా ఆనియంత అంగీకరించలేదు. ఆ తర్వాత కొన్ని నెలలకే హేబర్ చనిపోయాడు. ఏడాది తర్వాత కైజర్ వేల్హాం సొసైటీ ప్రెసిడెంట్‌గా హేబర్‌కు తగిన స్మృతి చిహ్నాన్ని ఏర్పరచాడు. ఎందరో జ్యూయిష్ సైంటిస్ట్‌లకు తన సంస్థలో పని చేయటానికి ఒప్పించి పని చేయించిన సమర్ధుడు ప్లాంక్. 1938లో ప్లాంక్ 80వ జన్మ దినానికి "మాక్స్ ప్లాంక్ మెడల్ " ఏర్పాటు చేసి ఫ్రెంచ్ ఫిజిసిస్ట్ లూయీ డీ బ్రొగ్లీకి ఇచ్చాడు. 38 తర్వాత ప్రష్యన్ అకాడెమి స్వాతంత్ర్యం కోల్పోవటంతో నాజీల వశమైంది. ప్లాంక్ పూర్వీకులు తాము పదహారవ వంతు జ్యూలం అన్నారు కాని ప్లాంక్ ఒప్పుకోలేదు.

1933లో ప్లాంక్‌కు 74 ఏళ్ళ వయసులో జర్మనీలోని ప్లాంక్‌కు తెలిసిన ఎందరో జ్యూయిష్ స్నేహితులు, బంధువులను పదవులనుండి నాజీలు తప్పించారు. కొందరు ఇతర దేశాలకు వెళ్లి పోవటమో జరిగింది. కొందరిని ఒప్పించి సంక్షోభం త్వరలోనే సమసిపోతుందని నచ్చచెప్పి ఇక్కడే పని చేయించాడు. కాని బహిరంగంగా నాజీలను వ్యతిరేకించలేదు. మాక్స్ ప్లాంక్ సోసైటీ ఏర్పరచి అధ్యక్షుడై నాడు. అదే 83 సోసైటీలుగా అభివృద్ధి చెంది ఎన్నో శాస్త్రీయ పరిశోధనలకు నెలవైనాయి.❋



## 33. అద్వితీయ మహాకవి, మహాకావ్య నిర్మాత, మహా పండితుడు- ఎ.ఇ.హూస్మన్ (Housman) (1859-1936)

పెసిమిస్ట్ కవులలో ఉమర్ ఖయ్యాం "రుబాయత్ " కవితలని ఇంగ్లాండ్‌కు చెందిన ఎడ్వర్డ్ ఫిట్జెరాల్డ్ ఆంగ్లంలోకి అనువదించటంతో దాని ఖ్యాతి ప్రపంచమంతా వ్యాపించింది. అలాగే లాటిన్ ప్రొఫెసర్, కవి ఆల్ఫ్రెడ్ ఎడ్మండ్ హూస్మన్ మనిషి దుర్మార్గాన్ని హత్య, ఆత్మహత్యలని దేవుడి ద్వేషాన్ని గురించి రాసిన "ఏ శ్రోఫైర్ లాడ్" కూడా అంతే విఖ్యాతమైంది. యువప్రేమికులు మాత్రమేకాదు నైతిక బాధ్యతతో జీవించే వారూ ఈ రెండిటికి బ్రహ్మరథం పట్టారు. ఈ రెండూ చిన్న గ్రంథాలే అయినా, విక్టోరియన్ భావాలపై గొప్ప తిరుగుబాటే చేయించాయి. క్రమశిక్షణ గల ఇంపీరియలిజం నుంచి "బేఫర్వాఆనందోబ్రహ్మ"కు జనం మారిపోయారు. వీటి ప్రభావం అంతగా ఉండేది. "తిను, తాగు, ఆనందించు" అనే మూడు మాటల మంత్రమే అందర్నీ శాసించింది. పురాణ గ్రంథాల మధ్య మనవాళ్ళు "చలం పుస్తకాలు" పెట్టుకొని చదివినట్లు వీటిని పెట్టుకొని రహస్యంగా చదివే సంఖ్య గణనీయంగా పెరిగింది. ముఖ్యంగా ఏ శ్రోఫైర్ లాడ్‌ను అలా చదివి రహస్యంగా ఆనందించేవారు.

26-5-1859న ఇంగ్లాండ్‌లోని శ్రో షైర్ కొండల దగ్గరున్న వార్సెస్టర్ షైర్‌లో పుట్టిన హూస్మన్‌కు ఆ కొండలే చిన్నప్పుడు విహార స్థలాలు. ఏడుగురు సంతానంలో పెద్దవాడు హూస్మన్. బ్రూమస్ గ్రూవ్‌లో స్కూల్ చదువు పూర్తిచేసి ఆక్స్‌ఫర్డ్‌లో సెయింట్ జాన్ కాలేజిలో చేరాడు. కుటుంబంలో అందరికి అభిమాని. ఆక్స్‌ఫర్డ్ వదిలేసరికి చాలా మారిపోయాడు. ప్రేమ వ్యవహారం విషాదమవటం ఒక కారణం అంటారు కాని రుజువుల్లేవు. ఇరవై ఏళ్ళకే అసాంఘికంగా, ఏదీ పట్టించుకోని వాడుగా మారి జీవితాంతం అలానే బతికాడు. అతని సమకాలిక కవి విల్ఫ్రిడ్ స్కావెన్ బ్లాంట్ "సిగరెట్ తాగడు. కొద్దిగా డ్రింక్ చేస్తాడు. ఎవరూ కదిలించకపోతే చాలా ప్రశాంతంగా

ఉంటాడు" అన్నాడు. స్నేహం చేసేవాడే కాని నిలబెట్టుకోవటం లేదు. పెళ్లి చేసుకోలేదు. అందరికీ దూరంగా ఒంటరిగా ఉండటం ఇష్టం. దేవుడున్నాడనే నమ్మకం పదమూడవ ఏటి నుంచే ఉండేది. ఇరవై ఎనిమిదవ ఏట నుండి నాస్తికుడు ఐపోయాడు. ఆనర్స్ పరీక్ష "డింకీ కొట్టటం" కూడా ఈమార్పుకు కారణం అని కొందరి ఊహ. బహుశా ఇది సరైన కారణమే కావచ్చు. కాని అతను ఇబ్బంది లేకుండా గ్రాడ్యుయేట్ అయినా 32వ ఏట యూనివర్సిటి కాలేజిలో ఉద్యోగం వచ్చే దాకా డిగ్రీ చేతికి రాకపోవటంతో హతాశుడయ్యాడు. టీచర్ అవటానికి ముందు పదేళ్ళు బ్రిటిష్ పేటెంట్ ఆఫీస్‌లో హయ్యర్ డివిజన్ క్లార్క్‌గా లండన్‌లో పని చేశాడు. ఈ కాలంలో ఏకాంత జీవనమే చేశాడు. కుటుంబానికి సంబంధం లేకుండా. 1892లో ఆఫీస్‌లో ఉద్యోగం మానేస్తూ "ఎంత తక్కువ చేయాలో అంత తక్కువ పని చేశా" అని చెప్పి యూనివర్సిటి కాలేజిలో లాటిన్ ప్రొఫెసర్‌గా చేరాడు.

19 ఏళ్ళ తర్వాత 52వ ఏట ట్రినిటీ కాలేజ్‌కి మారాడు. ఇక్కడే క్లాసిక్స్ బోధిస్తూ ఇతర లాటిన్ వాళ్ళను విమర్శిస్తూ, అడపా దడపా కవితలు అల్లుతూ జీవితాంతం ఉన్నాడు. దీన్ని రాసినా మళ్ళీ మార్పు చేసేవాడు కాదు. చివరి పాతిక ఏళ్ళు ఆగస్టన్ యుగానికి చెందిన "మానిలస్" కవి గ్రంథానికి వ్యాఖ్యానం రాస్తూ గడిపాడు. ఇది పూర్తి అయిన ఒక ఏడాదికి హూస్మన్‌ను ఒక కొత్త నీరసం ఆవహించింది. గుండెకు సంబంధించిన జబ్బు అని తెలుసుకొని మృతువు సమీపించిందని గ్రహించాడు. అయినా క్లాసులకు రెగ్యులర్‌గా వెళ్లి యధాప్రకారం బోధిస్తున్నాడు. బోధనలో డ్యూటీతోబాటు ఆనందాన్ని పొందాడు. తనకు ఇష్టమైన కవి "హోరేస్"పై ఉపన్యాసాలను తయారు చేసుకొన్నాడు. కాని పూర్తి చేయకుండానే హూస్మన్‌కు సెకండ్ ఎటాక్ వచ్చి 78వ ఏట 30-4-1936న మరణించాడు.

సుదీర్ఘ జీవితకాలంలో హూస్మన్ రెండే రెండు గ్రంథాలు మాత్రమే ప్రచురించాడు. కవిత్వంపై గొప్ప పట్టు సాధించాడు, వశపరచుకొన్నాడు. అందులో అరుదైనది "శ్రోఫైర్ లాడ్". దీని తర్వాత 26 ఏళ్ళకు అప్పటివరకు రాసిన కవితలను కూర్చి రెండో గ్రంథం తెచ్చాడు. దీనితో ఇక తాను కవిత్వం రాయాల్సిన పని లేదని చెప్పినట్లైనది. ఈ గ్రంథమే "లాస్ట్ పోయెమ్స్". హూస్మన్ మరణానంతరం చెదురుమదురుగా ఉన్న వాటిని సేకరించి సోదరుడు లారెన్స్ "మోర్ పోయెమ్స్"గా ప్రచురించాడు.

"శ్రోఫైర్ లాడ్" ఎన్నిసార్లు పునర్ముద్రణ పొందిందో లెక్కే లేదు. ఎన్ని రకాలుగా

ముద్రణ భాగ్యం దక్కించు కొన్నదో చెప్పలేం. దీనికి ఆయన నిరాశాతోకూడిన వేదాంతం ఒక్కటే కాదు, అందులోని లయాత్మక, సంప్రదాయ సంగీతం వీనుల విందు చేస్తుంది. సహజంగా మగాడు మోసం చేస్తాడు ఆడది వంచనకు గురౌతుంది. ఇది సహజం. ప్రకృతి ధర్మం. సహజ మానవ ధర్మం కంటే ప్రకృతి ధర్మం తక్కువ క్రూరమైనది. పల్లెటూరి ఆకస్మిక దాడులు మనిషిని మహా క్రూరత్వంలోకి నెట్టి భయపడేట్లు చేస్తుంది. సున్నిత మనస్కుడు మంచికంటే చెడుకు అలవాటు పడటం నేర్చుకొంటాడు. స్వర్గంలో ఆశ ఏమీ కనిపించదు. ఉన్నత స్వర్గం భూమి ఒకే పునాది నుంచి వచ్చినవే అంటాడు హూస్మన్. "the troubles of our proud dust and angry dust --are from eternity, and shall not fail" అంటాడు.

ప్రపంచం అంతా వేదనతో నిండిపోయింది దాన్ని జీర్ణించు కొంటే బాధ అలవాటై "ఇమ్యూనై" పోతుంది అన్నాడు. గ్రంథాంతంలో ఒక ప్రాచ్య రాజు "మిత్రి డేట్స్" ప్రపంచంలోని అన్ని రకాల విషాలను సేకరించి కొద్ది కొద్దిగా రుచి చూసి విష హరత్వం ఏర్పడి శత్రువులను జయించాడు అనే కథ చెప్పాడు.

"they poured strychnine in his cup --and shook to see him drink it up-they shook, they stared, as white' s their shirt --them it was their poison hurt --I tell the tale that I heard told --Mithridates, he died old.

"అదృష్టం ఒక చాన్స్ కాని అది తప్పక ఇబ్బంది పెడుతుంది" అన్నాడు. విశ్వ వ్యాప్త అసమానత్వాలు మనల్ని ఆశ్చర్యంలో ముంచి వేయక పోవచ్చునని చెబుతూ – "bear them we can, and if we can we must --shoulder the sky, my lad, and drink your ale"

రెండవది అయిన "లాస్ట్ పోయెమ్స్" కూడా నిరాశకే ఆజ్యం పోసింది. నిరాశ పరాకాష్టకు పోయింది. ఇందులో హూస్మన్ –

"we are a certainty are not the first --have sat in taverns while the tempest hurled --their hopeful plans to emptiness, and cursed - whatever brute blackguard made the world"

"డ్రింకింగ్ ఈజ్ బెటర్ దాన్ థింకింగ్" అంటూ గాలిబ్ గారి రుబాయత్‌ను అనుసరించి చెప్పాడు. అతని వేదాంతం మనకు కష్టంగానే ఉన్నా హృదయాలను పట్టేస్తుంది. కవిత్వం అంతా అసంబద్ధ అద్భుతంగా ఉండటం హూస్మన్ సాధించిన

ప్రత్యేకత. చిరకాలం జ్ఞాపకం చేసుకొనే వాక్యాలు హృదయాన్ని పట్టుకొని వదలవు.

"loveliest of trees,the cherry now --in hung with bloom along the bough --and stands about the woodland ride --wearing white for Eastertide"

హూస్మన్ వచనం కూడా కవిత్వమంత ప్రభావితం చేసింది. కవిత్వ లక్షణాన్ని చెబుతూ హూస్మన్ "could no more define poetry than a terrier could define a rat --but I thought we both recognized the object by the symptoms which it provoked in us" అన్నాడు. అతని పాండిత్య స్ఫోరక రచనలు అన్నీ వ్యంగ్య వైభవంతో రాణించాయి. స్విన్ బర్న్ కవిని గురించి చెబుతూ "Swinburne has said not only all he has to say about everything ,but all he has to say about nothing" అన్నాడు. హూస్మన్ అంటే "plainly a perfect poet ,and just as plainly as a great one" అన్నాడు విఖ్యాత విమర్శకుడు లూయీ క్రోనేన్ బెర్గెర్. ఇంగ్లీష్‌లో ఒక్క అక్షరం కూడా రాయని గొప్ప లాటిన్ కవి హూస్మన్.

క్లాసిస్ట్ కవులలో శిఖరాగ్రకవి హూస్మన్. ప్రైవేట్‌గా విద్యావంతుడై పండితుడై, తన కవిత్వంతో కావ్యాలతో అనితర సాధ్యమైన కవి అనిపించుకొన్నాడు. "జువేనాల్, మాలినాస్, లూకన్ కవులపై అతని పరిశోధన రచనలు అసాధారణమైనవి.

వోర్సెస్టర్ షైర్‌లోని బ్రూమస్ గ్రూవ్‌లో హూస్మన్ విగ్రహాన్ని ప్రతిష్టించి గౌరవించారు. వోర్సెస్టర్ యూనివర్సిటీలో ఒక బ్లాక్ కు హూస్మన్ పేరు పెట్టారు. హూస్మన్ కవితలను "కలక్టేడ్ పోయెమ్స్"గా 10 వాల్యూములు, క్లాసికల్ స్కాలర్షిప్ పేర" అయిదు గ్రంథాలు, "పబ్లిష్డ్ లెక్చర్స్"గా అయిదు గ్రంథాలు, ఒక ప్రోజ్ కలెక్షన్, కలేక్టేడ్ లెటర్స్‌గా రెండు గ్రంథాలు వెలువడ్డాయి.

శ్రో ఫైర్ లాడ్‌లో 63 మధుర కవితలున్నాయి. పబ్లిషర్లు ఎవరూ ముందుకు రాకపోతే హూస్మన్ స్వంత ఖర్చుతో దాన్ని 1896లో ప్రచురించాడు. అవి చదివి సహచరులు విద్యార్థులు అదిరిపోయారు. వాటిలోని భావోద్వేగాలు, హృదయ గాయాలను మాన్పే విధానంకు ముక్కు మీద వేలేసుకొని ఆశ్చర్యపోయారు. అమ్మకాలు క్రమంగా పుంజుకొని ఆంగ్ల సంగీత దర్శకుల అభిమానం పొంది వారు స్వరాలుకట్టి మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు ప్రపంచమంతా వ్యాప్తి చెందేట్లు చేశారు. ఇంగ్లీష్ ప్రజల

మనస్సులను హత్తుకున్నాయి. "శ్రో ఫైర్ లాడ్ 1896 మే నెల నుండి నిరంతరంగా పబ్లిష్ అవుతూనే ఉంది. ఇందులోని గీతాలను హూస్మన్ లండన్‌లోని హై గేట్లో ఉండి రాశాడు. శ్రోఫైర్ లండన్‌కు ముప్పై మైళ్ళ దూరంలోనే ఉంది. ఆతను పెరిగింది అక్కడే. దాన్ని తన కవితల ద్వారా చిరస్మరణీయం చేశాడు. తన కవితలకు ప్రేరణ షేక్స్ పియర్ పాటలు, స్కాటిష్ బార్డర్ బాలడ్స్, హీన్రిచ్ హీన్ అని ప్రకటించాడు. తన కవిత్వంపై గ్రీక్ అండ్ లాటిన్ క్లాసిక్ కవుల ప్రభావం లేనే లేదని నిర్ద్వందంగా తెలిపాడు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాతే తన నవ్య కవిత్వాన్ని రాయటం మొదలు పెట్టాడు. ఎందరో బ్రిటిష్ కవులపై హూస్మన్ ప్రభావం కలిగించాడు. వారందరూ యుద్ధం మీద కవితా భేరిమోగించారు. యుద్ధ ప్రారంభ సమయంలో చిన్నదైన "బ్రిటిష్ ఎక్స్పెడిషనరిఫోర్స్"ను బెల్జియంకు పంపిన సందర్భంలో కవిత రాశాడు. పాపం ఈ సైన్యం సరైన ఆయుధ సంపత్తి లేకుండా శక్తివంతమైన ఆయుధ సామగ్రి కల జర్మనితో పోరాడలేక ఇబ్బంది పడింది.

1920లో మోసెస్ జాక్సన్ అనే తన హోమోసెక్సువల్ కెనడాలో చనిపోతున్న సందర్భంలో హూస్మన్ తన ప్రచురణకాని కవితల్ని ఆయనకు పంపి చదివేట్లు చేసి ప్రశాంతంగా మరణించటానికి తోడ్పడ్డాడు.

John Sparrow quoted a letter written late in Housman' life that described the genesis of his poems:

Poetry was for him ...'a morbid secretion', as the pearl is for the oyster. The desire, or the need, did not come upon him often, and it came usually when he was feeling ill or depressed; then whole lines and stanzas would present themselves to him without any effort, or any consciousness of composition on his part. Sometimes they wanted a little alteration, sometimes none; sometimes the lines needed in order to make a complete poem would come later, spontaneously or with 'a little coaxing', sometimes he had to sit down and finish the poem with his head. That... was a long and laborious process.[23]❁



## 34. "ఫ్రీ విల్"ను ప్రవచించిన ప్రముఖ ఆధునిక ఫ్రెంచ్ తత్వవేత్త - హెన్రి బెర్గ్ సన్ (1859-1941)

హెన్రి బెర్గ్ సన్ తండ్రి పోలాండ్ దేశీయుడు తల్లి ఇంగ్లాండ్ దేశీయురాలు, పూర్వీకులెవరూ గాలిక్ రక్తం లేనివాళ్ళే. వీరంతా జ్యూయిష్ వ్యాపారస్తులు. హెన్రి తండ్రి కళల వైపు మొగ్గు చూపాడు. గొప్ప సంగీత విద్వాంసుడు అవటంతో స్వంత ఊరు వార్సా వదిలిపెట్టి బ్రిటన్ చేరి ఐరిష్ వంశానికి చెందిన ఇంగ్లీష్ జ్యూయిష్ యువతి కేథరీన్ లేవిన్సన్‌ని పెళ్లి చేసుకొన్నాడు. కొడుకు హెన్రి 18-10-1859లో పారిస్‌లో పుట్టినప్పటికీ ఇరవై ఒకటవ ఏడు వరకు సామాన్య ఫ్రెంచ్ దేశీయుడిగానే ఉన్నాడు. ఇతని ఇంగ్లీష్ ఉచ్చారణ చూసి తోటి విద్యార్థులు టిపికల్ ఇంగ్లీష్ మన్ అనుకొనేవారు. ఈకోల్ నార్మేల్ సుపీరియర్‌లో బయాలజీ, సైకాలజీ చదివాడు. జాన్ స్టువర్ట్ మిల్ బోధించే ఫ్రీ థాట్‌కు, ఇండక్షన్ విధానానికి ఆకర్షితుడై హెర్బర్ట్ స్పెన్సర్ చెప్పిన "ఫస్ట్ ప్రిన్సిపుల్"ను మెచ్చుకున్నాడు. శాస్త్రీయ పరిణామ భాషలో వాస్తవాన్ని వివరించలేము అని అనుమాన పడ్డాడు.

18వ ఏట ఒక గణిత సమస్య "అన్నేల్ డీ మేథమేటిక్" పత్రికలో పడింది. అది ప్రభావితం చేసింది. గణిత శాస్త్రజ్ఞుడు అవుదా మనుకొన్నాడు. గణితం లోని కఠిన నియమాలు, ఖచ్చితమైన సైన్స్, ఊహాత్మక సాహిత్యంలలో దేన్ని ఎంచుకోవాలో యువ హేన్రికి అర్థం కాక రెండిటిని కలపాలని నిర్ణయానికి వచ్చాడు. ఫిలాసఫీ రచయిత ఆవాలను కొన్నాడు. పూర్వపు గ్రీకు ఫిలాసఫర్లపై ఆసక్తి పెరిగింది. జీనో చెప్పిన "బీయింగ్, బికమింగ్", హెరాక్లిటస్ బోధించిన ఫ్లూయిడ్ యూని వర్స్ మనసుకు బాగా పట్టాయి. వీటిని తరువాత కాలంలో సుసంపన్నం చేశాడు. మనిషి వేదాంతం

వలననే జీవించలేదు అని గుర్తించి, ఫిలాసఫీ బోధన, తిండి పెడుతుంది అని తెలుసుకున్నాడు. గ్రాడ్యుయేషన్ అయిన తర్వాత "లైస్ ఆఫ్ క్లేర్మాంట్ ఫెర్రాండ్"లో టీచర్‌గా చేరి విద్యార్థులను బాగా ఆకర్షించాడు. ప్రతి విషయంపైనా నిగ్గు తేల్చే విధానాన్ని అనుసరించాడు.

30వ ఏట బెర్గ్ సన్ రెండు పరిశోధనా గ్రంథాలను రాసి ప్రచురించాడు. అందులో చాలా ముఖ్యమైన మొదటి గ్రంథం "Time and Free will". ఎనిమిది ఏళ్ల తర్వాత ఆయన చదివిన పాత స్కూలులో ఉద్యోగం పొందాడు. అప్పుడు తీవ్రమైన ఆలోచనా విధానం కల "మేటర్ అండ్ మెమరీ" గ్రంథాన్ని ప్రచురించాడు. 1900లో కాలేజి డి ఫ్రాన్స్‌లో ప్రొఫెసర్ అయ్యాడు. ఇందులో ముప్పై ఏళ్ళు పని చేశాడు. ఆయన ఉపన్యాసాలు అందరినీ ఆకర్షించేవి. ఒక ఫిలాసఫర్ అంతగా ప్రాచుర్యం పొందటం ఆశ్చర్యం వేస్తుంది. ఆయన ప్రఖ్యాతి విపరీతంగా వ్యాపించింది. అన్ని చోట్లా ఆయనను అభినందించారు, అనుకరించారు, ఆహ్వానించి సన్మానించారు. తరచుగా ఇండ్లు మారుస్తుండేవారు. అందుకని "వాండరింగ్ జ్యూ" అనేవారు. స్త్రీలు ఆయన ఉప న్యాసాలంటే క్రేజీగా హాజరయ్యేవారు. ఆయన చెప్పే "క్రియేటివ్ ఇవల్యూషన్", "చైతన్య స్రవంతి (ఎలాన్ వైటల్)" బాగా ఆకర్షణగా ఉండేవి. వేదాంతమంటే తనలో తాను తొంగి చూసుకోవడమని చెప్పేవాడు. ఈ మాటలను అందరూ అన్ని చోట్లా చెప్పుకుని ప్రాముఖ్యతను తెచ్చారు. 50వ ఏట టెయిన్ అండ్ రెనాన్ అనే చోట ఉండి ఫ్రాన్స్ దేశంలో సృజనాత్మక ఆలోచనా పరుడుగా కీర్తిపొందాడు. కొత్త భావాల వ్యాప్తికి ప్రపంచంలో గొప్ప ప్రేరణ కల్గించిన మేధావిగా గుర్తింపు పొందాడు. 52వ ఏట ఆయన రాసిన time అండ్ freewill, matter అండ్ memory, క్రియేటివ్ ఇవల్యూషన్ ఒకే సారి ఇంగ్లీషులో అనువాదం పొంది విడుదల అయ్యాయి. అమెరికా, ఇంగ్లాండ్‌లలో ఆయనకు కొత్త శిష్యులు ఏర్పడ్డారు. పురుషులు ఆయన భావ తీవ్రతకు ఉత్తేజపడితే, స్త్రీలకు ఆయన ఆరాధ్యుడయ్యాడు. ఆయన దాంపత్యం ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగింది.

50లలో బెర్గ్ సన్ సంచార ఉపన్యాసకుడుగా మారాడు. ఆక్స్ఫర్డ్, లండన్, బర్మింగ్ హాం, బొలోనా, న్యూ యార్క్‌లలో చిరస్మరణీయ ఉపన్యాసాలు ఇచ్చాడు. ఆయన అందరికీ అందుబాటులో ఉండేవాడు. దానితో శ్రోతలకు ఆయన ప్రవచనాలు పరమ ఆసక్తిగా ఉండేవి. 55వ ఏట ఫ్రెంచ్ అకాడమీకి ఎన్నిక అయ్యాడు. 62లో కాలేజి డి ఫ్రాన్స్‌కు రాజీనామా చేసాడు కానీ "ఆనరరీ ప్రొఫెసర్"గా ఉండిపోయాడు. 68లో బెర్గ్ సన్‌కు "in recognition of his rich and life giving ideas and re-

splendent art with which they are presented"కు గాను "నోబెల్ బహుమతి" లభించింది. వయస్సుపై బడుతున్న కొద్దీ మత భావాలకు మరీ దగ్గర అయ్యాడు. 70వ ఏట కాథలిక్‌గా మారి దానిని "The complete fulfillment of Judaism" అని ప్రకటించాడు. కానీ యాంటీ సేమిటిక్ ఉద్యమాల ప్రభావం వలన, జర్మనీ ఫ్రాన్స్‌లలో మతంపై ఒక కొత్త ఆలోచన రావాలి అని భావించాడు. దౌష్ట్యం ఆయన్ను కలచి వేసింది. రాబోయే రోజుల్లో బాధితులలో తానూ ఒకడిగా ఉండాలని అనుకున్నాడు. ఈ దౌష్ట్యం ఫ్రాన్స్‌లో 1940 ఫ్రాన్స్ పతనం తర్వాత జరిగింది. "విచీ" ప్రభుత్వం యూదులందరినీ వారి ఉద్యోగాల నుండి తప్పించింది. బెర్గ్ సన్ జోలికి పోలేదు. దీన్ని ఆయన స్వప్రయోజనంగా భావించలేదు. 80 ఏళ్లకు మరీ బలహీనుడై ఏమాత్రం రాజీ పడకుండా విశ్రాంత జీవితాన్ని గడిపాడు. ఫ్రాన్స్‌లోని యూదులందరినీ పేర్లను నమోదు చేసుకోవాలని బలవంత పెట్టినా ఈయన జోలికి రాలేదు. దాన్ని ఆయన అవకాశంగా భావించకుండా రిజిస్ట్రేషన్ ఆఫీసువెళ్లి, క్యూలో గంటల తరబడి నిలబడి తన పేరును రిజిస్టర్ చేయించుకున్నాడు. దీనితో విపరీతమైన నీరసం వచ్చి తట్టుకోలేక పోయాడు. అననుకూలమైన ఆ వాతావరణంలో ఆయన గంటలు తరబడి నిలబడి ఉండటం వలన ఆరోగ్యం దెబ్బ తిన్నది. కానీ మానవత్వ గౌరవాన్ని ఆయన పపంచానికి చాటాడు. అదే ఆయన చావుకు దగ్గరకు తెచ్చింది. ఊపిరి తిత్తులు దెబ్బ తిని, రక్త నాళాలు కుంచించుకునిపోయి 4 -1-1941న ఆ జ్ఞాన వయో వృద్ధ ఫిలాసఫర్ హెన్రీ బెర్గ్ సన్ తుది శ్వాస వదిలాడు.

బెర్గ్ సన్ భావాలు విప్లవాత్మకమైనవి కావు. కానీ ఆయన వివరించే విధానం ఆశ్చర్యంగా దిగ్భ్రమ కలిగించేవిగా ఉంటాయి. వేదాంతం అంటే పారిపోయే జనాలకు ఆయన మాటలు రస గుళికలయ్యాయి. సంభ్రమాశ్చర్యాలలో ముంచేవి. సామాన్య జీవికి గుణాత్మక మార్గాన్ని చూపెట్టిన మహానీయుడాయన. నేతి-నేతి వాదాల జోలికి పోకుండా సూటిగా వేదాంతాన్ని బోధించిన అద్వితీయుడు. ప్రతి వ్యక్తీ ఒక కొత్త జీవి అని సృజనశీలి అని నమ్మాడు. ఆయన జీవితంలో ప్రతి క్షణం ఒక కొత్త అవకాశానికి వేదికగా ఉండేది. స్వేచ్ఛా ఆలోచనలకు ఆయన పెద్ద పీట వేశాడు. డార్విన్ సిద్ధాంతాన్ని కొత్త ఆలోచనలతో పరిణామ క్రమంగా బోధించాడు. అందుకే బెర్నార్డ్ షా ఆయన చెప్పిన ఎలాన్ వైటల్‌ను ప్రాణ శక్తి (లైఫ్ ఫోర్స్) అన్నాడు. ఇది నిరంతరం అభివృద్ధి చెందుతూ, వ్యాపిస్తూ కొత్త రూపాలను పొందుతూ నిస్తేజంగా చలన రహితంగా ఉత్సాహ రహితంగా ఉండే వాటిని వ్యతిరేకించింది. జడత్వాన్ని వదిలించింది. జీవితం అంటే అడ్డు లేని నిరంతర చర్య అన్నాడు. అనుమాన రహితమైన పోరాట పటిమ కల

విధానం అంటాడు. దేవుడు కూడా ఒక చోట స్థిరపడి ఉండే శక్తి కాదన్నాడు. తను చేసిన సృష్టితో పాటు దేవుడు కూడా పెరుగుతాడు అంటాడు. "దేవుడు రెడీ మేడ్" వస్తువు కాదన్నాడు. "God is unceasing life action freedom. Creation so conceived is not a mystery -- we experience it in ourselves when we act freely" అని చెప్పాడు.

ఈ ఆరకమైన ఆలోచన వల్ల బెర్గ్ సన్ పదార్ధానికి ఒక కొత్త తేజాన్ని ఇస్తూ ఆధ్యాత్మికతకు దగ్గర చేశాడు. కనిపించే వస్తువులను, అణువులను దాటి ఆయన ఆలోచనలు ఉండేవి. "He compared the potential energy held in the atom to the release of nuclear thought within the mind. He made a distinction between the brain, which is the calculating and measuring machine and the mind which remembers every thing and manifests itself in intuition, the source of all knowledge" అని సిద్ధాంతరీకిస్తాడు బెర్గ్ సన్. మానవ మెదడు ఆలోచనా యంత్రమని, అది లెక్కించి మదింపు చేసి విశ్లేషణ చేస్తుందని కానీ అది అనుభ వించ లేదని చెప్పాడు. భావాలకు స్పందించే శక్తి బాధ పడటం, ఓర్చుకోనటం అనేవి ఒక ఆత్మగత విధానం అన్నాడు. బాధ పడటం, ఒర్చుకోనటం అని మిగిలిన వేదాంతులు చెబితే బెర్గ్ సన్ "intuition is the legitimate and noble province of the mind -- indeed it is the only means for perceiving the heart of things" అని స్పష్టంగా చెప్పాడు. మనిషిలోని గతం వర్తమానంపై అధిక ప్రభావం చూపిస్తుంది అని అది అతని అంతరాత్మను ఎప్పుడూ వదలిపెట్టదని ఆయన రాసిన మేటర్ అండ్ మెమరీ లో చెప్పాడు. ఇదే ఒక "సజీవ చైతన్య స్రవంతి" లాగా ఉంటుందని అతని అభిప్రాయం.

కాలానికి, అవధికి (duration) ఉన్న తేడాను కూడా బెర్గ్ సన్ వివరించాడు. గడియారం చూపే కాలం వాస్తవ కాలం కాదంటాడు. వాస్తవ కాలం లోలక ఆవర్తనంతో ఏకీభవిస్తూ ఉన్నా గడియారం టైంతో సంబంధ ఉండదు. దానికి హద్దులు లేవు. దానిని సంక్షిప్తీకరించలేము. అవధి (duration) గురించి చెబుతూ "Duration is the continuous progress of the past which gnaws (bite) into the future and which swells as it advances, "for the past in its entirety is prolonged into the present and abides there actual and acting. Duration is the essential pulse of our being". "అంతర్ జ్ఞానం అంటే వ్యక్తి అసలు రూపం, అతని ఆత్మ, అతని అనంతమైన సృజనాత్మక మేధ" అన్నాడు

బెర్గ్ సన్. అతని వ్యాసాలలో భాగాలు కేలిడియో స్కోప్‌లో చూస్తున్న అనుభూతి నిస్తాయి. గందరగోళ పరిచే కాల్పనికత ఉండదు. వాక్యాలన్నీ మాటల ప్రవాహాలే, పారదర్శకాలే. సునిశిత హాస్య స్ఫోరకాలే. కంటిని గురించి చెబుతూ బెర్గ్ సన్ అందులో అనేక భాగాలున్నాయని, కార్నియా, రెటినా, కటకం మొదలైన భాగాలు ఉన్నాయని అందులో ప్రతి భాగం పని అనంతంగా ఉంటుందని రెటీనాలో నాడులతో కూడిన మూడు పొరలు అనేక ధృవాల కణాలు ద్విధృవ కణాలు చూపు కణాలు ఉంటాయని ఇందులో ప్రతి దానికి స్వయం వ్యక్తిత్వం ఉంటుందనీ కనుక దీనిని నిర్వచించటం కష్టం అని అంటాడు. “The mechanism of the eye is in short composed of an infinity of mechanisms. All of extreme complexity, yet vision is one simple fact. As soon as the eye opens the visual act is effected, this contrasts between the infinite complexity of the organ and the extreme simplicity of the function is what should open our eyes” అని మనిషి తెలుసుకోవలసిన అసలు విషయాన్ని ఎరుక పరచాడు.

బెర్గ్ సన్ రచయితలందరికంటే గొప్ప సత్తా ఉన్నవాడు. ఏడిపిస్తాడు, కదిలిస్తాడు, ఊహను ప్రేరేపిస్తాడు. అతను ఫిలాసఫర్లలో కవి. అంతర్ జ్ఞానం –కారణాన్ని అధిగమిస్తుందని అంటాడు. బెర్గ్ సన్ ప్రభావం సాహిత్యంలో మార్మికతను వేగవంతం చేసింది. “Bergson re-established the innate sense of wonder in a world where even the machine takes on mystical powers” అని అతని మార్మికతపై వ్యాఖ్యానిస్తారు. దీనిపై ఆయన స్పందన “Machinery will find its true vocation again, it will render services in proportion to its power of mankind which it has bowed still lower to the earth can succeed through it in standing erect looking heavenly wards. మొత్తం మీద బెర్గ్ సన్ సిద్ధాంత సారాంశం “intuition and creation, life and memory, perception and religion are one, the immediate moment contains the entire past every thing- the accumulation of all ages is now”

1908లో బెర్గ్ సన్ లండన్ లో హార్వర్డ్ ఫిలాసఫర్ విలియం జేమ్స్‌ను కలుసుకొన్నాడు. అయన ఇంగ్లీష్ అమెరికన్ మిత్రులందరికీ ఈ ఫ్రెంచ్ ఫిలాసఫర్‌ను పరిచయం చేశాడు. ఈ ఇద్దరూ అప్పటినుండి మంచి మిత్రులయ్యారు. బెర్గ్ సన్‌ను అభినదిస్తూ విలియం జేమ్స్ “so modest and unpretending a man such a genius intellectually.I have the strongest suspicions the tendency

which he has brought to a focus will end by ,prevailing, and the present epoch will be a short of turning point in the history of philosophy" అని రాశాడు. హెన్రి రాసిన తొలి రచనలపై జేమ్స్ ప్రభావం బాగానే ఉంది. తర్వాత బెర్గ్ సన్ ప్రభావం జేమ్స్‌పై పడి తనకున్న లాజిక్‌ను క్రమంగా తగ్గించుకొన్నాడు. ఇటలీలోని బోలోనాలో జరిగిన నాలుగవ అంతర్జాతీయ వేదాంత సభలలో బెర్గ్ సన్ "ఫిలసాఫికల్ ఇంట్యూ షన్"పై అద్భుత ప్రసంగం చేశాడు. ఆక్స్ ఫర్డ్ యూని వర్సిటీలో "ది పెర్సేప్షన్‌ఆఫ్ చేంజ్"పై గంభీరోపన్యాసమిచ్చాడు. ఫ్రెంచ్ పత్రికలలో అసంఖ్యాక వ్యాసాలూ రాసి ఉత్తేజ పరచాడు. 1920లో కేంబ్రిడ్జి యూనివర్సిటీ "డాక్టర్ ఆఫ్ లెటర్స్" బహూకరించి సత్కరించింది.

"బెర్గ్ సన్‌అండ్ ఐన్ స్టీన్ యూనివర్స్" అనే పుస్తకం రాశాడు కాని ఆయన భౌతిక శాస్త్ర పరిజ్ఞానం చాలలేదనే విమర్శను ఎదుర్కొన్నాడు. "కార్టీషియన్ థీరీ"కి వ్యతిరేకంగా "లాఫ్టర్ (laughter) పుస్తకం రాశాడు. హెన్రిపై ఇమాన్యుల్ కాంట్, బారుక్, స్పినోజా మొదలైన వారి ప్రభావం ఉంది. బెర్గ్ సన్ ఎమిలీ బ్రీహీర్, మార్సెల్ ప్రౌస్ట్, నికోస్ కజంట్ జకి మొదలైన వారిపై విశేషమైన ప్రభావం కలిగించాడు.

బెర్గ్ సన్ కోటబుల్ కోట్స్ కొన్ని -1) to exist is to change ,to change is to mature ,to mature is to go on creating oneself endlessly .

2) think like a man of action ,act like a man of thought.

3) the present contains nothing more than the past,and what is found in the effect was already in the cause.❋



## 35. వ్యావహారిక సత్తా వాద వేదాంతాన్ని ప్రచారం చేసిన అమెరికన్ సంస్కర్త - జాన్ డ్యూయి (1859–1952)

అమెరికాలోని న్యూ ఇంగ్లాండ్ రైతు, నిర్భయ ఉదారవాది, ప్రాగ్మాటిజం ప్రచారకుడు విద్యా సాంఘిక సంస్కర్త, ఫిలాసఫర్ జాన్ డ్యూయి అమెరికా రాజకీయాలను, సంస్కృతిని ఆధునిక విద్యనూ ప్రభావితం చేసిన ఆలోచనాపరుడు. అమెరికా ప్రజలు ఆయనను ప్రగతిశీల విద్యావిధాన స్థాపకుడు అంటారు. డార్విన్‌కు విలియం జేమ్స్‌కు అనుచరుడు. విధానాలను స్పష్ట పరచడమే కాక వ్యాప్తికి ధర్మయుద్ధం చేసినవాడు. డార్విన్ లాగానే జ్ఞానం ముందే ఏర్పడిన భావాలపై ఆధారపడి ఉండదని, జీవాత్మక యదార్ధాలపై ఆధారపడి ఉంటుందని అన్నాడు. విలియం జేమ్స్ వలెనే నిరంకుశాధికారం, మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా వ్యావహారిక సత్తావాదం (ప్రాగ్మాటిజం)ను బలపరచాడు. వ్యవహారంలో ఉన్నవాటిని ప్రశ్నించలేదు. ఆలోచన, పదార్ధం రెండూ కూడా ఒక చలనశీల విధానం అని, తర్కం అనేది వృద్ధి చెందుతున్న ఒక విధానమని తత్వ శాస్త్రం, వాస్తవ విషయజనిత సంగ్రహాల సమాహారం కాదని, దానికి ఒక సాంఘిక పునాది ఉంటుందని కనుక అది సాంఘిక శక్తిగా భావించాలని అన్నాడు.

జాన్ డ్యూయి అమెరికాలోని వెర్మాంట్ రాష్ట్రంలో బర్లింగటన్ పట్టణంలో 20-10-1859లో జన్మించాడు. అదే సంవత్సరంలో చార్లెస్ డార్విన్ 'ఆరిజిన్ ఆఫ్ స్పెసీస్' ప్రచురించటం ఒక యాదృచ్చిక సంఘటన. నాలుగు రోజుల తర్వాత జాన్ బ్రౌన్

హార్పర్స్ ఫెర్రీపై దాడి చేసాడు. క్రీ.శ.1600 నుండి ఇతని కుటుంబం అమెరికాలోనే ఉంది. తండ్రి ఒక కిరాణా షాపు నిర్వహించేవాడు. తల్లి ఒక వేర్మార్మర్ కుమార్తె. ఆమె పూర్వీకులు కేప్ గాడ్ రైతులు. చిన్నతనం నుంచి పుస్తకాలలో కూరుకుపోయేవాడు. పుస్తకాలతోనే అతని ఆట. 20 ఏళ్ళు రాకముందే వెర్మాంట్ యూనివర్సిటీ నుండి పట్ట భద్రుడయ్యాడు. వెంటనే పాఠాలు బోధించాడు. పెన్సిల్వేనియాలోని ఆయిల్ సిటీలో మొదట ఉద్యోగంలో చేరి తర్వాత తన సొంత రాష్ట్రంలో అక్కడి గ్రామీణ స్కూళ్ళలో బోధన చేసాడు. కొన్నేళ్ళ తర్వాత తత్వ శాస్త్రాన్ని ముఖ్య విషయంగా ఎంచుకుని జాన్స్ హాప్కిన్స్‌లో చేరి 25 ఏళ్లకే డాక్టరేట్ పొందాడు. తన విద్యార్థిని అయిన యాలిస్ చిప్మన్‌ను పెళ్లి చేసుకున్నాడు. మిచిగాన్ యూనివర్సిటీలో ఇన్స్ట్రక్టర్‌గా చేరి 1888లో మిన్నెసోటా యూనివర్సిటీలో తత్వశాస్త్ర ఆచార్యుడు అయ్యాడు. 35వ ఏట చికాగో యూనివర్సిటీలో తత్వశాస్త్ర విభాగానికి అధిపతి అయ్యాడు. రెండేళ్ళ తర్వాత దాని "లాబరేటరీ స్కూల్ ఆఫ్ ఎడ్యుకేషన్"కు డైరెక్టర్ అయ్యాడు. అది ప్రయోగాత్మక విద్యా విధానం కోసం ఏర్పడిన స్కూల్. నిజాలు, గణాంకాలు ఆలోచనలు పిల్లలపై వారికి ఆసక్తి కలిగే వరకు బలవంతంగా రుద్ద రాదనే ఆశయంతో ఈ స్కూల్ నడుస్తోంది. జాన్ డ్యూయి పిల్లవాడి వర్తమాన అనుభవాన్ని సుసంపన్నం చేయాలని స్పష్టంగా తెలియని భవిష్యత్తు కోసం వారిని ఇబ్బంది పెట్టరాదని భావించాడు. అతని ఆశయం "పని చేస్తూ నేర్వడం" (లెర్నింగ్ బై డూయింగ్). భవిష్యత్తు కోసం విద్య బోధించడం కాక ఇప్పటి జీవితాన్ని అర్థవంతం చేసేట్లుగా విద్య ఉండాలని చెప్పేవాడు. దీనిపై అప్పుడు వాదోపవాదాలు ఉండేవి. "The new spirit in education forms the habit of requiring that every act be an outlet of the whole self" అనేది అతని వాదం. సనాతన భావాలకు విరుద్ధంగా ఆయన చెప్పేవాడు. తన భావాలను ఆయన మొదటి గ్రంథం "ది స్కూల్ అండ్ సొసైటీ"లో విస్పష్టంగా వివరించాడు. ఆయన 40వ ఏట ఇది ప్రచురించబడింది.

45వ ఏట చికాగో యూనివర్సిటీకి రాజీనామా చేసి కొలంబియా యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా చేరి అక్కడే జీవిత మంతా చిరస్మరణీయమైన సేవలు అందించాడు. ఆయన శిష్యుడు, సహాయకుడు మాక్స్ ఈస్ట్మన్ "సాటర్ డే రివ్యూ ఆఫ్ లిటరేచర్"లో ఆయన రాబర్ట్ లూయి స్టీవెన్సన్‌లాగా ఉండేవాడని వర్ణించాడు. సమతలమైన జుట్టు, నల్ల మీసాలు కాంతివంతమైన కళ్ళతో తరగతి గదికి వచ్చేవాడు. ఆయన స్ఫూర్తినిచ్చే ఉపన్యాసకుడు కాదు. పాఠాలు మార్పు లేకుండా మూస విధానాలు ఉండేవి. ప్రేరణ కలిగించేవి కావు. కొలంబియా యూనివర్సిటీ తత్వశాస్త్ర అధిపతి ఇర్విన్ ఎడ్మండ్

ఈయన బోధన మొదటిసారి విని చాలా నిరాశ చెందాడు. కానీ అయన విషయ పరిజ్ఞానం చాలా లోతైనదని ఆయన మేధా పరిణతికి ఆశ్చర్య పడ్డాడు. ఆయన చెప్పేదంతా సృజనాత్మక తత్వ శాస్త్రమే.

50వ ఏట "How we think" పుస్తకం రాసాడు. కూతురు ఈవ్లిన్‌తో కలసి "స్కూల్స్ ఆఫ్ టుమారో" రాశాడు. "డెమోక్రసీ అండ్ ఎడ్యుకేషన్" అనే ఈయన రాసిన గ్రంథం చాలా ప్రాముఖ్యమైనదిగా భావిస్తారు. 61వ ఏట "రి కన్స్ట్రక్షన్ ఇన్ ఫిలాసఫీ" రాశాడు. తత్వశాస్త్రాన్ని అర్థం చేసుకోలేని వారికి వెలుగు మార్గం చూపే కరదీపికగా దీనిని భావిస్తారు. పిల్లలకు వారి భావాలను బయటకు చెప్పే స్వాతంత్ర్యం ఇవ్వాలని వారి స్వేచ్ఛకు భంగం కలిగించరాదని చెప్పేవాడు. ఒకసారి ఈయన నర్సరీ స్కూలుకు పర్యవేక్షణకు వెళ్ళగా అక్కడ ఆయన కొడుకు ఒక పెద్ద కుర్రాడి చేత తన్నులు తింటూ నేల మీద అసహాయంగా పడివుండటం చూశాడు. అక్కడే ఉన్న ఒక ఉపాధ్యాయుడు "ఇది మా అభివృద్ధి విద్యా విధానం" అని నవ్వుతూ అన్నాడు. వెంటనే డ్యూయి "ప్రపంచంలో దుర్మార్గం చాలా ఉందని దానికి తన కుమారుడు ఎదిరించటానికి సిద్ధంగా ఉన్నాడని" అన్నాడు. ఇంకొకసారి ఆయన ఒక క్లాస్ రూమ్‌లోకి వెళ్ళగా క్లాసు గోలగోలగా ఉండగా ఒక కుర్రాడు పుస్తకాన్ని తదేక దీక్షగా చదువుతుండటం చూశాడు. అక్కడ ఉన్న టీచర్ "అతన్ని మీరు క్షమించాలని, అతను స్కూల్ లో చేరి ఒక వారమే అయ్యింది" అన్నాడు అంటే ఇతను కూడా, వారిలాగానే అల్లరి చేసేవాడు అనే అర్థం వచ్చేట్లు అన్నాడు "మీ విద్యా సంస్కరణలు ఇలా ఏడ్చాయి" అని దెప్పి పొడవటం అన్నమాట. ఇలాంటి సంఘటనలు చాలానే ప్రచారంలో ఉన్నాయి. వయస్సు పెరిగిన కొద్దీ ఆయన శక్తి సంపన్నుడు అయ్యాడు. 50-60-ఏళ్ల మధ్యలో చాలా చురుకుగ్గా ఉన్నాడు. న్యూయార్క్ నగరంలో "టీచర్స్ యూనియన్" ఏర్పడడానికి కృషి చేశాడు. రాజకీయంలో ప్రవేశించాడు. ఉదారవాదులలో ప్రముఖుడయ్యాడు. "పార్టీ కంటే వ్యక్తికి ఓటు వేయండి" అనే నినాదాన్ని ప్రచారం చేశాడు. జపాన్ పర్యటించి టోక్యోలోని "ఇంపీరియల్ యూనివర్సిటీ"లో ఉపన్యాసాలు ఇచ్చాడు. ఆయన శిష్యులైన చైనా విద్యార్థులు ఆయనను పట్టుబట్టి చైనాకు తీసుకెళ్ళాడు. అక్కడ రెండేళ్ళు పెకింగ్‌లో, నాంకింగ్‌లో ఉపన్యాసాలిస్తూ ఉన్నాడు. 65-70 ఏళ్ల మధ్య టర్కీ, మెక్సికో, రష్యా సందర్శించి అక్కడి విద్య ప్రయోగాలను నిర్దేశించాడు. 78 వ ఏట ఒక తీవ్రమైన వివాదాస్పద సంఘటనలో ఇరుక్కున్నాడు.

సోవియట్ ప్రభుత్వం లియాన్ ట్రాటస్కీ అనే ప్రవాసంలో ఉన్న అతనిపై చేసిన ఆరోపణలను పరిశోధించటానికి ఏర్పడిన కమిషన్‌కు నాయకత్వం వహించాడు. స్టాలిన్

అనుచరులందరినీ అక్కడి ప్రభుత్వం చంపేస్తోంది. ట్రాటస్కీ చాకచక్యంగా తప్పించుకుని మెక్సికో వెళ్ళిపోయాడు. కానీ అక్కడ దారుణంగా హత్య చేయబడ్డాడు. డ్యుయీ తటస్థంగా ఉన్నాడు. తాను ట్రాటస్కయిట్ కానీ స్టాలినిస్టు కాదని మాస్కో వారి సాక్ష్యాన్ని, అవతలి వారి సాక్ష్యం విన్న తర్వాత మాత్రమే అంగీకరిస్తామని చెప్పాడు. కమిషన్ ట్రాటస్కీకి తీవ్రవాదం, ఫాసిజంతో అమబంధం లేని అమాయకుడు అని, నిర్దోషి అని తీర్పిచ్చింది. కనుక అతనిపై ఆందోళనలు తగవని అది ఒక కుట్ర అని చెప్పింది. కమ్యూనిష్టులు అతనిని తీవ్రంగా రెచ్చగొట్టినా ఆయన కలవర పడలేదు. ప్రజాస్వామ్యాన్ని సంపూర్ణంగా రక్షించాలని ఆయన ధ్యేయం. జీవితం చరమాంకంలో ఆయన భయాలకు ఎర అయ్యాడు. ఎనభైలలో కూడా తను నమ్మిన సిద్ధాంతాలను ప్రచారం చేయటానికి జంకలేదు. ఎనభై ఐదు లో కూడా ప్రజాస్వామ్య విలువల కోసం తీవ్రపోరాటం చేస్తూనే ఉన్నాడు. 1946లో చికాగో, డెట్రాయిట్‌లో కార్మిక నాయకులతో కలిసి పీపుల్స్ పార్టీ ఏర్పాటు చేయడానికి ప్రయత్నించాడు. "పీపుల్స్ లాబీ"కి అధ్యక్షుడయ్యాడు. అమెరికాలోని "రెండు పార్టీలు" పెద్ద వ్యాపార సంస్థలు అన్నాడు. ప్రభుత్వాధికారం ధనస్వామ్యం చేతిలో కాక ప్రజలకు దక్కాలి అని ప్రచారం చేశాడు. 1946లో రాసిన ''ప్రాబ్లంస్ ఆఫ్ మెన్''లో తన అభిప్రాయాలను పొందుపరచాడు. దీనిని సమీక్ష చేసిన ఆల్విన్ జాన్సన్ అనే న్యూ స్కూల్ ఫర్ సోషల్ రిసెర్చ్ అధ్యక్షుడు "తత్వశాస్త్రంలోనూ రాజకీయంలోనూ గొప్ప ప్రతిక్రియకు తోడ్పడినాడని" అన్నారు. తత్వశాస్త్రాన్ని సమూలంగా మార్చాలని భావించాడు. ప్రస్తుత ప్రపంచం ప్రజాస్వామ్యానికి చెందినదని భావించాడు. ప్రజాస్వామ్యం కాలం కోసం ఆగకూడదని ఊహాగానాలపై ఆధారపడకూడదని అన్నాడు. 87లో ఆయన చూపు, ఆలోచనలకు ఏమాత్రం పదును తగ్గలేదు. మరింత దృఢపడ్డాడు. భార్య చనిపోయిన 20 ఏళ్ళ తర్వాత, 88 ఏట తన వయస్సులో సగం వయస్సును రోబర్తా గ్రాంట్ అనే విధవ స్త్రీని వివాహం చేసుకున్నాడు. మొదటి భార్య వలన ఆరుగురు పుడితే అందులో ఇద్దరు బాల్యంలోనే చనిపోయారు. ఏడవ వాడిని పెంచుకున్నాడు. తర్వాత ఇంకొక ఇద్దరినీ యుద్ధ శరణార్థులను దత్తత తీసుకున్నాడు. తొంభైవ పుట్టినరోజున అనేక సన్మానాలు, గౌరవాలు, డిన్నర్లు, ప్రపంచవ్యాప్త ప్రశంసలు అందుకున్నాడు. ఆయన అభిమానులు తొంభై వేల డాలర్లను కానుకగా అందించారు. ఆ ధనాన్ని తన అభిమాన విద్యా ప్రణాళికల అమలుకు ఖర్చు చేశాడు.

తొంభై ఒకటవ ఏట కిందపడగా మోకాలు విరిగింది. త్వరగా కోలుకుని "ఏల్స్" అందచేసిన గౌరవ పట్టాను స్వయంగా తీసుకున్నాడు. 1952 వసంత కాలంలో

న్యుమోనియా వచ్చి తీవ్రమై 93వ ఏట 2-6-1952న జాన్ డ్యూయీ మరణించాడు.

ఆయన రచనలు స్టయిల్ కంటే విషయానికి ప్రాధాన్యం ఉండేది. ఆయన ప్రకటనలు సంక్లిష్టంగా పునరుక్తితో ఆకర్షణీయంగా ఉండేవి కావు. ఆయన రాసిన ముప్ఫై ఎనిమిది పుస్తకాలు, ఎనిమిది వందలపైగా రాసిన వ్యాసాలలో కొట్టవచ్చేటట్లు ఒక వాక్యమూ కనిపించదని, "కోటబుల్ కోట్స్" ఉండవని విమర్శకులు అంటారు. కానీ అంతర్గర్భంగా తీవ్రమైన, ఆలోచనా సంపన్నమై ఉంటాయని తెలుస్తుంది. "Dewey calls for intellectual pioneering toward wider horizons". ఆయన తత్వ శాస్త్రాన్ని అందరూ అర్థం చేసుకోలేరు. కానీ ప్రతివారూ దానిని అనుసరిస్తారు. "His philosophy grows out of common experience and can be tested by it. It is applicable not only to college professors but to travelling salesmen, plumbers, farmers, clerks. His pulse beat quickens to the drums of humanity' 's blundering march toward freedom" ఆయన స్థిరంగా మంచితనానికి అవకాశమున్న చెడ్డతనానికి మధ్య విభజనరేఖ గీయటానికి ఇష్టపడేవాడు కాదు. ఆయన దృష్టిలోచెడ్డవాడు అంటే "The bad man is the man who, no matter how good he has been, is beginning to deteriorate to grow less good. అలాగే మంచివాడు అంటే "The good man is the man who, no matter how morally unworthy he has been, is moving to become better". జీవితాన్ని నిర్వచించలేమని అది ఎప్పటికి చివరిది కాదని అది ఎప్పుడూ పురోగామిస్తూనే ఉంటుందని అన్నాడు. అలాగే "Not perfection has a final goal, but the ever enduring process of perfecting maturing refining is the aim of living" అని చెప్పాడు. మనం ఉన్న ప్రపంచం అన్నిటికంటే ఉత్కృష్టమైనది అనుకోవటం నిరాశావాదం యొక్క విరక్తత అని అన్నాడు. ప్రజాస్వామ్యం, సమాజం జాన్ డ్యూయికి అతి ముఖ్యమైన విషయాలు. నియంతృత్వ ధోరణికి వ్యతిరేకంగా పోరాడటానికి అమెరికాలోని "యాంకీలను" సన్నద్ధం చేయటమే ఆయన ధ్యేయంగా జీవించాడు. అతని దృష్టిలో తత్వ శాస్త్రం అంటే "is a catholic and far sighted theory of the adjustment of the conflicting factors of life."

డ్యూయీ రెండిటికి ప్రాదాన్యమిచ్చాడు. ఒకటి స్కూల్స్, రెండవది పౌర సమాజం. విద్య చెప్పే వారు ఎప్పటికప్పుడు స్వయం సమర్ధం అవ్వాలన్నాడు లేకపోతే కాలం

కంటే వెనక బడతారని చెప్పాడు. టీచర్ నిరంతర విద్యార్థిగా ఉండాలని సూచించాడు. ఇదే విద్యానాణ్యతను పెంచుతుందన్నాడు. అందుకే కొఠారి "విద్యార్థి వ్యక్తిత్వ వికాసం క్లాస్ రూమ్‌లోనే తీర్చి దిద్దబడుతుంది" అన్నాడు. టీచర్ ఎడ్యుకేషన్‌కు ఎక్కువ ప్రాదాన్యమిచ్చాడు. జర్నలిజం సంఘాన్ని తీర్చిదిద్దటంలో ప్రముఖ పాత్ర పోషించాలన్నాడు. పబ్లిక్‌ను ఎలివేట్ చేసే పని వారిదే నంటాడు. మానవత్వమంటే మహా మక్కువ ఉన్న డ్యూయీ ఆ సంబంధ కార్యక్రమాలనెన్నిటి లోనో చురుకుగా పాల్గొన్నాడు. "humanism means not a contraction of human life, an expansion in which nature and the science of nature are made the willing servants of human good" అని మానవత్వాన్ని నిర్వచించిన మేధావి..విద్యా స్వేచ్ఛ కోసం అయిన్ స్టీన్‌తో కలిసి 'ఇంటర్ నేషనల్ లీగ్ ఫర్ ఎకాడేమిక్ ఫ్రీడం'లో అమెరికా తరఫున సభ్యుడైనాడు. 1940లో హోరేస్ కేల్లెన్‌తో కలిసి బెర్ట్రాండ్ రసెల్ కేసు కోసం అనేక వ్యాసాలూ రాశాడు. టీచర్ల వ్యక్తిత్వ రక్షణ కోసం, కమ్యూనిస్టుల నీడ పడకుండా స్వేచ్ఛాయుత ఉపాధ్యాయ ఉద్యమ నిర్వహణ చేశాడు. "నేషనల్ అసోసియేషన్ ఫర్ ది అడ్వాన్స్ మెంట్ ఆఫ్ కలర్డ్ పీపుల్" ఏర్పరచాడు. 1939లో "లీగ్ ఫర్ ఇండస్ట్రియల్ డెమోక్రసీ"కి అధ్యక్షుడయ్యాడు. టకాంగ్రెస్ ఫర్ కల్చరల్ ఫ్రీడం ఫ్రంట్"కు డ్యూయీ, బెర్ట్రాండ్ రసెల్ కార్ల్ జాస్పర్స్ మొదలైన వారు "ఆనరరీచైర్మన్" హోదా పొందారు.

యూనివర్సిటి ఆఫ్ ఒహాయో, పెన్సిల్వేనియా, ఏల్, రోమ్‌లు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేశాయి. బ్రూక్లిన్, న్యూయార్క్‌లలో ఆయన పేర హైస్కూల్స్ ఏర్పడ్డాయి. గ్రీన్ బే, బార్రింగ్ టన్ లలో డ్యూయీ పేరిట "ఎకాడెమి ఆఫ్ లెర్నింగ్" సంస్థలేర్పడ్డాయి.



## 36. చిన్న కథకు ప్రాణం పోసిన రష్యన్ కథకుడు అంటోన్ చెకోవ్ (1860-1904)

హాస్యం అంటే మొదటినుంచి అమితాసక్తి కలిగి, లెక్కలేనన్ని హాస్య కథలు రాసిన రష్యన్ రచయిత అంటోన్ పాల్వోవిచ్ చెకోవ్‌ను ఇవాళ ప్రపంచం అంతా ఆయన కొత్త సాహిత్య సృష్టికర్తగా, మనిషి సంతోష రహిత ఏకాంతాన్ని ఆవిష్కరించిన వాడిగా, సమకాలీనులను అర్థం చేసుకోలేక పోయినవాడిగా భావిస్తున్నారు.

16-1-1860లో రష్యాలో సి ఆఫ్ అజోవ్ పై ఉన్న టాగన్ రాగ్ పట్నంలో చెకోవ్ జన్మించాడు. వీళ్ళ పూర్వీకులు ప్లేబియన్ లకంటే తక్కువస్థాయి వారు. తాత ఒక బానిస. అయినా డబ్బు సంపాదించి తెలివి తేటలతో స్వేచ్ఛ కొనుక్కొని బానిసత్వం నుండి విముక్తి చెందాడు. తండ్రి పావెల్ డబ్బు లేని దుకాణాదారుడు. గర్వం, సంకుచిత స్వభావంగల, క్రూరుడైన తండ్రి. తల్లి వస్త్ర వ్యాపారి కూతురు. ఆరుగురు సంతానంలో చెకోవ్ మూడో కొడుకు. గృహ జీవితం సంతోషకరంగా లేదు. చిన్నతనం అంతా అణచివేత, దౌష్ట్యం కింద నలిగిపోయిందని జ్వరంలాగా అవి పీల్చి పిప్పి చేశాయని చెకోవ్ వాపోయాడు. మత వ్యవహారాలలో పిల్లలు ఏమాత్రం అతిక్రమించినా తండ్రి సహించేవాడుకాదు. కఠిన దండనకు గురి చేసేవాడు. ఇరవై తొమ్మిదవ ఏట చెకోవ్ తన బాల్యం గురించి రాస్తూ "దయ అనేది నాకు చాలా దూరమైన విషయంగా ఉండేది. ఎవరైనా దయ చూపిస్తే ఎంతో కొత్తగా పరమ సంతోషంగా ఉండేది. అందుకే ఇతరులపై దయ చూపాలనే సంకల్పం నాకు స్థిరంగా కలిగింది. కాని ఎలా దాన్ని చూపాలో తెలియటం లేదు" అన్నాడు.

యవ్వనంలోకి రాకుండానే అన్నలు అలెక్సాండర్, నికొలాస్ ఇద్దరూ పూటుగా తాగి, గాంబ్లింగ్‌లో మునిగి ఇల్లు వదిలి బాధ్యతలు మరచి పారిపోయారు. కుటుంబ బాధ్యత అంటోన్‌పైన పడింది. 8 ఏళ్ళకే ఫామిలీ స్టోర్స్‌లో పని చేయాల్సి వచ్చింది. కాని అతనిది తేలికగా తీసుకొనే స్వభావం, సంతోషంతో ఉండేరకం.

అందంగా ఉండటంతో అందర్నీ ఆకర్షించేవాడు ముఖ్యంగా మహిళలను. దీనితో 13వ ఏటికే "ప్రేమ రహస్యాలు" అన్నీ తెలిసిపోయాయి. పదహారవ ఏట, తండ్రి వ్యాపారం దివాలా తీసి, అప్పుల వాళ్లకు అందకుండా ఇంటి నుంచి పరారైపోయాడు. తండ్రితో బాటు కుటుంబం వెళ్లిపోయింది. చెకోవ్ ఒక్కడే అక్కడే ఉండి కుటుంబ స్నేహితుడి ఇంట్లో ఉంటూ, తింటూ వాళ్ళబ్బాయికి ట్యూషన్ చెబుతూ కృతజ్ఞతగా బదులు తీర్చుకొంటూ స్కూల్ చదువు పూర్తి చేశాడు. చదువులో పెద్దగా అభివృద్ధి ఉండేది కాదు. తప్పాడు. అందుకని ట్రేడ్ స్కూల్‌లో చేరి టైలరింగ్ నేర్చాడు. కష్టపడి ఇంకా ఎక్కువ ట్యూషన్లు చెబుతూ కొంత డబ్బు వెనకేసుకొన్నాడు. ఈ డబ్బును దాదాపు పస్తులతో బతుకుతున్న తన కుటుంబానికి పంపేవాడు. 17వ ఏట తీవ్రంగా జబ్బు పడ్డాడు. అప్పటినుంచి మెడిసిన్ చదివి డాక్టర్ కావాలనుకొన్నాడు. చెణుకులు, హాస్య గుళికలు, జోకులు రాసి మాస్కో లోకామిక్ ప్రెస్‌లో పని చేస్తున్న అన్న అలేక్సాండర్‌కు పంపేవాడు. అందులో కొన్ని ప్రచురితమై మరిన్ని రూబుళ్ళు చేతిలో పడేవి.

19వ ఏట పరీక్ష పాసై మెడికల్ స్కూల్‌లో చేరటానికి స్కాలర్ షిప్ పొందాడు. పుట్టిన ఊరి నుంచి మరో ఇద్దరు విద్యార్థుల్ని తన వారితో ఉండమని చెప్పి మాస్కో వెళ్ళాడు. అందరూ చేరటం తో ఇల్లు ఇరుకై మురికివాడలో ఒక ఫ్లాట్‌లోకి మారాల్సి వచ్చింది. బతకటానికి పోరాటమే చెయ్యాల్సి వచ్చేది. చిన్న తమ్ముడు మైకేల్ చాలా డామినేంట్‌గా ఉండేవాడని చెకోవ్ అన్నాడు. అతనికి డబ్బు సంపాదించటం జాగ్రత్తగా ఖర్చు చేయటం తెలుసు. కుటుంబానికి నైతిక బలం అతనే. మెడిసిన్‌లో చేరి చదువుతూ, తేలికపాటి హాస్య రచనలు చేస్తూ ఉండేవాడు. 21వ ఏట మొదటిసారిగా అమ్మి, తర్వాత వాటికేమీ సాహిత్య విలువలు లేవని గ్రహించి వాటిపై "ఆంతోష్ చేకాంటే" అనే కలం పేరుతో సంతకం పెట్టాడు.

క్రమంగా రచనలో పుష్టి, పక్వత చోటు చేసుకొన్నాయి. ప్లాట్ కంటే ప్రొటెస్ట్ డామినేట్ చేసేవి. కాని నాన్ స్టాప్‌గా రాస్తూనే ఉండేవాడు. 27 ఏళ్ళకే 600 చిన్న కథలు రాసిన చేయి తిరిగిన కథకుదయ్యాడు. అప్పటికి ఆరడుగుల అందగాడు. కాని ఇరవైవ ఏట క్షయ వ్యాధి సోకింది. లక్షణాలను బట్టి గ్రహించాడుకాని కుటుంబం వారికి చెప్పకుండా రహస్యంగా ఉంచాడు. దీని నివారణకు చాలా ఖరీదైన మందులు చాలాకాలం వాడాలి. కనుక అది తన మేడిసన్ చదువుకు, రచనకు అడ్డంకి అవుతుందని దాచుకొన్నాడు.

మెడిసిన్ పాసై 24వ ఏట ప్రైవేట్ ప్రాక్టీస్ ప్రారంభించాడు. పరిస్థితులకు

అనుకూలంగా ఉంటూ, సైన్స్ ఆర్ట్లకు ప్రాధ్యాన్యతనిస్తూ, జీవితంలో హాస్యానికి సముచిత ప్రాధాన్యమిస్తూ గడిపాడు. సాహిత్యాన్ని, డాక్టరీని సమంగా ఆదరించాడు. ఇది ఎలా సాధ్యం అని ప్రశ్నిస్తే వైద్య పరిభాషలోనే చమత్కారంగా "వైద్యం నా లీగల్ వైఫ్ అని, సాహిత్యం నా మిస్ట్రెస్–ఒకామేతో విసుగొస్తే రాత్రి అంతా రెండవ ఆమెతో హాయిగా గడిపేస్తా" అనేవాడు. ఇది మర్యాదకాదు కదా అని ఒక పబ్లిషర్ అంటే" తప్పదు. అది బోర్దం నుంచి తప్పిస్తుంది. నేను ఒకసారి ఒకరితో ఉండటం వల్ల, ఆ ఇద్దరిలో ఏ ఒక్కరికి అసౌకర్యం, నష్టం లేదు నేను వారికి అవిశ్వాసంగా ఉన్నాను అనటానికి అవకాశమే లేదు" అనేవాడు.

చెకోవ్ కంటే పాతికేళ్ళ సీనియర్ సవోరిన్ చెకోవ్‌కు మిత్రుడు ఫిలాసఫర్, మార్గదర్శి అయ్యాడు. అతని ప్రభావంతో చెకోవ్ రచనా శైలి మారింది. 26 ఏళ్ళకే చెకోవ్ తన మొదటి కథా సంపుటిని ప్రచురించాడు. ప్రేక్షకులంటే ఏమిటో అర్థమైంది. ఒక ఆర్టిస్ట్‌గా చెకోవ్ బాధ్యత ఏమిటో ఎరుక పరచాడు సవోరిన్. రష్యన్ సంప్రదాయంలో ఒక నవల పాఠకులను, జనన వంతుల్ని చేయటం కంటే వినోద పరచటం కోసం రాద్దామనుకొన్నాడు. కాని అందులో చరిత్ర, ఫిలాసఫీ, సోషియాలజీ కలపాల్సి వస్తుందని అది అంతగా ఆకర్షణీయం కాదని భావించి వెనక్కి తగ్గాడు. దీనికి బదులు "ఇవానోవ్" అనే నాటకం రాశాడు. ఇది బాగా క్లిక్ అయి "పుష్కిన్ ప్రైజ్" కొట్టేశాడు ఇరవైలలోనే. ఇది అతి చిన్న వయసులో ఆ యువ రచయితకు దక్కిన అరుదైన గౌరవం అయింది. దీనితో ఆత్మ స్థైర్యం ఏర్పడి రాబోయే కాలంలో తానొక ప్రముఖ రచయితను అవుతానని సాహిత్యంలో తనకొక ప్రత్యేక స్థానం ఏర్పడుతుందని గొప్ప ఆత్మవిశ్వాసం ఏర్పడింది. ఈ విషయంలో ఆయన ''చెకోవ్ కంటే చాలా రాశాడు కాని చెకోవ్ దాన్ని అంగీకరించటానికి ఇబ్బంది పడుతున్నాడు" అన్నాడు నిస్పృహగా.

ఆ రోజుల్లో రచయితలంతా లియో టాల్ స్టాయ్ ప్రభావం పడిన వారే. చెకోవ్‌కూ ఆయనంటే అభిమనమే కాని ఆయన మార్మిక భావాలు నచ్చేవి కావు. చెకోవ్ ను రాడికల్ అని అజ్ఞాతవాది అనీ అనేవారు. 30ఏళ్ళు వచ్చేసరికి సాహిత్యంలో చెకోవ్ లబ్ధ ప్రతిష్టుడైనాడు. మిత్రుడు సవోరిన్ మెడికల్ ప్రాక్టీస్‌కు రాం రాం చెప్పమన్నాడు. అప్పటికే ఆరోగ్యం క్షీణించటం మొదవటంతో రెండు వాహికలూ ఉండాలనే అన్నాడు చెకోవ్. తల్లీ, తమ్ముల సంరక్షణతో అతని శక్తి నీరుగారి పోయింది. అదే సమయంలో లిడియా అవేలోవాతో పరిచయం కొంత ఆశా జనకంగా ఉన్నా ఆమెకు అప్పటికే పెళ్లి అయి గర్భవతిగా ఉండటంతో నిస్పృహకు లోనయ్యాడు. వీటి నుండి కొంత విశ్రాంతి పొందటానికి దూరంగా ఉన్న సఖాలిన్ ఐలాండ్‌కు వెళ్ళాడు. మూడు నెలలు ఉండి

ఖైదీలతో తన అనుభవాలను రాశాడు. "భగవంతుని భూమి అందమైనది. అయితే అందులో అందంగా లేనినిది మనం మాత్రమే" అని ముగించాడు.

ఒత్తిడి, వేదనలతో రాయాలన్న ఉత్సాహం జావగారి పోతోంది. అతని "సి గల్" కథలోని త్రిగారిన్ మదనే చెకోవ్ మథనం. "పగలూ రాత్రి రాయటమే రాయటం అయిపోయింది నా జీవితం. రాయి రాయి రాయి అనే ఒత్తిడే ఎక్కువైంది. ఒక పుస్తకం పూర్తి చేశానని తెలియగానే మరోటి రాయమని పురమాయింపు. ఇలా నిరంతరం రచనా వ్యాసంగంలోనే ఉండిపోయాను. ఓపిక నశిం చేదాకా రాస్తూనే ఉన్నా. దీని నుంచి తప్పించుకోలేని స్థితి నాది. నన్ను రెచ్చ గొట్టి రాయిస్తున్నారు తప్పులు రాస్తున్నానని తెలుసు. కాని గత్యంతరం లేదు. దీనితో అసంతృప్తి. అధైర్యం. చదివిన ప్రతిదాన్నీ అబ్బో అదర గొట్టాడు చింపేశాడు నరికేశాడు దున్నేశాడు విజ్రుంభించాడని రాం డోళ్ళ మోత. ఇలా అంటూనే టాల్ స్టాయ్ రాసినంత బాగాలేవు అని సన్నాయి నొక్కులు. నేనూ మనిషినే. బాధ్యత గల పౌరరుడినే. వాళ్ళ కస్టాలు కన్నీళ్లు చూసి ఓదార్చార్చాల్సిన వాడినే. వారి ప్రతినిధిగా ఉండాల్సిన వాడినే. వారి భవిష్యత్తు, శాస్త్రీయ అవగాహన దృక్పధాలకు ఆసరాగా ఉండాలి. అందుకే అన్ని విషయాలపై రాశాను అన్ని వైపుల్నించి విమర్శలను ఎదుర్కొన్నాను" అని రాసుకొన్నాడు.

అప్పుడప్పుడు చిన్న చిన్న స్ట్రోక్స్ వస్తున్నా రచనలనేమీ ఆపలేదు, రాస్తూనే ఉన్నాడు. నిర్లక్ష్యం చేశాడు. సన్నిహితులతో తప్ప మిగిలిన వారెవ్వరితోనూ కలిసే వాడుకాదు. "తెలియని వారి సమక్షం లోకంటే ఆత్మీయుల దగ్గర చావటం మేలు" అనేవాడు. మొదటి నాటకం విజయం పొందిన తర్వాత రెండవది "ది వుడ్ డెమన్" రాశాడు. ఇది తన్నింది. నిరాశపడకుండా మూడోది "ది సీ గల్" రాశాడు. మిత్రులకు దీన్ని చదివి వినిపిస్తే పెదవి విరిచారు. నాటకం ఆడితే హాల్లో పిల్లి, నక్క కూతలు అరుపులు ఆగం. మిత్రుల సలహాతో సిగల్‌ను అయిష్టంగానే కొంతమార్చి "మాస్కో ఆర్ట్ దియేటర్"లో స్టానిస్ లేవిస్కి నిర్వహణలో ప్రదర్శిస్తే సూపర్ డూపర్ విజయం సాధించింది. ఇది అనూహ్య విజయం, అత్యంత విశేష విజయం.

నిరాశా, నిస్పృహలతో, బతికే ధైర్యంలేని బడుగు జీవులకు చెకోవ్ నాటకాలు మానసికానందాన్నిచ్చేవి. విధానాన్ని మరల్చాడు చెకోవ్. జీవిత సత్యాలను, అంతర్భాగమైన హాస్యాన్ని మేళవించి విజయం సాధించాడు. బడుగు ప్రజలు సామాన్యులతో దూరంగా ఉండటాన్ని ఎద్దేవా చేసి చైతన్యవంతుల్ని చేశాడు. "the artist should be not the judge of his characters, but only an un biased witness"అంటాడు. ఇవాళ ఆంధ్రజ్యోతి, వాళ్ళ చానల్ "ఉయ్ రిపోర్ట్ యు డిసైడ్" అని చెప్పినట్లు ఆనాడే చేకోవ్ "నా పని సంఘటనలు సన్నివేశాలని రిపోర్ట్

చేయటమే. అందులో పాత్రల స్వభావాలను కాంతి వంతం చేయటానికి అవసరమైనవీ అనవరమైనవీ ఉంటాయి. వీటిని నిగ్గు తేల్చి నిర్ణయింఛి తీర్పు చెప్పాల్సిన వారు పాఠకులు మాత్రమే" అన్నాడు.

కొత్త భావాలను మనసులో ఉంచుకొని వుడ్ డెమన్‌ను, అంకుల్ వాన్యాలను మార్చి రాశాడు చెకోవ్. వాన్యా బాగా ఆదరణ పొందింది. నిజాలను స్పష్టంగా చూడగలిగాడు. అప్పటి నుండి థియేటర్‌తో ఎక్కువ సంబంధాలను కొనసాగించాడు. మాస్కో ఆర్ట్ థియేటర్‌లో సభ్యురాలైన ఒల్గానిప్పర్‌ను ప్రేమించాడు, ఆమె కూడా వలచింది. కాని పెళ్లి విషయం చెప్పటానికి సందేహించాడు. అనారోగ్యం వలన ప్రదేశాలు తిరుగుతూ ఉత్తరాల ద్వారానే ప్రేయసికి వలపు వార్తలు తెలియజేసేవాడు. ఒక ఇంటిలో ఆతిధ్యం పొందుతూ తీవ్ర జబ్బుతో బాధపడ్డాడు. ఇక తన రోజులు దగ్గర పడ్డాయని తెలుసుకొన్నాడు. అయితే ఓల్గా అతనిని ఒంటరిగా బాధ పడకుండా కనిపెట్టి ఉంది. అతన్ని ఒప్పించటానికి రెండేళ్ళు తీవ్రంగా ప్రయత్నించింది. చివరికి 25-5-1901న అతన్ని ప్రపోజ్ చేసింది, ఇద్దరూ పెళ్లి చేసుకున్నారు. పిరికితనం వదలక పెళ్లి విషయం రహస్యంగానే ఉంచాడు. టాల్ స్టాయ్‌ని ఇష్టపడే వారందరికీ చెకోవ్ కూడా ఇష్టమే. కాని తనకు బయటి ప్రపంచానికి ఊహాత్మక అడ్డగోడ ఒకటి నిర్మించుకొని లోపలే ఉండిపోయాడని చెకోవ్ మరణం తర్వాత భార్య చెప్పింది.

జీవిత చరమాంకానికి ఇక మూడు ఏళ్ళు మాత్రమే మిగిలాయి. రష్యన్ అకాడెమిలో సభ్యుడయాడు. రెండేళ్ళ తర్వాత తన స్నేహితుడు మాక్సిం గోర్కీని అకాడెమికి ఎన్నిక చేశాడు. గోర్కీ రాజకీయ సిద్ధాంతాలకు అకాడెమి అభ్యంతరం చెప్పి అతని ఎన్నికను రద్దు చేసింది. దీనికి తీవ్రంగా స్పందించి గోర్కీ పక్షాన నిలిచి అకాడెమి సభ్యత్వానికి రాజీనామా చేశాడు. చెకోవ్ మరో రెండు నాటకాలు ది త్రీసిస్టర్స్, ది చెర్రి ఆర్చర్డ్ రాసి మహా పాప్యులర్ నాటకకర్త అనిపించాడు. శారీరక బాధ అంతకంతకు ఎక్కువైంది. రోజుకు కొన్ని పంక్తులు మాత్రమే రాయగలిగే వాడు. వ్యంగ్యాత్మక హాస్యాన్ని కొత్త విలువలతో పాత పద్ధతిలో రాశాడు.

చెర్రి ఆర్చర్డ్ తర్వాత చెకోవ్ పరిస్థితి విషమించింది. శారీరకంగా బలహీనుడైనా మానసికంగా మరింత ధృఢంగా ఉన్నాడు. దేవుడు తనలో జీవాణువు పెట్టాడని అనేవాడు. దిగజారిన ఆరోగ్యం వలన బెడేన్ వీలర్ శానిటోరియంలో చేర్చారు. డాక్టర్లు ఆయనకేమీ ఫర్వాలేదని ధైర్యం చెప్పేవారు. చెకోవ్ కూడా డాక్టరు కదా ఆయన్ను ఎవరూ మోసగించ లేరు. "నేను చనిపోతున్నాను" అని చెప్పి, 2-7-1904న 44 ఏళ్ళకే ఇంకో ఆరు నెలలకు 45 ఏళ్ళు వస్తాయనగా చెకోవ్ చనిపోయాడు. చెకోవ్ "ఏక వ్యక్తి సైన్యం" లాగా కృత్రిమతపై తిరుగుబాటు చేశాడు. శైలీ నిర్మాణంతో నాటకాలను, అందమైన

కథానికలను రాసి అజరామరమైన కీర్తి సాధించాడు. అతని మొదటి ఆంగ్ల శిష్యురాలు కేథరీన్ మాన్స్ ఫీల్డ్ చిన్నకథకు వన్నె తెచ్చాడని అంది. అటు అమెరికాలోను చెకోవ్ కథలకు బ్రహ్మరథం పట్టారు. ఎన్నో కథానికా పోటీలలో ఆయన కథలు బహుమతులు పొందాయి. ఏది రాసినా దాన్ని మధ్యలోనే చెప్పటం వదిలేస్తాడు. పాఠకుడి ఊహకే కథ సమాప్తాన్ని వదిలేయటం చెకోవ్ ప్రత్యేకత. నటన, కృత్రిమత్వాలను ఏవ గించాడు. కథలను "it does not matter" అని, "if we could know" అని కాని చెప్పి ముగిస్తాడు. "His was the genius of a style, the biography of the mood, the slice of life which gave rise to a new and enlarging literature of sensibility" అని విశ్లేషకుల భావన.

చనిపోవటానికి కొన్ని నెలలముందు తన రచనలను జనం మరో ఏడేళ్ళు చదువుతారని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పాడు. అ తర్వాత ఆరున్నర ఏళ్ళు జీవించాడు. ఆయన అంచనాలు తారుమారయ్యాయి. మరణానంతరం పాప్యులారిటీ బాగా పెరిగింది. ఆయన చెర్రీ ఆర్చర్డ్ నాటకంతో టాల్ స్టాయ్‌కి తరువాతివాడిగా ప్రజలు భావించేట్లు చేసింది. చెకోవ్ కథలను ఫస్ట్, సెకండ్ థర్డ్ గ్రేడ్‌లుగా విభజించారు. ఇంగ్లీష్‌లోకి అనువాదం పొందాక ఆంగ్ల పాఠకులు చెకోవ్‌పై వీరాభిమానం చూపారు. జేమ్స్ జాయిస్, వర్జీనియా ఉల్ఫ్, కేథరీన్ మాన్స్ ఫీల్డ్ వంటి ప్రముఖులు ఆయన్ను మెచ్చుకొన్నారు. ముఖ్యంగా బెర్నార్డ్ షా ప్రశంసలు పొందాడు చెకోవ్. అయన చిన్నకథలు నాటకాలను డామినేట్ చేశాయి. వాటికే విపరీతమైన క్రేజ్ వచ్చింది. చెకోవ్ ప్రభావం అమెరికా రచయిత హెమింగ్ వే మీద బాగా ఉంది. చెకోవ్ కథ "ది లేడీ విత్ ది డాగ్" చాలా గొప్పకథ అని హెమింగ్వే అభిప్రాయ పడ్డాడు. వర్జీనియా ఉల్ఫ్‌కు "ది కామన్ రీడర్" కథ బాగా నచ్చింది.

"hekhov is comic in avery special paradoxical way .His plays depend as comedy does on the vitality of the actors to make pleasurable what would other wise be painfully awkward -- inappropriyate speeches, missed connections, faux pas stumbles childishnesss --but as part of deeper pathos, the stumbles are not pratfalls but an energized graceful dissolution of purpose" అని విశ్లేషించాడు ఒక ప్రొఫెసర్. భూ ప్రపంచం మీద రెండవ గొప్ప రచయిత చెకోవ్ అన్నది యదార్ధం. జపాన్ నాటక రచయిలు షిమూజి కునో, యోజి సకాటే, ఐ నాగాయ్‌లపై చెకోవ్ ప్రభావం ఎక్కువ. చిన్న కథకు వన్నె చిన్నెలు దిద్ది కళాకృతిగా మార్చిన మహా కథా కథన శిల్పి చెకోవ్.❋



## 37. ఫ్రెంచ్ సంగీతానికే కాక ప్రపంచ సంగీతానికీ కొత్త ఇంప్రెషనిస్ట్ వెలుగులు అద్దిన క్లాడ్ ఏషిలీ డెబూసీ (1862-1918)

సంగీతం పతనమై పోయిందని అనుకోవటానికేమీలేదు. ఆధునిక సంగీతంలో నాలుగు విభిన్న జాతీయ స్రవంతులున్నాయని తెలుసుకోవాలి. అందులోరిచార్డ్ వాగ్నర్ తీవ్రమైన వాద్య ఘోషతో దద్దరిల్లే జర్మనీ సంగీతం ఒకటి. ఆ తర్వాత దీన్ని మరీ బలోపేతం చేసిన రిచర్డ్ స్ట్రాట్ ధోరణి తోబాటు "ట్వెల్వ్ నోట్" పద్ధతిలో ప్రసిద్ధమైన ఆర్నాల్డ్ స్కూన్ బెర్గ్ సంగీతం. రెండవది రష్యాకు చెందిన "ఇగార్ స్ట్రావెన్ స్కి బూర్జువా సెంటి మెంట్ ను కాదని" ప్రాధమిక, క్లాసికల్‌లతో సమ్మేళనమైన సంప్రదాయం. దీనితోబాటు డిమిత్రి స్టాస్టకోవిస్కి మరియు సెర్జీ ప్రోకోఫీవ్ ల సిం ఫనీలు. అమెరికా సంగీతం జానపదం, జానపద నాట్యం నీగ్రో స్పిరిట్యు వల్స్, ప్రాంతీయ జాజ్ మొదలైన స్థానిక విషయాలనుండి ఆవిర్భవించింది. సంగీతం సౌందర్య సౌరభాన్ని తెచ్చిన ఘనత ఎరిక్ స్టేటీ, మారిస్ రావెల్ దక్కితే దాన్నినిర్దుష్టంగా సుసంపన్నం చేసిన ఖ్యాతి ఫ్రెంచ్ సంగీత కారుడు క్లాడ్ ఏషిలీ డెబూసికి లభించింది. డేబూసీ సంగీతానికి కొత్త రంగులు, హంగులు పొంగులు సోయగాలు, సున్నితత్వం అద్ది ఫ్రెంచ్ సంగీతానికే కాక ప్రపంచ సంగీతానికీ కొత్త వరవడి సృష్టించాడు.

డేబూసీ ప్రభావం ఒక్కసారి ఏర్పడినదికాదు. క్రమానుగతంగా వచ్చింది. 22-8-1862న ఫ్రాన్స్ దేశంలోని పారిస్‌కు దగ్గరలో ఉన్న సెయింట్ జేర్మాన్ లేయీలో పుట్టాడు. క్లాడ్ ఏషిలీగా చర్చ్‌లో పేరు నమోదైంది. కాని యవ్వన దశలో తానే "డేబూసీ" తగిలించుకొన్నాడు. దీనికి కారణం తన వంశం చాలా ఉన్నతమైనదని తెలియ జేయటానికే. ఏషిలీ అనేదాన్ని 30వ ఏడాది వరకు ఉంచుకున్నాడు. పేరుకే గొప్ప కాని ఊరు దిబ్బ. సాధారణ రైతు కుటుంబానికి చెందినవాడు. తరతరాలుగా చిన్న వ్యాపారస్తులు. అయిదుగురు సంతానంలో మనవాడు పెద్దోడు. కుటుంబం నడిపే చైనా షాప్‌లో ఒక చిన్న గదిలో పుట్టాడు ఈ భవిష్య సంగీత సామ్రాట్. తండ్రి

మాన్యువల్ డేబూసీ కి ఒపేరా సంగీతం అంటే బాగా ఇష్టం, ఎందరో సంగీత కర్తలతో మంచి పరిచయాలున్నాయి. ఇది కొడుకుకు కూడా అబ్బాలని ఆరాట పడేవాడు.

కుర్ర డేబూసీ పియానో వాయించటంలో ఘటికుడని తెలిసి, ఇక అతని చదువు సంగతి పట్టించుకోకుండా వదిలేశాడు. స్కూల్‌కు పంపకుండా అతడు "బాల మేధావి" అని భావించి తనతోబాటు థియేటర్లకు సంగీత కచేరీలకు వెంట బెట్టుకొని తిప్పేవాడు. దీనితో చాలా ఏళ్ళు ఆతను సంగీతం కూరుస్తున్నా అందులో పరిపూర్ణత సాధించలేక పోవటం తరచూ తప్పులు చేయటం జరిగాయి. గురువు వద్ద నేర్చిన విద్యలేకపోవటమే కారణం. తప్పు తెలుసుకొని మొదటిసారిగా పియానో పాఠాలు నేర్పించాడు. దీనికి ఫీజు అతని కుటుంబ స్నేహితుడు అంటోనీ ఆరోసా చెల్లించేవాడు. ఈయనే మనవాడి "గాడ్ ఫాదర్", ఆంట్ గారి ప్రేమికుడు కూడా. కాని ఆరోసా ఆమెను తిరస్కరించటంతో స్పాన్సర్ షిప్ కోసం వేరొక అండను వెతుక్కోవాల్సి వచ్చింది. అదృష్టవశాత్తు మన కుర్రాడు మేడం మాట్ డీ ఫ్లెర్విల్ ద్రుష్టిలో పడ్డాడు. ఈమె చోపిన్ శిష్యురాలేకాక డేబూసీకి ఆరాధనీయుడైన కవి పాల్ వేరలీన్‌కు అత్తగారు కూడా. ఆమె మూడేళ్ళు మనవాడికి సంగీత పాఠాలు చెప్పింది. ఆమె నేర్పిన సంగీత విద్యలో పరిపూర్ణుడై, 11వ ఏటనే "పారిస్ కన్సర్వేటరి"లో చేరటానికి అర్హత పొందాడు.

ఈ కన్సర్వేటరిలో 11 సంవత్సరాలున్నాడు. కొంత అసంతృప్తి, కొంత సంతృప్తితో ఇక్కడ గడిపాడు. హార్మానిక్ ప్రోగ్రేషన్స్‌లో స్వేచ్చగా ప్రవర్తిస్తూ పాతవాటి బదులు తేలికైనవి కనిపెడుతూ, సంగీత సంప్రదాయ విరుద్ధమైన వాటికి స్వర రీతులను రాస్తూ ఉన్నాడు. ఆతను చేసే ప్రయోగాలన్నీ తప్పుల తడకలన్నారు సంప్రదాయజ్ఞులు. అతనిలో ప్రతిభ ఉంది కాని పెడ దారి పడుతోంది అన్నారు. శబ్దాలను సృష్టించటంలో అప్పటిదాకా ఉన్న పాత పద్ధతులపై విభేదించాడు. మూల సిద్ధాంతమే తప్పు అన్నాడు. పియానో కళాకారుడిగా గొప్ప ప్రవీణుడు, సాంప్రదాయానికి వ్యతిరేకి, నవీన దృష్టి ఉన్నవాడు. అతని సహచర విద్యార్ధి గేబ్రియల్ పీర్నీ "డెబూసీ అద్భుత కళాకారుడు. అందర్నీ ఆశ్చర్యంలో ముంచేస్తాడు, కాని వికారం అనిపిస్తుంది. దీనికి కారణం భయమో ఏదో ఉందని పిస్తుంది" అన్నాడు. పియానోను చాలా ఫ్రీగా ముతకగా వాడేస్తాడు. కష్టమైన స్వర సమ్మేళనం వచ్చినప్పుడు చాలా గట్టిగా శ్వాస పీల్చేవాడు. బీతోవెన్ ఇతన్ని తప్పించుకోనేవాడు. ఎవరేమన్నా 14 ఏళ్ళకే అద్భుత "చాపిన్ ప్లేయర్" అని పించుకున్నాడు డెబూసీ. పదిహేనవ ఏట పాటలకు సంగీతం సమకూర్చాడు. ఇవి సాంప్రదాయ సెలూన్ ధోరణిలో ఉండేవి.

17వ ఏట సంగీత విద్యకు తాత్కాలికంగా అంతరాయం కలిగింది. సంగీత గురువు శిష్యుడికి రష్యాలోని సంపన్న గృహిణి నదేజా వాన్ మెక్ నుండి ఆహ్వానం

వచ్చేట్లు సిఫార్సు చేశాడు. ఆమె టేకై కోస్కికి ఎన్నో ఏళ్ళుగా అతన్ని చూడకుండానే ఆర్ధికంగా సాయ పడుతోంది. ఆమెతో బాటు సంగీత త్రయం ఉంటారు. ఆమె ఎక్కడికి వెడితే వీరినీ తనతో బాటు తీసుకొని వెళ్ళేది. రష్యా రావటంతో డెబూసీ సంగీత ప్రపంచం అకస్మాత్తుగా విస్తృతమైనది. మాస్కోలో మనవాడు బోరోడిన్ కూర్చిన ఆటవిక డాన్స్ ట్యూన్లు, రిమ్ స్కి కోర్సకోవ్ కూర్చిన ఆకర్షణీయ స్వరాలు, టకై కో విస్కీ ఆత్మ వేదనా రాగాలు, తూర్పు దేశాలకు చెందిన అపరిపక్వ ధోరణులు విన్నాడు. గ్రీకుల ఆరు మూల స్వరాలు, ఇంపు చెడని చైనా నిరంతర సంగీతం ఆస్వాదించాడు. వెనిస్‌లో తన నాహ్వానించిన మెక్ గారి సౌజన్యంతో ప్రఖ్యాత సంగీతనిధి "రిచార్డ్ వాగ్నేర్"ను కలుసుకొనే అదృష్టం పొందాడు. వియన్నాలో "ట్రిస్టాన్ అన్జెసోల్డ్" సంగీతానికి పరవశించి పోయాడు.

తిరిగి ఫ్రాన్స్ చేరి కన్సర్వేటరిలో ఒక చెవితో ప్రయోగాత్మక హార్మనీలు, రెండవ చెవితో "ప్రిక్స్ డీ రోమ్"కు సంగీతం సమకూర్చాడు. సంగీత ప్రదర్శనాకారుడిగానే పొగడ్తలు పొందుతున్నాడు. సహకార వాద్యానికి మొదటి బహుమతి అందుకొన్నాడు. కాని సృజనకు దూరమై పోతున్నానేమోననే అనుమానం ఉండేది. "హార్మని పరీక్ష లో డజను తప్పులు చేశాడని ఇన్ స్ట్ర క్టర్లువేలెత్తి చూపారు. అవి కావాలనే చేశానని సమాధానం చెప్పాడు. "శృతి విరుద్ధ స్వరాలను ఎందుకు వదిలెయ్యాలి? వాటికీ స్థానం కల్పించవచ్చు కదా? తప్పేమిటి" అని ప్రశ్నించాడు డెబూ సీ.అకాడెమీ వాళ్ళ గుండెల్లో బాంబు పేల్చాడు. తర్వాత ఒక న్యాయ నిర్వహణాధికారి ఇతని వ్రాత ప్రతులను రెండిటిని పరిశీలించి అంతటి ప్రతిభావంతుడు ఇలాంటి తప్పులు చేయరాదన్నాడు. డెబూసీ ఏంతో సంతోషించాడు. చివరికి బిగ్గరగా "నేను నా స్వంత సృజన చేశాను" అని అరిచాడు. డేబూసీ మొదటి సారిగా ప్రచురితమైన తన సంగీత రచన "నూటిన్ డీ ఎటాలిన్"ను మేడం మేరీ సైంటీకు అంకితమిచ్చాడు. ఇప్పటినుంచి డెబూసీ ఆర్టిస్ట్ ల, బోహీమియన్‌ల సర్కిల్‌లో చేరాడు. ఇందులో మేడం వాస్నిర్ ప్రముఖ పర్షియన్ ఆర్కి టెక్ట్ భార్య కూడా ఉంది. అందం చందం కోయిల స్వరం ఉన్న ఆమెతో మన 19ఏళ్ళ డ్రీం బాయ్ ప్రేమలో పడ్డాడు. తలిదండ్రులకు గుడ్ బై చెప్పి, వాస్నిర్ సన్నిధానంలోకి ప్రవేశించాడు ఈ ప్రేమ పిపాసి.

డెబూసీ తన లక్ష్యం నేరవేర్చుకోవటానికి అవస్త పడుతున్నాడు. "ప్రిక్స్ డీ రోమ్" ప్రైమరీ పరీక్షలో తప్పాడు. అయితేనేం 21 వయసులో "ఎల్ ఎన్ఫాంట్ ప్రోడీగ్‌కు" కాంటాటా (సోలో కోరస్, ఆర్కెస్ట్రా) పూర్తిచేసి బహుమతి పొందాడు. రోమ్ అంటే విసుగు పుట్టింది. అక్కడి లాటిన్ వాతావరణం చీకాకు కలిగించింది. విశాలమైన విలాసవంతమైన "విల్లా మెడిసి ఒక జైలు అనిపించింది. మళ్ళీ వాస్నిర్ లైబ్రరీకి వెళ్లి

ఆగిపోయిన చదువు పూర్తి చేయాలను కొన్నాడు. ఇగేరియాకోసం పియానోను ఆధునీకరించాడు. ఇగేరా కోసమే ప్రసిద్ధమైన తన "మెండలీన్" రాశాడు. ఆమె చిన్నకూతురుకు మార్గరైట్‌కు సంగీతం నేర్పాడు. ఒక ఏడాది ఇక్కడ అనవసరంగా గడిపి పారిస్ పారిపోయాడు. కాని అతని హితులు మళ్ళీ అదృష్టాన్ని రోమ్‌లో వెతుక్కోమని సలహా ఇచ్చారు. ప్రవాస జీవితం అతడిని నిల బెట్టింది. "నేను అక్కడే ఉండి ఉంటే అస్తిత్వాన్ని కోల్పోయే వాడిని. రోమ్‌లో ఉంటే నా బుర్ర చచ్చిపోయి ఉండేది" అని తర్వాత చెప్పాడు. కానీ దుబారా అయిన ఈ రెండేళ్లలో "ప్రిన్టేమ్ప్స్"కు సంగీతం కూర్చాడు. ఇది "ఓ షార్ట్"లో ఉండటంతో నిరసన వచ్చింది. మరికొన్ని ఆర్కెస్ట్రా సంగీతం చేశాడు. ప్రీ రాఫలైట్‌లకు చెందిన రోసేట్టి రాసిన "బ్లెస్సెడ్ దామోజేల్" కవితకు సంగీతం సమకూర్చాడు.

25 ఏళ్ళకు అతని కదలికలు చాలా తాపీగా ఉండేవి. నడక పచార్లు చేస్తున్నట్లుండేది. మనుషుల మధ్య గుర్తింపు కోరుకునేవాడు. గాంభీర్యం అలవాటు చేసుకొని కొంచెం భీకరంగా కనిపించేవాడు. పారిస్ రావటంతో అతనిలో రెండు మార్పులొచ్చాయి. వాస్నిర్స్‌కు దూరమయ్యాడు. కాబ్రిల్ డ్యూపాంట్ అనే ఆకుపచ్చ కళ్ళ అసూయా పరురాలితో, మలార్మే, పియరీ లూస్ హెన్రి డీ జేనర్, పాల్ క్లాడేల్ ఆండ్రీ గైడ్‌లతో కొత్త పరిచయాలేర్పడ్డాయి. వాగ్నేర్‌కు శిష్యుడు కాకపోయినా, రెండో సారి చూసినప్పుడు ఆయన సంగీతాన్ని మెచ్చుకోలేక పోయాడు. వాగ్నర్‌లో సంగీత మోతతో బాటు గర్వం, నిర్లక్ష్యం చూశాడు. రష్యన్ సంగీతం ఆకర్షించింది. ముఖ్యంగా మోస్టార్ గ్ స్కి సంగీతం బాగా నచ్చింది. జావా వారి, ఆనోమైట్ బృందాల సంగీతం బాగా ఆకర్షించింది. ఈ సంగీత ధ్వనులు అతని చెవులలో రింగు మంటూనే ఉన్నాయి. వదిలి పెట్టటం లేదు. ముప్ఫై ఏళ్ళకు "ఫీటిస్ గాలేంటిస్, "ప్రోసెస్ లిరిక్స్"ల పాటలకు సంగీతం కూర్చాడు. "రోడ్రీగ్ ఎట్ చిమేనీ"కి ఇరవైలలోనే సంగీతం చేయటం ప్రారంభించాడు కాని పూర్తి చేయలేక పోయాడు. కాని చారిత్రాత్మక చిరస్మరణీయ సంగీతాన్ని "ప్రేల్యుడ్ ఏ ల ఎప్రేస్ మిడి డీ అన్ ఫాన్"కు, "పెల్లాస్ ఎట్ మేలిసాండీ "లకు చేశాడు. ఈ రెండు అతనికి ప్రతిభకు గీటురాళ్ళుగా నిలిచాయి.

మాలర్మే పాగాన్ కవిత్వానికి అనేక విషయాలు జోడించి సంగీతపు నేత నేశాడు. ఇది వాగ్నర్ చేసిన దానికి పూర్తిగా విరుద్ధంగా చేశాడు. సోనోరిటీలు మిశ్రమ అల్లికలతో మరో అంచుకు సంగీతాన్ని చేర్చాడు. ఏక వ్యక్తి సంగీతంతో, వ్యక్తిగత ప్రతిభతో తీర్చి దిద్దాడు. ప్రిల్యూడ్ ఒక గాఢముద్రతో ప్రారంభమై, ఒంటరి ఫ్లూట్‌తో వినగానే గొప్ప అనుభూతి కలిగించి అలా అలా లాక్కు పోతుంది. తర్వాత ఆర్కెస్ట్రాతో ఫ్లూట్ కలిసి పోయి రెండు ఆర్కేస్ట్రాల అనుభవం కలిగిస్తుంది, "the international cyclopaedia

of music and musicians"లో ఆస్కార్ థాంప్సన్ రాస్తూ "డేబాసీ ప్రతి వాద్యానికి దాని మూల గుణాని కున్న అనుభూతిని కలిగిస్తూ, వాగ్నర్ చేసిన దాన్నించి వేరుగా తన ప్రతిభను ప్రదర్శించాడు. ఇందులో పార దర్శకత ఉంది. మూలాలు స్వీయ వ్యక్తిత్వాన్ని కోల్పోకుండా చేయటం భగీరథ ప్రయత్నం చేసి అనితర సాధ్యమని పించాడు. వాద్యానికి ఉన్న వివిధ గుణాలను కాచి వడపోశాడు. అందువల్ల రుచితో బాటు భావ తీవ్రత అధికంగా కనిపించి ఏదో లోకాలో విహరింప జేస్తుంది. హార్ప్ వాద్యాన్ని కొత్త తరహాలో పెద్ద ధ్వనుల కోసం క్లైమాక్స్‌లలో ఉపయోగించాడు" అన్నాడు.

35వ ఏట మారిస్ మీటర్ లింక్ నాటకం "పెల్లాస్ ఎట్ మిలిసండీ" స్వర రచన చేశాడు. మొదటి డ్రాఫ్ట్ రాయటానికి రెండేళ్ళు పట్టింది. దాన్నిఏడేళ్ళ తర్వాత జరిగిన మొదటి ప్రదర్శన దాకా మరింత మెరుగుపెడుతూనే గడిపాడు. పెర్ఫెక్షన్ కోసం డెబూసీ అంత తపన చెందాడు. అసాధ్యమైన పనిని సుసాధ్యం చేశాడు. అప్పటికి ఆయన వయసు నలభైకి చేరింది. మేటర్లింక్ రాసింది అంతా సింబాలిజం మయం. అందుకే అంత కష్టపడాల్సి వచ్చింది. వయసు ముప్ఫై నలభై మధ్య డెబూసీ రోసాలి టేక్సీర్ అనే కుట్టు పని అమ్మాయిని పెళ్ళాడాడు. ఆమెను ముద్దుగా "లిల్లీ" అని పిలిచేవాడు. ఆమె పొడుగ్గా తెల్లగా ముఖం, వర్చస్సు. పాలరాతి శిల్పంలా ఉండేది. ఇలా ఉండగానే తన పాటలకు గాయని, తన విద్యార్థికి తల్లి, ఒక ఫైనాన్షి యర్ భార్య అయిన మేడం ఎమ్మా బార్డాక్‌తో కలాపం సాగించాడు. అతని అభిమానులకిది మింగుడు పడలేదు వాళ్ళు లిల్లీనే బల పరచారు. తానేదో విచారంలో ఉన్నానని, ఆమెను విడిచి పెట్టక తప్పదని చెప్పాడు. దీన్ని తట్టుకోలేక లిల్లీ పిస్టల్‌తో కాల్చుకుంది. దానినుంచి తేరుకొంది. విడాకులకు ఇష్టపడింది. ఈ లోగా డేబూసీ ఎమ్మాతో లేచి పోయాడు. ఆమె ఒక కూతుర్ని కని పెట్టింది. ఆమె భర్త నుండి విడాకులు పొందాక మనవాడిని మనువాడింది. కూతురు క్లాడే ఎమ్మాకు "చిల్డ్రన్స్ కార్నర్" అంకితమిచ్చాడు డేబూసీ.

"పెల్లాస్"ను ప్రదర్శించేటప్పుడు డ్రెస్ రిహార్సల్ సమయంలో ఒక అసభ్యకరమైన పాంఫ్లెట్‌ను పంచి పెట్టారు. ఆతను ప్రదర్శించేది ఆయన స్వంతం కాదని తన స్వంతం అని కరపత్ర రచయిత తెలియబర్చాడు. మీటర్ లింక్‌కు విపరీతమైన కోపం వచ్చి, అందులో తన భార్య పాడటానికి ఒప్పుకోలేదు. అప్పుడు మేరీ గార్డెన్ అనే అమెరికా గాయనితో పాడించారు. ఒక్కొక అంకం పూర్తి అవుతుండగా మంచి ఊపు వచ్చి చివరికి గొప్ప విజయం సాధించింది. అతని అనుచరులను డేబూసియన్లుగా ముద్ర పడ్డారు. అతన్ని వాళ్ళు అభిమానించారు, ఇబ్బందీ పెట్టారు.

నలభైలలో సంగీత విమర్శకుడిగా ఎన్నో పత్రికలకు డేబూసీ రాసేవాడు. ఇవన్నీ ఆయన చనిపోయిన తర్వాత "మాన్సార్ క్రోచ్ – యాంటి డిలేటేంటీ" పేరుతో

ప్రచురితమైనాయి. "ఐబీరియా"ను చూసి విన్న తర్వాత ఆయన ప్రతిభ తెలుసుకొని విమర్శనాస్త్రాలు సంధించటం మానేశారు. స్పానిష్ సంగీతాన్ని స్పెయిన్ వారికంటే డెబూసీయే చాలా గొప్పగా రాశాడని మెచ్చారు. నలభై రెండేళ్లకే బాగా అలసిపోయాడు. శారీరక మానసికంగా క్లేశం పొందాడు. ఈ వయసులోనే "ప్రిల్యూడ్స్"తో బాటు 12 అసాధారణ "ఎట్యూడ్స్" రాశాడు. ఇవి శాశ్వత కీర్తిని తెచ్చాయి. మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమయిన తర్వాత ఇక సంగీతం చేయటం మహా కష్టం అనిపించింది. కాని మిలిటరీ జర్మనీ దాస్టీకాన్ని, సంస్కృతీ వ్యతిరేకతను నిరసిస్తూ కొద్దిగా రచనలు చేశాడు. ఆయన సంతకాన్ని "క్లాడీ డెబూసీ, మ్యుజీషి యన్ ఫ్రాన్సైస్" అని చేసేవాడు. 1916 తర్వాత రాయటం మానేశాడు. చాలాకాలం బాధను ఒంటరిగా సహించాడు. కాని "నడుస్తున్న శవం"గా అయిపోయినప్పుడు మాత్రం ఆయనకు కేన్సర్ సోకిందని తెలిసింది. జర్మన్ సైన్యం పారిస్ మీద బాంబుల వర్షం కురిపించినప్పుడు దాక్కోటానికి సురక్షిత ప్రాంతానికి వెళ్ళే ఓపిక కూడా ఆయనకు లేదు. చివరికి తప్పని పరిస్థితులలో అత్యవసరంగా మలాశయం (రెక్టం)కు ఆపరేషన్ చేయించుకొన్నాడు. కాని కోలుకోలేకపోయాడు. 25-3-1918న విపరీతమైన విమాన దాడులు బాంబుల వర్షం సమయంలో సంగీత జ్ఞాని క్లాడే అషిలీ డెబూసీ 52 ఏళ్ళకే మరణించాడు.

డెబూసీ సంగీతం నిరసన, మిరుమిట్లు గొలిపే ఆశ్చర్యంతో కలిసి ఉంటుంది. సంగీత మార్గదర్శి అనిపిస్తాడు. శబ్దం లో స్వచ్ఛతను ఆయన సాధించాడు. మాధుర్యం చాలా సున్నితంగా, పారదర్శకంగా ఉంటుంది. వెండి జలతారు మిరుమిట్లు గోచరిస్తాయి. ఎక్కడా ఆగటం ఉండదు. నిరంతర సంగీత స్రవంతిగా ఉంటుంది. "దిఆర్గాన్ ట్యూనర్ స్కేల్"ను ఉపయోగించటం అతని ప్రత్యేకత. అందులో ఆరునాదాలు దర్శనమిస్తాయి. ఎక్కడా క్రమం తప్పదు. సాంకేతికతలో ఎన్నో అద్భుతాలు కనిపెట్టాడు. అవి సంగీత చరిత్రలో మైలు రాళ్ళుగా నిలిచి పోయాయి. ఆయన చూపిన "సమాంతర శ్రేణులు" అంతంత మాత్రంగా వినేవారిని తట్టి లేపి స్ఫూర్తి కలిగిస్తాయి. జెట్ స్ప్రింగ్‌లాగా నాట్యమాడి ఉద్రూత లూగిస్తాయి. ఆస్కార్ థామ్సన్ "the determining factor in the musicof atleast the first third of the twentieth century because of the doors he opened and the restraints he cast aside" అన్నమాటలు అక్షర సత్యాలే.

డెబూసీతో సంగీత హోరు ఆగిపోయింది. జిగి బిగి మిశ్రమ వాద్యాల రణగొణ ధ్వనులకు మంగళం పాడాడు. శృంగార అంగారాన్ని ఆర్పేశాడు. అనుభూతి వాదానికి (ఇమ్ప్రేషలిజం) తెర తీశాడు. మానసికానందాన్ని సమకూర్చాడు. అది తర్వాత వారికి మార్గదర్శనం చేసింది. సంగీతంలో ఇమ్ప్రేషనిస్ట్ అవతారం ఎత్తినవాడు డెబూసీ.

ఇతని ప్రభావం రావెల్ డ్యూకాస్, రస్సెల్‌పై అధికం. ఫ్రాన్స్‌లో ఒక కొత్త ఉద్యమ యుగం ఆరంభమై విశ్వ వ్యాప్తమైంది. దీనికి పారిస్ ప్రధాన కేంద్రమై నిలిచింది. కాని ఇమ్ప్రెషనిజం అనే పదాన్ని గుణాన్ని తన సంగీతానికి పెట్టటం ఆయనకు నచ్చేదికాదు.

మధ్య యుగపు సంగీతం నుంచిడెబూసీ ఎన్నో విలువైన విషయాలను ఏరికోరి తెచ్చుకొన్నాడు. ఫ్రెంచ్ క్లేరియన్ సంగీతకారులైన కూపెరిన్, రాముల సంగీతం అంటే మహా ప్రేమ. బాష్, చోపిన్, లిసాజీల ప్రభావమూ ఈయనపై ఎక్కువే. ఆయనకు "పాశ్చాత్యేతర" సంగీతం అభిమానమైంది. ప్రాచీనమైనది ప్రాచ్య సంబంధమైనది అయిన సంగీతాన్ని ఆరాధించాడు. జావా వారి సంగీతానికి ప్రాధాన్యం ఇచ్చాడు. వాళ్ళ గాంగ్స్, మెటల్లో ఫాన్స్ వాద్యాలపై మోజు. ఆయనకు సాహిత్యం విజువల్ ఆర్ట్ (దృశ్య కళ)లపై ఆసక్తి ఎక్కువ. మొదట్లో ఫ్రెంచ్ సింబాలిజం ఉద్యమ ప్రభావంలో ఉన్నాడు. వాళ్లకు వాస్తవికత ప్రకృతిలపై మోజు లేక పోవటాన్ని జీర్ణించుకోలేక పోయాడు. వచన కవిత్వ ప్రభావం ఉండేది. స్టీఫెన్ మలార్మే గొప్ప ప్రభావం కలిగించాడు. సంగీతానికి తన కవిత్వానికి దగ్గర సంబంధం ఉందని మలార్మే చెప్పేవాడు. దీనితో మలార్మే కవిత "ఆఫ్టర్ నూన్ ఆఫ్ ఏ ఫాన్"కు సంగీత కూర్చాడు డెబూసీ.

తర్వాత నేచర్‌కు దగ్గరయ్యాడు. తనమతం నేచర్ అన్నాడు. గూఢమైన ప్రకృతి (మిస్టీరియస్ నేచర్ ) నా మతం, దైవం అని చెప్పాడు. ఆచారాలుపాటిస్తూ పూజలు చేస్తూ కూర్చునే దానికన్నా ప్రకృతిని ఆస్వాదించటం వల్లనే మానసిక తృప్తి ఆనందం అనుభూతి లభిస్తాయని అన్నాడు. సముద్రం దగ్గర ఉండి సూర్యోదయ సూర్యామయాలను అవి పొందే అందమైన మార్పులు చూస్తుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది అన్నాడు. సమకాలీన పైంటర్-జేమ్స్ ఆబాట్ మెక్ నెల్ డెబూసీపై పెద్ద ప్రభావాన్ని కల్గించాడు.

20వశతాబ్దాన్ని అత్యధిక ప్రభావితం చేసిన కంపోజర్‌లలో డేబూసీ మొదటి స్థానంలో ఉంటాడు. "his innovative harmonies were influential to almost every major composer of the 20th century particularly Mauris Ravel, Igor travensky, bela Bartok etc". జపానీస్ కంపోసర్ "టోరు టేకమిస్కి" బాగా ప్రభావితుడైనాడు. జాజ్ సంగీతంలో మైల్స్ డేవిస్, డ్యూక్ ఎలింగ్ టన్‌లను ప్రభావితం చేశాడు. సమకాలీన సౌండ్ ట్రాక్ కంపోజర్ జాన్ విలియమ్స్ వగైరాలపై ప్రభావం అధికం.❁



## 38. అమెరికా పత్రికా సామ్రాజ్యాధిపతి, సంచలన కథనాలకు, ఎల్లో జర్నలిజానికి ఆద్యుడు– విలియం రాండాల్ఫ్ హార్స్ట్ (1863–1951)

అమెరికా జర్నలిజంలో వీరవిజయం సాధించినా, రాజకీయంలో ఘోర పరాజయం పాలైనవాడు విలియం రాండోల్ఫ్ హార్స్ట్. ఆనాడు “లార్డ్ ఆఫ్ ది ప్రెస్”గా ప్రసిద్ధి చెందిన జోసెఫ్ పులిట్జర్‌కు తీవ్ర ప్రత్యర్థి విలియం. పులిట్జర్ సెన్సేషనల్ రిపోర్ట్‌లతో సంచలనం సృష్టించి, తన వార్తాపత్రికను, దానితోబాటు జర్నలిస్ట్ ప్రపంచాన్ని ఒక కొత్త స్వేచ్ఛాస్థాయికి తెచ్చినవాడు. హార్స్ట్ అధోజగత్ సహోదరుల బుజం కాయటంలో చాంపియన్‌గా జీవితాన్ని ప్రారంభించి, సాంఘిక సంస్కరణలకు వ్యతిరేకియై అంతకు ముందెన్నడూ లేని బాధ్యతా రాహిత్య సెన్సేషనల్ వార్తలప్రచురణలతో దెబ్బతిన్నాడు. సెన్సేషనల్ వార్తలు దొరక్కపోతే తానే స్వయంగా వార్తలను వండి వడ్డించేవాడు. అంటే వార్తలను సృష్టించే వాడన్నమాట. తాజా సంఘటనలకు నిత్య గండాలుగా సంకట స్థితులుగా చూపిస్తూ, ఔత్సుక్యానికి పరాకాష్టగా మలుస్తూ అంతులేని సంపదను, పత్రికా సామ్రాజ్యాదిపత్యాన్నీ ,అధికారాన్ని సాధించి ఎన్నో గోలుసు పత్రికల డైరెక్టర్ అయి, చివరికి ప్రింట్ మీడియాకు డిక్టేటర్ అయ్యాడు.

### సిల్వర్ స్పూన్ బాయ్ - అమ్మ కూచి

అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రం సాన్ ఫ్రాన్సిస్కోలో 29-4-1863లో కోటీశ్వరుడు, పబ్లిషర్, సెనేటర్ అయిన జార్జి హార్స్ట్‌కు జన్మించాడు. తల్లి ఫాబే అపర్సన్. దక్షిణాదికి చెందిన సంస్కృతీ సంపన్నురాలు. భర్తలకంటే 22ఏళ్ళు చిన్నది. కవల పిల్లలలో ఒకడుగా జన్మించి, వేరొకరు చిన్నతనంలోనే చనిపోతే విలియం తలిదండ్రులకు ఏకైక పుత్రుడై గారాబంగా పెరిగాడు. తల్లి ప్రేమనంతా ఇతని మీదే కురిపించింది. ఆప్యాయాన్ని ఆత్మీయతను ఇతని మీదనే చూపించింది. “సన్నీ” అని అల్లారు ముద్దుగా పిలుస్తూ, విలాసవంతమైన జీవితాన్ని అందిస్తూ పదేళ్ళ వయసులోనే, తనతో బాటు యూరప్ యాత్రలు చేయించింది. అందుకే ఆ కొడుకు “పిల్లవాడి గొప్ప మిత్రుడు

తల్లిమాత్రమే" అని గొప్పగా చెప్పేవాడు. తిరిగి వచ్చాల కుటుంబానికి చెందిన గుర్రబ్బండీలో స్కూల్‌కు పంపించింది. తానునడిచే స్కూలుకు వెడతానని, తన బట్టలకు చిరుగులు చూపి కుట్టించమని లేకపోతె తనతోటి నిరుపేద విద్యార్థులు గేలి చేస్తారని తల్లితో వాదించేవాడు. అ సమయంలో ఆతను 45 వేల ఎకరాల విస్తీర్ణం ఉన్న సాన్ సిమియాన్‌లో ఉండేవాడు. 17వ ఏట తూర్పున ఉన్నన్యు అంప్ షైర్‌లోని సెయింట్ పాల్ కు పంపారు.

### హార్వర్డ్‌లో ఉన్నా జీవితాన్ని "లైట్ తీసు"కున్నాడు

అక్కడ హార్వర్డ్‌లో ప్రవేశం కోసం చదివాడు. ఎక్కడో ప్రవాసంలో ఉన్నట్లు ఫీలయ్యేవాడు. చదువుపై శ్రద్ధ చూపలేదు. అమ్మ మీద బెంగతో ఉండిపోయాడు. హార్వర్డ్‌లో చేరినా అక్కడా సర్దుకు పోవటం కుదరలేదు. చేతినిండా డబ్బు ఉండటంతో జలసాగా విలాసంగా పార్టీలు ఇస్తూ, ప్రతి చిన్న సందర్భానికి టపాసులు కాలుస్తూ దుబారా చేస్తూ ఉన్నాడు. అనేక ప్రాక్టికల్ జోక్స్‌ను సృష్టించి స్నేహితులకు చెప్పి నవ్వించేవాడు. తండ్రి పలుకుబడి కొడుకు కలివిడితో యూనివర్సిటి వారి హాస్య పత్రిక "లాంపూన్"కు బిజినెస్ మేనేజర్ అయ్యాడు. అడ్డగించలేనంత చిలిపితనంతో చదువుకు గుంట కొట్టి గంట వాయించాడు. అధికారులు గమనిస్తూనే ఉన్నారు. క్రమశిక్షణ విషయంలో ఇంకొక తప్పు చేస్తే డిస్మిస్ చేస్తామని వార్నింగ్ కూడా ఇచ్చారు. ఇవేమీ లెక్కలోకి తీసుకోకుండా "లైట్ తీసుకొని" "కేరే ఝాట్"గా మారి చదువు వదిలేసి జోకుల కేకులు తింటూ తినిపిస్తూ సంఘంలో కలుపుగోలు తనం పెంచుకొన్నాడు. చివరికి కొద్దికాలం సస్పెండ్ అయి మళ్ళీ చేరి, తల్లి సేవ చేయటానికి వెళ్ళే ముందు మరో మిస్టేక్ చేసి బహిష్కరింప బడ్డాడు. అతని చేతినిండా చెప్పిన పని చేసే నమ్మకమైన స్నేహితులను డబ్బిచ్చి కుదుర్చుకొని వారితో ఫాకల్టీ సభ్యులకు క్రిస్మస్ బహుమతులను కవర్‌లలో పెట్టి అందజేసేవాడు. వాటిని అందుకున్నవారు వాటిని ఓపెన్ చేసి చూస్తే అద్భుతమైన ప్రాచీన కుండలు, వాటిపై వారి వారి చిత్రాలు ఉండటం గమనించి ఆశ్చర్యపోయే వాళ్ళు. ఇలా "బే ఫర్వాగా" రెండేళ్ళు హార్వర్డ్ జీవితాన్ని గడిపాడు. చదువుపై హార్ట్ పెట్టకుండా హార్స్.

### పత్రికాధిపత్యానికి బాటలు

21ఏళ్ళకు పాలిపోయిననీలి కళ్ళతో పాలిపోయిన శరీరంతో ఉండేవాడు. కళ్ళల్లో దృఢమైన నిశ్చయం మాత్రం కనిపించేది. ఆధిపత్యం సాధించాలని 22లో నిశ్చయించుకొన్నాడు. హార్వర్డ్ నుంచి తొలగించటానికి కొద్ది రోజుల ముందు తండ్రికి ఒక గొప్ప ఉత్తరం రాస్తూ తమ "సాన్ ఫ్రాన్సిస్కో ఎక్సామినర్" పత్రికను, అప్పుడున్న

యజమాని–అంటే తన తండ్రి కంటే గొప్పగా నడపగలనని నిర్భయంగా తెలియజేశాడు. తన ఆశయం నెరవేరటానికి కావలసిన డబ్బు కేటాయించమని కోరాడు. న్యు యార్క్ వరల్డ్ అనే పులిట్జర్ నడిపే పత్రిక కంటే కాలిఫోర్నియా వాతావరణంతో మరింత సృజనాత్మకంగా నడుపుతానని హామీ ఇచ్చాడు. మరో లేఖ రాస్తూ తమ పత్రికలో ఉన్న లోపాలను వివరంగా తెలియబర్చాడు. ఎలా అభివృద్ధిలోకి తేవాలో సూచించాడు. తక్కువ జీతాలతో సరైన అవగాహన లేని సిబ్బందితో ఇక కుదరదని కొత్త వారితో సర్వోత్కృష్టమైన కొత్త నైపుణ్యంతో నడిపితేనే మనుగడ అనీ అన్నాడు. కొడుకు సత్తా ఏమిటో చూద్దామని పత్రికను మరింత సుందరంగా విలాసంగా తీర్చి దిద్దటానికి అడిగిన దానికంటే చాలా ఎక్కువ డబ్బు అందజేశాడు తండ్రి. కాని కొడుకు ఒప్పుకోలేదు. తండ్రి అనకొండ కాపర్ మైన్స్‌తో బాటు, మోంటానాలో ఉన్న విశాలమైన ఎస్టేట్ కూడా స్వంతం చేస్తానని ఊరించాడు. కాని తాను న్యూ యార్క్ వెళ్లి అక్కడ "వరల్డ్" పత్రికలో స్థానం సంపాదిస్తాను అన్నాడు. తన్ను కొడుకు దెబ్బ తీశాడని గ్రహించాడు సెనేటర్ అయిన తండ్రి. అన్నట్లుగానే న్యూ యార్క్ చేరి రాండాల్ఫ్ పడమటి తీరంలో అత్యున్నతస్థానంలో ఉన్న డెమోక్రాటిక్ వార్తాపత్రికకు సంపూర్ణ అధికారాలతో మేనేజింగ్ ప్రొప్రైటర్ అయ్యాడు. సాన్ ఫ్రాన్సిస్కోకి వచ్చి మళ్ళీ తండ్రికి మూడో లేఖ రాశాడు. కొట్ట వచ్చే "కొత్తదనం, మిరుమిట్లు గొలిపే సృజన, వార్తా విధానంలో విప్లవం తెస్తానని అందరూ "ఎక్సామినర్"లోని తను నిర్వహించే దాన్నే చూసేట్లు చేస్తానని, ఒక ఏడాదిలో పదివేల అదనపు సర్క్యులేషన్ సాధిస్తానని, రెండేళ్లలో పెట్టినఖర్చు వచ్చేస్తుందని, అయిదేళ్ళలో పసిఫిక్ తీరంలో తమదే పెద్ద గొప్ప పత్రిక అని పించుకొంటుందని తెలిపాడు.

**సంచలన వార్తా కథనాలు**

హార్స్ట్ ఆలోచన ఊహావిహారంకాదు, స్పష్టమైనది కూడా. అతని నినాదం "సర్క్యులేషన్‌లో మనకు బదులు వేరొకరు ఉండ కూడదు" అన్నట్లుగానే రుజువు చేసి చూపించాడు. హెడ్‌లైన్‌లను మరింత ఆకర్షణీయంగా చేశాడు. కార్టూన్‌లకు జోకులకు రెట్టింపు స్థలాన్ని కేటా ఇంచాడు. పాత లాగుడు, పీకుడు వార్తల స్థానంలో కొత్త గగుర్పొడిచే "గాసిప్ కాలమ్స్" రాయించాడు. ప్రజల స్పందన నాడిలను బట్టి ఎప్పటికప్పుడు మార్పులు చేశాడు. తన స్టాఫ్‌లో ఒకమ్మాయిని నడి బజారులో మూర్ఛ వచ్చినట్లు పడిపొమ్మని చెప్పి ఆమెను సిటీ రిసీవింగ్ హాస్పిటల్‌లోకి చేర్పించాగానే అక్కడ జరిగే దారుణాలన్నీ గమనించి రెండు రోజుల తర్వాత "ఎక్సామినర్"లో కాలిఫోర్నియా హాస్పిటల్స్‌లోని దాష్టీకాలను హాట్ హాట్‌గా వార్తల్ని వడ్డించేవాడు. పరిస్థితులలో రావాల్సిన మార్పుల్నీ తేవాల్సిన సంస్కరణలను సూచించేవాడు. ఇవి తాజాగా పసందుగా

ఉండటంతో ఎగబడి విరగబడి కొని చదివి పేపర్ సర్క్యులేషన్ పెరగటానికి కారకులయ్యారు జనం. సిటీని కంట్రోల్ చేసే అధికారుల బోలుతనాన్ని, పక్ష పాత దృష్టిని, పట్టించుకోక పోవటాన్ని పెద్ద పెద్ద హెడ్డింగ్‌లతో ప్రజల దృష్టికి తెచ్చేవాడు ఈ పేపర్ మనకోసమే ఉంది అని ప్రజల్లో నమ్మకం కలిగించాడు విశ్వాసం పెంచాడు. సదరన్ ఫసిఫిక్ రైల్ రోడ్ కోసం ప్రజా పక్షాన నిలిచి పత్రిక ద్వారా పోరాటం చేశాడు. ప్రజా ఉద్యమాలకు బుజం కాశాడు. ప్రజాసమస్యలకు అద్దంపట్టి పరిష్కారాలు చెప్పాడు. అది ప్రజా పత్రిక అని ప్రజావేదిక అని గొప్ప నమ్మకం కలిగించి పత్రికా వ్యాప్తికి విశేషంగా తోడ్పడ్డాడు రాండాల్ఫ్.

అనుకొన్నది సాధించగానే కొత్త పథకానికి తెరా తీశాడు రాండాల్ఫ్. సాన్ ఫ్రాన్సిస్కో ఎక్సామినర్ పత్రికాధిపత్యం చేబట్టాక ఎనిమిదేళ్ళకు “న్యూ యార్క్ మార్నింగ్ జర్నల్”ను కొన్నాడు. అతని ధ్యేయం రెండు సెంట్లకు అమ్మే పులిట్జర్ పత్రిక “ది న్యు యార్క్ వరల్డ్” అమ్మకాలను అధిగమించటమే. మనవాడు తెలివిగా తన పత్రిక వెలను ఒక్క సారిగా ఒకే ఒక పెన్నీకి తగ్గించేశాడు. మొదట్లో విపరీతమైన నష్టాలొచ్చినా క్రమంగా నిలబడి లాభాలు సాధించాడు. పత్రికను తీర్చిదిద్దటంలో డబ్బు కేమీ ప్రాధాన్యం లేదని ప్రకటనలు గుప్పించేవాడు. ప్రత్యర్ధి పులిట్జర్ పత్రికలో పని చేస్తున్న “మాంచి బుర్ర” ఉన్న మనుషుల్ని, ఆర్టిస్ట్‌లను రెట్టింపు జీతంతో ఆకర్షించి తన పత్రికలో చేర్చుకున్నాడు. స్టీఫెన్ క్రేన్, ఎడ్గార్ సాల్టస్, జేమ్స్ యి ఫోర్డ్, రిచార్డ్ హార్డింగ్ డేవిస్ వంటి దిగ్గంతులను చేర్చుకున్నాడు. వీరిని సెయింట్ పీటర్స్ బర్గ్‌కు జార్ చక్రవర్తి పట్టాభిషేకం చూడటానికి పంపాడు. ప్రఖ్యాత రచయిత మార్క్ ట్వేన్‌ను విక్టోరియా మహారాణి జూబిలీని వర్ణించి రాయటానికి లండన్ పంపాడు. తన పత్రిక సాహిత్యానికే ప్రాధాన్యం ఇస్తోందన్న అపోహ తొలగించటానికి మొదటి 16 పేజీలను రంగుల్లో కార్టూన్లు జోకులు ఫాషన్లు కథలతో ముంచెత్తే శాడు. మరో 8 పేజీలను కామిక్స్‌కు కేటాయించాడు. తనది “ఇంద్ర ధనుస్సు పేపర్” అని ప్రకటించేవాడు. వరల్డ్ పత్రికలో వచ్చే కామిక్ కేరక్టర్‌కు ప్రత్యర్ధిగా “ఎల్లో కిడ్” పాత్రను సృష్టించి వదిలాడు. అప్పటినుంచే “ఎల్లో జర్నలిజం” అనే పేరు బయల్దేరింది. పులిట్జర్ ఎడిటర్‌ను లొంగ దీసుకొని “ఈవెనింగ్ జర్నల్” మొదలు పెట్టాడు. సంపాదకీయాలతో అంతర్జాతీయంగా పేరు పొందిన ఆర్థర్ బ్రిస్బేన్‌ను చేరదీయటంతో “బ్రెయిన్ డ్రెయిన్” పూర్తయింది. మొదటి మూడు పేజీలను ఆశ్చర్యంలో, హెచ్చరికలు చేస్తున్నట్లు తయారు చేయించాడు. ఈ విషయంలో తన పత్రిక ఎలా ఉంటుందో ఆయన మాటల్లోనే చూద్దాం “when you looked at the first page you said", "Gee whiz". "When you swathe second page, you gasped" "Holy Moses', "And when you glimpsed the third page you exclaimed", "Good God Almighty” ఇలా పాఠకులలో విపరీతమైన

మోహం, మోజు కలిగించి తనపత్రిక వైపుకు మళ్ళించాడు చాకచక్యంగా.

**యుద్ధం చేయిస్తానన్న రాండాల్ఫ్**

హార్స్టు వంచన ఆలోచనలతో స్పానిష్ అమెరికన్ యుద్ధం నిజానికి ఆయన దాని సృష్టికర్త కాకపోయినా కలిసి వచ్చింది. అమెరికా క్యూబా తరఫున యుద్ధాన్ని ప్రారంభించటానికి రెండేళ్ళ ముందే యుద్ధ భీభత్సాన్ని గగుర్పొడిచే వ్యాసాలతో భయానక దృశ్యాలతో పేపర్ నిండా రాయించేవాడు. గవర్నర్లకు టెలిగ్రాములిచ్చేవాడు. ఏయే రాష్ట్రాల వారు ఎంతమంది వాలంటీర్లను నావికా యుద్ధానికి, పద సైన్యానికి సమకూర్చగలరని గవర్నర్లనందర్నీ ఆరా తీశాడు. ఆర్టిస్ట్ ఫ్రెడరిక్ రేమింగ్ టన్‌ను హవానా పంపి ఆర్టికల్స్ రాయించాడు. రేమింగ్ టన్ హవానా లో తనకేమీ పని లేదని అంతా పరమ ప్రశాంతంగా ఉందని, యుద్ధ వాతావరణం అసలు కనిపించనే కనిపించటం లేదని తానూ అమెరికాకు తిరిగి వచ్చేస్తానని తెలియబర్చాడు యజమానికి. “అక్కడే ఉండు. చిత్రాలు పంపు. నేను యుద్ధం చేయిస్తాను” అని చెప్పి అక్కడే ఉండమన్నాడు. క్యూబా విముక్తి ఉద్యమంలో ముఖ్యమైన అంశం అమెరికా క్యూబాతో చేసే వంద మిలియన్ డాలర్ల వ్యాపార ఇబ్బందులే. క్యూబా షుగర్ ఎకానమీ ఒక్కసారి కుప్ప కూలి పోయింది. దీనికంతటికీ ముఖ్య కారణం స్పెయిన్, క్రూర స్పెయిన్ దేశమేనని హార్స్టు, పులిట్జర్‌లు తమపత్రికలలో ఢంకా బజా ఇంచేవారు. ప్రజల్ని మభ్య పెట్టేవారు. యుద్ధాన్ని గురించి ఊదర కొట్టేవారు. చివరికి అది తుస్సుమనగా “అవర్ పెట్ వార్”అన్నాడు రాండాల్ఫ్. దీనికీ ఒక కథనం ఉంది –

ఐల్ ఆఫ్ పైన్స్‌కు చెందిన ఇవాంజేలీనా సిస్నేరాస్ అనే విప్లవ వీరుని కూతుర్ని పీనల్ కాలనీ నుంచి కాపాడటానికి ప్రయత్నం చేశాడు. దీన్ని తన పత్రికలలో బోల్డ్ లెటర్స్‌లో సంచలన వార్తాకథనాలుగా ప్రచురించి ఏదో ఆమెకు మహోపకారం చేసినట్లు బిల్డప్ ఇచ్చాడు. జెనరల్‌కు ముడుపులు చెల్లించి కదా బిగువుగా నడపటానికి కృషి చేశాడు. ఇదంతా తన గొప్పతనమే అని రంగు పూశాడు మసిపూసి మారేడు కాయ చేశాడు. ఇలా కొత్త తరహా జర్నలిజానికి నాంది పలికాడు. ఆపాప కష్టాలు పడినట్లు ఆమెకు ఆడవాళ్ళ నుంచి సానుభూతిని వరదలా పారించాడు.

యుద్ధ పన్నాగాలపై దృష్టి సారించాడు. అతని ఏజెంట్లు డిప్లమాటిక్ లెటర్స్‌ను తారుమారు చేసేవారు. హవానా హార్బర్‌లో యుద్ధ నౌక “మైన్” ఊహించని విస్ఫోటనంలో ధ్వంసానికి గురి అయినప్పుడు హార్స్టు 50వేల డాలర్ల నజరానాను ఆ విధ్వంసకుడిని పట్టిచ్చిన వాదికిస్తానని ప్రకటించాడు. యుద్ధ రంగం ఎక్కడ ఉందొ కనుక్కోవటానికి తన స్వంత యుద్ధ నౌకను పంపాడు. అనుమానాస్పదులైన స్పానిష్ నావికులను పట్టుకోవటానికి ఒకసారి తానే అక్కడికి వెళ్ళాడు. స్పెయిన్ నౌకలు అడ్డ దారిలో ఫసిఫిక్‌కు చేరటానికి అతిపెద్ద స్టీం షిప్‌ను సూయజ్ కెనాల్‌లో ముంచే ప్రయత్నం

చేస్తుంటే అడ్డంకి కలిగించే ప్రయత్నం చేశాడు. ఒక రకంగా ఇది అంతర్జాతీయ కట్టుబాటును అతిక్రమించటమే.

### పేపర్ పవర్

హార్స్ట్ పత్రికలూ నిలబడ్డాయి, సర్క్యు లేషన్ పెరిగింది. ఇప్పుడు హార్స్ట్ ఒక శక్తి కేంద్రమై పోయాడు. పత్రికా సామ్రాజ్యం ఏర్పరచాలని నిర్ణయించాడు. దీనితో కొత్త గోల్స్‌కు, విస్తృతమైన పరిదులకోసం ప్రయత్నించి సాధించిన తన విజయాలకు దృఢత్వం చేకూర్చాలను కొన్నాడు. దీనికి నాంది గా ఒక్క నెల రోజుల్లోపుననే చికాగోలో "అమెరికన్" పత్రికను 4-7-1900లో డెమొక్రాట్ కన్వెన్షన్‌లో అతను తన అభ్యర్థిగా విలియం జెన్నింగ్స్ బ్రియాన్‌ను ప్రకటించే ముందు స్థాపించాడు. మరింత బలపడి "చికాగో రికార్డ్ హెరాల్డ్" పత్రికను కొనేశాడు. ఇక వరుసగా బోస్టన్ అట్లాంటా, వాషింగ్టన్, డెట్రాయిట్, సియాటిల్, రోచెస్టర్, ఓక్ లాండ్, లాస్ ఏంజెల్స్, సిరాక్యూజ్ బాల్టిమోర్, పిట్స్ బర్గ్, ఒమాహాలలో కొత్త పత్రికలూ పెట్టటం కాని ఉన్నవాటిని స్వాధీనం చేసుకోవటం కాని చేసి తన పత్రికా సామ్రాజ్య పరిధిని అతి విస్తృతం చేసుకొన్నాడు. 1929లో సుమారు అరవై వయసులో 25 పెద్ద పత్రికలను 18 అతి కీలకమైన పెద్ద సిటీలలో నెలకొల్పాడు. అనుకొన్నది సాధించాడు.

### లేబర్ సానుభూతి- వారికే వ్యతిరేకి

అతని విధానాలు చాలా కఠినంగా, అభివృద్ధి నిరోధకంగా ఉండేవి. ఒకప్పుడు లేబర్‌కు గొప్ప సానుభూతి పరుడుగా, ఆసరాగా ఉన్నవాడు ఇప్పుడు ధన గర్వంతో దురహంకారి అయాడు. "డబ్బు లావు" చేసినకొద్దీ మరింత బిగిసి రైట్ రియాక్షనరీగా మారాడు. బిగ్ బిజినెస్‌కు బిగ్‌బాస్ అనిపించుకొన్నాడు. పబ్లిక్ వెల్ఫేర్‌ను కార్పోరేట్ సంక్షేమానితో సమం చేశాడు. 1919లో చట్టానికి సహకరించిన వారి, చట్టాన్ని అమలు పరచే పౌరుల హక్కులకు బాసటగా నిలిచాడు. పోలీసులను కూడా సమ్మె చేయమని సలహా ఇచ్చేవాడు అప్పుడు. అప్పుడాయన "every thinking human being admits the right of ordinary employees to organaize and to quit work when conditions are un satisfactory and to betaken back when conditions are amended" అని నీతులు బోధించాడు. కానీ అదే వ్యక్తి 15 ఏళ్ళ తర్వాత లేబర్ యూనియన్‌లతో పోట్లాడాడు న్యూస్ పేపర్ గిల్డ్‌ను వ్యతిరేకించాడు. పూర్వం తాను సమర్థించిన వాటి నన్నిటినీ ఇప్పుడు వ్యతిరేకించాడు. ఇప్పుడు "కొత్తా పేపర్ దేవుడి" అవతారం ఎత్తి "strikes should be out lawed and complete machinery to enforce their suppression should be

fully established and fearlessly operated" అని కొత్త నీతి వాక్యాలు పలికాడు. రెండు నాలుకల ధోరణి అంటే ఇదే. స్ప్లిట్ పెర్సనాలిటి అనిపించాడు.

**పవర్ టెంటకిల్స్**

పత్రికాధి పత్యంతో సంతృప్తి పడలేదు. ఇంకా విస్తృతమైన స్థిరమైన సాహిత్య పిపాసకులను ఆకర్షించే ప్రయత్నం మొదలు పెట్టాడు. మేగజైన్ రంగాన్ని వశపరచుకొని ఒక స్థితిలో 13 అతి ఖరీదైన నాణ్యమైన పీరియాడికల్స్‌ను ప్రచురిస్తూ అందులో "గుడ్ హౌస్ కీపింగ్", "కాస్మో పాలిటన్"లను చాలా విజయవంతంగా నడిపాడు. పుట్ట గొడుగుల్లా మేగజైన్లను పుట్టించాడు. అప్పటికి ప్రపంచంలోనే అతి పెద్ద పేపర్ సామ్రాజ్యాన్ని ఏర్పరచి మేగజైన్ మొఘల్ అనిపించాడు. తివాచీ నేత, యుద్ధ సామగ్రి, వెండి, ఇంగ్లీష్ ఫర్నిచర్, మూరిష్ పాటరీ తన వ్యాపారరంగాలలో టెంటకిల్స్‌ను చొప్పించేశాడు. పనికి రాని "నిక్ నాక్స్"ను, సేల్లిని ఆస్ట్రిచ్ ఎగ్‌లను కొనటానికి ను 35,000 డాలర్లు తగలేశాడు. అతని ఏజెంట్లు ప్రముఖ శాస్త్రజ్ఞుడు బెంజమిన్ ఫ్రాన్ క్లిన్ కళ్ళ జోడును, ఈజిప్ట్ కళా ఖండాలను, గ్రీకు మార్బుల్స్‌ను, రెండవ రకపు పెయింటింగ్స్‌ను ప్రపంచమంతా తిరిగి కొని సేకరించారు. ఆయన వేర్ హౌస్ పాకేజీ విప్పి వెలుగు చూడని, ఆయనే చూడని వస్తువులతో నిండిపోయింది. ఎక్కడ కొత్తది కనపడినా దాన్ని కొని సేకరించారు.

ఒకసారి "స్పానిష్ మొనాస్టరీ"ని కొని, ఆ బిల్డింగ్‌లోని ప్రతి రాయినీ జాగ్రత్తగా తెప్పించటానికి రైల్ రోడ్డు నిర్మించుకొన్నాడు. ఈ మొత్తం వ్యవహారానికి అరమిలియన్ డాలర్లు ఖర్చు చేశాడు మహానుభావుడు. అన్నిటినీ పొందాలి అన్నీ తన అధీనంలోకి తెచ్చుకోవాలన్న తపనే ఈ పనులన్నిటినీ ఆయనతో చేయించింది. వేల్స్‌లో ఒక రాజ సౌధాన్ని కొన్నాడు. లాంగ్ ఐలాండ్‌లో తల తిరిగిపోయే అద్భుత సౌధం నిర్మించాడు. కాలి ఫోర్నియాలో సాన్ సిమియాన్‌లో ఉన్న రాంచ్‌ను 75,000 ఎకరాలకు విస్తరింప జేశాడు. అందులో అరుదైన అందమైన పుష్పాల గార్డెన్ పెంచాడు. ఒక జంతు ప్రదర్శన శాల (జూ), ఆటలాడే ప్రదేశాలు, సగం మాన్యు మెంట్‌గా, సగం మాసోలియం (గోరీ)గా ఉండే ఒక "మ్యూరీష్ పాలస్" నిర్మించాడు. ఇవికాక నివాసానికి అతి విలాసమైన భవంతిని అందులో పార్టీలు ఇవ్వటానికి అతిపెద్ద బాంకేట్ హాల్, అతిధులకు కుటుంబ సభ్యులకు అతి పెద్ద హోటల్‌లో ఉండే వాటి కంటే విశాలమైన ఎక్కువ గదులు ఏర్పరచాడు. రియల్ ఎస్టేట్ వ్యాపారం చేశాడు. లింకన్ ఫారంను కొన్నాడు దియేటర్లు కట్టాడు. అపార్ట్‌మెంట్లు స్కై స్క్రేపర్లు నిర్మించాడు. ఇది చాలదన్నట్లు సినిమా నిర్మాణ వ్యాపారంలోనూ తనదైన శైలిలో విస్తరించాడు. మొదట వార్తా చిత్రాలు, ఫీచర్ ఫిలిమ్స్‌ను ప్రొడ్యూస్ చేశాడు. తర్వాత సీరియల్స్, ఆ తర్వాత మెరియన్

దేవిస్‌ను పెట్టి సూపర్ చిత్రాలు తీశాడు. చేతి చమురు బాగా వదిలి 7 మిలియన్ డాలర్లుపైగా బొక్క పడ్డాయి. స్థిరమైన ఆలోచనలు లేక చేసిన పిచ్చి పనులయ్యాయి ఇవన్నీ. ఆయన పేపర్లన్నీ తళుకు బెళుకు తారాగణంతో సెక్స్ కథలతో నిండిపోతున్నాయి. "మే వెస్ట్" రౌడీ సినిమాలు అసభ్యకరంగా ఉన్నాయని, ఆమె పేరును తన మేగజైన్‌లలో ఎక్కడా రాకూడదని శాసించాడు.

**థియేటర్ యాజమాన్యం**

థియేటర్ వ్యాపారం ప్రారంభించి అందులో స్వంత జీవితాను భవంతో పూర్తిగా కూరుకు పోయాడు. 18వ ఏట కాలిఫోర్నియా జడ్జి కూతురు అందచందాల భామ సిబిల్ సాండర్సన్‌తో ప్రేమలో పడ్డాడు. ఎంగేజి మెంట్ కూడా అయిపొయింది. కాని హార్స్ట్ హార్వర్డ్ వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి పారిస్ వెళ్ళింది. అక్కడ కన్జర్వేటరి చదివి "ఆపరేటిక్ స్టార్"గా తిరిగి వచ్చింది. కాని మన వాడిని మనువాడటం మరిచే పోయింది. రెండేళ్ళ తర్వాత మళ్ళీ మనోడు మరో కాలిఫోర్నియా యువతి ఎలినార్ కల్హన్ ప్రేమలో పడి ఇద్దరూ కలుసుకొంటూ ప్రేమలో ఉన్నారు ఆమె తనకు గొప్ప నటి కావాలనే కోరిక ఉందని చెప్పింది. మళ్ళీ ఎంగేజ్ మెంట్ తంతు జరిగింది. ఆ అమ్మాయి నటిగా మారి లండన్ వెళ్లి అక్కడి అభిమాన నటిగా ఎదిగింది. మళ్ళీ కథ మామూలయింది. ఇక అమ్మ మాత్రమే తనను ఓదార్చగలదు అనుకోని ఆమె రక్షణ కోరాడు.

**అకస్మాత్తు పెళ్లి**

ఆమె మీద ఉన్న నమ్మకంతో మరో 20 ఏళ్ళదాకా పెళ్లి ఊసు ఎత్తలేదు. వయసు నలభై వ పుట్టిన రోజున 'డాన్సింగ్' విల్సన్ సిస్టర్స్‌లో ఒకరైన మిలిసేంట్ విల్సన్ అనే చర్చ్ అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. అయిదుగురు మగపిల్లలు కలిగారు. వీరంతా తండ్రిని బహు ప్రేమాభిమానాలతో చూసేవారు ఆరాధించేవారు.

**ఇంట్లో ఆశ్రయం ఇస్తే గుండెలో దూరిన నటి**

అతని భార్య మిలిసేంట్ హార్స్ట్ థియేటర్ రంగంలో ప్రవేశించే వారికి చారిటీ ట్రస్ట్ పెట్టి సహాయ పడేది. అలాంటి అమ్మాయిలలో మేరియాన్ డేవిస్ అనే అమ్మాయిని చేర దీసి తన ఇంట్లోనే ఆశ్రయ మిచ్చింది. అప్పుడు హార్స్ట్ వయసు యాభై డేవిస్ వయసు ఇరవై. దీనితో బ్రూక్లిన్‌కి చెందిన ఈమె ఒక్కరాత్రిలో సేలిబ్రేటి అయిపొయింది. ఈమెను గురించి కవయిత్రి డోరోతీ పార్కర్ "మీరు హాలీ వుడ్ ఆకాశం వైపు చూస్తే అక్కడి నక్షత్రాలన్నీ 'మేరియాన్ డేవిస్" అని జపిస్తాయి అన్నది. రాండాల్ఫ్ డబ్బుతో, పేపర్ల బూస్టింగ్‌లతో చాలా ఖరీదైన సినిమాలలో హీరోయిన్‌గా నటించినా "వెండి తెర

రాణి" కాలేక పోయింది. కాని హార్స్టుకు చాలా విశ్వాసంగా, కంపానియన్‌గా, ఆరాధకురాలిగా ఉండేది. ఒకసారి అతని ఆర్థిక పరిస్థితి దెబ్బతింటే ఒక మిలియన్ డాలర్లు తిరిగి ఇచ్చేసి ఆదుకొన్నది కూడా. భార్య విడాకులకు అంగీకరించకపోయినా, ఆమెనుండి దూరమై డేవిస్‌తో గడిపాడు. జల్సా ఖర్చులో మార్పేమీ రాలేదు. విచ్చల విడిగా డబ్బు ఖర్చు చేశాడు. ఆమెతో సంతృప్తిగా జీవించాడు. తన ప్రేమను పంచాడు తానూ ఇంతవరకు పొందని ప్రేమానుభూతిని ఆమె ద్వారా పొందాలిగాడు.

**రాచకీయ అడుసులో కాలు – బహు భంగుల భంగ పాట్లు**

నలభై ఏళ్ళ వయసులో రాండాల్ఫ్ బుద్ధి తక్కువై రాజకీయ రంగ అరంగేట్రం చేశాడు. "వార్ మేకర్–ఇప్పుడు కింగ్ మేకర్ –సారీ సాక్షాత్తు కింగ్" అయ్యాడు. 1902లో కాంగ్రెస్‌కు ఎన్నికై రాజకీయారణ్యంలో ప్రవేశించాడు. సరైన ప్రజా ప్రతినిధి అని అనిపించుకోలేక పోయాడు. అతని సహచర సభ్యులు అతని ఆలోచనలపై అపనమ్మకంతో ఉండేవారు. చివరికి పార్టీ నాయకుడు కూడా అతనితో కలిసి మాట్లాడని పరిస్థితి ఏర్పడింది. దీనికి బెదరకుండా మరింత అత్యాసతో కొడితే గోల్కొండ కొట్టాలని ప్రెసిడెంట్ పదవిపై కన్నేశాడు. 1904లో డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా నామినేట్ అవటానికి అన్ని రకాల పావులూ కదిపాడు .చివరికి దాన్ని జడ్జి ఆల్టన్ బి పార్కర్ తన్నుకు పోయాడు. ఏడాది తర్వాత న్యూయార్క్ మేయర్ పదవికి ఇండిపెండెంట్ అభ్యర్థిగా ప్రయత్నించాడు. టామనీ చేతిలో ఘోరంగా ఓడిపోయాడు. అయినా ఆశ చావక న్యుయార్క్ గవర్నర్ కోసం అదే టామనీతో చేతులు కలిపి, ఎన్నో బహిరంగ సభలలో ఉపన్యాసాలిచ్చాడు. నలభై మూడులో బలిష్టమైన ఎముకలతో, భారీ పర్సనాలిటితో పొడవైన ముఖంతో, జుట్టు నుదుటి మీద పడి ఎడమ కనురెప్పలపై వాలిపోతున్నట్లు ఉండేవాడు. పడమటి దేశ గర్వం ముఖంలో బాగా కనిపించేది. చిన్న చిన్న వాక్యాలు మాట్లాడేవాడు. ఇవన్నీ ఎవర్నీ ఆకర్షించ లేకపోయాయి. ప్రచార సంరంభానికి అయిదు లక్షల డాలర్లు ఖర్చు చేసినా, డెమొక్రాట్ పార్టీ అభ్యర్ధులలో హార్స్టు తప్ప అందరూ ఎన్నికయ్యారు. విధి వక్రించింది. 619 డాలర్లు మాత్రమే ఎన్నికల ప్రచారానికి ఖర్చు చేసిన చార్లెస్ ఇవాన్స్ హగ్స్ బ్రహ్మాండమైన మెజారిటీతో ఎన్నికై రాండాల్ఫ్‌ను పీటీ, కాటా దెబ్బ కొట్టాడు.

అయినా ధన బలంతో ఆశపోక మళ్ళీ రాజకీయంలో అదృష్టం పరీక్షించుకోవాలనుకొన్నాడు. వైట్ హౌస్‌లోనూ, ప్రాంచమంతా తన ప్రభావాన్ని, పలుకు బడిని చూపించాలని భావించాడు. 1908లో ప్రెసిడెంట్ పదవికి రిపబ్లికన్ అభ్యర్థి విలియం హోవార్డ్ టాఫ్ట్. డెమోక్రాటిక్ అభ్యర్థి మళ్ళీ బ్రియాన్. సహజంగా డెమొక్రాట్ అయిన హార్స్టు రియాన్‌తో తగాదా పడి, ఒక స్వతంత్ర అనామక అభ్యర్థికి మద్దతు

ఇచ్చాడు. ఎన్నికల ప్రచారంలో స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ నుండి కొన్ని లేఖలు దొంగ తనంగా సంపాదించి కొంతమంది సేనేటర్లపై అభియోగం అనే బాంబు పడేశాడు. ఈ జిమ్మిక్కులేమీ పని చేయలేదు. రిపబ్లికన్ అభ్యర్థి టాఫ్ట్ ప్రెసిడెంట్‌గా భారీ మెజారిటీతో గెలిచాడు. మనవాడు బలపరచిన అనామకుడు హేజెన్స్‌కు మనవాడి రాష్ట్రంలో ఒక్క వోటుకూడా రాకపోవటం గమనార్హం. డబ్బే అన్నీ చేయిస్తుంది అనుకొంటే పెద్ద పొరబాటు. దానికి మించి చాలా ఉంటాయని గ్రహించాలి.

ఎదురు దెబ్బలు తింటున్నా పదవిపై ఆశ చావలేదు చిగురిస్తూనే ఉంది. 1909లో న్యూయార్క్ మేయర్ పదవి మనకే అనుకొన్నాడు. తీవ్ర ప్రచారార్భాటంతో శక్తి యుక్తులన్నీ పణంగా పెట్టి ప్రయత్నించాడు. మళ్ళీ ఘోర పరాజయం పాలైనాడు. 1912లో ప్రెసిడెంట్ పదవికి తన అభ్యర్థిగా చాంప్ క్లార్క్ కోసం ప్రయత్నిస్తే, తనను తీవ్రం గా వ్యతిరేకించే వుడ్రో విల్సన్ నామినేట్ అయి ప్రెసిడెంట్‌గా గెలిచాడు. కనుక మనవాడికి రాజకీయం అచ్చి రాలేదు. తిరుక్షవరమే అయింది పాపం.

### విదేశీ వ్యవహారలలో వేలు

స్వంత రాష్ట్రంలో రెండు పార్టీలు అతన్ని నమ్మలేదు. అంటే తను నమ్మకం కలిగించ లేకపోయాడు. ఇది లాభం లేదని విదేశీ వ్యవహారంలో వేలు పెట్టాడు. 20 ఏళ్ళకు పూర్వం మనవాడు యుద్ధం సృష్టించాడు. ఇప్పుడు 1914లో మొదటి ప్రపంచ యుద్ధాన్ని ఆపటానికి ప్రయత్నించాడు. అమెరికా యుద్ధంలో దిగక ఉండలేని పరిస్థితి. అందుకే సంఘటిత కూటమి (అల్లీస్) రాజ్యాలకు కొమ్ము కాసింది. పాపం హార్స్ట్ తిట్లు తినే అందరూ ద్వేషించే ఒంటరి వాడైపోయాడు. పైగా ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌లకు అమెరికా ఏ మాత్రం సాయం చేసినా విజేత అయ్యే జర్మనీ మాడ్చి మసి చేస్తుందని హెచ్చరించాడు. యుద్ధం వాల్ స్ట్రీట్‌కు ఆయుధ సామగ్రి తయారు చేసేవారికి లాభాలు కలిగించింది. చివరికి అమెరికా శత్రు దేశంతో ప్రత్యేక శాంతి ఒడంబడిక కుదుర్చుకోవాల్సి వచ్చింది. అవమానాలు భరించలేక రాండాల్ఫ్ డెమోక్రాటిక్ పార్టీకి గుడ్‌బై చెప్పి రిపబ్లికన్‌ల పంచలో చేరాడు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన సమయంలో మన “జర్నలిజం మోనార్క్”, “నేషనల్ సోషలిజం” అనే నినాదాన్ని బయటపెట్టాడు. ఫాసిస్ట్‌లు యాంటి సెమి సేమేటిస్‌లు కలిసి హిట్లర్‌ను ఇంటర్వ్యూ చేసి “హిట్లర్ శాంతికి, ఆర్థిక స్థిరత్వానికి కృషి చేసే అద్వితీయ శక్తి” అని ప్రకటించారు. జపాన్ కూడా వారితో కలవటంతో హార్స్ట్ “తూర్పు దేశాల బెదిరింపు” (ఓరియెంటల్ మెనేస్) అని సమాధాన పరచాడు.

### అధికారాంతమున చూడవలె

రెండవ ప్రపంచ యుద్ధానంతరం “పేపర్ మొఘల్ ” పవర్ క్షీణింటం మొదలైంది.

ప్రత్యర్థి సంపాదకులు రాజకీయ నాయకులు ప్రెసిడెంట్లు తీవ్రంగా దాడి చేసేవారు. ఇప్పుడు మరింత సంక్షోభంలో పడ్డాడు. ప్రిస్టేజి డామేజి అయింది. భౌతికంగా కుంగి పోయాడు మానసికంగా కృశించిపోయాడు. 1947లో మొదటి సారి హార్ట్ ఎటాక్ వచ్చింది హార్స్ట గారికి. మౌంటేన్ రిట్రీట్ నుంచి మకాం మారియన్ డేవిస్ బివేర్లీ హిల్స్‌కు మార్చాడు. ముప్ఫై ఏళ్ళ నుండి అంటిపెట్టుకున్నావిడే ఆరోగ్యంగా ఉండగానూ ఇప్పటి అనారోగ్య బలహీన స్థితిలోనూ సపర్యలు చేసి కృతజ్ఞత చూపింది. ఆయన గుండె నిబ్బరం మరో నాలుగేళ్ళు జీవించేట్లు చేసింది. 88ఏళ్ళ సఫల విఫల దిగ్విజయ పరాజయాలను రుచి చూసిన విలియం రాండాల్ఫ్ హార్స్ట గారి హార్ట్ 14-8-1951న శాశ్వతంగా ఆగిపోయింది.

చనిపోవటానికి ముందు తన మనోభిప్రాయాలను వెల్లడించారు. ఆయన జీవిత చరిత్రలు రాశారు. "ostracism by decency in life ,and oblivion in death" ఊహించి ముందే చెప్పాడు చార్లెస్ బియర్డ్ అనే హిస్టోరియన్. అతని రాజకీయంపై వ్యాఖ్యానిస్తూ విలియం అలెన్ వైట్ "Ibelieve that Hearst as an ally ofany politician is a form of political suicide" అని ఘాటుగా వ్యాఖ్యానించాడు. ఎవరేమన్నా ఆతను "లెజెండరీ ఫిగర్ " అన్నది నిర్వివాదం. 1900లో మొదలుపెట్టి 1936లో ఓడిపోయిన లాండాన్ నుంచి మేకార్థీ వరకు అయన మెచ్చిన పాత స్నేహితులంతా "proverbial kiss of death" రుచి చూసిన వాళ్ళే అన్నాడొకాయన. ఒక విధయం గా ఆయన "గొప్ప మూవర్ అండ్ షేకర్" పత్రికా సామ్రాజ్య వ్యాప్తిలో ఎదురు లేనివాడు తిరుగు లేనివాడు. గొలుసు పత్రికలకు మార్గదర్శి. సంచలన కథనాలకు ఆలవాలం. "ఎల్లో కిడ్" పాత్ర ద్వారా ఎల్లో జర్నలిజానికి నాంది పలికినవాడు. అతని అస్థిర విధాల విషయమై ప్రశ్నిస్తే దానికి ఆయన సమాధానం "it is not important to be consistant, as it is to be correct. A man who is consistent never learn any things. conditions change, and he does not" అని జవాబు చెప్పాడు అతని చరిత్రకారులు కూడా అతనిలోని విరుద్ధ భావాలను అలాగే ఉండనివ్వండి అన్నారు.❋



# 39. కాళ్ళీడ్చు కుంటూ నడిచే సామాన్యుడిని కారెక్కించిన-హెన్రీ ఫోర్డ్ (1863-1947)

అమెరికాను చక్రాలపై నడిపించిన ఘనుడు, మెకానిక్, "దిలిటిల్ మాన్స్ లిటిల్ మాన్" హెన్రీ ఫోర్డ్ 30-7-1863లో అమెరికాలోని మిచిగాన్ రాష్ట్రంలో ఒక చిన్న పల్లెటూరు డియర్ బార్న్‌లో జన్మించాడు. కొడుకు రైతు కావాలని తండ్రి కోరిక. స్కూల్‌కు వెళ్లేముందు వచ్చిన తర్వాత ఫోర్డ్‌ను పల్లె జీవితానికి అలవాటు చేశాడు. అయినా జీవితం చరమ భాగంలో ఏ భూమిని ప్రేమించలేదో అక్కడే మళ్ళీ మట్టి మనిషి అయ్యాడు. ఫోర్డ్ కార్ల ఉత్పత్తిలో మెస్సయ్య అయి కీర్తి గడించాక ఈ విషయమై రాస్తూ "మా డైరీ ఫాంను అచ్చంగా ఒక ఫాక్టరీ నడిపినట్లుగానే నడిపాం" అన్నాడు. యవ్వనంలో అంత నెమ్మదిగా నడిచే గుర్రాలు, ఆవుల మధ్య గడుపుతానని అనుకోలేదు. అప్పుడే కనీసం అప్పటికి కంటితో చూడనైనా చూడని ట్రాక్టర్ల నమూనాలు గీసేవాడు. తల్లి ఉపయోగించే కుట్టు పని సూదులను స్క్రూ డ్రైవర్లుగా మలచేవాడు. పుస్తకం అడ్డం పెట్టుకొని మెకానికల్ ఆట వస్తువులకు టింకరింగ్ చేసేవాడు రహస్యంగా. 14ఏళ్ళకే వాచ్‌ని విప్పి అందులోని భాగాలను బయటికి తీసి మళ్ళీ చక్కగా అమర్చ గలిగేవాడు. డెట్రాయిట్‌లో 16వ ఏట పగటిపూట ఒక మెకానిక్ షాప్‌లో వారానికి రెండున్నర డాలర్ల జీతంతో అప్రెంటిస్‌గా పని చేశాడు. సాయంత్రాలలో ఒక జ్యూయలరీలో, అంతే జీతానికి పని చేశాడు. రెండేళ్ళ తర్వాత ఒక ఇంజెన్ షాప్‌లో ఉద్యోగం వచ్చింది. వయసు 19లో మళ్ళీ ఫాం హౌస్ బాయ్ అయి "సింగిల్ సిలెండర్ స్టీం ఫాం ట్రాక్టర్"ను స్వయంగా రూపొందించాడు. అది పనిచేసింది కాని పొలంలో ప్రక్కకి తిరగటానికి చాలినంత సామర్థ్యం ఉన్న బాయిలర్‌ను తగిన ప్రజర్‌తో తయారు చేయలేక పోయాడు. కొడుకు క్షేత్రపాలకుడుగా ఉన్నాడన్న సంతోషంతో తండ్రి ఫోర్డ్‌కు 40 ఎకరాల వుడ్‌లాండ్ పొలం ఇచ్చాడు. దీనిలో ఒక సామిల్‌ను ఏర్పరచి పొలంలోని

చెట్లను నరికించి రద్దు ముక్కలని అమ్మేశాడు. అప్పటికి అయ్యగారి వయసు 21మాత్రమే.

24 ఏళ్ళకే పెళ్లి చేసుకొని హెన్రి డెట్రాయిట్‌లో కాపురం పెట్టాడు. అక్కడ "ఎడిసన్ ఇల్యూ మినేటింగ్ కంపెని" ఉద్యోగి అయ్యాడు. రెండేళ్లకే ఆ కంపెనీ చీఫ్ ఇంజినీర్ అయ్యాడు. డెట్రాయిట్ ఆటో మొబైల్ క్లబ్‌లో చేరి మొదటి ఆటో మొబైల్‌ను తయారు చేశాడు. సన్నగా పొడుగ్గా పలచగా ఉండేవాడు. నిశిత దృష్టి ఉన్నకళ్ళు. నొక్కుకు పోయినట్లుండే ముఖం. వాషింగ్టన్ ఇర్వింగ్ గీసిన "ఇచాబాడ్ క్రేన్"లా ఉండేవాడు. కొంగలాంటి చూపు. అన్నిటినీ పసికట్టే నేర్పు ఉండేవి. ఫోర్డ్ ప్రేమనంతా యంత్రాల మీదే కురిపించాడు. యంత్రంలోని ప్రతిభాగం ఆయన్ను ఆశ్చర్యపరచి ఉత్తేజం కల్గించేది. యంత్రారాధకుడై పోయాడు. "అంతర్దహన యంత్రం" (కంబశ్చన్ ఇంజిన్)తో ప్రయోగాలు చేశాడు. ఇంటికి కూడా తీసుకొని వెళ్లి వాటి సామర్థ్యాన్ని పెంచే ప్రయత్నం చేసేవాడు. 33వ ఏట అందవికారంగా ఉండే గుర్రం లేని బండీని ఇంజన్‌తో "సోలీన్ బగ్గీ"ని నడిపి అందరకీ ఆశ్చర్యం కలిగించాడు. దీని తర్వాత అనేక రకాల కార్లు తయారు చేశాడు. కొన్ని వ్యతిరేక ఫలితాలనిచ్చాయి. చివరగా ఒక "రేసింగ్ కార్"ను తయారు చేసి రేసింగ్ పోటీలో స్వయంగా నడిపి పాల్గొన్నాడు. ఈ అనుభవాన్ని వర్ణిస్తూ "నేనే స్వయంగా ఒక మైలు దూరం ఐసు మీద నా రేసింగ్ కార్ నడిపాను. ఈ రేస్‌ను జీవితంలో మరచిపోలేను. ఐసు మీద పగుళ్ళు ఉండేవి. ఆ పగుళ్ళలో నా కారు యెగిరి గంతేసేది గాలిలో. అది మళ్ళీ యెట్లా మంచుమీదకు వచ్చేదో నాకు అర్థమయ్యేది కాదు. గాలిలో లేనప్పుడు జారిపోతున్నానేమో అనిపించేది. ఏమైతేనేం విజయవంతంగా నడిపి రేస్ గెలిచి ప్రపంచం దృష్టిని ఆకర్షించాను" అని "మై లైఫ్ అండ్ వర్క్ " అనే జీవిత చరిత్రలో రాసుకొన్నాడు ఫోర్డ్. తానొక "గ్రేటెస్ట్ డేర్ డెవిల్ డ్రైవర్" అనిపించుకొన్నా కార్ డ్రైవింగ్‌పై వ్యామోహ పడలేదు. తేలిగ్గా ఉదాసీనంగా అదొక అడ్వర్‌టైజ్‌మెంట్‌గా లైట్ తీసుకున్నాడు. 40వ ఏట 1903లో స్వంతంగా కార్ల కంపెనీ స్థాపించాడు. స్టాక్ హోల్డర్లుగా ఇద్దరు లాయర్లు, ఒక బుక్ కీపర్, ఇద్దరు మెషీన్ షాప్ యజమానులు, ఒక గుమాస్తా, షాప్ నిర్వహించే ఒక మనిషి గాలిమరలు తయారు చేసే ఆయనతో మొదలుపెట్టాడు. గ్రాస్ కాపిటల్ 25వేల డాలర్లు. అయిదేళ్ళ తర్వాత "మోడల్ టి" కారు (TLizz)ను రోడ్డుఎక్కించి అమెరికా ప్రజల్ని కాలి నడకనించి తప్పించి కారులో దూసుకుపోయే స్థితిని కల్పించాడు ఫోర్డ్.

నమ్మ శక్యం కాని విపరీతమైన లాభాలొచ్చి పడ్డాయి. దీనికో చిన్ని ఉదాహరణ. ఆర్గనైజర్లలో ఒకడైన జేమ్స్ కజిన్స్‌కు రోసేట్ట అనే సిస్టర్ ఉంది. జాగ్రత్తగా గడుపుతూ స్కూల్ టీచర్ జీవితాన్ని గడుపుతూ ఎట్లాగో రెండు వందల డాలర్లు నిలవచేసింది.

రిస్క్ తీసుకొని అందులో సగం అంటే వంద డాలర్లు ఫోర్డ్ కంపెనీలో పెట్టుబడి పెట్టింది. 1919కి ఆమె పెట్టుబడిపై ఆమెకు మిలియన్‌లో మూడవ వంతు అంటే మూడు వందల యాభైవేల డాలర్లు లభించాయి. కళ్ళు తిరిగే రాబడి విని మూర్ఛపోయే విషయం. ప్రతివాడు ఫోర్డ్ తయారు చేసిన "టి లిజ్" కారును చూసి మొదట్లో నవ్వారు. ఒక జోకు కూడా వదిలారు "ఆ ఏం లేదురా! ఎవడో పల్లెటూరి రైతుబైతు పగిలిన బాయిలరూ, తుప్పుపట్టిన వాష్ టబ్ ఫాక్టరీకి ఇచ్చి ఉంటాడు ఈయనేమో రెండు రోజుల తర్వాత వాటితో కొత్త ఆటో మొబైల్ చేసి రైతుకు రవాణా చేశాడు. మిగిలిన మెటల్ ఖరీదు 20 డాలర్లు కట్టి రైతుకు పంపి ఉంటాడు" ఇలా బోల్డు కథలు ప్రచారంయ్యాయి. ఇలా అంటూనే అందులో ఎక్కి అందరూ తిరిగారు. ఫోర్డ్ కొత్త ఇంజన్ల సృష్టికర్తకాడు, ఆర్గనైజరూకాడు. కాని నిరంతర ప్రయోగాలు చేసేవాడు అవి హిట్ అవచ్చు ఫట్ అవచ్చు. ఆయనొక కూర్పరి (అసెంబ్లర్). కాని అతని ఈ ఇన్వెన్షనరీ కూర్పు ఆలోచనే, కార్ల ఉత్పత్తిలో విప్లవం తెచ్చింది. శతాబ్దాల జనాల జీవన విధానాన్నే మార్చేసింది. అతి వేగంగా కార్లను ఉత్పత్తి చేసి అతి తక్కువ ధరకు అమ్మటం ఫోర్డ్ ప్రత్యేకత. ఈకార్లు "డబ్బు చేసిన" మనుషుల కోసం కాదు. సామాన్య పనీ పాటా చేసుకొనే జనం కోసమే. అంతకు ముందెప్పుడూ కారు ముఖం చూడని, కారు ప్రయాణ సుఖం అనుభవించని, స్వంత కారు లేని వారి కోసమే. వర్కర్ల జీతాలు పెంచి కారు ధర తగ్గించాడు ఫోర్డ్. దీనికి తగిన గొప్ప ప్రతిఫలం పొందాడు. 15 మిలియన్ల టిలిజ్ కార్లను ఉత్పత్తి చేసి అమ్మాడు. అందులో చాలాభాగం కేవలం 290 డాలర్లకే అమ్మాడు. ధర తగ్గటంతో మార్కెటింగ్ పెరిగింది. అలా వ్యాపారం అనంతంగా సాగింది. రోడ్డుమీద కనిపించే ప్రతి రెండు కార్లలో ఒకటి ఫోర్డ్ కారే అవటం ఆశ్చర్యకరం. కారులో కొన్ని లోపాలున్నాయి వాటిని సరి చేయాల్సి ఉంది. అయినా క్రేజ్ మాత్రం తగ్గలేదు. లోపలి డిజైన్ బట్టి కారు ధర ఉండేట్లు చూశాడు. దీనితర్వాత "మోడల్ A కార్లను తయారు చేయటం మొదలెట్టి రోజుకు ఆరు వేలు తయారు చేశాడు. అమెరికా, కన్వేయర్ బెల్ట్, స్పీడ్ అన్నీ స్వంతంగా అమర్చారు.

అంత అందం, ఆకర్షణా లేకపోయినా టిలిజ్ కారు టఫ్ అండ్ రఫ్‌గా ఉండేది. దీని నుండి ఇంకా కొంచెం సున్నితమైన నాలుగు సిలిండర్ల, మరింత ఆధునికతతో స్లైడింగ్ గేర్‌తో ఆకర్షణీయమైన "మోడల్ ఏ" వచ్చింది. ఉత్పత్తి వేగం పెంచారు. ఫోర్డ్ జీవిత కాలంలోనే 30 మిలియన్‌పైనే కార్లు ఉత్పత్తి అయ్యాయి. నిమిషాని కొకకారు ఉత్పత్తి అయింది. ఇవికాక జీపులు, ట్యాంక్ విధ్వంసకాలు బాంబర్లు, షిప్పులు, బ్రెన్ గన్ కారియర్లు, మొదలైన యుద్ధ వాహనాలు తయారు చేశాడు. ఏది నిర్మించినా

సామర్థ్యంను దైవంగా భావించి చేశాడు. తక్కువకాలంలో తక్కువ లేబర్‌తో అసాధ్యాన్ని సుసాధ్యం చేశాడు. మనిషి మెషీన్ దేవుడికి సేవ చేసే విధం చూపాడు. స్వయం కృషికి విశేష ప్రాధాన్యమిచ్చాడు. సృజనకు విశేష విజయం చేకూర్చాడు. సాధారణ ప్రజలే ఫోర్డ్ దృష్టిలో ఎప్పుడూ ఉండేవారు. వారి సంక్షేమమే ధ్యేయంగా పని చేసేవాడు. వారికి పితృ ప్రేమను అందించాడు. వారు సౌకర్యాలు కలిపిస్తే మరింత సామర్థ్యంతో పని చేస్తారని నమ్మాడు. ఆ సౌకర్యాలు కల్పించి రుజువు చేసుకొన్నాడు.

పని చేసేవారి ఇంటి పరిస్థితులను తెలుసుకోనేవాడు. వారికి దురభ్యాసాలేమైనా ఉన్నాయేమోనని వేగుల ద్వారా విచారించేవాడు. సిగరెట్ తాగటాన్ని నిషేధించాడు. తాగుతూ కనిపిస్తే ఉద్యోగం నుంచి డిస్మిస్ చేసేవాడు. ఇదంతా ఒక కుటుంబంలో తండ్రికున్న బాధ్యతగా భావించేవాడు. ఫోర్డ్ సామ్రాజ్యం ఒక నియంత ప్రభుత్వంలాగా, ఒక పోలీస్ రాజ్యంగా, స్పైస్టేట్‌గా అనిపించేది. స్వయం రక్షక భటులు, ఇన్ఫార్మర్లు, బలీయమైన ఆర్మేడ్ గార్డ్‌లతో జెర్మనీ వాళ్ళ "గెస్టపో"ను పోలి ఉండేది. ఫోర్డ్ ఫాక్టరీల నుండి ఫోర్డ్ సామ్రాజ్యమేర్పడింది. రోగ్ రివర్ వద్ద వెయ్యి ఎకరాలలో విస్తరించి, లక్షమంది ఉద్యోగులతో విలసిల్లింది. బొగ్గు, ఇనుప గనులను, టింబర్ లాండ్, బ్రెజిల్‌లోని ఆరుమిలియన్ల ఎకరాల రబ్బర్ ప్లాంటేషన్ను గ్లాస్ ఫాక్టరీలను, చిన్న పరిశ్రమలను స్వాధీనం చేసుకొన్నది. యూరప్ దక్షిణ అమెరికాలలో ప్రతిచోటా అనుబంధ కంపెనీలను ఏర్పరచింది. 1923 నాటికి ఒక్క అమెరికాలోనే ఫోర్డ్ ఉద్యోగుల సంఖ్య 2లక్షలకు పైనే ఉండేది. దీనితో నిరంతర ఉత్పత్తి సాధ్యమైంది. రోగ్ రివర్ ఫాక్టరీకి ఓడలలో దగ్గరున్న నౌకాశ్రయాలకు ఇనుము చేరేది. దాన్ని ఫాక్టరీలో కరగించి ఉక్కుగా మార్చేవారు. తర్వాత విడిభాగాలు తయారు చేసేవారు. వీటిని అసెంబుల్ చేసి ఆటో మొబైల్స్‌ను నాలుగు రోజుల్లో తయారు చేసి షిప్పింగ్ చేసి అమ్మేవారు. ఫోర్డ్ పట్టినది అంతా బంగారమే అయ్యేది. పాడై పోయిన ఒక రైల్ రోడ్‌ను కొని, కొన్నేళ్ళ తర్వాత దాన్ని 9 మిలియన్ల డాలర్ల లాభానికి అమ్మేశాడు. 1940లో ఫోర్డ్‌ను సంపాదించిన సంపదను లెక్కపెట్టట సాధ్యం కాలేనంత పెరిగిపోయింది. కాని ఆ ఏడాది అది 600 మిలియన్ డాలర్లుపైగా ఉంటుంది అని అంచనా వేశారని ఫోర్డ్ జీవితంపై "దిలాస్ట్ బిలియనీర్" పేరసి రిచార్డ్స్ రాసిన పుస్తకంలో ఉంది.

ఫోర్డ్‌లో చిన్న చిన్న విపరీత ధోరణులు, పెద్దపెద్ద అసూయలు ఉండేవి. విశ్వ సమస్యలపై ఆలోచించేవాడు. వైరుధ్యాలపై ఆధారపడి, అవే సాకులుగా చూపి అకస్మాత్తుగా దూరంపెట్టే అలవాటుండేది. లేబర్ యూనియన్‌లతో చాలా కఠినంగా వ్యవహ రించేవాడు. పరిస్థితి అర్థం చేసుకోన్నాక అడిగిన దానికంటే ఎక్కువే ఇచ్చేవాడు.

పొగాకు తాగటం మంచిది కాదనే ప్రచారం చేస్తూ "నేరం చేసిన ప్రతి వాడికీ సిగరెట్ దురభ్యాసం తప్పకుండా ఉంటుంది" అని చెప్పేవాడు. అమెరికన్ టొబాకో కంపెనీ కొన్న తర్వాత సిగరెట్‌పై చెప్పిన మాటే మర్చిపోయాడు.

కళా సాంస్కృతిక రంగాల గురించి ఆయనేమీ పట్టించుకోలేదు పుస్తకం చదివే అలవాటు కూడా లేదాయనకు. ఫిలాసఫీ కూడా తెలియదు. ఎమర్సన్ చెప్పిన "an institution is the lengthened shadow of one man"పై నమ్మక మున్నవాడు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో ఫోర్డ్ అకస్మాత్తుగా "ప్రపంచ రక్షకుడు"గా శాంతి పరిరక్షకుడుగా అవతారం ఎత్తాడు. ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకొన్న (చార్టర్డ్ ) షిప్‌లో వందమంది సానుభూతి పరులతో యూరప్ వెళ్లి యుద్ధ ఉన్మాదంలో ఉన్న రెండు వైపుల వారి మధ్య సయోధ్య కుదర్చాలని అనుకొన్నాడు. "సైనికులను క్రిస్మస్ నాటికి ట్రెంచ్‌లలోంచి బయటికి తీసుకోచ్చేయండి" అనేది ఫోర్డ్ స్లోగన్. స్లోగన్ కూడా. కాని అక్కడి పరిస్థితులను అర్థం చేసుకొని గమ్మున ఉండిపోయాడు. నౌక నార్వే తీరం చేరగానే ఫోర్డ్ తిరుగు ప్రయాణపు షిప్ ఎక్కి తిరిగొచ్చాడు.

యుద్ధం అయిపోయాక ఒక ఏడాది తర్వాత మరొక తక్కువస్థాయి ప్రయత్నం తలపెట్టాడు. యూదుల మీద యుద్ధం ప్రకటించాడు. బుడాపెస్ట్ జ్యూస్ రోజికా స్విమ్మర్‌తో జరిగిన దురదృష్ట సంఘటనలతో అతనిలో యాంటి సెమిస్ట్ భావాలు తీవ్రమైనాయి. "డియర్ బార్న్ ఇండిపెండెంట్" అనే మేగజైన్‌ను ఫోర్డ్ ప్రచురించాడు. ఏడేళ్ళు జాతి విద్వేషాన్ని అందులో వెళ్ళ గక్కాడు. నీచమైన డాక్యుమెంట్లను సేకరించి అందులో ప్రచురించాడు. ప్రపంచ ప్రభుత్వాల, కళా సంస్కృతుల ఆర్థిక రంగాలలో తప్పిదాలన్నీ జ్యూస్ వల్లనే జరిగాయని వాళ్ళే బాధ్యులని ఆరోపించాడు. కల్తీ మద్యం, సంగీతం, బేస్ బాల్. ఆడవాళ్ళ లిప్‌స్టిక్ లన్నీ యూదుల సృష్టి అన్నాడు. చికాగో అటార్నీయారన్, కో ఆపరేటివ్ నిర్వాహకుడు సాపిరో ఫోర్డ్‌పై మిలియన్ డాలర్లకు పరువు నష్టం దావా వేశాడు. గురూగారు ఒక్క సారిగా వెనక్కి తగ్గాడు. పత్రికా ముఖంగా క్షమాపణ చెప్పి లెంప లేసుకొన్నాడు. ఈ తప్పు అంతా తన కింద పని చేసే వాళ్ళదే అని వాళ్ళే బాధ్యులని నేరం వారిపై తెలివిగా నెట్టేశాడు ఫోర్డ్ సామ్రాజ్యాధిపతి విలియం ఫోర్డ్. "జియాన్ ప్రోటోకాల్స్" అన్నీ తప్పుడు వని సంజాయిషీ ఇచ్చాడు. తన పత్రిక "ఇండిపెండెంట్"లో రాయబడినదంతా తాను బిజీగా ఉండటం వలన చదవ లేకపోయానని తాను చదవ కుండానే అచ్చై పోయిందని తప్పించుకొన్నాడు. వెంటనే ప్రచురణ ఆపేయిం చేశాడు కూడా.

ఫోర్డ్ సామ్రాజ్యం బాగా విస్తరించాక విశేష అధికారాలను పొందాడు. కనుక

తప్పులు చేయటానికి సాహసించ లేదు. జరిగిన తప్పులన్నీ ఆయనపై ప్రభావం ఉన్నవారి వల్ల జరిగినవేననే ఆరోపణ వచ్చింది. ఒకరిపై ఒకరిని ఉసి గొల్పి వినోదించే మనిషి ఫోర్డ్. ఎంత ప్రాముఖ్యమైన వ్యక్తి అయ్యాడో అంత డేంజర్ కూడా అయ్యాడు. కంపెనీలో పని చేసే అత్యున్నత స్థాయి ఆఫీసర్లను కింది తరగతి స్వీపర్లను పీకి పారేసినట్లు తీసిపారేశాడు. అలాంటి వారిలోఫోర్డ్‌తో మొదటినుంచి పని చేసి కంపెనీ వ్యాప్తికి అన్ని విధాలా తోడ్పడి, వర్కింగ్ బ్రదర్‌లా ఉన్నజీనియస్ జేమ్స్ కజిన్స్ కూడా ఉండటం బాధాకరం. అలాగే ప్రొడక్షన్ సూపరిండెంట్, విల్లో రన్‌లో వార్ ప్లాంట్‌ను ఏర్పాటు చేసిన హార్లేస్ సోరెంసన్ కూడా ఉన్నాడు. ముఖ్య బిజినెస్ సెక్రెటరి, ఆంతరింగుకుడు ఎర్నెస్ట్ లీ బోల్డ్‌ను కూడా "ఫైర్" చేశాడు. కాల్చాడు అని కాదు తీసేశాడని అర్ధం. ఫోర్డ్ దగ్గరున్న అతి ముఖ్యమైన నలుగురిలో బాడీగార్డ్, ట్రీనింగ్ ఏజెంట్ అయిన హారీ బెన్నెట్‌ను ఒక్కడినే తన దగ్గర ఉంచుకొని మిగిలిన ముగ్గురికి ఉద్వాసన పలికాడు ఫోర్డ్ మహాశయుడు. ఫోర్డ్ చనిపోయేదాకా ఇతనున్నాడు. ఫోర్డ్ చనిపోయాక అప్పటికే ఫోర్డ్ ఎస్టాబ్లిష్ చేసిన సర్వీస్‌ను తాను స్వీకరించానని చెప్పాడు. ప్రతివాడూ మరోకరిని చెక్ చేసేవారని, ఉద్యోగుల్లో అయిదుగురిలో ఒకరు గూఢచారి లేక సర్వీస్ మనిషి ఒకరు ఉండేవారని, టాయ్ లెట్లకు వెళ్ళినా వెంబడించేవారని, ఫోర్డ్ కంపెనీలో ఫోర్డ్‌కు తెలియ కుండా ఏ చిన్న విషయమూ జరగదని బెన్నెట్ చెప్పాడు.

చాలాకాలం చాలా సమస్యలకు తన దగ్గర సమాధానాలున్నాయని ఫోర్డ్ నమ్మాడు. విద్యా గంధం లేని వ్యవహారదక్షుడు, శక్తి వంతమైన పారిశ్రామికవేత్త, అధిక సంపన్నుడైన ఉత్పత్తిదారుడు అన్నిటా తానే అయినవాడై పోయాడు. రాజకీయాలు కూడా ఒక పరిశ్రమ. కనుక మిచిగాన్ నుంచి సెనేటర్‌గా పోటీచేశాడు. ఆయన రిపబ్లికన్ అయినా ఆ పార్టీ నామినేషన్ సాధించలేక పోయాడు. డేమోక్రాటిక్ టికెట్ పొంది ముగ్గులో దిగాడు. ఓడిపోయాడు. కాని తల వంచుకో లేదు. ప్రత్యర్ధి కదలికలు గమనించటానికి రాహస్య ఏజెంట్‌లను ఏర్పాటు చేసి, అతని అవినీతి బాగోతం బయటపెట్టి, అతని రాజీనామాకు పట్టు బట్టాడు. కాని సాగలేదు. కొడితే ఏనుగు కుంభ స్థలమే కొట్టాలనుకొని ప్రెసిడెంట్ పదవికి పోటీ చేయాలనుకొన్నాడు. ఫోర్డ్ పత్రికలో "the next president of the United States will be a man who can read a blue print and who understands the problems of production and how to keep men employed" అని ప్రకటించు కొని బిల్డప్ ఇప్పించుకొన్నాడు. రాండాల్ఫ్ హార్స్ట్ పేపర్లు వెన్ను దన్నుగా నిలిచాయి. "ది లిటిల్ మాన్స్ లిటిల్ మాన్" అని ఆకాశానికి ఎత్తేశాయి. ఫోర్డ్‌ను ఏదో ఒక పార్టీ అభ్యర్ధిగా

నిలబెట్టకపోతే అయన స్వతంత్ర అభ్యర్థిగా నిలబడి గెలుస్తాడు అనే అభిప్రాయం వ్యాపింపజేశాయి. ప్రతివారూ ఫోర్డ్ వైపే ఉన్నారు. వ్యవసాయదారుల ట్రాక్టర్లు ఆయనవే. ప్రొహిబిషనిస్ట్లు, పెసిఫిస్ట్లూ, పని చేసేవారు అయన వైపే. ఫోర్డ్ కార్లు వాడేవారు దేశ జనాభాలో చాలా ఎక్కువ మందే ఉన్నారు. ఇలా మాంచి ఊపులో రాజకీయం నడుస్తుండగా ఫోర్డ్ అకస్మాత్తుగా తాను ప్రెసిడెంట్ పదవికి పోటీదారును కాదని, తన ఆలోచనను విరమించుకొంటున్నానని సంచలన ప్రకటన చేశాడు. ఫాక్టరీలో జరిగిన సంఘటనలు, ఆయనకు చరిత్రా సంస్కృతులపై నమ్మకం లేక పోవటం లేక అవి తెలియక పోవటం ఫోర్డ్ లోపాలని ఆయన "అవివేకి" అని "చికాగో ట్రిబ్యూన్" పత్రిక ఆరోపిస్తే ఫోర్డ్ దానిపై మిలియన్ డాలర్లకు డామేజ్ సూట్ వేశాడు. ఆ పత్రిక సాక్ష్యాలుగా బెనెడిక్ట్ ఆర్నాల్డ్ ఎవరో ఫోర్డ్కు తెలియదని, 1812 యుద్ధం రివల్యూషన్ అన్నాడని, ఆయన "history is bunk" అన్నాడని చూపాయి. ఫోర్డ్ కేసు గెలిచాడు. కానిప్రిస్టేజ్ డామేజ్ కింద ఆయనకు దక్కినది కేవలం "ఆరు పెన్నీలు" మాత్రమే అంటే కోర్టు "ఆయన పరువు విలువ 6 పెన్నీలు" అని అభిప్రాయ పడిందా? దీనితో అహం మరీ దెబ్బతిన్నది. ఉడికిపోయాడు. అవమానం పాలైనాడు. దీని నుంచి బయటపడటానికి తీవ్ర ప్రయత్నం చేశాడు. వర్తమాన క్రూర వాస్తవాన్ని గమనించాడు. గతాన్ని అర్థం చేసుకున్నాడు.

గతం తవ్వుకొన్నాడు. బాల్యపు స్మృతులు గుర్తు తెచ్చుకొన్నాడు. పాత నాగలి, కత్తి, కొడవలి చేతి శ్రమ, నెమ్మదిగా నడిచే పల్లె జీవితం జ్ఞాపక మొచ్చాయి. గ్రామ సీమలు కరెంట్ లేకుండా సరైన దారి సౌకర్యాలు లేక కునారిల్లుతున్నాయని గమనించాడు. మర్చి పోయిన కాలానికి చెందిన స్మృతి చిహ్నాలను సేకరించి భద్రపరచాడు. ఆ జ్ఞాపకాలన్నీ మళ్ళీ కళ్ళముందు ప్రదర్శించాడు. భవిష్యత్ తరాలకు స్ఫూర్తి కలిగించాడు. పాత కాలపు నాట్యాలను సంగీతాన్ని వెలుగులోకి తెచ్చాడు. ఫాక్టరీలో డాన్సింగ్ పార్టీలు ఏర్పరచి వాటి వివరాలను ముందుగానే బుక్లెట్లలో ముద్రించి తెలియజేసేవాడు. పాత తరం వయోలిన్ వాద్యకారులను కలిసి వారి సాయంతో అమెరికాలో ఉన్న పూర్వకాలపు వయోలిన్లన్నిటినీ సేకరించి భద్రపరచాడు. అందులో అమరాటి, స్ట్రాడివారి, గుర్నేరి మొదలైన ప్రసిద్ధులు తయారు చేసిన వయోలిన్లను కొన్నాడు. వాటికి అయిదు వేల డాలర్లు ఖర్చు చేశాడు. ఒక పెద్ద మ్యూజియం కట్టించి అందులో అన్నిరకాల వాహనాలను, ఈజిప్ట్ వారి చారియట్లు జపాన్ వారి జిన్ రిక్షాలు, వేలోసి పీడియోలు, సైకిళ్ళు, బగ్గీలు, బస్సులు, బాండ్ వాగన్లు, రైళ్ళు, ఇంజన్లు, ఆటోలు అన్నీ సేకరించి అందులో ఉంచాడు. ఫిలడెల్ఫియాలోని లాండ్ మార్క్ అయిన ఇండిపెండేన్స్

హాలు నమూనాను కట్టించాడు. ఇలాగే అమెరికాలో ఉన్న అన్నిరకాల విశేష కట్టడాల నమూనాలను కట్టించాడు. తన ముఖ్య స్నేహితుడు ఎలెక్ట్రిక్ బల్బ్ లిజెండ్ థామస్ ఆల్వా ఎడిసన్ మెన్లో పార్క్, న్యుజెర్సీలలో ఏర్పాటు చేసిన ప్రయోగాత్మక సంస్థలను తరలించి తన మ్యూజియంలో సురక్షితంగా ఉంచాడు. లాంగ్ ఫెలో కవితో అమరమై నిలిచిన వేసైడ్ ఇన్‌ను తలుపుల దగ్గరనుంచి అన్నిటినీ మార్చి సర్వాంగ సుందరం చేశాడు. మాసాచూసేట్స్ స్కూల్ హౌస్‌ను పునర్నిర్మించాడు. స్టీఫెన్ సి ఫాస్టర్ పుట్టిన చోటును ఒక రకమైన దేవాలయంగా మార్చాడు. పెన్సిల్వేనియాలో జన్మించిన మెక్ గఫీ కాబిన్‌ను తెచ్చి ఇక్కడ జాగ్రత్త చేశాడు. లింకన్ వాడిన ముతక కప్ బోర్డ్‌ను తెప్పించి మ్యూజియంలో ఉంచాడు. థియేటర్లో కాల్పుల్లో చనిపోయే ముందు లింకన్ కూర్చున్న కుర్చీని భద్రపరచాడు. ఫోర్డ్ సేకరణ దాహం తీరలేదు. తను చదివిన గ్రీన్ ఫీల్డ్ విలేజ్‌ని అందులోని 90 నిర్మాణాలను అందమైన కట్టడాలుగా మార్చి తన తీపి గుర్తులకు జ్ఞాపకాలుగా మలచాడు. ఆధునికత విస్తరించిన స్పీడ్ జీవితం కంటే ప్రశాంతమైన పాత రోజులే నయం అన్న విషయం రుజువు చేశాడు.

వర్తమాన భూతకాలాల వారధిగా ఉండాలనుకొని చేసిన ప్రయత్నాలు పూర్తికాలేదు ఫోర్డ్ జీవితంపై అనేక గ్రంథాలు వెలువడ్డాయి ఒక్కొక్కరిది ఒక్కొక్క దృక్పథం. "ది వైల్డ్ వీల్" అనే పేరుతొ గారేట్ గార్రేట్ రాశాడు. ఎనభైవ ఏట ఫోర్డ్ జ్ఞాపకశక్తి క్రమంగా క్షీణించింది. కాని బుర్ర పాదరసంగానే పని చేసింది. తను బలవంతంగా బయటికి నెట్టేసిన జీనియస్, ఆంతరంగికుడు ఉక్కు గుండె సూపరిండెంట్‌పై ఆధారపడిన వాడు సోరేస్మన్‌ను గురించి ఆలోచించి విచారించాడు. "let us go over and ask Charlie about this" అన్నాడు. 82లో ఫోర్డ్ రిటైర్ అయ్యాడు. రిటైర్‌మెంట్‌ను ఏర్పాటు చేశాడు. అతని రాక పోకలని జాగ్రత్తగా గమనించేవారు. కుటుంబ సభ్యులు కాకుండా బయటి వారెవరూ ఆయన్ను కలవకుండా జాగ్రత్త పడ్డారు. ఎనభై నాలుగవ ఏడు సమీపిస్తున్న సమయంలో 7-4-1947న మెదడులో రక్తనాళాలు తెగిపోవటం వలన ఫోర్డ్ మరణించాడు. రోగ్ నది రోగ్‌లాగా ఉచ్చ నీచాలు తెలియకుండా వరదలతో పోటెత్తి ఫోర్డ్ ఇంట్లో కరెంట్ పోయింది. ఇదే చివరి పారడాక్స్. యంత్ర శక్తికి ప్రతి రూపమై యంత్ర కాంతిని దశ దిశలా వెదజల్లిన ఫోర్డ్ తాను ఆనాడు చీకటి గదిలో పుట్టినట్లుగానే ఇప్పుడు అదే చీకటిలో మరణించాడు. ఇదే పారడాక్స్. అతని మరణంలో అక్కడ వెలిగింది మినుకు మినుకు మంటూ వెలిగే నూనె దీపం, కొన్ని వెలుగు తున్న కొవ్వొత్తులు మాత్రమే.❁




## 40. పోస్ట్ ఇంప్రెషనిస్ట్ పెయింటర్ హెన్రి డీ టోలోసే లాట్రే

(Henri de Toulouse -Lautrec) (1864-1901)

అంగవికల ఆరిస్టోక్రాట్, ఎప్పుడూ ఇంట్లోనే ఉంటూ, వెలివేయబడిన వారితో ఆటలతో, మార్పు చెందిన మాల్ ఫార్మేడ్ సొసైటీతో గడిపే హెన్రి డీ టోలోసే లాట్రే 24-11-1864న ఫ్రాన్స్‌లోని అల్బిలో పుట్టాడు. తండ్రి కౌంట్ ఆల్ఫాన్సే స్వంత కజిన్ ఎడిలేను పెళ్లి చేసుకొన్నాడు. తండ్రి ది విపరీత ధోరణి. ఒకతెల్ల ఆడ గుర్రాన్ని ఎక్కి పారిషియన్ పార్కులన్నీ చుడుతూ, దిగి దాని పాలు పిండుకొని తాగాడు. గర్విష్టి, తారుమారుగా మాట్లాడేవాడు. పల్లెటూర్లన్నీ తిరుగుతూ తనతోబాటు ఒక డేగ (హాక్)ను కూడా తీసుకు వెళ్లి దారిలో జంతువుల్ని చంపి దానికి ఆహారంగా పెడుతూ తిరిగాడు. గతంలోనే ఎప్పుడూ జీవిస్తూ రేసింగ్ ఇష్టపడుతూ, ఆధునిక ప్రపంచాన్ని ముఖ్యంగా మోడరన్ ఆర్ట్‌ను ఏవగించు కొంటూ గడిపాడు. దీనికి విరుద్ధమైనది అతని భార్య. ప్రశాంతంగా పవిత్ర హృదయంతో ఉండేది. మతసంబంధ జీవితాన్ని గడిపేది. బాగా చదువుకున్న సంస్కారం ఉన్న యువతి. సంస్కారాభివృద్ధి కోరుకొనే ఇల్లాలు. పెళ్లి అయిన తర్వాత చాలా ఏళ్ళు ఈ దంపతులు విడిగానే జీవించారు. తనకీ తన భార్యకీ మధ్య దగ్గర సంబంధం ఉండటం వలన రక్తాలు కలవక పోవటం వలన తన కొడుక్కి అంగ వైకల్యం వచ్చిందని నమ్మేవాడు కౌంట్. అందుకే భార్యను దూరంగా ఉంచాడు.

తల్లిలాగానే కొడుకు హెన్రి కూడా చాలా సున్నితంగా మంచి ప్రవర్తనతో ఉండి తల్లి అంటే అమిత ప్రేమ చూపేవాడు. ఒకే ఒక్క సోదరుడు పసితనంలోనే చనిపోయాడు. హెన్రి మూడవ ఏట క్రైస్తవంలో చేర్చే ఉత్సవంలో అక్కడ చర్చిలో ఉన్న పుస్తకంలో పెద్దవాళ్ళు సంతకాలు చేస్తుంటే తాను చేస్తానని మారాం చేశాడు. "నీకు చదువురాదు కదా రాయలేవు" అని అంటే "అదినాకు తెలుసు కాని ఒక ఎద్దు బొమ్మ గీయగలను" అని సమాధానం చెప్పాడు. అతని బాల్యం అలీబి కోటలోను పారిస్ లోను గడిచింది. పారిస్‌లో లిసీ కండోర్సెట్‌లో చదువుకు చేరాడు. బాగా చదివేవాడు. త్వరగా అన్నీ నేర్చేవాడు. స్నేహితులతో కలిసేవాడు బొమ్మలు బాగా వేసేవాడు. గుర్రాలు జంతువులను పరిశీలించి వాటి బొమ్మలను లెక్కలేనన్ని చిత్రించాడు. తన లాగే కొడుకు హార్స్

మాన్‌గా స్పోర్ట్స్ మాన్‌గా తయారవ్వాలని తండ్రి కోరిక.

11వ ఏట హెన్రి కోట లైబ్రరీలో పాలిష్డ్ నేలమీద పడిపోయాడు. దురదృష్టవశాత్తు తుంటి ఎముక విరిగింది. అది అతుక్కోవటానికి చాలా కాలం పట్టింది. క్రచెస్ సహాయంతో తల్లితో వాకింగ్ చేసేవాడు. మళ్ళీ అదృష్టం కలిసిరాక ఒక క్రచెస్ జారిపోయి వీధిలో పడిపోయి రెండో కాలి తుంటి ఎముకా విరిగింది. అప్పటికి 15ఏళ్ళు మాత్రమే. తర్వాత రెండేళ్ళు దేనికీ పనికి రాకుండా పోయాడు. ఇక తన కాళ్ళు సరికావని, తానిక నడవ లేనని కుంగిపోయాడు. కుంచించుకు ఉండిపోవాల్సి వచ్చింది. కాళ్ళు పెరగటం ఆగిపోయాయి. మిగతా శరీరభాగ మంతా పరిపక్వమైంది. మొండెం బాగానే పెరిగింది. తలమాత్రం మిగిలిన శరీరం కంటే ఎక్కువగా పెరిగింది. కాళ్ళు మాత్రం మరు గుజ్జు వైనాయి. యవ్వన ప్రాదుర్భావంలో సర్వాంగ సుందరంగా వికసించాల్సిన వాడు చాలా వికారంగా వికృతంగా అయ్యాడు. ముక్కు పెద్ద బల్బు లాతయారైంది. పెదిమలు బండగా ముతకగా బాగా ఎర్రగా అయ్యాయి. మూతి చిన్న నల్ల గడ్డంతో ఉండేది. ఎత్తు నాలుగు అడుగులకు కొద్దిగా ఎక్కువ. పెరిగిన వయసులో మొండెం, ఆ చిన్ని కాళ్ళమీద చూస్తుంటే చూడటానికి భయంకరంగా, అసహ్యాకరంగా ఉండేది పాపం. కాని కళ్ళు మాత్రం చాలా సున్నితంగా సుతి మెత్తగా ఉండేవి. ఆ కళ్ళలో ప్రేమ, స్నేహం ఉన్నా పెద్ద కళ్ళద్దాల వెనక అవి కనబడేవి కావు. ఎందరో అతని చిత్రాలు గీశారు కాని ఆయనే స్వయంగా వేసుకొన్న చిత్రంలో ఇవన్నీ స్పష్టం గా కనిపిస్తాయి. అతని వికారమైన తల, కోతిలాంటి సిమ్మేట్రి లేని ఆకారం అందులో ప్రస్ఫుటంగా చిత్రించుకొన్నాడు.

తండ్రి కౌంట్ కొడుకు హెన్రి వికృత రూపాన్ని భరించలేక పోయాడు. ఇదివరకంటే కొడుకు మీద ఎక్కువ ప్రేమ చూపిస్తూ మరింత సన్నిహితుడయ్యాడు. తల్లి ప్రేమకంటే తండ్రి ప్రేమ ఎక్కువైంది. తల్లి కొడుకుని త్వరగా స్కూలు విద్య పూర్తి చేసి ఆర్ట్ అధ్యయనం చేయమని సలహా ఇచ్చింది. అప్పటికే రినే ప్రిన్సిటా అనే ఫామిలీ ఫ్రెండ్ నుంచి హెన్రి కొన్ని సూచనలు పొందాడు. రినే రేసింగ్, వేట సీన్లు వేయటం లో సుప్రసిద్ధుడు. హెన్రిని బోనాట్ అనే చిత్రకారుని దగ్గర చేరి నేర్చుకోమని సలహా ఇచ్చాడు. సృజన లేని హెన్రి జీవితంలో ఏదీ గీయలేడని ఢంకా బజాయించి చెప్పాడు ఆయన. తర్వాత ఫెర్నాండ్ కార్మాన్ అనే పెయింటర్ దగ్గర చేరాడు. ఈయన గొప్ప క్రమశిక్షణ, ఓర్పు వున్నవాడు. ఈయన దగ్గరున్నప్పుడే ప్రముఖ చిత్రాకారుడు "వాన్ గో", మరికొంతమంది యువ ప్రయోగశీలురతో పరిచయమయింది. ఇక ఎవరి శిక్షణా లేకుండానే స్వయంగా ఎదిగాడు హెన్రి.

20 ఏళ్ళ వయసులో మాంట్ మార్టేలో నివసించాడు. ఇది పారిస్‌లో ఒక భాగం. ఇక్కడే ప్రముఖమైన పూటకూడు ఇళ్ళు, ఈతగాళ్ళు ఉండేవారు. ఇది సిటీకి

దూరంగానేకాక, చట్టానికీ దూరంగా ఉన్న ప్రాంతం. దీని వైవిధ్యం 1818 వరకు బాగా ప్రసిద్ధమైంది. లాటిన్ క్వార్టర్‌లలో ఉండే ఆర్టిస్ట్‌లు రచయితలూ ఇక్కడికొచ్చి స్థిరపడ్డారు. రాత్రి జీవితం ఒక వెలుగు వెలిగింది ఇక్కడ. "కాబెరేట్స్, ఆర్టిస్టిక్స్"గా పిలువబడే ఇక్కడ నైట్ క్లబ్బులు, డాన్స్ హాళ్ళు సాహిత్య జీవులకు ఆర్టిస్ట్‌లకు మోడల్స్‌కు సమావేశ స్థలాలైనాయి. మన ఆర్టిస్ట్‌కు ఇక్కడి నివాసులతో పరిచయమేర్పడింది. తల్లిని తానిక్కడ ఉండటానికి అనుమతికోరి దాదాపు ఇక్కడే ఉండిపోయాడు. స్నేహితుల అపార్ట్‌మెంట్‌లలో కలిసి ఉండేవాడు. ఒంటరిగా ఎప్పుడూ ఉండేవాడుకాదు. డీ మార్లిటన్ ప్రోప్రైటర్ అరిస్టైడ్ బ్రాంట్ అంటే మహా ఇష్టపడేవాడు. అతనికి చాలా చిత్రాలు వేశాడు. బ్రాంట్ గాయకుడు. బాలడ్స్ రాసేవాడు. అవి కూడా ఈ ప్రాంతంలో దగాపడిన మోసపోయిన వారి గురించి కవితలు రాసేవాడు. ఆతను హాస్యగాడు. పోకిరీ జనం అంటే ఇష్టం ఇక్కడున్న డాన్స్ హాల్స్‌తో బ్రోతల్ హౌసెస్‌తో హెన్రికి దోస్తీ బాగా కుదిరింది. డాన్స్ హాళ్ళలో తిండి, మందు, డాన్సులతో పాటు లభించేవి. అద్భుతమైన డాన్సులకు కేంద్రంగా ఉండేవి. ఎలిస్ మాంట్ మాత్రేలో ప్రొఫెషనల్స్ మాత్రమే చేసే డాన్సులు ఉండేవి. వీటిని చూడటానికి క్లబ్ పోషకులు వచ్చేవారు. అందులో ప్రఖ్యాతులందరి చిత్రాలు లాట్రేస్ ఆరాధనా భావంతో చిత్రించాడు. మరొక కేబరేట్ ప్రొప్రైటర్, దివాన్ జపనీస్ మేనేజర్ కవిత్వం అల్లేవాడు. ఇతనే హేన్రి కి. పాత జానపద గేయాలతో ప్రేక్షకుల్ని ఉద్రూత లూగించే గాయని యువేటి గిల్బర్ట్‌ను పరిచయం చేశాడు. ఆమె ఫీచర్స్‌కు మనవాడు ఫ్లాటయ్యాడు. ఒకసారి ఆమె మనవాడు వేసిన చిత్రాలను చూడటానికి వచ్చినప్పుడు ఆమె చిత్రం గీసేశాడు. ఆమెకు ఏదో ఉపద్రవం జరిగిపోయినట్లు ఫీలయి "నిజంగా మీరు వికలాంగులైనా పెయింటింగ్‌లో జీనియస్ అన్నది సహజమే" అన్నాడు.

శారీరక వక్రత హెన్రిలో విషాద వేదాంతాన్ని నింపింది. అతని పక్వ కళ కేబరేలలో ఇరుక్కు పోయిందన్నారు. మనిషిలోని ఉన్నతిని ఆతను వదిలేశాడు. అందుకే అది విషాదాన్ని వదిలేసింది. అతని కళ కుళ్ళిపోయిన శిధిలమైన వాటినే చిత్రించింది. ఈ ప్రదేశవాసుల జీవితాలను చిత్రించటంలో అతని భుక్తి గడిచింది. ఇందులో కొద్దిభాగమే గీశాడు. అందులోని అంతర్గత ప్రవాహాల జోలికి వెళ్ళలేదు. ఆతను స్నేహం, ఆప్యాయత కోరుకున్నాడు. అందుకే అసహజమైన వాటినే చిత్రించాడు. విదూషకులతో, సైకిల్ తొక్కేవాళ్ళతో, బల ప్రదర్శకులతో తిరిగి, వారినే గీశాడు. గుర్రపు పందెగాళ్ళను, డాన్సర్లను, ధైర్య సాహసవంతుల్ని చిత్రించలేదు. ఆశ్చర్యం కలిగించనివి, కోపం తెప్పించనివి అతనికి ఇష్టం. ఒక అందమైన జ్యూయేస్ అతనిపై సానుభూతితో దగ్గరై మిస్ట్రెస్ అయింది. కాని ఆడవాళ్ళు "ఈ లిటిల్ మాన్ స్టర్ పిల్ల రాక్షసుడును చూసి ఉలిక్కిపడి పారిపోయేవారు. అందుకే మనవాడి శృంగార చేష్టలన్నీ వ్యభిచారులతోనే.

వారితోనే తృప్తి తీర్చుకోనేవాడు. కనుక వాస్తవమైన ప్రేమ, పెళ్లి అతని జీవితంలో "ఔటాఫ్ క్వశ్చన్" అయింది. వారితోడిదే జీవితం ప్రేమా, ఆనందం తృప్తి సౌఖ్యం వారికి ఆతను స్నేహితుడైన ఆర్టిస్ట్. వారి నిరాశామయ జీవితాలకు అతడే వెలుగు. వారి చిత్రాలనే గీసి సంతోష పెట్టేవాడు. నెలకు రెండువారాలు వారాంగనల ఇళ్ళల్లోనే మకాం. అక్కడున్నప్పుడే అమితానందాన్ని పొందేవాడు. తనను కలుసుకోవాలనుకొన్న కన్జర్వేటివ్ ఫ్రెండ్స్‌ను అక్కడికే వచ్చి మాట్లాడమనే వాడు. వాళ్ళకు ఈ అడ్రస్‌లు కనుక్కోలేక తలప్రాణం తోక కొచ్చేది. తన సెట్టింగ్‌ల గురించి చెబుతూ "every where there is ugliness and every where ugliness has its beautiful aspects. It is thrilling to discover them where nobody has noticed their existence" అన్నాడు.

అతని స్టూడియోలన్నీ "ఎవరిగోల వారిది"గా రణ గొణ ధ్వనులతో, చిందర వందర పెయింటంగ్‌లతో ఉండేవి. ఆ ప్రాజెక్ట్‌లలో ఏమున్నాయో కూడా తెలీని స్థితి. ఒక సారి రూమ్ మారుస్తూ ఉన్న గదిలోనే 80 కేన్వాసులను గోడకు వదిలేసి వెళ్ళిపోయాడు. స్నేహితులకు అదిరిపోయే పార్టీలు ఇస్తూ "కంగారూ రోస్ట్" తినిపించేవాడు. ఎన్నోరకాల మద్యాలు పోసేవాడు తాగేవాడు తాగించేవాడు తినేవాడు తినిపించేవాడు. ఇరవై ముప్పై మధ్య వయసులో ఆతను తిరిగిన మ్యూజిక్ హాళ్ళు, రేసులు, సర్కసులు హాస్పిటల్స్ అందులో ముఖ్యంగా ఆపరేషన్ థియేటర్లు, కోర్ట్ రూములు బ్రోతల్ హౌసులు లెక్కలేనన్ని. వింత ప్రవర్తన ఉన్న వారందర్నీ చూసేవాడు. వెయ్యికి పైగా డ్రాయింగులు, లితోగ్రాఫులు పెయింటింగులు వేశాడు. క్షణ జీవితానికి ఇష్టపడేవాడు. భవిష్యత్తు గూర్చి ఆలోచన ఉండేదికాదు. సాంగ్ షీట్స్ గణాంకాలు, ప్రకటనలు, థియేటర్ ప్రోగ్రాములు ప్రదర్శన అట్టలు (ప్లేకార్డ్) బొమ్మలు వాణిజ్య స్కెచ్‌లు అన్నీ తయారు చేసిచ్చేవాడు. తన తల్లిలోని "అమ్మతనం"పై అద్భుతమైన లోతైన అవగాహనతో చిత్రాన్ని గీశాడు. వాన్ గో, ఆస్కార్ వైల్డ్ చిత్రాలు గీశాడు. నిరంతర యాత్రాశీలి. ఇంగ్లాండ్ హాలండ్ స్పెయిన్ బెల్జియం దేశాలు తిరిగాడు. అక్కడ తన అభిమాన చిత్రకారుడు వాన్ గోను గేలి చేసినవాడితో దాదాపు ద్వంద్వ యుద్ధం చేశాడు. ఫ్రాన్స్ సముద్ర తీరాన్ని చుట్టాడు. దాని అందాలను చిత్రాలలో బంధించలేదు. కాని స్థానిక బార్ మెయిడ్స్ పెయింటింగ్‌లను కొని తెచ్చుకొన్నాడు. హెన్రి ప్రపంచం మాంట్ మాత్రే ఒక్కటే. ఇక్కడ స్వంత ఇంటి ఆనందాన్ని అనుభవించాడు.

చాలా ఏళ్ళ బట్టి తాగుడు బాగా అలవాటైంది. ఇరవయ్యవ ఏడుదాటే దాకా మద్యం ఒక మందు అని అనుకోలేదు. 33 ఏళ్ళకు బాగా అలవాటు పడ్డాడు. విపరీతమైన తాగుడు, విరామం లేని శ్రమతో 1899లో ఆరోగ్యం దెబ్బతింది. తల్లి కోరికపై న్యూలిలోని శానిటోరియం నర్సింగ్ హోమ్‌లో చేర్చారు. ఆల్కహాలకు దూరమవటంతో ఆరోగ్యం

బాగైంది. తిరిగి వెళ్లి మళ్ళీ బాటిల్ ఎత్తితే కొంప కోల్లేరని హాస్పిటల్ సిబ్బంది హెచ్చరించారు. అందుకే వాకింగ్‌కు వెళ్ళినా మనిషిని తోడుగా పంపేవారు. అది చాలా అసంబద్ధం అనిపించింది. అటెండర్‌ను మంచి చేసుకొని అతనితో బార్ కెళ్ళి వాడికి పూటుగా పోయించి తానూ సేవించి శానిటోరియం చేరేవాడు రహస్యంగా. విశ్రాంతి దొరకటంతో "సర్కస్" అనే కొత్త సీరియల్ చిత్రాలు గీయటం ప్రారంభించాడు. మానసికంగా బాగానే ఉన్నాడని భావించి డాక్టర్లు రిలీజ్ చేశారు. మొదట్లో కొంచెం తగ్గి ఉన్నా మళ్ళీ డ్రింకింగ్ లో విజృంభిం చాడు. 1901లో పక్షవాతం వచ్చింది. తల్లి వచ్చి తమ మల్రోం కోటకు తీసుకు వెళ్ళింది. జబ్బు తీవ్రమై 37 ఏళ్ళకే 9-11-1901న చిత్రకారుడు డీ టోలోసే లాట్రేస్ చనిపోయాడు.

ఒకప్పుడు లాట్రేస్ కదిలే వస్తువులంటే ఆసక్తి చూపాడు. ఆడ మగ జంతువుల నడకలు బాగా గీశాడు. ఆసక్తి కలిగించని ప్రకృతిని ఇష్టపడేవాడు కాదు. పూలు, పళ్ళ అమరిక కన్యలకే కాని మగాళ్ళకు కాదనే వాడు. ప్రతిదానిలో వేగంతో కూడిన దృశ్యం గోచరించాలన్నాడు, లాండ్ స్కేప్‌లంటే అయిష్టం. "land sccape is nothing and should remain nothing but an accessary --the painter ofpure land scape is an idiot" అని అభిప్రాయ పడ్డాడు. చిత్రం యొక్క వ్యక్తిత్వాన్ని ఇంకా స్పష్ట పరచాలంటేనే లాండ్ స్కేప్ కావాలన్నాడు. చిత్రకారుడు ఫోర్లైన్ దగ్గర కొద్ది స్ట్రోకులతో కేరెక్టర్ ఎలా చూపచ్చో నేర్చాడు. ఫోర్లైన్ మనుషుల తప్పుల్ని చర్మం వొలిచినట్లు వొలిచి చూపేవాడు. కాని లాట్రేస్ వారిలోని వైపరీత్యాలను, విషాద, అసంగతాలను గీశాడు. అతని టెక్నిక్ జపనీస్ ప్రింట్‌ను తలపుకు తెస్తుంది. ముఖ్యంగా వాటిలో ఉండే అసమతుల్యమైన రంగులకలయిక కన్పిస్తుంది. అతనికి "their spatial diagnols, broad flat areas of color strong silhouttes cutting off a figure withseeming arbitrarines, but actually with sharp discrimination and great effect" బాగా ఇష్టం.

హెన్రి గీసినవన్నీ సుమారు 15 ఏళ్ళకాలంలో గీసినవే. బతికి ఉండగా ఒక్క పేయింటింగ్ అమ్మితే ఒట్టు. తనవి, ఇతరులవి చిత్రాలు చాలా వేశాడు. అతని శరీరం బలహీనమైనదే కాని మైండ్ చాలా బలమైనది అన్నారు విశ్లేషకులు. అడ్వర్టైజింగ్ ఆర్ట్‌కు, పోస్టర్‌కు రూపం, డిగ్నిటి తెచ్చిన వాడు లాట్రేస్ ఒక్కడే. మోడరన్ ఇలస్ట్రేషన్లు అన్నీ ఆయన కళనుండి ఏర్పడినవే. అతని ప్రతిభను గురించి మెక్ అనే విశ్లేషకుడు వివరిస్తూ "Henri succeeded in raising design to the level of a fine art. He allowed no distinction, no snobbish arbitrary barriers between commercial and pure art" అన్నాడు. వాణిజ్య కళకు అసలు కళకు ఉన్న విభజన రేఖను చెరిపేసిన గొప్ప కళాకారుడు హెన్రి. అతను మోరలిస్టూ కాదు,

మనుష్య ద్వేషికాదు. అతనొక సాక్షి మాత్రమే. ద్వేషం, భయం లేకుండా మాట్లాడతానని ప్రతిజ్ఞ చేసి నిలబెట్టుకొన్నవాడు.సమాజాన్ని లెక్క చేయలేదు. కాని ప్రతివ్యక్తిని విపరీతంగా తాపీగా, నెమ్మదిగా అధ్యయనం చేశాడు. ఆసక్తి తగ్గకుండా మనుష్యులను పరీక్ష చేశాడు. వారి విషయమై ముందే అభిప్రాయాలు ఏర్పరచుకోకుండా ఆలోచించాడు. స్వర్గం కాక నరకం కాక మధ్యస్తంగా ఉన్న ప్రదేశాలలో ఉన్న మనుషులే ఆయనకు కావాలి. వారి గురించే ఆలోచించి వారినే చిత్రించాడు. అందుకే అతని గీత సూటిగా సాగింది. తీక్షణంగా, నిరలంకృతంగా నగ్నంగా ఉంది. ఒక పర్య వేక్షకుడిగా బాధ, విసుగుల నుండి మానవత తప్పించుకోవటం అతని కేమీ ఆశ్చర్యం కలిగించ లేదు. అతని మోడల్స్ అందరూ డాన్సర్లు, డ్రింకర్లు, క్లౌన్లు, ఆనందాన్ని వెతుక్కొనే అమ్మాయిలూ. అతని చిత్రణలో ఆనందం లేదు రంగు లేదు. ఆతను చిత్రించిన డాన్సర్లు గంభీరంగా, క్లౌన్లు అలసిపోయినట్లుగా, డ్రింకర్లు డల్‌గా వ్యభిచారులు దారుణంగా ఉంటారు. కాని వాటిలో మానసిక అంతర్ ద్రుష్టి చాలా అగాధమైనదిగా కనిపిస్తుంది. వాటిని సృష్టించిన సృజనకారుడు, ఆచిత్రాలూ కూడా సంతోషానికి, నీచ దౌర్భాగ్య స్థితికి అతీతంగా కనిపిస్తారు. అతని గురించి క్లుప్తంగా చెప్పాలంటే "the art of Touslouse Lautrec is the art of an intense observer who does not render verdicts but whose reports are clear un critically candid, and not without compassion" అని చెప్పవచ్చు.

లాట్రేస్ జీవితంపై సినిమాలు నాటకాలు వచ్చాయి. మొత్తం మీద 737 కాన్వాసులు, 275వాటర్ కలర్లు, 363 ప్రింట్లు, పోస్టర్లు, 5084 డ్రాయింగులు, గ్లాసు పింగాణీ వస్తువులపై కళాత్మకాలు ఇంకా లెక్కకు రానివెన్నో గీసి ఈ వామన చిత్రకారుడు కళా విశ్వరూపం చూపించాడు. మేనట్, డేగాస్ అనే ఇద్దరు ఇంప్రెషనిస్ట్ చిత్రకారులకు రుణపడి ఉన్నాడు. అతని శైలిపై ప్రభావం చూపింది జాపనీస్ వుడ్ ప్రింట్లు. అవే అప్పుడు పారిస్‌లో బాగా చలామణిలో ఉండేవి. వ్యక్తులు పని చేసే పరిసరాలను రంగులతో కదలికలను రాత్రి జీవితాన్ని గీశాడు. గ్లామర్‌కు ప్రాధాన్యం లేదు. గుంపులో గోవిందలాగా ఉండక ప్రత్యేకంగా చూపటం అతని ప్రతిభ. సిలౌటీలను చిత్రించటంలో మార్గదర్శి. పొడవైన పలుచని బ్రష్ స్ట్రోకులతో కావాల్సిన ఫలితాన్ని రాబడతాడు. అతని ఆర్ట్ వర్క్ అంతా కలర్ పెయింట్‌లో డ్రాయింగ్‌లే అనిపిస్తాయి.❁



## 41. ఐరిష్ సాహిత్య పునరుద్ధరణ చేసిన - విలియం బట్లర్ యేట్స్ (1865-1939)

"కవులు గుర్తింపబడని ప్రపంచ శాసన సభ్యులు" అన్నాడు షెల్లీ కవి. ఆమాటను నిజం చేశాడు అక్షరాలా యేట్స్ కవి. అయన కవి, కవితా నాటకకర్త, స్వతంత్ర ఐర్లాండ్ దేశానికి సెనేటర్‌గా 1922 నుండి 1928 వరకు సేవ చేశాడు. ఇలా షెల్లీ మాట నిజం చేశాడు.

విలియం బట్లర్ యేట్స్ ఐర్లాండ్‌లో డబ్లిన్ దగ్గర సాండి మౌంట్‌లో 13-6-1865లో ప్రొటెస్టెంట్ కుటుంబంలో జన్మించాడు. తాత ముత్తాతలు ఆంగ్లికన్ మినిస్టర్లుగా పని చేశారు. తండ్రి జాన్ ప్రముఖ ఆర్టిస్ట్, సోదరుడు జాక్ ప్రసిద్ధ చిత్రకారుడు. వీరిద్దరి ప్రభావం విలియంపైన ఉంది. 19వ ఏట డబ్లిన్‌లోని మెట్రోపాలిటన్ ఆర్ట్ స్కూల్‌లో చేరాడు. చిత్రకారుడు టర్నర్ దగ్గర పని చేసి కొంత నేర్చినా దృష్టి రచన మీదే ఉండేది. చివరికి తన భావ వ్యక్తీకరణకు బ్రష్ కంటే పెన్ను బాగా సహకరిస్తుందని నిశ్చయించుకొని రాతకే మొగ్గు చూపాడు.

విలియం యవ్వనం ఇంగ్లాండ్-ఐర్లాండ్ మధ్యనే గడిచింది. పదకొండేళ్ళ వయసులో లండన్ దగ్గరున్న హామర్ స్మిత్‌లోని గోడాల్ఫిన్ స్కూల్‌లో చేరాడు. కాని తన దేశంలో తనకిష్టమైన స్లిగోకు తిరిగి వెళ్లాలని కోరుకున్నాడు. జీవితంలో ఎక్కువ భాగం స్వదేశానికి దూరంగా గడిపినప్పటికీ మాతృదేశం ఐర్లాండ్‌పై ఎప్పుడూ మక్కువతో ఉండేవాడు. 22 వయసులో లండన్ వెళ్ళాడు. అక్కడ ఎర్నెస్ట్ రైస్ తో కలిసి "రైమర్స్ క్లబ్" స్థాపించాడు. ఇది ఫ్రీ రాల్ఫ్ వైట్‌ల భౌతిక భావ వ్యాప్తికి అడ్డు కట్ట వేసి, ధార్మిక భావ వ్యాప్తికోసమే ఏర్పాటు చేయబడింది. ఈ వయసులో బక్కగా పలుచగా ఎత్తుగా ఉండేవాడు. ముఖం చిన్నదిగా, మిరుమిట్లు గొలిపే కళ్ళతో ఉండేవాడు.

శీతాకాలంలో ఈ క్లబ్‌కు వచ్చి మేధో సదస్సులలో పాల్గోటమే కాక వెచ్చదనాన్నీ పొందేవాడు విలియం. గుర్రం మీద డబ్లిన్ నుండి లండన్‌కు వెళ్ళటానికి చేతిలో డబ్బులు లేక అనేకసార్లు నడిచి వెళ్ళే వాడినని ఆయనే చెప్పుకొన్నాడు. మధ్యాహ్నం "టీ"కి ఎవరో స్నేహితుల మీద ఆధార పడేవాడు. వీలయితే వారి ఆతిధ్యం పొంది

భోజనం చేసేవాడు.  ఇంకే విధమైన పోషకాహారం తీసుకొనే ఆర్థికస్థితి లేనివాడిగా గడిపాడు.  ఆస్తికతను ఒక జీవిత విధానంగా అలవరచుకొన్నాడు. యవ్వనదశలో హక్సిలీ, తిండాల్‌ల మెటీరియలిజం అంటే ఇష్టపడేవాడు కాదు.  తన స్వీయ జీవిత చరిత్రలో "నేను కవిత్వ విధానం అనే ఒక కొత్త మతాన్ని కనిపెట్టాను.  అనేక తరాలుగా కవులు కళాకారులు తత్వవేత్తలు అందించిన విజ్ఞాన రహస్యాలను చిన్న కథలుగా చెప్పాను. ఈ భావ వ్యాప్తికోసం ఒక ప్రపంచం నిర్మించాలనుకొన్నాను" అని రాసుకొన్నాడు.

యేట్స్ కొత్త మత అన్వేషణలో సగం అభూతకల్పన, సగం మాజిక్ ఉన్నాయి. అందుకని థియసాఫిస్ట్‌లకు దగ్గరయ్యాడు.  1887లో రష్యా దేశపు మార్మికవేత్త మేడం బ్లావట్ స్కి శిష్యుడైనాడు.  ఆమె చేసేదంతా అభూత కల్పన అని రుజువైనా యేట్స్‌కు ఆమెపై విశ్వాసం తగ్గలేదు.  పుష్పాలలో దెయ్యాలని ఆహ్వానించటం, తలక్రింద ప్రత్యేక దిండులను ఏర్పరచి కలలు కనమని చెప్పి వాటి అర్థాలను వివరించేవాడు.  ఈ జబ్బును తోటి క్లబ్ సభ్యులకూ అంటించాడు.  పంచేంద్రియాలకు అతీతమైనదేదో ఉందని చెప్పేవాడు.  మెటీరియలిజానికి వ్యతిరేకంగా ఈ పని చేస్తున్నాడు.  అద్భుత కథలన్నిటినీ నమ్మింప జేసేవాడు.  చిన్ననాటి జానపద కథలనూ వండి వడ్డించేవాడు. ఇవన్నీ తన జీవితంలో కన్న కలలే అనేవాడు.

సహజంగా సిగ్గుపడే విలియం హృదయం ఆత్మస్పర్శకు, ఈ కల్పిత కథలకు మధ్య విలవిలలాడింది కొంతకాలం.  దేనికి సమాధానం చెప్పాలో అర్థం కాలేదు.  ఈ ద్వంద్వాలలో ఊగిసలాడాడు.  తన కాలంలో పెరుగిపోతున్న మెటీరియలిజానికి బ్రేకులు వేయటమే యేట్స్ ఉద్దేశ్యం.  ఈ ఊహా ప్రపంచమే లేకపోతే తానేదీ రాయగలిగి ఉండేవాడిని కానన్నాడు.  "సెల్టిక్ రివైవల్" ఉద్యమం వచ్చేసరికి విలియంలో స్పిరిటిజంతో బాటు జాతీయతా భావం కలిసి పోయాయి.  ఐర్లాండ్‌లో రెండు మహా ఉద్యమాలు మొలకెత్తాయి.  అందులో 1893లో ఐరిష్ ప్రాచీన సాహిత్యాధ్యయనం పునరుద్ధరించాలని, గేలిక్‌ను జాతీయ భాషగా చేయాలని  ప్రారంభమైన "గేలిక్ లీగ్" ఉద్యమం, తర్వాత కొన్నేళ్ళకు మెరుగైన వ్యవసాయం, వర్తక వాణిజ్యం, మెరుగైన జీవితం కోసం, మొదలైన "సహకార ఉద్యమం".  ఈ రెండు ఉద్యమాలు ఐరిష్ జాతీయ సంస్కృతీ వికసనం కోసమే ఏర్పడ్డాయి.

ఈ ఉద్యమాలలో ఐరిష్ కవులు, జానపద గేయ కర్తలు కళాకారులు, విద్యావేత్తలు, ఆర్థిక సామాజికవేత్తలు, వ్యవసాయదారులు నిపుణులు అందరూ చేయి చేయి కలిపి పని చేశారు.  జార్జి రసెల్ "ఏ యి" అనే మారుపేరుతో కవిత్వం రాసి ప్రేరణ కలిగించాడు. ఈ మహోద్యమాలలో తానూ మమేకమయ్యాడు యేట్స్.  ఉద్యమాలు తీవ్ర రూపందాల్చి తీవ్రవాదమైంది.  ఉద్యమాన్ని అణచి వేసే ప్రయత్నాలూ తీవ్రంగా సాగాయి.  తిరుగుబాటు ప్రతిచోటా తీవ్రమైనది.  కొద్దిమందితో ప్రారంభమైన ఉద్యమం దేశమంతా ప్రాకింది. ఐరిష్ పునరుద్ధానం విప్లవంతో ముగిసింది.  కవుల రక్త తర్పణంతో "ఐర్" ఏర్పడింది.

గేలిక్ లీగ్ సంస్థాపకుడు, కవి డగ్లాస్ హైడ్ ఐర్లాండ్‌కు మొట్టమొదటి ప్రెసిడెంట్ అయ్యాడు.

ఐరిష్ సాహిత్యం థియేటర్‌లోనూ మార్పు తెచ్చింది. దీనిలో యేట్స్ ప్రవేశించి, లీనమై చలనం తెచ్చాడు. బౌద్ధిక ఉద్యమంలో చురుకుగా పని చేసిన మాడీగానే అనే అమ్మాయిని యేట్స్ ప్రేమించాడు. ఆమెనే దృష్టిలో పెట్టుకొని నాటకాలు రాశాడు. అంతరార్ధ నాటకాలు రాసి ప్రఖ్యాతి చెందాడు. క్రమంగా ఐరిష్ కవులలో మార్గదర్శి అనిపించుకున్నాడు. పారిస్‌లో జే.ఏం .సిన్జ్ అనే నాటక రచయితను కలిసి “ఆరన్” అనే ఆదిమ జాతి ప్రదేశానికి, ఆ ప్రజల మధ్యకు తిరిగి రమ్మని పిలిచాడు. బైబిల్‌ను వారి భాషలోకి అనువాదం చేయించాడు ఆయనతో. ఐరిష్ జాతీయాలను పలుకు బడులను అందులో చొప్పించి రాయించాడు.

కవిత్వాన్నే మాధ్యమంగా ఎంచుకొని విలువైన, ముందు చూపున్న కవిత్వం రాశాడు. ముప్ఫై ఏళ్ళు వచ్చేసరికి ఆరు కవితా సంపుటాలు రాసి ప్రచురించాడు. పుస్తకాలు స్లిమ్‌గా వున్నా అందులోని కవితాసారం బలమైనదిగా ఉంది. కొన్ని ప్రతీకలకు మాత్రమే పరిమితమైనాడు. “sentimentality is deceiving one;s self, rhetoric is deceiving other people” అనేది యేట్స్ అభిప్రాయం. 34 వయసులో “దివిండ్ అమాంగ్ ది రీడ్స్” ప్రచురించాడు. ఇందులోనూ ఏదో “ట్రాన్స్ ”లో ఉండి రాసినట్లు అనిపిస్తుంది కవిత్వం.

“All things uncomely and broken, all things worn out and old --the cry of a child by the road way, the creeak of a lumbering cart --the heavy steps of the ploughman, splashing the wintry mold --are wronging your image that blossoms a rose in the deeps of my heart”

ఇంకా మానవాతీత శక్తి ప్రభావాన్నే వివరిస్తున్నాడు. తన జీవిత కథను “ది సాంగ్ ఆఫ్ వాండ రింగ్ ఏగ్నెస్” అనే సంగీత నాటికలో రాసుకున్నాడు.

“I went out to the hazel wood --because a fire was in my mind --and cut and peeled a hezel wand --and hooked a berry to a thread --and when white moths were on the wing --and moth like stars were flickering out --I dropped the berry in a stream --and caught a little silver trout”

నలభైలలో ప్రచురించిన “రేస్పాన్సి బిలిటీస్”, “ది వైల్డ్ స్వాన్ ఎట్ కూలే” కవితల్లో మార్పు కొట్టొచ్చినట్లు కన్పించింది. ప్రభావ శీలమైన కవిత్వం జాలువారింది. విషయానికి పరిమితమై రాశాడు. ఈ మార్పును స్వయంగా “లేబిరింత్ ఆఫ్ ఇమేజెస్”లో చెప్పుకొన్నాడు–

“I made my song a coat --coveredwith embroideries-out of old

mythologies --from heel to throat" అని యదార్థం ఒప్పుకున్నాడు. మానసిక సత్యమేకాక ఆధ్యాత్మిక నమ్మకం కావాలనుకొన్నాడు.

దెయ్యాలు లేక శక్తులు లేక స్పిరిట్స్‌ను ఆహ్వానించి వారినే "కమ్యూని కేటర్"లుగా భావించి యేట్స్ భార్యాభర్తలు ఎన్నో రాయించారు. ఇవన్నీ కలిపి "ది విజన్" పేర 52వ ఏట విడుదల చేశాడు. దీని రెండవ భాగం ప్రచురించే నాటికి యేట్స్ సమాజంలో మహా గౌరవనీయ వ్యక్తి అయ్యాడు. ఐరిష్ ఫ్రీ స్టేట్‌కు ఆరేళ్ళు సెనేటర్‌గా సేవలందించాడు. ఆయన అనుసరిస్తున్న గోప్యత (ఈసోటేరిక్) వలన రాజకీయాలకు, కవిత్వానికి ఏ ఇబ్బందీ కలగలేదు. పైగా బాగా కలిసొచ్చింది కూడా. 1923లో సాహిత్యంలో యేట్స్ నోబెల్ బహుమతి పొందాడు. ఆయన ఒక ప్రపంచానికి మాత్రమే పౌరుడు కాదు. రెండు ప్రపంచాల పౌరుడు. అవి ఒకటి కనిపించే ప్రపంచం ఒకటి మనకు కనిపించని ఆయనే చూడగలిగే మార్మిక ప్రపంచం. యాభై- అరవై మధ్య వయసులో రాసిన కవిత్వం అత్యంత విలువైనది అవసరమైనది మార్గదర్శకమైనదిగా ఉంది. అంతకు పూర్వంలేని సాధికారత కవిత్వంపై సాధించాడిప్పుడు. కనిపించని దయ్యాలు ఫైరీ టేల్స్, పుక్కిటి పురాణాలు వదిలేసి ప్రజలు తక్షణ సమస్యలపై స్పందించి రాశాడు. మొదట్లో ప్రీ రాఫల్లై ట్‌గా ఉన్నప్పుడు తన ముఖాన్ని అంతులేని తారా సమూహంలో దాచుకొన్నాడు. ఇప్పుడు మానవ రక్త సంబంధంతో అమితానందం పొందుతున్నాడు. ఈ స్థితిని చెప్పుకొంటూ "I am content to follow to its source every event in action or in thought".

"ఎ డైలాగ్ ఆఫ్ సెల్ఫ్ అండ్ సోల్" కవితలో తన్ను తాను ఆవిష్కరించుకొన్నాడు - "When such as I cast out remorse --so great a sweetness flows into the breast we must laugh and we must sing --we are blest by every thing --every thing we look uponis blest" సాంస్కృతిక జాగృతిని తన మాతృదేశం ఐర్ లాండ్‌కు ఇచ్చిన ఘనత యేట్స్ కవి ది. "Romantic ireland, dead and gone --it is with O, Leary in the grave" అని చెప్పాడు. మర్యాద, మన్నన గౌరవం తన దేశంలో మంటగలిసి పోయినందుకు వ్యథ చెందాడు. కోపం ద్వేషం అసహనం అందలం ఎక్కినందుకు బాధపడ్డాడు. అందుకే కవిత్వంలో హెచ్చరిక జారీచేశాడు–

"you thinkit horrible that lust and rage-should dance attendance upon my old age --they were not such a plague when I was young --what else have I to spur me into song?" అని ప్రశ్నించాడు. ఇప్పటిదాకా ఉన్న ఊహా ప్రపంచం కుప్ప కూలిపోయింది. వాస్తవం బోధపడింది. ఐర్లాండ్‌కు దూరంగా రపల్లో అనే చిన్న పట్నం ఇటాలియన్ రివేరాలో ఉన్నాడు. ఇది దక్షిణ ఫ్రాన్స్‌లో ఉంది. యూరప్ పర్యటన చేశాడు. అక్కడి విలువల పతనాన్ని సహించలేక

పోయాడు. "things fall apart --centre can not hold" అని ఆవేదన చెందాడు. మెరుపులతో "సెకండ్ కమింగ్" రాసి విభ్రాంతి కలిగించాడు.

చనిపోయే దాకా యేట్స్ రాస్తూనే ఉన్నాడు. ఆయన చివరి ముఖ్య రచన "బైజాంటియం". ఇందులో కవితా ప్రతిభ అంతా ప్రదర్శించాడు. కవిత్వారంభం ఎలా ఉండాలో మచ్చుకి చూపించాడు. ఇమేజెస్ ఎలా వాడాలో అత్యద్భుతంగా వాడి చూపాడు. 70వ ఏట శారీరకంగా బలహీనుడయ్యాడు, శ్వాసపీల్చటం కష్టమయ్యేది. బాధలు ఎక్కువయ్యాయి. తానిక బతకటం కంటే చావటమే నయం అని భార్యకు చెప్పుకొన్నాడు. 1938 చివర్లో చలి ఎక్కువగా లేకపోయినా చలికి తట్టుకోలేక పోయాడు. జనవరిలో తీవ్రంగా గుండె జబ్బు వచ్చింది. కోమాలో ఉన్నాడు. చివరికి గుండె ఆగి 28-1-1939న 74వ ఏట ఈ ఐరిష్ స్వాతంత్ర యోధుడు మహాకవి సెనేటర్ యేట్స్ మరణించాడు.

యేట్స్ మరణానంతరం ఆయన జీవిత చరిత్రలు చాలా వచ్చాయి. ఆయన సింబాలిజంపై అనేక వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. ప్రముఖ విమర్శకుల చేత రాయించిన ఇరవైనాలుగు వ్యాసాలను "దిపెర్మనెన్స్ ఆఫ్ యేట్స్" పేరిట వెలువడింది. జాన్ కరో రామ్సన్ "యేట్స్ అండ్ హిస్ సింబల్స్" పుస్తకం రాశాడు. ఆయన కవిత్వం ఇంకా ప్రభావితం చేస్తూనే ఉంది. యువకవులపై యేట్స్ ప్రభావం అనంతం. సమకాలీన కవిత్వాన్ని తన స్వంత శైలి, గాఢత్వాలతో పరిపుష్టి చేశాడు. ఏది రాసినా మహోన్నత భావంతో చెప్పి మెప్పించిన కవి యేట్స్.

నిప్పులు కురిపించే కవిత్వం రాసిన అమెరికన్ కవి ఎజ్రా పౌండ్ కు యేట్స్ సన్నిహితుడు. రవీంద్రుని ఆంగ్ల గీతాంజలికి యేట్స్ ముందుమాట రాశాడు. ఇంగ్లాండ్ కవులు స్పెన్సర్ షెల్లీ ప్రీ రాఫెలైట్స్‌ల ప్రభావం ఉన్నవాడు. పోను పోను వాస్తవానికి చాలా దగ్గరగా భౌతికపరంగా రాశాడు.

1899లో యేట్స్ దంపతులు మిత్ర బృందం తోకలిసి "ఐరిష్ లిటరరీ దియేటర్" స్థాపించారు. "We hope to find in Ireland an uncorrupted & imaginative audience trained to listen by its passion for oratory ... & that freedom to experiment which is not found in the theatres of England, & without which no new movement in art or literature can succeed. [51] అని దీని మేనిఫెస్టో రాశాడు యేట్స్. రెండేళ్ళ తర్వాత ఇది మూతపడింది. 1909లో లండన్‌లో అమెరికన్ కవి ఎజ్రా పౌండ్‌ను కలిశాడు అప్పటినుండి వారి స్నేహం చివరివరకు ఉంది.

నోబెల్ ప్రైజ్‌ను స్వీకరిస్తూ యేట్స్ కవి "I consider that this honour has come to me less as an individual than as a representative of Irish literature, it is part of Europe' welcome to the Free State' "[66]"

అని తన మనోభావాన్ని తెలియ జేశాడు. స్వతంత్ర ఐర్లాండ్ దేశం ఏర్పడిన తర్వాత మైనారిటీ ప్రొటెస్టెంట్‌లకు మెజారిటీ కేథలిక్కులకు మధ్య విద్వేషాలు పెరిగాయి. దీనికి సమాధానంగా సెనేట్‌లోనూ బయటా యేట్స్ అద్భుత ప్రసంగాలు చేసి చారిత్రాత్మక ప్రాముఖ్యాన్ని సాధించాడు ఆయన మాటలలోనే – "quixotically impressive" ambitions of the government and clergy, likening their campaign tactics to those of "medieval Spain" [71] "Marriage is not to us a Sacrament, but, upon the other hand, the love of a man and woman, and the inseparable physical desire, are sacred. This conviction has come to us through ancient philosophy and modern literature, and it seems to us a most sacrilegious thing to persuade two people who hate each other ... to live together, and it is to us no remedy to permit them to part if neither can re-marry" [71] ఇది ఆయన సాధించిన అద్భుత విజయం .

తన సమాధి మీద తన కిష్టమైన తన కవితా పంక్తులను చెక్కించే ఏర్పాటు చేశాడు –

Cast a cold Eye
On Life, on Death.
Horseman, pass by!.

ఇరవయ్యవ శతాబ్దపు ప్రముఖ కవులలో యేట్స్ అతి ముఖ్యకవి. "సింబలిస్ట్ పోయేట్"గా గుర్తింప బడ్డాడు. ప్రతి పదానికి పైకి కనిపించే అర్ధం కంటే లోపలి అంతరార్ధాలను ఆవిష్కరిస్తూ కవిత్వం రాయటం యేట్స్ ప్రత్యేకత. ఫ్రీ వెర్స్‌తో కదను తొక్కుతూ ఆధునిక కవులు ఉంటే సాంప్రదాయ బద్ధమైన కవిత్వంతో జిగేల్ మనిపించాడు. మొదట్లో ఐరిష్ మిత్ అండ్ ఫోక్ లోర్ ప్రభావంతో రాసినా తర్వాత జనంతో మమేకమై రాశాడు. కొందరు విమర్శకుల దృష్టిలో యేట్స్ 19వ 20వ శతాబ్దాల కవిత్వ వారధి. హిందూ దియసాఫికల్ భావాలను మంత్రాలు తంత్రాలను నమ్మినవాడు "డ్రీమర్ ఆఫ్ డ్రీమ్స్"అంటారు ఆయనను. జార్జి మూర్‌పై ప్రభావం చూపాడు. బెర్నార్డ్ షాను తన "జాన్ బుల్" అనే నాటకానికి పని చేయించాడు. నాటక ప్రయోగాలతో మాంచెస్టర్ ప్లేయర్స్‌ను ఆకర్షించాడు. అమెరికా, యూరప్‌లలో చిన్న థియేటర్ నిర్మాణానికి ప్రోత్సహించాడు. నాటక రంగానికి ఐరిష్ ఇంగ్లిష్ నటులు ప్రముఖులనే కాక, ఆక్స్ ఫర్డ్, కేం బ్రిడ్జి, హార్వర్డ్ సోఫిస్టికేట్స్‌ను కూడా వాడుకోవటం యేట్స్ ప్రత్యేకత.❁



## 42. టైం మెషీన్ వంటి సైన్స్ ఫిక్షన్ రాసిన - హెచ్.జి.వెల్స్ (1866-1946)

నిష్కపట యదార్ధ వాది,నిష్కర్షక విమర్శకుడు అనే రెండే రెండు మాటలతో హెచ్ జి వేల్స్‌ను ఆవిష్కరించవచ్చు. 1936లో 70వ ఏట ఆయన "The Late H ..G. Wells" పేరిట రాసుకొన్న ఆయన జీవిత చరిత్రను లివింగ్ ఏజ్ ప్రచురించింది. అప్పటికి ఆయన ఎంతో ఆరోగ్యంగా జీవించే ఉన్నాడు. తన చరిత్ర "పోస్ట్ మార్టెం ఎస్టిమేట్" అని చెప్పుకొన్నాడు. అందులో మొదటి పేరాలో "నిన్నమధ్యాహ్నమే గుండె జబ్బుతో 97వ ఏట చనిపోయిన హెచ్ జి వెల్స్ పేరు, యువతతో సాన్నిహిత్యం కలిగి ఉంటుంది. మధ్య వయస్కుల జ్ఞాపకాలు ఈ శతాబ్దపు ప్రారంభాన్ని, ఆయన రాసిన పుస్తకాలను వాటి పేర్లను గుర్తుంచుకొంటారు. అతని రచనలను మననం చేసు కొంటారు. చాలా పుస్తకాలు రాశాడు. విలువైన విమర్శ గ్రంథాలు రాశాడు. తనపై గ్రంథాలెన్నో వచ్చాయి సాహిత్యాకాశంలో మిలమిల మెరిసే తార. తనను తాను రోజర్ బేకన్‌తో పోల్చుకోవటం భేషజమే. అతని మూలాలు సాధారణమైనవే. తండ్రి ఒక తోటమాలి. తర్వాత చిన్న దుకాణానికి యజమాని మాత్రమే కాక క్రికెట్ ప్లేయర్. అతని తల్లి ఒక ఇన్ కీపర్ కూతురు. పెళ్ళికాక ముందు సర్వెంట్ మెయిడ్. వెల్స్‌లు ఎప్పుడూ ఈ సాంఘిక నిమ్నతను గురించి ఆలోచించలేదు. కొత్తప్రపంచంలో స్వేచ్ఛా పౌరుడు. అతను లిబరల్ డెమొక్రాట్. ఆలోచించే, విమర్శించే, చర్చించే అనంత స్వేచ్ఛ హక్కు ఉన్నవాడు. సోషలిస్ట్ వర్గ జాతీయతల ఆధిపత్యానికి వ్యతిరేకి" అని రాసుకొన్నాడు వెల్స్. ఇదీ అతని ప్రత్యేకత.

ముగ్గురు సోదరులలో చిన్నవాడైన హెర్బర్ట్ జార్జి వెల్స్ 21-11-1866లో కెంట్‌లోని బ్రామ్లీలో పుట్టాడు. తన పుట్టుకలోని నిమ్నస్థాయిని గూర్చి ఆలోచించలేదు. అంతే కాదు కింది మధ్యతరగతి జనం విషయం కూడా ఆయనకు పట్టేది కాదు. పుట్టుకతో వచ్చిన" కాక్నీ ఉచ్చారణ "మాత్రం మర్చి పోలేదు. చనిపోయే ముందు "I may be scientific aristocrat, but I am no gentleman" అని నిర్భయం గా చెప్పాడు. "బార్టీ" అనే ముద్దు పేరున్న వెల్స్ ప్రాథమిక విద్య పెద్దగా లేదు. అతి పేదకుటుంబం

కనుక చదువుకొనే స్తోమత లేదు ఇది అతన్ని జీవితాంతం బాధించింది. తండ్రి దుకాణంలో సహాయం చేస్తూ ఉండచ్చునను కొన్నాడు. కాని విధి వశాత్తు ఎనిమిదో ఏట కాలు విరిగింది. విశ్రాంతి తీసుకొంటూ ఆరోగ్యాన్ని చక్క బరుచు కొంటూ దొరికిన పుస్తకాలన్నీ ఆబగా చదివాడు. డికెన్స్, వాషింగ్టన్ ఇర్విం, రచనలు ఆపోసన పట్టాడు. కాని స్కాట్ నవలలు బోర్ కొట్టించాయి. అయినా స్కాట్ నవలలు "మర్మియాన్, ది లేడీ ఆఫ్ ది లేక్" మొత్తం కంఠస్తం చేశాడు. గడగడా అప్ప చెప్పేవాడు.

చదివే అలవాటే తనకు గొప్ప రక్షణ నిచ్చిందన్నాడు. 13వ ఏట ఒక కెమిస్ట్ దగ్గర సహాయకుడిగా చేరాడు. కొంతకాలం బట్టల కొట్లో ఉన్నాడు. పనులు చేస్తూ ఖాళీ సమయాలలో క్లాసులకు వెడుతూ 15వ ఏట మిడ్ హర్స్ట్ గ్రామర్ స్కూల్‌లో డోర్ కీపర్‌గా చేస్తూ చదువు కొనసాగించాడు. 18వ ఏట లండన్‌లోని సౌత్ కేన్సిన్ టన్‌లోఉన్న కాలేజ్ ఆఫ్ సైన్స్‌లో చేరటానికి స్కాలర్షిప్ ఆఫర్ పొందాడు. అక్కడ ప్రపంచ ప్రసిద్ధ బయాలజిస్ట్ థామస్ హుక్స్లీ వద్ద నిద్య నేర్చాడు. ఖాళీ సమయాలలో వెనక బడిన విద్యార్థుల అసైన్ మెంట్లు చేసి డబ్బు సంపాదించేవాడు. టీచర్‌గా పని చేయటానికి సిద్ధ పడ్డాడు. 21వయసులో లండన్ యూనివర్సిటి నుంచి డిగ్రీ చేతికొచ్చింది. అండర్ గ్రాడ్యుయేట్‌గా ఉన్నంతకాలం ఎప్పుడూ ఆకలితో అలమటిస్తూ ఉండేవాడు. చాలినంత తినటం అసలు ఉండేదేకాదు. గుంటకళ్ళు, పాలిపోయిన ముఖం ఎముకల పోగుగా అప్పుడు ఉండేవాడు వెల్స్. తర్వాత మనం చూసే వెల్స్ ఫోటోలకు ఆనాటి వెల్స్ ఫోటోలకు హస్తి మశకాంతర భేదం ఉంటుంది.

గ్రాడ్యుయేషన్ పూర్తికాగానే హోల్ట్ అకాడెమీలో కొంతకాలం బోధించాడు. బయాలజీ టెక్స్ట్ బుక్ రాశాడు. ఈ తీవ్రమైన పని ఒత్తిడిలో ఆరోగ్యం దెబ్బ తింది. గోరు చుట్టుపై రోకటి పోటు అన్నట్లు గ్రౌండ్‌లో ఆడుతుంటే ఒక కిడ్నీ నలిగిపోయింది. తనకు టి. బి.వచ్చిందేమోనని భావించాడు. రక్తం కక్కుకోనేవాడు అదృష్టవశాత్తు తేరుకొన్నాడు. ఇలా అనారోగ్యానికి గురౌతున్నా "సరిపడా ఆరోగ్యం నాకు ఉండేది" అన్నాడు. జబ్బు నుంచి తేరుకొంటూ ఉన్న సమయంలో ఫిక్షన్ రాయటం ప్రారంభించాడు అప్పటికే సైంటిఫిక్, అకాడెమిక్ పేపర్లు రాయటంలో సిద్ధ హస్తుడైనాడు. తను రాసినవి ప్రింట్‌లో చూసుకోవాలనే కోరిక కలిగింది. 1888లో రాసిన రెండు నవలలు నచ్చక తగల బెట్టేశాడు. రీములకొద్దీ రాసిన కవిత్వాన్ని చించి పారేశాడు. ఇందులో ఎక్కువ భాగం కామిక్‌కు చెందినవే. వచన రచనలు పత్రికలకు పంపితే తిరిగి వచ్చిన జాడే లేదు. ఒక చిన్న కథకు ఒక పౌండ్ డబ్బులోచ్చాయి. అదే ప్రాఫిట్ అనుకొన్నాడు జర్నలిజానికి సంబంధించిన ఆర్టికల్స్ రాసి డబ్బు సంపాదించి జీవితం లాగించేవాడు.

వెల్స్ మొదటి పుస్తకం "సెలెక్ట్ కాన్వేర్సే షన్ విత్ యాన్ అంకుల్" ప్రచురితమైంది. తర్వాత "ది టైం ట్రావెలర్"ను సీరియల్‌గా రాశాడు. ఇది క్లిక్ అయి మొదటిసారిగా వంద పౌండ్లు వచ్చాయి. ఇదే తర్వాత "ది టైం మెషీన్" పేరిట పుస్తకంగా వచ్చింది.

ఇదే మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ రచనగా చరిత్ర సృష్టించింది. రచనపై డబ్బు బాగా వస్తూ ఉండటంతో టీచింగ్‌కు స్వస్తి పలికాడు.

అప్పటికే భావోద్రేకాల సుడిగుండంలో పడి కొట్టుకొంటున్నాడు. 25 వయసులో కజిన్ ఇసాబెల్ మేరీను పెళ్లి చేసుకొన్నాడు. లండన్‌లో స్టూడెంట్‌గా ఉన్నదగ్గర్నించీ ఆమెను ప్రేమించాడు. ఆమె చాలా సౌమ్యంగా నెమ్మదిగా అందంగా, సానుభూతి పరురాలుగా, మౌనంగా ఉండేది. ఆమె మౌనాన్ని తనతో ఏదీ చెప్పటానికి లేక పోవటం అని, ఆమె సానుభూతి ఏ విషయంపై ఆమెకు అవగాహన లేక పోవటం వలన అని వెల్స్ అర్థం చేసుకొన్నాడు. శృంగారం అంటే ఆమె కంతగా ఇష్టం ఉండేది కాదు. కనుక తన మగతనాన్ని వేరే చోట ప్రదర్శించాలనుకొన్నాడు. ఆరుసార్లు ఎంగేజ్‌మెంట్లు అయినా ప్రేమ ఎందుకో సఫలం కాలేదు. వివాహేతర సంబంధాలో వెల్స్‌కు మించిన వారు చాలా అరుదుగా ఉంటారు. వీటిని స్నేహితులు తెలిసినవారు తెగ చెప్పుకొనేవారు. తానూ బజాయించి చెప్పేవాడు వెల్స్. పెళ్లి అయిన రెండేళ్లకే భార్యాతో విడిపోయాడు. యామీ కేథరిన్ రాబిన్స్ అనే ఆమెకు దగ్గరయ్యాడు. ఆమెలో శారీరక మానసిక పరి పక్వత ఉందని అనుకొన్నాడు. కాని ఈయన్ను ఆమె భరించలేక పోయేది. జేన్ అని ముద్దుగా పిలిచేవాడు అదే ఆమెకు సార్థక నామం అయింది. వెల్స్ గోడచాటు వ్యవహారాలను భరిస్తూ సర్దుకుపోయేది. వెల్స్‌ను "ప్రాఫెట్ ఆఫ్ అవర్ డే" అని "ఫేబియన్ కాస బియాంకా" అనీ పిలిచేవారు. భర్త దొంగచాటు శృంగారాలన్నీ ఆమెకు తెలుసు కాని వీటికోసం వివాహబంధాన్ని తెంపుకోరాదని సర్దుకు పోయేది.

నడి వయసులో లావుగా తయారయ్యాడు వెల్స్. నిరంతర రచన సాగిస్తున్నాడు. "ది ఇన్విజిబుల్ మాన్, "ది వార్ ఆఫ్ ది వరల్డ్స్, వెన్ దిస్లీపర్ వేక్స్, దిటేల్స్ ఆఫ్ స్పేస్ అండ్ టైం. వగైరాలు బాగా క్లిక్ అయ్యాయి. నలభైలలో "కీప్స్ అండ్ టోనో బాంగే" అనే అతని రచనల్లో ఉత్రుష్టమైనదాన్ని రాశాడు. ఆత్మకథ లాంటి నవలలూ రాశాడు. అందులో యవ్వనంలో తాను పడ్డ కష్టాలు బాధలూ రాశాడు. జోన్ అండ్ పీటర్ అనే మానవసంబంధాల గురించి చర్చించాడు. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందే యుద్ధాలలో టాంక్‌ల వాడకాన్ని ఊహించి చెప్పిన మేధావి వెల్స్. యుద్ధంలో విమానాలు చేసే విధ్వంసాన్నీ ఊహించి రాశాడు. పదమూడేళ్ళ ముందే జర్మనీతో యుద్ధం వస్తుందని చెప్పాడు. హీరో హీమాపై బాంబుదాడి జరగటానికి 31 ఏళ్ళకు ముందే అలాంటి ఉపద్రవం జరగాబోతోందని "ది వరల్డ్ సెట్ ఫ్రీ"లో రాసిన క్రాంతదర్శి. "ది అవుట్ లైన్ ఆఫ్ హిస్టరీ" సూక్షంలో మోక్షం. స్పృశించని అంశమే లేదు. ఇంగ్లీష్‌లో ఇది రెండు మిలియన్ కాపీలు అమ్ముడు అయి రికార్డ్ సృష్టించింది. దీని తర్వాత అంతే సక్సెస్ సాధించింది "ది సైన్స్ ఆఫ్ లైఫ్". దీన్ని కొడుకు జూలియస్ హక్స్లీతో కలిసి రాశాడు. మూడు పుస్తకాలను ఏక కాలంలో రాసిన ఘనత వెల్స్ ది. ఒకటి ప్రచురణకు సిద్ధంగా, ఒకటి గాలేరీ ప్రూఫ్‌లో, ఒకటి రాస్తూ ఉండేదిగా కనిపించేది. ఏ సబ్జెక్ట్

అయినా విస్తుతమైనదో, అతి చిన్నదో అనిపించేది కాదు ఆయనకు. చిన్నదైనా పెద్దదైన అదే ఉత్సాహంతో రాసేవాడు. నీరస నిస్పృహలను దూరం చేయటం మానవాళిని జాగృత పరచటమే ఆయన ధ్యేయం.

సాంఘిక పునర్ నిర్మాణంపై వెల్స్ అభిప్రాయాలకు క్రమగా ఆదరణ తగ్గింది. భవిష్యత్తులో ఏయే కొత్త విషయాలోస్తాయో ఆయన "ది షేప్ ఆఫ్ థింగ్స్ టుకం"లో రాశాడు. క్రమంగా అయన సాధారణ సృజన ధార బలహీనపడిందన్నారు. తీవ్రంగా విమర్శిస్తూ "he sold his birth right for a pot of messages" అని ఈసడించారు. వయసు అరవై మధ్యలో ఉండగా అంతగా ఉత్సుకత లేని "ది బల్ పింగ్టన్ఆఫ్ బ్లప్" రాశాడు. ముదురు వయసులో రిపిటీషన్ లే రాస్తున్నాడు అనే అభియోగామూ ఉంది. దేనినీ లక్ష్యం చేయకుండా "ది న్యు వరల్డ్ ఆర్డర్" రాశాడు. ఇది రేషనలిజాన్ని తట్టి లేపింది. ఆయన ఊహించి ముందే చెప్పినవన్నీ ఒకటి తర్వాత ఒకటి అనుభవంలోకి వచ్చి నిజం చేస్తుంటే తిట్టిన నోళ్ళుమూత పడ్డాయి. ఆయనలో ఫెర్టిలిటి పెరిగిందే కాని తగ్గలేదు. వయసు 90 వచ్చేసరికి పబ్లిష్ అయిన ఉద్గ్రందాలే 90కి పైన ఉన్నాయి. 30 పాంఫ్లేట్స్ రాసి ప్రచురించాడు. "impure but inexhaustible Wells" అనిపించుకొన్నాడు.

మానవాళికి మార్గదర్శనం చేయటంలో వెల్స్ ఎప్పుడూ ముందు ఉండేవాడు. జనజాగృతమే ఆయన ధ్యేయం. 76 వయసులో డాక్టరేట్ పొందాడు. తన థీసీస్‌కు ఆయన "qulality of illusion in the continuity of the individual life in the higher Meta zoa with particular reference to Homo Sepines" అని పేరుపెట్టాడు.

"సూపర్ హుమన్ వైటాలిటి" ఉన్నవాడు వెల్స్. రెండు ప్రపంచ యుద్ధాలు ఆయన పాత భావాలపై అనుమానం కలిగించాయి. హీరో షిమా ఉదంతం తర్వాత మనసు వికలమైంది. తన స్పందనను "this can wipe out every thing bad or good in the world.It is up to the pe0ple to decide which" అన్నాడు ఆవేదనగా. 79వ ఏట "mind at the end of its tether" అనే సోషలాజికల్ టెస్టమెంట్ రాశాడు. ఇందులో మానవ మూర్ఖత్వాన్ని ప్రశ్నించాడు. మానవుడు తాను జీవించటానికి సరైన శ్రద్ధ తీసుకోలేక పోతున్నాడని బాధ పడ్డాడు. "man will have to give place to some other animal better adapted to the fate that closes in" అని భవిష్యవాణి చెప్పాడు. కొన్నేళ్ళనుంచి డయాబెటిస్‌తో బాధ పడుతున్నాడు వెల్స్. 80వ ఏట పరిస్థితి క్షీణించింది. మరణం అంచున ఉన్నానని గ్రహించాడు. తాను కొన్ని రోజులకు చనిపోతాననగా "నా ఒక కాలు సమాధిలో మరొకటి బయటా ఊగుతున్నాయి" అన్నాడు తనగురించి జోక్ చేస్తూ. చావును విషాదాంతంగా కాని సీరియస్‌గా కాని తీసుకోలేదాయన. ఒక సందర్భంలో ఆయన సంభాషణ సమయంలో

కొంచెం పరాకుగా ఉన్నాడని అంటే నవ్వుతూ "నేను చావులో బిజీగా ఉన్నాను" అన్నాడు. ఇంకొక నెలలో ఎనభైవ ఏడు వస్తుందనగా వెల్స్ 14-8-1946న మరణించాడు.

ఎన్సైక్లో పీడియా బ్రిటానికా వెల్స్ ను "నావలిస్ట్, సోషియాలజిస్ట్, హిస్టోరియన్, అండ్ ఉటోపియన్"గా అభివర్ణించింది. న్యూ యార్క్ టైమ్స్ "పార్లమెంట్, రాజకీయం, ప్రైవేట్ ఆస్తి, వాణిజ్య పోటీ, పోలీసులు జైళ్ళు పిచ్చివాళ్ళు, వికలాంగులు, లేని ఆదర్శ రాజ్యం కోసం వెల్స్ తపించాడు" అని శ్లాఘించింది. ప్రపంచ ప్రభుత్వం కోసం కలలు గన్న మేధావి వెల్స్. ప్రపంచ శాంతి స్థాపనే ధ్యేయంగా ఉన్నవాడు. ఆంగ్ల రాజకీయాలను ప్రభావితం చేసి మార్గదర్శనం చేశాడు. సోషలిస్ట్ ఇంగ్లాండ్ రావాలని తపించాడు కాని బ్రిటిష్ పౌరుడెవ్వడూ దానికి ఇష్టపడడు అనీ చెప్పాడు. ఆయన రాసిన సెక్స్ నవలలు విముక్తికి మార్గం చూపాయి. చార్లెస్ డికెన్స్ తర్వాత ఇంతటి పాప్యులర్ నవలా రచయిత రాలేదు. "Wells was possibly the greatest British journalist since Defoe" అని న్యూయార్క్ టైం ఘన నివాళి అర్పించింది.

వెల్స్ కొంతకాలం సోషలిస్ట్ ఫేబియన్ సొసైటీలో ఉన్నాడు. వారికి విద్యా, సంస్కరణలపై అవగాహన ఏమీ లేదని తెలుసుకొని బయట పడ్డాడు. లండన్ యూనివర్సిటీలో లేబర్ పార్టీ ప్రతినిధిగా పోటీ చేశాడు కాని పార్టీపై అంతగా అభిమానం లేక వదిలేశాడు. "సోషల్ క్లాస్" రావాలని ఆశించాడు. ప్రపంచ ప్రభుత్వం ఏర్పడాలని ఆరాట పడ్డాడు. "ది ఓపెన్ కాన్ స్పి రసి"లో వరల్డ్ కామన్ వెల్త్ గురించి చర్చించాడు. "దిఫ్యూచర్ ఇన్ అమెరికా" పుస్తకంలో అక్కడి జాతి విచక్షత కొంప ముంచుతుందని చెప్పాడు. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు "టెర్రిటోరియలిజం"పై మాట్లాడాడు. జియనిస్ట్ మూమెంట్‌ను వ్యతిరేకించాడు. రష్యాలో స్టాలిన్ రాకతో భావాలలో మార్పు వచ్చింది. స్టాలిన్‌తో మార్క్సిజం-లెనినిజం వస్తుందని ఆశించాడు. తర్వాత ఫాసిజాన్ని కమ్యూనిజాన్ని విమర్శించాడు. వెల్స్ పూనికతో ఇంగ్లాండ్‌లో "డిజైన్ అండ్ ఇండస్ట్రియల్ అసోసియేషన్" ఏర్పడింది. "గాడ్ ది ఇన్విజిబుల్" పుస్తకంలో దేవుడు మతాలను సృష్టించలేదని చెప్పాడు "the most important writer the genre has yet seen", and notes his work has been central to both British and American science fiction. [85] He was nominated for the Nobel Prize in Literature in 1921, 1932, 1935, and 1946.[7].

నోబెల్ ప్రైజ్ కు నామినేట్ అయినా పొందలేని గొప్ప రచయిత. ఎందరెందరికో స్ఫూర్తి ప్రదాత. ప్రపంచ బంగారు భవిష్యత్తు కోసం కలలు కన్న ఆశావాది. క్రాంత దర్శి వెల్స్.❁




## 43. చైనా రిపబ్లిక్ పిత - సన్యట్ సేన్ (1866-1925)

సన్ వెన్ అని చైనా వాళ్ళు ఆప్యాయంగా పిలుచుకొనే సన్యట్ సేన్ 22-11-1866న చైనా దేశం అవినీతి, కుట్రా కుతంత్రాలతో కుదించుకుపోతూ పీకల్లోతు కష్టాల్లో మునిగి ఉన్నప్పుడు చైనాలోని "టౌన్ ఆఫ్ బ్లూ వాలీ" అని పిలువబడే చోయ్ హాంగ్‌లో జన్మించాడు. అద్భుత చియాంగ్ వంశ రాజురికం విచ్ఛిన్నమైపోతోంది. విదేశేయులు ద్వారాల దగ్గర నిలబడటమే కాక వారిని ఊది పారేస్తున్నారు. అన్నాం ఫ్రెంచ్ సంరక్షణలో, హాంగ్ కాంగ్ బ్రిటిష్ వారికి దక్కి, మరో అయిదు ఓడరేవులు ప్రారంభమై పాశ్చాత్య వర్తకులను ఆహ్వానించాయి. టైపింగ్ తిరుగుబాటు దారులను ఓడించినా, వారింకా సామ్రాజ్య సైనికులను వేధిస్తూనే ఉన్నారు.

చైనాలో కుటుంబం లేక వంశం పేరుముందు ఉంటుంది. "సన్" అంటే వారసుడు అని అర్థం. "యట్" అంటే విశ్రాంతి అని అర్థం. తల్లి తనకొడుకు విలాసంగా జీవించరాదని కోరుకొంటుందనే భావానికి సూచన. "సేన్" అంటే తల్లికి ఉండే మరో కోరిక "చిరంజీవి"గా వర్ధిల్లాలని తెలుపుతుంది. ఈ కుర్రాడి స్కూల్ లో పేరు "వెన్" అంటే విద్యావంతుడు అని అర్థం. చైనీయులు తమ పేర్లను ఆషామాషీగా భావించరు. దానికొక పరమార్థం ఉందని పేర్లు పెడతారు. సేన్ తండ్రి "సన్ తట్ సంగ్" చదువురాని వరి పండించే రైతు. కౌలుకు భూమిని తీసుకొని వ్యవసాయం చేసేవాడు. ఇంటిని మట్టి, గానుగ సున్నంతో కట్టుకొన్నాడు. ఇంట్లో నేల నెర్రెలు విచ్చి ఉండేది. ముగ్గురు కొడుకులలో సేన్ చివరి వాడు. ఇతను పుట్టే సరికి తండ్రికి 54, తల్లికి 40 వయసు. ఇద్దరాడపిల్లలు, విధవలైన ఇద్దరు ఆంటీలు. ఇంతమంది ఇరుకిరుకుగా ఆ ఇంట్లోనే గడిపేవారు. కష్టపడ్డప్పటికీ సేన్ బాల్యం సంతోషంగానే గడిచింది. గాలిపటాలు చేపల వేట, సెలవల్లో మందుగుండు సామగ్రి తయారు చేయటంతో కాలక్షేపం. మిగిలిన ఊరి పిల్లలకంటే ఒక విషయంలో వేరుగా ఉండేవాడు. నాగలి దున్నటం ఆచారం ఇష్టముండేది కాదు. స్వేచ్ఛగా స్వాతంత్ర గీతం పాడుతూ దేశ దేశాలు తిరిగే పక్షిలా ఉండాలనుకోనేవాడు. ఆ విషయాన్ని బహిరంగంగా చెప్పలేదు కాని అతని మనసులోని కోరిక మాత్రం అదే. పక్షి చేసే కిలకిలా రావం వింటే

ఈభావమే పొటమరించేది. తెలియని సుదూర దేశాల గురించి కలలు కనేవాడు. ఒక ముసలి సైనికుడు గ్రామీణ మాండలికంలో అసాధారణమైన టైపింగ్‌ల యుద్ధాలు, వాళ్ళ యుద్ధవీరులను ఎదిరించటాలు, బానిసత్వంపై ద్వేషం, అందరికీ సమానంగా భూమిని పంపిణీ చేయటం, శిలువకు తప్ప దేనికీ వంగని ధైర్య సాహసాల గురించి చెప్పిన కథలు విని ఊగిపోయేవాడు.

బాల్యంలో అందరిలాగానే కష్టపడి స్కూల్‌కు వెళ్లి చదివాడు. ముఖం దేవాలయ బడి గోడకు పెట్టి, పంతులగారి వెదురు బెత్తం దెబ్బలకు అటూ ఇటూ కదుల్తూ చైనావారి ఒకటో తరగతికి చెందిన మూడక్షరాల క్లాసిక్ బట్టీ పడుతూ ఉండేవాడు. ఇతని కుగ్రామం చాలా వెనుక బడినదే. ఎదిగే వయసులోనే ఈ ఊరు వదిలివెళ్లి పోవాలని అనుకొనేవాడు. ఈ చాన్స్ 15ఏళ్ళ వయసులో వచ్చింది. ఇతనికంటే పదిహేనేళ్ళ పెద్దవాడైన అన్న "ఆ మీ" హవాయి ద్వీపానికి వెళ్లి సంపన్నుడయ్యాడు. ఒకసారి ఇంటికొచ్చి తమ్ముడిని తనకు సహాయంగా తీసుకొని వెళ్ళటానికి తలిదండ్రుల అనుమతి కోరాడు. హానాలూలు చేరే టప్పటికి సేన్ బలమైన గడ్డం, సున్నితమైన నోరు ఉన్న 14 ఏళ్ళ కుర్రాడే. అన్నకు అక్కడ ఒక ఫారంతోబాటు జనరల్ స్టోర్స్ కూడా ఉంది. అక్కడ స్టోర్స్‌లో పనిచేస్తూ హవాయ్, జపాన్ మూలాలను గ్రహించి, జ్ఞాన సంపాదనకోసం ఆరాటపడ్డాడు. అన్న తమ్ముడిని చర్చ్ ఆఫ్ ఇంగ్లీష్ స్కూల్ లో చేర్పించాడు. ఇక్కడ లెక్కలు బైబిల్, చరిత్ర నేర్చాడు. తండ్రి క్రైస్తవానికి మారాడు. కనుక ఈ చిన్నకొడుకు తాను కూడా క్రిస్టియన్ అనే అనుకొన్నాడు. ఇంగ్లీష్ భాషలోనే క్లాసులు జరిగేవి. తమ్ముడు ప్రజ్ఞావంతుడై, పాశ్చాత్యుల కంటే మరీ వెస్టెన్‌గా మారిపోతున్నాడని అన్న అనుకొనేవాడు. 17 ఏళ్ళ వయసులో ఇంగ్లీష్ గ్రామర్ పరీక్షలో సేన్ బహుమతి పొందాడు. కుర్రాడు ముదిరాడు అని గ్రహించి సమాజంలో తన స్థానానికి ప్రమాదమని అన్న తమ్ముడిని చైనాకు తిరిగి పంపించేశాడు.

యువ సన్యట్ సేన్ చదువుతో తిరిగి వచ్చి ఇబ్బంది పెట్టాడు. సంప్రదాయాన్ని అనుసరించటానికి ఒప్పుకోలేదు విగ్రహారాధన, పూర్వీకుల ఆరాధన, పూజలపై తిరగ బడ్డాడు. ఇంట్లో ఉన్న దేవతా విగ్రహాలలో ఒక దాని వేలు విరగ్గొట్టాడు. ఊరంతా ఆశ్చర్యపోయింది ఇతని ప్రవర్తనకు. బహిష్కరించి హాంగ్ కాంగ్‌కు పంపేసింది. కొన్ని నెలల తర్వాత్ క్వీన్స్ కాలేజిలో చేరి బైబిల్ చదివి అత్యుత్సాహంగా క్రైస్తవం గురించి దిమ్మ తిరిగేట్లు మాట్లాడటమే కాక ఇద్దరు విద్యార్థుల్ని మతం పుచ్చుకోనేట్లు చేశాడు. ఇంతలో యెంత మార్పో?

తన పరిపక్వతను, భర్తగానూ రుజూ చేసుకొటానికి సన్యట్ సేన్‌కు 18 ఏళ్ళు వచ్చాయి. ప్రక్క ఊరిలోని రైతు కూతురిని ఆయనకు వధువుగా వారి ఆచారం ప్రకారం నిర్ణయించారు. దేవుడి విగ్రహం వేలు విరిచేసిన విషయం మర్చిపోయారు. ముచ్చటగా

పెళ్లి జరిగి పెళ్ళికొడుకు హాంగ్‌కాంగ్ వెళ్ళాడు. పెళ్ళికూతురు కోడలిగా అత్తవారింట్లో విధులు నిర్వర్తిస్తోంది. 19వ ఏట యువ బృందం సేన్‌ను మిషనరీ అని ముద్ర వేసింది. అప్పటికే సేన్ మరో విషయంపై తీవ్రంగా దృష్టి పెట్టాడు. అప్పటికి అమలులో ఉన్న కుటుంబాలలో కొడుకుల్ని బానిసలుగా అమ్మటం, కూతుళ్ళను, వేశ్యలుగా మార్చటం వంటి అనాగరక చర్యలపై తిరుగుబాటు చేశాడు. ఈ నిర్బంధంలో ఉన్న వారితో తానూ ఒకడై పోరాడాడు. దేశంలోని అవినీతి, పాలకుల బలహీనతలు, ఇతర దేశాల దాడులను ఎదుర్కోలేని పిరికితనం చూసి ఉద్రేక పడ్డాడు. వీటి పరిష్కారానికి సంస్కరణలు రావాలని కోరుకొన్నాడు. షిప్ యార్డ్ వర్కర్లు సమ్మె చేస్తుంటే వారికి అండగా నిలిచి, సామ్రాజ్యవాదులను పారద్రోలవచ్చని ఆశించాడు. ప్రజలకు సూటిగా సేవచేయాలనే తలంపుతో మోడరన్ మెడిసిన్‌లో చేరాడు. 1887లో కాంటన్‌లోని పోక్ సి హాస్పిటల్‌లో అసిస్టంట్‌గా చేరాడు. డాక్టర్ జేమ్స్ కాన్ట్లీ హాస్పిటల్ ప్రారంభించాక చేరిన మొదటి విద్యార్థి సన్ యట్ సేన్. అయిదేళ్ళ తరువాత గ్రాడ్యుయేట్ అయిన మొదటి బాచ్‌లో వాడూ ఆయనే. ఈ కాలంలో రహస్య కార్యక్రమాలలో పాల్గొంటూ ప్రాపగాండాతో పాటు సర్జరీలోనూ నైపుణ్యం సాధించాడు. వయసు 29లో కన్ఫ్యూసియస్ వేదాంతి చెప్పిన ప్రముఖ సూక్తిని ప్రకటించి దానినే జీవితంలో నినాదంగా తీసుకొని ఉద్యమించాడు. "ఈభూమి, విశ్వం, అందరిదీ" అన్నదే కన్ ఫ్యూసియస్ సూత్రం. అదే సేన్‌కు నినాద మంత్రమైంది. "చావుకు సిద్ధపడే (డేర్ టు డై) అనే పటిష్ట బృందాన్ని తయారు చేసి మొట్టమొదటి విప్లవ వ్యూహం పన్నాడు. దాన్ని కనిపెట్టి అతని అనుచరుల్ని అరెస్ట్ చేసి ఉరి తీశారు. వారికి దొరకకుండా తప్పించుకోన్నవాడు సన్యట్ సేన్ ఒక్కడే.

చార్లీ సూంగ్ (యావో జు) అనే అమెరికాలో చదివిన, మెథడిస్ట్ పారిశ్రామికవేత్తతో సేన్‌కు బాగా పరిచయమైంది. అతని రెండవ కూతురు చింగ్లింగ్ సేన్‌కు రెండవ భార్య అయింది. సూంగ్ గారి మిగిలిన కూతుర్లకూ ప్రసిద్ధ వ్యక్తులతో వివాహాలు జరిగాయి. ఇందులో పెద్దకూతురు ఎలింగ్ హెచ్ హెచ్ కుంగ్ అనే చైనీస్ మోర్గాన్ అని పిలువ బడే బాంకర్ భార్య. చిన్నమ్మాయి మీ లింగ్ జనరల్ ఇస్మో చాంగ్ కై షేక్‌కు భార్య అయింది. సేన్ వయసు సూంగ్ వయసు ఒకటే. ప్రగతిశీల రాజకీయ భావ వ్యాప్తి, సాధన కోసం ఆయన కూడా యవ్వనంలో మిషనరీ జీవితానికి స్వస్తి చెప్పాడు. ఆయన సన్యట్ సేన్‌కు సెక్రెటరి అసిస్టెంట్ మిత్రుడు అయ్యాడు. ఆయనకున్న ముద్రణా వ్యవస్థపైకి మత సాహిత్య ముద్రణయే కాని చివరికి రెచ్చగొట్టే ఆశ్చర్యకర పత్రాలను ముద్రించేది. ఇలాంటిది ఎవరూ అచ్చు వేయటానికి సాహసించి ముందుకు రాలేదు అని "సూంగ్ సిస్టర్స్" పుస్తకంలో ఎమిలి హాహన్ రాశాడు. ఇంపీరియల్ కోర్ట్ వీటిని గమనిస్తూ, ఇవి రక్తపాత ధోరణిగా ఉన్నాయని భావించింది. అందుకనే సేన్ ఈయనపైనే

ఆధారపడ్డాడు. ఆయన కూడా తన కుటుంబ సంక్షేమానికి, తన జీవితానికి ముప్పుగా భావించినా, సేన్ కొత్త లోకా విష్కారానికి సహాయ సహకారాలు అందజేశాడు. సూంగ్ గారు సవ్య సాచిలా బైబిల్‌ను దాని సూక్తులను ఒక చేత్తో, విప్లవ సాహిత్యాన్ని రెండో చేత్తో ప్రింట్ చేసి వదులుతున్నాడు. చివరికి బైబిల్‌ను బజారులో విసిరేసి ప్రభుత్వాన్ని పడగొట్టటం యెట్లా అని చర్చించాడు.

విప్లవ కుట్ర విఫలమైన తరువాత సన్యట్ సేన్‌ను బలవంతంగా చైనానుంచి బయటికి పంపించేశారు. ప్రవాస జీవితంలో ఎన్నో కష్టాలుపడి హవాయి అమెరికా ఇంగ్లాండ్ దేశాలు తిరిగి సామ్రాజ్య వాదుల నెదిరించటానికి మద్దతునూ ధనాన్నికూడగట్టాడు. అతని తలపై యాభై వేల డాలర్లు నజరు పెట్టి ప్రభుత్వం ప్రకటన చేసింది. అత్యంత ప్రమాదకర పరిస్థితుల నుండి అతి చాక చక్యంగా బందీ కాకుండా కొద్దిలో తప్పించుకొన్నాడు. ఇంగ్లాండ్‌లో ఆయన్ను కిడ్నాప్ చేసి అరెస్ట్ చేసి చైనీస్ లేగేషన్‌లో ఉంచింది. తల తీయటానికి చైనాకు పంపించే ముందు, అందరి కళ్ళుగప్పి తన మెడికల్ సహాధ్యాయి, పాత మిత్రుడు సర్ జేమ్స్ కాన్ ట్లీకి తన సంగతి రహస్యంగా తెలియజేశాడు. ఆయన దీనిపై ప్రజలను, బ్రిటిష్ ప్రభుత్వాన్ని తనకున్న పలుకు బడితో కదిలించి సేన్ విడుదలకు మార్గం సుగమం చేశాడు. ఈ సంఘటనతో మన చైనా డాక్టర్ పేరు ప్రపంచమంతా మారు మోగిపోయింది. సన్యట్ సేన్ పేరు నిర్భీతికి, నిశ్చల నిర్ణయానికి మారు పేరై నిలిచింది. "ఇంతవరకు తయారైన ఏ తుపాకీకంటే వేగమైనవాడు సేన్" అన్నాడు ఆయన అనుచరుడొకడు. "ఆయన పరిస్థితిని బట్టి మెరుపు వేగంగా అనువర్తించే వేగం, తుపాకి గుండు వేగం కన్నా ఎక్కువ ఆయనే" అన్నాడు ముక్తాయింపుగా. కొద్దికాలం జపాన్‌లో శరణార్థిగా ఉన్నాడు. ఆయన్ను పట్టిస్తే చెల్లించే ధర పెంచింది ప్రభుత్వం. భయ సంకోచాలేమాత్రం లేకుండా మిలిటరీతోనూ, అండర్ గ్రౌండ్ అనుచరులతోనూ సంబంధాలను రహస్యంగా కొన సాగిస్తూనే ఉన్నాడు. జెనరల్ హ్వాంగ్‌తో కలిసి "పేట్రియట్స్ అసోసియేషన్" (దేశభక్త సంఘం) ఏర్పరచాడు. 1910లో సౌత్ సి ఐలాండ్స్‌లో విఫల నాయకుడిగా ప్రవక్తగా, వేటాడబడే వ్యక్తిలా గడిపాడు. అయినా నిరాశ చెందలేదు. సమాచారాలు అందటం ఆలస్యమౌతున్నాయే తప్ప అయన ప్రయత్నాలేవీ ఆగిపోలేదు. ఒకోసారి వార్తలు అడ్డగించబడేవి, కాని పవిత్ర యుద్ధం కొన సాగుతూనే ఉంది.

అమెరికా వెళ్లాక విప్లవం అనే దాన్ని సన్యట్ సేన్ ఆచరణలో పెట్టాడు. అది 1911 సెప్టెంబర్‌లో హాన్ కౌమీద బాంబు దాడితో ప్రారంభమైంది. తర్వాత డజన్ జిల్లాలలో జరిగింది. దీన్ని చూసి ప్రభుత్వసైన్యం తీవ్ర దిగ్భ్రాంతి చెందింది. జపాన్‌లో షాంగ్ కై షేక్ సన్యట్ సేన్ ప్రభావంలో పడిపోయాడు. అప్పుడే ఆతను మిలిటరీ స్కూల్ నుండి బయటికొచ్చాడు. వెంటనే అతన్ని హాన్చౌలో ఆర్మీ ఛీఫ్‌గా నియమించారు.

కొలరాడోలో ఉన్న సన్‌కు ఈ వార్త చేరింది. తూర్పు వైపుకు వెళ్లి సెయింట్ లూయీ వార్తా పత్రిక ద్వారా తనను చైనాకొత్త రిపబ్లిక్‌కు మొదటి అధ్యక్షుడిగా నియమించ బడినట్లు వార్త చదివి తెలుసుకొన్నాడు సంతోష పడ్డాడు. లండన్ వెళ్లి, 1912 జనవరి మొదట్లో చైనా చేరాడు. నాంకింగ్‌లోని జాతీయ సమావేశంలో తాత్కాలిక అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేశాడు సన్యట్ సేన్.

చైనాను జాగృతం చేసి, స్వేచ్ఛను తెచ్చిన ఘనత సూంగ్ సిస్టర్స్‌దే అనటంలో సందేహం లేదు. చింగ్ లింగ్‌కు విప్లవ వివరాలు తెలిశాక అమితాశ్చర్యం పొంది తను చదివే మెకన్‌లోని వేల్సియన్ కాలేజీ పేపర్‌నే బ్లాక్ బోర్డ్‌గా చేసి దాన్ని వ్యక్త పరచింది. 1912 ఏప్రిల్‌లో "ది వేల్సియన్" పత్రికలో "20వ శతాబ్దపు అతి గొప్ప సంఘటన" అని రాసింది. నెపోలియన్ వాటర్లూ తర్వాత ప్రపంచంలో అతి ముఖ్యమైనది చారిత్రాత్మక సంఘటన చైనా విప్లవం. 400 మిలియన్ల ప్రజలు జీవితం, స్వేచ్ఛ, సంతోషాలను దారుణంగా తిరస్కరించిన సుదీర్ఘ రాజరికం నుండి విముక్తి పొందారు. క్రూర దోపిడీ దారులైన వంశ పాలకుల కబంధ హస్తాల నుండి బయట పడ్డారు. అతి సంపన్నమైన చైనా దేశాన్ని అతి బీదరికంలోకి నెట్టేసిన దారుణ పాలన చెరనుండి విముక్తులయ్యారు. "మంచు" ప్రభుత్వం అంటే వినాశనం, రాజ్య బహిష్కరణ, అనాగరిక పాలన. నెపోలియన్ "చైనా కదిలితే ప్రపంచాన్ని కదిలిస్తుంది" అన్నాడు. ప్రపంచ జనాభాలో నాలుగవ వంతున్న చైనా దేశం మానవ జాతి అభ్యుదయానికి దారి చూపాల్సి వచ్చింది.

ఇవన్నీ చింగ్ లింగ్ భావనలే అయినా అవి అపరిపక్వమైనవి. 12-2-1912న సామ్రాజ్య వాద శాసనం చక్రవర్తిని త్యజించి, ప్రజాస్వామ్య స్థాపనను ప్రకటించింది. వెంటనే చైనా రిపబ్లిక్ పిత, చైనా మొదటి అధ్యక్షుడిగా రాజీనామా చేశాడు. మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేసినా చీఫ్ మేజిస్ట్రేట్‌గా ఉండే శక్తి సామర్ధ్యాలు తనకున్నాయా అని సందేహించాడు. ముందు దేశంలోని ఇబ్బందికర పరిస్థితులను చక్క బరచాలి. తనకేమో పరిపాలనలో అనుభవం లేదు. లోపాలు, అసంతృప్తులను తొలగించాలి. మొత్తం అధికారం తన చేతిలో లేదు. ఈ పరిస్థితులలో ప్రజా హృదయం తెలిసినవాడు అందరినీ సమైక్య పరచేవాడు ప్రెసిడెంట్‌గా ఉండటం అవసరం. అందుకని తన వారసునిగా ఉదారవాద నాయకుడు, చింగ్ ప్రభుత్వాన్ని అనేక సంస్కరణల కోసం ఒప్పించిన" యువాన్ షై కై" ని ఎంపిక చేశాడు. తన పదవిని వీడుతూ సన్యట్ సేన్ "ఉత్తర, దక్షిణ ప్రాంతాలు చక్రవర్తి పదవీ త్యాగం వలన ఏకీ కృతమైనాయి. యువాన్ రిపబ్లిక్‌ను సమర్ధిస్తానని వాగ్దానం చేశాడు. రాజ్యాంగ వ్యవహారాలలో ఆయనకు అనుభవం ఉంది, ఆయనకు ప్రజాస్వామ్యానికి పూర్తి విధేయుడని, ఈ పాలనా బాధ్యతలు ఆయన కోసమే ఎదురు చూస్తున్నాయి" అని వీడ్కోలు ప్రసంగం చేశాడు.

కొద్ది కాలంలోనే సన్యట్ సేన్ పొరపాటు చేశానని గ్రహించాడు. యువాన్

ప్రజాస్వామ్యవాది కాదు నియంత అని తేలిపోయింది. ట్రాన్స్ పోర్ట్ అండ్ ట్రేడ్‌కు సన్ డైరెక్టర్ జనరల్ అయ్యాడు. ప్రజాపార్టీ అని పిలువబడే "కౌమిటాంగ్ పార్టీ" వ్యవస్థాపకుడైన సన్యట్ సేన్, ప్రాపగాండాకు, సన్నాహానికి అంకితమై పని చేశాడు. అధికారాన్ని అదనుగా తీసుకొని యువాన్ రాజకీయం ఆడి, దారుణంగా ప్రవర్తించాడు. విప్లవానికి ముందే అతను అధికార పగ్గాలు పట్టుకోవటానికి పథకాలు అమలు చేసుకొన్నాడు. "సన్యట్ సేన్ అండ్ చైనీస్ రిపబ్లిక్" అని పాల్ లించార్జర్ రాసిన పుస్తకంలో యువాన్‌ను, అవకాశ వాద విద్రోహి హంతకుడు, దారుణ రాక్షసుడు, ప్రజాస్వామ్య ఘాతకుడు అయినవాడిగా "చైనీస్ జూడాస్" అని పిలిచాడు. యువాన్ వేసిన పథకంలో భాగమే సన్ ప్రెసిడెంట్‌గా పదవీ త్యాగం అన్నాడు ఆయన. "చైనా దేశభక్తుల ఎరుపు రక్త ప్రవాహాన్ని మరింత ఎరుపెక్కించి పారించిన "యెద్ర" వాడు యువాన్" అంటాడు. వీరిద్దరి మధ్య ఉన్న విభేదం చైనాకు శాపమే అయింది.

ఇబ్బందులు వేగంగా దూసుకొచ్చాయి. ఒక్క ఏడాదిలోనే యువాన్‌తో విడిపోయాడు సన్. చైనా ఉత్తర, దక్షిణాలుగా చీలిపోయింది. తను గద్దెపై కూర్చోపెట్టిన వాడితోనే తలపడాల్సి వచ్చింది. ఇప్పటికే యువాన్‌కు సుశిక్షిత అతి పెద్ద సైన్య విభాగం చేతిలో ఉంది. నాంకింగ్ వద్ద జరిగిన యుద్ధంలో సన్యట్ సేన్‌కు మళ్ళీ ప్రవాసం తప్పలేదు. 1915 డిసెంబర్‌లో జపాన్‌లో ఉన్నాడు. అప్పుడు యువాన్ తనను చక్ర వర్తిగా ప్రకటించుకొన్నాడు. ప్రాంతాలు ఎదురు తిరిగాయి. అనుచరులు చాలామంది అతన్ని వదిలిపెట్టారు. దీనితో దారుణ మారణ కాండ చెలరేగింది. నిర్దాక్షిణ్యంగా అతి అమానుషంగా యువాన్ ప్రవర్తించాడు. బందిపోట్లు, దుర్మార్గుల రావణ కాండ పెరిగిపోయింది. ముఠాలు, కక్షలు కార్పణ్యాలు పెచ్చు పెరిగాయి. దేశమంతా అట్టుడికి పోతోంది. ఆరునెలల ఈ దానవ దారుణ పాలన తర్వాత యువాన్ చచ్చాడు. సన్యట్ సేన్ చైనా తిరిగి వచ్చాడు. తాను వదిలి వెళ్ళిన కార్యక్రమాలను కొన సాగించాలనుకొన్నాడు కాని పరిస్థితులు అనుకూలంగా లేవు. దేశమంతా అనేక వర్గాలుగా విడిపోయింది. కొత్త అనాగరక సైన్య ముఠాలు ఏర్పడి, అదుపులోకి తీసుకోక ముందే అదృశ్యమైనాయి. ప్రతి పల్లె గల్లీ రాజకీయ నాయకుడూ జాతీయ నాయకుడని పోజులిస్తున్నాడు. చట్ట న్యాయాల ఉల్లంఘన, దోపిడీ పెరిగిపోయి ప్రజా బాధ ఎవరికి విన్నవించుకోవాలో తెలియని విచిత్ర వింత నికృష్ట పరిస్థితి ఏర్పడింది.

చిన్నతనం నుంచే చింగ్ లింగ్ సూంగ్ సన్యట్ సేన్ అంటే మోజు పడింది. ఆమె ఆమె అక్క చెల్లెళ్ళు సేన్‌ను బిజీ, గ్రేషియస్ అంకుల్ – దయా అందమున్న బిజీ అంకుల్ అనేవారు. జార్జియాలో ఉన్నప్పుడు ఆమె చైనా విప్లవ విజయం గురించి రాసింది. ఇప్పుడు సేన్‌ను అధికంగా ప్రేమించింది. ఇప్పుడామెకు 20, సేన్‌కు 50 వయసు. ఆమె కుటుంబం విస్మయం చెంది తిరస్కరించింది. వయసులో ఉన్న తేడాల వల్లకాదు.

అప్పటికే సన్‌కు వివాహమవటం, సేన్, చింగ్ లింగ్లిద్దరూ క్రిస్టియన్లు కావటం కారణం. రెండవ భార్యగా ఈమెను పొందటానికి రెండు వైపులా కుటుంబ పెద్దలు ఒప్పుకోవాలి అనేది సంప్రదాయం. అమెరికాలో చదివిన లింగ్ తలిదండ్రులకు మెల్లగా చెప్పింది, బ్రతిమాలింది, ఒత్తిడి చేసింది, బెదిరించింది. అన్నీ ప్రయత్నాలు విఫలమై ఇంటి నుంచి పారిపోయి సన్యాట్ సేన్‌ను పెళ్ళాడేసింది. .

1920లో సేన్ కాంటన్‌లో పని మొదలుపెట్టాడు. దక్షిణ చైనాలో పరిస్థితులు అనుకూలంగా ప్రశాంతంగా ఉన్నాయి. యుద్ధ వీరుడు చెన్ చుయాన్ మింగ్, అందరూ ద్వేషించే క్వాన్ గ్సి ముఠాను ఓడించాడు. ఈయన సన్‌కు స్నేహితుడైనందువల్ల సేన్ మళ్ళీ నిలదొక్కుకోవటానికి వీలైంది. మళ్ళీ సేన్‌ను ప్రెసిడెంట్‌గా ప్రశంసించి ప్రజలు బ్రహ్మ రథం పట్టారు. కాని అది ఒక్క దక్షిణ చైనాకే పరిమితమైంది. చెన్ ఉత్తర ప్రాంతంలో కూడా దూసుకుపోయే ప్రయత్నం చేయమన్నాడు. దీనివల్ల సివిల్ వార్‌ల వలన దెబ్బ తిన్న ఐకమత్యం మళ్ళీ పునరుద్ధరించటానికి సాధ్యమౌతుందని చెప్పాడు. ఈ విషయమై సందేహించి ముందుకు వెళ్ళటానికి తిరస్కరించాడు. దీనితో మనసు గాయమై తానే ఒక సైన్యాన్ని చేర్పాటు చేసి ఉత్తరం వైపు కదిలాడు సేన్. ధన లోపం వలన తీవ్ర ప్రచారం చేయలేక తిరిగొచ్చాడు చెన్‌ను పదవి నుండి తొలగించాడు. అహం దెబ్బతిని సేన్‌కు వ్యతిరేకి అయి ఎదురు దాడి చేశాడు. చెన్ సైన్యం చేయిదాటిపోయి, అదుపు తప్పి, సేన్ హెడ్ క్వార్టర్‌పై దాడి చేశాయి. సన్యట్ సేన్‌ను పారిపోయేట్లు చేశారు. భార్య చింగ్ లింగ్ ముసలి పల్లెటూరి ఆవిడ వేషంలో తప్పించుకొన్నది.

యుద్ధం ముఠాలు దేశాన్ని బలహీన పరుస్తున్నాయి. అందర్నీ కలప టానికి సేన్ విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు. రష్యా విప్లవాన్నీ, దాని వలన జరిగిన దేశాభివృద్ధిని గమనించాడు. రష్యా విధానం చైనాకు పనికి రాదన్నాడు కారణం “అక్కడ కమ్యూనిజం కాని, సోవియటిజం కాని విజయవంతంగా స్థాపించటానికి తగిన పరిస్థితులు లేవు” అన్నాడు సేన్. చియాంగ్‌కై షేక్ రష్యామిలిటరీ సలహాదారుల నుండి సహాయం, సూచనలు తీసుకోవచ్చునని కమ్యూనిస్ట్ విధానంలో కౌమిటాంగ్‌ను పునర్నిర్మించవచ్చని అనుకొన్నాడు. పరిస్థితులు తీవ్ర రూపం దాల్చటంతో, తన స్థానాన్ని పదిల పరచుకోవటానికి హింసామార్గం, మూక హత్యలు తప్పని సరైనాయి. విద్యార్థులు, వర్కర్లు దీన్ని ఆమోదించినా రాజకీయ నాయకుల నుండి భూస్వాముల నుండి, మిగిలిన కన్జర్వేటివ్‌ల నుండి మద్దతు లభించలేదు.

చైనా రెండు ప్రాంతాల్లో ఎన్నో ఆటంకాలేర్పడ్డాయి. ఉత్తరాన, పెకింగ్, యాన్గ్ ఛీ లోయలోనూ యుద్ధాలు జరుగుతున్నాయి. చియాంగ్ కై షేక్ సహాయంతో సేన్ స్వయంగా సంఘర్షణకి దిగాడు. ఫ్రెంచ్ ఒడంబడిక లేర్పడ్డాయి, విచ్ఛిన్నమైనాయి. కొత్త

ఒడంబడికలు, వెన్నుపోట్లు అరుగుతూనే ఉన్నాయి. తీవ్ర పరిస్థితులలో శత్రువులు మిత్రులు అందరు కలిసి సన్యట్ సేన్ నే ప్రజా నాయకత్వం వహించమని కోరారు. ఇది అవాస్తవమైనదని తెలుసుకొన్నాడు. కాని అంగీకరించక తప్పలేదు. పెకింగ్‌కు బయల్దేరి వెళ్లేముందు అనారోగ్యంతో ఉన్నాడు.

తనకు ఇన్ ఫ్లు ఎంజా వచ్చిందని, లివర్ జబ్బు దీనికి కారణమని గ్రహించాడు. 1925లో పెకింగ్ చేరే సరికి విపరీతమైన జ్వరం, వచ్చి పల్స్ బీట్ 120 ఉంది. కేన్సర్ అని అనుమానించారు. నెలాఖరికి పల్స్ బీట్ ఇంకా పెరిగిపోయి గుండె తట్టుకోలేని స్థితి వచ్చింది. చివరికి ఆపరేషన్ తప్పని సరైతే, అప్పటికే కేన్సర్ చాలా ముదిరిపోయిందని తేలింది. బాధ తగ్గించటానికి అల్ట్రా వయొలెట్ కిరణ చికిత్స, నిద్రమాత్రలు వాడారు. కాని ఆశ కనిపించలేదు. ఊపిరి పీల్చటం కష్టమైపోతున్నా నోటి నుండి "స్వేచ్ఛ, ఐక్యత" అనే పదాలు పదే పదే వచ్చేవి ఆ స్వాతంత్ర్య ప్రియుడి నోటి నుండి. డాక్టర్ వెల్లింగ్ టన్ క్లూ హాస్పిటల్‌లో చేర్చారు. అక్కడే 12-3-1925న సన్యట్ సేన్ మరణించాడు.

సేన్ ప్రారంభించిన విముక్తి ఉద్యమం ఆయనతో ఆగి పోలేదు. అనేక సివిల్ వార్‌ల తర్వాత 1946లో చియాంగ్ కై షేక్ ఆధ్వర్యంలో జాతీయ ప్రభుత్వమేర్పడింది. ఇదీ ఎక్కువ కాలం లేదు. ప్రభుత్వ గౌరవం క్రమగా పతనమై పోయింది. అంతర్యుద్ధాలు, అవినీతి, అశాంతి పెరిగి, ఇంతకంటే ఏ ప్రభుత్వమొచ్చినా బాగుండుననిపించింది. 1949లో జాతీయ ప్రభుత్వం కూలిపోయి అక్టోబర్‌లో మావ్ సే టుంగ్ చైర్మన్‌గా "కొత్త కమ్యూనిస్ట్ పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా" అవతరించింది. ఏడాది తర్వాత చియాంగ్ కై షేక్, అతని సైన్యం కొన్ని దీవుల మీద మాత్రమే అధికారాన్ని కలిగి, ఫార్మోజాను ప్రధాన కార్యాలయం చేసుకొన్నారు. అమెరికా సాహాయంతో ముఖ్య భూభాగాన్ని ఆక్రమించుకొనే ఉద్దేశ్యంలో చైనా కమ్యూనిజాన్ని నీరు కార్చేశారు. చివరికి ఏమౌతుందో తెలియదుకాని ఇదంతా చైనా రిపబ్లిక్ పిత సన్యట్ సేన్ మొదటి చివరి కల.

చైనా జాతిపితగా సన్యట్ సేన్‌ను ఆరాధిస్తారు చైనాలోనూ, తైవాన్‌లోను. చైనా విప్లవ వీరులలో సేన్ అగ్రగామి. ఆయన పేరు మీద అనేక వీధులు విద్యా సంస్థలున్నాయి. ఆయనకు నివాళిగా చైనీస్ కల్చరల్ రినైసేన్స్‌ను ఆయన జన్మదినం నవంబర్ 12న ఏర్పాటు చేశారు. అమెరికాలోని న్యూయార్క్‌లో ఉన్న సెయింట్ జాన్ యూనివర్సిటీలో సన్యట్ సేన్ మెమోరియల్ హాల్‌ను ఆయన గౌరవార్ధం నిర్మించారు. ఆయన శత జయంతిని ఆస్ట్రేలియాలోని మెల్బోర్న్‌లో, చైనా యువత ఘనంగా నిర్వహించారు. ఆయన జీవితంపై సినిమాలు నాటకాలు ఒపెరాలు. టివి షోలు వచ్చాయి. ఆయన పేరిట ప్రత్యేక స్టాంప్‌లను విడుదల చేశారు. ❋



## 44. విమాన యానానికి రైట్ చెప్పిన రైట్ సోదరులు (1867-1912) (1871-1948)

"మానవుడు ఎగరటం అసాధ్యమే కాదు, తర్క విరుద్ధమైనది" అని "మనిషి ఎగరాలంటే కొత్త లోహాన్ని లేక ప్రకృతిలో కొత్త శక్తిని కనిపెట్టాలి" అని బల్ల గుద్ది మరీ చెప్పాడు ప్రముఖ ఖగోళవేత్త ప్రొఫెసర్ సైమన్ న్యు కాంబ్. ఒక వేళ అలాంటి యంత్రాన్ని కనిపెట్టినా, అది కూలి నడిపే పైలట్‌ను తప్పక చంపేస్తుంది, స్పీడ్ తగ్గించినా, దిగేటప్పుడు చచ్చిన శవంలా నేల కూలుతుంది అని ఆయన అభిప్రాయం. ఈ విషయాలన్నీ బహిర్గతం చేస్తూ ఆయన 1903లో రాసి ప్రచురించాడు. ఇదే సమయంలో రైట్ సోదరులు కిట్టీ హాక్‌లో విమానం తయారు చేసి గాలిలో ఎగిరేట్లు చేసి అసాధ్యాన్ని సుసాధ్యం, అతర్కాన్ని తర్క హేతుబద్ధం చేసి చూపించారు. ఒక పావు శతాబ్దంలో గత కాలపు జాగ్రఫీకి చెందిన భావనలన్నీ విప్లవాత్మకంగా మారిపోయి రవాణాలో విమానయుగపు కొత్త శకం ఆవిర్భవించింది. దీనికి 500 సంవత్సరాలకు పూర్వం ప్రఖ్యాత చిత్రకారుడు సైంటిస్ట్, మేధావి లియొనార్డో డావిన్సి తాత్కాలికంగా ఎగిరే యంత్రాన్ని డిజైన్ చేశాడు. ఆ తర్వాత రైట్ సోదరులు విమానాన్ని కనిపెట్టటానికి వందేళ్ళ ముందు మనుషులు బెలూన్ల సహాయంతో గాలిలోకి ఎగరటం నేర్చారు. గాలికంటే తేలికైన యంత్రాన్ని కనిపెట్టినా, దాన్ని నియంత్రించలేక పోయారు. చరిత్రలో మొట్టమొదటి సారిగా రైట్ సోదరులు గాలి కంటే చాలా బరువైన సుస్థిరమైన, నియంత్రణలో ఉండే గాలి యంత్రాన్ని తయారు చేసి ఎగిరారు.

1932లో కేట్టిహాక్‌లో ఏర్పాటు చేసిన స్మృతి చిహ్నంపై విమానానికి కారకులైన

వారి గురించికాక "భయం లేని స్పష్టమైన, అజేయమైన విశ్వాసం" అని రాశారు. ఈ విమానంతో ప్రసిద్ధులయ్యేదాకా వారు మధ్యతరగతి పౌరులని, వ్యాపారవేత్తలని, వారికి వైమానిక శాస్త్రం హాబీ అని అని మాత్రమే అందరికి తెలుసు. వీరి తండ్రి మిల్టన్ రైట్ ఇండియానాలో లాగ్ కేబిన్‌లో పుట్టాడు. యునైటెడ్ బ్రదర్న్ ఇన్ క్రైస్ట్‌కు బిషప్ అయ్యాడు. అయిదుగురు సంతానంలో సోదరులకు ఇద్దరు పెద్దన్నయ్యలు, రూక్లిన్, లోరిన్, ఒక సోదరి కేథరిన్ ఉన్నారు. విల్బర్ రైట్ 16-4-1867న ఇండియానాలోని మేల్విల్లీలో పుట్టాడు. చిన్నవాడు ఆర్విల్లీ రైట్ 19-8-1871న ఒహాయోలోని డేటన్‌లో పుట్టాడు. ఇదే తర్వాత వీరి కుటుంబ ఆవాసం అయింది. ఇక్కడే సోదరుల అన్యోన్యత సుస్థిరమై అజేయమై నిలిచింది. వారి క్లాస్ రూమ్ అస్థిరంగా ఉండేది. 14ఏళ్ళ వయసులోనే విల్బర్ స్కూల్ వదిలేశాడు. ఆర్విల్లీపై క్లాస్ చదివాడు కాని డిప్లొమా పొందేదాకా లేదు. ఇద్దరికీ కాలేజి చదువు యావే లేదు. ఎడిసన్, ఫోర్డ్‌లలాగా వీరికీ పెద్దగా విద్య, శిక్షణా లేవు. పని చేస్తూ నేర్చుకోవటం వీరి కలవాటైనది.

తండ్రి క్రిస్టియన్ మినిస్టర్ అయినా కుర్రాళ్ళ చేష్టలను నిరుత్సాహ పరచలేదు. ఆరేళ్ళప్పుడే ఆర్విల్లీ ఇంకో కుర్రాడితో కలిసి పాత ఎముకలను ఏరి, ఎరువుల ఫాక్టరీకి అమ్మి డబ్బు సంపాదించాడు. 11వ ఏట తోటి ఆటగాళ్లకు గాలిపటాలు తయారు చేసి అమ్మి డబ్బు పోగేశాడు. పనికి రాని లోహపు ముక్కల్ని ఏరి, జంక్ డీలర్‌కు అమ్మి సొమ్ము చేసుకొనేవాడు. చర్చ్ ప్రచురణ కాగితాలను మడతలు పెట్టి సాయం చేసేవాడు. నాలుగేళ్ల పెద్దవాడైన ఆల్బర్ ఆర్విల్లీతో కలిసి సృజనాత్మక పనులు చేసేవాడు. మొట్టమొదటిసారిగా ఇద్దరూకలిసి బాల్ బేరింగ్‌ల కోసం చెక్క సాధనం (వుడేన్ లేత్) తయారు చేశాడు. 12వ ఏట ఆర్విల్లీ ప్రింటింగ్‌పై అభిరుచి చూపిస్తే, విల్బర్ ప్రెస్ తయారు చేయటంలో సాయం చేశాడు. 18వ ఏటనే పబ్లిషర్ అవతారమెత్తాలని అర్విల్లీ నిర్ణయించుకొని "వెస్ట్ సైడ్ న్యూస్"ను ప్రారంభించి పడమటి తీరంలోని ప్రజల వ్యారస్తుల ప్రయోజనాల కోసమే ప్రచురిస్తున్నానని ప్రకటించాడు. ప్రజల , నైతిక బౌద్ధిక, ఆర్థిక అభివృద్ధిలపై తన పత్రిక దృష్టి సారిస్తుందని హామీ ఇచ్చాడు. దీనిలో మొదట రాసిన వాడు ఎలివేటర్ బాయ్ అయిన ఒక నీగ్రో పాల్ లారెన్స్ డన్బార్. ఇతను తర్వాత "లిరిక్స్ ఆఫ్ లౌలీ లైఫ్"తో ప్రసిద్ధి చెందాడు. కొన్నేళ్లలో రైట్ సోదరులు "దిమిడ్జెట్, దిఈవెనింగ్ ఐటెం, స్నాప్ షాట్స్" అనే చిన్న వార పత్రికలు తెచ్చారు. నీగ్రోల కోసం డన్బర్ ఎడిటర్‌గా ప్రారంభించిన "ది టాట్లేర్"ను ముద్రించారు. భాగస్వామ్యం, అనుభవంతో ఇది బాగా ఆభివృద్ధి చెందింది. ఒకరికొకరు అర్థం చేసుకొంటూ చేయి చేయి కలిపి సోదరులు ముందుకు పోతున్నారు. ఎవరి సాయం లేకుండానే దూసుకు

పోతున్నారు. ఇద్దరికీ పెళ్లి సంగతే పట్టలేదు. వారి జీవితాలలో తాత్కాలిక ప్రేమ వ్యవహారాలూ లేనే లేవు. ఇద్దరు పరస్పరం సహకరించుకొంటూ గొప్ప ముందడుగే వేశారు.

చిన్నతనం నుంచి యంత్ర శాస్త్రం అన్నా, అందులో చలన యంత్రాలన్నా రైట్ సోదరులకు మక్కువ ఎక్కువగా ఉండేది. వారు తయారు చేసిన మొదటి ఆటవస్తువు 'ఒక చిన్న గైరోస్కోప్ '– ఒక వలయంలో ఉన్న చక్రం – దీన్ని వేగంగా త్రిప్పితే కత్తి మొనమీద లేక కప్పు అంచుమీద ఎటూ ఒరగకుండా బాలన్స్‌గా ఉండే ఆటవస్తువు. రెండవది మినియేచర్ హెలి కాప్టర్. వెదురు, కాగితాలతో రబ్బర్ బాండ్‌లతో కట్టి తిరిగేట్లు చేశారు. ఇద్దరికీ పదేళ్ళ వయసులోపు ఉండగానే దీని నాణ్యత పెంచటానికి కృషి చేశారు. తర్వాత బైసికిల్స్ తయారు చేయటంలో దృష్టిపెట్టారు. ఆట వస్తువులు తయారు చేసి అమ్ముతూ జీవికకు డబ్బు సంపాదించారు. అన్నదమ్ములకు 25, 20 ఏళ్ళున్నప్పుడు సైకిళ్ళను అద్దేకిస్తూ, అమ్ముతూ జీవించారు. తమ షాపు పైన ఒక గదిలో బైసికిల్స్ తయారు చేస్తూ యంత్రభాగాలను కూరుస్తూ, లాభసాటి వ్యాపారం చేశారు. ఇన్ని చేస్తున్నా గాలిలో ఎగిరే హెలికాప్టర్ తయారు చేయాలన్న ఆలోచన మాత్రం మనసుల నిండా అలాగే ఉండి పోయింది. ఆర్విల్లీ ఇరవైలలో ఉండగా ఆల్బర్‌తో కలిసి ఫ్లైయింగ్‌కు సంబంధిన విషయాలన్నీ సేకరించి ఒక లైబ్రరీ ఏర్పాటు చేసుకొన్నారు. వీరిద్దరికీ జర్మన్ ఎక్స్ పర్ట్ ఆటో లిలీన్తాల్. ఆతను గ్లైడింగ్ గురించి బాగా అధ్యయనం చేయటమేకాక, ఒక కొండ ప్రక్కనుండి చిన్న చిన్న దూరాలకు గ్లైడ్ చేసి ఆశ్చర్య పరచాడు. పాపం ఈ గ్లైడింగ్‌లో ఆతను ప్రాణాలు పోగొట్టుకొన్నాడు. ఇది విని మన సోదరులు కలత చెందారు కాని నిరాశ పడలేదు. అతని ప్రయత్నాలు అనుభవాలను క్షుణ్ణంగా పరిశీలించి, అతను రాసిన "ది ప్రాబ్లెమ్స్ ఆఫ్ ఫ్లైయింగ్ అండ్ ప్రాక్టికల్ ఎక్స్ పెరి మెంట్స్ ఇన్ సోరింగ్ "పుస్తకాన్ని అధ్యయనం చేశారు. స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూషన్ సెక్రెటరి పీర్పాంట్ లాంగ్లేకు ఉత్తరం రాసి ఆయన పుస్తకం "ఎక్స్ పెరమెంట్స్ ఇన్ ఏయిరో డైనమిక్స్" పుస్తకాన్నీ చదివారు. ఆయన సూచన మేరకు ఏయిరో నాటికల్ జర్నల్స్ 1895, 96, 97లను పరిశీలించి అవగాహన పొందారు. ములార్డ్ రాసిన "ఎంపైర్ ఆఫ్ ది ఎయిర్", అందరూ చదవాల్సిన ఆక్టేవ్ చాన్యూట్ రాసిన ''ప్రోగ్రెస్ ఇన్ ఫ్లైయింగ్ మెషీన్స్'' కూడా చదివి ఆయనకు మంచి స్నేహితులైపోయారు. ఆయన వీరికి గొప్ప ప్రేరణ కలిగించాడు. దీన్ని సమగ్రంగా ఫ్రూడేన్థాల్ "ఫ్లైట్ ఇంటు హిస్టరీ"లో వివరంగా రాశాడు.

రైట్ సోదరులు స్వయంగా గ్లైడర్ తయారు చేయాలని నిర్ణయించారు. పూర్వం

చేయబడిన వాటికి భిన్నంగా ఈ బై ప్లేన్ తయారు చేయాలన్నది వీరి సంకల్పం. ఇతర విమానాల వింత పోకడలను గమనించి, తాము నిర్మించే దానికి ముందు భాగంలో స్టెబి లైజర్, పైలట్ చేతిలో నియంత్రణ ఉండేలా ఒక చిన్న అనుబంధ ప్లేన్ లేక ఎలివేటర్‌ను నిర్మించారు. ఎగిరేప్పుడు అటూ ఇటూ ఒరిగితే, అది ఆ యంత్రాన్ని మరింత పైకి ఎగిరేట్లు చేస్తుంది. దాన్ని అణచేస్తే పైకి ఎగరటాన్ని వెనక్కి మారుస్తుంది (రివర్స్). కాని పార్శ్వ సమతులనం (లేటరల్ బాలన్స్)లో చిక్కులున్నాయి. కాకుల సంజ్ఞలను గమనించి విమాన రెక్కలను సమతలంగా కాకుండా కొంచెం వంపు ఉండేట్లు తయారు చేసి బాలన్సింగ్ సమస్యను అధిగమించారు. అనువైన రెక్కల అమరిక నేర్పరచడంతో గ్లైడింగ్‌లో విప్లవాత్మక మార్పు వచ్చింది. దీనిపైనే వారి భవిష్యత్తు పేటెంట్‌లన్నీ ఆధార పడ్డాయి. రెక్కల చివరలలో కదిలే వాటిని మార్చటంతో నడిపే వాడికి పని తేలికై ఒకసారి ఎగిరితే గాలిలో దాన్ని స్థిరంగా ఉంచటం సాధ్యమైంది. దీనితో బైసికిల్ బిజినెస్ దెబ్బతింది. అందులోని స్పేర్ పార్టులన్నీ దీనికోసం వాడారు. 1900 ఆగస్ట్‌లో రైట్ సోదరుల కొత్త గ్లైడర్ తయారైంది.

మొదటి ఫలితాలు ఆశా జనకంగా రాలేదు. కాని ఎంతో అనుభవం వచ్చింది. గ్లైడింగ్ ఫ్లైట్‌లను కంట్రోల్ చేయగలం అనే నమ్మకం కుదిరింది. అసలైన ఎగురుడు ఎంతో దూరం లేదని పించింది. డేటాన్‌కు సోదరులు చేరుకొన్న వెంటనే ఇంతకు ముందెన్నడూ ఎవరూనిర్మించని అతిపెద్ద ఎగిరే యంత్రాన్ని తయారు చేశారు. కిట్టీ హాక్‌లో దాన్ని ప్రయోగంగా నడిపి అంతకు ముందు కొన్ని సెకన్లు మాత్రమే ఉన్న గ్లైడింగ్ రికార్డ్‌ను బద్దలుకొట్టి, ఎక్కువ దూరం ఎక్కువ కాలం ఎగిరారు. ద్విగుణీకృత ఉత్సాహంతో సోదరులు మళ్ళీ ప్రయత్నాలు చేశారు. డేటన్ వచ్చి విండ్ టన్నెల్స్‌ను, సుమారు 200 రెక్కల నమూనాలను రూపొందించారు. స్వయంగానే నేర్చి సంక్లిష్ట పట్టికలు, జటిలమైన లెక్కలేనన్ని గణిత సూత్రాలను తయారు చేశారు. “లెక్కల సూత్రాలపై ఎగిరే యంత్రాలు నమ్మకమైనవి కావు అని తెలిసింది” అని ఆ తర్వాత రాశారు. ఒకదాని తర్వాత ఒకదాన్నిశాస్త్రీయంగా ప్రయోగం చేస్తూ, అనుమానించిన వాటిని వదిలేస్తూ రెండేళ్ళు కఠోర శ్రమ చేసి విసిగి వేసారి చివరికి తామే స్వయంగా పరిశోధన చేసి తేల్చుకోవాలనుకొన్నారు. అత్యంత శాస్త్రీయ బద్ధంగా ఆలోచించి విమానం తయారు చేయాలనే సంకల్పానికి వచ్చారు.

1902 శిశిరంలో కిట్టేన్ హాక్‌లో కొత్తగా అభివృద్ధి చేసి తయారు చేసిన మూడవ గ్లైడర్‌ను వాడారు. రెక్కల పొడవు 32 అడుగులు. రెక్కల అమరికలో మార్పులు చేసి తోక కూడా ఏర్పాటు చేశారు. అన్ని రకాల పరీక్షలు నిర్వహించి సుమారు వెయ్యి

గ్లైడింగ్ ఫ్లైట్స్ తయారు చేశారు ఇద్దరూ. ఆరువందల అడుగుల పొడవుతో కొన్ని రెండు నెలలలో తయారు చేశారు. పార్శ్వ సమతుల్యతను అనేక చిట్కాలతో రెక్కలలో మార్పులతో సాధించారు. మరో అడుగు ముందుకు వేయటానికి సిద్ధమైనారు. అదే "పవర్ ఫ్లైట్". అప్పటికి విల్బర్‌కు 36, ఆర్విల్లీకి 32 ఏళ్ళు. ఇద్దరూ సన్నగా పుల్లలాగా తీగల్లాగా ఆరు, అయిదున్నర అడుగుల అందగాళ్ళుగా, స్టీల్ బ్లూ కళ్ళతో, డేగ చూపుతో దృఢమైన శరీరంతో ఉండేవారు. ప్రముఖ అమెరికన్ కవి రచయిత "ఎడ్గార్ అల్లెన్ పో" పోలికలుండేవి. చిన్నోడిని ఒక సభలో మాట్లాడమంటే "నాకు చిలుక పక్షి ఒకటే తెలుసు కాని అది బాగా ఎగరలేదు కదా" అని చెప్పి కూర్చున్నాడట. విల్బర్ రైట్ జీవితం గురించి గ్రిఫ్ఫిత్ "ది లైఫ్ అండ్ వర్క్ ఆఫ్ విల్బర్ రైట్" పుస్తకంలో "To try to be always comfortable and happy was a mistake, for, if one succeeded life became unbearably monotonous" అన్నాడని రాశాడు. విల్బర్ ఆర్విల్లీలిద్దరూ చాలాపవిత్రంగా ఉండేవారు. తాగుడు, స్మోకింగ్ వారు ఎప్పుడూ చేయలేదు. సబ్బాత్‌లో చెప్పిన నాలుగవ కమాండ్ మెంట్‌ను తూ చా తప్పక ఆచరించేవారు. సాధారణ వ్యాపారవేత్తల దుస్తులనే ధరించేవారు. బజారులో తిరిగే బట్టలతోనే ఆర్విల్లీ గ్లైడర్‌లో కూర్చునేవాడు. కళ్ళజోడు హెల్మెట్, చేతి తొడుగులు ధరించేవాడు కాదు. లేకపోతే ఆల్బర్ గ్రే సూట్‌లో బాగా గంజి పెట్టిన కాలర్‌తో పైలట్‌గా ఉంటే చూస్తూండేవాడు.

"దేవుడు మనిషిని ఎగిరేట్లు చేయాలనుకొంటే రెక్కలు పెట్టే వాడే కదా" అని సన్నాయి నొక్కులు నొక్కారు. దాదాపు వెయ్యి సార్లైనా వీళ్ళ ప్రయత్నాలపై నీళ్ళు చల్లే ప్రయత్నాలు చేశారు జనం. కాని అధైర్యపడకుండా జంకకుండా ముందుకే వెళ్ళారు రైట్ సోదరులు. గాసోలిన్ ఇంజన్‌ను పకడ్బందీగా తయారు చేశారు. ఇదే తగినదని భావించారు. వీళ్ళకు అనువైన మోటారు తయారు చేసివ్వటానికి కంపెనీలు చాలా బిజీగా ఉండటం వలన ముందుకు రాలేదు. కనుక అదీ వాళ్ళే తయారు చేయాలనుకొన్నారు. 1903 వేసవి అంతా దీనికోసమే వెచ్చించారు దీక్షగా. వీరి కృషిని సమీక్షిస్తూ "ది రైట్ బ్రదర్స్" పుస్తకంలో ఫ్రెడ్ సి కెల్లీ "ఈ పవర్ మెషీన్ రెక్కలు నలభై అడుగులకు పైన కొన్ని అంగుళాలు. పై రెక్క కింది రెక్క మధ్య దూరం ఆరు అడుగులు. ఇంజన్ పైలట్ మీద పడకుండా ఉండటానికి దాన్ని కింద రెక్కపై మధ్యనుండి కొంచెం కుడివైపుకు అమర్చారు. పైలట్ మధ్యనుంచి కొంచెం ఎడమవైపు పడుకొని బాలన్స్ సమకూర్చుకొని నడిపారు. దిగేటప్పుడు మెషీన్ దొర్లి కిందపడకుండా రన్నర్‌లను విస్తృత పరచారు. తోక కదిలే రెండు బ్లేడ్ ఆకారాలతో నిర్మించారు".

1903 నవంబర్‌లో ఈ కొత్త యంత్రాన్ని కిట్టీ హాక్‌లో ప్రయోగం చేశారు. లోపాలు గుర్తించి సరిచేశారు. కొన్ని భాగాలు తీసి పారేశారు కొత్తవి కొన్ని అమర్చారు. డిసెంబర్ 14న విల్బర్ పైలట్ అవతారం ఎత్తాడు. యంత్రాన్ని నడిపి పైకి లేపి మూడున్నర నిమిషాలు గాలిలో తేలి దింపాడు. కొన్నిభాగాలు దెబ్బతిన్నాయి అది ఎగురుతుంది అనే ధైర్యం వచ్చింది. రిపేర్ చేశారు. ఆర్విల్లీ వంతు వచ్చింది. కాని నిరాశగా ఉంది. ఉదయం బాగా చలి, గాలి ఉన్నాయి. గంటకు ఇరవైఏడు మైళ్ళ వేగంతో గాలి వీస్తోంది. సోదరులు పనిలో స్వేచ్ఛ ఉండదని ఓవర్ కోట్ తొడుక్కోలేదు. డిసెంబర్ 17న మళ్ళీ ప్రయోగం చేశారు. ఇంజన్‌లోంచి వింత శబ్దాలొచ్చాయి. చుక్కాని వణికింది కాని యంత్రం మాత్రంపైకి లేచింది. 12 సెకన్లు గాలిలో నిలబడింది. ఆర్విల్లీ మాటలలో "ఇదే మొట్టమొదటి సారి మనిషితో యంత్రం గాలిలోకి పైకి స్వయంగా లేచి స్వేచ్ఛగా పూర్తిగా ఎగరటంతో చరిత్ర సృష్టించబడింది" అన్నాడు. స్పీడ్ తగ్గించకుండా ముందుకు సాగింది. ఎంత ఎత్తుమీదనుంచి లేచిందో అంత ఎత్తుమీద దిగింది. రైట్ సోదరుల నాలుగవ ప్రయత్నం విజయవంతమైంది. 59 సెకండ్లు అత్యద్భుతంగా గాలిలో స్థిరంగా యెగిరి రికార్డ్ నెలకొల్పింది. ప్రపంచం అంతా ఈ క్షణాల కోసమే నిరీక్షించింది. అందరి హృదయాలలో హర్షం ఆనందం వెల్లివిరిశాయి. బలహీనమైన రెక్కలు లేని ద్విపాద జీవి గాలిలో ఎగిరిన మధుర క్షణం అది. నిజంగానే మానవుడు గాలిలో యెగిరి చరిత్ర సృష్టించాడు. ఈసడించిన వారికి సత్తా చాటి చూపించి తాము కన్నకలలను నిజం చేసుకొన్నారు రైట్ సోదరులు. విమానయానానికి తొలిసారి రైట్ చెప్పారు. దీని తర్వాత ఇంకా సామర్ధ్యమున్న ఫ్లైట్‌లను నిర్మించారు. తమ ఊరికి కిట్టీహాక్ చాలా దూరంగా ఉన్నందున డేటాన్ దగ్గరే హాఫ్మాన్ ప్రయరీ భూములలో ప్రయోగాలు చేశారు. 51వ ఫ్లైట్‌లో ఒక నిమిషం సేపు ఎగిరారు. 1904లో 5నిమిషాలు గాలిలో తేలారు. ఏడాది తర్వాత 11మైళ్ళు తర్వాత 15, 20 మైళ్ళు ఎగిరారు. అక్టోబర్ 5నాటి ఫ్లైట్‌లో 24 మైళ్ళు అరగంట సేపు ప్రయాణించారు. అయిన ఇవేవీ అసలైన వార్తలుగా నిలబడలేదు. పేపర్లేవీ దీన్ని పట్టించుకోలేదు. నిర్లిప్తంగా ఉండిపోయాయి. దినపత్రికలు విషం కక్కాయి. "ది సైంటిఫిక్ అమెరికన్" పత్రికే" ఎగరటం అంతా అబద్ధం" అంది. న్యుయార్క్ హెరాల్డ్ పత్రిక కరేస్పాండెంట్ ఒక ప్రత్యక్ష సాక్షి కథనాన్ని పంపిస్తే యాజమాన్యం తిరస్కరించింది. "నువ్వు రాసిన కథనం చదవటానికి సరదాగా ఉంది. అది సత్యమూకాదు, ఫిక్షనూ కాదు" అని తేలికగా కొట్టిపారేస్తూ అన్నాడట ఎడిటర్. అమెరికా సైన్యం కూడా దీన్ని పట్టించుకోలేదు, ఆసక్తీ చూపలేదు.

కాని యూరప్ దేశం విమాన యానాన్ని క్రేజీగా భావించింది. 1908లో విల్బర్ అన్ని రికార్డులు బద్దలు కొట్టిఫ్రాన్స్‌కు వెళ్లి 360 అడుగులపైకి విమానం నడిపి గంట ఇరవైనాలుగు నిమిషాలు ఆకాశంలో చక్కర్లు కొడితే అవాక్కయి జనం వీక్షించారు. ఇక్కడ అమెరికాలో ఆర్విల్లీ అనేక బహుమతులు అందుకొంటూ, యుద్ధ శాఖ ఉదాసీనతను భగ్నం చేశాడు. 1911లో ఈ బైసికిల్ తయారీ దార్లు విమానాలు తయారు చేయటం ప్రారంభించారు. అప్పుడప్పుడు గాలిలో ఎగిరినా ఎగరటానికంటే తయారు చేయటంపైనే శ్రద్ధ చూపారు. అకస్మాత్తుగా నకిలీ విమానాలు మనుషులు, తమ పేటెంట్ హక్కులపై కేసులు, విజయాలతో రైట్ సోదరులు చాలా ఇబ్బందులు పడ్డారు. అంతిమ విజయం సోదరులదే అయినా, అప్పటికే విల్బర్ కేసులతో నీరసించి, న్యాయ పోరాటంలో, అతి శ్రమవలన అలసిపోయి టైఫాయిడ్ పాలై 30-5-1912న 46 ఏళ్ళు వచ్చే ముందు చనిపోయాడు. సోదరుల రెక్కలలో ఒకటి విరిగిపోయింది.

ఆర్విల్లీ వ్యాపారం కొనసాగించాడు. ఒంటరిగా చేయలేననుకొన్నాడు. అన్న చనిపోయిన మూడేళ్ళ తర్వాత కంపెనీని, పేటెంట్‌లను అమ్మేశాడు. కాని విమాన తయారీలో రిసెర్చ్ మాత్రం ఆపలేదు. చాలా ఎయిర్ క్రాఫ్ట్ ఫాక్టరీలకు కన్సల్టంట్‌గా ఉన్నాడు. అరుదుగా పబ్లిక్‌గా కనపడేవాడు. కారణం అనారోగ్యం అని చేప్పేవాడు. వివాదాల జోలికి పోకుండా ఉన్నా, స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూట్‌తో దీర్ఘకాలం వైరం సాగింది. యాభై ఏళ్ళకే బాగా ముసలివాడైపోయాడు. అన్న మరణం తర్వాత 36 ఏళ్ళు జీవించి, ఊపిరితిత్తుల వ్యాధితో 30-1-1948న 87 ఏడేళ్ళ వయసులో ఆర్విల్లీ రైట్ అస్తమించాడు. మరో రెక్క రాలిపోయింది.

ఆర్విల్లీ మరణం తర్వాత ఒక నెలకు నేవీకి చెందిన ఎఫ్ జే 1 అనే ఫైటర్ ప్లేన్ సియాటిల్ నుంచి 950 మైళ్ళు ఉన్న లాస్ ఏంజెల్స్‌కు ఒకగంట యాభై ఎనిమిది నిమిషాలలో చేరింది. కిట్టీహాక్‌లో 12సెకన్లు ఎగిరిన రైట్ సోదరుల విమానాన్ని సౌత్ కేంసింగ్ టన్ మ్యూజియంలో భద్ర పరచారు. వార్తాకథనానికి అది ఊగిందో లేదో రుజువూ కాలేదు, మనిషి ఎగరటం అసాధ్యం అన్న ప్రొఫెసర్ న్యుకామ్బ్ సమాధి నుంచి కంగారుపడి లేచి బయటికీ రానూ లేదు.❁



## 45. రేడియో యాక్టివిటీ కనిపెట్టి నోబెల్ బహుమతి పొందిన తొలి మహిళ - మేరీ క్యూరీ (1867-1934)

రోగ చికిత్సా విధానంలో కొత్త మూలకాన్ని కనిపెట్టి, 35 ఏళ్ళకే భర్తతో పాటు విఖ్యాతురాలై చిన్న కుటీరంలో అనామకంగా ఉన్న మేరీక్యూరీ. పోలాండ్‌లోని వార్సాలో స్కోడోవ్ స్కాలో "మార్యా"గా 7-11-1867న జన్మించింది. తండ్రి వార్సా హైస్కూల్‌లో ఫిజిక్స్ ఉపాధ్యాయుడు. తల్లి సంగీత విద్వాంసురాలు, గర్ల్స్ అకాడెమీ ప్రిన్సిపాల్. ఈమె కాక జోశియా, జోసెఫ్, బ్రోన్యా, హెలెన్‌లున్నారు. అందరిలో మార్యా చిన్నది. అందరు చురుకైనవారే. పోలాండ్ రష్యన్ ఆధిపత్యంలో ఉండటం వలన వాళ్ళు పోల్స్‌ను చాలా హీనంగా చూసేవారు. పోలిష్ చరిత్రను మార్చేశారు. పోలిష్ మాండలికాన్ని హేళన చేసేవారు. రష్యన్ భాషలోనే చదువుకోవాల్సి వచ్చేది .తండ్రి జీతం తగ్గించి అవమానించారు. ఈ బాధలు భరించలేక స్కోడో విస్కలు బోర్డింగ్‌లలో చిన్న గదుల్లో పదేసి మందికి పైన ఉండేవారు. చదువుకోనేవారికి బారక్ లాంటి వాటిలో ఉంచి విద్య నేర్పేవారు. ఈ దుర్భర పరిస్థితులలో జోషియా, బ్రోన్యాలకు టైఫాయిడ్ తగిలి చాలా ఇబ్బంది పడ్డారు. పదహారేళ్ళ జోషియా తీవ్రమైన జ్వరంతో బాధ పడ్డాడు. రెండేళ్ళ తర్వాతా దారిద్ర్యంతో, అనారోగ్యంతో, టి.బి.వచ్చి తల్లి చనిపోయింది. 11ఏళ్ళ మర్యాకు ఇది ఆశనిపాతమే అయింది ఆ లేత వయసులో.

యవ్వన ప్రాదుర్భావంలో మార్యా మోడల్ విద్యార్థినిగా ఉండేది. కాని మానసికంగా ఆమెది తిరుగుబాటు మనస్తత్వం. ఆమెకు అవార్డులు రివార్డులు బహుమతులుగా రష్యన్ పుస్తకాలే ఇచ్చేవారు. దారిలో ఉన్న తన దేశానికి ద్రోహం చేస్తున్న రష్యా వాళ్ళ విగ్రహాలపై ఉమ్మి వేస్తూ స్కూల్‌కు వెళ్ళేది. పోల్స్‌కు సార్వభౌమాదికారం కావాలని కోరుకొనేది. ఈ యువ పద్మం చక్కగా క్రమంగా వికసించి శోభించింది. చేపలు పడుతూ, డాన్స్ చేస్తూ, స్ట్రా బెర్రీలు కోసుకొంటూ కొండలెక్కుతూ నీటిలో ఈదుతూ స్నేహితురాళ్ళతో హాయిగా కాలం గడిపేది. ఒక్కోసారి తెల్లవారుజామున నాలుగు గంటలకే నిద్ర లేచేది. పెద్దగా సీరియస్ పుస్తకాలేవీ చదివేదికాదు. అశ్లీలం లేని ప్రమాదం కాని పుస్తకాలే చదివింది. స్కూల్ చదువు పూర్తి అయేసరికి అందరిలో

గౌరవనీయురాలైన అమ్మాయి అనిపించింది.

వార్సాకు తిరిగి వచ్చి "పాజిటి విస్ట్" అనే అండర్ గ్రౌండ్ కార్యక్రమాలు నడిపే బృందంతో చేతులు కలిపింది. సంస్కరణల కోసం కరపత్రాలు తయారు చేయటం, పంచటం చర్చలలో పాల్గొనటం చేసేది. ఈ రహస్య మిషన్ కు "ఫ్లోటింగ్ యూని వర్సిటి" అని పేరు పెట్టుకొన్నారు. 17ఏళ్ళ మేరీ దీన్ని జీవితాంతం జ్ఞాపకం ఉంచుకొన్నది. ఆర్ధిక వనరులు లేక పోయినా, సాధించింది అతి స్వల్పమైనా అది అసలైన సాంఘిక పురోభివృద్ధికి దారి చూపిందని తర్వాత చెప్పింది. వ్యక్తిని తీర్చి దిద్దకుండా కొత్త సమాజం ఏర్పడదు అంటుంది. ప్రతివ్యక్తి తన స్వీయ ఉన్నతికీ కృషి చేస్తూ సమాజాభి వృద్ధికి దోహదం చేయాలని విశ్వసించింది. ఈ బోర్డర్ స్కూల్‌ను స్కోడో వ్ స్కి నిర్వహించటం కష్టమై ఆర్ధికంగా లాభించక వదిలేసి, మరొక చిన్న ఇంటికి మారాడు. ఇప్పుడు పిల్లలు స్వంత కాళ్ల మీద నిలబడే అవకాశం వచ్చింది. 18వ ఏట మార్యా గవర్నస్ అయింది. వచ్చే జీతంలో కొంత డబ్బును పారిస్‌లో మెడిసిన్ చదువుతున్నచిన్నక్క బ్రోన్యాకు పంపేది. మార్యా ఇంటి జనం డబ్బు హజంతో తప్పు దారిన పడే తత్త్వం ఉన్నవాళ్ళు. అదొక నరకమనిపించి, వారంతా ఫ్రెంచ్ భాష తప్ప మాట్లాడారని ఇంట్లో అయిదుగురు నౌకర్లున్నారని, వీళ్ళంతా లిబరల్స్‌లాగా పోజు కొడుతున్నారని ఒక కజిన్‌కు కార్డ్ రాసింది. కొన్ని వారాల తర్వాత మరిన్ని సమస్యలొచ్చాయి. ఈమెకు ఉద్యోగమిచ్చిన యజమాని పెద్దకుటుంబం, చిన్న ఎస్టేట్ ఉన్న వ్యవసాయదారుడు. వాళ్ళ 18 ఏళ్ళ అమ్మాయి తో మంచి స్నేహమేర్పడింది. కూలీల జీవన పరిస్థితి, పాసిటివిస్ట్ ధానాలను తనతో ఆమె చర్చించేది. మార్యా ఆమె అన్న కాసిమిర్ తో ప్రేమలో పడింది. మార్య అంటే ఆ యజమానికి భార్యకూ ఇష్టమే కాని సాంఘికంగా తక్కువ స్థితిలో గవర్నేస్‌గా ఉన్న అమ్మాయిని కోడలిగా చేసుకోవటానికి వారు ఇష్టపడలేదు. కాసిమిర్ యూనివర్సిటీలో చదువుకోటానికి వెళ్ళిపోయాడు. మార్యా అక్కడే ఉండి పోయింది. అక్కకు డబ్బు పంపుతూ ఏదో ఒక రోజు తానూ పారిస్ చేరి చదువుకోవాలని అనుకొన్నది. ఆమె పొజిషన్ మారినా అలాగే మరో అయిదేళ్ళు కొనసాగింది. తర్వాత తండ్రిని చిన్న చెల్లెలు హేలాను వదిలిపెట్టి నాలుగవ తరగతి రైలు పెట్టెలో ఫ్రాన్స్‌కు బయలు దేరింది.

బ్రోన్యా ఒక పోలిష్ రివల్యూషనరి, సహా విద్యార్ధి డ్లుస్కి ని పెళ్ళాడగా మార్యా ఫాకల్టి ఆఫ్ సైన్స్‌లో చేరి తన పేరును గాలిక్ సంప్రదాయంలో మేరీగా రిజిస్టర్ చేసుకొన్నది. అక్కాబావా ప్రాక్టీస్ ప్రారంభించారు. అక్క స్త్రీలకు సంబంధిన రోగాలకు కన్సల్టంట్‌గా ఉండేది. కొంతకాలం హాయిగా కాలం గడిచింది. బ్రోన్యాకు సంతానం కలిగింది. మేరీ రోజూ యూనివర్సిటీకి బస్సులో వెళ్లి రావటానికి అక్కడ లంచ్ చేయటానికి చాలినంత డబ్బు లేక ఇబ్బంది పడేది. 1892 మార్చ్‌లో లాటిన్ క్వార్టర్‌కు మారిపోయింది.

అది ఒక చిన్న "సన్నాసి" గుహలాగా చలిగా ఉండేది. కాని తన కెమిస్ట్రీ లాబ్‌కు 15 నిమిషాల నడక దూరమే. కొన్ని రోజులకే ఆ గది అసౌకర్యంగా ఉండటమేకాక, మురికి కూపం అనిపించింది. తర్వాత రెండేళ్లలో ఇళ్ళుమారుతూనే ఉంది. బావ పంపే అతి చిన్న మొత్తంతో జీవితాన్ని లాక్కొచ్చేది. బ్రెడ్‌తో టీతో మాత్రమే బతికింది. తగినంత ఆహారం, పోషణా లేక ఒకసారి క్లాస్‌లో నీరసం వచ్చి పడిపోయింది కూడా. బావ కంగారుపడి పరిగెత్తుకొచ్చి చూసి ఆమె రోజు మొత్తం మీద రెండు ముల్లంగి దుంపలు, కొద్దిగా చెర్రీ పళ్ళు మాత్రమే తిన్నదని తెలిసి అవాక్కయ్యాడు. ఇంటికి తీసుకు వెడితే అక్క బ్రోన్యా చక్కగా సేవ చేసి కడుపు నిండా తినిపించి సేవ చేసింది. కొన్ని రోజుల తర్వాత మళ్ళీ తన ఇంటికి వెళ్లి చదువుపై దృష్టి పెట్టాలని పట్టు బట్టి వెళ్ళిపోయింది.

మేరీ బుర్రంతా పరీక్షలమీదే ఉంది. కెమికల్స్, కాల్క్యులస్‌లు తప్ప మిగిలిన వాటి గురించి ఆలోచనే లేదు. అందం వికసించి మరింత అందంగా కనిపించి అందరి దృష్టిలో పడేది. ఒకసారి ప్రేమలో పడింది కాని ఇప్పుడు ధ్యాసంతా చదువు మీదే. తీక్షణంగా చదివి చిక్కి శల్యమైంది కాని ఆమె మనస్సు శరీరాన్ని నియంత్రించి ముందుకు సాగేట్లు చేసేది. 26 ఏళ్ళ వయసులో ఫిజిక్స్‌లో ఫస్ట్‌గా మాస్టర్ డిగ్రీ పొందింది. కొన్ని నెలల తర్వాత గణితంలో సెకండ్ వచ్చి పాసైంది. ఆమెకు ఆరు వందల రూబుళ్ళ స్కాలర్ షిప్ వచ్చి ఉత్సాహాన్ని పెంచింది. కాని ఉంటున్న గది మార్చలేదు. తన బీదరికానికి గర్వపడేది "she was proud of her poverty". విదేశంలో ఒంటరిగా స్వతంత్రంగా ఉండటం మేరీకి ఇష్టమైంది. ఇలాంటి సమయంలో పియర్రీ క్యూరీతో పరిచయమేర్పడింది.

మేరీకి అన్ని సౌకర్యాలతో లాబ్ కావాలని ఫ్రెంచ్ టీచర్ పియరీ అర్థం చేసుకొన్నాడు. ఆయన్ను చూడగానే మనసు పారేసుకొన్నది మొదటిసారిగా మేరీ. పియర్రీ పారిస్‌లో 15-5-1859లో పుట్టాడు క్యూరీలు ప్రొటెస్టెంట్ ఆల్సేషియన్లు. తండ్రి డాక్టర్, క్షయ వ్యాధిపై గ్రంథాలు రాసిన రచయిత. పారిస్‌లో మ్యూజియమాఫ్ నేచురల్ హిస్టరీలో రిసెర్చర్. సోదరుడు జాక్వెస్ కూడా పరిశోధకుడు, లాబ్ వర్కర్ కూడా. కొడుకు సంప్రదాయానికి వ్యతిరేకంగా ఉన్నాడని డాక్టర్ క్యూరీ బాధ పడేవాడు. కొడుకుకు 16 ఏళ్ళు వచ్చేదాకా సైన్స్‌లో డిగ్రీ పొందేదాకా ఇంటి వద్ద తానే చదువు చెప్పాడు. 18వ ఏట ఫిజిక్స్‌లో మాస్టర్ డిగ్రీ సాధించాడు. 24 వయసులో సోదరుడితో కలిసి అతి తక్కువ విద్యుత్తును కొలిచే సాధనం కనిపెట్టాడు. తర్వాత "క్రిస్టలైన్ ఫిజిక్స్"పై దృష్టి పెట్టి అతి నాజూకు సున్నిత సైంటిఫిక్ స్కేల్‌ను కనిపెట్టటమే కాక, మాగ్నటిజంలో ప్రాథమిక సూత్రం (ఫండ మెంటల్ లా) కనిపెట్టాడు దానినే ఇప్పుడు "క్యూరీస్ లా" అంటున్నారు.

మేరీని చూసిన మొదటి క్షణంలో పియర్రీ స్త్రీ ద్వేషి అనిపించాడు, కాని ఈ పాలిష్డ్ పోలిష్ అమ్మాయిని చూసి ఫ్లాటైపోయాడు. కాని మేరీ మాత్రం ప్రేమవ్యవహారాలు కాక క్వార్ట్జ్ గురించి క్రిస్టల్స్ గురించి చర్చించేది. చాలా శాస్త్రీయంగా సుదీర్ఘ కాలం ప్రేమ కలాపం సాగింది. అతని మొదటి ప్రేమ కానుక "ఆన్ సిమ్మెట్రి ఇన్ ఫిజికల్ ఫినామినా – సిమ్మెట్రిఆఫ్ ఆన్ ఎలెక్ట్రిక్ ఫీల్డ్ అండ్ ఆఫ్ ఎ మాగ్నెటిక్ ఫీల్డ్" అనే కరపత్రం. ఉన్న పరిస్థితులలో ప్రేమ వ్యవహారం గురించి తీవ్రంగా ఆలోచించింది మేరీ. పది నెలల తర్వాత పెళ్లి చేసుకొని మేరీ క్యూరీ అయింది. ఇద్దరూ స్వేచ్ఛా ఆలోచనా పరులే కనుక వివాహం పౌర వేడుక (సివిల్ సెరిమని)గా జరిగింది. పెళ్లి ఉంగరాల మార్పిడి లేదు. బావ అమ్మ తెల్లని పెళ్లి గౌను కొని బహుమతిగా ఇస్తానంటే నల్ల గౌను ఇస్తే చాలా సంతోషిస్తానని లాబ్‌లో పని చేయటానికి దాన్ని వేసుకొంటానని రాసింది. వాళ్ళ "మధు చంద్రం" హనీమూన్ కూడా పారిస్ దగ్గరున్న వనారణ్యంలోనే నడిచి, సైకిల్స్ మీదా. బాగా ప్రసిద్ధ శాస్త్ర వేత్తలయ్యాక కూడా వారు ఇదే తీరుగా ఉన్నారు. 1895లో చిన్న ఫ్లాట్‌లో ఉన్నారు. అంతకు ముందు ఏనాడూ గుప్పెడు మెతుకులు వండటం రాని మేరీ, అన్నీ నేర్చి ఎక్స్ పర్ట్ ఫ్రెంచ్ మహిళ అయింది. ఇల్లు తీర్చి దిద్దుకోవటం ఆమెకు మరొక ప్రయోగమే. వంటగది ఆమెకు పరిశోధనాలయమే. కొత్త జంట అరుదుగానే సినిమాలు చూసేవారు. సాయం వేళలో స్నేహితులింటికీ చాలా తక్కువగానే వెళ్ళేవారు. ప్రేమ పావురాలు లాగా కలిసి మెలిసి దాంపత్య ఫలంగా అరీన్, ఈవ్ అనే ఇద్దరమ్మాయిలకు జన్మనిచ్చారు.

క్యూరీల వివాహమైన ఏడాదిలోనే విలెం రోఇంజేన్ "ని కిరణాలు" కనుగొన్నాడు. అప్పుడే హెన్రి బెక్వేరల్ యురేనియం లవణాలు కాంతి సోకకుండానే అజ్ఞాత కిరణాలను వెలువరిస్తున్నాయని కనిపెట్టాడు. చీకటిలో వీటిని నల్లకాగితంలో దళసరిగా చుట్టిన ఫోటోగ్రాఫిక్ ప్లేట్ దగ్గర ఉంచితే మచ్చలు ఏర్పరచాయి. కనుక యేవో కిరణాలు వెలువడి ప్లేట్‌ను తాకి మచ్చలేర్పరచాయని గ్రహించాడు. వీటినే "బెక్వేరల్ కిరణాలు" అన్నారు. ఇది తెలుసుకొన్న పియర్రీ మేరీ చేస్తున్న ప్రయోగాలకు సాయం చేశాడు. వీరికి బయటి సహాయం లేదు. నిధుల కొరత. పరికరాలు తగినన్ని లేవు. వాళ్ళ ప్రయోగ శాల ముతక కర్ర దుకాణంలా ఉండేది. గది ఎప్పుడూ చెమ్మతో ఉండేది. వేసవిలో పొగలు వింటర్‌లో ఫ్రీజింగ్ పాయింట్ కంటే కొంచెం ఎక్కువ 42 డిగ్రీల ఫారెన్ హీట్. తెలిసిన అన్నిస్వచ్ఛమైన కెమికల్స్‌ను, రసాయన సమ్మేళనాలను, పరీక్షిస్తూ యురేనియమే కాక, మరొక లోహమూ కంటికి కనిపించని కిరణాలను వెద జల్లుతోందని గ్రహించారు. ఇదే రేడియో ధార్మికత –రేడియో యాక్టివిటి. అయినా పరిశోధనలు చేస్తూనే ఉన్నారు.

తరువాత పని చాలా పెద్దది. కొన్ని సమ్మేళనాలు యురేనియం, థోరియంలకంటే

శక్తి వంతమైనవి అని గుర్తించారు. ఫలితాలను అనేక సార్లు చెక్, రీచెక్ చేసుకొన్నారు. రేడియేషన్ వలన అత్యంత శక్తివంతమైన కొత్త మూలకం ఏర్పడుతుందని గ్రహించారు. యురేనియం ధాతువు అయిన పిచ్ బ్లెండిలో అది చాలా తక్కువ పరిమాణంలో ఉందని తెలిసిన, అది అంత సూక్ష్మ స్థితిలో మిలియన్లో ఒక వంతు (మిలియంత్) ఉంటుందని తెలుసుకోలేక పోయారు. పిచ్ బ్లెండీని ఎక్కువగా సేకరించటం చాలా కష్టమైంది, ఖర్చుతో కూడినదీ. వీళ్ళకు అది టన్నులకొద్దీ కావాలి. పిచ్ బ్లెండీ నుంచి ఉరేనియం పొందిన తార్వాత మిగిలిన దానిలోంచి తాము ఎదురు చూసే మూలకం వస్తుందనుకొన్నారు. ఖర్చుకు వెనకాడకుండా నిరుత్సాహ పడకుండా సేకరించి ప్రయోగాలు చేశారు. ఎట్టకేలకు తాము ఎదురు చూసిన "పొలోనియం" మూలకాన్ని ఆవిష్కరించి లోకానికి తెలియ జేశారు. క్యూరీ దేశం పోలాండ్ పేరుతో దాన్ని పొలోనియం అన్నారు. పోలాండ్‌కు ప్రాచీనమైన పేరు పొలోనియా. గొప్ప పవిత్ర ఘడియలుగా వారి జీవితాలలో నిలిచి పోయాయి.

లాబ్‌లో మెరీ ది "పగటి కూలి" పాత్ర. అనేక గాజు జార్లలో సమ్మేళనాలు, అవక్షేపాలు నిలువ చేయటం, టన్నుల కోద్దీ పిచ్ బ్లెండిని అతి సూక్ష్మంగా శుద్ధి చేసి, మరిగే నీటిలో ఉడికించటం ఆమె పని తల్లిగా, భార్యగా, ఇల్లాలుగా, సైంటిస్ట్‌గా అన్నీ సర్వ సమర్ధంగా నిర్వహిస్తోంది మేరీ. పిల్లలకోసం గూస్ బెర్రీ జ్యూస్, రుచికరమైన వంటకాలు చేస్తూ పెద్దమ్మాయికి చదువు నేర్పుతూ ఆదర్శ గృహిణిలా ఉంది. లాబ్ చాలా చల్లగా ఉండటం, వెచ్చదనానికి పెట్టె స్టవ్ అయిదడుగుల దూరంలో ఉంచటంతో ఆమె నరకమే అనుభవించింది. దీనికి తోడూ పైకప్పు చిల్లులు పడినీళ్ళు కారటం, పొగ బయటికి వెళ్ళే చిమ్నీ కూడా లేక పోవటం ఆమె పాలిటి మృత్యు పాశాలే అయ్యాయి. "ఇలాంటి వ్యతిరేక పరిస్థితులలో మేమిద్దరం అన్యోన్యంగా ఆనందంగా మా పరిశోధన చేసి విజయం సాధించాం. పెద్ద పెద్ద పాత్రలలో ద్రవాలు ఉడకటం పొంగటం నా అంత అంతపొడవైన బలమైన ఇనుప రాడ్‌తో ఆ ద్రవాన్ని కలపటంతో రోజు రోజంతా గడిచి పోయేది. సాయంకాలానికి తీవ్ర అలసట వచ్చేది. అయినా అవన్నీ మాకు మధురాతి మధురమైన రోజులు" అని రాసుకొన్నది మేరీ.

క్యూరీ దంపతులు బతకటానికి సంపాదించటమే కాక, అడ్డంకుల్ని అధిగమించాల్సి వచ్చేది. పొలోనియం కనిపెట్టిన ఆరు నెలలకే "రేడియం" అనే మరో కొత్త మూలకాన్ని కనిపెట్టి దానికి సంబంధించిన పత్రాలను విడుదల చేశారు. కాని మరొక 45 నెలల తర్వాతనే ఒక "డెసిగ్రాం" బరువున్న రేడియంను ఉత్పత్తి చేసింది మేరీ. దీని రేడియో ధార్మికత యురేనియం ధార్మికత కంటే ఒకటిన్నర మిలియన్ల రెట్లు ఎక్కువ. 1899-1904 లోపు 30కి పైగా సైంటిఫిక్ పేపర్లు రాసి ప్రచురించారు క్యూరీ దంపతులు. రేడియం చాలా ప్రాణాంతకమైనా, తీవ్రంగా శరీరానికి బొబ్బలు వంటివి కలిగించినా, అది కొన్ని రకాల వ్యాధులకు నివారణగా ఉపయోగిస్తుందని తెలియజేశారు. వ్యాధి

సోకిన కణాలను నాశనం చేసి, అవి మళ్ళీ వృద్ధి చెందకుండా చేస్తుందన్నారు. కొన్ని రకాల కేన్సర్‌ను కూడా నివారిస్తుందని చెప్పారు. 1902లో అకాడెమీ ఆఫ్ సైన్స్ మేరీకి రేడియో యాక్టివ్ పదార్థాన్ని శుద్ధి చేసి సాధించినందుకు 20 వేల ఫ్రాంకులను కానుకగా అందజేసింది. పారిస్ యూనివర్సిటీ మేరీని "డాక్టర్ ఆఫ్ ఫిజికల్ సైన్స్" ఇచ్చి గౌరవించి సత్కరించింది. 1903లో రేడియో యాక్టివిటీ ఆవిష్కరణ చేసిన హెన్రీ బెకరెల్‌కు, క్యూరీ దంపతులకు సంయుక్తంగా "నోబెల్ ప్రైజ్"నిచ్చారు.

అనాటికి ఒక గ్రామ్ రేడియం ఖరీదు 1,50,000 డాలర్లుగా నిర్ణయించారు. దీన్ని స్వార్ధం కోసం వాడుకోవాలని క్యూరీ దంపతులు భావించక. అలా చేస్తే సైన్సుకే ద్రోహం చేసినట్లుగా తలచారు. వ్యాధుల చికిత్సా విధానంలో ఉపయోగపడే రేడియం ఏ ఒక్క వ్యక్తీ స్వంతం కాదని అది విస్తృత మానవాళికే చెందాలని చెప్పారు. దానిపై "పేటెంట్" తీసుకోలేదు. తమ పరిశోధనా ఫలితాలను రహస్యంగా ఉంచక బహిర్గతం చేశారు. నోబెల్ నగదు బహుమతి చాలా ఎక్కువగా రావటంతో పియర్రీ టీచింగ్‌ను వదిలేశాడు. ప్రత్యేక విందులు వినోదాలకు హాజరు కాలేదు ఆ దంపతులు. ఫ్రాన్స్‌లో అత్యున్నతమైన "లీజియన్ ఆఫ్ ఆనర్" ఇస్తామని మినిస్టర్ తెలియజేస్తే తనకు దానికంటే లాబ్ అభివృద్ధి ముఖ్యం అని తెలియజేశాడు. ఏడాది క్రితం వరకు జనాలకు పట్టనీ, ఎవరికీ తెలియని ఈ అజ్ఞాత జంటను ఇప్పుడు చూడటానికి, సందర్శించటానికి ఇంటర్వ్యూలకు వేలాది జనం నిత్యం వస్తున్నారు, అభినందిస్తున్నారు. సంచులకొద్దీ అభినందన ఉత్తరాలొస్తున్నాయి. లెక్చర్ టూర్‌లకు రమ్మని, సన్మానాలు స్వీకరించమనే వినతులు వెల్లువలా వస్తున్నాయి. అమెరికా ప్రభుత్వం సాదర ఆహ్వానం పలికింది. చివరికి అకాడెమి ఆఫ్ సైన్స్ పియర్రీని తీసుకొన్నది వాళ్ళకూ ఈయనకూ పూర్తిగా ఇష్టం లేకుండానే. సార్బారన్‌లో ప్రొఫెసర్ షిప్ ఇచ్చి పూర్తికాలం పరిశోధనలోనే గడపమని కోరారు. ఒక సంపన్నురాలు అన్ని వసతులతో లాబ్ నిర్మించి అందజేస్తానని ముందుకొచ్చింది కాని ఆ అదృష్టాన్నీ, ఆనందాన్ని అనుభవించలేక పోయాడు పియరీ. 1906 ఏప్రిల్ 19న నోబెల్ పొందిన రెండేళ్లకు ఒక వర్షపు రోజున తన పబ్లిషర్‌ను కలవటానికి పియరీ వెళ్ళాడు. రోడ్లు జనసమ్మర్దంగా ఉండి, కాళ్ళు జారిపోతున్నాయి. రోడ్డు దాటే ప్రయత్నంలో ఎదురుగా వచ్చే రెండు చక్రాల గుర్రపు బండీని గమనించలేదు. గుర్రాలు అదుపు తప్పాయి. పియరీ ఒక గుర్రానికి తగులుకొని వ్రేలాడిపోయాడు. కొన్ని క్షణాలు సురక్షితంగానే ఉన్నట్లు కనిపించాడు. గుర్రాలను తప్పించుకొన్నా, బండి చక్రాల కిందపడి తల చితికిపోయి, ఆ బురదలో మెదడు ముక్కలు ముక్కలై కూరుకుపోయి దారుణంగా ఆ నోబెల్ లారియేట్ పియరీ క్యూరీ మరణించి, భార్య మేరీకి తీవ్ర మానసిక వేదన మిగిల్చాడు.❁



## 46. ప్రపంచ ప్రసిద్ధ ఆర్కిటెక్ట్ ఫ్రాంక్ లాయడ్ రైట్ (1869-1959)

యవ్వనంలోనే "నేను నిజాయితీ ఉన్న అహంకారి, కపట మానవత్వం ఉన్న వాళ్ళలో దేనిని ఎంచుకోవాలను కొంటె, నేను ఆనేస్ట్ ఆరోగెన్స్‌నే ఎంచు కొంటాను దీనిలోంచి మారటానికి నాకేమీ కారణం కనిపించలేదు" అని ధైర్యంగా చెప్పిన వాడు, "ఇంత వరకు నాలాంటి మహాగొప్ప ఆర్కిటెక్ట్ పుట్టలేదని, ఇక పుట్టదని, నేను చరిత్రలో ఎన్నడూ జన్మించని అతి గొప్ప ఆర్కిటెక్ట్‌గా నిలబడి పోతాను" అని చాలెంజీగా చెప్పిన వాడు దాన్ని రుజువు చేసుకొన్న వాడూ ఫ్రాంక్ లాయడ్ రైట్. ఆయనకు 70 ఏళ్ళు వచ్చేసరికి అభిమానులు పొంగిపోయారు, విమర్శకులు ఆయన అహంకారం చాలా నిజాయితీతో కూడినదే నని అంగీకరించారు. 80వ ఏట ఆయనలాంటి ఆర్కిటెక్ట్ కొత్త ప్రపంచంలో జన్మించనే లేదనీ, అత్యంత సృజనశీలి, అన్నికాలాకు ఆయనే జీనియస్ అని ఏకగ్రీవ నిర్ణయానికి అందరూ వచ్చారు. ఆయనను "ఫుజియామా ఆఫ్ అమెరికన్ అర్కిటెక్చర్, ప్రకాశించే అత్యున్నత శిఖరం" అని ప్రశంసించారు .

ఫ్రాంక్ లాయడ్ రైట్ 8-6-1869న అమెరికాలోని విస్కాన్సిన్ రాష్ట్రంలో ఉన్న రిచ్‌లాండ్ సెంటర్‌లో పుట్టాడు. తల్లి అన్నా లాయడ్ జోన్స్ వెల్ష్ హాటర్, యునిటేరియన్ ప్రీచర్ విస్కాన్సిన్ కు వలస వచ్చిన ఆయన కూతురు. తండ్రి విలియం రసేల్ కారీ రైట్ ఇంగ్లీష్ వాడు. కనెక్టి కట్ లోని హార్ట్ ఫోర్డ్ నుంచి వచ్చాడు. తండ్రి లా, మెడిసిన్ చదివి తర్వాత రెండూ వదిలేశాడు. డజనుకు పైగా ఉద్యోగాలలో వేలుపెట్టాడు కాని ఎందులోనూ నిలబడలేక చివరికి సంగీతం నేర్చి మినిస్టర్ అయ్యాడు. విస్కాన్సిన్‌లో సంగీత ప్రచారం చేస్తూ అన్నాను కలిశాడు. ఆమెను పెళ్లి చేసుకొన్నాకే ప్రీచర్ అయ్యాడు. వారి మొదటి సంతానమే ఫ్రాంక్. ఇద్దరు ఆడపిల్లలు జెన్నీ, మాగినేల్‌లు. ఫ్రాంక్‌కు మూడో ఏడు వచ్చాక తండ్రిని బోస్టన్ చర్చ్‌కు ఆహ్వానించారు. అక్కడకు వెళ్ళినా ఎక్కువ కాలం ఉండక బాక్ టు పెవిలియన్‌గా విస్కాన్సిన్‌కు తిరిగొచ్చేశాడు. మాడిసన్‌లో మ్యూజిక్ కన్సర్వేటరి ప్రారంభించాడు. ఇందులో చెయ్యి కాల్చుకొని ఎందులో వేలేట్టినా,

వివాహంతో సహా ఏదీ కలిసిరాక ఫైల్యూర్‌గా మిగిలిపోయాడు. తల్లి మాత్రం ఫ్రాంక్ మీదే దృష్టి పెట్టింది. తల్లి గారాల కూచి అయ్యాడు ఫ్రాంక్ లాయడ్ రైట్. అతనిలో ఆమె జీవించింది అంటే అతిశయోక్తి కాదన్నాడు చరిత్రకారుడు. తలిదండ్రుల మధ్య సయోధ్య సాగ లేదు. విడిపోయారు. తండ్రి ఇల్లు విడిచి వెళ్లి, మళ్ళీ కనిపించనే లేదు.

తల్లి అన్నాకు పెద్ద పెద్ద భవనాలంటే మహా ఇష్టంగా ఉండేది. ఫ్రాంక్ కడుపులో పడినప్పుడే దరిద్రంతో బాధ పడుతున్నా, తనకు మొదటి సంతానం మగపిల్లాడే కలగాలని వాడు ఆర్కిటెక్ట్ కావాలని కోరుకొన్నది. ఎంతో త్యాగం చేసి కొడుకును చదివించింది. కాని 14ఏళ్ళ వయసులో అతడు దారి చూపేవాడుకాని, స్వంతకాళ్లపై నిలబడేవాడుగా కాని అనిపించలేదు. అతని అంకుల్ ఫారంలో పని చేసి ఏదో కొంత సంపాదించేవాడు. కాలేజిలో చేరి, మధ్యాహ్న సమయాలలో ఒక ఆర్కిటెక్ట్ ఆఫీస్‌లో పని చేస్తూ ఫీజుకు సరిపడా డబ్బు సంపాదించేవాడు. విస్కాన్సిన్ యూనివర్సిటిలో ఆర్కిటెక్చర్ కోర్సు లేనందున సివిల్ ఇంజినీరింగ్‌లో చేరాల్సి వచ్చింది. దానికి విచారించలేదు. పైగా ఇమిటేషన్ వలన ఆర్కి టెక్చర్ మీద మోజు మరింత పెరిగిందన్నాడు.

యూని వర్సిటీలో చదువుతూనే, ఏదో పని చేస్తూనే ఉన్నాడు. ఇక ఇక్కడ చదవటం వృథా కాలక్షేపమే అనిపించింది. ఇంటి దగ్గరే ఏదో స్వయంగా సాధిస్తూ జీవికకు డబ్బు సంపాదించాలను కొన్నాడు. తల్లి చెప్పినట్లు మాడిసన్ చికాగోలకు వెళ్ళాడు కాని ఉపయోగపడలేదు. ఆర్కి టెక్చరల్ ఫార్మ్‌లో పని చేస్తూ వదిలేస్తూ వారానికి ఎనిమిది డాలర్లు ఆర్జిస్తూ, పది డాలర్లు అప్పు తీసుకొని వారానికి రెండు డాలర్లు తీరుస్తూ తల్లికి ఆర్థిక సాయం అందించాడు. ఇప్పుడే జీవితంలో సరైన నిర్ణయం తీసుకోగలిగానని సంతృప్తి చెందాడు ఫ్రాంక్. జీతం పెంచమని కోరితే తిరస్కరిస్తే, ఉద్యోగం వదిలేసి మరో కొత్త ఉద్యోగంలో ఎక్కువ జీతంలో చేరుతూ గడిపాడు. తాను జీతానికి కాని, పనికి కాని పనికి రానని తేల్చుకొన్నాడు. మళ్ళీ పాత ఫార్మ్‌లోనే చేరుతానని చెప్పి అంగీకరించగా చేరి బాగానే సంపాదిస్తూ తల్లిని చెల్లెళ్ళను చికాగోకు తెచ్చి తనతో పాటు ఉండేట్లు చేశాడు. కుటుంబం ఓక్ పార్క్‌లో స్థిరపడింది.

ఇరవైవ ఏడు వచ్చే లోపే ఫ్రాంక్‌కు అడ్లర్, సల్లివాన్ ఫార్మ్‌లో డ్రాఫ్ట్ మాన్ డిజైనర్‌గా ఉద్యోగం వచ్చింది. చికాగోలోనే కాక అమెరికా అంతటిలోను లూయీ సల్లివాన్ గొప్ప అభ్యుదయ ఆర్కిటెక్ట్. అతని దగ్గర పని చేయటం చాలా కష్టమే కాని రైట్ అంకిత భావంతో యజమాని సందేశం “ఫారం ఫాలోస్ ఫంక్షన్”ను అనుసరించి పని చేశాడు. ఫ్రాంక్ ఆయన్ను “లీబల్ మీస్టర్” అని గొప్పగా చెప్పుకోనేవాడు. అది

అతనికి మాంచి యవ్వనోద్రేక కాలం. కేథరిన్ టోబిన్ అనే అమ్మాయితో ప్రేమలో పడ్డాడు. పెళ్లి అయ్యే నాటికి కుర్రాడికి ఇంకా 21 రాలేదు. ఆమెకు 18 మాత్రమే. సల్లివాన్ ఫ్రాంక్‌కు డబ్బు అప్పు ఇచ్చి ఇల్లు కట్టుకోమన్నాడు. మనవాడు అయిదేళ్ళ కాంట్రాక్ట్ రాసి నెల వారీ వాయిదాలలో అప్పు తీరుస్తానని రాశాడు. వంట ఇంటి మీద "truth is life" అని ముందు రాసి తర్వాత "it occurred to me that Life is Truth" అని కలిపాడు.

ఆరుగురు పిల్లలు పుట్టారు. మామూలు తండ్రిగా ఉండటానికి ఇష్టంగా ఉండేది కాదు. ఆదర్శమైన తండ్రిగా ఉండాలని భావించాడు. ఒక్కొక్కరికి ఒక్కో రకమైన సంగీత వాయిద్యాలలో శిక్షణ ఇప్పించాడు. భార్య పియానో బాగా వాయించేది. కొడుకు జాన్ తండ్రి గురించి చెబుతూ "నాన్న బీథొవెన్ లా ఉండేవాడు. కొడుకులు గుర్తింపు పొందే జీవితాలతో రాణించాలని ఆయన కోరిక. సౌందర్యారాధన ఉండాలని కోరేవాడు. అది ఇంట్లో నుంచే ప్రారంభమవాలని చెప్పేవాడు" అని రాశాడు. ఇంకా కాంట్రాక్ట్ కాలం ఉన్నా నెమ్మది నెమ్మదిగా ప్రైవేట్ పనులు చేయటం మొదలుపెట్టాడు. యజమానికి తెలిసి కోపపడ్డాడు. అయినా లెక్క చేయకుండా ఉద్యోగానికి నీళ్ళు ఒదిలేశాడు. తర్వాత తాను చేసింది తప్పు అని తెలుసుకొని సల్లివాన్‌తో చనువుగానే ఉండేవాడు. 25 వయసు వచ్చేనాటికే చికాగోలో ప్రైవేట్ ప్రాక్టిస్ ప్రారంభించాడు. కమిషన్లు మాత్రం వదలలేదు. అతను డిజైన్ చేసిన భవనాలు ప్రత్యేకతతో ఆకర్షణీయంగా చూడముచ్చటగా ఉండేవి. అందరూ వీటిపై మోజు చూపించారు. అతనికి క్లైయింట్ లెవ్వరూ లేరు. అభిమానులూ ఆరాధకులే ఎక్కువగా ఉండేవారు. డబ్బు విషయంలో అజాగ్రత్త వలన దివాలా పరిస్థితి ఏర్పడింది. భార్య భర్తలిద్దరూ చెక్కులపై సంతకాలు చేసి ఇస్తే బౌన్స్ అయి పరువు పోయేది చాలినన్ని నిధులు లేకపోవటం వలన. ఇక బ్యాంక్‌లో డబ్బు లేదని తెలుసుకొని "God give me the luxuries of life, and I will willingly do without the necessities" అని ప్రార్థించిన గడుసు పిండం రైట్.

పనిలో విజయాలు ఉన్నా దేశంలో గుర్తింపు నెమ్మదిగా వచ్చింది. ఎవరో ఒకరిద్దరు తప్ప అతని సహ ఆర్కిటెక్ట్‌లు ఫ్రాంక్ సృజనను తక్కువగా అంచనా వేశారు. ఎగతాళి చేశారు, చెత్త అన్నారు. అతని డిజైన్‌లు ఆచరణ సాధ్యం కావని తిరస్కరించి పక్కన పడేశారు. స్వయంగా ఆతను చూపిన చొరవను అర్థం చేసుకోలేకపోయారు. ఫ్రాంక్‌కు నలభై ఏళ్ళు వచ్చేసరికి యూరప్‌లో అతని పనితనంను ప్రస్తుతించి అభిమానించి నెత్తి కెత్తుకొన్నారు. అతను సాధించిన మహోన్నత విజయాలను జెర్మనిలోని ఒక పబ్లిషింగ్ హౌస్ రికార్డ్‌గా ప్రచురించి ప్రపంచానికి అతని సృజనాత్మక శక్తిని తెలియజేసింది.

సమకాలీన ఫాషన్‌లను త్రోసి రాజని, కొత్త అభివృద్ధి విధానాలతో అతనికే ప్రత్యేకమైన "ఆర్గానిక్ ఆర్కి టేక్చర్ స్టైల్" ఆవిర్భవించింది. అనవసర నగిషీలు, విదేశీ బాణీలు వదిలేసి ఉన్నత పవిత్ర శైలిని పక్కకు పెట్టి, సంపూర్ణ స్వయంసిద్ధ ఆకృతులకు రూపకల్పన చేశాడు. రాజీలేని మనస్తత్వం అతనిది. "principle is the only safe precedent" అనేదే అతని ఆదర్శం. రైట్ స్వయంగా డిజైన్ చేసిన మొట్టమొదటి భవనం చాలా చిన్నదే కాని విప్లవాత్మకమైనది. 1893 నాటికి ఇళ్ళు అన్నీ ఎత్తైన బేస్‌మెంట్‌లతో, అటకలతో, ఇంటికి మించి చూరుతో, వాలు రూఫింగ్‌లో నిలువుగా ఉండే కిటికీలతో పెట్టెలలాగా ఒక పెట్టెలో ఎన్నో పెట్టెలులాగా ఉండేవి. గదులన్నీ , డోర్లతో పార్టిషన్‌లతో, హాళ్ళు చీకటి గుయ్యారాల్లా ఉండేవి. ముందుగా అసహ్యంగా కనిపించే బేస్‌మెంట్ కన్నాలను తీసి పారేశాడు. అటకలను ఎత్తేశాడు. గదులను విశాలంగా నివాస యోగ్యంగా మార్చాడు. ఫైర్ ప్లేస్ ఏర్పాటు చేశాడు. ఇంటికి ఇంటీరియర్ స్పేస్ అనేది కొత్తగా కల్పించాడు. దీనితో "ఆర్గానిక్ ఆర్కి టెక్చర్"కు ప్రాణ ప్రతిష్ఠ చేశాడు. వంట గది సకల సదుపాయాలతో ఆకర్షణీయంగా వచ్చింది. డైనింగ్ ఏరియాకు లివింగ్ రూమ్‌కు స్థానం కల్పించాడు. దీనినే "ఓపెన్ ప్లాన్" అన్నారు. ఫర్నిచర్‌కు వీలు ఉండేట్లు ఫ్లోర్ స్పేస్‌లన్నీ లివింగ్ రూమ్స్ అయ్యాయి. టేర్రేసులు, బాల్కనీలు కొత్తగా వచ్చాయి. ఇంటా బయటా విశాలమైన ఆవరణ ఏర్పడి ముచ్చటగా ఉంది. తరువాత అనేక మార్పులు పొందాయి. "sense of spacious ness"కు అధిక ప్రాధాన్యమిచ్చాడు రైట్.

వస్తువుకు, డిజైన్‌కు ఒక చక్కని సంబంధమేర్పడింది. గొప్ప నాటకీయ మార్గదర్శిగా. విజేతగా ఆర్కిటెక్చర్‌లో స్థిరపడ్డాడు రైట్. ఒకే నమూనాకు మూసపద్ధతిలో ఉండిపోకుండా అవసరాన్ని బట్టి విధానం మార్చాడు. కాని సమకాలికులు మాత్రం మార్పులు చేర్పులతో కాలక్షేపం చేశారు. న్యుయార్క్‌లోని సస్పెండేడ్ గ్లాస్‌వాల్డ్ "లీవర్ హౌస్" ఫ్రాంక్ రైట్ సృజనకు పరాకాష్ఠ. కాని దీన్ని "కర్రలపై పెట్టె" అని గేలి చేశారు. కారణం ఒకహోమాలోని బార్తిల్స్ విల్ "ఆకాశ హర్మ్యం" ముందు వాళ్లకు ఇది ఆనలేదు. ప్రతి కొత్త చోటా నూతన విధానంలో సృజన మేళవించి డిజైన్ చేసి నిర్మింపజేశాడు. నిత్య నూతనత్వం అతని ప్రత్యేకత.

రైట్ వినూత్న విధానంలో కొంత భాగం ఆతను వాడే మెటీరియల్‌కూ, భాగస్వామ్యం ఉంది. రాయికి ఉన్న శక్తిని ఆయన గుర్తించాడు. గుళ్ళుగా ఉండేవాటితో తరంగ ఆకృతులను కల్పించాడు. బఫ్ఫెలో 1904లో కట్టిన "లార్కిన్ బిల్డింగ్" రాయి సున్నాన్ని వాడి ఆశ్చర్యపరచాడు. అతి ఆడంబరాన్ని తగ్గించాడు. వస్తువుల స్వభావం తెలుసుకొని

వాటిని వినియోగించాడు.

రైట్ కున్న సహజమైన విజ్ఞానం, వస్తుజాలంపై ఉన్న అవగాహన వలన అధికారులు ఆయనకు ఇబ్బందులు కలిగించేవారు. ఆయన నూతన విధానాలకు తగినంత సహకారం లభించేది కాదు. రైట్ లెక్కలే రైట్ అనీ ఎక్స్పర్ట్ల లెక్కలే తప్పులని నెమ్మది మీద తెలుసుకొన్నారు. విస్కాన్సిన్‌లో రెసిన్‌లోని జాన్సన్ వాక్స్ కంపనీ కోసం అడ్మినిస్ట్రేషన్ బిల్డింగ్ ఇచ్చిన డిజైన్‌ను బిల్డింగ్ ఒవర్సీర్లు సురక్షితం కాదని అభిప్రాయపడ్డారు. తేలిక స్తంభాలు పెట్టి అనుకొన్న బరువుకంటే ఎక్కువ బరువు మోసేట్లు చేసి చూపించి వారిని కంగు తినిపించాడు. తరువాత అంతటి బలిష్టమైన బిల్డింగ్ లేదని రుజువు చేశాడు కూడా. పాతవాటికి కొత్త ఆలోచనతో కొత్త రూపు నిచ్చే ఆయన డ్రాయింగ్‌లు అద్భుతమనిపించాయి. మానవ నాగరకాభివృద్ధికి అవి నిదర్శనాలుగా నిలిచాయి. "కాంటి లీవర్" వ్యవస్థ రావటంతో ఆయన నిశితబుద్ధి మరింత పదునెక్కింది. మూస రకాలకు పూర్తిగా స్వస్తి పలికాడు. భారం అంతా మధ్య బీం మీద వేసి కార్నర్ల మధ్య దూరాన్ని తగ్గించి, సపోర్ట్‌లను లోపలి వచ్చేట్లు చేసి, మూలలను ఓపెన్‌గా ఉంచాడు. ఇప్పుడు గోడలు స్క్రీన్లుగా మాత్రమే ఉంటాయి. కార్నర్‌లను హాయిగా చూడచ్చు. ఇది వరకెప్పుడూ ఇలాంటి వీలు ఉండేదికాదు. పూర్వం సమాంతరంగా ఉండేది ఇప్పుడు నిలువుగా కార్నర్లు దర్శనమిస్తున్నాయి. కనుక రైట్ ప్లాన్‌లన్నీ ఓపెన్ ప్లాన్‌గా పేరు తెచ్చుకొన్నాయి. సహజత్వం సాక్షాత్కరించింది. అతని దృష్టిలో "the life of the individual is broadened and enriched by the new concept of Archidtecture by light and the sense of liberty attained through freedom of space".

రైట్‌కు 40వ ఏట కుటుంబ వ్యవహారాల్లో ఇబ్బంది వచ్చింది. భార్యను విడాకులిమ్మని కోరాడు. ఒక ఏడాది తర్వాత కూడా అదే ఆలోచనలో అతడు ఉంటే అప్పుడు ఇస్తానని జవాబు చెప్పింది. ఏడాది అవగానే మళ్ళీ విడాకులకై పట్టు బట్టాడు రైట్. ఆమె మాత్రం మనసు మార్చుకొన్నది. కోపం తారాస్థాయికి చేరింది. ఇల్లు, దేశమూ వదిలి ఇటలీ చేరాడు. ఒక్కడే వెళ్ళలేదు మామా బూటన్బారత్ చిక్ చేనేతో కలిసి వెళ్ళటం విశేషం. పేపరు వాళ్ళు వెంటపడ్డారు. ఎవరికీ కనిపించకుండా రెండేళ్ళు ప్రవాసం ఉన్నాడు. 1911లో విస్కాన్సిన్ తిరిగొచ్చి స్ప్రింగ్ గ్రీన్ చేరాడు. ఇక్కడ ఆయనకు కొంత ఆస్తి ఉంది. అక్కడ ఫ్రెంచ్ కవి టాలీసిన్ పేర ఒక బిల్డింగ్ కట్టాడు . టాలీసిన్ అంటే "మెరిసే కను బొమ్మ" (షైనింగ్ బ్రో) అనే అర్థం కూడా ఉంది. అసలైన పోరాటం ఇంకా తనకు ఉండి పోయింది అని చెప్పాడు.

కొత్తావిడ "చేనే" సహవాసి మాత్రమే కాక సహచరి కూడా అయింది. ఇద్దరూ కలిసి ఎల్లెన్ కీ రాసిన "లవ్ అండ్ ఎథిక్స్"ను అనువదించారు. ఆమెకున్న ఇద్దరు పిల్లలూ ఈ ఇద్దరితోనే ఉన్నారు. ఇంతలో చికాగోలో "మిడ్ వె గార్డెన్" నిర్మాణానికి ఆహ్వానం వచ్చింది. వెళ్లి ఆ పనులు ఇంటికి దూరంగా ఉండి పర్యవేక్షిస్తుండగా గొప్ప విషాదం జరిగిపోయింది. ఒక నీగ్రో బట్లర్ తనకు దేవుడు ఆవహించాడని, కిరోసిన్‌తో తడిపిన కాగడాలు చేనే ఉంటున్న టేలీసిన్ బిల్డింగ్ రూమ్ లోకి 1914 ఆగస్ట్‌లో ఒక రాత్రి వేళ విసిరేశాడు. పొగ వ్యాపించి ఉక్కిరి బిక్కిరి చేశాయి. భయంతో పరుగెత్తే వారిని వాడు గొడ్డలితో అడ్డంగా నరికేశాడు. చంపబడిన వారిలో చేనే, ఆమె ఇద్దరు పిల్లలు కూడా ఉండటం దారుణం. ఈ వార్త తెలిసి దుఖం ఆపుకోలేక పగతో మళ్ళీ ఆ బిల్డింగ్‌ను నవ్యాతి నవ్యంగా నిర్మించాడు.

తర్వాత జపాన్ ప్రభుత్వం రైట్‌ను "ఇంపీరియల్ హోటల్" నిర్మించమని కోరింది. అది సాంఘిక కేంద్రంగా, సామ్రాజ్య స్మృతి చిహ్నంగా ఉండాలని కోరింది. జపాన్ వెళ్లి అక్కడి భూకంప పరిస్థితులను అధ్యయనం చేసి భూకంప తరంగాలకు లొంగ కుండా తట్టుకొని స్థిరంగా నిలబడే బిల్డింగ్ నిర్మిచి తన సామర్ధ్యాన్ని చూపాడు. రాళ్ళ మీద నిల బెట్టకుండా, తేలి యాడేట్లు నిర్మించటం ఇందులోని ప్రత్యేకత. "he realized instead of rigidity. flexibility and resiliency must be the answer to the over recurring nightmare threat, he designed a building that could, "flex and return to normal". అదీ రైట్ మేధో విజ్ఞానం. ఈ హోటల్ నిర్మాణం పూర్తయిన చాలా ఏళ్ళ తర్వాత 1924లో జపాన్ రాజధాని టోక్యోను భయానక భూకంపం కుదిపేసింది కాని రైట్ కట్టిన ఇంపీరియల్ హోటల్ చెక్కు చెదరకుండా ఆయన స్థిర సంకల్పంలా నిలిచి ఉంది. దీనిపై న్యూయార్కర్ పేపర్ కథనం రాస్తూ "as the temblor passed, settled quietly back into position which no crack or dislocation" అని రైట్ సామార్ధ్యాన్ని మహా మెచ్చుకొన్నది. రెండవ ప్రపంచ యుద్ధంలో బాంబు దాడులలో మాత్రమే ఈ హోటల్ విధ్వంసమైంది. ఆ భూకంపానికి ఈ హోటల్ రక్షణ కేంద్రంగా ప్రజలకు ఉపయోగ పడింది. పట్టణ ప్రజలంతా ఇక్కడికే చేరి తల దాచుకొని భూకంపాన్ని వెక్కిరించారు అని పేపర్లు రాశాయి.

జపాన్‌కు వెళ్ళే ముందే రైట్ మిరియం నోయెల్ అనే ఆవిడతో పరిచయం పెంచుకొన్నాడు. ఆమె క్రిస్టియన్ సైంటిస్ట్, శిల్పి. ఆమెకు ఒకే కంటిగ్లాస్‌తో ఉండేది. ఇద్దరుపెద్ద పిల్లలు కూడా. స్వయం సిద్ధంగా కలిసి ఉండాలని ఇద్దరూ అవగాహన కొచ్చారు. ఒరిఎంట్ హోటల్ పనిలో నాలుగేళ్ళు ఉన్నాడు. మొదటి భార్య కేథరిన్

విడాకులకు ఒప్పుకోగా విడిపోయారు. అప్పుడు మిరియంను మారేజ్ చేసుకొన్నాడు. దురదృష్టవశాత్తు ఈ బంధం మొదటి నుండి తప్పటడుగులతో నడిచింది. మిరియంకు చాలాకాలంగా మానసిక వ్యాధి ఉంది. జపాన్ వదిలే ముందు మిరియంనూ వదిలేశాడు. అమెరికా తిరిగొచ్చాక మరో దురదృష్టం వెంటాడింది. రెండోసారి కట్టిన కవి భవనం టాలీసిన్ అగ్నికి ఆహుతై కూలి పోయింది. పట్టువదలని విక్రమార్కుడిగా మూడోసారి దాన్ని నిర్మించాడు రైట్.

బిల్డింగ్‌ల కంటే నగరాల నిర్మాణం చేయాలనే కోరిక కలిగింది. ఆధునిక మానవుడు యాంత్రిక జీవితం గడుపుతూ మరణించిన గతకాలపు పురాతన విధానాలలో బతుకుతున్నాడని గ్రహించాడు. అంతర్జాతీయ శైలి అనే అసేంద్రియ, యాంత్రిక కార్య కారణ పద్ధతిపై ఏవగింపు కలిగింది. "యంత్రం భవనాన్ని కదుతుంది కాని బిల్డింగ్ కూడా ఒక యంత్రమే అవుతుంది" అన్నాడు. తన మోడల్ అయిన "బ్రాడ్ కేర్ సిటీ"ని వికేంద్రీకరణ విధానంలో అప్పటికి ఇంకా ఆర్కిటెక్ట్ నిర్మించటానికి సిద్ధంగా లేదు. రైట్ మాత్రం మరింత తెలివితేటలతో మానవ వారసత్వాన్ని అంటే భూమినే నమ్మి నిర్మించాడు. అతని ఆలోచన "in the ideal community every one could enjoy his birth right with an acre of land for each person". క్రిక్కిరిసే, కేంద్రీకరణ అంటే రైట్‌కు ఇష్టం లేదు. కనుక తన ఆలోచనలకు కార్య రూపంలో సమాధానం చెప్పే ప్రయత్నం చేశాడు. ఇంతలో ఓల్గా లాజో విచ్‌తో పరిచయం ప్రేమకు దారి తీసింది. ఆమె నల్లగా ఉన్నా అందాల రాశి. తెలివి, సంస్కృతీ ఉన్నావిడ. విడాకులు పొంది ఒక కూతురుతో ఉన్నది. ఈవిడతో రైట్ కలిసి ఉన్నాడని తెలిసి మిరియం కోర్ట్‌కు వెళ్ళింది. అన్ని రకాలుగా ప్రైవేట్‌గా పబ్లిక్‌గా ఇబ్బంది పెట్టింది. పేపర్ల వాళ్లకు కావలసినంత కలహ భోజనం దొరికింది. ఓల్గా రైట్ దంపతులు అరెస్ట్ అయ్యారు. కేసులన్నీ ఒక కొలిక్కివచ్చి వారిద్దరూ పెళ్లి చేసుకొన్నారు.

రాజీ లేని ధోరణి రైట్‌ది. ప్రతి ఆర్కిటెక్చర్ విభిన్నంగా ఉండటం అతని ప్రత్యేకత. పెనిసిల్వేనియాలో బేర్ రాన్‌లో "ఫాల్లింగ్ వాటర్", రీ ఇంఫోర్స్డ్ కాంక్రీట్‌తో కట్టిన మొదటి బిల్డింగ్. ఆరిజోనాలో దీనికి భిన్నంగా వేరొక స్టైల్‌లో కట్టాడు. రెసిన్‌లో జాన్సన్ లాబరేటరిని ముష్రుం టైప్ ఫ్లోర్ స్లాబ్‌లను కాంటి లీవర్‌లను వాడి నిర్మించాడు. శాన్ ఫ్రాన్సిస్కోలో గిఫ్ట్ షాప్‌ని కిటికీలు లేకుండా ప్లాస్టిక్ బబుల్ స్కై టాప్‌తో డిజైన్ చేశాడు. ఫ్లోరిడాలో లేక్ లాండ్‌లోని సదరన్ కాలేజి "the gayest, airiest, and most un conventional campus in America"గా నిర్మించాడు. న్యూయార్క్ ఫిఫ్త్ ఎవేన్యులో గగన్ హీం మ్యూజియం ఒక బృహత్ గోళాకార స్పేస్‌తో స్పైరల్ ఆకార

రాంపులు బయటిదారులు ఒకే నిరంతర (కంటిన్యుయాస్) ఫ్లోర్‌గా ఏర్పాటు చేశాడు. తన ప్రణాళికలన్నిటిని పుస్తకాలుగా తెచ్చాడు.

"Wright ;s conviction that organic buildings are always of the land. was amplified to read, "and from the land". రైట్‌ని పిలిచి పని అప్పగించటం గొప్ప ప్రివిలేజ్ అనాడు. అందరూ "రైటో రైట్" అన్నారు.

డెబ్భై ఏళ్ళు వస్తున్నాయనగా గౌరవాలు రైట్‌పై వర్షించటం ప్రారంభమయ్యాయి. 1941లో రాయల్ ఇన్ స్టిట్యూట్ ఆఫ్ ఆర్కి టెక్ట్స్ రైట్‌కు గోల్డ్ మెడల్ అందజేసింది. ఎనిమిదేళ్ళు జాగ్రత్తగా గమనించి అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్కి టెక్ట్స్ గోల్డ్ మెడల్ ఇచ్చింది. 15 దేశాలలో వివిధ అకాడేమీలలో గౌరవ సభ్యత్వం అందించారు. 1953లో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ లెటర్స్ గోల్డ్ మెడల్ బహూకరిస్తూ సన్మానించి "you have created an archi tecture in which you have been thoughtfully aware of the powerful forces implicated in the new inventions and, though philosophically concerned with the machine, you have never held that it should heedlessly produce more machines or more machine --like objects. on the contrary, you have felt that it should be used to make a world in which function may be controlled so as to emancipate enslaving forms and to increase the possibilities for new founded cities whose broad acres will furnish that beauty of life for which man has ever sought" అని ప్రశంసించింది.

ఈ రకమైన బిరుదులూ గౌరవాలు తనలోని వినయానికి హాని చేస్తున్నాయని అనుకొన్నాడు. ఎనభై ఏళ్ళు వచ్చాయి. సీరియస్‌గా మాత్రం లేడు. తన దగ్గరకు వచ్చే విద్యార్థులకు మెళకువలు బోధించేవాడు సృజనను అలవాటు చేసుకోమని హితవు చెప్పేవాడు. రొటీన్ వదిలి కొత్తది తయారు చేయాలని బోధించాడు. ఒక సందర్భంలో "we have no culture. we have civilization. we have power, the consequence of excess. but excess is artificial. it should not be confused with exuberance" అని చెప్పేవాడు. 85 ఏళ్ళ "ఎంఫాంట్ టేర్రిబుల్" అయిన రైట్ విలియం బ్లేక్ కవి చెప్పిన "బ్యూటీ"కి తల ఊపాడు. రైట్ నిర్మించిన 650 అత్యున్నత నిర్మాణాలు ఆయన అవిశ్రాంత అభి వృద్ధి అతిశయోక్తికి ,తాజా ఆర్గానిక్ జీవితానికి ప్రత్యక్ష సాక్ష్యాలు గా నిలిచి పోయాయి . 19-4-1959న 91వ ఏట

అద్వితీయ ఆర్కిటెక్ట్ ఫ్రాంక్ లాయడ్ రైట్ మరణించాడు .

1893-నుంచి ఏడేళ్ళు రైట్ నిర్మాణంలో ప్రయోగాలు చేశాడు. 1901 నాటికి 50 ప్రయరీ హౌసెస్ నిర్మాణం చేశాడు. దీనికే ప్రయరీ స్టైల్ అనే పేరొచ్చింది. 1920లో కాలి ఫోర్నియాలో హాలీవుడ్‌లో "ప్రీకాస్ట్ టెక్స్ స్టైల్ కాంక్రీట్ బ్లాక్ రీ ఇంఫోర్స్ మెంట్ భవనాలు నిర్మించాడు. ఇవి సినిమాలకు, టి.వి లకు ఉపయోగిస్తున్నారు. 1930 నాటికి అయన చేబట్టిన ఆర్గానిక్ స్టైల్‌కు పరిపూర్ణత లభించింది. "అసోనియన్ హౌస్" అనే కొత్త నమూనాతో మిన్నేసాపోలిస్‌లో భవనాలు కట్టాడు. ఇవి మధ్యతరగతి ప్రజల స్వర్గ గృహాలే. ఆయన కట్టిన 400 స్ట్రక్చర్స్‌లో 2005 నాటికి 300 ఇంకా సజీవంగా ఉన్నాయి. రైట్ ఆర్కి టేక్చర్‌తో పాటు గ్లాస్ పరిశ్రమ కూడా అభివృద్ధి చెందిన కాలం అది. తన ఫిలాసఫీకి గ్లాస్ తగినది అని నమ్మి, దాన్ని చాలా బాగా ఉపయోగించాడు. పైరేక్స్ గ్లాస్‌కు పెద్దపీట వేశాడు. గ్లాస్ వాడకంలో తేలికైన ఉల్లాసవంతమైన భవనాలు తయారయినాయి. అవే ఇంటర్నల్ డెకరేషన్‌కు ఎంతో గొప్పగా తోడ్పడ్డాయి. 20వ శాతాబ్దంలో భవనాలకు కొత్త వెలుగు తెచ్చినవాడు రైట్. అతను గొప్ప ఫాషన్ డిజైనర్. తన దుస్తులను తాననే డిజైన్ చేసి అత్యంత ఖరీదైన సూట్, వేలాడే నెక్ టై ధరించేవాడు. 1909లో మొదటి ఫాషన్ కారు "స్టాండర్డ్ డేటాన్" కొన్నాడు. ఆ తర్వాత అనేకమైన కార్లను వాహనాలను కొన్నాడు. 1950లో వోక్స్ వాగన్, చేవ్రోలేట్ మొదలైన నాలుగు కార్లున్నాయి. అప్పటినుంచి చనిపోయేదాకా 50 కార్లు వాడాడు. స్వీయ వ్యక్తిత్వానికే ప్రాధాన్యమిచ్చేవాడు. 80 ఏళ్ళ వయసులోనూ బిజీ బిజీగా జీవించాడు. ఆయన డిజైన్ చేసిన ఏకైక స్కై స్క్రేపర్ ఓక్ల హామాలోని బార్లిల్ విల్‌లోని 19 అంతస్తుల "ప్రైస్ టవర్". ఇది వర్టికల్ నిర్మాణం.

రైట్ డిజైన్ చేసిన కమ్యూనిటీ ప్లాన్‌లలో ఇల్లినాయిస్‌లోని ఓక్ పార్క్‌లోని - క్వాడ్రూపుల్ బ్లాక్ ప్లాన్‌లో ఉన్న 24 గృహాలు, మొన్టానాలోని కోమో ఆర్చర్డ్ సమ్మర్ కాలని, చికాగో క్వార్టర్ సెక్షన్, ఆటో వర్కర్స్, టీచర్స్ కోసం నిర్మించిన కో ఆపరేటివ్ హోమ్ స్టేడ్స్ మొదలైనవి ఉన్నాయి. తాను గొప్ప ఆర్కి టెక్ట్ అయినా జపాన్ ఆర్ట్ అయిన "వుకియో -ఇ వుడ్ బ్లాక్ ప్రింట్ అంటే మోజుపడి వాటినీ తన నిర్మాణాలలో వాడాడు. జపనీస్ ప్రింట్‌లన్నీ సేకరించి భద్రపరచి, టీచింగ్ ఎయిడ్స్‌గా ఉపయోగించాడు. 9-4-1959న 91వ ఏట మహా ఆర్కిటెక్ట్ ఫ్రాంక్ లాయడ్ రైట్ జీవిత సౌధం నేల కొరిగింది.❁



## 47. భారత జాతిపిత మహాత్మా గాంధి (1869-1948)

భారత్ అంటే ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభం నాటి తొలి సంవత్సరాల వరకు సామాన్య పడమటి దేశీయులకు పట్టనే లేదు. దూరం ఒక కారణం కావచ్చు. కాని 1940 నాటికి ఇండియాను గురించి ప్రపంచ మంతా గొప్పగా చెప్పుకొనే స్థితి వచ్చింది. దీనికి కారణం ఒకే ఒక్కడు. ఆయనే మోహన్ దాస్ కరం చంద్ గాంధి. అతి సామాన్యంగా ఉండి, అణకువ, హిందూ మతంపై గాఢమైన అభివ్యక్తీ కలిగి, రాజకీయాలలోకి వచ్చిన ముని అనిపించుకున్నవాడు. సత్యాన్ని నమ్మి ఆచరించినవాడు.

గాంధి 2-10-1869న బొంబాయి సంస్థానంలోని చిన్న సముద్ర తీర పట్టణం పోర్ బందర్‌లో జన్మించాడు. అక్కడి ప్రజల మాతృభాష గుజరాతీ. తాత పోర్బందర్‌కు దివాన్ అయినా, తండ్రి రెండు చిన్న సంస్థానాలలో అదే ఉద్యోగం చేశాడు. ఈ ఇద్దరూ విధి నిర్వహణలోనే గడిపారు కాని దౌత్యవేత్తలు రాజకీయవేత్తలు కాలేదు.

హిందువుల విధానంలో సంఘంలో నాలుగు కులాలుంటాయి. బ్రాహ్మణులు చదువుతో తెలివి తేటలు గలవారుగా గుర్తింప బడేవారు. తరువాత వారు సమాజ, దేశ రక్షణలో ఉండి యుద్ధవీరులుగా, రాజులుగా ఉన్న క్షత్రియులు. తరువాతి వారు వర్తక వ్యాపారాలు చేసే వైశ్యులు. అందరికంటే అట్టడుగు వారు కూలీ పని చేసే శూద్రులు. గాంధి కుటుంబం మూడవ జాతి వైశ్య కుటుంబం. గాంధి అంటేనే కిరాణా వ్యాపారి అని అర్ధం. కాని వీరు విలాసాలకు చేరువలో సకల సుఖాలతో జీవించారు. ఇంటిలో పాశ్చాత్య వ్యామోహం లేదు కాని ఇంటినిండా పుస్తకాలు దంతపు సామాను, సంగీత వాద్యాలు, నగా నట్రా బంగారం ఘనంగా ఉండేవి. తండ్రి నాలుగవ భార్యకు నాల్గవ సంతానం గాంధి. బాలగాంధిని చూసుకోవటానికి ప్రత్యేకంగా ఒక నర్సు ఉండేది. గాంధి బాల్యం పవిత్రంగా సురక్షితంగా గడిచింది. కొన్ని బలహీనతలలో చిక్కుకున్నాడు. కొన్నిసార్లు పొగ తాగాడు, మాంసం తిన్నాడు, అన్నగారి డబ్బు తస్కరించాడు. 15వ ఏట తాను చేసిన తప్పులను తండ్రికి చెప్పి ఒప్పుకొన్నాడు. ఏ

శిక్షకైనా సిద్ధపడ్డాడు. తండ్రి ఏడుస్తూ కొడుకును మన్నించి పెనాల్టీ విధించకుండా శిక్షించకుండా క్షమించాడు. దీనితో మోహన్ దాస్ మారిపోయాడు. హిందూ ధర్మాలైన ప్రేమ, సత్య భావనలు ఉత్కృష్టమైనవిగా అర్థం చేసుకొన్నాడు. అప్పటి నుంచే వాటిని ఆచరణలో పెట్టటం ప్రారంభించి జీవితాంతం ఆచరిస్తూనే ఉన్నాడు.

ఆనాటి సంఘాచారం ప్రకారం గాంధీకి 13 ఏట వివాహం చేశారు. పోర్బందర్ వ్యాపారి కుమార్తె కస్తూరి బాయి ఆయన భార్య. సమాన వయస్కురాలు. ఆమెతో జీవితాంతం కాపురం చేశాడు. ఈ బాల్య వివాహాలు ఆర్థిక సౌకర్యం కోసం జరిగేవి. వివాహం విద్య నాశాయ అన్నట్లు ఒక ఏడాది చదువు గుంట కొట్టింది. భార్య కాపురానికి వచ్చింది. తనకు తెలిసిన చదువు కస్తూర్బాకు బోధించాడు. ఆమెకు గుజరాతిలో ప్రాధమిక విద్య తప్ప ఏమీ రాదు. కాని ఆమెను ఆరాధించి ప్రేమించి జీవనం సాగించాడు. యవ్వన మదం దిగలేదు. తండ్రి చనిపోయినప్పుడు, ఆయన ప్రక్కన ఉండి సేవ చేయకుండా, హాయిగా భార్యతో గదిలో శృంగారంలో మునిగి తేలాడు. మొదటి సంతానం పుట్టి వెంటనే చనిపోయే నాటికి గాంధి దంపతులకు కేవలం 15 ఏళ్ళు మాత్రమే. మొదటిసారిగా తనకున్న వ్యామోహంపై ఏవగింపు కలిగింది .

తండ్రి మరణం తర్వాత 19వ ఏట గాంధీని లా చదవటానికి ఇంగ్లాండ్ పంపారు. గాంధికి మెడిసిన్ చదవాని ఉంది. కాని లా చదివితే సంఘంలో పలుకుబడి వ్యవహారాలను చక్క బెట్టె నేర్పు వస్తాయని కుటుంబం పట్టుబట్టింది. రెండో కొడుకును, భార్యను వదిలి 1888లో లండన్ చేరాడు. 20 ఏట తీసుకొన్న ఫోటో అప్పటికి గొప్ప. నల్లని జుట్టు ఒకప్రక్కకు ఒరిగి, నల్లటి కళ్ళతో తీక్షమైన దృష్టితో ఉండేవాడు. దొప్పల్లాంటి పెద్ద చెవులు పొడవైన కొంగ ముక్కు, మొరటు పెదవులు. మొదటిసారి లండన్ వెళ్ళినప్పుడు పడమటి వాసనతో అలంకరించుకొన్నాడు. చొక్కా కాలర్లకు పిండి పెట్టి స్టిఫ్‌గా ఉంచుకోనేవాడు, మార్నింగ్ కోట్ వేసేవాడు. తోలు చెప్పులు ధరించాడు. పెద్ద సిల్క్ టోపీ పెట్టేవాడు. చేతులకు గ్లోవ్స్ విలాసంగా చేతిలో కర్ర. వీటికి విరుద్ధంగా చాలా సాధారణ జీవితమే గడిపేవాడు. మైళ్ళకొద్దీ దూరం రోజూ నడిచే వెళ్ళేవాడు. కొద్దిమందే స్నేహితులు. లాతో పాటు లాటిన్, ఫ్రెంచ్, ఫిజిక్స్‌లు కూడా చదివాడు. ఇంగ్లీష్ అమెరికన్ సాహిత్యాన్ని బహు ఇష్టంగా చదివాడు. తూర్పు, పడమటి దేశాల మతాలు వాటిలోని తేడాలు అధ్యయనం చేశాడు. తమాషా ఏమిటి అంటే ఇంగ్లాండ్‌లోనే మొదటిసారిగా భగవద్గీత ఇంగ్లీష్ అనువాదాన్ని చదివాడు. గీత నుండి తన జీవిత ఫిలాసఫీని నిర్ణయించుకొని ఆచరణలో పెట్టాడు.

1891లో బార్ ఎట్ లా పాసై గాంధి, ఇండియాకు తిరిగి వచ్చి లాయర్‌గా

ప్రాక్టీస్‌లో సఫలం కాలేక పోయాడు. ఇక్కడి కపట నాటకం, సంస్థానాల అవినీతి నిరాశ పరచాయి. ఒక వ్యాపార సంస్థ తమ న్యాయ వ్యవహారాల కోసం గాంధిని దక్షిణాఫ్రికాకు పంపిస్తే సంతోషంగా వెళ్ళాడు. ఆ పని కొద్దికాలమే అయినా ఇరవై ఏళ్ళు అక్కడే లా ప్రాక్టీస్ చేశాడు. 24వ ఏట దక్షిణాఫ్రికా వెళ్లి అక్కడి భారతీయులకు జరుగుతున్న అన్యాయాలను వర్ణ విచక్షతను, హీనంగా చూడటాన్ని గుర్తించాడు. అమెరికాలోని జిమ్ క్రో నిబంధనలాగానే అక్కడ బ్రిటీష్ వాళ్ళు ఇండియన్స్‌ను అవమానిస్తున్నారు. ఒక కేసులో వాదిస్తున్నప్పుడు నెత్తిమీదున్న టర్బన్
(తలపాగా) తీసేయమంటే తిరస్కరించాడు గాంధి. గాంధీని “కూలీ బారిస్టర్” అని ఎద్దేవా చేసేవాళ్ళు. ఫస్ట్ క్లాస్ పెట్టెలో ఎక్కితే దింపి మూడవ తరగతి పెట్టెలో కూచో మనేవారు. ఒకసారి ఎదురు తిరిగితే బయటికి నెట్టేసి కొట్టారు కూడా. చూసీ చూడనట్లు ఉండటం అసాధ్యమని పించింది. ఉపేక్ష ఇక పనికిరాదనుకొన్నాడు. అక్కడి ప్రజల భవ్య భవిష్యత్తు కోసం దక్షిణాఫ్రికా ఇండియన్ల సంఘం ఏర్పాటు చేశాడు. తమను ప్రభుత్వం గౌరవించే స్థాయి కలిగి ఉండేట్లు ప్రవర్తించాలని ప్రజలను కోరాడు. గాంధీ ఒక్కడే. అయినా వారిని కదిల్చాడు వారి ఆలోచనలో మార్పు తెచ్చాడు. దీనికి ఆయన విశుద్ధ ప్రవర్తన ముక్కుసూటి తనం మనోధైర్యం బాగా తోడ్పడ్డాయి. వాళ్ళంతకు వాళ్ళు చేయలేని దాన్ని గాంధీ దగ్గరుండి చేసేట్లు చేశాడు. అంతటి గొప్ప పరివర్తన వారిలో వచ్చింది.

పాతికేళ్ళ దక్షిణాఫ్రికా జీవితంలో గాంధీని ప్రభావితం చేసినవారిలో రష్యన్ నవలాకారుడు లియో టాల్ స్టాయ్, ఆంగ్ల విమర్శకుడు జాన్ రస్కిన్, అమెరికా రచయిత హెన్రి డేవిడ్ థోరో. టాల్ స్టాయ్ రచన “ది కింగ్డం ఆఫ్ గాడ్ ఈజ్ విదిన్ యు” చదివి సాంఘిక విషయాలలో ప్రతిఘటన లేకుండా నిరసన వ్యక్తం చేయటం ఎలాగో తెలుసుకొని అమలు చేశాడు. థోరో శాసనోల్లంఘన, హక్కులు తెలియజేశాడు. కాని గాంధీని అత్యంత ప్రభావితం చేసిన వాడు రస్కిన్ మాత్రమే. రస్కిన్ రచన “అన్ టు దిస్ లాస్ట్” చదివి పనిలోని గౌరవాన్ని – డిగ్నిటి ఆఫ్ లేబర్ అర్థం చేసుకొన్నాడు. సహజంగా హిందూ జీవితంలో పురుషులకు సమాన వ్యక్తిత్వం అనాదిగా ఉన్నా కుల వ్యవస్థ వారిని దిగ జార్చింది. ఎవరూ చేయని అతి తక్కువ స్థాయి పనులను చేసేవారిని అస్పృస్యులుగా సమాజం చూసి వారిని దూరంగా పెట్టింది. రస్కిన్‌ను అర్థం చేసుకొన్న గాంధి వీటిపై గొప్ప మార్పులు రావాలని తలచి దీక్షగా ముందుకు కదిలాడు. తానూ మారటమే కాదు యావత్తు సమాజాన్ని మార్చాలనుకొన్నాడు. తాను దివ్య జీవితం గడుపుతుతూనే ఉన్నాడు. కాని ఇప్పుడు తీసుకొనే నిర్ణయాలు చాలా తీవ్రమైనవి.

సమాజ మూలాలను పూర్తిగా మార్చేవి. దీనికి ఆర్థిక సహకారమూ కావాలి అప్పుడే సాధ్యం.

తన సంకల్పాన్ని అమలు చేయటానికి ఒక వరుసగా కార్యక్రమాలు చేబట్టాడు. మొదట అందరికి విజ్ఞప్తి చేశాడు. ఉత్తరాలు వ్యాసాలూ కరపత్రాలు పేపర్లలో వ్యాసాలూ రాసి తన మోభావాలను ప్రజలకు తెలియజేశాడు. దక్షిణాఫ్రికాలో తన పని పూర్తికావటానికి ఇంకా చాలాకాలం పడుతుందని గ్రహించి గాంధి ఇండియా తిరిగి వచ్చేశాడు. అప్పటికే రెండోకొడుకు మణిలాల్ జన్మించాడు. గాంధీ వ్యాసాలూ చదివిన జనం ఆయన చెడిపోయాడని కనుక ఆయన ఎక్కి వచ్చిన నౌకను నౌకాశ్రయంలో ఆపటానికి వీల్లేదని ఆందోళన వచ్చింది. 23రోజులు అలాగే ఓడలో ఉండి చివరి పరిస్థితులు సర్దుకున్నాక బయటికి రావటానికి ఒప్పుకొన్నారు కాని ఆయన చీకట్లో రహస్యంగా రావటానికి ఇష్టపడలేదు. పగటిపూట సముద్ర తీరంపైకి చేరగా అక్కడ చేరిన జనం ఆయనపై దాడి చేశారు. రాళ్ళతో చెప్పులతో కొట్టారు, కింద పడేశారు తన్నారు. శరీరభాగాలేవీ దెబ్బతిన కుండా పోలీసుల జాగ్రత్త వలన బతికి బయట పడ్డాడు. దీనిపై కేసు పెట్టమని చాలా మంది ఒత్తిడి తెస్తే అలా చేయటానికి గాంధి ఒప్పుకోలేదు. హింసాత్మక చర్యలతో తన మనో దీక్షను బలహీన పరచటం ఎవరికి సాధ్యం కాదని రుజువు చేశాడు.

గాంధీ 32వ ఏట బోయర్ యుద్ధం వచ్చింది. బోయర్లపై సహజంగా సానుభూతి ఉన్నా బ్రిటిష్ ప్రభుత్వంలో ఉన్నాం కనుక ప్రభుత్వానికి సహకరించాలను కొన్నాడు. ఇది ఆయన నమ్మిన అహింసా సిద్ధాంతానికి విరుద్ధం. ఇలా గాంధీ కొన్ని విషయాలలో విరుద్ధంగా ప్రవర్తించాడు. మొదటి ప్రపంచయుద్ధంలో ప్రభుత్వానికి సహకరించాడు. నిజంగా యుద్ధంలో పాల్గొనక పోయినా అంబులెన్స్‌లో ఉండి పని చేశాడు. బోయర్ యుద్ధం ముగిశాక, తన స్వగ్రామంలో ఉండిపోవాలనుకొన్నాడు, కాని దక్షిణాఫ్రికా నుండి పిలుపు వచ్చింది. అక్కడ ఆయన ప్రజానాయకుడుగా లాయర్‌గా బాగా విజయాలు సాధించాడు. ధనం బాగా వచ్చినా, అసమానతపై దృష్టి మారలేదు. సాంఘిక పోరాటాలలో మరింత దీక్షగా పని చేశాడు. రోజు వారీ జీవితంపై ప్రభావం కలిగించాడు. అంటరాని వారితో కలిసి పని చేశాడు. తన కుటుంబం వారికి ఆ విషయమై అవగాహన కలిగించి ఒప్పించి వారిలోనూ మార్పు తెచ్చాడు. ఎవరి పని వారు చేసుకోవటం నేర్పాడు. పాకీ దొడ్లు కడిగాడు.

డబ్బు బాగా వస్తోంది. అందులో ఎక్కువ భాగం సాంఘిక అభివృధికి ఖర్చు చేసేవాడు గాంధి. దక్షిణాఫ్రికా భారతీయుల కోసం ఒక నిధి ఏర్పాటు చేశాడు. రస్కిన్ ఆలోచనలతో

తన జీవిన విధానాన్నీ మార్చుకొన్నాడు. రస్కిన్ సూక్తి "the life of labor, the life of the tiller of the soil and the handi craftsman is the life worth living" బాగా వంట బట్టింది. ఏ విధానమైనా పరస్పర సహకారం లేకపోతే అర్ధ రహితమౌతుంతుని నమ్మాడు. కళ, కార్యం, ప్రేమ జీవిత పరమార్ధం అని గ్రహించాడు. ఫారం ఏర్పాటు చేసి అందులో భాగస్వాములుగా అందరినీ చేర్చి తనతో పాటు పని చేసేట్లు చేశాడు. అందరు కలిసి పని చేసి ఉత్పత్తి చేసి సమానంగా అనుభవించటం అనేదాన్ని ప్రయోగాత్మకంగా విజయవంతం చేశాడు. తాను శాకాహారిగానే ఉన్నాడు. కొద్దిగా కాయలు, పళ్ళతో జీవించటం అలవాటు చేసుకొన్నాడు. బ్రహ్మచర్యాన్ని పాటించాడు. 37వ ఏట నలుగురు పిల్ల తండ్రి గాంధి దాంపత్య శృంగార వ్యవహారాలకు ఇష్టంగానే దూరమయ్యాడు. జీవితాంతం దీన్ని కొనసాగించాడు. దీనివల్ల ఏంతో శక్తి ఆదా అయి, ఆయన సేవాకార్యాలకు ఉపయోగించింది. స్వయం నియంత్రణ ఆయన పద్ధతి. మంచి చేయటం మంచిగా ఆలోచించటంతో మహాత్ముడైనాడు.

గాంధీ పత్రికా సంపాదకుడై జీవితాంతం గడిపాడు. సంస్కరణ కోసం జర్నలిజంను వాడుకొన్నాడు. ప్రయోగాలకు అది పనికి వచ్చింది. తప్పులు తెలుసుకోవటానికి సహకరించింది. 38వ ఏట భారతీయులందరి పేర్లు రిజిస్టర్ చేసి వేలి ముద్రలు తీసుకోవాలన్న చట్టం పెండింగ్‌లో ఉన్నప్పుడు జోహాన్స్ బర్గ్‌లో భారీ నిరసన సభ నిర్వహించాడు. ప్రతి ఒక్కరిని ఒప్పించి ఆచట్టాన్ని వ్యతిరేకించాలని, అవసరమైతే అరెస్ట్ అయి జైళ్లకు వెళ్ళినా దెబ్బలు తిన్నా ప్రాణాలు పోయినా అంగీకరించరాదని తెలియజేశాడు. మొదటిసారిగా ఇక్కడ ప్రారంభించిన ఈ నిరసన తర్వాత ఇండియాలో చాలాసార్లు ప్రభుత్వ వ్యతిరేక విధానాలపై ఎదురు నిల్చి ఉద్యమించాడు. దీనికే సత్యాగ్రాహం అని పేరు పెట్టాడు గాంధి. ఇదే సత్య శక్తి లేక సత్య ప్రేమ. అక్కడి ప్రభుత్వం గాంధి ప్రొటెస్ట్‌ను లెక్క చేయలేదు. చట్టం పాసైంది. గాంధీ వ్యతిరేకించి అరెస్ట్ అయ్యాడు. "ది లైఫ్ ఆఫ్ మహాత్మా గాంధి" అనే అత్యద్భుత గ్రంథం రాసిన లూయీ ఫిషర్‌తో గాంధీ "జైలు నేరగాళ్లకు దొంగలకు అందరికీ జైలే. నాకు మాత్రం అదొక భవనం. థోరోను చదవక ముందు నుంచే నేను జైలుకు వెళ్లాను" అని చెప్పాడు.

జైలులో ఉండగానే గొప్ప రచనలు చదవటంపై మనసు కేంద్రీకరించాడు. దక్షిణాఫ్రికా జిల్లాలో గాంధి 249 రోజులున్నాడు. ఇండియా జైళ్లలో 2,089 రోజులు గడిపాడు. ప్రజావ్యతిరేక చట్టాలను ప్రజలందరూ వ్యతిరేకిస్తే ప్రభుత్వం ప్రజలందరినీ జైళ్లలో పెట్టలేదని, చివరికి దిగివచ్చి ప్రజలకు అనుకూలంగా వ్యవహరిస్తుందని అన్నాడు. ఆయన ఫిలాసఫీ తర్వాత నిజంగానే రుజువైంది. దక్షిణాఫ్రికా నాయకుడు జనరల్

స్మట్స్ కొంత దిగొచ్చి, ఇండియన్లు స్వచ్ఛందంగా పేర్లు నమోదు చేసుకొంటామని చెబితే చట్టాన్ని ఉపసంహరిస్తామని ప్రకటించాడు. దీనికి అందరూ వ్యతిరేకించినా గాంధీ అంగీకరించాడు. అందరిలాగానే గాంధీకి కూడా స్మట్స్‌పై అనుమానం ఉన్నా "ప్రేమ సత్యం నమ్మకాలు ఒకదానితో ఒకటి కలిసి ఉండేవని చెప్పాడు. దేనికైనా ప్రాతి పదిక నమ్మకమే. ఒకవేళ స్మట్స్ మోసం చేస్తే మళ్ళీ ఉద్యమిద్దాం. నమ్మకం లేకపోతే భవిష్యత్తు లేదు" అని అందరికి చెప్పి తానే మొదట తన పేరును నమోదు చేసుకొన్నాడు. కాని ఇప్పటిదాకా ఆయన్ను నమ్మి అనుసరించిన వారే గాంధీ మోసగించాడని తిట్టారు, అసహ్యించు కొన్నారు, కొట్టారు కూడా. దాదాపు చంపినంత పని చేశారు. ఇదే ఆయన ఎదుర్కొన్న సత్య పరీక్ష.

అనుకోన్నట్లే స్మట్స్ తన వాగ్దానం నిలబెట్టుకోలేదు. చట్టాన్ని ఉపసంహరించ లేదు. గాంధీ వ్యూహా సంచారి అయి ఉంటే ఈ సంఘటనతో మట్టి గరచి ఉండేవాడు. కానీ ఆయన కలల బేహారి కాదు. ఒక ఆచరణశీలి అయిన రాజకీయ నాయకుడు. ఒకసారి మొదలు పెట్టాక ఆగటం అసాధ్యం అని తెలిసినవాడు. స్మట్స్‌ను నమ్మి చేసిన పొరబాటు ఆయన్ను నాశనం చేసి ఉండాలి. "సత్యాగ్రహ బలం ఏమిటో ప్రపంచానికి తెలిసింది. మనలను వ్యతిరేకించే వాడికి పరిస్థితులను పూర్తిగా అర్థం చేసుకోవటానికి మరో అవకాశం ఇద్దాం" అని చెప్పి, మళ్ళీ ప్రజా సమీకరణ చేశాడు. ఈ సారి అందరూ ఆయనపై పూర్తి విశ్వాస ముంచి ముందుకు కదిలారు. అప్పటిదాకా ధరించిన యూరోపియన్ వేషాన్ని తీసి పారేశాడు. తెల్లని పంచ, అంగోస్త్రాన్ని కట్టాడు, మామూలు చెప్పులు తొడిగాడు. అసలైన భారతీయుడిలా కనిపించాడు. వేలాదిగా పురుషులు స్త్రీలు పిల్లలతో బ్రహ్మాండమైన ప్రొటెస్ట్ మార్చ్ నిర్వహించాడు. గని యజమానులు సానుభూతి చూపారు. రైల్ రోడ్ ఉద్యోగులైన తెల్లవారు కూడా సమ్మెలో చేరారు. పరిస్థితులు చేయిదాటి పోతున్నాయని ప్రభుత్వానికి అర్థమైంది. స్మట్స్ దిగొచ్చి మరోమారు సంప్రదింపులు జరిపాడు. "ఇండియన్ రిలీఫ్" గాంధీకి అద్భుత విజయాన్ని కట్ట బెట్టింది. అనుకొన్నది సాధించి తిరుగులేని ప్రజానాయకుడు, ప్రజా బంధువు అయ్యాడు గాంధి.

46వ ఏట గాంధి బ్రిటిష్ కబంధ హస్తాలనుండి ఇండియాకు విముక్తి కలిగించాలన్న ధ్యేయంతో ఇండియాకు తిరిగొచ్చాడు. మొదట్లో అది అసాధ్యమనిపించింది. ఇండియా చాలా పెద్ద దేశం అనేక కులాలు వర్గాలు భాషలతో ఉన్న దేశం. హిందూ ముస్లింల మధ్య సఖ్యత లేదు. కులాల వారీగా హిందూ సమాజం చీలిపోయి ఉంది. దక్షిణాఫ్రికాలో విజయం సాధించినట్లుగా ఇక్కడ విజయం పొందటం చాలా కష్టం. కాని అసాధ్యం

మాత్రం కాదు. ఇండియా రాగానే మొదటగా ప్రజలకు తమ గౌరవాన్ని గుర్తు చేశాడు. వారికున్న సంస్కృతీ అనాది అని దాన్ని కాపాడుకోవాలని విజ్ఞప్తి చేశాడు. అన్ని కులాలు సమానమేనని తెలిపాడు. అందరూ గౌరవంగా సహకారంతో నమ్మకంతో జీవించాలన్నాడు. అసమానత తొలగిపోవాలి. నిరక్షరాస్యత రూపు మార్చాలి. స్వయంగా వేసుకొన్న బంధనాల నుండి అందరూ ముందుగా విముక్తి పొందాలి. తర్వాత భారతమాత దాశ్య శృంఖలాలను చేదించి స్వతంత్రం సంపాదించాలి. స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు అందరి అభివృద్ధికీ తోడ్పడాలి. భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడై దేశమంతా సంచరించి పరిశుభ్రత పాటిస్తేనే జీవన వృద్ధి జరుగుతుందని బోధించాడు. అంటరాని తనం భారతీయ సమాజానికి చేటు అని దాన్ని రూపు మాపాలని తీవ్రంగా ప్రచారం చేశాడు. తానే ముందుగా తన ఆశ్రమంలో ఒక నిరుపేద అంటరాని కులానికి చెందిన అమ్మాయికి ఆశ్రయమిచ్చి అందరికి మార్గదర్శి అయ్యాడు. పారిశ్రామీకరణ భారతీయ కుటీర పరిశ్రమలకు హాని చేసిందని, మన కుటీర పరిశ్రమలకు చేయూత నిచ్చి కాపాడుకోవాలని ఉద్బోధించాడు. గ్రామీణ వృత్తులకు ప్రోత్సాహం కలిగించాలన్నాడు. చేనేతకు అధిక ప్రాధాన్యమిచ్చి స్వయంగా రాట్నంపై తన వస్త్రాలకు సరిపడా నూలు తీశాడు. దీనితో ప్రతి ఇంటా రాట్నం వెలిసింది. చేతి పరిశ్రమలకు ఊత మొచ్చింది. పల్లె టూళ్ళు ప్రగతి పథంలో చేరాయి. గ్రామీణాభి వృద్ధే దేశాభివృద్ధికి రాచబాట అన్నది గాంధీ పిలుపు.

గాంధీ నాయకత్వంతో జాతీయోద్యమం పరవళ్ళు తొక్కింది. బ్రిటిష్ ప్లాంటర్స్ భారతీయ రైతులను పీల్చి పిప్పి చేస్తుంటే చంపారాన్‌కు వెళ్ళాడు. గాంధీని జోక్యం కలిగించుకోకుండా బ్రిటిష్ ఆఫీసర్లు అడ్డం పడ్డారు. చట్టాన్ని వ్యతిరేకించాడని కేసుపెట్టి ఇబ్బంది కలిగించారు. అదొక గొప్ప సంఘటనగా చరిత్రలో నిలిచి పోయింది. ఆయన జీవితాన్ని గొప్ప మలుపు తిప్పింది.

ఇంపీరియల్ ప్రభుత్వం ఇండియా పౌరుడిని రౌడీగా చిత్రించలేదని గ్రహించింది. చంపారాన్ పోరాటంపై లూయీ ఫిషర్ రాస్తూ “it did not begin as an act of defiance, It grew out of an attempt to alleviate the distress of large numbers of poor peasants. This was typical Gandhi pattern .His politics were intertwined with the practical day --to-day problems of the millions His was a loyalty to living human beings but not a loyalty to abstractions. In every thing Gandhi did , he tried to mold a new free Indian who could stand on his own feet and

thus make India free. He was a natural fighter and a born peace maker He had the might of a dictator and the mind of a democrat" అంటూ చక్కగా విశ్లేషించి మహాత్ముని గొప్పతనాన్ని ఆవిష్కరించాడు. ఆయన యంత్రాలను నమ్మక పోవటానికి కారణం ఆయన మాటలలోనే "the human to-day is a most delicate piece of machinery". అనేకులపై ఎక్కి యంత్రం స్వారిచేస్తూ కొద్దిమందికే ఉపయోగపడుతుంది" అన్నాడు. మార్క్స్ చెప్పిన లేబర్ సర్ఫస్ వలువను నమ్మాడు. కార్మికులు యజమాని మధ్య ఘర్షణ అర్థం చేసుకొన్నాడు. కాపిటలిజం తగదన్నాడు. భౌతిక, ఆధ్యాత్మిక స్వేచ్ఛను గాంధి ప్రచారం చేశాడు. చర్చించాడు రాశాడు నచ్చ చెప్పాడు, మందలించాడు. వినక పొతే చివరి ఆయుధంగా ఆమరణ నిరాహార దీక్ష చేశాడు. వ్యతిరేకులకు భయం కలిగించటానికో, ప్రచారం కోసమో నిరాహార దీక్ష చేయలేదు. తనను నమ్మిన వారినందరినీ ఏకం చేయటానికి వారి దృష్టి కేంద్రీకరణకోసం మాత్రమే చేశాడు. సమస్యపై పలు కోణాలలో అధ్యయనం చేసి దాన్ని సాధించటానికి ఒక మార్గంగా చనిపోవటానికైనా తాను సిద్ధం అని తెలియజేసిన వాడు గాంధీ మహాత్ముడు.

దేశం విషయంలో తీవ్రంగా స్పందించిన గాంధి తన స్వంత కుటుంబ విషయంలో కూడా చాలా గట్టిగానే వ్యవహరించాడు. స్ట్రిక్ట్ డిసిప్లిన్ అంటూ పిల్లలపై ఆంక్ష పెట్టాడు. ఆయన పాత పద్ధతులు వాళ్లకు నచ్చలేదు. హరిలాల్ పెద్ద తాగుబోతు అయ్యాడు. జల్సాగాడై డబ్బు దుబారా చేశాడు. చివరికి మహమ్మదీయ మతంలోకి మారాడు. తన గొప్పతనాన్ని గాంధీ దాచుకొన్నా, ఆయన్ను ప్రజలు "మహాత్ముడు" అన్నారు. గుడ్డినమ్మకాలతో ఆయన ప్రజల్ని నమ్మించలేదు. ప్రజలలో చైతన్యం, జాగృతి కల్పించి మనసుల్ని దోచాడు. "తన చుట్టూ ఉన్న సామాన్యులను నాయకులుగా అమరవీరులుగా మార్చిన మహా మహర్షి గాంధి అన్నాడు గోపాలకృష్ణ గోఖలే. ఆయన భాషణలు సెర్మన్ ఆన్ ది మౌంట్‌లాగా గొప్ప ప్రభావం కలిగించాయి. చెడుకు మంచిగా స్పందించిన మహానుభావుడు. చాలామంది అంతకు పూర్వమే "నిష్క్రియాత్మక ప్రతిఘటన (పాసివ్ రెసిస్టన్స్) బోధించినవారే, కానీ గాంధి అహింసాత్మకంగా శాసన ఉల్లంఘన కార్యక్రమం చేబట్టి ప్రభుత్వాన్ని లొంగదీసి చరిత్రలో చిరస్మరణీయ విజయాలను సాధించాడు.

తన అనుచరులను ఆయుధం పట్టవద్దని గాంధీ ఆదేశించినా, ఆయన చేతుల్లో అనేక ఆయుధాలున్నాయి. అందులో ఒకటి "హర్తాల్". స్వచ్ఛందంగా సమ్మెచేసి, దుకాణాలు బందు చేసి, పని వాళ్ళు దేవుని ప్రార్థిస్తూ నిరాహార దీక్ష చేస్తూ ఇంట్లోనే గడపటమే హర్తాల్ అంటే -1919లో బ్రిటిష్ ప్రభుత్వం పరిమిత చట్టం (రెస్ ట్రి క్టివ్

యాక్ట్) తెచ్చినప్పుడు గాంధి హర్తాల్ ఆయుధం మొదటి సారి ప్రయోగించాడు. దాని విజయం దాదాపుగా నమోదై, 28 ఏళ్ళ తర్వాత బ్రిటిష్ పాలనకు చరమ గీతం పాడించింది. 1919-47 మధ్యకాలంలో గాంధీ రాజకీయ ఆధ్యాత్మిక కార్యక్రమాలలో మునిగి తేలాడు. సన్నబడి బలహీనంగా కట్టె పుల్లగా నల్లకళ్ళతో పెద్ద గుండ్రని స్టీల్ రిం ఫ్రేం కళ్ళజోడుతో ఉన్నాడు. అరవై వచ్చేసరికి పళ్ళూడి పోయి "బోసి నోటి బాపు" అయ్యాడు. జుట్టులేకుండా బట్ట తలతో, శరీరం వంకర్లు పోయి చాలా దారుణంగా తయారయ్యాడు. చేతులు మాత్రం యవ్వనంలో ఉన్నట్లు కనిపించాడు. కాని ఆయన ఆత్మశక్తికి ఏ అడ్డూ ఆపూ లేదు. ఇది వరతికంటే మరింత ప్రేరితం చేస్తూ ప్రాజల్ని ప్రభావితం చేస్తున్నాడు. ఇండియా అంతా తిరిగి ప్రజలభాషలో ప్రజలకు అర్ధమయ్యేట్లు వందలాది సభల్లో వేలాది ప్రజలకు ప్రబోధించాడు. బాగా అలసిపోయి ఉంటే వేదికపై కాళ్ళు ముడిచి మౌనంగా ఉండి పోయేవాడు. ప్రేక్షకులు కూడా ఆయన మనో భావాన్ని అర్ధం చేసుకొని ఆనందించేవాళ్ళు. ఆయన మాట యెంత ప్రభావితం చేసేదో మౌనం కూడా అంతగానే ప్రభావితం చేసింది. ఆయన మౌనముద్ర మౌనగురువు దక్షిణామూర్తి ప్రబోధంలాగా ఉండేదన్నమాట.

ఒకవేళ హర్తాల్ పిలుపు తో హింస ప్రజ్వరిల్లితే, ప్రజలకు శాసనోల్లంఘనలో సరైన శిక్షణ లభించలేదని సమ్మెను ఆపెయ్యాలని వెంటనే ఆదేశించేవాడు. అమృతసర్‌లో బ్రిటిష్ నరమేధం చేసినప్పుడు హోమ్ రూల్ లీగ్ అధ్యక్షుడుగా ఉన్న గాంధి, మరింత తీవ్రంగా సహాయ నిరాకరణ చేశాడు. అరెస్టయి జైలుకెళ్లాడు. జైల్లో నిరాహార దీక్ష చేసి తిరుగుబాటు చేయమని ఆదేశించాడు. ఇలాంటి విధానాలను ఒక దశాబ్ద కాలం నిర్వహించాడు. 61ఏళ్ళ బాపు ఇరవై నాలుగు రోజులు నడిచి సముద్ర తీరం దండీలో ఉప్పు వండాడు ఇదే ఉప్పు సత్యాగ్రహం. ఇది దేశ ద్రోహంగా భావించి అరెస్ట్ చేస్తే ఆసియాలోనే కాదు పడమటి దేశాలన్నీ బ్రిటిష్ దౌర్జన్యాన్ని ఖండించి ఇండియన్‌లకు స్వాతంత్ర్యం ఇవ్వాల్సిందేనని ఘాటుగా తెలియజేశాయి. దీని ఫలితంగా గ్రేట్ బ్రిటన్ చర్చలు జరపటానికి తీవ్రంగా సిద్ధపడింది. లండన్‌కు ఆహ్వానించారు. అక్కడ అయిదవ జార్జి రాజుతోనూ క్వీన్ మేరీతోనూ కలిసి బకింగ్ హాం పాలస్ లో టీ త్రాగాడు. ఇండియాలో ధరించే అంగోస్త్రం, పై పంచతో చర్చలకు వెళ్ళాడు. రాజు గారితో భేటీకి ఈ డ్రెస్ సరి కాదు కదా అని ఒకరు వ్యాఖ్యానిస్తే "రాజు మా ద్దరికి సరిపడిన దానికంటే ఎక్కువ దుస్తులే ధరించాడు కదా" అన్నాడు బోసినవ్వుల బాపు. ఇండియా వదిలి వెళ్ళేదాకా బ్రిటిష్ వాళ్ళు భీష్మించుకొనే కూర్చున్నారు. అంతకంటే మొండిగా గాంధీ కూడా పట్టు వదలలేదు. మళ్ళీ మళ్ళీ ప్రజల చేత శాసనోల్లంఘన చేయించాడు,

జైలుకెళ్ళాడు, నిరాహార దీక్ష చేశాడు. హిందూ ముస్లిం లమధ్య సయోధ్యకు దిర్చాడు. అంటరాని తనాన్ని రూపు మాపాడు. పుట్టుకబట్టి కులంకాదు ప్రవర్తనబట్టి అన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వ నక్క జిత్తులు గాంధి ముందు పారలేదు. గాంధీని నియంత్రించటం అసాధ్యం అని గుర్తించింది తెల్ల జాతి ప్రభుత్వం. లక్ష్యం ఏమిటో 1942లో క్రిప్స్ రాయబారం వలన ఇస్తామన్న రాజ్యాంగ ప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్) చాలదని పూర్తి అధికారంతో స్వాతంత్ర్యం ఇచ్చి దేశం విడిచి బ్రిటిష్ వారు వెళ్ళిపోవాలని చెప్పాడు.

కాని దేశంలో ఐక్యత సాధించటం కష్టంగా ఉంది. రాత్రింబవళ్ళు హిందూ ముస్లిం ఐక్యత కోసమే శ్రమించాడు. పాకిస్తాన్‌లో ముస్లింలు ఎక్కువ. మిగతా దేశంలో హిందువులది మెజారిటీ. నాయకులతో 73 ఏళ్ళ వయసులో కూడా పరిష్కారం కోసం నిరంతర సంభాషణలు జరుపుతూనే ఉన్నాడు ఓపికగా. అసూయ, బదులు ప్రేమతో ఉండమన్నాడు ప్రతిఘటన వదిలి సహకరించాలని కోరాడు. కాని ఆయన ప్రయత్నం విఫలమైంది. రెండు మతాలమధ్య చిచ్చు రగిలింది. హింస ప్రజ్వరిల్లింది. కానీ రాజీ అనేది గాంధీ ముఖ్య సిద్ధాంతం. మెజారిటీ వైపే మొగ్గాడు. చివరిసారిగా ఎక్కువకాలం నిరాహార దీక్ష చేశాడు. దాదాపు చావు అంచుకు చేరాడు. ఢిల్లీలో చర్చలు జరిపి ఇండియా పాకిస్తాన్‌లు ఏర్పడాలని ముస్లింలు పట్టుబట్టారు. చర్చులు విఫలమైనాయి. ఒప్పుకోక తప్పలేదు. 1947 ఆగస్ట్ 15 ఇండియా స్వతంత్రం పొందింది పాకిస్తాన్ విడిపోయింది. మళ్ళీ గాంధి విఫలమైనాడు. సయోధ్యకోసం ప్రయత్నించే సమయం ఇక లేదు. 25-1-1948న. ఆదివారం దీక్ష అయిపోగానే ఒక ప్రార్ధనా సమావేశానికి హాజరయ్యాడు. మామూలుకంటే అధికంగా జనం హాజరౌతున్నారు ప్రార్ధనలకు. 30-1-1948న ప్రార్ధనా సమావేశానికి వెడుతూ ఉండగా నాథూరాం గాడ్సే అనే హిందూ మహాసభ సభ్యుడు గాంధీకి నమస్కరిస్తున్నట్లుగా వంగి చేతిలోని రివాల్వర్‌తో అతి దగ్గరగా మూడు సార్లు కాల్పులు జరిపాడు. "హే రాం" అంటూ కుప్ప కూలి ప్రాణం విడిచాడు జాతిపిత మహాత్మా గాంధీజీ.

"భూమి మీద గాంధీలాంటి మానవుడు జన్మించి జీవించి జాతిని ప్రపంచాన్ని ప్రభావితం చేశాడంటే భవిష్యత్తరాలు నమ్మ వేమో" అన్నాడట ప్రఖ్యాత సైంటిస్ట్ ఆల్బర్ట్ అయిన్ స్టీన్. నిజమే అంతటి చరిత్రనే సృష్టించాడు గాంధి. తన జీవిత చరిత్రను "ది స్టోరి ఆఫ్ మై ఎక్స్పరి మెంట్స్ విత్ ట్రూత్" (సత్య శోధన)గా రాసుకొన్నాడు. దీన్ని తెలుగులోకి తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామ మూర్తిగారు, శతావధాని శ్రీ వేలూరి శివ రామశాస్త్రిగారు అనువదించారు. ఎన్నో భాషలలోకి అనువాదం చెందిన పుస్తకం అది. ఎందరెందరికో కరదీపికగా భాసించింది. గాంధీపై రస్కిన్, థోరో టాల్ స్టాయ్

ప్రభావం ఉంటే, గాంధీ ప్రభావం నల్ల జాతి అమెరికా నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్‌పై అమితంగా ఉంది. లక్షలాది నల్లజాతి ప్రజలతో లాంగ్ మార్చ్ నిర్వహించి తన జాతి వారి హక్కులు సాధించాడాయన. అహింసా సిద్ధాంతాన్నే నమ్మి ఉద్యమించాడు.

బాల్యంలో సత్య హరిశ్చంద్ర నాటకం చూసి ప్రభావితుడై సత్యానికి జీవితాంతం కట్టుబడ్డాడు గాంధి. శ్రావణ పితృ భక్తి ఆయన్ను ఎంతో బాగా ఆకర్షించింది. భగవద్గీత ఆయన ఆరవ ప్రాణం. తనకు ఏ సందేహం వచ్చినా అదే తీరుస్తుందని చెప్పేవాడు. పుతలీబాయ్, కరం చంద్‌ల చివరి పుత్రుడైన మోహన్‌దాస్ గాంధి బొంబాయిలో లాయర్‌గా ఫెయిల్ అయి దక్షిణాఫ్రికా వెళ్లి అక్కడ లాయర్‌గా ఇండియన్ ప్రజా నాయకుడిగా సక్సెస్ అయ్యాడు. 1906లో అక్కడి ప్రభుత్వం జూలూ రాజ్యంపై నటాల్‌లో యుద్ధం ప్రకటిస్తే భారతీయులను సైన్యంలో చేర్చుకోమని ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చాడు. సరేనని 20మంది స్వచ్ఛంద సేవకుల్ని స్ట్రెచర్ మోయటానికి నియమించి గాయపడిన బ్రిటిష్ సైనికులకు వైద్య సహాయం అందించటానికి వినియోగించుకొన్నది. దానికి గాంధీ నాయకత్వం వహించి రెండు నెలకు పైగా పని చేశారు. ఈ ఉదంతం వలన బలీయమైన సైన్యం ఉన్న బ్రిటిష్ ప్రభుత్వంతో తలపడటం కష్టం అని తెలుసుకొని నెమ్మదిగా అహింసా విధానంలో, నిరసన, సమ్మెలతో వారి మనసు మార్చాలని నిర్ణయించాడు.

ఇండియాలో లోమితవాద భావాలున్న గోపాలకృష్ణ గోఖలే నాయకత్వంలో శిష్యుడిగా ఉండి కాంగ్రెస్ పార్టీలో పని చేశాడు. బ్రిటిష్ "విగ్గిష్" విధానాన్ని అనుసరించి పార్టీని పూర్తి స్వదేశీయంగా మార్చాడు. 1920లో కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడై 1930 భారత స్వాతంత్రం కోసం జాతికి పిలుపు నిచ్చాడు. 1939 బ్రిటిష్ ప్రభుత్వం జర్మనీపై యుద్ధానికి దిగినప్పుడు గాంధీ, కాంగ్రెస్ ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించారు. సమ్మెలు హర్తాళ్ళతో దేశాన్ని హోరెత్తించాడు. గాంధీమాటే మంత్రం అయింది. 1942లో ఇండియాకు అత్యవసరంగా స్వేచ్ఛను ఇవ్వాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాడు.

1918లో మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వ వైస్‌రాయ్ గాంధీని ఢిల్లీలో జరిగే యుద్ధ సమావేశానికి ఆహ్వానిస్తే వెళ్ళాడు. వారి మనసు దోచుకొని స్వాతంత్ర్యాన్ని పొందచ్చుననే ఆలోచన ఆయనది. భారతీయులను సైనికులుగా చేర్చుకోవటానికి ఒప్పుకున్నాడు. ఇది ఆయన అహింసా సిద్ధాంతానికి వ్యతిరేకమే కాని తానుకాని తన వాలంటీర్లుకాని యుద్ధంలో పాల్గొని ఏ ఒక్క సైనికుడినీ చంపము అని వైస్ రాయ్ సెక్రటరికి విజ్ఞాపన రాసి పంపాడు. అందుకే ఆంబులెన్స్‌లో ఉండి క్షత గాత్రులకు సేవలందించారు. బీహార్‌లోని చంపారాన్, గుజరాత్‌లోని ఖేడా ఉద్యమాలలో రైతులకు జరుగుతున్న అన్యాయానికి వ్యతిరేకంగా ప్రభుత్వంపై అహింసా విధానంలో

పోరాడాడు. రైతులకు న్యాయం చేకూర్చేట్లు ప్రభుత్వాన్ని ఒప్పించాడు. గుజరాత్‌లోని నాడియా జిల్లా ఖేడాలో జరిగిన ఉద్యమానికి వల్లభాయ్ పటేల్ నాయకత్వం వహించాడు. ప్రజలతో సంతకాల ఉద్యమం చేయించాడు. శిస్తులు కట్టవద్దని రైతులకు చెప్పి ఒప్పించాడు. అయిదు నెలలు తీవ్రంగా ప్రతిఘటించి ప్రభుత్వం దిగొచ్చేట్లు చేసి రైతు హక్కులు కాపాడాడు. దీనితో పటేల్ నాయకత్వాన్ని మెచ్చి "సర్దార్" బిరుదు ప్రసాదించాడు. 1919లో ఖిలాఫత్ ఉద్యమాన్ని నిర్వహించి ముస్లింలకు న్యాయం జరిగేట్లు చేశాడు.

1909లో గాంధీ "హింద్ స్వరాజ్" పుస్తకం రాశాడు. ఇందులో ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వం భారతీయుల సహకారం వల్లనే ఏర్పడి బతుకుతోందని ఇప్పుడు ప్రజా సహకారం లేనందున భారతీయులకు అధికారం అప్పగించి వెళ్ళిపోవాలని తీవ్ర స్వరంతో రాశాడు. తన హరిజన్ పత్రిక, యంగ్ ఇండియాలోనూ ప్రజాసమస్యలపై స్పందించి రాసేవాడు. పంజాబ్‌లోని జలియన్ వాలాబాగ్ మారణకాండతో ఆయనలో ఉద్రేకం పెరిగింది. 1921లో కాంగ్రెస్ పార్టీ గాంధీని ప్రత్యేకంగా ఆహ్వానించి ఆచరణాత్మక ప్రణాళిక రూపొందింప జేసింది. పార్టీని పునర్నిర్మించటానికి సూచనలు చేసి "స్వరాజ్ సభ్యత్వం" అందరితో తీసుకొనేట్లు చేశాడు. డబ్బుకట్టి సభ్యులుగా చేర్చే పని ప్రారంభించాడు. అహింసా సహాయ నిరాకరణ శాసనోల్లంఘనలతో బాటు స్వదేశీ విధానాన్ని చేర్చాడు. విదేశీ వస్త్ర, వస్తు బహిష్కరణ చేయించాడు. వాటిని పబ్లిక్ ప్రదేశాలలో ప్రజలు స్వచ్ఛందంగా దహనం చేసి పూర్తి మద్దతు పలికారు. రాట్నంపై తాను నూలు వడుకుతూ ప్రజల చేత వడికిస్తూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని "వణికేట్లు" చేశాడు. బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన బిరుదులూ సత్కారాలు త్యజించారు నాయకులు. ఇప్పుడు అంతా స్వదేశీయే. ఖద్దరు దుస్తులే కట్టారు. తెల్లని గాంధీ టోపిపెట్టి ప్రాభుత్వానికి "టోపీ పెట్టె" పనిలో పడ్డారు ప్రజలు. ఎక్కడికైనా మడిచి తేలికగా మోసుకు వెళ్ళే టైప్ రైటర్ సైజ్‌లో చిన్న పోర్టబుల్ రాట్నాన్ని గాంధీ స్వయంగా తయారు చేశాడు.

గాంధీ ప్రమేయం లేకుండా కాంగ్రెస్ రెండు గ్రూపులుగా చీలింది. ఒక దానికి చిత్తరంజన్ దాస్ మోతీలాల్ నెహ్రూలు రెండవదానికి రాజగోపాలాచారి సర్దార్ వల్లభ భాయ్ పటేల్ నాయకులు. కలిసి పనిచేసిన హిందూ ముస్లింలు క్రమంగా దూరమైపోయారు, దీనికి నివారణగా 1924లో గాంధీ మూడు వారాల నిరాహార దీక్ష చేశాడు. ఆయన ఆశించిన ఫలితం రాలేదు. ఆ ఏడాది కాంగ్రెస్ మహాసభను బెల్గాంలో జరపాలని చెప్పాడు. అందరూ ఆయనే అధ్యక్షత వహించాలని కోరగా కాంగ్రెస్ కార్యకర్తలంతా చేతితో వడికిన నూలుతో నేసిన వస్త్రాలు ధరిస్తామని ప్రతిజ్ఞ

చేస్తే అభ్యంతరం లేదన్నాడు. అందరూ ఆమోదించగా అసభకు గాంధీ అధ్యక్షుడిగా వ్యవహరించాడు. ఇదే ఆయన అధ్యక్షతలో జరిగిన ఒకే ఒక్క సమావేశం. స్వరాజ్ పార్టీకి కాంగ్రెస్‌కూ ఉన్న విభేదాలను చర్చలతో పరిష్కరించాడు. 1928లో గాంధీ మళ్ళీ పూర్తి ఉత్సాహంతో ఉద్యమించాడు. ప్రభుత్వం నియమించిన సైమన్ కమీషన్‌ను "గోబాక్" ఉద్యమంతో సాగనంపాడు. యువనేతలు నెహ్రూను సుభాస్ చంద్రబోస్‌ను దగ్గరకు తీశాడు. వాళ్ళు స్వరాజ్యం వెంటనే ఇవ్వాలి అని డిమాండ్ చేస్తున్నారు. రెండేళ్లలో తానే దాన్ని ప్రకటిస్తానని చెప్పి చివరికి ఒక్క ఏడాది గడువుతో సరిపుచ్చుకొన్నాడు గాంధి.

31-12-1929న లాహోర్‌లో భారత జాతీయ పతాకాన్ని ఎగరేశారు. 1930 జనవరి 26ను భారత స్వాతంత్ర్య దినోత్సవంగా సంబరాలను కాంగ్రెస్ లాహోర్‌లో సభ జరిపి నిర్వహించింది. 1930 మార్చ్‌లో గాంధి ఉప్పు సత్యాగ్రహానికి పిలుపు నిచ్చాడు. మార్చ్ 12నుంచి ఏప్రిల్ 6వరకు గాంధీ అహమ్మదాబాద్‌లో బయల్దేరి 388 కిలో మీటర్లు నడిచి సముద్ర తీర గ్రామం దండి చేరాడు. ప్రజలు బ్రహ్మరథం పట్టారు. దేశంలో ప్రతి చోటా ఉప్పు సత్యాగ్రహాలలో ప్రజలు పాల్గొని ప్రజా బలం నిరూపించగా బ్రిటిష్ ప్రభుత్వం ఇక అణచి ఉంచటం అసాధ్యమని గ్రహించింది. మద్రాస్‌లో ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు బ్రిటిష్ వారి తుపాకీకి చాతీ ఎదురుగా పెట్టి కాల్చమన్నాడు. ఉద్యమాలలో మహిళలను స్వచ్ఛందంగా పాల్గొనేట్లు చేశాడు. సరోజినీ, కమలానెహ్రు, దుర్గాబాయి దేశముఖ్ వంటి వారెందరో ఉద్యమించారు. మహిళా చైతన్యం కలిగించారు. గాంధీ ఒక "ప్రవక్త" అయ్యాడు జనాలకు. ఆయన చెప్పిందే వేదం. ఆయన నడచిన బాట ఆదర్శం. ఆయనపై పాటలు పద్యాలు గేయాలు కథలు నవలలు నాటకాలు వచ్చాయి. 1931లో గాంధీ -ఇర్విన్ ఒడంబడిక ఏర్పడింది. ఖైదీలన్దర్నీ ప్రభుత్వం విడుదల చేసింది. లండన్‌లో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు ఆహ్వానిస్తే వెళ్లి నిష్కర్షగా స్వతంత్రం ఇవ్వాల్సిందేనని చెప్పాడు. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ గాంధీ చర్యలను నిందించేవాడు "అర్ధనగ్న సన్యాసి" అని అవహేళన చేశాడు.

దళితుల పక్షాన అంబేద్కర్ నిలబడి అంటరానితనాన్ని రూపుమార్చాలని కోరాడు. 1934లో గాంధీ కాంగ్రెస్‌కు రాజీనామా చేశాడు. రెండేళ్ళ తర్వాత మళ్ళీ రాజకీయాలలో చురుకుగా పాల్గొన్నాడు. రెండేళ్ళ తర్వాత సుభాస్ బోస్ కాంగ్రెస్ అధ్యక్షుడై పట్టాభి సీతారామయ్య ఓడిపోతే పట్టాభి ఓటమి తన ఓటమి అన్నాడు గాంధి. బోస్‌కు దూరమైనాడు. గాంధీకి ఇష్టం లేకపోయినా బోస్ రెండవ సారి కాంగ్రెస్ అధ్యక్షుడిగా గెలిచాడు. గాంధీ మార్గాన్ని కాదని ముందుకు బోస్ వెడుతున్నాడని కాంగ్రెస్ నాయకులు

ఒక్కసారిగా రాజీనామా చేశారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమాన్ని మహా ఉధృతంగా నడిపాడుగాంధీ. “ordered anarchy of the present system of administration was worse than real anarchy” అన్నాడు. స్వాతంత్ర్యం వచ్చినా గాంధీ సంతోషంగా లేడు. అన్నదమ్ములు విడిపోయినందుకు బాధపడ్డాడు. ఉత్సవాలకు పదవులకు దూరంగా ఉన్నాడు. నెహ్రూను ప్రధానిగా పటేల్‌ను ఉప ప్రధానిగా ఉండాలని హితవు చెప్పాడు. గాంధీ నడచిన మార్గాన్నే “గాంధీ యిజం” అన్నారు. అదే అందరికి ఆదర్శమైంది. “There is no such thing as, "Gandhism, "and I do not want to leave any sect after me. I do not claim to have originated any new principle or doctrine. I have simply tried in my own way to apply the eternal truths to our daily life and problems...The opinions I have formed and the conclusions I have arrived at are not final. I may change them tomorrow. I have nothing new to teach the world. Truth and nonviolence are as old as the hills.[1]

గాంధీయిజం అనేది కొత్తదికాదని అనాదిగా ఈ దేశంలో వస్తున్నదాన్నే తానూ అమలు చేశానని చెప్పాడు. గాంధీ అంటే రవీంద్రనాద్ టాగూర్‌కు వీరాభిమానం. టాగూర్ నా గురువు అనేవాడు గాంధి. మహాత్ముడన్నాడు టాగూర్. విద్యావిధానం చదువుతూ ఆర్జించేదిగా ఉండాలని కోరాడు. అందుకే “నయీ తాలిం” అంటే బేసిక్ ఎడ్యుకేషన్ కోసం శ్రమించాడు. దీనిపై జకీర్ హుసేన్ చేత పుస్తకం రాయించాడు. ఆయనది “సర్వోదయ సిద్ధాంతం” అందరి సంక్షేమం కావాలన్నదే ధ్యేయం. గాంధీ ప్రభావం మార్టిన్ లూథర్ కింగ్, జేమ్స్ లాసన్, జేమ్స్ బావెల్‌పై అధికం. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ గాంధీని అనుసరించి “సరిహద్దు గాంధీ” అనిపించుకొన్నాడు. దక్షిణాఫ్రికా స్వాతంత్ర్యం కోసం ఉద్యమించి సంపాదించిన నెల్సన్ మండేలా, బర్మా నాయకురాలు ఆంగ్ సాన్ సూకీ, స్టీవ్ బీకోలు గాంధీ వల్ల ప్రేరణ పొంది అదే మార్గంలో పని చేసి లక్ష్యాలు సాధించారు. రోమిన్ రోలాండ్, బ్రెజిల్ లీడర్ మేరియా లేసెర్డా డీ మోరాలపై గాంధీ ప్రభావం చాలాఉంది. ఆయన్ను స్తుతించి కీర్తించిన వారే వీళ్ళు.

గాంధీపై అటన్ బరో గొప్ప సినిమా తీశాడు. బెన్ కింగ్స్లీ గాంధి పాత్రను గొప్పగా పోషించాడు. గాంధీ మరణించిన జనవరి 30వ తేదీని “అమర వీరుల దినోత్సవం”గా ప్రభుత్వం నిర్వహిస్తోంది. కల్లుతాగద్దని బోధించిన గాంధీ బొమ్మల ఎదుటే ఇవాళ కల్లు, సారా దుకాణాలు వెలిసి ప్రభుత్వానికి ధనం సంపాదించి పెడుతూ ఉండటం ఆశ్చర్యకరం. గాంధీ ఒక మహాత్ముడు. మార్గదర్శి భారత జాతిపిత.❋



## 48. అమెరికన్ నేటివిజాన్ని నెత్తి కెత్తుకొన్న ఎడ్విన్ ఆర్లింగ్టన్ రాబిన్సన్ (1869-1935)

కవిత్వంలోను, మాటల్లోను అసాధారణ సంక్షిప్తత, సిగ్గుపడే మనస్తత్వం ఉన్న అమెరికన్ కవి ఎడ్విన్ ఆర్లింగ్టన్ రాబిన్సన్. సమకాలీన విలువలను చాలెంజీ చేసి, పొందిన విజయాలను ప్రశ్నించి, ఆనాటి వరకు ఎవరూ ఎదిరించని కలం వీరుడిగా చరిత్రలో స్థానం పొందాడు. యవ్వన దశలోనే తాను ఈ ప్రపంచంలో నిత్య పోరాటంతో, తప్పించుకోరాని సంఘటనల మధ్య జీవించాల్సి ఉంటుందని గ్రహించాడు. 22-12-1869న అమెరికాలోని లింకన్ స్వరాష్ట్రం మెయిన్‌లో హెడ్ టైడ్ అనే గ్రామంలో జన్మించాడు. పుట్టిన ఏడాదికే తండ్రి కుటుంబాన్ని దగ్గరలోనే ఉన్న ఉత్పత్తి కేంద్రం,నాలుగు వేల జనాభా ఉన్న గార్డేనర్‌కు మార్చాడు. 27 ఏళ్ళు వచ్చేదాకా ఇక్కడే ఉండిపోయాడు. ఈ అనుభవాలను తన కవిత "టిల్బరీ టౌన్"లో నింపాడు. ఇక్కడున్న కాలంలో దాదాపు ఒంటరిగా, ఎక్కువకాలం ఇంట్లోనే ఉన్నాడు. తండ్రి షిప్ కార్పెంటర్‌గా పని చేశాడు. ఒక జనరల్ స్టోర్స్ కూడా ఉండేది. ఎడ్విన్ యవ్వన దశవరకూ ఆ కుటుంబం సంపన్న కుటుంబంగానే ఉండేది. తండ్రి లాండ్ ఓనర్, స్టాక్ హోల్డర్, కౌన్సిలర్, బాంక్ డైరెక్టర్ కూడా కావటంతో సంపన్న ధనిక కుటుంబంగా ఉన్నారు. ఎడ్విన్ ఇద్దరు అన్నయ్యలలో "డీన్"ను డాక్టర్ చేయించాలని చదివించారు. రెండోవాడు హీర్మన్‌ను బిజినెస్ మాన్‌గా మార్చాలని తండ్రి భావించాడు. ఎడ్విన్ చిన్నప్పటినుండి చాలా ప్రశాంతంగా ఉండేవాడు. చుట్టూ ఉన్న ప్రపంచంలో పోరాడి, విజయం సాధించగలిగితేనే బతకగలం అనే అధైర్యమేర్పడి, పోటీ పడటానికేప్పుడూ వెనకడుగే వేసేవాడు.

అయిదవ ఏటనే కవిత్వం చదివి అర్థం చేసుకొని, పదకొండవ ఏట కవిత్వం రాయటం ప్రారంభించాడు రాబిన్సన్. ఎడ్విన్ "టీన్" వయసు నుంచి బయటపడే లోపే తండ్రి ఆరోగ్యం క్షీణించి, నిత్యం చావు బతుకుల్లో గడిపాడు. తెలివిగల అన్న

"డీన్" మెడికల్ ప్రాక్టీస్ మానేసి, మత్తుమందుకు బానిసై, నరాల వ్యాధితో నరకమే అనుభవించేవాడు. మేజర్ అయిన ఆర్లింగ్టన్, రాబోయే భవిష్యత్తు యెంత దారుణంగా ఉండబోతుందో ఊహించుకోగలిగాడు. స్వీయ అస్తిత్వం లేకుండా నిరాశ నిస్పృహలతో ఒంటరి జీవిగా కుంగిపోయాడు. "నేను దాదాపు ఇరవై రెండేళ్ళు గార్డినర్‌లో ఉన్నానన్న మాటే కాని ఇల్లు వదిలి బయటకు వెళ్ళిన పాపాన పోలేదు" అని తర్వాతెప్పుడో రాసుకొన్నాడు. ఒంటరితనం వ్యక్తిత్వ వికాసానికి ఎక్కువగా తోడ్పడుతుందని, తన అపజయాలకు అది సానుభూతి చూపుతుందని అనుకొన్నాడు. ఏదో తెలీని అదృశ్యశక్తి యాదృచ్ఛికంగా తన జీవిత నావను నడిపిస్తుందని నమ్మాడు.

1891 "ఫాల్" సీజన్‌లో హార్వర్డ్‌లో చేరి, రచయిత కావాలని అనుకొన్నాడు. హార్వర్డ్ మాసపత్రికకు డజన్ కవితలు పంపాడు. అందులో చాలా ఇప్పుడు అధిక ప్రాచుర్యాన్ని పొందినా, ఆనాడు ఆ పేపర్ వాటిని తిరస్కరించింది. రెండేళ్ళ తర్వాత కాలేజీ చదువుకు స్వస్తి చెప్పాడు. మిల్లులన్నీ మూతపడ్డాయి. బ్యాంకులు కట్టేశారు. బాగా వ్యవస్థీ కృతమైన ఫరములు కూడా దివాలా తీశాయి. నలభై లక్షల మంది ఉద్యోగాలు కోల్పోయారు. కొక్సీ నిరుద్యోగ సైన్యం వాషింగ్టన్‌పై దాడి చేసింది. రాబిన్సన్ అదృష్టమూ దీనితో తలక్రిందులైంది. తండ్రి చనిపోయాడు. అన్న డీన్ భ్రమలలో బతుకుతున్నాడు. మరో అన్న హీర్మాన్ తెలివి తక్కువగా పనికిరాని వాటిలో పెట్టుబడులు పెట్టి, కలిసి రాక తాగుడుఅలవాటై, కలల్లో తేలిపోతున్నాడు. ఈ పరిస్థితులలో తన కాళ్ళ మీద తాను నిలబడాల్సిన పరిస్థితి ఉందని ఎడ్విన్ గ్రహించాడు. ప్రపంచం చెప్పే వ్యాపార దృష్టి తనకు లేదని తెలుసుకొని వినయం కలిగి, అజ్ఞాతంగా ఉండిపోయిన, జనం మర్చి పోయిన వారి గురించి చిన్నకథలు రాస్తూ తన అదృష్టాన్ని పరీక్షించుకొంటున్నాడు. మధ్య మధ్యలో సానెట్లు, 19పంక్తులతో, రెండు రైమ్స్ ఉన్న "విల్లనేల్లెస్" కవితలు రాశాడు. తర్వాతి జీవితంలో అడపాదడపా నాటికలు గిలికే ప్రయత్నమూ చేశాడు. ఇవేవీ తనకు అచ్చి రావని గ్రహించి కవిత్వమే తనకు దిక్కు అనే నిశ్చయానికి వచ్చేశాడు.

చిన్నతనంలోనే చెవి ఎముకకు ఇన్ఫెక్షన్ సోకి, లోపలి చిన్న ఎముకలను నాశనం చేసింది. వినికిడి పోతుందేమోనని విపరీతంగా భయ పడ్డాడు. కళ్ళు కూడా చాలా బలహీనంగా ఉండేవి. కళ్ళు చెవిలపై తీవ్ర ఆందోళన చెందేవాడు. తనకు ఎవరో ఒకరు ఆసరాగా ఉంటేగాని జీవించలేననే అధైర్యమేర్పడింది. స్నేహితుడికి ఉత్తరం రాస్తూ 24 ఏళ్ళ తాను ప్రతి సెంటు డబ్బుకోసం, తినే ప్రతి ముద్ద కోసం తల్లిపై ఆధార పడాల్సి రావటం సిగ్గుగా ఉందని, ప్రపంచం తనను భయపెడుతోందని

తెలియజేశాడు. ఏదైనా వచనంలో రాసిపంపితే పేపరు వాళ్ళు తిరుగు టపాలో మొహాన కొట్టేస్తున్నారు. అతని బాగా ప్రసిద్ధమైన కవిత "ది హౌస్ ఆన్ ది హిల్"ను ఒక పత్రిక స్వీకరించింది కాని ఒక్క సెంటు కూడా విదల్చలేదు. ఇంకోటి మరో మేగజైన్‌లో అచ్చు అయి, ఒక ఏడాది పాటు ఆ పత్రికను ఉచితంగా పంపింది అంతే. కాని 1895లో మాత్రం ఎడ్గార్ అల్లెన్ పోపై రాసిన సానెట్‌ను "లిప్పిన్ కాట్స్ మేగజైన్" ప్రచురించి 7 డాలర్ల పారితోషికాన్నిచ్చి ఉత్సాహం నింపి, ఆర్థికంగా సాయపడింది. అదే 26వ ఏట అతని మొదటి సంపాదన అయింది.

1896లో వందపేజీల "దిటారెంట్ అండ్ ది నైట్ బిఫోర్" వ్రాతప్రతిని రాసి పంపిస్తే, రెండు సార్లు తిరస్కరింపబడింది. చివరికి రివర్ సైడ్ ప్రెస్‌లో ముద్రించి అతని అంకుల్ ఒకడు 312 పేపర్ బౌండ్ కాపీలను 52 డాలర్లకు అందజేశాడు. దీన్ని "To any man, woman, or critic who will cut the edges of it -- I have done the top" అని స్వీయ చేతనతో అ0కి తమిచ్చుకొన్నాడు. దీనిపై వచ్చిన స్పందన స్వల్పమే. కొన్ని విమర్శలు అనుకూలంగానే వచ్చినా ఇంకా ఎక్కు మందికి అందేలా రచయిత ప్రయత్నించాలని సలహా నిచ్చారు. గర్విష్టి అయిన ఒక పబ్లిషర్ రిచర్డ్ సి బాడ్జేర్ అతి తక్కువ ధరకే పుస్తకం కొత్త ప్రచురణ అచ్చు వేస్తానన్నాడు. కొన్ని కవితలు వదిలేసి కొన్ని కొత్తవి చేర్చినానా కంగాళీ చేసి, ఎడ్విన్ స్నేహితుడు డబ్బు అడ్వాన్స్‌గా ఇస్తే "ది చిల్డ్రెన్ ఆఫ్ ది నైట్"ను ప్రచురించి అందులో కొన్ని రాబిన్సన్ పోర్ట్రెయిట్లు కూడా చేర్చి 1897లో విడుదల చేశాడు.

అకస్మాతుగా ఎడ్విన్ గార్డే నర్ లో నిలబడలేక కూర్చోలేక నిద్రరాక, పని చేయలేక పోయాడు. అక్కడి వాతావరణాన్నే తట్టుకోలేక పోయాడు. హీర్మాన్ భార్య అయిన వదినతో "నలభై ఏళ్ళు దాటి నేను బతుకుతాననుకోవటం లేదు. కనుక చేయాల్సిందంతా ఈ లోపలే చేయాలి" అని చెప్పాడు. తండ్రి ఎస్టేట్‌లో తనకు దక్కిన వాటా కొన్ని వందల డాలర్లు మాత్రమే. దీన్ని తీసుకోని న్యూయార్క్ చేరాడు. అప్పుడు అతని ఆకారం "పలుచటి శరీరం, నిటారు మనిషి, అతని వంశపు చిహ్నాలు కొట్టొచ్చినట్లు ఉండే రూపంతో ఉండేవాడని పరిచయమున్న స్నేహితుడు చెప్పాడు. ఒకవేళ చూసేవాళ్ళకు ఇవి ఆనకపోతే అతని ముఖంలో కనిపించే విద్యా, మిరుమిట్లు గొలిపే కంటి చూపు అతని ప్రత్యేకతను చాటి చెప్పేవి. కొత్త సుదీర్ఘ కవిత "కెప్టెన్ క్రైగ్"ను స్క్రిబ్నర్ పత్రిక తిరస్కరించింది. దీని వ్రాత ప్రతిని స్మాల్, మే నార్డ్ పత్రికలకు పంపితే ఆహ్వానించాయి. కాని దీన్ని ఆ పత్రిక సంపాదకులలో ఒకడు ఒక వేశ్యా వాటికలో మర్చిపోతే చివరికి ఎప్పుడో అది బయట పడింది. తీరా అది వెలుగు చూశాక దాన్ని

ముద్రించటానికి కొత్త సంపాదక వర్గం ఒప్పుకోలేదు. అతని ఇద్దరు మిత్రుల ధన సాయంతో ముద్రణ భాగ్యానికి నోచుకొని అతని అచ్చయిన మూడవ పుస్తకంగా నిలిచింది. ఒంటిమీదకు 33ఏళ్ళు వచ్చాయి. ఇప్పటిదాకా రచనలవల్ల సంపాదించింది ఇదివరకు పో కవిపై రాసిన సానెట్‌కు వచ్చిన కేవలం ఏడు డాలర్లు మాత్రమే. చాలా నాజూకుగా సున్నితమైన కవితలలతో వెలువడే ఆ మేగజైన్ ఇతని కర్కశ శరాఘాత పదజాల కవిత్వాన్ని వేసుకోవటానికి ససేమిరా అంది.

పొట్ట గడవక చేతిలో చిల్లిగవ్వ లేక న్యూయార్క్‌లో ఒక అపార్ట్‌మెంట్ నుంచి, అంతకంటే చిన్నదైన వేరొక అపార్ట్‌మెంట్‌కు, మరీ చిన్నవాటికీ, మురికి కూపాలుగా ఉన్నవాటికీ మారుతూనే ఉన్నాడు. దరిద్రాన్ని తట్టుక లేక మానసిక శాంతికోసం సెలూన్లలో విస్కీతో పాటు ఉచితంగా అందించే భోజనంతో బతుకుతూ తిరిగాడు. ఖరీదైన సూట్ లేకపోవటం వలన, చిల్లులు పడ్డమురికి బట్టలు వేసుకోవటం వలన అతన్ని అతని స్నేహితులే అతనితో తాగి తందానాలాడటానికి అంగీకరించటం లేదు. విసిగి వేసారి గంటకు ఇరవై సెంట్ల జీతంతో రోజుకు పది గంటలు పనిచేసే ఒక ఉద్యోగంలో చేరాడు. ఈ ఉద్యోగం న్యూయార్క్ సబ్ వేలో చేసేవాడు. అండర్ గ్రౌండ్‌లో ఉంటూ వచ్చిన సరుకును లెక్క పెడుతూ గడిపాడు. ఈ జీవితాన్నే ఎడ్విన్ "నరకం లో గడిపాను" అని రాశాడు. తొమ్మిది నెలలకే సబ్ వే నిర్మాణం పూర్తయి ఉద్యోగం ఊడింది. చలి పులి విపరీతంగా గాండ్రించి దూకుతున్న కాలంలో ఒంటరిగా ఏ ఆచ్ఛాదనా లేకుండా దయనీయ జీవితం గడిపాడు. ఒక తీవ్రమైన ప్రమాదం నుండి త్రుటిలో తప్పించుకొన్నాడు. అదొక మిరకిల్ అంటాడు.

ఇంతలో అదృష్టం అతని తలుపు తట్టింది. ఆ నాటి ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ కొడుకులలో ఒకరికి రాబిన్సన్ రాసిన "ది చిల్డ్రెన్ ఆఫ్ ది నైట్" కంటబడి, తండ్రికి పంపాడు. అది చదివి సాహిత్యాభిమాని అయిన ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ ఆ రచనకు ఆశ్చర్యపడి, చలించి, పిలిపించి, ఇమ్మిగ్రేషన్ డిపార్ట్‌మెంట్‌లో ఇన్స్పెక్టర్ ఉద్యోగం ఇచ్చాడు. అమెరికా ఇలాంటి ప్రతిభావంతులైన కవులకు నిలయంగా ఉండాలని భావించి ఎడ్విన్‌ను న్యూయార్క్ కస్టమ్స్ హౌస్‌లో స్పెషల్ ఏజెంట్‌గా ఏడాదికి రెండు వేల డాలర్ల జీతంతో నియమిస్తూ "నువ్వు కవిత్వాన్ని గురించి ముందు ఆలోచించి ఆ తర్వాతే కస్టమ్స్ ఉద్యోగం గురించి ఆలోచించు" అని హితవు చెప్పాడు. మహదానందమేసింది కవి ఎడ్విన్‌కు. కృతజ్ఞత తెలియజెప్పుకొన్నాడు ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్‌కు.

హాయిగా స్వేచ్ఛగా ఇదివరకు రాయలేకపోయిన భావాలన్నిటికీ కవితలల్లాడు రాబిన్సన్. ఇదివరకటి కంటే కొంచెం వసతి ఉన్న ఇంట్లో కొంచెం ఎక్కువ సుఖాలతో

గడిపాడు. "ఇప్పుడు నాకు రెండుజతల బూట్లున్నాయి" అని గర్వంగా ఫ్రెండ్‌కు జాబు రాశాడు. ప్రెసిడెంట్-ఎడ్విన్‌కు జీవికను కల్పించటమే కాదు, ది అవుట్ లుక్ "పేపర్‌లో అతన్ని ప్రశంసిస్తూ ఆర్టికల్ రాసి, అతనికి ఆడియెన్స్ పెంచాడు. నాలుగేళ్ల తర్వాత రూజ్ వెల్ట్ పదవీకాలం పూర్తికాగానే రాబిన్సన్ ఉద్యోగం హుళక్కి అయింది. మరొక కవితా సంపుటి "ది టౌన్ డౌన్ ది రివర్" వెలువరించాడు. కొంతవరకు ప్రోత్సాహకమైన కామెంట్లు వచ్చినా అతని అపక్వ, భావనలను, మూఢత్వాలను, అసహజత్వాన్ని ఈసడించారు. మళ్ళీ ఒంటరి జీవితం, "దేవదాసు" అవతారంతో పూటుగా తాగుతూ బతుకుతున్నాడు. తన బోహీమియన్ స్నేహ బృందం దగ్గర డబ్బు అప్పు తీసుకొన్నాడు. మరోసారి కష్టాల కడలి దాటించే మరో తెప్ప దొరికింది హెర్మన్ హేగడర్న్ అనే జీవిత చరిత్రకారుని రూపంలో. కవిని కవులపాలిటి స్వర్గమైన మాక్డో వెల్ కాలనీకి తీసుకొని వచ్చి వసతి కలిపించాడు.

ముసలితనం మీదపడుతోంది వేసవిని న్యూయార్క్‌లో చలికాలాన్ని బోస్టన్‌లో గడుపుతున్నాడు. కవిత్వం అంబ పలుకుతోంది. కవితా ప్రవాహం యధేచ్ఛగా జాలువారి పుస్తక రూపాలను సంతరించుకొన్నది. "ది మాన్ ఎగైనెస్ట్ ది స్కై" శీర్షికతో, మరికొన్ని అతని ప్రసిద్ధ కవితలు "ది త్రీ ట్రావేర్స్" అనే మూడు పుస్తకాల సైజు కథనాల కవితలతో ముఖ్యంగా "ఆర్ధూనియన్ లెజెండ్ లని పిలువబడే మెర్లిన్, లాన్సేలాట్, ట్రి స్టాం, హావెంస్ హార్వెస్ట్, రోమన్ బార్త్ లో కవితలతో ప్రచురించాడు. 1921లో రాబిన్సన్ కవితా సంపుటికి పులిట్జర్ బహుమతి లభించింది. మరో రెండుసార్లు గౌరవప్రదమైన బహుమతులను అందుకొన్నాడు. 1924లో "ది మాన్ ట్వైస్ డైడ్"కు, 1927లో "ట్రిస్టాన్"కు ఈ అవార్డులు అందుకొన్నాడు. ట్రిస్టాన్‌ను "లిటరరీ గిల్డ్ బుక్" సంస్థ లక్షలాది తన క్లబ్ సభ్యులకు అందజేసి రికార్డ్ సృష్టించింది. అరుదైన గౌరవం ఇది. దీని తర్వాత ఇక వెనక్కి తిరిగి చూసుకోవాల్సిన అవసరమే కలగలేదు. రాసిన వన్నీ అద్భుత విజయాలే సాధించి కీర్తి ప్రతిష్టలు పెంచాయి. అరవై ఏళ్ళు వచ్చేసరికి సుదీర్ఘమైన శ్రమ పడుతూనే ఉన్నాడు. రాబడికోసం రాస్తున్నాడు. గత జీవితం, భవిష్యత్తు ఏమౌతుందోనన్న భయం ఆవరించాయి అతన్ని. వార్షికంగా రచనలు చేయాలనే సంకల్పంలోనే ఉన్నాడు. అలానే రాశాడు కూడా.

ఏడేళ్ళు ప్రతి ఏడాది, చివరికి చనిపోవటానికి ఒక నెల ముందువరకు కథనాత్మక కవితల్ని విడవకుండా రాశాడు. దీనితో అధిక శ్రమ కలిగి అలసట చెందాడు. ఇందులో "అమరాంత్" వంటివి పగటికలల కవితలున్నాయి. "నీకో డెమాస్"లో భరించరాని శబ్ద ఘోష ప్రతిధ్వనించింది. దెయ్యాల వయ్యారం భయపెట్టింది. కొన్ని అన్యార్ధ

ప్రాతిపదికలుగా ఉన్నాయి. గతకాలపు తన జీవితాన్ని నీడలుగా చూపుతున్నాడో, లేక వాటిని సెటైర్‌గా రాస్తున్నాడో అర్థం కాకుండా ఉంది. తన పాత్రలకు చిరస్మరణీయమైన పేర్లు పెట్టాడు. కాని మాల్కం కౌలీ అధ్యయనం ప్రకారం "ఎడ్విన్ ఒక్కోసారి ఆ పాత్రలకు ముఖాలను అమర్చటం మర్చే పోయాడు". తరువాత కాలంలో స్నేహబృందం యెడల చాలా ఓపికతోను, కొందరు మగాళ్ళను నమ్మకుండాను, అసలు ఆడవాళ్ళపై నమ్మకమే లేకుండానూ గడిపాడు. ఎవరినీ ప్రేమించలేదు ఎవ్వర్నీ పెళ్లాడ లేదుకూడా. ఇసడోరా డంకన్ అనే డాన్సర్ అతన్ని లొంగ దీసుకొని ముగ్గులో దింపే ప్రయత్నం చేసింది. ఆమె నంగనాచి మాటలకు, వెకిలి చేష్టలకు లొంగిపోయాడు. అరవైవ ఏట మళ్ళీ ఒంటరితనమే. గదిలోంచి బయటకు వచ్చేవాడే కాదు. అతని చివరి శీతాకాలాలు భరించరాని బాధలతో గడిచాయి 66వ ఏట మరింత బలహీనుడై క్లోమ గ్రంధి వ్యాకోచించి దారుణస్థితిలో న్యూయార్క్ హాస్పిటల్‌లో చేరాడు. అతనికి ఆపరేషన్ చేసి బతికించటం కస్టమన్నారు డాక్టర్లు. హాస్పిటల్‌లోనే ఎడ్విన్ ఆర్లింగ్టన్ రాబిన్సన్ 6-4-1935న చనిపోయాడు.

చనిపోయిన తర్వాతనే రాబిన్సన్ గొప్పతనం బాగా వెలుగులోకి వచ్చింది. అతడు అంకితమైన ఒకే ధోరణిని మెచ్చారు. అతని చెదరని ఏకాగ్రతకు జోహార్లు అర్పించారు. తన కీర్తిని గౌరవంగా లిఖించుకొన్న అతనిని అభిమానించారు. అతని భయంకర, నిరాశావాదాన్ని అతన్ని విస్తృత ప్రేక్షకులకు దూరం చేసినా ట్రిస్టాన్‌తో జనరంజక కవి అయ్యాడు. అయినా అతన్ని నిరాశావాద కవి అనే ముద్ర వేసింది లోకం. రాబిన్సన్ "ఈ లోకం జైలు గది కాదు అదొక అద్భుత ఆధ్యాత్మిక కిండర్ గార్టెన్. అందులో తికమక పడే లక్షలాది శిశువులు దేవుడు అంటూ తప్పు దోవన పడుతున్నారు" అన్నాడు. అతని సిద్ధాంతం నిరాశ కాదు, ఒంటరి తనం మాత్రమే. అతని గుండె కలలకు నోచుకోని తాగుబోతులకు బాసట. భ్రాంతిలో అపజయం పాలైన వారికి ఊరట. వారందరిలో తనను చూసుకొన్న కవి రాబిన్సన్. సరికొత్త పూర్తి అమెరికన్ బొమ్మల కొలువు (గాలరీ) సృష్టించాడు. అతని పాత్రలు ఎలా ఉన్నాయో విశ్లేషకుల భాషలోనే తెలుసుకొందాం. "Richard Cory who", "glittered when he walked, "and fluttered pulses butwho, one calm summer night, "went home and put a bullet through his head". Miniver Cheevy, born too late, in love with the past, sighing "for what was not "who coughed", "and called it fate, and kept on drinking".

రాబిన్సన్ కవితా మాణిక్యాలు కొన్ని చూద్దాం - "where strangers would

have shut the many doors --that many friends had opened long ago". రాబిన్సన్ పాత్రలు-న్యు ఇంగ్లాండ్ ప్రతిభతో వెలుగులు వెదజల్లుతాయి. సానుభూతి, వ్యంగ్యంతో రాణిస్తాయి. కాని అక్కడి ముతక హాస్యంతో నవ్వు తెప్పిస్తాయి. నిజమైన నవ్వుకు దూరమైనట్లు కనిపిస్తాయి. సున్నితత్వం బాధలతో ఆ పాత్ర పోషణ చేశాడు. మనిషికి ఉన్న నిర్దయ, క్రూరత్వం, అవినీతి, సాటిమనిషిపై ప్రేమ లేకపోవటాన్ని తన కవిత్వంలో ఎండ కట్టాడు. "tell me oLord --tell me, o lord, how long --Are we to keep Christ writhing on the Cross"

రాబిన్సన్ సృజనశీలి కాదు. కొత్త టెక్నిక్‌ను ప్రవేశ పెట్టిందీ లేదు. సంప్రదాయ కవిత్వానికి కొత్త రూపు కల్పించిన వాడూ కాదు. పాత రూపాలను పునరుజ్జీవింప జేసినవాడు. సానెట్‌లకు సానపెట్టి కొత్త వెలుగులు తెచ్చినవాడు. ఫ్రెంచ్ పద్ధతులను అమెరికన్ కవిత్వంలో ప్రవేశపెట్టి బాలడ్, విల్లనేల్లె లను రూపొందించినవాడు. తేలికైన కవిత్వానికి సీరియస్నెస్‌ను అద్దినవాడు. ప్రేయేడ్, డాబ్సన్‌ల కథనాత్మక విషాదాలకు, శైలికి పరి పుష్టి చేకూర్చాడు. అమెరికాలో అంతవరకు ఏ కవీ చేయని సంక్షిప్త చిత్ర రూప కవిత్వాన్ని ఆవిష్కరించాడు. అతని అభిరుచి, శ్రద్ధ శ్లాఘనీయమైనాయి. చమత్కార చాటు రూపక కవిత్వానికి పట్టాభిషేకం చేశాడు. సంప్రదాయ కవిత్వానికి కొత్త సోకులు సొబగులు జవం జీవం తాజాతనం చేకూర్చాడు. అతని ప్రశాంతత బాధల్లో నుంచి ఉద్భవించింది. అతని యవ్వన జాతీయాలు వేధించే పోరాటంలోంచి ప్రభవించినవే. అతను ఉన్న సమకాలీన అంగీకృత విలువలను నిరాకరించి, భౌతికతను కాదని అసలైన అస్తిత్వాన్ని ప్రదర్శించాడు. తన వైఫల్యాలను ఆర్భాటంగా ప్రదర్శించాడు. అట్టడుగు ప్రజల , అణగారిన ప్రజల, అలక్ష్యం చేయబడిన, తిరస్కృతుల, పీడితుల వాణిగా నిలిచాడు, ప్రతినిధిగా గౌరవం పొందాడు. ఓటమి నుంచి ఒకింత చేదు విజయాన్ని పొందిన కవి రాబిన్సన్. దాదాపు 25 కవితాసంపుటులు వెలువరించాడు. రెండు నాటకాలు మూడు లేఖా సంపుటులు, కొంత కలగూర గంప రాశాడు.❋



## 49. ఫ్రెంచ్ క్లాసికల్ పెయింటింగ్ సంప్రదాయ పరిరక్షకుడు- హెన్రీ మాటిస్సే (1869-1954)

హెన్రి ఎమిలి బెనాట్ మాటిస్సే జీవిత చరిత్ర అంటే అతని పెయింటింగుల కేటలాగ్ అవుతుంది. కళనే జీవితంగా జీవించినవాడు, నిజంగా చెప్పాలంటే "కాన్వాస్ పైనే జీవించాడు". 31-12-1869న ఫ్రాన్స్‌లోని పెకార్డీ లో ఉన్న ఫ్రాన్స్-ఫ్లాన్డర్స్‌తో కలిసేచోట లీ కాత్యూ అనే చిన్న పట్టణంలో జన్మించాడు. తండ్రి ధాన్య వ్యాపారి. పెద్దకొడుకైన హెన్రీ లాయర్ కావాలని తండ్రి కోరాడు. దీనికి అనుగుణంగానే కొడుకు చదువు ప్రారంభించాడుకాని అనారోగ్యం వలన కొనసాగించలేక పోయాడు. కోలుకొంటున్న స్థితిలో తన చుట్టూ ఉన్న వస్తువుల స్కెచ్‌లు గీశాడు. అప్పుడే అతని దృష్టిలో "హౌ టు పెయింట్" అనే పుస్తకం పడింది. తలిదండ్రులకు ఇష్టం లేకపోయినా లాకు నీళ్ళొదిలి ఆర్టే హార్ట్‌గా భావించి ముందడుగే వేశాడు. కమ్మర్షియల్ డిజైన్‌లో పాఠాలు నేర్చాడు. దీన్ని ఎంబ్రాయిడరీ కోసం వాడుతారు. కాని 23 ఏళ్ళు వచ్చేసరికి ఆర్ట్‌ను క్రమపద్ధతిలో నేర్వటం ప్రారంభించాడు. 29వ ఏట టౌలస్‌కు చెందిన ఎమిలీ పెయేరేను పెళ్ళాడాడు. ఇద్దరు కొడుకులు జీన్, పియరేలు పుట్టారు.

సాంప్రదాయ విద్యా విధానాన్ని తిరస్క రించే రాడికల్‌గా పెయింటింగ్ జీవితం ప్రారంభించలేదు హెన్రి. అతని మొదటి గురువు స్పాంజి కేక్ పింక్, షుగర్‌లతో వనదేవతలను చేయటంలో ప్రసిద్ధుడైన బోగురే. ఇది మూడో తరగతి ఆర్ట్‌గా భావించి,

గుస్టేవ్ మొరువా స్టూడియో లో చేరాడు. గుస్టేవ్ గొప్ప ఆర్టిస్ట్ కాకపోయినా హేన్రిపై ప్రభావం చూపించాడు. ఈయనే రౌవాల్ట్, డూఫీ, మాటిస్సే లను అరువు తెచ్చుకొన్న శైలిని వదిలేసి, స్వంత స్టైల్‌ను జాతీయతను ఏర్పాటు చేసుకోమని సూచించాడు. మాటిస్సే స్వతంత్ర విధానంలోకి మారటానికి ఎక్కువ కాలం పట్టింది. పూర్వపు ప్రసిద్ధ ఆర్టిస్ట్‌ల చేతలను కాపీ చేయటం మొదలు పెట్టి మ్యూజియంలలో ఉంచటానికి అమ్ముకొంటూ డబ్బు సంపాదించేవాడు. తర్వాత కాలంలో అరాచక వాది అనిపించుకొన్నా, ఎన్నడూ సంప్రదాయాన్ని నిరాకరించలేదు. తన పూర్వ ఆర్టిస్ట్‌ల నైపుణ్యాన్ని మెచ్చుకుంటూ, తన భావధోరణిని వాటిలో ప్రవేశ పెడుతూ, అకాడెమీలో నేర్చిన విషయాలను చొప్పిస్తూ ఎదిగాడు. అందుకే ఆతను "నేనెప్పుడూ ఒక పాదం లాగ్రే లోను, భవిష్యత్తులో సాహసాలు చేయాల్సి వస్తే, నా "లంగరు" నా స్వంత ఊరులోను ఉంచుతాను" అన్నాడు హెన్రి.

ఈ యాంకర్ అంటే లంగరు తాత్కాలికంగా వదిలేసి, అనుభూతి వాదులతో (ఇంప్రెష నిస్టులు), తర్వాత వారినీ అధిగమించి ముందుకే మున్ముందుకే దూసుకుపోయాడు. 1897లో ముప్ఫై ఏళ్ళకు పెయింటర్ మొరువా ఊహించి "మాటిస్సే ఏదో ఒక రోజు పెయింటింగ్‌ను సరళీకృతం చేస్తాడు" అని ముందే చెప్పిన మాట కొంతవరకు యదార్ధమయింది. వివరంగా చెప్పాలంటే అతని లాడేసేర్టే పూర్తిగా సృజనాత్మకమైనదే. ఇది సెలూన్ డీ లా సొసైటీ నేషనేల్ వారికి కారం రాసినట్లని పించింది. ఈ మరపు రాని విషయాన్నే జెట్రూడ్ స్టెయిన్ "మాటిస్సే శీతాకాలం అంతా ఒక స్త్రీ ఒక టేబుల్ ను సర్దుతూ, దానిపై అద్భుతమైన డిష్‌లో పండ్లు" ఉన్న ఒక పెద్ద చిత్రాన్ని గీస్తూ గడిపాడు. ఈ పళ్ళను ఎలాగైనా కొనమని తన కుటుంబం వారిని కోరాడు. ఆ రోజుల్లో పారిస్‌లో పళ్ళు అంటే విపరీతమైన అభి రుచి ఉండేది. మామూలు పళ్ళు అంటేనే మహా ఇష్టంగా ఉండేవారు జనం. అలాంటిది ఇంతటి అపూర్వ సృష్టి అయిన మాటిస్సే పళ్ళు అంటే మహా ముచ్చటపడ్డారు కళా ప్రియులు, సామాన్యులు కూడా. ఆ ఫలాల తాజాదనాన్ని అలాగే కాపాడటానికి పెయింటింగ్ స్టూడియోలో చల్లదనం కలిపించారు, పారిస్ వింటర్‌లో అది పెద్ద అసాధ్యమైన విషయం కాదు. ఈ చిత్రాన్ని మాటిస్సే ఓవర్ కోట్ వేసుకొని, చేతులకు గ్లోవ్స్‌తో చలికాలమంతా శ్రమించి చిత్రించాడు. ఇంత కష్టమూ పడి గీసి సెలూన్‌కు పంపితే తిరస్కారానికి గురైంది. అవి చాలా చీకటి రోజులు, ఆతని ఉత్సాహం నీరుకారింది" అని రాశాడు. కొత్త చిత్రాలను అమ్మి పొట్ట గడుపుకో లేక పోయాడు. శిల్పిగా జీవితం ప్రారంభించాలను కొన్నాడు. భార్య టోపీలు తయారు చేసి అమ్మి కొంత డబ్బు సంపాదించేది.

1904లో అద్భుతమైన వ్యాపార దృష్టి ఉన్న సెజెన్నేలోని కళను గుర్తించి లోకానికి

పరిచయం చేసిన ఆంబ్రోస్ వోలార్డ్ మాటిస్సే చిత్ర ప్రదర్శన ఏర్పాటు చేశాడు. ఆర్థికంగా అది విజయం సాధించలేదు. వోల్లర్డ్ ఒకే ఒక కాన్వాస్‌ను అమ్మగాలిగాడు. దానివలన మాటిస్సేకి దక్కింది కేవలం వంద ఫ్రాంకులు మాత్రమే. కాని కొత్త తరహా ఆలోచన, భావ వ్యక్తీకరణ, తెలివి తేటలు ఉన్న నూతన ఆర్టిస్ట్ లభించాడని అందరూ సంతోషించారు. పారిస్‌లో దర్శనమిచ్చిన అనేక జపనీస్ ప్రింట్‌లకు ఆకర్షితుడై వాటిని వాటి ప్రభావం నీడలను పడనీయ కుండా తమాషాగా అనుకరించాడు. 36వ ఏట 1905లో ఇంకొక అడుగు ముందుకేసి, కొత్త ప్రదేశంలో కాలుపెట్టాడు. యువరాడికల్స్ అనబడే "వైల్డ్ బీస్ట్"లతో కలిసి సగం గర్వం సగం ఎదిరించే "ఫావిజం" పాత్ర చిత్రీకరణను అంగీకరించి నడిచాడు. అదంతా ఇజాల కాలం. ఫావిజం నుంచి ఇంప్రెష నిజం వచ్చింది తర్వాత పోస్ట్ ఇంప్రెషనిజం, డివినిజం, పాయింటిలిజంలు వచ్చి చేరాయి. దీనితర్వాత జర్మనీలో ముఖ్యంగా ఎక్స్‌ప్రెషనిజం వచ్చింది. ఫాచురిజం ఇటలీని ఊపేసింది. ఇంగ్లాండ్‌ను వోర్టి సిజం, ఇంగ్లాండ్‌ను కట్టి పడేసింది. సర్రియలిజం అబ్ స్ట్రాక్షనిజం ప్రపంచమంతా రాజ్యమేలాయి.

ఫ్రాన్స్‌లో వైల్డ్ బీస్ట్‌లు వస్తు విషయంలో స్వేచ్ఛ తీసుకొన్నారు. వాళ్ళు వస్తువులను కాకుండా ఆలోచనలనే (ఐడియాస్) పెయింట్ చేశారు. మానసిక స్థితి (మూడ్)ను వ్యక్తీకరించటానికి ఆకారాలను ఏకపక్షంగా మార్చేశారు. భావ వ్యక్తీకరణకు దట్టమైన హింసాత్మక (వయొలెంట్) రంగుల్ని, అంతకు పూర్వం ఎవరూ కూడా వాడని వాటిని వాడారు. వీళ్ళని ప్రకృతి అంటే ఏమిటో తెలియని "పిచ్చోళ్ళు" దిగజారిన జనం, నేరగాళ్ళు బుద్ధిలేని నమ్మక ద్రోహులు అని గేలి చేశారు. పబ్లిక్‌ను అవమానిస్తూ దిగజార్చే ప్రయత్నం చేస్తున్నారని, మాన మర్యాదలు మంటగలుపుతూ దేశద్రోహం చేస్తున్నారని వీరిపై అభియోగం మోపారు.

మాటిస్సే చేస్తున్న సరళీకరణ, రంగుల విధానం విమర్శకులకు విపరీతమైన కోపం తెప్పించింది అతన్ని అరాచకునిగా అన్ని సంప్రదాయాలను విధ్వంసం చేసేవాడిగా, దోషిగా ప్రకటించారు. "మాటిస్సే ఒక విషం. అతడు ఆల్కహాల్ కంటే ఎక్కువ హాని చేస్తాడు. పిచ్చితనానికి అతడు పరాకాష్ట" అన్నారు. క్రమంగా అతని కీర్తి వ్యాపించాక హెన్రి మెక్ బ్రైడ్ అనే అమెరికన్ విమర్శకుడు "ఆర్టిస్ట్‌గా జీవితం ప్రారంభిన సమయంలో మాటేస్సే ఉత్సాహం కోసం తననే చూసుకొని స్వేచ్ఛ, వ్యక్తీకరణలకు కోసం చిన్నపిల్లల బొమ్మలేశాడు. తాను పిల్లాడు కాకపోయినా అది అవసరమనిపించి స్కూలులో బోధించే అనేక రకాల మేనరిజంల సృజనకు తోడ్పడింది. తరువాత బేఫర్వాగా పెయింటింగ్ చేయటం నేర్చాడు. మాటిస్సే గొప్ప చిత్రాలన్నీ సంసిద్ధతను దాచి, అభి వృద్ధి చెందే

దిశలో ఉన్నట్లు అనిపిస్తాయి.

జేట్రూడ్ స్టెయిన్ ఆమె సోదరుడు లియోలు మాటిస్సేను పేదరికం నుండి బయట పడేశారు. అతని చిత్రాలను అధిక సంఖ్యలో కొని, ప్రచార ఉధృతీ కల్పించారు. అమెరికన్లను కొనమని ప్రోత్సహించారు. సమతల దివ్య కూర్పుల విషయంలో వ్యవహారమూ నడిపారు. దీనితో మనో ధైర్యం కలిగి, ఆశించని, నమ్మలేని ఉత్తమ ఫలితాలు రాగా చిత్రకారుల కోసం మాటిస్సే ఒక వర్క్ షాప్, స్టూడియో నిర్వహించాడు. తన చిత్ర ప్రయోగాల సందర్భంగా ఒకసారి "ప్రకృతికి కట్టుబడి యధాతధంగా చిత్రించటం అంటే మీరు ఆత్మహత్య చేసుకొన్నట్లుగా భావించకండి. మొదట్లో నేచర్ పైనే అందరం ఆధార పడాలి దాని ప్రభావాన్ని పొందాలి కూడా. ఆ తర్వాత ఆ ప్రకృతినే చైతన్య పరచి (మోటివేట్) మరింత అందంగా ఆకర్షణీయంగా చేయాలి. కాని తాడు మీద నడిచే ముందు మీరు గట్టిపట్టుతో నేల మీద నడవాలి" అని తన విద్యార్ధులకు బోధించాడు.

నలభైవ ఏడు వచ్చేసరికి మేధావి అనిపించాడు. ఎత్తైన నుదురు, పలుచబడిన జుట్టు, వింత నోరు, తీవ్రమైన కళ్ళు, పెద్ద కళ్ళ జోడుతో కనిపించాడు. గణిత ప్రొఫెసర్లాగా, చిరుఆఫీసర్లా, గ్రామీణ వైద్యునిలా అనిపించేవాడు. ఊహాత్మక భావ ధోరణి మాత్రం ఆయన్ను 80వ ఏడాది వరకు వదలలేదు. యాత్రలలో ఆనందాన్ని అనుభూతిని పొందాడు. 1917లో నైస్లో స్థిర నివాసం ఏర్పరచుకోనేదాకా మొరాకో ఉత్తర ఆఫ్రికాలో వింటర్ను గడుపుతూ అక్కడి పండ్ల తోటలు, పుష్పాల అందాలను చిత్రించాడు. 1930లో గాజిన్ ప్రవేశ ద్వారాన్ని పర్య వేక్షించటానికి తాహితికి వెళ్ళాడు. అమెరికా కూడా వెళ్లి, కార్నెజీ ఎక్సిబిషన్లో జడ్జీగా కూడా ఉన్నాడు.

అరవై దాటాక మాత్రమే అతని చిత్ర రచనా సామర్ధ్యానికి గుర్తింపు కలిగి మెచ్చుకోవటం ప్రారంభించారు. ఫ్రెంచ్ క్లాసిక్ చిత్రకారుడని శ్లాఘించి సిజన్నేతో సరిసమానం అన్నారు. సిజన్నే అంటే యవ్వనంలో మాటిస్సేకి వీరాభిమానం ఉండేది. ఒకే తరానికి చెందిన ఇద్దరు పెయింటర్స్లో భేదం పెద్దగా ఉండదు మాటిస్సే ఏనాడు ఆడవారిని చిత్రించక పోయినా అవసరమొస్తే వారిని గొప్ప అభిరుచి లేకుండానే, వ్యక్తిత్వం లేకుండానే చిత్రించాడు. సిజన్నే లాండ్ స్కేప్ చిత్రాలలో అద్వితీయడని పించాడు. మాటిస్సేతన పాత్రలను లాండ్ స్కేప్లకంటే వ్యక్తిత్వసంబంధం లేకుండా గీశాడు. సిజాన్నే లాగా కాకుండా మాటిస్సే మానవ శరీరానికి ప్రాధాన్యమిచ్చి, అంతులేని లయలు అనేకానేక రూపాలు వాటిలో కనిపించేట్లు చూపాడు. దృష్టికోణంలో భేదం ఇది. అతని నగ్నచిత్రాలు ఆ శతాబ్దపు సెక్స్కు అతీతంగా ఉంటాయి. ఇది ఒక వింత విషయమే. మాటిస్సే "చిత్రకారుని రంగు యొక్క ఉద్దేశ్యం భావ వ్యక్తీకరణను

సాధ్యమైనంత ఎక్కువగా చూపించటం" అని రాశాడు. అతనే "A work of art must carry in itself its complete significance and impose it upon the beholder even before he can identify the subject matter. What I dream of is ,an art of balance of purity and serenity devoid of troubling or depressing subject matter, an art which might be for ever mental worker like an appeasing influence, like a mental soother, something like a good arm chair in which to rest from physical fatigue"అని ఆర్ట్ పై తన హార్ట్ ఓపెన్ చేసి చెప్పాడు మాటిస్సే.

మాటిస్సే చిత్రాలలో వర్ణం అంటే కలర్ ఆయువు పట్టు. రంగు సంఘటిత పరచే ప్రతినిధి మాత్రమే కాకుండా, చాలాసార్లు ఆసక్తికరంగా పునరా వృత్త పరికరమే అయి మొత్తం నమూనానే మార్చేస్తుంది. మాటిస్సే ప్రాముఖ్యం ఉన్న ఆకృతుల లోతులను ఏవగించుకొనే రియలిజం, రూపకల్పనలో కేంద్రీకరణలతో సాధించాడు. ఒక రూపానికి ప్రాముఖ్యం ఇవ్వటానికి ముందుగా నల్ల గీతలతో ఆకారం(అవుట్ లైన్) కల్పించి, సాంప్రదాయ విరుద్ధంగా ఆరంజ్, పింక్, స్కార్లెట్ పర్పుల్ రంగుల కలయికలతో బహిర్గతం చేస్తాడు. అనుభూతి వాదులలాగా మాటిస్సే సాధారణ షేడింగ్, మృదు క్రమాలను వదిలేసి, ఆకస్మిక విరుద్ధ రంగులతో సూటిగా రూపాన్ని ఆవిష్కరిస్తాడు. చూసేవాడికి భౌతిక ప్రభావం తక్షణమే కలిగి ఆనందం అనుభవించి, అనుభూతికి లోనౌతాడు. డిజైన్‌పై అతనికి అపారమైన నమ్మకం ఉంది అది ఒక అందమైన చేతి వ్రాతలాగా, విభిన్న మైన పాయలతో, చాలా అర్ధ వంతంగా ఉంటుంది.

ఎనభైవ ఏట వెనిస్లో తన స్వగ్రామం నైస్‌కు దగ్గరలో ప్రార్ధనాలయాన్ని (చాపెల్) పూర్తిగా డిజైన్ చేసి అలంకరించాడు. ద్వారాలు, స్టేయిండ్ గ్లాస్ కిటికీలు, క్రాస్‌లు, గాన, వాద్యాల నిలయం, కాండిల్ స్టిక్స్, క్రూసి ఫిక్స్, పై పెంకు, ప్రీస్ట్ గారి స్లీవ్లెస్ ఔటర్ కోట్, అన్నీ తానే డిజైన్ చేశాడు. 83వ ఏట కేన్సర్ వచ్చి ప్రేగుకు ఆపరేషన్ జరిగి ఒంగిపోయాడు. మంచమే శరణాగతి అయింది. అయినా కళాత్మక కృషి మానలేదు. ఇప్పుడు ప్రపంచం అంతా మాటిస్సే ఆనాటి సజీవ చిత్రకారులలో మహోన్నత చిత్రకారుడని గుర్తించి బహుధా ప్రశంసించారు. ఒక్క ఫిలిస్టైన్లు మాత్రం అంగీకరించలేదు. అప్పుడప్పుడు ఎవరో ఒక విమర్శకుడు యదార్ధత నుంచి పారిపోయి, ఎంబ్రాయిడరీ, టైలరింగ్‌కి ప్రాధాన్య మిచ్చాడని సన్నాయి నొక్కులు నొక్కుతూనే ఉన్నారు.

తనను చులకనగా చూసే వారిని మాటిస్సే పట్టించుకోలేదు. 85వ ఏట ఒక వ్యాసం రాస్తూ "The artist is a man who succeeds in arranging, for

their appointed end, a complex of activities of which the work of art is the outcome" అని స్పష్టం చేశాడు. కాంప్లెక్స్ ఆఫ్ యాక్టివిటీస్ అని చెప్పిన దానిలో వక్ర దృష్టి కూడా ఉంది. "The average observer sees everything more or less distorted by acquired habits prejudices, points of view" అని అభిప్రాయ పడ్డాడు. ఆర్టిస్ట్ అనేవాడు జీవితాన్ని తనలాగే తన చిన్నతనంలో చూసినట్లు పక్షపాతం లేకుండా దర్శించాలని, హితవు చెప్పాడు. అది కోల్పోతే ఆర్టిస్ట్ తన భావాలను సృజనాత్మకంగా ప్రదర్శించ లేడని అన్నాడు. ఈ స్వభావాన్ని జీవితాంతం అమలు పరచి సార్ధక జీవితం గడిపి, గుండెపోటుతో 3-11-1954న 85ఏళ్ళ చిత్రకారుడు హెన్రి మాటిస్సే మరణించాడు.

మాటిస్సేను విమర్శించే వారుకూడా ఆతను తన రంగులను తాను ఎన్నుకొనే స్వేచ్ఛ, ధైర్యం తీసుకొన్నప్పటికీ వాటిని అత్యంత ప్రతిభావంతంగా, నిర్దుష్టంగా ఉపయోగించాడని మెచ్చుకొన్నారు. అతని రంగుల కలయిలలో ఘర్షణ లేదు. ఏదీ మొరటుగా, ఒత్తిడి పెంచేదిగా ఉండదు. ప్రతిదీ అత్యంత సూటిగా ఉండటం అతని ప్రత్యేకత. అతను పెట్టింది సంప్రదాయానికి మెరుగులే. చూసేవాడు విషయాన్ని మర్చిపోయి, మాటిస్సేఅసాధారణ భావ వ్యక్తీకరణకు జోహార్లు అనాల్సిందే.

ఫావిజం ఉద్యమ శైలి 1900లో ప్రారంభమై పదేళ్ళు బతికింది. 1930లో మాటిస్సే అమెరికాలోని ఫిలడెల్ఫియాలో బార్న్స్ ఫౌండేషన్ కోసం కుడ్యచిత్రాలు "డాన్స్" రూపొందించి, అమెరికాకు విముక్త పెయింటింగ్‌ల సృజనలో, తరువాత వచ్చిన పొలాక్ మొదలైన వారికి మార్గదర్శిగా నిలిచాడు. వందలాది పేపర్ కటౌట్లను రూపొందించి ఆర్ట్‌లో కొత్తదనం తెచ్చాడు. క్యూబిజం ప్రభావంతో అతని చిత్రాలు రేఖీయ తీవ్రతతో మెరిశాయి. ప్రముఖ నైరూప్య చిత్రకారుడు పాబ్లో పికాసో మాటిస్సే కంటే 11ఏళ్ళు చిన్నవాడు. మొరాకోలో ఒక ఏడాది గడిపి 24 పెయింటింగులు అనేక డ్రాయింగులు వేశాడు. అతని చిత్రాలలో ప్రసిద్ధమైనవి - వుమన్ విత్ హాట్, నుబ్లు, లాడాన్స్.❋



## 50. రష్యాలో అక్టోబర్ విప్లవ నాయకుడు, బోల్షివిక్ పార్టీ నేత మార్క్సిజం లెనినిజంకు మార్గదర్శి - లెనిన్ (1870-1924)

నికోలాయ్ లెనిన్‌గా ప్రసిద్ధుడై న లెనిన్ అసలుపేరు వ్లాడిమిర్, ఇలిచ్ ఉలినోవ్-షార్ట్‌కట్‌గా వి.ఐ.లెనిన్. 1870లో ఏప్రిల్ 9న రష్యాలో సింబిర్స్క్ నగరంలో జన్మించాడు. తండ్రి ఇల్యా నికోవిచ్ ఉలినోవ్, స్కూల్ మాస్టర్. తరువాత స్కూళ్ళ ఇన్స్పెక్టర్ అయి, జిల్లా స్కూళ్ళ సూపరింటేండెంట్‌గా ఎదిగాడు. తల్లి మేరియా అలేక్సాం డ్రో వ్నా డాక్టర్ కూతురు. సుఖమయ జీవితాన్ని పుట్టింట్లో గడిపింది. ఆమెకు తండ్రి తాలూకు కొంత ఆస్తి సంక్రమించి భర్తకు ఆసరాగా ఉండి, కుటుంబాన్ని కొంత సుఖశాంతులతో మిగిలిన బ్యూరోక్రాట్ల కంటే హాయిగా ఉండేట్లు చేయగలిగింది. ఆరుగురు పిల్లలలో వ్లాడిమిర్ మూడవ వాడు. పెద్దమ్మాయి అన్నా, తర్వాత అలేక్సాండర్. చివరి ముగ్గురూ ఓల్గా, మన్యాషా, డ్మిత్రి.

వీరి కుటుంబం ప్రక్కవారికంటే కొంచెం విభిన్నంగా ఉండేది. ఇన్స్పెక్టర్, డాక్టర్ కూతురుల సంతానం తెలివైనదే కాని, ఉండాల్సినంత తెలివి తేటలు వారిలో లేవు కనుక వారి విద్యావిధానంలో అంత ఆశాపూరిత వాతావరణం లేదు. వారి సంరక్షణ ప్రమాదంలో పడింది. వ్లాడిమిర్ పదహారవ ఏట తండ్రి చనిపోయాడు. తల్లి ఆదాయంతో ఏదో రకంగా నెట్టుకొస్తుంటే ఇంటి పరిస్థితి నరక ప్రాయమైనది. రెండవ విషాదం అలుము కొన్నది. అలక్సాండర్ సెయింట్ పీటర్స్ బర్గ్ యూనివర్సిటిలో సైన్స్ చదువుతూ, 19వ శతాబ్దంలో విద్యార్థులలో సాధారణమైన విప్లవ కారులతో కలిసి మూడవ జార్ చక్రవర్తి అలక్సాండర్‌ను చంపే కుట్రలో పాల్గొనగా, అరెస్ట్ చేసి ఉరి తీశారు. అన్న అలక్సాండర్ నాయకుడైన దళం పేరు “లెనిన్”. దీనినే తమ్ముడు వ్లాడిమిర్ తన పేరుగా మార్చుకొని వ్లాడిమిర్ లెనిన్ అయ్యాడు .

కుటుంబంలో చేతికి అందివచ్చిన కొడుకు అంతకు ముందు భర్త మరణించటంతో లెనిన్ తల్లి తట్టుకోలేకపోయి అనారోగ్యం పాలైంది. ఉలినోవ్స్ కుటుంబ

సభ్యులను సంఘం సాంఘికంగా అంగీకరించలేక పోయింది. కాని లెనిన్ పట్టు వదలక చదివి గ్రాడ్యుయేషన్‌లో బంగారు పతకం సాధించాడు. కుటుంబం మీద పడిన నిందను తప్పించుకోవటానికి కాని, వ్లాడిమిర్‌ను యూని వర్సిటీలో చదివించే ఉద్దేశ్యంతో కాని కుటుంబం కజాన్‌కు మారింది. అక్కడ లా చదవటం ప్రారంభించాడు కాని కొద్దికాలానికే రాడికల్ స్టూడెంట్ యాక్టివిటీలలో పని చేస్తున్నాడని బహిష్కరించారు. దేశద్రోహ నేరం కింద వ్లాడిమిర్‌తో పాటు 38 మంది మీద కేసు పెట్టి, అతనిని ఒక మారుమూల గ్రామంలో ఉండేట్లు బహిష్కరించారు. ధైర్యం చెడని వ్లాడిమిర్ స్వయంగా లా చదువుతూ 21వ ఏట సెయింట్ పీటర్స్ బర్గ్ యూనివర్సిటీలో పరీక్ష రాసి పాసై, ఒక ఏడాది తర్వాత ప్రాక్టీస్ ప్రారంభించాడు.

అటార్నీగా విజయం సాధిస్తున్నా, విప్లవ కారుడిగానే వ్యవహరించాడు. అప్పటికే కారల్ మార్క్స్ గ్రంథాలను సేకరించి చదివాడు. కొద్దికాలానికి మార్క్స్ ఫిలాసఫీ వంటబట్టింది. పీటర్స్ బర్గ్‌కు చేరి రివల్యూషనరీగానే గడుపుతున్నాడు. వైట్ కాలర్ దువ్విన వాన్ డై క్ గడ్డం, జుట్టును చూస్తే అతను ఒక అకౌంటేంట్ గానో, వ్యాపారిలాగానో, చిన్న సైజు గాయకుడుగానో, ఫిజిక్స్ మాస్టారు లాగానో అనిపించేవాడు. న్యాయపరంగా తన వ్లాడిమిర్ పేరును వాడుకొనేవాడు. ప్రచారానికి విప్లవ బోధనకు, ఉపన్యాసాలకు, అండర్ గ్రౌండ్ కార్యకలాపాలకు "నికోలాయ్ లెనిన్" పేరును ఉపయోగించేవాడు.

రష్యాలో పరిస్థితులు రోజు రోజుకూ అధ్వాన్నంగా మారిపోతున్నాయి. జనం తిండి, గుడ్డకు అల్లల్లాడిపోతున్నారు. ఇప్పుడు వారి పరిసస్థితి చెప్పటానికి వీలులేనంత దారుణంగా తయారైంది. జార్ చక్రవర్తి రాజకీయ, అధికార కుటుంబాలు నిర్లక్ష్యంగా విలాసమైన జీవితాలు గడుపుతూ ప్రజాక్షేమాన్ని అలక్ష్యం చేస్తున్నారు. అధిక భూభాగాలు హస్తగతం చేసుకొన్నా భూస్వాములు, సోమరితనంతో ధనవంతులయ్యారు. ఫాక్టరీలు విస్తరిస్తూనే ఉన్నాయి. వాటి యజమానులు లాభపడుతు, మరింత సంపన్ను లౌతున్నారు. దీనికి విరుద్ధంగా సామాన్య రైతులు, కార్మికుల జీవనస్థితి రోజు రోజుకూ దిగజారిపోతోంది. జార్ చక్రవర్తిని అందరూ "లిటిల్ ఫాదర్" అని పిలుస్తారు. కాని తండ్రిగా ఆయన బాధ్యత ప్రజల్ని మరింత దండించటం శిక్షించటం మాత్రమే అయింది. ప్రజలు తనకు పిల్లలు అనుకొంటూ వాళ్ళు ఏమాత్రం అసౌకర్యం కలిగించినా విరుచుకు పడుతున్నాడు. 1891నాటి కరువులో వేలాది రైతులు ఆకలి బాధతో అలమటించి చనిపోయారు. రైతులు కూడా ఫాక్టరీ కార్మికులలాగానే అణచబడుతున్నారని లెనిన్ గ్రహించాడు. దీనికి పరిష్కారం సోషలిస్ట్ విధానమే అని నమ్మాడు. కనుక కర్షకులు

కూడా, శ్రామిక వర్గంతో పాటు చేతులు కలిపి పేదల పోరాటంలో భాగస్వాములు అయితేనే సోషలిస్ట్ రాజ్యమేర్పడుతుందన్నాడు.

25ఏళ్ళ వయసులో విప్లవనాయకుడిగా ఎదిగిపోయాడు లెనిన్. అప్పటికే "రష్యా సోషలిజం పిత" అని గౌరవంగా పిలువ బడుతున్న జార్జి ప్లెఖనోవ్‌ను కలుసుకొని చర్చించాడు. శ్రామిక విముక్తిఐక్య సంస్థ (యూనియన్ ఫర్ లిబరేషన్ ఆఫ్ ది వర్కింగ్ క్లాస్)ను ఏర్పరచి వార్తాపత్రికలను ముద్రిస్తూ అరెస్ట్ అయి 27వ ఏడు అంతా జైల్లోనే గడుపుతూ రాస్తూ చదువుతూ జైల్లో నుంచే బయటి ఉద్యమాలను నడిపిస్తూ సీక్రెట్ కోడ్‌తో ఉద్యమ నాయకులతో మాట్లాడుతూ విచారణ కోసం ఎదురు చూస్తున్నాడు. అతని బృందంలోని నఢేదా కాన్ స్టాంటి నోవా క్రప్స్కావా అనే విద్యా వంతురాలు, రష్యా మధ్యతరగతి అమ్మాయి లెనిన్ సీక్రెట్ వ్యవహారాలను జాగ్రత్తగా నిర్వహించింది. ఆమెకు లెనిన్ అంటే పిచ్చ ఆరాధనా భావం. జైలులో అతనితో కలిసి మాట్లాడటానికి అనుమతి పొందింది . లెనిన్‌కు సైబీరియాలో మూడేళ్ళ ప్రవాస శిక్ష పడింది. ఒక రకంగా లెనిన్‌కు ఇది అతి తేలిక శిక్షయే. కారణం అతనిది ఉద్దేశ్యమే కాని నిబద్ధత (కమిట్మెంట్) కాదని కోర్టు అభిప్రాయ పడింది. కొన్ని నెలలకు నదేదా కూడా అరెస్టయి ప్రవాస జీవితం గడిపింది. తనకు లెనిన్ అంటే అభిమానం ఎక్కువనీ, మార్క్సిస్ట్ ఫిలాసఫీ అధ్యయనం కోసం తనను లెనిన్ దగ్గరకు పంపమని అర్జీ పెట్టింది. విచారించిన జడ్జి అప్పటికే ఎనిసీ ప్రాంతంలో ప్రవాసుల సంఖ్య చాలా ఎక్కువగా ఉందని ఇంకా పెరిగితే రక్షణకు ఇబ్బంది అని ఒక వేళ ఆమె లెనిన్‌ను పెండ్లి చేసుకొంటే ఇద్దరినీ కలిపి ఒకరుగా భావించే వీలు ఉంటుందని చెప్పాడు. అప్పుడు లెనిన్‌కు 28. ఆమెను పెళ్లి చేసుకొన్నాడు. ఆమె తల్లి కూడా వచ్చి ఇక్కడే ప్రవాసంలో చనిపోయేదాకా ఉండి పోయింది. గత్యంతరం లేక కోర్టు కోసం ఇద్దరూ పెళ్లాడినా ఒకరికొకరు అంకిత భావంతో జీవించారు. ఆమె అతనికి విశ్వసనీయురాలైన అనుచరురాలు మాత్రమే కాదు, అనుకూలమైన, ఆధారపడ తగిన భార్య కూడా.

వయసు ముప్ఫై రాగా లెనిన్ జైలులో మొదలు పెట్టిన రచన "ది డెవలప్ మెంట్ ఆఫ్ కేపిటలిజం ఇన్ రష్యా" అనే అసామాన్య ఆర్థిక పత్రం పూర్తి చేశాడు. కొన్ని నెలలకే అతని ప్రవాస జీవితం పూర్తయింది. సెయింట్ పీటర్స్ బర్గ్‌కు తిరిగి రాగానే మళ్ళీ అరెస్ట్ చేశారు. విడుదల కాగానే వెంటనే స్విట్జర్ లాండ్ వెళ్ళాడు. అక్కడ ప్లెఖనోవ్ చెప్పినట్లు "ఇస్క్రా" మేగజైన్ ప్రారంభించాడు. దీన్ని మ్యూనిచ్‌లో ప్రింట్ చేశాడు. దీని మోటో–అంటే నినాదం "స్పార్క్ టు ఫ్లేం" అంటే "రవ్వ నుంచి మంట" దాకా. దీని ముఖ్యోద్దేశం కేంద్రీకృత అండర్ గ్రౌండ్ విప్లవ పార్టీ ఏర్పరచి జార్ నియంతల అణచివేతను ఎదుర్కోవటం. ఫాక్టరీ వర్కర్ లాగానే పొలం రైతు ఆకలి

కూడా ఒకటేనని గుర్తించి సమష్టి శ్రామిక పోరాటాన్ని ప్రజాస్వామ్య విధంగా చేయాలని భావించాడు. ఇస్క్రా పత్రికను రష్యాలోకి దొంగతనంగా తెచ్చి పంచిపెట్టేవారు. రహస్యంగా అండర్ గ్రౌండ్ కార్యక్రమాలను అందుబాటులో ఉన్న సాంకేతిక పరిజ్ఞానంతో విస్తరించాడు. ఇది బహిష్కృత నేతలకు సర్వ సాధారణ విషయమే ఆ రోజుల్లో.

తరువాత ఏడు సంవత్సరాలు లెనిన్ జీవితంలో అరెస్టులు తప్పించుకు పారిపోవటం విడుదల, దీర్ఘకాలం దాగి ఉండటం, అకస్మాత్తుగా ప్రత్యక్షమవటంతో అయి రికార్డ్ సృష్టించాయి. ఈ సమయంలో చాలాకాలం స్వదేశానికి బయటనే ఒక దేశాన్ని వదిలి మరో దేశంలో ఉండి పోయాడు. పేపర్ ఎడిటర్‌గా అతని జీతం నైపుణ్యమున్న ప్రింటర్ జీతానికి, అతి తక్కువ కూలి పొందే లేబర్‌కు మధ్యలో ఉండేది. దానితోనే భార్యతో జీవితం గడిపేవాడు. బట్టలు ఎప్పుడూ చినిగే ఉండేవి. ఉంటున్న గది పరమ దరిద్రంగా ఉండేది. తినే తిండి అతి నికృష్టంగా కడుపునింపు కోవటానికి సరిపడా ఉండేది కాదు పాపం. కాని అతని రచనా ప్రభావం అనంతంగా ఉండి ఎందరినో విప్లవకారులుగా మార్చి లెనిన్ పేరు రష్యా అంతా మారు మోగిపోయింది. రాసిన కర పత్రాలలో భాష అతి సహజంగా, సరళంగా సూటిగా ఉండేది. నైరూప్య, సంక్లిష్ట భావనలను, అతి తేలిక మాటలలోకి తర్జుమా చేసి రాసి ప్రభావితం చేసే జీనియస్ లెనిన్. ఆయన సూత్రాలు కొన్ని – "ఇతరుల పనిని దోపిడీ చేసే వాడికి జీవించే అర్హత లేదు", "పనివాడికి తన పనిపై రాబడిని కోరవచ్చు" వంటివి కొన్ని మాత్రమే. మార్క్స్ చాటువులలో చెప్పినట్లు "సంఘటితమైతే కార్మికులకు పోయేదేమీ లేదు బంధనాలు తప్ప" అనేది బాగా ప్రచారం చేశాడు లెనిన్.

1902లో లండన్ నుండి ఇస్క్రాను ప్రచురిస్తున్నప్పుడు, సైబీరియానుంది తప్పించుకోచ్చిన మరో విప్లవకారుడు లియో ట్రాస్కితో పరిచయమైంది. ట్రాస్కిమాంచి తెలివైన క్రియాశీల వక్త. లెనిన్‌కు బాసటగా నిలిచాడు. ఏడాది తర్వాత ఇద్దరి మధ్యా అభిప్రాయభేద మేర్పడి రష్యా సోషలిస్ట్ డెమోక్రాటిక్ పార్టీ రెండుగా చీలిపోయింది. క్రియారహిత సానుభూతిపరులను పార్టీలో చేర్చుకోవచ్చునని ట్రాస్కి వాదం. అధిక సంఖ్యాకులు లెనిన్‌నే బలపరచి లెనిన్ ఆధ్వర్యంలో "బోల్షెవిక్" పార్టీ ఏర్పాటు చేశారు. అల్ప సంఖ్యాకులైన ట్రాస్కి ముఠాను "మెంషె వికీలు" అన్నారు.

లెనిన్ వయసు ముప్పై. రష్యాలో పరిస్థితులు బాగా క్షీణించి విప్లవానికి తగిన పరిపక్వ వాతావరణ మేర్పడింది. 1905 జనవరి 9న ఒక మతాధికారి నాయకత్వంలో కొందరు వర్కర్లు జార్ రాజ కుటుంబం ఉండే వింటర్ పాలస్‌కు యాత్రగా వెళ్ళారు. తమ "చిన్న తండ్రి"గా భావించే, నమ్మే జార్ రాజుకు తాము యెంత దీన

స్థితిలో జీవిస్తున్నామో తెలియజేయటానికి ప్రశాంతంగా వారు అక్కడికి చేరుకొన్నారు. రాజ భవనానికి చేరుకోగానే పాలస్ గార్డ్ లు "కోసాక్"లు ఎలాంటి ముందస్తు హెచ్చరికలు జారీ చేయకుండానే వారిపై కాల్పులు జరిపి రెండు వందలమందిని కాల్చి చంపేశారు. ఈ వార్త దావానలంగా దేశమంతటా వ్యాపించి అప్పటిదాకా దైవాంశ సంభూతుడు అని భావించిన రాజుపై ప్రజల ఆగ్రహజ్వాల ఎగసిపడి నమ్మకాన్ని బుగ్గి చేసింది. రాజు గౌరవం మరింత దిగజారి పోయింది. ప్రజల మనసులు తీవ్రంగా గాయపడ్డాయి. ఆత్మ గౌరవం దెబ్బతిన్నదని భావించారు. ఏడాది తర్వాత జపాన్‌తో చేసిన యుద్ధంలో రష్యా బలగాలు దారుణంగా ఓడిపోయాయి. దేశమంతటా సమ్మెలు, తిరుగుబాట్లుతో అతలా కుతలమైంది. ఇదే తగిన సమయం అని లెనిన్ రష్యా చేరాడు. రెండేళ్ళు దేశమంతా పర్యటించి, సుదీర్ఘ ఉపన్యాసాలిస్తూ, విప్లవానికి ప్రేరేపిస్తూ, గెరిల్లా దండులను ఏర్పాటు చేయటంలో సఫలుడైనాడు. దీనికి విరుగుడుగా జార్ రాజు ప్రజలను ప్రసన్నం చేసుకొనే ప్రయత్నంగా ప్రభుత్వంలో "డ్యూమా" అనే ఎన్నిక కాబడిన ప్రతినిధులను తీసుకొన్నాడు. కార్మికులకు "సోవియెట్" లనే కమిటీలను ఎన్నుకోవటానికి యజమానులకు అవకాశమిచ్చాడు. నామ మాత్రంగా కార్మికుల జీతాలు పెంచేట్లు చేశాడు. 1907నాటికి విప్లవ ఉద్యమం చప్పగా చల్లారిపోయింది. ఇబ్బంది కలిగించేవారు మళ్ళీ విజృంచారు. కాని లెనిన్ మాత్రం ఫిన్ లాండ్‌కు అక్కడి నుండి స్వీడెన్‌కు చేరుకొన్నాడు.

బోల్షివిక్ పార్టీ అధ్యక్షుడిగా లెనిన్ జీతం అతి స్వల్పం. అతని ఆర్థిక స్థితి మరీ అధ్వాన్నమైంది. అన్ని వైపులా నుండి ఇబ్బందు లేర్పడ్డాయి. ఇంపీరియల్ రష్యా నుండి, మెన్షెవిక్ ల నుండి, అరాచక, టెర్రరిస్ట్‌ల నుండి అతనికి ఒత్తిడి, ప్రమాదమేర్పడింది. ట్రాస్కీని వదిలించేసుకొన్నాడు. ఇప్పుడు మరో ఇద్దరు కొత్త స్నేహితులు ప్రముఖ రచయిత మాక్సిం గోర్కి, కఠిన హృదయుడు, యువ అతివాది జోసెఫ్ స్టాలిన్‌లు దగ్గరయ్యారు. లెనిన్ పారిస్‌లో ఉండి "మెటీరియలిజం అండ్ ఎంప్రికో క్రిటిసిజం" రాశాడు. దీనిపై విభిన్న అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. తరువాత రాసిన "హిస్టరీ ఆఫ్ మోడరన్ ఫిలాసఫీ"ను మార్మికతపై తిరుగుబాటు అన్నారు. గతి తార్కిక భౌతిక వాదానికి (డయలెక్టిక్ మెటీరియలిజం) ఇదే భూమిక అయింది. దీనిలో ప్రకృతి జడం కాదని, క్వాంటం ఫిజిక్స్ ఆవిష్కరణలతో పదార్థాన్ని శక్తి రూపాలుగా భావిస్తూ ప్రకృతిని న్యూనత పరచరాదని, లెనిన్ చెప్పాడు. గతి తార్కిక వాదాన్ని 18వ శతాబ్దపు పదార్థ భావనలతో ముడి పెట్టరాదన్నాడు. "It is not the contemplation of the objective world which counts rather it is the control through which we channel the powers of nature and make them useful to ma

kind" అని లెనిన్ అభిప్రాయ పడ్డాడని ఫ్రెడరిక్ మేయర్ రాశాడు. లెనిన్ జీవిత చరిత్ర రాసిన "వాలేరు మార్కు". ఈ పుస్తకాన్ని "A cauldron of invective and constructive thought" అంటే దూషణాత్మక, నిర్మాణాత్మక జ్యోతి" అన్నాడు. "it is a book in which profundity alternatives with more abuse. If any one else had written it, no one would remember it" అనీ అన్నాడు.

లెనిన్ దంపతులు పారిస్ నుంచి క్రాకో చేరారు. ఇది వాళ్ళ ఊరుకు, అనుచరులకు దగ్గరే. లెనిన్‌కు అన్ని రకాలా సాయపడుతూ వెంట ఉన్న భార్య నదేఝాకు తీవ్ర అనారోగ్యం వల్ల అనేక ఆపరేషన్లు జరిగి ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. అయినా ఆత్మ ధైర్యంతో కోలుకొని కష్టతరమైన తన విధులను నెరవేరుస్తోంది. అప్పటికే ఆమె గుండె చాలా దెబ్బ తిన్నదనీ ఇక ఎక్కువ శ్రమ చేస్తే ఆమె బతకదని డాక్టర్లు చెప్పారు. కాని భర్త మరణం తర్వాత 15ఏళ్ళు బతికి అందరికి ఆశ్చర్యం కలిగించింది. 1914లో లెనిన్ దంపతులు ఆస్ట్రియాలో భాగమైన గెలీషియాకు వెళ్ళారు. అదే సమయంలో ఆస్ట్రియా రష్యాపై యుద్ధం ప్రకటించింది. లెనిన్‌ను అరెస్ట్ చేశారు. ఆయన రష్యాకు దాదాపు గూఢచారి లాంటివాడు అని రుజువై వదిలేశారు. స్విట్జర్లాండ్‌కు వెళ్ళాడు లెనిన్.

మొదటి ప్రపంచ యుద్ధం అంతర్జాతీయ సోషలిజాన్ని దెబ్బతీసింది. మార్క్సిజం ప్రకారం అలాంటి యుద్ధం కార్మిక పోరాటాన్ని ప్రతి కాపిటలిస్ట్ దేశంలోనూ బలీయం చేస్తుంది. కార్మికులు సంఘటితమై ఆ ఘర్షణలో పాల్గొని చివరికి విప్లవ అంతర్యుద్ధాన్ని సృష్టిస్తారని భావించింది. కాని అలాంటిది ఏదీ జరగ లేదు. జర్మన్ సోషలిస్ట్‌లు తమ దేశపు మిలిటరీ లక్ష్యాలను సమర్ధించారు. ప్లేఖ నోవ్ పూర్తిగా లెనిన్ నుంచి విడిపోయి రష్యన్ సోషలిస్టులు రష్యా యుద్ధాన్ని సమర్ధించాలన్నాడు. లెనిన్ లాంటి కొద్దిమంది మాత్రం గట్టిగా నిలబడ్డారు. లెనిన్ మాత్రం ప్రతి దేశంలోని బీద పోరాడే జనం అంతా జాతీయతను ఎదిరించి సోషలిజం యొక్క అంతిమ విజయానికి తోడ్పడాలని ప్రకటించాడు. అదే "ప్రపంచ కార్మికులారా ఏకం కండి" అనే నినాదం. లెనిన్‌ను సమర్ధించిన వారు ఒక్క బోల్షివిక్కులు మాత్రమే. దీని పర్యవసానం అయిదుగురు బోల్షెవిక్‌ల ప్రవాసమే.

అంతర్జాతీయ విప్లవం రావటం అసాధ్యం అని గ్రహించి లెనిన్ రష్యా దేశ పేద ప్రజలు రష్యా కోసం ఏమి చేయాలో ఆలోచించాడు. రష్యాలో దిగజారిన పరిస్థితులు ఆయనకు కలిసొచ్చాయి. దేశం తన సైన్యాన్ని సరైన విధానంలో ఉంచ లేక పోతోంది. సైన్యానికి కడుపు నిండా తిండీ ఒంటినిండా బట్టా కూడా ఇవ్వలేకపోయింది. వ్యాపారులు

విపరీతంగా లాభాలు గడిస్తున్నారు. కార్మికుల స్థితి సంస్కరణ నాటి కంటే దిగజారి పోయింది. హిస్టీరియా రాజ్యమేలుతోంది. జార్ రాజు నికొలాస్ జర్మనీతో విడిగా శాంతి ఒడంబడిక కుదుర్చుకొన్నాడు. ఇది కోర్టు అరిస్టో క్రాట్‌లను జాగృతం చేసింది. యుద్ధం వలన విపరీతంగా వాళ్లకు డబ్బు అందుతోంది. కనుక దోపిడీ దారులు, తిరుగుబాటు దారుల పైకి వెళ్ళకుండా సైన్యం యుద్ధంలో ఉంటేనే తమకు మేలు అనుకొన్నారు. ముగ్గురు నోబుల్స్ 1916 డిసెంబర్ 16న రాజరికానికి వెన్ను దన్నుగా ఉండి నడిపిస్తున్న పూర్వపు మాంక్ రాస్పుటిన్‌ను హత్య చేయటంతో వీళ్ళ అసంతృప్తి పెరిగిపోయింది. దీనితో సంఘం, రాజ్యంలలో పతనం పరాకాష్టకు చేరింది. విప్లవానికి సర్వం సంసిద్ధంగా ఉంది. 1917 ఫిబ్రవరి 23న సెయింట్ పీటర్స్ బర్గ్‌లోని మిల్లు మహిళా కార్మికులు సమ్మె చేశారు. పురుష కార్మికులు వారికి సపోర్ట్‌గా వీధుల్లోకి వచ్చారు. అనేక పరిశ్రమలు మూతపడ్డాయి. ట్రాఫిక్ ఆగిపోయింది. పోలీసులు జనాన్ని లాఠీలతో విపరీతంగా బాదిపారేశారు. పోరాటం ఆవేశాకావేషాలకు గురైంది. సైన్యాన్ని పిలిపించారు. రక్షకదళం, కొస్సాక్ దళాలు పోలీసులకు వ్యతిరేకంగా ప్రజలవైపు నిలబడి పోరాడాయి. అయిదవ రోజున ప్రజలు విజయం సాధించి విప్లవానికి ముగింపు పలికారు. ఎంతోకాలంగా ఎదురు చూసిన విప్లవం రానే వచ్చింది విజయం పొందింది. కాని దీనిని సంఘటిత పరచి నడిపే నాయకుడు లేకపోయాడు. కార్మికులు, సైనికులు కలిసి తమ ప్రతినిధులను సోవియెట్ కోసం ఎన్ను కొన్నారు. ఇంతలో డ్యూమా ప్రవేశించి వాళ్ళతో కలిసి పని చేస్తానని అన్నాడు. ఒక ప్రాదేశిక ప్రభుత్వం ఏర్పాటైంది కాని అందులో సోవియెట్‌లకు ప్రాతినిధ్యమివ్వలేదు. మంత్రులలో ఒకడైన కేర్నేస్కి అధ్యక్షుడై, జార్‌ను పదవీ త్యాగం చేయాలని పటుబట్టాడు. తన ప్రభుత్వం మిత్ర దేశాలతో (అల్లీస్) కలిసి యుద్ధం కోనసాగిస్తుందని ప్రకటించాడు.

లెనిన్‌కు ఈ విప్లవ విజయవార్త ఒక నెల తరువాత కాని తెలియలేదు. తన మాతృదేశం రష్యాకు తిరిగి వచ్చేద్దామనుకొన్నాడు కాని రష్యాతో సహా ఏ మిత్ర రాజ్యమూ లెనిన్ రాకను సమర్ధించనే లేదు. శత్రుదేశమైన జర్మనీ ద్వారా చేరాడు. జర్మన్లు లెనిన్‌కు రష్యాయుద్ధం కొనసాగించటం ఇష్టం లేదని తెలిసి అనుమతించారు. మొదట సెయింట్ పీటర్స్ బర్గ్ చేరి, ప్రాదేశిక ప్రభుత్వ విధానాలపై, సర్దుబాట్లపై విరుచుకు పడ్డాడు. యుద్ధం నుంచి రష్యా వైదొలగాల్సిందే అని తీవ్రంగా హెచ్చరించాడు. ప్రజలందరూ లెనిన్‌నే సమర్ధించి నిలిచారు. మళ్ళీ ప్రదర్శనలు నినాదాలు, తిరుగుబాట్లు. కేర్నేస్కి ప్రభుత్వం లెనిన్ జర్మనీతో కలిసి కుట్ర చేస్తున్నాడని ఆరోపించింది. మళ్ళీ అజ్ఞాతంలోకి వెళ్లి సమయం కోసం ఎదురు చూశాడు. జనరల్ కోర్నిలోవ్ మిలిటరీ డిక్టేటర్ షిప్ ప్రభుత్వం ఏర్పాటు చేసే ప్రయత్నంలో ఉండగా, కేర్నేలోవ్ ప్రభుత్వానికి

పట్టు సడలి బలహీనమైనది. దీనితో బోల్షెవిక్‌ల ప్రాధాన్యత, కంట్రోల్ విపరీతంగా పెరిగింది. సెయింట్ పీటర్స్ బర్గ్‌లో ఒక భవనాన్ని బోల్షెవిక్‌లు ఆక్రమించి, ప్రధాన కార్యాలయాన్ని ఏర్పాటు చేసుకోగా, లెనిన్ రంగ ప్రవేశం చేసి, దళాల బలాలను సమీక్షించి దెబ్బ తీయాలని ప్రయత్నించాడు. జూలియన్ కేలండర్ ప్రకారం 25-10-1917న జరిగిన ఈ సంఘటననే అక్టోబర్ విప్లవం అన్నారు. మన కేలండర్ ప్రకారం విప్లవం జరిగిన తేది నవంబర్ 7. దీనితో రష్యా అంతటా సోవియెట్‌లందరూ ఏకమై సోవియెట్ కాంగ్రెస్‌గా పిలువబడ్డారు. ఈ పేరుతోనే లెనిన్ అధ్యక్షుడయ్యాడు. స్టాలిన్ సభ్యుడుగా ఉన్న బోల్షెవిక్ పార్టీ కేంద్ర నాయకత్వం సంస్థాగత నిర్మాణ వ్యవహారం చూసింది. మెన్షెవిక్‌ల నుండి విడిపోయిన ట్రాట్ స్కి మళ్ళీ లెనిన్‌తో చేతులు కలిపాడు. మిలిటరీ దాడులకు నాయకత్వం వహించాడు. కొన్ని వీధి పోరాటాలు సాగాయి. పది రోజుల విప్లవ పోరాటం అంతకు ముందు జరిగిన వాటితో పోలిస్తే అతి తక్కువ రక్త పాతంతో విజయం సాధించి చరిత్రలో లెనిన్ పేరును అక్టోబర్ విప్లవాన్ని చిరస్మరణీయం చేసింది.

లెనిన్ సాధించిన విప్లవ ఘన విజయం ఆయనలో కాని, ఆయన అలవాట్లలో కాని ఏ మాత్రం మార్పు తేలేదు. పరిశుభ్రమైన నిరాడంబర జీవితాన్నే గడుపుతున్నాడు. మూడేళ్ళు రష్యా నియంతగా ఎన్నుకోబడిన తర్వాత ఆయన్ను చూసిన మార్కు "లెనిన్ సాధారణ కార్మికుడు ఉండే ఇంట్లోనే మరికొన్ని సౌకర్యాలతో ఉన్నాడు. లెనిన్ భార్య, సోదరిల భోజనం ఆడంబరం లేకుండా, ఆనాటి సోవియెట్ ఆఫీసర్ల సగటు భోజనంలా ఉంది. అందులో టీ, నల్ల రొట్టె, వెన్న, జున్ను మాత్రమే ఉన్నాయి. లెనిన్ చూడటానికి ఆకర్షణీయంగా ఉండదు. మామూలు ఎత్తుకన్నా కొంచెం తక్కువే. లెనిన్ కవళికలు ప్లేబియన్‌కు చెందినవిగా స్లావోనిక్‌గా దృఢంగా ఉంటాయి. విస్తారమైన అతని నుదురు మాత్రమే అతని శక్తికి నిదర్శనంగా ఉంటుంది" అని రాశాడు. నీనా బ్రౌన్ బెకర్ అనే లెనిన్ జీవిత చరిత్రకారిణి 1907లో రష్యాకు తిరిగొచ్చిన లెనిన్‌ను "బట్ట తల, చిరిగిన కోటు, పాంచీలాగా యెర్ర గడ్డంతో 45 ఏళ్లవాడే అయినా ఇంకా ముసలివాడుగా కనిపించాడు. అరుదైన చిరునవ్వుతో గృహ వాతారణం కలిపించాడు" అని రాసింది.

తాను స్థాపించదలుచుకొన్న సోషలిస్ట్ రాజ్యం కోసం భూమిని విభజించి రైతులకు పంచిపెట్టాడు లెనిన్. అప్పటిదాకా ప్రైవేట్ వ్యక్తుల పెత్తనంలో ఉన్న పరిశ్రమలు, జాతి వనరులు, వినియోగ సంస్థలను వారినుంచి లాక్కుని ప్రభుత్వ పరం చేశాడు. బోల్షెవిక్ పార్టీ పేరును అధికారికంగా కమ్యూనిస్ట్ పార్టీగా మార్చేశాడు. మార్క్సిస్ట్ సిద్ధాంతాలను 1) ఉత్పత్తి లాభానికి కాదు వినియోగానికే 2) పని చేయనివాడు తిండికి

అనర్హుడు" అనే రెండు నినాదాలతో అమలు పరచాడు. 1918 జనవరి 7న రాజ్యాంగ అసెంబ్లీని రద్దు చేసి, శ్రామిక నియంతృత్వాన్ని అమలు చేసి, ఒకరకంగా సమాజంలో వివిధ స్థాయిలను సమానం చేశాడు. మార్చి15న జర్మనీతో రష్యా సంప్రదింపులు ప్రారంభించి, బ్రెస్ట్ లితోవ్ స్క్‌లో ఒడంబడిక కుదుర్చుకొని యుద్ధం నుంచి వైదొలగింది. ఒడంబడికపై సంతకాలు జరిగాయి కాని శాంతి కనిపించలేదు. దేశీయ విదేశీయ అణచివేతలు పెరిగాయి. అధిక భూభాగాలు స్వంతం చేసుకొన్న యజమానులనబడే కులక్స్ శ్రామిక నియంతృత్వాన్ని ఎదిరించారు. దీనితో అనేక అంతర్గత పోరాటాలు అణచివేతలు, రక్త ప్రవాహాలతో రష్యా చాలా సంక్షోభంలో పడింది. సోవియెట్‌లు ఏర్పరచిన "చేకా" అనే సీక్రెట్ ప్లీస్ సర్విస్- పై అధికారులను తప్పించాలనే కుట్ర జరుగుతున్నట్లు పసి గట్టింది. కుట్ర దారులను పసిగట్టి ఏరివేసి, రహస్య విచారణ జరిపి, ఉరితీసి, భయ పెట్టారు. దీనికే "రెడ్ టెర్రర్" అనే పేరొచ్చింది. మిత్ర రాజ్యాలే బాహ్య శత్రువులై పోయాయి. కొత్త రష్యా ప్రభుత్వానికి కూల్చే ప్రయత్నాలు చేశారు. జేకోస్లో వేకియా సైన్యాలు రష్యా భూభాగాన్ని ఆక్రమించి జార్ రాజును మళ్ళీ సింహాసనం మీద నిలబెడతామని ఆశ చూపించాయి. దీన్ని గమనించిన "అధికార సోవియెట్" రాజును, రాణిని అయిదుగురు పిల్లలను దారుణంగా హత్య చేసింది. దీనివలన అంతర్యుద్ధం ఆరంభమైంది. రెడ్ గార్డ్‌లు వైట్ గార్డ్‌లను సవాలు చేశారు. వీరు మిలిటరీ స్కూల్ కేడేట్‌లకు చెందినవారు, ఎగువ మధ్యతరగతి యువకులు. విప్లవ వ్యతిరేక ఉద్యమం విజయవంతం అవుతుందేమోనని పించింది. కాని 1921లో నిర్బంధ సైనికులను అందరినీ చేర్చుకొని రెడ్ ఆర్మీ అందర్నీ ఓడించింది.

1921నాటికి కాని లెనిన్ తాననుకొన్న ఆర్థిక, సాంఘిక సమాజాన్ని నిర్మించలేక పోయాడు. కొత్త ఆర్థిక విదానన్ని ప్రవేశ పెడుతూ, వస్తు పంపిణీ కోసం ప్రైవేట్ భాగస్వామ్యం తప్పదని గుర్తించాడు. తన బీద దేశం ఇంకా మానవ వనరుల మీదే ఆధారపడి ఉండటం చూసి అత్యంత వేగంగా విద్యుదీకరణ విధానాన్ని అమలు చేశాడు. జాతీయ బృందాలు స్వేచ్ఛా పూరిత అభివృద్ధిని దేశీయ విధానంలోనే సాధించాలని చెప్పాడు. కాలనీ ప్రజలతో సరిసమానంగా రష్యా అభివృద్ధి సాధించే కృషిలో అందరూ భాగస్వాములవ్వాలి అని హితవు పలికాడు. రష్యా సాంప్రదాయ చర్చిని రాజ్యాంగ మతంగా తీసేశాడు. పెళ్ళిళ్ళు విడాకులు పూర్వం టాక్స్‌లతో జరిపించే చర్చి ఇప్పుడు ప్రభుత్వంలో భాగమైంది.

1922లో పునర్నిర్మాణం జోరుగా సాగుతున్న తరుణంలో లెనిన్ చాలా తీవ్రంగా అలసిపోయాడు. మెదడులోని నాడుల వలన గుండెపోటు వచ్చింది. కొన్ని నెలల

తర్వాత మరో స్ట్రోక్ వచ్చి పాక్షిక పక్షవాతానికి గురైనాడు. అలాగే కొంతకాలం గడిచింది. తన ముఖ్య స్నేహితుడి పేర నిర్మించిన "గోర్కీ మోడల్ నగరం"లో విప్లవ వీరుడు వ్లాడిమిర్ లెనిన్ 21-1-1924న 54వ ఏట మరణించాడు. రష్యా రాజధానిని మాస్కోకు మార్చిన ఘనత లెనిన్‌దే. మాస్కోలోనే లెనిన్ అంత్యక్రియలు జరిపి క్రెమ్లిన్ గోడకు ప్రక్కన ఒక సమాధి నిర్మించారు.

మన మహాత్మా గాంధీలాగానే లెనిన్ కూడా తడబడని కృత నిశ్చయంతో ఏక దీక్షతో కృషి చేశాడు. గాంధీలాగా కాకుండా లెనిన్ ప్రజలకన్నా తను ప్రేమించిన ఐడియా వల్లనే ప్రజలకు లాభం అభివృద్ధి కలిగేట్లు చేశాడు. గాంధి కరుణతో ఉన్న మహర్షి, ప్రజలతో మమేకమైన వాడు, తన అనుచర గణంలో ఏ ఒక్కరినీ త్యాగం చేసుకొనేవాడు కాదు గాంధి. కాని లెనిన్ తన ఐడియా అమలు కోసం ఎవరినైనా భూమిపై లేకుండా చేసేవాడు. "ది వర్ల్డ్ ఫిలాసఫర్స్" అనే పుస్తకంలో రాబర్ట్ హీల్ బ్రానర్ "Internally corrupt, externally predatory is still the soviet explanation of the world in which we live. Its validity was again affirmed by Stalin in 1952" అని రాశాడు.

మార్క్స్ సిద్ధాంతం ప్రకారం రాజ్యం కనిపించకుండా పోవాలి. కాని లెనిన్ మార్పు అనేక రూపాలలో వచ్చి పలు తీవ్రదారుణ ఘాతాలకు లోనైనప్పుడే అంతం సాధ్యం అన్నాడు. లెనిన్ రాతలపై అంతులేని చాలారకాల వ్యాఖ్యానాలున్నాయి. ఇతర నియంతల లాగా కాకుండా లెనిన్ అధికార దాహం, మోజు లేని వ్యక్తి. ఏక వ్యక్తి పాలనను ఎదిరించి, అధికారం సాధించి దాన్ని తనకోసం కుటుంబం కోసం ఉపయోగించకుండా ప్రజాక్షేమం కోసం ప్రజా భాగస్వామ్యంతో, ప్రజల చేతికి అధికారం అందించిన వాడు "the word must be Power to the Soviets, land to the peasants, bread to the hungry and peace to the people" అని కలవరించి కలవరించి ఆ కలను యదార్థం చేసిన విప్లవ వీరుడు, రష్యా ప్రజలకు అధికారం అందజేసిన మహోన్నత నాయకుడు వ్లాడిమిర్ నికోలాయ్ లెనిన్.

అమెరికా మొదటి అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్ తరువాత, రష్యాలో అంతటి ఆరాధన పొందిన నాయకుడు లెనిన్. లెనిన్ విగ్రహం లేని గ్రామం లేదు. ఆయన పేర పోస్టేజి స్టాంపులు, సంస్థలు వెలిశాయి. లెనిన్ చెప్పిన ప్రతిమాటా మంత్రమే అయింది. ప్రభావం చూపింది. లెనిన్ రచనలు అనేక సార్లు ముద్రణ పొంది ప్రపంచమంతా విస్తరించాయి అన్నిభాషల అనువాదాలు వచ్చాయి. లెనిన్ ఒక లెజెండ్ అయ్యాడు. లెనిన్ మణానంతరం స్టాలిన్ మార్క్సిజం – లెనినిజంను బాగా వ్యాప్తి చేశాడు. లెనిన్ ప్రభావానికి లోనుకాని దేశం లేదు.❀



## 51. మతాత్మక హింసాత్మక ఫ్రెంచ్ చిత్రకారుడు - జార్జెస్ రౌవాల్ట్ (1871-1959)

ప్రముఖ చిత్రకారుడు వాన్ గోను మినహాయిస్తే, అంతటి మతాత్మక చిత్రకారుడు అనిపించుకోవటమేకాక హింసాత్మక చిత్రాకారుడు అనిపించుకొన్నాడు జార్జెస్ రౌవాల్ట్. పరిశోధనాత్మక చిత్రకారుల పరంపరలో సాగి సిజన్నే, రేనార్ వంటి అనుభూతివాద చిత్రాకారులకు భిన్నంగా రౌవాల్ట్ చిత్రాలుంటాయి. సిజన్నే తేలిక రంగుల దగ్గరే ఆగిపోతే, రౌవాల్ట్ ముదురు రంగులైన ఎరుపు, క్రోం బ్రౌన్ లను మహా ఇష్టంగా వాడి, నల్ల బార్డర్‌లతో షోకు చేశాడు. రేనార్ సౌందర్యంతో నిష్క్రమిస్తే, రౌవాల్ట్ భయంకరంగా, హద్దులను అదిగమించి, మార్మిక వేదనలను కల్లోల భయానక చిత్రాలుగా గీశాడు. దీనికి కారణం ఆతను జన్మించిన నాటి పరిస్థితు లే కావచ్చు.

27-5-1871న ఫ్రాన్స్ దేశపు రాజధాని పారిస్ నగరంలో ఆ దేశ శత్రువు కమ్యూన్ లు తీవ్రంగా పారిస్ పై బాంబు దాడులు చేస్తుండగా, తల్లి రక్షణ కోసం పురిటి నెప్పులతో ఒక సెల్లార్‌లో తలదాచుకొన్న సమయం లోజార్జెస్ హెన్రి రౌవాల్ట్ పుట్టాడు. ఇదేదో రొమాంటిక్‌గా అనిపించవచ్చు కాని పూర్తి యదార్ధం. తాతయ్య సంరక్షణలో పెరిగాడు. ఈ తాత తన మనవడు ఆర్టిస్ట్ కావాలని ఆకాంక్షించాడు కూడా. తాతకు ఆనాటి ఆర్టిస్ట్ లైన కాలట్, రేమ్బ్రాంట్, కార్బెట్, మానేట్‌లు అభిమానులు.

రౌవాల్ట్ తండ్రి పియానో ఫాక్టరీలో వడ్రంగంలో నగిషీ పని చేసేవాడు. 14వ ఏట కొడుకు ఒక రంగుల గ్లాస్ వస్తువులు చేసేవాడి దగ్గర సహాయకుడిగా పని చేశాడు. అక్కడ తనపని కొలిమి మంటను పర్య వేక్షించటం, కిటికీలలో నుంచి బయటపడిన గాజు ముక్కల్ని ఏరి రిపేర్ చేయటం. ఇది అతనికి బాగా నచ్చింది. ఇక్కడ పని చేస్తూనే సాయంకాలం “ఈకోల్ నేషనల్ డెస్ ఆర్ట్స్ డెకోరాటిఫ్స్”లో చేరి చదివాడు. 20వ ఏట “ఈకోల్ డెస్ బీక్స్ ఆర్ట్స్”లో పేరు నమోదు చేయించు కొన్నాడు. ఇక్కడే గుస్టేవ్ మొరేవ్ ప్రభావానికి లోనయ్యాడు. మొరేవ్ రెండవ శ్రేణి రొమాంటిక్ ఆర్టిస్ట్ అయినా చాలా సహన శీలి. శిష్యులను అది చేయి ఇలాచేయి అని బలవంత పెట్టేవాడు కాదు. వారే స్వయంగా తెలుసుకొని ముందుకు వెళ్లాలని కోరుకోనేవాడు. మిడి మిడి

జ్ఞానం పనికి రాదనీ హితవు చెప్పేవాడు. "Art is a furious tracking down of the inner feelings solely by means of plastic expression" అన్నది మొరావ్ అభిప్రాయం. "ఈ ఫ్యూరియస్ ట్రాకింగ్ డౌన్"ను రోవాల్ట్ పట్టుకొని తన మనోభావాలను కళలో ప్రదర్శించాడు. రౌవాల్ట్ మొరావ్‌కు ప్రియ శిష్యుడయ్యాడు. గురుశిష్యుల మధ్య గొప్ప సాన్నిహిత్యం ఉండేది. అందుకే మొరావ్ చనిపోగానే రౌవాల్ట్‌ను "మొరావ్ మ్యూజియం" అధ్యక్షుడిని చేశారు.

యవ్వనంలోనే రౌవాల్ట్ క్లాసిక్స్ అభ్యసించాడు. 25వ ఏట తన "గ్రాఫిక్ సెల్ఫ్ పోర్ట్రైట్"ను వేసుకొన్నాడు. కనుక అతని చిత్రాలలో శారీరక నిర్మాణ దోషాలున్నాయని, కనుక శరీర నిర్మాణ చిత్రాలు వేయటానికి అసమర్థుడు అని అనే వారికిది చెంప పెట్టు. రేమ్బ్రాంట్ చిత్రకారుడు 26వ ఏట మాత్రమే "క్వారీ" చిత్రాన్ని గీయగాలిగాడని గ్రహించాలి. 30వ ఏట రౌవాల్ట్ ఒక సన్యాసిలాగా కనిపించేవాడు. ఇరవైల మధ్యలో పెరిగిన బిరుసు గడ్డం ఇప్పుడు మెత్తనై వంకర్లు తిరిగింది. కళ్ళు ప్రశ్నార్థకంగా చూసేవి. అందమైన మూతి. ఎందుకో చాలా దుఖితుడుగా, చింతతో కుంగిపోయినట్లుగా కనిపిస్తూ వీటిని తన లాండ్ స్కేప్‌లలో ప్రతిఫలింపజేసి నిరుత్సాహ పరుస్తాడు. పేలవమైన నీలంరంగుతో, భారమైన ఆత్మవేదనతో కనిపిస్తాయి అవి. ఇదే సమయంలో అంటే 1903లో ఉత్సాహభరిత అంకిత భావంతో ఉన్న కేథలిక్ రచయిత రియాన్ బ్లాయ్‌తో పరిచయ మేర్పడింది. బ్లాయ్‌లోని ఆధ్యాత్మిక తేజం నీరవంగా నిరుత్సాహంగా ఉన్న రౌవాల్ట్‌లో ఉద్దీపన కలిగించింది. రౌవాల్ట్‌కు కూడా ఇప్పుడిప్పుడే ఆధునిక ప్రపంచం వెగటు పుట్టి దూరమౌతున్నాడు. బ్లాయ్‌లాగానే అతనికీ "At a time everything seemed lost, to thrust at God the outcry of dereliction and anxiety for the orphaned multitude which the Father in his celestial heights seems to be abandoning and which no longer has the strength even to die bravely" అనే గొప్ప ఎరుక మన గజేంద్రుడికి "నీవే తప్ప ఇతః ప్రమబెరుగ" అన్నఉత్కృష్ట భావన కలిగి జ్ఞానోదయమైంది.

దీనితో కేన్వాస్‌పై టెర్రర్ దుర్ఘటనలను (డిసాస్టర్) గాస్పెల్స్‌ను గీశాడు. చెడును అసహ్యించుకోవటానికి అందంగా లేని వ్యభిచారుల్ని అసహ్యమైన ఇంద్రియ లోలురను, వికార దిగంబర బానిస విటనపుంసకుల్ని, వికర్షించే మొహినుల్ని, నీచ కుహనామేధావుల్ని, అలసిన విషాద విదూషకుల్ని (క్లౌన్స్) బాగా పరీక్షగా అధ్యయనం చేశాడు గీశాడు కూడా. ఇవన్నీ చూసి, విని బ్లాయ్ అవాక్కయ్యాడు. తన శిష్యుడు ఆధునిక "ఫ్రాంజేలికో" అవుతాడేమోననుకొన్నాడు. సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని సమకాలీనంగా మారుస్తాడని భావించాడు. "రౌవాల్ట్ దేవతా చిత్రాలను (సేరాఫిం) గీసే సమర్థుడు అనుకొంటే, దీనికి విరుద్ధంగా ఇప్పుడు అత్యాచారాలు, ప్రతీకార వ్యంగ్య చిత్రాలు మాత్రమే గీస్తున్నాడు" అని రాశాడు.

1917లో బ్లాయ్ మరణం వరకూ రౌవాల్ట్, బ్లాయ్‌లు మంచి స్నేహితులుగా ఉన్నప్పటికీ మన పెయింటర్ ధోరణి మార్చుకోలేదు. అత్యాచారాలు మరింత దారుణంగా చిత్రించాడు. వీటిని తానుకూడా సంస్థాపకులలో ఒకడైన "సెలూన్ డీ ఆటోమ్ని"లో ప్రదర్శించాడు. దీనిపేరు తర్వాత "సెలూన్ డెస్ ఫావెస్"గా మారింది. "వైల్డ్ బీస్ట్"లనబడే "ఫావెస్"లలో మాటిస్సే, డిరైన్, ఫ్రీజ్, రౌవాల్ట్‌లున్నారు. వీరందరి నూతన ఆవిష్కరణలు ఆ రోజుల్లో మామూలుగానే సంప్రదాయవాదులు విమర్శించారు. వీళ్ళ సృజనను నిగూఢం, అశ్లీలం, కుటిల కృత్రిమ, పిచ్చి దురవగాహన అగమ్య గోచర కళ అన్నారు. వీరిలో రౌవాల్ట్‌నే ఎక్కువగా అందరూ దూషించారు. కారణం అతని అతి చీకటి లక్షణ మానసిక చిత్రాలే. ఈ విమర్శ, తిట్లు మరోసారి మరి కొంతకాలమైన తర్వాత జరిగిన ప్రదర్శన తర్వాత మరీ పెరిగింది. బ్లాయ్ మళ్ళీ "నేను నీకు రెండు మాటలు మాత్రమే చెప్ప దలచాను. ఆ తర్వాత నువ్వు నాకు పోగొట్టుకొన్న స్నేహితుడు గానే మిగిలిపోతావు. మొదటిది నువ్వు అంద విహీన చిత్రాలపైనా, అసహ్యించుకొని తల తిరిగేట్లు చేసే వాటినే చిత్రించాలని ఉబలాట పడుతున్నావు. రెండవది నువ్వు నిజంగా దైవ ప్రేమికుడివే అయితే, విధేయతగల అత్మగలవాడి వైతే నువ్వు ఇలాంటి భయంకర చిత్రాలు గీయవు" అని రౌవాల్ట్‌కు ఉత్తరం రాశాడు.

కాని రౌవాల్ట్ చిత్రకళ అవమానకరమైనదని, మానవుని కించపరచేదని, దైవం పట్ల విశ్వాసం లేనివని, ఆత్మ న్యూనతకు చిహ్నాలని ఎవరూ నిరసన తెలుపలేదు. అలాగే అతని బాధా తప్త హృదయాన్నీ, వేదననూ కూడా అర్థం చేసుకొన్న వారు లేక పోయారు. అతని చిత్రాలు ద్వేషం, రోషాలతో గీసినవి కావు. అవి ఆధునిక ప్రపంచ హీనస్థితిని అంతరాత్మ అవసరం, సానుభూతి, సహవేదనలను ప్రదర్శించే చిత్రాలు. వయసు 30 దాటాక ముందుకు దూకే భరోసా లభించింది. అతని చిత్రశైలి మొరటు వ్యంగ్యం, సామాన్య ప్రజల, రైతుల, స్నానం చేసేవారల నిత్యం కనిపించే ఆడ మగ పిల్లా జెల్లాల ఇష్టాల మధ్య గడిచింది, రంగులు మరీ దట్టమైనాయి. ప్రాముఖ్యం పెంచే నల్ల సరిహద్దు ఆకృతులు ఏర్పడ్డాయి. అతని అసలైన వ్యాపారమైన రంగు గాజు పనులు ఇప్పుడు శక్తివంతమై నమ్మకం కలిగేట్లు బోధనామయంగా వున్నాయి. ఇదే రౌవాల్ట్ ను గుర్తించే అతిముఖ్యమైన శక్తివంతమైన శైలి అయింది. నలభైలలో చిత్రించిన నీరస క్లౌన్లు, యాభై ఎనిమిదిలో వేసుకొన్న సెల్ఫ్ పోర్ట్రైట్, అరవైలలో వేసిన శిలువ, ఏసు క్రీస్తు చిత్రాలు మత భావ విశేషాలతో రాణించాయి. 60కి పైగా పెద్ద కాన్వాసులు చిత్రించాడు. లితోగ్రాఫులు, పెర్సనల్ చిత్రాలు, సర్కస్ జనం చిత్రాలు అన్నీ కలిపితే వంద దాకా గీసినట్లే లెక్క. తన స్వంత కవిత్వం "పాసేజేస్ లేజెండరీస్"కు తానే చిత్రాలు వేసుకొన్నాడు. వందకుపైగా వుడ్ కార్వింగ్స్ చేశాడు. సుమారు ఇరవైకిపైగా చెక్కాడు. వయసు మీద పడుతున్నా అతని శైలి తీవ్రత ఏమాత్రం తగ్గలేదు. 75వ ఏట "బిబ్లికల్ లాండ్ స్కేప్", ది ఇంఫంట్ క్రైస్ట్ అమాంగ్ డాక్టర్స్" చిత్రించాడు.

వాటిని చూస్తే భక్తిభావం ఉట్టిపడుతుంది. మిగతా చిత్రకారులకంటే గొప్ప అదృష్ట వంతుడు రౌవాల్ట్. కారణం ఆయన జీవించి ఉండగానే అందరూ ఏవగించుకొన్న, దూరం చేసిన, దూషించిన చిత్రాలనే గొప్ప చిత్రాలుగా ప్రపంచ విమర్శకులు గుర్తించి మెచ్చుకొన్నారు. ఈ అదృష్టం చాలామందికి దక్కలేదు. రౌవాల్ట్ యొక్క అసామాన్యతను జేమ్స్ ట్రాల్ సోబీ సమీక్షిస్తూ "A devout Catholic and devotional painter in a period when artists more often run the gamut of anti religious feeling from indifference to irreverence --a painter of sin and redemption in the face of prevailing estheticism and counter estheticism --an artist with a limited vision of unlimited ferocity in contrast to many other leading painters who have scanned and pivoted but seldom started fixedly for long" అని వివరించాడు.

రౌవాల్ట్‌ను ఏ ఇతర సమకాలీన ఆర్టిస్ట్ తో పోల్చాలి అన్నదొక ప్రశ్న ఉంది. అతన్ని ఒక కవిగానే గుర్తించాలి చిత్రకారునిగా కాదు. అతని అసాధారణ జుగుప్సాకర, ఊపిరి సలపని చిత్రాలు మహా కవి టి.ఎస్.ఇలియట్ "అపూర్వ కావ్యం", "దివేస్ట్ లాండ్"తోను యాష్ వేద్నస్ డే "జర్నీ ఆఫ్ ది మాగీ, ఫోర్ క్వార్టర్స్" కవితలతో పోల్చవచ్చు. ఇలియట్ లాగానే రౌవాల్ట్ గాఢ నిరాశ మార్గం నుండి తెగించిన నమ్మకంలోకి ప్రయాణించాడు. ఏదీ ప్రశాంతంగా పరిష్కారం కాదు. పాపం, ప్రక్షాళనలు నిరంతర ప్రక్రియలు. విదూషకులు, క్రీస్తులు అందరూ మనుషులకంటే. ఎక్కువ బాధే అనుభవించారు. "ఇలియట్ లాగానే రౌవాల్ట్‌కూ క్రూరత్వం సానుభూతి ప్రేరేపిస్తాయి అనిపిస్తాయి. బాధలలోనే మోక్షం ఉంది" అన్నాడు లూయీ అంటర్ మేయర్.

1891లో రౌవాల్ట్ "ది వే టు కావల్రి" చిత్రించాడు. 1907లో స్పిరిట్యు వలిజంకు, జాక్వెస్ మారిటన్ యొక్క అస్తిత్వవాదానికి ఆకర్షితుడయ్యాడు. మానవ ప్రకృతిపైననే అతని దృష్టి కేంద్రీకరించాడు. "A tree against the sky possesses the same interest, the same character, the same expression as the figure of a human" అంటాడు రౌవాల్ట్. 1917నుంచి క్రిస్టియన్ మత విశ్వాస చిత్రాలు గీశాడు. 1937లో చిత్రించిన "దిఓల్డ్ కింగ్" అతని ఫైనెస్ట్ ఆర్ట్‌గా గుర్తించారు. 1930 నుండి లండన్ న్యూయార్క్ చికాగోలలో ప్రదర్శన నిర్వహించాడు. 1948లో "సైకిల్ మిసేరేరే" చిత్రించాడు. జీవితం చివరి రోజుల్లో 300కు పైగా తన చిత్రాలను తగల బెట్టేశాడు. వీటి ఖరీదు నేటి లెక్కల ప్రకారం అర మిలియన్ డాలర్లకు పైనే ఉంటుంది. దీనికి కారణం ఆయన ఏం చెప్పాడంటే తానిక వాటిని పూర్తి చేయలేను కనుక అన్నాడు. 13-2-1958న చిత్రకారుడు రౌవాల్ట్ పారిస్‌లో 87వ ఏట మరణించాడు.❋



## 52. ఇరవయ్యవ శతాబ్ది అత్యుత్తమ నవలా రచయిత మార్సెల్ ప్రౌస్ట్ (1871-1922)

నిరంతరం బాధిస్తున్న ఎలర్జీలతో సతమౌతూ, ఆ బాధానివారణ కోసం డ్రగ్స్‌కు అలవాటై చస్తూ బతికి, ఇరవైవ శతాబ్దంలో అత్యుత్తమ సుదీర్ఘ నవలా రచయితగా గుర్తింపు పొందిన ఫ్రెంచ్ నవలారచయిత మార్సెల్ ప్రౌస్ట్. వ్యాసాలు కొన్ని మాత్రమే రాసినా అతని "ఇన్ సెర్చ్ ఆఫ్ టైం లాస్ట్" అనే 16 భాగాల సుదీర్ఘ నవల కొంత ఫిక్షన్, మరికొంత ప్రౌస్ట్ స్వీయ జీవిత చరిత్ర, సమాజం యొక్క సంపూర్ణ దృశ్య చిత్రంగా కాలాతీత నవలగా మిగిలింది.

10-7-1871లో ఫ్రాన్స్‌లోని ఆటేవిల్ అనే పారిస్‌కు దగ్గరలో ఉన్న శివారు గ్రామంలో జన్మించాడు మార్సెల్ ప్రౌస్ట్. సంపన్న ఎగువ మధ్యతరగతి కుటుంబం. తండ్రి డాక్టర్ ఎడ్రీన్ ప్రౌస్ట్ వృత్తి రీత్యా డాక్టర్ మాత్రమే కాక, పారిస్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో ప్రొఫెసర్, ఫ్రెంచ్ మెడికల్ హెల్త్ సర్వీసెస్‌కు హెడ్ కూడా. తల్లి జీన్నే వీల్ అందమైన సంస్కారవంతమైన ఆల్సేషియన్ జ్యూయెస్. కొడుకును అతిగారాబంగా పెంచి, తనపైనే ఆధార పడిన అతడిని చెడగొట్టింది. ఇద్దరు కొడుకులలో రాబర్ట్ చిన్నవాడు తండ్రి నుంచి మంచి ఆరోగ్యం, వివేకం వారసత్వంగా పొందాడు. ఇతనికి రెండేళ్ళ పెద్దవాడైన మార్సెల్ తల్లినుంచి నరాల బాధ, అసహనం సున్నితమైన సంవేదనాశీలాలను పొందాడు. 9వ ఏట మార్సెల్ ఊపిరి సలుపని జబ్బు పడ్డాడు. అదే ఉబ్బస రోగం అని తర్వాత గుర్తించారు. తరువాతి కాలంలో జరిగిన సంఘటనలు ఈ జబ్బును బాగా తీవ్రం చేశాయి. ఆస్తమా ఒకోసారి మానసిక అస్తవ్యస్తత వలన కూడా రావచ్చు. పాపం ప్రౌస్ట్ క్రానిక్ ఆస్తమా పేషెంట్ అయిపోయాడు. దీనితో జీవితంలో కొంత వరకు పనికిరాని వాడుగా ఉండి చనిపోయేదాకా ఎప్పుడూ మంచంలోనే ఉండిపోవటానికి నిర్ణయించు కొన్నాడు.

తల్లికి అతుక్కుపోయి జీవించాడు. ఈ విషయాలన్నీ తన ప్రఖ్యాత నవలలో

మొదటి భాగం అయిన "స్వాన్స్ వే"లో వర్ణించాడు. రచయిత చిన్న పిల్లాడుగా ఉన్నప్పుడు తల్లి ఒకరోజు రాత్రి రోజూ లాగా ఆతను నిద్రించే ముందు ఇచ్చే "గుడ్ నైట్ ముద్దు" ఇవ్వటం మర్చిపోయింది. అది అతనిని డిప్రెస్ చేసింది. ఈ విషయాన్ని మర్నాడు డిన్నర్ టేబుల్ దగ్గర ఒక కాగితంపై రాసి ఆమె చూసేట్లు కింద పడేశాడు. ఈ సంఘటన అతన్ని మానసికంగా బాగా కుంగదీసింది. అంతటి సెన్సిటివ్ అయ్యాడు మార్సెల్. ఈ సంఘటననే నవలలో రాశాడు. అందుకని ప్రతిరాత్రీ ఆమె గుడ్ నైట్ కిస్ ఇచ్చి తలుపు వేసి వెడుతున్నప్పుడు తల్లిని మళ్ళీ పిలిచి మరో కోసరు ముద్దు పెట్టించుకొని నిద్ర పోయేవాడు. అప్పుడామే చాలా అసహనంగా కనిపించేది. ఈ విషయంపై రాస్తూ తన మనోభావాలను "When she bent her loving face down over my bed, and held it out to me like a Host, for an act of Communion in which my lips might drink deeply the sense of her real presence and with it the power to sleep" అని రాసుకొన్నాడు. అంతటి గాఢ అనుబంధం తల్లితో ఉండేది ప్రౌస్ట్‌కు.

స్వీయ జీవిత చరిత్రలోని "నేను"కు, నిజ జీవితంలో మార్సెల్‌కు చిన్న తేడా మాత్రమే ఉండేది. యవ్వనంలో తల్లిని చిన్నప్పటి గాయపడిన మనసుతోనే పిలిచేవాడు. అందులో ఉన్న నిజాన్ని ఉత్తరాలలో తల్లికి తెలియబరచాడు కూడా. అతను పలికిమాలిన, ప్రమాదకరమైన జీవితాన్ని గడుపుతున్నప్పుడు కూడా ఇలాగే జరిగింది. తాను కొంత మెరుగైన ఆరోగ్యంతో ఉన్నప్పుడు కూడా ఆమె ఇలానే ప్రవర్తించింది అన్నాడు. తాను ఆస్తమా తో బాధ పడుతున్నప్పుడు తల్లి తనకు తోడుగా ఉంటే బాగుండును అనుకొన్నాడు. ఈ రాతలలో అతని స్వీయ కనికరం, (సెల్ఫ్ పిటి) మూర్ఛ (హిస్టీరియా)లతో కంగారుగా ఉన్న మనస్సు కనిపిస్తుంది. కొడుకు అనారోగ్యం వలన దేనికీ పనికి రాని వాడైనాదని తండ్రి పట్టించుకోవటం మానేస్తే తల్లి అతని పాలిటి ఆత్మ బంధువు అయి చదువు సంధ్యలు చూసింది. అతని నైతిక స్తైర్యాన్ని పెంచటానికి ఏదో ఒక పని చెప్పి చేయించేది. చదువు అంటే బద్ధకమేర్పడింది. తల్లి ఎప్పుడైనా తిడితే అతనికి విపరీతంగా దగ్గు వచ్చి ఎక్కువకాలం బాధించేది. అప్పుడు తల్లి తప్పక అతనికి సేవలు చేయాల్సి వచ్చేది. లైబ్రరీకి చేరి తన జీవితాన్నే సాహిత్యంగా మలిచాడు. పుస్తకాలు జుర్రి, మనుష్యుల్ని చదివాడు. తండ్రి స్వగ్రామం ఇల్లీర్స్‌లో వేసవి ఎప్పుడు గడపాలా అని ఎదురు చూసేవాడు. ఈ గ్రామమే అతని ఫిక్షన్‌కు కామ్బ్రేగా మారి నేపథ్యం అయింది. సముద్ర తీర కాబోర్గ్ టౌన్ ఫిక్షన్‌లో బాల్బెక్ అయింది. బ్రేకులు పడుతూ చదువు సాగింది. లైసీ కండార్సేట్‌లో చేరి చదివి సెయింట్ సైమన్ ఫిలాసఫీని అర్ధం చేసుకొన్నాడు. తన పట్టణ ప్రజల,

సమాజం యొక్క పరిస్థితులపై విశ్లేషనాత్మక రచయితగా మారాలనుకొన్నాడు. కాన్స్క్రిప్ట్ ఆర్మీలో కొద్దికాలం పనిచేసి, దిస్కూల్ ఆఫ్ పొలిటికల్ సైన్స్, లా స్కూల్, సార్బొంనే స్కూల్‌లలో పేరు రిజిస్టర్ చేయించు కొన్నాడు. సార్బొన్నేలో అతనిపై హెన్రి బెర్గ్ సన్ ప్రభావం పడింది. బెర్గ్ సన్ స్పెషలైజ్ చేసిన ఇమాజినేషన్ అండ్ ఇంట్యూషన్ (ఊహ, అంతర్ దృష్టి)పై అభిరుచి కలిగింది. బెర్గ్ సన్– ప్రౌస్ట్ కజిన్ మిల్లీని పెళ్లి చేసుకోన్నాక వీరిద్దరి మధ్య అనుబంధం మరీ పెరిగింది.

21వయసులో ప్రౌస్ట్ చీకూ చింతా లేని యువకుడుగా ఆ నగర యువతలో వెలిగిపోయాడు. తల్లిలాగా ఆలివ్ రంగు శరీరం, మెరిసే నల్ల కళ్ళతో కనిపించేవాడు. నిరంతరం చిరునవ్వుతో అందరినీ ఆహ్వానిస్తూ ఉండే ముఖంతో ఉండేవాడు. అయితే ఉన్న వయసుకంటే పెద్ద వయసువాడుగా అనిపించేవాడు. అతని స్నేహ బృందం ఆర్ట్‌పై నిరంతర చర్చ చేసేది. మేడం జేనివీవ్ స్ట్రాటస్ సలూన్‌లో ఎక్కువగా గడిపేవాడు. స్ట్రాటస్ భర్త చనిపోయాక మిగిలిన బృందాల పరిచయమేర్పడింది. అతనిని బాగా ఆకర్షించింది అనటోల్ ఫ్రాంక్‌ను ప్రభావితం చేసిన మేడం అర్మాన్ డీ కైలావేట్. అర్మాన్‌తోనే ప్రయాణం స్నేహం ఆధారం. ఆమె కోడలు జియాన్నే మారిస్ పాకెట్. ఈమె మొదటి భర్త గాస్టాన్ డీ కైలావేట్ ఆమె తన "అనటోల్ ఫ్రాంక్ అండ్ హిస్ మ్యూజ్"లో ప్రౌస్ట్‌ను బాగా అధ్యయనం చేసి రాసింది. మార్సెల్ ఎక్కువ సార్లు ముఖ్యంగా ఆదివారాలలో అర్మాన్ సెలూన్‌లో కనిపించేవాడని, తల వెనక్కి వాల్చి, భుజం మీద ఉంచి కూర్చున్నట్లు అంటే దాదాపు పడుకోన్నట్లు ఉండేవాడని. అతడు దాదాపు ఒక కుప్ప లాగా ఉండేవాడని, సీరియస్ ముఖంతో కళ్ళలో గూడు కట్టిన విషాదంతో ఉండేవాడని, తెల్లని పళ్ళు మెరుస్తూ ఉండేవని, చిన్న వాటికే పెద్దగా నవ్వేవాడని రాసింది. అందంగా ఆకర్షవంతంగా మంచిగా ఉండేవాడు. తన నవల చివరిభాగంలో తానూ ఎంతటి సెన్సిటివ్ మనిషో, తన మర్యాద ఎలా ఉండేదో, యెంత కృతజ్ఞతతో ఉండేవాడో ఏ మాత్రం మనసుకు గాయమైనా యెంత విషాదంతో కుమిలి పోయేవాడో అన్నీ రాశాడు. ఆడ, మగ పిల్లలతో కలిసి ఆడుకోవాలనిపించేది. వాళ్ళతో సరదాగా పిక్నిక్‌లు చేయాలను కొనేవాడు. కాని పాపం ఏ అమ్మాయీ అతని దగ్గరకు చేరలేదు. అబ్బాయిలు మాత్రం పొగడ్తలతో ఉబ్బేసి ఉబ్బు లింగాన్ని చేసి పబ్బం గడుపుకొని పోయేవాళ్ళు. "తల్లితో సాన్నిహిత్యం అప్పుడప్పుడు సందిగ్ధంలో పడేసేది. రాయటం మొదలు పెట్టకముందు నుంచే తానొక రచయిత కావాలనుకొన్నాడు. అతని మేధస్సుమీద అంత నమ్మకం ఉండేది. 20ఏళ్ళ వయసులో మేడం స్ట్రాస్ సెలూన్‌లో మిత్ర బృందంతో ఉండగా "లీ బాన్ క్వెట్" అనే మేగజైన్ నడిపాడు. అది ఇంగ్లాండ్ వారి "ఎల్లో బుక్"

ధోరణిలో ఉండేది. తన శైలిలో కొన్ని ఆర్టికల్స్ దీనిలో రాసాడు. జర్నలిస్టిక్ విషయాలు సాంఘిక విషయాలు, పుకార్లు అన్నే "లీ ఫిగరా"లో వండి వడ్డించాడు. ఇవేవీ గొప్పవి కాకపోయినా తన భావాలకు అవుట్‌లెట్‌గా ఉపయోగపడ్డాయి. 25వ ఏట "లేస్ప్లాసిర్స్ ఎట్ లేస్ జోర్స్"లో కొన్ని కవితలు, వ్యాసాలూ, రేవేరీస్ స్కెచ్‌లు కలిపి మొదటిభాగం ప్రచురించినప్పుడు ముందుమాటలో ప్రౌస్ట్‌ను "ఏ గిల్ లెస్ పెట్రోనియాస్" అని రాసింది మేడం కైలావేర్ట్. ప్రౌస్ట్ 22వ ఏట తమ్ముడు స్కాట్ చనిపోయాడు. అతని మధుర స్మృతుల్ని రికార్డ్ చేశాడు రచనలో. తనను నోవా ఇన్ దిఆర్క్‌తో పోల్చుకొన్నాడు.

30ఏడు మీద పడేలోగానే ప్రౌస్ట్ స్వయం వినాశక పద్ధతులలో పడ్డాడు. వ్యక్తిత్వం, అవసరాల మధ్య నలిగిపోయాడు. రాసినా మాట్లాడినా చాలా నిష్కపటంగా ఉండాలనుకొన్నాడు. కాని లోపల మాత్రం ఏదో తెలీని దాపరికం ఉండేది. తన గురించి తల్లి దండ్రుల గురించి స్వేచ్ఛగా చెప్పాలనుకొన్నా కొన్ని చెప్పలేక పోయాడు. శ్వాస పీల్చే సమయం కూడా దొరికేది కాదు. ముందు తండ్రి తర్వాత రెండేళ్లకు తల్లి చనిపోగానే ప్రౌస్ట్ మరింత మనోవ్యాకులానికి, విచారానికి గురైనాడు. తల్లి మరణాన్ని జీర్ణించుకోలేక పోయాడు. దీనిపై "34వ ఏట ప్రౌస్ట్ తల్లి లేని అనాధ అయ్యాడు. చిన్నప్పుడూ, ఇప్పుడూ కూడా "లిటిల్ బాయ్ లాస్ట్"గానే ప్రవర్తించాడు. తల్లిని ఎన్నడూ మార్చి పోలేదు, క్షమించానూ లేక పోయాడు. తల్లిని "Mother was a dove, the consoling hopeful messenger, who had left him, who had left him hopelessly alone" అనుకొన్నాడు. ఆమె మరణం అతనికి విముక్తి అనిపించింది.

ఇప్పుడు ప్రౌస్ట్ తన బృహత్తర రచనకు శ్రీకారం చుట్టాడు. కౌంట్ డీ మాంటిస్కోను నెపోలియన్ మూడవ సోదరి ప్రిన్సెస్ మాటిల్డా మొదలైన వారిని చాలా తీవ్రంగా అధ్యయనం చేశాడు. దేనినీ మర్చే పోలేదు. ఈ సంఘటనలన్నీ ఒక ధారావాహిక గాధలలా అనిపించాయి. కుళ్ళి పోయిన సమాజం, బాగుపడని సమాజం, ప్రజల తీర్చలేని ఇక్కట్లు దారుణ జీవన పరిస్థితులు అన్నిటినీ తన దీర్ఘ నవల "రిమేంబరెంస్ ఆఫ్ థింగ్స్ పాస్ట్"లో నిక్షిప్తం చేశాడు. తన మైక్రోస్కోపిక్, టేలిస్కోపిక్ వివరాలను చదివి జనం మెచ్చారన్నాడు. ఒక్క పాత్ర ఆల్బర్టైన్ మాత్రమే అతనికి నచ్చలేదు. ఆ పాత్రంటే మహా ప్రేమ, ఆరాధన. కథలో అసలైన ఆల్బర్టైన్ లెస్బియన్‌కు బదులు సెక్సువల్. ఈ నవల వ్యక్తిగత ఒప్పుకోలు, సాంఘిక విమర్శ. దీన్ని ఏ పబ్లిషర్ కూడా గుర్తించలేదు, ప్రింట్ చేయానికి ముందుకు రాలేదు. కొంత డబ్బు తానే ఖర్చు చేసి అజ్ఞాత ప్రింటర్ ద్వారా అచ్చువేయించి మొదటిభాగం "స్వాన్స్ వే" బయటికి 1913లో తెచ్చాడు. దీన్ని ఎవరూ పట్టించుకోలేదు. అయిదేళ్ళు ఆగాల్సి వచ్చింది రెండో భాగం

"విదిన్ ఏ బడ్డింగ్ గ్రువ్" తేవటానికి. ఇది జనంలోకి బాగా చొచ్చుకెళ్లి, వీర అభిమానం తెచ్చి పెట్టి "కన్కార్ట్ ప్రైజ్" పొందింది. మిగిలిన నాలుగేళ్ళలో "ది గుర్మాన్టైస్ వే", "సిటీ సాఫ్ ది ప్లైన్, ది కాప్టివ్", "ది స్వీట్ చీట్ గాన్", "ది పాస్ట్ రి కాప్చర్డ్" ప్రౌస్ట్ జీవిత కాలంలోనే రాస్తే మరణానంతరం ప్రచురింప బడ్డాయి.

ప్రౌస్ట్ రాసిన రిమెంబరెన్స్ నవలలో ఎన్నో పాత్రలున్నాయి. చెప్పలేనన్ని సంఘర్షణలు రెండు పెద్ద నేపథ్యాలలో జరుగుతాయి. మొదటిది సమాజం ఉత్థాన పతనాలు. ఆ శతాబ్దం అంతంలో అననుకూలంగా ఉన్న నిబంధనల సడలింపు, సామాజిక పొరలు కరిగిపోవటం. ఈ నేపథ్యంలో జర్మంటిస్ అంటే అరిస్టోక్రాట్ల సమ్మేళనం "స్వాన్స్" అంటే మధ్యతరగతి మేధావుల సుఖ జీవనం, "వర్దూరిన్స్" అంటే నయా రిచ్ వర్గాల నిలకడ ప్రభావం అన్నీ కలగా పులగంగా ఉన్నాయి. రెండవది, మరింత జటిలమై సింబాలిక్‌గా ఉన్నదీ –కాలంతో మనిషి నిరంతర పోరాటం. అందుకే నవల శీర్షిక "ఇన్ సెర్చ్ ఆఫ్ టైం లాస్ట్" చాలా చక్కగా నప్పింది. "Poetry is emotion remembered in tranquility" అని వర్డ్స్ వర్త్ కవి అంటే, ప్రౌస్ట్ "Not only poetry but reality is an experience relived in the memory, reality is not so much the event as the re animating flow between the past and the present" అన్నాడు. "ది పాస్ట్ రి కాప్చర్డ్" లేక "టైం రీ గైండ్"లో చివరి పేజీలు అసలు రహస్యాన్ని, కీలక విషయాన్ని తెలియజేస్తాయి. గతం తనను తనవారినీ వేరు చేయలేదని అన్నాడు. "మనుషులు స్పేస్‌లో కంటే కాలంలో ఎక్కువగా విహరిస్తారు. వారి వర్తమానం భూతకాలంపైనే ఆధారపడి ఉంటుంది. అతని పాత్రలు మామూలు దృష్టిలో పెరగవు. వాళ్ళు వృద్ధి చెంది, వికసిస్తారు. "The most vivid insights in Proust;s work do not rise from wisdom or applied intelligence, but from chance sensations and their buried associations --a "madeleine", "a little cake dipped in a cup of tea".

భవిష్యత్ అదృష్టాన్ని గురించిన చింతే లేనివాడు ప్రౌస్ట్. ప్రౌస్ట్‌ను ఫేబర్‌తో పోల్చవచ్చు. ఫెబెర్ కీటకాల సంఘ జీవనాన్ని అధ్యయనం చేస్తే ప్రౌస్ట్ మానవ సంఘాల జీవనాన్ని అధ్యయనం చేసి రాశాడు. బెర్గ్ సన్ కాలాన్ని అధ్యయనం చేశాడు కనుక ఆయనతో పోలికా సరైనదే. జేమ్స్ జాయిస్‌తో పోల్చటమూ బాగుంటుంది కారణం అతను అంతశ్చేతనను శోధించాడు. ఫెబర్ లాగా ప్రౌస్ట్ పరిశీలకుడు మాత్రమే కాదు వ్యాఖ్యాత కూడా. బెర్గ్ సన్‌లాగా కాకుండా ప్రౌస్ట్ కాలాన్ని నిర్మాణ అంశంగా కాక విచ్ఛిన్న అంశంగా భావించాడు. జాయిస్ సబ్జెక్టివ్ అయితే, ప్రౌస్ట్ ఆబ్జెక్టివ్. ప్రౌస్ట్

అనుబంధాలు స్వేచ్ఛా పూరితమైనవి కావు. అవి సుదీర్ఘ జ్ఞాపకాల గొలుసులతో గట్టిగా అనుసందానమైనాయి. "Remembrance of things pas", "is the first and last, a uniquely expanding autobiography which is a masterpiece of sensibility".

ఈ బృహత్తర నవలా రచనలో ఉన్నప్పుడు ప్రౌస్ట్ నరాల బలహీనత, ఒంటరితనంతో మునిగిపోయాడు బజారు అరుపులు శబ్దాలు కాలుష్యం దుమ్ము ధూళి, పరాగ రేణువులు, పగటి కాంతి అతని నరాలపై ప్రభావితం చేశాయి. అందుకనే గది వదిలి బయటికి వచ్చేవాడు కాదు. గదిలోకి శబ్దం దూరకుండా కార్కు షీట్లు, సూర్య రశ్మి ప్రవేశించకుండా షట్టర్లు ఏర్పాటు చేసుకొన్నాడు. కిటికీ తలుపులు అసలెప్పుడూ తెరవనే లేదు. స్టీం హీట్‌ను ఉపయోగించేనే లేదు. మహిళా సందర్శకులు వస్తే అతని సేవకులు ముందుగా వారి వద్ద పూలుకాని సువాసన ద్రవ్యాలు కాని ఉన్నాయేమో చెక్ చేసి లోపలి పంపేవారు. వేసవి కాలంలోనూ శీతాకాలంలోనూ మఫ్లర్లు స్వెట్టర్లు, నైట్ కాప్ గ్లోవ్స్ తప్పనిసరిగా వేసుకొనే పడుకోనేవాడు. గది అంతా దట్టమైన ధూపంతో నిండి ఉండేది. ఫామిలీ హౌస్ నుండి మారి ఒక పాత అపార్ట్మెంట్ నాలుగవ అంతస్తు గదిలో చేరాడు. అంతా చీకటి. అదే అతనికి వరం. ప్రౌస్ట్ జీవిత చరిత్రాకారుడు లియర్ పియరీ క్వింట్ ఆ గదిని "ఒక సర్వెంట్ రూమ్"లాగా ఉందన్నాడు. దీన్నీ ఖాళీ చేసి వేరొక చోటికి వెళ్లాలని ఉండేది కాని వెళ్ళలేదు. కుర్చీలకు కవర్లు తొడిగే ఉండేవి. పడుకొనే రోజులో చాలా ఎక్కువ భాగం గడిపేవాడు. గది అంతా మందు సీసాలు, ఖాళీ జార్లు చిందర వందరగా పడి ఉండేవి. మధ్యలో రాసి పారేసిన కాగితాల దొంతరలు. పాత న్యూస్ పేపర్ కట్టలు, 20 పెద్దనోట్ పుస్తకాలు టేబుల్‌పైన ఉండేవి. ఇవే అతని తాజా రచనకు తార్కాణాలు.

ఒక్కోసారి రాత్రి బయటికి కాసేపు వెళ్ళేవాడు. రాత్రి అంత ప్రమాదకరం కాదని అనుకొనేవాడు. బాధకు ఉపశాంతిగా తప్పుడు ఉత్ప్రేరకాలు వాడేవాడు. పరిస్థితి రోజు రోజుకూ క్షీణించింది. విశ్రాంతి కోసం మాదక ద్రవ్యాలు వాడాడు. వీటితో మూడు రోజులు నిద్రపోయేవాడు. లేపటానికి మళ్ళీ ఎఫీన్ అడ్రోలీన్ వేసేవారు. 51వ ఏట న్యుమోనియా సోకింది. కాని డాక్టర్‌ను పిలవలేదు తమ్ముడు రాబర్ట్ అన్నకు సేవ చేద్దామని వచ్చాడు. అతనితో మాట్లాడనే లేదు. అతని సపర్యలు వద్దుపొమ్మని తిరస్కరించాడు. తాను పని చేసుకోవాలి కనుక డిస్టర్బ్ చెయ్యద్దన్నాడు. చావు ముందు ఒక గంట సేపు ప్రూఫ్ రీడింగ్ చేశాడు. అందులో చనిపోయే బెర్గాట్టే పాత్ర వర్ణనలో కొంత మార్పు చేయాలనుకొన్నాడు. కారణంగా "I have several retouchings

to make ,now that I find myself in the same predicament" చెప్పాడు. అనుకొన్నట్లు ఆ మార్పులు చేయగానే చేతిలోని పెన్సిల్ జారి కింద పడిపోయింది. మార్సెల్ ప్రౌస్ట్ 18-11-1922న 57ఏళ్ళ వయసులో మరణించాడు.

ప్రౌస్ట్ హోమో సెక్సువల్. మగవాళ్ళతో అతని సంబంధాలు ఆనాడు బాగా చర్చనీయాంశమైంది. కాని ఇది అబద్ధం అని అతనికి సేవ చేసిన సేలేస్టే అల్బరేట్ చెప్పింది. కాని అతని సమకాలిక రచయిత ఆంద్రీ గైడ్ మొదలైన వారు రాసినదానికి ఆమె చెప్పింది విరుద్ధంగా ఉంది. ప్రౌస్ట్ ఎప్పుడూ దీనిపై స్పందించలేదు. ప్రౌస్ట్ రచనలో సెక్సువాలిటి ఒక పెద్ద చర్చనే రేపింది. "హోమో" అనేది తర్వాత జీన్ పాల్ సాత్రే రచనల్లోనూ చోటు చేసుకొంది. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో ప్రౌస్ట్ తన నవలను యదార్థ సంఘటనలతో నిర్మాణంలో పెద్ద మార్పులతో మూడు రెట్లు పెంచి రాశాడు. "Proust ;s novel has a circular constitution and must be considered in the light of the revelation with which it ends". అతని సబ్జెక్ట్ ముక్తి. తాత్కాలిక ప్రలోభాలనుండి విముక్తి. నవలాపదార్థం తన గతమేనని స్పష్టంగా చెప్పాడు.

ఆధునిక కాల్పనిక సాహిత్యంలో ఇరవైవ శతాబ్ది నడకను ఒడిసిపట్టుకొని ప్రతిబింబింప జేసిన గొప్ప నవల రేమేబ్రన్స్. తన గత జీవితాన్ని ఒక ముడిపదార్థంగా తీసుకొని, గతించిన కాలం తిరిగిరాదని, అమాయకత్వంను అనుభవంతో అధిగమించాలని ప్రేమ స్నేహం మనిషి అహంకారం గర్వం పాపం నిరాశల విజయాలు గురించే రాశాడు. చివరగా ప్రౌస్ట్ చెప్పిన దాని సారాంశం "దిన జీవితం చాలా ప్రాముఖ్యమైనది. అందులో నీతి సంతోషం, అందం, ఆనందం ఉన్నాయి. వీటిని వదులు కోరాదు. మానవసహజ తప్పిదాల వలన వాటిని కోల్పోయినా, అవి నాశనం చెందనివి, తిరిగి పొందగలిగినవి. ప్రపంచ సాహిత్యంలో ప్రౌస్ట్ శైలి అద్వితీయమైనది. వేగం దీర్ఘత, నిర్దుష్టత, శక్తి, మురిపెం, క్లాసిజం, సింబాలిజం యొక్క సమాహారం ప్రౌస్ట్ రచనా విధానం. అసాధారణ వ్యక్తిత్వం ఉన్న మహా రచయిత ప్రౌస్ట్. తనది జ్యూయిష్ రక్తం అని ఎక్కడా ప్రౌస్ట్ చెప్పుకోలేదు. తల్లి కులగోత్రాలజోలికీ పోలేదు. ❁



## 53. తన తరాన్ని సోషలిస్ట్ భావ సంపదతో ప్రభావితం చేసిన అమెరికన్ నవలాకారుడు - దియోడర్ డ్రైజర్ (1871-1945)

అమెరికన్ నవలాకారులలో అతి వెర్రిగా అణగ దొక్కబడిన, నిషేధింపబడిన వాడు దియోడర్ డ్రైజర్. అయినా అదే పట్టుదలతో తనను తాను కాపాడుకొన్న ధీరుడు. ప్రచురణకు కాంట్రాక్ట్ కుదుర్చుకొన్న రెండు పెద్ద సంస్థలు అతని రచనలను ప్రచురించ టానికి తిరస్కరించి, మిగిలిన చిన్నా చితకా పబ్లిషర్‌లను కూడా అసలు వాటిని చదవకుండానే ప్రచురించ నీయకుండా చేశాయి. అతనేదో దేశద్రోహం లాంటి నేరం చేశాడని, ఆయన రచనలు అమెరికా జాతికి అవమానకరమని. అశ్లీల సాహిత్యకారుడని ముద్ర వేశారు. చిన్నతనం నుంచే ఈ విద్వేషాన్ని అనుభవించటం మొదలుపెట్టి జీవితాంతం అనుభవిస్తూనే ఉన్నాడు. ఒక అభద్రతాభావం జీవితాంతం అతన్ని వెంటాడింది. అందుకే రాసిన దానిలో గందర గోళం కనిపిస్తుంది.

అసలు పేరు దియోడర్ హెర్మన్ ఆల్బర్ట్ డ్రైజర్. 27-8-1871న అమెరికాలోని ఇండియానా రాష్ట్రంలో ఉన్న టెర్రెహాట్‌లో జన్మించాడు. ఇల్లు పాడుపడిన దెయ్యాలకొంప. జబ్బు పడినట్లు నీరసంగా కనిపించే కొడుకు ఆరోగ్యం కోసం తల్లి ప్రక్కనే ఉన్న ముసలి మంత్రగత్తెను పిలిపించి దెయ్యం పట్టి అలా చిక్కిపోతున్నాడేమో చూసి వదిలించమని కోరింది. తండ్రి జాన్‌పాల్ కేథలిక్. ఇలాంటి నమ్మకాలు లేనివాడు. ఏ ఇబ్బంది వస్తుందోనని జర్మనీ పారిపోయాడు ఆయన జీవితంలో విఫలుడు. బ్రహ్మాండమైన ఫాక్టరీకి సంపన్న యజమాని. దివాలా తీసి లేబరర్‌గా పనిచేస్తున్నాడు. ఇంటిబాధ్యత అతని మేన్నోనైట్ భార్య వహించి ఒక బోర్డింగ్ హౌస్‌ను నిర్వహిస్తూ వాషింగ్ పనీ చేబట్టింది. 13మంది సంతానంలో దియోడర్ 12వ వాడు. ఆ కుటుంబం అంతా వేయించిన బంగాళాదుంపలు, పాప్ కారన్ తిని బతికింది. రైల్ రోడ్ ప్రక్కనే ఉండటంతో

వాగన్లలోని బొగ్గు దొంగలించి అమ్మి సొమ్ము చేసుకొనేవారు. ఎవరికీ చెప్పులు కూడా ఉండేవికావు. తల్లి చేసిన ఇస్త్రీ బట్టల్ని బుజాలపై మోసుకొంటూ డోర్ డెలివరి ఇచ్చేవాడు దియోడర్. పేదరికపు కోరల్లో గిలగిలలాడి పోతున్న సంసారాన్ని చూసి ఏమీ చేయలేక తన నిస్సహాయ స్థితికి వ్యధ చెందేవాడు. అన్నలు అప్పుడప్పుడు ఇంటికి వచ్చి బాధ్యత లేని తమ జీవితానందాలను కథలుగా చెబుతూంటే ఆశ్చర్యపోయేవాడు. ఏదీ సాధించకపోయినా తండ్రి ఆడపిల్లలను తల్లినీ సాధిస్తూ ఇబ్బంది పెట్టటం సహించలేక పోయేవాడు. తన తల్లి దయ సానుభూతి ప్రేమ ఉన్న మాతృమూర్తి అని తెలుసుకొని ఆరాధించేవాడు.

పెద్దకొడుకులులాగా వీడు దారి తప్పకూడదని తండ్రి డ్రైజర్ను చర్చి స్కూల్‌కు పంపించాడు. అక్కడి మత బోధ ఒంటికి పడలేదు. తట్టుకోలేక పోయాడు. నల్ల డ్రెస్ వేసుకొన్న ప్రీస్ట్‌లంటే భయమేసేది. నవ్వుకు తావేలేదక్కడ. నిత్య కర్మకాండ మరింత భయపెట్టింది. కుటుంబం అక్కడి నుంచి ఇండియానాలోనే మరో ప్రాంతానికి మారింది. మనవాడు ఇక్కడ అయిష్టంగానే ఉండిపోయాడు, చికాగోకు ఫామిలీ చేరినతర్వాత ఊరట లభించింది. చిన్నతనంలో ఆడుకొనే ఆటలు అతనికి దూరమయ్యాయి. బాల్యం అంతాఆనంద రహితంగానే గడిచిందని బాధ పడేవాడు. 17ఏళ్ళు రాకముందే ఒక మురికి రెస్టారెంట్ డిష్ వాషర్‌గా, స్టవ్ తుడవటం, కార్ చెకర్‌గా పని చేశాడు. 18వ ఏట వారానికి 5డాలర్లు సంపాదించాడు. అతని పూర్వపు టీచర్ ఇండియానా యూనివర్సిటీలో పని చేసే అవకాశం కల్గించాడు. 19వ ఏట తల్లి చనిపోయింది. ఆమె అనారోగ్యంతో చర్చికి హాజరు కాలేక పోయేది. అందుకని ఆమె చనిపోతే ప్రీస్ట్ వచ్చి అంత్యక్రియలు జరపటానికి నిరాకరించాడు. ఇవన్నీ ఈయువకుడిపై ప్రభావం కలిగించి అసలే చర్చి అంటే ఏహ్యభావం ఉన్న దియోడర్‌కు ఆ సంప్రదాయంపై పూర్తి వ్యతిరేకత ఏర్పడిపోయింది.

పొట్ట పోషణకోసం రియల్ ఎస్టేట్ కాన్వాసర్‌గా, వాగన్ డ్రైవర్‌గా, చిన్న చిన్న పనులు చేస్తూ ఒక న్యూస్ పేపర్ ఆఫీస్‌లో చేరాడు. ఇరవై ఏళ్ళకే రిపోర్టర్ చేస్తూ ప్రపంచంలోని కష్టాలు బాధలు వ్యధలు, ప్రజల, పాలకుల ఉదాసీనత అర్థం చేసుకొన్నాడు. అందులో ఏదీ వార్తకాదని యదార్ధ గాథ అని తెలుసుకొన్నాడు. సెయింట్ లూయీకి మారి తన పేపరుకు స్కూల్ టీచర్ పరీక్ష నిర్వహించి సారా వైట్ అనే అమ్మాయితో పరిచయమై ప్రేమించి, అయిదేళ్ళ తర్వాత పెళ్ళాడాడు. పెళ్ళికాక ముందే చార్లెస్ డికెన్స్, దూ మారినర్, హతారన్, బాల్జాక్ రచనలన్నీ క్షుణ్ణంగా చదివి జీర్ణం చేసుకొన్నాడు. సెయింట్ లూయీ నుండి టోలెడో, క్లీవ్ లాండ్, పిట్స్ బర్గ్, కూ చివరికి న్యూయార్క్‌కు

చేరాడు. అప్పటికే అతని సోదరుడు పాల్, ఇద్దరు అక్కలు అక్కడే ఉంటున్నారు. అక్కడ కెరీ అనే రెస్టారంట్మేనేజర్‌గా ఉన్న ఆమెను ఒకడు ముగ్గులోకి దింపి, ఆమెతో ఉడాయించేశాడు. 15వేల డాలర్లు నొక్కేసి బొక్కేసిన వాడినే పెళ్లి చేసుకొంది. వాడికి అన్నిరకాల సాయం చేసింది. తన సోదరి ధనవంతుడైన వాడినిష్టపడి, కడుపు తెచ్చుకొంటే ఆమెకు అండగా నిలిచింది. ఈ కెరీ అంటే డ్రైజర్కు వీరాభిమానం. ఈమెనే తన నవలలో ముఖ్య పాత్రగా చిత్రించాడు. అక్కలకు, పాల్‌కు భారం కారాదని భావించి వేరే ఒక అచ్చిరాని చోట రూమ్ అద్దెకు తీసుకొన్నాడు. "న్యూ యార్క్ వరల్డ్" పత్రికలో ఉద్యోగం వచ్చింది. కొద్దికాలానికే డిస్మిస్ చేశారు. తిండిలేక ఇబ్బందిపడ్డాడు. రోజూ పస్తులే. పాల్ వచ్చి బాసటగా నిలిచాడు. పాల్ డ్రసర్‌గా పిలువ బడే ఇతను గుర్తింపు పొందిన గొప్ప నటుడు, ఎంటర్ టైనర్. అనేక పాప్యులర్ సాంగ్స్ పాడి రికార్డ్ చేసినవాడు. అందులో బార్బర్ షాప్ మెలడీలు, సెంటి మెంటల్ థ్రిల్లర్లూ ఉన్నాయి. 300పౌండ్ల స్థూలకాయుడు పాల్. మనవాడికంటే 15ఏళ్ళు పెద్ద. హానికర రక్తహీనత వలన 1906లో పాల్ చనిపోతే "మై బ్రదర్ పాల్" అంటూ విపరీతంగా ఏడ్చేశాడు. అతనితో కలిసి తయారు చేసిన ఒక పాట ఆల్ టైం రికార్డ్ అయింది. తన పబ్లిషింగ్ ఫార్మ్‌లో ఇతనికి అవకాశమిచ్చాడు. ఈ సంస్థ పాటలు, కథలతో ఒక మేగజైన్ తెచ్చి "ఎడిటర్ అండ్ ఆరేంజర్" అని గౌరవంగా ముద్రించాడు. అవినీతితో కూరుకు పోయిన మెట్రో రాజకీయాలను, పురాతత్వ శాస్త్రం, ఐరోపా పరిస్థితులు, మహిళా భవితవ్యం, మద్యపాన వ్యసనం, కుజ గ్రహంలో జీవరాశి మొదలైన విషయాలపై సంపాదకీయ రచనలు చేసే బాధ్యత డ్రైజర్‌కు అప్పగించాడు ఇతను తన సమర్ధతను చాటి భేష్ అనిపించుకొన్నాడు.

రెండేళ్ళ తర్వాత కొంత ఆర్ధిక వెసులుబాటు ఉన్నా, భవిష్యత్తు ఆశాజనకంగా ఉండదని గ్రహించాడు డ్రైజర్. వేరే చోట పనిలో కుదిరి 1928లో ఫ్రీలాన్స్ సామర్ధ్యంతో పెళ్ళికి సిద్ధమయ్యాడు. తరువాత కొన్నేళ్ళు సక్సెస్ ఫుల్ రచయితగా ఎదిగాడు. న్యూయార్క్ మురికి వాడల, స్వీట్ షాప్‌ల, నిరుద్యోగుల కడగండ్లను నిశితంగా పరిశీలించి రాశాడు. కార్పోరేషన్ వారికి హృదయం లేదన్నదాన్ని వ్యతిరేకిస్తూ "No corporation is soulless which helps all others in helping itself" అన్నాడు. పేదలతో మమేకమై తిరిగినవాడు ఇప్పుడు ప్రకటన రొచ్చులో కూరుకుపోయాడు. 28వ ఏట ఈ ఫాల్స్ ప్రిస్టేజ్ ఉద్యోగం నచ్చక వదిలేసి "సిస్టర్ కారీ" నవల రాశాడు.

డ్రైజర్ మొదటి నవల సిస్టర్ కారీ చాలా పాపులర్ అయింది. అందులోని విషయమే ఈవిజయానికి కారణం. సమ్మోహనం, వ్యభిచారం, విషాదం, దొంగతనంలను నైతికతను మసాలాగా దట్టించి రాసిన నవల ఇది. బెస్ట్ సెల్లర్‌గా పేరు పొందింది. కాని నిజానికి

అది చేజేతులా నాశనం చేసుకొన్న అతని సోదరి జీవితమే. ఇందులోని వాస్తవికత అతిసామాన్యమై, ఆనాటి సెక్స్‌తో రొచ్చుతో దట్టించిన మిగిలిన నవలల కంటే భిన్నంగా జనాదరణ పొందింది. పాపాలకు పరిహారంగా హార్ట్స్ వుడ్ ఆత్మహత్య చేసుకొంటే, కారీ బతికి తను సాధించాల్సింది ధైర్యంగా సాధించింది. ఈ నవల రాత ప్రతిని హార్పర్ అండ్ బ్రదర్స్‌కు ముద్రణకోసం డ్రైజర్ అందజేస్తే వెంటనే తిరస్కరించి తిరిగి పంపించేశారు. నిరాశతో వేరే పబ్లిషర్‌కు డబల్ డేకు ఇస్తే ఒప్పుకొని అంతా సిద్ధం చేసిన తర్వాత అతని భార్య ప్రూఫులు దిద్దుతూ అందులోని నిష్కపట రచనకు ఆనందించినా, చట్టప్రకారం ముద్రించాల్సి ఉన్నా దాన్ని విస్తృతంగా ప్రచారం చేయటానికి ఒప్పుకోలేదు. చిన్న పుస్తకంగా ప్రింటర్ దగ్గరే ఉండిపోయింది. ఒకరకంగా రచనను అణగ ద్రొక్కేశారు. కొన్ని సమీక్షలు అనుకూలంగానే వచ్చాయి. రచయిత పాత్ర చిత్రీకరణపై ప్రశంశలు వెల్లి విరిశాయి. కాని చాలామంది విమర్శకులు అంటీ ముట్టకుండా చేతులకు మసికాకుండా రాశారు. ఎవరూ కమిట్ కాలేదు. పాపం కొన్ని వందల పుస్తకాలే అమ్ముడు పోయాయి. తండ్రిలాగే తానూ జీవితంలో ఓడిపోయానని చింతించాడు.

ముప్ఫైవ ఏట అంత ఉత్సాహంగా లేక ఏదో చిలక్కొట్టుడు స్కెచెస్ మాత్రం అడపా దడపా రాశాడు. దీనికి తోడు నీడలేని వాడయ్యాడు. నిరాశే తోడయ్యింది. భార్యను అత్తవారింటికి మిస్సోరికి పంపించి, న్యూయార్క్ నుంచి, వర్జీనియా అక్కడి నుండి, పెన్సిల్వేనియా, బాక్ టు న్యూయార్క్ చేరాడు. మనోవ్యధ ఎక్కువై, చేతి వేళ్ళకు స్పర్శ తగ్గి పోయిందని భావించాడు. నిద్ర పట్టేది కాదు. తనపై ఎవరో గూఢచర్యం చేస్తున్నారని అనుమానపడేవాడు. తనలో మరో "అపరిచిత వ్యక్తి" ఉన్నాడని గ్రహించాడు. తనది ద్వంద్వ ప్రవృత్తి అని తెలుసుకొన్నాడు. "అపోజిల్ ఆఫ్ నేచర్" అనే పేరుతో డ్రైజర్ జీవిత చరిత్ర రాసిన రాబర్ట్ ఎలియాస్ "వారానికి ఒకటింబావు డాలర్ల అద్దెతో ఒక చీకటి కొట్టులాంటి గదిలో అద్దెకు ఉంటూ, మొదట రోజుకు రెండు పూటలా తింటూ, తర్వాత ఒక్క పూటతో సరి పుచ్చుకొని, చివరికి ఇన్నిపాలు బ్రెడ్ ముక్కా తింటూ గడిపాడు. వీధిలో దొరికిన యాపిల్ పండునో, కాయగూరలనో తిని బతికాడు. ఆయిల్ స్టవ్‌తో గదిని వెచ్చ బెట్టుకోనేవాడు" అని రాశాడు. ఎంతకు కుంగిపోయాడంటే స్వచ్ఛంద సేవా సంస్థలను తనకు సాయం చేయమని అర్థించినా స్పందన లేకపోతే మరింత దిగజారిపోయాడు. జీవించాలని ఉన్నా బతకటానికి సరిపడా తిండి లేక శారీరకంగా మానసికంగా కుంగిపోయి ఆత్మహత్యా ప్రయత్నాలు చేశాడు. తాను పోట్లాడి గెంటేసిన పాల్ మళ్ళీ శరణు అయ్యాడు. అతనికి తను ఇవ్వాల్సిన వాటా దనం ఇచ్చేస్తానన్నాడు.

ఇలా నిర్భాగ్య స్థితిలో అతను బ్రతకటానికి ఒప్పుకోనని ఆ డబ్బు తీసుకోమన్నాడు పాల్. కొత్త బట్టలు కొని తనతో వెస్ట్ చెస్టర్‌లో ఉన్న ప్రముఖ మోల్డాన్ హెల్త్ రిసార్ట్‌లో చేర్చాడు.

అన్ని వసతులు కలిగిన ఆ రెస్టారెంట్‌లో అతని ఆరోగ్యం క్రమంగా బాగుపడింది. జీవితేచ్ఛ పెరిగింది. న్యుయార్క్ సెంట్రల్‌కు ఆరు నెలలు బయటి నుంచే పని చేశాడు. పూర్తిగా ఆరోగ్యవంతుడై మళ్ళీ ఎడిటర్‌గా పని చేయాలనుకొన్నాడు. స్ట్రీట్ అండ్ స్మిత్ వాళ్ళ కాకమ్మ కబుర్ల పత్రికలో ఎడిటోరియల్ బాధ్యత తీసుకొన్నాడు. అక్కడ అతనిపని వచ్చిన ఆర్టికల్స్‌లోని 60 వేల పదాలను ముప్ఫై వేల పదాలు ఉండేట్లు రెండుగా కుదించటం మొదటి భాగానికి కొత్త సమాప్తి రాయటం రెండవ సగానికి కొత్త ప్రారంభం రాసి రెండిటికీ కొత్త పేర్లు పెట్టటంతో చీప్ నవలల విజయం ఊపందుకోన్నది. ప్రొడ్యూసర్‌కు లాభాల పంట పండింది. దీనితో డ్రైజర్ "బ్రాడ్వే మేగజైన్"కు ఎడిటర్ అయ్యాడు. మరో ఏడాదికి "డెలి నీటర్", "ది డిజైనర్, "న్యు ఐడియా వుమెన్స్ మేగజైన్" అనే బటరిక్ పత్రికా త్రయానికి డైరెక్టర్ అయ్యాడు. మధ్యే మార్గం కాక కుడి పక్షంగా పత్రికలు నడిపాడు. తన పత్రికలకు ప్రకటనగా "A curtain raised on a general unwritten phase of life" అని రాసేవాడు. సెన్సేషనల్ ఆవిష్కరణలు, దోషాలు లేని జోలా వాస్తవికత ఉంటాయని చెప్పేవాడు. "బోహీమియన్"పై కంట్రోల్ సాధించి చిన్న వ్యంగ్య రచనలు ప్రచురించాలని నిర్ణయించాడు. మొదట్లో నిరాశగా ఉన్నా తర్వాత ఊపు అందుకొన్నది. ఈ ప్రయత్నం ఎందుకూ పనికి రాని చెత్త కథల్ని వండి వడ్డించి అయిదేళ్ళు బండీలాగి ఇక ఈ రకమైన నీచ సాహిత్యాన్ని ప్రోత్సహించకూడదనుకొన్నాడు. ఇంకానలభై రాలేదుకాని మరో బ్రేక్ డౌన్ భయ పెట్ట సాగింది. దీన్ని తప్పించుకొనే ప్రయత్నంలో రెండవ నవల "జెన్నీ గేరార్ట్" రాయటం మొదలు పెట్టాడు.

మొదటి నవల కారీలో లాగానే ఇందులోనూ దిగజార్చబడిన స్త్రీ కథ ఉంది. కాని దానికంటే నైపుణ్యంతో ఈ అమ్మాయిని చిత్రించాడు. రొంపిలో నుంచి స్వచ్ఛ వజ్రంగా బయటికొచ్చిన అమ్మాయిని చిత్రించాడు. తన స్వీయ వినాశకర అనుమానాలకు జవాబులు చెప్పే ప్రయత్నం చేశాడు. వెంటనే ఆరేళ్లలో ఆరు నవలలు రాసేశాడు "ఎ ట్రి ట్రైజ్ ఎట్ ఫార్టి"లో ఇంగ్లాండ్ జర్మని, ఇటలీలపై తన అభిప్రాయాలను రాశాడు. పద్ధతి శైలి మారినా డ్రైజరిజం మారలేదు. I don "t know what truth is, what beauty is, what love is, and what hope is. i don, "t believe any one absolutely and I don, "t doubt anyone absolutely. I think people

are both evil and well intentioned' అంటాడు డ్రైజర్. నిర్ణయాలలోని మూసపద్ధతిని. నల్లజాతి తెల్లజాతి అభిప్రాయాలు బద్ధక రాయుళ్ళు, నిలకడలేనితనం, విరుద్ధ ప్రవర్తన, భిన్నాభిప్రాయాలు, మనుషులు నైతికత మొదలైన వాటిని వ్యతిరేకించాడు.

తన యాత్రా పుస్తకం ప్రచురించేముందు చార్లెస్ టి.ఎర్బ్ అనే పెద్ద ధనవంతుడి జీవితాన్ని అధ్యనం చేయటం అతడు అరెస్ట్ అయి జైలు నుంచి విడుదలకాగానే అంతకన్నా ఎక్కువ ధనవంతుడవ్వటం, అనేకమంది భార్యలు విలాస జీవితంపై "ది జీనియస్" రాశాడు. "ట్రయాలజీ ఆఫ్ డిజైర్"లో డ్రై జర్-ఎర్బ్ పాత్రను కాపర్ వుడ్ మోడల్‌గా తీసుకొన్నాడు. ఇందులో ఒక భారీ పారిశ్రామికవేత్త ఉత్థాన పతనాలు అద్భుతంగా చూపాడు. "ది ఫైనాన్షి యర్", "ది టైటాన్", "ది స్టాయిక్" నవలలో కాపర్ వుడ్‌ను బలీయమైన మనిషిగా, అవతలివాడి డబ్బుతో ఆడుకొనేవాడిగా, వాటినే తన అధికారానికి మెట్లుగా ఎదిగిన వాడిగా చూపాడు. వాడిది "కోల్డ్ ఫోర్స్ విత్ క్విక్నేస్ ఆఫ్ బ్రెయిన్" అన్నాడు రచయిత. ఈ నవలాత్రయంలో డబ్బే ప్రధాన పాత్ర. విలువలకు విలువే లేదు. అయితే అమెరికా సాంఘిక మార్పుల నేపథ్యాన్ని చూపిన నవలలుగా ప్రసిద్ధి చెందాయి. "In Dreiser;s work dominance of financial capitalism became completely self --contained and remorselessly logical universe in itself, whose only goal was power, whose primary emotions were greed and cunning, whose main activity was to manipulate and exploit" అంటారు విమర్శకులు.

"ది జీనియస్"లో యూజీన్ విట్లా తన నిలకడలేని ఎమోషన్‌లకు బలి అవుతాడు. ఇందులో శారీరక ప్రేమే ఉన్నా, కోరిక వినాశ హేతువుగా చూపాడు. కనుక నైతిక బోధ ఇందులో చూపై నట్లే. కాని ప్యూరిటన్లు గొంతు పెంచారు. స్టువార్ట్ పి.షెర్మాన్ అనే బలీయమైన క్రిటిక్ వాస్తవ నవలకూ, డ్రైజరాసిన "నేచురలిస్టిక్" నవలలకు ఉన్న తేడాను వివరించాడు. అందులో "a representation based upon a theory of human conduct" అనేది మొదటిది అయితే రెండోది "a representation based upon a theory of animal behavior" అన్నాడు. మంత్రులు ఈ పుస్తకాన్ని వ్యతిరేకించారు. వెట్టన్ సొసైటీ దీన్ని అశ్లీల సాహిత్యమని దిగ జారుడుతనమని ఈసడించింది. పుస్తక విక్రేతలు స్టాకు పెట్టుకోటానికి అంగీకరించలేదు. చాలా లైబ్రరీలు జీనియస్ నవలను తమ స్టాక్ నుంచి తొలగించాయి. డ్రైజర్ రాసిన ఇతర రచనలను కూడా నిషేధించారు. దీనికి చాలాకోపం వచ్చింది డ్రైజర్‌కు. భావాలను అణచుకోలేక నాలుగు అంకాల నాటకం "ది హాండ్ ఆఫ్ ది పాటర్" రాశాడు. అదొక

నమ్మ శక్యం కాని రోగం కథ ఉన్న నాటకం. అంటే పాథలాజికల్ డ్రామా. దీన్ని అతనిమిత్రులే వ్యతిరేకించారు. గొడవలు కొట్లాటలు సాగాయి. మళ్ళీ వెనకడుగు వేసి మిస్టిజంతో రాశాడు. "ప్లేస్ ఆఫ్ నేచురల్ అండ్ సూపర్ నేచురల్" రాశాడు. మాయా మర్మాలు దెయ్యాలూ భూతాలూ అభూత కల్పనలతో మిర్చీ మసాలా దట్టించాడు. అతని అభిమానులే అవాక్కయ్యారు. వీటి జోలికి వెళ్ళవద్దన్నారు కాని డ్రైజర్ మరో పార్శ్వాన్ని గురించి అన్వేషించటం మొదలుపెట్టాడు.

చిన్నకథల సంపుటి ప్రచురించాక, మరో బృహత్ రచన ప్రారంభానికి ముందు అంతకు పూర్వం రాసిన వాటిని "హే రబ్ ఎ డబ్ డబ్" ప్రచురించాడు. ఇందులో ఎక్కువగా వ్యాసాలున్నాయి. కౌమార దశలోని భావజాలం ఇందులో చొప్పించాడు. దీన్నే తర్వాత శీర్షికను "ఏ బుక్ ఆఫ్ ది మిస్టరి అండ్ వండర్ ఆఫ్ లైఫ్"గా మార్చి తర్వాత ప్రచురించాడు. 1909 నుండి పెళ్ళాంతో విడిపోయి ఒంటరిగా బతుకుతున్నాడు. ఆమె అతనికి విడాకులు ఇవ్వటానికి ఒప్పుకోలేదు. 1942లో ఆమె చనిపోయాక ఒక దూరపు కజిన్ హెలెన్ పార్ర్స్ రిచర్డ్ సన్‌ను పెళ్లి చేసుకొన్నాడు. వీరి కాపురం 20 ఏళ్ళు నిలిచింది. వయసు యాభై మధ్యలో ఉండగా "యాన్ అమెరికన్ ట్రాజెడి" ప్రచురించాడు. వార్తాపత్రికలో వచ్చిన ఒక యదార్ధ నేర కథను గ్రహించి అన్ని హంగులూ అద్ది రాశాడు. అది సాధారణ హత్యకాదని తేల్చాడు. దీని తర్వాత డబ్బు, సాంఘిక విషయాలను ఆధారంగా రాశాడు. పెద్దగా క్లిక్ కాలేదు. యూరప్ వెళ్లి "డ్రైజర్ లుక్స్ ఎట్ రష్యా" అనే వివాదాస్పద కథనం రాశాడు.

ముసలితనం మీదపడే కొద్దీ ప్రిడిక్షన్‌లు చెప్పటం మొదలు పెట్టాడు. ఆరకిల్ జడ్జిమెంట్‌లు పలికేవాడు. రాజకీయ సలహాలిస్తాననేవాడు. ఇవన్నీ ఎవరూ ఆయన బతికి ఉండగా పట్టించుకోలేదు. స్పానిష్ లాయలిస్ట్‌లపై సవాలు చేశాడు. నాజీ జర్మని తన ప్రజల రక్షణకోసమే పని చేస్తోందదన్నాడు. ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్‌ను సమర్ధిస్తూ వ్యతిరేకిస్తూ ఉండేవాడు. ఓరియెంటల్ సంస్థలు మార్క్సిజం ఆర్ధికం కలిసి పని చేయాలనుకొన్నాడు. తన పాత భావాలు అప్పుడున్న అభ్యుదయ భావాల మధ్య ఎటూ తేల్చుకోలేక గిజ గిజ లాడాడు. "the un happy fate of humanity was pre -determined but that, never the less, mankind must learn to choose its destiny" అని చెప్పాడు. జబ్బుపడి ముసలివాడై సోదరభావానికి దగ్గరయ్యాడు.

తనను "ఈక్వి టిస్ట్"గా చెప్పుకొన్నాడు. కాని కమ్యూనిజం న్యాయం సమానత్వంలను పెంచుతుందని నమ్మాడు. 74 ఏళ్ళ వయసులో కమ్యూనిస్ట్ పార్టీ తీర్ధం పుచ్చుకొన్నాడు.

ఇది తెలివి తక్కువ పని అని చాలామంది అన్నారు. అతను సెయింట్ మాథ్యూను, కారల్ మార్క్సును సమ్మేళనం చేయటమేనన్నాడు. "ది బుల్వార్క్" అనే పెద్ద రచనలో మునిగాడు. అది తనతండ్రి జీవిత చిత్రణ. దీన్ని 1916లో ప్రకటించి 30 ఏళ్ళ తర్వాత పూర్తి చేశాడు. అతని మనోవ్యథ నెమ్మదిగా రోగంగా మారింది. ఉక్కు బాకులాంటి చూపుల్లో వాడి తగ్గింది. బలమైన శరీరం శిథిలమైంది. అనుకోకుండా మూత్రపిండ వ్యాధి మీదపడి, 28-12-1945లో 74వ ఏట డ్రైజర్ మరణించాడు.

డ్రైజర్ను "రైటర్స్ రైటర్"గా దాదాపు అందరూ అంగీకరించారు. అతని రచనలు దీర్ఘం, కంగాళీ, చెత్త, అనుకరణ అని కొద్దిమంది అనుకొన్నా అతడు ప్రతిదీ "shakable determination"తో రాశాడని చాలామంది అభిప్రాయం. ఆలోచనాపరుడిగా డ్రైజర్తనకు తానే ఒక సమస్య అయ్యాడు. అతని బుర్ర స్కూలు పిల్లాడి ఫిలాసఫీ. ఫ్రీవిల్ను ఫాటలిజంను నమ్మాడు. మనిషిలోని సహజ మంచితనానికి పెద్ద పీటవేశాడు. ప్రతిభ లేకపోవటం అతనికి ఇబ్బందిగా మారింది. అతనికంటే గొప్పగా రాసినా డ్రైజర్ స్థాయిని ఎవరూ అందుకోలేక పోయారు. దీనికి కారణం "his desperate earnestness and lifelong war with timidity and prudery that won them the prerogative to write honestly and without fear" అన్నాడు లూయీ అంటర్ మేయర్.

"to observe a certain type of crime in the United States that proved very common. It seemed to spring from the fact that almost every young person was possessed of an ingrown ambition to be somebody financially and socially". "Fortune hunting became a disease". "with the frequent result of a peculiarly American kind of crime, a form of "murder for money", when "the young ambitious lover of some poorer girl" found "a more attractive girl with money or position" but could not get rid of the first girl, usually because of pregnancy.(1) అని అమెరికాలో యువతకు నేరాలపై ఉన్న అభినివేశాన్ని చెప్పాడు. అతని సాహితీ ప్రభావం అమోఘం అంటూ షేర్ వుడ్ ఆండర్సన్ "Heavy, heavy, the feet of Theodore. How easy to pick some of his books to pieces, to laugh at him for so much of his heavy prose ... [T]he fellows of the ink-pots, the prose writers in America who follow Dreiser, will have much to do that he has

never done. Their road is long but, because of him, those who follow will never have to face the road through the wilderness of Puritan denial, the road that Dreiser faced alone.

తన సమకాలిక రచయితలకంటే ఘనమైన రచయిత అని, అతను చిత్రించిన ప్రపంచానికన్నా విశాలమైనవాడనీ అంటారు. "among the American giants, one of the very few American giants we have had" అన్నారు. "he is a great artist, and that no other American of his generation left so wide and handsome a mark upon the national letters. American writing, before and after his time, differed almost as much as biology before and after Darwin. He was a man of large originality, of profound feeling, and of unshakable courage. All of us who write are better off because he lived, worked, and hoped". Dreiser' great theme was the tremendous tensions that can arise between ambition, desire, and social mores.[24]

అన్నాడు సమకాలీన రచయిత మెంకేన్..10 ఫిక్షన్, 13 నాన్ ఫిక్షన్, 2 నాటకాలు రాశాడు డ్రైజర్. "a pioneer of unvarnished truth-telling in modern literature, is due almost entirely to his achievements as a novelist. అన్నది ఎన్సైక్లో పీడియా బ్రిటానిక. అతని పాత్రలు ఆత్మ అన్వేషణలో కొట్టు మిట్టాడుతాయి. అతని రచనలు "delineate the tragic aspects of the American pursuit of worldly success. Sister Carrie and An American Tragedy are certainly enduring works of literature that display a deep understanding of the American experience around the turn of the century, with its expansive desires and pervasive disillusionments.❋



## 54. అమెరికాలో తన తరంలో అత్యంత సృజనశీలిగా పేరొందిన స్టీఫెన్ క్రేన్ (1871-1900)

యుద్ధంలో సైన్యం చేసిన సాహసాన్ని "ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్" అనే అమరమైన నవలగా 23వ ఏట అసలు యుద్ధభూమిని చూడనే చూడకుండా రాసిన అమెరికన్ యువ రచయిత స్టీఫెన్ క్రేన్. దీన్ని "అట్లాంటిక్ మంత్లి" పత్రిక "సాహిత్యంలో కొత్త ఫాషన్ (వైఖరి) ప్రవేశ పెట్టాడు క్రేన్" అని గొప్పగా రాసింది. ప్రముఖ రచయిత హెచ్ జి వెల్స్ "కొత్త శకానికి ఇది నూతన ఆవిష్కారం. పాత విదానాలన్నిటిని వెనక్కినెట్టేసిన నవల" అన్నాడు. ఇందులోని తీవ్రత అంతా రచయిత చర్యా రాహిత్యమే. తన సృజన సామర్థ్యాన్ని అతి వేగవంతంగా ఖర్చు చేసి అపూర్వ అనన్య సామాన్య రచనలు చేసి 30 ఏళ్ళకే పరమపదించాడు క్రేన్.

తలిదండ్రులైన జోనాధన్ టౌన్లిక్రేన్, స్టీఫెన్ క్రేన్‌ల 14మంది సంతానంలో చివరివాడు స్టీఫెన్ క్రేన్. అమెరికాలోని న్యూయార్క్ లోన్యు జెర్సీలో 1-11-1871న జన్మించాడు. తొమ్మిదవ ఏట మెథడిస్ట్ మినిస్టర్ అయిన తండ్రి చనిపోయాడు. తల్లి కూడా అంతే పవిత్రంగా జీవిస్తూ పిల్లల బాధ్యతా తీసుకొంది. మతసంబంధమైన వ్యాసాలూ రాసి ప్రచురించేది. తల్లికున్న ఈ సుగుణం కొడుకు క్రేన్‌కు అబ్బింది. టీనేజ్‌లో కుటుంబం యాస్బరి పార్క్‌లో ఉండగా సంఘంలోని గుసగుసలు, వేసవి యాత్రికుల విషయాలు గ్రహించేవాడు. సిరాక్యూజ్ యూనివర్సిటి లాఫెటీ కాలేజిలో విద్యార్ధిగా చేరి, కాలేజి

రిపోర్టర్‌గా "ది న్యూ యార్క్ ట్రిబ్యూన్"కు పనిచేసి చిలక్కొట్టుడు డబ్బు సంపాదించి ఖర్చులకు వాడుకొనేవాడు. పెద్దగా చదువుపై శ్రద్ధ ఉండేది కాదు కాని సంతృప్తికరమైన విద్య అబ్బింది. పాఠ్య పుస్తకాలను అలా అలా తిరగేసేవాడు కాని అందులోని విషయాలన్నీ యిట్టె గ్రహించేసేవాడు. పొడవుగా సన్నగా అసలైన కొంగ అంటే క్రేన్‌లాగా ఉండేవాడు. నీలి కాంతివంతమైన కళ్ళు, క్రీడాకారుడిగా కనిపించేవాడు. వాస్తవంగా మంచి ఎత్లేట్. బేస్ బాల్ టీం కెప్టెన్ క్రేన్.

18ఏళ్ళకే తల్లి చనిపోయింది. కుటుంబం చాలాపెద్దది. కనుక ఒంటరిగా జీవించాలనుకొన్నాడు. తనదారి తాను చూసుకోవటం మంచిదనే నిర్ణయానికి వచ్చాడు. యువ రచయితలూ కళాకారుల బృందంలో చేరి న్యుయార్క్‌లోని దిగువ తూర్పు ప్రాంతంలో లాడ్జింగ్‌లలో అద్దెకు ఉంటూ అయిదేళ్ళు గడిపాడు. అప్పుడప్పుడు స్కెచ్‌లు రాస్తూ, జర్నలిజంలో ప్రవేశించి ఆకలితో చావకుండా బతికాడు. 21వ ఏట ఒక నవల రాస్తే ఏ పబ్లిషర్ కూడా ప్రచురించటానికి ముందుకు రాలేదు. అదే "మాగ్గీ –ఎ గర్ల్ ఆఫ్ ది స్ట్రీట్స్" నవల. దీన్ని ప్రీస్ట్ లైన తలిదండ్రుల కొడుకైన క్రేన్ రాశాడు. అది ఒక వ్యభిచారి అయిన స్త్రీ వృత్తాంతం. బురదలో పుట్టి వికసించిన పుష్పం ఆమె. మురికివాడలలోని ముడి హింసను, ఆ మనుషులు మాట్లాడే బజారు భాషలో రాశాడు. చివరికి ఎవడో ఒక బకరా పబ్లిషర్ అచ్చు వేయటానికి రెండు షరతులపై ఒప్పుకొన్నాడు. పుస్తక ముద్రణ ఖర్చు క్రేన్ పెట్టుకోవాలి. పబ్లిషర్ పేరు పుస్తకంలో ఎక్కడా కనిపించ కూడదు. తన సోదరుల దగ్గర అప్పు చేసి డబ్బు సమకూర్చుకొన్నాడు. తీరా పుస్తకం బయటికి వస్తే జర్నలిస్ట్‌గా ఉన్న తన పరువు పోతుందేమోనని భయపడ్డాడు. "జాన్ స్టన్ స్మిత్" అనే మారు పేరుతో పుస్తకం అచ్చు వేయించాడు. చచ్చీ చెడి వందకాపీలు అమ్ముడయాయి. మిగిలిన వాటిని కాల్చి గదిని వెచ్చ చేసుకొనేవాడు. అంతకు ముందే సిస్టర్ కారీ నవలతో డ్రైజర్ నేచురలిస్ట్ నవలకు దారి చూపాడు. దాని ప్రభావం క్రేన్ రాసిన ఈ నవలపై ఉందని కొందరు విమర్శకులన్నారు. కాని హామ్లిన్ గార్లాండ్ ఈ నవలను బాగా మెచ్చాడు. విలియం డీన్ హోవెల్స్ "as present in the working out of this poor girl;s squalid romance as any classic fable" అని కీర్తించాడు. కథ కంటే కూడా గొప్పగా మురికి కూపంలో దరిద్రంతో అలమటించిన ఒక పేద పిల్ల ఏ ఇతర క్లాసిక్ కథ కంటే గొప్పగా ఉంది అన్నాడు.

పేపర్లు బాగా ప్రోత్సహించాయి. దీనితో రెండవ నవలకు శ్రీకారం చుట్టాడు. అదే ప్రపంచ ప్రసిద్ధి చెందిననవల "ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్" ఇంకా ఇరవై నాలుగు ఏళ్ళు రాకుండానే 1895లో దీన్ని క్రేన్ ప్రచురించాడు. ఈ నవలకు నేపథ్యం అమెరికన్

సివిల్ వార్. అది అటామిక్ యుగం ముందు జరిగే ఏ యుద్ధమైనా కావచ్చు. అన్నీ అలాగే జరుగుతాయి. తికమక పెట్టె ఆ పరిస్థితులలో ఏ సైన్యమైనా అలానే ప్రవర్తిస్తుంది. ఆనాటి ప్రజలు పిరికితనం, సమయానికి తగినట్లు మొండి ధైర్యంతో, భయాలను సిల్లీ జోకులతో కప్పి పుచ్చుకొంటూ, ప్రగల్భాలు, ఆత్మస్తుతి డాబులతో ఉండేవారు. కథను ఒకదాని తర్వాత ఒకటిగా వచ్చే ఫ్లాష్‌లతో మనుషులను అజ్ఞాతంలో ఉంచుతూ మహావేగంగా నడిపించి రాశాడు. కొద్ది వీరత్వం, యుద్ధ మహా భీభత్సం కళ్ళకు కట్టించాడు. ఇందులోని సైన్యం సామాన్య రైతులు, కమ్మరివారు, గుమాస్తాలు, కంచర గాడిదలను తోలేవారు. వీరిలో ఎవరికి యుద్ధం ఎలా జరుగుతుందో అపాయం ఎలా తప్పించుకోవాలో ఏమాత్రం తెలియనివాళ్ళు. అయినా యుద్ధం చేస్తున్నారు. క్రేన్ ఈస్తటిక్ అన్వేషణ భయ భ్రాంతులకు అధీనంలో ఉంది. అందుకే అన్ని యుద్ధ రచనలు వేరు వేరుగానే ఉంటాయి. ఇందులోని సంఘర్షణను అనేక స్థాయిలలో వర్ణించాడు క్రేన్. రక్తపాతం అడుగున సౌందర్యం కనిపిస్తుంది. చనిపోయే సైనికుడు తన గాయాలను బాధను లెక్క చేయకుండా ముందుకు సాగిపోతాడు. ఆకాశంలో సూర్యుడు ఎర్రగా పొరలాగా ఉన్నాడని వర్ణించాడు. యుద్ధ భూమిని కవిత్వీకరించి మన తిక్కన మహా కవిలాగా తీర్చి దిద్దాడు. ఆ వర్ణ క్రేన్ మాటల్లో “In the gloom before the break of day their uniforms glowed with a deep purple hue. From across the river the red eyes were still peering. In the eastern sky there was a yellow patch like a rug laid for the feet of the coming sun, and against,black and pattern like, loomed the gigantic figure of the colonel on a gigantic horse”

ఈ నవలను ఎందరు ఎన్ని విధాల మెచ్చుకొన్నా లాభాల వర్షం కురిపించలేక పోయింది. ఒక వంద డాలర్లే చేతిలో పడ్డాయి. కాని ఈ నవలతో స్టీఫెన్ క్రేన్ అమెరికన్ సెలిబ్రిటి అయ్యాడు. ఆయనకు మెక్సికో వెళ్ళే అవకాశమిచ్చారు. 1896లో గ్రీసు టర్కీలు యుద్ధానికి దిగినప్పుడు న్యూయార్క్ జర్నల్ ఎడిటర్ ఈ యుద్ధ వార్తలను రాయటానికి సర్వ సమర్థుడు క్రేన్ ఒక్కడే అని భావించి బాధ్యతలను అప్పగించాడు. ఆనందంగా క్రేన్ వెళ్ళాడు. అక్కడ అనేక మోసాలలో అభియోగాలను ఎదుర్కొన్నాడు. అతనికిష్టమైన ఒక అమ్మాయి బజారు బిచ్చగత్తె అని అరెస్ట్ చేశారు. క్రేన్ ఆమెను రక్షించబోతే పోలీసులు వీరి గదిలో మత్తు పదార్థాలు దొరికాయని అభియోగం మోపారు. వేరొకమ్మాయి అతన్ని బ్లాక్ మెయిల్ చేసి ఆతను తన దగ్గర డబ్బు అప్పు తీసుకోన్నాడని డబ్బు వాపసు ఇప్పించమని కోర్టు కెక్కింది. 26ఏళ్ళ వయసులో ఇలాంటివి ఎన్నో

ఎన్నెన్నో.

గ్రీస్ నుంచి తిరిగి వచ్చాక దక్షిణం వైపు వెళ్ళమని ఆజ్ఞ జారీ అయింది. క్యూబా తిరుగుబాటులలో చిక్కుకు పోయింది. స్పానిష్ అమెరికన్ యుద్ధం రావటానికి ఇంకా రెండేళ్ళు ఉంది. ఐలాండ్ ప్రజల క్యూబా విముక్తి నినాదం అమెరిక ప్రజల సానుభూతి పొందింది. పేపర్ దిగ్గజం హార్స్ట్ పత్రికలన్నీ యుద్ధం రావాలనే కోరాయి, ప్రచారమూ చేశాయి. చట్ట వ్యతిరేక ఆయుధాలు ప్రబలంగా ఉన్నాయి. ఈ స్థితిలో క్రేన్‌ను అక్కడి యుద్ధ వార్తల్ని రాయటానికి పంపారు. అతను వెళ్ళే షిప్ బ్రద్దలయింది. ప్రయాణీకులందరూ క్షేమం. క్రేన్‌తోబాటు మరో ముగ్గురు ఒక నాటు ఓపెన్ బోటు ఎక్కి ప్రయాణించారు. చాలా రోజులు ప్రయాణం సాగింది. ఒక ఏడాది తర్వాత ఇదంతా ఒక గొప్ప ఎపిసోడ్‌గా "దిఫైనెస్ట్ షార్ట్ స్టోరి ఇన్ ఇంగ్లిష్"గా ప్రచురితమైంది. అదే "ది ఓపెన్ బోట్ అండ్ అదర్ టేల్స్ఆఫ్ అడ్వెంచర్". ఈ కథను అతి సహజంగా నిదానంగా ప్రారంభించి రాశాడు. అందులోని ప్రారంభ వాక్యాలే అందర్నీ ఆకర్షించాయి. క్రేన్ మాటల్లోనే "None of them knew the color of the sky" నుంచి చివరిదాకా నాన్‌స్టాప్‌గా చదివించింది. ప్రమాదం షాక్, దాదాపు ట్రాజెడీగా మారిన ఉదంతంతో క్రేన్ ఆరోగ్యాన్ని గూర్చి పట్టించుకోలేదు. దీనివలన యెడ తెగని దగ్గు పట్టుకొన్నది. ఎత్లెటిక్ శరీరం కుంగిపోయింది. 27వ ఏట ఇంగ్లాండ్‌కు కోరా హౌరాత్ స్టెవార్ట్‌తో వెళ్ళాడు.

ఇంతకీ ఎవరీ కోరా? ఫ్లోరిడాలో వేశ్య వాటికను నడిపేది. ఆమెను క్రేన్‌ను కలిశాడు. న్యు ఇంగ్లాండ్‌లో పుట్టి ఇంగ్లీష్ కెప్టెన్‌ను పెళ్ళాడి, అనేక మగాళ్ళకు ఆడదై బతికింది. క్రేన్ కన్నా పెద్ద వయసు అందం ఆనందం బె ఫరవా ఉన్న కోరా ఔరా అన్నట్లు క్రేన్ ప్రేమ క్రేన్‌కు తగులు కొన్నది. కెప్టెన్ నుంచి విడాకులు తీసుకోకపోయినా లండన్‌లో క్రేన్‌ను పెళ్లి చేసుకొని అతని సంరక్షణ బాధ్యత తీసుకొన్నది. వేడి ప్రదేశానికి అతడు వెడితే క్షేమమని డాక్టర్లు సూచించగానే క్రేన్‌ను తీసుకొని గ్రీస్ వెళ్ళి, అతనికి సేవలు చేసి మళ్ళీ ఆరోగ్యవంతుడిని చేసే ప్రయత్నం చేసింది. కొంచెం ఆరోగ్యం కుదుట బడగానే ఇంగ్లాండ్ చేరి సర్రేలో స్థిరపడ్డారు. వీళ్ళ పెళ్లి గుట్టు రట్టు అవుతుందనే భయంతో ఉండగా జోసెఫ్ కాన్రాడ్ క్రేన్‌కు బాసటగా నిలిచాడు. దీనితో ఇతర సాహితీపరులతో సాన్నిహిత్యం పెంచుకొన్నాడు. గాసిప్ ఉచ్చు కోరాకు కాక క్రేన్‌కు తగులు కొన్నది. వ్యభిచారం దాన్ని నడిపే వారిపైనా క్రేన్ సానుభూతిగా ఉండటంతో అతనే ఆ వ్యాపారం చేస్తున్నాడని పుకారు రేగింది. పుకార్లు మరీ ప్రమాదకరమైనాయి. మనిషి నీరసించి, ఆరోగ్యం క్షీణించి జబ్బుపడ్డ కవిగా కనిపించాడు. క్రేన్ చివరి ఫోటో

రిల్కేను గుర్తు చేస్తుంది. అప్పుడప్పుడు తూలి పడిపోయేవాడు. బహుశా మత్తు మందుకు బానిసయ్యాడేమోనని అనుమానించారు. అతని గదిలో మాదక ద్రవ్యాలు కనిపించాయి. అప్పటికే వాటికి పూర్తిగా బానిసై పోయాడు. స్పానిష్ అమెరికన్ యుద్ధం ప్రారంభమవగానే అమెరికా తిరిగి వచ్చేయాలనుకొన్నాడు. క్యూబా నుండి రాసి పంపే అనుమతి పొందాడు. టి.బి.అనుకొన్నారు కాని తేలలేదు. ససెక్స్‌లో ఉన్న బ్రేడేలో ఒక ఇల్లు చూసి అక్కడకు క్రేన్‌ను తీసుకు వెళ్ళింది కోరా. అక్కడ కాలంతో పోరాటం సాగించాడు. ప్రపంచ గొప్ప యుద్ధాల గురించి విస్తృత వర్ణనాత్మకంగా లిప్పిన్ కాట్స్ మేగజైన్‌కు రాశాడు. ఇది అతని మరణానంతరం ప్రచురితమైంది. హార్పర్స్ మంత్లీకి విలోం విల్ స్టోరీస్ రాశాడు. ఆడపిల్లల కోసం ఇలాంటి సీరియలే రాశాడు. రక్తపోటు రాత పనిని మందగింప జేసింది. ఆరోగ్యం కోసం జర్మనిలోని బ్లాక్ ఫారెస్ట్‌లో ఉన్న శానిటోరియంలో 29వ ఏట యేడు నెలల కాలంలో చేరాడు. 5-6-1900లో చనిపోయాడు క్రేన్. అతని భౌతికకాయాన్ని అమెరికా చేర్చి న్యూజెర్సీలోని ఎలిజబెత్‌లో ఖననం చేశారు.

వచన రచనతో బాటు క్రేన్ చాలా ప్రాముఖ్యమైన కవితలూ రాశాడు. రెడ్ బాడ్జ్ ప్రచురించిన సమయంలోనే వీటినీ “ది బ్లాక్ రైడర్స్ అండ్ ఆదర్ లైన్స్” పేర అచ్చు వేశాడు. చనిపోవటానికి రెండేళ్ళ ముందు “వార్ ఈజ్ కైండ్” అనే రెండవ కవితా సంపుటి వెలువరించాడు. రెండిటిలోనూ సెంటిమెంట్ ఉన్నా అతని తప్పులకు అద్దం పట్టాయి. చావును తప్పించుకోలేమని గ్రహించాడు. విధానం తీవ్రంగానే ఉన్నా స్వభావం తెలుస్తుంది.

“In the desert --I was a creature, naked and bestial --who, squatting upon the ground --held his heart in his hands --I said, "is it good, friend? -It is bitter bitter" "he answered --but I like it --because it is bitter --and because it is my heart” ఈ కవిత మొదటి సంపుటిలోనిది. రెండవ సంపుటి వార్ ఈజ్ కైండ్‌లో ఒకటి చూద్దాం-

“have you ever made a just man?- "oh ! I have made three "answered God - "but two of them are dead --and the third --listen listen --and you will hear the thud of his defeat” అన్ని కవితలూ ఇలా ఉండవు. కొన్నిటిలో నిరసన మరికొన్నిటిలో నిరాశా కొన్నిట్లో కోపోద్రిక్తత నిస్పృహ కనిపిస్తాయి. అయితే ఇందులో దేన్నీ కాదన లేము. క్రేన్ చనిపోయిన పాతిక ఏళ్ళకు కానీ ఏ పబ్లిషర్ కూడా అతని సమగ్ర సాహిత్యాన్ని ముద్రించటానికి ముందుకు రాలేదు.

"కలేక్టేడ్ పోయెమ్స్" రావటానికి మరో అయిదేళ్ళు ఆగాల్సి వచ్చింది. క్రేన్ గురించి "--all inside --he had no surface" అన్నాడు జోసెఫ్ కాన్రాడ్1952లో "స్టీఫెన్ క్రేన్-ఆమ్నిబస్"లో. హెన్రి డేవిడ్ థోరో, హెమింగ్ వేల మధ్య ఉన్న అమెరికన్ వచన రచయితలలో ఇప్పుడు హెమింగ్ వే, ఫాక్నర్ లలాగా తన స్వంత శైలిని నిర్మించుకొని ప్రతి అంగుళాన్నీ ప్రభావితం చేశాడు క్రేన్" అన్నాడు ఆల్ఫ్రెడ్ కజిన్. అమెరికా దేశంలోని అగ్ని అతని వచనంలో ఉంది. అతని వాక్యాలు ఉరుములు సృష్టిస్తాయి. మనిషి భూమిని బద్దలు కొట్టినట్లు ఉంటాయి. నేచరిజం గురించి ఆలోచిస్తూ కూర్చోకుండానే నేచరిస్టిక్ రచయిత అనిపించాడు. ఒక్కమాటలో "Crane made an image of a new and clear cut world. The actual world in which he lived was not only too much with him but too much for him" అంటాడు లూయీ అంటర్ మేయర్.

స్టీఫెన్ క్రేన్ రాసిన ఫిక్షన్ అంతా నేచురలిజం అమెరికన్ రియలిజం, ఇంప్రెషనిజం. లేక ఈ మూడిటి మిశ్రమం. రచనలో నేచురిస్టిక్ ఐడియాలు ఇంప్రెషనిజ విధానాలు ఉంటాయి. తన జీవిత చరిత్ర రాసుకొనే ఆలోచన ఉందా అని క్రేన్ ను అడిగితే "dare not say that I am honest. I merely say that I am as nearly honest as a weak mental machinery will allow. "[167]" అని చెప్పాడు. H. G. Wells remarked upon "the great influence of the studio' on Crane' s work, quoting a passage from The Red Badge of Courage as an example: "At nightfall the column broke into regimental pieces, and the fragments went into the fields to camp. Tents sprang up like strange plants. Camp fires, like red, peculiar blossoms, dotted the night……. From this little distance the many fires, with the black forms of men passing to and fro before the crimson rays, made weird and satanic effects. "[169] Although no direct evidence exists that Crane formulated a precise theory of his craft, he vehemently rejectedsentimentality, asserting that "a story should be logical in its action and faithful to character. Truth to life itself was the only test, the greatest artists were the simplest, and simple because they were true" [170]

30ఏళ్ళ జీవితంలో క్రేన్ అయిదు నవలలు, రెండు కవితా సంపుటాలు, మూడు

చిన్నకథల సంపుటాలు రెండు యుద్ధ కథా సంపుటాలు రాసి ప్రచురించాడు. ఇవికాక అనేక వార్తా కథనాలు రాశాడు. వీటిలో "రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్"ను అమెరికన్ క్లాసిక్ అంటారు. చనిపోయే ముందు క్రేన్ అతని సమకాలిక రచయితలలో అగ్రగామిగా ఉన్నాడు. 1920నాటికి క్రేన్‌ను అతని రచనలనూ జనం మర్చేపోయారు. 1923లో థామస్ బీర్, క్రేన్ జీవిత చరిత్ర రాశాకే మళ్ళీ వెలుగులోకి వచ్చాడు. ఇప్పుడు క్రేన్‌ను 1890 నాటిఅత్యంత ప్రతిభ ఉన్న సృజనాత్మక రచయితలలో ఒకడుగా గుర్తించారు. "ఫైనేస్ట్ క్రియేటివ్ స్పిరిట్ ఆఫ్ హిజ్ టైం" అంటున్నారిప్పుడు. హెమింగ్ వే మొదలైన మోడర్నిస్ట్‌లకు క్రేన్ గొప్ప ప్రేరణ అయ్యాడు. క్రేన్ ఆకస్మిక మరణం సాహిత్యానికి గొప్ప ఆశనిపాతం అన్నారు. In 1936, Hemingway wrote in The Green Hills of Africa that "The good writers are Henry James, Stephen Crane, and Mark Twain. That 's not the order they' re good in. There is no order for good writers. "[243] Crane' s poetry is thought to have been a precursor to the Imagist movement, [244] and his short fiction has also influenced American literature. "The Open Boat", "The Blue Hotel", The Monster and "The Bride Comes to Yellow Sky" are generally considered by critics to be examples of Crane' s best work.[245]

A river, amber-tinted in the shadow of its banks, purled at the army' feet; and at night, when the stream had become of a sorrowful blackness, one could see across it the red, eyelike gleam of hostile camp-fires set in the low brows of distant hills". ❁



## 55. సర్వ శాస్త్ర పారంగతుడైన బ్రిటిష్ మేధావి తత్వవేత్త , అమెరికా పౌరుడు నోబెల్ లారియట్ -బెర్ట్రాండ్ రసెల్ (1872-1970)

మనదగ్గర ఏదైనా విశేషం ఉందా అని కనుక్కోవటమే జ్ఞానం అంటాడు రసెల్. గణిత శాస్త్ర వేదాంతి లేక వేదాంత గణిత శాస్త్రజ్ఞుడు, చరిత్రకు కొత్త అర్ధం చెప్పినవాడు, అనుమానాస్పదుడు, మహా జ్ఞాపక శక్తి ఉన్నవాడు బెర్ట్రాండ్ రసెల్. దేనినైనా వెంటనే ఒప్పేసుకోవటం, మామూలు ఆలోచానా విధానం నచ్చనివాడు. అంతమాత్రం చేత సర్వశుద్ధుడు కాదు. కాని తనలోనే విరుద్ధ భావాలున్నవాడు. గందర గోళ ప్రపంచంలో వివాదాస్పద వ్యక్తి, తన జీవితాన్నే తాను చక్కదిద్దుకోలేని వాడు. ప్రతిదీ స్థిరమైన పద్ధతిలో ఉండాలనుకోనేవాడు. నలుగురు పిల్లలకు తండ్రి, బాల్య శిక్షణలో ప్రతిభా సంపన్నుడు, ఒక అభివృద్ధికరమైన స్కూల్‌ను స్థాపించి చేతులు కాల్చుకొన్న విఫలుడు. శృంగారం తెలియని సిద్ధాంతి. అయినా పరిపూర్ణ వివాహం గురించి శాస్త్రీయంగా రాసిన వాడు, నిత్య సంచారి. స్థిరంగా ఒక చోట లేనివాడు, అపజయం పొందిన భర్త, మూడు సార్లు విడాకులు పొందినవాడు. 80 ఏళ్ళు దాటాక నాలుగో భార్యను పొందినవాడు రసెల్.

పుట్టినప్పటి నుండే వివాదాస్పద వ్యక్తి. మూడవ ఏటనే రస్సెల్ తండ్రి తన కోడుకును అగ్నాస్టిక్‌గా అంటే దైవభక్తి లేనివాడిగా పెంచమని కోరితే బ్రిటిష్ రాజ్యం రసెల్‌ను వార్డ్‌గా రక్షణ బాధ్యత స్వీకరించింది. 18-5-1872న ఇంగ్లాండ్‌లోని మన్మత్ షైర్ లోని అందమైన ప్రదేశమైన టింటెర్న్‌కు సమీపంలో ఉన్న ట్రెల్లెక్‌లో జన్మించాడు. బెర్ట్రాండ్ ఆర్థర్ విలియం రసెల్ అసలు పేరు. 59వ ఏట రసెల్ "మూడవ ఎరల్" అయ్యాడు. 1832లో ఈ ముసలాయన విప్లవాత్మకమైన సంస్కరణ బిల్లును ప్రవేశ పెట్టాడు. అందులో లిబరిజంను వారసత్వంగా పొందిన యువత జీవితాంతం కొనసాగాలని కోరాడు. బాల్యంలో ఎపిస్కోపలియన్, ప్రెస్ బెటేరేనియన్ చర్చిలలో వారం విడిచి వారం ఆదివారాలలో వెడుతూ చర్చికి వెళ్ళని వాడిగా గుర్తింపబడి 11వ ఏట డార్విన్ శిష్యుడని పించాడు. ఈ వయసులోనే తన మొదటి తిరుగుబాటు

బావుటా ఎగుర వేశాడు. యూక్లిడ్ నిర్వచనాలను అంగీకరించటానికి సిద్ధపడ్డాడు. కాని అందులోని సిద్ధాంతాలలో స్వీయ స్పష్టత లేదని విభేదించాడు.

18ఏళ్ళు వచ్చేదాకా రసెల్‌ను ఇంటి వద్దే జర్మన్ గవర్నేస్‌లు, ఇంగ్లాండ్ ట్యూటర్లు చదువు చెప్పారు. గణితంలో అతనికున్న మేధస్సుకు వాళ్ళు ఆశ్చర్య పోయేవారు. కేంబ్రిడ్జిలో చేరి గ్రాడ్యుయేట్ అయి పారిస్ వెళ్లి, బ్రిటిష్ ఎంబసీకి అనుబంధంగా ఉన్నాడు. జర్మనిలోని బెర్లిన్ చేరి ఎకనామిక్స్ చదివాడు. 22వయసులో ఫిలడెల్ఫియాలోని క్వేకర్ రచయిత లోగాన్ పియర్సాల్ స్మిత్ సోదరి అయిన ఆలీస్ విటాల్పియర్సల్ స్మిత్ కు చేరువై పెళ్లి చేసుకొన్నాడు. అర్ధమాటిక్, ఫిలాసఫీ అధ్యయనంలో మునిగి, ఫెమినిజం, సోషలిజంలను కూడా నేర్చాడు. భార్యా భర్త లిద్దరూ ఫెబియన్ సొసైటీ సభ్యులై జార్జి బెర్నార్డ్ షా సిడ్నీ, బీట్రిస్ వెబ్ లతో సాన్నిహిత్యంగా మెలిగారు. 29ఏళ్ళ రసెల్ నల్ల మీసంతో మేధావిగా కళ్ళలో కాంతితో కనిపించేవాడు. ఏది రాసినా మాట్లాడినా ఖచ్చితంగా సూటిగా ఉండేది. నల్లజుట్టు, నాడులు పైకి కనిపించే చేతులు, బుల్లిగడ్డంతో అందగాడని పించేవాడు. నైతికత విషయంలో ప్యూరిటన్. అలవాట్లలో సన్యాసిగా ఉండేవాడు. ఉన్నవాటిని సద్వినియోగం చేసుకోవాలనే తత్త్వం. మేధాపరంగా చాలా సాహసి. విగ్రహారాధనకు వ్యతిరేకి. మత సాంఘిక సంప్రదాయాలకు, సెంటిమెంట్‌లకు వ్యతిరేకి. ఆలోచన క్రమానినే (ఆర్డర్ ఆఫ్ థాట్) నమ్మేవాడు. లాజిక్, సైన్స్ లలో వస్తు క్రమాన్నే (ఆర్డర్ ఆఫ్ థింగ్స్) నమ్మాడు రసెల్. ప్యూరిటన్ల రూపు రేఖలు మరో రెండేళ్లలో మారిపోతున్నాయి. బీట్రిస్ వెబ్ మాటల్లో "రసెల్ తనలోకాని ఇంకెవరి లోనైనా కానీ చిన్న తప్పును కూడా సహించేవాడు కాదు. మనుషుల స్థాయిని బట్టి తప్పులు ఉంటాయనేవాడు. సంపూర్ణతలో ఏ లోపమున్నా సహించేవాడు కాదు. భార్య అయినా లోకమైనా అదే పద్ధతిలో ఉండేవాడు. మానవ అభ్యుదయానికి ఆధారం సైన్స్ అని నమ్మాడు" 'సెలక్టెడ్ పేపర్స్'కు ముందుమాట రాస్తూ "యవ్వన వాంఛ నన్ను మానవ సమాజ శ్రేయస్సును ఆలోచింప జేసింది. గణితం నుండి సైన్స్‌కు చేరి ఒంటరిగా పగటికలలతో గడిపాను. గలీలియో, డేస్కార్టేలు కూడా వారి యవ్వనంలో ఇలాగే ఉండేవారేమో. ప్యూర్ మాదమేటిక్స్‌లో రాణించాలంటే సైన్స్‌లోనూ ప్రతిభ సాధించాలని పించింది. కనుక సైన్స్ నాకు బాగా దగ్గరైంది. ఇదే సమయంలో నాబుద్ధి ఫిలాసఫీ వైపు పరిగెత్తింది. నైతికతకో వేదాంతానికో కాదు "by the wish to discover whether we possess anything that can be called knowledge".

కనుక జ్ఞాన సముపార్జన కోసమే రసెల్ గవేషణ సాగించాడు. తరువాత తుఫాను మధ్య ఉన్న భావన కలిగించాడు. దీనితో రాజ్యానికి శత్రువై, అనైతికులలో ఒకడు అనిపించుకొన్నాడు. చివరికి అధికారిక దార్శనికుడు అయ్యాడు కాని పిడివాది అని పించుకోలేదు. 24వ ఏట మొదటి పుస్తకం "జర్మని సాంఘిక ప్రజాస్వామ్యం"పై

విశ్లేషణాత్మక రచన చేసి ప్రచురించాడు. తరువాత రేఖాగణితం, లీబ్నిజ్ ఫిలాసఫీ లపైనా గణితం, తర్కం ఒకటే అనే సిద్ధాంత వ్యాసం రచించాడు. 38వయసులో ఏ.యెన్.వైట్ హెడ్‌తో కలిసి "ప్రిన్సిపియా మాధమేటికా" వ్రాత ప్రతి తయారు చేశాడు. ఇరవై ఏళ్ళగా తనను బాధిస్తున్న సమస్యకు ఇది పరిష్కారం అన్నాడు దీన్ని. అయితే అతని అసలు సమస్యకు ఇంకా పరిష్కారం లభించలేదు. అయితేనేం ఫిలాసఫీలో కొత్త విధానం గణితంలో నూతన శాఖ లను కనిపెట్టగలిగానని సంతృప్తి చెందాడు. ఇది అంతగా కొత్తది కాకున్నా సత్యాన్ని ఆవిష్కరించటానికి మరో మార్గమేర్పడింది. పరిశీలన, పరీక్ష, విశ్లేషణల వలన జ్ఞానం అనుభవమౌతుంది. కాని లెక్కలు లాజిక్ ఇంకా దూరం వెళ్ళగలవు. వీటిద్వారా ఇప్పటి వరకు ఉన్న జ్ఞాన పరిధి విస్తరింప జేశారు. అనుభవ జ్ఞానం కాదనలేము అన్నాడు. వేదాంతంలోనే కాదు దాని వివరణలో అవసరమైన భాషలోనూ మార్పులు తెచ్చాడు. ఏదైనా రుజువైన తరువాతనే నమ్మగలం. అందులోని ప్రతి పదం, సముదాయం, వాస్తవంలకు కూడా ఇదే వర్తిస్తుంది. మనకు తెల్సింది అనుకొన్న ప్రతి విషయాన్నీ అనుమానించాలి, జాగ్రత్తగా గమనించాల్సిందే అంటాడు రసెల్.

41 వయసులో ప్రిన్సిపియా చివరి మూడవ భాగం అచ్చయింది. అమెరికా వెళ్లి హార్వర్డ్‌లో "లోవెల్ లెక్చర్స్" ఇచ్చి మొదటి ప్రపంచ యుద్ధ చివరికాలంలో ఇంగ్లాండ్‌కు తిరిగొచ్చాడు. రసెల్‌లోని ఫాసిజం, మానసిక శక్తి ఒక్కసారిగా షాక్ తిన్నాయి – కారణం లిబరల్స్ "యుద్ధానికి యుద్ధమే" అన్న నినాదం విని. జంకు గొంకు లేకుండా యుద్ధ భీభత్సాన్ని గూర్చి తీవ్రంగా ప్రచారం చేశాడు. ఒక పాతికళ్ళ తర్వాత "యుద్ధం నాలోని మేధస్సుకు వ్యతిరేకం. యుద్ధ ప్రేమికులు గొర్రెల్లా మందలో కలిసి పోయారు. మేధావులకు సంఘంపై ప్రేమా బాధ్యతా ఉంటే ఈ మానవ మారణ కాండకు ఊపిరులు ఊదరు" అని రాశాడు. "most intellectuals have no belief in the intellect, except in quiet times" అని చురక అంటించాడు. యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ చేస్తున్న ప్రచారాన్ని, కరపత్రాలను ప్రభుత్వం తీవ్రంగా పరిగణించి జరిమానా విధించి చివరికి ట్రినిటి కాలేజీ లెక్చరర్ ఉద్యోగాన్ని పీకేసింది. కొద్దికాలం తర్వాత రాసిన ఆర్టికల్స్ మిత్ర కూటమికి వ్యతిరేకంగా భావించి అరెస్ట్ చేసి ఆరు నెలలు జైల్లో పెట్టింది బ్రిటిష్ ప్రభుత్వం. జైలు జీవితం రసెల్‌కు వరమై తాను టెక్స్ట్ బుక్ అని పిల్చుకొన్న "ఇంట్ర దక్షన్ టు మాధమాటికల్ ఫిలాసఫీ" పుస్తకం రాసి ప్రచురించాడు. దీనిపై హెచ్. జి. వెల్స్ "ప్రతిపేజీని జైలు గవర్నర్‌కు పంపి చదివింపజేసి ఆమోదం పొందాకే పబ్లిషర్ దగ్గరకు చేరేది. జైలు గవర్నర్ ప్రతి రాత పేజీని చదవలేక అర్ధమూకాక తలకాయ నెప్పి వచ్చి బాధ పడ్డాడు" అని రాశాడు. రిటైర్డ్ అకెడేమీషియన్ అని రసెల్‌ను అందరూ మర్చే పోయారు. ఇప్పుడు పబ్లిక్ పర్సన్ అయ్యాడు. దేశ ద్రోహిగానో.

అమరవీరుడిగానో ప్రజల మనస్సులో ఉండిపోయాడు. ప్రముఖ నవలాకారుడు, రచయిత డి. హెచ్. లారెన్స్‌తో కలిసి అమెరికా వెళ్లి అక్కడ "పసిఫిక్ ఉటోపియన్ కాలనీ" స్థాపించాలనే ఆలోచనలో ఉన్నాడు. కాని యుద్ధం పూర్తి అయ్యేదాకా ఇంగ్లాండ్‌లోనే ఉండటం మంచిదని నిర్ణయించుకొన్నాడు.

యుద్ధం తర్వాత తాను నమ్మని, రష్యామీదుగా ప్రయాణం చేశాడు. అప్పుడు బోల్షివిక్కులు ఆసియా వాసులపై చూపిస్తున్న బలాన్ని పాశ్చాత్య మానసాలు ఒక జబ్బుగా ఎలా భావిస్తున్నారోనని ఆశ్చర్యపోయాడు. రష్యా చైనాలను మెచ్చుకొన్నాడు. 50 వచ్చాయి పెళ్లి అయి 27 ఏళ్ళయింది. విడాకులిచ్చి డోరా విన్ఫ్రేడ్ బ్లాక్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఆమెతో కలిసి "ప్రాస్పెక్ట్స్ ఆఫ్ ఇండస్ట్రియల్ సివిలిజేషన్" పుస్తకం రాశాడు. ఆమె సహకారంతో బీకన్ హిల్ స్కూల్‌ను 4నుండి 10 ఏళ్ళ వయసు పిల్లల కోసం స్థాపించాడు. అందులో నిబంధనలు కాని, మతబోధ కాని క్రికెట్, ఫుట్ బాల్ ఆటలు కాని, బెత్తంతో కొట్టటం కాని తిట్టటం కాని లేని ఆధునిక భావాలతో నడిపించటానికి ప్రయత్నించిన స్కూల్ అది. విద్యార్థినీ విద్యార్థులు ఎవరికి ఇష్టమైంది వాళ్ళు చదువుకోవచ్చు. ఏం కావాలంటే అది చేసుకోవచ్చు. ఆడా మగా కలిసి బట్టలు లేకుండా స్నానాలు చేసేవారు. అన్ని ప్రశ్నలకు పూర్తి నిజాయితీతో జవాబు చెప్పేవారు. ఈ విధానం సాధారణ, ఎగువ సాధారణ వర్గాల తలిదండ్రులకు మింగుడు పడలేదు. కొందరు ఈ విధానం పనికిరాదన్నారు. మనిషి శీలానికి నాలుగు ముఖ్య విషయాలు కారణం అన్నాడు రసెల్. వీటిని "ఎడ్యుకేషన్ అండ్ గుడ్ లైఫ్" పుస్తకంలో వివరించాడు. అందులో మొదటిది –వైటాలిటి –అంటే బలీయమైన శక్త్యుత్సాహం –భయం లేని స్వీయ క్రమశిక్షణ. ఎవరూ ఎలా ప్రవర్తించాలో చెప్పబడ రాదు. ఎవరూ అవతలి వారిపై అధికారం చూపించరాదు. మన ప్రయోజనాలు మనవే. అవి బయటివారి ప్రభావం వలన యేర్పడ రాదు. మన ప్రయోజనాలను ఇతరులపై బలవంతంగా రుద్ద రాదు. రెండవది కరేజ్ –ధైర్యం –ఆత్మ గౌరవం, ఆత్మ జ్ఞానం. వ్యతిరేక అలవాట్లపై పోరాటం చేసి కోపం దుర్మార్గాలను అణచుకొని నేర్చుకోవాలి. మూడవది సెన్సిటివిటి– అంటే సున్నిత మనస్తత్వం. సరైన విద్యవలన ఇది లభిస్తుంది కాని తాత్కాలిక భావోద్రేకాలకు గురైతే రాదు. నాలుగవది ఇంటలిజెన్స్ - అంటే మేధస్సు. తెలుసుకోవాలనే తహ తహ కొత్తది కనిపెట్టటానికి కారణమవుతుంది. అది విజ్ఞానానికి దారితీస్తుంది. సృజన వయసు మీద పడిన కొద్దీ తగ్గుతుంది. ఆశయ ఆదర్శాలు ఘనమే కాని ఆచరణలో పూజ్యమై స్కూల్ మూత పడి నిరాశనూ అపజయాన్ని పంచింది.

స్కూల్‌తో పాటు రెండో పెళ్ళీ ఫెయిలయింది. మొదటి భార్య ఇచ్చిన విడాకులు గుర్తింపు పొందలేదు. రెండో భార్య డోరా ఇచ్చిన విడాకుల నోటీసు చాలా స్పెక్టాక్యులర్ అంటే వింత ఆకర్షణమైంది. దీనికి కారణం రసెల్ ప్రచురించిన "మారేజ్ అండ్

మోరల్స్". భార్యా భర్తల మధ్య సెక్స్ సంబంధం సంతానం కోసం మాత్రమే కాదు కాని వారిద్దరి మధ్యా అవగాహనకు ఇద్దరికీ విద్య ఉండాలి. అందుకోసం పెళ్లికాకుండానే పరాయి వాడితో పడుకోవటం అలవాటుకావాలి. అంతే కాదు వివాహేతర శృంగారమూ అభిలాషణీయం అన్నాడు. దీన్ని వివరిస్తూ రసెల్ "where marriage is fruitful and both partners to it are reasonable and decent the expectations ought to be that it will be lifelong, but that not it will exclude other sex relations" అని కొత్త "దవ్వారాలు" తెరిచాడు. ఈ విషయంలో రసెల్ ద్వయం హుందాగానే ఉన్నా, ఇద్దరు పిల్లలను కన్నా వీరికాపురం జీవితాంతం వర్ధిల్లాల్సి ఉంది. కాని ఈ వివాహేతర శృంగారాన్ని ఆ ఇద్దరూ ఆహ్వానించ లేక పోయారు. ఈ బాధ భరించలేక 1932లో చట్ట పరంగా రెండేళ్ళ తర్వాత విడిపోయారు. అప్పటికి ముసలాయన వయసు 64, ఇక ఆగకుండా తన దగ్గర రిసెర్చ్ అసిస్టెంట్‌గా ఉన్న హెలెన్ పాట్రీషియా స్పెన్స్‌ను పెళ్లి చేసుకొన్నాడు. మరో ఏడాదికి ఒక కొడుక్కి తండ్రి అయ్యాడు.

అరవైలలో చాలా విలువైన గ్రంథ రచన చేసి ప్రచురించాడు. అందులో ముఖ్యమైనది "ఫ్రీడం అండ్ ఆర్గ నైజేషన్". దీనిలో 1814 నుండి 1914వరకు ఒక శతాబ్దపు చరిత్రను గూర్చిన సర్వే ఉంది. ఇందులోని శక్తివంతమైన వర్ణన శైలి విపరీతంగా ఆకర్షిస్తుంది. దీన్ని ఒక సైంటిఫిక్ ఫిక్షన్‌గా రాశాడు. పాతవాటిని పునర్ మూల్యాంకన చేసి కొత్త విషయాలు చెప్పాడు. ఇందులో కొంత దుస్టస్వభావం ఉన్నా, వందేళ్ళలో నియంత మాటర్నిచ్, సింహ సదృశ బిస్మార్క్, చాపకింద నీరులా ఉండే మాల్థస్, విప్లవ అవాస్తవ ఫిలాసఫర్, ప్రమాదకర ఎకనామిస్ట్ మార్క్స్ గురించి మనకు తెలియని విషయాల నెన్నిటినో తవ్వి తీశాడు. గణిత శాస్త్ర వేత్తగా రసెల్ మార్క్స్ చెప్పిన వివాదాస్పద సర్ప్లస్ థీరీ అంటే మిగులు సిద్ధాంతాన్ని సవాలు చేసి ధనికుల చేతిలో అధికారం ఉందనటాన్ని కాదని వర్గ పోరాట సిద్ధాంతం ఉదార వాద సిద్ధాంతాన్ని దెబ్బతీసిందని తేల్చాడు. దీనివలన కన్జర్వేటివ్‌లు బలపడ్డారన్నాడు. అంతమాత్రం చేత కేపిటలిజం ఉద్ధరిస్తుందనుకోలేదు. దీనికి పారిశ్రామిక ప్రజాస్వామ్యం పరిష్కారం అన్న మార్క్స్ ఆలోచనపై అనుమానించాడు. "the nineteenth century was brought to a disastrous end by conflict between industrial technique and political theory. Plutocracy, the actual form of government in western countries, was unacknowledged and, as far as possible concealed from the public eye" అని తన మనోభావాలను స్పష్టంగా చెప్పాడు రసెల్.

"ఇన్ ప్రైజ్ ఆఫ్ ఐడిల్నెస్"ను దీనితర్వాత ఒక ఏడాదికి ప్రచురించాడు. శైలిలో

విషయంలో చాల భిన్నంగా ఉంది. ఆశ్చర్యాలు సూక్తులు, హాస్యంతో మేళవించి రాశాడు "science while it diminishes our cosmic pretensions, enormously increases our terrestrial comfort. That is why in spite of the horror of the theologians, science has on the whole been tolerated" అని సైన్స్ చేస్తున్న మేలు కీడులను విశ్లేషించాడు పని రెండు రకాలు. మొదటిది పదార్థాన్ని భూమి వద్దకానీ భూమి ఉపరితలం దగ్గరలో కాని ఇతర పదార్థాలకు సాపేక్షంగా మార్చటం. రెండవది ఇతరులను కూడా ఇలానే చేయమని చెప్పటం" అన్నాడు.

65వ ఏట రసెల్ మళ్ళీ అమెరికా వెళ్ళాడు చికాగో యూనివర్సిటి, కాలిఫోర్నియాలోని లాస్ ఏంజెల్స్ యూనివర్సిటి, హార్వర్డ్ యూనివర్సిటీలలో విలియం జేమ్స్ స్మారక ఉపన్యాసాలిచ్చాడు. 1940లో కాలేజ్ ఆఫ్ ది సిటి ఆఫ్ న్యు యార్క్‌లో ఫిలాసఫీ ప్రొఫెసర్ చైర్‌కు ఆహ్వానించారు. చాలా తీవ్రంగా అరుపులు కేకలు నిరసనలు మిన్ను ముట్టాయి. "అక్కడి తలిదండ్రులు రసెల్ రాసిన మారేజ్ అండ్ మోరల్స్ చదవకుండానే తమ పిల్లలకు ఫ్రీ సెక్స్, అనైతికత వంటివి నేర్పి భ్రష్టు పట్టిస్తాడేమోనని భయ పడ్డారు, ఈ అభియోగాలైన సేలేషియస్ అంటే కామం, లెచేరస్ అంటే అతి శృంగారం, లిబిడినస్ అంటే విషయాసక్తి, ఏస్తేటిక్ అంటే సౌందర్యారాధన, సబ్ వెర్సివ్ అంటే అన్నిటికీ అడ్డుతగలటం వంటివి తనపై మోపటం చూస్తే పూర్వం సోక్రటీస్‌పై కూడా ఇవే అభియోగాలు మోపారన్న సంగతి గుర్తు చేశాడు. రసెల్ క్లాస్ రూమ్‌లో లాజిక్, గణితం మాత్రమే బోధిస్తున్నాడని కాలేజి ప్రెసిడెంట్ నిర్ధారించినా, రసెల్‌పై ఒక కోర్టు కేసు జరిగి, అతను హానికర ప్రభావం (పేర్నిషియస్ ఇన్ఫ్లుయన్స్) కలిగిస్తున్నాడని నియామకం రద్దు అయింది. న్యు యార్క్ సుప్రీం కోర్ట్ జస్టిస్ జాన్ మెక్ గీహన్, రసెల్ నియామకాన్ని రద్దుపరచి "రసెల్‌కి ఉద్యోగం అమర్యాదకు పట్టాభిషేకం" అని తీర్పు చెప్పాడు. రసెల్ ఫిల డల్ఫియా దగ్గర బార్న్స్ ఫౌండేషన్‌లో ఉపన్యాసానికి ఆహ్వానం అందుకొన్నాడు. పెన్సిల్వేవేనియాలో మెరియన్‌లో ఇల్లు కొనుక్కొని ఉండి, బార్న్స్‌తో తగువు పడి రెండేళ్ళ తర్వాత మళ్ళీ బాక్ టుపెవిలియన్‌గా ఇంగ్లాండ్ చేరాడు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రసెల్ అభ్యంతరాలేవీ చెప్పలేదు. ఫసిఫిజాన్ని వదులుకోలేదు. కాని ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఫాసిజాన్ని వ్యతిరేకించాలని కోరాడు. 70వ పడిలో తనను తాను ఆనంద పసిఫిస్ట్‌గా చెప్పుకొన్నాడు. మార్మికతా వ్యతిరేకి అయ్యాడు. నిందా స్తుతి పరుడు, అవిధేయతా తిరుగుబాటు దారుడు అనిపించాడు. 76లో మరో రచన బాంబు పేల్చాడు. అదే "హ్యూమన్ నాలెడ్జ్-ఇట్స్ స్కోప్ అండ్ లిమిట్స్". మేధావితనం ను విశ్లేషించిన రచన ఇది. రసెల్ తొణకని బెణకని ధైర్య సాహసాలకు అద్దంపట్టింది అది. రేడియో ప్రసంగాలు చేస్తూ రేడియోస్థాయిని విపరీతంగా పెంచాడు. సామాన్యజనానికి సాహిత్యాన్ని అందించాడు రేడియో మాధ్యమంగా. 77వ

ఏట నార్వేజియన్ ఫ్లైయింగ్ బోట్లో ప్రయాణం చేశాడు. అది కూలిపోయింది. అందులోని 20 మంది ప్రయాణీకులు నీళ్ళలో మునిగి మరణించారు. ఒళ్ళంతా పూర్తి డ్రెస్‌తో ఉన్న రసెల్ గడ్డకట్టిన సముద్రంలో ఈదుకొంటూ బయటపడే ప్రయత్నం చేస్తుండగా సహాయం అంది రక్షింపబడ్డాడు. కొద్ది రోజుల తర్వాత యధాప్రకారం తాను చేయాల్సిన ఉపన్యాసం ఇచ్చాడు. 78వ ఏట బెర్ట్రాండ్ రసెల్‌కు సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది. రసెల్‌ను మహితాత్మక రచయితగా మానవతామూర్తిగా ప్రపంచం గుర్తించి ప్రశంసించింది.

రసెల్ 80వ జన్మ దినోత్సవం కీర్తులు భుజకీర్తులతో బ్రహ్మాండంగా జరిగింది. నోబెల్ బహుమతి వచ్చినప్పుడు లైఫ్ మేగజైన్ రాస్తూ "తాను సాహిత్యానికి చేసిన సేవ ఏదీలేదు కనుక దాన్ని తిరస్కరించాడని ఆతని మహోన్నత బుద్ధి ఇంకా కోపం తెప్పిస్తూనే అలంకారమైంది" అన్నది. ఆయనపై ఒక సినిమా చిత్రీకరిస్తు ఇంటర్వ్యూ చేస్తున్నప్పుడు ఆయన బుర్ర పాదరసంలా పని చేసింది. పక్షపాతం, నటన, మోసాలను అతి వేగంగా గుర్తించ గలిగే సామర్ధ్యాన్ని కలిగే ఉంది. అప్పుడు ఆయన 60 ఏళ్ళ వాడికంటే యవ్వనంగా కనిపించాడు. మీసం ఎప్పుడో జారిపోయింది. కవళికలు స్పష్టంగా పెదిమలు దృఢంగా, కళ్ళు జీవంతో తొణికిస లాడాయి .

80వ పుట్టిన రోజు జరిగిన నెలకు "పెళ్ళిళ్ళ ప్రయత్నగాడు" వివాహ ఆనందాన్ని చాలా అనుభవించానని విడాకులను దూరం చేశానని అన్నాడు. అన్నాడే కాని కొన్ని నెలల తర్వాత నాలుగో సారి ఎడిత్ ఫించ్ అనే బ్రిన్ మావార్ కాలేజి మాజీ టీచర్‌ను పెళ్ళాడేసి ఆశ్చర్యం కల్గించాడు. ఆయన సంకల్ప బలం రచనశక్తి ఎనభై దాటినా ఏమీ తగ్గనే లేదు. వితండవాదం ప్రమాదల గురించి నిర్మోహమాటంగా ఇదివరకటి కంటే ఘాటుగా రాశాడు. 1950-52 కాలంలో "అన్ పాప్యులర్ ఎస్సేస్", న్యు హోపెర్ ఫర్ ఏ చేంజింగ్ వరల్డ్ "ది ఇంపాక్ట్ ఆఫ్ సైన్స్ ఆన్ సొసైటీ" గ్రంథాలు రాశాడు. 1953లో రసెల్ కొత్త రంగ ప్రవేశం చేశాడు. అప్పటివరకు 65పుస్తకాలు, అనేక కరపత్రాలు రాసిన వాడు చిన్న కథల మోజులో పడి రాశాడు. వీటిని "శాటన్ఇన్ ది సబర్బ్స్" పేరుతో ప్రచురించాడు. 1954లో 82వ జన్మ దినోత్సవం జరుపుకొంటూ "నైట్ మేర్స్ ఆఫ్ ఎమినంట్ పెర్సన్స్" రాసి ప్రచురించాడు. ఫ్రీ మైండ్ గురించి ఇంకా చర్చిస్తూనే రాస్తూనే చెబుతూనే ఉన్నాడు. చావేకాక మనిషి జీవితంలో చాలా స్వేచ్ఛగా ఉండాలి, ఆలో చనల్లొ, విమర్శలో, ఊహలో, సృజనలో అన్నాడు.

1962 జూన్ 1న చావు గరించి విని విచారం వెలి బుచ్చే సమయంలో తానొక దేశ దిమ్మరినని, అరిస్టాక్రసి వ్యతిరేకినని, తన సిద్ధాంతాలు చాలా తమాషాగా ఉంటాయని, అవి తన నడవడిని నిర్ణయించాయని చెప్పుకొంటారు. ఆయన బాగా ముసలితనంలో కూడా మాంచి వినోదం పంచేవాడిగా, మంచి ఆరోగ్యంగా, రాజకీయ నిర్ణయనేతగా,

ఆనాటి రెస్టోరేషన్ తరువాతి మహాకవి మిల్టన్ లాగా ఒంటరిగా ఉన్నాడని, చని పోయిన శకానికి మిగిలిన ఆఖరి ప్రాణి" అని కీర్తించాలని కోరుకొన్నాడు.

రసెల్ పూర్తిగా యుద్ధ వ్యతిరేకి. సామ్రాజ్య వాదాన్ని పూర్తిగా తిరస్కరించినవాడు. పాసిజంను సమర్ధించి జైలుకు వెళ్ళినవాడు. తర్వాత హిట్లర్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేసినవాడు. స్టాలిన్ తరహా నియంతృత్వాన్ని ఎదిరించిన వాడు. వియత్నాంపై అమెరికా యుద్ధాన్ని వ్యతిరేకించాడు. అణ్వాయుధ విసర్జన కోరుకొన్నవాడు. అతనికి వచ్చిన పురస్కారాలు విశేషమైనవి. పుట్టుక నుండి 1908 వరకు "ది ఆనరబుల్ బెర్ట్రాండ్ ఆర్థర్ విలియమ్స్ రసెల్"ను, 1908 నుంచి 1931 వరకు "ఎఫ్.ఆర్.ఎస్.", 1931-49 వరకు "రైట్ ఆనరబుల్ ఎరల్ రసెల్", "1949 నుంచి చని పోయేవరకు" రైట్ ఆనరబుల్ ఎరల్ రసెల్ ఓ.ఎం.ఎఫ్.ఆర్.ఎస్ బిరుదులతో విరాజిల్లాడు. 98వ ఏట మహామేధావి రసెల్ 2-2-1970న చనిపోయాడు. ఎనలిటికల్ ఫిలాసఫీ స్థాపకుల్లో రసెల్ ఒకడు. లీబ్నిజ్ ప్రభావం బాగా ఉన్నవాడు. ఈస్తెటిక్స్ కాకుండా అన్ని వేదాంత విషయాలు రాశాడు. ఫలవంతమైన మెటా ఫిజిసిస్ట్. లాజిక్ ఫిలాసఫీ గణితాలలో ఉద్దండుడు. ఫిలాసఫీ ఆఫ్ లాంగ్వేజెస్, ఎథిక్స్, ఎపిస్టమాలజిఅంటే జ్ఞాన మీమాంసా శాస్త్రంలలో నిష్ణాతుడు. బ్రాండ్ బ్రాన్ డాల్ట్ రసెల్‌ను ఈస్తెటిక్స్ పైన ఎందుకు రాయలేదని అడిగితే తనకు సౌందర్యం గురించి ఏమీ తెలియదని, కాని దాని వలన తాను రాసిన దానిని బేరీజు వేయకూడదని అన్నాడు. తాను అజ్ఞేయ వాదినే అన్నాడు. అంతమాత్రం చేత ఒలింపిక్ దేవతలను కాదని అనలేదు. బ్రిటిష్ హ్యూమన్ అసోసియేషన్ సలహా సంఘ సభ్యుడిగా, కార్డిస్ హ్యూమానిటీస్ అధ్యక్షుడిగా జీవితాంతం రసెల్ పనిచేశాడు. శాస్త్రీయ సంఘం (సైంటిఫిక్ సొసైటీ) ఏర్పడాలని వాచించాడు. యుద్ధం లేని జనాభా అతిగా పెరగని, సంపద అందరికి సమానంగా విభజింప బడే సమాజం కోరుకొన్నాడు. మానవాళికి మార్గ దర్శనం చేసేది పరస్పర సహకారమే అన్నాడు. హోమో సెక్సువల్. ఆ "రిఫార్మ్ సొసైటీ"ని పూర్తిగా సమర్ధించాడు. "Reflections on My Eightieth Birthday" ("Postscript" in his Autobiography), Russell wrote: "I have lived in the pursuit of a vision, both personal and social. Personal: to care for what is noble, for what is beautiful, for what is gentle; to allow moments of insight to give wisdom at more mundane times. Social: to see in imagination the society that is to be created, where individuals grow freely, and where hate and greed and envy die because there is nothing to nourish them. These things I believe, and the world, for all its horrors, has left me unshaken" (158) అని రాసుకొన్నాడు. రసెల్ ప్రభావం పడని ఆధునిక రచయిత ఎవరూ లేరు అన్నది యదార్థం.❋



## 56. ఆధునిక సాహిత్య రథ సారధి – జెర్ ట్రూడ్ స్టెయిన్–1 (1874–1946)

జెర్ ట్రూడ్ స్టెయిన్ పై రెండు వర్గాలమధ్య రేగిన విపరీత మైన దుమారం అంతా ఇంతా కాదు. మధ్యే మార్గమే లేదు. ఆమె వ్యతిరేకులు ఆమెను ఒక ఫ్రాడ్‌గా, ఆమె చెప్పిన ఆటోమాటిక్ రైటింగ్ ఒక అవహేళనగా భావించారు. ఆమెది "క్లినికల్ కేస్ ఆఫ్ మేగలోమానియా" అన్నారు. కొద్దిమంది ఆమెను రచయిత్రిగా కంటే ఆమె ఒక ఒక మతంగా, దేశంలో అత్యంత విప్లవాత్మక సృజన శీలిగా సాహిత్యంలో శాస్త్రీయ దృక్పధం ఉన్న విద్యార్థినిగా, ప్రపంచాన్నే మార్చేసిన ఏకవ్యక్తి విప్లవ వనితగా ఆరాధించారు. మిగిలిన చాలా మందికి ఆమె నిరంతర వివాదాస్పద వ్యక్తి. ఎవరేమనుకొన్నా ఆమె తిరుగులేని ఉన్నత స్థాయి మతాధికారి.

3–2–1874 నా అమెరికాలో పెన్సిల్వేనియాలోని అల్లెఘేనిలో డేనియల్, అమీలియా కేజర్ స్టెయిన్ దంపతులకు జన్మించింది. తండ్రి సంపన్నమైన స్ట్రీట్ రైల్వే వైస్ ప్రెసిడెంట్, నిరంతర సంచారి. పెద్దన్న లియోతో ఆమే వియన్నా, పారిస్ కాలి ఫోర్నియా లలో బాల్యం గడిపింది. చిన్నతనం నుంచే పుస్తకాల పురుగు. లైబ్రరీలకు వెళ్లి దొరికిన ప్రతి పుస్తకాన్నీ చదివేసింది. తర్వాత స్మోలెట్, స్కాట్, షేక్స్పియర్, బన్యన్, ఫీల్డింగ్ వర్డ్స్ వర్త్ రచనలతో పాటు "కాంగ్రెషనల్ రికార్డ్స్" కూడా ఊది పారేసింది. 19 వ ఏట రెడ్ క్లిఫ్‌లో సైకాలజీ ప్రత్యేకంగా చదివి విలియం జేమ్స్‌కు శిష్యురాలైనది. పరీక్ష ముందు రోజు రాత్రి ఒపేరా హౌస్‌కు వెళ్లి, అక్కడి నుంచి అర్ధరాత్రి లేట్ పార్టీలో

ఉండి ఇంటికి వచ్చింది. పరీక్షలో సమాధానం పేపర్‌పై భాగాన "డియర్ ప్రొఫెసర్ జేమ్స్ నేను ఫిలాసఫీ పేపర్ రాయలేక పోతున్నందుకు మన్నించండి" అని రాసింది. దానికి సమాధానంగా జేమ్స్ "డియర్ మిస్ స్టెయిన్ –నిన్ను పూర్తిగా అర్థం చేసుకొన్నాను. అప్పుడప్పుడు నేను అలానే చేసేవాడిని" అని రాసి ఆమెకు అతి ఎక్కువ మార్కులు వేశాడు. రెడ్ క్లిఫ్‌లో ఉండగానే ఆటోమాటిక్ రీడింగ్, రైటింగ్‌లో ప్రయోగాలు చేసింది. లియాన్ సాల్మన్ అనే గ్రాడ్యుయేట్ విద్యార్థితో కలిసి సృజనకార్యం అంతశ్చేతనతో కాకుండానే సాధ్యం అని రుజువు చేసి తమ పరిశోధన వివరాలను 1896లో "నార్మల్ మోటార్ ఆటో మాటిజం" అనే శీర్షికతో "సైకలాజికల్ రివ్యు"లో ప్రచురించింది. అదే ఆమె మొట్టమొదటి ప్రచురణ వ్యాసం. దీనిపై విస్తృతంగా రాస్తూ ఆ తర్వాత బాగా ప్రసిద్ధి చెందింది. ఆ తర్వాత కాలంలో "ఇందులో మాటలూ వాక్యాలు సరైనవే కాని ఒక దానికొకటి సంబంధం సరిగ్గా లేదు" అని చెప్పుకొన్నది. రెడ్ క్లిఫ్ పరిశోధన జరిగిన 38 ఏళ్ళ తర్వాత ప్రొఫెసర్ బి.ఎఫ్.స్కిన్నర్ ఆ పత్రాన్ని కనుగొని "హాజ్ గెట్రూడ్ స్టెయిన్ అ సీక్రెట్" అనే దానిలో ఆమె సైకలాజికల్ రివ్యులో రాసిన దానిలో అది చాలా పాక్షికంగా ఉన్న పేపర్ మాత్రమే అని రాశాడు. అచేతన స్థితిలో రాసిన రాత అన్నాడు. స్టెయిన్ కూడా ఆ తర్వాత తన స్వీయ చరిత్రలో తన ప్రయోగం విజయవంతం కాలేదని, ఆటోమాటిక్ రెస్పాన్స్‌కు తగిన సరైన సాక్షాలు లేవని రాసింది. "ఇది ఆటోమేటిక్ అని నేననుకోలేదు, ఇప్పుడు కూడా అనుకోను. విశ్వ వ్యాప్తంగా ఏ విద్యార్థి అయినా దీనిపై ఇంకా పరిశోధించి నిగ్గు తేల్చవచ్చు మనిషి మనసులో ఉన్నది ఏదో, సరైన పదాలతో ఆ భావోద్వేగం రాత వలన బయటికి వస్తుంది" అని చెప్పింది. ఇదంతా భాషా శాస్త్ర వేత్తల దృష్టిని ఆకర్షించింది. దీనిని ఆమె గురువు విలియం జేమ్స్ బాగా ప్రోత్సహించాడు. ఆయన రాసిన "సైకాలజీ" గ్రంథంలో "స్ట్రీం ఆఫ్ కాన్షస్ నెస్" అధ్యాయంలో సాహిత్యంలో ఈ కొత్త పదాన్ని సృష్టించి వాడాడు. ఇందులో ప్రతి ఆలోచనా విడి విడిభాగాలుగా బయటికి వస్తుంది. ప్రతివాక్యం ఒక కాల అవధికి సంబంధించింది అవుతుంది. ఇది స్టెయిన్‌ను బాగా ఆకర్షించింది. ఇందులో సెన్స్ ఆఫ్ టైం అంటే ఆమెకు బాగా ఇష్టమైంది.

23వ ఏట ఆమె జాన్స్ హాప్కిన్స్ యూనివర్సిటీలో చేరి నాలుగేళ్ళు మెడిసిన్ చదివింది. అన్నిటా బాగా మార్కులు వస్తున్నా, డిగ్రీ పొందకుండానే మానేసింది. మార్కులకంటే చదువే ముఖ్యంగా భావించింది. లండన్ వెళ్లి జీవిత గమనాన్ని మలుపు తిప్పు కొన్నది. ఎలిజబెతన్ ప్రోజ్‌కు అంకితమైంది. 20వ శతాబ్ది ప్రారంభంలో పారిస్ మేధావులకు కేంద్ర నిలయంగా ఉండేది. 1903లో పారిస్ చేరి, ఆలిస్ బి.టోక్లాస్ అనే సాన్

ఫ్రాన్సిస్కో స్నేహితురాలితో పరిచయం చేసుకొని స్నేహాన్ని జీవితాంతం నిలుపు కొన్నది. ముప్ఫై ఏళ్ళలో ఒక్కసారి మాత్రమే చుట్టపు చూపుగా అమెరికా వెళ్లి వచ్చింది. మిగాతాకాలం అంతా పారిస్‌లోనే సోదరుడు, ది ఎ.బి.సి .ఆఫ్ అథ్లేటిక్స్ రచయితా అయిన లియోతో ఉన్నది.  వీరి భావాల మధ్య వైరుధ్యం ఉన్నందున తరచూ కీచులాడుకోనేవారు.  కొత్త, అంతగా పేరు లేని పెయింటర్స్‌ను గుర్తించి చిత్రాలను అతను సేకరించి భద్రపరిస్తే, తానే వారిని కనుక్కున్నానని ఆమె పోట్లాడేది.  ఆమె రాసే విధానమూ అతనికి నచ్చేది కాదు.  ఆమె రాతలో స్పష్టత లేదని, పునరుక్తులు ఎక్కువని ఈసడించేవాడు.  ఆమె పురుష వేషం మాట విధానం అతనికి ఏవగింపు.  బిగుతు, పొట్టి బట్టలను అతడు వద్దనే వాడు.  జుట్టు కత్తిరించుకోవటం గిట్టేదికాదు.  చురుకైన నళ్ళకళ్ళ చిన్నది ఆమె.  పికాసో ఈమె చిత్రాన్ని అర్ధ నిమీలిత ధ్యాన యోగంలో సగం వాదంలో ముందుకు వంగి ప్రత్యర్థిని ఉచ్చులో పడేస్తున్నట్లు గొప్పగా చిత్రించాడు. అయితే పికాసో చిత్రించిన దానికి భిన్నంగా ఆమె కవళికలు ఉండేవి.  ఆమె ముఖం ఆవేశ పూరితుడైన బుద్ధుని ముఖంలా లేక ఉలెన్ బట్టలలో చుట్టబడిన రోమన్ సెనేటర్ ముఖంలా అనిపించేది.  ఆమె డామినేటింగ్ నేచర్‌కు కొంపలో ఇద్దరు ఆడ వాళ్ళ మధ్య ఉండటం భరించలేక లియో అక్కడి నుంచి మారి వేరే చోట ఉన్నాడు.  స్టెయిన్ అతనికి "prolonged disease, a kind of mild insanity"తో బాధ పడుతున్నదానిలా  అనిపించింది.

రూ డీ ఫ్లూరస్‌లోని ఇల్లు ప్రగతిశీల రచయితల, కళాకారులకు ముఖ్య కేంద్రమైంది. కళాకారిణిగా  స్టెయిన్, పికాసో, మాటిస్సే, బ్రేక్‌లతో వారికి కీర్తి రాకముందే పరిచయమైంది. వాళ్ళ చిత్రాలనుకొని తన ఇంట్లో గర్వంగా వ్రేలాడదీసి మురిసిపోయేది. సొగసైన సెలూన్ నిర్వాహకురాలుగా యువ రచయితలను ఆకర్షించింది.  వారిని తన నిర్మొహమాట పద్ధతిలో అప్పటికి ఇంకా రచన ప్రారంభ దశలోనే ఉన్నా స్టెయిన్ వారిపై ప్రభావం చూపించింది.  ఆమె నిజాయితీకి వారు అప్రతిభులైనారు.  స్కాట్ ఫిట్జెరాల్డ్, షేర్వుడ్ అండర్సన్.  ఎర్నెస్ట్ హెమింగ్ వేమొదలైన వారు ఆమె వలన లబ్ధి పొందారు. వారి రచనలను ఇంకా సూక్ష్మీ కరించమని సరళం చేయమని పదేపదే చెప్పేది.  తాను సూచించిన సరళత ఆమె మొదటి పుస్తకం "త్రీ లైవ్స్"లో కనిపించదు.  దీన్ని 35 వయసులో రాసింది.  ఇద్దరు జర్మన్ సేవకుల ఒక నీగ్రో వేశ్యల విషాద  జీవిత చిత్రణ. దీనిపై వచ్చిన విమర్శలు తక్కువే కాని పాజిటివ్‌గా లేవు.  కాని కొత్తస్వరం నూతన భావనలు వైవిధ్యం ఉన్నాయని మెచ్చుకొన్నారు.  రెండవ పుస్తకం "ది ఆటో బయాగ్రఫి ఆఫ్ ఆలిస్ బి టాక్లాస్"లో మేనరిజాలు, సంబంధం లేని విషయాలు ఉన్నాయి.  కొత్త

ప్రపంచంలో పాత మనుషులు బాపతుగా ఉంది. కొత్తవారు పాతవాళ్ళలోంచి ఏర్పడుతారు. కథా సంవిధానం లేదు. ఒకే కుటుంబానికి చెందిన కథ. జీవితం అంటే సాధారణ సంఘటనల మార్పు లేని తీరే అంటుంది స్టెయిన్. పునరుక్తి బోరు కొడుతుంది "దిమేకింగ్ ఆఫ్ అమెరికన్స్"లో "the quality of being a son or an uncle, does not depend at all on the specific parents or nephews who objectively create the position. The individual people in the book go on and on as themselves" ప్రాణం ఉన్న జీవులుగా, క్రియలుగా, వాళ్ళందరూ ఆకర్ములు. "this anonymity or common" placeness " or impersonality of mind is of course, in her case an intellectual thing, even a scientific discipline --but it is parallel to and very like the mentality of the saints whose biographies are lost in their absorption in the present general miracle and the state of grace'' విగ్రహారాధనకు స్వస్తి.

41వ ఏట మరోపుస్తకం తెచ్చింది స్టెయిన్. అతుకుల బొంతలా అసహ్యంగా ఉంది. పికాసో బరాక్‌లు పెయింటింగ్‌లో వస్తువును తగ్గించి నైరూప్యం (ఆబ్ స్ట్రాక్ట్)లోకి వచ్చేశారు. రచనలో దాన్ని తీసుకొచ్చే ప్రయత్నం "టెండర్ బటన్స్"లో స్టెయిన్ చేసింది. దీనికి ఉప శీర్షికగా "ఆబ్జెక్ట్స్ ఫుడ్ రూమ్స్"అని పెట్టింది. నిశ్చల చిత్రాన్ని క్యూబిక్ చిత్రకారులు చిత్రించినట్లు రాసింది. ఛైర్, పియానో ఆరంజ్, బాక్స్, పుష్పం, పోస్టేజ్ స్టాంప్, ఎగ్స్ గొడుగు మొదలైన వస్తువులను తీసుకొని చదువరులకు షాకిచ్చింది. ప్రతి వస్తువులో కొత్తదనం, అననుభూతికంగా అంతకు ముందెప్పుడూ చూడని, తారసపడనీ రీతిలో రాసింది. పెయింటర్లు విషయాన్ని మార్చి సంబంధం లేకుండా చేసినట్లు. స్టెయిన్ వాక్యాలను మార్చి మార్చి రాసింది. వాక్య నిర్మాణం (సింటాక్స్)ను ధ్వంసం చేసింది. సంప్రదాయాలను కిటికీలోంచి గిరాటేసింది. "త్రీ లైవ్స్అండ్ ది మేకింగ్ ఆఫ్ అమెరికా"లో నిజమైన ప్రజల గురించి రాసింది కాని ఇప్పుడు మానవ ప్రవృత్తిపై ఆమెకు అభిరుచి లేదు. ఇప్పుడు అంతా పదాల, దృశ్యాల సహసంబంధాల (కారిలేషన్), శబ్దాల, మాటలలో ఉత్పన్నమయ్యే అర్థాలపై ఆకర్షణ పెంచుకొన్నది. శబ్దంలోని లయ,వ్యంగ్యం అనిశ్చితత్వం ఆమెను పట్టుకున్నాయి. మిగిలిన వన్నీ వదిలేసింది సంఘటనలు, చర్యలను నుండి తప్పుకొన్నది. దీనికి కారణం ఈ రోజుల్లో అందరికి ఏం జరుగుతుందో తెలుసు అందుకని దానిమీద మక్కువ లేదు అన్నది. ఎవరైనా శబ్దాన్ని చూశారా, రంగుకు శబ్దానికి ఉన్న సంబంధం తెలుసా, దాన్ని

వర్ణించటానికి ఒకమాట సరిపోతుందా? అని ప్రశ్నించింది. లూసి చర్చ్ అనే నవలిక,యూస్‌ఫుల్ నాలెడ్జ్ అనే వ్యంగ్యాత్మక రచన చేసింది. "వాట్ హాపెనేడ్"లో నాటకాత్మక శైలి ప్రవేశపెట్టింది. అదెలా ఉందొ రుచికి చూద్దాం – "a cut a cut is not a slice, what is the occasion for representing a cut and slice. What is the occasion for all that. A cut is a slice, a cut is the same slice" ఇలా సాగుతుంది.

యాభైవ పడిలో ఈ గందరగోళ రచనకు స్వస్తి పలికి, స్నేహితురాలిపై రాస్తున్న నెపంగా తన జీవిత చరిత్రనే "ది ఆటో బయాగ్రఫి ఆఫ్ ఆలిస్ బి.టోక్లాస్" నవల రాసింది. ఇందులోవన్నీ తన జ్ఞాపకాల మాలలే. నిజానికి దగ్గర లేదన్నారు కొందరు. కాని చాలామంది ప్రాభావితులై ఇష్టపడి చదివి బాగా చర్చించుకొన్నారు. ఈ విజయంతో మళ్ళీ అమెరికా వెళ్ళింది. అక్కడ తన రచన "ఫోర్ సెయింట్స్ ఇన్ త్రీ యాక్ట్స్" ప్రదర్శన చూసింది. మార్మికత, చాదస్తాలతో ఉన్నా మ్యూజికల్ హిట్. "నువ్వు మాట్లాడే భాషలో ఎందుకు రాయవు? అని అడిగితే "షేక్స్ పియర్ బ్లాంక్ వెర్స్‌లో మాట్లాడాడని అనుకొంటున్నారా?" అని ఎదురు ప్రశ్న వేసింది.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో ఫోర్డ్ కారులో యుద్ధ భూమిని చేరి గాయపడిన, హాస్పిటల్‌లో కోలుకొంటున్న సైనికులకు ఆహార పదార్థాలు అందించింది. ఆమె నవ్వు చలాకీతనం సంభాషణ వారికి ఎంతో బాధోపశమనం కలిగించింది. నాజీ సైన్యం పారిస్‌ను రెండవ ప్రపంచ యుద్ధంలో ఆక్రమించినప్పుడు రోజు విడిచి రోజు 7 మైళ్ళు నడిచి వెళ్లి ఆహార పదార్థాలను సేకరించేది. 'her;s is a powerful personality" అన్నాడు ఫ్రాన్సిస్ హాకేట్. "అమెరికన్ సైన్యం ఆమెకు బానిసత్వ సంకెళ్ళను ఛేదించింది" అన్నారు. "వార్స్ ఐ హావ్ సీన్" రచనలో ఫ్రాన్స్ పతనం, దాన్ని ఆక్రమించుకోవటం మరలా స్వేచ్ఛ పొందటం అన్నీ రాసింది. "బ్రూసీ అండ్ విల్లీ"లో ఎక్కువ భాగం సైనికులు కాని సైనికులలాంటి చిత్రాలే. ఇదే ఆమె చివరి పుస్తకం. ఆమెకిప్పుడు 70ఏళ్ళు. మరో ఏడాదికి ఆమె ఆరోగ్యం క్షీణించి కుంచించుకు పోయింది. మళ్ళీ అమెరికాకు వెడదామని అనుకోనగా ఆమెకు కేన్సర్ సోకిందని నిర్ధారణయింది. న్యూల్లి సర్ సీన్ అనే పారిస్‌లోని అమెరికన్ హాస్పిటల్‌లో చేర్చారు. ఒకవారం మాత్రమే అక్కడ ఉంది. నిరంతర శ్రమవలన స్టెయిన్ 26-7-1946న శాశ్వతంగా దూరమైపోయింది. చనిపోవటానికి ముందు "సమాధానం ఏమిటి?" అని అడిగి "అయితే సరి, అని నవ్వి, సమాధానం రాక, "ప్రశ్న ఏమిటి?"అని అడిగింది అదే ఆమె జీవితపరమార్థాన్ని గురించిన అన్వేషణలో చివరిసారిగా అడిగిన ప్రశ్నగా మిగిలింది.

ఆమె చనిపోయాక అమెపై విరుద్ధాభిప్రాయాలు వెలువడ్డాయి. ఒకాయన "log-orrhea, a running of the vowels" అంటే, "syllabic babbling" అన్నాడు ఇంకొకాయన. ఆమె రాసిన పేరగ్రాఫులు ఎమోషనల్‌గా ఉన్నాయి కాని వాక్యాలు కాదన్నాడు ఇంకొకడు. ఇవేవీ నిజం కాదు చిన్నపిల్ల మాటల కూర్పు మొదలు పెట్టి ఎదిగినట్లు ఎదిగింది. ఆమె "she reached to overlaboration by over simplification --against what she considered an effete literature she pitted a primitive, even as barbaric, youthfulness" ఆమె ఎప్పటికప్పుడు కొత్త విషయం కొత్త విధానంలో చెప్పింది. చదువరిని జాగృతం చేయటమే ఆమె లక్ష్యం. ప్రసార విషయంగా ఆమెది అపజయమే. భాషా ప్రయోగ శీలనంలో అద్భుత విజేత. తరువాత రచయిత లెందరికో స్టెయిన్ గొప్ప ప్రేరణగా నిలిచింది. ఆమె సాహిత్య శైలి మూడు రకాలు. 1) hermetic --works illustrated by "The making of Americans". Popularized writings such as Autobiography of Toklas and speech writings are Brwisie and wille" అని ఎస్టిమేట్ చేశారు. ఆమె రాసిన ఇతర నవలలు నాటకాలు పలు కవితలు హాస్యంతో వ్యక్తిగతమైనవే. ఆమె కవిత "a rose is a rose is a rose is arose" దీనికి ఉదాహరణ. These stream-of-consciousness experiments, rhythmical essays or "portraits", were designed to evoke "the excitingness of pure being" and can be seen as literature' s answer to visual art styles and forms such as Cubism, plasticity, and collage. Many of the experimental works such as Tender Buttons have since been interpreted by critics as a feminist reworking of patriarchal language. These works were well received by avant-garde critics but did not initially achieve mainstream success. Despite Stein' s work on "automatic writing" withWilliam James, she did not see her work as automatic, but as an "@excess of consciousness". [citation ne

పికాసో వేసిన క్యూబిక్ ఆర్ట్ పిక్చర్లను ఎక్కువగా కొన్నాకాని సిజన్నే ఆర్ట్ అంటే అమిత ఇష్టం. సర్వ వ్యాపకమైన దానిలో ప్రత్యేకంగా కనిపించే సమానత్వాన్ని ఆమె కోరటం సిజన్నే ప్రభావమే. "కాన్వాస్ అంతా ప్రాముఖ్యమైనదే" అంటాడు సిజన్నే. Stein explained: "The important thing is that you must have deep

down as the deepest thing in you a sense of equalit". ఆమె చేసిన పునరుక్తులు పాత్ర అట్టడుగు స్వభావ వ్యక్తీకరణకే. ఆంగ్లోసాక్సన్ పదాలను ఎక్కువగా వాడింది. అందరూ వాడిన వాటిని వదిలేసింది. Stein predominantly used the present progressive tense, creating a continuous present in her work, which Grahn argues is a consequence of the previous principles, especially commonality and centeredness. Grahn describes "play" as the granting of autonomy and agency to the readers or audience: "rather than the emotional manipulation that is a characteristic of linear writing, Stein uses play. [49]

For me the work of Gertrude Stein consists in a rebuilding, an entirely new recasting of life, in the city of words. Here is one artist who has been able to accept ridicule, who has even forgone the privilege of writing the great American novel, uplifting our English speaking stage, and wearing the bays of the great poets to go live among the little housekeeping words, the swaggering bullying street-corner words, the honest working, money saving words and all the other forgotten and neglected citizens of the sacred and half forgotten city" అన్నాడు యాండర్సన్. హాస్య రచయిత జేమ్స్ థర్బర్ "ఏ పదార్థం లేకుండా ఎనభై వేలకు పైగా పదాల" జాగ్రఫీ అండ్ ప్లేస్ "రాయటం స్టెయిన్ గొప్పతనం" అన్నాడు. దాదాపు నలభై పుస్తకాలు రాసిన స్టెయిన్ బ్రెయిన్ "స్టెన్ గన్" అనిపిస్తుంది. ఎందరో సంగీతకారులు ఆమె రచనలకు సంగీతం కూర్చారు "దేర్‌ఈజ్ నో దేర్" ఎ రోజ్ ఈజ్ యే రోజ్" వంటివి ఎన్నో ఉన్నాయి.❋



## 57. అమెరికా వ్యావహారిక భాషా ప్రచారకుడు, వెర్మాంట్ రాష్ట్ర ఆస్థానకవి-రాబర్ట్ ఫ్రాస్ట్ (1874-1963)

న్యు ఇంగ్లాండ్ అనే మాసాచూసేట్స్‌ను అత్యంత ప్రతిభావంతంగా ఆవిష్కరించినవాడైన రాబర్ట్ ఫ్రాస్ట్ 26-3-1874న కాలిఫోర్నియా రాష్ట్రంలో సాన్ ఫ్రాన్సిస్కోలో జన్మించాడు. అందుకని ఆయన రచనల్లో ఆ మట్టి వాసనలు -నార్త్ ఆఫ్ బోస్టన్, మౌంటేన్ ఇంటర్వెల్, ఫార్దర్ రేంజ్, న్యు హాంప్ షైర్, స్టీపెల్ బుష్ వంటి వాటిలో ప్రత్యక్షమౌతాయి. అమెరికా దూర పాశ్చాత్య భాగంలో జన్మించటం యాదృచ్ఛికం. తలిదండ్రులిద్దరూ తూర్పు ప్రాంతంలో పుట్టిన పల్లెటూరి మేస్టార్లు. ఇక్కడే వారి పూర్వీకులు ఎనిమిది తరాలుగా నివశించారు. తల్లి స్కాట్ లాండ్‌కు చెందిన సముద్ర యాన ఆర్కీ కుటుంబానికి చెందినవారు. తండ్రి వైపువారు ఇంగ్లాండ్ నుండి వచ్చి స్థిరపడిన వాళ్ళు. తండ్రి విలియం ప్రెస్కాట్ ఫ్రాస్ట్ సహజంగా దేనికీ కట్టుబడనివాడు. ఉపాధ్యాయ వృత్తి వదిలేసి, న్యు ఇంగ్లాండ్ రిపబ్లికన్ నుండి తిరుగుబాటు చేసి కాలిఫోర్నియా చేరి అక్కడ సాన్ ఫ్రాన్సిస్కో బులెటిన్ అనే డెమోక్రాటిక్ పార్టీ పత్రికకు సంపాదకుడయ్యాడు. ఆయన మనసంతా సౌత్ మీదే ఉండేది. కొడుకు రాబర్ట్ పుట్టటానికి పదేళ్ళ ముందే సివిల్ వార్ పూర్తి అయినా కొడుకుకు రాబర్ట్ లీ ఫ్రాస్ట్ అని పేరు పెట్టుకొన్నాడు. రాజకీయాలలో ప్రవేశించిన ఆయనకు ఆరోగ్యం సహకరించలేదు. ముప్పై ఏళ్ళకే క్షయ వ్యాధితో చనిపోయాడు. భార్య కొడుకుని, కూతుర్ని తీసుకొని మాసా చూసేట్స్ లోని లారెన్స్ చేరి మామగారి దగ్గర ఉంది. అప్పటికి మనకవి వయసు పది మాత్రమే.

తల్లి మళ్ళీ ఉపాధ్యాయురాలుగా పని చేస్తూ, ఖాళీ సమయాలలో ఇంకా యేవో వ్యాపకాలలో ఉంటూ పిల్లల పోషణ చేసింది. కాలి ఫోర్నియాలో చదువు ఏమీ సాగలేదు రాబర్ట్‌కు. ఎలాగో అలా కాలేజి నుంచి బయటపడ్డాడు. తన చదువు గురించి చెబుతూ ఫ్రాస్ట్ "ఒకటిన్నర ఏడాది యే గ్రేడూ లేని కాలిఫోర్నియా చదువు, నాలుగేళ్ల లారెన్స్ హై స్కూల్ చదువు మాత్రమే నేను చదువుకొన్న చదువు" అన్నాడు. 12వ ఏట

కొద్ది పొలం కౌలుకు తీసుకొని వ్యవసాయం చేశాడు, ఒక "షూ షాప్" పీస్ వర్కర్‌గా పని చేశాడు. 16 ఏళ్ళ వయసులో బాబిన్ వాగన్‌ను లాగేపని లారెన్స్ టెక్స్టైల్ మిల్‌లో చేశాడు. 18 ఏట కార్బన్ పెన్సిల్ లాంపులు స్పిన్నింగ్ యంత్రాలకు అమర్చటం డైనమో బాగు చేయటం వంటి చిన్న చిన్న పనులు చేశాడు. 17 వయసులో డార్ట్ మౌత్ చేరి మూడు నెలలకే మానేశాడు. చాలా రెస్ట్ లెస్‌గా ఉంటూ పుస్తకాలు చదవని శిక్షణ లోటు అనుభవించాడు. తల్లి చేసే చోట ఒక టరం టీచింగ్ చేసి మళ్ళీ వ్యవసాయంలో చెయ్యి కాల్చుకొన్నాడు. షేక్స్ పియర్ కవిని జనాలకు పరిచయం చేసే ప్రయత్నం చేసి అట్టర్ ఫ్లాప్ అనిపించుకొన్నాడు. 19వ ఏట జర్నలిజంలో వేలెట్టాడు. లారెన్స్ సెంటినెల్ పేపర్‌కు రిపోర్టర్‌గా చేరి "అమెరికన్" పేపర్‌కు బదిలీ అయ్యాడు. కాలమిస్ట్‌గా పని చేసస్తూ ఎడిటోరియల్ పేజీ రాశాడు. పద్ధతీ పాడూ లేకుండా పేరాలు రాసేవాడు. కొన్నిసార్లు మత సంబంధ వ్యాసాలూ గిలికేవాడు. చివరికి ఇదే కవిత్వం రాయటానికి దారి చూపింది.

21వ ఏట తన హైస్కూల్ స్వీట్ హార్ట్ సౌందర్య రాశి ఎలినార్ వైట్‌ను పెళ్లి చేసుకొన్నాడు. చదువు పూర్తి చేయాలనుకొని హార్వర్డ్‌లో చేరాడు. విలియం జేమ్స్ దగ్గర చదవాలని ఉండేది. కాని ఫిలాసఫీకి తగిన ప్రాథమిక విషయాలు తెలియవని చేర్చుకోలేదు. రెండేళ్ళు కర్రిక్యులంతో కుస్తీ పట్టాడు. కాని దాన్ని ఓడించటం అసాధ్యమనుకొని "పీటీ దెబ్బ తిని"చదువు మానేశాడు. మరో అయిదేళ్ళు పొలం సాగు, న్యు హాంప్ షైర్ లోని డేర్రిలో ఉన్న పింకేర్టన్ అకాడెమిలో పార్ట్ టైం టీచింగ్‌తో కాలం గడిపాడు. 27 వయసులో న్యు హాంప్ షైర్ స్టేట్‌లోని ప్లిమత్‌లో ఉన్న నార్మల్ స్కూల్‌లో సైకాలజీ బోధించాడు. జే.ఏం సిన్జే, జార్జ్ బెర్నార్డ్ షాల నాటకాలు ఇతర విషయాలు చదువుతూ జ్ఞాన సముపార్జన చేశాడు. టీచింగ్ మాత్రమే తన కెరీర్‌కు తగింది అనుకొన్నాడు. మధ్య మధ్యలో కవిత్వం రాస్తూనే ఉన్నాడు. పదిహేనేళ్ళ వయసులో ప్రెస్కాట్ రాసిన "కాంక్వెస్ట్ ఆఫ్ మెక్సికో" చదివి మురిసిపోయి దాన్ని బాలడ్‌గా రాయటం ప్రారంభించాడు. ఇది లారెన్స్ హై స్కూల్ మేగజైన్‌లో ప్రింట్ అయింది. 19వ ఏట మొట్ట మొదటి ప్రొఫెషనల్ కవిత "ఇండిపెండెంట్ మేగజైన్"లో ప్రచురితమై 15 డాలర్ల పారితోషికం లభించింది. పెద్దగా హుషారు ఇవ్వక పోయినా కవిత్వం కూడు పెడుతుంది అని గ్రహించాడు, నిరాశ నిస్పృహలు తొలగి ఆశా రేఖ కనిపించింది. దీనికి బలం ఇస్తూ, మరో 14 ఏళ్ళు ఆ పత్రిక ఫ్రాస్ట్ కవిత్వాలను ప్రచురిస్తూ ప్రోత్సహిస్తూ ఆదాయాన్ని సమకూర్చింది. మిగతా మేగజైన్లు ఫ్రాస్ట్ కవితలను వేసుకోవటానికి ముందుకు రాకపోయినా ఇండిపెండెంట్ పత్రిక మరో ఆరు కవితలను

ప్రచురించింది. ఫ్రాస్ట్ కవిత్వం పాతమూస కవిత్వానికి భిన్నంగా, పల్లెటూరి భావాలకు బలమిస్తూ వారికి సన్నిహితంగా రాయటమే దీనికి కారణం. ఫ్రాస్ట్ రాసిన "మై బట్టర్ ఫ్లై" రాసిన 20 ఏళ్ళకు అతని మొదటి కవితా సంపుటి అమెరికాలోని న్యు ఇంగ్లాండ్‌లో కాదు అసలైన బ్రిటన్‌లోని ఇంగ్లాండ్ నుండి వెలువడింది. ఇది చాలా అరుదైన గౌరవం, అదృష్టం. దీనికి అనేక కారణాలున్నాయి. రైతుగా బైతు అని పించుకొని, కొన్న పోలాలన్నీ అమ్మేసుకొని, రాళ్ళు రప్పల నేలను సాగు చేయటం తన వలన అయ్యే పని కాదని గ్రహించి పూర్తిగా కమతానికి దూరమయ్యాడు. ఇప్పుడు మధన ప్రారంభమై తాను ఏదైనా కవిత్వం కాని కాకరపీచు కాని రాయటానికి ఆలోచన ఉన్నవాడినేనా రాయగలనా అని వితర్కించు కొన్నాడు. తాత్కాలికంగా ఫ్రాస్ట్ దంపతులు బకింగ్ హాం షైర్లో ఉండి, అక్కడ ఇరుగు పొరుగు వారిద్దరూ వ్యవసాయం చేస్తూ కవులైన వారి సంగతి గ్రహించాడు. మిగిలిన రచయితలు రూపర్ట్ బ్రూక్, ఎడ్వర్డ్ థామస్ లతో పరిచయం పెంచుకొన్నాడు. థామస్‌పై ఫ్రాస్ట్ ప్రభావం అధికమై తన కవితా సంకలనాన్ని ఫ్రాస్ట్‌కు అంకితమిచ్చాడు.

ఒక రోజు తాను రాసిన కవితలను అచ్చుకాని వాటిని తిరగేస్తూ ఉండగా తాను ఇరవై ఏళ్ళుగా రాసిన కవిత్వం అంతా రాశీ భూతమై కనిపించి జలదరించింది. ఎప్పుడూ డబ్ల్యు ఇ.హెన్లీ కవిత్వాన్ని ఆదరిస్తూ మెచ్చుకొనే ఫ్రాస్ట్‌కు తన కవిత్వ "కవిలె కట్ట"ను హెన్లీ పబ్లిషర్‌కు పంపాలనే ఆలోచన వచ్చింది. ఫ్రాస్ట్ ఎవరో ఆ పబ్లిషర్‌కు తెలియక పోయినా, ముద్రించటానికి వెంటనే అంగీకరించి ముందుకొచ్చాడు. కవి లాంగ్ ఫెలో కవితలో ఒక ఫ్రేజ్ "మై లాస్ట్ యూత్"ను స్ఫూర్తిగా తీసుకొని "ఎ బాయ్స్ విల్" పేరిట ప్రచురించాడు. అప్పటికి ఫ్రాస్ట్ వయసు 38.

విమర్శకులు ఫ్రాస్ట్ లిరిక్స్‌ను బాగా ఆదరించారు. ఆయన వాడిన అతి సాధారణ శబ్ద జాలాన్ని, పరిశీలనా దృష్టినీ అభినందించారు. మరచిపోయిన ఆలోచనలను మరపురాని విధంగా మలచిన తీరు అసాధారణం అన్నారు. ఒక ఏడాది తర్వాత రెండవ పుస్తకం అచ్చు అయి ఫ్రాస్ట్ కీర్తి బాగా వ్యాపించి ప్రసిద్ధుడయ్యాడు. అట్లాంటిక్‌కు ఇరువైపులా ఉన్న దేశాలు "నార్త్ ఆఫ్ బోస్టన్" కవిత్వంలో నవీన హృదయానందకర భావాలు సహజ సుందరంగా మానసిక విశ్లేషణాత్మకంగా ఉన్నాయని మెచ్చుకొన్నారు. సాధారణ భాషను అత్యంత శక్తివంతంగా ప్రయోగించిన తీరు అందర్నీ ఆకట్టుకొన్నది. కవితాపరంగా నేటివిటీ ఉన్న విషయాలను ఎన్నుకొని వాటిని అందల మెక్కించాడు. అందులో వ్యావహారిక పదాలు అందాలొలుకుతూ సొగసు చేకూర్చాయి. ఇదొక కొత్త వరవడి. మార్క్ వాన్ డోరేన్‌కు ఫ్రాస్ట్ కవితలో సహజ సంభాషణా చాతుర్యం ఉట్టిపడింది. ఆయన ఏది రాసినా ప్రజలు మాట్లాడుకొన్నట్లుగా ఉండటం గొప్ప విశేషం. ఫ్రాస్ట్‌కు

గొప్ప గొప్ప విషయాలను యెంత తేలిక పదాలలో చెప్ప వచ్చో బాగా తెలుసు. అందుకే అతని కవిత్వంలో సహజత్వం పరిమళిస్తుంది" అన్నాడు.

నార్త్ ఆఫ్ బోస్టన్‌కు ఉపశీర్షికగా "ఎ బుక్ ఆఫ్ పీపుల్" అని పెట్టటం సార్థకమైంది. ప్రజల గురించేకాదు వారి నేపథ్యాన్నీ వివరించే కవితలు ఇవి. కొన్ని గంభీరంగా ఉన్న డ్రామాలూ రాశాడు. వీటిలో ఏకాంకికలే ఎక్కువ. వ్యవసాయం ఒట్టిపోయి ఆ ప్రదేశంలో పారిశ్రామిక విస్తరణ జరుగుతున్న నేపథ్యంపై ఎక్కువగా రాశాడు. అతని సహచరుడు న్యు ఇంగ్లాండ్ కవి ఎడ్విన్ ఆర్లింగ్టన్ రాబిన్సన్ లాగానే స్వీయ ప్రేమ, కోరికలోని చెడును వ్యతిరేకిస్తూ ఫ్రాస్ట్ కవితలల్లాడు. కానీ ఆయన లాగా కాకుండా అడవులు మానసిక ప్రశాంతికి నిలయాలని, సహజ రోగ నివారకాలని, భూమి అన్నీ ఇచ్చే మాతృమూర్తి అని నమ్మాడు. రాబిన్సన్‌తో కలిసి ముసలి, ముతక, పేద బలహీన వర్గాలకు సహాయం చేసి సంతృప్తి చెందాడు.

నార్త్ ఆఫ్ బోస్టన్‌లో ప్రజలే డామినేట్ చేస్తారు. "హోం బరియల్" కొత్త అసాధారణత కనిపిస్తుంది. ఇందులోని మాటలు అందరూ మాట్లాడేవే. కాని సందర్భం మాత్రం చాలా విశేషంగా ఉంటుంది. సహజమైన మాటలే కాని అనుభవంలో అసాధారణంగా ఉంటాయి. కాళ్ళ చెప్పులకు అంటిన బురద కూడా కవితాస్థానం పొందింది. "ది విచ్ ఆఫ్ కూస్" దెయ్యం కథ. చనిపోయిన వాడి ఎముకలు మెట్లు ఎక్కి భయం, భీభత్సం సృష్టిస్తాయి. "కోడ్" అనేది మరో వింత కామెడి, దాదాపు ట్రాజెడీ. "The House keeper "is an instance of pure talk not only in poetry but talks as poetry". అదొక కుటుంబ నాటకం.

1915లో ఫ్రాస్ట్ అమెరికాకు ఒక సెలెబ్రిటిగా తిరిగొచ్చాడు. అజ్ఞాత వ్యక్తిగా అమెరికా నుండి బయటికి వెళ్ళినవాడు ఇప్పుడు "నవీన అమెరికా కవిత్వ నాయకుడి"గా కాలుపెట్టాడు. విమర్శకులు బ్రహ్మ రథం పట్టారు. ఆయన తమవాడే నని యెగిరి గంతు లేశారు. లండన్‌లో ఎజ్రా పౌండ్ స్నేహితుడుగానే కాక పోషకుడుగా ఉండేవాడు. ఫ్రాస్ట్‌ను "ఇమేజిస్ట్" కవిగా మారుద్దామని ప్రయత్నించి విఫలుడయ్యాడు. కొందరు క్లాసిస్ట్ అని మరికొంత మంది హ్యూమనిస్ట్ అని, రియలిస్ట్ అని రూరలిస్ట్ అనీ అన్నారు. వీటికి సమాధానంగా ఫ్రాస్ట్ "If I must be classified I might be called a Synecdochist, for I prefer the synecdoche in poetry --that figure of speech in which we use a part for the whole" అని స్పష్టంగా చెప్పాడు. తాను అఖండత్వాన్ని కోరేవాడినని అందులో యే కొద్దిభాగమైనా పూర్ణత్వానికి ప్రతీకగా ఉంటుందని అర్థం.

ఇలాంటి సరదా స్టేట్‌మెంట్‌లు ఆయన కిష్టం. ఎక్కువగా చెప్పకుండా అన్నిటినీ సూచించటం ఫ్రాస్ట్ లక్షణం. ఒక మేధావి సలహా మేరకు రోజూ ఒక అవ్యక్త ఉపన్యాసం రాసి దానికి చక్కని ఆకృతి కలిపించేవాడు. రియలిజంపై చెబుతూ "రియలిస్ట్‌లలో రెండు రకాలున్నారు. ఒకాయన అసలైన పోటాటోను చూపించటానికి దానికి అంటిన మట్టీ మశానంతో సహా చూపిస్తాడు. అది నమ్మినవాడు దాని దుమ్ము దులిపి అసలు బంగాళా దుంపను చూపిస్తాడు. నేను రెండో రకం వాడిని. కళ జీవంతో ఉండాలంటే దాన్ని శుభ్రం చేసి తోలు తీయాల్సిందే నాది అదే పని" అన్నాడు. "ఒక్కోసారి నేను రాసే పదాలలో అనుమానం వచ్చి నన్ను నేనే ప్రశ్నించుకొంటాను. నాకు సరైన సమాధానమే లభిస్తుంది. మాటలు వాటికి కావాల్సిన స్థానాల్లో అవే వచ్చి చేరుతాయని నమ్ముతాను. సాహిత్యంపై నా నిర్వచనం "మాటలు చేతలుగా మారటం" అన్నాడు ఫ్రాస్ట్.

ఫ్రాస్ట్ భావాలన్నీ ఆయన లాండ్ స్కేప్‌కు చెందినవే. ఆ లాండ్ స్కేప్‌లో ఆయన ముఖమే ప్రత్యక్షమౌతుంది. ముడి గ్రానైట్ రాయిని సాన బెడితే వచ్చే బొమ్మలాగా ఆయన కవళికలు ఉంటాయి. పాలిపోయిన నీలి కళ్ళు వేళాకోళం చేస్తున్నట్లున్న నవ్వు, కందిరీగ కుడితే వాచిపోయినట్లున్న కింది పెదవితో బలీయమైన శరీరంతో కనిపిస్తాడు ఫ్రాస్ట్. ముభావం గంభీరం అయిన విద్యావేత్త ముఖం ఆయనది. తన "కనెక్టెడ్ పొయెమ్స్"కు ముందుమాట రాసుకొంటూ "విద్యావేత్తలూ కళాకారులను విసిరేసిన తర్వాత వాళ్ళు బాధ పడుతూ తమలో విభేదాలకు కారణం ఏమిటి అని వితర్కించుకొంటారు. ఇద్దరూ కూడా జ్ఞానం ద్వారానే పని చేస్తారు అయితే తేడా ఎక్కడ ఉంది అంటే వారు పొందిన జ్ఞాన మార్గాలలో తేడా అని నా అనుమానం. విద్యావేత్తలు తమ మనస్సాక్షి పరిపూర్ణతతో, తర్కంతో, జ్ఞాన సముపార్జన చేస్తారు. కవులు పుస్తకాలతోనూ, అవిలేకుండాను ఉత్సాహ ఉల్లాసాలతో సాధిస్తారు. వారు దేనికీ కట్టుబడి ఉండరు. కాని తమవద్దకు వచ్చి చేరి అంటుకొనే వాటిని తప్పకుండా స్వీకరిస్తారు.

మళ్ళీ అమెరికాకు తిరిగి రాగానే యథాప్రకారం ఒక ఫారంను కొని సాగు మొదలు పెట్టాడు. హాలిక కవి అయ్యాడు. మొదటగా న్యు హాంప్ షైర్‌లోని ఫ్రాన్కోనియా వద్ద కొండ ఎక్కే మార్గంలోను, తర్వాత వెర్మాంట్ లో షా, ఫ్ట్ బరీ, కాంకార్డ్, కార్నర్స్, రిప్టన్‌లలో కొన్నాడు. డబ్బు పోయీ శనీ పట్టే నన్నట్లు చేతులు కాల్చుకోవటమేకాని పెన్నీ రాబడి రాలేదు. మళ్ళీ లెక్చరింగ్ చేబట్టి "కల్చర్ అగ్రి కల్చర్ కు ఊతమిస్తుందను" కొన్నాడు. చాలా ప్రతిభావంతంగా, యాదృచ్ఛికంగా, అతి సహజంగా మాట్లాడే నేర్పున్నవాడు కనుక శ్రోతలను బాగా మెప్పించేవాడు. తన కవితల్ని వినిపించేవాడు.

వాటితో స్థానిక కథలకు ప్రచారం జరిగింది. అనేక గ్రంథాలు, చాటువులు వినిపించి అలరించేవాడు. మళ్ళీ కాలేజిలో చేరాడు. ఈ సారి విద్యార్థిగానో విద్యా వేత్తగానో కాదు "పోయెట్ రెసిడెన్స్"గా కాంపస్ ఇంఫ్లుఎన్స్‌గా, ఒక విధంగా "పొయెటిక్ రేడి యేటర్"గా చేరాడు. 40వ ఏట నుండి అనేక విద్యా సంస్థలలో ఇలా గడిపి, మిచిగాన్‌లోని డార్ట్ మౌత్‌లోను, ముఖ్యంగా మెసా చూసేట్స్‌లోని అమ్ హెర్స్ట్‌లో ఉన్నాడు.

నార్త్ ఆఫ్ బోస్టన్ ప్రచురణ తర్వాత ఇక ఆపు లేకుండా కవిత్వ పఠనం, రచనలలో మునిగిపోయాడు. రాసినది ప్రతిదీ స్వీయానుభవంతో భావ తీవ్రతతో రాశాడు. అవసరమైన చోట్ల విషాద మలుపులు పెట్టేవాడు. కొన్నిసార్లు ఆయన కవిత్వం కబుర్లు చెప్పేది. మరికొన్ని సార్లు వాటి బాణీలను అవే కట్టుకొని బయట పడేవి. చాలాసార్లు మాట్లాడుతూ పాటలతో పలకరించేవి. 1916లో "మౌంటేన్ ఇంటర్వల్" ప్రచురించాడు. అందులో "యాన్ ఓల్డ్ మానస్ వింటర్ నైట్, "బిర్చేస్" "ఫైర్ అండ్ ఐస్" వంటివి అద్భుతమనిపిస్తాయి. చాటువులలో నిరుత్సాహ భావాన్ని పొదిగేవాడు. ఉదాహరణకు –"Some say the world will end in fire --some say in ice --from what I have tasted of desire --I hold with those who favor fire -.But if it had to perish twice --I think I know enough of hate --To say that for destruction ice --is also great --And would suffice"

ఫ్రాస్ట్ ప్రజాకవి అయిపోయాడు బిరుదులూ, గౌరవాలు వచ్చి పడుతున్నాయి. "నేషనల్ ఇన్ స్టి ట్యూట్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ లెటర్స్" బంగారు పతకమిచ్చి సత్కరించింది. అనేక సంస్థలు విద్యాలయాలు ఆహ్వానించి సన్మానించాయి. నాలుగుసార్లు పులిట్జర్ బహుమతి పొంది, రికార్డ్ సృష్టించాడు. ఈ గౌరవాలు ఆదరాలు ఆయన కవిత్వానికి ఆటంకం కాలేదు. వీటి గురించి తన మొదటి పుస్తకంలోనే "They would not find me changed from him they knew --only more sure of all I thought was true" అని రాసిన నిర్లిప్తుడు ఫ్రాస్ట్. పొగడ్తల హోరు విజ్రుమ్భించినా, అతని వ్యతిరేకులు మాత్రం తన పాత అప్రయత్న విధానాన్ని బలి చేశాడు అన్నారు. ఇప్పుడు వాళ్ళ కళ్ళకు ఫ్రాస్ట్ "Play with the role of a self conscious home-spun philosopher"గా కనిపించాడు. ఫ్రాస్ట్ అభిమానులు నిత్య జీవితంలోని సమస్యలను వదిలి సంప్రదాయవాదిగా ఉన్నదన్నారు. అన్ని సంక్షేమ కార్యక్రమాలపై ఆయనకు ఉన్న తూష్ణీ భావాన్ని తెలియజెప్పటానికి ఆయన రాసిన– "I have none of the tender than --thou --Collectivistic regimenting love --with which the modern world is being swept" పంక్తులను ఉదహరిస్తారు. "నేను

యువకుడిగా ఉన్నప్పుడు రాడికల్‌గా ఉండటానికి సందేహించా. కారణం ముసలి వయసులో కన్జర్వేటివ్‌ను అయిపోతానేమోనని భయం" అన్నాడు. ఎప్పుడు ఆయన సేఫ్ జోన్‌లో ఉండేప్రయత్నమే చేశాడు అంటారు. ఆయనది "క్రాకర్ బాక్స్ ఫిలాసఫీ" అన్నారు. అయితే జీవించి ఉన్నయే అమెరికా కవీ ఫ్రాస్ట్‌లాగా సామాన్య మనుషుల చర్యల గురించి రాయలేదు" అన్నాడు ప్రముఖ విమర్శకుడు జారెల్. "వాళ్ళందరూ వాస్తవ వ్యక్తులు. వారిమాటలు, ఆలోచనలూ, ఎమోషన్లూ యదార్థాలే. ఇవన్నీ చదివితే ఫ్రాస్ట్ తాను రాసిన పుస్తకాలలో లేడని, యదార్ధ ప్రపంచంలోనే ఉన్నాడని తెలుస్తుంది. వస్తువుల విషయాలలోని ఆహ్లాదం విషాదం, నిరుత్సాహం ఆయనలోని వేదన అన్నీ అర్ధవంతాలైన కవిత్వం రాశాడు. ఇంతకంటే ఎక్కువ న్యాయాన్ని సున్నితత్వానికి, ప్రేమకు, ఆనందానికి కలిగించిన వారు లేరు అన్నది పూర్తి యదార్ధం.

కవులు ముసలి వారైన కొద్దీ పాడాలనే అభిలాష తగ్గిపోతుంది కాని దీనికి విరుద్ధం ఫ్రాస్ట్. యాభై, అరవై ఏళ్ళ మధ్య ఆయన వైవిధ్యం తారా స్థాయికి చేరింది. "happiness makes up in height for what it lacks in length", "choose something like a star", the gift out right" వంటివి ఎన్నో. వీటిలో "కమిన్" చాలా చిన్నదిగా షార్ప్ గా ఉంది "As I came the edge of the woods -- thrush music hark --now if it was dusk outside --inside it was dark

I was out for stars --I would not come in-I meant not even if asked-
And I had not been"

ఫ్రాస్ట్ 80వ పుట్టిన రోజున "ఎఫోర్ సెడ్" అనే ఆయనకు ఇష్టమైన ఆయనే ఎంపిక చేసిన అభిమాన కవితా సంపుటి వెలువడింది. రాబిన్సన్ చనిపోయాక వచ్చిన "కింగ్ జాస్పర్"కు ముందుమాట రాస్తూ ఫ్రాస్ట్ "The style was not only the man but that style was the way the man takes himself" అని రాశాడు. కవిత తనను తానూ చెప్పుకు పోవాలి అని ఫ్రాస్ట్ అభిప్రాయం. చాలా అరుదుగానే తానూ వివరణలిస్తాడు. "కవిత ఆనందం తో ప్రారంభమై జ్ఞానంతో అంతమవాలి" అన్నదే ఫ్రాస్ట్ దృక్పధం. మానసిక స్థితి–మూడ్‌కు అది మొదటి చిత్రం అవుతుంది. రాసేవాడికి చదివే వాడికి ఆశ్చర్యం ఉండదు. "For me the initial delight is in the surprise of remembering something I did not know I knew" అంటాడు ఫ్రాస్ట్.

ఫ్రాస్ట్ ప్రాచుర్యానికి కారణాలు వెతకటం కోసం పెద్దగా కష్టపడక్కర లేదు. ఆయన మార్గదర్శికత, కవితా పదజాలం, అందులోని సొగసు చదువరులను కట్టి

పడేసి ఆయనకు కృతజ్ఞులౌతారు. కవితలు యెంత ఆకర్షణగా ఉంటాయో అంత సవాలుగా ఉండటం ఆయన ప్రత్యేకత. అందుకే రచయిత లూయీ అంటర్ మేయర్ "never has poetry accomplished a more complete act of sharing" అని ఫ్రాస్ట్ కవిత్వ ప్రత్యేకతను తెలియజేశాడు.

1922 జూన్‌లో వెర్మాంట్‌లోని "స్టేట్ లీగ్ ఆఫ్ వుమెన్స్ క్లబ్" "రాబర్ట్ ఫ్రాస్ట్‌ను" వెర్మాంట్ ఆస్థాన కవిగా ప్రకటించింది. దీన్ని "న్యు యార్క్ టైమ్స్" అధిక్షేపిస్తే సారా క్లెఫ్ హార్న్ మొదలైన మహిళలు సమర్ధించారు. 1961 జులై 22న వెర్మాంట్ రాష్ట్ర శాసన సభ సంయుక్త సమావేశంలో ఫ్రాస్ట్‌ను "వెర్మాంట్ రాష్ట్ర ఆస్థాన కవి"గా ప్రకటించి గౌరవించింది. వెర్మాంట్ రాష్ట్రం ఫ్రాస్ట్ పేరును అక్కడున్న ఒక పర్వతానికి పెట్టి గౌరవించింది.

ఫ్రాస్ట్ జీవితకాలంలో సుమారు 40 కవితా సంపుటాలను, 4 నాటకాలను, 7వచన గ్రంథాలను రాశాడు. అయన రాసిన లేఖలు "లెటర్స్ ఆఫ్ రాబర్ట్ ఫ్రాస్ట్"గా వచ్చాయి. మానవ అస్తిత్వాన్ని అన్వేషించటంలో, తనతో సంబంధం లేని విశ్వంలో ఒంటరితనం పైనే కవిత్వం రాశాడు. ఫ్రాస్ట్ కవిత్వం 19వ శతాబ్ది అమెరికన్ కవిత్వ క్రాస్ రోడ్‌పై ఉంది అన్నారు. Frost believed that "the self-imposed restrictions of meter in form" was more helpful than harmful because he could focus on the content of his poems instead of concerning himself with creating "innovative" new verse forms.[26]

ఫ్రాస్ట్ పబ్లిక్‌లోకి బాగా వచ్చేవాడు. అసలు ఆయనను రుషి అనాలా కవి అనాలా అనే సందిగ్ధం ఉంది. 28 యూనివర్సిటీల నుందడి గౌరవ డిగ్రీలు పొందాడు. అందులో రెండు ఇంగ్లాండ్ యూనివర్సిటీలు ఉండటం విశేషం. ఆయనను వర్డ్స్ వర్త్‌తో పోలుస్తారు. "నీకు అదృష్టం దురదృష్టం ఏదైనా పట్ట వచ్చు. కాని నీకు చివరికి కావాల్సింది కృప మాత్రమే" అంటాడు. దీనిపైనే "ఎ మాస్క్ ఆఫ్ రీజన్" ఎ మాస్క్ ఆఫ్ మెర్సి" అనే రెండు దీర్ఘ కవితలు రాశాడు. 89ఏళ్ళు "నాన్ కన్ఫర్మార్"గా జీవించి 29-1-1963న రాబర్ట్ ఫ్రాస్ట్ "మరణ మంచు"-డెత్ ఫ్రాస్ట్‌లో కలిసిపోయాడు. "గ్రేటెస్ట్ ఆఫ్ ది అమెరికన్ పోయేట్స్ ఆఫ్ ది సెంచరి" అని పించుకొన్నాడు. అమెరికాలోని న్యు ఇంగ్లాండ్ జానపద కవిగా ప్రారంభమైన ఆయన కవితా ప్రస్థానం జాతీయ, అంతర్జాతీయ కీర్తి నార్జించింది. జాన్.ఎఫ్ .కెన్నెడి అమెరికా ప్రెసిడెంట్ అయినప్పుడు రాబర్ట్ ఫ్రాస్ట్‌ను సగౌరవంగా ఆహ్వానించి సత్కరించి "ది గిఫ్ట్ అవుట్ రైట్" కవితను చదివించి ప్రజలకు స్ఫూర్తి కలిగించాడు. అంతవరకూ యే అమెరికన్ ప్రెసిడెంట్ కూడా ఒక కవికి ఇంతటి గౌరవాన్ని పదవీ ప్రమాణంనాడు కలిగించలేదు. కెనెడీ ఫ్రాస్ట్‌లు రికార్డ్ సృష్టించారు. ❁



## 58. రేడియో కనిపెట్టిన- గుగ్లీల్మో మార్కోని (1874-1937)

25-4-1874న గుగ్లీనో మార్కోని ఇటలీదేశంలోని బోలానాలో పుట్టినప్పుడు, వాళ్ళ పక్కింటి ఆయన ఈ పిల్లాడిని చూసి అతని చెవులు చేటల్లాగా ఉన్నాయని అన్నాడట. వాళ్ళమ్మ వెంటనే "అయితే మనం ఎవరం వినలేని శబ్దాలను మావాడు వింటాడన్న మాట" అని బదులిచ్చిందట. ఐరిష్ జాతికి చెందిన తల్లి ఆ చెవులకు సంగీత మాధుర్యాన్ని అందించేది. తండ్రి సంపన్నుడైన బిజినెస్ మాన్ కనుక కొడుకును అందరూ చదివే చదువు కాకుండా గొప్ప చదువు చదివించాలనుకొన్నాడు. ఫ్లారెన్స్ అండ్ లెగ్ హారన్ వంటి ప్రసిద్ధ విద్యా కేంద్రాలలో చేరక ముందు మార్కోని ఇంటికొచ్చి మేస్టార్లు విద్య నేర్పేవారు. తండ్రి లైబ్రరీలో ఉన్న పుస్తకాలను బాగా చదివేవాడు. ముఖ్యంగా భౌతిక శాస్త్రాన్ని ఆసక్తిగా చదివాడు. అందులో ఎలక్ట్రిసిటిపై విపరీతమైన అభిమానమేర్పడింది. తండ్రి కట్టించిన అటకపై కూర్చుని ప్రయోగ శాలగా కరెంట్ వైర్లు బాటరీలతో ఏదో ప్రయోగాలు చేసేవాడు. 12ఏళ్ళ వయసులో గాలిలోని పదార్థాల గురించి బాగా అర్థం చేసుకొన్నాడు. 13వ ఏట గాలి నుంచీ నైట్రేట్‌ను తయారు చేసే ప్రయత్నం చేశాడు.

మార్కోనికి 14 ఏళ్ళు వచ్చినప్పుడు హీన్రిచ్ రుడాల్ఫ్ హెర్ట్జ్ వాయు తరంగాలపై తాను చేసిన ప్రయోగ ఫలితాలను ప్రచురించాడు. గాలిలో తరంగాలున్నాయి అనేది కొత్త విషయం కాదు. 1864లో జేమ్స్ క్లార్క్ మాక్స్ వెల్ కాంతిలోని విద్యుదయస్కాంత తరంగాలను, విద్యుత్ తరంగాలను ప్రయోగాత్మకంగా ప్రదర్శించే ప్రయత్నం చేశాడు. వాటి పొడవు వెలాసిటిలను చెప్పాడు. కాని ఆయన సిద్ధాంతం ప్రయోగాత్మకంగా రుజువు కాలేదు. అందుకే చాలాకాలం అది సిద్ధాంతంగానే హెర్ట్జ్ ప్రయోగం చేసి రుజువు చేసేదాకా ఉండి పోయింది. గదిలో ఏలెక్ట్రికల్ వేవ్స్‌ను హెర్ట్జ్ పంపగలుగుతున్నాడని, ఎలెక్ట్రిక్ ఆసిలేటర్ ద్వారా దానికి 20 అడుగుల దూరంలో ప్రేరిత విద్యుత్ (ఇన్ డ్యూసింగ్ కరెంట్)ను సృష్టించాడని చదివి ఆశ్చర్య పోయాడు మార్కోని. వైర్ లెస్‌లో అద్భుతమైన శక్తి దాగి ఉందని గ్రహించాడు. గాలిని మాధ్యమంగా తీసుకొని వార్తలు మ్యూజిక్, ప్రసంగం మొదలైనవానిని పంపవచ్చుని, భద్ర పరచ వచ్చునని

ఊహ చేశాడు. ఒక స్పందనను వైర్లు లేకుండా కొన్ని అడుగుల దూరం పంపగా లేనిది, మైళ్ళ దూరం పంపలేమా అని ఆలోచించాడు. ఇది సాధ్యమైతే ప్రపంచ వ్యాప్తంగా పంపించవచ్చు అని ఆయన మస్తిష్కంలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది. దీనినే మార్కొని ఇంట్యూషన్ అంటే అంతర్ దృష్టి అన్నాడు. "ఈ తరంగాలు కొద్ది రోజుల్లోనే ప్రపంచ వ్యాప్తమై కొత్త సమాచార వ్యవస్థ ఏర్పడుతుంది" అని చెప్పాడు.

16 వయసులో మార్కొనికి తన జీవిత లక్ష్యమేమిటో తెలిసింది. బొలోనా యూనివర్సిటీలో ఎలెక్ట్రో మాగ్నేటిజంపై పరిశోధనలు చేస్తున్న ఫిజిక్స్ ప్రొఫెసర్ అగస్టోరిఘి వద్ద చేరి చదివాడు. అక్కడి మిగిలిన శాస్త్రవేత్తలు హెర్జియన్ తరంగాల పని తీరుపై పరిశోధిస్తున్నారు. అంతమాత్రంగా మార్కొని దానికేమీ భంగ పడలేదు. ఒక "ప్రేరణ వేష్టనం" అంటే ఇండక్షన్ కాయిల్, కొన్ని పరికరాలు మోర్స్ కీ, ట్రాన్స్ మీటర్, మల్టిపుల్ డిస్చార్జర్ (స్పార్క్ గాప్)తో ప్రయోగాలు సాగించాడు. పారిషియన్ ఫిజిసిస్ట్ అడొర్డ్ బ్రాన్లీ నుంచి అరువుగా మరొక పరికరం తీసుకొన్నాడు. బ్రాన్లీ లోహముక్కలు నింపిన గ్లాస్ ట్యూబ్‌ను ఉపయోగిస్తూ హేతు బద్ధంగా ప్రయోగం చేస్తుంటే మెకానికల్ షాక్‌తో పడిపోయాడు. మార్కొని ఇందులోని సిద్ధాంతాన్ని గ్రహించి నిర్మాణాన్ని వృద్ధి చేశాడు. పలుచటి థర్మామీటర్ గ్లాస్ ట్యూబ్‌లో నికెల్ పొడి వేసి, దానిలోకి కరెంట్ పంపాడు. అది అతని ఆలోచనలను సరియైనవే నని రుజువు చేస్తూ ఒక కండక్టర్‌గా పని చేసింది. దానిపై నెమ్మదిగా తట్టితే లోపలి రేణువులు దూరమై అంచనా తప్పింది. తరువాత ఇనుము, కాపర్ జింక్, బ్రాస్‌లతో ప్రయోగాలు చేశాడు. ఇవేవీ ఊహించిన ఫలితాలివ్వ లేదు. చివరికి నికెల్ సిల్వర్ మిశ్రమం బాగా సెన్సిటివ్‌గా ఉంటుది కనుక దాన్ని వాడాలని నిర్ణయానికొచ్చాడు. స్పందనలను పెంచుతూ, పరికరాన్ని మరింత శుద్ధి చేస్తూ ప్రయోగాలు చేశాడు. ఇప్పటివరకు హెర్టీజియన్ ఆసిలేటర్‌కు ఉన్న రెండు కడ్డీలను తీసేసి స్పార్క్ డిస్చార్జర్ ఒక టెర్మినల్‌ను ఎత్తుగా స్థంభం మీదున్న మెటల్ కండక్టర్‌కు కలిపాడు. రెండవ టెర్మినల్‌ను భూమిలో పాతిపెట్టిన మెటల్ ప్లేట్‌కు కలిపాడు. దీనితో వైర్ లెస్ లాబ్ నుండి గాలిలోకి దూసుకు పోయింది అని మార్కొని జీవిత చరిత్ర రాసిన ఆరిన్ డన్లాప్ అంటాడు. దీనితో సృష్టింపబడిన స్పార్క్ చేయలేని పని, ప్రయాణం చేయలేని దూరం అనేవి లేకుండా పోయాయి. సమాచార వ్యవస్థలో ఇదొక గొప్ప విప్లవం. దీని సాధకుడు మార్కొని.

వైఫల్యాలను దాటి విజయాలు సాధించాడు మార్కొని. భవనం మూడవ అంతస్తులో ఒక "కీ" పెట్టి, కింద బేస్మెంట్‌లో బెల్లును మోగించాడు. పైంతస్తులో ఒక యంత్రం పెట్టి మోర్స్ కోడ్‌లోని మూడు చుక్కల ద్వారా ఎస్ అనే అక్షరాన్ని కింద లాన్‌లో వినపడేట్లు చేశాడు. ఎక్కువ శక్తిని తరంగాలలో నింపే ప్రయత్నం చేశాడు. వాటిని శక్తి పుంజాలుగా మార్చి ఎక్కువ వేగం కలిపించాడు. స్పార్క్ లకు మరింత శక్తి

కలిగించాడు. దీని వలన రిసీవర్ స్పష్టంగా పదునుగా వార్తలను గ్రహించేది. 21వ ఏట ఒక మైలు దూరంలో పల్లెటూరిలో ఉన్నతండ్రి ఫారం హౌస్‌కు మెసేజ్ పంపగలిగాడు. మొదట వాడిన పరికరం శక్తిని బాగా పెంచి రెట్టింపు దూరం మెసేజ్ పంపాడు. మార్కొని కున్న ప్రభావం కలను స్నేహితులు అతని పరిశోధనా ఫలితాలను, ఇటలీ ప్రభుత్వ దృష్టికి తీసుకొని వెళ్ళారు. అదేమంత గొప్ప విషయం కాదని, ఆ కాలంలో పక్కానికి వచ్చిన పండులాంటి జ్ఞానం అనీ తేలిగ్గా కొట్టి పారేశారు అధికారులు. దీన్ని లక్ష్య పెట్టకుండా, తండ్రి ఇచ్చిన ప్రోత్సాహం, అంతకుముందే సర్ ఆలివర్ లాడ్జ్ చేసిన పరిశోధనా ఫలితాలను అర్ధం చేసుకొని ఇంగ్లాండ్ వెళ్ళాడు.

22ఏళ్ళ 6నెలల వయసున్న మార్కొని కళ్ళు తిరిగే ప్రదర్శనలు చేసి అందరి మెప్పు పొందాడు. మొదటిసారిగా వైర్లెస్ టెలిగ్రఫీకు పేటెంట్ పొందాడు. బ్రిస్టల్ చానెల్ గుండా 10మైళ్ళ దూరం మేసేజ్ పంపగలిగాడు. అప్పుడు ఇటలీ ప్రభుత్వం కళ్ళు తెరిచి మార్కొని ని స్వదేశానికి తిరిగి రమ్మని ఆహ్వానించింది. దాన్ని గౌరవించి వెళ్లి ఇటాలియన్ రేవీరా వద్ద ఉన్న స్పెజియాలో ఒక స్టేషన్ ఏర్పాటు చేసి సముద్రంలో 12మైళ్ళ దూరంలో ఉన్న యుద్ధ నౌకలతో వార్తా సంబంధాన్ని ఏర్పరచాడు. అప్పటికే ఆయన స్వంత వైర్లెస్ టెలిగ్రాఫ్, సిగ్నల్ కంపెనీలు ఏర్పరచుకొన్నాడు. మళ్ళీ ఇంగ్లాండ్ వెళ్లి ఇంగ్లీష్ చానెల్ ద్వారా సమాచారం అందుకోవటం చేశాడు.

ఈప్పటిదాకా కళ్ళు మూసుకొన్న బడా బడా సైంటిస్ట్‌లు ఇప్పుడే ఒక యువ సైంటిస్ట్ ఒక గొప్ప అభివృద్ధిని సైన్స్‌లో సాధించాడని ప్రకటించారు. అయితే మార్కొని గొప్పతనమేమిటో ప్రజలకు 1898 వరకు అంటే మొదటి వైర్లెస్ పరికరాన్ని ఒక లైట్ షిప్‌లో ఏర్పాటు చేసే దాకా తెలియదు. కొద్ది కాలానికి ఆ షిప్ ఒక స్టీమర్ తాకిడికి దెబ్బతింది. సహాయం కోసం మెసేజ్‌లు లైట్ హౌస్ కు అందాయి. వెంటనే లైఫ్ బోట్‌లను పంపి సమాచార వ్యవస్థను అత్యంత వేగంగా సమర్ధంగా పునరుద్ధరించారు. ప్రసార దూరం క్రమక్రమంగా పెరిగి, 74 మైళ్ళ దూరం వరకు సమాచారం పంపటం కుదిరింది.

ఆధునిక ప్రపంచంలో మార్కొని సాధించింది అత్యద్భుత శాస్త్రీయ విజయమే అయినా ఆయన తాను ఇంకా ప్రాధమిక దశ లోనే ఉన్నానని చెప్పేవాడు. ప్రసారం చానెల్ దాటిందీ అంటే అట్లాంటిక్ సముద్రాన్నీ దాటించవచ్చు అనే నమ్మకం కుదిరింది. పాత పుస్తకాల జ్ఞానం వంట బట్టించుకొన్న ప్రొఫెసర్లు ఇది అసాధ్యమని, విద్యుత్ అయస్కాంత తరంగాలు సరళ రేఖా మార్గంలో ప్రయాణించటమే దీనికి కారణం అన్నారు. ఈ వితండ వాదులకు జవాబు ఇవ్వటానికి ఇష్టపడని మార్కొని హెర్ట్జియన్ తరంగాలు నదులు, ప్రవాహాలు లాగానే భూమి వక్రతను అనుసరిస్తాయని రుజువు చేశాడు.

ఇప్పటికే ప్రసిద్ధుడనిపించుకొన్న మార్కొని చాలా సీరియస్‌గా ముభావంగానే

ఉండేవాడు. ఏమీ చదువుకొని అజ్ఞానులకు వైర్లెస్ టెలిగ్రఫీ అర్థం ఎలా వివరిస్తావు అని అడిగితే మార్కొని "గాలిలో శబ్దం తరంగాలుగా వ్యాపిస్తుందని తెలియని వారు లేరు. ఉదాహరణకు ఒక ఫిరంగిని పేలిస్తే దానివలన కలిగే ఒత్తిడి దగ్గరున్న గాలిని కంపింప జేస్తుంది. ఈ కంపనాలు వెళ్ళినంత దూరం శబ్దం వినపడుతూనే ఉంటుంది. నేను ఏర్పాటు చేసిన నిలువుగా ఉన్న వైరు విద్యుదయస్కాంత తరంగాలను గాలిలోకి పంపిస్తుంది. అందువలన ఒక రకమైన కంపనాలను వాతావరణంలో కలుగుతాయి. ఈ కంపనాలు అన్ని దిశలలోనూ రిసీవర్ను చేరే దాక వ్యాపిస్తాయి. కనుక ఒక మెసేజ్ను గాలిద్వారా యెంత దూరమైనా పంపవచ్చు. అయితే మనం కల్పించిన కంపనాలు నిరంతరం ముందుకు సాగుతూ ఉండాలి అప్పుడే సాధ్యం" అని చక్కగా వివరించాడు.

1899 ఫాల్ సీజన్లో మార్కొని అమెరికాకు బయల్దేరి వెళ్ళాడు. న్యుయార్క్ హెరాల్డ్ యజమాని జేమ్స్ గార్డన్ బెన్నెట్ అమెరికా కప్ యాచ్ పోటీలను వైర్లెస్ ద్వారా రిపోర్ట్ చేయమని కోరాడు. న్యుయార్క్ సందర్శన సంభ్రమాన్ని కల్గించింది. అక్కడి ఆకాశ హర్మ్యాలు వైర్లెస్ సిగ్నల్లకు అడ్డు పడతాయేమోనని సరదాగా అన్నాడు. అక్కడున్న ఒక రిపోర్టర్ "no bigger than a French man and no older than a quarter century .He is a mere boy ,with a boy 's happy enthusiasm and a manÑ s view of his life work. His manner is a little nervous and his eyes a bit dreamy. He acts with the modesty of a man who merely shrugs his shoulders when accused of discovering a new continent"అన్నాడు మార్కొనిని గమనించి.

ప్రతిఖండం మార్కొనికి కొత్తదిగానే ఉంది. పాత ప్రపంచానికి కొత్త ప్రపంచానికి వైర్లెస్ ద్వారా అనుసంధానం జరపాలనే ధ్యేయంతో అమెరికా వెళ్ళాడు. చనిపోయేలోపు మార్కొని 89 సార్లు అట్లాంటిక్ దాటాడు. 1900 అక్టోబర్లో అతి పెద్ద ట్రాన్స్ మిటర్ బిల్డింగ్ను పర్యవేక్షించాడు. అప్పటిదాకా తాను నిర్మించిన దానికంటే ఇది వంద రెట్లు శక్తివంతమైనది. దీన్ని కార్న్ వాల్ లోని పోలద్లో ఏర్పాటు చేశాడు. ఇది ఇంగ్లాండ్కు ఆగ్నేయంగా ఉంది. 1901లో బీమ్స్ శక్తిని పరీక్షించాడు. ఆరు నెలల తర్వాత వచ్చిన తుఫాను తానేర్పరచిన వ్యవస్థను చిన్నా భిన్నం చేసింది. అన్నీ మళ్ళీ నిర్మించాల్సి వచ్చింది. ఇలాంటి టవర్లే రిసీవింగ్ టవర్లుగా మాసా చూసేట్స్లో కేప్ కాడ్లో ఏర్పాటు చేసి వీటిని పడగొట్టేశారు. తరువాత అమెరికన్ సైట్ను న్యు ఫౌండ్ లాండ్లోని సెయింట్ జాన్కు మార్చాడు. దీనివలన అనేక ఇబ్బందులేర్పడ్డాయి. అప్పుడు వాతావరణం అసలు బాగా లేదు అంటే అనుకూలంగా లేదు. ట్రయల్గా పంపిన బెలూన్లు దూరంగా కొట్టుకు పోయాయి. కావలసిన ఎత్తుకు సరిపడా నిర్మాణం చేయ

లేక పోయాడు. చివరిసారిగా న్యు ఫౌండ్ లాండ్‌లోని ఏరియల్ ఎత్తును 400 అడుగులు ఉండేట్లు యాంటేన్నాను గాలి పటాలు పట్టుకోనేట్లు చేశాడు.

1901 డిసెంబర్ 12న మార్కొని సెయింట్ జాన్‌లోని ఒక టవర్‌లో కూర్చుని కార్న్ వాల్ నుండీ వచ్చే సిగ్నల్ కోసం ఎదురు చూశాడు. మొదట్లో చాలా బలహీనంగా పోను పోనూ చాలా బలంగా మోర్స్ కోడ్‌లోని "ఎస్" వినిపించింది. సక్సెస్. సముద్రమే ఒక మిరకిల్‌గా ఒక వారధిగా వైర్లెస్‌కు పని చేసిందని చెప్పాడు. ఈ యువ సైంటిస్ట్‌ను "హీరో ఆఫ్ ది అవర్"గా అభివర్ణించారు. "నవీన శక ఆవిష్కర్త" అన్నారు మార్కొనిని. "మాస్టర్ ఆఫ్ స్పేస్" అనీ శ్లాఘించారు. మార్కొని పేరు మొదటి ఆవిష్కర్తల జాబితాలో చేరింది అని పొగిడారు. "మార్కొని కార్న్ వాల్ నుంచి ఎస్ సిగ్నల్ పంపటంలో విజయం సాధించగానే ఒక కొత్త శకం మానవ చరిత్రలో ఆవిష్కారమైంది. ఒక వ్రేలి స్పర్శ ఒక ప్రత్యుత్తర స్పందనను ప్రకటించింది. కాని ఈ కుర్రాడు సగం సంతోషంతో, సగం ఆశ్చర్య భయంతో కనిపించాడు తాను ఇప్పుడు అన్నిటినీ తన నియంత్రణలోకి తెచ్చుకోగలననే ధైర్యమొచ్చింది" అని రాశాడు సైంటిస్ట్ ఆథర్ సర్ ఆలివర్ లాడ్జ్.

ఈ పరిశోధనా సుడిగుండంలో కొట్టుకొంటున్న మార్కొనికి ఇంతవరకు పెళ్లి కోరిక కలగ లేదు. 35 దాటాయి. మొదటి పెళ్లి ప్రయత్నం విఫలమైంది. మాంచి ముహూర్తంలోనే ఐరిష్ లార్డ్ ఇంచిక్విన్ కూతురు ఆనరబుల్ బీత్రిస్ ఓ బ్రీన్‌తో జరిగింది. 19 ఏళ్ళు కాపురం చేసి ముగ్గురు పిల్లలను కన్నారు. 1924లో వివాహ బంధం విచ్ఛిన్నమైంది. మూడేళ్ళ తర్వాత మార్కొని 53వ ఏట మరో అందగత్తె కౌన్టేస్ మేరియా క్రిస్టిన బెజ్జి స్కాలిని పెళ్ళాడాడు. అమెది పాపల్ అరిస్టాక్రసి వంశం. ఈ వివాహం గ్రాండ్‌గా యువరాజు చేతులమీదుగా జరిగింది. కార్డినల్ మతపరమైన కార్యక్రమాలు నిర్వహించాడు. విలాసవంతంగా జీవితం గడపాలని మార్కొని నిర్ణయించుకొన్నాడు. ఒక తెరచాప ఉన్న చిన్న పడవ మీద చిన్న ప్రయోగశాలను నిర్మించుకొని ఎక్కువ కాలం అక్కడే గడిపేవాడు. ఇప్పుడు మార్కొనిని సైంటిస్ట్‌గా కంటే నోబుల్‌గా చూస్తున్నారు. మళ్ళీ తండ్రి అయ్యాడు. కూతురికి తన పరిశోధనలకు తగిన "ఎలక్ట్రా" అని పేరు పెట్టుకొన్నాడు.

తన ప్రయోగ రంగాన్ని విస్తృత పరచాడు 1902లో తాను సాధించిన మాగ్నెటిక్ డిటెక్టర్‌కు పేటెంట్ పొందాడు. దీనితర్వాత సమాంతర ఏరియల్‌ను నిర్మించి ఆశ్చర్యం కలిగించాడు. అల్ట్రా షార్ట్ వేవ్స్‌పై దృష్టి పెట్టాడు. మొదట్లో తాను సాధించిన రెండు వేల మీటర్ల వేవ్ లెంగ్త్ ఉన్నదానికి బదులుగా ఇప్పుడు 15మీటర్ల వేవ్ లెంగ్త్‌ను సాధించాడు. షార్ట్ వేవ్స్‌లో ఇదొక అద్భుతం. దీన్ని ప్రక్కన పెట్టి తరంగాన్ని 12వేల మీటర్ల అతి పొడవైన దానిగా మార్చే కృషి చేశాడు. ఇవి పగటిపూట బలాన్ని కొంత కోల్పోతాయి. ముసలితనం పైబడినకొద్దీ మళ్ళీ షార్ట్ వేవ్స్ పైనే పని చేశాడు.

కేంద్రీకరించి, యే దిశలోనైనా పుంజాలుగా పంపే షార్ట్ వేవ్‌ను తయారు చేసే పనిలో పడ్డాడు. ఈ షార్ట్ వేవ్స్‌ను ప్రపంచంలో యే ప్రాంతంపైకి అయినా పంపవచ్చుని, వాటితో మెసేజ్‌లను యే ఆటంకం లేకుండా, పగలు రాత్రి భేదం లేకుండా నిరాటంకంగా బయలుదేరిన చోట ఉన్న శక్తితోనే రిసీవర్‌కు చేరేట్లు పంప వచ్చని రుజువు చేశాడు.

సమాచార వ్యవస్థలో మరో అద్భుతం ఆవిష్కారమైంది. జాన్ ఆంబ్రోస్ ఫ్లెమింగ్, లీ డీ ఫారెస్ట్ శాస్త్ర వేత్తలు మేధావి మార్కొని ఫలితాలను మిగిలిన మాధ్యమాలపై ప్రయోగించి వినోదంతో బాటు సమాచార ఆలోచనలకు దారి ఏర్పరచారు. ఫ్లెమింగ్ తయారు చేసిన ధర్మి యానిక్ వాల్వ్, డీ ఫారెస్ట్ వాక్యూం ట్యూబ్‌కు దారి చూపింది. దీనితో రేడియో, బొమ్మలు మాట్లాడే వ్యవస్థ ఏర్పడ్డాయి. 1909లో మార్కొని రెండు విధాల గౌరవం పొందాడు. ఇటాలియన్ సెనేట్‌లో సభ్యునిగా, గౌరవాన్ని పొందటమే కాక భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి పొందాడు. 1919లో ఆస్ట్రియా, బల్గేరియా దేశాల మధ్య శాంతి ఒడంబడిక సాధించటంలో కృత కృత్యుడయ్యాడు. పారిస్ పీస్ కాన్ఫరెన్స్‌కు డెలిగేట్‌గా వెళ్ళాడు. 1929లో "మార్చేస్"ను చేసి అరుదైన గౌరవం కలిగించారు. వైర్లెస్ వ్యాప్తిని మరింత విస్తృత పరచే ఆలోచనలో భాగంగా అంతరిక్షంలోకి చంద్రుడు లక్ష్యంగా లేక కుజుడికి వార్త పంపే విధానం గురించి తీవ్రంగా ఆలోచిస్తూ అధిక శ్రమతో అలసిపోయి కూలిపోయాడు. తనకేం జరిగిందో తెలియదు. కాని ఆ సచేతన మేధావి (డైనమిక్ జీనియస్) "బాగా బాగా అలసిపోయాను" అని మాత్రం అంటూ, వెంటనే ఆక్సిజన్ ఎక్కించినా అందుకొనే శక్తి లేక 20-7-1937న 63వ ఏట మార్కొని మరణించాడు. నిస్సంకోచంగా మార్కొని స్థానం అత్యున్నతమైనదే. రేడియోను "the miracle with world girdling wings" అన్నాడు. అది అభివృద్ధికి గొప్ప చిహ్నం. "సైన్స్‌కు పరిమితులు లేవు. ప్రతి ముందడుగు అన్వేషణా పరిధిని విస్తరిస్తుంది" అనేవాడు మార్కొని. ఆ మాట నిజం ఆయన పరిశోధనలో జీవించిన యాభై ఏళ్ళు నిజంగానే సైన్స్ పరిధిని విస్తరింప జేసింది అంటారు రచయిత లూయీ అంటర్ మేయర్. మార్కొని బిజినెస్ మాన్, పారిశ్రామికవేత్త, "ది వైర్లెస్ టెలిగ్రాఫ్స్ అండ్ సిగ్నల్ కంపెని" వ్యవస్థాపకుడు. ఇదే తర్వాత "మార్కొని కంపెని" అయింది. రేడియోకు వాణిజ్య లాభాలను చేకూర్చినవాడు. 1912 ఏప్రిల్ 15న "టైటానిక్ షిప్" మునిగినపుడు మార్కొని కంపెనీ బ్రతికి ఉన్నవారి పాలిటి ఆపద్బాంధవిగా ఉండి రక్షించింది. "నేను ప్రపంచానికి మంచి చేశానా, కీడు చేశానా?" అని వితర్కించు కొనేవాడు. మేలే తనవల్ల జరిగిందని సంతృప్తి పడేవాడు. నోబెల్ బహుమతితో పాటు మొత్తం 15 అరుదైన అవార్డులు సత్కారాలు అందుకొన్నాడు. మార్కొని పేర అనేక సంస్థలు వెలిసి ఆయనను చిరంజీవిని చేశాయి. మహానుభావుడు మార్కొని మరో లోకంలో సమాచార వ్యవస్థ సాగిస్తున్నాడేమో!❋



## 59. అత్యంత వివాదాస్పద బ్రిటిష్ ప్రధాని - సర్ విన్ స్టన్ చర్చిల్ (1874-1965)

79వ పుట్టిన రోజున తాను రాసిన ఆరు భాగాల "రెండవ ప్రపంచ యుద్ధం" జ్ఞాపకాలలో చివరిభాగాన్ని ప్రచురించి విడుదల చేసినవాడు ఇంగ్లాండ్ ప్రధాని సర్ విన్ స్టన్ లెనార్డ్ స్పెన్సర్ చర్చిల్. అప్పటికే 30కి పైగా ఇతర పుస్తకాలు రాసిన రాజకీయ దురంధరుడు, పెయింటర్, రచయిత చర్చిల్. ఇవి ఏదో ఆషామాషీగా, సంక్షిప్తంగా రాసినవి కావు. తన పూర్వీకుడు మార్ల్ బరోపై ఆయన జీవితం కాలం అనే పేరుతొ నాలుగు బృహద్గ్రంధాలు రాశాడు. తండ్రి లార్డ్ రాండాల్ఫ్ చర్చిల్‌పై రెండు, తన యుద్ధ ప్రసంగాలను ఏర్చి కూర్చి ఆరు భాగాలుగా రాశాడు. ఫిక్షన్‌ను ఏమీ వదిలిపెట్టలేదు. "సవ్రోలా, ఎ టేల్ ఆఫ్ రివల్యూషన్ ఇన్ లారేనియా" అనే కాల్పనిక సాహిత్యమూ రాశాడు. సైనికుడు జర్నలిస్ట్, చరిత్రకారుడు, రాజకీయ నాయకుడు, మహావక్త, రాజకీయ దురంధరుడు అయిన చర్చిల్‌కు గ్రంథ కర్తృత్వం జీవితంలో ఒక భాగమైపోయింది. అయిదుగురు చక్రవర్తుల వద్ద పని చేసిన అనుభవం ఆయనది. ఆయనను ఎంతగా ఆరాధించారో అంతగా తిట్టారు. హౌస్ ఆఫ్ కామన్స్‌లో అతనంటే చిరాకు ఏహ్య భావం ఉండేవి. అయితేనేం జనం చేత పిచ్చ పిచ్చగా మోజు పడి ఆరాధింప బడిన నాయకుడాయన. ఆ శతాబ్దపు అత్యంత "బహురూప మూర్తి" (ప్రోటియన్ ఫిగర్) అనిపించుకోన్నవాడు.

30-11-1874న లండన్‌లోని బ్లెన్ హీం పాలస్‌లో లార్డ్ రాండాల్ఫ్ చర్చిల్‌కు మూడవ కొడుకుగా పుట్టాడు. వీరిది మార్ల్ బరో వంశం. ఈ వంశానికే రాణి అన్నే వుడ్ స్టాక్ క్రౌన్ ప్రాపర్టిని, వారిలో బ్లెన్ హీంలో అత్యంత సుందర విలాస భవనం నిర్మించిన ఆర్కిటెక్ట్ జాన్ వాన్ బ్రాకు అప్పగించింది. తల్లి జెన్నీ జెరోం అమెరికా దేశీయురాలు, న్యూయార్క్ వాసి. అత్యంత సంపన్నురాలు, బహుదొడ్డ అందగత్తె.

నెలలు రాకముందే పుట్టటం, పుట్టిన దగ్గర్నుంచి మన "జగన్"లాగా పదవి కోసం తొందర పడటం చూసి స్నేహితులు చర్చిల్‌ను "యంగ్ మాన్ ఇన్ హ(రి" అనేవాళ్ళు. అంటే దుందుడుకు కుర్రాడు అని అనచ్చు. తర్వాత "దూకుడు గాడు" అన్నారు. చిన్నప్పటి నుంచి కయ్యానికి కాలు దువ్వేరకం. అధికారాన్ని ధిక్కరించేవాడు. నర్సుల్ని విసిగించేవాడు. ట్యూటర్లను ఆట పట్టించేవాడు. చర్చిల్ జీవిత చరిత్ర రాసిన లేవిస్ టేలర్ "కొంతవరకు కంచర గాడిద తల, మండే నిప్పు పొగరు, పొట్టి, యెర్ర జుట్టు, ముఖంపై చిన్న చిన్న మచ్చలు, కొద్దిగా కుక్కపిల్ల ముక్కు, లాంతరురు స్తంభంలా యే భావం కనిపించని మూతి, నీలి కాంతి వంతమైన కళ్ళు, వాటిలో కొట్టవచ్చేట్లు కనిపించే అసహనం" అని చర్చిల్ రూపాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణన చేశాడు. "మొరటడు"గా చిన్నప్పుడేకాడు పెద్దప్పుడూ, జీవితాంతం ప్రవర్తించాడు. 80 ఏళ్ళ వయసులో బట్టతల ఉన్న, అతని ముఖం మర్యాదతో గుండ్రంగా పింక్ కలర్‌గా ఉండేది. ఒకావిడ తనకు పుట్టిన కొడుకు ఆయనలాగే ఉన్నాడని చర్చిల్‌తో అంటే "నిజమే పుట్టిన శిశువులందరూ నాలానే కనిపిస్తారు" అన్నాడు. రెండేళ్ళ వయసు రాకముందే తాత ఐర్లాండ్‌కు వైస్రాయ్ అయ్యాడు. కనుక కొంతకాలం చర్చిల్ బాల్యం ఐర్లాండ్‌లో గడిచింది. అక్కడి క్రమ శిక్షణ ఉల్లంఘించి తను స్వయంగా ఏర్పాటు చేసుకొన్న, బొమ్మల సైన్యంతో ఆడుకొనేవాడు. వాటితో ఆడకుండా ఉండగలిగేవాడు కాదు. దీన్ని గమనించిన అతని తండ్రి ఒక వెయ్యి మంది బొమ్మ సైనిక బృందాన్ని ఏర్పాటు చేశాడు. తన కొడుకు తప్పనిసరిగా మిలిటరీ కమాండర్ అవుతాడని భావించాడు. స్కూల్ చదువు పెద్ద బోర్‌గా పెద్ద హింసగా భావించాడు. 7వ ఏట దగ్గరలో ఉన్న ఆస్కాట్‌కు పంపారు. ఇది ఈటన్‌లో చేరటానికి శిక్షణ ఇస్తుంది. ఇక్కడ లాటిన్‌ను ద్వేషించటం ఒక్కటే నేర్చుకొన్నాడు. కోపం వచ్చి మేస్టార్లు "బడితె పూజ" చేసే వాళ్ళు. కాని దాన్ని మాన్పించలేక పోయారు. ఒకసారి హెడ్ మాస్టర్ నెత్తిన పెట్టుకొనే స్ట్రా కాప్‌ను కాలితో తన్నుతూ ముక్కలు ముక్కలుగా చేసి పారేశాడు. ఇంకేముంది స్కూల్ పిల్లలకు ఆదర్శమూర్తి అయిపోయాడు. కొడుకులో మార్పుఏదైనా వస్తుందనే ఆశతో, ఆరోగ్యమూ ఈ రెండేళ్లలో దెబ్బతిన్నదనే ఆలోచనతో చేర్పించారు, ఇక్కడ మరింత స్వేచ్ఛ దొరికింది. ఈత కొట్టటానికి, గుర్రపు స్వారీకి, తనకు కావలసిన పుస్తకాలు చదువుకోవటానికి అనుమతి లభించింది. ఇక్కడే "కింగ్ సాల్మన్స్ మైన్స్", "ట్రెజర్ ఐలాండ్" నవలలు ఇష్టంగా చదివాడు. కాని దీనికంటే ఏదో ఒక చిలిపి పని చేయటం ఇష్టంగా ఉండేది. ఎర్ర తోలు కదా "ఎర్ర తేలు" బుద్ధులు వంట బట్టాయి. వీరామూర్ అనే టీచర్ "ఇకపై నా మోకాళ్లను నువ్వు తొక్కితే నేను రిజైన్ చేసి వెళ్ళిపోతాను" అంది ఈ కొంటె కుర్రాడితో. "క్లాసు పిల్లల్లో అత్యంత అల్లరిగాడు. కాని వీడే ఎప్పుడో ఒకప్పుడు ప్రపంచంలోనే అతి

చిన్న అల్లరి పిల్లాడు అనిపించుకొంటాడు అని నాకు అనిపిస్తోంది" అన్నది. అమర్యాదకు, మూర్ఖత్వానికి చిరునామా అయ్యాడు. అందులోనే ఆనందం పొందాడు. ఒకసారి విద్యార్థులను టీచర్ "మీలో ఎవరికి ఎన్ని లోపాలున్నాయో చెప్పండి?" అని అడిగితే మన తుంటరి 'తొమ్మిది' అని గర్వంగా చెప్పాడు. "తొమ్మిదా?" అని టీచర్ ఆశ్చర్యంగా అంటే మన ప్రబుద్ధుడు కాలర్ ఎగరేసి అంతే అన్నాడు. ఆ క్లాస్ వయసు పిల్లగాళ్ళకు అన్ని లోపాలు క్షమించరానివే. గ్రహించిన సూక్ష్మగ్రాహి కొంటెకోణంగి "నేను చెప్పింది 'నీన్' అది జర్మన్ మాట" అని సర్దుకొన్నాడు.

మూడేళ్ళు బ్రైటన్ చదువు తర్వాత ఆరోగ్య కేంద్రమైన హారోలో చేరాడు. ఇక్కడ పరిస్థితి మరీ దారుణం చేశాడు. ఎంట్రన్స్ పరీక్షకు లాటిన్‌లో ఒక ప్రశ్నా పత్రం ఇస్తే అక్షరం ముక్క రాయకుండా ఖాళీగా అక్కడక్కడ పిచ్చి గీతాలు గీసి చివర సంతకం ఒకటి "పొడిచి" మళ్ళీ తిరిగిచ్చేశాడు. స్కూల్లో అతి చిన్నతరగతిలో అతి తక్కువ మార్కులు. దీనితో మరీ రెచ్చి పోయాడు. తెలివి తక్కువ తనం నుంచి అత్యధిక విద్యా వ్యాసంగం కలవాడయ్యాడు. తనకు నచ్చని ఇష్టం లేని, తనదికాని దాన్ని దేనినీ పట్టించుకొనే వాడు కాదు. ఈ విషయంపై చర్చిల్ స్వయంగా "where my reason, imagination or Interest was not engaged, I could not or would not learn" అని కుండ పగలకొట్టి చెప్పాడు. "మై ఎర్లి లైఫ్" అనే తన పుస్తకంలో చర్చిల్. స్కూల్ మాస్టర్లు తనపై రుద్దే క్లాసికల్ చదువును అడ్డుకొన్నాడు. సీజర్, ఓవిడ్, వర్జిల్‌లను చదివి చదివి చెమటలు కార్చాడు. ఇంగ్లీష్ కాంపోజిషన్ అంటే కొంచెం ఇష్టం. గొప్పగొప్ప ఇంగ్లీష్ స్టైలిస్ట్‌ల నాడి పట్టుకొన్నాడు. ఈ సందర్భంగా "I got into my bones the essential structure of the ordinary British sentence which is a noble thing" అంటూ "స్కూల్‌లో లాటిన్ కవిత్వంలో, గ్రీక్ ఎపిగ్రామ్స్ రాయటంలో ప్రైజులు కొట్టేసి ఆకాశంలో విహరించిన నా స్నేహితులు, ఇప్పుడు బుద్ధి తెచ్చుకొని నేలమీద నడుస్తూ బతుకు తెరువు చూసుకొంటున్నారు. కనుక లాటిన్ గ్రీక్ నేర్చుకోనన్న నాకు పశ్చాత్తాపం లేదు, అవి రాకపోయినందు వలన నా జీవితానికి కలిగిన ప్రమాదం ఏదీ జరగలేదు" అన్నాడు.

క్లాసిక్స్ అంటే యెంత అయిష్టమో చర్చిల్‌కు ఆటలన్నా అంతే. ఫుట్బాల్, క్రికెట్ మాచ్ లవైపు కన్నెత్తి అయినా చూసి ఎరగడు. ఖర్మకాలి చూసినా ఆటగాళ్లను నవ్వుతో పలకరించటం అనేది అతని నిఘంటువులోలేదు. అయితే ఫెన్సింగ్ పోటీలంటే అమితాసక్తి. 17వ ఏటనే ఇందులో ప్రైజ్ కొట్టేశాడు. మరుసటి ఏడాది మనవాడి చదువు నిర్వాకం స్కూల్‌కు ఎగనామం, పంతుళ్ళకు పంగనామం బాగోతం చూసి, ఒక పాడుబడిన ఇంటిని బీర్ బాటిల్‌లో గన్ పౌడర్ దట్టించి పేల్చి వేసే సంఘటనలో

చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు కొంచెంలో ప్రాణాపాయం నుండి తప్పించుకోవటం తెలిసి, తండ్రి కొడుక్కి ఈ చదువు అచ్చిరాదని గ్రహించి "సాండ్ హర్స్ట్ మిలిటరీ స్కూల్‌లో చేర్పించాడు చర్చిల్‌ను. కుర్రాడికి అక్కడికెళ్ళి చదవటం మోజుగా ఉంది. కాని అందులో ప్రవేశానికి చాలా తంటాలు పడాల్సి వచ్చింది. ఎంట్రన్స్ పరీక్షలో రెండుసార్లు డింకీ కొట్టాడు. మూడోసారి ఒక స్పెషలిస్ట్ చెప్పినట్లు అన్నీ బట్టీ పట్టి ఎట్లాగో అట్లా ముక్కి గట్టెక్కాడు. మనవాడి అత్తిసరు మార్కులకంటే తక్కువ వచ్చిన మార్కులకు తండ్రి తన సామర్ధ్యాన్ని రుజువు చేసుకొన్న క్రాక్ రెజిమెంట్‌లో చేర్చుకోకుండా రోత పుట్టించే ఆశ్విక దళంలో చేర్చుకొన్నారు. కాని ఈ కావల్రిలో సంపన్న కుటుంబ యువకులకు, విద్యలో పెద్దగా రాణించని, తెలివితేటలూ తక్కువగా ఉన్న వారి నే చేర్చుకొంటారు. ఇదీ ఒక అదృష్టమే అయింది. గుర్రపు స్వారినే నడక కంటే ఎక్కువగా ఇష్టపడేవాడు.

సాండ్ హర్స్ట్ స్కూల్ చర్చిల్ జీవితాన్ని గోప్ప మలుపు తిప్పింది. అతని అల్లరి చిలిపితనం దుందుడుకు స్వభావాలకు కళ్ళెం వేసి అతన్ని ప్రయోజకుడిని చేసింది. యుద్ధరంగం గురించి నేర్చే విద్యకోసం అప్లై చేశాడు. మాప్‌లను తయారు చేయటం పరిశీలించటం, యుద్ధ వ్యూహ ప్రతి వ్యూహాలు, పరిపాలన, సైనిక చట్టాలు అన్నీ నేర్చాడు. ప్రజా వ్యవహారాలనూ క్షుణ్ణంగా అభ్యసించాడు. చర్చిల్ మేనత్త గారి సన్‌కు కుడి భుజమైన లార్డ్ ట్వీడ్ మౌత్‌ను పెళ్లి చేసుకొన్నది. హోం రూల్ గురించి డిన్నర్ టేబుల్ దగ్గర లిబరల్స్ మాట్లాడుకొనే మాటలు, హౌస్ ఆఫ్ కామన్స్‌లో కన్జర్వేటివ్‌ల సంభాషణలు విని అర్ధం చేసుకొన్నాడు. 19వ యేట స్కూల్‌లో చివరి టరంలో లండన్‌లో మిసెస్ ఆర్మిస్టన్ చాంట్, ఆమె బృందం చేబట్టిన ప్రొహిబిషన్ ఉద్యమాన్ని వ్యతిరేకిస్తూ బ్రహ్మాండమైన ఉపన్యాసం ఇచ్చి రాచకీయ ఆరంగేట్రం చేశాడు. చర్చిల్ వాగ్ధాటికి మురిసిపోయి, నిరసనకారుల చేతుల్లోని "ప్లేకార్డ్"లను అనుచరులు చించి పారేశారు. పాపం నిరసనకారులు నీరుకారి జావగారి జారిపోయారు. ఈ సంఘటన చర్చిల్‌లో నిగూఢంగా దాగి ఉన్న శక్తిని బహిర్గతం చేసింది. చర్చిల్‌కు "ఎస్" పలకటం సరిగ్గా వచ్చేది కాదు. కాని అతని "ఐ మస్ట్ సే", "ఐ గ్లాడ్ టు సీ" అనే మాటలు మంత్రాలై అతన్ని ఆ కాలంలో ఒక గొప్ప వక్తగా మార్చేశాయి.

ఇరవై ఏళ్ళ ఈ రాగి జుట్టు భరోసా, స్వీయ స్వాధీన నవ్వు ముఖపు యువకుడు సాండ్ హర్స్ట్ చదువుకు తగిన ప్రతిఫలంగా "క్వీన్స్ కమిషన్" పొందాడు. ఈ గుర్తింపు చూసి ఆనందించే అదృష్టం తండ్రికి దక్కలేదు. ఉన్న ఎస్టేట్ చాలా విశాలమైంది. అమ్మి అప్పులు తీర్చేసరికి తలప్రాణం తోకకు వచ్చి ఈ కుర్ర కావల్రి ఆఫీసర్‌కు రెందు వేళ్ళూ నోటిలోకి వెళ్ళటమే కష్టమైపోయింది. గుర్రం మాట దేవుడెరుగు. అయితే

అనుకోకుండా సంవత్సరానికి అయిదువందల పౌండ్ల భత్యాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. ఇది గుడ్డిలో మెల్ల. తన తోటి ఆఫీసర్ల జీతం కంటే తక్కువే అయినా ఖర్చులు తక్కువే అవటం ఏడాదికి అయిదు నెలలు సెలవు లభించటం ఊరట కల్గించాయి.

ఖాళీగా కూర్చోటం కత్తికి తుప్పపట్టకుండా చేయటం అలవర్చుకొన్నాడు. అన్నీ పరిశీలించేవాడు. యుద్ధం ఎక్కడ ఉందా అని వెతుక్కునేవాడు. అది క్యూబాలో కనిపించింది. అక్కడ గెరిల్లా యుద్ధాలు వీధి పోరాటాలు. అతని కోరిక తీరటానికా అన్నట్లు 'డైలీ గ్రాఫిక్' అనే పత్రిక చర్చిల్‌ను యుద్ధ విలేకరిగా క్యూబాకు పంపింది. స్పానిష్ అధికారులు చర్చిల్‌ను అతనితో వచ్చిన హసార్‌ను బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులుగా భావించి బాగా మర్యాద చేశారు. తాగినంత రమ్, కోరినన్ని చుట్టలు, స్వారీకి గుర్రాలు, వెనక ఎస్కార్ట్, సంప్రదాయ బాప్టిజం ఫైర్‌తో స్వాగత సత్కారాలు చేశారు. కొద్దివారాలు అక్కడ గడపగానే దోమకాటు వలన మలేరియా చిహ్నాలు కనిపించాయి. వెంటనే స్నేహితుడితో సహా ఇంగ్లాండ్ చేరేసరికి ఇద్దరికీ ఇండియాలో పని చేయటానికి ఆర్డర్లు సిద్ధంగా ఉన్నాయి.

చర్చిల్ బెంగుళూరులో తన రెజిమెంట్‌లో దిగేసరికి అతని వయసు 22. పెద్దగా భారం లేని పనే. పెద్ద బంగాళా లో నివాసం. అతనితోపాటు ముగ్గురు ఆఫీసర్లు. ఉదయం పూట డ్రిల్లు. మధ్యాహ్నం అంతా పడి నిద్రపోవటం సాయంత్రం అయిదింటి దాకా. అప్పుడు పోలో ఆట. ఇలా లేజీగా గడపటం ఇష్టం లేక ఇంగ్లాండ్ నుండి పుస్తకాలు పంపమని కోరాడు. ఇదివరకు సాహస గాథలంటే ఇష్టంగా ఉండేది. ఇప్పుడు ప్లేటో రాసిన రిపబ్లిక్, మెకాలే రాసిన హిస్టరీ ఆఫ్ ఇంగ్లాండ్, గిబ్బన్ రచన డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ రోమన్ ఎంపైర్‌లు బాగా అభిరుచి కలిగించాయి. ఇవేవో కాలక్షేపానికేకాని అతని శారీరక మానసిక శక్తులకు తగిన పని లేదనిపించి విసుగొచ్చింది. కాని మెకాలే, గిబ్బన్‌ల రచనలు అతను భావి మహావక్త కావటానికి బాగా సహకరించాయి.

ఒక ఏడాది తర్వాత ఇండియాలోని ఆగ్నేయ ప్రాంతంలో పోరాటం సాగింది. యుద్ధ వార్తాప్రతినిదిగా ఉన్న చర్చిల్ ఇక గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోరాదని అనుకోని తనపై అధికారులకు తనకు యుద్ధంలో పాల్గొనే అవకాశమిచ్చి పఠాన్ల తిరుగుబాటును అణచి వేసే బాధ్యతనిమ్మని కోరాడు. దీనిలో విజయం సాధించి తన వ్యాసాల వలన చర్యలవలన పొగడ్తలు సాధించాడు. 'దిస్టోరీ ఆఫ్ ది మాలకండ్ ఫీల్డ్ ఫోర్సెస్' అనే పుస్తకంలో ఈ యుద్ధ విశేషాలను రాశాడు. ఇరవై మూడేళ్ళకే ఈ పుస్తకం అచ్చయి మంచి పేరు తెచ్చింది, ఆర్థికంగా బాగా లాభించింది. రాయల్టీ వర్షమే కురిసింది. సెకండ్ లెఫ్టినెంట్ అయి మాంచి హుషారులో ఉండి "సవ్రోలా" అనే నవలను ఫిక్షన్, కల, కలగా పులగంగా రాశాడు. తిరుగుబాటుకు వ్యతిరేకి చర్చిల్. "ఆయన బ్లడ్‌లో

సైనికుడే ఉన్నాడుకాని రచయితలేదు" అనిపిస్తాడు. ఆంగ్లో ఈజిప్షియన్ సైన్యం దేర్విషేస్ సుల్తాన్‌కు విమోచనం కలిగించే దుందుడుకు చర్యలు చేబట్టాలని ఆలోచిస్తున్నప్పుడు తానూప్రచారంలో భాగమయ్యాడు. పై అధికారుల్ని ఒప్పించటానికి కష్టపడాల్సి వచ్చింది. కమాండర్ ఇన్ చీఫ్ సర్ హెర్బర్ట్ కిచేనర్‌కు చర్చిల్‌ను తీసుకొనే ఉద్దేశ్యం లేదు. అతని తల్లి వెనకాల ఉండి కథ నడిపించింది. 21వ లాన్సేర్‌కు సూపర్ న్యూమరరి లెఫ్టినెంట్ అయి, కరేస్పాండెంట్‌గా స్థానం పదిల పరచుకొన్నాడు.

సూడాన్ యుద్ధంతో చర్చిల్ డబల్ ధమాకాగా పోరాట యోధుడిగా, రచయితగా ప్రసిద్ధి చెందాడు. ఆండర్మాన్ యుద్ధంలో లాంసర్ దళం అద్వితీయ పోరాట పటిమ చూపి అతని ప్రతిభ నాయకత్వం వలన గెలుపు లభించింది. దీనిపై రాసిన "ది రివర్ వార్" పుస్తకం విమర్శకులకే కాక సాధారణ చదువరులను కూడా ఆకర్షించి, చాలా పెద్ద ఖరీదైన పుస్తకం అయినా కొన్ని నెలలోనే పునర్ముద్రణ పొందటం విశేషం. 24 ఏట ఇంగ్లాండ్‌కు తిరిగి వెళ్లి ఈ "సోల్జర్ జర్నలిస్ట్" మళ్ళీ రాజకీయాలలో తన సత్తా చాటుకొనే ప్రయత్నం చేశాడు. సరైన దిశా ఆలోచనలు లేని కన్జర్వేటివ్ పార్టీ అభ్యర్థిగా ఉప ఎన్నికలో పోటీ చేశాడు. టోరీల ప్రాధాన్యత, స్టాటస్కోవిధానం అంగీకరించాడు. "టిటేస్ బిల్లు"కు మద్దతు పలికాడు. అది జనాభిప్రాయానికి విరుద్ధంగా ఉందని తెలిసి ఉపసంహరించాడు. హౌస్ ఆఫ్ కామన్స్ నాయకుడు ఆర్థర్ బాల్ఫోర్ ఈ ఫిరాయింపు చూసి "ఈకుర్రాడు పనికోస్తాడను కొంటే వాగ్దానాల మోజులో పడ్డవాడిగా కనిపిస్తున్నాడు" అని హేళన చేశాడు. ఈ ఎన్నికలో చిత్తుగా ఓడిపోయాడు చర్చిల్. తప్పు తెలుసుకొని చెంపలేసుకొని మళ్ళీ సోల్జరింగ్ అంటూ యుద్ధ వీరుడయ్యాడు. సుడి ఎక్కడో ఉండి ఆరు నెలల తర్వాత హీరో అయ్యాడు.

దక్షిణాఫ్రికా చర్చిల్‌కు పెద్ద దృశ్యమే అయింది. ఆరంజ్ ఫ్రీస్టేట్ లోని ట్రాన్స్ వాల్లోని బోయర్లు అనబడే రైతులు, ఆంగ్ల సంపన్నుల దాడిని వ్యతిరేకించారు. అక్కడి బంగారు వజ్రాల గనుల ఖనిజ సంపదపై బ్రిటిష్ వాళ్ళ కళ్ళు పడి దోచుకొనే ప్రయత్నం చేస్తున్నారు. అక్కడి చిన్న చిన్న స్వతంత్ర రిపబ్లిక్‌లను ఏకం చేసి "శ్వేత ఛత్రం" కిందకు తెచ్చే ప్రయత్నంలో ఉన్నారు. ఇంగ్లాండ్ సైనిక దళాలు ట్రాన్స్ వాల్ సరిహద్దులో దిగగానే ప్రెసిడెంట్ పాల్ క్రూజర్ ఒక అల్టిమేటం జారీ చేయటం, లండన్ యుద్ధం ప్రకటించటం చక చకా జరిగిపోయాయి. దక్షిణాఫ్రికా యుద్ధాన్ని బుజాన మోసిన టోరీ ఇంపీరియలిస్ట్‌లపై లిబరల్స్, రాడికల్స్ దాడి చేశారు. దీనితో తలబొప్పికట్టి పరువు బజారున పడిన "ఘనత వహించిన బ్రిటిష్ ప్రభుత్వం" మూడేళ్ళు యుద్ధం చేయాల్సి వచ్చింది. ఏదో రకంగా విజయం దక్కించుకొనే ఆలోచనలో ఆంగ్ల ప్రభుత్వం ఒక లక్షా ఇరవై వేలమంది బోయర్ మహిళలను, పిల్లలను ఒక కాన్సేంట్రేషన్ కాంప్‌లో

పెడితే అందులో 20వేల మంది సైనిక దౌర్జన్యానికి బలై చనిపోయారు. పరువు ప్రతిష్టలు పాతాళంలోకి జారిపోయినా, చర్చిల్ పేరు మాత్రం బాగా ప్రచారమైంది. "మార్నింగ్ పోస్ట్" పత్రికకు యుద్ధ ప్రతినిధిగా దక్షిణాఫ్రికా వెళ్లి, ఒక పాడైపోయిన యుద్ధ రైల్‌లో ప్రయాణం చేసి, తనే నాయకత్వం వహించి వెడుతుండగా రైలు పట్టాలు తప్పగా చర్చిల్‌ను వల వేసి పట్టి బందీని చేశారు. రెండు వారాల తర్వాత తప్పించుకొన్నాడు. ఆయనపై నిఘావేసి పట్టిస్తే పాతిక పౌండ్లు నజరానా ఇస్తామని ప్రభుత్వం ప్రకటిస్తే "నా విలువ పాతికేనా?" అని గునిశాడు. అతని ఆచూకీ కోసం వేసిన పత్రాలలో "25 ఏళ్ళ ఇంగ్లీష్ వాడు అయిదడుగుల ఎనిమిది అంగుళాల పొడవు, అందరికంటే భిన్నమైన శరీరం, ముందుకు వంగి నడిచే నైజం, పాలి పోయినట్లుండే ముఖం, రాగి రంగు జుట్టు, కనిపించీ కనిపించని మీసం, ముక్కు మాట, "మాటల్లో ఎస్" అక్షరాన్ని పలకలేని తనం ఉన్నవాడు" అని రాశారు. బ్రిటిష్ కాలనీకి అద్దె కారులో కలప దుంగల కింద దూరి పారిపోయి ఉంటాడని అనుమానించారు. చర్చిల్ రాసిన రిపోర్ట్‌లను మిలిటరీ అధికారులు ఛీ కొట్టారు. అందులో చర్చిల్ బోయర్‌ల సుపీరియారిటీ, గొప్పతనపు ప్రశంస తప్ప న్యూస్ ఏదీ లేదన్నారు. ఒక గ్రూపు బ్రిటిష్ మిలిటరీ ఆఫీసర్లు చర్చిల్‌కు టెలిగ్రాం పంపుతూ "నీ ముఖ్య స్నేహితులు ఇక్కడ నువ్వు మరింత గాడిద లాగా గుర్తింప బడకుండా వెంటనే ఇంగ్లాండ్ తిరిగి రావాలని కోరుకొంటున్నారు" అని వార్త పంపారు. పై అధికార్లు చీదరించినా తడబాటు పడలేదు. అతనిది "పతాక శీర్షిక విజయం" (హెడ్ లైన్ విక్టరి). అదే అతనికి ఆనందం. నమ్రతగా ఉండాలనుకొంటాడు కాని స్వీయ మౌనాన్ని భరించలేదు. ఏది ఏమైనా ఇరవై ఏళ్ళ నడి వయసులో చర్చిల్ ఇంగ్లాండ్ దేశ జాతీయ విగ్రహమూర్తి (ఐడల్) అనిపించుకొన్నాడు.

మెప్పులూ మెహర్బానీలతో ఉన్న చర్చిల్ ఒల్డ్ హాంకు తిరిగొచ్చి ప్రజాసేవలో పడ్డాడు. దేశభక్తి విషయంలో మచ్చ లేని వాడని పించుకొన్నాడు. కనుక రాజకీయ గెలుపు సమస్య కాలేదు. ఎన్నికల ముందే లెక్చర్ టూర్‌తో లండన్ అంతా చుట్టేశాడు. దీనికి అయిదు వేల పౌండ్లు, అమెరికా టూర్‌లో మరొక పది వేల పౌండ్లు రాబడి వచ్చింది. అమెరికాలో చర్చిల్‌ను "5 యుద్ధాల వీరుడు, 6 గ్రంథాల రచయిత, ఇంగ్లాండ్ భావి ప్రధాని" అని పొగిడారు. న్యుయార్క్‌లో ప్రముఖ రచయిత మార్క్ ట్వేన్ ఒక సభలో చర్చిల్‌ను పరిచయం చేస్తూ "ఖచ్చితంగా పరిపూర్ణ (పెర్ఫెక్ట్) వ్యక్తి చర్చిల్. అతని తండ్రి ఇంగ్లిష్, తల్లి అమెరికన్" అన్నాడు. అమెరికాలో ప్రసంగాలు, పుస్తక పరిచయాలు పూర్తి చేసుకొని ఇంగ్లాండ్ చేరే సరికి "ఈ ఆంగ్ల దొర" చేతిలో లక్షణంగా ఒక లక్ష డాలర్లు పడ్డాయి. చర్చిల్ అదృష్టం తారాజువ్వలాగా పైకి ఎగరటమే కాదు చాలా ఉన్నత స్థాయిలో నిలిచి, 26వ ఏటనే బ్రిటిష్ హౌస్ ఆఫ్ కామన్స్‌లో స్థానం పొందాడు.

చక్కని సమాసాలు, పద గుంభన, అలవోకగా వచ్చే వాక్ ప్రవాహంతో చర్చిల్ సభికుల్ని ఆకర్షించేవాడు. ఒక ఆలోచనాపరుడిగా వినేవాళ్ళ బుర్రల్ని కంగాళీ పెట్టేవాడు కాదు. ఒకే మూస భావజాలం తోప్రవాహ ఝరిగా మాట్లాడుతుంటే అది పాతదే అని పించేది కాదు. స్వీయంకాని వాటిని స్వీయంగా చేసుకొనే నైపుణ్యం ఆయనలో యెలా ఉండేదో ఆయన జీవిత చరిత్ర "విన్ స్టన్ చర్చిల్–ది ఎరా అండ్ ది మాన్" రాసిన వర్జీనియా కౌలేస్ "అతను కార్య శూరుడేకాని ఆలోచనాపరుడు కాదు. ఉన్న విధానాలను, విలువలను తనవే అన్నట్లుగా చెప్పే నేర్పు ఉన్నవాడు. విక్టోరియా కాలపు భావనలు పూర్తి వికాసం పొందిన కాలంలో ఆయన చరిత్ర గడియారాన్ని శతాబ్దాల వెనక్కి తిప్పగల మేధావి. గతకాలపు, కాలదోషం పట్టి, రంగు కోల్పోయి వెలిసిపోయిన భావాలకు పట్టిన బూజు. ఆ బూజు దులపకుండా దాన్నే ప్రచారం చేసినవాడు చర్చిల్. యూరప్‌కు దూరం గాచిన్న సైన్యం కోసం, సామ్రాజ్య వాదం కోసం, పటిష్ట ఆర్థిక స్థిరత్వం కోసం, స్వేచ్ఛా వాణిజ్యం కోసం ఆదాయం పన్ను పెంపుదల లేకుండా ఒంటరిగా ఉన్నవాడు. ఇవన్నీ గతకాలపు భావ జాలం. కొత్త శతాబ్ది వచ్చే సరికి ఇవన్నీ నశించిపోతాయి" అని రాసింది.

"ఊహ తెలిసిన నాటినుంచి నేను దేన్ని నమ్మాలి అనుకొన్నానో దానినే నమ్మి ఆచరించాను" అంటాడు చర్చిల్. తన రాజకీయం పూర్తిగా కన్జర్వేటివ్ అయిన తండ్రి రాండాల్ఫ్ చర్చిల్ వద్ద నేర్చినదే అని, ఆయన మెప్పించగల సామర్థ్యమున్న వక్త, రాజకీయవేత్త అనీ అన్నాడు. ఆ పురాతన సంప్రదాయ వారసత్వమే తనకూ సంక్రమించిందని, తన తాత మొదటి డ్యూక్ ఆఫ్ మరల్ బరో అని, ఆయన గొప్ప మిలిటరీ కమాండర్ మాత్రమేకాక "మాస్టర్ ఆఫ్ ఇంగ్లాండ్" అని పించుకొన్నాడని, ఆయన వాడిన హాస్యపు పలుకులు తాను వాడి తన ప్రసంగాలకు మిర్చీ మసాలా అద్దానని చెప్పుకొన్నాడు. ఆయన "he loves to see him work"కు చెందినవాడని, మిస్టర్ మాక్ డోనాలడ్ మాత్రం "greatest living master of falling without hurting himself" టైపు వాడని అన్నాడు. ప్రతి దానినీ వ్యతిరేకించటం చర్చిల్ స్వభావం. అది తనకు మేలు చేస్తుందనే నమ్మకం ఉండేది ఆయనకు. ఆయన వ్యతిరేకులు మాత్రం "చర్చిల్ పార్టీలో ఇమడలేనంత పెద్దవాడు" అన్నారు. ఆయన అనుకూలురు మాత్రం అప్పుడెప్పుడో మన "బారువా"అనే ఆయన "ఇండియా ఈజ్ ఇందిరా" అన్నట్లుగా "వ్యక్తి ముందు, పార్టీ తర్వాత" అని కొమ్ము కాశారు. సడన్‌గా టోరీ కన్జర్వేటివ్‌లపై విరుచుకు పడ్డాడు చర్చిల్. బోయర్‌లతో శాంతి ఒప్పందం కోసం మరింతగా ముందుకు వెళ్లి సభలో లిబరల్స్ వైపు మొగ్గాడు. మూడేళ్ళ తర్వాత లిబరల్ పార్టీ తమ పార్టీలోని వ్యతిరేకుల్ని, 1906 సాధారణ ఎన్నికలలో వదిలించుకొని, చర్చిల్‌కు

"అండర్ సెక్రెటరి ఫర్ ది కాలనీస్" పదవి కట్టబెట్టింది.

లిబరల్స్ కన్జర్వేటివ్‌లతో నిత్యం తలపడుతుంటే "మహిళా వోటు హక్కు" కేకలు చర్చిల్‌కు చెమట పట్టిస్తున్నాయి. ఇది గొప్ప ఉద్యమంగా మారి ప్రజా బలం పెరిగి చివరికి చర్చిల్‌ను ఓడించేదాకా వచ్చింది. మరొక "కౌంటీ"లో లిబరల్స్ బలీయంగా ఉన్న చోటు నుంచి పోటీ చేసి గెలిచి మళ్ళీ సభలో అడుగుపెట్టాడు. మళ్ళీ మంత్రి వర్గంలో బెర్త్ సంపాదించి ఈసారి బోర్డ్ ఆఫ్ ట్రేడ్‌కు ప్రెసిడెంట్ అయ్యాడు. పుష్కలంగా డబ్బు మూలుగుతోంది కనుక పెళ్ళాడాలనే ఆలోచనలో పడ్డాడు. 1908 సెప్టెంబర్‌లో సెయింట్ మార్గ రేట్ చర్చ్‌లో క్లిమేంటైన్ హోజేర్ అనే అందగత్తెను పెళ్లి చేసుకొన్నాడు. ఈ పెళ్లి పెద్ద రాజ లాంఛనాలతో జరిగింది. 36వ ఏట హోం సెక్రెటరి అయ్యాడు. ఏడాది తర్వాత "ఫస్ట్ లార్డ్ ఆఫ్ అడ్మిరాల్టి" అయ్యాడు. ఆయన బాధ్యత చాలా క్లిష్టమైనది ముఖ్యమైనది ప్రమాద భరితమైంది కూడా. అన్ని లోపాలకు ఆయన్నే లక్ష్యంగా చేసి మాట్లాడేవారు. ఇంగ్లాండ్ మూడు సమ్మెలు ఆరు నిరసనలతో అట్టుడికి పోతోంది. బయట ముంచుకొస్తున్న విపత్కర పరిస్థితులు పాలనకు చాలా ఇబ్బందులుగా మారాయి. సముద్రాంతర మార్కెట్ కోసం పోరాటం ఎక్కువైంది. ఆయుధ ప్రదర్శన, యూరప్‌ను భయపెడుతోంది. 1914లో ఆంగ్లో -జర్మన్ సంబంధాలు బాగా క్షీణించాయి. ఇదంతా దారిలోకి రావాలంటే ఏదో ఒక రెచ్చ గొట్టే సంఘటన జరగాలి. 28-6-1914న ఆస్ట్రియన్ డ్యూక్ సెర్బియన్ ఒక టెర్రరిస్ట్ సభ్యుడి చేతిలో హత్య చేయబడ్డాడు. జర్మని ఆస్ట్రియాను సమర్ధించింది. రష్యా సెర్బియా వెనక నిలబడింది. ఫ్రాన్స్ కొంత ఊగిసలాడినా చివరికి రంగంలోకి దిగింది. జర్మన్ సైన్యం పారిస్‌పై దాడి కోసం బెల్జియంపై దాడి చేసి లోబరచకొన్నది. జర్మన్‌పై ఉన్న ద్వేషంతో ఇంగ్లాండ్ యుద్ధ సన్నద్ధమవటంతో మొదటి ప్రపంచ యుద్ధం మొదలైంది.

మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభ కాలంలో చర్చిల్ బ్రిటిష్ సామ్రాజ్యంలో అత్యంత శక్తివంతమైన నాయకులలో ఒకడైనాడు. సమయానికి తగిన చురుకుదనం, అవతలి వారిని ఒప్పించే నైపుణ్యం, అవసరమైతే మొండిగా ఉండే నైజం ఉన్న చర్చిల్ పాత విధానంలో సాగే భూయుద్ధ వైఖరినే మార్చేశాడు. కొత్త ఆయుధాలు కనుగొనే అవకాశమిచ్చాడు, మూస విధానంలోఉన్న యుద్ధ వ్యూహాలను సమూలంగా మార్చేశాడు. తేలిక రకం యుద్ధ విమానాలు చాలా అవసరమని గుర్తించాడు. అప్పటికే జర్మని గాస్‌తో నడిచే జెప్పిన్ విమానాలను వాడుతూ ఆకాశాన్ని హస్తగతం చేసుకొన్నది. అప్పటి వరకు వాడుకలో ఉన్న ట్రెంచ్‌లలో దాక్కొని చేసే యుద్ధం ఇక ఫలించదని తెలుసుకొని "ఆయుధ కారు"ను ఉపయోగించి ఫలితాలు పొందాలనే నిర్ణయానికొచ్చాడు. ఇదే తర్వాత యుద్ధటాంక్‌గా మార్పు పొందింది. ఇంతచేసినా ఒక్క ఏడాది మాత్రమే

అధికారంలో ఉన్నాడు. అవతలి వారి అభిప్రాయాలను కనీసం వినని, పట్టించుకోని తత్త్వంతో శత్రువులను ఎక్కువగా సృష్టించుకొన్నాడు. యుద్ధం నత్త నడక నడుస్తోంది. ఆంట్వెర్ప్, డార్డ్ నేల్లెస్‌లలో అపజయాలను చర్చిల్ మెడకే చుట్టారు. యుద్ధం ప్రారంభమైన పది నెలల తర్వాత ఆయన "ఫస్ట్ లార్డ్ ఆఫ్ ది అడ్మి రాలిటి" పదవి ఊడిపోయింది. మరో అయిదు నెలలలో చర్చిల్ మంత్రి పదవికే ఎసరొచ్చింది.

"నా పని అయిపోయింది. కార్య రంగం నుంచి నన్ను తప్పించేశారు" అని వాపోయాడు ఒక స్నేహితుడి దగ్గర. ఇంకా హౌస్ ఆఫ్ కామన్స్ సభ్యుడుగానే ఉన్నాడు. దేశభక్తితో కూడిన ప్రతి పక్షం వాడిగా ఉన్నాడు. గాడి తప్పిన విధానాలను వ్యతిరేకించాడు. పని తక్కువ కనుక తనకు ఇష్టమైన పెయింటింగ్‌తో గడిపాడు. 1916 నాటికి డయానా, రాండాల్ఫ్, సారా అనే ముగ్గురు పిల్లల తండ్రి అయ్యాడు. క్రమంగా పదవీ సోపానాలు ఎక్కటం ప్రారంభించాడు. పాత ప్రభుత్వాలు పోయి కొత్తవి వస్తున్నప్పుడు చర్చిల్ మంత్రి అవుతూనే ఉన్నాడు. వ్యతిరేకత తారా స్థాయిలో ఉన్నా లాయడ్ జార్జ్ చర్చిల్‌ను ఆయుధ సంపత్తి మంత్రిగా తీసుకొన్నాడు. యుద్ధ విరమణ తర్వాత మిలటరిపై అధికారంతో సహా ఉన్న యుద్ధ మంత్రియ్యాడు. తర్వాత కలోనియల్ ఆఫీస్‌కు బదిలీ అయ్యాడు. అప్పటికే బలహీనమై పోయిన లిబరల్ పార్టీని వదిలేసి, లాబ రైట్స్‌ను ఎదిరించి అతుకుల బొంత కూటమి పార్టీ ఆలోచన చేసి, అదీ గిట్టక టోరీల తీర్థం పుచ్చుకొన్నాడు. 1924లో కన్జర్వేటివ్‌లు మళ్ళీ అధికారానికొచ్చారు. స్టాన్లీ బాల్డ్ విన్, చర్చిల్‌ను "చాన్సెలర్ ఆఫ్ ది ఎక్స్ చెకర్"ను చేశాడు. అంటే "బొక్కసానికి కులపతి"ని చేశాడు. రాజకీయ గాలియే వైపు వీస్తుందో తేలికగా పసిగట్ట గల "వెదర్ కాక్" చర్చిల్. దిగే గడపా, ఎక్కే గడప ఆయనకు బాగా అలవాటే, అధికారానికి అది రాచబాటే అయింది. ఈ నాటి పార్టీ ఫిరాయింపులకు ఆద్యుడు భజన్ లాల్, దేవీలాల్ మొదలైనవారికి, "ఆయారాం గయారాం"లకు గురు తుల్యుడు చర్చిల్ అనిపిస్తాడు.

కొత్త ఉద్యోగం చర్చిల్ ఊగిసలాడే ధోరణిని, అస్థిర తను సూచిస్తుంది. "మనవాడు ఎవరి వైపు ఉంటాడు అంటే తనవైపే" అని "జోకారు" ఫ్రీట్రేడ్‌ను నిషేధించినపుడు "అదేమీ తప్పుకాదు. సరైనమార్గంలో తీసుకొన్న నిర్ణయమే. అభివృద్ధి అంటే మార్పే. లోపం లేకుండా ఉండటం అంటే అనేకసార్లు మార్చుకోవటమే" అని నాన్ స్టాప్‌గా వాయించేశాడు. దీన్ని చూసి లార్డ్ ఆక్స్ ఫర్డ్ "తీర్పులేని జీనియస్" అన్నాడు (ఎ జీనియస్ విథౌట్ జడ్జి మెంట్). దీన్ని నిజం చేశాడేమో అన్నట్లు చాలాసార్లు తీవ్ర అంత్యస్థితిలో(ఎక్స్ ట్రీం) ఉండేవాడు. కొత్త బిచ్చగాడు పొద్దెరగడు అన్న సామెత ప్రకారం కన్జర్వేటివ్‌ల కంటే ఇంకా కన్జర్వేటివ్‌గా ఉండేవాడు. టోరీలకే టోపీ పెట్టి ముందుండేవాడు. 1929లో లేబర్ పార్టీ లిబరల్స్ ఇచ్చిన తోడ్పాటుతో ఎన్నికలలో

టోరీలతో పోటీ చేసి ఘన విజయం సాధించింది. బాల్విన్‌ను మళ్ళీ ప్రధానిగా నియమించి చర్చిల్‌కు కేబినేట్‌లో స్థానం ఇవ్వకూడదని షరతు పెట్టారు. 58వ ఏట ప్రాభవం కోల్పోయి మంత్రి వర్గంలో స్థానం పొందలేదు. మళ్ళీ గద్దెనెక్కటానికి పదేళ్ళు నిరీక్షించాల్సి వచ్చింది పాపం. ఈ నిరీక్షాకాలాన్ని సోమరి కాలం (ఐడిల్ డికేడ్) అన్నాడు. అవే ఆయనకు "లోటస్ యియర్స్" అయ్యాయి. తనపల్లెటూరు చార్ట్ వెల్‌కు వెళ్లి రచనా వ్యాసంగంలో మునిగిపోయాడు. అతి ప్రసిద్ధి చెందిన రాజకీయ చారిత్రిక సాక్షాధార పత్ర (డాక్యుమెంట్) రచన చేసి ఎన్నో విషయాలు తవ్వి తీశాడు. "ది వరల్డ్ క్రైసిస్" పేర వచ్చిన నాలుగు భాగాలు చర్చిల్‌ను మహా వక్తలలో ఒకనిగా, అతనిది ఒక మహాద్భుత అనితర సాధ్యమైన ప్రత్యేకమైన శైలిగా – అదే "ప్యూర్ చర్చిలియనిజం"గా గుర్తింపు పొందింది. ఈ పుస్తకం అమ్మకాల వలన చర్చిల్‌కు లక్ష డాలర్ల పైకం లభించింది. ఈ రాబడి ఆయన రాసిన "మాల్ బరో" జీవిత చరిత్ర, అనేక పత్రికలకు రాసిన సీరియల్ వ్యాసాలవలన ఇబ్బడి ముబ్బడిగా పెరిగి పోయింది. మరొక వ్యాసంగంగా తాపీ పని (మేసన్రి) హాబీగా చేసుకొని అందులోనూ విజయస్తంభాన్ని కట్టాడు. కాని "బ్రిక్ లేయర్స్ యూనియన్" వ్యతిరేకించింది. వెంటనే అందులో మెంబర్షిప్ తీసుకొని గోడ కట్టటంలో పై కప్పు నేయటంలో తన సామర్థ్యాన్ని నిరూపించాడు. దేశ భవిష్యత్తునే నిర్మించిన వాడికి ఇదొక లెక్కా! ప్రజా జీవితం నుంచి చర్చిల్ విరమించుకోవటాని ఎవరూ ఒప్పుకోలేదు. పదేళ్ళు నియోజకవర్గానికి దూరంగా ఉన్నా పిలిచి నిలబెట్టి గెలిపించి పార్లమెంట్‌కు పంపారు.

హిట్లర్ మొదటి సారిగా జర్మని ఆయుధ సంపత్తి సేకరణ చేయాల్సిందే అన్నప్పుడు, చర్చిల్‌కు హిట్లర్‌పై జాతీయ పక్ష పాత ధోరణి కనిపించలేదు. "గాదరింగ్ స్టార్మ్"లో రాస్తూ చర్చిల్ "హిట్లర్ సిద్ధాంతాలు ఆలోచనలు, రికార్డ్, ప్రవర్తనా శీలం గురించి నాకేమీ తెలియదు. ఎవరైనా ఓడిపోయిన తన దేశం కోసం నిలబడితే నేను అవతలి పక్షంలో ఉన్నా వారిని మెచ్చుకొంటాను" అన్నాడు. హిట్లర్ రాసిన "మీన్ కాంఫ్" పుస్తకాన్ని చర్చిల్ పూర్తిగా చదివి అర్థం చేసుకొన్నాడు. రాబోయే కాలంలో ప్రపంచ విజేత కావాలన్న హిట్లర్ ఆశయం, దానికోసం జరుగబోయే తీవ్ర యుద్ధాలను, వాటివలన ప్రపంచానికి జరగబోయే అనర్థాన్ని ముందే పసి గట్టాడు. జర్మన్ సైన్యం ఇంకొక 7 ఏళ్ళలో చిన్న దేశాలను కబళించే ఉద్దేశ్యంతో జర్మన్ వీధుల్లో కవాతు నిర్వహిస్తున్నప్పుడే చర్చిల్ హౌస్ ఆఫ్ కామన్స్‌లో తీవ్ర స్వరంతో రాబోయే ప్రళయాన్ని వివరిస్తూ "ఈ యువ బలీయ మైన సైనికులు కవాతు చేయటం చూస్తే హిట్లర్ కోరిన సమాన హోదా కోసం కాదని, ఆ విషయం వారి కళ్ళల్లో ఆయుధాలకోసమే అన్న భావం ప్రతిఫలిస్తోంద"ని చెప్పాడు. జర్మనీ అంతకు ముందు ఎన్నడూ లేని విధంగా

జలాంతర్గాములను తయారు చేసుకొన్నదని, సైన్యానికి ఆధునిక యుద్ధ టాంకులు నిర్మించి అజేయంగా తయారైందనీ సభలో నెత్తీ నోరూ పెట్టుకొని అరిచాడు ఆవేశపడ్డాడు, వాదించాడు గర్జించాడు. తన మాటలు యదార్ధమేనని విశ్వాసం కలిగించాడు. అప్పటికి చర్చిల్ నాజీలకు ఎదురు నిల్చిన "ఏక వ్యక్తీ బ్రిటిష్ సైనికుడు", దీనితో మిగిలిన వారికి విసుగు కోపం వచ్చాయి ఆయన మీద. ప్రతిపక్షం నిద్రలో జోగుతూ "ఎస్" అని ఈ హెచ్చరిక దారుని తోసేసింది.

1934లో పార్లమెంట్‌లో చర్చిల్ మాట్లాడుతూ నాజీ జర్మనీ హిట్లర్ నాయకత్వంలో ఆకాశాన్ని విమానాలతో ఆక్రమించే ప్రయత్నం చేస్తున్నారని, అలక్ష్యం చేస్తే లండన్‌పై జర్మన్ విమానాలు బాంబుల వర్షం కురిపిస్తాయని హెచ్చరించాడు. ప్రధాని స్టాన్లీ బాల్డ్విన్, ఎడ్వర్డ్ రాజు ఒక సామాన్యఅమెరికన్ స్త్రీని పెళ్లి చేసుకోవద్దు అంటూ నచ్చ చెప్పే ప్రయత్నంలో ఉన్నాడేకాని హిట్లర్ కొంప ముంచుతాడనే ఆలోచనలో లేడు. నేవెల్లి చాంబర్లేన్ మాత్రం హిట్లర్‌ను తక్కువ అంచనా వేశాడు. లీగ్ ఆఫ్ నేషన్స్ వెన్నులో బాకు గుచ్చినట్లుగా ఇంగ్లాండ్ ఇటలీ ముందు మోకరిల్లి అబిసీనియాని నిర్లక్ష్యం చేసింది. చర్చిల్ ఉద్విగ్న దీర్ఘోపన్యాసం కూడా ఫలించలేదు.

అప్పటికే చేతులు కాలాయి ఆకులతో పని లేక పోయింది. జర్మని రైన్ లాండ్‌ను వశం చేసుకొని, తూర్పు యూరప్‌లో జర్మనీ హవాను ఆపలేక నిస్తేజమైంది. ప్రధాని బాల్డ్విన్ "ఇంతకంటే గొప్ప ఆయుధాలున్న దేశం ఉందా, మనకేమీ భయం లేదు" అంటూ చర్చిల్‌ను దుయ్య బట్టాడు. చాంబర్లేన్ సిగ్గుమాలిన షరతులతో హిట్లర్ ముందు మ్యూనిచ్‌లో మోకరిల్లాడు. ఏడాది దాటేసరికి జర్మని పోలాండ్‌ను స్వాధీనం చేసుకోవటంతో రెండవ ప్రపంచయుద్ధం "శురూ" అయింది.

వార్ మేనేజర్ చర్చిల్‌ను ఇప్పుడు అందరూ "ప్రాఫెట్" ప్రవక్త అంటున్నారు. బాల్డ్విన్ స్థానంలో చాంబ ర్లేన్ ప్రధాని అవగానే, 65 ఏళ్ళ చర్చిల్ సమర్ధతకు తగినట్లుగా నేవీకి చీఫ్ చేసి "ఫస్ట్ లార్డ్ ఆఫ్ అడ్మిరాల్టి" పునరుద్ధరించాడు, నావికా రంగంలోని ప్రతి శాఖకూ "Winston is back" అని మెసేజ్‌లు పంపించాడు. చర్చిల్ అంటే ఇంగ్లాండ్ గౌరవ చిహ్నమైన "సింహపు ముఖం" అని కీర్తించారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన కొద్ది నెలల్లోనే బ్రిటన్ రాజు చాంబ ర్లేన్‌ను దిగిపొమ్మని చెప్పి చర్చిల్‌ను కూటమి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కోరాడు. 10–5–1940న చర్చిల్ బ్రిటిష్ ప్రధానిగా మొదటి ప్రసంగం చేస్తూ బ్రిటిష్ ప్రజలకు "మీకు రక్తం చెమట, శ్రమ, కన్నీళ్లు తప్ప నేనేమీ ఇవ్వటం లేదు" అన్నాడు ఉద్వేగంతో.

సమర్ధ నైపుణ్యం ఉన్న చర్చిల్ తాను ప్రజలతో ఏమన్నాడో తెలియనివాడు కాదు. అందులోని అంతరార్ధం గ్రహించమని కోరాడు. తన సర్వశక్తి యుక్తుల్నీ చాతుర్యాన్ని

సాహస ధైర్యాలను ప్రదర్శించాడు. జర్మనీ తీర ప్రాంతాలపై దాడి చేయమని సైన్యానికి ఆదేశాలిచ్చాడు. దీనికోసం సైన్యానికి "ఆంఫీబియన్ టాంక్"–అంటే నీటిలో నేలమీదా నడిచే వాటిని, వాటికి కావలసిన ఆయుధ సామగ్రిని, ప్రయోగాత్మక లాండింగ్ క్రాఫ్టును అందించాడు. తుది సమరానికి ముందే మిత్ర కూటమి ఫ్రాన్స్‌పై దాడి చేసి దీనికోసం ఒక కృత్రిమ హార్బర్‌ను నిర్మించింది. ఇలాంటివి అవసరం ఉన్న చోటల్లా నిర్మించాలని వీటికి ఉక్కు కాకుండా కాంక్రీట్ వాడాలని సూచించాడు. అవి నీటిలో తేలుతూ కృత్రిమ దీవిలాగా కనిపిస్తాయి. శత్రుభయం ఉన్నప్పుడు అవి నెమ్మదిగా నీటిలో మునిగిపోతాయి దీనివల "టార్పేడో ప్రూఫ్ వెదర్ ప్రూఫ్ ఉన్న కృత్రిమ హార్బర్లు తయారయ్యాయి వీటినుంచి సబ్ మేరీన్లను విమానాలను పంపే వీలు, నాశనం చేసే అవకాశం కలిగింది, ఇదంతా చర్చిల్ మేధో మధనంలో వచ్చినదే. బెల్జియం రాజు లిపోల్డ్ జర్మన్‌లకు పాదాక్రాంతుడయ్యాడు. రష్యా ఫ్రాన్స్‌ను పట్టుకోన్నది. ఈ సందర్భంగా చర్చిల్ కేబినేట్ మీటింగ్‌లో "మనం ఒంటరి వాళ్ళం అయ్యాం నేనొక్కడినే ఉన్నాను. కాని నాకు ఇది చాలా గగుర్పొడిచే సందర్భంగా ఉంది" అన్నాడు. జర్మనీ చిరకాల కోరిక బ్రిటన్‌ను కబళించటం అని గుర్తు చేస్తూ ప్రజలకు "మనం మన ఇంగ్లాండ్ దీవిని ప్రాణాలకు తెగించి కాపాడుకొందాం. బీచులమీద నిలబడి యుద్ధం చేద్దాం. యుద్ధ భూమిలో వీధుల్లో, కొండల్లో పోరాటం సాగిద్దాం. అంతేకాని లొంగిపోవటం అనేది లేదు చావో రేవో తేల్చుకొందాం. సర్వస్వం ఒడ్డి పోరాడుదాం విజయమో వీర స్వర్గమో తేలుద్దాం. ఎంతటి త్యాగాలకైనా సిద్ధమవుదాం" అని ప్రబోధించాడు ప్రజలను చేతనతో సమాయత్తం చేశాడు వాళ్ళ గుండెల నిండా దేశభక్తి ప్రవహింప జేశాడు. జన జాగృతి కలిగించి దేనికైనా సిద్ధం చేశాడు. "Let us brace ourselves to our duties, and so bear ourselves that, if the British Empire and common wealth last for a thousand years, men will say "this was their finest hour" అని పిలుపునిచ్చి కర్తవ్యోన్ముఖులను చేశాడు చర్చిల్.

నాజీల "ఆబాస విజయం"ను గుర్తించనివాడు, ఇంగ్లాండ్ చేస్తున్న ఒంటరి పోరాటం చూసి రష్యాకు అమెరికాకు తగిన సమయంలో ఆయుధాలతో సైన్యంతో స్పందించే అవకాశామిచ్చినవాడు", మహా కూటమి" అనే గ్రాండ్ అలయన్స్ ఏర్పాటు చేసి పడమటి నుంచి అమెరికాను తూర్పునుంచి రష్యాను యుద్ధోన్ముఖులను చేసిన అపర చాణక్యుడు చర్చిల్. తనకు అత్యంత మిత్రుడైన అమెరికా ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్‌తో న్యు ఫౌండ్ లాండ్‌లో 1941లో చారిత్రాత్మక శాంతి ఒప్పందమైన అట్లాంటిక్ చార్టర్‌ను రూపొందించటంలో అనన్య సాధారణ ప్రతిభ కనపరచాడు. యుద్ధ సమయంలో ఈ నేత లిద్దరూ కనీసం డజనుసార్లు అయినా సమావేశమై చర్చించుకొన్నారు. చర్చిల్

అమెరికా ప్రెసిడెంట్‌కు ఆయననివాసం వైట్ హౌస్‌కు ఆత్మీయ అతిథి, కుటుంబ సభ్యుడూ అయ్యాడు. ప్రెసిడెంట్ భార్య ఎలినార్ రూజ్ వెల్ట్ ఈ అగ్రనాయకులిద్దరూ యుద్ధ పూర్వ దేశ పరిస్థితికి యుద్ధా నంతర దేశ పరిస్థితికి చాలా ఆందోళన పడ్డారని చెప్పింది. యుద్ధం పూర్తయ్యేదాకా తాను పదవిలోనే ఉంటానని యుద్ధం నుంచి ప్రతి సైనికుడు బయటికి వచ్చి జీవితంలో స్థిరపడేదాకా తనకు విశ్రాంతి లేదని చెప్పేవాడని గుర్తు చేసుకొన్నది. రష్యా నియంత స్టాలిన్‌తో స్నేహం వ్యక్తిగాతమైనదేకాని రాజకీయమైనది కాదు. ఈ ఇద్దరూ నిర్లక్ష్యం, దూకుడు స్వభావం గల యుద్ధ వీరులే కాక తిండిపోతులు, తాగుబోతులు కూడా. కమ్యూనిజం వ్యాప్తిని చర్చిల్ భయంకరమైనదిగా భావించేవాడు. రష్యా వల్ల కలిగిన దారుణ మారణ కాండ మానవజాతి చరిత్రలో ఎప్పుడైనా చూశామా అని 1921 జనవరిలో చర్చిల్ అన్నాడు. “రష్యా తీవ్ర కరువు కాటకాలతో అలమటిస్తోంది. జనానికి తిండి లేదు. మనిషికి మనిషి రాష్ట్రానికి రాష్ట్రం బద్ధ శత్రువులై జనాలను తరిమేస్తున్నారు. ఇదంతా చూస్తుంటే నాగరక మానవుడిని సంస్కృతికి దూరంగా తరిమేస్తూ ఆశల హర్మ్యాలు కూలుస్తూ, రెక్కాడితెకాని డొక్కాడని పరిస్థితి సృష్టించి మనం రాతి యుగంలో ఉన్నామా అనే అనుమానం కలిగేట్లు చేస్తున్నారు” అన్నాడు. ఇదే చర్చిల్ 20ఏళ్ళ తర్వాత రష్యాను “మహా యుద్ధ వీరులు, శక్తివంతమైన నాయకులు” అన్నాడు రష్యా సైన్యం జర్మనీ సైన్యాన్ని ఎక్కడికక్కడ నిలవరించి ఇంగ్లాండ్ వైపుకు దూసుకు రాకుండా అడ్డు పడినప్పుడు. గత రెండు దశాబ్దాలుగా తనకంటే కమ్యూనిజాన్ని వ్యతిరేకించిన వారెవరూ లేరన్నాడు. జర్మనీ రష్యాపై దాడికి దిగినప్పుడు రేడియోలో మాట్లాడుతూ “నేను పూర్వం మాట్లాడిన మాటలన్నీ గతం గతః. ఇప్పుడు రష్యా సైనికులు ప్రాణాలు ఒడ్డి తమ దేశాన్ని రక్షించుకొంటున్న తీరు చూస్తే వారి అపూర్వ త్యాగాభరిత పోరాట పటిమ దిగ్భ్రాంతి కలిగిస్తోంది. మా రెండు దేశాల లక్ష్యం ఇప్పుడు ఒక్కటే హిట్లర్‌ను అతని నాజీ సిద్ధాంతాన్ని కూకటి వేళ్ళతో పెకలించి పారేయటమే. ఇప్పుడు ఆ నరహంత హిట్లర్‌తో కాని అతని నాజీ జుంటా తోకాని అసలు సంప్రదింపులు జరపనే జరపం. భూమిపైనా సముద్రం మీదా ఆకాశమార్గానా అతనితో పోరాటం చేస్తాం, దైవకృప వలన తను స్వాధీనం చేసుకొన్న భూభాగాన్ని విముక్తం చేయగలిగాం “Any man or state who fights on against Nazidom will have our aid” అన్నాడు.

యుద్ధం పూర్తి అవగానే చర్చిల్ రష్యా విషయం లో కొంత ఊగిసలాడాడు .రష్యాఆసియాను డామినేట్ చేస్తుందేమోనని అనుమానించాడు. దానికోసం ఇంగ్లీష్ మాట్లాడే దేశాల సమాఖ్య కోసం ప్రయత్నించాడు. అంతమాత్రంతో రష్యా వైపు యుద్ధ దృష్టితో చూడను కూడా లేదు. ప్రభుత్వంలో ఉన్నా బయట ఉన్నా అతని

స్వరంలో తీవ్రత ఏమాత్రమూ తగ్గలేదు. యుద్ధం ముగిసి మిత్రపక్షాల విజయం తర్వాత ఇంగ్లాండ్‌లో ఎన్నికలు జరిగియే నాయకుడు తమను కాపాడాడో తమ దేశాన్ని రాక్షించాడో ఆ మహా నాయకుడైన చర్చిల్ నుపరువు ప్రతిష్టలు హిమాలయోత్తుంగ సదృశంగా ఉన్న సమయంలో దారుణంగా ఓడించారు. దీనికి చాలా కారణాలున్నాయి. స్వతహాగా టోరీ కావటం, పేదప్రజానీక బాగోగులపై దృష్టి లేని వాడు కావటం, నూతన దేశ నిర్మాణానికి, బాధ్యతలను మోయటానికి చాలినంత శక్తియుక్తులు లేని ముసలి ఎద్దు అయిపోవటం కొన్ని కారణాలు అతని శత్రువులు మాత్రం యుద్ధ సమయంలో శక్తి యుక్తులు చూపిదేశాన్ని రక్షించినా శాంతి సమయంలో సమర్ధత చూపే చాకచక్యం లేని ఒంటి కొమ్ము సొంటి లాంటి వాడన్నారు. అసలు ప్రజలు మార్పు కోరారు. సూపర్ హ్యూమన్ కాకపోయినా చర్చిల్ తీవ్రంగా బాధ పడ్డాడు. ప్రతిపక్ష నేతగా ఉండి అవమానాల పాలయ్యాడు. దీనిపై స్పందిస్తూ “దేశంలో అత్యున్నత పదవినిలో ఉంటూ అయిదేళ్ళ మూడునెలల రెండవ ప్రపంచ సంగ్రామంలో నా దేశం తరపున పోరాడి నా దేశం పరువు ప్రతిష్టలను పెంచి, యుద్ధ విజయాన్ని చేకూర్చితే, నా బ్రిటిష్ ప్రజలు ఇక నువ్వు మా విషయాలలో చేయవలసిందేమీ లేదు అంటూ ఓడించి ఇంటికి పంపారు” అని రాసుకొన్నాడు.

ఈ నిరాశా నిస్పృహలనుండి తేరుకోవటానికి చర్చిల్‌కు కొంత కాలం పట్టింది. ఇంగ్లాండ్ అమెరికాలలో విస్తృతంగా పర్యటన చేస్తూ పూర్వంలాగానే శక్తివంతమైన పదజాలంతో ప్రజలను ఆకర్షించాడు. కొత్త మాటలూ ప్రయోగాలు చేశాడు. రష్యా గురించి చెబుతూ “an iron curtain has descended across the continent” అన్నాడు. ఇనప తెరఅనే మాటను రష్యన్ సీక్రెట్ సర్వీస్‌లకు అన్వయించేట్లు అన్నాడు. గణాంక వేత్తలను సైంటిస్ట్‌లను, మిలిటరీ ఎక్స్‌పర్ట్‌లను, పరిశోధకులను, విద్యావేత్తలను ఒక రికార్డింగ్ మెషీన్‌ను ఏర్పాటు చేసుకొని పగలూరాత్రి షిఫ్ట్ పద్ధతిలో పనిచేసి ఆరు భాగాల సీరియల్‌ను నిర్మించాడు. ఇందులో అమెరికన్ సీరియల్ ఒక్కదానికే రెండు మిలియన్ డాలర్ల డబ్బు వచ్చింది. వీటికి వేరువేరుగా పేర్లు పెట్టాడు– “ది గాదరింగ్ స్టార్మ్”, దెయిర్ ఫైనేస్ట్ అవర్”, ది గ్రాండ్ అలయన్స్”, ది హింజ్ ఆఫ్ ఫేట్, “క్లోసింగ్ ది రింగ్”, ది ట్రంఫ్ అండ్ ట్రాజేడి” చివరిదానికి బాధా తప్త హృదయంతో “HOWTHE GREAT DEMOCRACIES TRIUMPHED AND SO WERE ABLE TO RESUME THEFOLLIES WHICH HAD SO NEARLY COST THEM AND THEIR LIFE” అని ఉప శీర్షిక పెట్టాడు. శక్తి వంతమైన రష్యా, ప్రచ్ఛన్న యుద్ధం వంటివి ఇంకా పరిష్కారం కాని సమస్యలుగానే ఉన్నాయి.

ఆరేళ్ళు జ్ఞాపకాల రాతల్లో తలమునకలుగా ఉండి, తన జీవితంలోని అవమానకర

ఓటమి ట్రాజెడీని మరో అంతర్ నాటకంతో విజయ తీరాలకు చేరుద్దామని ఎదురు చూస్తుండగా 1951లో మళ్ళీ సార్వత్రిక ఎన్నికలు రానే వచ్చి, అదృష్టం తలుపుతట్టగా గెలిచి మళ్ళీ బ్రిటిష్ ప్రధాని అయి ఊరట చెందాడు. ప్రజా సేవకు గర్వ పడుతూ "నేను పదవికోసమో అధికారం కోసమో రాలేదు. ఈ రెండిటినీ సుస్టుగా అనుభవించాను. మరి ఎందుకు వచ్చాను అంటే సుస్థిర శాంతి స్థాపనకోసమే" అన్నాడు.

79వ చర్చిల్ పుట్టిన రోజును ప్రపంచ వ్యాప్తంగా ధూమ్ ధాంగా నిర్వహించారు. ఈ సందర్భంగా "చర్చిల్ బై హిస్ కాంటేంపరీస్" అనే పుస్తకాన్ని విడుదల చేశారు. అందులో ఎందరో ప్రసిద్ధులు చర్చిల్ యుద్ధ విలేకరిగా, నవలా రచయితగా, కళాకారునిగా, హాస్య రచయితగా, వక్తగా, సైనికుడిగా, పార్లమెంటేరియన్‌గా, రాజకీయ ప్రతిపక్ష నాయకుడిగా, నిర్వహించి ప్రదర్శించిన బహు ముఖ ప్రజ్ఞా విశేషాలను నిండు మనసుతో రాశారు. అన్నిటికన్నా ప్రముఖ రచయిత జార్జ్ బెర్నార్డ్ షా "ప్రతిభగల వ్యక్తి చర్చిల్" అని రాసి ఆయనకు రెండు టికెట్లు పంపుతూ తన నాటకాన్ని ఆవిష్కరించమని కోరుతూ "మీరు మొదటి ఆటకే రండి. మీకు స్నేహితుడనే వాడెవరైనా ఉంటే వెంట తీసుకొని రండి" అని "ఎటకారంగా" రాసి ఆహ్వానించాడు. ఘటికుడు చర్చిల్ తక్కువ వాడా! వెంటనే జవాబు రాస్తూ "ప్రారంభ రాత్రి ఆటకు రాలేనంత పని ఒత్తిడిలో ఉన్నాను. కాని రెండో ఆటకు రాగలను-ఒక వేళ రెండో ఆట ఉంటే" అని ఝలక్ ఇచ్చాడు.

చర్చిల్ మాటలు తూటాల్లాగా పేల్తాయి. వాటిలో హాస్యం చమత్కారం వ్యంగ్య వైభవం మినుకు మినుకుమనే తెలివి తేటలు కలిసే ఉంటాయి. వీటినన్నిటినీ కలిపి "ఎ చర్చిల్ రీడర్"గా లోకంలో నిలిచి పోయాయి. అందులో కొన్ని. 1) మొండి వాడు అంటే తన మనసును ఎప్పుడూ మార్చుకోని వాడూ, తానూ మాట్లాడే విషయాన్ని మార్చనివాడు. 2) వ్యక్తిగతంగా నేను నేర్చుకోవటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉంటాను నాకు ఎవరిదగ్గరా నేర్చుకోవాలని లేకపోయినా. 3) తెలివిగాలవాడేవడైనా యుద్ధంలో జయించటానికి ప్రణాళికలు తయారు చేస్తాడు, వాటి అమలు కోసం బాధ్యత తీసుకోకుండా. 4) ప్రపంచం కలిసి ఉంటే విడిపోయి ఉన్నదానికంటే గొప్ప. కాని ప్రపంచం ధ్వంసం కాకుండా విడిపోయి ఉండటం మేలు.

79వ సంవత్సరం మధ్యలో ఈ బహు రంగుల బహు భంగుల, వివాదాస్పద మేధావిని "నైట్ ఆఫ్ ది మోస్ట్ నోబుల్ ఆర్డర్ ఆఫ్ ది కార్టర్ బై ఎలిజబెత్ ది సెకండ్" చేసి గౌరవించారు. కొన్ని నెలల తర్వాత విన్ స్టన్ చర్చిల్‌కు ప్రపంచ ప్రసిద్ధ నోబెల్ సాహిత్య బహుమతిని అందజేసి గౌరవాన్ని రెట్టింపు చేశారు. అయన రచనలకు మాత్రమే ఇచ్చిన బహుమతి కాదు, ఆయన చేసిన యుద్ధ ఉపన్యాసాలకు కూడా చెందుతుంది. నోబెల్ అవార్డ్ నిస్తూ "for his wartime speeches against a

'monstrous tyranny never surpassed in the dark, lamentable catalog of human crimes" అని అభివర్ణించింది ఆ సంస్థ. స్వీడిష్ అకాడెమి చర్చిల్‌ను ఆహ్వానించి సత్కరించి పురస్కార ప్రదానం చేస్తూ "for his mastery of historical and biographical description, as well as the brilliant art of oration with which he has defended human values" అని ప్రశంసించింది మానవీయ విలువల పరి రక్షణకు చర్చిల్ చేసిన సేవకు ఇది ఘనమైన కితాబు బహుమతి, ఆ "పాదరస బహు-మతి" చర్చిల్ కు.

ఆయన మహా వక్తృత్వానికి, చరిత్రకు అందుకొన్న గొప్ప అవార్డ్ అది. ఆయన రచనలో ఉన్న నిబద్ధతకు, ఆయనే చెప్పిన "పనిలో నైతికత" (మోరల్ ఆఫ్ ది వర్క్)కు అది నిదర్శనం. చర్చిల్ మాటలు మంత్రాలులా పనిచేశాయి. వాటి ప్రభావం అనిర్వచనీయం. కొన్ని చర్చిల్ మాటల మంత్రాలు- "In war ,Resolution. In Defeat, Defiance. In victory, Magnanimity. In peace, Good will. ఈ విషయంలో రచయిత లూయీ అంటర్ మేయర్ అన్నమాటలు "It was a motto worthy of being borne on the proudest shield and the loftiest banner" ఆ యుద్ధ వీరునికి కీర్తి పతాకలు. ఇంతటి కీర్తి ఘనుడు చర్చిల్ 24-1-1965న 91ఏళ్ళు జీవించి కీర్తి కాయాన్ని వదిలేసి అమరుడైనాడు. ఆయన అంత్యక్రియలకు చైనా తప్ప అన్ని దేశాల ప్రతి నిధులు హాజరైనారు. 350 మిలియన్‌ల ప్రజలు టెలివిజన్‌లో వీక్షించారు. సైనిక లాంచనాలతో 19 గన్ సాల్యూట్‌తో మహా గౌరవ ప్రదంగా ప్రభుత్వం నిర్వహించింది. డల్లాస్ మ్యూజియం ఆఫ్ ఆర్ట్‌లో చర్చిల్ పెయింటింగ్‌లను చూడవచ్చు.

ఫెలో ఆఫ్ రాయల్ సొసైటీ, బి బి సి నిర్వహించిన 2002. ప్రపంచ ప్రసిద్ధ వందమంది నాయకులలో చర్చిల్ సర్వ ప్రథముడుగా ఎన్నికైనాడు. "ఆనరరి సిటిజెన్ ఆఫ్ అమెరికా"గా ఆ ప్రభుత్వం గౌరవించింది. రోచెస్టర్, మియామి మొదలైన ఎన్నో యూనివర్సిటీలు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేశాయి. వివాదాస్పద ప్రధాని అయినా చారిత్రిక పురుషుడు, మన కృష్ణ దేవరాయలులాగా "సాహితీసమరాంగణ బ్రిటిష్ సార్వ భౌమ ప్రధాని చర్చిల్". మహా రాజకీయ దురంధరుడు. చరిత్రను ఒక మలుపు తిప్పిన లెజెండ్ చర్చిల్.❋



## 60. జర్మన్ సంగీత స్రష్ట, ఆర్గాన్ నిర్మాత, వేదాంతి- ఆల్బర్ట్ స్క్వీజర్

(Albert Schweitzer) (1875-1965)

"రోతను పుట్టించే ఆలోచనలతో పూర్తిగా నిండి ఉన్న యుగ వైఖరికి రోసి ఉన్నాను. ఆలోచన తనను తాను చక్కబరచుకోకుండా ఇప్పటి వరకు తన లక్ష్యాన్ని సాధించలేదు. ఈ విపత్కర కల్లోలాన్నుంచి బయట పడాలంటే వాస్తవ నాగరకత ఆదర్శాల సంరక్షణ కింద ఉండాల్సిందే" అని, అన్నది పరిపక్వత లేని ఫిలాసఫర్ కాదు. తన పరిధిని నైరూప్య సరిహద్దులో ఉన్ననిరంతర కార్యకర్త అయిన ఒక ప్రీచర్, సంగీత సృజన శీలి, సంగీత వాద్య నిర్మాత, నాగరికతను బహిష్కరించి, హాయిగా సాగే వృత్తికి తిలోదకాలిచ్చి, తన జీవిత కాలమంతా సభ్యతా సంస్కారం లేదని మనం అనుకొంటున్న ఆటవిక జాతులతో అరణ్యాలలో కలిసి జీవించిన ఆల్బర్ట్ స్క్వీట్జేర్. ఇప్పటికే ఆయన అంటే ఏమిటో అర్ధమైపోయి ఉంటుంది.

యోగ పురుషులలో ఒకరుగా గుర్తింపబడిన ఆల్బర్ట్ స్క్వీజర్ 14-1-1875న జర్మన్ ఆల్సేస్‌లోని కేసర్స్ బెర్గ్‌లో జన్మించాడు. తలిదండ్రుల వైపుకు చెందిన వారందరూ మినిస్టర్‌లు, సంగీతకారులే. తాత ఆల్సేషియన్ ఆర్గనిస్ట్, స్కూల్ మాస్టారు. ఆయన సోదరులూ ఇంతే. మాతామహుడు ఒక పాస్టర్, తండ్రి ఇవాంజెలికల్ కాంగ్రి గేషన్ నాయకుడు. తండ్రి అయిదుగురు సంతానంలో ఆల్బర్ట్ రెండవవాడు. ఇతనికి ముగ్గురు సోదరిలు, ఒక తమ్ముడు ఉన్నారు. అయిదవ ఏటనే పియానోతో కమ్మని స్వరాలు ఒకే వేలితో పలికించిన బాల మేధావి. ఏడవ ఏటనే "పార్లోరోర్గాన్"పై స్వంత ఏకస్వరాలను (హార్మనీస్) వాయించిన దిట్ట. 9వ ఏట గ్రూయిన్స్ బాక్ చర్చిలో ప్రార్ధనలో ఆర్గనిస్ట్ రాకపోతే తానే వాయించి అబ్బుర పరచాడు. చదువు ఆల్సేషియన్ స్కూల్స్‌లో సాగింది.

నేచురల్ సైన్స్‌పై అభిమానం ఎక్కువ. చార్లెస్ మేరీ విండర్ అనే ప్రఖ్యాత ఫ్రెంచ్ ఆర్గనిస్ట్ వద్ద వీలున్నప్పుడల్లా పాఠాలు నేర్చాడు. 18వ ఏట స్ట్రాస్ బర్గ్ యూనివర్సిటీలో చేరాడు. ఇక్కడే టెక్నాలజీని సంగీతాన్ని అభ్యసించాడు. యవ్వనం నుంచే ప్రముఖ సంగీతకారులు బాష్ అన్నా, జీసస్ అన్నా ఆరాధనా భావం ఉండేది. 22ఏళ్ళ వయసులో ఫిలాసఫీ చదవటానికి పారిస్‌లోని సాన్ బారన్ వెళ్ళాడు. వెండర్ దగ్గర ఆర్గాన్ నేర్చి బాగా అభివృద్ధి చెందాడు. జర్మనీలో అంతకు ముందు ఎవరూ నేర్వని "ప్లాస్టిక్ స్టైల్"ను అలవరచుకొన్నాడు.

ఇరవై నాలుగవ ఏట ఫిలాసఫీలో డిగ్రీ పొంది, స్ట్రాస్ బర్గ్‌లోని సెయింట్ నికొలాస్ చర్చ్‌లో ప్రీచర్ అయ్యాడు. యూని వర్సిటీలో మత వేదాంత శాస్త్ర లెక్చరర్‌గా ఎంపికయ్యాడు. లాస్ట్ సప్పర్‌లోని పూర్వ క్రైస్తవమరియు బాప్టిజం అభివృద్ధిపై ఆల్బర్ట్ కున్న అభినివేశాన్ని గమనించి ఈ పదవి నిచ్చారు 1906లో "ది క్వెస్ట్ ఆఫ్ దిహిస్టారికల్ జీసస్" పుస్తకం రాసి ప్రచురించాడు. అదే సమయంలో సంగీతకర్త బాష్‌పై స్క్వీజర్ రాసిన ఉద్గ్రంధమూ వెలువడింది. 18వ శతాబ్దికి సంగీత గ్రాండ్ మాస్టర్ బాష్‌ను పూర్వ పరి శోధకులకంటే భిన్నంగాపోలీ ఫోనీలో ఆయన మాస్టర్ అని, క్లాసిసిస్ట్ అని, మహాకవి అని ప్రముఖ చిత్రకారుడని ఆల్బర్ట్ సశాస్త్రీయంగా రుజువు చేశాడు. బాష్‌ను గురించి రాస్తూ "ఆయన సంగీతం కవితాత్మకమే కాక, చిత్రాత్మకం కూడా. కారణం అందులోని విషయాలు కవిత్వం చిత్ర లేఖనం నుండి పురుడు పోసుకొన్నాయి. గోథిక్ ఆర్కి టెక్చర్‌ను శబ్దంగా రూపాంతరం చెందించిన ఘనత బాష్ ది" అని విశ్లేషించాడు. దీనికి అనుబంధంగా బాష్ వి, తనవి ప్రదర్శనలను చేర్చి "ది ఆర్ట్ ఆఫ్ ఆర్గాన్ బిల్డింగ్ అండ్ ఆర్గాన్ ప్లేయింగ్ ఇన్ జర్మని అండ్ ఫ్రాన్స్"ను ప్రచురించి బాష్‌పై తిరుగు లేని అధారిటీ అని నిరూపించాడు. పాతవాటిని మార్చి కొత్తవి కనిపెట్టటంలో సాధికారత సాధించాడు. నమూనాలను ఆయన అంగీకారం కోసం మార్పుల కోసం పంపేవారు. అనేక సార్లు ఆయా ప్రాంతాలకు వెళ్లి పురాతన వాద్యాలను పరిరక్షించే ప్రయత్నాలు చేశాడు. మాంచి ప్రాముఖ్యాన్ని పొంది 29వ ఏట భవిష్యత్ జీవితంపై భరోసా పొందాడు.

30వ ఏట స్క్వీజర్ నాటకీయంగా ఒక నిర్ణయం తీసుకొన్నాడు. భూమధ్య రేఖపై ఉన్న ఆఫ్రికాకు డాక్టర్‌గా వెళ్ళాలనే కోరికతో మెడిసిన్‌లో చేరాడు. అతని స్నేహితులు దిగ్భ్రాంతి చెందారు. ఎలాగైనా అతని ప్రయత్నం మాన్పించాలని ఒక ముఖ్య స్నేహితుడు "యూరప్‌లో నువ్వు పాత ఆర్గాన్స్‌ను రక్షించావు. ఇప్పుడు ఆఫ్రికాలో పాత నీగ్రోలను రక్షిస్తావా?" అని అడిగాడు. స్క్వీజర్‌కు ఈ ఆలోచన చాలా కాలం నుంచే మనసులో మెదులుతోంది. విద్యార్థిగా ఉండగానే బాధలతో యే బాదర బందీలేని జీవితం గడపాలన్నది అతని ఆకాంక్షగా ఉండేది. ఇరవై రెండవ ఏట ఒకసారి అకస్మాత్తుగా

“నేను ముప్ఫైవ ఏడు వచ్చేదాకా ఆర్ట్ కోసం శ్రమిస్తా. ఆ తర్వాత నాజీవితాన్ని మానవ సేవలో గడుపుతాను” అని ఒక నిర్ణయానికి వచ్చాడు. జీసెస్ చెప్పిన “who se ever would save his life shall lose, it, and whosoever shall lose his life for My sake shall save it” దానిలో అర్థాన్ని వెతికే వాడు, ఆ ధోరణిలో జీవితాన్ని సార్ధకం చేసుకోవాలను కొనేవాడు మూత్తం మీద అర్థాన్ని పట్టుకొన్నాడు. బాహ్యానందంతోపాటు ఇప్పుడు మానసికానందాన్ని పొందుతున్నాను అనుకొనేవాడు.

యూరప్ వెళ్ళటానికి ప్లాన్ ఏమీ తయారు చేసుకోలేదు కాని, ముందుగా తలిదండ్రులకు దూరమైన బాలల భవ్య భవితవ్యం కోసం తపించి విద్యాబుద్ధులు నేర్పించి శ్రమించాడు. ఆయనకు అనాధ శరణాలయ సంస్థలేవీ సహకరించలేదు. కనుక తనదారేదో తానే వెతుక్కోవాలనిపించి విడుదలైన ఖైదీలలో మార్పు తెచ్చే ప్రయత్నం చేశాడు. అదీ ఫలించలేదు. పారిస్ మిషనరీ సొసైటీకి చెందిన ఒక మేగజైన్‌లో కాంగో కాలనీకి ఉత్తరాన ఉన్న గాబన్‌లో డాక్టర్ల అవసరం ఉంది అన్న ప్రకటన చూశాడు. ఇది ఒక వరంగా అనిపించింది. జీసస్ మాటల్ని అందరూ చెబుతారుకాని ఆచరణలో పెట్టేవారు బహు అరుదు అని గ్రహించాడు. తన ఆలోచనలకు తగిన అవకాశం అని, తనను చూసి నవ్విన వారి నాప చేను పండేట్లు చేసే సదవకాశం అనుకొన్నాడు.

“వీడెవడ్రాబాబూ! ఆఫ్రికాకు ఎగరేసుకొంటూ పోతానంటున్నాడు. మిషనరీగా కాదుట డాక్టర్‌గానట. వీడికి పిచ్చా వెర్రా” అనుకొన్నారు స్నేహితులు. వాళ్లకు సమాధానంగా “నేను డాక్టర్ అవాలనుకున్నాను ఒక్క మాట కూడా మాట్లాడకుండా. ఇప్పటిదాకా ఏదో ఒకటి జనాలకు చెప్పీ చెప్పీ విసిగి వేసారి పోయాను. ఇప్పుడు ఈ కొత్త అవతారంలో నాకు మాట్లాడే అవకాశం కోసం చూడను. క్రీస్తు చెప్పిన ప్రేమ మతాన్ని అవలంబించి సేవ చేస్తాను ఇదే నా నిర్ణయం దీనికి తిరుగు లేనే లేదు” అన్నాడు. తర్వాత ఏడేళ్ళు మెడిసిన్‌పై దృష్టి కేంద్రీకరించి చదివాడు. వైడర్ తోకలిసి బాష్ ఆర్గానిక్ సంగీతంపై మొదటి అయిదు విప్లవాత్మక భావ పరంపరగా గ్రంథాలు, జీసెస్ క్రీస్తు చారిత్రకతపై పుస్తకం రాశాడు. ఉష్ణమండల ప్రాంత వ్యాధుల గురించి 37వ ఏట పరిశోధన చేశాడు. హాస్పిటల్‌లో ఇంటర్ షిప్ పూర్తిచేసి, హేలీన్ బస్లావు అనే చారిత్రకారుని కుమార్తెను పెళ్లి చేసుకొని, కొత్త పెళ్ళాంతో ఆఫ్రికాలోని లామ్బార్నే సెటిల్‌మెంట్‌కు చేరాడు. మెడికల్ ప్రాక్టీస్‌కు కావలసిన బిల్డింగ్ నిర్మాణం పూర్తి కాలేదు. అక్కడి పరిస్థితులు పరమ దారుణంగా ఉన్నాయి. అతని కన్సల్టింగ్ రూమ్ పాడు పడ్డ చిన్న గది. మురికివాసన. అక్కడి ఉష్ణోగ్రత భరింప రానిదిగా ఉంది. మొదట్లో అతనికి దుబాసీలుగా సహాయకులుగా ఉండే స్థానికులు ఎవరూ దొరకలేదు. మొదటిసారిగా తమ దగ్గరకు ఒక డాక్టర్ వచ్చాడని తెలుసుకొని దాదాపు రెండు వందల

మైళ్ళు కాలినడకన నడిచివచ్చి జబ్బుపడ్డ వారు వచ్చేవారు. స్వీజర్ మలేరియాకే కాకుండా స్లీపింగ్ సిక్ నెస్, విరేచనాలు, అక్కడ బాగా ప్రబలి ఉన్న కుష్టు వ్యాధికీ చికిత్స చేశాడు. అవసరమైతే హెర్నియాకు అల్సర్, బోదకాలుకు కూడా శస్త్ర చికిత్స చేశాడు. డాక్టర్ ఆఫ్ డివినిటి అయిన ఆల్బర్ట్ పేషెంట్‌లు ఇచ్చిన బహుమతులను తీసుకోలేదు. మతాధికారులు అతన్ని దుబాసీ సహాయంతో మతబోధ చేయమని కోరేవారు. ఇదొక కొత్త అనుభవం అనిపించింది. ఏసుక్రీస్తు పవిత్ర బోధనలను అక్కడ ఏమీ తెలియని కొత్తవారికి ప్రచారం చేయటంలో విపరీతమైన ఆనందాన్ని పొందాడు. ఖాళీ సమయంలో బాష్‌పై మిగిలిన చివరి మూడు భాగాలు రాశాడు. తనకున్న ఆర్గాన్ సంగీతానికి మెరుగులు దిద్దుకొంటూ స్వయంగా తాను రూపొందించిన పియానోపై పలికించాడు.

స్వీజర్‌కు అతని భార్య తనకు నర్సుగా లేఖకురాలిగా సహాయం చేసింది. ఆఫ్రికా చేరిన ఏడాదిలోపే మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఫ్రాన్స్ అధీనంలో ఉన్న జర్మనీకి చెందినవాడు కనుక ఆల్బర్ట్‌ను విదేశీ శత్రువుగా భావించారు. తెల్లవాళ్ళు తెల్లవాళ్ళను ఖైదీలుగా చేసి నల్ల సైనికుల అధీనంలో ఉంచటం స్థానికులకు ఇబ్బందిగా ఉండేది అని "ఔట్ ఆఫ్ మై లైఫ్ అండ్ థాట్" పుస్తకంలో రాశాడు. నాగరిక దేశాలు యుద్ధంపై మొహరించిన కాలంలో స్వీజర్ డాక్టర్‌గా తన పని తాను చేసుకు పోతున్నాడు. వింత పరిస్థితులలో ఇరుక్కున్న రెండు రోజుల తర్వాత "ఫిలాసఫీ ఆఫ్ సివిలి జేషన్" రాయటం మొదలు పెట్టాడు. 16 నెలల తర్వాత స్వీజర్‌ను వందమైళ్ళ దూరం నదికి ఎగువన జబ్బుతో ఉన్న ఒక మిషనరీ భార్యను చూసి వైద్యం చేయటానికి అనుమతించారు. డెక్ మీద కూర్చుని తనకు అంతవరకు తెలియని కొత్త ఆలోచనలేవో మది నిండా ముసురు కాగా, యే వేదాంత గ్రంథంలోని లేని వినూత్న ఆలోచనలను పేజీలకు పేజీలు రాసేశాడు. మూడు రోజుల తర్వాత ఖడ్గమృగాల మధ్యలో ఉన్న అనుభవం ఏదో కలిగింది. మనసులో మెరుపులా "రివరెంస్ ఫర్ లైఫ్" అనే పదం తన్నుకొచ్చింది. అప్పటిదాకా ఉన్న ఇనుప తెరలు తొలగిపోయి, దారి సుగమంగా దర్శనమిచ్చింది. ప్రపంచ స్థితి, నైతికత ప్రక్క ప్రక్కనే ఉంటాయి. కనుక కనిపించే భౌతిక ప్రపంచం, జీవితం నాగరకతతో కలిసి పోవటం తన ఆలోచనలకు మూలం అన్నాడు ఆల్బర్ట్ స్వీజర్.

స్వీజర్‌కు వచ్చిన కష్టపరంపర నుంచి బయట పడేయ్యటానికి అతని "జీవితం కోసం భక్తి –(రివరెంస్ ఫర్ లైఫ్) బాగా తోడ్పడింది. యూరప్ తిరిగి వెళ్ళేటప్పుడు అదే రక్షగా ఉంది. గారిసాన్, సెయింట్ రేమి, లలో మానసిక వ్యాధి గ్రస్తులకు సేవ చేస్తున్నప్పుడు వాన్ గో వద్ద ఉన్నప్పుడూ అదే వెంట ఉండి నడిపించింది. ఆర్మిస్టైస్

వచ్చినప్పుడు శారీరక మానసిక శక్తులతో బాగా ఉన్నాడు. ఎక్కడికి వెళ్ళాలనుకొంటే అక్కడికి వెళ్లి పోగలిగేవాడు. లాంబ రేన్‌లో తన కార్య సాధనకోసం ఆర్గాన్‌తో ప్రదర్శనలిస్తూ లెక్చర్లు ఇస్తూ విరాళాలు స్వీకరించాడు. కీర్తి బాగా వ్యాపించి స్విట్జర్లాండ్, స్వీడెన్ డెన్మార్క్, ఇంగ్లాండ్‌కు 1924లో ఆహ్వానిస్తే వెళ్ళాడు. తిరిగి ఆఫ్రికాకు చేరాడు.

ఆల్బర్ట్ స్క్వీజర్ జీవిత చర్య ఇదే అయిపోయింది. తన హాస్పిటల్‌కు మందులు, పరికరాలు అవసరం వచ్చినప్పుడల్లా ఇల్లాగే లెక్చర్ టూర్, ఆర్గాన్ ప్రదర్శన చేసి ధనాన్ని పొందాడు. 1949లో మొదటిసారి అమెరికా వెళ్లి కొలరాడోలోని ఆస్పెన్‌లో జరిగిన గోథే సెంటిన్నియల్‌లో పాల్గొన్నాడు. 1950లో "నేషనల్ ఆర్ట్స్ ఫౌండేషన్ సంస్థ 18 దేశాలలోని చిత్రకారుల, సంగీతకర్తల, రచయితల మధ్య పోటీ నిర్వహించింది. అందులో "schweitzer was proclaimed The Man of the Century" అంటే ఆశతాబ్దపు ప్రముఖ వ్యక్తిగా ప్రకటింపబడ్డాడు. చాలా సంతోషించాడు. కాని దీనికంటే తాను కనిపెట్టిన శాశ్వత స్ప్రింగ్‌ను 750 కాంక్రీట్ బ్లాకుల మధ్య బిగించి వాయించటం అతన్ని మరింత గర్వపడేట్లు చేసింది. ఇంతకంటే అతనికి మహదానందం కలిగించిన విషయం మరొకటి ఉంది. అతని గారాల కూతురు 6 చింపాంజీలతో, 5 ఏపులతో అతి ప్రేమగా హాస్పిటల్ ఆవరణలో కలిసి తిరుగుతూ జీవరాసులన్నిటిపైనా ఆమె చూపిస్తున్న ప్రేమకు మరీ మరీ ఆనందం పొందాడు. తన కృషి తన కూతురుకు కూడా సంక్రమించటం ఆయనకు మధురానుభూతినిచ్చింది. జీసెస్ చెప్పిన విశ్వవ్యాప్త ప్రేమ ఆచరణలోకి వచ్చినందుకు సంబరపడ్డాడు.

65వ ఏట "ఆల్బర్ట్ స్క్వీజర్ ఫెలోషిప్" ఏర్పరచారు. అప్పుడు ఏం జరిగిందో ఒక సభ్యుడు ఇలా వివరించాడు "సరిగ్గా ఉదయం ఏడున్నర గంటలకు బ్రేక్ ఫాస్ట్‌కు గంట మోగింది. మేమందరం చీకటిగా ఉన్న ఆప్రదేశానికి ఆ ముందు రాత్రికే చేరుకొన్నాం. అబ్బా! యెంత అద్భుత ప్రపంచం! ఇంటి దగ్గర దాని చుట్టూ కూడా యదార్ధమైన జంతు ప్రదర్శనశాల చూశాం. అందులో కోళ్ళు, బాతులు, టర్కీలు, పిల్లులు, కుక్కలు, మేకలు, లేళ్ళు, పక్షులు మొదలైనవి ఎన్నో ఉన్నాయి. ఒక పెలికాన్ పక్షి అక్కడికి నిత్యం వచ్చిపోయే అతిధి. అక్కడ చేరిన పక్షులు జంతువులతో అది కూడా కలిసిపోయి ఆల్బర్ట్ స్క్వీజర్ ప్రేమను పొందుతుంది. ఈ జంతు ప్రపంచం మధ్య స్క్వీజర్‌ను చూస్తే ఆనాటి నిజమైన "సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసి" అనిపించాడు. రాత్రిళ్ళు తనను చిన్నప్పుడెప్పుడో రక్షించిన ఒక పసుపు తెలుపు రంగు పిల్లి ఒకటి వచ్చి కృతజ్ఞతాపూర్వకంగా ఆయన దగ్గర ఉండే దీపం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తుంది" అని ఆ యదార్ధ దృశ్యాన్ని ఫోటోగ్రాఫ్ తీసినట్లు రాసి మనకు చూపించాడు. ఇదంతా చూస్తుంటే ఒక మానవ మాత్రునికి సాధ్యమా అనిపిస్తుంది. సకల జీవరాసులపై ప్రేమ ఉన్న వారికి సాధ్యమే

అని తెలుస్తుంది. దీనికి మనకు ప్రత్యక్ష సాక్ష్యంగా భగవాన్ రమణ మహర్షి కనిపిస్తారు. రమణాశ్రమంలో ఆయన ఇలానే జంతు ప్రేమికులు అని మనకు తెలిసిన విషయమే. అవి చనిపోతే అక్కడే సమాధులు కూడా నిర్మించిన మహోన్నతమూర్తి శ్రీ రమణులు.

ఎనభై ఏళ్ళు మీద పడ్డాయి. జుట్టు నెరిసింది కాని దట్టంగా ఉంది. నీలి వాడి చూపులకళ్ళలో కరుణారసం, సహిష్ణత జాలువారుతూనే ఉన్నాయి. ప్రపంచంలో నిత్యం జరిగే అన్యాయాలు చూస్తున్న న్యాయం జరుగుతుందనే నమ్మకంతో ఉన్నాడు ష్వైజర్. ఇదేదో సంతృప్తికర ఆనందమయ ప్రపంచం అని అనుకోలేదు. "తానొక స్వయం విభజన చెందిన ఆదర్శవాది" (సెల్ఫ్ డివైడెడ్ ఐడియ లిస్ట్) అని చెప్పుకోనేవాడు. తానూ నిత్య ఆశావాదినని, ఏదో ఒక రోజు మానవాళికి మంచి జరిగి అందరూ సుఖ సంతోషాలతో జీవిస్తారనే నమ్మకం తనకు ఉన్నదని చెప్పేవాడు. "To every one ,in what ever state of life he finds himself, the ethics of reverence for life do this"అంటాడు. మనిషితన చుట్టూ ఉన్న వారి సంక్షేమం కోసం కూడా తపించి పని చేయాలి. విద్యావేత్తలు ఆర్టిస్ట్లు తమ దగ్గరున్న విద్య మొదలైన వాటిని అందరికీ అందించే ప్రయత్నం చేయాలి. ఈ బిజీ ప్రపంచంలో వ్యక్తి తన పరిధి దాటి బయటకు పోవటం నిజంగా కష్టమే. అయినా దాటే ముందడుగు వేయాలి. సకల జన సౌభాగ్యమే మానవ జాతి పురోగతికి మార్గం అని ఆలోచించాలి. తమ జీవితాలలో కొద్దిభాగమైనా పరులకోసం వెచ్చిస్తేనే మనం మానవులం అనిపించుకో గలుగుతాం" ఇదీ ష్వైజర్ మహర్షి చెప్పిన "రివరెంస్ ఫర్ లైఫ్". ఇది భక్తి పరిధి దాటి చాలా ముందుకు వెళ్ళింది. "It asked for a life which was actively, but not passively ,Christian --a life in which getting and spending, contrary to the spirit of the times, came second and sharing came first" అని తన సిద్ధాంత పిండితార్ధం చెప్పాడు.

1953లో ష్వైజర్కు నోబెల్ శాంతి పురస్కారం ప్రకటించి ఆయన మానవాళికి చేసిన సేవలను గౌరవించారు. ఆయనను 20వ శతాబ్దపు సాటిలేని మహోన్నత వ్యక్తి (ది ట్వెంటి యత్ సెంచ రీస్ మాచ్ లెస్ హ్యూమన్ బీయింగ్) అని శ్లాఘించారు. నిజంగా అ పురస్కారం ఆయన మనసును ఆర్ద్రం చేసింది. కాని స్వీడన్ వెళ్లి బహుమతిని స్వీకరించలేదు. తనను నమ్ముకొని తన సేవతో సేద దీరుతున్న ఆఫ్రికా వాసులను వదిలి ఒక్క క్షణం కూడా ఉండలేను అని తాను వెళ్ళక పోవటానికి కారణంగా చెప్పాడు. మనవ సేవే మాధవ సేవగా జీవితాన్ని చరితార్ధం చేసుకొని నిండుగా 90 ఏళ్ళు జీవించిన మహర్షి, ఏసుపాదమూ అయిన ఆల్బర్ట్ ష్వైజర్ 4-9-1965న తాను నమ్మిన ఏసు పదం చేరుకొన్నాడు.

"Who can describe the injustice and cruelties that in the course of centuries they [the coloured peoples] have suffered at the hands of Europeans?...... If a record could be compiled of all that has happened between the white and the coloured races, it would make a book containing numbers of pages which the reader would have to turn over unread because their contents would be too horrible The laying down of the commandment to not kill and to not damage is one of the greatest events in the spiritual history of mankind. Starting from its principle, founded on world and life denial, of abstention from action, ancient Indian thought -- and this is a period when in other respects ethics have not progressed very far -- reaches the tremendous discovery that ethics know no bounds. So far as we know, this is for the first time clearly expressed by Jainism.

అణు ఆయుధాలను అరికట్టాలని రేడియో ఒసియోలో మాట్లాడుతూ "The end of further experiments with atom bombs would be like the early sunrays of hope which suffering humanity is longing for" అని హెచ్చరించాడు. స్విజర్ జీవితాంతం "శాకాహారి"గానే ఉండిపోవటం మరొక విశేషం. ఎలిజబెత్ రాణి "ఆర్డర్ ఆఫ్ మెరిట్ కేవేలియర్ ఆఫ్ మిలిటరీ"ను, హాస్పిటల్ ఆర్డర్ ఆఫ్ సెయింట్ లాజరస్ ఆఫ్ జెరూసలెం అవార్డులను అందుకొన్నాడు స్విజర్. అతని కజిన్ అన్నే మేరీ స్విజర్ సాత్రే, ప్రముఖ శాస్త్రవేత్త జీన్ పాల్ సాత్రే తల్లి. స్విజర్ పేర అవార్డ్ నెలకొల్పి ఎందరో ప్రముఖులకు అందజేశారు. ఆల్బర్ట్ స్విజర్ అంతర్జాతీయ బహుమానాన్ని 29-5-2011న మొదటిసారిగా యూజీన్ డ్రూవర్ మాన్‌కు, డాక్టర్ దంపతులు రోల్ఫ్ అండ్ రాఫెల్ మైబాచ్‌లకు అందజేశారు.

బాష్ సంగీతాన్ని రికార్డ్ చేయటానికి స్విజర్ కొత్త టెక్నిక్ వాడాడు. దీనినే ఆయన పేరుమీద "స్విజర్ టెక్నిక్" అన్నారు గౌరవంగా. కొలంబియా, ఫిలిప్స్ రికార్డింగ్ కంపెనీలు దీన్ని బాగా సద్వినియోగం చేసుకొన్నాయి. స్విజర్‌పై దాదాపు పది సినిమాలు వచ్చాయి. ఆయన సుమారు ఇరవై దాకా పుస్తకాలు రాశాడు.❋



## 61. అత్యంత ప్రసిద్ధ ప్రతీకాత్మక హాస్యాత్మక పురాణ నవలా రచయిత- థామస్ మాన్ (1875-1955)

మార్సెల్ ప్రౌస్ట్ అనే ఫ్రెంచ్ రచయిత, ఐరిష్ రచయిత జేమ్స్ జాయిస్, అమెరికా రచయిత థామస్ ఉల్ఫ్, జర్మన్ రచయిత థామస్ మాన్ రాసిన స్వీయ చరిత్రలాంటి నవలలు ఇరవైవ శతాబ్దంలో కొత్త లోకాలను చూపించాయి. మాన్ పురాణ రచనలు రాయటం మొదలుపెట్టే దాకా మిగిలినవారి లాగానే చాలా కల్లోలం అనుభవించాడు. మిగిలినవారి కంటే వేరుగా ఉండటం ఆయన కోరుకొన్నాడు. దీనికోసం ఒంటరితనం అనుభవించాడు మధ్యతరగతి సంపన్న కుటుంబానికి చెందినవాడైనా.

జర్మనీలోని పాత హాన్సీటిక్ టౌన్‌లోని లూబెక్ సిటీలో థామస్ మాన్ 6-6-1875న జన్మించాడు. పాల్ థామస్ మాన్‌గా చర్చి రికార్డ్‌లో పేరు నమోదైంది. స్టూడెంట్ మేగజైన్‌లో రాసిన వాటిని పాల్ థామస్ పేరుతో రాశాడు. మాన్ వంశం తర తరాలుగా ప్రసిద్ధమమైనదే. తాత చాలా పేరున్నవాడు. నెదర్లాండ్స్‌కు "కాన్సల్"గా ఉండేవాడు. తండ్రి ధనవంతుడైన ధాన్యం వ్యాపారి, రెండుసార్లు సెనేటర్‌గా ఒకసారి లూబెక్ మేయర్‌గా ఉన్నవాడు. కన్జర్వేటివే కాని సంప్రదాయ పద్ధతి పాటించనివాడు. సౌత్ అమెరికా ప్లాంటర్, పోర్చుగీస్ క్రియోలీ జర్మన్ కుమార్తెను పెళ్లి చేసుకొన్నాడు. వీరి మొదటి కుమారుడు తాతలాగా లిబరల్‌గా ప్రసిద్ధుడు, తల్లిలాగా ప్రముఖ నవలాకారుడు. అయిదుగురు సంతానంలో థామస్ రెండవ వాడు తండ్రి గౌరవాన్ని మెచ్చుకొంటూనే చీదరించుకోనేవాడు. కాని తల్లి అంటే వీరాభిమానం చూపేవాడు. తల్లి పియానో, మాండలీన్ వాయించటంలో నేర్పరి. ఆ పట్నం లోని తతిమ్మా ఆడవారి కంటే చాలా భిన్నంగా అన్నిట్లోనూ కనిపించేది.

మాన్ బాల్య విద్య అంత హుషారుగా సాగలేదు. ప్రష్యన్‌ల పెత్తనం ఎక్కువ.

సాహిత్య గంధం వారికి పడేది కాదు. శిక్షణా గొప్పగా ఉండేది కాదు. మనవాడి కాలక్షేపం అన్నగారి "టాయ్ థియేటర్"లోనే, అక్కడున్న పుస్తకాలతోనే. ఆన్స్ క్రిస్టియన్ ఆండర్సన్ కథలు, హోమర్ రాసిన గ్రీకు పురాణ కథలు బాగా చదివాడు. 15వ ఏట తండ్రి చనిపోయాడు. కుటుంబ ఆదాయం క్రమంగా తగ్గిపోయి, దివాలా ఎత్తేయటం జరిగింది. లంకంత కొంప బేరానికి పెట్టారు. ఇంట్లోని పురాతన వస్తువులన్నీ అమ్మేశారు. పిల్లలను తీసుకొని తల్లి కొంచెం వెచ్చని ప్రాంతమైన దక్షిణంవైపు ఉన్న మ్యూనిచ్ చేరింది. థామస్ మాత్రం లూబెక్ లోనే అన్న హీన్రిచ్‌తో ఉండిపోయి స్కూల్ విద్య పూర్తి చేశాడు. గోథే, షిల్లర్, హీన్ కవులను అనుకరిస్తూ రొమాంటిక్ కవితలు రాశాడు. వీటికి "స్ప్రింగ్ స్టార్మ్" అనే పేరుపెట్టి ఒక చిన్న పత్రికకు పంపిస్తే అవి ప్రచురితమవగా మహా సంతోషించాడు. 19వ ఏట మ్యూనిచ్‌లో ఉన్న కుటుంబానికి చేరుకొన్నాడు. సీరియస్‌గా, తనకే ప్రాముఖ్యం ఉండాలనుకొనే ఈ నల్లకళ్ళ యువకుడి చూపులో భవిష్యత్ రచయిత దర్శనమయ్యేది. ఇన్సూరెన్స్ ఆఫీస్‌లో తాత్కాలికంగా పనికి కుదిరాడు. అకౌంట్స్ రాస్తూ, దొంగతనంగా ఫిక్షన్ రాస్తూ ఒక చిన్న కథ రాసి పత్రికకు పంపితే అది అచ్చు అయి చూసుకొని మురిసిపోయాడు. పొగడ్తలూ లభించాయి. ఒక ఏడాదికే దట్టంగా ముక్కు పొడుం పీలుస్తూ ముక్కు లెగరేసి చీదుతూ రోతగా ఉండే గుమాస్తాల మధ్య ఉండటం అసహ్యమని పించింది. ఈ గుమాస్తా చాకిరీ విసుగనిపించి. తండ్రి ఆస్తిపై వచ్చేరాబడి బాగానే ఉండటంతో మళ్ళీ చదువులో దిగాడు. యూని వర్సిటిలో చేరి ఫిలాసఫీ, సాహిత్యం చదివాడు. తల్లి అతనికి మరో 12నెలల స్వేచ్ఛనిచ్చింది. ఈ కాలం ఇటలీలో గడిపాడు. అప్పటికి హీనస్ రిచ్ అక్కడే ఉన్నాడు, తన పెద్ద గ్రంథం రచనలో మునిగి ఉన్నాడు. థామస్ చిన్న కథలు రాస్తూ "లిటిల్ మిస్టర్ ఫరీద్ మాన్" పేరుతో కథా సంపుటిని 23వ ఏట ప్రచురించాడు.

అన్న హీన్రిచ్ ప్రోత్సాహంతో భయపెట్టేంత పెద్ద సైజులో ఉద్గ్రంథ రచన చేస్తూ 1898లో జర్మనీకి తిరిగి వస్తూ తనతో "బడ్డన్ బ్రూక్స్" అనే ఆ మహా గ్రంథాన్ని తెచ్చాడు. ప్రచురణ కర్త పుస్తకం సైజు సగానికి సగం తగ్గించమని ప్రాధేయ పడ్డాడు. అదంతా తన పూర్వీకుల కథ, ఆనాటి సమాజం కథ అవటం, తాను ఇంకా యవ్వనంలోనే ఉండటం వలన తక్కువ పేజీలలో దాన్ని కుదించి న్యాయం చేయలేనని తగ్గించటానికి ససేమిరా అన్నాడు. పబ్లిషర్ అభ్యంతరాలను తోసిరాజంటూ రెండుభాగాలుగా దీన్ని 1902లో ప్రచురించాడు. ఊహాతీత విజయం వరించింది. ఒక్క ఏడాదిలోనే రెండు భాగాలను కలిపి ఒకే పుస్తకంగా ప్రచారించాడు. అంత డిమాండ్ వచ్చింది ఆ పుస్తకానికి. మాన్‌ను "డాజ్లింగ్ పో ర్టెంట్ "అంటే" మిరుమిట్లు గొలిపే ఉత్పాతం" అన్నారు. ప్రపంచం లోని సజీవ భాషలన్నిటిలోకీ ఈ నవల అనువదించబడింది.

అదొక సమకాలీన క్లాసిక్ అయింది. జర్మనీలో ప్రతి ఇంటిలోనూ బైబిల్‌తో పాటు ఈ పుస్తకమూ చోటు చేసుకొన్నది. 1935లో జర్మన్ భాషలో వెలువడిన ఈ గ్రంథం ఒక మిలియన్ కాపీలకు పైనే అమ్మకాలు సాధించింది. 1929లో థామస్ మాన్‌కు నోబెల్ ప్రైజ్‌ను సాహిత్యంలో ప్రదానం చేస్తూ కమిటీ "మాన్ రాసిన గొప్ప నవల బడ్డన్ బ్రూక్స్‌కు మాత్రమే ఈ పురస్కారం" అని మెచ్చి ఇచ్చింది.

బడ్డేన్ బ్రూక్స్‌లోని కథను తెలియ జేస్తూ ఉప శీర్షికగా "ఒక కుటుంబ పతనం" (డిక్లైన్ ఆఫ్ ఎ ఫామిలీ) అని అర్థవంతంగా పేరు పెట్టాడు. 19వ శతాబ్దంలోని మూడు తరాల కథాగమనం ఇందులో ఊహాతో తనవారి ఉత్థాన పతనాలను ఆవిష్కరించాడు. ధనాన్ని కోల్పోవటం, సంస్కృతిలో ఉన్నతి సాధించటం చూపించాడు. నిర్వహణ చాలా సహజంగా ఉన్నా, అంతరార్థం అంతా–ఆది భౌతికంగా (మెటా ఫిజికల్ )గా ఉండటం విశేషం. ప్రసిద్ధ వేదావీతులైన నీషె స్కోపెంహార్‌లను పూర్తిగా అధ్యయనం చేశాడు కనుక ఆ భావ పరమపరలో నడిపాడు. నీషె వేసిన ప్రశ్న "మన ఉనికికి పరమార్థం ఉందా?" అన్న దానికి వివరణ ఇది. ఇందులో సామాన్య పౌరుడి ప్రపంచానికి, సమాజంలో ఇమడలేని ఆర్టిస్ట్ ప్రపంచానికి ఉన్న తేడాను గొప్పగా వివరించిన నవల. కుటుంబగాథా సరిత్సాగరమే కాకుండా సామాజిక సమస్యా కథా సాగరం కూడా. ఒక రకంగా మన విశ్వనాథ వారి "వేయి పడగలు"లాగా అనుకోవచ్చునేమో? దీనినే మాన్ భాషలో ఏం చెప్పాడో చూద్దాం– "it is my bourgeois conscience makes me see in the artist life, in all irregularity and all genius, something profoundly disreputable, that fills me with this lovelorn "faiblesse "for the simple and good, the comfortably normal, the average unendowed respectable human being"

ముప్ఫైవ ఏట ప్రేటియా ప్రింగ్ షీం అనే అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాడు. ఆమె తండ్రి ప్రముఖ గణితాచార్యుడే కాక, కళా పిపాసి. విలువైనవాటి సేకరణ చేసేవాడు. తర్వాత 28 ఏళ్ళు "మాన్ తన ఉమన్"తో హాయిగా విలాసంగా సృజనాత్మకంగా కాలక్షేపం చేశాడు. మ్యూనిచ్‌లో ఉన్న విలాసవంతమైన పెద్ద భవంతి కాక, మిమి లాండ్‌లోని ఇసార్‌లో ఒక కాటేజీని ఏర్పాటు చేసుకొన్నాడు వేసవి విడిది కోసం. ముగ్గురబ్బాయిలు ముగ్గురమ్మాయిలు సంతానం. ఒక కొడుకు "క్లాస్" రచయిత. ఒక కూతురు "ఎరీకా" నటి, ప్రసిద్ధ కవి డబ్ల్యు. హెచ్ ఆడెన్‌ను పెళ్ళాడింది. తన వివాహం కాగానే మాన్ "రాయల్ హైనెస్" అనే అరిస్టాక్రాటిక్ హీరో గురించి, ఆర్టిస్ట్ అయిన ఆతను రెండు భిన్న సమాజాలమధ్య పొందిన బాధల గాథలుగా రాశాడు. పూర్వపు వాటిలో ఉన్న తీవ్రతను తగ్గించి తగిన మోతాదులో రాయటంతో దీన్ని నవలా రూపంలో ఉన్న కామెడి

అన్నారు. మొ.ప్ర.యు.వచ్చి మీద పడే సమయం. ఇంకా 15ఏళ్ళకు కాని మాన్ మహా గ్రంథం అచ్చు అయి వెలుగు చూడదు.

"డెత్ ఇన్ వెనిస్" అనే ప్రసిద్ధ నవలిక 30వ ఏట రాశాడు. అందాన్ని ఆరాధించే, పాతదాన్ని పెకలించేసే గుస్టావ్ వాన్ ఏశాన్ బాష్ అనే విసిగి వేసారిన అరిస్టా క్రాటిక్ గురించిన కథగా రాశాడు. అతనికి ఒక పోలిష్ కుర్రాడు తోడు. ఇద్దరిమధ్య మాటలు ఉండవు. పట్టణం ప్లేగు మహమ్మారి కోరల్లో ఉంటే హీరో ఆ కుర్రాడి కోసం అక్కడే ఉండి చనిపోవాలనుకొంటాడు. ఇందులోని కొన్ని వాక్యాలు అద్భుతంగా ఉంటాయి – "beauty ;s very essence ,form as divine thought, the single and pure perfection which resides in the mind"లాంటివి చాలా ఉన్నాయి. కథా లేదు కాకర కాయా లేదూ. పనీ లేదు పాటాలేదు. కాని అత్యంత ఉత్కంఠ కలిగిస్తూ నరాలు తెగిపోతాయేమో అన్నంత భయాన్ని కల్పిస్తూ రచన చేశాడు మాన్. సౌందర్య స్తోత్రం చేస్తూ ప్రేరణతోపాటు అపకారమూ కల్పించాడు. ఇందులోని విషయం మాన్‌కు చాలా ఇష్టమైనది. హీరో ఎవరితోనూ పెద్దగా మాట్లాడక పోయినా, ఒంటరిగా ఉన్నా, తనకు సేవ చేసే వారితోనే అప్పుడప్పుడు మాట్లాడుతున్నా నవలాకారుని తీవ్ర తన్మయత్వం ముగ్ధుల్ని చేస్తుంది. దీని భావాన్ని జోసెఫ్ వార్నర్ ఏంజెల్ అనే విశ్లేషకుడు –"ది థామస్ మాన్స్ రీడర్"లో రాస్తూ "his absorption with the idea, his yielding to the image of Tadzio;s beauty separates Aschenbach from his art, which is communication, and from his morality, and he plunges into the abyss of solitude" అన్నాడు.

మొ.ప్ర.యు.తర్వాత మాన్ ఫిక్షన్ ఏదీ రాయలేదు. "అన్ పొలిటికల్ మాన్" అనే పుస్తకంలో తన జ్ఞాపకాలు రాశాడు. తనవన్నీ మెటాఫిజికల్, మోరల్ రాజకీయ, సాంఘికాలను చెందినవని, తన అభిరుచులు సంప్రదాయం జర్మనీకి చెందినవని, అవి కయ్యానికి కాలుదువ్వే దేశభక్తికి చెందినవనీ చెప్పేవాడు. కొన్నేళ్ళ తర్వాత మాన్‌కున్న కన్జర్వేటివ్ భావాలు తగ్గాయి. తక్షణ సమస్యలపై దృష్టి ఏర్పడింది, తానున్న పరిస్థితులను తన అంతరాత్మనూ బేరీజు వేసుకొన్నాడు. తాను నడిచిన మార్గం సరైనది కాదని గ్రహించాడు. రాజకీయానికి వ్యతిరేకమైన, అభివృద్ధికి నిరోధకంగా ఉన్న సంస్కృతితో తాను సహజీవనం చేయలేనని గ్రహించాడు.

ఇదుగో ఇలాంటి అంతః శుద్ధి ఏర్పడిన కాలంలోనే "ది మాజిక్ మౌంటెన్" రాశాడు. మాన్ మొదటి నవల బడ్డన్ బ్రూక్స్‌ను మొదటి స్వచ్ఛమైన జర్మనీ నవలగా భావిస్తే, దీన్ని స్వచ్ఛ మైన మొదటి యూరప్ నవలగా విమర్శకులు గుర్తించారు. ఇది కూడా మాస్టర్ పీస్–అత్యుత్తమ నవల అనిపించింది. ఈ నవల కథ 1912లో మాన్మాన్

మనసులో మూడు వారాలు భార్యకు శ్వాసకోశ సంబంధ వ్యాధి చికిత్స కోసం సానిటోరియంలో ఉండగా రూపుదిద్దుకున్నది. మొదట్లో ఇదొక కామెడీగా అనుకొన్నాడు. కాని చావుపై వ్యామోహం, జీవితంపైనా, సువ్యవస్థపై అవ్యవస్థ విజయాలు చూసి విపరీతంగా పెంచి రోగగ్రస్త నాగరకతపై నీతి కథా వృత్తాంతంగా రాశాడు. ఈ నవల నుయదార్ధంగా ప్రతీకాత్మకంగా రెండు స్థాయిలలో రచించాడు. మామూలు కథ అయితే ఒక అమాయక, ఏదీ దాచుకొని మధ్యతరగతి యువకుడైన హాన్స్ కాస్టర్ప్ స్విస్ శానిటోరియంలో క్షయ వ్యాధికి చికిత్స పొందుతున్న ఒక కజిన్‌ను చూడటానికి వస్తాడు. మూడు నెలలు ఉండాలనుకొని వచ్చినవాడు ఏడేళ్ళు అక్కడే ఉండిపోతాడు. అక్కడే అనేక సాహసాలలో మాంసం, ఆత్మలను పరిశీలించి "సూక్ష్మ లోకం" (వరల్డ్ ఇన్ మైక్రో కాసం)ను కనుక్కొంటాడు. అక్కడే ఒక జర్మన్ డాక్టర్ ఒక రష్యా అమ్మాయి మొదలైన అనేక జాతుల మనుషుల ప్రభావానికి లోనౌతాడు. రష్యా అమ్మాయిపై వలపుల వల విసురుతాడు. జర్మన్ డాక్టర్, సాల్విక్ సైకాలజిస్ట్ డచ్ పెయింటర్ కూడా పరిచయ మౌతారు. వాళ్ల సుదీర్ఘ వాగ్వాదాలు, చావులాంటి ఉదాసీనత చూసి అకస్మాత్తుగా, యే పనీలేకుండా ఉండే పరిస్థితిలో నుంచి ఒక మాజిక్ పర్వతం వలన బయటపడి జన జీవితంలోకి అడుగుపెట్టాడు. ప్రతీకాత్మకంగా ఆలోచిస్తే- ఇది జాతీయతను, ఉదారవాదాన్ని తెలియజేస్తూ, విషాదం వినోదం కాని జీవితం పాత్రలన్నీ అన్యార్థమైనవిగా ఉంటాయి. దీనిలోని నీతిని మాన్ స్వయంగా ఇలా "A man lives not only his personal life as an individual, but also consciously or unconsciously, the life of his epoch and his contemporaries" వివరించాడు.

మాజిక్ మౌంటెన్‌లో వాతావరణం శబ్దార్ధ ప్రధానంగా (లిటరల్), మెటా ఫిజికల్‌గా ఉంటుంది. శిఖరాగ్రం నుండి దూకే పదాల జలపాతంలాగా ఉంటుంది. అవి రక్తం లేని వ్యాసాల్లాగా ఉంటాయి. అతని ఆలోచన నిర్మాణం కథా కథనం, మేధా కలసిపోయి అత్యద్భుత పాత్ర చిత్రణతో అత్యంత గొప్ప ఏకైక ఊహాత్మక నవలగా చరిత్ర సృష్టించింది. దీని విస్తృత పరిధి వలన ఇరవయ్యవ శతాబ్దపు ప్రపంచాన్ని, దానికి అంటుకొన్న క్షయాన్నిచూడవచ్చు. ఈ క్షీణత మొదట్లోను తర్వాత హిట్లర్ ప్రజాస్వామ్యంపై చేసిన దాడితోనూ మాన్ మనసులో పడలేదు. అతని అన్న హీన్రిచ్, అతని ఎదిగిన పిల్లలు అతిగా వ్యాపిస్తున్న నిరంకుశత్వాన్ని ఎదిరించమని పదేపదే కోరేవారు. ఏ రాజకీయం లేని మాన్ నిర్ణయం తీసుకోలేకపోయాడు. తనలో కన్జర్వేటివ్ భావాలు ఇంకా ఉండటం వలన జర్మనీకి వ్యతిరేకంగా మాట్లాడలేక పోయాడు. నాజీల పూర్తి దౌష్ట్యం, నేరం, నేషనల్ సోషలిజం పేరిట రీచ్ స్టాగ్ కాల్పులలో గుర్తించి మారిపోయాడు. వెంటనే

రొమాంటిక్ బార్బెనిజాన్ని ఎదిరించాడు. ఈ కాలంలో మాన్ స్విట్జర్ లాండ్‌లో జోసెఫ్‌పై రాస్తున్న నాలుగు భాగాల రచనలో మునిగిపోయాడు. మళ్ళీ ఎన్నడూ జర్మనీలో అడుగు పెట్టలేదు.

1933లో జ్యూరిచ్‌లో స్థిరపడ్డాక, మాన్ ఆస్తి నంతటిని జర్మనీ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నది. మాన్ గ్రంథాల నన్నిటిని కాల్చి బూడిద చేసింది నాజీ ప్రభుత్వం. మూడేళ్ళ తర్వాత అతని జర్మన్ పౌరసత్వం రద్దు చేశారు. 1938లో జన్మ భూమి జర్మనీలో నిలువ నీడలేని మాన్ అమెరికాకు వెళ్లి ప్రిన్స్ టన్ యూనివర్సిటీలో ఉపన్యాసాలిచ్చాడు. కాలి ఫోర్నియాలో స్వగృహాన్ని ఏర్పరచుకొని 1914లో అమెరికా పౌరసత్వం పొందాడు. ఫాసిస్ట్ కార్య క్రమాలకు వ్యతిరేక ప్రచారంలో పాలు పంచుకొన్నాడు. "ది కమింగ్ ఆఫ్ డెమోక్రసీ"లో "the habit of thought which regards life and intellect, art and politics as totally separate worlds" అని రాశాడు. భవిష్యత్ నాగరకతపై దార్శనికుడుగా తన మనోభావాలు చెప్పాడు. "నా నలభై వ ఏట తప్పు చేయకుండా ఉండి ఉంటే, ఇవాళ నేను సత్యదర్శనాన్ని పొంది ఉండేవాడినే కాదు అంటూ "truth can never be a possession, only an eternal aspiration. May it be said of each one of us that he spent his life honestly and restlessly striving for the true and the good" అన్నాడు.

జర్మనీలో ప్రారంభించిన నాలుగు భాగాల పుస్తకాన్ని పాలస్తీనా, స్విట్జర్లాండ్‌లలో కొనసాగించి మాన్ అమెరికాలో పూర్తి చేశాడు. యాభైవ పడిలో ఒక మ్యూనిచ్ ఆర్టిస్ట్ వచ్చి జీసెస్‌కు సంబంధిన ఇతిహాసానికి చిత్రాలు గీయమని, ముందుమాట రాయమని కోరాడు. పూర్తిగా ధ్యానంతో, అస్థిర ఊహాగానాలతో తానూ బైబిల్ కథలను మళ్ళీ చదివానని, గోథే చేసిన "అతి సాధారణమైన కథ చాలా అందంగా ఆహ్లాదంగా ఉంది అతి తక్కువలో ఉండి మిగిలినది ఎప్పుడు పూరిద్దామా అనే తహ తహ ఏర్పడింది అన్న వ్యాఖ్య గుర్తుకొచ్చిందని మాన్ తన "ఎ స్కెచ్ ఆఫ్ మై లైఫ్"లో రాసుకొన్నాడు. అది తనకు గొప్ప అవకాశమేనని మనిషి మూలాలను వెదికి, అతని సారాంశం, లక్ష్యాలను తెలియజేసే మహత్తర కృషి అని అన్నాడు. ఈ జోసెఫ్ పుస్తకానికి బొమ్మలు వేయటానికి 16 ఏళ్ళు పట్టింది. మొదటి భాగం "జోసెఫ్ అండ్ హిజ్ బ్రదర్స్" ఆరేళ్ళతర్వాత 1934లో ప్రింట్ అయింది. ఇదే ఇంగ్లాండ్‌లో "ది టేల్స్ ఆఫ్ జాకబ్" పేరున విడుదలైంది. ఏడాది తర్వాత "ది యంగ్ జోసెఫ్", వచ్చింది తర్వాత "జోసెఫ్ ఇన్ ఈజిప్ట్" 1938లో ముద్రణ పొందింది. "జోసెఫ్ ది ప్రోవైడర్" అనే సంతోషకర భాగం పూర్తిగా అమెరికాలోనే 1944లో రూపు దిద్దుకొన్నది. బైబిల్ కథే అయినా కాలం, స్థలాలను ఆధునిక దృష్టితో చూపాడు. హాన్స్ కాస్ట్రాప్‌లాగా మాన్ కూడా కొత్త అపరి శుద్ధ వాతావరణంలో

యువకుడిగా ప్రవేశించాడు. మామూలుగానే యదార్థాన్నీ ప్రతీకల్నీ జోడించాడు. ఇందులో కూడా ఆర్టిస్ట్‌ను సమాజంతో అతని పోరాటాన్ని చిత్రించాడు. కలల బేహారి, అందగాడు అయిన జోసెఫ్‌ను అతని సోదరులు మోసం చేస్తారు. అతని ధార్మికతకు ఈర్ష్యతో బందీ చేస్తే చివరికి విడిపించుకొని మహోన్నతంగా ఎదుగుతాడు. అతని విజయానికి తగిన గుర్తింపు లభించేలోపు, పూర్వపు ఐతిహాసిక నాయకులలాగానే చనిపోతాడు. జోసెఫ్ అమర ఆర్టిస్ట్‌గా విమోచకుడుగా, ప్రదాతగా, బాధలను అనుభవిస్తూ నమ్మిన ప్రజలను రక్షించే రక్షకుడుగా మిగిలిపోతాడు.

ఈ నాలుగు భాగాలు విడుదల అవుతున్నప్పుడే మాన్ 1940కి ముందు రాసిన ఫిక్షన్ అంతా అంటే బృహత్ నవలలు కాక మిగిలిన వాటినన్నిటినీ “స్టోరీస్ ఆఫ్ త్రీ డికేడ్స్”గా ముద్రించాడు. ఇది కాక గుర్తింపు పొందిన ఫ్రాయిడ్, గోథే, వాగ్నర్‌లపై వ్యాస పరంపర అచ్చు వేశాడు. అనేక రాజకీయ పత్రాలను, “ది బిలవేడ్ రిటర్న్స్”ను, ముసలి గోథేపై ఒక నవలను చైతన్య స్రవంతి (స్ట్రీం ఆఫ్ కాన్షస్ నెస్)లో రాశాడు. ఇది గోథే ఉదయ ధ్యానానికి ప్రతీక. హిందూ నేపథ్యంగా “ది ట్రాన్స్ పోజేడ్ హెడ్స్” అనే ఫాంటసిని, ఒజేస్, డేకలాగ్‌లపై ఒక నవలికను అల్లాడు. ఇది జోసెఫ్ సాగాకు అనుబంధం. 73వ ఏట మళ్ళీ గోథే మహాశయుడికి గౌరవాభినందనలు తెలియజేస్తూ “డాక్టర్ ఫాస్టస్” రాశాడు.

ఎనభై ఏళ్ళు వచ్చాయి మాన్‌కు. “బ్లాక్ స్వాన్” రాసి ప్రచురించి అభిమానుల్ని ఆశ్చర్యపరచాడు. ఇది ఒక మధ్య వయసు స్త్రీ జననేంద్రియ (గైనలాజికల్) కథ. ఆమెకు బహిస్టు ఆగిపోయినాక తన కొడుకుకంటే కాస్త పెద్ద వాడైన ఒక యువకుడితో ప్రేమలో పడుతుంది. కలలు కంటుంది. పూర్తి ప్రేమ పిచ్చిలో పడిన ఆమెకు కేన్సర్ వచ్చిందని తెలుస్తుంది. ఈ అత్యధిక వేదనా భరిత కధను పేరడీ జోడించి రాశాడు. మాన్ తప్పులన్నీ అతని స్టైల్‌కు ముడిపెట్టబడి ఉన్నాయి. జర్మనీ సంగీతకారుడు వాగ్నర్ వాద్య ఘోషలాగా మాన్ మాటల ఘోష ఉంటుంది. లేక జార్గాన్‌ను మరొక ఆర్ట్‌కు జత చేసినట్లు ఉంటుంది అంటారు. రంగు మీద రంగు అద్ది హడలెత్తిస్తాడు అంటారు. సంక్షిప్తతా ప్రతిభ లేనివాడు మాన్. చిన్నకథల్లో కూడా లాగుడు స్వభావం జాస్తి. అతని ప్రతీకలూ భారంగా ప్రాముఖ్యంగా ఉంటాయి. నడక మందంగా ఉంటుంది. విడిపోయిన జర్మనీని కలిపే ప్రయత్నం చేస్తూ 1952లో స్విట్జర్లాండ్ వెళ్ళాడు. అకస్మాత్తుగా జ్యూరిచ్‌లో జబ్బు చేసింది. అక్కడే రక్తం గడ్డ కట్టి ఎనభైవ ఏట 12–8–1955న మహా రచయిత మాన్ మహా మానవునిలో కలిసిపోయాడు. “ఉత్తమ మానవ సంప్రదాయ దూత” (హెరాల్డ్ ఆఫ్ ది బెస్ట్ ట్రెడిషన్ ఆఫ్ హ్యూమానిటి)గా మాన్‌ను అందరూ అభినందించారు.

యాదృచ్ఛికంగా మాన్ మరణించిన నెల తర్వాత ఆయన "గేయేస్ట్" నవల ముద్రణ జరిగింది. 30 ఏళ్ళకు పైగా ఈ కథ ఆయన మనసులో ఉంది. మరణానంతరం "కన్ఫెషన్స్ ఆఫ్ ఫెలిక్స్ క్రల్, కాన్ఫిడెన్స్ మాన్" 1955లో వచ్చాయి. ఇది వినోదాత్మక నవలగానే కాకుండా అ యుగపు గొప్పసాహస రౌడీ నవలగా గుర్తింపు పొందింది. సగం పారడి, సగం అపహాస్య జ్ఞానంతో రాణించింది. ఆర్టిస్ట్ యాక్టర్ అడ్వెంచర్ మాత్రమేకాదు, ఆయన జీవించిన కాలానికి విమర్శనాత్మక చిత్రం అది.

1929లో సాహిత్యంలో మాన్‌కు నోబెల్ బహుమతినిచ్చారు. డాస్టవస్కి పై రాసిన వ్యాసంలో మాన్ ఫ్రెడరిక్ నీట్స్ అనుభవించిన బాధలతో పోల్చాడు. నీషే ప్రభావం మాన్‌పై చాలా ఉంది. మొదటి ప్రపంచ యుద్ధంలో కైజేర్ విలాం కన్జర్వేటిజాన్నిను బలపరచి లిబరల్స్‌పై నిప్పులు చెరిగాడు. కొత్త జర్మన్ వీమర్ రిపబ్లిక్‌కు మద్దతు ఇవ్వమని మేధావులను కోరాడు. బీతొవెన్ సంగీతంపై ప్రసంగించాడు. క్రమంగా మాన్ భావాలు లిబరల్ లెఫ్ట్ నుంచి ప్రజాస్వామ్యం వైపు మళ్ళాయి. నాజీయిజాన్ని వ్యతిరేకించమని పనివారలకు ప్రబోధించాడు. నాజీలకు వ్యతిరేకంగా ఎన్నో రేడియో ప్రసంగాలు చేశాడు. దాదాపు 60కి పైగా మాన్ గ్రంథాలు రాశాడు.

'Mann' style is finely wrought and full of resources, enriched by humour, irony, and parody; his composition is subtle and many-layered, brilliantly realistic on one level and yet reaching to deeper levels of symbolism. His works lack simplicity, and his tendency to set his characters at a distance by his own ironical view of them has sometimes laid him open to the charge of lack of heart. He was, however, aware that simplicity and sentiment lend themselves to manipulation by ideological and political powers, and the sometimes elaborate sophistication of his works cannot hide from the discerning reader his underlying impassioned and tender solicitude for mankind అన్నది యెన్ సైక్లో పీడియా బ్రిటాన్నికా. Mann demanded "a compact between the conservative culture-idea and revolutionary social thought: to put it pointedly ...... an understanding between Greece and Moscow". At the same time he defended the standpoint that one should establish a dialogue between Karl Marx and Friedrich Hölderlin, because a social democracy must go hand in hand with cultural education and the development of society.❋



## 62. సాంప్రదాయ ఆధునికత్వాల వారధి ప్రఖ్యాత జర్మన్ మార్మిక కవి- రైనెర్ మేరియా రిల్కే (1875-1926)

జర్మనీ మహా కవులు గోథే, హీన్ లతర్వాత అంతటి ప్రసిద్ధి పొందిన కవి రైనెర్ మేరియా రిల్కే. ఆస్ట్రియాకు చెందినవాడైనా జర్మనీలోనే ఉన్నాడు. ఆ భాషలోనే రచనా వ్యాసంగం చేశాడు. 4-12-1875న ప్రేగ్‌లో పాత బోహీమియన్ వంశంలో జన్మించాడు. చిన్ననాటే గొప్పవాడనిపించాడు. ఒక కూతురు పసిపిల్లగా ఉన్నప్పుడే చనిపోతే తల్లి ఇతనిని అతి గారాబంగా ఆడపిల్లలాగా పెంచి ముద్దూ మురిపం చూపింది. చర్చిలో పేరు రెనీ. ఆరేళ్ళదాకా ఆడపిల్ల వేషంలోనే పెరిగాడు. ఆడుకోటానికి బొమ్మలు, టాయ్ కిచెన్ వంటివి ఇచ్చేది తల్లి. తల్లికి సాయం చేస్తూ వస్తువుల దుమ్ము దులిపేవాడు. ధరించిన పెద్ద గౌను, చిన్న చామాయిస్ గ్లోవ్స్‌లను చూసుకొని గర్వ పడేవాడు.

తనకు యే రకమైన పునాది లేదన్నాడు. రహస్యంగా ఉండటం అలవాటైంది. ఈ ఆడ వేషాలకు చెల్లు చీటీ ఇస్తూ తండ్రి మిలిటరీ స్కూల్‌లో చేర్చాడు. పదేళ్ళ వయసులో నిత్య జీవితంలోని ఒత్తిడి తట్టుకుంటూ, ఒంటరి జీవితానికి అలవాటు పడి, చివరికి ఒక అంకుల్ రక్షణలో ఊపిరి పీల్చుకొన్నాడు. ఈ అంకుల్ గారి చిత్రాన్ని గీసి ఆయన్ను ఒక చక్రవర్తిగా ఆరాధించాడు. క్రమంగా ఈ ఆరాధన భగవంతుని వైపు మరల్చాడు. మిలిటరీ స్కూల్‌లో ఇబ్బంది పడ్డాడు. అయిదేళ్ళు మిలిటరీ స్కూల్ చదువు. నీళ్ళలో చాలా సేపు ఇతన్ని నిలబెట్టేవారు. పనికిమాలిన వారితో జమ చేసి తిప్పలు పెట్టేవారని చెప్పుకొన్నాడు. ఈ బాధలు భరించలేక అర్ధరాత్రులలో మంచం మీద లేచి నిలబడి తనకు చావు ప్రసాదించమని దేవుడిని వేడుకొనేవాడు. మొరేవియాలోని

సెయింట్ పోల్టన్ అనే మొదటి స్కూలులో అనుభవించిన దారుణాలు మానసిక గాయమై జీవితాంతం వేధిస్తూనే ఉన్నాయని చెప్పు కొన్నాడు రిల్కే.

గోరు చుట్టు మీద రోకలి పోటులాగా రిల్కే బాధలు తల్లీ తండ్రీ విడిపోవటంతో మరీ పెరిగాయి. పెదనాన్న జరోస్లోవ్ రిల్కే బాధ్యత తీసుకొని ప్రైవేట్ ట్యూటర్‌లను పెట్టి చదివించాడు. ఈ అంకుల్ అకస్మాత్తుగా మరణించగా ఏడేళ్ళ రిల్కీ తట్టుకోలేక ఆత్మహత్యా ప్రయత్నం చేసుకొన్నాడు. బిజినెస్ స్కూల్‌లో ఒక ఏడాది లాగినా ఉపయోగ పడలేదు. ప్రేగ్ యూనివర్సిటి పరీక్ష ఇరవైవ ఏట పాసయ్యాడు. సాహిత్యం మెటాఫిజిక్స్, తత్వశాస్త్ర చరిత్ర చదివాడు. న్యాయ శాస్త్రంపై దృష్టి పడింది. ఒక సెమిస్టర్ అవగానే ఆర్ట్ చదవటానికి మ్యూనిచ్ పారిపోయాడు. తర్వాత స్కూల్ చదువుకు సున్నా చుట్టి వారసత్వ ఆస్తిపై వచ్చిన కొద్దిపాటి డబ్బుతో యాత్రా సందర్శనంతో కొత్త కొత్త స్నేహితులతో, కొద్దికాలపు అసంతృప్తి ప్రేమ వ్యవహారాలతో కాలక్షేపం చేశాడు.

1897లో వేలరీ డేవిడ్ రోన్ఫీల్డ్ అనే అమ్మాయితో ఎంగేజ్ మెంట్ ఆగిపోయాక మొదటి పుస్తకం ముద్రణకు డబ్బు ఇచ్చి, నీషెని కలవరపరచిన లూసలోమీ అనే 35ఏళ్ళ ఆవిడతో 23వ ఏట ప్రేమలో పడ్డాడు. ఆమె ఇతనిని హృదయానికి హత్తుకోగానే అతని గుండె కుదుపులకు లోనైంది. ఇద్దరూ ప్రేమికుల అవతారం ఎత్తారు. కాని కొద్దికాలానికే విడిపోయారు. మళ్ళీ కొన్నేళ్ళ తర్వాత పెళ్లి చేసుకొన్నారు. సలోమీ రిల్కీకి సర్వస్వం అయి ఎంతో సహకరించి ఆదర్శ గృహిణి అనిపించింది. నిత్య బోరు జీవితాన్నుంచి దూరం కావటానికి ఒంటరితనానికి ప్రయత్నించేవాడు. మొదటిపుస్తకం "లైఫ్ అండ్ లిరిక్స్"ను 19 ఏట ముద్రించాడు. తర్వాత మూడేళ్ళకు "dream crowned" విడుదల చేశాడు. సోరీస్ అబౌట్ గాడ్, ది బుక్ ఆఫ్ పిక్చర్స్ విడుదల చేశాడు. నమ్మశక్యం కాని ఈ ప్రపంచం దాని వాస్తవికత అతన్ని కుదిపేశాయి.

22-25 ఏళ్ళ మధ్యలో మ్యూనిచ్ బెర్లిన్, ఇటలీ, రష్యాలు తిరిగి ప్రముఖ రష్యా రచయిత టాల్స్టాయ్‌ని కలుసుకొన్నాడు. రష్యన్ భాష నేర్చాడు. రెండోసారి రష్యా వెళ్లి వార్ప్స్ వీద్ అనే ఊళ్ళో ఉన్న ఆర్ట్ కాలనీలో సారా వెస్ట్ హాప్స్ అనే రోడిన్ శిష్యురాలైన శిల్పినిని చూశాడు. మరుసటి ఏడాది ఆమెను పెళ్లి చేసుకొని ఒక కూతురును కన్నాడు. పారిస్ వెళ్లి రోడిన్‌ను కలిసి, రోమ్‌లో ఒక నెలగడిపి, ఇటాలియన్ రేవేరాలోని వయా రేగియోలో కొంతకాలం ఉండి, మళ్ళీ రోమ్ వచ్చి 10 నెలలు గడిపి, స్వీడెన్ డెన్మార్క్ లలో తిరిగి, తిరిగి పారిస్ చేరాడు. 30వ ఏట రోడిన్‌కు సెక్రెటరి అయ్యాడు. అననుకూలమైన రోడిన్‌తో ఇబ్బందిపడ్డా అతని శిల్పకళ రిల్కేను ప్రభావితం చేసింది. Rilke envisioned a poetry, which would not be about "things", but

would be them a poetry which would make his objects standby themselves, filling space with their solidity" ఇదే "పోయెమ్స్ ఆఫ్ థింగ్స్". ఇందులో మానవుల లక్షణాలు, విశ్వ లక్షణాలు ఉంటాయి దీనిపై హాన్స్ ఈగన్ హోల్తూసేన్ "under the emblem of humanity, of selfless devotion to "die Dinge "e world is conquered by the all in one of feeling అని విశ్లేషించాడు. మాయాజాలమే అయినా అర్థమయ్యే భావన కార్యం అదే సమయంలో కర్తృత్వకతను వదిలి విషయ పరంగాను మొత్తం విశ్వంలోని వస్తుపరంగానూ వ్యక్తమౌతుంది. వస్తుశక్తిని ఆడెన్ కవి అంచనా వేస్తూ ఒంటరితనం నుండి రిల్కే తన ప్రపంచాన్ని మన ముందుంచాడు అంటాడు Rilke whom "die dinge "bless --the Santa Claus of loneliness".

కావాలనే ఒంటరిగా ఉన్నాడు రిల్కే. కాలాన్ని ఎక్కువగా మ్యూజియం, గాలరీ, స్టూడియోలు, లైబ్రరీలు పబ్లిక్ గార్డెన్‌లలో గడుపుతూ రాత్రి వేళల్లో రోడ్లమ్మట తిరుగుతూ సీన్ నది గట్ల వెంబడి పచార్లు చేస్తూ గడిపాడు. ఒంటరితనాన్ని ఆతను అర్థం చేసుకోన్నంత ఎక్కువగా వేరెవరూ అర్థం చేసుకోలేదు. బ్రహ్మాండంగా ఏకాంతాన్ని అనుభవించాడు. "నాకు ఏకాంతమే కావాలి లోపలి ఏకాంతం. ఏకాంతమే పని, స్థాయి, వృత్తీ" అంటాడాయన. తాను రాసిన "ది నోట్ బుక్స్ ఆఫ్ మాల్టేలారిడ్స్ బ్రిగ్గీ"లో "మనిషి అనేక నగరాలు తిరగి మనుషుల్ని చూడాలి. పక్షులు జంతువుల గురించి తెలుసుకోవాలి. పువ్వుల నవ్వులు అనుభవించాలి అప్పుడెప్పుడో ఏదో ఒక సమయంలో రాయాల్సిన దానిలో మొదటిది స్ఫురిస్తుంది" అంటాడు.

ఈ తిరగటంలో బెల్జియం, కాప్రిమ్యూనిచ్ బిస్రాా, కార్తేజ్, నేపుల్స్, ట్యూనిస్‌లు చుట్ట బెట్టాడు. అల్జీర్స్‌లో ఈజిప్ట్‌లోనూ గడిపాడు. "ది బుక్ ఆఫ్ అవర్స్", "ఎర్లి పోయెమ్స్", "ది లైఫ్ ఆఫ్ వర్జిన్ మేరీ"లతోపాటు ఎలిజబెత్ బార్రెట్ బ్రౌనింగ్ పోర్చుగీస్‌లో రాసిన సానెట్స్‌ను అనువాదం చేశాడు. తనలో ఏదో మార్పు వస్తున్నట్లు గ్రహించాడు. పని దృష్టి ఏర్పడి మనసుతో చూడటం ఆలోచించటం మొదలు పెట్టాడు. బయటిదాన్ని చూస్తూ అంతరంగం మధనాన్ని గ్రహించాడు. వస్తున్న మార్పు ఏమిటో తెలుసుకోలేక పోతున్నాడు. బాధ అనుభవిస్తూ ఎదురు చూస్తున్నాడు. భార్య నుండి విడిపోయి శారీరకంగా మానసికంగా కుంగిపోయాడు. తనకు సృజనశక్తి తగ్గిపోతోందని బాధపడ్డాడు. దిగులు, నిరాశా ఉన్న సన్యాసిగా మారిపోయాడు.

అదృష్టవశాత్తు మేరీ వాన్ తర్న్ అండ్ టాక్సిస్'హెన్ లోహే అనే ప్రిన్సెస్‌తో పరిచయమై, ట్రీస్టీలోని కాజిల్ ఆఫ్ డ్యునోలో ఆమెకు అతిథిగా ఉన్నాడు. ఏడాదిన్నర

తర్వాత మళ్ళీ వచ్చి అక్కడే ఒంటరిగా ఉన్నాడు. ఒక రోజు అకస్మాత్తుగా ఆధ్యాత్మిక శక్తి ఏదో అనుభవంలోకి వచ్చినట్లు అనిపించింది. ఏదో కొత్త విషయం జరిగింది. తానేదో ప్రకృతికి ఆవలి తీరంలో ఉన్నట్లు అనిపించింది. డ్యుయానోలో ఉన్న ఈ కాలంలో అంతరాత్మ ఏదో చెప్పిన అనుభూతి కలిగింది. ఈ అనుభూతిని "డ్యూనో ఎలిజీస్"గా పదేళ్ళు రాసి పూర్తి చేశాడు. "ప్రతి చోటా ఏదో కనిపించి దృష్టి గోచరమైంది. ప్రతి దానిలోనూ ఒక అంతర్ ప్రపంచం కనిపించింది. అంతరిక్షంతో ఉన్న ఒక దేవదూత దర్శనమైంది. ఈ అంతరంగాన్ని పట్టుకోవటమే నా కర్తవ్యమ్ అనిపించింది" అని రాశాడు రిల్కే. దైవ దర్శనంతో పులకించాడు. ఒక చెట్టు కొమ్మలో నుంచి విశ్వాన్ని చూశాడు. రిల్కే చూసింది క్రిస్టియన్ దేవత కాదని దేవుని మారు పేరు అని అంటారు. రిల్కే ఆ దేవతలో కనిపించేది పూర్తిగా కనిపించనిదిగా మార్పు చెందుతుందని అన్నాడు. దేవదూతలో ఉన్న ప్రపంచానికే రిల్కే మనసును అర్పణ చేశాడు. అదే ఉండటం అవటం (బీయింగ్ అండ్ బికమింగ్) అన్నాడు.

ఈ ఎలిజీలలో ఉన్న శోకానికి జవాబుగా "సానెట్స్ ఆఫ్ ఆర్ఫియస్" రాశాడు. శోకం తర్వాత ఆనందం అన్నమాట. మళ్ళీ ఒంటరితనం, అవిశ్రాంతత అనుభవించాడు. లోకసంచారం తిరిగి ప్రారంభించాడు. ప్రజలంతా పతనంలో ఉన్నారన్నాడు. ప్రేమ విషయంలో అతని అభిప్రాయాలు తమాషాగా ఉంటాయి. ఆదర్శ ప్రేమికులు అంటే స్త్రీత్వం ఉన్నవారే, ఏదీ కోరనివారే, అర్థం చేసుకోగలిగిన వారే అంటాడు. మగవాడు ప్రేమలో ఆశక్తుడని రిల్కే అభిప్రాయం.

వయసు నలభై మధ్యలో సియార్రే దగ్గర స్విస్ చాటోలో నివాసమేర్పరచుకొన్నాడు. అప్పుడప్పుడు పారిస్, ఇటలీ ట్రిప్‌లు చేస్తున్నా స్విట్జర్లాండ్‌లో స్థిరపడాలని కోరుకున్నాడు. యాభైవ ఏట రక్త హీనత బారిన పడ్డాడు. రిల్కేకు ఇష్టమైన రోజ్ చిహ్నం అతని చావును వేగిర పరచింది. రిల్కేకున్న ఈజిప్ట్ అభిమాని నిమేట్ ఎలౌ బే కు గులాబీ పుష్పగుచ్ఛాన్ని ఇవ్వాలనుకొని గులాబీ పూలు కోస్తూ గులాబి ముళ్ళు గుచ్చుకొని సెప్టిక్ అయి, విషమై ఇన్ఫెక్షన్ సోకి లుకేమియా తీవ్రమై బలహీనమైనాడు. 29-12-1926న 57వ ఏట రిల్కే మరణించాడు. స్విట్జర్లాండ్‌లోని వాలోలిస్‌లో ఉన్న రెరాన్‌లో ఖననం చేశారు.

రిల్కే అభిమానులు కొద్దిమందే ఉండేవారు. వారికీ ఆయన "కవులకు కవి" అనిపించాడు. కవితలు కథలు జ్ఞాపకాలు, అనువాదాలు అన్నీ కలిపి రిల్కే 30కి పైగా రాశాడు. చనిపోయాక కూడా గ్రంథ ప్రచురణ జరిగింది. ఆయన ప్రతీకలు ఒక దానిలో ఒకటి చోరబడి విశ్లేషకులకు తల బొప్పికట్టేది. రిల్కే అత్యంత పారవశ్యంతో

బాధపడ్డాడు. వాచామ గోచరంకాని దాన్ని వాచ్యం చేయటానికి తీవ్ర ప్రయత్నం చేశాడు. కాలాతీత, రూపాతీత, అనంత పరబ్రహ్మాన్వేషణ చేశాడు రిల్కే. ఇది కొందరికి ఆధ్యాత్మిక అవకాశవాదం అనిపించింది. రిల్కే భావధారను తెలియజేస్తూ లూయీ అంటర్ మేయర్ "There is a magnificence in RilkeÑ s double vision which tries to break through the barrier of the senses, and even for those who comprehend it only in glimpses, there is nobility in the poetry which continually strives to unite thought and action desire and fulfillment, in a sustained flash of revelation" అని అన్నాడు.

రిల్కే శైలి గురించి చెప్పాలంటే గ్రీక్ మైథాలజీలోని విషయాలను స్వీయ వ్యాఖ్యానంతో కవిత్వం రాశాడు. రూపకం అన్యాపదేశాలను ఎక్కువగా వాడాడు. కవిత్వంలో ఖండన ఎక్కువ. రోజా పువ్వును నిద్రకు చిహ్నంగా, వాటి రేకులు మూసిన కనురెప్పలకు ప్రతీకలుగా గ్రహించాడు. "విజన్ ఆఫ్ క్రైస్ట్"లో మేరీ మగ్ద లీన్‌ను క్రీస్తు కుమారుడి తల్లిగా చెప్పాడు. "ఏసు క్రీస్తు దివ్యుడు కాదు మానవుడే. జెరూసలెంకు అవతలున్న కాల్వేరి కొండపై ఆయన్ను శిలువ చేసినప్పుడు వచ్చిన గాథలే ఆయన చరిత్రకు ఆధారం ,ఈ విషయాలు 1893 నాటికి ప్రచురణ పొంని కవితలలో చెప్పాడు. మేరీ మాగ్దలీన్‌తో క్రీస్తు ప్రేమ విషయమూ రాసి, ఆయన దైవాంశ సంభూతుడు కాదని కేవల మానవ మాత్రుడేనని గట్టిగా తెలియజేశాడు" అని సుసాన్ హస్కిన్ వివరించాడు.

అమెరికాలో రిల్కే కవిత్వాన్ని బాగా ఆరాధించి పుస్తకాలు బాగా కొన్నారు. 13వ శతాబ్దపు సూఫి కవి రూమిలాగా, 20వ శతాబ్దపు లెబనీస్- అమెరికన్ కవి ఖలీల్ జిబ్రాన్‌లాగా రిల్కేను ఆరాధించారక్కడ. టివి, సినిమా, రేడియోలలో రిల్కే కవిత్వాన్ని తరుచుగా ఉదహరిస్తారు. అతనిది "మార్మిక కవిత్వం" అంటారు. ఆరాటం తక్కువతో ఎక్కువ సఫలతతో ముందుకు నడిపిన మార్గ గామిగా రిల్కే ఆరాధింప బడుతున్నాడు. రిల్కే రాసిన "డ్యూనో ఎలిజీస్" ప్రభావం పడని కవి లేడు. ముఖ్యంగా ఆడెన్‌కు రిల్కే ఆరాధ్య కవి.

రిల్కే కవితలలో కొన్ని భావాలు మరికొన్ని

"Let everything happen to you
Beauty and terror
Just keep going
No feeling is final"
'Rainer Maria Rilke'

"I live my life in widening circles that reach out across the world".
Rainer Maria Rilke, Rilke' Book of Hours: Love Poems to God

"Believe in a love that is being stored up for you like an inheritance, and have faith that in this love there is a strength and a blessing so large that you can travel as far as you wish without having to step outside it"
Rainer Maria Rilke, Letters to a Young Poet

"The work of the eyes is done. Go now and do the heart-work on the images imprisoned within you"
Rainer Maria Rilke

Love consists of this: two solitudes that meet, protect and greet each other"
Rainer Maria Rilk

"Extinguish my eyes, Ill go on seeing you.
Seal my ears, Ill go on hearing you.
And without feet I can make my way to you,
without a mouth I can swear your name.
Break off my arms, Ill take hold of you
with my heart as with a hand.
Stop my heart, and my brain will start to beat.
And if you consume my brain with fire,
"ll feel you burn in every drop of my blood".
Rainer Maria Rilke

"The purpose of life is to be defeated by greater and greater things"
Rainer Maria Rilk

"Have patience with everything that remains unsolved in your heart.
……live in the question"
Rainer Maria Rilke, Letters to a Young Poet

"The only journey is the one within"

Rainer Maria Rilke

"Make your ego porous. Will is of little importance, complaining is nothing, fame is nothing. Openness, patience, receptivity, solitude is everything".

Rainer Maria Rilke

Let life happen to you. Believe me: life is in the right, always"

Rainer Maria Rilke

Whenever Rilke writes about God, however, he is not referring to the deity in the traditional sense, but rather uses the term to refer to the life force, or nature, or an all-embodying, pantheistic consciousness that is only slowly coming to realize its existence

The revolutionary poetic philosophy that Rilke proposed in Duino Elegies is considered significant to many literary scholars. "No poet before him had been brave enough to accept the whole of [the dark side of the] world, as if it were unquestionably valid and potentially universal, "asserted Conrad Aiken in his Collected Criticism.

"The Sonnets are the songs of his victory, "affirmed Bowra in The Heritage of Symbolism. "In the Sonnets, " Bowra wrote, "Rilke shows what poetry meant to him, what he got from it and what he hoped for it.

రిల్కే జీవిత చరమాంకంలో ఫ్రెంచ్ కవులు పాల్ వాలేరి, జీన్ కాక్టువా ప్రభావంలో పడి ఫ్రెంచ్ భాషలో కవిత్వం రాశాడు.



## 63. ఆధునిక సమకాలీన నృత్యానికి ప్రాణం పోసిన- ఇసడోరా డంకన్ (1875-1927)

యూరప్‌లో ప్రారంభించి నాట్యంలో విప్లవం సాధించి ప్రపంచ వ్యాప్తి కలిగించిన ఏకైక అమెరికా నాట్య కళాకారిణి ఇసడోరా డంకన్. ఆమె చేసింది "ఏక మహిళా విప్లవం". 27-5-1878న అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రం శాన్ ఫ్రాన్సిస్కోలో సముద్ర తీరాన జన్మించింది. తన జీవిత చరిత్ర "మై లైఫ్"లో "నా శారీరక కదలికలు సముద్ర అలల లయను బట్టే వచ్చాయి. అందానికి సంతానానికి, ఆనందానికి ప్రేమకు చిహ్నమైన, సముద్రంలో పుట్టిన గ్రీకు దేవత ఆఫ్రొడైట్ నక్షత్రంలో నేను పుట్టాను. ఈ గ్రీకు దేవతకు సమానం రోమన్ దేవత వీనస్" అని రాసుకొన్నది. తనను తాను ప్రకృతి ప్రసాదించిన దానినిగా చిన్నప్పటి నుండి భావించుకొన్నది. ఇసడోరా తండ్రి స్కాటిష్‌వాడు. నాలుగుసార్లు బాగా సంపాదించి అంతా పోగొట్టుకొన్నవాడు. తల్లి ఐరిష్ కేథలిక్. ఈమెను వదిలి తండ్రి వేరే అమ్మాయితో ఉన్నాడు. దీనితో తల్లి నాస్తికానికి మారి రాబర్ట్ ఇంగర్ సాల్ శిష్యురాలైనది. పుట్టిన ఇద్దరు మొగపిల్లలను, ఇద్దరాడ పిల్లల్ని తిరుగుబాటు దారులుగా పెంచింది. సంగీతం టీచర్ అయిన ఆమె జీవితంలో విసిగి వేసారి పియానో పాఠాలు నేర్పేది. చక్కగా పాడుతూ మంచి సాహిత్యాన్ని పిల్లలకు అలవరచింది. ఈ డంకన్ కుటుంబం పొట్ట గడుపుకోవటం కోసం ఎన్నో చోట్లు మారుతూ తిరిగింది. ఈ జీవితమే ఆమె భవిష్యత్తు జీవితంపై ప్రభావం చూపింది.

బోధించటంలో యెంత కోరిక ఉండేదో డాన్స్ చేయటంలోనూ అంతే ఉండేది. ఆరేళ్ళ పిల్లగా ఉన్నప్పుడే చుట్టు ప్రక్కలున్న నడక కూడా ఇంకారాని దజను మంది పిల్లల్ని పోగేసి కాళ్ళూ చేతులు ఎలా కదపాలో తుంటిని ఆధారంగా చేసుకొని శరీరాన్ని ప్రక్కలకు ఎలా త్రిప్పాలో నేర్పించేది డంకన్. ఇదే తన "డాన్స్ స్కూల్" అనేది.

జీవితకాలంలో ఎప్పుడైనా ఒక గొప్ప డాన్స్ స్కూల్ ఏర్పాటు చేయాలని కలలు కన్నది. దీనికోసం ఖండాలు దాటి ప్రయాణించింది. ఎనిమిదవ ఏట చిన్నపిల్లలకు డాన్సింగ్ స్టెప్స్ నేర్పి కొన్ని పెన్నీలు మొదటిసారిగా సంపాదించింది. పదవ ఏట డబ్బు సంపాదించటం ఎలాగో తనకు తెలిసిపోయిందని, ఇంక స్కూల్‌కు వెళ్లి చదవాల్సిన పని లేదని తల్లికి చెప్పేసింది. కూతురుకున్న అభిరుచి గుర్తించి తల్లి ఇసడోరాను స్థానిక బాలెట్ టీచర్ దగ్గర పెట్టింది. కాని కాలి బొటన వ్రేళ్ళపై నిలబడి ప్రాక్టీస్ చేయటం సహజత్వానికి భిన్నం అని, అసహ్యం అని చెప్పింది. మూడవ లెసన్ అయ్యాక క్లాస్ వదిలేసి బాలెట్‌పై ఉన్న ద్వేషాన్ని జీవితాంతం ఒదులుకోలేకపోయింది. బాలెట్ స్కూళ్ళు అంటే వ్యతిరేకత ఏర్పడింది. అవన్నీ అర్థం పర్థం లేని శరీర విన్యాసాలు అన్నది. పూర్తి జిమ్నాస్టిక్‌నే డాన్స్ అంటున్నారని ఈ బాలెట్ డాన్స్ అసహ్యం అన్నది.

17వ ఏట తల్లి ఇసడోరాను చికాగో తీసుకొని వెళ్ళింది. అక్కడ ఎవరైనా కూతురు అభిరుచికి తగిన డాన్స్ నేర్పుతారేమోననే ఆశతో. అప్పటికి "స్ప్రింగ్ సాంగ్స్" మొదలైన శ్రావ్యమైన సంగీతం ఆదరణలో ఉంది. ఈమెకు నేర్పటానికి యే మేనేజరూ అంగీకరించలేదు. వెంట తెచ్చుకొన్న డబ్బు అంతా ఒక వారంలో అయిపోయి తల్లీ కూతురు టమేటాలు తిని బతికారు. చివరికి "మేసోనిక్ టెంపుల్ రూఫ్ గార్డెన్" మేనేజర్ ఇసడోరా స్ప్రింగ్ సాంగ్ పాడటానికి ఒప్పుకొన్నాడు. కాని పాటలో "ఫ్రిల్స్ అండ్ కిక్స్" ఉండాలన్నాడు. అదే ఆమె మొదటి ప్రదర్శన. ఒక వారం బాగానే గడిచింది. కాని దాన్ని వద్దని వదిలేసింది. చికాగోలో అప్పటికే పెళ్ళయిన పోలిష్ పెయింటర్‌ను ప్రేమించింది. అతనంటే పిచ్చ ప్రేమ కలిగింది. కాని తల్లి ఒప్పుకోక పోవటంతో పెళ్లి జరగలేదు. తన బాల్య జీవితమంతా తండ్రి చేసిన నికృష్టపు పని నీడ పడి వెంటాడిందని బాధపడింది. తల్లితో తండ్రి విడాకుల విషయం తన మనసుపై తీవ్రమైన ముద్ర వేసింది అన్నది. కనుక తాను పెళ్ళికి వ్యతిరేకంగా, స్త్రీ జన విముక్తికి పోరాడాలని, ప్రతి స్త్రీ ఒకరో ఇద్దరో పిల్లలను కనటానికి హక్కు ఉండాలని కోరింది.

చికాగో వదిలాక ఆగస్తిన్ డాలీ అనే నాటక ప్రదర్శకుడు పిలిచిన ఇంటర్వ్యూకు వెళ్లి ఉపన్యాసంగా "నేను డాన్స్ ను కనిపెట్టాను. రెండు వేల సంవత్సరాలుగా మరుగున పడిన ఆర్ట్‌ను కనుక్కున్నాను. దానితో మన నాట్యాన్ని విప్లవాత్మకంగా మార్చేయవచ్చు. నేను ఎక్కడ నేర్చుకొన్నాను అని ప్రశ్నిస్తే ఫసిఫిక్ సముద్ర తీరం వద్దా, సియాఱ్రా నేవడాలోని పైన్ వృక్షారణ్యం దగ్గరా నేర్చానని చెప్తాను. నేను మహా కవి వాల్ట్ విట్మన్ "ఆధ్యాత్మిక పుత్రిక"ను. అమెరికా పిల్లల కోసం అమెరికాను యదార్థంగా అభివ్యక్తీకరించే డాన్స్‌ను సృష్టిస్తాను" అన్నది గుక్క తిప్పుకోకుండా. ఇసడోరా వాక్ ప్రవాహం ఆమెలోని సృజన, తపన, నమ్మకం చూసి ఇలాంటి అమ్మాయి కోసమే తానూ వెతుకుతున్నట్లుగా భావించి తీసుకొన్నాడు. కొన్ని వారాల తర్వాత ఇసడోరా బ్రాడ్వేలోని 29వ వీధిలో

రిహార్సల్ ప్రారంభించింది. మూకాభినయం విజయవంతం కాలేదు. అప్పుడు డాలీ "మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీం"లో ఒక సీన్ ప్రాక్టీస్ చేయించాడు. అందులో దేవదూతలు పెట్టుకొనే రెక్కలు, వాటితో డాన్స్ నచ్చలేదు. ఇంగ్లీష్ మ్యూజికల్ కామెడి "గ్రీషా"లో కోరస్ పాడటమూ ఇబ్బంది అనిపించింది.

కూతురు సంపాదించిన కొద్ది డబ్బుతోనే ఇసడోరా తల్లి కార్నెజీ హాల్‌లో ఒక రూమ్ ఉన్న స్టూడియోను అద్దెకు తీసుకొని కుటుంబాన్ని ఇక్కడకు వచ్చేయమన్నది. కొద్దిమందికి పియానో నేర్పింది. కొడుకు ఆగస్టిన్ నటుడు కావాలనుకొని టూరింగ్ టాకీస్‌లో చేరాడు. రేమాండ్ ఒకపత్రికలో పార్ట్ టైం జాబ్‌లో చేరాడు, ఎలిజబెత్ ఇసడోరాకు సాయంగా ఉంది. అందరూ కొద్దో గొప్పో సంపాదిస్తున్నా ఇంటి అద్దెకు చాలక వక్తృత్వం సంగీతం కోసం గంటకు ఇంత అని అద్దెకిస్తూ రాబడి పెంచుకొన్నారు. వీరందరితో స్టూడియో కిక్కిరిసిపోతే డంకన్ కుటుంబం సేదదేరటానికి సెంట్రల్ పార్క్‌కు వెళ్ళేవారు. ఇసడోరా కచేరీలను పెంచింది. డాన్సులూ చేస్తోంది. ఎతేల్ బెర్ట్ నేవీననే ఆతను ఆమెకు చిన్న చిన్న కచేరీ హాళ్ళలో కచేరీలకు కుదిర్చాడు. అయినా ఖర్చు ఎక్కువా రాబడి తక్కువగా ఉంది. సంచార తెగల గుడారం లాంటి ఈ కొంప నుంచి విండ్సర్ హోటల్‌లోని రెండు విశాలమైన గదుల్లోకి మారారు. కాని ఇక్కడి నుంచి కూడా వెళ్ళిపోవాల్సిన పరిస్థితి వచ్చింది. అప్పుడు ఇసడోరా "మమ్మల్ని ఆదుకొనేది ఒక్కటే హోటల్ తగలబడటమే" అన్నది నవ్వుతూ. ఈ పరిస్థితిలో అదృష్టం ఆమె తలుపు తట్టింది. మర్నాడే విండ్సర్ భవనం పూర్తిగా కాలి నేల మట్టమైంది. జంతువులను చేరవేసే ఒక బోటు ఎక్కి డంకన్ కుటుంబం వారు ఇంగ్లాండ్ వెళ్ళారు.

ఇరవై ఏళ్ళకు ఇసడోరా అందాల రాశిగా ఉన్నా, ఆనాటి ప్రసిద్ధ ఇంగ్లాండ్ ఫోటోగ్రాఫర్ ఆర్నాల్డ్ గెంతీ దృష్టిలో ఆమె అంత అందగత్తెగా అనిపించలేదట. బుగ్గలు లావుగా ముక్కు కోటేరు తీసినట్లు, చిన్న రెండు గడ్డాలతో కనిపించేది. మూతి చాలా అందంగా లలితంగా ఉండేది. కళ్ళు సవాలు చేస్తున్నట్లుగా మొత్తం మీద శరీరం చాలా హుషారైన సాఫల్యవంతమైనదిగా ఉండేది. వేలాది అమెరికా బాలికల కంటే చాలా భిన్నంగా ఉండేది. తాను నాట్య నక్షత్రంలో జన్మించినట్లు భావించేది.

లండన్‌లో డంకన్‌లు బ్రిటిష్ మ్యూజియంలో ఎక్కువ కాలం గడిపేవారు. విన్కేల్మాన్ రాసిన "జర్నీ టు ఎథెన్స్" ఆంగ్లానువాదం వాళ్ళను బాగా ఆకర్షించి హెలెనిక్ సంస్కృతిపై ఆసక్తి పెరిగింది. అక్కడి గార్డెన్ పార్టీలలో, డ్రాయింగ్ రూమ్‌లలో తన ప్రతిభ చూపేది. సోదరి ఎలిజబెత్ థియోక్రిటిస్ కవితలు చదివేది. రేమాండ్ డాన్స్ గురించి ఉపన్యాసాలిచ్చేవాడు. డాన్స్ –సైకాలజీమీద భవిష్యత్ మానవులపైనా చూపే ప్రభావంపై మాట్లాడే వాడు. అందరూ బ్రహ్మాండంగా అభినందించారు కాని రొక్కం రాలేది కాదు. పెన్నీకి దొరికే బన్, నీళ్ళు కలిసిన సూపు తిని తాగి ఎలాగో గడిపేవాళ్ళు. ఇసడోరా

ప్రిన్స్ ఆఫ్ వేల్స్, ఎల్లెన్ టెర్రీవంటి ప్రముఖులనెందరినో కలిసింది. చివరికి ఫ్రాంక్ బెన్సన్ నడిపే షేక్స్పియర్ కంపెనీలో చేరింది. పూర్వం వేసిన మిడ్ సమ్మర్ తప్ప వేరే అవకాశం రానేలేదు. లండన్ లాభం లేదని పారిస్‌కు మారారు.

22వ ఏట పారిస్‌లో ఇసడోరా ఒక కొత్త అవతారం దాల్చింది. లాస్రే దెయ్యాలను, గ్రీక్ కుండీలను, లోహ ఉపశమనాలను పరీక్షించి వాటిని సంగీతానికి జోడించి, పాదాల రిధం కు సరిపోయేట్లు చేసింది. స్టుడియో గోడలపై రేమాండ్ గ్రీక్ స్తంభాలు పెయింట్ చేశాడు. డంకన్ కుటుంబం బూట్ల బదులు చెప్పులు వాడటం మొదలు పెట్టింది. తనకున్న లేస్ డ్రెస్‌ను, స్లిప్పర్‌లనూ వదిలేసి డాన్స్ చేసింది. ఈ నాటి నగ్నంగా ఉన్నట్లు ఆనాడు దాదాపు అలానే డాన్స్ చేసింది. ఇదంతా గ్రీక్ పెయింటింగ్స్, శిల్పాల ప్రభావమే. సంగీతకారుడు రోడిన్ బ్రాంజ్ చప్పుడు, జపనీస్ సాడాయాక్కో విషాద నృత్యాలను చేసింది. తానిప్పుడు డాన్స్ మూలం ఏమిటో తెలుసుకొంటున్నానని చెబుతూ “which might be the divine expression of the human spirit through the medium of the body' movement” అని వివరించింది. డాన్సింగ్ స్కూల్స్‌లో శరీరకదలికలను వెన్నెముక ఆధారంకు వెనుక మధ్యలో ఉంటాయని బోధిస్తారని, ఈ అక్షరేఖ నుంచి కాళ్ళు చేతులు మొండెం కదులుతాయని చెప్పి ఒక తోలుబొమ్మలాగా తయారు చేస్తారు అన్నది ఇసడోరా. ఇసడోరా కనిపెట్టిన దాని ప్రకారం సెంట్రల్ స్ప్రింగ్ మోటార్ పవర్ బిలం (క్రేటర్ ఆఫ్ మోటార్ పవర్) సోలార్ ప్లెక్సేస్‌లో ఉంది. అంటే ఉదర నాడీ కూపంలో ఉంది. ఈ విషయాన్ని వివరిస్తూ అర్ధ శతాబ్దం తర్వాత జాన్ మార్టిన్ రాస్తూ “అదే ఆమె చెప్పిన బేసిక్ డాన్స్. అదొక వృత్తి, వ్యాపారంకాని, మొదలు పెట్టే కళ కాని కాదని, అదొక జీవ కార్యం (బయలాజికల్ ఫంక్షన్) అన్నాడు. ఆమె ఏదో కొత్తగా ఏమీ కని పెట్టలేదు కాని ఈ కదలికల ప్రేరణ మూలాన్ని (రూట్స్ ఆఫ్ ది ఇంపల్స్) శోధించే ప్రయత్నం చేసింది. ఇదే ప్రతి అనుభవానికి స్పందన అవుతుంది. దీనినే ఆమె యూనివర్సల్ ఏండోమెంట్ అంటే సార్వత్రిక దైవ లక్షణం అనుకొన్నది. ఏమాత్రం సాధారణ సైకాలజీలో ప్రవేశం లేని ఈమె యే ఒక్క డాన్సర్‌కూ తట్టని అద్భుత భావం తట్టటం గొప్ప విషయం. యాదృచ్ఛి కమైనశారీరక కదలిక (స్పాంటేనియస్ మూవ్ మెంట్స్) అనేది ప్రతి మనిషి యొక్క ఇంద్రియ లేక భావోద్వేగ ఉద్దీపనలకు ప్రధమ ప్రతిస్పందన. (spontaneous movement of the body is the first reaction of all men to sensory or emotional stimuli)

ఇసడోరా సిద్ధాంతాలపై చాలా అనుమానాలున్నాయి కాని అంతకు మించిన జవాబు ఎవరి వద్దా లేదు. ఆమె ప్రాధమిక భావోద్వేగాలను, ప్రేమను, నిరాశా నిస్పృహలను వేలాది ప్రేక్షకుల ముందు తన ఆనందం దుఃఖంతో ప్రదర్శించి చూపింది.

ఇంకేముంది మ్యూజిక్ కంపోజర్లు, నాటక రచయితలు, ఆమె చుట్టూ మూగారు. కళాకారులు ఆమె చూపే అసాధారణ శారీరక కదలికలను అనుకరించటానికి, నేర్చుకోవటానికి ఒకరితో ఒకరు పోటీ పడ్డారు. అంతకు మించి ఆమె చేబట్టి, పునః సృష్టి చేసిన ప్రాచీన "టేర్సి కోరియన్ ఆర్ట్"ను అభినందించటానికి చాలామంది వచ్చారు. ఈ విషయం పై రోడిన్ రాస్తూ "ఇసడోరా శిల్పాన్ని, భావోద్వేగాన్ని అతి సునాయాసంగా సాధించి, జీవితాన్ని, కళను ఇసడోరా మహాద్భుతంగా ఏకీకృతం చేసింది" అన్నాడు.

ఫ్రాన్స్‌లోనే కాక తన జీవితంలోను పరిపూర్ణత సాధించటానికి కన్యత్వం నుండి చెప్పులు వదిలేసినంత తేలికగా విడుదలైంది. ఒక రోజురాత్రి ఒపెరాకు తల్లిని, రేమాండ్‌ను రమ్మని పిలిచి రహస్యంగా ఒక చాంపేన్ బాటిల్ తెచ్చి తలలో రోజా పువ్వులు అలంకరించి డయాస్ అందరి కోసం ఎదురు చూసినట్లు ఉంది. అక్కడికి అప్పుడే వచ్చిన ఒక యువకుడు ఒక్కసారిగా దిగ్భ్రాంతి చెంది బాబోయ్ అని పారిపోయాడు. రోజాలు చామ్పేన్ తనను ముంచేశాయని ఏడుస్తూ కూర్చుంది. మరోసారి ఇంకో కుర్రాడిని హోటల్ రూమ్‌కు తీసుకొని వెళ్ళమని అడిగితే ఆమె స్వచ్ఛతకు ముగ్ధుడై మోకాళ్ళ మీదకూర్చుని వినమ్రుడయ్యాడు. ఇదీ ఆమె మోహ బంధ జీవితం. ఆమెది ఎప్పుడూ అవతలివారిని ఇబ్బంది పెట్టే విధానమే. మోహపు వలలో వేసి మగాళ్ళను గిలగిల లాడేట్లు చేసేది. లవర్స్ కంటే ఆమె చేత దిగజార్చబడిన వాళ్ళే ఎక్కువ. అహంకార పూరిత సాహసం, ఆలోచనా రహిత జీవనం బాధ్యతా రాహిత్యం ఆమె కొంప కొల్లేరు చేశాయి. My life called for the pen of Cervantes or Casanova" అని గర్వంగా చెప్పేది.

డంకన్లు మరింత తూర్పుకు బెర్లిన్ వియన్నా బుడాపెస్ట్ వెళ్ళారు. ఇసడోరా తన రంగాన్ని తీవ్ర, భోగాసక్తి విషయాలతో డిజైన్ చేయించింది. స్టేజి ఏమీ లేని శూన్యం చేసింది. పేల్ బ్లూ, సాఫ్ట్ గ్రీన్, న్యూట్రల్ గ్రే రంగుల పెద్ద పెద్ద కర్టెన్లు ఏర్పాటు చేసింది. అవి పైన నలుపులో కలిసిపోయి అదృశ్యమయ్యేట్లు వెనకా ప్రక్కలా ముడతలుగా అమిరేట్లు చేసింది. రోజ్ కలర్ స్పాట్ లైట్ ఊహను ప్రతిబింబింప జేసింది. ఇసడోరా కురులు వంకరలు తిరిగి మెత్తగా ఉన్నాయి. ప్రేమ పిచ్చి పట్టిన కోపోద్రిక్త వాతావరణం కల్పించింది. డాన్సులు మొదలయ్యాయి. ఆమె ఒక పిల్లలాగా బంతి, పిడికిలి ఎముకలతో చాకీస్ సముద్ర తీరంలో ఆడుతున్నట్లు అభినయించింది. ఆర్ఫియాస్‌కు విషాద సహాయికలలో ఒకరిగా, ఎల్సియన్ ఫీల్డ్‌లలో ఆనందోత్సాహాలతో ఉన్న అమ్మాయిగా నటించింది. సమాప్తి అతి త్వరలోనే వచ్చేసింది. ఈ ప్రదర్శన బాగా విజయవంతమైంది. అదొక రెవెలేషన్ అంటే దివ్యా దేశం అనిపించింది.

బుడా పెస్ట్‌లోనే ఇసడోరా మరో నూతన నృత్యానికి ప్రాణం పోసి ప్రేక్షకులను ఉగ్రూత లూగించింది. ఆమె ఫ్రోజ్ స్టైల్ లాగా ఆమె టేస్ట్ కూడా నాసిరకం. ఒక స్టాక్

కంపెనీ నటుడిని ప్రేమ వలలో పడేసింది. అతని మూడ్ ప్రతి పాత్రకీ మారిపోతుంది. అతను రోమియో జూలియట్‌లో నటించగానే మళ్ళీ మార్క్ ఆంటోనిగా నటించటం ఆమె జీర్ణించుకోలేక పోయింది. ఇసడోరా ముద్దు ఇమ్మంటే ఆంటోనీ లాగా లాంగ్ స్పీచ్ ఇచ్చేవాడు. వ్యక్తి తన వృత్తికి మొదటి ప్రాధాన్యం ఇవ్వాలి అని చెప్పేవాడు. మళ్ళీ ప్రేమలో విఫలమైంది కాని ఆర్ట్‌ను గుర్తించింది. జెర్మనీ చేరి "డాన్స్ ఆఫ్ ది రివల్యూషన్" చేసింది. మ్యూనిచ్ చేరగానే విద్యార్థులు అభిమానులు కోచ్ హార్స్‌ను తప్పించి వీధుల్లో తామే బండీలాగి అభిమానాన్ని ప్రదర్శించారు. ఆమె బెర్లిన్ ఒపేరా హౌస్‌లో కనపడగానే ప్రేక్షకులు ఆమె ప్రదర్శనను పదేపదే చేయమని కోరారు.

26వ ఏట ఇసడోరా గ్రీస్ వెళ్ళింది. రేమాండ్ తమ యాత్ర యులిసిస్ దారిలో నడవాలన్నాడు. ఎన్నో ఇబ్బందు లెదురైనాయి. గ్రీకు గడ్డ మీద కాలు పెట్టగానే స్వంత గడ్డపై కాలు పెట్టిన అనుభూతి పొందారు. అక్కడి పార్థి నాన్‌ను చూసి ఒక దేవాలయం కట్టాలని నిర్ణయించుకొన్నారు. శంకుస్థాపనకు ప్రీస్ట్‌ను పిలిచారు. ఒక నల్ల కోడిపుంజును బలిచ్చారు. గ్రీసులోనే స్థిరంగా ఉండి పోవాలనుకొన్నారు. సూర్యోదయాన పాటలతో డాన్స్‌లతో సముద్ర తీరాన గడిపారు. తర్వాత మేక పాలు మాత్రమే తాగి చాలా సాత్వికంగా గడిపారు. అక్కడి వారికి ఉదయాన డాన్స్, పాట నేర్పేవారు. గ్రీకు దేవతలను సందర్శించేటప్పుడు తమ ఆధునిక వస్త్ర ధారణవదిలేసి సామాన్యంగా వెళ్ళేవారు. మధ్యాహ్న సమయాలలో ధ్యానం, సాయం వేళల పాగాన్ ఉత్సవాలు జరిపి తగిన సంగీతం పాడేవారు. ఇంత చేస్తున్నా అక్కడి వారెవరికీ వీళ్ళగురించి పట్టనే లేదు. మంచినీళ్ళకోసం మైళ్ళ దూరం వెళ్ళాల్సిన పరిస్థితి ఉండేది అక్కడ తాము ప్రారంభించిన గుడి నిర్మాణం తడపటానికి నీళ్ళు అందలేదు. దానితో పని ఆపేశారు. కాని మొత్తం ట్రిప్‌లో ఇసడోరాకు ఒకే ఒక ఆనందం మిగిలింది – గ్రీకు పిల్లలకు ఏషిలస్ రాసిన "ది సప్లిఎంట్స్"ను పాడటం నేర్పగలిగింది. తమతో వాళ్ళను వియన్నాకు తీసుకెళ్ళింది.

వియన్నా వాళ్ళు వీళ్ళని అర్థం చేసుకోలేదు. ఈమె ఏశిలస్ కన్నా వాళ్ళ స్ట్రాస్‌కే ప్రాముఖ్యమిచ్చారు. కాని "బ్లూ డాన్యూబ్" ప్రదర్శన వారికి బాగా నచ్చింది. టూర్ సాగుతుండగా వెంటవచ్చిన గ్రీకు కుర్రాళ్ళు సమస్యలు కల్గించారు. బెర్లిన్ చేరే సరికి వాళ్ళ అలవాట్లు గొంతులూ మారిపోయాయి. అమాయకత్వం పోయి స్థాయి కోల్పోయారు. గత్యంతరం లేక వాళ్ళను ఏథేన్స్‌కు పంపింది ఇసడోరా. యాత్ర సాగిస్తూనే ఉంది. బేరూట్‌లో కొత్త విధానంగా డాన్స్ చేసింది. జర్మన్ రచయిత హీన్రిచ్ దోడ్‌పై మరులుకొన్నది. అతని ప్రతిస్పందన పారవశ్యంతో అది ఆధ్యాత్మికంగా ఉంది. సెయింట్ పిట్స్ బర్గ్ చేరి స్టానిస్లవిస్కిపై వ్యామోహపడింది. ఆయన మర్యాదగా తిరస్కరించాడు. బెర్లిన్‌లో ఆమె కలల్లో ఒకటి నిజమైంది. సోదరి తోకలిసి "ఇసడోరా

డంకన్ స్కూల్" పెట్టింది. శిష్యులుగా చేరిన ప్రతిభ గలవారు వాస్తవ నాట్యకళను తమకంటే తక్కువ స్థాయి పిల్లలకు నేర్పాలి. ఉల్లిపొర లాంటి దుస్తులు కట్టి స్టేజి మీదకు ఇసడోరా రాగానే కొంతమంది పేరెంట్స్ అభ్యంతరం చెప్పారు. పాద రక్షలు లేకుండా స్టేజిపై ఆమె నర్తించటం స్పాన్సర్లకు నచ్చలేదు. మేజోళ్ళు వేసుకొన్న దానికంటే అదే చాలా బాగుంటుంది అని వారికి నచ్చ చెప్పింది. ఒక ఏడాది తర్వాత ఒక పెద్ద కుంభకోణం బయట పడి స్కూలు మూతపడింది.

27ఏళ్ళ వయసులో ఇసడోరా గార్డెన్ క్రెయిగ్ అనే ఆర్టిస్ట్ సీనిక్ డిజైనర్ ప్రముఖ నటి ఎల్లెన్ టెర్రీ కొడుకును చూసి వలచింది. తామిద్దరం వేరు వేరుకాదని ఒకే ఆత్మ యొక్క రెండు సగాలమని భావించింది. రెండు వారాలు ఆమె క్రెయిగ్ స్టుడియోలో బందీగా ఉంది. మంచం లేకపోవటంతో ఇద్దరూ నేలమీదే పడుకొన్నారు. క్రెయిగ్ సామాన్య వ్యక్తికాదు. బజారులో అతను నడుస్తుంటే ఇసడోరాకు దేబ్స్‌లో సమాధి చేయబడిన గొప్ప ప్రీస్ట్ అనిపించాడు. కొన్ని రోజులకే ఇద్దరి మధ్యా మాటల యుద్ధం అపోహలూ, నిందలు వృత్తి పరమైన దృష్టీ, అరుపులు కేకలు బొబ్బలూ పెరిగిపోయి ఒక రోజు అకస్మాత్తుగా అతడు తలుపు బద్దలు కొట్టుకొని బయటికి వెళ్ళిపోయాడు. భంగపడిన ఇసడోరా హాలండ్ చేరింది. వారం నేల పడక దోర్లాటలో వచ్చిన గర్భంతో ఒక పిల్లను కని, తన ఉదంతానికి గుర్తుగా విషాద ఐరిష్ క్వీన్ డీర్డ్రే పేరు పెట్టుకొన్నది.

క్రెయిగ్‌తో ఉండటం అసాధ్యం అని తెలిసి, ప్రేమ లేకుండా బతకలేనని గ్రహించి ఒక ఏడాదంతా కోపంతో గడిపేసింది. హోమియోపతి వైద్యంతో కొంత ఉపశమనం పొందింది '18వ శతాబ్దపు ముక్కు పొడుం డబ్బాలను సేకరించే చీకు చింతా లేని డచ్ కుర్రాడితో రష్యా పారిపోయి "కొద్ది సుఖమైనా విషాదాన్ని దూరం చేస్తుందని" అనుకొంటూ తన డాన్స్‌లలో తేలిక రకమైన "మూమెంట్ మూజికల్" ప్రదర్శించింది. ఏడాది తర్వాత న్యూయార్క్ చేరి అక్కడి మేధావులను, గ్లఫ్ వాళ్ళ "ఇఫీ జీనియా" డాన్స్ సభ్యులనూ కలిసి మాట్లాడింది. ఆమె చేసిన ప్రదర్శనలపై మిశ్రమ అభిప్రాయాలు వ్యక్తమైనాయి. "అశ్లీలం, అపవిత్ర కళ, అసభ్య అంగాంగ ప్రదర్శన" అని ఫిలి స్టీన్‌లు ఈసడించారు. చెప్పులు లేకుండా ప్రదర్శన వాళ్ళు అంగీకరించలేదు. బోస్టన్‌లో ప్రదర్శనపై నిషేధం విధించారు. విమర్శకుడు కారల్ వాన్ వేచ్ టన్" మన గ్లక్ డాన్స్‌లు కూడా కొద్దో గొప్పో అపవిత్రంగా అశ్లీలంగానే ఉన్నాయి కదా" అన్నాడు. ఆమె బీథోవెన్ ఏడవ సింఫనీని తప్పుదోవ పట్టించింది. ఆమె డాన్స్‌లో చాంతాడులాంటి పొడవైన స్పీచెస్ ఉండటం, అవి మూడ్‌ను పాడు చేయటం, "స్వంత డబ్బా" వాయించు కోవటం నచ్చలేదు. "నేను మస్తిష్కాన్ని (సెరిబ్రల్) అని చెప్పుకొన్నది. కాని తప్పులను చెప్పి సరిదిద్ది దారిలో పెట్ట గల స్నేహితులు ఆమెకు లేక పోయారు.

ఫ్రాన్స్‌లో 32వ ఏట మళ్ళీ ప్రవేశించి బిచ్చగత్తె అయింది. ఒక మిలియనీర్

అయిన పారిస్ సింగర్‌ను కలిసింది. పొడవుగా ఉన్న అతన్ని తనను రక్షించటానికి వచ్చిన యుద్ధ వీరుడుగా భావించి లోహేన్ గ్రీన్ అని పేరు పెట్టింది. అతని పడవ ఇద్దర్నీ మధ్యధరా సముద్రం మీదుగా ఇటాలియన్ రేవీరా కింది నైలునది పైగా బ్రిటాన్ని చేర్చింది. నైస్‌లో బ్రహ్మాండమైన పార్టీలు, పారిస్‌లో విందులు వేర్సల్లీస్‌లో చిందులు, ఈ జంటలోనికి ప్రవేశిస్తుంటే ఆర్కెస్ట్రా స్వాగత గీతాలతో అదిరిపోయింది. ఇసడోరా లోని ఆడంబరంపై తిరుగుబాటు ధోరణిని బలవంతం మీద అణచుకొన్నది. అడపా దడపా వీటిని తప్పించుకోవటానికి ఆమె ఇంజిన్ రూమ్‌లోకి వెళ్లి లోహెన్ గ్రీన్ ఎలాంటి ఉడుకు విప్లవం పరాయి దేశంలో తెస్తున్నాడో అర్థం అవుతోందా అనుకొన్నది. క్రమంగా మధురమైన వైన్, సువాసన దవ్యాలు, జిగ్ జిగేల్ మనిపించే పాల్ పారిట్ గౌన్లుకు అలవాటు పడింది. అందమైన అమ్మాయికి అత్యంత సుందరమైన దుస్తులు చూసి ముచ్చట పడింది. 1911లో ఇద్దరూ న్యుయార్క్ చేరారు. అతి పెద్ద విలాస వంతమైన నౌకలో భోగ భాగ్యాల గదిలో ఉన్నారు. జాయ్, జాయ్‌గా సాగిన ఈ ప్రేమ యాత్ర గర్భవతి అయిన ఇసడోరా వలన అర్థంతరంగా ఆగి పోయింది. ఫ్రాన్స్‌కు తిరిగి వస్తూ మిలియనీర్ గారి కొడుకును సముద్ర తీరం మీదే కని పాట్రిక్ అని పేరు పెట్టుకొన్నది.

హేన్గ్రిన్ ఇసడోరాను పెళ్లి చేసుకోవటానికి ముందుకొచ్చాడు. కాని ఆమె చాలా రెస్ట్ లెస్‌గా ఉంది. సోమరిగా సృజనకు దూరంగా ఉండాలని అనిపించలేదామెకు. పూర్వం క్రేగ్‌లాగానే ఇప్పుడూ ఈయనతో గొడవలు కొట్లాటలు ఛీ ఛీ ఛాఛాలు జరిగాయి. ఆమెలోని వ్యక్తిత్వం స్వాతంత్రేచ్ఛ నిజంగా ఆమెలో నిలకడైనవి కాదని గ్రహించాడు. ఇతరులపై ఆధారపడాల్సి వస్తుందనే పెళ్లి వద్దన్నది. ఆమెకు అకస్మాత్తు పరిచయాలలో థ్రిల్ ఉంటుంది. డబ్బున్న ఆడవాళ్ళు డబ్బు బాగా ఖర్చు పెట్టే మగాళ్ళు అంటే తాను ఎవరిని ద్వేషిస్తుందో వారే కావాలి.

35వ ఏట ఇసడోరాకు పెద్ద దుఃఖ సంఘటన జరిగింది. తాత్కాలికంగా భర్తతో కలిసి కాపురం చేస్తూ ఒక రోజు ఇద్దరు పిల్లల్ని నర్స్‌ను కారులో షికారు పంపింది. అది అదుపుతప్పి బ్రేకులు ఫెయిలయి కారు సీన్ నదిలో పడి పోయింది. ఇసడోరా తనభర్త తనను ఊరడిస్తాడనుకొంటే "పిల్లలు, పిల్లలు చచ్చిపోయారు" అని ఏడ్చాడు.

ఈ సంఘటన దిగ్భ్రాంతి కలిగించి ఆమె జీవితాన్ని మార్చేసింది. జీవితం సాగుతూనే ఉంది. కాని మారిన మరో స్త్రీగా. ఆత్మ వినాశకరంగా మరి జీవితాన్ని సర్వనాశనం చేసుకొన్నది. లావు పెరిగి, పని మందగించింది. అప్పుడప్పుడు నరాల ఉద్రేకం వచ్చేది. మళ్ళీ ప్రేమికుల వేటాడి ఒక "బకరా"ను పడేసింది. అతను పెళ్లికావాల్సిన ఇటాలియన్ యువశిల్పి. ఒక డాక్టర్ గమనించి ఆమె ఆత్మ జబ్బు పడిందని తేల్చాడు. ఆమెకు కావాల్సింది ప్రేమ, మరింత ప్రేమ అన్నాడు. అందమైన ఒక హోమో సెక్సువల్, ఒక దక్షిణ అమెరికా టాంగో డాన్సర్, ఒక పియానిస్ట్ ఆమె ప్రేమ మంటలకు

ఆహుతయ్యారు. కవులు కళాకారుల సంఖ్య చెప్పనే అక్కర్లేదు. దీన్ని అంతటిని ఆమె "love might be a pastime as well as tragedy, and I gave myself to it with pagan innocence" అన్నది.

మొ ప్ర.యు.వచ్చాక ఇసడోరా డాన్స్ విజేత అయి, ఎన్నో హింసలను ఎదుర్కొన్నది అనుకోని ఎదురు దెబ్బలు తిన్నది. ఆమె ఆదర్శ పాఠశాల ఒక హాస్పిటల్‌గా మారింది. దాన్నే ఆమె "a charnel house of bloody wounds and death" అన్నది. తర్వాత అది విషవాయువు తయారు చేసే ఫాక్టరీగా మారింది. తన చనిపోయిన పిల్లల బదులు వారసురాలిగా చేసుకొందామన్న ఒక పిల్ల పుట్టిన వెంటనే చనిపోయింది. అయినా అకాడెమి ఆలోచన మానలేదు. 1921లో రష్యా ప్రభుత్వ ఆహ్వానంపై మాస్కోలో ఒక స్కూలు పెట్టాలని వెళ్ళింది.

మరో ఏడాది దాటాక ఆదర్శాలన్నీ తుంగలో తొక్కి సెర్జ్ ఎస్సేనిన్‌ను పెళ్లి చేసుకోన్నది. అతను 27 ఏళ్ళు. అందగాడు. క్రూర, సగం వెర్రి వెంగళప్ప, నీతిలేని రష్యన్ కవి. అతనికి ఇంగ్లీష్ రాదు. నేర్చుకోవటానికి ఇష్టపడేవాడు కాదు. తప్పతాగి ఇసడోరాను హింసించేవాడు. ఆమె డాన్స్‌ను అవహేళన చేసేవాడు. ఆమె ఎదురు తిరిగితే కాల్చి చంపేస్తానని బెదిరించే శాడిస్ట్. అతడిని అమెరికా తీసుకొని వెళ్ళింది అక్కడ ఆమెకు అనేక విశేషణాలతో స్వాగతం పలికారు. తర్వాత ఆమెను ఎల్లిస్ ఐలాండ్‌లో నిర్బంధంలో ఉంచితే అతడే ప్రదర్శన చేశాడు. పెద్దగా లాభాపడింది ఏమీ లేదక్కడ.

యూరప్ తిరిగి రాగానే మళ్ళీ ఎస్సిన్ దురుసుగా ప్రవర్తించి, ఫర్నిచర్ విరగ్గొట్టి భీభత్సం సృష్టించేవాడు. మూర్ఛరోగి అని సానుభూతి చూపేది. ఒక పెద్ద విలాస వంతమైన హోటల్ గది సామాను పగలగొడితే అతన్ని శానిటోరియంలో చేర్చింది. అతని స్వేచ్ఛ కోసం ప్రాధేయపడి కంట్రోల్ లో అతన్ని ఉంచుతానని వాగ్దానం చేసింది. కాని మణికట్లు విరగ్గొట్టుకొని ఒక కవిత రాసి రక్తంతో సంతకం చేశాడు. చివరికి ఉరేసుకు చచ్చాడు. ఇసడోరా తీవ్ర దుఖంలో కూరుకు పోయింది. అతని మరణం తర్వాత ఆమె ఎక్కువ కాలం జీవించలేదు. 49వ ఏట 1927 జులైలో ఆమెఅభిమానులు మహా గొప్పది అని మెచ్చిన కచేరీ చేసింది. అందులో వేసుకొన్న స్కార్ఫ్ అందరికీ గుర్తుండి పోయింది. జీవిత మాధుర్యాన్ని బాగా రక్తి కట్టించింది అన్నారు. రెండు నెలల తర్వాత సెప్టెంబర్ 14న ఒక ఆటో మొబైల్‌లో వెడుతుండగా తాను ఇష్టంగా వేసుకొన్నసిల్క్ స్కార్ఫ్‌ను తాను మామూలుగా స్వేచ్ఛా చిహ్నంగా ఊపుతుండగా దాని అంచులు కారు చక్రాల స్పోక్స్‌లో ఇరుక్కు పోయి, అది క్రమంగా బిగుసుకుపోయి మెడను ఒరుసుకు పోయి మెడ తెగి రోడ్డుమీద పడి చనిపోయింది. ఈ విధంగా ఆ కళ(ల)ల రాణి, దైవాంశ సంభూతురాలు, మేధో విలసితురాలు దారుణ మరణానికి గురైంది.

ఇసడోరా జీవిత ధ్యేయం ఆశ్చర్యాన్ని ప్రసారం చేయటమే. డాన్సులతో దాన్ని చేసి చూపించింది. అందానికి సామాన్యతకు భేదం ఆమె ఎన్నడూ నేర్వలేదు. ఆమెది లోకాచారానికంటే ఎక్కువైనది. ఆమెది ఒక ప్రక్షాళన శక్తి. కదలికలను స్టేజ్‌ని విప్లవాత్మకంగా మార్చింది. డాన్స్‌లోనే కాక ఆధునిక మనసును విప్లవాత్మకంగా మార్చేసింది. ఆరోగ్యవంతమైన ఆర్ట్‌కు మార్గదర్శి అయింది. నటిగా, ఆర్టిస్ట్‌గా ఎన్నో పాత్రలు ధరించి ఒదిగిపోయింది. కోరస్ పాడింది, విషాద రాణి అనిపించింది. ఆమె చంచల మానసంతో మెలోడ్రామ పండించిది. "ఏఅమెరికా మహిళా ఇసడోరా అంత పేరు ప్రఖ్యాతులు పొంది, ప్రభావం చూపిన వారు లేరు" అని బోలి ధియో 1929లో రాసిన మాట పూర్తి యదార్థం.

యూరప్‌లో ఇసడోరా స్థాపించిన "మదర్ ఆఫ్ డాన్సేస్ స్కూల్" ఎక్కువకాలం ఉండకపోయినా ఆమె కళాప్రాభవం, ప్రభావం పెరిగాయి. ఆమె శిష్యురాళ్ళు అన్నా, లిసా, ఇర్మా మొదలైన వారు ఆమె తీర్చిదిద్దిన బాటలో నడిచి ఆమె ఆలోచనలను మరింతగా ప్రచారం చేశారు. ఆమె భావాలన్నిటినీ "ఇసడోరా డంకన్ సంప్రదాయం"గా చరిత్రలో నిలిచిపోయింది. వైద్య వృత్తిలో ఒక గాయానికి (ఇంజురి) "ఇసడోరా డంకన్ సిండ్రోం" అని పేరు పెట్టారు. కోరియోగ్రఫీలో ఇసడోరా కొత్త పుంతలు తొక్కింది.

The movement of the waves, of winds, of the earth is ever in the same lastingharmony. We do not stand on the beach and inquire of the ocean what was its movement of the past and what will be its movement of the future. We realize that the movement peculiar to its nature is eternal to its nature. The dancer of the future will be one whose body and soul have grown so harmoniously together that the natural language of that soul will have become the movement of the body.

•Thedance of the future will have to become again a high religious art as it was with the Greeks. For art which is not religious is not art. It is mere merchandise.

•Theharmony of music exists equally with the harmony of movement in nature.

Man has not invented the harmony of music. It is one of the underlying principles of life. Neither could the harmony of movement be invented: it is essential to draw one' conception of it from Nature herself, and to see the rhythm of human movement from

the rhythm of water in motion, from the blowing of the winds on the world, in all the earth' movements, in the motions of animals, fish, birds, reptiles, and even in primitive man, whose body still moved in harmony with nature……..All the movements of the earth follow the lines of wave motion. Both sound and light travel in waves. The motion of water, winds, trees and plants progresses in waves. The flight of a bird and the movements of all animals follow lines like undulating waves. If then one seeks a point of physical beginning for the movement of the human body, there is a clue in the undulating motion of the wave.

"I have the right to choose the father of my own children, " Isadora declared, and then wrote to George Bernard Shaw: "Will you be the father of my next child? A combination of my beauty and your brains would startle the world, "but he replied: "I must decline your offer with thanks, for the child might have my beauty and your brains".

ఈ జోక్ ప్రపంచ వ్యాప్తమైనదని మనకు తెలిసిన విషయమే.

This great artist is no longer in our world. The sun has set: the cycle is finished. In her art and in her life Isadora Duncan seemed to be an incarnation of all the energies of Nature.

In those moments where beauty and emotion fuse and climax, something of the immortal floats about the dancer; she wanders in a divine ray, in a mist where all works of art circle in unison with her.

Perhaps the greatest personality who has ever devoted herself to developing the art of the dance …… Her interests ranged over a wide field of activities. There was a time when she wished to initiate a reform of human life in its least details of costume, of hygiene, of morals. But gradually she came to concentrate her interest upon the dance. For her the dance is not merely the art which permits the spirit to express itself in movement; it is the

base of a whole conception of life, a life flexible, harmonious, natural. I

Her dances were hymns to freedom — of sensibility, of passion, of the transcendentally convinced and convincingEmersonian soul …… Today it is hard to picture convincing interpretations of Joy, Hope, Immortality, the Soul. But at the turn of the century an American girl, incarnating these and more, coincided with historical promise

The dancing of Isadora Duncan is great symbolic art; now, when perhaps we have seen it for the last time, we must unhesitatingly re-affirm our conviction that it is one of the superlative artistic expressions of eternal spiritual glories. Her endowment is no mere talent for the consummation of exterior beauties; it is genius. She is a seer and a prophet, fulfilled of understanding and wisdom.

ఇప్పుడు ఇసడోరా కవిత ఒకటి చూద్దాం

The wind?
I am the wind.
The sea and the moon?
I am the sea and the moon.
Tears, pain, love, bird-flights?
I am all of them.
I dance what I am.

Whenever you feel the evil influence of the middle class muddling your soul, you" ll say these two words and you' ll be a free spirit again: "Isadora Duncan"

Nor must we forget the liberating force which sprang from the art of Isadora Duncan, whose heroic practice has done more than any precepts of philosophy to widen our ideas as to the intellectual and spiritual possibilities of the dance.❁



## 64. మహా మేధావి, సాపేక్ష సిద్ధాంతకర్త–అల్బర్ట్ ఐన్ స్టీన్ (1879–1955)

“ఈ విశ్వంతో దేవుడు పాచికలాట ఆడతాడని నేను అనుకోను” అని చెప్పిన ప్రఖ్యాత శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐన్ స్టీన్ 26వ ఏటనే సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రచురించాడు. అప్పటికున్న మేధావులలో 12మందికి మాత్రమే దాని అంతరార్థం తెలిసి ఉంటుంది అనుకొనేవారు. 40ఏళ్ళ తర్వాత అమెరికన్ ఆర్మీ ఎయిర్ ఫోర్స్ హిరోషీమాపై 6–8–1945న ఆటంబాంబు వేసినప్పుడు 80 వేల మంది ప్రజలు దాని ప్రభావంతో చనిపోయారు. అది ఆయన ప్రతిపాదించిన జటిల సూత్ర తార్కిక ప్రభావం. ఇప్పుడు ప్రపంచానికి అర్థమైనది. ఆయువ లెక్చరర్ సిద్ధాంతాలు విజ్ఞాన శాస్త్రంలో విప్లవాన్ని ప్రముఖ ఖగోళ శాస్త్రవేత్త గెలీలియో తర్వాత తీసుకొచ్చాడని.

ఐన్‌స్టీన్ 14–3–1879న బవేరియన్ జర్మనీలో విట్టెం బెర్గ్ సిటీలో జన్మించాడు. వారిది ధనిక కుటుంబం. తండ్రి ఇంజనీర్. అక్కడ ఎలెక్ట్రో టెక్నికల్ సంస్థల అధిపతి. ఈ బిజినెస్ వలన కుటుంబం ఇటలీలోని మిలన్‌కు 1894లో మారింది. కుర్రాడి చదువు ఎక్కువ భాగం మ్యూనిచ్‌లో జరిగింది. కొత్త జర్మనీ మిలిటరీ బూట్లు, గొప్పలు నచ్చేవి కావు. వీటికి దూరంగా బీథోవెన్, మొజార్ట్‌ల సంగీతానికీ, తత్వ శాస్త్ర గ్రంథాలకే ఆకర్షితుడయ్యాడు. 15వ ఏటికే యూక్లిడ్, న్యూటన్, స్పినోజాల పుస్తకాలను కాచి వడపోసేశాడు. దీని వలన ‘‘ఓల్డ్ ఫాదర్ బోర్’’ అనే నిక్‌నేంతో పిలిచేవారు సహాధ్యాయులు. 17 వయసులో స్విట్జర్లాండ్‌లోని జూరిచ్ పాలిటెక్నిక్ స్కూల్‌లో చదువు పూర్తి చేశాడు. తండ్రి తనలాగే వ్యాపారంలో స్థిరపడటానికి ఏలెక్ట్రికల్ ఇంజనీరింగ్ చదవమని అంటే పోటీతో ఎప్పుడూ ఒడిదుడుకులతో ఉండే వ్యాపారం కంటే సైన్స్

లోతులు పరిశీలించటానికే నిర్ణయించుకొన్నాడు. అప్పటికే ఆయనకు ప్రముఖ అమెరికన్ రచయిత ఎమర్సన్ ప్రవచించిన “If a man plant himself indomitably on his instincts, the world will come round to him” అన్నది వేద మంత్రమై స్ఫూర్తినిచ్చింది. దానినే అనుసరించాడు. గణితం ఫిజిక్స్‌లలో ప్రత్యేక కృషి చేయాలనుకొన్నాడు. జూరిచ్ యూనివర్సిటీలో చదువుతూనే, అక్కడి సిటీ హై స్కూల్‌లోను తర్వాత స్కాఫాసేన్‌లోను విద్యార్థులకు పాఠాలు బోధించాడు. 22వ యేట స్విస్ సిటిజన్ అయ్యాడు. తన తోటి గణిత విద్యార్థిని మిలీవామారేక్‌ను పెళ్లి చేసుకొన్నాడు. బెర్నే పేటెంట్ ఆఫీస్‌లో పనిచేశాడు. అందంగా హుషారుగా ఉండే కుర్రాడు. నల్లని దువ్విన మీసం, చక్కగా దువ్వుకొన్న నల్ల జుట్టుతో హీరోలాగా ఉండేవాడు. విశాలమైన కళ్ళు, అందులో విశ్వాంతరాళాలను శోధిస్తున్నట్లు ఉండే చూపు ఆకర్షణీయంగా అనిపించేవి.

1905లో “అన్నలెన్ దీర ఫికిక్” అనే 30పేజీల పేపర్‌ను కదిలే ఎలక్ట్రో డైనమిక్ వస్తువులపై రాసి ప్రచురించాడు. ఈ మహా వ్యాసం వస్తు గుణాలను, విశ్వ నిర్మాణంలో ఉన్న అభిప్రాయాలను పూర్తిగా మార్చేసింది. దాని విప్లవాత్మక భావం మొదట్లో ఎవరికీ తెలియలేదు గుర్తించనూలేదు. ఇది 1920కి ఆయన సిద్ధాంతం యొక్క ఆంగ్లానువాదం “ఐన్ స్టీన్ సాపేక్ష సిద్ధాంతం, ఎ స్పెషల్ అండ్ జనరల్ థీరీ”గా ముద్రింపబడి గొప్ప విలువను సంతరించుకొన్నది. ఇది ప్రపంచ వ్యాప్తంగా ఫిజిక్స్, గణితాలను సవాలు చేసింది. న్యూటన్ అనుచరులు –గతి, స్థిరత్వాలు సంపూర్ణమని, వాటిని కొలవవచ్చునని నమ్మారు. కాని ఇప్పుడీ కుర్రాడు ఐన్ స్టీన్ ఆ రెండూ సాపేక్షాలు అని చెప్పి సవాలు విసిరాడు. వేర్వేరు మనుషులు వాటిని వేర్వేరుగా గణించగలరు అన్నాడు. దీనితో ఇప్పటిదాకా అందరూ నమ్మిన పొడవు ద్రవ్య రాశి, కాలం యొక్క సంపూర్ణత్వం గంగలో కలిసిపోయింది. ఈ మూడిటి ఆధారంగానే మిగిలినవన్నీ కొలిచే విధానంలో పెను మార్పే వచ్చింది.

ఇది అంతగా కొత్తదేమీ కాదు. హెర్బర్ట్ స్పెన్సర్ తూర్పు వెళ్ళే స్టీమర్ మీద అదే వేగంతో కెప్టెన్ పడమరకు నడుస్తుంటే వచ్చే సమస్యను అందరి దృష్టికి తెచ్చాడు. అతడు కదదుల్తున్నాడా లేదా అని ప్రశ్నించాడు. పడవ మీద ఉన్నవాళ్ళకు ఆతను కదులుతున్నట్లే అనిపిస్తుంది. కాని ఒడ్డునుండి చూసేవాడికి అతనిలో కదలిక కనిపించదు. కనుక ఐన్ స్టీన్‌కు ముందు నుంచే ఇలాంటి సాపేక్ష కదలిక విషయాలు చర్చలలో ఉన్నాయి. దీనికి విశ్వంలో ఎక్కడో ఒక బిందువు నుండి గణన చేయాలని అనుకొన్నారు. ఇలాంటి గందర గోళ భావాలు ఎన్నో ఉన్నాయి. ఎన్ని లెక్కలు వేసినా బుధ గ్రహం తన మార్గం నుండి పక్కకు తొలగినట్లు న్యూటన్ ఆకర్షక సిద్ధాంతాలలతో గమనించారు.

కాని మైకెల్సన్, మోర్లీ శాస్త్రవేత్తలు 1887లో భూమి కక్ష్యా మార్గంలో ఒక స్థిర బిందువు ఆధారంగా మార్పుని కనిపెట్టలేక పోయారు. క్యూరీ దంపతులు రేడియం లోహం నుండి కంటికి కనపడని శక్తి ప్రవాహం వెలువడుతోందని చెప్పారు. 1901లో కాఫ్మన్ శాస్త్రజ్ఞుడు వేగంగా కదిలే ఎలక్ట్రాన్ల భారం స్థిరంగా ఉన్న వాటి కంటే ఎక్కువగా ఉంటుందని తెలియ జేశాడు. వీటన్నిటికీ ఐన్‌స్టీన్ సిద్ధాంతం తిరుగులేని సమాధానం చెప్పి చరిత్ర సృష్టించింది. ప్రకృతి ధర్మాలపై నూతన భావావిష్కరణ జరిగింది. ఈ ఖ్యాతి అంతా ఐన్ స్టీన్ దే.

గణిత శాస్త్ర సింబల్స్ ప్రకారం ప్రతి పరిశీలకుడు తాను స్థిర బిందువుపై ఉన్నానని భావించే హక్కు ఉన్నదని అన్నాడు. సెకనుకు ఒక లక్షా ఎనభై ఆరు వేల మైళ్ళ వేగంతో ప్రయాణం చేసే కాంతి చూసేవారికి పరిమాణంలో సంకోచించినట్లు గమనిస్తారు. ఈ సంకోచాన్ని 1885లో గుర్తించి లోరెంజ్-ఫిట్జెరాల్డ్ సంకోచం అని పేరు పెట్టారు. ఇది "గణితకృత్రిమత". "మేథమాటికల్ ఆర్టి ఫీషియాలిటి" అన్నారు. కాని ఐన్‌స్టీన్ దీన్ని భౌతిక సత్యంగా రుజువు చేశాడు. ఉదాహరణకు ఒక బంతి నిమిషానికి 161000 మైళ్ళ వేగంతో కదులుతుంటే గమనించేవాడికి దాని మందం సగానికి సగం తగ్గి, ఒక ఫ్లాట్ డిస్క్ లాగా చివరికి అసలు మందమేలేనట్లుగా గమనిస్తాడు. అంటే కాంతి వేగానికి మించిన వేగంతో యే వస్తువూ ప్రయాణించలేదు అని అర్థం.

ఏక కాలంలో జరిగిన సంఘటనలు ఒకరికి కనిపించినట్లుగా మరొక పరిశీలకుడికి కనిపించటం లేదు. ఉదాహరణకు ఒక గడియారం చూసేవాడికి దానికీ సాపేక్ష వేగంలో ఉన్నట్లయితే నెమ్మదిగా నడుస్తుంది అని గమనించారు. ఇప్పుడు పొడవు కాలాలను మార్చే వీలు కలిగింది. ఈ రెండిటిని కలిపి ఐన్ స్టీన్ "స్పేస్ టైం ఇంటర్వల్"ను గుర్తించి దూరం, వ్యవధి చూపరులకు స్థిరంగా ఉంటుందని కనిపెట్టాడు. దీనివలన విశ్వంలోని స్థల, కాల సమస్యలు పరిష్కారమైనాయి. వీటన్నిటి వలన తేలిన విషయం ఏమిటీ అంటే – అతి వేగంగా కదిలే ద్రవ్యరాశి తాను స్థిరంగా ఉన్నప్పటికంటే ఎక్కువ బరువుగా ఉంటుంది అని. ఈ ద్రవ్య రాశి మార్పు కాఫ్ మన్ శాస్త్రజ్ఞుని ప్రయోగాల వలన ద్రవ్యరాశి, శక్తికి మధ్య ఉన్నప్రఖ్యాత "పరస్పర అంతర సంబంధం"కు దారి చూపింది.

న్యూటన్ గారి ఫిజిక్స్‌లో ఒక కదిలే వస్తువును తోస్తే, ఆ తోపు దాని వేగాన్ని పెంచి, దాని చోదక శక్తి (ఎనర్జిఆఫ్ ప్రొపల్షన్) కదిలేవస్తువులో గతి శక్తిగా మారుతుంది. తోపులు ఎక్కువైతే స్పీడ్ కూడా ఎక్కువౌతుంది. దీనికి పరిమితి లేదు. కాని ఐన్ స్టీన్ ద్రవ్య రాశిని వేగవంతం చేసినా స్పీడ్ కాంతి వేగాన్ని మించలేదు

అని చెప్పాడు. దీనర్ధం–కాంతి వేగం దగ్గర ద్రవ్య రాసిపై ఇచ్చిన తోపు కొద్దిగా మాత్రమే స్పీడ్ పెంచటానికి తోడ్పడి, మిగిలినది అంతా ఆ వస్తు ద్రవ్య రాశిని పెంచటానికే తోడ్పడుతుంది. ద్రవ్య రాశిలో పెంపు, ఇచ్చిన తాపు శక్తికి అనులోమానుపాతంగా ఉంటుంది. దీనినే ఐన్ స్టీన్ ప్రఖ్యాత సూత్రం E=mc2 అంటారు. ద్రవ్య రాశి అంతా కేంద్రీకృత శక్తి అనే అభిప్రాయాన్ని చెప్పాడు. ఇదొక విప్లవాత్మక సిద్ధాంతం. దీని అర్ధం–వస్తువులోని గుప్త శక్తి (లేటెంట్ ఎనర్జీ) E,దాని ద్రవ్య రాశి, (M), కాంతి వేగం యొక్క వర్గం (స్క్వేర్) `Ë C2తో హెచ్చించగా వచ్చిన లబ్ధానికి సమానం. ఇదే తర్వాత రేడియో యాక్టివ్ విచ్ఛిన్నానికి దారి చూపించింది.

క్యూరీల ఈ భావాలు ఎక్కువ ద్రవ్య రాశుల కోసం చేసే అన్వేషణకు దారి చూపింది. ఇదే అత్యంత శక్తికి నిలయమైన ఆటంబాంబు నిర్మాణానికి అవకాశం కల్పించింది. “నేను అటామిక్ ఎనర్జీ విడుదల పితను కాను” అని ఐన్ స్టీన్ చెప్పుకొన్నాడు. “అటామిక్ వార్ అండ్ పీస్” అనే తన గ్రంథంలో ఐన్ స్టీన్ “అందులో నాపాత్ర పరోక్షమైనది. అంతటి మహాశక్తి నా జీవితకాలంలో విడుదల అవుతుందని నేను ఊహించలేక పోయాను. అది సిద్ధాంత రీత్యా సాధ్యం అనే నేను చెప్పాను. అకస్మాత్తుగా కనుగొన బడిన చైన్ రియాక్షన్ అది త్వరలోనే సాధ్యమైపోయింది. అయితే నేను చైన్ రియాక్షన్‌ను ముందుగా ఊహించలేక పోయాను” అని రాశాడు. 1939లో అమెరికా భౌతిక శాస్త్రవేత్తలు అమెరికా ఆర్మీ, నేవీ అధికారులను అటామిక్ ప్రాజెక్ట్ ప్రాధాన్యతను గురించి ఒప్పించ లేకపోయారు. ప్రెసిడెంట్ రూజ్వెల్ట్‌కు ఐన్ స్టీన్ అణుశక్తి విస్మరించలేనిదని, ఒక ఉత్తరం రాశాడు. దీనితో శత్రు దేశమైన జర్మనీకంటే ముందే అటామిక్ బాంబ్‌ను తయారు చేసే పనిలో అమెరికన్ సైంటిస్ట్‌లు ముందడుగు వేశారు. ఇవన్నీ ఐన్ స్టీన్ పూర్వమే చెప్పిన స్పెషల్ రిలేటివ్ థీరీకి పుట్టిన కొమ్మలే. 1915లో ఆయన చెప్పిన జనరల్ రిలేటివిటి యే విశ్వంపై ఉన్న అనేక భావాలను కొత్తగా ఆవిష్కరించింది. గణితంలో రోజు రోజుకూ ఆవిష్కారమౌతున్న నూతన సిద్ధాంతాలు, తన స్వంత సాంకేతిక పరిజ్ఞానాలతో ఐన్ స్టీన్ “ప్రిన్సిపల్ ఆఫ్ ఈక్వివ లెన్స్” అంటే సమానార్ధక సూత్రంను సాధించాడు. దీనివలన గురుత్వాకర్షణ శక్తికి, వేగవృద్ధి లేక త్వరణంలకు మూల విభేదం లేదని తెలిసింది. “కాని త్వరణం యొక్క శక్తి అసలు శక్తి కాదని, ఒక కారు అకస్మాత్తుగా స్టార్ట్ ఆయేటప్పుడు, ఆగేటప్పుడు, ప్రక్కలకు తిరిగేటప్పుడు దాన్ని అనుభవించగలం, అదే కదలికల స్థితిలో మార్పు. అంతరిక్షం ధర్మాలు అతి పెద్ద ద్రవ్య రాశుల దగ్గర మారిపోతాయి అని ఐన్ స్టీన్ కనిపెట్టాడు. దీన్ని వంపు లేక వక్రత అన్నారు. ఇదే నాలుగవ పరమాణం (ఫోర్త్ డైమెన్షన్). ఇది న్యూటన్ చెప్పిన గురుత్వాకర్షణశక్తిని సమర్థిస్తుంది. కాని సమీకరణంలో ఉన్న అదనపు పదం మనకు

దగ్గరున్న సూర్యుడులాంటి అతి భార వస్తువుల విషయమై కొద్ది తేడాలు కనిపించాయి. ఇదే సూర్యునికి దగ్గరున్న బుధ గ్రహ విషయంలో ఉన్న తేడాలను పరిష్కరించింది.

అంతరిక్ష లక్షణమైన గురుత్వాకర్షణ శక్తి అనుకొంటే, అది ఒక శక్తి కాకపోతే, కాంతి కూడా గురుత్వాకర్షణకు గురవ్వాలి, కాంతి కిరణం గురుత్వాకర్షణ క్షేత్రంలోకి ప్రవేశిస్తే, అది తన దారి నుంచి ప్రక్కకు తొలగిపోతుంది లేక వంగుతుంది. ఇదంతా సాధారణ భౌతిక శాస్త్రవేత్తలకు కలలాగా అనిపించింది. కాని ఐన్ స్టీన్ మాత్రం తన సిద్ధాంతాన్ని ప్రయోగ పూర్వకంగా రుజువు చేయచ్చునని చెప్పాడు. సూర్యుని గురుత్వాకర్షణలో ఉన్న ఒక నక్షత్రం యొక్క మార్గాన్ని పరీక్షించి చేసి చూడమని సలహా ఇచ్చాడు. సాధారణంగా నక్షత్రాలు రాత్రిపూట మాత్రమే కనిపిస్తాయి. కాని గ్రాహణం రోజున మాత్రమే నక్షత్రాలను, సూర్యుడిని ఒకేసారి చూడగలం. ఈ విషయాన్ని గురించి "ది యూనివర్స్ అండ్ డాక్టర్ ఐన్ స్టీన్" పుస్తకం లో లింకన్ బార్నెట్ "గ్రహణం సమయంలో సూర్యుని నలువైపు నుంచి తీసిన నక్షత్రాల ఫోటోలను, మిగాతా కాలంలోని నక్షత్రా ఫోటోలను పరీక్షించి చూడమన్నాడు. సూర్యుని చుట్టూ ఉన్న నక్షత్రాలనుండి వచ్చే కాంతిలోనికి అంటే సూర్యుని వైపుకు ఆయన గురుత్వా కర్షణ శక్తి క్షేత్రం ద్వారా ప్రయాణించినపుడు ఒంగుతుంది. భూమి మీది వీక్షకులకు అ నక్షత్రాల ప్రతి బింబాలు వాటి యదార్ధ స్థితి నుంచి బయటికి తొలగినట్లు కనిపిస్తుంది. ఐన్ స్టీన్ ఈ విక్షేపం (డిఫ్లక్షన్) యొక్క ప్రమాణంను గణించాడు. సూర్యుని దగ్గరున్న నక్షత్ర కాంతి విచలనం (డీవిఏషన్) 1.75 సెకన్లు అని ఖచ్చితంగా గుణించి చెప్పాడు. ఐన్ స్టీన్ చెప్పిన విషయాలను గుర్తించిన శాస్త్రవేత్తలు ప్రపంచ వ్యాప్తంగా 29-5-1919 నాడు భూ మధ్య రేఖపై చేరి ఫోటోలు తీశారు. వాటిని తర్వాత డెవలప్ చేసి పరీక్షించి చూస్తే సూర్య గురుత్వాకర్షణ క్షేత్రంలో నక్షత్ర కాంతి విక్షేపం సరాసరి 1.64 సెకనులు అని గణించి తెలిపారు. ఇది ఐన్ స్టీన్ ఊహించి చెప్పిన దానికి అతి దగ్గరలో ఉండటం విశేషం. ఆయనది ఊహతో చెప్పింది. ఇది ప్రయోగాత్మకంగా రుజువు చేసి చెప్పింది. అంతటి మేధావి ఐన్ స్టీన్.

అంతర్జాతీయ బృందం ఏర్పాటు చేసిన సభలో అతని విజయాలను ప్రస్తుతించాక ఐన్ స్టీన్ చాలా పొడి హాస్యపు మాటలతో జవాబు చెప్పాడు. సాపేక్ష సిద్ధాంతానికి మరో తమాషా నిరూపణగా "ఇవాళ జర్మనీలో నన్ను జర్మనీ దేశపు సైంటిస్ట్‌గా గౌరవిస్తున్నారు ఇంగ్లాండ్‌లో ఇతర దేశీయ జ్యూగా గుర్తిస్తున్నారు. కాని నా సిద్ధాంతాన్ని నిరాకరిస్తే జర్మన్లు నన్ను విదేశీ జ్యూ అని ఇంగ్లిష్ వాళ్ళు నన్ను జర్మనీవాడు కాదు అని దూషిస్తారు" అన్నాడు. జర్మనీలోని ప్రేగ్ యూనివర్సిటీలో థీరిటికల్ ఫిజిక్స్‌లో ప్రొఫెసర్‌గా ఉన్న ఐన్ స్టీన్, ప్రష్యన్ అకాడెమి సభ్యుడై బెర్లిన్‌కు వెళ్లి ఉన్నాడు. ఇద్దరు సంతానం

తర్వాత భార్యకు విడాకులిచ్చాడు. 1917లో తన మొదటి కజిన్ ఎల్సా ఐన్ స్టీన్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఆమె 1936లో చనిపోయేదాకా ఆయనకు చాలా అనుకూలవతిగా ఉన్నది. 40వ ఏట ప్రపంచ యాత్రికుడయ్యాడు. ఇంగ్లాండ్ ఫ్రాన్స్ అమెరిక, చైనా, జపాన్, పాలస్తీనాలు సందర్శించాడు.

రాజకీయంలో ఎప్పుడూ లేడు కాని ఐన్ స్టీన్ హింస ప్రజ్వలిస్తే మాత్రం తప్పక దానికి వ్యతిరేక శిబిరంలో ఉంటాడు. శాంతి ప్రేమికుడు, బీదజన సంక్షేమాభిలాషి. తనకు వచ్చిన నోబుల్ ప్రైజ్ మనీని తన దేశం అనుసరిస్తున్న అతి తీవ్ర వాదవిధానాలకు వ్యతిరేకంగా పోరాడేవారికి చారిటీ ద్వారా అందించాడు. నాజీలు ఆయన్ను ద్వేషించారు. హిట్లర్ అధికారంలోకి రాగానే ఐన్ స్టీన్‌ను జాతి శత్రువుగా ప్రకటించాడు. 1933లో బలాత్కారంగా అకాడెమీ నుంచి తొలగించగానే ఐన్ స్టీన్ అమెరికా చేరాడు. అక్కడ న్యూ జెర్సీలోని ప్రిన్ స్టన్‌లో ఉన్న అడ్వాన్సెడ్ స్టడీలో ఆయన ఆ జీవిత ఆచార్యుడుగా (లైఫ్ టైం ప్రొఫెసర్) నియమించ బడ్డాడు. 1940కి అమెరికా పౌరసత్వం పొందాడు. ఆయనలోని స్వాతంత్రేచ్ఛను అనేక పేపర్లలో రాసి తెలియజేశాడు. ఇవన్నీ "ది వరల్డ్ యాజ్ ఐ సీ ఇట్" మరియు "అవుట్ ఆఫ్ మై లేటర్ లైఫ్" పుస్తకాలలో వచ్చాయి. నీతి పతనం, టుడే మొదలైన వ్యాసాలలో తన భావాలను విస్పష్టంగా చెప్పాడు. "ఈ రోజు నాగరక మానవ అస్తిత్వ పునాదులు కదిలిపోయి స్థిరంగా లేవు. ఒకప్పటి మహా సామ్రాజ్యాలు ఇప్పుడు మాకు సేవ చేసేదే సరైనది" అని ప్రకటించే దౌర్జన్యకారులకు తల వంచుతున్నాయి. భావ ప్రకటన మత స్వేచ్ఛలు కబళింపబడ్డాయి. సామాన్య మానవుని జీవితంతో ఆడుకొంటున్నారు. వీటివలన ఆటవికత ప్రబలి పోయింది. కనుక మనం విలువల విషయంలో రాజీ పడవద్దు. హక్కు, మానవ గౌరవాలకు భంగం కలిగే యే చర్యనైనా కలిసి కట్టుగా ఎదిరించాల్సిందే". ఈ ఆలోచనే పసిఫిస్ట్ అయిన ఐన్ స్టీన్‌ను మానవ సేవకు యుద్ధవీరునిగా మార్చింది.

ఆయన స్పెషల్ జనరల్ థీరీ ఆఫ్ రిలేటివిటి సైన్స్‌లో విప్లవం తెచ్చి అందరి సైంటిస్ట్‌లకన్నా ముందు నిలబెట్టినా ఐన్ స్టీన్ విశ్వ రహస్య విషయాలనూ మరింత నిర్దుష్టంగా చెప్పే కృషి చేస్తూనే ఉన్నాడు. 1921లో ప్లాంక్ శాస్త్రజ్ఞుని క్వాంటం సిద్ధాంతానికి సంబంధించిన "రేడిఎంట్ ఎనర్జీ" విషయంపై మార్పులు తెచ్చాడు. దీని భావం ఏమిటి? అంటే రేడిఎంట్ ఎనర్జీ క్వాంటా అనే చిన్న చిన్న విభాగాలుగా విడిపోయి వెలువడుతుంది. దీనికే ఆయనకు నోబెల్ బహుమతి వచ్చింది. 1906 నుంచి 1920 వరకు ఆయన చేసిన పరిశోధనా ఫలితంగా "ఐన్ స్టీన్ ఫోటో ఎలక్ట్రిక్ లా" ఏర్పడి ఫిజిక్స్, స్పెక్ట్రోగ్రఫీలను సమూలంగా మార్చేసింది. తరువాత ఇదే టెలివిజన్ ఆవిష్కరణకు దారి చూపింది కూడా. దీని అనుబంధం 35 ఏళ్ళ కృషి, ఏకీకృత సిద్ధాంత పరిశోధన.

ఆధునిక శాస్త్రవిజ్ఞానం అతి సాధారణ సిద్ధాంతం కోసం సైంటిస్ట్‌ల మధ్య పోటీగా మారింది. సమ్మేళన (కాన్గ్లోమేరేట్) పదార్థం 92 మూలకాలకు కుదింపబడింది. ఈ మూలకాలు మరింత సూక్ష్మ పదార్థాలుగా విభజింప బడ్డాయి. బాగా మారిపోయే ప్రకృతి శక్తులను కుదించి కొన్ని శక్తి క్షేత్రాలుగా అంటే కాంతి, ఉష్ణం మొదలైన వికిరణ శక్తులన్నిటినీ కలిపి వేర్వేరు పొడవు ఫ్రీక్వెంసి ఉన్న విద్యుదయస్కాంత తరంగాలుగా వర్గీకరించారు. ఐన్ స్టీన్ పూర్వపు శోధన వీటిని మరింత తక్కువ చేసింది. స్పేస్ అండ్ టైంలు నిరంతర ప్రవాహంలో కలిసిపోతాయని ఐన్ స్టీన్ చెప్పిన సిద్ధాంతాన్ని ఆయన జనరల్ థీరీ ఆధారంగా ప్రత్యక్షంగా అనుభవించి రుజువు చేశారు. దీనితో విశ్వం యొక్క వక్రతపై ఉన్న కీలక భావనలు, నక్షత్రాల పుట్టుక, గ్రహాలూ, గెలాక్సీల స్థితి గతులపై వివరించే చెప్పే అవకాశమొచ్చింది. 20 వేల టన్నుల టి.యెన్ టి. ప్రేలినప్పుడొచ్చే శక్తి కంటే ఎక్కువ శక్తి, ఒక చిన్న పదార్థం ఆటం బాంబ్‌గా ప్రేలినప్పుడు విడుదలౌతుంది. అంటే పదార్థం అంటే తనలో దాచుకొన్న అనంత శక్తి అని అర్థం. కనుక ఒకే విశ్వ తత్త్వం (కాస్మిక్ ఎంటిటి) యొక్క రెండు విభిన్న అభివ్యక్తులే (మాని ఫెస్టే షన్స్) పదార్థం, దాని శక్తి.

కాని ఐన్ స్టీన్ సంతృప్తి పడలేదు. ఆయన ఇంకా సాధ్యం కాని సాధారణ సూత్రం కోసమే ప్రయత్నిస్తున్నాడు. ఆ సూత్రం –భౌతిక ప్రపంచమంతా ఒక నిరంతర, అనంత ప్రవాహ శీలతే. కాని ఆయన సహ సైంటిస్ట్ లందరూ విశ్వం అంతా ఆగిపోయిన అనంత అణుమాత్ర కణాలు, అణువులే. అంటే క్వాంటా శక్తికణాలే. క్వాంటం శాస్త్రవేత్తలు ప్రతిదీ తరంగాలు, కణాలు కనుక విశ్వం ద్విగుణాత్మకమైనది అన్నారు. అది అంతు చిక్కని పదార్థమని కనుక అది సంభావ్యతపైనే ఆధారపడి ఉందని అంటారు. దీనినే “అనిశ్చిత సూత్రం” (అన్ సర్టెన్ ప్రిన్సిపల్) అంటారు. ప్రమాదం కాని నిశ్చయత్వం కాని (కాజువాలిటి, డిటెర్మినిజం) విశ్వావిర్భానికి కారణం కాదని తేల్చారు. విలియం లారెన్స్ యూని ఫైడ్ థీరీని “ది న్యూ యార్క్ టైం”లో సమీక్ష చేస్తూ “క్వాంటం థీరీకి ఒకే ఒక్కడు ఎదురు నిలిచాడు. అది విశ్వంలోని అనేక సమస్యల పరిష్కారంతో పాటు, అణువు అంతర్నిర్మాణం, రేడియేషన్ ప్రభావంలను కూడా పరిష్కరించింది. విశ్వం సంభావ్యత నిశ్చయత్వం వలన ఏర్పడలేదు. అది ఒక అనంత ప్రవాహమే” అని రాశాడు. అంతకు ముందే ఐన్ స్టీన్ పూర్తి తార్కిక విశ్వరూపాన్ని గురించి చెప్పాడు. అందుకే ఆయన “దేవుడు విశ్వంతో పాచికలు ఆడతాడు అని నేను నమ్మను” అన్నాడు.

75వ ఏట తాను రాసిన అనుబంధంలో “క్షేత్ర భావన సాధారణ సాపేక్ష సిద్ధాంతానికి తప్పని సరి. అటామిక్ శక్తి ప్రవర్తన గురించి వివరించటం చాలా కష్టమైన పనే. సంపూర్ణ విశ్వ సిద్ధాంతానికి రుజువుల కోసం ఐన్ స్టీన్ ఉపయోగించిన సంకేతాలు

(సింబల్స్) గణితంలో తలపండిన వేత్తలకు ప్రయోగాత్మకంగా రుజువు చేయటానికి సంవత్సరాల కాలం పడుతుంది. ఈ గణిత సూత్రాలను యంత్రాలకు అనువర్తింప జేయటానికి బుర్రలు బద్దలు కొట్టుకొవాల్సి వచ్చింది. అప్పటిదాకా ఐన్ స్టీన్ భావనలు సమాప్తం అని చెప్పటానికి వీలు లేదు.

వయసు 75 వచ్చే ముందే ఐన్ స్టీన్‌ను ప్రపంచమంతా గుర్తించి గౌరవించింది. ఎశ్వివా యూనివర్సిటీలో ఆల్బర్ట్ ఐన్ స్టీన్ కాలేజ్ ఆఫ్ మెడిసిన్ ఏర్పరచటానికి నిధుల సేకరణకోసం ఆయనతో డిన్నర్ పార్టీలు నిర్వహిస్తే అనేక మిలియన్ల డాలర్లు వర్షంలా కురిసింది. స్థల, కాల శక్తులపై ఉన్న ప్రతి పాత భావనలన్నిటిని తన మేధా సంపత్తితో మార్చేసిన మేధావి శాస్త్రజ్ఞుడు ఐన్ స్టీన్ ముసలి వాడైపోతున్నాడు. కాని అతి గౌరవాలకు అంగీకరించలేదు .ఊహా తీత భావనలతో చూసే ఆ కళ్ళు ఆశ్చర్య చకితులను చేసే మేధస్సున్న వాడు "ఆబ్సేంట్ మైండ్ ప్రొఫెసర్" అనిపించుకొన్నాడు. పండిన జ్ఞానంతో మరింత పండిన తెల్లని జుట్టుతో ఆయన ఒక రుషి తుల్యుడు అనిపించేవాడు.

గణిత పజిల్స్‌పై ఆసక్తి ఎక్కువ. ఆటలపై ఆసక్తి లేదు. అసలు చదరంగం ఆట గురించే తెలియదు. గుర్రపు పందాలు ఎరుగడు. బాస్కెట్‌బాల్ ఫుట్‌బాల్ ఆటలు చూసేవాడు కాదు. బోటింగ్ అంటే మహా ఇష్టం. ఆయన అనుభవజ్ఞుడైన నావికుడు. ఆయనకు అమితాసక్తి కలిగించే ఆట ఒక్కటే ఉంది అదే నడక. క్లైంబింగ్ అసలు ఇష్టం లేదు. పర్వతాలను చూడగానే నిరుత్సాహం వస్తుంది. అవి తనపై పడతాయేమో ననుకోనేవాడు. పైప్ తాగటం మహా ఇష్టం. విడతలు విడతలుగా తాగటం ఇష్టం. పుస్తకాలు చదవటం మహా ఇష్టం. సైన్స్ తర్వాత ఆయనకు అమితాసక్తి కలిగించింది చరిత్ర, జీవిత చరిత్రలు, వ్యాసాలు మాత్రమే. మంచి చిత్రాలు అంటే బాగా ఇష్టం కాని వాటిని కొని సేకరించలేదు. మత సంబంధ కార్యాలకు వెళ్ళే వాడు కాదు. ధర్మం, దానం ఇష్టమే. నెత్తిన కాప్ పెట్టుకొని యూదుల ప్రార్ధనలలో వయొలిన్ వాయించేవాడు. మతానికున్న ప్రాముఖ్యతను ఎప్పుడూ తక్కువ చేసి మాట్లాడలేదాయన. ఫిలాసఫర్, ఫిజిసిస్ట్ కూడా అయిన ఐన్ స్టీన్ భౌతికత ఆధి భౌతికతల మధ్య విభజన రేఖ గీయలేము అని చెప్పాడు. "The most beautiful thing we can experience is the mysterious. It is the source of all true art and science. To know that what is impenetrable to us really exists manifesting itself as the highest wisdom and the most radiant beauty which our dull faculties can comprehend only in the most primitive forms --this knowledge, this feeling, is at the center of true religiousness. In this sense I belong in the ranks of devoutly religious men" అని

స్పష్టం చేశాడు. ఐన్ స్టీన్ విశ్వాసానికి, సైన్స్‌కూ సంబంధించి నవాడే అయినా "సైంటిఫిక్ రిసెర్చ్‌కి విశ్వ మత అనుభవం అతి శక్తివంతమైన, ఉన్నత మైన ముఖ్య సూత్రం" అంటాడు. విశ్వ రహస్యాలను శోధించి చెప్పిన మహా తత్వవేత్తలందరూ ఆయనకు ఇష్టులే అయినా ముఖ్యంగా స్పినోజా అంటేమరీ ఆరాధన. అతనిది "జామెట్రిక్ ఫారం ఆఫ్ ఆర్గ్యు మెంటేషన్" అని సంతోషిస్తాడు. ఈ డచ్ ఫిలాసఫర్ ఆలోచనలే తనను పదార్ధం, శక్తి ఒకటే అనే సూత్రం కనిపెట్టటానికి తోడ్పడింది అన్నాడు. స్పినోజాలో ఆలోచన, దాని విస్తృతి అనే భావన ఉత్తమంగా ఉంది. ఒకే వస్తువు వివిధ రూపాలలో కనిపిస్తుందని ఆయన చెప్పింది గొప్ప విషయం అన్నాడు. నిత్య జీవితంలో ఓర్పు చాలా ముఖ్యం అనేవాడు. దానికి తోడు ఆరోగ్యకరమైన హాస్యం అవసరం అన్నాడు. "We scientists will not change the hearts of other men by mechanism, but by changing our own hearts and speaking bravely. We must be generous in giving to the world the knowledge we have of the forces of nature, after establishing safe guards against abuse. We must realize can not simultaneously plan for war and peace. When we are clear in hearts and mind --then only shall we find courage to surmount the fear which haunts the world" అన్న దార్శనికుడు ఐన్ స్టీన్.

కొద్దికాలం చిన్న అనారోగ్యానికి గురై, 76వ ఏట రక్తనాళాలు గట్టిపడి పగిలి 18-4-1955న మహామేధావి శాస్త్రవేత్త ఐన్ స్టీన్ మరణించాడు. ఆయనకు అత్యుత్తమ నోబెల్ బహుమతితోపాటు లెక్కలేనన్ని పురస్కారాలు లభించాయి. 30కి పైగా రచనలు చేశాడు. ఆయన అనేక సినిమాలు నవలలు నాటకాలు సంగీతానికి స్ఫూర్తి. "మాడ్ సైంటిస్ట్", "ఆబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్" పాత్రలకు ఆదర్శం కూడా. ఆయనకు ప్లంబరింగ్ బాగా వచ్చు. ప్లంబర్ అండ్ స్టీం ఫిట్టింగ్ యూనియన్‌లో సభ్యుడయ్యాడు కూడా. 1912 నుంచి 1955వరకు ఆయన జరిపిన 3,500 ఉత్తర ప్రత్యుత్తరాలు హీబ్రూ యూనివర్సిటి ఆర్కైవ్స్‌లో చూడచ్చు. ఐన్‌స్టీన్‌కు నీల్స్ బోర్ శాస్త్రవేత్తకు మధ్య అనేక వాదోపవాదాలు క్వాంటం మెకానిక్స్‌పై జరిగాయి. అవి ఫిలాసఫీకి, సైన్స్‌కు బాగా ఉపయోగపడ్డాయి. ఐన్ స్టీన్, రోడో వస్కి-రోజెన్ పారడాక్స్ కూడా చాలా ప్రసిద్ధి చెందింది.

1926లో ఒక స్టూడెంట్‌తో కలిసి "ఐన్ స్టీన్ రిఫ్రిజిరేటర్" కనిపెట్టాడు. దీనికి 1930లో పేటెంట్ పొందాడు. స్క్రాడిన్జర్కు సలహా ఇచ్చి "బోస్ ఐన్ స్టీన్ గాస్" తయారు చేయించాడు. సెకండ్ క్వాన్టై జేషన్‌తో స్క్రాడిన్జర్ "థర్మో డైనమిక్" సూత్రాలను సాధించాడు. మాగ్నేటిజంలో ఐన్ స్టీన్ డీ హాస్స ప్రయోగం ప్రసిద్ధమైనది.❋



## 65. ఇనుపతెర ఉక్కు నియంత జోసెఫ్ స్టాలిన్ (1879 -1953)

ఆయన అనుయాయులు "మా తండ్రి", "మాజీవిత సూర్యుడు" అంటూ దేవుడని, సర్వజ్ఞుడని, సర్వ శక్తివంతుడని, తప్పు చేయని మొనగాడని" అంటారు. ఆయన వ్యతిరేకులు "క్రూర మేధావి, మనస్సాక్షి, యోగ్యతాలేని అయోగ్యుడని, అమానుష వ్యక్తి అని, దయలేని మాకి విల్లీ అని, చేసిన వాగ్దానాలను, నమ్మిన వారిని నట్టేట ముంచే రకమ"ని అంటారు. ప్రపంచంలో చాలా మందికి 80 కోట్లకు పైగా జనాల భవిష్యత్తును చేతుల్లో పెట్టుకొని, చరిత్రలో యే నాయకుడూ చలాయించని విశేషాధికారాలను చలాయించి చర్చిల్ చెప్పినట్లు "అస్పష్టతలో చుట్టబడిన రహస్యం" (ఎ మిస్టరిరాప్పేడ్ ఇన్ ఎనిగ్మా) అయినవాడు. ఇనుప తెర అని పిలువబడిన సోవియెట్ యూనియన్‌కు ఉక్కు నియంత జోసెఫ్ స్టాలిన్.

రష్యాలో చిన్న జార్జియాలోని గోరి గ్రామంలో 21-12-1879న జన్మించాడు. అసలు పేరు "జోసెఫ్ విస్సారియోనోవిచ్ జుగాష్విలి. వంశం సనాతనమైనదే అయినా కలగా పులగం. తండ్రి చదువులేని చెప్పులు కుట్టేవాడు. ఎప్పుడూ తాగి తందనాలడుతూ కొడుకును చితక్కొట్టేవాడు. తల్లి భక్తురాలైన చాకలి. తన గారాబు బిడ్డ "జో జో" ప్రీస్ట్ అవాలని కోరుకొనేది. చాలా ఎక్కువ కష్టపడుతూ కొడుకును ఒక చర్చి స్కూల్‌లో చేర్చింది. అతనికి 15ఏళ్ళు రాగానే స్టాలిన్‌కి టిఫ్లిస్ దియోలాజికల్ సేమిటరిలో స్కాలర్‌షిప్ సాధించింది. అక్కడే నాలుగేళ్ళు చదివాడు. చర్చిలో ప్రార్ధన భక్తితో భావోద్విగ్నంగా పాడుతుంటే గొంతు వణికేదని కొందరు రాస్తే, ఇది అబద్ధం అని రికార్డులు తెలియజేశాయి. కాని "కరకు వీధి రౌడీ రాజు" అని, బయటి నుంచి వచ్చిన

నిషేధించిన సాహిత్యాన్ని ఇష్టపడి చదివే వాడని ఒక కథ ఉంది. మరొకదాని ప్రకారం "లిటరరీ ఇవల్యూషన్ ఆఫ్ ది నేషన్స్"ను చర్చి మెట్లపై కూర్చుని చదివేవాడని, అలాంటివి చదువుతున్నట్లుగా 13సార్లు గమనించినట్లు రికార్డ్ ఉంది. సేమిటరిలో సోషలిస్ట్ ఉద్యమ భాగమైన "సీక్రెట్ సోసైటీ" సభ్యుడయ్యాడు. అధికారులపై తిరగబడినందుకు స్కూల్ నుంచి సస్పెండ్ చేశారు స్టాలిన్‌ను.

కుటుంబంతో సంబంధాలు తెంచుకొని టిఫ్లిస్ అబ్సర్వేటరిలో నైట్ డ్యూటీ చేస్తూ స్వంత కాళ్ళపై నిలబడ్డాడు. పగటిపూట రైల్వే, రవాణా వర్కర్లకు మార్క్సిస్ట్ సిద్ధాంతంపై అవగాహన కల్పించి వారిని సంఘటిత పరచేవాడు. 21ఏళ్ళు రాక ముందే ఒక ప్రదర్శనలో పాల్గొని కోసాక్‌ల చేత అడ్డుకోబడ్డాడు. రహస్య స్థావరాలలో దాక్కొని తనను "కోబా" అనే జార్జియన్ పౌరాణిక హీరో పేరుతో పిలిపించుకొనేవాడు. 22 ఏట సోషల్ డెమోక్రాటిక్ లేబర్ పార్టీ కమిటీ సభ్యునిగా ఎన్నికయ్యాడు. బేటం వెళ్లి ఆయిల్ వర్కర్లు చేసే సమ్మెలో పాల్గొని అరెస్ట్ అయ్యాడు. లెనిన్ రాసిన ఇస్క్రా (ది స్పార్క్) పుస్తకాన్ని దొంగచాటుగా తెప్పించుకొని జైలులో మార్క్సును అతని సిద్ధాంతాన్ని లెనిన్ అమలు పరచిన తీరును అధ్యయనం చేశాడు. పార్టీ బోల్షేవిక్కులు అనే వామ భావాలున్నవారు, మితవాదులైన మెంషెవిక్కులుగా చీలినప్పుడు లెనిన్‌ను, అతని అతివాదులను సమర్ధించాడు. ఆ తర్వాత 12 ఏళ్ళలో 6సార్లు జైలుకు వెళ్ళాడు. అరెస్ట్ అయిన ప్రతిసారి ఏదో రకంగా తప్పించుకొని బయటకు రావటం మళ్ళీ ఉద్యమకార్యంలో పని చేయటం జరిగేది. ఒక సందర్భంలో విప్లవకార బృందానికి నాయకత్వం వహించి రెండు కారేజీలలో వస్తున్న ప్రభుత్వ ధనం 340,000 రూబుళ్ళను కైవశం చేసుకొని బోల్షెవిక్ పార్టీకి అందజేశాడు. వయసు ఇరవైలలో ఉండగానే అతని భౌతిక ఆకారానికి, ధైర్య సాహసాలకు, సిద్ధాంత నిబద్ధతకు అందరూ మెచ్చి అతన్ని "ఉక్కు మనిషి –అంటే స్టాలిన్" అన్నారు. అదే ఆయన పేరై పోయింది. 30వ ఏట జారిస్ట్ రాజుల పాలనలో రాజకీయ ఖైదీగా ఉండి రెండు వరుసలలో ఉన్న సైనికుల మధ్య ఒకే లైన్‌లో ఆయనా, ఆయన అనుచరులనూ బలవంతంగా నడిచేట్లు చేసి రైఫిల్ బట్స్‌తో కుళ్ళ బొడిచారు. దీన్ని సవాలుగా తీసుకొని సైన్యం వేగంగా వెళ్ళమన్నా ఉక్కు హృదయంతో గట్టిగా నిలబడి అతి నెమ్మదిగా కదులుతూ ఉంటే, వాళ్ళు కిందపడేట్లు చేసి విపరీతంగా దెబ్బలతో రక్తం కారేట్లు హింసించి తల పగిలేట్లు చేస్తే నేల మీద పడిపోయి, నిజంగానే ఉక్కుమనిషి అంటే స్టాలిన్ అనిపించుకొన్నాడు. ఇంతటి నిబద్ధతను తన అనుచరులు అలవరచుకోవాలని స్టాలిన్ అభిమతం. వారు అలాంటి స్పందన కలిగించకపోతే మహా క్రూరంగా ప్రవర్తించేవాడు.

జైలు నుంచి జైలుకు మారుతూ "ప్రావ్దా" పత్రిక పెట్టటానికి తోడ్పడ్డాడు. అదే

బోల్షేవిక్కుల అధికార పత్రిక అయింది. 1912లో కామ్రేడ్ వేషంలో ఉన్న ప్రభుత్వ గూఢచారి మాలినోవ్ స్కి చేత మోసగింపబడి మళ్ళీ అరెస్ట్ అయి సైబీరియాకు పంపబడ్డాడు. అక్కడ యే రకమైన సమాచార వ్యవస్థాలేదు. ఇక స్టాలిన్ పని అయిపోయినట్లే అని అందరూ అనుకొన్నారు. మొదటి ప్రపంచ యుద్ధం రష్యన్ నిరంకుశత్వం ఎక్కువ కాలం నిలబడలదనే ఆశ చిగురింప జేసింది. కాని 1917లో రష్యా విప్లవం జరిగి, ప్రాంతీయ ప్రభుత్వమేర్పడి, స్టాలిన్‌తోపాటు మిగిలిన రాజకీయ ఖైదీలను విడుదల చేస్తే కాని, ఆయన ఆశలు నెరవేరలేదు. 40ఏళ్ళ వయసులో జర్మనీ మీదుగా పెట్రోగ్రాడ్ వచ్చి, అమెరికా నుంచి వచ్చిన ట్రోట్ స్కి తో కలిసి లెనిన్‌తో చేతులు కలిపాడు. ట్రోట్ స్కి లెనిన్‌కు బాగా ఇష్టుడు. బాగా చదువుకొన్నవాడు మహావక్త, రచయితగా చాతుర్యం ఉండటంతో లెనిన్ అభిమానాన్ని సంపాదించాడు స్టాలిన్‌ను యుద్ధ రంగానికి పంపారు. అక్కడ క్లాస్ విజ్‌ను అధ్యయనం చేసి, ప్రష్యన్ సేనాని యుద్ధ తంత్రాన్ని అలవరచుకొని కౌంటర్ రివల్యూషన్‌ను అణచేశాడు.

1922లో లెనిన్‌కు మొదటిసారి గుండె జబ్బు వచ్చినప్పుడు స్టాలిన్ ట్రోట్ స్కిలమధ్య తీవ్ర విభేదాలు చోటుచేసుకొన్నాయి. రెండేళ్ళ తర్వాత లెనిన్ మరణంతో విభేదాలు తారా స్థాయికి చేరాయి. స్టాలిన్ సమర్ధత, నిశ్చయ నిర్ధారణను లెనిన్ నమ్మినా, అతని లక్ష్యాన్ని నమ్మలేకపోయాడు. తన విల్లులో లెనిన్ "కామ్రేడ్ స్టాలిన్ పార్టీకి జనరల్ సెక్రెటరీగా ఉండి, అధికారాన్ని అంతా హస్త గతం చేసుకొన్నాడు. కాని ఆ అధికారాన్ని ఎలా సద్వినియోగం చేయవచ్చో అతనికి తెలియదు. అతను చాలా క్రూర మోటు మనిషి. అతని తప్పుల్ని సమర్ధించలేను. అతనిని తప్పించమని పార్టీ సభ్యులని కోరుతున్నాను. అతని స్థానంలో విధేయుడు, నెమ్మదైనవాడు, చంచలత్వం తక్కువగా ఉన్న మరొకరిని నియమించండి. కామ్రేడ్ ట్రోట్ స్కి ఇవన్నీ కలిగి ఉన్నవాడని, పార్టీ ప్రెసిడెంట్‌కు సమర్ధుడని, ఆత్మ విశ్వాసం ఉన్న వ్యక్తి అని, నిర్వహణ బాధ్యత బాగా ఉన్నవాడని నా నమ్మకం" అని రాశాడు.

లెనిన్ మరణానంతరం స్టాలిన్, జినోవీవ్, కామేనోవ్ అనే త్రయం ఏర్పడింది. ట్రోట్ స్కికి ఇందులో చోటు లేదు. కాలం గడుస్తున్న కొద్దీ స్టాలిన్ ఒక గ్రూప్‌ను మరొక గ్రూప్‌పై ఉసి గొలుపుతూ వినోదం చూస్తూ ట్రోట్ స్కి సమ్మతిని విస్మరించాడు. చాలా బలీయమైన చురుకైన రాజకీయవేత్తగా, నాయకుడై తనను ఎవరూ ధైర్యంగా ఎదిరించలేని పరిస్థితి కలిగించాడు. ట్రోట్ విస్కీ ప్రపంచ వ్యాప్త విప్లవం వస్తుందని కలలు కంటున్నాడని అది అసాధ్యమని, అన్ని విప్లవాత్మక ప్రయత్నాలు ఒక్క దేశం యొక్క సోషలిజం వల్లనే సాధ్యమనీ జనాలకు చెప్పి ఒప్పించాడు. ఆ దేశమే రష్యా అన్నాడు. ట్రోట్ స్కికి అర్ధమైపోయింది స్టాలిన్ వ్యక్తి గత సుగుణాలతో కాకుండా

అవ్యక్త యంత్ర సామర్ధ్యంతో పూర్తి అధికారాలను గుప్పిట్లో పెట్టుకొన్నాడని గ్రహించాడు. "స్టాలిన్ ఆ యంత్రాన్ని తయారు చేయలేదు, కాని దాన్ని స్వాధీనం చేసుకొన్నాడు" అని "స్టాలిన్–యాన్ అప్రైసల్ ఆఫ్ ది మాన్ అండ్ హిస్ ఇన్ఫ్లుయెన్స్" పుస్తకంలో రాశాడు ట్రోట్ స్కీ. మనిషిని తెలివి తేటలతో దగ్గరకు చేర్చుకోడనీ, నీచ నికృష్ట, హేయ, నీతి బాహ్య విధానాలతో లొంగ దీసుకొంటాడనీ కూడా రాశాడు. బానిసత్వ దేశాన్ని విమోచనం చేయటానికి ఎంతో కృషి చేసిన ట్రోట్ స్కిని దేశ బహిష్కరణ చేశాడు స్టాలిన్. 12ఏళ్ళ తర్వాత ట్రోట్ స్కి మెక్సికోలో హత్య చేయబడ్డాడు. ఇనుప తెర రష్యాలో ఉక్కు మనిషి స్టాలిన్ పాలన ప్రారంభమైంది.

ఉగ్రవాద పాలన (రీన్ ఆఫ్ టెర్రర్) 1930లో మొదలైంది. రెడ్ ఆర్మీ జనరల్ స్టాఫ్‌కు చెందిన వేలాది మంది, చిన్న రైతులు, స్టాలిన్‌ను విమర్శించేవారు అందరూ చంపబడ్డారు. అంతకు రెట్టింపు మందిని జైల్లో పెట్టారు. లెనిన్ అనుకూలురులలో చాలామందిని ప్రక్షాళన చేశారు. జినోవీవ్ తర్వాత వచ్చిన సెర్జీ కిరోవ్ హత్య చేయబడ్డాడు. కొద్దికాలానికి తూతూ మంత్రంగా విచారణ (పర్జ్ ట్రయల్) 1937 దాకా జరిపించారు. లెనిన్ అనుచరులు, అభిమానులు, రివల్యూషన్‌లో పాల్గొన్నవారు, ప్రచారకులు, ఉన్నతాధికారులు అందరూ అవినీతి బూర్జువాలకు తొత్తులని, నాజీ జర్మనీతో చేతులు కలిపి దేశంలో కేపిటలిజం తెచ్చే కుట్ర చేస్తున్నారని అభియోగం మోపారు. దేశభక్తితో రివల్యూషన్‌లో పాల్గొన్న వారిని, వారి కుటుంబాలవారినీ ద్రోహులని, దేశంలో అభద్రతా వాతావరణాన్ని సృష్టిస్తున్నారని నిందమోపి, విచక్షణా రహితంగా ఏరి పారేస్తున్నారు. ప్రముఖ సైనికాధికారుల్ని ఉరితీస్తున్నారు. లక్షలాది ప్రభుత్వ అధికారుల్ని, పార్టీ సభ్యులని కుట్రదారులు, ఫాసిస్ట్‌లూ అని ముద్రవేసి చడీచప్పుడూ కాకుండా చంపేసి (కోల్డ్ బ్లడేడ్ మర్డర్), ప్రవాసంలోకి చాలామందిని పంపేశారు. విచారణలన్నీ చాలా రహస్యంగా జరిగేవి. నేరాన్ని బలవంతంగా ఒప్పుకొనేట్లు చేసే ప్రయత్నాలు ఎక్కువయ్యాయి. ట్రోట్స్కిని ఆయన పరోక్షంలో విచారణ జరిపి, ఆయన్ను, విధానాలను ఖండించారు. బోల్షెవిక్ విప్లవాన్ని మోస్తున్నట్లు, సోవియట్ పాలన మొదలైనట్లు భ్రమ కలిగించి దేశ ద్రోహుల సాయంతో దేశద్రోహుల కోసం నాటకమాడారని "న్యూయార్క్ టైమ్స్ రాసింది". "మిత్రత్వం" (బ్రదర్ హుడ్) అనే మాట పరిహాస పదమైపోయింది. వర్గ రహిత సమాజం అన్నది పగటికలే అయింది. కొన్ని ప్రక్షాళన విచారణల తర్వాత సమాజంలో అన్ని తరగతులవారు భయం, క్రూరత్వం హింసలకు గురైపోయారు.

ఈ హింసా దౌర్జన్యాలన్నీ స్టాలిన్ చేయించినవే అని నమ్మకం కలిగినా, ఆయన్ను చూస్తే మాత్రం అంతటి రక్త పిపాసి అని అనిపించదు. ముఖంలో ఆభావాలేవీ వ్యక్తీకరించదు. సాధు స్వభావమైన గుండ్రని ముఖంతో, తీగల్లాంటి జుట్టుతో,

ప్రీతిపాత్రమైన వాల్రస్ లాంటి మీసంతో, అయిదు అడుగుల ఆరంగుళాలు మాత్రమే ఉన్న ఎత్తుతో బలిష్టంగా దాదాపు 190 పౌండ్ల బరువుతో ఉండేవాడు. చేతులు ఆయన బుర్ర అంత గట్టిగా పొడవుగా ఉండేవి. "ఆకర్షణీయం కాని మనిషి. కాని కళ్ళల్లో ఏదో వెలుగు, ముఖంలో స్పష్టత కనిపిస్తాయి. పొడగరి కాకున్నా మహా బలవంతుడు అనిపిస్తాడు. ఆ మొగానికి నల్లని కళ్ళే అందం, ఆకర్షణ. అన్ని వేళలలోనూ సామాన్య సైనికుడి దుస్తులనే వేసుకొనేవాడు. చాలా చౌక రకం పైప్‌నే పీల్చేవాడు. చదరంగ ఘనాపాటి స్టాలిన్. ఆట విడుపుకోసం చెస్ ఆడేవాడు. కాని ఆప్యాయత ప్రేమ ఉన్న తండ్రి, తన పిల్లలను సామాన్య పిల్లల్లాగానే పెంచాడు. "స్టాలిన్ ఇంట్లో ఒక బెడ్ రూమ్, ఒక డైనింగ్ హాల్, పని చేసుకొనే గది, స్నానాల గది మాత్రమే ఉన్నా డాబుసరిగా ఉంది" అని చర్చిల్ చెప్పాడు.

స్టాలిన్ వ్యక్తిగత జీవితం రహస్యమైనది. మొదటిభార్య ఎకటారినాస్వాండిజ్ ఒక కొడుకు జాకబ్‌ను కన్నది. అతను రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మన్ వార్ ప్రిజనర్ అయ్యేదాకా అతని గురించి లోకానికి తెలియనే తెలియదు. 1907లో భార్య చనిపోతే పన్నెండు ఏళ్ళ తర్వాత నాద్యాఅలిలూయేవాను రెండో పెళ్లి చేసుకొన్నాడు. ఆమె ఆయనతో రివల్యూషన్‌లో పాల్గొన్న సహచరుని 19ఏళ్ళ అమ్మాయి. వీరికి పుట్టిన కొడుకు వాసిలి సోవియెట్ ఎయిర్ ఫోర్స్‌లో లెఫ్టినెంట్ జనరల్. అందమైన ఎర్ర జుట్టు కూతురు స్వెత్లానా. రెండోభార్య 1932లో మిస్టరీగా ఆత్మహత్య చేసుకొని చనిపోయింది. మూడో భార్య కగనోవిచ్ గురించి లోకానికేమీ తెలియదు.

జరిగిన, జరుగుతున్న హింస దౌర్జన్యాలకు స్టాలిన్‌పైనే నెపం వేసినా, స్టాలిన్ వ్యతిరేకులు కూడా ఆయన కొన్ని మంచి పనులు చేశాడని అంటారు. పీటర్ ది గ్రేట్ తర్వాత సోవియెట్ యూనియన్‌ను అంతగా అభివృద్ధి చేసిన వారెవరూ లేరు. ఒక్క స్టాలిన్ మాత్రమే ఆపని చేయగలిగాడు. పంచవర్ష ప్రణాళికలు రచించి చక్కగా అమలు పరచి క్రూర అనాగరిక. దేశాన్ని సాంఘిక ఆర్థిక రంగాలలో అభివృద్ధిపరచి ఆధునిక రష్యాగా మార్చాడు. లెనిన్ కోరినట్లుగా విద్యుత్ అవసరాన్ని గుర్తించి, వెయ్యిమంది నిపుణులతో అధ్యయనం చేయించి దాని సారాంశాన్ని కాచి వడపోసి, టెక్నీషియన్‌లతో పని చేయించి గొప్ప విద్యుత్ ప్రణాళికతో పారిశ్రామిక దేశంగా రష్యాను నిలబెట్టాడు. ఊసర క్షేత్రాలను సస్య శ్యామలం చేశాడు. ఎద్దుల బదులు ట్రాక్టర్ వ్యవసాయం ప్రవేశపెట్టి, పూర్వం డజన్ ఎకరాలలోపాత పద్ధతులలో పండేపంటను ఆధునిక విధాన అవలంబన వలన ఒక్క ఎకరంలోనే పండేట్లు చేసి, సస్య విప్లవమూ తెచ్చాడు. సమైక్య వ్యవసాయ నినాదంతో ముందుకు సాగుతూ దీన్ని వ్యతిరేకించే భూస్వామ్య, రైతు, వ్యవసాయ దారులను కఠినంగా శిక్షించాడు. వారి భూములను పేదరికంతో

అలమటిస్తున్న బడుగు రైతులను ఆక్రమించి దున్నుకోమన్నాడు. విద్యా, మిలిటరీ విధానాలలో సమూలమైన మార్పులు తెచ్చాడు. జార్ రాజుల పాలనలో 79 శాతం ఉన్న నిరక్షరాస్యతను 10 శాతానికి తగ్గించగలిగాడు. సాంకేతికత ఇస్తున్న సత్ఫలితాలకు ఆకర్షింపబడి జనం సైన్స్ చదవటానికి ఉత్సాహంగా ముందుకు వచ్చారు. 1916లో రష్యాలో కేవలం 200 లాబరేటరీలు మాత్రమే ఉండేవి. ఇరవై ఏళ్ళ తర్వాత వాటి సంఖ్య గణనీయంగా 2,0 00కు పెరిగింది. విప్లవ అభ్యుదయం శాంతిని ఇవ్వదు అని భావించి యుద్ధానికి సన్నద్ధయ్యాడు స్టాలిన్.

ఈలోగా స్టాలిన్ పూర్తి నియంత అయ్యాడు. ఖచ్చితమైన ఆటవిక సెమి ఓరిఎంటల్ అయ్యాడు. ఆయన్ను అప్పుడు "టెలిఫోన్ ఉన్న చెంగిజ్ ఖాన్" అన్నారు. రెం ప్ర.యు.వస్తుందని ఊహించి రష్యా దానిలో భాగస్వామి కాకూడదని నిర్ణయించాడు. నాజీల బెదిరింపులు చూసి, తన దౌత్యవేత్తలను పిలిపించి హిట్లర్‌తో చర్చలు జరిపించి పరస్పర ఆక్రమణ దాడులకు స్వస్తి చెప్పే ఒడంబడికపై సంతకం చేశాడు. కాని హిట్లర్ దీన్ని అతిక్రమించి అతి వేగంగా రష్యాపై దాడికి దిగటంతో జర్మన్లను ఆపటం అసాధ్యం అని గ్రహించాడు. హిట్లర్ వరుసగా నగరం తర్వాత నగరం ఆక్రమిస్తున్నాడు. రష్యా గుండెకాయ మాస్కో ముంగిట్లో వాలి దాడికి సిద్ధమయ్యారని తెలిసి అత్యంత ప్రతిభావంతంగా చురుగ్గా బెదురు లేని యుద్ధ నిపుణుడుగా అవతారం ఎత్తాడు. ప్రభుత్వం రక్షణకోసం కూబి షేవ్‌కు వెళ్ళగా స్టాలిన్ కొద్దిమంది అధికారులతో క్రెమ్లిన్‌లోనే ఉండిపోయాడు. జర్మన్లు శీతాకాలంలో గోతులు త్రవ్వటానికి ముందే భూమిని మండించే విధానం అవలంబింపజేసి, వాళ్లకు నిలువ నీడ లేకుండా చేసి గత్యంతరం లేక జర్మనీ సైనికులు వెనక్కి తిరిగి వెళ్లిపోయేట్లు గొప్ప వ్యూహం పన్ని దాదాపుగా నెపోలియన్ అనుభవించిన పరాజయ పరాభవాన్ని హిట్లర్‌కూ జర్మనీకి కలిగించి బుద్ధి చెప్పాడు. రెండేళ్ళ తర్వాత హిట్లర్ కొత్త బలగాలతో స్టాలిన్ గ్రాడ్‌ను చుట్టు ముట్టాడు. ఎన్ని ఇబ్బంది లెదురైనా తన సైన్యాన్ని వెనకడుగు వేయవద్దని చాలా కఠినంగా ఆదేశించాడు. దాదాపు మూడు లక్షల జర్మన్ శత్రు సైన్యంపై మెరుపు దాడులు జరిపి వెనక్కి నెట్టేసి స్టాలిన్ ప్రపంచ చరిత్రలోనే మహాద్భుత యుద్ధ విజయాన్ని సాధించాడు. ఈ విజయమే ఆ తర్వాత సంకీర్ణ దేశాల యుద్ధ విజయానికి దారి చూపింది. చరిత్రలో స్టాలిన్ ఉక్కు మనిషి అని నిరూపించుకొన్నాడు మళ్ళీ. హిట్లర్ పప్పులు స్టాలిన్ ముందు ఉడకలేదు.

"బిగ్ త్రీ" అనబడే మూడు దేశాల ప్రెసిడెంట్‌లు టెహ్రాన్, యాల్టా, పాట్స్ డాంలలో జరిపిన చర్చలు ఫలించి పరస్పర సైన్య ఆర్థిక సహకారంతో భవిష్యత్తులో కలిసి పని చేయాలని ఉక్కు తెర రష్యా మిగిలిన ప్రజాస్వామిక ప్రభుత్వాలు అంగీకారానికి వచ్చాయి. అలానే కలిసి పోరాడి జర్మనీ దాని అక్ష దేశాలపై పోరాటం జరిపి హిట్లర్ పతనాన్ని

తెచ్చి నాజీ నియంతృత్వానికి మంగళగీతం పాడాయి. యుద్ధం తర్వాత వీరిలో వీరికి పరస్పర అనుమానాలు అపనమ్మకం ఏర్పడి నమ్మకాలు సడలి చర్చిల్ చెప్పినట్లుగా రష్యా "ఇనుప తెర"ను వేసుకొని మిగిలినవారికి ప్రవేశం లేకుండా చేసింది. పశ్చిమ దేశాల శక్తితో చేతులు కలపలేదు. తర్వాత సోవియెట్ రష్యా అమెరికాతో యాల్టా సమావేశంలో కలిసి రష్యాకు పూర్తి వీటో హక్కు ఇవ్వాలని స్టాలిన్ గట్టిపట్టు పట్టాడు. దాన్ని సాధించి తరచుగా వీటో పవర్‌తో గేములాడి అమెరికా ముందరి కాళ్ళకు బంధంవేసి దాని అభివృద్ధికి ఆటంక పరచాడు. ఇతర దేశాలపై అమెరికా దాని అనుచర దేశాలు అనవసర దాడులకు దిగకుండా కట్టడి చేయగలిగాడు. ప్రపంచ సమస్యలపై సహకార విధానానికి అడ్డుగా నిలిచాడు.

అన్ని అధికారాలు స్టాలిన్ హస్తగతం అయ్యాయి. సోవియెట్ ప్రభుత్వం ఏర్పడిన మొదట్లో సంవత్సరానికి నాలుగుసార్లు పార్టీ మీటింగులు జరిగేవి. 1925 నుంచి 1939 వరకు ఉన్న 14 ఏళ్ళలో నాలుగు మీటింగ్‌లే జరిగాయి. 1939 తర్వాత అసలు జరగనే లేదు. దేశ స్థిరత్వానికి స్టాలిన్ విపరీతంగా ప్రచారం నిర్వహించాడు. స్టాలిన్‌కు కమ్యూనిజాన్ని వ్యాప్తి చేసే ఉద్దేశ్యం కంటే ప్రపంచానికి రష్యా నాయకత్వం కావాలని ప్రయత్నించాడు. కార్పతో యుక్రెన్ రష్యాలో కలిసిపోయాక పోలాండ్, హంగేరి, యుగోస్లోవియ బల్గేరియా జెకోస్లోవేకియాలు స్టాలిన్ నియంత్రణలోకి వచ్చాయి. ఈ దేశాలలోని నాన్ కమ్యూనిస్ట్ పార్టీలన్నిటి అస్తిత్వాన్ని దెబ్బతీశాడు. ఈ "సాటిలైట్" దేశాలను గ్రిప్‌లో ఉంచుకోవటానికి కొంత హింస తప్పలేదు, జెకోస్లోవేకియా విషయంలో ఇదే జరిగింది. 1948లో మార్షల్ టిటో స్టాలిన్‌తో విభేదించి ఆ దేశం కమ్యూనిస్ట్ దేశమే అయినా క్రెమ్లిన్ ఆదేశాలను "బే ఖాతర్" చేసింది. ఈ దేశాలు జారిపోకుండా ఉండటానికి స్టాలిన్ ఆ దేశాధిపతుల మాట వినాల్సిందేనన్నాడు. ఇప్పటి దాకా ప్రాముఖ్యమున్న అగ్రశ్రేణి కమ్యూనిస్ట్ నాయకులైన రుమేనియాలోని అన్నా పాకేర్, జెక్ లోని స్లాన్కీ, పోలాండ్‌లోని గోముల్క్, హన్గేరిలోని రాజ్క్ బల్గేరియాలోని కొస్తోవ్‌లను ప్రక్షాళనం చేశాడు.

ఈ రకమైన అననుకూల పరిస్థితులు "కోల్డ్ వార్" ప్రచ్ఛన్న యుద్ధానికి దారి తీశాయి. స్టాలిన్ అందుబాటులో ఉండక, అవిధేయుడుగా ఉండిపోయాడు. మార్షల్ ప్లాన్‌లో భాగస్వామి కాలేదు. తన దేశానికి ఆర్థిక సాయం చాలా అవసరం. ఎన్నో ఫాక్టరీల అస్తిత్వం ప్రశ్నార్థక మౌతోంది. యుద్ధాలవల్ల నిత్యావసర వస్తువులు దొరకటం లేదు. దొరికినా విపరీతమైన ధరలతో జనం అల్లల్లాడి పోతున్నారు. వ్యవసాయ ఉత్పత్తి అడుగంటింది. కాని రష్యా అద్భుతమైన విమానాలు, సబ్ మేరీన్లు, జెట్ యుద్ధ విమానాలు, గైడెడ్ మిసైల్, అటామిక్, హైడ్రోజెన్ బాంబ్‌లను తయారు చేసింది. పశ్చిమ దేశాలు దీన్ని వ్యతిరేకించాయి. నిరసనలు తెలిపాయి. శాంతి సమావేశం స్టాలిన్‌కు

ఇష్టం లేదు. "sincere diplomacy is no more possible than dry water or iron wood" అన్నాడు. "హౌ రష్యా ఈజ్ రూలేడ్" అనే పుస్తకంలో "మిర్లీ ఫైన్సాడ్" పార్టీలో నాయకుల మధ్య ఉన్న పరస్పర ద్వేషం, పార్టీ నాయకత్వంపై అవిశ్వాసం, రహస్య పోలీస్ దళం, పాలనా వ్యవస్థ, సైన్యం పారిశ్రామిక నిర్వహణ స్టాలిన్‌కు కలిసి వచ్చాయి. పార్టీలోని గ్రూపులు తోలు బొమ్మలాట వంటివికావు చాలా శక్తివంతమైనవి. వీటిని నిర్వీర్యం చేసి పాలించాడు స్టాలిన్. మరొక ఆయన "Stalin' workers state was a combination of the economic exploitation of early capitalism with the political terror of modern totalitarianism" అని స్టాలిన్ పాలనలోని రష్యా గురించి అన్నాడు. రష్యా ప్రజలకు స్టాలిన్ పాలనకు మధ్య స్పష్టమైన విలక్షణత ఉంది. దీన్ని వివరిస్తూ స్టీవెన్ "the problems created in a decent people by the forced maintenance of power will some how in the end destroy that power" అని హెచ్చరించాడు.

"అధికారం అవినీతికి నిలయమౌతుంది. పూర్తి అధికారం పూర్తి అవినీతికి నిలయమౌతుంది" అని ఎప్పుడో లార్డ్ యాక్టన్ చెప్పాడు. స్టాలిన్ సర్వాధికారి అయ్యాడు. స్టాలిన్ చర్చలు జరిపి సమస్యలను పరిష్కరించాడు. స్టాలిన్ రెండో అభిప్రాయానికి అవకాశం, విలువ ఇవ్వలేదు. విరుద్ధా భిప్రాయమేర్పడితే దాన్ని ఫిరాయింపు అని ముద్ర వేసేవాడు. వారితో బహిరంగంగా క్షమాపణ చెప్పించేవాడు. కళ సంగీతం సాహిత్యం స్టాలిన్ దయా దాక్షిణ్యాల మీదనే ఆధారపడ్డాయి ఆయనకెవరు నచ్చితే వారికి సత్కారం. "state is not meant to be of service to the individual, but that, on the contrary man was meant to serve the state" అన్నది స్టాలిన్ అభిప్రాయం.

70వ ఏడు వచ్చేసరికి స్టాలిన్ వ్యక్తినిష్ఠ పూర్తిగా పెరిగింది. ప్రతి మ్యూజియం, ప్రభుత్వ ప్రతి బిల్డింగ్ అందులోని, ప్రతిగది అయన చిత్రపటం వేలాడేట్లు చేసుకొన్నాడు. ఆయన విగ్రహాలు ఎక్కడ పడితే అక్కడ పెట్టించుకొన్నాడు. ప్రతి స్కూల్‌లోనూ ఆయన విగ్రహాలను విద్యార్థులు చూసేట్లు ఏర్పాటు చేశాడు. ఆయన ఉద్దేశ్యం ఎక్కడ చూసినా స్టాలిన్ కనపడాలి, ఆయన దృష్టికి రాని విషయం ఉండకూడదు అని. ప్రపంచ జనాభాలో మూడవవంతు ఉన్న రష్యాకు ఆయన సర్వాధికారి. కనుక ఆయన్ను అందరూ పొగడాలి. మెచ్చుకోవాలి. ఆ ప్రజల భాగ్య విధాత స్టాలిన్ అని అబ్బురపడాలి. 1953లో స్టాలిన్‌కు మొదటిసారి గుండెపోటు వచ్చింది. దాన్ని రహస్యంగా ఉంచి అత్యధిక శ్రద్ధతో మందులతో నివారించారు. రెండవసారి వచ్చింది బ్రెయిన్ హేమరేజ్‌కు దారి తీసి చావు ముంగిట్లోకి వెళ్ళాడు. శక్తివంతమైన వైద్య విధానాలేవీ పని చేయలేదు. నాలుగు

రోజుల తర్వాత రక్త ప్రవాహం క్షీణించి 5-3-1953న నియంత స్టాలిన్ మృత్యు కౌగిలి చేరాడు. 74వ ఏడు రాకుండానే, 29 ఏళ్ళు అధికారం చెలాయించి స్టాలిన్ మరణించాడు.

రష్యాలో స్టాలిన్ కంట్రోల్‌లో సైన్స్ టెక్నాలజీ ఆర్ట్, సాహిత్యం అన్నీ నడిచాయి. అగ్రానమిస్ట్ ట్రోఫిం లిసేంకో మాటలకు విలువ ఇవ్వక, మాండలిన్ జెనెటిక్స్‌ను కాదని లేమేర్కియాన్ ఇంహరిటేన్స్‌కు ప్రాధాన్యమిచ్చి హైబ్రేడేషన్‌ను ప్రోత్సహించాడు. బయాలజీపై పూర్తి అవగాహన లేనందున రష్యా వ్యవసాయ ఉత్పత్తి బాగా తగ్గిపోయింది. సైంటిస్ట్‌లందరూ వ్యతిరేకించి వీధిపోరాటం చేశారు. ఆధునిక జెనెటిక్స్ మార్గదర్శి నికోలాయ్ వావిలోవ్‌తో సహా అరెస్ట్ చేసి అంతం చేశాడు.

మగపిల్లలతో సమానంగా ఆడపిల్లకు ఉచిత విద్య ,ఉద్యోగం సంక్షేమం కల్పించాడు. ఆరోగ్య రక్షణ కల్పించి జీవన పరిమితి పెంచాడు. టైఫాయిడ్, కలరా మలేరియాలు రాకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకొన్నాడు. వందలాది విదేశీ ఇంజనీర్లను ఆహ్వానించి దేశ పురోభివృద్ధిలో భాగస్వాములను చేశాడు. స్త్రీ సంక్షేమాన్ని పకడ్బందీగా అమలు చేశాడు. స్త్రీలు హాస్పిటల్‌లో కనే ఏర్పాటు చేసి, సకల సౌకర్యాలు కల్పించాడు. రవాణా సౌకర్యాలు వృద్ధి చేసి అనేక కొత్త రైలు మార్గాలు నిర్మించాడు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత రష్యా మహిళ అన్నిటా అగ్రగామి అయింది.

పుట్టుక తో జార్జియన్ అయినా రాజకీయంలో ఆరితేరి రష్యన్ జాతీయతనే అనుసరించాడు. రష్యా చరిత్ర, సంస్కృతీ నాయకుల వారసత్వాలను నిలబెట్టాడు. రష్యేతర మైనారిటీలకంటే రష్యా ప్రజలు పెద్దన్నయ్యలు అనేవాడు. పెయింటింగ్ శిల్పం సంగీతం, సాహిత్యాలలో అప్పటిదాకా వ్యాపించిన ఎక్స్ పెరి మెంటలిజం ఆబ్స్ట్రాక్ట్ ఆర్ట్ మొదలైన వాటిని నిరుత్సాహ పరచి "సోషలిస్ట్ రియలిజం"కు ప్రాధాన్యమిచ్చాడు. ఆయనకు బహు ఇష్టమైన నవల "ఫారో". జార్జియన్ సాంప్రదాయ కుటుంబంలో జన్మించినా మతాన్ని కాదని ఎథీస్ట్ అయ్యాడు. ప్రభుత్వమూ దీనినే ప్రోత్సహించింది. మత సంబంధ కట్టడాలను ప్రోత్సహించలేదు. 1945, 48లలో రెండు సార్లు స్టాలిన్ నోబెల్ బహుమతికి నామినేట్ అయ్యాడు. కాని రాలేదు.

మూడు లక్షల పోలిష్ ప్రజలను బందీలను చేసి అందులో 25వేల మందిని చంపేశాడు. యుద్ధానికి చెందిన అనేక వివాదాస్పద ఆర్డర్లు జారీచేశాడు. జపాన్ చేతుల్లోంచి కొరియాను స్వాధీనం చేసుకొన్నాడు. స్టాలిన్‌కు మావోకు విభేదాలుండేవి. స్టాలిన్ చాంగ్‌కై షేక్‌ను సమర్థించాడు. చియాంగ్‌ను మావో ఓడించాక స్టాలిన్ మావోను సమర్థించాడు. ఇజ్రాయిల్ ఏర్పాటును బాగా సమర్థించి, అక్కడ ప్రభుత్వం ఏర్పడగానే దాన్ని మొదటిసారిగా గుర్తించాడు. గోల్డా మేయర్ మొదటి విదేశాంగ మంత్రిగా

రష్యాలో పర్యటించింది. జెక్ ద్వారా ఇస్రాయిల్‌కు ఆయుధ సామగ్రి అందించి, తర్వాత "తూ నా బొడ్డూ" అన్నాడు. రష్యా ప్రచ్ఛన్న యుద్ధంపై వచ్చిన "ఫాల్సి ఫయర్స్ ఆఫ్ హిస్టరీ" పుస్తకాన్ని ఎడిట్ చేసి కొంత తానూ అందులో రాశాడు. "At the end of May 1945, Stalin proposed a victory toast to the Soviet people, and to the virtues of the Russian majority in particular:

I should like to propose a toast to the health of our Soviet people, and in the first place, the Russian people. (Loud and prolonged applause and shouts of (Hurrah!')

I drink in the first place to the health of the Russian people because it is the most outstanding nation of all the nations forming the Soviet Union.

I propose a toast to the health of the Russian people because it has won in this war universal recognition as the leading force of the Soviet Union among all the peoples of our country.

I propose a toast to the health of the Russian people not only because it is the leading people, but also because it possesses a clear mind, a staunch character, and patience.[283] అని విక్టరీ టోస్ట్ తీసుకొన్నాడు.

స్టాలిన్ చనిపోయాక ఏర్పడిన "కిస్సా కుర్సీ కా"ఆటలో ఎందరో పోటీ పడినా చివరికి 1958లో పూర్తి అధికారాలను దక్కించు కొన్నవాడు కృశ్చేవ్. "మర్డరస్ టిరంట్" అని రష్యా ప్రజలు స్టాలిన్ ను అన్నా ఇప్పటికీ ఆయనకు వోటు వేసేవారి శాతం 35 ఉంది అంటే ఆశ్చర్య మేస్తుంది .2008 లో రష్యన్ టెలివిజన్ నిర్వహించిన "నేం ఆఫ్ రష్యా "పోటీలో స్టాలిన్ మూడవ వ్యక్తిగా ఎంపికయ్యాడు.

తాను తాగుతూ చుట్టూ ఉన్న వాళ్ళతోబలవంతంగా తాగించటం స్టాలిన్ వేడుక .రష్యన్ వోడ్కా కంటే జార్జియన్ వైన్ ఇష్టపడే వాడు .స్టాలిన్ కు అమెరికన్ కౌ బాయ్ సినిమాలు చాలా నచ్చేవి అని కృశ్చేవ్ చెప్పాడు .స్టాలిన్ పొందిన బిరుదులూ చాలా ఉన్నాయి అందులో కొన్ని– హీరో ఆఫ్ ది సోవియెట్ యూనియన్, హీరో ఆఫ్ ది సోషలిస్ట్ లేబర్, ఆర్డర్ ఆఫ్ విక్టరి, ఆర్డర్ ఆఫ్ లెనిన్, మెడల్ ఫర్ విక్టరి ఓవర్ జర్మని, ఆర్డర్ ఆఫ్ ది రెడ్ స్టార్, హీరోఆఫ్ ది మంగోలియన్ పీపుల్ రిపబ్లిక్. స్టాలిన్ కవిత్వంతోపాటు 14 రచనలు చేశాడు. ఏది ఏమైనా రష్యాలో స్టాలిన్ ఒక లెజెండ్ అన్నది మాత్రం యదార్థం.❀



## 66. జీవిత చరిత్ర రచనలో కొత్త దారులు తొక్కిన బ్రిటిష్ రచయిత- లిట్టన్ స్ట్రాచీ (1880 -1932)

చారిత్రిక జీవిత చరిత్రలను విప్లవాత్మకంగా మార్చి కొత్త ప్రమాణాలు సృష్టించిన బ్రిటిష్ రచయిత లిట్టన్ స్ట్రాచీ. సిగ్గరి అయిన ఆయన ఎప్పుడూ తల్లిని అంటి పెట్టుకొనే ఉండేవాడు. గడకర్రలాగా బారుగా పూచిక పుల్లలాగా అతి సన్నంగా ఉండేవాడు. తమాషాగా ఉండే వెలవెల బోయే చర్మం, తీక్ష్ణమైన దృక్కులు విలక్షణంగా ఉండి మరింత ఆశ్చర్యం కలిగించేవి. ఎడ్వర్డ్ లియర్ లిమరిక్కులు గుర్తుకొస్తాయి అతన్ని చూస్తే. కొందరు రచయితలతో “బ్లూమ్స్ బరి గ్రూప్” ఏర్పడింది. అందులో సభ్యుడే అయినా పెద్దగా మాట్లాడకుండా, శ్రద్ధగా వింటూ “గూని వాడు”లాగా ఒక మూల కూర్చునేవాడు. కళ్ళకు అద్దాలు, గడ్డాలు మీసాలుతో ఎప్పుడూ వింటున్నా అవసరం వచ్చినప్పుడు యెగిరి గంతేసి అభిప్రాయం చెప్పేవాడు. కుటుంబ వ్యవస్థలోనే ఉండాలనుకోనేవాడే కాని అసలు పెళ్ళే చేసుకోలేదు.

లండన్‌లో 1-3-1880న లండన్‌లో లిట్టన్ స్ట్రాచీ ఒక అసాధారణ కుటుంబంలో జన్మించాడు. ఇండియన్ అడ్మినిస్ట్రేటర్ అయిన జనరల్ సర్ రికార్డ్ స్ట్రాచీ కుమారుడు. ప్రఖ్యాత వ్యాస రచయిత అయిన లేడీ జెన్ స్ట్రాచీ, స్పెక్టేటర్ పత్రిక సంపాదకుడులో స్ట్రాచీ, పొలిటికల్ ఎకనామిస్ట్ జాన్ స్ట్రాచీ ఆయన కజిన్స్. కేంబ్రిడ్జిలో ట్రినిటి కాలేజిలో చేరి, తాను రాసిన కవిత్వానికి బహుమతి రావటంతో ప్రసిద్ధుడయ్యాడు. అతని సంప్రదాయబద్ధ కవిత్వంతో ముగ్ధులైన న్యాయ నిర్ణేతలు భవిష్యత్తులో ఆ సంప్రదాయాన్ని

తుత్తునియలు చేస్తాడని ఊహించలేదు. గ్రాడ్యుయేషన్ పూర్తికాగానే నాజూకైన సంప్రదాయ కవిత్వాన్ని వదిలేసి కత్తిపోట్ల వంటి వచనం రాయటం మొదలెట్టాడు. రాసింది ప్రతిదీ ఆలోచనాత్మకంగా ఉండేది. మొదటి పుస్తకం అచ్చు అయ్యే నాటికి అతనికి 32 ఏళ్ళు. 40వ ఏట ఆతను రాసిన వ్యాసాలన్నీ కలిపి "ఎమినంట్ విక్టోరియన్స్" పేరిట వెలువడ్డాయి. ఇది గోప్పకలవరాన్నే సృష్టించింది. వింత జీవిత చరిత్ర అధ్యయన వ్యాసాలే అవి. బాధాకర, విచారణాత్మక, కాపట్య, ఆటవిక వ్యాసాలే. తిరుగుబాటు కుర్ర కారుకు హుషారు పుట్టించి, ఆకర్షించాయి. ఇక్కడే ఆయనలోని విలక్షణ చరిత్రకారుడు బయటికొచ్చి కళాత్మక జీవితచరిత్ర రచనకు ఆద్యుడయ్యాడు. సెన్సేషన్ సృష్టించి పాప్యులర్ అయ్యాడు. జీవిత చరిత్ర రచనా విధానానికి విస్తృత పరిధి కల్పించాడు. ఆతను రాసిన "క్వీన్ విక్టోరియ", "పోప్", "ఎలిజ బెత్ అండ్ ఎస్సెక్స్" రచనలు విప్లవాత్మక, మానసిక విశ్లేషణాత్మక రచనలు. అంతకు ముందు ఎవరూ వీటి జోలికి వెళ్ళలేదు. అందుకే జీవిత చరిత్ర రచనలో "ట్రెండ్ సెట్టర్" అయ్యాడు. వ్యంగ్యం, హాస్యం హేళనా, అవహేలణా దట్టంగా రంగరించి మహా ఆకర్షణ కలిగించాడు. క్షణం వదలకుండా విపరీతంగా చదివించే లక్షణం అతని ప్రత్యేకత. ఎవరి మీదో కోపం ద్వేషంతో రాసినవి కావు. "It was not with rude iconoclasm, however but with a surgeon', 'detachment and a scholar' précision that he cut through the rigid pietism, the saddled sentiment and the prudish reticences" అంటే ఒక శాస్త్ర చికిత్స వైద్యుడుగా తనకేమీ సంబంధం లేనట్లు, ఒక విద్యా వేత్తకుండాల్సిన ఖచ్చితత్వంతో, కఠిన పీటిజాన్ని, ఉయ్యాల లూగుతున్న సెంటిమెంట్‌ను, నంగనాచి అమాయకత్వాన్ని కోసి శుభ్రం చేశాడు. అనుమాన రహిత సత్యాలను వెలువరించాడు. ముగింపు బాధ్యత తీసుకోకుండా వదిలేశాడు. ఊహా గానాలకు ఎక్కువ అవకాశమిచ్చాడు.

ఫిక్షన్‌లాగా బయాగ్రఫీ కూడా విపరీతంగా చదివించేదిగా ఉండాలని స్ట్రాచీ ముఖ్య ఉద్దేశ్యం. దీనితో ఆయన అనుకున్నది సాధించాడు. అతని నినాదాలు "స్వచ్ఛ సంక్షిప్తత", "నిష్పాక్షిక నిజం", "విమర్శ విచారణకు స్వేచ్ఛ" ఇవి బాగా క్లిక్ అయ్యాయి. ఇవన్నీ ఒక కొత్త ఆలోచనా రచనా విధానానికి మానిఫెస్టో అయాయి. కవిత్వంతో కూర్చిన రచనా విన్యాసంతో వ్యక్తిని పేజీపై ఆవిష్కరింప జేశాడు. కవి పోప్ రాసిన సందర్భోచిత కవితా వాక్యాలను శీర్షికలుగా పెట్టి మాంచి ఊపు, ఉత్సాహం కలిగించి చదివింపజేశాడు.

అయితే స్ట్రాచీపై చాలా అభియోగాలు వచ్చాయి. చరిత్రను నవలలాగా తిరగ

రాశాడు అన్నది ఒక అభియోగం. చనిపోయిన వాళ్ళు రాసినట్లుగా ఉత్తరాలు అందులో రాసి, వాళ్ళెవరూ డిఫెన్స్ చేసుకోలేరు కదా అనే ధర్యంతో పేజీలు నింపాడు అన్నది మరొకటి. కలాన్ని క్రూర నిర్హేతుక ఇంకులో ముంచి గిలికాడు అన్నది వేరొకటి. అతనిది ద్వేషం కాదు, వినాశనమూ కాదు. ఎక్కడ మంచి ఉన్నా గ్రహించాడు. దానిని గీటు రాయితో పరీక్షించి పదును పెట్టిరాశాడు. ఒక ప్రత్యేక శైలి కోసమే శైలి అవలంబించాడు. సాహిత్యంలో ప్రాణం చూశాడు. కేరక్టర్‌లను కారి కేచర్ (వ్యంగ్య పాత్రలు)లుగా మార్చాడు. అదొక ఆర్ట్. తాను రాసిన ప్రతి పాత్రనూ అమితంగా అభిమానించి ప్రేమించి ఆరాధించి మాత్రమే రాశాడు. మొదట్లో క్వీన్ విక్టోరియాను చాలా పొడి పొడి మాటలతో, హేళనగా రాశాడు. తర్వాత సరదాగా మొదలుపెట్టి, క్రమంగా గౌరవ, అభిమాన ఆరాధనలతో పూర్తి చేశాడు.

1944లో మాక్స్ బీర్ బొమ్ స్ట్రాచీలోని రచనా సామర్థ్యాన్ని గూర్చి మాట్లాడుతూ "his pioneering irony, his dramatic and at times melodramatic effectiveness" బాగా ఆకర్షించింది అన్నాడు. చదివేప్పుడు గొప్పఆనందాన్ని కల్గించే లక్షణం స్ట్రాచీలో ఉందనటం పూర్తి సత్యం. అతను ప్రవేశ పెట్టిన మేనరిజంలు కూడా తమాషాగా ఉంటాయి. అతని "పోర్ట్రెట్స్ అండ్ మినీ యేచర్స్ అండ్ బుక్స్ అండ్ కేరక్టర్స్" అనే చిన్న రచనలను చదవటానికి ఎక్కువ ఇష్టపడతారు . "లేడీ హెస్టర్ స్టానాప్ మరో ప్రత్యేకమైనది". 1932లో స్ట్రాచీ 52వ ఏట చనిపోయే నాటికి అతని ప్రభావం ప్రపంచమంతా వ్యాపించి ఉంది. "Strachey 's power of revaluation, incisive skepticism, and challenging imagination, he not only changed the biographers approach, but also made the reader look for the living men and women too often buried in the solidly official biographies" అని చెప్పిన రచయిత లూయీ అంటర్ మేయర్ మాటలు అక్షరసత్యాలు.

ఫ్రాయిడ్ ప్రభావం స్ట్రాచీ రచనలపై బాగా ఉంది. డాస్టోవిస్కీ ప్రభావం మరీ ఎక్కువ. 1916లో లండన్ తిరిగి వచ్చి తల్లితోనే ఉన్నాడు. తన గ్రూప్ బ్లూమ్స్ బెరీ సభ్యులతో తాను హోమో సెక్సువల్ అని తరచుగా చెప్పుకొనేవాడు. పాట్రిడ్జ్ అనే వాడితో మరి కొందరితో ఆ సంబంధాన్ని సాగించాడు కూడా. అందులో సభ్యురాలైన పెయింటర్ డోరాకారింగ్ టన్‌తో అసాధారణ సాన్నిహిత్యం ఉండేది. ఇద్దరూ కలిసి నాలుగేళ్ళు స్ట్రాచీ 1921 మరణం వరకు జీవించారు కూడా. 1921లో ఆమె రాల్ఫ్‌ను పెళ్లి చేసుకోవాలను కొన్నది. ప్రేమతో కాదు, రక్షణ కోసమే. స్ట్రాచీ చనిపోయిన

రెండు నెలలకే ఆత్మహత్య చేసుకొన్నది.

స్ట్రాచీ బ్రతికి ఉండగానే ఆరుపుస్తకాలు -లాండ్ మార్క్స్ ఇన్ ఫ్రెంచ్ లిటరేచర్, ఎమినంట్ విక్టోరియన్స్, క్వీన్ విక్టోరియ, బుక్స్ అండ్ కారక్టేర్స్, ఎలిజబెత్ అండ్ ఎస్సెక్స్, పోర్ట్రైట్స్ అండ్ మినీ యేచర్స్ ప్రచురింప బడ్డాయి. చనిపోయాక 8 పుస్తకాలు కారేక్టర్స్ అండ్ కావేంటరీస్, స్పెక్టే టోరియల్ ఎస్సేస్, ఎర్మిట్రూడ్ అండ్ ఎస్మేరాల్డా, లిట్టన్ స్ట్రాచీ బై హింసెల్ఫ్, ది రియల్లీ ఇంటరెస్టింగ్ క్వేస్చన్, ది షార్టర్ స్ట్రాచీ, లెటర్స్ ఆఫ్ లిట్టన్ స్ట్రాచీ, అన్ పబ్లిషేడ్ వర్క్స్ ఆఫ్ స్ట్రాచీ వచ్చాయి.

His biographical creed was to paint a picture of the person from the author' viewpoint—never mind the scholarly inhibitions, never mind the search to find "the truth" of any human situation so far as is possible. He had a "laughing admiration" for the satirists of the 18th century, like Voltaire (1694-1778). He saw religion as Voltaire saw it, as a "ludicrous anachronism". Careers in public service were mainly full of political intrigue. But human relationships were the nexus of life itself. Strachey eschewed the standard "two fat volumes" of Victorian biographies (he saw these tomes as "hagiographies": treatment of the illustrious dead). He favored for himself brief biographies, the art of which rested on the subject' motive and personality as he saw it.❁



## 67. జర్మన్ జాతీయ భావ సోషలిజం వ్యాప్తి చేసిన – ఆస్వాల్డ్ స్పెంగ్లెర్ (1880–1936)

ఫ్రీడ్రిక్ నీషే పూర్తిగా పిచ్చివాడు కాకముందే అనేక భవిష్యత్ విషయాల పుస్తకాలు చాలా దూరదృష్టి, మేధస్సు తో రాశాడు. అవి జనాలను మేలుకొనేట్లు చేశాయి. అతని నిగూఢ భావనలు హిట్లర్ రాజకీయ టెర్రరిజానికి దారితీస్తాయని, సింగ్లేర్ పూర్తిగా నిరాశ చెంది "ది డిక్లైన్ ఆఫ్ ది వెస్ట్" రాస్తాడని వినిఉంటే నిశ్చేస్టుడయ్యేవాడు. ఏది ఏమైనా కానీ 19వ శతాబ్దపు అసంబద్ధ ప్రవక్త, 20వ శతాబ్దపు శిష్యులకోసం మార్గం ఏర్పరచి, నియంత హిట్లర్ మారణదమన విద్వేష మంత్రాల భయాన్నుంచి ప్రజలను తప్పించి ప్రశాంత భయంకర విపత్తును కళ్ళముందు నిలిపాడు.

29–5–1980న మధ్య జర్మనీలోని హార్ట్జ్ పర్వతాలలో ఉన్న చిన్నగ్రామం బ్లాన్కేన్ బర్గ్‌లో ఆస్వాల్డ్ స్పెంగ్లెర్ జన్మించాడు. అతని వంశం రెండు విభిన్న వ్యక్తిత్వాల సమ్మేళనం. తల్లి వంశం వాళ్ళు వాళ్ళ రక్తం శ్రేష్టమైనదని అంటారు, అతని పిన్ని సంప్రదాయ డాన్సర్, తండ్రి తండ్రి అంటే తాత బాలెట్ మాస్టర్. తండ్రి పూర్వీకులు దక్షిణ జర్మనీ నుంచి మూడు వందల ఏళ్ళకు పూర్వమే వచ్చారు. వాళ్ళు ఇంజనీర్లు, గనుల త్రవ్వక సాంకేతికతలో నిపుణులు. తండ్రి కూడా అదే బాటలో నడిచి గనులు వట్టి పోయి నష్టం కష్టం మిగిలాక మానేసి కుటుంబాన్ని హల్లేకు మార్చాడు. ఆస్వాల్డ్‌కు ముగ్గురు చెల్లెళ్ళు. ఇతనొక్కడే మగ పిల్లాడు. హల్లేలో హైస్కూల్ చదువు పూర్తిచేసి అక్కడే యూనివర్సిటిలో చేరి, తర్వాత మ్యూనిచ్, బెర్లిన్ వర్సిటీలలో చదివాడు. బెర్లిన్ నుండి ప్రాచీన గ్రీక్ ఫిలాసఫర్ హెరాక్లిటస్‌పై పరిశోధన చేసి పి.హెచ్.డి.పొందినా, అతని అభిరుచి గణితం, సైన్స్ లమీదే ఉండేది.

23వ ఏటనే గణితంతోపాటు చరిత్ర జాగ్రఫీలు సారా బ్రికేన్, డీసెల్ డార్ఫ్, హాంబర్గ్‌లలో బోధించాడు. 30వ ఏట విశ్రాంతి కోసం సెలవు పెట్టి, ఒక ఏడాది తర్వాత తనకేమీ రాలేదని గ్రహించాడు. తన అవగాహనా లోపాన్ని గ్రహించి టీచింగ్‌కు స్వస్తి చెప్పాడు. బెర్లిన్ వాతావరణం దారుణంగా ఉండటంతో మ్యూనిచ్ వెళ్ళాడు.

ఇది అన్నివిధాలా అనుకూలమైన ప్రదేశమని అనుకొన్నాడు. వంశ పారంపర్య ఆస్తి కొంత చేతికి వచ్చింది. దానికి తోడుగా పత్రికలలో రివ్యూలు రాసి డబ్బు సంపాదించాడు. మొదటి ప్రపంచ యుద్ధం అతని ఆర్థిక స్థితిని దెబ్బతీసింది. మ్యూనిచ్‌లో నీచ పరిసరాలలో హీటింగ్ సౌకర్యం లేనిచిన్న గదిలో ఉంటూ, కూలీల విశ్రాంతి ప్రదేశాలలో దొరికినదేదో తింటూ, ఎక్కువ భాగం టీ తాగి బతికాడు. చలి నుండి రక్షించుకొనే దుస్తులు లేవు. కొవ్వొత్తి కాంతిలో రాసుకోనేవాడు. అవసర రిఫరెన్స్ పుస్తకాలు కొనటానికి డబ్బులు ఉండేవికావు. తన గదిని వెచ్చ చేసుకోవటానికి బొగ్గులు కొనే తాహతు కూడా ఉండేది కాదు. బుగ్గల ఎముకలు బయటికొచ్చి, కళ్ళు మొరటుగా మారి తల బులెట్ షేప్‌లో ఉండి, తలవెంట్రుకలన్నీ రాలిపోయి దాదాపు బట్టతల వచ్చేసింది. అతనిది ఉత్తర జర్మనీ రక్తమే అయినా అందరూ స్వచ్ఛమైన ప్రష్యన్ రక్తంగా భావించారు.

38వ ఏట స్పెంగ్లర్ ఎవరో ఎవరికీ తెలియదు. కాని ఆయన రాసిన "ది డిక్లైన్ ఆఫ్ ది వెస్ట్" పుస్తకం విడుదలై ప్రష్యనిజాన్ని ప్రభావితం చేయటమే కాక ప్రపంచ వ్యాప్త ప్రకంపనలు సృష్టించింది. ఈ పుస్తకం 1918లో విడుదలై మొ.ప్ర.యు.లో జర్మనీ అధికారం కోసం చేస్తున్న పోటీ ఆఖరు రోజుల్లో వచ్చింది. డజను భాషల్లోకి అనువాదం పొంది, అమెరికా, జపాన్ యూరోపియన్ లలోని చరిత్రకారుల్ని, విద్యావేత్తలను కలవర పరచింది. ఈ పుస్తకంలో స్పెంగ్లర్–వాగ్దాన భంగం చేసిన నాగరకత పతనాన్ని, సర్వ నాశనం చేసి, పాత భావసృష్టి చేసే ఒక కొత్త శక్తి ఆవిర్భవిస్తుందని తెలియజేశాడు. ఫాసిజం, నేషనల్ సోషలిజంలు పూర్తి వినాశానానికి పూర్తి విధానంతో ఉన్నాయని, ఉపేక్ష చేస్తే ప్రగతి మార్గం మాట దేవుడెరుగు అధోగతి పాలవ్వటం తప్పదని, దీనితో నాగరకత క్షీణించి పోతుందని హెచ్చరించాడు. ఇప్పుడు తాత్కాలిక విజయం పొందిన వారికి భవిష్యత్తు లేదని, బహుశా తెల్లజాతి విజేతలను మంగోలియన్ లేక ఆసియాకు చెందిన మరొక జాతి ప్రక్కకు తొలగించి అధికారం హస్తగతం చేసుకొంటుందని, భవిష్యత్తు స్పష్టంగా చెప్పాడు. ఈ పుస్తకంను మరింత నిర్దుష్టంగా మార్చి 1923లో మళ్ళీ ముద్రించాడు. ఇందులో నీషే చెప్పిన నాగరకత అంటే మానవ జాతి ముసలిదైపోయి, అంతం చెందటమే అని గుర్తు చేశాడు. పాశ్చాత్య మనిషి నాగరకంగా అభివృద్ధి చెంది, బలహీనమై నీరసించి, స్థిర నిశ్చయం లేక, ఆత్మ రక్షణ చేసుకోలేని పరిస్థితికి వస్తాడు కనుక తప్పక చావాల్సిందే" అన్నాడు.

ప్రాచీన, ఆధునిక ప్రపంచాల మధ్య ఉన్న సమాంతర విషయాలను చర్చిస్తూ స్పెంగ్లర్ తన కృషి ఒక కొత్త ఫిలాసఫీ అని చెప్పి "ఈ కొత్త ఫిలాసఫీ భవిష్యత్తుకు చెందినది. మెటా ఫిజికల్‌గా అంతా కోల్పోయి ఊసర క్షేత్రమైన పశ్చిమ దేశాలవారు భరించేటంత కొత్తది" అని అన్నాడు. స్పింగ్లేర్ అభిప్రాయంలో ప్రతి సంస్కృతీ వసంత, వేసవి, శిశిర, శీత అనే నాలుగు ఋతువులను దాటాలి. పడమటి దేశాలలో సంస్కృతీ

వసంతం అంటే మధ్య యుగపు యుద్ధ పోరాటాలు గొప్ప కేథడ్రిల్ నిర్మాణాలు, స్వేచ్ఛా కళా వికసనం, అరిస్టోక్రసి సృజనలు. సాంస్కృతిక పునర్వికాసం అంటే రినైసేన్స్‌ను వేసవి కాలం అన్నాడు. ఈ కాలంలో లియోనార్డో డావిన్సి, గెలీలియో, షేక్స్ పియర్, అజ్ఞానం నుండి నిరక్షరాస్యత సూపర్ నేచురలిజం నుండి విజ్ఞానంలోకి అక్షరాస్యతలోకి ప్రవేశం. ఇక శిశిరం అంటే సంస్కరణలు, అరిస్టోక్రాటిక్ కల్చర్ మారిపోయి మధ్యతరగతి సాంప్రదాయ ప్రవేశం, లోతైన సహజ జ్ఞానాన్ని ఒక ప్రత్యేక మేధావి తనం ఆక్రమించటం, విశ్వాసానికి బదులు బలహీనమైన హేతువుపై ఆధారపడటం. 19వ శతాబ్దిని శీతాకాలం అన్నాడు. ఇది అసంతృప్తి, వినాశనం. నాగరకత పూర్తి అయిపోయి దానంతటికి అదే ఆధునిక నగర, ధన శక్తి, మూక సమూహ పెత్తనంతో నాశనమై పోయింది అంటాడు.

పడమటి ప్రపంచం విస్తృత నగరాల వలన తప్పనిసరి నాశనాన్ని కోరి తెచ్చుకొన్నది అంటాడు. వస్తువుల అసలు విలువను అది నాశనం చేసింది. కారణం అన్ని రకాల విలువలను డబ్బుతో కొలుస్తున్నారు. సాంస్కృతిక విషయాలు, సాంఘికాచారాలను ఎక్కడో పట్టణంలో ఉండే జ్ఞానం ఉందనుకొంటున్న కొద్దిమంది వ్యతిరేకిస్తున్నారు. దీనితో అవగాహనలేని వారికీ మిగిలిన వారికి శత్రుత్వం కలుగుతోంది. సిటీ అంటే ఇంపీరియలిజానికి విస్తృతి, అదే నాగరకతకు అంతం. సంస్కృతీ సంపన్నుడు తన మేధస్సును ఆంతరింగికంగా ఉపయోగించుకొంటాడు, నాగరకుడు బాహిరంగా తన శక్తి సామర్థ్యాలను ప్రదర్శిస్తాడు. ఇతనిది స్వయంకృత ఓటమికి విస్తృత పరిధి అవుతోంది. విస్తరణ ప్రవృత్తి వినాశ హేతువు. అన్నిటినీ చేతిలో పెట్టుకొని శక్తులను సేవకు వినియోగించుకొంటున్నాడు. ఈ పడమటి ప్రపంచ జనాలకు ఈ విషయం తెలుసో లేదోకాని వారి భవిష్యత్తు శీతాకాలం, అతి విషాద భరితం, అనూహ్యంగా ఉంది. మంచి కోరే హక్కు లేదు. కలలు కనే వారు మాత్రమే దీనికి ఏదో పరిష్కారం ఉందని అనుకొంటారు. ఆశావాది పిరికివాడు. మనం ఈ కాలంలో పుట్టాం. కనుక కడదాకా ధైర్యంగా గమ్యానికి ఈ దారిలోనే ప్రయాణం చేయాలి. వేరే మార్గం లేదు. మన కర్తవ్యం చివరి దాకా కారణం లేకుండా, ఆశ లేకుండా పట్టుకొని వేలాడటమే" అంటాడు స్పెంగ్లెర్.

"కళ విషయానికి వస్తే మనం తూర్పు దేశాల వారి చేతిలో పరాజయమయ్యాం. పాశ్చాత్య సంస్కృతీ దాని నాగరకతతో పతనమైపోయింది. "we have ruined classicism with soulless sentimentalities and destroyed pure form with multiple but meaningless decorations" అని బాధ పడ్డాడు. "ఇవాళ మనకేం మిగిలింది? కృత్రిమ శబ్ద హోరుతో, రణగొణ ధ్వనులు చెవులు బ్రద్దలయ్యే వాయిద్యాల హోరు అరుపులుతో ఒక నకిలీ సంగీతం, ఇతర దేశాల అసంబద్ధ ప్రభావంతో, ప్రతి పదేళ్లకోసారి కొత్త శైలి పేరుతో అసలు శైలే లేని నకిలీ పెయింటింగ్ తప్ప ఏం

మిగిలింది మనకు, ఏం మిగిలింది?" అని ఆవేదన చెందాడు. అన్ని రంగాలలో దిగజారిపోతున్న విలువలు, ప్రమాణాలను చూసి జీర్ణించుకోలేక బాధపడ్డాడు. "ఇప్పుడు మనకు అనుకరణ, వక్రీకరణ, పగిలిన అద్దం పెంకులు, పరావర్తనాలకే పరావర్తనాలు మిగిలాయి. మనదైనదేదీ మనకు ఇప్పుడులేదు" అన్నాడు.

ఇవన్నీ అచ్చంగా మన కవిసామ్రాట్ శ్రీ విశ్వనాధ సత్యనారాయణ గారి నోటి నుండి వెలువడిన వాక్కుల్లా, వారి సాహిత్య సర్వస్వంలో చెప్పిన విషయాలులాగా అనిపిస్తున్నాయి కదూ. "గ్రేట్ మైండ్స్ థింక్ అలైక్" అంటే ఇదే.

స్పెంగ్లర్ భవిష్యత్తును ఆనందమయ పెసిమిజంగా చూశాడు. నీషే చెప్పినభయ సంతృప్తులతో కూడిన "శాశ్వత పునరా వృత్తం" (ఎటర్నల్ రికరెన్స్) కోసం ఎదురు చూశాడు. ఇప్పుడు ఆ వృత్తం పూర్తయింది. ఇప్పుడు స్పెంగ్లేర్ కొత్త ఆవృత్తం జీర్ణించి నశించిపోయిన నాగరకత నుంచి ఆరోగ్యకర ఉత్సాహపరచే బార్బేరిజంగా ఆవిర్భవిస్తుంది అన్నాడు. మరొక కొత్త ఉన్నత యువ క్రూర సంస్కృతీ ఏర్పడి వ్యాపించి రాజ్యమేలుతుంది అని ఊహించాడు. "ఆస్వాల్డ్ స్పెంగ్లర్ –ఎ కల్చరల్ ఎస్టి మేట్" అనే పుస్తకంలో హెచ్.స్టువార్ట్ హగ్స్ "మానవాభివృద్ధిలో ఆయన చెప్పిన వృత్త సిద్ధాంతం, సంశయ వాదం, మానవ నైతిక శక్తి సామర్థ్యాలు ఒక భ్రమగా కొట్టిపారేశాడు. ప్రజాస్వామ్యం పవిత్ర మోసం, మాయ అన్నాడు. ప్రపంచశాంతి సాధన అసాధ్యమేకాదు, అనవసరం కూడా అన్నాడు. 20వ శతాబ్దం శాంతికి, అభివృద్ధికి, ప్రజాస్వామ్యానికి బహుదూరంగా తన సమకాలీనులు ఊహించిన దానికి విరుద్ధంగా ఉండి భయ విహ్వలత, ఇంపీరియలిజం, నిరంతర యుద్ధ ప్రమాదకర శకంగా ఉంటుందని భవిష్యత్తు చెప్పాడు" అని రాశాడు.

స్పెంగ్లెర్ చెప్పిన "మానవ తలరాత" సిద్ధాంతం నాశనమై, మళ్ళీ తల ఎత్తి పుంజుకొన్న జర్మని విషయంలో నిజమైంది. జర్మన్లు తమ ఓటమి ప్రపంచవ్యాప్త పతనంలో ఒక భాగమేనని, పుట్టుకొచ్చిన నాజీలు ఆయన చెప్పిన భవిష్యత్తుకు ఉత్సాహపడి, ప్రపంచంలో ఆర్యజాతి ఒక్కటే సర్వోత్కృష్టమైనదని నమ్మి ప్రచారం చేసి వినాశకర హింసాత్మకతను పెంపొందించారు. అందువల్ల నాజీ నాయకత్వానికి స్పెంగ్లెర్ కొంతకాలం దేవుడే అయ్యాడు. కాని ఆయన నియంత్రణ, స్వీయ అహంకారాలపై ఉన్న అపనమ్మకం ఆయన్ను నేషనల్ సోషలిజంలో పాల్గొననీయకుండా చేసింది. ఆయన్ను వేధించకపోయినా, కార్యక్రమాలు పరిమితమై క్రూర పైశాచిక జర్మనీలో నిస్తబ్ధంగా ఉండిపోయాడు. మిగిలిన జీవితకాలం అంతా ఏకాంతంగా గడిపాడు. 56వ ఏట అకస్మాత్తుగా అనారోగ్యం పాలై, కొన్నేళ్ళు విపరీతమైన తలనెప్పితో బాధ పడుతున్నా ఆరోగ్యంగానే ఉంటూ విపరీతమైన గుండెపోటు వచ్చి దార్శనికుడు స్పెంగ్లెర్ 8-5-1936న మరణించాడు.

స్పెంగ్లెర్‌తోపాటు మరికొందరు కూడా నాశనమౌతున్న నాగరకతను గూర్చి వ్యథ చెందారు. ఇటలీకి చెందిన చరిత్రకారుడు జియాం బాట్టి స్టా వికో "అనేక చారిత్రాత్మక పునరావృత్తాలు జరిగి, అనేక నాగరక దశలు దాటి ఒక అనాగరకత నుంచి మరొక అనాగరకతకు చేరుకొంటుంది" అని చెప్పాడు. 1890లో అమెరికాకు చెందిన హెన్రి ఆడమ్స్ "ప్రజాస్వామ్య భవిష్యత్తు ప్రమాదం అంచులో ఉంది. ఉన్న ఆధారాలను బట్టి మనం ఇంకా రెండు వందల ఏళ్ళకుపైగా మూర్ఖ స్తబ్దతలో ఉండిపోవాల్సి వస్తుంది" అని చెప్పాడు. ఆయన సోదరుడు బ్రూక్స్ ఆడమ్స్ పడమటి నాగరకత శిధిలమౌతుందని ఊహించాడు. మనకున్న అధిక శక్తులు అనేక టెన్షన్‌లను సృష్టించి ఆధునికమానవుని అస్తిత్వాన్ని భగ్నపరుస్తాయి. ఒత్తిడి ఇక తట్టుకోలేనప్పుడు ఒక స్తబ్ద కాలం ఆవరించి, ఖర్చయి ఖాళీ అయిపోయి కాని యుద్ధం వలన కానీ లేక రెండిటి వలనకూడా అంతమవుతుంది. లేక విచ్ఛిన్నమై నాగరక జనాభా నశించి, మళ్ళీ వెనక్కి అడుగులు వేస్తూ ఆదిమ జీవ సమాజంలోకి చేరుతుంది" అని "ది లా ఆఫ్ సివిలిజేషన్ అండ్ డీకే" లో రాశాడు బ్రూక్స్.

"ప్రజాస్వామ్యం బలహీనతకు పర్యాయ పదం" (డెమాక్రసి ఈజ్ యే సినానిం ఫర్ డిసల్యూషన్) అని, శాంతి మరణానికి పరచిన దారి అని, జీవితం గురించి ఫిలాసఫర్స్‌కు అవగాహనే లేదని, ఫిలాసఫీ నిరర్ధకమైనదని, అభ్యుదయం అనేది లేదని, అది క్షీణతకు వృద్ధి అని స్పెంగ్లెర్ తప్ప ఎవరూ చెప్పలేదు. ఆయన వ్యాసాలు కొన్ని మరణానంతరం ముద్రింపబడినాయి. "ది డిక్లైన్ ఆఫ్ ది వెస్ట్", "ది అవర్ ఆఫ్ డెసిషన్"లపై. వయసు ముప్పైలో రాసిన వాటిపై వచ్చిన విమర్శలపై స్పందించలేదు. తన పాఠకులు మరింత ఆశ్చర్య పోయేట్లు వారిని ఉత్తేజపరుస్తూ మన నాగరకతను సుదీర్ఘకాలంగా వర్ధిల్లిన చైనా ఈజిప్ట్, ఇండియా, గ్రీక్ మరి కొన్ని దేశాల వాటితో పోల్చాడు. యూరప్, అమెరికాల మనసు ఆత్మను ముసలిదైపనికి రానిదైన "ఫాస్టియన్" అన్నాడు. అది అసాధ్యాన్ని కల కంటోంది అని చెప్పాడు. "we have not the freedom to choose, to reach to this or to that, but only the freedom to do what is necessary or do nothing. And a task that historic necessity has set will be complished with the individual or against him"

చాలామంది చరిత్రకారులు స్పెంగ్లెర్ సిద్ధాంతం "తప్పని సరి వినాశనం" మరియు, శతాబ్దాల పోరాటం ద్వారా సాధించుకొన్న జ్ఞానోదయ అనాసక్తత సిద్ధాంతం లను ఒప్పుకోలేదు. కొద్దిమంది ఆయన చెప్పిన దానికి అంతప్రభావం, వ్యాప్తి, శక్తి లేవన్నారు. క్విన్సీ హౌయీ "ది వరల్డ్ బిట్వీన్ టు వార్స్" అనే గ్రంథంలో "ఆయన్ను అర్థం చేసుకొన్న వారికి తమవాడు అయ్యాడు. వాళ్ళందరూ జూలియస్ సీజర్‌లు కాలేదు. కాని

జరగబోయే అనర్థాన్ని తట్టుకొనటానికి సర్దుబాటుకు సంసిద్ధమౌతారు. విల్సన్, లెనిన్‌ల ఆవిర్భావం స్పెంగ్లెర్ చెప్పిన భవిష్యత్తుకు మద్దత్తు ఇచ్చినట్లయింది. 20వ శతాబ్దిలో గొప్ప వాళ్ళ పాత్ర ఏమిటో విడమర్చి చెప్పింది. విలియం జేమ్స్ చెప్పిన కార్య సాధక ఫిలాసఫీని నీరు కార్చింది. “his worship for" technics "suited the scientific temper of the times. He offered a fatalistic formula to replace Westeren man' lost religious faith. His fame spread from defeated Germany to shell shocked Europe to the bewildered United States .it became more and more apparent that nobody had won the war and that everybody had won the war and that everybody had lost it” అని విశ్లేషించారు.

అతని పద్ధతులు శాస్త్రీయం కాకపోవచ్చు కాని ఆయన మెటాఫిజికల్ అనుమానాలు, యదార్ధమైనవే. తూర్పు, పడమర దేశాల మధ్య జాతి వర్ణ విభేదాలు ఆయన చెప్పిన నాటి కంటే ఇరవయ్యవ శతాబ్దంలో పూర్తిగా రుజువయ్యాయి. సమాజాలు యుద్ధాలవల్ల బలహీమమై పోతున్నాయి. ఆర్ధిక సంక్షోభంలో కూరుకు పోయాయి. ఆసియా ఆఫ్రికాలలోఅనిశ్చిత పరిస్థితులు, ప్రపంచ వ్యాప్త జాతీయ నినాదాలు, అంతర్జాతీయ యుద్ధోన్మాదం, ప్రపంచంలో రష్యా పెత్తనం, ఆయుధ పోటీ, ఆటం, హైడ్రోజెన్ బాంబ్‌ల విధ్వంసక శక్తి అన్నీ పూర్తి వినాశానానికే దారి చూపిస్తున్నాయి. “The decline of the West remains a fearful and continuing portent (దుశ్శకునం)” అన్నాడు అంటర్ మేయర్.

1938లో వరల్డ్ లీడింగ్ పర్సనాలిటీ పోటీలో మాల్కం కౌలీ మొదటివాడుగా వస్తే, స్పెంగ్లెర్ అయిదవ వాడుగా నిలబడ్డాడు. ఐరోపా ఫిలాసఫర్లు మార్టిన్ హీడ్జేర్, లుడ్విగ్ విట్టేంగ్ స్టీన్‌లపై ఈయన ప్రభావం ఎక్కువ. అమెరికా ఫిలాసఫర్‌లలో హెమింగ్వే, ఫిట్జెరాల్డ్, జాన్ డాస్ పాస్సో, హెన్రి మిల్లర్ లపై అత్యధిక ప్రభావం చూపాడు. ఇంగ్లాండ్‌లో హెచ్.జి.వెల్స్, మాల్కం లోరీ, యేట్స్‌లు జర్మనీ ఆస్ట్రియాలలో అనేక మంది లాటిన్ అమెరికా దేశాలలో చాలామంది ఆయన ప్రభావానికి గురైన వారే. వీరంతా స్పెంగ్లేర్‌ను పునర్జీవితుడిని చేసినవారే. దాదాపు పదిహేడు గ్రంథాలు రచించాడు.



## 68. పెనిసిలిన్ ప్రదాత–అలేక్సాండర్ ఫ్లెమింగ్ (1881–1955)

అణుశక్తిపై విప్లవాత్మక పరిశోధనలను అడ్డుకొంటున్న కాలంలో, మెడికల్ సైన్సులో విప్లవ పరిశోధనలను ప్రపంచ ప్రజలందరూ ఆహ్వానించారు. న్యూక్లియర్ పవర్ మానవ జీవితాలను కుంచింపజేస్తుంటే, లేక పూర్తిగా సర్వనాశనం చేస్తుంటే కొత్తగా కనిపెట్టిన అద్భుతమైన మందులు వ్యాధి నిరోధకతను పెంచి మానవ జీవితకాలాన్ని మరింతగా వృద్ధి, మేలు చేశాయి. శరీరంలో జబ్బు పడి పడిన కణాలను బాగా ఆరోగ్యంగా సజీవంగా ఉన్న కణాలకు నష్టం రాకుండా నాశనం చేసే సమస్య పరిష్కృతం కాలేదు. కాని ఆశ్చర్యకరమైన యాంటి బయాటిక్స్, సల్ఫా డ్రగ్స్, హార్మోన్లుతో సమకాలీన విజయాలు సాధిస్తూ భద్రమైన మానవ భవిష్యత్తుకు భరోసానిచ్చాయి.

లూయీ పాశ్చర్ తర్వాత వైద్య విధానం లోవచ్చిన పెనుమార్పు పెనిసిలిన్ ఆవిష్కరణ. దీని ప్రదాత స్కాట్లాండ్ దేశపు బాక్టీరియాలజిస్ట్ అలేక్సాండర్ ఫ్లెమింగ్‌కే ఈ కీర్తి దక్కింది. స్కాట్ లాండ్‌లోని అయిర్ షైర్‌లో లోచ్ ఫీల్డ్ డార్వేల్‌లో 6–8–1881న ఫ్లెమింగ్ జన్మించాడు. రైతు అయిన తండ్రి 8మంది సంతానంలో చివరివాడు. రెండవ భార్య కొడుకు. తనలాగా వ్యవసాయమే చేస్తాడని తండ్రి ఆశించాడు. కొడుకూ అలాగే అనుకొన్నాడు. పొలం పని మాంచి హుషారుగా ఉండేది. చేపలు పడుతూ కుందేళ్ళను పెంచుతూ, గొర్రెల్ని మేపుతూ సరదాగా గడిపాడు. తాము గ్రామం లో మిగిలిన వారికంటే కొద్దిగా బాగానే బతుకుతున్నామని అనుకొన్నాడు. తానూ బాగా వ్యవసాయం చేసి తండ్రి పేరు నిలబెట్టాలని, ఆ గ్రామంలో తమ కుటుంబం వ్యవసాయంలో అగ్రగామి కావాలని ఆశించాడు.

14వ ఏట అతని జీవిత నేపథ్యం అకస్మాత్తుగా తలకిందు అయింది. పెద్దన్నలతో పాటు చదువుకోమని లండన్ పంపారు. కిల్ మార్ నాక్ అకాడెమి లోరాబర్ట్ బర్న్స్, రాబర్ట్ లూయీ స్టీవెన్సన్‌లు చదివిన చోట చేరి, ఇంగ్లాండ్ తన దేశం, లండన్ తన కేంద్ర స్థానం అయినా కూడా స్కాటిష్ ఆక్సెంట్‌ను మాత్రం మార్చుకోలేదు. పాలిటెక్నిక్‌లో చదువు పూర్తిచేసి స్కాటిష్ వాలంటీర్‌గా మేరు నమోదు చేయించుకొని ఈతలో అద్భుతంగా

రాణించాడు. ఈ ఈతే అతని గీత మార్చింది. మార్లేబోన్ రోడ్‌లో అన్న థామస్ జనరల్ ప్రాక్టీషనర్, మరిద్దరు అన్నలు జాన్, రాబర్ట్‌లు “ఆప్టోమెట్రి” అంటే కంటి దోషాలు గుర్తించి నివారించే కోర్సు చదువుతున్నారు “మా అన్న థామస్ నన్ను మెడిసిన్‌లోకి తోశాడు. నేను మెడికల్ స్కూల్‌ను ఎంచుకోవాలి. అలాంటివి లండన్‌లో డజన్ ఉన్నాయి. వాటి గురించి నాకేమీ తెలియదు. అయితే నేను సెయింట్ మేరీ స్కూల్ వాళ్ళతో వాటర్ పోలో ఆడాను కనుక అక్కడే చేరాను” అని చెప్పాడు ఫ్లెమింగ్.

ఈ స్కూల్‌లో చాలా ప్రసిద్ధి చెందిన బాక్టీరియాలజిస్ట్ ఆల్మత్ రైట్ వద్ద చదివాడు. నిశిత పరిశీలన, మంచి జ్ఞాపకశక్తి, పనిలో పొదుపరితనం ఈయన వలన నేర్చాడు. చివరి గుణం అయిన పొదుపరితనం గురించి ఫ్లెమింగ్ చెబుతూ “నేను తెలివిగల స్కాట్ లాండ్ వాడిని కనుక, మా దేశస్థులు దేన్నీ అనవసరంగా పారవేయరు కనుక, చివరికి కలుషితమైన ఆహారాన్ని కూడా చూస్తూ చూస్తూ పారేసే లక్షణం మా జాతిలో లేదు కనుక పొదుపు రక్తగతమై అలవడింది” అని చెప్పాడు. అన్ని ఆటలలోనూ పాల్గొనేవాడు. ఫిజియాలజీ, హైజీన్, మెడిసిన్, పాథాలజి, ఫార్మకాలజీ మొదలైన అనుబంధ సబ్జెక్ట్‌లలో ఏర్పరచిన ప్రతి ప్రైజ్‌ను, స్కాలర్ షిప్ నూ సాధించుకొన్నాడు. అప్రెంటిస్ పూర్తి చేశాక లాబరేటరీలో పని చేసి, 28ఏట తన పరిశోధనలకు, రోగనిర్ణయ విధానాలకు ఒకదాని తర్వాత మరొక గౌరవాలు, ప్రశంసలు పొందాడు.

మొదటి ప్రపంచ యుద్ధం ఫ్లెమింగ్‌ను లండన్‌కు దూరం చేసింది. 1914లో 33వ పుట్టిన రోజున రైట్‌తో కలిసి కాసినోలో తానే ఏర్పాటు చేసిన “రాయల్ ఆర్మీ మెడికల్ కార్ప్స్”లో ఆఫీసర్‌గా బోలోన్ వెళ్ళాడు. అక్కడ నిత్యం విపరీతంగా గాయపడిన, బాధలతో అరుపులు, కేకలు వేస్తున్న సైనికులతో మహా రద్దీగా ఉండేది. అందులో ఎక్కువ మంది “గాంగ్రీన్” అంటే కండరాల మాంసం కుళ్ళి వచ్చే జబ్బుతో బాధ పడేవాళ్ళే. మెరుగు పరచిన రెండు బాత్ రూమ్‌లున్నా మురుగు వ్యర్ధ పదార్ధాలతో కంపుకొడుతూ ఉండేవి. యుద్ధం మాట దేవుడెరుగు. ఈ నరకంలోనే అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోవటం ఎక్కువైందని గమనించాడు. గాయాలు నయం కాక జరుగుతున్న చావులే అవి. బాగా శక్తిగల యాంటి సెప్టిక్‌లను వాడినా బాక్టీరియాను అరికట్టలేక పోతున్నారు. అందుకే అవి తమ ప్రతాపం చూపిస్తూ సైనికులను బలి తీసుకొంటున్నాయి. పై అధికారులకు విషయాలు తెలియజేస్తున్నా స్పందన లేకపోవటంతో కుంగిపోయాడు ఫ్లెమింగ్. నయం చేయటానికి తాను చేస్తున్న ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయని బాధ పడ్డాడు.

37వ ఏట కెప్టెన్‌గా ప్రమోషన్ రాంక్ లభించింది. యుద్ధం పూర్తి అయింది కాని

ఫ్లెమింగ్‌ను అక్కడి నుంచి కదల్చ లేదు. లండన్‌కు చేరాక "ఇమ్యూనాలజి"–వ్యాధి నిరోధక విజ్ఞానంపై పనిచేయాలని నిర్ణయించుకొన్నాడు. ఆరోగ్యకర టిస్యూలకు హాని చేయకుండా బాక్టీరియాను పూర్తిగా నాశనం చేసే సమర్ధ బాక్టీరియా సంహారక పదార్థాన్ని కనిపెట్టాలని భావించాడు. ప్రయోగాలు, అనుభవాల వలన శరీరంలోని కణాలే యాంటి బాక్టీరియా ఏజెంట్‌లుగా పని చేస్తాయని గ్రహించాడు. అదే "నేచురల్ ఇమ్యూనిటి" అంటే సహజ రోగ నిరోధకం. అవి శరీరాన్ని సైనికులులాగా నిత్యం కాపాడుతూ ఉంటాయి. వెంటనే "ఎక్స్ పెరమేంట్ పాథాలజి"పై అనేక పేపర్లు రాసి ప్రచురించాడు. అందులో ఒక ముఖ్యమైన పత్రంలో "స్రావాలు, టిస్యూలలో పులియజేసే బాక్టీరియా ఉంటుందని, అది కొన్ని రకాల బాక్టీరియాపై దాడి చేసి సమర్ధంగా శక్తి హీనం చేస్తుందని గ్రహించాడు. ఇదే "లైసోజైం" దీన్ని కనిపెట్టన ఏడాది ముందే ఫ్లెమింగ్ సారా మెరియన్ మేకే్రాయ్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఆమె ట్విన్ సిస్టర్‌ను అన్న జాన్ పెళ్ళాడాడు.

సాత్వికంగా మాట్లాడే స్వభావం. బూడిద రంగు జుట్టుతో 47ఏళ్ళ సైంటిస్ట్ ఫ్లెమింగ్ కనిపించేవాడు. 1928లో ఒక రోజు తన లాబ్‌లో ఒక వింత విషయం గమనించాడు. ఒక పెట్రి డిష్‌పై స్టాఫిలో కాకస్ జెర్మ్ కల్చర్ ఉన్న గ్లాస్ ప్లేట్‌పై బూజులాంటి పదార్ధం ఏర్పడినట్లు గుర్తించాడు. విద్దూరంతో పరిశీలిస్తే ఏర్పడిన లైసోజైం తన చుట్టూ ఉన్న స్టాఫిలోకాకస్ బాక్టీరియాను నాశనం చేసిందని తెలుసుకొన్నాడు. సూక్ష్మ దర్శింతో నిశితంగా పరీక్షిస్తే ఏర్పడిన ఆకు పచ్చని బూజు పని చేయటం ప్రారంభించి బాక్టీరియాను క్రమంగా తొలగిస్తోంది. బాక్టీరియా క్రమంగా అదృశ్యమవటం చూస్తే తప్పక తాను బాక్టీరియా సంహారక పదార్థాన్ని కనిపెట్టి చికిత్సా విధానంలో ఉపయోగించి మానవ శరీరంలో బాక్టీరియావలన ఇన్ఫెక్షన్ రాకుండా చేయగలుగుతాననే నమ్మకం కలిగింది.

మోల్డ్ నుంచి పెనిసిలిన్ తయారవటం ఫ్లెమింగ్ మర్యాదగా చెప్పినట్లు యాదృచ్ఛికం కాదు. అనేక పరిశోధనల, పరిశీలనల, అనుకూల పరిస్థితుల వలననే జరిగింది. దీనికి నోబెల్ బహుమానం అందుకొన్న రోజు ఫ్లెమింగ్ "అదృష్టవశాత్తు జరిగిన సంఘటనలో పెనిసిలిన్ ఏర్పడింది. అప్పుడు నేను మామూలుగా బాక్టీరియాలజీ సమస్యలపై పరిశోదిస్తున్నానే కాని బాక్టీరియా సంహారకాలపై కాని మోల్డ్‌లపైకాని యాంటి సెప్టిక్స్, యాంటి బయోటిక్స్‌లపై నా దృష్టి యే మాత్రం లేదు. నా మొదటి పరిశోధనా పత్రంలో మోల్డ్స్ ద్వారా యాంటి బాక్టీరియల్ పదార్థం తయారు చేయవచ్చు అని మాత్రమే చెప్పాను. అందుకనే ఆసమస్యపై పరిశోధిస్తున్నాను. అది సత్యంకాక పోవచ్చని, సత్యాన్ని చెప్పాలని మాత్రమే నా తపన. అప్పుడే పెనిసిలిన్ అకస్మాత్తుగా ఒక చాన్స్‌గా నాకు అబ్బ్రేవ్షన్‌లో కనిపించింది. నా గొప్పతనం ఏమిటి అంటే నా

శోధనను అలక్ష్యం చేయక పోవటమే. అందుకే నిరంతర శోధన చేయటంతో నన్ను బాక్టీరియాలజిస్ట్ అన్నారు" అని చెప్పాడు.

చాలా పరిశోధనలు లాగానే పెనిసిలిన్ చాలా కాలం ఉపేక్షకు గురైంది. "ది సైన్స్ బుక్ ఆఫ్ వండర్ డ్రగ్స్" పుస్తకంలో డోనాల్డ్ జి.కూలే "making herbs extracts and so on was scarcely respectable in leading scientific circles. it was all a bit too with witch --doctorish, savoring of superstition and folklore, like the belief of some ignorant people that a poultice of molded bread made a wound heal more cleanly. The nature of pharmaceutical research was overwhelmingly along lines of laboratory synthesis of organic molecules and the impact of sulfas gave tremendous impettusto such directions" అని పూర్వ గాథాలహరి వివరించాడు. నిరంతరంగా మోల్డ్‌లను పెంచుతూ ఉన్నాడే కాని దానిపై ఏమీ చేయలేదు. పెనిసిలిన్ శక్తి తెలుసుకోవటానికి పదేళ్ళు పట్టింది.

ఫ్లెమింగ్ పబ్లిష్ చేసిన పత్రం ఇద్దరు ఆక్స్ ఫర్డ్ యూనివర్సిటి స్పెషలిస్ట్‌లు డాక్టర్ హోవార్డ్, ఫ్లోరీలను ఆకర్షించింది. అతని జర్మన్ సహాయకుడు ఎర్నెస్ట్ బోరిస్ చిన్ నెలల తరబడి ఫ్లెమింగ్ మోల్డ్ నుంచి ఏదైనా పదార్థాన్ని పొందచ్చునేమోనని ప్రయత్నించాడు. చివరికి చిక్కని గరిటెడు ఎల్లో బ్రౌన్ పౌడర్‌ను పొందగలిగాడు. ఇదే పెన్సిలిన్ నుంచి పొందిన మొదటి లవణం, దాన్ని అనేక తరహా బాక్టీరియా మైస్‌లపై ప్రయోగించాడు. 12-2-1941న వేరు చేసిన పెనిసిలిన్‌ను మొదటిసారిగా లండన్‌లో స్టాఫిలో కొకి బాక్టీరియాతో బాగా ఇన్ఫెక్ట్ అయిన 105 డిగ్రీల జ్వరంతో బాగా జబ్బుపడ్డ ఒక పోలీస్‌కు ఇంజెక్షన్‌గా ఇచ్చాడు. అంతకు ముందు అతనికి చాలా పెద్ద డోసులో సల్ఫానిలమైడ్ ఇచ్చారు కాని గుణం కనిపించలేదు. కాని ఇప్పుడు ఈ పెనిసిలిన్‌తో క్రమంగా జ్వరం తగ్గింది కాని అప్పటికే చాలా ప్రమాదం అంచున ఉండటం వలన చనిపోయాడు. అతని మూత్రం నుండి కొద్ది మోతాదులో పదార్థాన్ని సేకరించి రెండు నెలలు సాంద్రత పరచి, స్ట్రెప్టో కాకి బాక్టీరియాతో చావు బతుకులమధ్య ఉన్న 15 ఏళ్ళ కుర్రాడికి దాన్ని ఇంజెక్షన్‌గా ఇస్తే వాడు కోలుకొని బతికి బట్టకట్టాడు. కొన్ని నెలల తర్వాత ఫ్లెమింగ్ తన మిత్రుడు ప్రాణాపాయంలో ఉంటే వెన్నెముక ద్వారా మందు ఎక్కించి ప్రాణాలు కాపాడాడు.

ఈ విధంగా పెనిసిలిన్ ప్రపంచ వ్యాప్త ప్రాణ సంజీవనిగా పేరు పొందింది. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో యుద్ధంలో ఇరుక్కుని, ప్రతి ప్రయోగశాల ఆయుధాల

కోసమే పని చేయటంతో తగినంత పెనిసిలిన్‌ను తయారు చేయలేక పోయింది. డాక్టర్ ఫ్లోరే అమెరికా వెళ్లి అక్కడ విస్తృత స్థాయిలో పెనిసిలిన్ తయారు చేసే ఏర్పాటు చేశాడు. 1942 నాటికి ఒక 100 మందికి మాత్రమే సరిపడ పెనిసిలిన్ మందు ఉంది. మరుసటి ఏడాదికి లెక్కలేనంత మందికి ఆ మందు ఇచ్చి ప్రాణాలు కాపాడే స్థితికి వచ్చారు. 1943లో ఫ్లెమింగ్‌ను ఫెలో ఆఫ్ ది రాయల్ సొసైటీని చేశారు. తరువాత నైట్ హుడ్ ఇచ్చి గౌరవించారు. 1945లో ఫ్లోరీ, చైన్లతో కలిపి ఫ్లెమింగ్‌కు నోబెల్ పురస్కారం ప్రదానం చేశారు.

అనేక మట్టి నమూనాల నుంచి మోల్డ్‌లను వృద్ధి చెందించారు. రాట్జేర్స్ యూనివర్సిటికి చెందినవాక్స్ మన్ న్యుజెర్సీ మట్టి నుండి "స్ట్రెప్టోమైసిన్" కనిపెట్టాడు. ఎల్ యూనివర్సిటికి చెందిన పాల్ బార్క్ హోల్డర్ వెనిజుల దుమ్ము నుంచి "క్లోరోమైసిటిన్" మందు తయారు చేశాడు. అది దక్షిణ అమెరికాలో టైఫస్ బాక్టీరియాను నివారించి టైఫాయిడ్ నుంచి విముక్తి కలిగించింది. 75 ఏళ్ళ బెంజమిన్ డ్రగ్గర్ అనే రిటైర్డ్ బాటనీ ప్రొఫెసర్ పుట్టగొడుగులపై తీవ్ర పరిశోధన చేసి మిస్సోరి బురద నుంచి బంగారపు పసుపు రంగు మోల్డ్ పెంచి దాని నుంచి వచ్చిన మందుకు "ఆరో మైసిన్" అని పేరు పెట్టాడు. బ్రూక్లిన్ లోని ఒక సంస్థ ఇండియానాలో కుళ్ళిన సాయిల్ నుంచి "టెర్రామైసిన్" తయారు చేసింది. దీనితో వైద్య రంగంలో నూతన అధ్యాయం ఆరంభమైంది. దీనినే "కేమో థెరపీ శకం" అన్నారు. ఈ మందులన్నీ భూమిలోని మట్టి సారం నుంచి తీసినవే.

ఎక్కువ డోస్‌లో యాంటి బయాటిక్స్ వాడితే పేషెంట్‌లకు ఎలర్జీలు వచ్చి ఇబ్బంది పడతారు. ఫ్లెమింగ్ చలవ వలన వైద్య ప్రపంచం గణనీయమైన అభివృద్ధి సాధించి జన జీవితంలో వసంతోదయాన్ని తెచ్చింది. చెవి ఎముక (మాస్టాయిడ్) ఆపరేషన్లు ఒకప్పుడు అతి ప్రమాదకరం. ఇప్పుడు "వీజీ" అయింది. పిల్లల చెవి బాధలు తగ్గాయి. మధ్య చెవిలో వచ్చే భయంకర ఇన్ఫెక్షన్ ఇప్పుడు యాంటి బయాటిక్స్‌తో ఉష్ మాయం అవుతోంది. బోస్టన్‌లోని పిల్లల ఆసుపత్రిలో మాస్టాయిడ్ ఆపరేషన్లు మూడు వందల నుంచి ఒక దశాబ్దకాలంలో అయిదుకు తగ్గి గొప్ప మార్పు తెచ్చింది. ఎపెండి సైటిస్, మేనేంజేటిస్ (మజ్జా రోగం) టులారెమియా (ప్లేగు వంటి వ్యాధి) ప్యూర్ పెరల్ ఫీవర్ (ప్రసూతి జ్వరం) ఇప్పుడు భయంకరమైనవి కానేకాదు. పూర్తిగా నివారింప దగినవే . ప్రపంచం ఫ్లెమింగ్‌కు ఎంతో రుణపడి ఉంది. యువకులు ఉత్సాహంగా పని చేస్తూ 65 ఏళ్ళకు హాయిగా రిటైరై ధోకా లేకుండా జీవిస్తున్నారు. అంటే లైఫ్ స్పాన్ పెరిగింది అన్నమాటం.

బాక్టీరియాలజీలోనే కాక పెయింటంగ్‌లోనూ సిద్ధ హస్తుడైన ఫ్లెమింగ్ తన ఇంటి గోడలపై జర్మ్ కల్చర్‌ను చిత్రించాడు. 70వ పుట్టిన రోజు రిటైర్మెంట్ పొందినా మైక్రో బయాలజీపై ఇంకా పరిశ్రమ చేయాలని నిర్ణయించాడు. అతని మాటల్లోనే "I have still got a few useful years before me,The happy man keeps on working" అన్నాడు. 74వ ఏట ఫ్లెమింగ్‌కు హార్ట్ ఎటాక్ వచ్చింది. 11-3-1955న కోట్లాది ప్రాణులకు పెనిసిలిన్ ద్వారా ప్రాణ దానం చేసిన ప్రాణదాత అలెక్సాండర్ ఫ్లెమింగ్ అమరుడయ్యాడు. ఆయన లండన్ ఇంటికి దగ్గరలో ఉన్న లాబరేటరిలో ఆయన వృద్ధి చెందించిన అసలు మోల్డ్ (ఏన్సేస్టర్) గాజు మూసలో ఇంకా భద్రంగా ఉన్నది. దీనినుంచే ప్రపంచానికి అవసరమైన పెనిసిలిన్ ఆవిర్భవించింది.

2000 సంవత్సరంలో ప్రవేశించే ముందు స్వీడన్‌కు చెందిన మూడు పెద్ద మేగజైన్‌లు ఆ శతాబ్దపు గొప్ప పరిశోధన ఏదని అభిప్రాయ సేకరణ చేస్తే "పెనిసిలిన్" అనే అందరూ చెప్పారు. 2002లో బి బి సి వంద మంది ప్రసిద్ధ బ్రిటన్ల జాబితాలో ఫ్లెమింగ్‌ను చేర్చింది. ఆయన కాంశ్య విగ్రహాన్ని మాడ్రిడ్‌లో ఏర్పాటు చేశారు. ఆయన పేరుతో బాంక్ నోట్లు ముద్రించారు. ఆస్టెరాయిడ్ బెల్ట్‌లో ఒక దానికి ఫ్లెమింగ్ పేరు పెట్టారు. ఆయన లెక్కలేనన్ని అవార్డులు రివార్డ్‌లు పొందాడు. 1999లో టైం మేగజైన్ ఆయనపై ప్రత్యేక సంచిక తెచ్చింది. ధన్యజీవి ఫ్లెమింగ్.

In 1999,Time magazine named Fleming one of the 100 Most Important People of the 20th century, stating:

It was a discovery that would change the course of history. The active ingredient in that mould, which Fleming named penicillin, turned out to be an infection-fighting agent of enormous potency. When it was finally recognized for what it was, the most efficacious life-saving drug in the world, penicillin would alter forever the treatment of bacterial infections. By the middle of the century, Flemin' s discovery had spawned a huge pharmaceutical industry, churning out synthetic penicillins that would conquer some of mankindÑ s most ancient scourges, including syphilis, gangrene and tuberculosis. (32) ❋



## 69. ప్రయోగాత్మక ప్రపంచ ప్రసిద్ధ ఫ్రెంచ్ చిత్రకారుడు-పాబ్లో పికాసో (1881-1973)

"పెయింటింగ్ అంటే అపార్ట్‌మెంట్‌లకు అలంకారం తెచ్చేది కాదు. చీకటి, క్రూరత్వాలపై యుద్ధం" అన్న మహా చిత్రకారుడు పికాసో. సాధారణంగా యే ఆర్టిస్ట్ అయినా మొదట్లో అనుకరణ స్థాయి నుంచి ప్రారంభిస్తాడు, క్రమంగా తనదైన విధానాన్ని అవలంభించి ప్రతిభ చూపిస్తాడు. అప్పుడు ఏమీ తెలియని వాడైనా అది ఫలానా వాడి చిత్రం అని గుర్తిస్తాడు. కాని పికాసో ఒక అసాధారణ చిత్రకారుడు. ఆయన వేసే చిత్రం సాధారణంగా ఉండదు. కనీసం అందులో అర డజన్ శైలీ భేదాలుంటాయి. ఆయన అనేక తీవ్ర మార్పులకు లోనయ్యాడు. అన్నిటిలో ఆయన ఉత్కృష్ట చిత్రకారుడని పించుకొన్నాడు. ఒక ప్రయోగం తర్వాత మరొకటి చేస్తూ ముందు దాన్ని వదిలేస్తూ సాగింది ఆయన చిత్ర కథా పయనం. అయినా తానూ పూర్తిగా పరిణతి చెందలేదని భావించేవాడు. ఒకే మూసలో వస్తువులు స్థలాలు మనుష్యులు చిత్రింపబడటం ఆయనకు అసంతృప్తి కలిగించింది. అన్ని కాలాల్లోనూ అస్థిర, అత్యుత్సాహ ఆర్టిస్ట్ పికాసో. మేధో సృష్టికర్త పికాసో. ప్రయోగ శిఖరారోహకుడు.

5-10-1881న స్పెయిన్‌లోని మాలగాలో పుట్టిన పికాసో అసలు పేరు చర్చిలో రాసిన దానిప్రకారం "పాబ్లో నేపెనూసేనో క్రిస్పినియానో డి లా సాంటిస్మా ట్రినిడాడ్ రూయిజ్ య పికాసో". స్నేహితులు ఈ చాంతాడు పేరును పాబ్లో రూయిజ్‌గా కుదించారు. తండ్రి జోసె రూయిజ్ బ్లాస్కో, బాస్క్ వంశానికి చెందిన ఆర్ట్ టీచర్. కుర్ర పికాసో మొదటి పెయింటింగ్ గీసి తల్లి, తండ్రి పేర్లు వచ్చేట్లు పి.రూయిజ్ పికాసో అని సంతకం చేశాడు. ఇరవైవ ఏట తండ్రి పేరు సామాన్యమైనదే అని భావించి దాన్ని వదిలి అసాధారణం, శ్రావ్యం అయిన ఆతల్లి పేరునే ఉంచేసుకొన్నాడు. కొన్ని కథనాల ప్రకారం పికాసో చేతిలో పెన్సిల్‌తో జన్మించాడు. కనుకనే నిర్దుష్టమైన డ్రాఫ్ట్ మన్‌గా, నిర్ణయాత్మక ఆర్టిస్ట్‌గా ఎదిగాడు. 14వ ఏట పోర్ట్రైట్ లను చిత్రించాడు.

వాటిని ఎక్స్ప్రెసివ్ రియలిజంకు లోతైన మోడలింగ్‌కు ఉదాహరణలుగా భద్రపరచి రక్షిస్తున్నారు. కుటుంబం బార్సెలోనాకు మారినప్పుడు, అక్కడ ప్రొఫెసర్‌గా ఉన్న తండ్రి కొడుకును స్కూల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌లో చేర్పించాడు. అత్యంత కఠినమైన ఎంట్రెన్స్ పరీక్షలకు సిద్ధం కావటానికి ఒక నెల మాత్రమే గడువు ఇచ్చారు. కాని మనవాడు ఒకే ఒక్క రోజులో వాటిని పూర్తి చేశాడు. పదారేళ్ళ వయసులో మాడ్రిడ్‌లో జరిగిన ఫైన్ ఆర్ట్స్ ఎక్సిబిషన్‌లో చిత్ర ప్రదర్శనలో పాల్గొని అవార్డ్ పొందాడు. కొన్ని నెలలతర్వాత స్వంత స్టూడియో ఏర్పాటు చేసుకొన్నాడు. చిత్రం వేసుకొనే ఏటవాలు బల్ల (ఈజేల్) కాక ఆ రూమ్‌లో ఒక మంచం ఒక కుర్చీ మాత్రమే ఉండేవి. అందుకని గోడలపై విలాసవంతమైన, అలంకరించబడిన ఫర్నిచర్‌ను పెయింట్ చేసి సంతృప్తి చెందేవాడు. వీధుల వెంట తిరుగుతూ కేబెరాలు, రేవులు చూస్తూ కనిపించిన ప్రతిదాన్నీ చిత్రించేవాడు, ఆయన చిత్రించన వాటిలో సోమరిపోతులు, నన్స్, వేశ్యలు, రేవు పనివాళ్ళు, కుక్కలు, అందం ఫాషన్ ఉన్న స్త్రీలు, నీరసించిన ముసలి ముతకా జనం, బలిసిన కాబ్ డ్రైవర్లు ఉన్నారు. వీరి కారికేచర్‌నే చిత్రించేవాడు.

19ఏళ్ళ వయసులో మొదటిసారి పారిస్ వెళ్ళాడు. అక్కడ పికాసో విజయం సాధించటం సామాన్యమైన విషయమే. నెల లోపల మూడు కాన్వాసులను అమ్మాడు. మాడ్రిడ్ తిరిగొచ్చి, "యంగ్ ఆర్ట్" అనే మేగజైన్ ప్రారంభించాడు. తన పాస్టెల్స్ ప్రదర్శించి మళ్ళీ పారిస్ చేరాడు. అక్కడ బాగా ప్రచారంలో ఉన్న తోలోసే లాట్రేస్ బోహీమియన్ స్టూడియోతో, వాన్ గో బ్రష్ వర్క్, గాగిన్ కలర్ మాస్ చిత్రాలతో ప్రభావితుడయ్యాడు. తర్వాత మృదుత్వం తగ్గించి అస్పష్ట అవుట్ లైన్స్‌తో, వివక్షా పూరిత పాలెట్‌తో చిత్రించాడు. అనేక రీతులను అధ్యయనం చేసి, తానే విభిన్న శైలులు అవలంబించి చివరికి తనదైన సృజనాత్మక చిత్రాలకు ప్రాణం పోశాడు. ఇరవై ఏళ్ళకే బీద, అసంతృప్త శుష్కించిన ఎముకలు పొడుచుకు వచ్చిన చేతులు పొడవైన బొమి కల్లాంటి వేళ్ళు, విషాద మాతృమూర్తులు, వారి శరీరాలకు అతుక్కుపోయిన పసిపిల్లలు, బిచ్చగాళ్ళు, దీనులైన శ్రమ జీవులు, అంగవిహీనులు ఆకలితో అలమటించే జంటలు, సంఘ బహిష్కృతులు అయిన స్త్రీ పురుషులను సీరియల్‌గా గీశాడు. విషాదానికి చిహ్నమైన నీలి రంగుతో వ్యంగ్య చిత్రాలుగా కాకుండా లోకంలో ఉన్న దరిద్రం, అలసత్వం, కాపట్యం కారుణ్య హీనతకు అద్దం పట్టేట్లు చూపించాడు. ఒక మానవ సజీవ చిత్రశాల అది. తాడిత పీడిత దీన గాథా చిత్రమాలిక అది. పికాసో స్నేహితుడు అవి మనుషులపై ఆయనకున్న మమకారం సానుభూతి సహవేదనకు చిహ్నాలు అన్నాడు.

23వ ఏట పికాసో చిన్న, నల్లగా బలంగా, అశాంతిగా, చింతతో, నిరుత్సాహపు లోతైన కళ్ళతో, గుచ్చే చూపులతో వింతగా కదలికలేని వాడుగా ఉండేవాడు. దుబ్బ జుట్టు నుదిటిపై పడుతూ వికారంగా, సున్నితమైన స్త్రీ చేతులతో, నిర్లక్ష్యంగా డ్రెస్

వేసుకొని కనిపించేవాడు. మేధావి నుదురు, దానిపై నల్లని కనుబొమలతో సగం బోహిమియన్‌లాగా, సగం వర్కర్‌లాగా కనిపించేవాడు. రాత్రి వేళల్లోనే పెయింట్ చేసేవాడు. డైవ్స్ ప్రైజ్ ఫైట్స్ తిరిగి చూస్తూ సర్కస్ మోజులో పడ్డాడు.

సర్కస్ ఆట మాత్రమే కాదు అది చేసేవాళ్ళ జీవితాలపై అభిమానం అధ్యయనం పికాసో జీవితాన్ని మలుపు తిప్పింది. వీరిపై కళా ఖండాలు అనదగ్గ చిత్రాలు గీశాడు. అందులో బఫూన్లు విషాదంగా కనిపిస్తారు. అప్పటిదాకా ఉపయోగించిన బ్లూ కలర్‌ను వదిలేసి రోజ్ కలర్‌లోకి దిగాడు. లేకపోతే పింక్ కలర్ వాడాడు. దీనివలన భౌతిక అందం తగ్గించాడు. హాలండ్ వెళ్లి వచ్చాక బ్లూ పీరియడ్‌ను వదిలేసి గుండ్రని రమ్యాకృతులు, రక్తం మాంసంతో ఉన్న, వయోరహిత ఔన్నత్యాన్ని కలిపించాడు. ఇదంతా ఇంకా 25 దాటని కుర్ర చిత్రకారుని ప్రతిభ. రిల్కీ చిత్రాల్లా సగం కాంతితో నిత్య వాస్తవికతకు దూరంగా ఉండేవి. తీవ్రంగా ఉన్నా ప్రశాంత ఆహ్లాదంగా కనిపించేవి కాని అవి వ్యక్తీకరణ లేనట్లు ఉండేవి. శైలి కోసం ఆయన పడుతున్న ఏక మానసిక స్థితి గుర్తించాం అన్నాడు. "మారిస్ రేయ్నాల్ ..సంప్రదాయంగా ఉన్న అన్ని సరిహద్దుల్ని అధిగమించి కొత్త క్లాసిజం వైపు అడుగులేస్తున్నాడు. దీనితో అత్యంత ఖచ్చితత్వం వచ్చింది. అతని రోజ్ పీరియడ్‌లో వచ్చిన కూర్పులు పెయింటింగ్‌లో ఉత్తమమైనవి, మాస్టర్ పీస్ అనిపించుకోన్న వాటికి పోలికలో సరిపోతాయి.

25 ఏళ్ళకే పికాసో సుస్థిర చిత్రకారుడైనాడు. ఆయన చిత్రాలను కొనటం, వాటిపై గొప్ప వ్యాఖ్యానాలు చేయటం వంటివి ప్రఖ్యాత చిత్రకారుడు విమర్శకుడు అయిన జెర్ట్రూడ్ స్టెయిన్ లాంటి వాళ్ళు చేశారు. రష్యన్ డీలర్ సెర్జీ శేకిన్ 50 పెద్ద కాన్వాస్‌లు కొన్నాడు. తన చిత్రాన్ని గీయటానికి పికాసో దగ్గర మోడల్‌గా ఎనభై సిట్టింగులు ఇచ్చానని స్టెయిన్ చెప్పింది. దాదాపు చిత్రం పూర్తి అయిందికాని అది పికాసోకు నచ్చక ముఖాన్ని చెరిపేశాడు. కొంతకాలం ఎక్కడెక్కడో తిరిగి వచ్చి మోడల్ లేకుండానే ముఖ కవళికలను గొప్పగా చిత్రించాడు. వస్తువును చూసి చేయటం కంటే ఇమాజినేషన్‌తో చేయటం దీనితో ప్రారంభించాడు.

"వైల్డ్ బీస్ట్"లని పిలువ బడేమాటిస్సే, రౌవాల్ట్, వ్లామింక్, డిరైన్ మొదలైన అతని పెర్షియన్ స్నేహితుల చిత్రాలు పికాసోలో ఆలోచనలు రేపి స్వయం ప్రతిపత్తిగల కళను సృష్టించే అవకాశం ఉంది అనే భావన కలిగింది. అప్పటికి ఇంకా ప్రాతినిధ్యాన్ని వదిలిపెట్టటానికి సిద్ధంగా లేదు. ప్రధానమైన బహుశా పూర్తిగా చిత్ర సంబంధ మైన "కళ కళ కోసమే" అని నిందించిన దానికి మరింత అనువర్తనంగా, సహజానికి విరుద్ధం కాకుండా, యదార్ధం కానట్లుగా ఉండే వక్రీకరించని, సృజనాత్మక కళను పికాసో ఊహిస్తున్నాడు. అతని స్నేహితులు ఆఫ్రికన్ నీగ్రోల మాస్క్‌లు, కొయ్య శిల్పాలు కనుక్కొంటే పికాసో పదునైన కోణాలు, ఆకస్మిక స్తరాలు(ప్లేన్స్), నాటకీయ, జ్ఞాన శూన్య క్రౌర్యంతో

వక్రీకరణలపై మోజు పడ్డాడు. అవన్నీ ఈస్తేటిక్ షాక్ ఇచ్చాయి. సంప్రదాయ కళను దృష్టి కోణాన్ని సవాలు చేసి పెయింటింగ్‌కు నూతన పరిమాణాన్ని ఆవిష్కరించాయి. ఆ పరిణామమే క్యూబిజం. అయినా పికాసో రేఖీయ ఆకృతుల అవకాశాలకోసం అన్వేషిస్తూనే ఉన్నాడు. "ఆఫ్రికా దేశపు ఆదిమ జాతుల విగ్రహాలు అసలైన విలువ కలవని అనుకొని, తన ఈస్తేటిక్ అనుభవాలను మార్చుకొంటూ, ప్రపంచపు కొత్త చిత్రాన్ని తయారు చేసే ప్రయత్నం చేస్తూ, సహజ అనుభవం, అతీంద్రియ అనుభవం ఒకదానిపై ఒకటి పడి ఒక ప్రత్యేక వాస్తవ చిత్రాన్ని తయారు చేసే కృషి కొనసాగించాడు పికాసో" అన్నాడు క్రిస్టియన్ జేర్వోస్.

ప్రత్యేక వాస్తవంను కొట్టవచ్చేట్లు 26వ ఏట 'పెయింట్ చేసిన' "లెస్ డేమాసేల్స్ డి అవిగ్నాన్"లో చూపించి కళాప్రపంచాన్ని ఒక కొత్త వివాదాస్పద ఈస్తెటిక్స్‌తో పెద్ద కుదుపు కుదిపాడు. దీనిపై జేర్వోస్ సమీక్షిస్తూ "this about- face of all aesthetic values marked the beginning of a period which revolutionized painting and enriched all art" అని అంటే, ఆల్ఫ్రెడ్ హెచ్. బార్ జూనియర్ "పికాసో–ఫిఫ్టీ యియర్స్ ఆఫ్ హిజ్ ఆర్ట్"లో ఈ చిత్రం మొట్ట మొదటి క్యూబిస్ట్ చిత్రం –అది సాధారణ రూపాలను అవి వస్తువులైనా స్టిల్ లైఫ్ చిత్రాలైనా, పరదాలైనా వాటిని సెమి అబ్ స్ట్రాక్ట్ డిజైన్‌లుగా జారిపోయేట్లు, స్తరాలమార్పులతో, బోలు ప్రదేశంగా అదిమి మార్చాడు. ఇదే క్యూబిజం. అదొక సంధికాలపు చిత్రం, ప్రయోగ శాల, అంతకు మించి యుద్ధ భూమి, విచారణ, ప్రయోగం. కాని అది కూడా ఒక దారుణమైన, చైతన్య వంతమైన శక్తి –ఆ కాలం లో ఐరోపా కళలో అన్నిటిని మించి అద్వితీయమైనది" అన్నాడు.

తన స్నేహితుడు, సాటి చిత్రకారుడు జార్జెస్ బ్రేక్‌తో కలిసి పికాసో బలీయమైన వెంచర్లను శక్తివంతమైన క్యూబిజంలోకి మార్చాడు. ప్రముఖ చిత్రకారుడు సిజానే–లాండ్ స్కేపులు, సాధారణ వస్తువులు శంకువులు స్తూపాలు గోళాలుగా అమరి ఉంటాయని సూచించాడు. ఈ ఇద్దరుకలిసి దాని క్యూబ్ అంటే ఘనంలోకి వ్యాప్తి చెందించారు. ప్రిజం, త్రిభుజం ,మరికొన్ని పదునైన కోణాలు కల వానిగా, సాలిడ్ జామెట్రీ అనుకరణగా మార్చారు. మరో చిత్రకారుడు స్యురాట్ పెయింటింగ్‌ను "the art of hallowing surface" అన్నాడు. పికాసో విరుద్ధ కళను తయారు చేసే ప్రయత్నంలోఉన్నాడు. ఉపరితలాన్ని శుద్ధ ఘన పరిమాణం ద్రవ్య రాసితో నిర్మించాడు. తనకు కనిపించిన ప్రతి దాన్నీ విశ్లేషించి వ్యక్తిగత భౌతిక కంటితో కాక తనమనో నేత్రంతో ఊహను జోడించి చిత్రించాడు. "ఇప్పుడు పికాసో వస్తువును ఒకే అనేక పార్శ్వాలనుండి అంతర్ నేత్రంతో దర్శించినట్లు గమనిస్తాడు. ఆర్టిస్ట్ ఊహకు అనుగుణంగా భౌతిక వస్తు పథకం కాక వస్తువు పూర్తిగా ఒక్కసారే దర్శనమిస్తుంది. వస్తువు యొక్క ప్రాతినిధ్యంగా

ఆర్ట్ ఉండాలి. అది స్వయం సమృద్ధ మవ్వాలి" అనేది పికాసో సిద్ధాంతం అని మారిస్ రెయ్నాల్ అన్నాడు.

అన్నీ విసర్జించే ప్రయత్నంలో వస్తు నిర్మాణం కంటే వాటి కారక అంశాలకు సంబంధించిన సూత్రాలను స్థాపించే ప్రయత్నంలో ఉన్న పికాసో పూర్వపు రూపం కోసం వస్తువుల ఆకారం మార్చి, పూర్వపు బలమైన రంగుల్ని వదిలేసి పొడిలక్షణాలను, విలక్షణమైన ఆకర్షణను కలిపించాడు. దీనికోసం కోల్డ్ గ్రే, ఆకర్షణ లేని బ్రౌన్ పాలిపోయిన సాండోయిష్ ఎల్లో బ్రౌన్, స్తబ్దతగా కనిపించే 19వ శతాబ్దిలో మోనో క్రోం ఫోటోగ్రాఫ్‌లలో వాడిన రెడ్డిష్ బ్రౌన్ రంగులను ఉపయోగించాడు. తీవ్రత అంచులదాకా వెళ్లి, తన వస్తువుల నుండి సారాన్ని పీల్చి స్వచ్ఛమైన రూపకల్పనను కాపాడుతూ చిత్రించి, అస్తవ్యస్తతతో పోగు చేసిన అనవసర వివరాలకు స్వస్తి చెప్పాడు. నిశిత కోణ రూప భేదాలను, అవి ఎలాంటి అక్రమ ప్లాస్టక్ ప్లేన్ లైనా, పికాసో అనాటమీని అతి శాస్త్రీయంగా భాగాలుగా విడగొట్టి ఆపరేషన్ విజయవంతం అయినా, తరచుగా వ్యక్తి బతక నట్లు ప్రయోగాలు చేశాడు. సమాంతర, నిలువులకు ముసుగేసి అసలు వస్తువే దాదాపు కనిపించకుండా పోయేట్లు చిత్రించాడు. అందులో ఒక సలహా, అస్పష్ట సూచన, ఉండి ధీం అంటే నేపథ్యం వైవిధ్య సంక్లిష్టతతో ఒక "ఐడియో గ్రామ్"లాగా మారిపోయేట్లు చేశాడు. "The true Picassophile divides this period into proto --cubism, analytical cubism, hermeti ccubism, synthetic cubism, -there is even a completely contradictory but solemnly announced "curvilinear cubism". ఇన్ని విధాలుగా ఆయన చిత్రకళ రూపాంతరం చెందింది. అన్నీ ప్రయోగాలే. ఎందులోనూ అసంతృప్తే. అందుకే ప్రయోగాలమీద ప్రయోగాలు అంతులేకుండా చేశాడు పికాసో.

తన అభి వృద్ధి గురించి అతి తక్కువగా పికాసో వివరించేవాడు. క్యూబిజంకు దాదాపు బానిస అయ్యానని సమర్థించుకొనే వాడు. 1923 మే నెలలో ప్రచురితమైన "ది ఆర్ట్స్" పత్రికలో "క్యూబిజం మిగిలిన యే రకమైన పెయింటింగ్ కంటే తేడా ఉన్నది కాదు. అవే సూత్రాలు అవే మూలకాలు ఇందులోనూ ఉన్నాయి. నిజానికి క్యూబిజాన్ని ఇవాల్టి వరకు ఎవరూ అర్థం చేసుకోలేక పోయారు. కొంతమందికి అందులో ఏమీ కనిపించలేదు. ఏమీ లేదు అన్నారు కూడా. నేను ఇంగ్లీష్ చదవ లేను. ఇంగ్లీష్ పుస్తకం నాకు బ్లాంక్ పుస్తకం. దీనర్థం నేను ఎవరిపైనో నింద వేస్తున్నానని కాదు విమర్శిస్తున్నానని కాదు. లెక్కలు, కెమిస్ట్రీ, ఫిజిక్స్, సైకో అనాలిసిస్, మ్యూజిక్ మొదలైనవి నాకు అర్థం కానంత మాత్రాన అవి క్యూబిజానికి సంబంధించినవి కావు అనటాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాను. ఇదంతా సాహిత్యమే. సిద్ధాంతాలతో ప్రజలకు అంధత్వం, చెడుఫలితాల నిచ్చినంత మాత్రాన అర్థం పర్థం లేనిది అనటం

అర్ధం చేసుకోలేక పోతున్నాను. క్యూబిజం తనను తాను పెయింటింగ్ హద్దుల్లో ఉంచుకొని, ఎప్పుడూ దాని హద్దు దాటనని అది మభ్య పెట్టలేదు. విషయం, రూపాలను గతంలో విస్మరించగా మేము పెయింటింగ్‌లలో పరిచయం చేసిన వస్తువులు తేడాలుగా ఉండవచ్చు. పరిసరాలను మా కళ్ళు మెదడూ ఎప్పుడూ చూస్తూనే ఉంటాయి"అన్నాడు పికాసో. తన కళ్ళు ఎప్పుడూ తెరుచుకొని ఉండటమే కాదు పికాసో తన విమర్శకులను ఒక అత్యున్నత వివాద వైరుధ్యాలలో పడేస్తూ 20ఏళ్ళు దాటగానే "లెజెండ్" అనిపించుకొన్నాడు. 30వ ఏట తన 84 చిత్రాలతో 1911 ఏప్రిల్‌లో అమెరికాలో ఏక వ్యక్తి ప్రదర్శన నిర్వహించాడు.

క్యూబిజంతో ఉన్న ఆర్ట్ అంతా ఖర్చు చేసి ఆగిపోలేదు. అంతకన్నా మరింత తీవ్రమైన ప్రయోగాలు చేశాడు. కొంతకాలం "కోల్లజేస్"తో ఆడుకొన్నాడు. కోల్లజేస్ అంటే ఫోటోగ్రాఫ్‌లు, కాగితం ముక్కలు, గుడ్డ ముక్కలు మొదలైన అనేక రకాల వస్తువులను, ఆర్టిస్టిక్‌గా అంటించటం. అలాగే ఉపరి తలాలపై పేపర్, మొదలైన వస్తువులను ఒకదానిపై ఒకటి ఇష్టమొచ్చినట్లు అతికించి, వాటిపై కాని వాటి చుట్టూ కాని పెయింట్ చేయటం చేశాడు. అంటే అతి సామాన్య వస్తువుల నుంచి అందాన్ని రేకెత్తించటం చేశాడు. న్యూస్ ప్రింట్‌పై, తాడు ముక్కలపై, లినోలియం అంటే లిన్ సీడ్ ఆయిల్, పౌడర్డ్ కార్క్ లను కాన్వాస్‌పై దట్టంగా అంటించటం సాండ్, క్లాత్, గ్లాస్, గుర్తించలేని విధంగా కొయ్యను, షీట్ మ్యూజిక్ అంటే ప్రింటెడ్ మ్యూజిక్‌ను చార్కోల్, ఇంకు లేక ఆయిల్‌లతో కలిపి అతికించటం చేశాడు. ఇదంతా కోల్లజ్ టెక్నిక్. ఇది ఒక సరళీకృత మోజాక్. నేత విధానంకు ప్రాధాన్యమిచ్చి, అతి సాధారణ చెత్తా చెదారంను మిశ్రమం చేసి అపూర్వ, అసాధారణ, అవాస్తవిక అందాన్ని చేకూర్చి ఒక రకంగా "పెయింటర్స్ పార డాక్స్" (చిత్రకారుని విరుద్ధత)ను వింత, విలక్షణ అందమైన నిరాడంబర రూప కల్పన చేశాడు.

34వ ఏట రియలిజాన్ని వదిలేసిన పదేళ్లకు ఒక్క సారిగా మళ్ళీ వెనక్కి మళ్ళి, అతి జాగ్రత్తగా తన స్నేహితుల, సహాయకుల నేచుర లిస్టిక్ గ్రాఫిక్ పోర్ట్రైట్‌లు గీశాడు. "ఈ క్లాసిక్ పీరియడ్" రోమ్‌కు వెళ్లి విస్తృత పరచాడు. అక్కడ "పెరేడ్" అనే ఒక బాలెట్‌కు కర్టెన్, స్క్రీన్, కాస్ట్యూమ్స్ డిజైన్ చేశాడు. దీన్ని సెర్జీ దయాఘిలేవ్ నిర్మిస్తే ఎరిక్ సాటీ సంగీతం సమకూర్చాడు. అక్కడ స్ట్రావేన్స్కి అనే కంపోజర్‌ను కలిసి ఆయన "రాగ్ టైం" కవర్‌కు స్కెచ్ వేశాడు. రష్యన్ బాలెట్ బృందంతో బాగా ఉల్లాసంగా గడిపాడు. వారితో రిహార్సల్‌లను రోమన్ సెల్లార్లలో చేస్తూ రాత్రివేళ చంద్రకాంతిలో తిరుగుతూ నేపుల్స్, పాంపీలు తిరిగి చూస్తూ, ఆ ట్రూప్‌లో డాన్సర్ యువతి వోల్గా కొక్లోవాను పెళ్లి చేసుకొని, పాల్ అనే కొడుకుకు జన్మనిచ్చాడు. మూడేళ్ళ వయసులో తీవ్రమైన కాంక్ష కళ హాస్యగాడిగా ఒకటి, నాలుగో ఏట అందమైన ఆకర్షణ, కొద్దిపాటి విచక్షణతో

ఫ్రెంచ్ పాంటోమైమ్‌లోని విచార పాలిపోయిన ముఖం, వదులైనతెల్లటి బట్టలతో పాయింటెడ్ హాట్ పెట్టుకొన్నవాడిగా ఒకటి మొత్తం రెండు కొడుకు పాల్ చిత్రాలను చిరస్మరణీయంగా చిత్రించాడు తండ్రి పికాసో. ముప్ఫైలలో ఎప్పుడూ పికాసో పరిణతి చెందినవాడిగా కనిపించాడు. కాని యే శైలికి కట్టుబడక, నైరూప్య (ఆబ్ స్ట్రాక్ట్), క్యూబిక్ నమూనాలు, అలంకరణ ఉన్న లాండ్ స్కేప్, సున్నిత లైన్ డ్రాయింగ్ చిత్రాలు గీస్తూ "ఇంగ్రేస్" చిత్రకారుని నాజూకు, సొంపుతోతో పోటీ పడే చిత్రాలు తయారుచేశాడు.

ముప్ఫైల చివరలో పికాసో "నియో క్లాసికల్ పీరియడ్" ప్రారంభమైంది. సెమి ట్రాపికల్ ఫ్రెంచ్ రేవేరాలో ఉంటూ పూల ముక్కల్ని పరిణతి చెందింపజేస్తూ, పండ్లను 17,18 శతాబ్దాలనాటి యూరోపియన్ ఆర్కిటెక్చర్ లా అమరుస్తూ, వస్తువులను ఆకర్షణతో కళకళ లాడేట్లు గుండ్రంగా, అసలు ఇది వరకు ఎప్పుడూ క్యూబ్‌ను చూడని వాడిలాగా మెస్మరైజ్ చేశాడు. నలభైలలో అతని చిత్ర రూపాలు హీరోయిక్ సమతుల్యతతో గీశాడు. మొదటి ప్రపంచ యుద్ధం అనంతర పరిణామాలు పికాసోను మళ్ళీ పూర్వపు మానవత్వ భావాలకు చేర్చాయి. అనేక సార్లు గీసిన "వుమన్ ఇన్ వైట్" ఇప్పుడు సున్నితంగా కొంతవరకు అభివ్యక్తీకరణంగా ఉన్నాయి. కాని అందులో ఎక్కువ భాగం పురాతన శిలను నరికి మలచినట్లు ఉండేవి. అవి దృఢత్వంలో క్లాసికల్‌గా ఉండటమే కాక ఆవి విషయంకంటే రూపానికి ప్రాధాన్య మిచ్చినట్లు ఉండేవి. అంతేకాదు హుందా, గౌరవం కలబోసినట్లు ఉండేవే కాని రొమాంటిక్ ప్రయోగాలతో ఏర్పడ్డవి కాదు. ఈ పికాసో పెయింటింగ్‌లను "Monumental ,impassive ,immovable are a few of the adjectives with which the critics described the heavy --limbed sculptural paintings".

తరువాత 12 ఏళ్ళలో పికాసో అనేక రూపవిక్రియలకు (మెటామార్ఫసెస్) లోనైనాడు. వైర్‌లతో తుప్పు పట్టిన ఇనుము, కొయ్యలతో నిర్మాణాలు చేశాడు. సర్రియలిస్టిక్ కవిత్వం రాశాడు. శిల్పకళలో ప్రవేశించి, అతి పెద్ద తలకాయలు, జంతువులను రూపమార్పిడిచేశాడు .స్మారక చిహ్నాల ప్రాజెక్ట్ లు చేబట్టాడు .నైరూప్య వరదలో నుండి బయటపడి హింసాత్మక ,తిరుగు బాటు ధోరణితో, అవాంఛనీయ లక్షణాలతో, గాఢమైన అలజడితో సరసమైన సొగసైన ఒంటికాలిపై నిలబడి, రెండవ కాలు సమాంతరంగా జాపినట్లున్న కేవలం ఆనందం కలుగజేసే డిజైన్‌లను రూపొందించాడు. అంటే ఇప్పుడు పికాసో ప్రవహించే గీతలో అందాన్ని దర్శించి ఆ వైపుకు తన దృష్టిని కేంద్రీకరిస్తున్నాడన్న మాట. దీనిలో ఆకృతిని దాటి అర్థం లేదని లేక ఆకృతే పరమార్థమని అదే పరిపూర్ణమైన రూపం అని భావించాడు.

స్పానిష్ సివిల్ వార్ పికాసో యాభైలలో ఉండగా వచ్చింది. యుద్ధ సన్నద్ధమౌతున్న లాయలిస్ట్‌లతో స్పెయిన్‌లో ఉన్నాడు. ఆయన్ను యుద్ధోత్సాహంలేని, ఫ్రాన్స్‌లో నివసిస్తున్న

స్పానియార్డ్‌గా మొ ప్ర.యు. కాలంలో భావించారు. ఇప్పుడు ఆయన రాజకీయాలకు దూరంగా ఉన్నా, ఫ్రాంకో నాయకత్వం వహిస్తున్న నిరంకుశత్వ తిరుగుబాటు దారులకు, వారి మిలిటరీ క్రూర విప్లవ భావాలకు ఎదురు నిలిచి పోరాడుతున్న రిబలికన్ ప్రభుత్వానికి పికాసో మద్దతు చూపే కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నాడు. మాంచి ప్రచారకర్తగా దూసుకు పోతూ "పారడో"కు డైరెక్టర్ అయి మ్యూజియంలోని విలువైన వస్తువులు దుండగుల చేతుల్లో వినాశనం కాకుండా కాపాడ గలిగాడు. అందుకే ఆయన "painting is not done to decorate apartments. It is an instrument of war for attack and defense against the enemy, against brutality and darkness" అని అన్నాడు. నాజీ విమానాలు స్పానిష్ ఫాసిస్ట్‌లతో చేతులు కలిపి గ్యూర్నికాలోని ప్రశాంత బ్రాస్క్యు టౌన్‌పై బాంబుల వర్షం కరిపించి తుడిచి పెట్టేసినప్పుడు పికాసో అందరూ భావించినట్లు అతని సర్వోత్కృష్టమైంది కాకపోయినా అత్యంత భావాత్మక వ్యక్తీకరణమైన ముఖ్యమైన పనిలో నిమగ్నమై ఉన్నాడు. 300 చదరపు అడుగుల అతి పెద్ద కేన్వాస్ మీద యుద్ధపు క్రూరత్వాన్ని, ముఖ్యంగా ఇప్పుడు జరుగుతున్నా యుద్ధ అనాగరకత్వాన్ని నిరశిస్తూ రాశాడు. తన భావాలను తెలియ బరుస్తూ "The Spanish struggle is the fight of reaction against the people ,against freedom" అన్నాడు. పెయింటింగ్‌లో ఉండి" నా జీవితమంతా కళాత్మకమే, ప్రతిక్రియపై, కళ మరణంపై నిరంతర సమరమే. మిలిటరీ కులం స్పెయిన్ దేశాన్ని బాధా మరణ సముద్రంలో ముంచేసింది అని నేను విస్పష్టంగా నా అసహాయతను వ్యక్త పరుస్తున్నాను" అని చెప్పిన ప్రజాభిమాని పికాసో.

పికాసో చూపిన సాహసం దౌర్జన్యంపై ఏహ్యాభావ ప్రకటన, టెర్రర్‌ను రేకెత్తించే చిత్రాలు "గుయెర్నికా"లో ప్రస్ఫుటంగా తెలియ జేశాడు. కాని అందులోని సంకేతాలు, రాక్షసులు, విరిగిపోయిన శరీరభాగాలు, వక్రీకరించబడిన ఎద్దులు, అరిచే గుర్రాలను గ్రే, బ్లాక్, తెలుపు రంగుల్లో భయంకరంగా ఉన్నా స్పష్టంగా భావవ్యక్తీకరణ చేయనట్లుగా చిత్రించాడు. 1937లో జరిగిన పారిస్ వరల్డ్ ఫెయిర్‌లో పికాసో ప్రదర్శించిన విస్తృత చిత్రాన్ని చాలా నిశితంగా పరీక్షించి తన పుస్తకంలో చాలా పేజీలు కేటాయించి రాశాడు ఆల్ఫ్రెడ్ హెచ్ బార్. "సైన్స్ అండ్ సొసైటీ"లో వెర్నాన్ క్లార్క్ ఉదాహరించిన "గుర్నేకా చిత్రం ఉన్న స్థితిని అన్నిధోరణుల పరాకాష్టగా, కళాత్మకంగా, మానసికంగా, పాత విధానాలపై నిర్మించిన కొత్త విధానంగా ఉంది" అని మెచ్చినట్లు తెలిపాడు. న్యు యార్క్ మెట్రో పాలిటన్ మ్యూజియం అండ్ ఆర్ట్ డైరెక్టర్ ఫ్రాన్సిస్ హెన్రి టేలర్ "బాబెల్స్ టవర్" సామాన్యాన్ని పెద్ద ప్రకటనగా చెప్పాడు" అని వెక్కిరించాడు. కాని ఆంగ్ల కవి, రచయితా హెర్బర్ట్ రీడ్ మాత్రం "A monument to disillusion, to despair, to destruction. His symbols are are banal, like the symbols of

Homer, Dante ,Cervantes. It is a great work of art transcending all schools and categories, is being born and being born lives immortally" అని మహా మెచ్చాడు. పికాసో ఒక ప్రపంచ మహా విపత్తును సామాన్యుడికి ఇప్పటికిప్పుడు అర్థమయ్యేట్లు కాని చిత్ర భాష లోరచించాడు. "ఈ చిత్రం పూర్తిగా తనను తాను వివరించుకోక పోయినా, దాన్ని తేలికగా అనుకూలంగా రక్షించు కొంటుంది. ఇది సరి పోయేంత డోసులో లేని మహోన్నత చిత్రంకాదు అన్నవారికి అది రాబోయే కాలంలో జరిగే అనర్థాన్ని చాటి చెబుతుంది. బహుశా మనం ఉన్న శతాబ్దంలోనే ఆ వికృత రూపాన్ని చూస్తాం" అన్నాడు బార్.

1937 నుండి పికాసో గీసిన చాలా చిత్రాలు చాలా నిరాశతో భంగకరంగా ఉన్నాయి. మనం చూస్తున్న అవిటి అనాకారి మానవ రూపాలు, మానవులు పరస్పర కలహం దౌర్జన్యం, హింసలతో ఆవిర్భవించినవే, కావాలని వినాశనం కొని తెచ్చుకొన్నవే. క్రమంగా పికాసో ఉపరితల ప్రదర్శనకు దూరమై, సామాన్య మానవుడికి అప్పటికప్పుడు అర్థమయ్యేరీతి లేని విధంగా శక్తివంతమైన నిగూఢ కళను చేబట్టాడు. సాదృశ్యత లేని విధంగా సాంకేతికతతో భయ విహ్వలంగా, ముఖం లోపలి భావాలను పికాసో చిత్రిస్తున్నట్లు, ముసుగువెనక ఉన్న బుద్ధి, మనసులాగా చిత్రిస్తున్నాడు. కవళికలను పునః పంపిణీ చేస్తున్నట్లు, రేఖాచిత్ర దృశ్యంగా (ప్రొఫైల్) ముఖంకూడా బాగా కనిపించేట్లు ముక్కు కన్ను ఉన్న స్థానంలో, ఉండేట్లు గీశాడు. "The simultaneity of two different aspects has a distinctive purpose. Picasso hopes to give a feeling of the live and active person not a static replica --he presents a face with all its complexity ofplanes in motion, moving not only in space but time" అని వీటికి భాష్యం చెప్పారు. అతని చిత్రాలు వింతగా, అర్థం చేసుకోవటానికి వీలు లేనివిగా ఉన్నాయంటే, దానికి కారణం మన విజన్. మనం ఎప్పుడూ ఒకే దృష్టితో వస్తువులను చూడటానికి ఇప్పటిదాకా అలవాటు పడటం, ఒకటే విషయాన్ని చూడటమే దీనికి కారణం. అందుకే ఒకేసమయంలో అనేక విషయాలు, పార్శ్వాలు చూసే దిక్సూచి లాంటిది మనకు లోపించటమే. బ్లేక్ కవి "ఆగరీస్ ఆఫ్ ఇన్నో సెన్స్" కవిత పికాసోకు బాగా తెలుసుననిపిస్తుంది. ఆ కవితా సౌందర్యం బ్లేక్ మాటలలోనే–

"we are led to believe a lie --when we see with ,not through the eyes" కంటితో చూసిన అబద్ధాన్ని నమ్మటానికి అలవాటు పడ్డాం కాని కంటిలోంచి చూసింది కాదు. పికాసో చేసిన, చూపిన రెండు ముఖాల తలలతో బాటు మరింత లోతుగా నైరూప్యానికి అన్వేషణ సాగించాడు. ఒక పీడకల లాంటి ఐరానిక్ నాటకం రాశాడు. ఇంకా తెగువతో ప్రాజెక్టలను చేయాలని ఆలోచిస్తుండగా రెండవ ప్రపంచ

యుద్ధం మొదలైంది. జర్మన్ సైన్యం పారిస్‌ను ఆక్రమించినప్పుడు పికాసో అక్కడే ఉన్నాడు. తన కళను దిగజారిపోయిన కళ అని ఈసడించిన నాజీలు, అతని ప్రాణానికి ప్రమాదం తెచ్చారు. పారిపోవటానికి నచ్చ చెప్పుకోలేక పోయాడు. యుద్ధ కాలమంతా పారిస్‌లోనే ఉంటూ శత్రు దేశంతో చేతులు కలిపి పని చేయటానికి తిరస్కరించాడు. దీనికి విరుద్ధంగా తన "గుయెర్నికా" చిత్రాలను అందరికి పంచి పెడుతూ ఆనందిస్తున్నాడు. లిబరేషన్–విముక్తి తర్వాత క్లాడే, పలోమా అనే ఇద్దరు పిల్లల తండ్రి అయ్యాడు. తన వయసుకు 42ఏళ్ళ జూనియర్ అయిన ఆవిడ ద్వారా. ఫ్రెంచ్ రేవేర్రా మీద యాన్టైర్ దగ్గరున్నవల్లారిస్‌కు చేరాడు. మళ్ళీ ఆయన ఆర్ట్ మార్పు చెందింది. ఈ పెయింటింగ్‌లు కొత్త అత్యుత్సాహం, కొంత ఉపశమనం మరికొంత తేలిక హృదయంతో అలరించాయి. నిరంతర అన్వేషణ సృజనశీలి కనుక లితోగ్రఫీలో కొత్త టెక్నిక్ ప్రయోగించి, సరి కొత్త పాత మాధ్యమం పింగాణీని కనిపెట్టి మట్టిని పిగ్మెంట్ ల్లాగా సృజనతో కొత్త ఆకారాలు చేశాడు. నీడింగ్, వస్తువుల్ని కాల్చటం, ప్రాచీన ప్లేట్ల మీద, దేగిసాలమీద గీశాడు. మట్టి కుండల్ని అనేక రూపాలతో చేశాడు. మేక లాంటి జగ్గులు, స్త్రీ లాంటి జాడీలు, టీ పాట్‌లను పక్షి ముక్కు స్పౌట్స్ (జారే ప్రదేశం)లు తయారు చేశాడు.

70వ పడిలో కూడా నిరంతర సృజనశీలిగానే ఉన్నాడు. పూర్తిగా విగ్రహ వినాశకారి అయ్యాడు. 1952లో ఒక "మిడటరేనియన్ లాండ్ స్కేప్"ను దట్టమైన రంగుల కాంపోజిషన్‌తో పూర్వం ఎప్పుడూ చిత్రించని విధంగా భిన్నంగా చిత్రించాడు. "మాసకర్ ఇన్ కొరియా" మరో కనికరంలేని సమకాలీన భయంకర చిత్రం. 1953మేలో అంతకు పూర్వం ఎవరూ చూడని తన "వన్ మాన్" 50చిత్రాల ప్రదర్శనను రోమ్ నగరంలో ఏర్పాటు చేశాడు. ఇవి మ్యూజియం ఆఫ్ మోడరన్ ఆర్ట్ భవనంలో 14 గదులలో అమర్చాడు. విమర్శకులు యధా ప్రకారం అతని కొత్త విధానాలను ఒకటి కాదని వేరొక దానికి మొగ్గటాన్ని విమర్శిస్తూనే ఉన్నారు. ఆయన అభిమానులు ఒక దానిలో పరిపూర్ణత సాధించాకే ఇంకో దానిని స్వీకరిస్తున్నాడని అన్నారు. ఆయన్ను వ్యతిరేకించేవారు ఈ మార్పులన్నీ ఆయనకు సీరియస్ నెస్ ఉద్దేశ్యం లేక పోవటంగా (గాంభీర్య రాహిత్యంగా) ఆయన విధానానికే తప్ప అర్ధానికి విలువ ఇవ్వటం లేదని దెప్పారు. ఆయన కళ ఎప్పుడో అర్ధరహితమై పోయిందన్నారు. "మోడరన్ ఆర్ట్" పుస్తకంలో థామస్ క్రేవన్ "పికాసోకు జీవితంపై ఆసక్తి లేదు ఆయనకు యాంత్రిక చిత్ర నిర్మాణమే ఉన్న కళ మాత్రమే కావాలి. తన చురుకైన తెలివిని నిరింద్రియ ప్రపంచంను కళారాహిత్యంగా చేయటానికి శ్రమిస్తున్నాడు. ఆయన కళ పరిపూర్ణమైనదే ఎందుకంటే, అది ఏమీ ఇవ్వదు కనుక. అది స్వచ్ఛ మైనది కారణం అది సంతృప్త మానవ ప్రక్షాళన చేస్తుంది కనుక. అది క్లాసిక్ – ఎందుకు అంటే అది చచ్చిపోయింది కనుక" అని రాశాడు. పికాసో ఇలాంటి ఉడత ఊపులకు జవాబు ఇవ్వలేదు. కాని

గుయెర్నికాలాంటి పెయింటింగ్‌లతో, తన రచనలతో మాత్రమే జవాబిచ్చాడు. ఆయన "artists who live with spiritual values cannot remain in different to the conflicts about them struggles' in which the highest values of humanity and civilization are at stake" అని రాశాడు. రూపం అనేదే నిర్హేతుక స్వేచ్ఛ కలదే అయినా తాను "నైరూప్యకళ" (అబ్స్ట్రాక్ట్) ఉందని నమ్మనని, కళకు ఉన్న లోతైన ధర్మం మానవుని భావోద్వేగాలను సమతుల్యం, క్రమతలను సాధించటమే" అన్నాడు పికాసో. "if the subjects I have wanted to express have suggested different ways of expression I have never hesitated to adopt them" అని చెప్పాడు రాతలలో. "నేను ఎప్పుడు ఏది చెప్పాలనుకొన్నా, దాన్ని నేను అనుభవించిన విధానంలోనే, చెప్పాల్సిన పద్ధతిలోనే చెప్పాను. విభిన్నమైన ఉద్దేశ్యాలు తప్పని సరిగా విభిన్న విధానాలలో చెప్పాల్సిన అవసరం ఉంది. దీనికి పరిణామ క్రియకాని, లేక అభివృద్ధి కాని అన్వయించదు. కాని ఒక ఆలోచనకు అనువర్తనం అయి చెప్పాల్సిన దాన్ని అతి విస్పష్టంగా ఆవిష్కరించే వీలు కలుగుతుంది" అని చెప్పాడు పికాసో. "painting of his pictures as "the result of sudden vision, rather than of calculated manipulation of form" అని విశ్లేషిస్తూ జేమ్స్ త్రాల్ సోబే చివరగా "he was and remains one of the most extraordinary creators of imagery in the long history of art" అని ముగించాడు. 91వ ఏట మహా చిత్రకారుడు పాబ్లో పికాసో 8-4-1973న ఫ్రాన్స్‌లోని మొగిన్స్‌లో మరణించాడు.

పికాసో చిత్రకళా సోపానాన్ని చూస్తుంటే మన కృష్ణాజిల్లా గుడివాడకు చెందిన ఆధునిక చిత్రకారులు శ్రీ ఎస్.వి. రామారావు గారు జ్ఞాపక మొస్తున్నారు. ఆయన కూడా చిత్రకళలో అనేక ప్రయోగాలు చేసి, నిరంతర ప్రయోగ శీలియై నైరూప్య చిత్రకళ అవధిని దాటి సుమారు 50 ఏళ్ళనుంచి అమెరికాలో ఉంటూ చిత్రకళా లోతులను తరచి "ఆధునిక పికాసో" అని పించుకొన్నారు. మంచి కవి కూడా. తమ కవితలను సంకలనాలుగా తెచ్చారు. ఈ మధ్య ఆరేళ్ళ నుంచి ఢిల్లీలో ఉంటూ మరొక కొత్త ప్రక్రియ కోసం తపిస్తున్నారు. శ్రీ రామోజీరావు గారి ఆధ్వర్యంలో నడుస్తున్న "తెలుగు వెలుగు" మాసపత్రిక మే సంచికకు ఇంటర్వ్యూ ఇస్తూ "నేను పికాసో కంటే గొప్ప వాడిని" అని స్పష్టంగా చెప్పిన చిత్రకారులాయన.

ఇప్పుడు పికాసో గురించి మరికొన్ని సంగతులు తెలుసుకొందాం-ఆయన చిత్రయాత్రలో మొదటికాలం బ్లూ పీరియడ్. ఇది 1901 నుంచి మూడేళ్ళు సాగింది. ఈ కాలంలో బార్సెలోనా, పారిస్‌ల మధ్య తిరిగాడు. ఇప్పుడు గీసిన "ది ఫ్రూగల్ రిపాస్ట్"లో గుడ్డివాడు కళ్ళున్న స్త్రీ ఉంటారు. ఆయన చిత్రాల్లో గుడ్డితనం

పునరావృత్తమౌతుంది. "బ్లైండ్ మాన్స్ మీల్" గొప్ప చిత్రం. 1904 నుండి 1906 వరకు ఉన్న రెండవ కాలాన్ని "రోజ్ పీరియడ్" అంటారు. సర్కస్ జనాన్ని ఆరంజ్, పింక్ రంగులలో చిత్రించాడు. హీర్లేక్విన్ అనే హాస్యగాడిని గళ్ళ దుస్తులతో చిత్రించాడు. స్నేహితురాలు భార్య ఫెర్నాడే ఆలివర్‌ను ఈకాలంలో చాలా చిత్రాలలో చూపాడు. లియో జెర్ ట్రూడ్ స్టెయిన్‌ల అభిమానం పొందాడు. 1907లో పారిస్‌లో డేనియల్ హెన్రి కావీలర్ పెట్టిన ఆర్ట్ గాలేరీలో చేరాడు. తరువాతది ఆఫ్రికన్ ప్రభావ కాలం. ఇది 1907 నుంచి రెండేళ్ళు సాగింది. ఇదే తర్వాత క్యూబిజంలోకి దారి తీసింది. 1909 నుంచి 12 వరకు ఉన్నకాలాన్ని అనలిటికల్ క్యూబిజం పీరియడ్ అన్నారు. మోనో క్రోం బ్రౌనిష్, న్యూట్రల్ రంగులు వాడాడు. తర్వాత సిన్థేటిక్ క్యూబిజంలోకి, తర్వాత కోల్లెగ్‌లోకి ప్రవేశించాడు (19-12-19) 1911లో ఇటలీ చిత్రకారుడు లియోనార్డో డావిన్సి చిత్రించిన ప్రసిద్ధ "మోనాలిసా" చిత్రాన్ని దొంగిలించాడని అరెస్ట్ చేశారు. విచారణ జరిగి వదిలేశారు. 1915-17 మధ్య రేఖీయ చిత్రాలకాలం స్క్వేర్ కట్ దయమండ్స్‌తో ప్రయోగాలు చేశాడు. ఈ కాలాన్ని "క్రిస్టల్ పీరియడ్" అంటారు.

1917లో ఇటలీ మొదటిసారి వెళ్ళాడు. నియో క్లాసిక్ చిత్రాలు గీశాడు. 1925లో సర్రియలిస్ట్ రచయిత ఆండ్రే బేటన్ -పికాసోను తమవాడు అని ప్రకటించాడు. "దేశ డిమో సిల్లెస్ మొదటిసారిగా యూరప్‌లో తిరిగి సృష్టించాడు. సర్రియలిస్ట్ ఎక్సి బిషన్‌లో క్యూబిస్ట్ ప్రదర్శన చేశాడు. 1930లలో హీర్లేక్విన్ బదులు మినోటార్ను ఎక్కువగా గీశాడు. 1935 నుంచి 1959 వరకు 24 ఏళ్ళు పికాసో 300కు పైగా కవితలు రాశాడు. 1949లో మూడవ అంతర్జాతీయ శిల్ప సదస్సు ఫిలడెల్ఫియా మ్యూజియం ఆఫ్ ఆర్ట్స్‌లో జరిగింది. ప్రపంచ వ్యాప్తంగా 250 మంది శిల్పులు పికాసోతో సహా పాల్గొన్నారు. మళ్ళీ శైలి మార్చాడు. చికాగోలో 50 అడుగుల ఎత్తు ఉండే విగ్రహాన్ని నిర్మించటానికి పికాసోను ఆహ్వానించారు. దాన్ని ఇప్పుడు "చికాగో పికాసో" అంటారు. ఆయన జీవితం చివరలో చేసినవన్నీ మిశ్రమ శైలికి చెందినవే.

జీవితకాలంలో పికాసో యాభై వేల పనులు చేశాడు. అందులో 1885 పెయింటింగ్‌లు, 1228 శిల్పాలు, 2880 సిరామిక్స్, సుమారు 12వేల డ్రాయింగ్‌లున్నాయి. రంగును భావవ్యక్తీకరణకు బాగా ఉయోగించినవాడు పికాసో. పెయింట్‌లో ఇసుక కూడా కలిపి రావాల్సిన ఎఫెక్ట్ సాధించాడు. అయన క్యూబిక్ విధానం ఆబ్స్ట్రాక్ట్ పద్ధతిలోకి దారి తీసింది. ఆయనది "అతి విశాల చిత్ర స్వీయ చరిత్ర" (వాస్ట్ పిక్టోరల్ ఆటో బయాగ్రఫి). ఆయన చిత్రాలు అత్యంత ఎక్కువ ఖరీదుకు అమ్ముడయ్యాయి. "గార్కాన్ ఆ లా పైప్" చిత్రం 104 మిలియన్ డాలర్లకు లండన్‌లో అమ్ముడయి రికార్డ్ సృష్టించింది. 2016 జూన్ 21న "ఫెమ్మి అస్సేస్సే" చిత్రం 43.2 మిలియన్ డాలర్లకు లండన్‌లోని సౌత్ బెలో కొన్నారంటే ఆయనపై అభిమానం ఈనాటికీ యెంత ఉందో తెలుస్తోంది. అదీ పాబ్లో పికాసో చిత్ర విజయం..❋



## 70. న్యు డీల్, అమెరికన్ లిబరలిజంతో నాలుగుసార్లు అమెరికన్ ప్రెసిడెంట్ అయిన- ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్ (1882-1945)

"మంచి పోరాటం కంటే నాకిష్ట మైంది ఏదీ లేదు" అనే అమెరిక ప్రెసిడెంట్ రూజ్వెల్ట్, నాలుగుసార్లు ప్రెసిడెంట్ పదవికి పోటీ చేసి గెలిచి రికార్డ్ సృష్టించిన వ్యక్తి. అమెరికన్లు ఆయను ఆరాధించారు, అలక్ష్యమూ చేశారు. అంకిత భావమున్న క్రుసేడర్గా అభిమానించారు. వినాశకర నియంతగా తిట్టీ పోశారు. శాశ్వత అంగ వైకల్యంతో విపరీతమైన ఆర్ధిక మాంద్యం, చరిత్రలోనే భయంకర యుద్ధ సమయంలో ధైర్య స్థైర్యాలతో నిలబడి "the only thing we have to fear is fear itself" అని జాతికి చాటి చెప్పి సంక్షోభం నుండి గట్టెక్కించినవాడు.

30-1-1882న రెండవ జేమ్స్ రూజ్వెల్ట్కు ఆయన రెండవ భార్య సారా డేలనోకు ఏకైక సంతానంగా అమెరికాలో న్యూయార్క్ లోని హైడ్ పార్క్లో ఫ్రాంక్లిన్ డేలనో రూజ్ వెల్ట్ జన్మించాడు. ఇరువైపుల వారు పూర్తిగా అమెరికా జీవులే. రూజ్ వెల్ట్లకు కొత్త ప్రపంచం అయిన అమెరికాలో రెండు విధాల అంటే సీనియర్, జూనియర్ లైన్లుగ పేరు ప్రతిష్టలున్నాయి. దధియోడర్ రూజ్ వెల్ట్ డచ్ జాతివాడు. వీరిలో మొదటి రూజ్ వెల్ట్ న్యు ఆమ్ స్టర్ డాంకు 1644లోనే వచ్చాడు. జూనియర్ లైన్లో వచ్చిన ఫ్రాంక్లిన్ డేలనో డచ్, ఇంగ్లిష్, ఫ్రాన్స్, జర్మన్ కొంత స్వీడిష్ మిశ్రమం. అతని తల్లి వంశం-ఫ్రెంచ్ సముద్ర నావికుడు ఫ్రెంచ్ తలిదండ్రులకు లేదేన్లో పుట్టినవాడు, అమెరికాలోని మాసా చూసేట్స్ రాష్ట్రం న్యు బెడ్ ఫోర్డ్లో 1624లో పుట్టిన ఫిలిప్పి డీ లా నాయ్కు చెందింది. దీనినే డేలనో అన్నారు. ఇంత ఘన చరిత్ర ఉన్న కుటుంబం నుంచి వచ్చిన రూజ్ వెల్ట్ అమెరికా 32వ ప్రెసిడెంట్ అయ్యాడు. అందుకే ఆయనకు ఓడలన్నా సముద్ర యానమన్నా విపరీతమైన ఇష్టం.

రూజ్ వెల్ట్ లంటే ఏదో ఒక కుటుంబం కాదు. అదొక రాజ వంశం (డైనాస్టి). ముఖ్యంగా వాళ్ళు వాణిజ్యవేత్తలు. ఐజాక్ రూజ్ వెల్ట్ సంపన్ను డైన బాంకర్ వ్యాపార

వేత్త, సెనేటర్, రివల్యూషనరి యుద్ధంలో సైనికుడు. ఈయన ముత్తాత తండ్రికి ఫ్రాంక్లిన్ అనే గౌరవనామం ఇచ్చారు. అప్పటి నుంచి ఆ వంశం వారందరికీ అది పారంపర్యంగా వస్తోంది. ఈయన మనవడు మొదటి జేమ్స్ రూజ్ వెల్ట్ రిటైర్ అయి, హడ్సన్ రివర్ తీరంలో డచస్ కౌంటిలో హైడ్ పార్క్ లో చాలా ఖరీదైన విశాలమైన ఎస్టేట్ కొన్నాడు. డేలనోలు కూడా సరి సమానంగా భాగ్యవంతులే. ఫ్రాంక్లిన్ తల్లి అందంతో పాటు పెత్తనం, సంఘ గౌరవ స్పృహ ఉన్నావిడ. తనపై తనకు అత్యంత నమ్మకం, స్వీయ అభయం ఉదాత్త గుణంతోపాటు, సర్వ సమర్ధత ఉన్న మహిళ.తల్లికున్న ఈ లక్షణాలన్నీ వారసత్వంగా రూజ్ వెల్ట్‌కు సంక్రమించాయి. ఇతడిని డాబు దర్పంతో పెంచారు. నౌకాయానం అతనికి పరమ ప్రీతికరమైన వృత్తి. కెనడా, మైమ్ మధ్య ఉన్న పస్సామా ఖాతంలో ఒంటరిగా స్వంత బోటును నడిపేవాడు. 15ఏళ్ళు నిండకముందే యూరప్‌కు 10 సార్లు తీసుకువెళ్ళారు. జర్మనీలో నాఔహెల్మ్‌లో జర్మన్ భాష నేర్చాడు. అప్పటికే కాస్మోపాలిటన్ యువకుడయ్యాడు. 14వ ఏట కాలేజిలో చేరే నిమిత్తం అప్పర్ క్లాస్ గ్రోటాన్‌కు తప్పనిసరిగా పంపబడే ప్రయత్నంలో ఉన్నారు.

గ్రోటాన్‌లో స్టూడెంట్‌గాకంటే ఇతర వ్యాపకాలపై మోజు పడ్డాడు. అక్కడి కోర్సులు పెద్దగా అభిరుచి కలిగించలేదు. టెన్నిస్ ఆడుతూ, సముద్ర కథలు చదివాడు. కాని వారానికి మూడుసార్లు అమ్మ దగ్గరకు వెళ్ళేవాడు. ఇప్పుడు అది దూరమయింది. 16వ ఏట వివాదాస్పద విషయాలపై దృష్టిపడి, డిబేట్‌లలో లిబరల్ అయ్యాడు. ఫిలిప్పీన్ స్వాతంత్ర్యం గురించి, ఇమ్మిగ్రేషన్‌లపై నిబంధనలకు వ్యతిరేకంగా మాట్లాడేవాడు. 17 వయసులో అసమ్మతివాది అయ్యాడు. తన సహచర గ్రోటేనియన్ మిత్రులతో విభేదించి అగ్రకుల భూయజమాని విషయంలో వింత భావాలు ప్రకటించాడు. జాన్ గంధర్ తన “రూజ్ వెల్ట్ ఇన్ రెట్రాస్పెక్ట్” పుస్తకంలో “ఆయనకు స్కూల్‌లో చదివే జ్యూ విద్యార్థి ఎవరూ లేకపోయినా జ్యూస్ అంటే అభిమానం పెరిగింది. దక్షిణ రాష్ట్రాలలో నీగ్రోలుకు చదువు నేర్చుకొనే అవకాశాలు లేవని, వారు విద్యా వంతులు కావాలని ఉపన్యాసాలిచ్చాడు. దక్షిణ ప్రాంతంలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడే బోయేర్లపై సానుభూతి చూపాడు. బోయేర్ల పక్షాన చేరి వారికి నిధులు సమకూర్చి అందజేశాడు.

రూజ్ వెల్ట్‌కు నౌకాయానంపై యెంత పిచ్చి అంటే, ఒకరోజు ఎవరికీ చెప్పకుండా గ్రోటాన్ నుంచి పారిపోయి నేవీలో పేరు నమోదు చేయించు కోవాలనుకొన్నాడు. కాని పొంగు జబ్బు సోకి ఆగిపోయాడు. కాని నావల్ అకాడెమిలో అన్నా పోలిస్‌లో గ్రాడ్యుఏషన్ అయ్యాక చేరాలని నిర్ణయించుకొన్నాడు. కాని తండ్రికి కొడుకును తమ వంశంవారందరికి మాతృ విద్యాలయమైన హార్వర్డ్‌లో చదివించాలని కోరిక. అలాగే 1900లో హార్వర్డ్ యూనివర్సిటిలో చేరాడు. 18 వయసులో రెస్ట్ లెస్ అయి ఫుట్‌బాల్ ఆటలో తన

టీంకు సరైన శిక్షణ ఇవ్వలేక, తెడ్డూ, పడవ పుచ్చుకొని దానికోసమే తానూ పుట్టాడేమో అన్నట్లు నీటి విహారం చేశాడు. అథ్లెటిక్స్ వదిలి జర్నలిజంలో చేరాడు. కాలేజి న్యూస్ మేగజైన్ "క్రిమ్సన్"లో ముఖ్య పదవి దొరికి మేగజైన్ ఎడిటర్, ప్రెసిడెంట్ కూడా అయ్యాడు. నాలుగేళ్ల హార్వర్డ్ చదువులో చిన్నప్పటి నుంచి పరిచయమున్న అన్నా ఎలినార్ రూజ్ వెల్ట్‌తో ప్రేమాయణం సాగించి, చివరి ఏడాదిలో ఎంగేజ్ మెంట్ దాకావచ్చి, తల్లి అభ్యంతరంతో పెళ్లి 1905 వరకు వాయిదా పడి, ఆయనకు 23, ఆవిడకు 20 వయసులో పెళ్లి చేసుకొన్నారు. ప్రెసిడెంట్ థియోడర్ రూజ్ వెల్ట్ వాషింగ్టన్ నుంచి ప్రత్యేకంగా తన, దైవదత్త కుమార్తె, అనాధ అయిన నీస్ వివాహానికి హాజరై వేడుక జరిపించాడు. వివాహ సమయంలో రూజ్ వెల్ట్ కొలంబియా లా స్కూల్‌లో చదువుతున్నాడు. రెండేళ్ళ తర్వాత "అడ్మిరాల్టి లా" (దళాధిపతి చట్టం)ను స్పెషలైజ్ చేద్దామనుకొన్నాడు. బార్ కౌన్సిల్‌లో చేరాడు. ఇంతలో తండ్రి చనిపోతే హైడ్ పార్క్‌లో ఆతిధ్య బాధ్యతలు చేబట్టాడు. ఇక్కడే ఇద్దరు పిల్లలు పుట్టారు. స్థానిక రాజకీయాలలో ప్రవేశించి బలపడి స్టేట్ సెనేట్‌కు నామినేట్ అయ్యాడు. ఆయన పేరు మంత్రం ముగ్ధం అయి విపరీతమైన పేరు ప్రఖ్యాతులొచ్చాయి. రిపబ్లికన్‌లకు బలమున్న చోట డెమొక్రాట్ అభ్యర్ధిగా పోటీ చేశాడు. సివిల్ వార్ తర్వాత ఇక్కడి నుంచి ఎన్నికైన ఏకైక డెమోక్రాటిక్ సెనేటర్ రూజ్ వెల్ట్ ఒక్కడే. ఈ సవాలును ధైర్యంగా ఎదుర్కొన్నాడు. నిలువెత్తు మనిషి, నీలి కళ్ళతో అందమైన జుట్టుతో బలమైన ముక్కు, దవడలుతో అందగాడు. "ఆయన అంత ధన సంపన్నుడు కాకపోయి ఉంటే, ఆ పర్సనాలిటీ సినిమా ఇండస్ట్రిని ఏలుతూ ఉండేది" అని "న్యూయార్క్ హెరాల్డ్" రాసింది. అననుకూల పరిస్థితులలో, ఓడిపోతాడనే జోష్యాలతో ఉక్కిరి బిక్కిరౌతూ కూడా ఏది ఏమైనా గెలిచి తీరాల్సిందే అని నిర్ణయించుకొన్నాడు. ఈ సందర్భంలోనే "there is nothing I love so much as a good fight" అన్నాడు. తీవ్రమైన ప్రచారంతో ప్రత్యర్ధిని ఆత్మరక్షణలోకి తోసేసి, వ్యంగ్యంతో, నయనా భయానా బెదరగొడుతూ, పల్లెలు పట్టణాలు కారులో తిరిగి చుట్టేస్తూ, ఇదివరకు యే పార్టీ అభ్యర్ధీ తిరగని మారు మూల ఊళ్ళన్నీ చుట్ట బెడుతూ అందర్నీ నవ్వుతూ పలకరిస్తూ దారికి తెచ్చుకొంటూ న్యుయార్క్ రాష్ట్రం అంతా కలయ తిరిగాడు. రూజ్ వెల్ట్‌కు తప్ప అందరికి ఆశ్చర్యం కలిగే విధంగా గెలిచి తన సామర్ధ్యమేమిటో రుజువు చేసుకొన్నాడు. లా ఫర్మ్ వదిలి ఆల్బనికి చేరాడు.

స్టేట్ సెనేటర్‌గా లిబరల్ దృక్పధంతో పనిచేశాడు. అభివృద్ధికరమైనవాటిని స్వాగతించాడు. స్త్రీ వోటు హక్కు ఆనాడు వివాదాస్పదమైనదే అయినా సమర్ధించాడు. ఉడ్రో విల్సన్ అభివృద్ధి విధానాలను మెచ్చుతూ 1912 డెమోక్రాటిక్ సమావేశంలో విల్సన్ నామినేట్ అవటానికి ఎక్కువ కృషి చేశాడు. విల్సన్ ప్రెసిడెంట్‌గా ఎన్నిక

కాగానే 31 ఏళ్ళ రూజ్ వెల్ట్‌ను నేవీకి అసిస్టెంట్ సెక్రెటరిని చేశాడు. దీనితో తన ఎన్నాళ్ళు కన్నకల నెరవేరింది. మొదటి ప్రపంచ యుద్ధం ఆయనకు నౌకారంగంపై ఉన్న అనుభవం సామర్థ్యం తెలివి తేటలు ప్రదర్శించటానికి బాగా దోహదమయింది. రహస్యంగా నౌకా సంస్థలను, సబ్ మేరీన్లను సమర్ధవంతంగా అధ్యయనం చేసి జర్మనీ వాళ్ళ జలాంతర్గాములను తుత్తునియలు చేసే విధానాలు ప్రయోగించాడు. లెఫ్టినెంట్ కమాండర్ హోదాలో పని చేశాడు. 38వ ఏటవిపరీతమైన ఆర్థిక మాంద్యం ఉన్న కాలంలో శాన్ ఫ్రాన్సిస్కో లో డెమోక్రాటిక్ పార్టీ సదస్సు జరిగింది. యుద్ధంలో జయం లభించింది కాని శాంతి నష్టపోయింది. ప్రెసిడెంట్ విల్సన్ లీగ్ ఆఫ్ నేషన్స్ ప్లాన్ సెనేట్ చేత తిరస్కరింపబడింది. గుండెపోటు వచ్చి విల్సన్ చావు బతుకుల్లో ఉన్నాడు. ఒహాయో రాష్ట్రానికి చెందిన జేమ్స్ ఏం.కాక్స్‌ను రాజీ అభ్యర్థిగా ప్రెసిడెంట్ పదవికి, రూజ్ వెల్ట్‌ను వైస్ ప్రెసిడెంట్ పదవికి నిర్ణయించారు. ఇద్దరూ కలిసి ప్రచారం చేసినా రూజ్ వెల్ట్ 800కు పైగా ఉపన్యాసాలిచ్చి దున్నేసినా రిపబ్లికన్ అభ్యర్థులు హార్డింగ్, కూలిడ్జ్ చేతుల్లో "మళ్ళీ యధాస్థితికి" అన్న వాళ్ళ ఆకర్షణీయమైన స్లోగన్‌తో పరాజయం పొందారు.

ఒక ఏడాది తర్వాత మళ్ళీ ప్రైవేట్ ప్రాక్టీస్ ప్రారంభించి, పెద్ద ప్రాణాంతక మహా విపత్తుకు గురైనాడు. 1921ఆగస్ట్‌లో కుటుంబం అంతా కాంప్ బెల్లో ఐలాండ్‌లోని న్యు బ్రన్స్ విక్‌లో సెలవులు గడుపుతుండగా రూజ్ వెల్ట్ ఒక రోజంతా విపరీతంగా బే లోని మంచు నీటిలో ఈతకొడుతూ పూర్తిగా అలసిపోయాడు. చలి, వణుకుతో జ్వరం ప్రారంభమై పాక్షిక పక్ష వాతం వచ్చింది. డాక్టర్లు సరిగ్గా రోగ నిర్ధారకం చేయక పోవటంతో "పోలియో మైలేటిస్" వ్యాధికి గురైనాడు. పూర్తిగా వికలాంగుడై, కాళ్ళను కదల్చలేక బ్రేసులు, క్రచ్‌లూ లేకుండా ఒక అడుగు కూడా నడవలేని స్థితికి వచ్చాడు. ఎంతో కష్టపడితేకాని, సహాయకుడు ఎవరైనా ఉంటేకాని కుర్చీలోంచి లేవగలిగేవాడు కాదు. నిలబడటానికి ఎవరో ఒక ఆసరా లేక ఒక కర్ర ఉండాల్సొచ్చేది. దీనితో రూజ్ వెల్ట్ ప్రజా జీవితం సమాప్తం అనుకొన్నారు అందరూ. పదవికి పనికి రానని చెప్పి రిజైన్‌చేసి హాయిగా హైడ్ పార్క్ ఇంట్లో విశ్రాంతి తీసుకోమని తల్లి సలహా ఇచ్చింది. పరాజయాన్ని రూజ్ వెల్ట్ ఏనాడూ అంగీకరించలేదు. ఒక ఏడాది ఈ బాధతోనే ఉండి మళ్ళీ తన పని ప్రారంభించాడు.

జార్జియాలోని వార్మ్ స్ప్రింగ్స్‌లో ఒక రిసార్ట్‌లో పూర్తిగా మినరల్ సాల్ట్‌లు, ఎక్కువ స్పెసిఫిక్ గ్రావిటి ఉన్న ఒక బేదింగ్ పూల్‌ను కనుక్కొని నిత్య స్నానం చేస్తూ మూడేళ్ళకు బిగుసుకు పోయిన అవయవాలకు కొద్దికొద్దిగా చలనం వచ్చేట్లు చేసుకొన్నాడు. ఆ తర్వాత ఏడాదికి రెండుసార్లు ఇక్కడికి వచ్చేవాడు. ఈ చికిత్స కోసం మిలియన్

డాలర్లలో నాలుగో వంతు డబ్బు ఖర్చయింది. డబ్బుపెట్టి దీన్ని కొని లాభ నష్టాలు లేని విధానంలో తన లాంటి వ్యాధి గ్రస్తులకు ఉపయోగపడేట్లు చేశాడు. 42వ ఏట న్యుయార్క్‌లో డెమొక్రాటిక్ పార్టీ సదస్సుకు క్రచస్ సాయంతో హాజరవగలిగాడు. నాలుగేళ్ల తర్వాత, టెక్సాస్‌లోని హూస్టన్ సభకు క్రచస్ లేకుండా తుంటి నుండి పాదం వరకు స్టీల్ బ్రేసేస్‌తో దర్జాగా హాజరై అందర్నీ ఆశ్చర్యపరచాడు.

1928లో ప్రెసిడెంట్ అభ్యర్ధిగా డెమొక్రాటిక్ పార్టీ తరఫున ఆల్ఫ్రెడ్ స్మిత్, న్యూయార్క్ గవర్నర్‌గా రూజ్ వెల్ట్‌ను, ఆయన సహాయకుడిగా హెర్బర్ట్ లె మాన్‌ను ఎంపిక చేశారు. తీవ్రంగా జరిగిన పోటీలో స్మిత్ ఓడిపోయి, రూజ్ వెల్ట్ గవర్నర్‌గా ఎన్నికయ్యాడు. ఈ "గూబర్ నేటోరియల్ పోస్ట్"లో నాలుగేళ్ళు ఉన్న తరువాత 1932 ప్రెసిడెంట్ అభ్యర్ధిగా ఎంపికయ్యాడు. ఇంకా కొంతకాలం గవర్నర్ పదవీకాలం ఉంది, కాని దేశం అతి తీవ్రమైన డిప్రెషన్‌లో కొట్టు మిట్టాడు తున్నప్పుడు ఆయన "మరువ బడిన మనిషి" అని భవిష్యత్ వాణిగా చెప్పాడు. వ్యవస్థ మళ్ళీ వైభవంలోకి రావాలంటే సంస్కరణలు పై నుంచి కాక అట్టడుగు నుంచి ప్రారంభం కావాలని నొక్కి వక్కాణించాడు. "ఆర్థిక పిరమిడ్‌లో అట్టడుగు మనుషులను మర్చి పోయారని వారి సంక్షేమం దేశ ప్రగతికి గతి అన్నాడు. యాభై వయసులో అయన ఉపన్యాసాలలో దీనినే మరీ మరీ చెప్పి ప్రజల దృష్టికి తెస్తూ ప్రెసిడెంట్ పదవీ ప్రచారం చేశాడు. అమెరికన్ ప్రజలకోసం "న్యు డీల్"ను అందజేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ప్రతి పౌరుడు బాగా సౌకర్యాలతో ఆర్ధిక పుష్టితో జీవించాలని అన్నాడు. అమెరికా పారిశ్రామిక వ్యవస్తలు, వ్యావసాయక యంత్రాంగం బాగా ఉత్పత్తి చేస్తూ తగినంత మిగిల్చాలి. ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు, రాజకీయ నాయకులు, ఆర్ధికవేత్తలు అందరూ తగినంత ఉత్పత్తి చేసి మిగల్చాలి.. దేశంలో అంతులేని వనరులున్నాయని, 15 మిలియన్ల జనం వీధుల్లో తిండిలేక అవమానకరంగా అడుక్కుతింటున్నారని, పూరిగుడిసెల్లో, అట్టముక్కల ఇళ్ళల్లో ఉంటూ దిక్కూ మొక్కూ లేక బతుకుతున్నారని, వారి పరిస్థితి దయనీయంగా ఉందని. వీళ్ళందరి జీవితాలలో ఉషోదయం రావాలంటే ధైర్యంగా నిరంతర ప్రయోగాలు చేయాలని, దీనికి చాలా కామన్ సెన్స్ కావాలని, ఒకవేళ ఈ ప్రయోగాలలో అపజయం పాలైతే ధైర్యంగా ఒప్పుకోవాలని, మరొక ప్రయోగం చేయాలని చెప్పాడు. మిలియన్ల మంది పేద ప్రజలు తమకు రావాల్సినవి తమ దగ్గరకు రాకపోతే ఇక ఉపేక్షిస్తూ ఊరుకొంటారనుకొంటే పొరబాటని గట్టిగా అన్నాడు. తమకిప్పుడు ఏం కావాలో ఆయన మాటల్లోనే "we need enthusiasm, imagination, and the ability to face facts, even unpleasant ones bravely. We need to correct by drastic means, if necessary, the faults in our economic system from which we now

suffer. We need the courage of the young".

ఇలాంటి ధైర్య వచనాలు, నివేదనలు ఆ సమయంలో బాగా ప్రభావం చూపాయి. రూజ్ వెల్ట్ అయస్కాంత ఆకర్షణ వ్యక్తిత్వం, దేశపు దుస్థితి రూజ్ వెల్ట్ చాలా సరైన దిశలోనే ఆలోచిస్తున్నాడని అర్థం చేసుకొన్న జనం ఆయన్ను విపరీతంగా ఆరాధించారు అభిమానించారు. ప్రజా బలంతో దేశాన్ని దారుణ సమ్మెలు, విప్లవ స్థితులనుండి కాపాడాడు. అదొక గొప్ప నాటకీయ సమయమై ఆయనకు బాగా కలిసొచ్చింది. దీని ఫలితంగా అతి భారీ మెజారిటితో ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యాడు. ఎనభై ఏళ్ళ అమెరికా చరిత్రలో ఆరు రాష్ట్రాలు తప్ప మిగిలిన అన్ని రాష్ట్రాలలోను మెజారిటీ సాధించిన డెమొక్రాటిక్ అభ్యర్థిగా రికార్డ్ సాధించాడు. హోవర్‌కు కేవలం 59, రూజ్ వెల్ట్‌కు 472 ఎలెక్టోరల్ వోట్లు వచ్చాయి. అదీ రూజ్ వెల్ట్ వీరవిజయ గాధ.

అయినా అమెరికా ఇంకా భయ విహ్వలతతోనే ఉంది. రూజ్ వెల్ట్ మొదటి బాధ్యత ఉదాసీన, అనుమానం, నమ్మకం లేని స్థితి నుంచి ప్రశాంత స్థితి కల్పించటం". వాస్తవ స్థితులను గమనించి కుంగిపోకూడదు. ఇలాటి ఎన్నో ఉపద్రవాలను తట్టుకొన్న దేశం, జాతి మనది, ప్రతి సంక్షోభం నుంచీ విజయవంతంగా బయటపడింది. ఇప్పుడు మనం భయపడాల్సింది భయం గురించి తప్ప మరి దేని గురించి కాదు. మళ్ళీ మనం అభివృద్ధి సాధించి, విజయంతో విలసిల్లుతాం. సమస్యలు చుట్టుముట్టి ప్రగతిని పక్షవాతానికి గురి చేసింది. దానికి తగిన ట్రీట్‌మెంట్ ఇచ్చి మళ్ళీ చైతన్యవంతం చేద్దాం" అని రూజ్ వెల్ట్ ప్రెసిడెంట్‌గా పదవీ స్వీకారం చేసిన రోజు జాతిని ఉద్దేశించి చెప్పి ధైర్యం కలిగించాడు. పదవిలోకి రాగానే విస్తృత యాజమాన్యంతో సంస్కరణలకు శ్రీకారం చుట్టాడు. అధిక లాభం, డివిడెండ్‌లపై పన్నులు విధించాడు. ప్రభుతోద్యోగుల జీతాలు పెన్షన్లు తగ్గించాడు, బాంక్‌లపై కంట్రోల్ కోసం కాంగ్రెస్ అనుమతి పొందాడు. డాలర్ విలువ తగ్గించాడు. దేశంలో ఉన్న బంగారాన్ని అంతా బయటికి తీయించి గోల్డ్ స్టాండర్డ్ కల్పించాడు.

ఇది ఆరంభం మాత్రమే. వాషింగ్టన్‌లో ఆర్థికవేత్తల, సైంటిస్ట్‌ల, రచయితల టీచర్ల, రాజకీయ పండితులను సమావేశ పరచి చర్చించాడు. ప్రెసిడెంట్ సరళీకృత విధానాలను "ది బ్రెయిన్ ట్రస్ట్" అని హేళన చేశారు. లెక్కచేయలేదు. మూడే మూడు నెలల్లో ఆయనా, ఆయనతో ఉన్న మేధావులు కలిసి "న్యు డీల్" ప్రయోగానికి సిద్ధమయ్యారు. నేషనల్ ఇండస్ట్రి యల్ రికవరీ యాక్ట్‌తో సహా అగ్రికల్చరల్ అడ్జెస్ట్ అడ్మినిస్ట్రేషన్, సివిల్ కన్జర్వేషన్ కార్ప్సు మొదలైన వాటిని ఏర్పాటు చేశాడు. ఇందులో కొన్ని ఫెయిలయ్యాయి కాని 1933కు అవే అత్యవసరమైనవయ్యాయి. సెక్యూరిటి యాక్ట్ వాల్ స్ట్రీట్‌ను నియంత్రించింది. సివిలియన్ కన్జర్వేషన్ కార్ప్సు అరమిలియన్ యువకులకు

ఉద్యోగాలు కల్పించింది. హోం ఓనర్స్ లోన్ అసోసియేషన్ తేలికగా తనఖాపై అప్పు సౌకర్యం కల్పించింది. టేనస్సీ వాలీ అథారిటీ భూ క్షయాన్ని నివారించి పారిశుధ్యం విద్యుత్తూ, వరద నివారణలను చేసి దక్షిణ ప్రాంతంలో దరిద్రంలో మగ్గుతున్న వారి పాలిటి ఆశా జ్యోతి అయింది. నేషనల్ ఇండస్ట్రియల్ యాక్ట్ బాలకార్మికులపై నిషేధం విధించి, వస్తువుల ధరలు తగ్గించింది, అన్యాయపు పనులకు చెక్ పెట్టింది, ఉద్యోగుల వేతనాలు పెంచింది, పని చేసే చోట్ల అద్భుత సౌకర్యాలు కలిపించింది, ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో లేబర్ హక్కులను సాధించింది. లేబర్ యూనియన్‌ను సంప్రదించకుండా యజమాని ఉద్యోగాలు ఇవ్వరాదనేది అమలైంది.

వీటితో గొడవ, పేచీలతో పరిస్థితి కొంత భయానకమైంది. దాదాపు పత్రికలన్నీ రిపబ్లికన్‌ల చేతుల్లో ఉన్నాయి కనుక అవి విషం కక్కాయి. ఒక పత్రిక కాలంలో న్యూ డీల్ ఫాసిస్ట్ విధానం అంది. మరోటి కమ్యూనిస్ట్ విధానం అన్నది. తాను తెచ్చిన ప్రతి కొత్త చట్టంతో వ్యతిరేకులు పెరుతున్నా, తన సంస్కరణలకే కట్టుబడి ముందుకు కదిలాడు రూజ్ వెల్ట్. "సంపద పన్ను 'నినాదం' బాంకర్లను వాణిజ్యవర్గ స్నేహితులను దూరం చేసింది. కాని ఆయనలో కనిపిస్తున్న మానవతా కార్యక్రమాలకు ప్రజా సమూహాలు విపరీతమైన మద్దత్తు నిచ్చాయి. కనుక రెండవసారి ప్రెసిడెంట్‌గా ఎన్నికవటానికి ఢోకాలేదని పించింది. 1936లో నామినేషన్ వేసి ఒక ఇంగ్లిష్ జడ్జి చెప్పిన "necessitious men are not free men" అన్న వాక్యం ఉదాహరించాడు. ఎకనామిక్ రాయలిస్ట్ లనుద్దేశించి "better the occasional faults of a government that lives in a spirit of charity than the consistent omissions of a government frozen in the ice of its own indifference" అని మెత్తని చెప్పుతో కొట్టినట్లు చెప్పాడు.

రేడియో ద్వారా సామాన్య జనాన్ని "ఫైర్ సైడ్ చాట్" (కుర్చీలో కూని రాగాలు) పేరుతో తరచుగా పలకరిస్తూ ప్రతిసారి యాభై వేల మిలియన్ల ప్రజలు రేడియోలో తన ప్రతిమాటా వినేట్లు చేసి మరీ దగ్గరయ్యాడు. ఆయన మాటలు వారిని మంత్రం ముగ్ధం చేసేవి, అందులోని ప్రతి విషయం వారి గుండెల్లోకి సూటిగా చేరేట్లు చేశాడు తన అత్యద్భుత వాక్చాతుర్యంతో. వివేకం కల రాజకీయవేత్తగా, తన శక్తి సామర్థ్యాలను గొప్పగా వ్యక్తీకరించే మహా నటుడిగా, తన దేశ ప్రజల పాలిటి ఆపద్బాంధవుడిగా ఒక "పెద్దన్న"గా వారి మనసులలో నిలిచి ఉండిపోయాడు. ప్రతి ఉపన్యాసమూ "మై ఫ్రెండ్స్" అంటూ ప్రారంభించి వాళ్ళ మనసుల్ని దోచుకొన్నాడు. వీటన్నిటితో ప్రజలు ఆయనకు సన్నిహిత స్నేహితులు అవటమేకాదు వారికి ఆరాధ్య దైవమే అయ్యాడు. రెండోసారి గెలుస్తాడనే అందరూ అనుకొన్నా మొదటిసారికంటే భారీ మెజార్టీతో గెలవటం అందర్నీ

ఆశ్చర్యపరచింది. కాన్సాస్ రాష్ట్ర పూర్వ గవర్నర్ ఆల్ఫ్రెడ్ ఏం లండన్‌తో ఈసారి పోటీ. అమెరికా ప్రెసిడెంట్ ఎన్నికల చరిత్రలో ఎప్పుడూ రాని భారీ మెజారిటీతో గెలిచి ఏక పక్ష విజయంగా నిరూపించాడు. 523లో 521 ఎలెక్టోరల్ ఓట్లు సాధించాడు కేవలం రిపబ్లికన్‌లకు అధికబలమైన మెయిన్, వెర్మాంట్‌లలో ఆ రెండూ పోయాయి.

రెండవసారి అధ్యక్షోపన్యాసంలో మొదట దేశపు చురుకైన ఆరోగ్యానికి చేయవలసింది చాలా ఉందని, దేశంలో మూడవ వంతు ప్రజలు సరైన నివాసం వస్త్రాలు, పోషకాహారం లేక ఇబ్బంది పడుతున్నారని, మిలియన్లజనం వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తులను కొనే సామర్థ్యం లేకుండా ఉన్నారని, వారి దారిద్ర్యం పనికి దూరం చేస్తోందని, వీటినన్నిటినీ సరి చేయాల్సిన తక్షణ అవసరం ఉందని చెప్పాడు. ఆశా వివేకంతో రాగల ఉజ్వల భవిష్యత్తును గురించి చెప్పిన మాటలివి "మొదటిసారి గద్దె నెక్కినప్పుడు నేను స్వార్థం పదవీ వ్యామోహ శక్తులపై నాపోరాటం అన్నాను. ఇప్పుడు రెండోసారి పదవీ బాధ్యతతీసుకొంటున్నప్పుడు ఆ శక్తులు వాటి యజమానిని కలిశాయి" అన్నాడు. అయన వ్యతిరేకులు దేన్నీ ఉపేక్షించలేదు. విషపు మాటలతో ద్వేషం కక్కారు. "మాకియవెలేన్ ఈగోయిస్ట్" అన్నారు. రూజ్ వెల్ట్ తప్పులూ చేశాడు. సుప్రీం కోర్ట్‌లో తొమ్మిదిమందికి బదులు 15 మంది జడ్జీలు ఉండాలని కాంగ్రెస్‌ను కోరాడు. ప్రముఖ డెమొక్రాట్ నాయకులే దీన్ని వ్యతిరేకించారు. కనుక వోటింగ్‌కు రాకుండానే ఈ సూచన చచ్చిపోయింది. ఆయన్ను ఓడించవచ్చుననే నమ్మకంతో రిపబ్లికన్లు ఎదురు తిరిగారు. కాంగ్రెస్ ఇప్పటివరకు ఆయన సూచనను అంగీకరించే స్థితిలో ఉంది కాని దీనివలన ఆయనకు విస్తృత ఎక్సిక్యూటివ్ అధికారాలు లభిస్తాయని, పబ్లిక్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్‌తో సహా అన్నిటా ఇష్టమొచ్చినవారికి కాబినెట్ పదవుల పందారం చేస్తాడని భావించి తిరస్కరించింది.

దేశం రెండు అతి ముఖ్య విషయాలతో సతమతమై గిలగిల లాడుతోంది. అందులో ఒకటి యుద్ధ ప్రమాదం. రెండవది పాత సంప్రదాయాన్ని కాదని నిబంధనలను తుంగలో తొక్కి, అన్నిటికి విరుద్ధంగా రూజ్ వెల్ట్ మూడవసారి 1940లో ప్రెసిడెంట్ పదవికి సిద్ధమౌతున్నాడని. మొదటిది రెండోదానికి దారి చూపించింది. చాలాకాలంగా ఇక ప్రెసిడెంట్ పదవి చాలు అనుకొంటూనే ఉన్నాడు కాని విస్తరిస్తున్న యూరోపియన్ యుద్ధం వలన తటస్థ దేశమైన అమెరికాకు ఇబ్బందులెదురౌతాయేమో నని, చికాగోలో డెలిగేట్లు మొదటి బాలెట్‌లోనే రూజ్ వెల్ట్‌ను నామినేట్ చేశారు. దీనితో అమెరికా రిపబ్లిక్ మొదటి అధ్యక్షుడు జార్జ్ వాషింగ్టన్ ఏర్పరచిన రెండుసార్లు మాత్రమే పోటీ చేయాలనే సంప్రదాయాన్ని కాదని మూడవసారి నిలబడటానికి సిద్ధమయ్యాడు. 58ఏళ్ళ వయసులో దీన్ని సమర్ధించుకొంటూ తాను నియంతగా మారటం లేదని, అంతర్జాతీయ

విపత్తు సమయంలో, అన్ని పక్షాలవారు ప్రభుత్వానికి బాసటగా నిలవాలని అభ్యర్థించాడు.

యుద్ధానికి దేశాన్ని సన్నద్ధం చేయటమే ఇప్పుడు ఆయన ప్రధాన విషయమై పోయింది. నిర్బంధ సైనిక శిక్షణ అమలు చేశాడు. యాభై పాత డిస్ట్రాయర్‌లను 99 ఏళ్ళ లీజ్ కు తీసుకొని అట్లాంటిక్ సముద్ర బ్రిటిష్ స్థావరాల వద్ద నిఘా ఉంచాడు. న్యు డీల్‌ను పారిశ్రామిక సంస్థలు అధిక తుపాకుల టాంకుల, ఆయుధ సామగ్రి తయారీ కోసం కొంత ఉదారం చేశాడు. దీనితో అమెరికాను "ఆర్సేనల్ డెమోక్రసీ" (సాయుధ ప్రజాస్వామ్యం)గా మార్చాడు. ఇంగ్లాండ్ ఫ్రెంచ్ మిలిటరీ సహకారం పొందాడు. అమెరికాలోని అన్ని జపాన్, ఇటలీ నౌకలను స్వాధీనం చేసుకొన్నాడు. గ్రీన్ లాండ్‌కు సైన్యాన్ని పంపాడు. ఇంగ్లాండ్ ప్రధాని చర్చిల్‌తో అతి రహస్య సమావేశం జరిపి "అట్లాంటిక్ చాప్టర్" రూపకల్పన చేసి నాజీ నియంతృత్వం నుంచి ప్రపంచానికి విముక్తి కలిగించి యుద్ధానంతర ప్రపంచం సముద్రాలపై అంతర్జాతీయ స్వాతంత్ర్యం, ప్రజల స్వీయ నిర్ణయ హక్కు, బలవంతపు దాడులు లేకపోవటం, ముడి సరుకులను విజేత, పరాజిత, నాశనమైన దేశాలతో సహా అందరూ పంచుకోవటం" అనే అంశాలకు ప్రాముఖ్యత నిచ్చారు.

రెండవ ప్రపంచ యుద్ధంలోకి 7-12-1941న జపాన్ ప్రభువులు అమెరికాలోని పెరల్ హార్బర్‌పై ఆత్మహత్యా సదృశ పాశవిక దాడులతో ఆక్రమించే ప్రయత్నంలో అమెరికా బలవంతాన లాగ బడింది. ఇలా చాల దేశాలలో జరిగినా రూజ్ వెల్ట్ దీన్ని "ప్రజలలో విశ్వాసం ఉన్న వారికి నియంతలపై విశ్వాసం ఉన్న వారికి మధ్య జరిగే యుద్ధం" అన్నాడు. చర్చిల్‌తో చర్చించి ఐక్య రాజ్య సమితి ఏర్పాటు చేయించాడు. ఉత్తర ఆఫ్రికాపై ఆంగ్లో అమెరికన్ దాడి చేయించాడు. మిత్ర దేశ సైన్యాల పరస్పర సహకారంతో నాజీ నియంతృత్వాన్ని ఎదుర్కొవాలన్నాడు. టెహరాన్‌లో మొదటిసారి రష్యా నియంత స్టాలిన్‌తో సమావేశమై యుద్ధంలో గొప్ప ముందడుగుకు సిద్ధమై యూరప్ పడమటి తీరంపై విరుచుకుపడి జర్మని సర్వనాశనానికి పూనుకొన్నాడు.

1944లో అన్ని సంప్రదాయాలకు భిన్నంగా నాలుగోసారి ప్రెసిడెంట్ పదవికి పోటీ చేశాడు. పూర్వం అంత కాకపోయినా మంచి మెజారిటీతోనే నెగ్గాడు. ప్రజలకు ఆయనపై పూర్తి విశ్వాసం ఉంది. విపక్షులు కాకి గోల చేశాయి. రిపబ్లికన్ అభ్యర్థి థామస్ యి డ్యూయీకి కేవలం 99 ఎలెక్టోరల్ ఓట్లు మాత్రమే వచ్చాయి. రూజ్ వెల్ట్‌కు 432. దేశావ్యాప్తంగా వేలాదిమందితో పరిచయాలు, మిలియన్ల కొద్దీ ఆరాధకులు, ఉన్నప్పటికీ సన్నిహితులు అతి తక్కువమందే ఉండేవారు. ఆయనపై భారం అధికమైంది. 62 ఏళ్ళవాడు బాగా ముసలాడిగా కనిపిస్తున్నాడు. జుట్టు తెల్లబడింది కవళికలు బలహీనమై భావవ్యక్తీకరణ గంభీరమై ముఖం పాలిపోయింది. ఒంటరివాడై దిగులుగా

ఉన్నాడు. యుద్ధం ఎలాంటి ముగింపు ఇస్తుందోనని ఆందోళన పడుతున్నాడు. శాంతి భయపెడుతోంది. శాంతికోసం మళ్ళీ యాల్టాలో చర్చిల్ స్టాలిన్‌లతో భేటీ వేశాడు. ఈ సమావేశం బాధాకర వివాదాలను, అనంతమైన వైరుధ్యాలను కలిగించింది. నిందించే వాళ్ళు "బుజ్జగింపులు", "ద్రోహం" అమ్మేశాడు" అన్నారు. ఈ వ్యతిరేకత ఆయన చనిపోయినా, డెమొక్రాట్‌లు1952లో ఘోరంగా ఓడిపోయే దాకా ఆగలేదు . రష్యా సైన్యం పోలాండ్‌ను ఆక్రమించి, పడమటి వైపుకు దూసుకొస్తున్నాయి. రూజ్ వెల్ట్ బేరాలు, ఒడంబడికలలో మునిగాడు. కొన్ని బెడిసి కొట్టాయి. శాశ్వత శాంతి స్థాపన సాధ్యమేనని పూర్తిగా నమ్మాడు. కాని అది తప్పు అని తేలింది. యుద్ధం ముగియటానికి, అతి త్వరగా పూర్తి అవటానికి తొందరపడ్డాడు. ఒడంబడికలన్నీ రష్యా ఉల్లంఘించింది. దీన్ని రూజ్ వెల్ట్ ముందే గ్రహించి ఉండాల్సింది. కాని ఆయన ఆశతో, భయంతో పరస్పర అవగాహన, సౌహార్దత పొందవచ్చు అనుకొన్నాడు.

కొన్ని వారాల తర్వాత 63వ పుట్టిన రోజున కాంగ్రెస్‌కు యాల్టాసమావేశ విషయాలు వివరించి చెప్పాడు. అలసి సొలసి వార్మ్ స్ప్రింగ్స్‌కు మార్చ్ చివరలో విశ్రాంతికి వెళ్ళాడు. రెండు వారాల తర్వాత ఆయన పోర్ట్రైట్ పూర్తి అయ్యాక అకస్మాత్తుగా ఒక రోజు విపరీతమైన తలనొప్పి వచ్చి బాధపడ్డాడు. మరొక మూడు గంటలలోపే సెరిబ్రల్ హేమరేజ్ వచ్చి 1945 ఏప్రిల్ 12 సాయంత్రం 5-47గం.లకు తుదిశ్వాస విడిచాడు. ఈ విషాద వార్తా దేశమంతా వార్తామాధ్యమాల ద్వారా జనాలకు తెలిసింది. అమెరికా మొత్తం అచేతనమై వణికిపోయింది. ఆయనను నమ్ముకొని ఆయనపైనే ఆధారపడి ఈ 13 ఏళ్ళు జీవించిన మిలియన్ల జనం ఒక్కసారిగా నిశ్చేష్టులయ్యారు. ఆయన అంత్య క్రియలనాడు ఆబాల వృద్ధ జనం అందరూ ఆపుకోలేని ఏడుపుతో పొర్లి పొర్లి దుఃఖించారు. ప్రపంచ వ్యాప్తంగా నాయకులు ఒకరినొకరు కలుసుకొని ఊరడించుకొన్నారు. ఆయనకు నలుగురు కొడుకులు, ఒక కుమార్తె. భార్య అన్నా ఎలినార్ గొప్ప మానవతా వాది, ప్రజాసంబంధాలు బాగా కలిగిన ప్రథమ మహిళ.

రూజ్ వెల్ట్‌పై పన్నీరు చల్లారు, బురదాచిమ్మారు. ఆయన పాలనలో కాపిటలిజం బాగా పెరిగిందని, స్వేచ్ఛా వాణిజ్యం దెబ్బతిందని, తన క్లాస్ వారిని మోసగించాడని ఆరోపణలున్నాయి. అయినా ఆయన చేసింది అంతా ప్రజాసంక్షేమం కోసమే. అభివృద్ధి విధానంలో న్యు డీల్ గొప్ప ముందడుగు. సామాన్యమానవుడు అంటే ఆలోచన లేని వాడుకాడని ఆతను ఒక వినియోగ దారుడు అని గుర్తించి గౌరవించిన వాడు రూజ్ వెల్ట్. ఈ సామాన్య మానవులే వినియోగదారులుగా ప్రవర్తించకపోతే తన క్లాస్ వాళ్ళు నట్టేట మునిగేవాళ్ళు అంటాడు. కేపిటలిజం అమెరికాలోనే కాదు ప్రపంచ వ్యాప్తంగా ఉంది అన్నాడు. "వైట్ హౌస్‌లో కుంటాడు" అని శత్రువులు దెప్పినా, ఆయన్ను అర్థం

చేసుకున్నవాళ్ళు ఆరాధించారు. ఆయన్నుమరింత హాయిగా జీవించగలిగే ప్రపంచాన్నిచ్చిన ప్రపంచ పౌరుడు అన్నారు. స్టీఫెన్ వింసేట్ బెంట్ కవి మాటలలో రూజ్ వెల్ట్ “A country squire from Hyde Park with a Harvard accent --who never failed the people --and whom the people will not fail”

మాంచి ధాటీ వక్త యే కాని గొప్ప రచయిత కాదు రూజ్ వెల్ట్. వివాదంలో, అసమ్మతి ప్రకటనలో గొప్పవాడు కాదు కాని గొప్పతనం పొందాడు. దాన్ని ప్రతి సందర్భంలోనూ వికిరణ కాంతిలాగా ప్రదర్శించేవాడు. ఆయన ప్రతిపాదించిన “ది సమ్మరి ఆఫ్ ఫోర్ ఫ్రీడంస్” ప్రపంచ వ్యాప్త ప్రచారం పొందింది. “the first is the freedom of speech and expression --everywhere in the world. The second is freedom of every person to worship god in his own way --everywhere in the world. The third is freedom from want --everywhere in the world. The fourth is freedom from fear which translated into world terms, means a worldwide reduction of armaments to such a point that no nation will be in a position to commit an act of physical aggression against any neighbor --anywhere in the world. That is no vision of a distant millennium. It is a definite base for a kind of world attainable in our own time and generation” అన్న మహోన్నత మానవతా మూర్తిమత్వం రూజ్ వెల్ట్ ది. రూజ్ వెల్ట్ మైనారిటీల హీరో .ముఖ్యంగా ఆఫ్రో అమెరికన్‌ల, కేధలిక్కుల, జ్యూల సంక్షేమాన్ని అమలు చేశాడు. చైనా, ఫిలిప్పినో అమెరికన్ల అభిమానం, మద్దతు పొందాడు, న్యు డీల్‌లో వీరందరి అభివృద్ధికి దోహద పడ్డాడు. ఆఫ్రికన్ అమెరికన్ ల పౌరహక్కుల కోసం ప్రయత్నించాడు. అమెరికాలో ఉన్న పౌరసత్వం లేని ఇటలీ పౌరులు ఆరు లక్షలమందిపై ఉన్న ఆంక్షలను 1942 అక్టోబర్‌లో తొలగించాడు. లక్షా ఇరవై వేలమంది జపనీయులను వెస్ట్ కోస్ట్‌ను వదిలి పొమ్మన్నాడు. “Reflecting on Roosevelt', s presidency, "which brought the United States through the Great Depression and World War II to a prosperous future", said FDR' biographer Jean Edward Smith in 2007, "He lifted himself from a wheelchair to lift the nation from its knees. ఆయన హైడ్ పార్క్ నివాసం జాతీయ చారిత్రిక చిహ్నంగా మార్చారు. వాషింగ్టన్ డి సిలో ఏడున్నర ఎకరాలలో ఆయన మెమోరియల్ ఏర్పాటు చేశారు.❁




## 71. చైతన్య స్రవంతికి ప్రాణం పోసిన-జేమ్స్ జాయిస్ (1882-1941)

పుట్టిన దేశం ఐర్లాండ్ అంటే అమిత భక్తీ, ఐరిష్ ప్రజలంటే యూరప్‌లో ఆలస్యంగా వచ్చిన జాతి అనే విపరీత ద్వేషం ఉన్నవాడు జేమ్స్ జాయిస్. స్వయం నిర్ణయంతో జీవితమంతా ప్రవాసంలో గడిపాడు. దరిద్రం, పక్షపాత ధోరణి, అనారోగ్యం, దాదాపు గుడ్డితనంతో పోరాడుతూ బతికాడు. యవ్వన దశలో ఐరిష్ రినైసన్స్ అనే సంకుచిత జాతీయతకు వ్యతిరేకంగా, పోరాడాడు. "సెల్టిక్ ట్వి లైట్"ను కల్టిక్ ట్విలైట్ అంటే కృత్రిమ వస్త్రాలంకరణ అంటూ నిరశించాడు. సెల్టిక్ ఉద్యమంలో ముఖ్యుడైన కవి విలియం బట్లర్ ఈట్స్‌తో "మనం చాలా ఆలస్యంగా కలుసుకొన్నాం. నువ్వు నా ప్రభావం పడటానికి చాలా ముసలాడివై పోయావు" అన్నాడు. ఐరిష్ రివైవల్‌కు చెందిన మిస్టిక్ సింబాలిజం, స్థానిక పురాతన గాధలను తిరస్కరించి, ఒక కొత్త హింసాత్మక భాషను కొత్త సింబల్స్‌తో దానికి చెందిన ధారావాహిక జటిల విషయాలతో ఒక విస్తృత మైన తికమకపెట్టే ఆధునిక ప్రపంచ పురాణం రాశాడు.

అసలు పేరు జేమ్స్ అగస్టైన్ ఆలోసియస్ జాయిస్. 2-2-1882న ఐర్లాండ్ రాజధాని డబ్లిన్ దగ్గర జన్మించాడు. తల్లి గొప్ప సంగీత విద్వాంసురాలు. అది భర్తకు చర్చికి మధ్య విభజన పొందింది. తండ్రి ఏదీ పట్టని, బాధ్యత లేని అందగాడు. తండ్రి నుంచి తీవ్ర స్వభావం, సుస్వర గాత్రం వచ్చాయి. తనకు పుట్టిన 17మంది పిల్లలో జాయిస్ తన అభిమానపుత్రుడు అని చెప్పుకోనేవాడు తండ్రి. అరవ ఏట జేసూట్ స్కూల్‌లో చేరి, తర్వాత కాన్గోస్ వుడ్ కాలేజిలో 3 ఏళ్ళు చదివాడు. తొమ్మిదో ఏట తండ్రి పొగడ్తలకు ఉబ్బిపోయి ఒక విలువైన అభినందన రాస్తే, దాన్ని అచ్చు వేయించి తండ్రి డబ్లిన్ అంతా పంచిపెట్టాడు. 11వ ఏట మరో జెసూట్ సంస్థకుకు చెందిన బెల్వేదర్ కాలేజిలో చేరి 4 ఏళ్ళు చదివాడు. ఇక్కడ తాను రాసిన వ్యాసాలకు బహుమతులు పొందాడు. అందులో ముఖ్యమైనది "నా అభిమాన హీరో". 15 వయసులోనే ఆయనకు నిరంతర దేశ సంచారి, తుఫాను బాధితుడు యులిసెస్ అభిమాన హీరో అయ్యాడు.

16 నుంచి 20 వెళ్ళే వరకు యూనివర్సిటి కాలేజిలో చదివి చాలా పవిత్రమైన విద్యార్థి అనిపించుకొని జెసూట్ ఆర్డర్‌లో చేరుదామనుకొన్నాడు. ఇతరభాషా

సాహిత్యాలను విపరీతంగా చదవటంతో అభిరుచి మారింది. 20కే లాటిన్ ఫ్రెంచ్, ఇటాలియన్ భాషలలో ఇంగ్లీష్‌లో లాగానే ప్రావీణ్యం సాధించాడు. ఇబ్సెన్ అసలు సాహిత్యం చదవాలనుకొని నార్వేజియన్ భాష నేర్చాడు. 18లో "ఇబ్సన్స్ న్యు డ్రామా" అనే వ్యాసం రాస్తే ప్రముఖ పత్రిక "ఫోర్ట్ నైట్లి రివ్యు" ప్రచురించింది. నార్వేజియన్ నాటక రచయిత ఇబ్సన్‌కు జాబు రాసి అందులో ఆయన సత్యారాధనను, ఆయనకు కళా నియమాలపై ఉన్న ఉదాసీనతను అభినందించాడు. 20లో డిగ్రీ పొంది "డబ్లిన్ గాంగ్"తో ఉండటం ఇష్టంలేక డబ్లిన్ వదిలి పారిస్ చేరాడు. "ఎ పోర్ట్రైట్ ఆఫ్ ఆన్ ఆర్టిస్ట్ ఆస్ ఎ యాంగ్ మాన్" రచనలో దీన్ని వివరిస్తూ "నాకు నమ్మకం లేని నా స్వంత ఇల్లు అయినా పితృ దేశమైనా లేక నా చర్చ్ అయినా నేను సేవ చేయలేను" అన్నాడు. దీన్ని మరింత చేదుగా దూషణ భాషలో కవితలో ఇలా చెప్పాడు-

"This lovely land always sent --her writers and artists to banishment --and in a spirit of Irish fun-betrayed her own leaders, one by one".

పారిస్‌కు ఒక సిఫార్సు ఉత్తరం రెండు మూడు పౌండ్ల డబ్బు, కొన్ని కవితలతో చేరాడు. అక్కడ ఏదో ఒక కాలేజిలో మెడిసిన్ చదవాలనుకొన్నాడు, కాని దానికి ముందే డబ్బు కట్టాలని తెలుసుకొని విరమించుకొన్నాడు. డబ్బు సంపాదించే కవితలేవీ రాయలేక పోయాడు. కనుక చేతిలో పైసా కూడా లేక కడుపు మాడ్చుకొని దాదాపు పస్తులతో గడిపాడు. అతనికి అందుబాటులో ఉన్నది కోకా ఒక్కటే. అదే ఆయన యులిసేస్‌లో సంస్కారపరంగా సింబాలిక్ అయింది. తిండిలేకపోతే కండ ఉండదు కనుక జబ్బు పడ్డాడు. విపరీతమైన పంటి నొప్పి బాగా బాధించింది. పంటి చికిత్సకు డబ్బుల్లేవు. ఈ దెబ్బ తిన్న దంతాల వలననే తరువాత కంటి వ్యాధి వచ్చి కళ్ళు కనపడకుండా పోయాయి. ప్రొఫెషనల్ సింగర్ అవుదామని ఉంది. సంగీత పాఠాలు నేర్చుకొందామనుకొంటే గురు దక్షిణకు గుడ్డి గవ్వ కూడా లేదు. ఆరు నెలల తర్వాత ఇంటికి రమ్మని కబురొచ్చింది. తల్లి చావు బ్రతుకుల్లో ఉంది కొడుకును మత ప్రచారకునిగా ఉండమని కోరితే కాదు పొమ్మందుకు ఆమె జబ్బు మరీ పెరిగి చనిపోయింది.

21వ ఏడు సందడిగా గడిచింది. పూటుగా తాగి చేత పెన్నీ కూడా లేకుండా చింకి బొంతతో కొంప వదిలి వచ్చేశాడు. మురికి కూపాల గదులలో బతుకుతూ మారుతూ గడిపాడు. డాల్కీలోని క్లిఫ్టన్ స్కూల్‌లో టీచర్‌గా చేరి ఇతర భాషలను నేర్పటం మళ్ళీ మొదలుపెట్టాడు. నేషనల్ ఫెస్టివల్స్‌లో టెనార్ పోటీలలో పాల్గొని అంతకుపూర్వం జన మెక్ కొమార్క్‌లాగా విజయం సాధించాలనుకొన్నాడు. ప్రేక్షకులు, న్యాయనిర్ణేతలు ఆతని విధానాన్ని బాగా మెచ్చారు. అతనికే ప్రైజ్ వస్తుందని అందరూ అనుకొన్నారు. కాని మూడవ పరీక్ష సైట్ రీడింగ్ టెస్ట్‌కు తాను సంగీతం చదవలేదని

కనుక పూర్తి న్యాయం చేయలేనని చెప్పి అంగీకరించలేదు. రాజీమార్గం వదిలేసి అక్కడినుండి బయటికి వెళ్ళిపోయాడు. అతని స్వర మాధుర్యం గ్రహించిన ఒక కోచ్ కొద్ది పాటి ఫీజుతో ఒపేరా సంగీతం నేర్పుతానని ముందుకొచ్చాడు. కాని ఆయనతో నిబంధనల గురించి మాట్లాడటానికి ఇష్టపడలేదు. డాల్కేలో నారా బర్నాకిల్ అనే అమ్మాయిని ప్రేమించి 1904 అక్టోబర్‌లో పెళ్లి చేసుకొన్నాడు. కొత్తదంపతులు స్విట్జర్లాండ్ చేరారు. అక్కడ అనుకొన్న ఉద్యోగం రాక, ట్రీస్టీ చేరి బ్రిట్జ్ స్కూల్‌లో భాషా బోధకుడుగా కుదిరాడు.

ఇకపై పాతికేళ్ళ జాయిస్ జీవితం అంతా బాధ, ప్రవాస చరిత్రే. ఒకదానిపై ఒకటి రోకటి పోట్లే. ముద్రణకు కాణీ లేదు. ఆదరణ లేదు. అసంతృప్తి అసహనం, అనుకొన్నది ఆలస్యంగా జరగటం, డిప్రెషన్‌లతో బాధామయ గాధ అయింది జీవితం. 23లో కొన్ని చిన్న కథలు రాసి ముద్రణకిస్తే పబ్లిషర్‌కు అందులో ఉన్న నేచురలిజం చాలా అభ్యంతరకరంగా ఉందని చెప్పి పుస్తకం పూర్తి అయినా చేతికివ్వలేదు. మరొకడు ఒప్పుకొని అచ్చువేసి జాయిస్ స్వంతంగా ప్రింట్ చేసుకొంటానంటే జాయిస్‌కు అమ్మకానికి కూడా ఒప్పుకో లేదు. కోపం వచ్చి టైప్‌ను ధ్వంసం చేసి కాగితాలను చింపి పారేశాడు. ఇది అచ్చు వేయటానికి పదేళ్ళు పట్టింది. 1914లో లండన్‌లో ఇదే "డబ్లినర్స్"గా వెలుగు చూసింది.

జాయిస్ ముద్రించిన మొదటి పుస్తకం "చేంబర్ మ్యూజిక్" కవితా సంపుటి 25వ ఏట వెలువడింది. ఇందులో శ్లేష, పరిహాసం ఉన్నాయి. ఈ విరుద్ధ విపరీత ప్రతివాద కవిత్వంతోనే జాయిస్ గుర్తింపు పొందాడు. ఇది ప్రయోగం కాదు. పూర్తిగా సంప్రదాయమే. 17 వశతాబ్ది గాయకుల, ఫ్రెంచ్ సింబాలిస్ట్‌ల, విలియం బట్లర్ ఈట్స్ తొలి లిరిక్కుల ప్రతిధ్వనులే ఇవి. దీని తర్వాత రచనలన్నీ తన సృజన, కొత్త విషయాలతో రాసినవే. మైనర్ ఎలిజబెతేన్ సంగీతం అంటే జాయిస్‌కు ప్రాణం. వచనాన్ని వదిలేశాక నలభైలలో మళ్ళీ కవిత్వం రాసి "పోయెమ్స్ ఆఫ్ పెనీచ్" పేర ప్రచురించాడు. "డబ్లినర్స్" అనువాదం. దీనిలో రిపోర్టర్‌గా జాయిస్ ఉంటాడు. తాను పుట్టిన సిటి డబ్లిన్‌లోని విషాద గాధల వివరణ. ఒకరకంగా స్వీయ చరిత్రకూడా. మొదటి మూడు కథలలో తనబాల్యంలో కొన్ని భాగాలున్నాయి. మిగిలినవన్నీ తన సమకాలికుల గర్వం పొగరు దార్ష్టీకంలపై దయారహిత వ్యాఖ్యానాలే. వ్యంగ్య చిత్రణే. ఇందులోని టు గాలంట్స్, ఈవేలిన్, కౌంటార్ పార్ట్, ది డేడ్ ఎపిసోడ్‌లు బాగా ఆలోచింపజేసి యధార్ధాన్ని తెలియ బరుస్తాయి. చివరిది చాలా పదునైన సున్నితమైన కథ. ఇందులో పూర్తి రియలిస్ట్, పూర్తిగా సింబలిస్ట్‌గా మారుతాడు .

ట్రిస్టేలో ఒంటరిగా ఉంటూ సున్నిత మైన బతుకు బతుకుతున్నానని చెప్పుకొన్నాడు. పెళ్ళాం ఇద్దరు పిల్లల్ని పోషిస్తున్నాడు. స్కూల్‌లో ఇంగ్లీష్ బోధిస్తూ ఏడాదికి వచ్చే

ఎనభై పౌండ్ల జీతంతో బతుకు బండీ లాగిస్తున్నాడు. ఒక పుష్కరం ముందే "పోర్ట్రైట్" నవల పూర్తి చేశాడు. ఇది ఆయన మొదటి పాతికేళ్ళ జీవిత చిత్రణే. దీనికి మొదట్లో "స్టీఫెన్ హీరో" పేరు పెడదామనుకొన్నాడు. పేర్లలో ఉన్న రిథం బాగా తెలిసినవాడు. ఇందులో ముఖ్యపాత్ర జాయిస్‌ను పోలి ఉంటుంది. చివరి పేరును దేడాలస్‌గా మార్చాడు. దేడాలస్ మనిషిని భూమి నుంచి పైకి తీసుకు పోవటానికి రెక్కలు సృష్టించుకొన్నవాడు. దేడాలస్ అంటే కపట వేషధారి అని అర్థం. ఇదంతా ఆయన ఊహ. సింబాలిజం సృష్టి. జార్జ్ రస్సెల్ AE అనే మారు పేరుతో రాశాడు. ఈయన ఐర్లాండ్‌లో ఆధునిక వ్యవసాయ పద్ధతులను గురించి "ఐరిష్ హోంస్టెడ్" పుస్తకం రాస్తూ, సెల్టిక్ ఉద్యమ రచయితలపై పుస్తకం తెస్తూ జాయిస్‌ను అందరికి అర్థమయ్యేట్లు సరళంగా రాస్తే ఎడిటర్ వ్యాసానికి ఒక పౌండ్ చొప్పున ఇస్తాడని తనకు ఎప్పుడు వీలయితే అప్పుడు అగ్రిమెంట్ మీద సంతకం చేయచ్చునని మారు పేరు వాడుకోవచ్చని సలహా ఇచ్చాడు. సరేనని "స్టీఫెన్ దేడాలస్" అనే మారు పేరుతో మూడు కథలు రాశాడు.

"పోర్ట్రైట్" నవల ద్వివిధమైన వ్యక్తీకరణ ఉన్న నవల. అందులో తాను అమితంగా ప్రేమించి ఆరాధించే ఐర్లాండ్, అందులో ఒక విలువైన యువరచయిత వ్యంగ్యచిత్రం కలిసి ఉన్నాయి. శబ్దాలమీద పూర్తి అధికారంతో, మాంత్రిక శబ్దజాలంతో అదరగొట్టాడు. దీనిపై ఆయనే స్పందిస్తూ "to encounter for the millionth time the reality of experience and forge in the smithy of my soul the uncreated conscience of my race" అంటూ తన ఉద్దేశ్యాన్ని వివరించాడు. ఇందులో విద్యా చరిత్ర, అసాధారణ జ్ఞానం ఉన్న కౌమార దశలోని కుర్రాడు పరిపక్వతకు చేరుకోవటం అదే సమయంలో దాపరికంలేని ఆ వయసులోని శృంగార భావనలు కలిసి ఉంటాయి. ఇది సాధారణ రచన కాదు. తరువాత రాయబోయే ఎపిక్‌కు నేపథ్యం. ఈ పుస్తకమూ ముద్రణ ప్రసవ వేదన అనుభవించింది. "ఈగోయిస్ట్" పత్రికలో సీరియల్‌గా వచ్చింది. పుస్తక రూపంలోకి తేవటానికి యే పబ్లిషర్ కూడా సాహసించలేదు. కాగితాలు అమెరికా నుండి దిగుమతి చేసుకోవాల్సి వచ్చింది.

జాయిస్ రాసిన మరో గొప్ప రచన "యులిసెస్". అది ఆయన ఐరిష్ స్వదేశీయ భక్తి. హోమర్ రాసిన గ్రీక్ ఎపిక్ పేరును వాడుకొన్నాడు. అందులో హీరో యులిసెస్ తనలాగే దేశం వదిలి ప్రవాసంలో ఉంటూ దేశదిమ్మరిగా తిరిగాడు. హోమర్ రాసిన కథలోని సంఘటనలు ఇక్కడ ఒకరోజు 1904 జూన్ 16న డబ్లిన్‌లో జరుగుతాయి. అందులో టెలిమాకస్, యులేసేస్ భార్య మోలీలు బదులు దేడాలస్, లియో పోల్డ్ బ్లూమ్, పెనెలోప్ ఉన్నారు. మిగతా పాత్రలూ చాలా ఉన్నాయి. కథ బ్లూమ్ మీదే ఎక్కువగా నడుస్తుంది. అతని కొడుకు తప్పిపోతాడు మరోకడికోసం తపన పడతాడు. దేడాలస్ మానవులకు దూరమై తండ్రి కోసం వెతుకుతుంటాడు. ఇది ఆబాల వృద్ధుల

అందరి జీవితాలలో ఉన్న సమస్యయే. దేనికోసమో పరితపించటం అంతులేని అన్వేషణ చేయటం. దీనినే జాయిస్ తండ్రి కోసం వెతుకులాటగా సింబలైజ్ చేశాడు. తన జీవితం సంగతి చెబుతూనే ఆధునిక మానవుని అయోమయ పరిస్థితిని చిత్రించాడు.

యులిసేస్‌ను ప్రచురించటానికి చాలాముందే సెన్సార్ కత్తి ఝుళిపించింది. 1918లో అది "ది లిటిల్ రివ్యు"లో ధారావాహికగా వస్తున్నప్పుడే గుసగుసలు సాగాయి. "గెట్టిమాక్ డేవేల్" భాగం ప్రచురితమైనప్పుడు అమెరికాలోని అశ్లీల సాహిత్య నిరోధక సంఘం రంగంలోకి దిగింది. అమెరికా పోస్టాఫీస్ అన్ని కాపీలను స్వాధీనం చేసుకొన్నది. సంపాదకులకు జరిమానా విధించి, వ్రేలి ముద్రలు తీసుకొని ధారావాహికను ఆపేయించింది. అతని అభిమాని సిల్వియా బీచ్ ఆ పుస్తకాన్ని రహస్యంగా ఫ్రాన్స్‌లో ముద్రింప జేసి, మొదటి కాపీని జాయిస్‌కు ఆయన 40వ పుట్టిన రోజున అందజేసింది. పుస్తకానికి గ్రీస్‌కు చెందిన బ్లూ వైట్ రంగుల కవర్ పేజీని ఏర్పాటు చేయించింది. అది జాగ్రత్తగా సేకరించి భద్ర పరచాల్సిన పుస్తకం అయింది. దుకాణాలలో అమ్మారు. మళ్ళీ మళ్ళీ ప్రింట్ చేసి దొంగచాటుగానూ వదిలారు. ప్రముఖ రచయిత డి.హెచ్.లారెన్స్‌కూ ఆయన రాసిన "లేడీ చాటర్లీస్ లవర్" నవల విషయంలో ఇలానే జరిగింది. పుస్తకం అయితే అనేక కాపీలు అమ్ముడు పోయింది కాని అయ్యగారి చేతిలో పెన్నీకూడా రాలలేదు. పోస్టాఫీస్ వారికి దొరికిన అయిదు వందల పుస్తకాలను తగల బెట్టేశారు. అది సీరియల్ దశనుండి పుస్తకంగా రావటానికి మరొక 15 ఏళ్ళు పట్టింది. ఈ కేసు విచారించితీర్పు చెప్పిన జడ్జి జాన్ ఏం.ఊల్సే చెప్పిన వాక్యాలను. "whilst in some places, the effect on the reader is somewhat emetic (వాంతిమందు), nowhere does it tend to be an aphrodisiac (నిరోధించాల్సింది కాదు) "ప్రపంచమంతా ఘనంగా చెప్పుకొన్నది. జడ్జి ఊల్సే ఆ పుస్తకాన్ని "in terms of catharsis, the purge of the emotions through pity and terror that Aristotle attributes to tragedy" అని విశ్లేషకులు తెలియజేశారు.

పుస్తకంపై నిషేధం తొలగినా విమర్శల జడి వానలు కురుస్తూనే ఉన్నాయి. "ఇంత దరిద్ర గొట్టు, నీచ పుస్తకం చరిత్రలో లేదు" అన్నారు. అందులో పాక్షిక రాజకీయం, ద్వేషం ఉన్నాయన్నారు. సమకాలీన సమాజ నిరర్ధకత్వం, అరాచకం పెద్ద కాన్వాస్‌పై చిత్రించాడు అన్నారు. టి.ఎస్.ఇలియట్ మాత్రం "సిస్జీ తర్వాత ఇంతఅద్భుతమైన వచనం రాసిన వాళ్ళు లేరు. ఇదొక మహా కావ్యం. మార్మికతను వాడుకొంటూ సమకాలీనతను, పురాతనత్వాన్ని కలగలుపుగా చిత్రించాడు. దీనితో ఆర్ట్‌లో ఒక కొత్త ప్రపంచం వైపు అడుగులు వేయటం సాధ్యమయింది అని జేమ్స్ జాయిస్ రుజువు చేశాడు" అన్నాడు. ఇందులో చాలాభాగం యే హోమర్ రిఫరెన్స్ లేకుండా హాయిగా

చదువుకోవచ్చు. అయితే కొన్నిటికి అర్థం వివరణ లేకపోతే కీకారణ్యంలో ఉన్నట్లు ఉంటుంది. ఇందులో డిసిప్లినేడ్ లాజిక్ ఉందని అన్నారు. పదాల ఆట, సయ్యాటలున్నాయి. మైథాలజి ఫిలాసఫీ, ఎక్కువ మందికి తెలియని గ్రంథాలు, వింత పాత్రలు, అన్యమత నమ్మకాలు, కేథలిక్ మత ఉత్సవాలు, రహస్య, గూఢవిజ్ఞాన విశేషాలు ఉన్నాయి. అందుకే యులిసెస్ "un questionably the most complex, the most confusing, and the most learned novel-if it is a novel --in all literature"

యులిసెస్ రాయటానికి జాయిస్‌కు ఏడేళ్ళు పట్టింది. అమెరికాలో అది చట్ట రీత్యా చదవతగింది అని తేలినప్పుడు జాయిస్‌కు 52 ఏళ్ళు వచ్చాయి. కళ్ళు కనిపించకుండా పోయాయి. చనిపోయేలోపు పది ఆపరేషన్లు జరిగాయి. ఇవన్నీ ఎనేస్తీషియా ఇవ్వకుండా జరిపారు. అందుకే వేలాది పేపర్లపై పెద్ద పెద్ద అక్షరాలతో రాయాల్సి వచ్చేది. పొడుగ్గా సన్నగా ఉండి ఎక్కడికి వెళ్ళినా వారిని అతి మర్యాదగా పలకరించటంతో ఆయన్ను అందరూ తేలిగ్గా గుర్తు పట్టేవారు. ఆయన ప్రవాస జీవితం అంతా కష్టాలమయమే. మొ.ప్ర.యు.లో ఆస్ట్రియాలోని ట్రిస్టీ నుంచి స్విట్జర్లాండ్ పంపారు. ఎక్కడా ఆయన్ను ఉంచుకోవటానికి ఒప్పుకొనేవారు కాదు. ఇక్కడ ఇల్లు కొనుక్కున్నాడు. యుద్ధ విరమణ తర్వాత పారిస్ వెళ్లి శాశ్వత శాంతి ఏర్పడుతుందని కలలు కన్నాడు. జబ్బు, డబ్బులేమి, కుటుంబ గొడవలు అతన్ని బాధిస్తూనే ఉన్నాయి. పుస్తకాలపై వచ్చే రాబడి అతి తక్కువ. స్నేహితుల అభిమానుల సాయం మీదే బతకాల్సి వస్తోంది. వచ్చిన డబ్బులో ఎక్కువ భాగం కూతురు లూసీ నరాల జబ్బు నయం చేయటానికే ఖర్చయేది. కొంత భరోసా కలిగిన సమయంలో మళ్ళీ అగాధంలో పడ్డాడు. 1940లో రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మన్ సైన్యం ఫ్రాన్స్‌ను ఆక్రమించే ప్రయత్నం చేసినప్పుడు జాయిస్, కూతుర్ని కదిలించలేక మిగిలిన వారితో స్విట్జర్లాండ్ చేరాడు. కట్టుకొన్న బట్టలు తప్ప యే ఆధారం లేకుండా వచ్చారు. అమెరికా నుంచి వచ్చిన సాయంతో జ్యూరిచ్ చేరారు.

దరిద్రంతో పోరాటం, వంటరితనం, త్వరగా పోతున్న కంటి చూపుతో ఉన్నా, జాయిస్ మరొక వివాదాస్పద "ఫిన్నేగాన్స్ వేక్" రాశాడు. సరళంగా చక్కని భాషలో రాశాడు. ఇందులో కూడా యెడ తెగని ఆలోచనా స్రవంతి ని అంటే స్ట్రీం ఆఫ్ కాన్షస్ నెస్‌ను కొనసాగించాడు.

"ఫిన్నేగాన్స్ వేక్స్"ను "the rivering waters of hitherandthithering waters of night" అన్నారు, రాత్రి "ఫిన్నేగాన్స్"ను కంట్రోల్ చేస్తే పగలు "యులిసెస్"ను పరిపాలించింది. కాల నిబంధనల నుండి విడుదల అవటానికి జాయిస్ తాను చెప్పే విధానాన్ని మార్చి ఇందులో ఒక కలల సముదాయంగా మార్చాడు. స్వప్న అనంతత్వాన్ని,

దాని ప్రత్యేక పరిభాషను, దాని అసంబద్ధ లాజిక్‌ను చేర్చాడు. యులిసెస్‌లాగా ఇదీ మిత్ ఆధారంగా రాసిందే. కాని "it is an impersonal rather than personal mythology which makes the central figure mankind itself". ఇది అందరికి అన్నిచోట్లా అన్నికాలాల్లో జరిగేదే. ఒకరకంగా "allegorical, psychological spiritual history of humanity in a single theme". దీన్ని అనేక ప్లేన్స్‌లో రాశాడు జాయిస్. ఫ్రాయిడ్ భావాలకు రూపకల్పనగా ఉంటుంది. విరుద్ధాల యాదృచ్ఛిక సంఘటనం. ఎన్నో షేక్స్ పియర్ టాగ్‌లు, దారితప్పిన సామెతలు, భాషాయాసలు, జాతీయాలు, వికార భాషా శాస్త్ర విషయాలు, జారుళ్లు, చర్చలు, టెలిస్కోపేడ్ శబ్దాలు, పద సమ్మేళనాలు, పేరడీలు, శ్లేషలతో ముంచేశాడు. శ్లేష ఆయన శ్వాసగా కనిపిస్తుంది. 12 భాషలలో వేలాది శ్లేషలను ఇందులో గుప్పించాడు. షేక్స్పియర్ తర్వాత "పన్ లో పాదుషా" జాయిస్ మాత్రమే. ఒకే పదానికి రెండు మూడర్థాలుంటాయి. సామాన్యుడికి అదొక కారడవి అనిపిస్తుంది. వ్యాఖ్యాన దీపం లేకపోతే కారు చీకటే. క్రాస్ వర్డ్ పజిల్ గాఅర్థం కాని కోడ్ భాషగా తికమక పెడుతుంది. అంత్యక్రియలకు నాందిగా అనిపిస్తుంది. ఆ శైలీ విన్యాసం చూద్దాం–

"Buy a book in brown paper --from Faber and Faber --to hear Annie Liffie, trip, tumble and caper --sevensinns in her singthings --Plurabell;s on her prose --sheashell ebb music wayriver she flows" ఈ పుస్తకం అతి పెద్ద బూటకం అన్నారు. 17 ఏళ్ళు కష్టపడి పబ్లిక్‌పై ట్రిక్కులు ప్రయోగించాడు అన్నారు.

59వ ఏట జాయిస్ కష్టాలు మరీ పెరిగాయి. "ఫిన్నేగాన్స్" పుస్తకం ఫెయిల్ అయింది. దమ్మిడీ రాలేదు. భవిష్యత్తు అంధకారమై కూతురి ఆరోగ్యం ఏమైపోతుందో అనే బెంగతో కుంగిపోయాడు. ప్రాణాంతక ఆంత్రమూల అల్సర్ ఏర్పడింది. ఆపరేషన్ జరిగింది. రెండుసార్లు రక్తం ఎక్కించారు. కోలులోలేక జ్యూరిచ్‌లో 13-1-1941న 59 ఏళ్ళకే జేమ్స్ జాయిస్ చనిపోయాడు.

"విమర్శకులు జాయిస్‌ను విమర్శించే ముందు ఆయన చదివినంత చదుకోవాలి" అన్నాడు ఎల్.యే.జి.స్ట్రాంగ్. ఇందులో నిజం కొంత ఉంది. ఏ సాయం లేకుండా అతని సాహిత్యం చాలా భాగం చదవచ్చు. కాని కొన్నిటికి తప్పక గైడ్ ఉండాల్సిందే. ఆయనను విశ్లేషిస్తూ "in the beginning there was the word and the word was the life. in the end there was only the word" అన్నాడు. జాయిస్ కవి, అర్ధ జ్ఞాని, సృజనశీలి. దారుణమైనవాడు స్ఫూర్తి కలిగించేవాడు కూడా. "he enlarges Shakespearean soliloquy into an interior monolog of unexampled length breadth, and richness. He was the first to em-

ploy "the stream of consciousness "as a running commentary, a tossing flood of free association. He caught and preserved in a fluid amalgam part speech, partsliding, suggestive syllables, the shapes of dissolving dreams. A genius who united the comic with the cosmic, a renegade Jesuit with the lustiness of a Rabelais and the savagery of a Swift, Joyce was an influence so great that imitators were imitable and so unique that imitation was impossible" అంటూ అనుకరణకు అందని సాహితీమూర్తి జాయిస్ అన్న రచయిత లూయా అంటర్ మేయర్ మాటలు యదార్థం.

జాయిస్ సాంఘిక వ్యవస్థను క్రిస్టియానిటిని వ్యతిరేకించాడు. వీటితో తానెప్పుడూ అంతర్యుద్ధం చేసేవాడిని అని చెప్పాడు. కేథలిక్కుల అణచివేత విధానంపై పోరాడాడు. జాయిస్ చనిపోయినప్పుడు క్రిస్టియన్ మతగురువు వచ్చి కార్యక్రమం చేస్తానంటే భార్య అభ్యంతరం చెప్పింది. సంగీతం అంటే విపరీతమైన మోజున్న జాయిస్ కవితల్లో వచనంలో సంగీతం కట్టలు తెంచుకొని ప్రవహించింది. థామస్ మూర్ "ఐరిష్ మెలోడీలు", జార్జ్ బార్కర్ బాలడ్‌లను చాలాచోట్ల ఉపయోగించాడు. సంగీతజ్ఞులైన సల్లివాన్, మొజార్ట్, వాగ్నేర్‌లను బాగా అధ్యయనం చేశాడు. జాయిస్ రచనలు సంగీతానికి, వాద్య సంగీతానికి ప్రేరణ అయాయి.

జాయిస్ ప్రభావం చాలామంది మీద ఉంది. ముఖ్యంగా నాటక రచయిత శామ్యూల్ బెకెట్‌పై ఎక్కువ. జోసెఫ్ కాంప్ బెల్, జాన్ అప్ డైక్, మలార్మే, రింగ్ బాడ్‌లపై కూడా జాస్తీగానే ఉంది. జూన్ 16ను "బ్లూమ్స్ డే"గా జాయిస్ రచనలు, జీవితంపై కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. 1999లో టైమ్స్ మేగజైన్ వందమంది ప్రసిద్ధుల పేర్లలో జాయిస్ పేరూ చేర్చింది. 2013లో ఐర్లాండ్ ప్రభుత్వం ఆయన స్మారక సిల్వర్ కాయిన్ ముద్రించి, దానిపై యులిసెస్‌లోని ప్రఖ్యాత వాక్యాన్నిచేర్చి గౌరవించింది. ఐరిష్ నౌకకు ఆయన పేరు పెట్టారు. జాయ్స్ జీవించి ఉండగా 8 పుస్తకాలు చనిపోయాక 10 పుస్తకాలు ముద్రణ పొందాయి. Shortly after the publication of Ulysses, he elucidated this preoccupation somewhat, saying, "For myself, I always write about Dublin, because if I can get to the heart of Dublin I can get to the heart of all the cities of the world. In the particular is contained the universal" [2] అని తన డబ్లిన్ అభిమానాన్ని గుండె డప్పుతో మోగించి చాటిన ఐరిష్ దేశభక్తుడు, శాశ్వతంగా ఐర్లాండ్ ను వదిలి ప్రవాస జీవితం గడిపిన చైతన్య స్రవంతి రచయిత జేమ్స్ జాయిస్.❁



## 72. 20వ శతాబ్ది ప్రముఖ ప్రభావ రష్యన్ స్వరకర్త– ఇగార్ స్ట్రావిన్స్కి (1882 -1971)

"క్రమం యొక్క కీర్తి సారమే సౌందర్యం" అన్నాడు రష్యన్ స్వరకర్త ఇగార్ స్ట్రా విన్స్కి. 1913లో పార్శియన్ పబ్లిక్ ముందు "ది రైట్ ఆఫ్ స్ప్రింగ్" బాలట్‌ను అన్ని సంప్రదాయాలను విస్మరించి విభిన్నంగా ప్రదర్శించినపుడు అది విప్లవాత్మకమో, విధ్వంసకమో శూన్యమో తెలియక జుట్లు పీక్కుని ప్రేక్షకులు నిరసన, ఆందోళన, ఈలలు, అరుపులు, పిల్లికూతలు, కేకలతో రాళ్ళవానతో భీభత్సం సృష్టించారు. ఈ భీభత్సం వాగ్నర్‌కు జరిగిన పరాభవన్ని గుర్తు చేసింది. వేదిక మీద వాద్య ధ్వనులకంటే, ఈ గొడవే ఎక్కువగా వినిపించింది. సభలో ఉన్న అమెరికన్ క్రిటిక్ కార్ల్ వాన్ వేచ్ టెన్ లేచి నిలబడి "ఈ కుర్రాడి సంగీతం వింటుంటే నా నెత్తి మీద అతని చేతులతో ముష్టి ఘాతాలు చేస్తున్నట్లుంది. అన్ని సంప్రదాయాల్ని నాశనం చేశాడు. నా భావోద్వేగం ఏమిటంటే ఆ దెబ్బలు కొంచెం సేపు నాకు బాధ కలిగించలేదు" అన్నాడు.

ఇగార్ స్ట్రా విన్స్కి ముఖ్య లక్షణం భావోద్విగ్నతను ప్రేరేపించటం. సంగీత పరమార్ధం "వస్తువుల విషయాల మధ్య క్రమాన్ని సృష్టించటం, దీనికి మించి మనిషికి, కాలానికి మధ్య క్రమత్వం నెలకొల్పటం" అంటాడు ఇగార్.. ఎమోషన్‌ను ప్రసరింప చేయటం లేక సృజనలో అర్ధాన్ని కల్పించటమే కాక స్ట్రా విన్స్కి ఆర్ట్ – ఒక మేధా కార్యక్రమం, స్వర సమూహాన్ని కొన్ని విరామాలలో క్రమబద్ధం చేయటం అతని ప్రత్యేకత. ఇంద్రియాలకు ప్రత్యేక విన్నపాలను చేయటం, శృంగార స్పూర్తి కలిగించటాన్ని వ్యతిరేకించాడు. అలా చేస్తే కాక్టియాచెప్పినట్లు "హృదయాన్ని బ్లాక్ మెయిల్" చేయటమే నంటాడు. హేతువాది. ఎమర్సన్ చెప్పిన "transcendentalism"అంటే అతీత భావవాదం, అందులోని "beauty is its own excuse for being" నచ్చినవాడు. దీన్ని సాధనక్రమంలో సాధించాలనుకొన్నాడు. స్వర కల్పన నిత్యకృత్యం అంటాడు. అలాకాకపోతే వాడని వాయిద్యం పనికి రాకుండా పోయినట్లు ఇదీ పాడై పోతుంది.

నిత్యాభ్యాసం లేకపోతే సంగీతకర్తకు ప్రగతి ఉండదు అంటాడు. ఏదైనా సృష్టించే ముందుస్ఫూర్తి కోసం ఎదురుచూడాలి అనుకొంటారు ఎక్కువమంది.. ప్రేరణను తాను కాదు అనలేనని, అది ముందుకు తీసుకుపోయే శక్తి అని, ప్రతి మానవ క్రియకు అవసరమేనని అంతమాత్రం చేత అది ఒక్కటే ఆర్టిస్ట్ యొక్క ఆస్థి కాదని అంటాడు. నిరంతర ప్రయత్నం, ప్రయాస బుద్ధికి అవసరం. అవే స్ట్రావిన్స్కి సంగీత వైవిధ్యానికి ముఖ్య సోపానాలు. అదే ఆతని "thinking of the music".

1882లో రష్యన్ కాలెండర్ ప్రకారం జూన్ 5,పాశ్చాత్య కాలమానం ప్రకారం 17న సెయింట్ ఇగార్ దినోత్సవంనాడు జన్మించాడు. తండ్రి ఫియోడర్ స్ట్రావిన్స్కి ప్రసిద్ధ బాస్ సింగర్. ఇదే మూడో కొడుకు విగార్‌కు సెయింట్ పీటర్స్‌బర్గ్ దగ్గరున్న ఒరానీన్ బాంలో సంక్రమించింది. ఆరేళ్ళ వయసులోనే పియానోపై చిన్న చిన్న విషయాలు వాయించేవాడు. అవి గొప్పవేమీ కాదు. 19 వయసులో రిమ్స్కి కోరాకాఫ్‌కు వాయించినప్పుడూ అభివృద్ధి కనిపించలేదు. 24లో షిహారజేడ్ కంపోజర్ అతనికి నేర్పటానికి ఒప్పుకొన్నాడు. గురువుగారి కంటే ఓరిఎంటల్ మ్యూజిక్‌లో చాలా ముందుకు దూసుకు పోయినా తన ప్రేరకుడిని ఎప్పుడూ గుర్తుంచుకొంటాడు. గురువు కూతురు రిమ్స్కిని పెళ్లి చేసుకొన్నప్పుడు స్ట్రా విన్స్కి ఒక సింఫనీ కవిత "ఫైర్ వర్క్స్" రాశాడు , గర్భాదానంతర్వాత నాలుగు రోజులకు రిమ్స్కి కోర్సాకాఫ్ చనిపోయాడు. గురువు స్మృత్యర్థం శిష్యుడు "చాంట్ ఫోనేబర్" కంపోజ్ చేశాడు.

ఇంకా చదువులోనే ఉండి, పియానోపై ఎట్యూడ్స్‌ను సాధన చేస్తుండగా రష్యన్ బాలెట్‌ను విప్లవాత్మకంగా మార్చేసిన సెర్జీ దయాఘిలేవ్‌తో పరిచయం కలిగింది. ఈయన 70 బాలెట్‌లను ప్రదర్శించే ఆలోచనలో ఉండి, డేబస్సి, ఫాలా, ఆలిక్, పౌలీన్ రిమ్స్కిలతో సంగీతం చేయిస్తున్నాడు. కర్టెన్లు రంగాలంకరణ దుస్తుల డిజైన్‌కు పికాసో వంటి ప్రసిద్ధులను నియమించుకొన్నాడు. స్ట్రావిన్స్కి శక్తి సామర్థ్యాలు తెలిసినవాడు కనుక చేరమని కోరాడు. అతనికి పని ఎలా చేయించుకోవాలో తెలుసు.. అతని మార్గదర్శకత్వంలో స్ట్రావిన్స్కి స్థానిక రష్యన్ సంగీతకారుడి అవతారం నుండి అంతర్జాతీయ యూరోపియన్ అవతారమెత్తాడు.

1909లో దయాఘిలేవ్ ప్రోత్సాహంతో స్ట్రావిన్స్కి "ది ఫైర్ బర్డ్" తోబాటు మరొక దానికీ సంగీత సమకూర్చాడు. కాని అతనిపై రష్యా సంగీత ప్రభావం ఇంకా దూరం కాలేదు. పియానో శబ్దాలను మిగతా ఆర్కెస్ట్రా మింగేసి కర్ణ కఠోర శబ్దాలను సృష్టించింది. పపెట్ ప్రదర్శన దారుణంగా విఫలమైంది. అయినా దయాఘిలేవ్ స్వయంగా తర్వాత కలిసి జరిగిందేదో జరిగింది దాన్ని పూర్తి బాలట్‌గా మార్చే ప్రయత్నం చేసి సత్తా చూపించమని ప్రోత్సహించాడు. "పెట్రౌ చకా"లో తన సామర్థ్యం ప్రదర్శించాడు.

రష్యన్ జానపద ట్యూన్స్ వాడి, స్వంత బాణీ ప్రదర్శించాడు. కొత్త రిథంలను ప్రయోగించాడు. మధురం శ్రావ్యత కలిపించాడు. కాని ఇదంతా చాలా ప్రాధమిక దశకు చెందినదే అనిపించింది. స్వేచ్ఛా వాతావరణానికి 31వ ఏడాదిలో ప్రవేశించి "లీ సాక్రే డుప్రిన్టేమ్స్"కు స్వర రచన చేశాడు. చరిత్రాతీత త్యాగ కథ ఒక్కసారిగా ఆయన మనసులోకి వచ్చింది. తన ఊహాలో "ఒక పాగాన్ ఉత్సవంలో గుండ్రంగా కూర్చున్న వృద్ధ తాపసులు చూస్తూ ఉండగా నడుమ ఒక యువతి డాన్స్ చేస్తూ చేస్తూ చనిపోవటం. ఆమెను రాబోయే శుభ వసంతానికి బలిగా చేయటం ఇందులో కథ. ఒక గుహ, అందులో వెర్రి ఆవేశపు స్త్రీలు, హిప్నటైజ్ అయిన కౌమార దశవారు, కన్యరికాన్ని కాపాడుకున్నవాళ్ళు, వాళ్ళల్లో వాళ్ళు చర్చించుకోవటం కలుసుకోవటం, ఆనందించటం విడిపోవటం అంతా అత్యంత సహజమైన డాన్స్‌లతో ప్రకృతి శక్తుల నృత్యాలతో తీర్చిదిద్దాడు. నియంత్రణలో ఉన్న హింస ఉండటంతో ఇది మాస్టర్ పీస్ అనిపించుకొన్నది. దీనిపై జీన్ కాక్టువా రాస్తూ "ఆటవిక దుఖం బాధ, చింతల పుట్టుకలో భూమి, పొలాలపై కేకలు, సన్నని మాధుర్యాలు, శతాబ్దాల కిందటి వాతావరణం, పశువుల నెమరువేతలు, పూర్తి ప్రకృతి సౌందర్యాన్ని ఒడిసి పట్టి చాలా గొప్పగా సింఫనైజ్ చేశాడు" అని రాశాడు. ఇందులోని సంగీత విలువలు చిరస్మరణీయం. ప్రతిదీ సెంట్రి ఫ్యూగల్ శక్తితో చలించింది. రెండు విభిన్న తాళాలతో శ్రుతి కల్గించాడు. వరుసక్రమంలో మనుషులు వంగటం, తుఫాను గోధుమ చేనుపై విరుచుకు పడ్డట్టు ఆడవాళ్ళ భుజాల మీద నుండి దాటుకు పోవటం, తమ మడమలను కాల్చుకోవటం ఓహ్! పరమాద్భుతం అనిపించింది. "Srtavinsky ;s dancers are not merely electrified by these rhythmic disturbances ,they are electrocuted" అని మహా ఇదిగా మెచ్చుకొన్నారు అతని సృజన విజృంభించి శత పత్ర పద్మ సుందరిలా వికసించి మనసులకు హృదయాలకు మహదానందాన్ని పంచింది. అలౌకిక అనుభూతికి లోను చేసింది. రాళ్ళ దెబ్బలు కొట్టిన ప్రేక్షకులను స్వర సమ్మోహనం చేసి తానే ఇప్పుడు సుస్వరాలతో బాది పారేసి ప్రతీకారం తీర్చుకొన్నాడు స్ట్రా విస్కీ.

సంగీత సూత్రాలకు విరుద్ధంగా పెట్రౌచాకా, షాకెర్‌లను చేశాడు. ఆకస్మిక అంతర్వేశనం (ఇంటర్ పోలేషన్), దారుణ దాట్లు, సంబంధం లేని ఫ్రేజులుతో ఒక తరాన్ని అంతటిని ప్రభావితం చేశాడు. సంగీత కర్తలు కొత్తగా చెప్పాలన్న ఆలోచనలకు వచ్చారు. వీటితో పరిచయంలేని వారు నేర్చుకొని చేయాల్సి వచ్చింది. స్ట్రావిన్స్కి ఎక్కడా రాజీ పడలేదు. వినేవారికి, చేసేవారికి అసూయ కలిగించలేదు. తన నెర్వస్ ఎనర్జికి సమాధానం చెప్పాడు. శబ్ద జంఝుకు, వైరుధ్యానికి విముక్తి కల్గించి దూసుకు పోయాడు. 1914లో స్వల్పకాలం రష్యాలో గడిపాడు. ఇదే చివరి దర్శనం. తర్వాత

స్విట్జర్లాండ్ వెళ్ళాడు. దీనివలన రష్యా నేపథ్యంతో ఏవేవో చేయాలనే ఊహ కలిగింది. వెంటనే రష్యన్ జానపద గీతాలతో "ప్రిబౌతి"ను ఒకే గాత్రంతో ఎనిమిది వాయిద్యాలతోను, "బెర్సూయెస్ డి చాట్"ను మూడు క్లారినెట్‌లతో, "రేనార్డ్"ను రష్యన్ ఫోక్ మెలడీస్‌తో ఒపెరాను చేశాడు. రష్యా విప్లవ సమయంలో రోమ్‌లో ఉండిపోయాడు. అక్కడే "వోల్గా బోట్ మన్స్ సాంగ్స్" పేర ఒక ఆర్కెస్ట్రాకు రాశాడు. దీని దయాఘిలేవ్ నిర్మాణంలో చేశాడు.

మరో రష్యన్ ఆధార "లేస్ నోసెస్" అనే పెళ్లి సందడిని రష్యా సంప్రదాయ జానపద బాణీలతో నేపథ్యంతో శతాబ్దాల క్రితం రష్యా పల్లెటూర్లలో జరిగే పెళ్లి వేడుకలలోని అన్ని విషయాలకు పునః ప్రాణ ప్రతిష్ట చేశాడు. "ఆ ఆచారాలు కట్టుబాట్లు నాకోసమే ఉన్నాయా అన్నట్లు స్వేచ్ఛగా వాడుకొన్నాను సంగీతంలో ఆడుకొన్నాను" అన్నాడు. అదొక బృహత్తర, నమ్మశక్యం కాని 17 విభిన్న వాయిద్యాల సమ్మేళనం. దీన్ని గురించి వివరిస్తూ "there were no strings or wood winds no harmonic pleasantries or instrumental sonorities, choruses piled on top of choruses --dwarfed the soloists --the constant use of voices, chanting in authentic folk accents even shouting and at times screaming, is a guarantee against any intrusion not nakedly indigenous" అని అర్థర్ బెర్జేర్ "మ్యూజిక్ ఫర్ ది బాలెట్"లో రాశాడు. "ఎల్ హిస్ట్ రే డు సోల్డాట్"ను స్విస్‌లో ఉండగానే చేశాడు. దెయ్యం వలలో చిక్కిన ఒక రష్యన్ సైనికుడి కథ. యుద్ధ సమయం కనుక చాలా పొదుపుగా చేశాడు. స్టేజి పైఒక ప్రక్క వివరించేవాడు, రెండవ వైపు 7 వాయిద్యాలు మాత్రమే ఉంచాడు. ఈ రెండిటినడుమ నాటకం నడుస్తుంది. చిన్న చిన్న ఎపిసోడ్‌లతో ఒకదానికొకటి ఉన్న సంబంధంతో నడిచే దీన్ని ఆయన "రాగ్ టైం" అన్నాడు. అప్పటికే 1916కే అమెరికాలోని నూతన సంగీతం ఆయన చెవిన పడింది. తనతో ఎంతో జాజ్ సంగీతాన్ని తెచ్చుకొన్నాడు 11-11-1918 "ఆర్మిస్టిస్" రోజున ఒక నివాళిగా భవిష్యత్తులో తన దేశం కాబోతున్న అమెరికాకు కానుకగా ఇచ్చాడు. దీన్నీ "రాగ్ టైం" అనే అన్నాడు. 11 వాయిద్యాలతో అద్భుత శబ్ద సృష్టి చేశాడు. తనను తానే అధిగమించాడు.

ప్రేక్షకులకు స్ట్రావిన్స్కి "ఆబ్స్ట్రాక్ట్ మ్యూజిక్"ను కోరుకొంటున్నారు. టోన్ పోయెమ్స్ , ప్రోగ్రాం మ్యూజిక్‌లపై వీటిని రాశాడు. ఎక్కువ మంది అభిప్రాయం ప్రకారం ఆయనకు థియేటర్ పరిధి దాటిన విస్తృత స్వర సమ్మేళనాలు ఉండాలని కోరుకొన్నారు. అవే ఆయన సంగీత విలువలను, ఆచరణీయ అంశాలనుగా మారుస్తాయి. 35వయసులో స్విస్‌ను వదిలి ఫ్రాన్స్ చేరి 16 ఏళ్ళ తర్వాత పౌరసత్వం పొందాడు. హార్మానిక్

రిధమిక్ అతిని వదిలి నిరాడంబర నియో క్లాసిజం వైపుకు మారాడు. "సంగీతం సరైన విజ్ఞానం. కనుక దానినుండి ఏదో సందేశం లేక అర్ధం ఆశించరాదు దాన్ని దానిగానే అనుభవించాలి" అన్నాడు. నలభైలలో చేసినదంతా స్వచ్ఛమైన ఆబ్ స్ట్రాక్ట్ సంగీతమే.

నలభై దాటాక క్లాసికల్ మ్యూజిక్ వైపుకు కదిలాడు. గాలి వాయిద్యాలకోసం ఒక ఆక్టేవ్ రాశాడు. పియానో వయోలిన్‌ల మేళనం వదిలేశాడు. గాలి వాద్యాలపైనే ఎక్కువగా పని చేశాడు. అవి స్వచ్ఛమైనవి, ప్రతిధ్వనినిచ్చి మానసికానందాన్నిచ్చేవి అన్నాడు. స్వచ్ఛమైన నాదం కోసం అన్వేషిస్తూనే ఉన్నాడు. గతాన్ని మళ్ళీ నెమరేసుకొన్నాడు. "పల్సినేల్ల"లో పాత మాధుర్య స్వరాలను వాడాడు. పెర్గోలేసి,చికో విస్కీ ల సుస్వరాలను వాడుకొన్నాడు .దీనిపై స్పందిస్తూ ''శిశు జననం తర్వాత రేప్ నిజమే ననిపిస్తుంది ''అని సమర్ధించుకొన్నాడు. ఇతర సంగీతకర్తల ట్యూన్స్‌ను చక్కగా వాడి కొత్తతరానికి పరిచయం చేశాడు.

ఇటలీ పర్యటనలో ఉండగా తాను మరీ మరీ ప్రాచీనంవైపు వెడుతున్నానని భావించాడు. దీని ఫలితంగా తన స్నేహితుడు జీన్ కాక్టువాను 'ఫ్రెంచ్ భాషలో ఉన్న' ఈడిపస్ రెక్స్'ను లాటిన్‌లోకి అనువాదం చేయమని కోరాడు. కొద్దిగా తనకు లాటిన్ వచ్చు కనుక అందులోని పదాలను ఫోనెటిక్ సామగ్రి కోసం వాడుకోవచ్చు అనుకొన్నాడు. శబ్దాలపై ఒత్తిడి కల్పించి ఇంద్రియాలు వాటి జాగ్రత్త అవి పడేట్లు చేయాలని సంకల్పించాడు. ఈ ఒపేరా-ఆర టోరియో తర్వాత మరొకటి క్లాసిజం ప్రకాశంతో "అపోలాన్ ముసగేట్స్" చేసి మొదటిసారి 1925లో అమెరికా వెళ్లి అక్కడ ఎలిజబెత్ స్ప్రేగ్ కూలిడ్జ్‌తో ఆవిష్కరింప జేశాడు. మళ్ళీ తంత్రీ వాయిద్యాలు ఉపయోగించి ఆర్కెస్ట్రాతో డామినేట్ చేయించి బహు సొగసైన వీనుల విందైన, మార్మిక అస్థిరతతో మారు మోగించి సంగీతంలో రస ధునులు సృష్టించిన బాష్, హాండెల్‌లను గుర్తుకు తెచ్చాడు.

1929లో డయాఘలేవ్ మరణం తర్వాత పూర్తిగా థియేటర్ సంబంధం లేని సంగీతాన్నే కూర్చాడు. యూరప్‌లో ఉంటున్నా దృష్టి అమెరికావైపే ఉండేది. 1930లో బోస్టన్ సింఫనీ 50వ వార్షికోత్సవానికి ఒక సింఫనీ రాయమని ఆహ్వానించారు. "19 వ శతాబ్ది నుండి వారసత్వంగా వచ్చిన సింఫనీ మనకు భాష, ఆలోచనలు రెండిటిలోనూ విదేశీ వాసన కలది" అని భావించి ఉపేక్షించాడు. కనుక మానవ స్వరాలను ఆర్కెస్ట్రా స్వరాలతో కలిపి నియోక్లాసిక్ పీరియడ్‌కు చెందిన అద్భుత స్వర సృష్టి చేశాడు.

తన జీవితచరిత్రలో దీనిపై రాస్తూ "సింఫనీ భిన్నస్వరాలతో అభివృద్ధి చెందిన ఒక విశేషమేకాని కాని నా ఆలోచనల మేరకు విస్తృత పరచాలనుకొన్నాను. కనుక కోరల్, వాయిద్యాల కలగలుపుతో వినూత్న అందాన్ని తెద్దామనుకొన్నాను. రెండిటికి

సమాన ప్రాదాన్యమిచ్చి ఒకదాన్ని మరొకటి ఆక్రమించకుండా జాగ్రత్త పడ్డాను. పదాలను ప్రత్యేకంగా సృష్టించి పాడించాను. సాల్టర్ నుంచి దీన్ని వాడుకోవాలనే ఆలోచన వచ్చింది. "సింఫనీ ఆఫ్ సాల్మ్స్"లో స్ట్రావిన్స్కి పదాలను నాదాల కోసం లాటిన్‌లోని వల్గేట్ నుంచి గ్రహించాడు. 50 ఏళ్ళు వచ్చేసరికి మరింత ఘనమైన స్వరకర్త అయ్యాడు. వయోలిన్, పియానోలకు "యుగళ కన్సర్టెంట్" చేశాడు. "పెర్సేఫోన్" కంసర్ట్‌కు రెండు పియానాలతో సమకూర్చాడు. 16 వాయిద్యాలతో మరో కంసేర్ట్ చేశాడు.

20వ ఏట రెండవ కజిన్ నడేజా సౌలిమాను పెళ్లి చేసుకొని ముగ్గురు పిల్లలకు తండ్రి అయ్యాడు. పెళ్లి అయిన 33 ఏళ్ళకు భార్య చనిపోయింది. యూరప్ అంటే విసుగు పుట్టి అమెరికాకు వెళ్ళిపోయాడు. అక్కడ మాసా చూసేట్స్‌లోని బెడ్ ఫోర్డ్‌లో 58వ ఏట వేరాసుదేకేన్‌ను పెళ్ళాడి, మూడవ పితృ దేశమైన అమెరికాలో స్థిరపడి 63వ ఏట అమెరికన్ పౌరుడయ్యాడు. 70 వయసులో పూర్తి ఒపేరా "ది రేక్స్ ప్రోగ్రెస్"ను 18వ శతాబ్దికి చెందిన విలియం హోగార్ట్ శిల్పరచనకు పరవశుడై, దాని నాధారంగా 20వ శతాబ్ది కథను మాంచి శక్తివంతంగా దూకుడుగా డబ్ల్యు హెచ్ ఆడెన్, చెస్టర్ కాల్ మన్ కవులు కల్పిత కథగా మలిచిన దాన్ని తీసుకొని, తనదికాని భాషలో ఉన్నదాన్ని అక్షర నాదాలను బట్టి సోనాట్ యూనిటీగా పరివర్తన చెందించాడు. ఇప్పుడు కూడా విమర్శకులు అది స్వీయమా, లేక ఇతర స్వరకర్తలైన హాన్డెల్, మొజార్ట్ టేకోవ్ స్కి ల కాపీ యా? అని ప్రశ్నించారు . కాని ఇర్వింగ్ కోలేడిన్ మాత్రం అంతగా మెచ్చక పోయినా, ఆడెన్, కల్లాం పాఠాన్ని అతి నూతనంగా, తెలివిగా, చిరస్థాయిగా నిలిచే సంగీతంతో ప్రకాశింప జేశాడు. ఇది ఏనాటికైనా మనతరంలోనే కాదు భవిష్యత్ తరాలలో కూడా అరుదైన ప్రయోగం అనిపించు కొంటుంది అన్నాడు.

స్ట్రా విన్స్కి చిత్రాన్ని పికాసో, కాక్టువాలు అద్భుతంగా గీశారు. "లైఫ్" మేగజైన్‌లో విన్త్రాప్ సార్జంట్ దీనిపై రాస్తూ "ఒక కొత్త ఇమేజ్‌లా ఉంది. బరువైన హారన్ రిమ్డ్ కళ్ళ అద్దాలతో అయన దేనిమీదో ముందుదృష్టి పెట్టిన గొల్లభామలాగా కనిపిస్తున్నాడు" అని కామెంట్ చేశాడు (his aquiline nose and heavy horn --rimmed glasses give him the look of a deeply preoccupied grasshopper) ఇక్కడ "ప్రీ ఆక్యు పైడ్"అంటే ఒక మేధావి ఏదో విషయంపై నిరంతర అన్వేషణలో మునిగి ఉన్నట్లు" అని అర్ధం చెప్పారు. "his willingness to write to order had made him more a craftsman than a creator" అని గిట్టని వాళ్ళు విశ్లేషించారు. అంటే ఆయన సృజనకర్త కంటే గొప్ప కళాకారుడు. కాని ఆయన అభిమానులు మాత్రం "అంతటి జీవకళ, ఉత్సాహం వైవిధ్యం, ప్రతి సూక్ష్మ విషయంపై దృష్టి, దాన్ని స్వర్ణమయం చేసే నేర్పు, అసాధారణమైన మిరుమిట్లు గొల్పే ప్రయోగాలు, ప్రశాంత సాధనా,

సాఫల్యత, ఆగ్రహ లయల అనుసంధానం, అంతటి క్రమపద్ధతి నిర్మాణం స్ట్రావిన్స్కి సంగీతంలో తప్ప ఇంకెక్కడా కనిపించదు కాక కనిపించదు" అని ప్రశంసించారు. పొగడ్తల తెగడ్తల, దూషణ భూషణ లేమీ పట్టించుకోకుండా తన పనేదే తాను చేసుకుపోయాడు. కొత్త శ్రుతులకోసం, కొత్త వాయిద్య సమ్మేళనాల ప్రయోగాలు చేస్తూనే ఉన్నాడు. అతను ఎలా పని చేస్తాడంటే "He lives only on music, shaping, cutting, and correcting it on a desk as severe as an architect;s drafting table". అంతటి దీక్ష తపన, అంకితభావం తాదాత్మ్యం ఆయనది. ఆయనకు ప్రేరణ ఒక లేబర్. "He knows how to sublimate instinct to a regular force" అని ఆయన పనితనాన్ని డచ్ క్రిటిక్ ఫ్రాంక్ ఆనేన్ విశ్లేషించాడు. స్ట్రావిన్స్కి కి "A thing of beauty is not a joy until it conforms to discipline bringing form out of chaos, fulfilling the stern definition of St.Thomos, "Beauty is the essence and glory of order"

6-4-19 71న అమెరికాలో 89వ ఏటఅమర సంగీత మందించిన స్ట్రా విన్స్కి అమరుడయ్యాడు.

ఆయన జీవితంలో 1) రష్యన్ పీరియడ్ -19 07 -19, 2) నియో క్లాసికల్ పీరియడ్ -19 20-54, 3) సీరియల్ పీరియడ్ -19 54 -68 అనే నాలుగు దశలు నడిచాయి. ఆయనను "one of music;s truly epochal innovators" అంటారు. కాంపోజిషన్ శైలిని ఎప్పటికప్పుడు మార్చటం ఆయన గొప్ప ప్రత్యేకత. అందులో స్పష్టత, తాదాత్మ్యాలను కాపాడుకొన్నాడు. అనేక రకాల వాయిద్యాలతో మానవ స్వరాలతో, ఏక వాయిద్యం నుంచి అనేక వాయిద్య సమ్మేళనాలతో చరిత్ర సృష్టించాడు. ఆయనకు రాయల్ ఫి హార్మోనిక్ సొసైటీ గోల్డ్ మెడల్‌ను, అందజేస్తే సానింగ్ మ్యూజిక్ ప్రైజ్‌ను లియోని ఇచ్చింది. బెస్ట్ క్లాసికల్ పెర్ఫార్మర్‌గా, బెస్ట్ క్లాసికల్ కంపోజర్‌గా ఆర్కెస్ట్రాలోను సోలో లోను పొందాడు. జీవిత సాఫల్య పురస్కారం మరణానంతరం 1987లో అందజేశారు. తన జీవితంలో సంగీతపరమైన అనేక గ్రంథాలు రాశాడు, "క్రానికల్ ఆఫ్ మై లైఫ్" అనే ఆటో బయాగ్రఫి రాసుకొన్నాడు మరికొందరితో కలిసి రచనలు చేశాడు. ❋



## 73. ఆంగ్ల ఆస్ట్రోఫిజిసిస్ట్, సైన్స్ ఫిలాసఫర్ - ఆర్థర్ ఎడ్డింగ్టన్ (1882-1944)

"మనిషి తర్కం అతని గొప్ప ఆయుధం" అంటాడు బ్రిటిష్ ఖగోళ, గణిత శాస్త్ర వేత్త ఆర్థర్ ఎడ్డింగ్ట న్. సంఖ్యలతో ప్రారంభమై సంఖ్యలతో అంతమయే తీరులో మధ్యలో ప్రభావిత సైంటిఫిక్ పాండిత్యం అని ఆర్థర్ స్టాన్లీ ఎడ్డింగ్ట న్ను విశ్లేషించవచ్చు. చివర్లో నంబర్ల విషయంలో మేధస్సు తగ్గుతుందో, లేక భవిష్యత్తులో మేధస్సు గుర్తింపు తెస్తుందో చెప్పలేని స్థితి. ఏది ఏమైనా ఎడ్డింగ్ టన్ సూత్రంలోని కీలక భావన శాస్త్రీయ ఆలోచనలో కొత్త విధానానికి నాంది పలికింది. ఎడ్డింగ్ టన్ 28-12-1882న స్కాట్లాండ్ సరిహద్దుకు యాభై మైళ్ళ దూరంలోని కేండాల్లో జన్మించాడు. రెండవ ఏటనే తండ్రి ఆ ఊళ్ళో ఒక స్కూల్ నడుపుతూ చనిపోయాడు. తల్లి అతన్ని సోమర్సెట్‌కు తీసుకువెళ్ళి క్వేకర్ విధానం సరైన విద్య నేర్పిలో పెంచాలనుకొన్నది. సౌకర్యాలు, నంబర్ల మీద ధ్యాస చిన్నప్పటి నుంచి ఉన్నాయి. 24వ ఎక్కం వరకు క్షుణ్ణంగా వచ్చేసింది. ఆరవ ఏట పెద్ద పెద్ద సంఖ్యలతో ఆడుకోవటం ఖగోళ శాస్త్రం వైపుకు ఆకర్షించింది. గణిత విషయాలన్నీ అప్పటికే హస్తగతమయ్యాయి. పదవ ఏట మూడు అంగుళాల టెలిస్కోప్‌తో ఆకాశాన్ని అధ్యయనం చేశాడు.

గొప్ప విద్య అడ్వొకేట్ అయిన తల్లి కొడుకును ప్రత్యేకతకల బ్రిమిలిన్ బోర్డింగ్ స్కూల్‌లో చేర్చింది. బోర్డింగ్ స్కూల్‌లో చదివిం చేంత ఆర్థిక స్తోమత లేదు. కాని ఈ స్కూల్ మాత్రమే మిగిలిన వాటికంటే మంచి విద్యనిస్తుందని నమ్మింది. కుర్రాడి ప్రత్యేక అభిరుచులను టీచర్లు బాగా ప్రోత్సహించారు. 13 వయసులో కేంబ్రిడ్జ్ జూనియర్ లోకల్ పరీక్షలలో మంచి మార్కులు సాధించి ప్రశంసలు పొంది, సోమర్సెట్ కౌంటి

స్కాలర్షిప్ 180 పౌండ్లు పొందాడు. ఇది మాంచస్టర్లో ఓవెన్స్ కాలేజిలో చేరటానికి వీలు కలిగించింది. 1902లో కేంబ్రిడ్జ్ ట్రినిటి కాలేజ్‌లో చేరి ట్రిపోస్ గణిత పరీక్షలో పాల్గొని మొదటి గౌరవం–సీనియర్ రాంగ్లెర్ సాధించాడు. దీన్ని మిగిలిన పోటీ దారులకంటే ఒక్క ఏడాదిలోనే సాధించటం అతని ప్రతిభా విశేషం. లెక్కలలో అపార పాండిత్యం, ఆస్ట్రానమి మీద అభిరుచి అతన్ని గ్రీన్విచ్ అబ్సర్వేటరి చీఫ్ అసిస్టంట్ అవటానికి దోహదం చేసింది. అక్కడ సమగ్ర నక్షత్ర గమనాలపై అధ్యయనం చేశాడు. ఒక ఏడాది తరువాత 1907లో "స్టెల్లార్ మోషన్స్"పైన రాసిన వ్యాసం అనేక నక్షత్ర సమూహాలతో ఏర్పడిన మన గెలాక్సీ గమనాన్ని, ఆకారాన్ని గురించి తెలిపింది. తన పరిశోధనల కేటలాగ్‌ను 1910లో ప్రచురించాడు. దీనికి "సిస్టెమాటిక్ మోషన్ ఆఫ్ స్టార్స్" అని పేరుపెట్టాడు. ఇందులో 6,188 నక్షత్రాల సైజు, స్థితి, గమనాలను విశ్లేషించి తెలియ జేశాడు.

31వ ఏట ఆస్ట్రానమిలో ప్లూమియన్ ప్రొఫెసర్ అయ్యాడు. ఏడాది తర్వాత ఫెలో ఆఫ్ ది రాయల్ సొసైటీ గౌరవం పొంది కేంబ్రిడ్జ్ అబ్సర్వేటరి డైరెక్టర్ అయ్యాడు. ఈ కాలంలో 12 ఏళ్ళ అక్షాంశాల తేడాలు ఖచ్చితమైన భూగమనం తెలుసుకోవటానికి ఎలా ఉపయోగపడతాయో కనిపెట్టాడు. నక్షత్ర గమనాలు, నక్షత్ర అంతర్భాగ నిర్మాణ విశేషాలను అందరూ వదిలేసిన ఐన్ స్టీన్ సిద్ధాంతం ఆధారంగా వివరించాడు.

పూర్వపు సైంటిస్ట్ లు నక్షత్రంలోని పరిస్థితులను అతి సామాన్యంగా చెప్పారు. కాని ఎడ్డింగ్ టన్ థెర్మో డైనమిక్స్‌ను, అటామిక్ ఫిజిక్స్‌తో మిక్స్ చేసి సేఫీడ్ వేరియబుల్స్ అంటే కొన్ని నక్షత్రాలు క్రమప్రకారం వాటిలోని కాంతి తగ్గి మళ్ళీపెరగటం, మళ్ళీ పెరుగదల నుంచి కాంతి క్రమంగా తగ్గిపోవటం వంటి ప్రత్యేక సమస్యలను అధ్యయనం చేసి చెప్పాడు. కొన్ని నక్షత్రాలలో గరిష్ట కాంతికి చేరటానికి కొన్ని గంటలే పడితే, మిగిలినవాటిలో చాలా ఎక్కువ కాలం అంటే సంవత్సరకాలం పడుతుందని చెప్పాడు. కాంతిలో వచ్చే ఈ మార్పులు నక్షత్ర ఉష్ణోగ్రతలో మార్పులు తెచ్చి, ఒకదాని తర్వాత ఒకటి తగలబడి చివరికి నక్షత్రం మొత్తం కుంచించుకు పోతుంది. ఎక్కువ కాంతి గల నక్షత్రాలు ఈ మార్పుకు నెమ్మదిగా గురౌతాయి. వాటిలోని పరిస్థితులను కూలంకషంగా అధ్యయనం చేసి నక్షత్రాల బరువుకు, వాటి పల్సేషన్ ఫ్రీక్వెంసికు ఉన్న సంబంధాన్ని సూత్రప్రాయంగా వివరించాడు. వాటి సుమారు బరువు, కాంతిలను పరిశీలన ద్వారా తెలుసుకొన్నాడు. తర్వాత సూత్రాన్ని చాలా ఖచ్చితం చేసి చెప్పాడు. సేఫీడ్స్ పీరియడ్ నుంచి దాని ద్రవ్య రాశి కనుక్కోవచ్చు, దాని ద్వారా దాని అసలు కాంతి ఎంతో తెలుసుకోవచ్చు. ఈ సేఫీడ్స్‌ను లైట్ హౌస్‌లుగా భావిస్తే వాటి ఫ్లాషింగ్ సిగ్నల్ ద్వారా

వాటి కాండిల్ పవర్ తెలుసుకొన్నట్లే వాటి కనిపించే కాంతి, దూరాలను లెక్కించవచ్చు.

చాలా సందర్భాలలో నెబ్యూలాలు మన మొత్తం గెలాక్సీలోని నక్షత్రాలకంటే, మిల్కీ వేకు చాలా దూరంలో ఉంటాయి. అంటే మన సూర్యుడు ఒక పెద్ద టౌన్‌కు శివారులో నక్షత్రాలు మన చుట్టూ కాంతి నిచ్చేటట్లు కనిపిచటమన్నమాట. మన గెలాక్సీకి బయట ఉన్న నెబ్యూలాలు దూరపు సిటీలోని తక్కువ కాంతిగా (ఫైంట్) కనిపించే లైట్లు అన్నమాట. వీటి దూరాలను వీటి "డిగ్రీ ఆఫ్ ఫైంట్ నెస్"ను బట్టి కాంతి సంవత్సరాల ద్వారా తెలుసుకోవచ్చు. అతని సేఫీడ్ వేరియబుల్స్ అంతరిక్ష యాత్రికులకు విలువైన ఏక రీతి కొలమానాన్ని అందజేసింది. సాధారణ నక్షత్ర గర్భవిషయం అంత అద్భుతమైనదేమీ కాకపోయినా అది రేడియేషన్ ప్రేసర్‌కు వినియోగించి మొదటిసారిగా స్టెల్లార్ అంతర్భాగాలను తెలుసుకోవటానికి సహకరించింది. ఈ రేడియేషన్ పీడనం నిజంగా అది బాగా ప్రకాశవంతంగా ఉన్నప్పుడున్న ఒక శక్తి లేక కాంతి తోపుడే నక్షత్ర నిర్మాణాన్ని ప్రభావితం చేసే ముఖ్య అంశం. "ఆన్ ది రేడియేటివ్ ఈక్విలిబ్రియం ఆఫ్ స్టార్స్"లో రాసి వివరించాడు. దీనిలో అతని కీలక భావనలు అన్ని రకాల నక్షత్రాల ద్రవ్యరాశి, ప్రకాశాలకున్న సంబంధాన్ని, వాటికి ఉష్ణం, కాంతిలను ఏర్పరచటానికి జరిగే వివిధ పరమాణు చర్యలను తెలుసుకొన్నాడు.

రాయల్ ఆస్ట్రనామికల్ సొసైటీకి 1912 నుంచి 17వరకు సెక్రెటరిగా ఉన్నాడు. డచ్ గణిత వేత్త విల్లెం డీ సిట్టర్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఈయనకు రిలేటివిటిపై ఉన్న అభిరుచి గమనించి ఐన్ స్టీన్ రాసిన జనరల్ థీరీ పుస్తకాన్ని కొన్ని వివరణ పత్రాలను పంపాడు. అది యుద్ధ సమయం కనుక ఈ విషయం ఇంగ్లాండ్‌లోనే ఉండి పోయింది. జామెట్రికల్, న్యూమరికల్ రీజనింగ్‌కు అది బాగా ఉపయోగ పడుతుందని గ్రహించాడు. సంఖ్యల మూల లక్షణాలు, అంతరిక్ష శోధనలో మునిగాడు. తన పనిలో తాను మునిగి ఉన్నా జనరల్ థీరీ ఆఫ్ రిలేటివిటిని సహచరులకు ప్రజలకు వివరించి చెబుతున్నాడు. 1918లో 91పేజీల "రిపోర్ట్ ఆన్ రిలేటివిటి" అనే బృహత్తర వ్యాసం రాశాడు. మరుసటి ఏడాది సూర్యుని శక్తివంతమైన గురుత్వాకర్షణ క్షేత్రంలో కాంతి పుంజం వంగిపోవటంపై ఐన్ స్టీన్ చెప్పిన జోస్యాన్ని అధ్యయనం చేసే అన్వేషణ యాత్రలో పాల్గొన్నాడు. 1920లో "స్పేస్, టైం, గ్రావిటేషన్" పుస్తకం ప్రచురించాడు. ఇందులో ఐన్ స్టీన్ సిద్ధాంతాలను తన విభజనలతో వివరించాడు ఇది సైంటిఫిక్ అన్వేషణలో విధానాలను ఫలితాలను బాగా వివరించింది. దీనితర్వాత "స్టార్స్ అండ్ ఆటమ్స్", "ది నేచర్ ఆఫ్ ది ఫిజికల్ వరల్డ్", ది ఎక్స్పాం డింగ్ యూనివేర్స్, "న్యూ పాత్ వేస్ ఇన్ సైన్స్, "ది ఫిలాసఫీ ఆఫ్ ఫిజికల్ సైన్స్" గ్రంథాలు రాశాడు. తన

భావజాలాన్ని సాంద్రతరం చేసి విస్పష్టం చేశాడు, సైన్స్‌కున్న ఊహాజనిత లక్షణాన్ని మెచ్చుకొన్నాడు.

జటిలమైన గణితాన్ని సమగ్రంగా మార్చే ప్రయత్నం చేశాడు. గ్రావిటేషన్‌ను సొట్టగా పోల్చాడు. అదే స్పేస్ టైంల మెత్తని వస్త్రం అన్నాడు. వస్తువులు గ్రావిటి వలన ఆకర్షింప బడుతాయి. దీన్ని ఎలా పోల్చవచ్చు అంటే- మంచుతో ఉన్న చెరువుపై దొర్లే రాయి ఐస్‌లోని డిప్రెషన్ (అణచటం)కు ఆకర్షింపబడినట్లు ఉంటుంది. విశ్వం అంతా వక్రంగా నాలుగవ పరిమాణంలో దానింతటికి అదే మూసుకు పోయినట్లు ఉంటుందే తప్ప అనంతం కాదు అని తన రిలేటివిటి సిద్ధాంతంతో చెప్పాడు. ఆస్ట్రో ఫిజికల్ గణనాలు ఒక అంతరిక్ష నౌక కనబడే ఒక సరళరేఖపై చాలా దూరం ప్రయాణం చేస్తే, అది వ్యతిరేక దిశ నుండి తిరిగి వస్తుంది అని తెలియ జేస్తున్నాయని చెప్పాడు. ఆయన ఖగోళ విషయాలలో మరో ముఖ్యమైంది-నెబ్యూలాలు మనకు దూరంగా కదిలి పోతున్నాయి అని. “the fundamental view point was not the apparent recession of nebulae, but the expansion of the whole four --dimensional curved universe” ఈ వ్యాప్తి నిరంతర ఎంట్రోపి అభివృద్ధితో సంబంధం కలిగి ఉంటుంది. విశ్వంలోని శక్తి అనేక రకాలుగా వాడుకోబడి లేక నశింపు పొందుతుంది కాని మళ్ళీ సృష్టింపబడదు అని తెలిపాడు.

ఎడ్డింగ్ టన్ ఉపన్యాసాలు ఇవ్వటానికీ సిద్ధమయ్యాడు. నెమ్మదిగా మొదలుపెట్టి గంభీరంగా మాట్లాడేవాడు. దృఢమైన నోరు, లోతైన కళ్ళు, వాటిని సగం మూసి ఉంచే కనురెప్ప వెంట్రుకలు చూస్తే ఈ వ్యక్తి ప్రపంచం అంతా, ఆలోచనలతో మునిగి ఉన్నట్లు అనిపిస్తుంది. వక్తగా చూస్తే దీనికి పారడాక్స్‌గా ఉంటుంది. వ్యక్తీకరణ చాలా డల్‌గా ఉన్నా విషయ వివరణం సూటిగా స్పష్టంగా ఉండేది. విని ప్రేరణకు లోనవ్వాల్సిందే. రాత, కూత తర్వాత కాలాన్ని గోల్ఫ్, పజిల్స్, డిటెక్టివ్ కథలలో గడిపాడు. కనుక పెళ్లి ఆలోచనే లేదు. ఐన్ స్టీన్ వర్క్‌లోని జామెట్రీకల్ రీజనింగ్‌పై ఆలోచన పెట్టాడు. దీనిలో చాలాక్లిష్టమైన “కాల్క్యులస్” గణితం ఉంది. “రిలేటివిటి థీరీ ఆఫ్ ప్రోటాన్స్ అండ్ ఎలక్ట్రాన్స్”లో తన సూత్రాన్ని వివరించాడు. ఫిజిక్స్‌లోని నంబర్లు “కాన్ స్టంట్స్‌ఆఫ్ నేచర్”ను పూర్తిగా ప్రేరక తార్కికత (ఇండ్యూసివ్ లాజిక్)తో గుర్తించి పరిష్కరించవచ్చు అన్నాడు. విశ్వ సత్యాలను కాంతి వేగాన్ని కాని అణువు బరువును బట్టీకాకుండా కూడా సాధించవచ్చు. మొదట్లో ఏదో ఒక దాన్ని అతి సరళంగా మూలంగా ఉన్న దాన్ని ఊహించి తరువాత ముందుకు వెళ్ళవచ్చు అని చెప్పాడు.

ఉదాహరణకు మనం మూడు పరిమాణాల ప్రపంచంలో ఉన్నామని అనుకొంటే

కాలం ఉందని భావిస్తే, విద్యుత్‌కు ధన రుణ తటస్థ స్వభావాలు ఉన్నాయనుకొంటే వీటి ఆధారంగా గణిత చట్రనిర్మాణాన్ని తయారు చేయవచ్చు. ఇది చాలా సంక్లిష్టమైనది కాని కొలువదగినంత ఫలితాలనిచ్చే దానిగా చేయచ్చు. ఎలక్ట్రాన్ కంటే ప్రోటాన్ 18 40 రెట్లు బరువైనదని ఈయన సిద్ధాంతం రుజువు చేసింది. అటామిక్ ఫిజిక్స్‌లో ఆయన ఊహా గణిత భావనలు ప్రయోగ ఫలితాకు అతి దగ్గరగా ఉండటం గొప్ప విశేషం. ప్రోటాన్ కు ఎలెక్ట్రాన్‌కు మధ్య ఒక ఊహాత్మక అటామిక్ పార్టికల్ ఉంటుందని చెప్పాడు. తరువాత పరిశోధనలో అదే "మీసాన్" అని కనిపెట్టారు. ఆయన ఊహించిన అన్ని లక్షణాలు బరువు చార్జిలతో సహా దానికి ఉన్నాయి.

విశ్వంలో 204 x2to the power of 256 కణాలు ఉంటాయని చెప్పాడు. ఈ సంఖ్య 16 తర్వాత 78 సున్నాల సంఖ్యకు సమానం. కాని వ్యోమగాముల గణనాల ప్రకారం విశ్వం ద్రవ్యరాశి అన్ని కణాలు కలిగి ఉండే వీలులేదు. లెక్కల్లో ఏదో కొద్ది తేడా తప్ప ఆయన ఊహ దాదాపు యదార్ధమే. సైంటిస్ట్‌లు ఆయనను మేధావి అనాలో లేక సంఖ్యల మర్మజ్ఞుడనాలో అర్ధకాక జుట్టు పీక్కున్నారు. భౌతిక స్థిరత్వాల సంఖ్యా సంబంధ యాదృచ్ఛ కాలు ఎడ్డింగ్ టన్ ఫలితాలతో సరిపోతున్నాయని విమర్శకులు తేల్చి చెప్పారు. 1944లో కేన్సర్ సోకి రెండేళ్ళు బాగా పోరాడుతూ నూతన జామెట్రికల్ సూత్రాలను వివరిస్తూ విశ్లేషిస్తూ గడిపాడు. 22-12-1944న 62ఏళ్ళ వయసులో కేంబ్రిడ్జ్ నర్సింగ్ హోంలో చనిపోయాడు.

ఇంకా శోదధించాల్సినవెన్నో మిగిలే పోయాయి. యువ శాస్త్ర, గణిత వేత్తలు వీటిని సాధించాలి. కాని ఎడ్డింగ్ టన్ కృషి చెల్లుబాటు అవుతుందో కాదో తేల్చాల్సిన పనేమీ లేదు. ఆయన విధానాలలో నిర్ణయాలలో తప్పులు ఉండవచ్చు కాని లాజిక్ నుండి ఫలితాలు సాధించవచ్చునని ఆయన రుజువు చేసింది పూర్తి యదార్ధం. జామెట్రికల్ రీజనింగ్ పరిధి బాగా విస్తరించి, మిశ్రమ లోహాల, నెబ్యులాలపై మరింత విజ్ఞానం లభించింది. ఆయన కృషి పరిధి పెరిగింది. సైన్స్ పరికరాల కంటే మనిషి తార్కిక శక్తి ఎక్కువ ఫలితాలనిస్తుందని ఎడ్డింగ్ టన్ నిరూపించాడు. కాస్మలాజికల్ కాన్ స్టంట్ విశ్వ ఆవిర్భావానికి ముఖ్య దోహదకారి అయి ఉండచ్చు అని నిర్ణయించి, కస్మలాజికల్ పరిశోధనలను ఆ కాన్ స్టంట్ పాత్ర, దాని లక్షణాల పరిశీలనపై కేంద్రీకరించాడు. వీటిని "మాధమేటికల్ థీరీ ఆఫ్ రిలేటివిటి" గ్రంథంలో పొందుపరచాడు. ఈ కాన్ స్టంట్ అంటే విశ్వస్వీయ కొలమానం.

ఫండమెంటల్ ఫిజిక్స్‌కు E numbers అనే ఆల్జీబ్రా ఆధారితమైనది ఉందని తెలుసుకొన్నట్లు చెప్పాడు. దీనినే క్లిఫోర్డ్ ఆల్జీబ్రా అన్నారు. స్పేస్ టైంను హయ్యర్

డైమెన్షనల్ ఆకృతికి దారి తీసింది. క్వాంటం థీరీ, రిలేటివిటి, కాస్మాలజి, గ్రావిటేషన్‌లను కలిపి విశ్వానికి ఒక ఏక సూత్రత సాధించే ప్రయత్నంలో చివరి రోజులు గడిపాడు.

సైక్లిస్ట్‌లు ఎక్కువ దూరం తొక్కే సామర్థ్యానికి చెందిన "ఎడ్డింగ్ టన్ నంబర్"ను కనిపెట్టాడు. ఎడ్డింగ్టన్ నంబర్ 60 అంటే ఒక సైక్లిస్ట్ సైకిల్‌ను రోజుకు 60 మైళ్ళు 60 సార్లలో తొక్కాడని అర్ధం. 62మైళ్ళు 100 కిలోమీటర్‌లకు సమానం. కానీ తర్వాత లెక్కల ప్రకారం నంబర్ 62 అంటే వందకిలోమీటర్లు 62 రోజుల్లో తోక్కాడనే అర్ధం కాని వందకిలోమీటర్లు వంద రోజుల్లో తోక్కాడని కాదు. 1919 సూర్యగ్రహణం నాడు ఉమర్ ఖయ్యాం కవితకు పేరడీగా ఎడ్డింగ్ టన్

Oh leave the Wise our measures to collate
One thing at least is certain, LIGHT has WEIGHT,
One thing is certain, and the rest debate —
Light-rays, when near the Sun, DO NOT GO STRAIGHT కవిత రాశాడు.

చంద్ర మండలంలో ఒక గుంటకు,ఆస్టెరాయిడ్ 2761కి, ఆయన పేరు పెట్టారు. స్మిత్ ప్రైజ్, బ్రూస్ మెడల్, గోల్డ్ మెడల్, రాయల్ మెడల్, కింగ్ హుడ్, ఆర్డర్ ఆఫ్ మెరిట్ వంటివి ఎన్నో పురస్కారాలు అందుకొన్నాడు. దాదాపు 15 పుస్తకాలు రాశాడు. మన భారతీయ ఆస్ట్రో ఫిజిస్ట్ సుబ్రహ్మణ్యం చంద్ర శేఖర్ లండన్ కేంబ్రిడ్జ్‌లో చదువుతున్నప్పుడు ఎడ్డింగ్ టన్ ప్రొఫెసర్. చంద్ర శేఖర్ ఫలితాలు బ్లాక్ హోల్స్ ఉన్నాయని తెలియజేశాయి. ఆయన చంద్రశేఖర్ లిమిట్ చాలా ప్రాచుర్యం పొందింది. అది భౌతికంగా అసంబద్ధమం (అబ్సర్డ్) అని కొట్టిపారేసి దాన్ని తిరస్కరించాడు తొక్కిపట్టేశాడు. పూర్తి గణితాధారిత నిర్ణయాలు యదార్ధ ప్రపంచానికి దుష్పరిణామాలు తెస్తాయన్నాడు. లేకపోతే అప్పుడే చంద్రశేఖర్‌కు నోబెల్ బహుమతి వచ్చి ఉండేది. తరువాత ఎడ్డింగ్ టన్ భావన తప్పు అని తేలింది. ప్రతిభకు పట్టిన గ్రహణం వీడింది. తరువాత ఎప్పుడో యాభై ఏళ్ళ తర్వాత ఆయనకు నోబెల్ పురస్కారం లభించింది. ఎడ్డింగ్ టన్ అసూయా దృష్టి, నిరంకుశత్వం, పిడివాదం, జాతి వివక్షత ఇంతపని చేసిందని చరిత్రకారులు నిర్ధారించారు. చంద్రశేఖర్ కూడా చాలా వ్యధకు గురయ్యాడు. దీనినే నేను "యాభై ఏళ్ళ ప్రతిభా చంద్ర గ్రహణం" పేరుతో ఒక వ్యాసాన్ని సుమారు ఏడెనిమిదేళ్ళ క్రితం రాస్తే "చినుకు" మాస పత్రికలో అచ్చయింది.❁



## 74. ఆధునిక సాహిత్య ప్రభావశాలి జెక్ నవలా రచయిత-ఫ్రాంజ్ కాఫ్కా (1883-1924)

"విజయవంతమైన జీవితానికి తగిన లక్షణాలేవీ నాలో లేవు" అని చెప్పుకొన్నవాడు జెక్ రచయిత ఫ్రాంజ్ కాఫ్కా. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఏర్పడిన అంతర్జాతీయ అపనమ్మకం, ప్రపంచ వ్యాప్త అభద్రత భావం లను గురించి ముందే ప్రజలను తన అవాంతర ఉపమాన నీతి కథలతో జాగృతం చేసిన జెకోస్లోవేకియా యువరచయిత ఫ్రాంజ్ కాఫ్కా 3-జులై 1883న ప్రేగ్‌లో జన్మించాడు. మొదటి నుండి వంటరివాడు. అణచబడిన అణగారినజాతివాడు. ఆస్ట్రియన్ సామ్రాజ్యంలో జెక్ ప్రజలు మైనారిటీలు. అతను జ్యూఅవటంతో మైనారిటీలలో మరీ మైనారిటీ వాడయ్యాడు. పరిసరాలకు తగినట్లు ప్రవర్తించటం చేత కాకపోవటం మరీ వంటరి వాడిని చేసింది. తల్లి జ్యూయీ లోవీ చాలా సున్నిత మనస్కురాలు. ఆమె అసాధారణ వైపరీత్యం ఉన్న మహిళ. శతాబ్దాల తరబడి లూవీలు విద్యావేత్తలు, దార్శనికులు..బాల్యం నుండి కాఫ్కా వారిలో ఒదిగిపోయాడు. తండ్రి హెర్మన్ కాఫ్కా బడా వ్యాపారి, హోల్ సేల్ బిజినెస్‌లో పూటుగా సంపాదించాడు. అందుకనే ఫాన్సీ వస్తువులు ఇంట్లో బాగా వాడుకలో ఉండేవి. తండ్రి యెడల కొడుకు ప్రవర్తన బాధాకరంగా సందిగ్ధంగా ఉండేది. తండ్రి పర్సనాలిటి, వ్యాపారం లో బుద్ధి సూక్ష్మత, నిర్ణయ సామర్ధ్యాలను చూసి అసూయ పడేవాడు ఈ అర్భక కుర్రాడు. ఆయన శక్తిని ఆరాధించాడుకాని ఆయన క్రూరత్వాన్ని అసహ్యించు కొన్నాడు.

దీన్నించి ఇక ఎప్పుడూ తేరుకోలేక పోయాడు. 36వ ఏట తండ్రికి "పుస్తకం అంత", "ఎ లెటర్ టు మై ఫాదర్" ఉత్తరం రాసి అందులో ఆరోపణలు ఫాంటసీలు,

స్వీయ రక్షణలు గుప్పించాడు. ఉత్తరం ఇలా ప్రారంభించాడు "ప్రియమైన నాన్నా! ఒకప్పుడు నువ్వు నా గురించి ఎందుకు భయం అని అడిగావు. అప్పుడు ఏం జవాబు చెప్పాలో భయంతో నాకు తెలియలేదు" అని కొనసాగిస్తూ తన బలహీనతలను తండ్రి సామర్ధ్యాలను వరసపెట్టి చెప్పుకొచ్చాడు. తండ్రికున్న సాఫల్యత తనకున్న అభద్రతాభావం, వైఫల్యం అన్నీ రాశాడు. "మనిద్దరినీ బేరీజు వేస్తే నేను కొంచెం కాఫ్కాలలోని లోయిని. అయితే జీవించటానికి, బిజినెస్ విజయవంతం చేయటానికి, డామినేట్ చేసి జయించటానికి కావలసిన కాఫ్కా లక్షణాలు నాకు లేవు. నీ సంగతి చూస్తే కాఫ్కాలలోని బలం, ఆరోగ్యం తిండి పుష్టి, మాట్లాడే నేర్పు స్వీయామోదం, ఆధునిక ఆడంబరం, పట్టుదల, ఏకాగ్రత, ప్రజల గురించిన జ్ఞానం, ఒక ప్రత్యేక హుందాతనం నీ సొమ్ము. కుర్చీలో కూర్చుని ప్రపంచాన్ని ఏలే తెలివితేటలు నీవి. నీ నిర్ణయం ఎప్పుడూ తప్పదు. మిగిలినవన్నీ ఆడంబరం అసాధారణం. నీ ఆత్మ విశ్వాసం మహత్తరమైనది. నీది స్థిర బుద్ధి. జెక్‌లకు వ్యతిరేకంగా నాటకంగా మాట్లాడగలవు. జర్మన్ల, జ్యూస్‌ల విషయంలోనూ ఇదే ధోరణి నీది. ఇవన్నీ ఏదో కారణం ఉండికాదు కారణం లేకుండానే. నిన్ను ఎవరూ దేనిలోనూ ఓడించలేరు. ఎప్పుడూ నువ్వే విజేతవు. ఇలాంటి రహస్యమైన గుణం నీది. నియంతలందరిది ఇదే ధోరణి. వాళ్ళు లాజిక్ తోకాక మేజిక్‌తో, తెలివి తేటలతోకాక పర్సనాలిటీతో అవతలి వారిని దెబ్బ తీస్తారు" అని రాశాడు ఈ ఉత్తరం ఒక రకంగా కాఫ్కా జీవిత చరిత్రయే. చిన్నప్పుడు కాఫ్కా పిరికితనాన్ని, మనిషిగా అపనమ్మకాన్ని వ్యక్తపరిచింది. తండ్రి మహోన్నత వ్యక్తిత్వం అడుగడుగునా కాఫ్కా అసమర్ధతను వ్యక్తం చేసింది. "you made me lose all possible self confidence and exchange a boundless sense of guilt for it"అని ఆవేదన చెందాడు కాఫ్కా. కాఫ్కా తనకు నరాల బలహీనత, తప్పు చేస్తున్నానేమోననే భయం, పట్టుకొని పీడిస్తున్నాయి. స్కూల్‌లో ఆతను అందరికంటే పెద్దవాడు. తమ్ముళ్ళు ఇద్దరూ ముందే చనిపోయారు. చెల్లెళ్ళు ముగ్గురికీ దూరమై ఒంటరివాడై పోయాడు. జర్మన్ ఎలి మెంటరి హైస్కూల్‌లలో చదివి ప్రేగ్ యూనివర్సిటిలో తనకిష్టమైన సాహిత్యం భాషలను చదివాడు. డిబేటింగ్ సొసైటీలో చేరి యువ, ప్రయోగశీల రచయితలను ప్రోత్సహించాడు. 21వ ఏడు వచ్చాక తాను లోయీ డ్రీమర్‌గా ఇక ఉండలేననుకొన్నాడు. ఏదో ఒకటి చేసి కష్టపడి డబ్బు సంపాదించి జీవించాలని నిర్ణయించుకొన్నాడు. తండ్రి బిజెనెస్‌లోకి రమ్మని ఒత్తిడి చేసినా ఆ వైపుకు కన్నెత్తి చూడక, తనకున్న వాదనా పటిమను లాయర్‌గా ఉపయోగించు కొందామనుకొని లా చదివాడు. 23 కే "డాక్టర్ ఆఫ్ లా" అయ్యాడు. కాని ప్రాక్టిస్ పెట్టలేదు. ఒక చిన్న ఇన్సురెన్స్ ఆఫీస్‌లో గుమాస్తాగా చేరి,

తర్వాత పైకి ఎదిగాడు. ఆస్ట్రియన్ ప్రభుత్వ శాఖలో పని చేస్తూ ఖాళీ సమయంలో ఆత్మకథ రాస్తూ లోపలి టెన్షన్‌లకు విముక్తి కలిగించే ప్రయత్నం చేశాడు.

ఒంటరిగా ఉండాలన్న భావాన్ని వదిలేసి గ్రూపులతో కలిసి ఉంటున్నాడు. మహా కవి దార్శనికుడు, జర్మన్ రచయితా గోథేను ఆవిష్కరించే సామర్థ్యం ఉన్న రుడాల్ఫ్ స్టేనర్ పరిచయమై ప్రవర్తనాశీల అధ్యయన శాస్త్రం (యాన్త్రోపోస్కోపి), తాంత్రిక శాస్త్రాలవైపు ఆకర్షింప బడ్డాడు. కొంతకాలం తానే "కాబాలిస్ట్" అయ్యాడు. మాక్స్ బ్రాడ్, ఫ్రాంజ్ వేర్ఫెర్ మొదలైన వారి ప్రభావంతో "జియోనిస్ట్" అయ్యాడు. ఇద్దరు ముగ్గురికంటే సన్నిహితంగా ఉండేవాడుకాదు. బృంద ఆలోచనలలో పాల్గొనేవాడు కాదు. ఒక గంట మాట్లాడాక నరాల ఒత్తిడి పెరిగిపోయేది పెదిమలు ఆకస్మికంగా బిగుసుకు పోయేవి, అసాధారణమైన నల్ల కళ్ళు మండిపోయేవి. విపరీతమైన తలనొప్పి వచ్చి బాధపడేవాడు. 29 వయసులో బెర్లిన్ వయ్యారి పొగడ్తలతో ఉబ్బు లింగమైపోయాడు. ఆమెతో సాన్నిహిత్యం ప్రేరణ భయమూ కూడా కలిగించాయి. రెండేళ్ళ తర్వాత పెళ్లి చేసుకోమని అడిగాడు. ఎంగేజ్ మెంట్ జరిగింది కూడా కాని మూడు నెలలకే దాన్ని కాఫ్కా రద్దు చేయించాడు. తన ఆకస్మిక నిర్ణయానికి లెంపలేసుకొని క్షమాపణ కోరాడు చాలాసార్లు. తన నరాల బలహీనత, టి.బి. లక్షణాలు ఏకరువు పెట్టాడు కాని జబ్బుకంటే మానసికంగా బలహీనమయ్యాడు. "హనీ మూన్ ఆలోచన అంటే నాకు భయమేస్తుంది" అని చెప్పుకొన్నాడు ఒకసారి. "నాప్రేమ ఉక్కిరి బిక్కిరికి భయం, నా విధానాలకింద సమాధి అయింది" అని మాక్స్ బ్రాడ్‌కు జాబు రాశాడు. గృహస్త జీవితానికి సంసార బాధ్యతలకు అనుకోకుండా స్వస్తి చెప్పినవాడిని చూస్తే కర్క్ గాడ్ గుర్తుకొస్తాడు. కాఫ్కా నేరాన్ని తండ్రిపై నెట్టేసి తప్పించుకొన్నాడు. తండ్రికి రాసిన ఉత్తరంలోనే ఈ అధ్యాయాన్నీ చేర్చి "సంసారం ఈడ్చాలంటే నీలాగా సర్వ సమర్థుడనై ఉండాలి. కానీ నాకవేమీ లేవు. అంటే మంచీ చెడూ లేవునాకు. అవి నీలో సహజంగా ఉన్నాయి. అందర్నీ ప్రేమిస్తున్నట్లే ఉంటావుకాని ఎవరినీ నమ్మవు" అని ఏకరువుపెట్టాడు. జరిగిపోయిన నష్టాన్ని భర్తీ చేసుకోవాలనుకొని 34వ ఏట మళ్ళీ ఒకమ్మాయికి లైనేసి ఎంగేజ్‌మెంట్ చేసుకొన్నాడు. కాని విషయం పక్వం కాకుండానే అతని అధైర్యం, అనాసక్తత వలన ఒక్కసారిగా బ్రేక్ పడింది. మళ్ళీ సీరియస్‌గా జబ్బుపడి ఒంటరివాడయ్యాడు.

అప్పటికే తాను రాసిన వ్యాసాలూ, కొన్ని చిన్నకథలు చేర్చి "దిస్టోకర్" పేరిట ముద్రించాడు. ఇది ప్రైజ్ పొందింది. ఇదే తర్వాత వచ్చిన "అమెరికా" అనే ఫాంటసిలో చోటు చేసుకొన్నది. మిగిలిన రచనలు అతని అతి తక్కువ స్నేహబృందానికి తప్ప

లోకానికి తెలియలేదు. చనిపోయాక మూడు నవలలు విడుదలై అనువాదం పొందాయి. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. డబ్బులకేమీ ఇబ్బంది లేదు కాని అప్పుడు బొగ్గు కొరత ఏర్పడింది. కనుక వెచ్చదనానికి అవకాశం లేక రక్తం కక్కుకోనేవాడు. అతనికి "పల్మనరి కటార్" జబ్బు వచ్చిందని, అందుకని ఎవరో ఒకరు తోడు ఉండాలి కనుక సాజ్ దగ్గర జురావు ఎస్టేట్‌లో ఉన్న చిన్న చెల్లెలి దగ్గర ఉండమని డాక్టర్లు సలహాచ్చారు. అక్కడ ఆరోగ్యం కొంతనయమైంది. "ది ట్రయల్ అండ్ ది కాజిల్" రాయటంలో విశ్రాంతిలేక దగ్గు పట్టుకున్నది. తర్వాత చాలా శానిటోరియంలలో చేరాడు.

40వ ఏట 18 ఏళ్ళ జ్యూయిష్ అమ్మాయి డోరా డిమాంట్‌తో ప్రేమలో పడి ఇద్దరూ కలిసి ప్రేగ్‌కు వెళ్ళారు. కాని మళ్ళీ ప్రేమ విఫలమైంది. జబ్బు తీవ్రమై ప్రమాద స్థితికి చేరింది. తలిదండ్రులకు తెలిసి అతనికి తక్షణ వైద్యం కోసం తీసుకొని వెళ్లి వీనర్ వాల్డ్ శానిటోరియంలో చేర్చాలనుకొని ఓపెన్ కారులో తీసుకువెడుతుంటే మూలిగే నక్కపై తాటి పండు పడ్డట్టు అకస్మాత్తుగా తుఫాను చుట్టు ముట్టింది. ఒళ్లంతా తడిసి ముద్దఅయి ఒణుకుతూ అచేతన స్థిలో చేరాడు. అక్కడ రోగులు విపరీతంగా ఉన్నారు. కాఫ్కాను బాధతో చచ్చిపోతున్న ఒక వ్యాధిగ్రస్తుడి ప్రక్క బెడ్‌లో పడుకోబెట్టారు. తర్వాత కీర్లింగ్ శానిటోరియంలో ఒక ప్రత్యేకగదిలో పెట్టారు. అక్కడే కాఫ్కా 3-6-1924న 41వ పుట్టినరోజు ఒక నెల ఉందనగా ఈ లోకం నుంచి కనుమరుగైపోయాడు శాశ్వతంగా. స్వగ్రామానికి తీసుకొని వెళ్లి జ్యూయిష్ పద్ధతిలో ప్రాగ్-స్ట్రాస్ చిన్జ్‌లో ఖననం చేశారు, అతని చెల్లెళ్ళు ముగ్గురూ విజ్ కాన్సేంట్రేషన్ కాంప్‌లో నాజీ దురాగతానికి బలైపోయారు. మగ నలుసు కూడా ఎవరూ మిగల లేదు.

కాఫ్కా పుస్తకాలు నిరాశ గాథామయ ధారావాహికం. గట్టిమనసు, అన్నిటిని ఎదుర్కొనే ధైర్యం కావాలని కోరుకున్నాడు కాని పొందలేక పోయాడు. ఆ అదృష్టం తనకు దక్కదని గ్రహించాడు. "ది ట్రయల్" నవలలో బాంక్‌లో ధనసంబంధ ఉన్నతాధికారి యే నేరం చేయక పోయినా చట్టాన్ని ఉల్లంఘించక పోయినా అరెస్ట్ అవుతాడు. నేరం మోపిన వారిని కాని ఎందుకు అరెస్ట్ చేశారో ఏ నిబంధనలతో చేశారో కాని తెలియదు. అయిష్టంగానే లాయర్ని కుదుర్చుకొన్నాడు. పైన పడిన అపరాధంతో కుంగి పోయాడు. భయపడిపోయాడు. అటార్నీ రహస్య డాక్యుమెంట్ కోర్ట్‌లో దాఖలు చేస్తే కేసు నిరంతరం సాగుతూనే ఉంటుందని సలహా ఇచ్చాడు. తన వెనక ఏదో ముఠావ్యతిరేకంగా పని చేస్తోందనుకొన్నాడు. అలాగే జరిగి కత్తిపోట్లకు గురై చనిపోయాడు. ఈ నవలనే ఆంద్రే గైడ్, జీన్ లూయీ బార్రట్లు నాటకంగా

మలిచారు. గోటిఫ్రైడ్వాన్ ఈనేం ఒపెరగా మార్చాడు.

"ది కాజిల్"లో ఈ నిరాశ మరీ విస్తృతమైనది. హీరోకు బాగా ఎత్తుమీదున్న బడాకేజిల్ అధికారులు లాండ్ సర్వేయర్ ఉద్యోగం ఆశ చూపించి. దానిపైకి మంచు చీకటిలో ఎక్కలేక ఎక్కలేక ఆభాస శూన్యంగా భావించాడు. ఇంత కష్టపడి ఇంటర్వ్యూకు వెడితే లోపలి అనుమతించలేదు. ఎన్నో విధాల ప్రయత్నించి విఫలుడయ్యాడు. స్టేటస్ సాధించే ప్రయత్నాలు లాభించలేదు. ఒక బార్ మెయిడ్ సాయంతో ప్రయత్నించినా కుదరలేదు. "అమెరికా" నవల కనిపించని శత్రువు ఉంటాడు. ఈ మూడిటిని "ట్రయాలజి ఆఫ్ లోన్లినెస్" అన్నారు. కాఫ్కా తండ్రి సగం నియంత సగం దేవుడు. బ్యూరాక్రాసి ప్రపంచంలో, యాంత్రిక పారిశ్రామికాభి వృద్ధిలో ఒంటరి అవటం మనుషులకు దూరం కావటం సహజం అని సూత్రీకరించాడు. కాఫ్కాను బాగా సంర్దిం చేవారూ బాగా వ్యతిరేకించేవారూ ఉన్నారు. కాఫ్కాలో మానవత్వం వంటరిదైపోయింది, ప్రేమలేదు, రక్షణ ఉండదు. అన్ని ఆసరాలు కోల్పోతారు. కాఫ్కా వీటన్నిటిని భూతద్దంలో చూపించాడు.

చిన్నతనంలో వ్యాయమం అంటే మోజు లేదు కాని పెద్దయ్యాక ఆటలు, ఫిజికల్ యాక్టి విటీలలో బాగా పాల్గొన్నాడు. మంచి రైడర్, స్విమ్మర్, రోవర్. ప్రత్యామ్నాయ మందులపై ఆసక్తి ఉండేది. మాంటిస్సోరి, టెక్నికల్ విద్యలపై అభిరుచి ఉండేది. "రచన కాఫ్కాకు ఒక విధమైన ప్రార్ధన". శబ్దకాలుష్యానికి దూరం. అతనిది "స్కిజాయడ్ పర్సనాలిటి డిసార్డర్". Enclosed in my own four walls, I found myself as an immigrant imprisoned in a foreign country;…… I saw my family as strange aliens whose foreign customs, rites, and very language defied comprehension;…… though I did not want it, they forced me to participate in their bizarre rituals;…… I could not resist.[193] రచన అంతా జర్మన్ భాషలోనే చేశాడు. సుదీర్ఘ వాక్యాలు ఒక్కోసారి పేజీ అంత ఉండేవి. వీటిని ఇంగ్లీష్‌లోకి అనువదించటం కష్టమయ్యేది. జర్మన్ భాష తమాషా ఏమిటి అంటే ఒకే వాక్యాన్ని అనేక రకాలుగా అనువాదం చేయచ్చు. అతనిది "మెటామార్ఫసిస్" శైలి అంటారు. మిగిలిన రచయితల వాక్యాలను ఉదాహరించినట్లుగా కాఫ్కా వాక్యాలు ఉదాహరించటం అరుదు. Michel-André Bossy writes that Kafka created a rigidly inflexible and sterile bureaucratic universe. Kafka wrote in an aloof manner full of legal and scientific terms. Yet his serious universe also had insight-

ful humour, all highlighting the, "irrationality at the roots of a supposedly rational world". [180] His characters are trapped, confused, full of guilt, frustrated, and lacking understanding of their surreal world. Much of the post-Kafka fiction, especially science fiction, follow the themes and precepts of Kafka' universe. This can be seen in the works of authors such as George Orwell and Ray Bradbury.[180]

"Kafkaesque"

Kafka' writing has inspired the term "Kafkaesque", used to describe concepts and situations reminiscent of his work, particularly Der Process (The Trial) and "Die Verwandlung" (The Metamorphosis). Examples include instances in which bureaucracies overpower people, often in a surreal, nightmarish milieu which evokes feelings of senselessness, disorientation, and helplessness. Characters in a Kafkaesque setting often lack a clear course of action to escape a labyrinthine situation. Kafkaesque elements often appear in existential works, but the term has transcended the literary realm to apply to real-life occurrences and situations that are incomprehensibly complex, bizarre, or illogical.

ఆల్బర్ట్ కాము, జీన్ పాల్ సాత్రే, లూయీ బోర్జేర్‌లు కాఫ్కా ప్రభావానికి బాగా గురైనవారు. అతని సాహిత్యం విజువల్ ఆర్ట్ మీద, సంగీతం మీద, పాప్యులర్ కల్చర్ మీద అపారం. 20వ శతాబ్దం నవలలు ఎక్కువ భాగం ఆతని ప్రభావంతో రాయబడినవే. Steinhauer, a professor of German and Jewish literature, says that Kafka "has made a more powerful impact on literate society than any other writer of the twentieth century". [5]Brod said that the 20th century will one day be known as the "century of Kafka". [5]

ఫ్రాంజ్ కాఫ్కా మ్యూజియంను ప్రేగ్‌లో నెలకొల్పారు. అతని పేర ఏటా సాహిత్య అవార్డ్ అందిస్తున్నారు. కాఫ్కా సొసైటీ ఏర్పడి అనేక సేవా కార్యక్రమాలు నిర్వహిస్తోంది.



## 75. అమెరికాలో మొదటి సాహిత్య నోబుల్ బహుమతి పొందిన- సింక్లైర్ లెవిస్ (1885-1951)

అమెరికాలో సాహిత్యంలో మొదటిసారి నోబుల్ పురస్కృతి సింక్లైర్ లెవిస్‌కు దక్కింది అంటే అది పారడాక్స్ అన్నారు. కారణం ఆయన రాసినవి స్థానిక విషయాలకు సంబంధించిన చౌకబారు పుస్తకాలు. అవి స్థానిక సాంఘిక ప్రమాణాలకు మాత్రమే సరిపోయేవి. అమెరికా బిజినెస్ మనస్తత్వానికి కాపట్యానికి వ్యతిరేకి. 7-2-1885న అమెరికా మిన్నేసోటలోని సౌక్ సెంటర్‌లో పుట్టాడు. తాను పుట్టింది సెంట్రల్ వెస్ట్‌లోని సంస్కృతికి విరుద్ధమైన, కిక్కిరిసిన ఇళ్ళతో నైతికంగా దిగజారిన గోఫర్ ప్రయరిలో అని చెప్పుకొన్నాడు. తండ్రి గ్రామీణ వైద్యుడు. తండ్రిపై అభిమానాన్ని నవలలో చెప్పుకొన్నాడు. అటు పల్లెకాక, ఇటు పట్నామూకాని ఊరు అది. చిన్నప్పటినుండి తూర్పుగాలిపై ధ్యాస ఉండేది. లోకల్ స్కూళ్ళలో చదివి ఏల్స్ వెళ్లి, ఒక సాహిత్య పత్రికకు సంపాదకుడై 1908లో గ్రాడ్యుయేట్ అయ్యాడు. 'వికృతంగా పొడుగ్గా ఎముకలపోగుగా, ఉబ్బిన కనుబొమలతో గట్టి నుదురుతో' యవ్వనంలో కనిపించేవాడు. అండర్ గ్రాడ్యుయేట్‌గా ఉండగానే కాల్పనిక శృంగారంను కవిత్వం వచనం కలగలిపి కథలు రాశాడు. మొదటి రచనలన్నీ విపరీతమైన ఎమోషన్‌తో నైపుణ్యంగా రాసిన వచనాలే. 45వ ఏట ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకొని అప్పటిదాకా రాసింది వ్యర్ధమేనని భావించి అసలైన జీవిత చిత్రణ చేయాలనుకొని మిన్నెసోటా ప్రయరి గ్రామాల నేపధ్యంతో రాశాడు.

అప్టాన్ సింక్లైర్ స్థాపించి ఏంగిల్ వుడ్‌లోని కొ ఆపరేటివ్ కాలని గురించి తెలిసి సోషలిజం దెబ్బతినటానికి కారణాలను అన్వేషించాడు. న్యు జర్సిలో హెల్పర్లు అవసరం అని గ్రహించి తానే స్వయంగా కాపలాదారుగా, లాండ్రి మాన్‌గా సేవలు అందించాడు. తాను అసంతృప్తితో పేరుపెట్టిన హేలికాన్ హాల్ దగ్ధమైతే, నిరాశ చెందినా ధైర్యంగా

నిలబడ్డాడు. పనామాకు చేరి, ఆ విస్తృత కాలువ త్రవ్వకం పనుల్లోపై ఉద్యోగం రాక, కాలి ఫోర్నియా చేరుకొన్నాడు. డబ్బుల్లేక అప్పులతో ఏడాదిన్నర గడిపాడు. చిన్నకథలు రాసి పత్రికలకు పంపిస్తే అంతే వేగంగా తిరిగొచ్చేవి. మళ్ళీ తూర్పుపై గాలి మళ్ళి, ఇయోవాలో రిపోర్టర్‌గా చేరి, వాషింగ్టన్ డి. సి. లో జూనియర్ అసిస్టెంట్‌గా పనిచేసి, 25 ఏళ్ళ వయసులో న్యుయార్క్‌లో ఒక పబ్లిషింగ్ హౌస్‌లో వారానికి 15 డాలర్లకు చెవిటి వారికి ప్రత్యేకమైన మేగజైన్‌లో సబ్ ఎడిటర్‌గా పని చేశాడు. "లేబర్ మార్కెట్ లో ఇదే నా అసలైన విలువ" అని జోక్ చేస్తూ 1930లో నోబెల్ ఫౌండేషన్‌లో ఆటో బయాగ్రఫి రాస్తూ చెప్పుకొన్నాడు. ఇదీ ఆయనకేమీ నచ్చలేదు. తాను ఏదైనా గొప్ప సాహిత్యం రాసి ఉంటే కళ్ళకద్దుకొని పెద్ద జీతం ఇచ్చేవారు అనుకొన్నాడు. తరువాత అయిదేళ్ళు ఆఫీస్ బాయ్‌గా ఒక పబ్లిషర్ వద్ద, రాతప్రతి సరి చేసే వాడుగా, "అడ్వెంచర్" పత్రికకు అసిస్టెంట్ ఎడిటర్‌గా, యాడ్ రైటర్‌గా, కేటలాగర్‌గా, బుక్ రివ్యూయేర్‌గా పనిచేసి పొట్ట గడుపుకొన్నాడు. మొదటి పుస్తకం "హైక్ అండ్ ది ఏరోప్లేన్" అనే ఒక కుర్రాడి కథ. 25వ ఏట రాసి "టాం గ్రాహం" అనే మారు పేరుతో ప్రచురించాడు.

29వ ఏట గ్రేస్ హేగ్గర్ అనే అమ్మాయిని పెళ్లి చేసుకొని, 11 ఏళ్ళ తర్వాత విడాకులిచ్చాడు. 1928 లో జర్నలిస్ట్, కాలమిస్ట్ డోరోతీ థామ్సన్‌ను పెళ్ళాడాడు. 14 ఏళ్ళ కాపురం తర్వాత విడాకులు. మొదటి భార్యకు పుట్టిన కొడుకుకు "వెల్స్" అని తన అభిమాన రచయిత హెచ్.జి.వెల్స్ పేరు పెట్టుకొన్నాడు. యితడు రెండవ ప్రపంచయుద్ధంలో చనిపోయాడు. వెల్స్ ప్రభావం మొదటి నవలలపై బాగా ఉంది. "ది ట్రయల్ ఆఫ్ ది హాక్" నవల మిడ్వెస్ట్‌లోని ఒక కార్పెంటర్ కొడుకు ప్రాంతీయ సాంప్రదాయాల నుండి విముక్తుడై, నిరంతర సంచారిగా చివరికి కొత్త నావికా ప్రపంచంలో అడుగు పెట్టటం కథ. బిజినెస్ వృత్తిలోని స్త్రీ పోరాటాలను "ది జాబ్"లో, మధ్యవయసు సాహసం మధ్యతరగతి ప్రేమ మందహాసం "ది ఇన్నోసెంట్"లో, తూర్పు సమాజపు పిల్ల. మధ్య ప్రాచ్య మెకానిక్‌ల మధ్య ప్రేమాయణం విభేదాలు, స్వేచ్ఛ కోసం తపన "ఫ్రీ ఎయిర్"లో రాశాడు. ఇవన్నీ 30 ఏళ్ళ లోపే రాశాడు. 35 వయేట ఈ విధానానికి గుడ్‌బై చెప్పి రాజీలేని నిజాయితీ, జంకని వాస్తవికతలతో రచన చేశాడు. ఇప్పటిదాకా సంతోష పెట్టటానికే రాశాడు. ఇప్పుడు నిజం చెప్పటానికి, ఆ నిజం యెంత ఘాటుగా ఉన్నా జనం చదవక పోయినా ఫరవాలేదన్న భావంతో రాశాడు. ఈ ధోరణిలో "మెయిన్ స్ట్రీట్" రాశాడు. ఇదొక బాంబు ప్రేలుడులాగా జనానికి షాక్ ఇచ్చింది. స్థానిక సరిహద్దులు దాటి విస్తృత పరిధిలో రాసిన రచన ఇది. కనుక వివాదాస్పదమై , ఒక మిలియన్ కాపీలు అమ్ముడై సంచనం సృష్టించి, అన్ని యూరోపియన్ ఆసియా భాషలలోకి అనువాదం పొంది అంతర్జాతీయ ఖ్యాతి పొందాడు. ఆయనలోని తిరుగుబాటు మనస్తత్వానికి, సంకుచితత్వంపై పోరాటానికి డాలర్ ప్రభావంతో క్రూసిఫిక్స్ అయిన

పల్లెటూరు జనంపై సానుభూతికి నిదర్శనం. అమెరికన్ మార్మిక కథలన్నీ అమెరికా గ్రామాలు మహోన్నతమైనవని సంతోష భరితమైనవని తెలియజేస్తుంటే ఈ అమెరికన్ రచయిత లెవిస్ దాన్నంతటిని పుక్కిటి పురాణం-మిత్ అని చెప్పటం వివాదాస్పదమైంది. "hundreds and thousands read the book with the same masochistic pleasure that one has sucking an aching tooth" లక్షలాది జనం ఈ పుస్తకాన్ని బాధా సర్పదష్ట ఆనందంతో పంటి నొప్పితో బాధపడుతూ చప్పరిస్తున్నట్లుగా చదివి ఆనందించారు అని అర్థం.

మొదట్లో, ఆ తర్వాత రాసిన నవలమధ్యలో దాదాపు 200 కథలు రాస్తూ ప్రచురించి అమ్మాడు. ఇందులో కొన్ని సెలెక్ట్ చేసి "సెలేక్టే డ్ షార్ట్ స్టోరీస్"గా 1935లో 50వ ఏట ముద్రించాడు. ఇందులో ఆయనకే నచ్చని కథలు కొన్ని ఉన్నాయి. ఈలోగా ఆయన బుర్రంతా నవల ప్లాట్‌లతో నిండిపోయింది. మెయిన్ స్ట్రీట్ తర్వాత ప్రసిద్ధ నవల "బాబ్బిట్" ప్రచురించాడు. రెండూ విపరీతమైన క్రేజ్ సృష్టించాయి ఒకదాన్ని మించి ఒకటి. బాబ్బిట్ ఇంగ్లాండ్‌లో హాగ్ వాల్పోల్ ముందుమాటలతో 200 అమెరికన్ ఎక్స్ ప్రేషన్స్‌తో అచ్చయింది. మెయిన్ స్ట్రీట్ చిన్న టౌన్‌కు ప్రతినిధి అయితే బాబ్బిట్ పెద్ద సిటీకి ప్రాతినిధ్యం పొందింది. ఇందులోనూ మోసాలు, హిపోక్రసీలు, జిమ్మిక్కులు, ధనమేరా అన్నిటికీ మూలం అదే విజయసాధనకు కొలబద్ద అనిపించటం మంచి జీవితానికి వ్యాపారమే కొలమానమవటం దర్శనమిస్తాయి. వీటిలోని మానవుడికి "the standard advertized wares --toothpastes, socks, tires, cameras, instantaneous hot water heaters --were his symbols and proofs of excellence --at first the signs then the substitutes for joy and passion and wisdom" అనిపిస్తుందని నిజాలు నిర్భయంగా చెప్పాడు.

రియలిస్ట్, సేటైరిస్ట్, విజనరీ అయిన లెవిస్ భౌతికాభివృద్ధిని నిరసించాడు. "యారో స్మిత్"లో డాక్టం-సైంటిస్ట్‌ను వ్యాపార ధోరణికి అసహ్యించాడు. "ఎల్మేర్ గంట్రిలో హైక్లాస్ ప్రీచర్లను, క్వేకర్లనూ, దొంగ సన్యాసులను, మతాన్ని లాభసాటి వ్యాపారం చేసే రివైవలిస్ట్‌లను ఉతికి ఆరేశాడు. "ది మాన్ హు న్యు క్యాల్ రిడ్జ్" ఓ అంటే నా రాని బిజినెస్ మాగ్నేట్లపై రాసిన పెద్ద కార్టూన్. ఇందులో ముఖ్యపాత్రధారి లోవెల్ స్మాల్జ్ పెద్దమోసగాడే అయినా పై అధికారుల ప్రతినిధి. ఎందుకూ పనికిరాని డాడ్స్ వర్త్ అందరితో ఆటలాడుకొంటూ. ముందుకు తోస్తూ శూన్యంలోకి నేట్టేసేవాడు. "వర్క్ ఆఫ్ ఆర్ట్'' అమెరికాలో ఆర్టిస్ట్ అంటే విజయాలు సాధించటమేకాక, హోటల్ నడపటంలోనూ సామర్థ్యం ఉన్నవాడు అనే నిర్ణయానికి వస్తాం. ఒకసారి తన జాతీయం ఏర్పడ్డాక క్లిష్టమైన, అసమ్మతిని తీవ్రంగా చేశాడు. అతను కారికేచర్‌కు ఎక్కువ పాత్రకు తక్కువ అని తీర్మానించారు. సామాన్య భాషలో అసామాన్యంగా రచనలను నిర్మించటం

ఆయన ప్రత్యేకత. ఫోటోగ్రాఫర్ కూడా అంత చక్కగా వెలుగు నీడలను ప్రదర్శించలేదు. ఆయన ఒక సందేహాస్పద రిపోర్టర్. గొప్ప నైపుణ్యం ఉన్నవాడే కాక దక్షుడైన సంస్కర్త. 1926లో ''యారోస్మిత్''కు పులిట్జర్ బహుమతి వచ్చినప్పుడు దాన్ని తిరస్కరించటమేకాకుండా వ్యతిరేకంగా తీవ్ర వ్యాఖ్య చేశాడు. సాహిత్య స్వేచ్ఛా ప్రియుడు కనుక గౌరవాలు బిరుదులూ చాలా ప్రమాదకరమైనవి అంటాడు. దానివలన ఇలాగే రాయాలని అలా రాయకూడదనే దానికి లోనౌతాడు రచయిత అన్నాడు. నాలుగేళ్ల తర్వాత వచ్చిన నోబెల్ ప్రైజ్ విషయంలో స్పందిస్తూ దాన్ని తీసుకొంటున్నందుకు క్షమించమని కోరాడు. థియోడర్ డ్రీజర్, విల్లా కేథర్, జేమ్స్ బ్రాంచ్ కాబెల్లు ఈ బహుమానాని అన్నివిధాలా అరులని, వారు అమెరికన్ వ్యవస్థలను హేళన చేయకుండా సంయమనం పాటించారని అన్నాడు.

లెవిస్ మరింత నిర్దయాలకు శస్త్ర చికిత్సలకు సిద్ధపడ్డాడు. 50 దాటాక అల్ప, విపరీతమైన ఇతి వృత్తాలను ఎన్నుకొన్నాడు. వారానికొకటి రాసి వదిలాడు. మొదట “ఆన్ వికర్స్”ను సామాన్య విషయం తీసుకొని రాశాడు తర్వాత “ఇట్ కన్ నాట్ హాప్పెన్ హియర్”లో అమెరికాలో రాబోయే ఫాసిస్ట్ సామ్రాజ్యాన్ని ఊహించి చెప్పాడు. ఒక సెటైర్ ఫైరీ టేల్‌ను తర్వాత స్మగ్లర్ల, డబ్బు నీతి విషయంలో కష్టం అధికారుల ద్వంద్వ ప్రవృత్తిని ఎండగడుతూ “గిడియాన్ ప్లానిష్” రాశాడు. జాతుల సమస్య, నీతి అది అమలవటంలో అపహాస్యం గురించి రాశాడు. వీటన్నిటిని బట్టి ఆయన్ను సంస్కర్త అన్నారు. క్రమంగా కంజర్వేటివ్ అవుతున్నాడు. “లేబర్ నవల” రాయాలనుకొన్నాడు. యూనియన్లను, వర్కర్లను సరిగ్గా అర్థం చేసుకోలేక పోయాడు. యువతపై మమత ఉన్నా వాళ్ళ తీవ్రవాదాన్ని ఒప్పుకోలేదు. “ప్రాడిగల్ పేరెంట్స్” నవల రాసిన 22 నవలలో నాసిరకమే. అది యువతరం పై తీవ్ర విమర్శే.

రెండవ సారి విడాకుల తర్వాత వెర్మాంట్ కౌంటి వదిలి డోరోతి థాంప్సన్‌తో న్యూయార్క్‌లో కలిసి ఉంటూ, మిన్నెసోటాలోని దూలత్‌లో, మాసాచూసేట్స్‌లోని విలియంస్ టౌన్‌లో విలాసవంతమైన విశాల భవనంలో ఉన్నాడు. పూటుగా తాగిన తర్వాత పిచ్చి ప్రేలాపనలతో, బెదిరింపులతో స్నేహితులకు దూరమైపోయాడు. అంతులేని సంపద మధ్య చింతతో వంటరి వాడయ్యాడు. దీనికి తోడు జబ్బు చేసింది. బలవంతం మీద మందుమానేసి ప్రత్యామ్నాయంగా స్వీట్లు కాన్డీలు బస్తాలకొద్దీ లాగించేవాడు. తర్వాత వీటికీ స్వస్తి చెప్పాల్సి వచ్చింది. అయినా చదువు, పరిశోధనా, రచన మానలేదు. 64లో చారిత్రాత్మక నవల “ది గాడ్ సీకర్” రాశాడు. అదేమీ గొప్పదని పించలేదు. జబ్బుతో ఉన్నా మరో గొప్ప నవల “వరల్డ్ సో వైడ్” రాయాలనే ప్రయత్నంలోనే ఉన్నాడు. ఇటలీకి వెళ్లి ఊరేగింపులో పాల్గొని న్యుమోనియాతో అకస్మాత్తుగా కుప్ప కూలాడు. తనకు సంబంధించిన అన్నిటికీ దూరమైన రోమ్ నగరంలో 10-1-1951న 64వ

ఏట లెవిస్ మరణించాడు.

లెవిస్ రచనలలో ఆదర్శవాదం వ్యంగ్యంతో మిళితమై ఉంటుంది. తన దారి ఏదో తెలుసుకాని లెవిస్‌కు గమ్యం తెలియదు. ముసలి లెవిస్ యువ లెవిస్‌ను వ్యతిరేకిస్తాడు. పరిణత దశలో కూడా తన లక్ష్యాలేమిటో ఆయనకు తెలియదు. ఆయన యుటోపియన్ అయినా యుటోపియస్‌లను చూసి నవ్వు కొంటాడు. ఆయన యాంటి సెంటి మెంటలిస్ట్. రోటరీ క్లబ్బులంటే వెక్కిరింపు. అసాధారణ మనిషి. క్రియాశీలక రాడికలిజంతో గొడవపడి, రెబెల్ నుంచి రోటేరియన్‌గా మారాడు. లాభసాటి సోషలిజాన్ని, లాభా పేక్ష లేని కేపిటలిజంతో కలుపుదామని ప్రయత్నించిన సుమనస్కుడు. కళా కవితా దీపకాంతిని వాటిని వ్యతిరేకించే వారిపై ప్రసరింప జేసే ప్రయత్నం చేశాడు. దీనిఫలితం వ్యర్థ కలల కళాకారులు, కాసుల బంధంలో చిక్కుకున్న కవులు ఏర్పడ్డారు. ఆయన ఆదర్శాలకు ఆచరణ విధానాలకు చాలా వ్యత్యాసం ఉంది. లెవిస్ సాగాలో ముఖ్యమైనది "బాబ్బిట్" నవల, అందులో ఆతను దృఢమైన పౌరుడు, ముందే అల్లుకుపోయిన బూర్జువా, అన్నీ కలిసిన బిగింపున్నవాడు. వెదర్ ప్రూఫేడ్ మధ్యతరగతి మనిషి. లెవిస్ అతన్ని ప్రేమించటం కంటే ఎక్కువగా ద్వేషించాడు. బాబ్బిట్, ఆయన సృష్టికర్త లెవిస్‌లు స్వయం క్షోభకులు అయినా స్వీయ సాధన ఉన్న స్వయం రక్షకులైన "సయామీస్ ట్విన్స్" ఇద్దరినీ విడదీసి వేరు చేయలేము.

అమెరికన్ దేశభాషను, విధానాలను మొదటిసారిగా అతి ఖచ్చితంగా రికార్డ్ చేసినవాడు లెవిస్. ఇంగ్లీష్ నవలా కారుడు యి. ఏం.ఫార్ స్టర్ "lodges a piece of continent in the world "s imagination" అని చాలా చక్కగా చెప్పాడు. పిక్విక్, డాన్ క్విక్సోట్, సీగ్ ఫ్రీడ్. రాస్కలోనికోవ్ సిరానో లాగా లెవిస్ పాత్రలు, ఆయన దేశమైన అమెరికా ప్రతినిధులు. సింక్లైర్ లెవిస్ పుస్తకంలో జార్జ్.ఎఫ్.బాబ్బిట్ పుట్టే దాకా, అమెరికాఫిక్షన్‌లో మార్క్ ట్వేన్ గారి టాం సాయర్ తర్వాత ఇలాంటి పాత్ర రానేలేదు. అంతర్జాతీయంగా ఒక గుర్తింపు పొందిన సిటిజన్‌గా ఆపాత్ర నిలిచిపోయింది. 1940లలో అమెరిలాలో లెక్చర్ టూర్ చేస్తూ "ఆధునిక యువతీ మంచిగా ఉందా? పల్లా? పట్నమా? యాంత్రికత నాగరికతకు చేటా? మొదలైన సమస్యలపై కిక్కిరిసిన ప్రేక్షకుల సమక్షంలో మాట్లాడాడు". 1943లో హాలివుడ్‌లో ఒక సినిమాకు డోరే స్కారితో కలిసి పనిచేయటానికి వెళ్ళాడు. సినిమాపేరు "స్టారం ఇన్ ది వెస్ట్" రెండవ ప్రపంచ యుద్ధానికి అన్యార్థమైన కథ. పూర్తికా రాజకీయం కనుక అది ముందుకు సాగలేదు. ఆయన 22 నవలలు, 7 భాగాలలుగా చిన్న కథలు, నాలుగు నాటకాలు, సుమారు పది వ్యాసాలూ నాలుగు కవితా సంకలనాలు రాశాడు. ❋



## 76. స్పోర్టివ్ హ్యూమరిస్ట్, అన్ సోషల్ సటైరిస్ట్‌గా మారిన అమెరికన్ జర్నలిస్ట్-రింగ్ లార్డేనర్ (1885-1933)

స్పోర్టివ్ హ్యూమరిస్ట్‌గా జీవితం ప్రారంభించి,అసాంఘిక వ్యంగ్య రచయితగా మారిన అమెరికన్ జర్నలిస్ట్ రింగ్ లార్డేనర్. మొదట రాసిన కథలన్నీ పూర్తి వినోదం ఇచ్చినవే. తరువాతి రచనలు క్రూరంగా, చిత్ర హింసగా ,నిరాశగా, ఆత్మ న్యూనతగా ఉంటాయి. క్రిటిక్ జర్నలిస్ట్ అయిన విలియం బోలితో అతనిని "అమెరికా తయారు చేసిన అతి గొప్ప నిజాయితీ గల ఆశావాది" (the greatest and sincerest pessimist America has produced) అన్నాడు. 6-3-1885న అమెరికా మిచిగాన్ రాష్ట్రం నైల్స్‌లో పుట్టాడు. అసలు పేరు రింగ్ గోల్డ్ విల్మార్ లార్డేనర్. పెద్దయ్యాక తానే రింగ్ డబ్ల్యు. లార్డేనర్‌గా మార్చుకొన్నాడు. మధ్యలో ఉన్న డబ్ల్యును అందరూ "వర్మ్" అని అపోహ పడుతారని దాన్నీ తీసేసి మిగిలిన పేరు ఉంచుకొన్నాడు. హైస్కూల్ చదువు అయ్యాక మిచిగన్ యూనివర్సిటిలో చేరి ఫుట్‌బాల్, డెంటిస్ట్రీ చదవాలనుకొన్నాడు. మిచిగన్‌అంటే మరీ ఇంట్లోనే ఉన్నట్లు ఉంటుందనుకొని చికాగోలో ఆర్మర్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరి మెకానికల్ ఇంజనీరింగ్‌లో మొదటి సెమిస్టర్ తర్వాత అలంకార శాస్త్రం చదివి బయటికొచ్చాడు నిరలంకారంగా. రైల్ రోడ్ పనుల్లో కొంతకాలం, సరుకు రవాణా ఏజెంట్‌గా కొద్దికాలం పనిచేసి ఒక సారి అతి భారీగా "క్రీం చీజ్"ను తప్పుడు అడ్రస్‌కు పంపిస్తే ఉద్యోగం ఊడింది. గాస్ ఆఫీస్‌లో బాయ్ లాగా అన్ని పనులు చేస్తూ వారానికి ఆరు డాలర్లు సంపాదించాడు. 20 వయసులో ఇతని అన్నకు ఇండియానాలోని సౌత్ బెండ్ లో "టైమ్స్"లో ఉద్యోగం వస్తే, దాన్ని అతను తిరస్కరిస్తే మనోడు దాన్ని జాక్పాట్ లాఒడిసి పట్టుకొన్నాడు. రెండేళ్ళు అందులో రిపోర్టర్‌గా పన్జేసి కోర్టులు, పోలీస్ స్టేషన్లు, బాల్ గేమ్స్, కొత్త సినిమాల రివ్యూలు, వినోద ప్రదర్శనలపై ప్రశంసలు ఒకటేమిటి సకల కళా వల్లభుడుగా అన్నీ రాశాడు.

22 వయసులో ప్రొఫెషనల్ జర్నలిస్ట్ అయి మంచి పేరు పొందాడు. చికాగో ట్రిబ్యూన్‌లో రాసిన "ఇన్ ది వేక్ ఆఫ్ ది న్యూస్" అందర్నీ ఆకర్షించి ఒక నమూనాగా

నిలిచి పోయింది. ఇరవైలలో చికాగో పిచ్చేర్ జాక్ కీఫేపై పరిహాసం, సరదా కలిపి రాసిన కథలు "ది సాటర్ డే ఈవెనింగ్ పోస్ట్"లో వస్తే పిచ్చ పిచ్చగా నచ్చి అది "యు నో మి అల్"గా పుస్తక రూపం పొందిన తర్వాత మరీ మరీ ఆకర్షణీయమైంది. విరగబడి పగలబడి పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుకొన్నారు చదివి. పాత్రలను అంత గొప్పగా హాస్యం రంగరించి తయారుచేయటం ఆషామాషీ కాదు – మన ముళ్ళపూడి వెంకట రమణలాగా అంతే "వీజీ"కాదు. దీనిపై హెన్రి ఎల్.మెంకేన్ స్పందిస్తూ "లార్డ్ నర్ తీర్చి దిద్దిన తీరు న భూతోగా ఉంది. అమెరికా జనం దీన్ని బాగా అర్థం చేసుకొని విపరీతంగా ఎంజాయ్ చేశారు" అని రాశాడు.

1911లో ఇంకా రిపోర్టర్‌గానే ఉండగా పాతికేళ్ళ వయసులో ఎల్లిస్ ఆబ్బట్‌ను పెళ్లి చేసుకొన్నాడు. ఆరడుగుల అందగాడు, బలిష్టమైన శరీరం రెండొందల పౌండ్ల బరువున్నవాడు. తండ్రి కావాలనే ఉబలాటం ఎక్కువ. నలుగురు మగపిల్ల తండ్రి అయ్యాడు. పెద్దకొడుకు జాన్ తండ్రిలాగానే స్పోర్ట్ రైటర్ అయ్యాడు. కామిక్‌గా ఘాటుగా రాసేవాడు. లార్డ్ నర్ లాగా రాయాలని చాలామంది ప్రయత్నించారు కాని అతని శైలి అందుకోలేక చతికిల పడ్డారు. అది "అననుకరణీయం" అని గ్రహించారు. అతని భాష సామాన్య అమెరికన్ మనిషి మాట్లాడే ఇంగ్లీషే. ఆయన రాసే ఇంగ్లీష్‌ను ఆయన పేరు మీద "రింగ్లిష్" అన్నారు. "హల్లిబుల్స్ ట్రావెల్స్", ట్రీట్ ఏం రఫ్"లు కూడా పూర్తిగా హాస్యరస పానీయాలే. అదే ప్రత్యేకతను సంతరించుకోన్నవే.

30లోకి అడుగుపెట్టగానే హ్యూమరిస్ట్ సెటైరిస్ట్‌గా రూపాంతరం చెందాడు. "హౌ టు రైట్ షార్ట్ స్టోరీస్", "ది లవ్ నెస్ట్ (ప్రేమగూడు)లు పూర్తిగా హాస్యాస్పద సంఘటనలతో, వింత పరిస్థితులతో కడుపుబ్బా నవ్వు పుట్టిస్తాయి. ఒక ప్రాంతానికి, ఒక లెవెల్‌కు మాత్రమే సంబందినవి కాకుండా అన్నిచోట్లా అన్ని తరహాల వారినీ ఆకర్షించి వినోదం పంచాయి. "అలీబి ఇకి" కూడా బేస్ బాల్ వజ్రం గురించినదే కాని ఇతి వృత్తం అసంబద్ధంగా ఉంటుంది. ఇందులోని ఫ్రాంక్ ఎర్నేల్ ఒక విదూషకుడు (క్లౌన్) కాదు అసలు మనిషే అనిపిస్తాడు డికెన్స్ పాత్రలలాగా. "హెయిర్ కట్" ఒక అతి వాగుడు బార్బర్ యొక్క ఇబ్బంది, చికాకు పరచే స్వగతం అయినా చిన్న పట్టణంలోని నిజజీవిత జోకర్ అనిపిస్తాడు. లవ్ నెస్ట్ పరోక్ష వివరణ. ఒక రిపోర్టర్ ఒక బిజినెస్ మాగ్నెట్‌ను ఇంటర్వ్యూ చేయటం. పాఠకుడిని బాధించి, దిగ్భ్రాంతి చెందించి చివరికి కదిలించి స్థానిక భయాన్ని దిగాజారుడును కళ్ళ ముందు నిలుపుతుంది. పదికథలను 1924లో పుస్తకంగా తెచ్చాడు. హాస్యం నుంచి సీరియస్నెస్‌కు అతని ప్రస్థానం కనిపిస్తుంది. తరువాత తనకు తాను తక్కువ చేసుకొన్నాడు. ఈ పది కథలు కథలు ఎలా రాయాలో తెలియజేసే మార్గ దర్శకత్వం చేస్తాయి. మిస్టరి కథ ఎలా ప్రచురింప బడిందో అందరికి మిస్టరీగానే ఉంది. ఈ కథలలోని జీవులు చెడు పద్ధతులున్నవారు, అసహ్యం పుట్టించే

తెలివి తక్కువ వాళ్ళు, మధ్య వయసున్న కౌమార దశవాళ్ళు, తప్పు చేసి దాక్కొనే నకిలీ వాళ్ళు, చవక బారువాళ్ళు, పనికి మాలిన వాళ్ళు. వీళ్ళను చూసి పెద్దగా నవ్వడు రచయిత. వాళ్ళపై జాలి ఉంటుంది. అందరూ అన్నిటా శూన్యులే అవటం వింత గొలుపుతుంది.

కథలన్నీ "హౌ టు రైట్ షార్ట్ స్టోరీస్ అండ్ రౌండ్ అప్" పేరుతో వచ్చాయి. క్రిటిక్స్ విశ్లేషణలో చాలా దూరం పోయారు. ఆ కాలపు ఉత్పత్తులపై ఏవగింపు చూపాడని, అమెరిక కేపిటలిజంపై సాధికారిక విమర్శ చేశాడని, మరణావస్తలో ఉన్న సాంఘిక వ్యవస్థపై తీవ్ర కధనం చేశాడని అన్నిరకాల వ్యాఖ్యానం చేశారు కాని వారు అందులోని కామిక్ ఎలిమెంట్‌ను, యెంత మూసుకుని ఉందామనుకొన్న వారినైనా పళ్ళికిలించేట్లు నవ్వించాడని మర్చిపోయారు. అతని ఆటగాయి తనం రచనలు భావ రహిత వర్ణనలు, సరిగ్గా తగ్గట్టు ఉండే డైలాగులు సందర్భోచిన శ్లేషలు ఎవరినైనా ఆకట్టుకొంటాయి. "కోరా స్పాన్ ఎట్ యే స్పాట్" క్లేమో యూటి వంటివాటిలో పొసగని సర్రియలిజాన్ని, "పబ్లిక్ బూత్ఇన్ యే బాత్ రూమ్", "త్రీ అవుట్ సైడర్స్ క్లీన్ గో" అక్రాస్ ది స్టేజ్ త్రీ టైమ్స్"లలో స్టేజ్ దర్శకత్వంపై చతురోక్తులు గుప్పించాడు. మేధావుల కౌగలింతలకు, వాళ్ళు ఊహించిన స్థాయిలో ఎదగలేక పోయానేమోననే భయపడ్డాడు. స్వీయ చరిత్ర "ది స్టోరీ ఆఫ్ యే వండర్ మాన్"లో తనను తాను నిందించుకొన్నాడు. తాను చనిపోయాక తన సెక్రెటరి పగ తీర్చుకోనేట్లు ఒక చాప్టర్ దానికి చేర్చాలన్నాడు అందులో "యజమాని వెళ్ళిపోయాడు, ఆయనకు ఎవరు వారసులు? బహుశా ఆయన ఇంకా పుట్టి ఉండడేమో! బహుశా అలాంటి వాడు పుట్టడేమో అసలు. అదే నేరు కోరేది" అంటూ రాయాలట. ఇలాంటి రాతలు ఆయన రోగ లక్షణాలను తెలియజేస్తుంది అన్నారు జనం. ది యంగ్ విజిటర్స్‌కు పేరడిగా "ది యంగ్ ఇమ్మిగ్రంట్స్" రాశాడు. భయాన్ని తనపై పరిహాసంతోకప్పి పుచ్చుకొన్నాడు. ఇది క్రమంగా లైంగిక ప్రకోపానికి దారి తీసింది. ఇదేదో అశ్లీలమైన మాటకాదు –దీనర్ధం స్వీయాన్ని నాశనం చేసుకోవటమే. తానున్న సమాజంపై విమర్శ చేస్తూ తాను అశ్రద్ధకు గురయ్యాడు. తన సున్నిత మనస్తత్వాన్ని వ్యంగ్యంతో కప్పి పుచ్చుకొన్నాడు. ఆయన పాత్రలు తమను లోకం తిట్టుకొంటారని తెలియదు.

1926లో ఆయనభారీ ఆరోగ్య శరీరం వ్యాధి గ్రస్తమై దగ్గు, అలసట ఆయాసాలకు గురైంది. టి.బి.వచ్చిందని ప్రారంభ దశలోనే ఉందని డాక్టర్లు కనిపెట్టి చెప్పినా డిప్రేస్ అయ్యాడు. చాలా రోజులు డిప్రెషన్‌లోనే ఉండిపోయాడు. జబ్బుకంటే డిప్రెషన్ ఎక్కువ బాధించింది. అర్ధం చేసుకోలేక పోయాడు. అపరాధభావం వెంటాడింది. ఏదో జరిగిందని దాన్ని జరగకుండా జాగ్రత్త పడలేక పోయానని అనుకొన్నాడు. అప్పటికే ప్రసిద్ధ రచయిత అయిపోయాడు. కాని కీర్తి గూర్చి అనుమానించాడు. తనలో తానూ

మాట్లాడుకోవటం మొదలు పెట్టాడు. జనం మీద అనుమానం ఎక్కువైంది.

"ది పోర్టబుల్ రింగ్ లార్డ్నర్" పుస్తకంలో ముందుమాట రాస్తూ గిల్బర్ట్ సేల్డస్ "మార్క్ ట్వేన్ టెంపరమేంట్లో సగం ఉన్నవాడు స్విఫ్ట్ అంతటి ఆలోచనా పరుడూ కాదు కాని, ఈ ఇద్దరిలాగానే ఎవరూ తమవైపు కన్నెత్తి చూడని ఉపేక్షిత జనాన్ని పలకరించిన వాడు. ఆ ప్రజల భాషా ఆలోచనలే ఆయన రచనలలో ప్రతి ఫలించాయి. అందుకే వారు ఆయన్ను ప్రేమించారు'' అన్నాడు. ఫిక్షన్ రాయటం ఆపేసి ఇంటికే పరిమితమయ్యాడు కాని "నో విజిటర్స్", "అవుట్ టు లంచ్", "న్యూయార్క్"లు పత్రికల కాలంస్‌లో ప్రత్యక్షమయ్యాయి. ఆయన ప్రాముఖ్యత ఏనాడు తగ్గలేదు కాని ఆయన దాన్ని ఆనందించి అనుభవించలేక పోయాడు. నలభైలలో జబ్బుపడి హస్పిటల్‌లో చేరి రెండేళ్ళు ఉన్నాడు. గదిలో ఉన్న రెడియో కొంత కాలక్షేపానికి, కొంత సెటైర్ ప్రాక్టీస్ చేసు కొవటానికి ఉపయోగ పడింది. "he turned out some of the best reviews of broadcasting ever produced" కాని పెరిగిపోతున్న డిప్రెషన్‌ను, ఓడిపోవటాన్ని అధిగమించలేక పోయాడు. జాగ్రత్తగా ఉన్నా బాగా అలసిపోయాడు. గుండె ఆగి లాంగ్ ఐలాండ్ లోని ఈస్ట్ హాంప్టన్ స్వగృహంలో 25-9-1933న 48 ఏళ్ళకే అందర్నీ నవ్వించిన నవ్వుల రేడు రింగ్ లార్డ్ నర్ రివ్వుమని చుక్కల్లో చేరాడు.

లార్డ్ నర్‌కు జీవితాంతం థియేటర్‌తో సంబంధం ఉండేది. అతని మూడు అంకాల నాటకం బ్రాడ్వేలో ప్రదర్శింపబడి, మూడు సార్లు తెరకెక్కింది. ఆయన గొప్ప స్వరకర్త, గీత రచయిత కూడా. ఆయన రాసిన "జాంజిబార్", "జూన్ మూన్"లు తను కూర్చిన బాణీలతోనే ప్రదర్శించి ముద్రించారు. బెర్ట్ విలియమ్స్‌కు ఒక రికార్డ్ సాంగ్ రాశాడు. ఓల్డ్ క్వార్టర్‌కు లిరిక్స్ రాశాడు. స్కాట్ ఫిట్జ రాల్డ్, జాజ్ యుగ రచయితలతోను దోస్తీ మస్తుగా ఉండేది. ఫిట్జ రాల్డ్ చివరి నవల "టెండర్ ఈజ్ ది నైట్"లో విషాద పాత్ర "ఏబ్ నార్త్"కు మోడల్గా లార్డ్ నర్ ఉంటాడు. లార్డ్ నర్ ప్రభావం అత్యంతంగా ఉన్నవాడు ఎర్నెస్ట్ హెమింగ్ వే. హెమింగ్వే తన హైస్కూల్ న్యూస్ పేపర్‌కు "రింగ్ లార్డ్ నర్" అనే మారు పేరుతో ఆర్టికల్స్ రాసేవాడు ఈ ఇద్దరూ 1928 డిసెంబర్‌లో మార్క్ పెర్కిన్స్ చోరవతో కలుసుకొన్నారు కాని స్నేహం పెరగలేదు. జే.డి.సాలింజేర్ తన "కాచర్ ఇన్ ది రై", "ఫరానీ అండ్ జూయీ" నవలలో లార్డ్ నర్‌ను ఉదాహరించాడు. బ్లాక్ సెక్స్ స్కాండల్‌కు సంబంధించిన "ఎయిట్ మెన్ అవుట్" సినిమాలో రచయితా దర్శకుడు జాన్ స్టేల్స్ లార్డ్ నర్ పాత్ర పోషించాడు. మేనల్లుడు జూనియర్ రింగ్ లార్డ్ నర్ స్క్రీన్ రైటర్-రెండవ ప్రపంచ యుద్ధంలో అమెరికన్ కాంగ్రెస్‌ను ధిక్కరించినందుకు బంధింపబడి, "హౌస్ అన్-అమెరికన్ యాక్టివిటీస్ కమిటీ" ముందు సంజాయిషీ చెప్పనందుకు బ్లాక్‌లిస్టులో పెట్టబడినవాడు..అతని స్క్రీన్ ప్లేలకు రెండుసార్లు అకాడెమి అవార్డ్ లభించింది. కనుక లార్డ్ నర్ లందరూ రచనా రింగు రంగంలో సుప్రసిద్ధులే, లార్డ్ లే. రచనా వారసత్వం నిలుపుకొన్నవారే.❀



## 77. మేధస్సు కంటే అంతః ప్రేరణ గొప్ప అన్న ఆధునిక ఆంగ్ల నవలా రచయిత డి.హెచ్.లారెన్స్ (1885-1930)

సమకాలీన సంఘంలో ఇమడలేక, స్వయం వేధకు బలైన మేధావి, ప్రపంచ వ్యాప్త ఒత్తిడులకు బలహీనతతో భరించలేని ఉద్రిక్తలకు లోనైన ఆధునిక ఆంగ్ల నవలా రచయిత డేవిడ్ హెర్బర్ట్ లారెన్స్. "మనది ముఖ్యంగా విషాద యుగం" అనే వాక్యంతో ప్రారంభించి "మనం దాన్ని విషాదంగా తీసుకోవటం లేదు. ఉపద్రవం జరిగిపోయింది. మనం శిధిలాల క్రింద ఉన్నాం. మనం కొత్త చిన్న ఆవాసాలను నిర్మించుకోవాలి, కొత్త ఆశలు నింపుకోవాలి. అది కష్టమైన పనే. భవిష్యత్తుకు దారి సున్నితంగా ఉండదు, అయినా అడ్డంకులను చేదించు కొంటూ మనం ముందుకు సాగాలి. ఎన్ని అవాంతరాలొచ్చినా, మిన్ను విరిగి మీద పడినా మనం బతకాల్సిందే" అని "లేడీ చాటర్లీస్ లవర్" నవల రాశాడు.

లారెన్స్ 11-11-1885న డేర్బి షైర్, నాట్టింగ్ హాం షైర్‌ల మధ్య ఉన్నబొగ్గు గనుల పట్టణం ఈస్ట్ వుడ్‌లో పుట్టాడు. తండ్రి సంతానంలో ముగ్గురు కొడుకులు ఇద్దరు కూతుళ్ళు. అందులో డేవిడ్ హెర్బర్ట్ అతి చిన్నవాడికంటే పెద్దవాడు. కాంతిహీనమైన ఇటుకల ఇంట్లో, కొండ దిగువ రోడ్డులో ఉండేవాడు. తండ్రి సంతకం కూడా చేయలేని చదువులేని పగటి కూలి, జీవితమంతా బొగ్గుగని పని చేశాడు. తల్లి సాధారణ మాజీ స్కూల్ టీచర్. ఆడంబరం, అసహనం, పెత్తనం ఉన్న స్త్రీ. భర్త తాగుబోతు అయినా ఆయన ఊహలకు మేడలు కడదామనుకోనేది. అతను మంచి డాన్సర్, చక్కని స్వరం ఉన్న గాయకుడు, చతురోక్తులతో నవ్వించే హాస్యగాడు. లారెన్స్ చిన్నప్పటి నుంచి బలహీనంగా ఉండేవాడు. చిన్నప్పుడు న్యుమోనియా సోకి మళ్ళీ పెద్దగా కోలుకోలేక పోయాడు. బాల్యంలో వచ్చిన నరాల బలహీనత, దగ్గు జీవితాంతం

అంటి పెట్టుకొనే ఉన్నాయి. సిగ్గరి. ఆకట్టుకొనే స్వభావంలేని విద్యార్ధి అయినా స్కాలర్షిప్ సాధించి నాటింగ్ హాం హైస్కూల్‌లో 16వ ఏట చేరి, పక్కింటి అమ్మాయి జెస్సి చేంబర్స్ తో ప్రేమలో పడ్డాడు. అది రొమాంటిక్ లిటరరీ లవ్. దీన్నే ఫిక్షన్‌గా "సన్స్ అండ్ లవర్స్" పేరుతో రాశాడు. తల్లి ప్రభావంతో ప్రేమ అంటే భౌతిక ఆనందం కాదు మానసిక విషయం అని గ్రహించాడు భోతికతతో దాన్ని దిగజార్చ కూడదని తెలుసుకొన్నాడు. ఈ విషయాలన్నీ జెస్సితో చర్చించేవాడు.

17వ ఏట చదువుకొంటూ తన ఊళ్ళో పిల్లలకు చదువు చెప్పాడు. ఆ గనికార్మిక పిల్లలకు నాలుగేళ్ళు బోధించాడు. బాటని, ఫ్రెంచ్‌లను చదివి నేర్చాడు. ఫ్రెంచ్ భాషను ప్రొఫెసర్ ఎర్నెస్ట్ వీక్లీ దగ్గర చదివాడు. 23 ఏళ్ళకు దక్షిణ లండన్‌లోని క్రియోడన్‌లో ఉన్న డేవిడ్సన్ రోడ్ స్కూల్‌లో పైక్లాస్ పిల్లలకు చదువు చెప్పాడు. ఇక్కడ సాహిత్యం బోధించటానికి పెద్దగా ఆసక్తి చూపలేదు. కాని సున్నితమైన పూల చిత్రాలు బహు అందంగా గీసేవాడు. పెద్దమనిషి అయినానని చెప్పుకోవటానికి కని సన్నని మీసం పెంచి బాలుడిని కాదు అని రుజువు చేసుకొన్నాడు. జుట్టులేని చెంపలు, బలహీనమైన గడ్డం ములక్కాడల్లా వేలాడే చేతులు, మాట్లాడే కొద్దీకీచుమనే మృదుస్వరం అప్పటి లారెన్స్ లక్షణాలు.

పంతులు ఉద్యోగం, రచనల మధ్య నలుగుతున్నప్పుడే లారెన్స్ తల్లి చనిపోయింది. బంధ విముక్తి అయిందనుకోలేదు. ఆమెపై ఆరాధన పెరిగి సుళ్ళు తిరుగుతోంది. ప్రపంచం తనముందు కరిగిపోతోంది అనిపించింది. తర్వాత తానూ కరగిపోయాడు. అన్నీ కోల్పోయాను అనుకొన్నాడు. చావు మిస్టరీ నుండి రక్షించాలి అని, జీవితంలో వెంటాడే చావు భయం నుండి బయట పడాలని భావించాడు. తరువాత రెండేళ్లలో ప్రేమింపబడటం కోసం చాలా అమ్మాయిల చుట్టూ తిరిగాడు. ఒకమ్మాయితో ఎంగేజ్మెంట్ దాకా వచ్చాడు. కాని తల్లి జ్ఞాపకాలు ఇంకా బలమైపోయాయి. తల్లితో తప్ప అంతటి అనుబంధం వేరే యే అమ్మాయితోనూ అసాధ్యం అనిపించింది. శారీరక జబ్బుతోపాటు సైకో సోమాటిక్ లక్షణాలూ పెరిగి వస్తున్న దగ్గు క్షయ లక్షణాలేమో అనుకొన్నాడు. కొంత భయం, కాస్త విరామం కోసం టీచింగ్ మానేశాడు. కవితల్లో, సంభాషణలలో దీన్ని వివరిస్తూ "నేను మళ్ళీ బోధనలో ఉండాలని కల వస్తుంది అది దారుణమైన కల అనుకొంటా"అని రాశాడు.

27 వయసులో "ఫ్రీడా వాన్ రిచ్ తోఫెన్ వీక్లీ" అనే 32 ఏళ్ళ జర్మన్ జన్మ కల ముగ్గురు పిల్లలున్న తన మాజీ ప్రొఫెసర్ కూతురుతో ప్రేమలో పడ్డాడు. ఆమెలో పరిపక్వ మాతృత్వానికి ముగ్ధుడై తన ప్రేమను వ్యక్తం చేశాడు. ఆమె కూడా తల ఊపటంతో ఇద్దరూ జర్మనీ ఆస్ట్రియా ఇటలికి "జంప్ జిలానీ". ఏడాదిన్నర తర్వాత ఆమె విడాకులు పొందాక పెళ్లి చేసుకొన్నారు. ఈ లవ్ స్టోరీ మూడవ కవితా సంపుటి

"లవ్ పోయెమ్స్ అండ్ ఎమోరీస్"లోను "లుక్ వుయ్ హావ్ కం త్రూ" అనే ఆటోబయాగ్రఫీ లోను దట్టించాడు. చివరి కవితలు చాలా విషాద భరితంగా ఉంటాయి. ప్రేమ ద్వారా శాంతి కోసం తపిస్తున్న వాడు లారెన్స్. 28వ ఏట ఇటాలియన్ లేక్ గార్డాలో ఉండగానే మూడవ నవల పూర్తి చేశాడు. అది బాధాకలిత ఆత్మ వేదన. "శీలవతీ, అంతశ్శుద్ధి ఉన్న స్త్రీ దిగువతరగతిలో ఉంటుంది. ఆమెకు తన జీవితంలో తృప్తి ఉండదు. మొదట్లో భర్తపై ఆరాధన, దానిఫలితంగా పిల్లల పుట్టుక, పిమ్మట వీరిపై మమకారం, వీళ్ళు పెరిగి ప్రయోజకులయ్యాక వాళ్ళపై విపరీతమైన ప్రేమ, అలాంటి ప్రేమను కొడుకులు తల్లికి ఇవ్వకపోతే మానసిక క్షోభ, మాత్రమేకాక ఆమె తమ జీవితాలలో అత్యంత శక్తివంతు రాలవటం. ప్రేమించినదాన్ని పెళ్ళాడి కొడుకు తల్లికి వ్యతిరేకి అవటం. ఇలా ఒక సుదీర్ఘ సీరియల్‌లా ఆమె జీవితం సాగిపోతూ ఉంటుంది అంతం ఉండదు. కొడుకు తన ఆత్మను వదిలి, అమ్మ చేతుల్ని దులిపేసుకొని దూరమై పోతాడు. చివరికి పిల్లలు అన్నీ పోగొట్టుకొని దిగంబరులౌతారు "ఈ పుస్తకంపై మంచి రివ్యును రాస్తూ "రెండు గొప్పముఖ్య పాత్రలను అందమైన బంధంతో ముడి వేసే కథ. విరామమెరుగని కొడుకు, నాయిక లక్షణాలున్న తల్లి ఇందులో ముఖ్యపాత్రలు. సోఫోక్లిస్ మళ్ళీ పుట్టి కొత్త కాలంలో భీభత్స సంఘర్షణలను మహాద్భుతంగా కళాత్మకంగా వర్ణించాడేమో ననిపిస్తుంది.

29వ ఏట మొదటి కథా సంపుటి "ది ప్రష్యన్ ఆఫీసర్" ప్రచురించాడు. "ది రెయన్ బో" నాలుగవ నవల. ఈ దశలోనే "అంతః ప్రేరణ మేధాస్సుకన్నా మిన్న" అనే ఎరుక కలిగింది. "నా గొప్ప మతం-రక్తం, మాంసంలపై నమ్మకం, అవి తెలివి తేటలకంటే గొప్పవి అని. బుద్ధితో మనం తప్పులు చేస్తాం. కాని మన రక్తం అనుభవించేది నమ్మేది ఎప్పుడూ సత్యమైనదే అవుతుంది. లారెన్స్ ఇన్స్టింక్ట్‌లు ఆయన మేధస్సుకొంటే గొప్పది కావచ్చుకాని ఆయన నమ్మకాలు మాత్రం ఇబ్బందుల్లో ప్రజా వ్యతిరేకతలో పడేశాయి ఆయనను. రైన్ బో నవల చట్టవ్యతిరేకమై, ఇంగ్లాండ్‌లోని మూడు ప్రముఖ పత్రికలు లెస్బియనిజంను ప్రోత్సహిస్తున్నాడని గగ్గోలు పెట్టాయి. పబ్లిషర్ స్క్రిప్ట్ చదవలేదని తప్పించుకొన్నాడు. దీనితో చట్టం తనపని తానూ చేసుకొని పోయి మొదటి ఎడిషన్ వెనక్కి తీసుకొన్నాడు. చదువరులు మాత్రం లారెన్స్ ఊహకు, మంత్రముగ్ధ రచనకు అబ్బురపడ్డారు. విభేదించిన విమర్శకులుకూడా అది "flushed with a moving animal vitality" అని మెచ్చుకొన్నారు.

మొదటి ప్రపంచ యుద్ధం లారెన్స్ జీవితంలో కొత్త చిక్కులు తెచ్చింది. మనిషి దీర్ఘ జీవితాన్ని గురించి ఆలోచిస్తుంటే క్రమ ప్రకారం జరుగుతున్న సమూహ హత్యలు ఆయనను కలవర పర్చాయి. ఈ పరిణామం మానవత మరణించటానికే దారి తీస్తుందని హెచ్చరించాడు. భార్యతో కలిసి ఇంగ్లాండ్ దక్షిణ తీరం చిన్నదైన కార్న్ వాల్ టౌన్

ఆఫ్ జేన్నార్ స్వర్గ సౌఖ్య మిస్తుందని వెళ్ళాడు. అక్కడ యుద్ధ బాధిత పీడితజనం కోసం ఒక ఊహా స్వర్గం (యుటోపియ) నిర్మించే ఆలోచన చేశాడు. దీనికి పరితపించి చేయలేకపోయారు ఆ నాడు కాల్ రిడ్జ్, సూదీలకవులు. ఈ సమయంలో లారెన్స్ చిన్న గడ్డాన్ని గుబురు వెంట్రుకలతో కప్పి పుచ్చాడు, అది ఎర్రగా మరీ వికృతంగా కనిపించింది. దీన్నే ఒక స్నేహితుడు "రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్" అని పరిహసించాడు. ఇతర మనుషులలాగా పని చేసే వీలు దీని వలన కలుగుతుందని అర్ధం. ఆ ఊళ్ళో స్నేహితులెవరూ లేరు. ఒకవేళ స్నేహం చేద్దామని ఉన్నా గడ్డం ఆయన వంట చేస్తాడు ఇల్లూడుస్తాడు అంట్లు తోముతాడు అని తెలుసుకొని ఏదో గూఢ చారి మనిషేమోనని అనుమానించారు. యుద్ధ సమయమవటం, భార్య జర్మన్ అవటం అనుమాలకు బలమైనది. ఆమె సోదరుడు మాన్ఫ్రేడ్ వాన్ రిచ్ తోఫెన్ జర్మనీలో ప్రసిద్ధ పైలట్ కూడా. ఇవన్నీ లారెన్స్‌లను గూఢచారులు అనటానికి బాగా తోడ్పడ్డాయి. ముందుగా లైట్లు తీసేయించారు. తర్వాత ఇల్లు సోదా చేయించారు. చివరికి ఊరిలోని గెట్టిం చేశారు. భార్యకు విచారం కలిగితే భర్తకు పిచ్చ కోపం వచ్చింది.

తరువాత రెండేళ్ళు వాళ్ళిద్దరూ ఒక ఇంటి నుంచి మరో ఇంటికి గెంటి వేయబడుతూ చివరికి లండన్ చేరారు. అక్కడ కూడా బెర్క్ షైర్, డేర్బి షైర్, మిడ్లాండ్ హిల్స్‌కు మారారు. యుద్ధ సమాప్తి కాగానే 1919లో కాంటినేంట్‌కు వెళ్ళారు. రచనపై రచన ఉత్పత్తి చేస్తున్నా నిత్య దరిద్రం వెంటాడుతోంది. అతని పుస్తకాలు అచ్చువేయటం రిస్క్ అనుకొన్నారు పబ్లిషర్లు. శారీరక బలం లేకపోయినా మానసిక ధైర్యం తో రాస్తూనే ఉన్నాడు. 35వ ఏట "వుమెన్ ఇన్ లవ్" రాశాడు. దీన్ని రైన్ బో కు సీక్వెల్ అన్నాడు లారెన్స్. ఇందులో లారెన్స్ హీరో శారీరక శృంగారానికి అతీతమైన ప్రేమను గురించి చెప్పాడు. సూటి మనస్తత్వం ఉండటంతో మరో ఆరేళ్ళు దేశ ద్రిమ్మరిగా తిరిగాడు. అస్తిత్వనిరూపణ కోసం, రక్షణ కోసం ఇంగ్లాండ్‌ను 1919లో వదిలేసి ఎప్పుడో అప్పుడప్పుడు వచ్చి వెళ్ళాడు. వాస్తవం చెప్పాలంటే పారిపోయాడు. ఒక్కోసారి తననుంచి తానుపారిపోతున్నానేమో అనుకొన్నాడు. తనకు ఎక్కడా చోటు లేదని ఎవరూ ఆహ్వానించి ఆదరించరని తెలుసుకొన్నాడు. తీరా ఒక చోటికి ఆశగా వెళ్ళినా కొన్ని రోజుల్లోనే అది మంచిది కాదు అనుకొనేవాడు. భ్రమల్లో తేలిపోయాడు. డార్క్ మాజిక్‌లో కూరుకు పోయాడు. అల్టిమాతూలేకు వెళ్ళాలనుకోన్నవాడు బేడేన్ బేడేన్‌కు, అబ్రూజి హిల్స్‌కు, కాప్రి, టావోర్మినా, సార్డీనియా, ఆస్ట్రియాలను తిరిగి అర్ధప్రపంచం చుట్టి సిలోన్ ఆస్ట్రేలియా, తాహితి, అమెరికాకు చేరాడు. 1920లో మేబెల్ డాడ్జ్ లుహాన్ ఆహ్వానంపై టావోస్, న్యు మెక్సికో, చివరికి ఓల్డ్ మెక్సికోలో అడుగు పెట్టాడు. ఇక్కడ మూడేళ్ళు తీవ్రకల్లోల పరిస్థితులలో గడిపాడు. 1924లో ప్రయత్నం చేసి, కొన్ని నెలలలోనే న్యు వరల్డ్ చేరాడు. మెక్సికో సిటిలో ఉండగా 1925 ఫిబ్రవరిలో తీవ్రమైన క్షయకు గురైనాడు.

ఇంకా నలభై ఏళ్ళు రాకపోయినా ఇక బతకను అనుకొన్నాడు. అమెరికా ఆగ్నేయ భాగంలో, మెక్సికోలో లారెన్స్ తనకు తాను నాయకుడు, మత ప్రవక్తగా ప్రవర్తించాడు. సృజన శీల ఆలోచనా పరులను, ఆర్టిస్ట్‌లను, వర్కర్లను ఒక చోట చేర్చే ప్రయత్నం చేశాడు. భారతీయుడులాగా అవినీతి ఆశ్రిత పక్షపాతం, నిరాశా లేని ప్రపంచాన్ని కలగన్నాడు. ఇక్కడే రూసో భావమైన "బ్లడ్ స్ట్రీం కాన్షస్ నెస్"ను సమర్ధిస్తూ ఇరవైవ శతాబ్ది యాంత్రిక జీవితాన్ని నిరసించాడు. డార్క్ గాడ్స్ "లాస్ట్ మాజిక్"లలో చిక్కుకొన్నా తన ప్రతిభ వ్యక్తమయే "ది ప్లూమేడ్ సర్పెంట్", "మార్నింగ్ ఇన్ మెక్సికో" నవలలు రాశాడు. వీటిలో ఆయనకున్న సూర్యారాధన, మాయలు, మంత్రాలు, ప్రకృతి ఆరాధన అన్నీ చెప్పాడు. ప్రజాస్వామ్య వ్యతిరేకత, అధికార కాంక్ష , అరిస్టాక్రటిక్ మేధావులతో కలయిక, అన్నీ ఆయన్ను ఫాసిస్ట్ అనుకూలుడు అని అనిపించాయి.

క్రమంగా రచనలో స్పష్టత, హృదయంలోకి సూటిగా దూసుకుపోయే లక్షణం పెరిగింది. జీవితంలో చివరి ఎనిమిదేళ్ళ రచనలు మహా అతి అయ్యాయి. ఇండియన్, కీటకం, సూర్యాస్తమయం, ఆవులలో ఆయన దేన్నీ తీసుకొన్నా అదొక క్రియాశీల చిహ్నామైపోయి, ఆయన ప్రాణావశ్యక బాధ్యతా అయింది. "మామూలు వస్తువులలో ఉన్న నిగూఢ అంతరార్ధాన్ని విడమర్చి చెప్పే నేర్పు లారెన్స్ సాధించాడు. తాత్కాలిక భావోద్రేకాల ప్రాముఖ్యతనూ గుర్తించి వాటికి తీవ్రమైన ప్రాముఖ్యముందని వివరించాడు. ఆయన్ను విమర్శించేవారికి చేతి నిండా పనే ఉన్నా ఆయన మాత్రం సృజన రచయితలకు దివ్యానుభావాన్ని అందజేశాడు. చాల జటిలమైన విషయాలను రాయటం మొదలుపెట్టాడు" రచనలో సంగీతం ప్రవహిస్తుంది. చిత్రం గీసి చూపిస్తున్నట్లు రాస్తాడు. చలనంలో లయ సృష్టిస్తాడు. రంగులు ఉపయోగించకుండానే చీకటి వెలుగులు సృష్టిస్తాడు. నాట్య విలాసం ఉంటుంది. పదాలను విడగొట్టుతూ, తేలిపోయేట్లు చేస్తాడు. ఒక్కోసారి అర్ధంకంటే శబ్దమాధుర్యానికే ప్రాణం పోస్తాడు. ఇలా చేయటానికి ఎంతో గుండె ధైర్యం కావాలి. ఉంది కనుకనే రాశాడు. ఒక్కో సారి విఫలుడు అవుతాడు. లారెన్స్ రచన గోడలో పగులు లాగా ఉండి కొత్త ప్రపంచాన్ని దర్శింపజేస్తుంది" అని చాలా గొప్పగా మహోత్కృష్టంగా ఎనైస్ నిన్ అనే విశ్లేషకుడు "లోన్స్ యాజ్ యాన్ ప్రొఫెషనల్ స్టడి"లో రాశాడు.

ఈ చంచల ప్రపంచంలో లారెన్స్ ఒక ముఖ్య ఆవాసాన్ని, భార్య ఫ్రీడా యొక్క అత్యంత విశ్వాసాన్ని పొందటం మూలంగానే ఇంత గొప్ప రచనలు చేయగలిగాడు. ఒక్కోసారి భార్య ఫ్రీడా కూడా శాంతినివ్వలేక పోయేది. పోట్లాటల మాటల యుద్ధాలు శారీరక హింస, పరస్పర ఆరోపణలు ఉన్నా మళ్ళీ కలిసిపోయేవారు. లారెన్స్ వలన పిల్లలు కావాలని భార్య ఫ్రీడా కోరుకొనేది. లారెన్స్‌కు అదంటే ఇష్టం లేదు పైగా ఆమాట అంటే విపరీతమైన కోపం వచ్చేది. ఆమే అర్ధం చేసుకొని రాజీపడి సర్దుకొని

భర్తనే పిల్లాడిలాగా చూసుకొంటూఅతని సృజనను ప్రోత్సహిస్తూ ఓదారుస్తూ ఉండేది. సాంఘిక స్థితిలో, శిక్షణలో, స్వభావంలో ఇద్దరివీ వేరు వేరు తరగతులే. కాని అరిస్టో క్రాట్‌కు కూతురైన ఆమె, పరిస్థితులను అవగాహన చేసుకొని ఆతనికి సహచరి అయి, నేలతల్లి లాంటి సహనాన్ని అలవరచుకొని దృఢంగా, అత్యంత సాధారణ మహిళగా మెలగింది. ఆమెపై ఆధారపడి బతకటానికి భర్త లారెన్స్ కష్టపడి పోరాటం చేశాడు. స్త్రీల వలననే లారెన్స్ సాహిత్య ప్రేరణ పొందాడు. వారితో కలిసి పనిచేశాడు. సన్స్ అన్డ్ లవర్స్ నవలలో చాలా భాగం లారెన్స్ స్వీట్ హార్ట్ జెస్సీ చేంబర్స్ కథలోని ఓడిపోయిన హీరోయిన్ రాసింది. రెండో నవల "ట్రెస్ పాసర్స్"ను తనతో పనిచేసిన ఇరవైల వయసులో దగ్గరకు చేరిన హెలెన్ కోర్క్ అనే టీచర్ రాసిన రాత ప్రతి నాధారంగా రాసిందే. ఆ స్ట్రేలియన్ కథ "ది బాయ్ ఇన్ దిబుష్" అనేది స్కిన్నర్ రాసిన. "ది హౌస్ ఆఫ్ ఎల్లిస్"కు మారు రూపం. అలాగే కేథరిన్ కార్స్ వెల్, మేబెల్ డాడ్జ లుహాన్ అనే స్త్రీల జీవితాలనాధారమైన కథలనే రాశాడు. ఇతర స్త్రీలు లారెన్స్‌ను తమ వాడిని చేసుకోవాలని విశ్వప్రయత్నం చేశారు కాని భార్య ఫ్రీడా, వాళ్ళ నీడా పీడా పడకుండా ఆయనకు కావాల్సిన మహిళగా రుజువు చేసుకొన్నది.

40వ పుట్టిన రోజు తర్వాత 1925లో లారెన్స్ తిరిగి వచ్చే ఆశతో అమెరికా వెళ్ళాడు. కాని ఆ ఆశ నిరాశే అయింది. సూర్య నమస్కారాలు సముద్ర స్నానాలపై ఉన్న ఆరాటం అనేక ప్రదేశాలను తిప్పించింది. స్విట్జర్లాండ్‌లోని ఫ్లారెన్స్‌కు సమీపంలో జెనోవా దగ్గరకు చేరాడు. అక్కడినుంచి ఆస్ట్రియా, జెర్మని, బాలరిక్ ఐలాండ్స్ తిరిగి చివరికి ఫ్రాన్స్ వచ్చి ఇక్కడే ఉండిపోయాడు. ఇక్కడే చిరస్మరణీయ వచన రచనలను, అత్యుత్తమమైన, ఆయన కోపోద్రిక్తమైన కవితలను రాశాడు. లారెన్స్‌కున్న శారీరక, మానసిక నిరోధాలను (ఇనిబిషన్స్) అత్యున్నత స్థితిలో "లేడీ చాటర్లీన్స్ లవర్" నవలలో ఆవిష్కరించాడు. ఇందులో సెక్స్‌పై కోరిక, పవిత్ర ప్రేమలపై ద్వంద్వాలపై తెగించిన ఆరాటం ఉంటుంది. సమకాలీన సాహిత్యంలో దీనిపై వచ్చినంత వ్యతిరేకత దేనికీ రాలేదు. పశు ప్రేమతో కొన్ని అధ్యాయాలున్నా అందులో లోతైన సానుభూతి ఉంటుంది. అసలు దీనికి మొదట్లో లారెన్స్ పెట్టాలనుకొన్న పేరు "టెండర్ నెస్". ఈ పుస్తకాన్ని అశ్లీలం అని సెన్సార్ చేశారు, నిషేధించారు. కాని లారెన్స్ దీన్ని ఆధునిక యుగంలోని ముతక వికారం, మానసిక బౌద్ధిక వంధ్యత్వాలు, త్వరపరచే లింగ ఇంద్రియ జ్ఞానంల మధ్య సమతూకంతో రాశానని చెప్పుకొన్నాడు. అసలైన సౌందర్యం, అసలైన మంచితనం మూలాలఅన్వేషణ అందులో ఉందన్నాడు. "Lawrence laid sex and those basic words for it on the salver of his art and held them up before creation and prayed that both might be transmuted to the highest that man could use".

చాటర్లీన్ నవల ప్రభావం అత్యద్భుతమై విశ్వవ్యాప్తమైంది. "పిల్గ్రిం ఆఫ్ అపోకలిప్సే" నవలలో అర్ధ శతాబ్ది కాలపు సెక్స్ స్వేచ్ఛకై పోరాటం. ఏ ఆంగ్ల రచనలలోను లేని విధంగా రాశాడు లారెన్స్. సెక్స్ చిహ్నాలను యాంటి క్లైమాటిక్‌గా వాడాడు" అన్నాడు హోరేస్ గ్రెగరీ. అదొక సుదీర్ఘ పోరాటం. మహాకవి వాల్ట్ విట్మన్ "సాంగ్ ఆఫ్ మై సెల్ఫ్" నుండి ఆస్కార్ వైల్డ్ విచారణ ద్వారా, తర్వాత ఫ్రాయిడ్ చివరి రచన ఇటలి, పారిస్‌లలో ప్రింట్ అయ్యేదాకా చివరికి ఈ నవల వరకు జరిగిన పోరాటం, ఇప్పుడు 1928తో పూర్తి అయి విజయం సాధించింది. లారెన్స్‌కు ఇక రెండేళ్ళ జీవితమే మిగిలి ఉంది. ఈ కాలంలో మరో నవల అది భౌతిక విచారణతో ఉన్న నవల "అపోక లేప్సి" రాశాడు. సూర్యుని స్తుతి, చాటర్లిన్‌పై విమర్శలకు కొన్ని సమాధానాలతో వందకు పైగా కవితలతో, అరడజన్ తీవ్రమైన కథలతో, ఒక సూపర్ నేచురల్ పిల్ల కథతో దీన్ని ముగించాడు. ఈ కథే ప్రపంచ ప్రసిద్ధ హారర్ స్టోరీలలో ఒకటి అయింది. భయంకరత్వానికి పరాకాష్ట అయింది. రచన రిలీఫ్‌గా ఉన్నా ఒత్తిడిగా కూడా ఉంది లారెన్స్‌కు. "పాన్సీస్" పేరుతో ఉన్న కవితా సంపుటిని హోం సెక్రెటరి సీజ్ చేశారు. ఆయన పెయింటింగ్ షోను పోలీసులు ఆపేశారు. అయినా మొక్కవోని ధైర్యంతో "సంపూర్ణ జీవితానికి, ఏకీభావ జీవితంకోసం "రచన చేస్తూనే ఉన్నాడు. ఆరు నెలల తర్వాత "మనిషికి, పుష్పానికి, జంతువుకు, పక్షికి సర్వోన్నత విజయం అత్యంత స్పష్టంగా జీవించి ఉండటమే" అని బోధించిన లారెన్స్ మరణించాడు. సూర్యారాధకుడైన మహా రచయిత "బ్యూ సోలీల్ భవంతిని యడ్ ఆస్ట్రా కోసం కేటాయించాననే వ్యంగ్యాన్ని అభినందిస్తూ తీవ్రంగా జబ్బు పడ్డాడు. పురాతన ప్రపంచ ప్రసిద్ధ వెనిస్ నగరంలో ఫ్రెంచ్ రేవేరాపైన 1-3-1930న 45ఏళ్ళకే చనిపోయాడు.

లారెన్స్ మరణం తర్వాత ఆయనపై రచనలు చాలా ప్రచురణ పొందాయి. ఆయనపై జీవిత చరిత్రలు, జ్ఞాపకాలు, ఉత్తర ప్రత్యుత్తరాలు, అంచనాలు, పునర్ మూల్యాంకనాలు, సమర్ధనలు, నిజ నిర్ధారణలు విరివిగా వెల్లువగా వెలువడ్డాయి. తమాషా ఏమిటంటే లారెన్స్‌తో పరిచయం ఉన్న ప్రతి ఒక్కరూ పుస్తకం రాయటం. లారెన్స్‌పై తుది నివేదిక రావాల్సి ఉంది. సాహిత్యంలో ఆయన స్థానం ఏమిటో ధృవీకరించాల్సి ఉంది. "no one of his generation pursued the cry of sex so passionately and so painfully" అన్నది నిర్వివాదం. ఆయన ముట్టుకున్నది అంతా పోరాటం, చావు, పునరుద్ధానంగా పరిణమించింది. బూర్జువా విక్టోరియన్ నీతి ప్రభావాన్ని కోల్పోయే సమయంలో మెధలిస్టులు పునర్వికాసాన్ని బోధించినట్లు లారెన్స్ యవ్వన గీతను బోధించాడు. పవిత్ర బోధకుడు పాపకూపంలోకి జారి పోతున్నప్పుడు ఉత్తేజ ఉత్సాహాలు కలిగించే మత బోధకుడిలాగా "పొంగే రక్తపు కనుగప్పు కళ" (ది హాట్ బ్లడ్బైండ్ ఫోల్డ్ ఆర్ట్)ను లారెన్స్ అమోఘ వాక్చాతుర్యంతో ప్రబోధించి ఎరుక పరచాడు" అన్నాడు

రచయితా లూయీ అంటర్ మేయర్.

If I had my way, I would build a lethal chamber as big as the Crystal Palace, with a military band playing softly, and a Cinematograph working brightly; then I' d go out in the back streets and main streets and bring them in, all the sick, the halt, and the maimed; I would lead them gently, and they would smile me a weary thanks; and the band would softly bubble out the "Hallelujah Chorus". [16] అని కలలు కంటూ లారెన్స్ స్నేహితుడికి జాబు రాశాడు.

In the deep, strange-scented shade of the great dark carob tree
I came down the steps with my pitcher
And must wait, must stand and wait, for there he was at the trough before me.
(From "Snake") అన్నది ఆయన ప్రసిద్ధ "ది స్నేక్" కవితలో ఒక భాగం. గ్రిగేరియన్ పీరియడ్ తర్వాత వచ్చిన లారెన్స్ రచనలను ఆధునిక రచనలని అన్నారు.

O the stale old dogs who pretend to guard
the morals of the masses,
how smelly they make the great back-yard
wetting after everyone that passes.
(From "The Young and Their Moral Guardians")

లారెన్స్ ప్రతి రచనలో అంతర్ దృష్టి ఉంటుంది. వాల్ట్ విట్మన్ మెల్ విల్లి, ఎడ్గార్ అల్లెన్ పో ఛాయలలో రాసినా తనదైన విస్పష్ట స్వరంతో లారెన్స్ నినదించాడు. ఆయనపై సినిమాలు వచ్చాయి ఆయన నవలలను సినిమాలుగా తీశారు. 12 నవలలు, 10 చిన్న కథా సంపుటాలు, పది ఉత్తర ప్రత్యుత్తర సంకలనాలు, 16 కవితా సంపుటులు, పది నాటకాలు, 12 నాన్ ఫిక్షన్ రచనలు, నాలుగు యాత్రా సాహిత్యాలు, ఆరు అనువాద రచనలు, ఆరు వ్రాత ప్రతులు కాక లారెన్స్ ఖాతాలో మూడు పెయింటింగ్స్ కూడా ఉన్నాయి. లారెన్స్ పేరులోనే ఏదో గొప్ప ఆకర్షణ ఉంది. పుస్తకం చదవటం మొదలు పెడితే పూర్తి అయ్యేదాకా మరో దానిపై యావ ఉండక పోవటం. ఆయన రచనా ప్రభావం అనంతం అద్వితీయం అమోఘం. ❋



## 78. ప్రతీక కవిత్వ వ్యాప్తి చేసిన అమెరికన్ కవి-ఎజ్రా పౌండ్ (1885-1972)

తన పోరబాట్ల అస్తిత్వంతో బతుకు విషాదం చేసుకొన్న ఆధునిక అమెరికన్ కవి ఎజ్రా పౌండ్. రాజకీయ ప్రచారంలో ఉద్దండుడు. ఈ ప్రాపగాండాతో తనలోని ఆర్టిస్ట్‌ను వాచాలత్వం, బూతులతో సన్నిహితులను దూరం చేసుకొని చివరికి దేహద్రోహ నేరం మోపబడిన విధి వంచితుడు. 30-10-1885న అమెరికాలోని ఇడాహో రాష్ట్రంలో హైలీలో పుట్టాడు. అతనిది న్యు ఇంగ్లాండ్ వంశం. తల్లి లాంగ్ ఫెలో కవికి దూరపు చుట్టం. తండ్రి ప్రభుత్వ ఉద్యోగి, మొదటి ప్లాస్టర్డ్ హౌస్ నిర్మించిన మార్గదర్శి. చిన్నతనంలోనే పెన్సిల్వేనియాకు తీసుకుపోబడి తూర్పు వాతావరణంలో పెంచబడ్డాడు. 15 ఏళ్ళకు అక్కడి యూనివర్సిటిలో చేరి కర్రిక్యులంలేని తులనాత్మక సాహిత్యం చదివి జీర్ణించుకొన్నాడు. 16 వయసులో స్పెషల్ స్టూడెంట్‌గా నమోదయ్యాడు. 18వ ఏట న్యూయార్క్ హామిల్టన్ కాలేజిలో చేరి, ఇరవైకే గ్రాడ్యుయేట్ అయి రోమాన్స్ లాంగ్వేజెస్‌లో ఫెలో అయి పెన్సిల్వేనియా యూని వర్సిటిలో, ప్రొఫెసర్ సమాన హోదా గల ఇన్స్ట్రక్టర్ అయ్యాడు. 21కే మాస్టర్ డిగ్రీ పొంది, స్పెయిన్ ఇటలి ఫ్రాన్స్ లు తిరిగొచ్చాడు. ఒక ఏడాది స్పానిష్ నాటక రచయిత లోప్ డి వేగాపై పరిశోధన చేశాడు. 1907లో తిరిగి రాగా ఇండియానా రాష్ట్రం క్రాస్ ఫోర్డ్స్ విల్‌లో వాబాష్ కాలేజిలో ఫాకల్టిలో చేరమని ఆహ్వానం అందుకొన్నాడు. ఆ టౌన్ సాహిత్య సంప్రదాయాలకు, ముఖ్యంగా బెన్‌ర్ రాసిన ల్యు వాలెస్ చనిపోయిన ప్రదేశంగా గుర్తింపు పొందింది. నాలుగు నెలల

తర్వాత బోహిమినియ నిజంతో సంప్రదాయ విరోధి అని నిందలు మోపి ఉద్యోగం ఊడగొట్టారని పౌండ్ చెప్పుకొన్నాడు.

పుట్టుకతోనే విద్యావేత్తగా బోధనా సామర్థ్యం ఉన్నా విఫలమైన టీచర్‌గా నిరాశ చెంది, తన బహిష్కృత అమెరికన్‌లకు చదువు నేర్పాలనుకొని, యూరప్‌కు వెళ్లి జేబులో ఎనభై డాలర్లతో జిబ్రాల్టర్ చేరి కొంత డబ్బు వడ్డీకిచ్చి దానితో బతుకుతూ గడిపాడు. ఇటలీ వెళ్లి మొదటి పుస్తకం "ఎ ల్యూం స్పేంటి" 1908లో వెనిస్‌లో ప్రచురించాడు. ఇది చిన్నపుస్తకమే అయినా తన విద్యకు తగిన ఉన్నత రంగుల ప్రతిబింబాలతో పగిలిన అద్దం పెంకుల్లా ఉంది. కొన్ని నెలల తర్వాత లండన్‌లో ఉన్నాడు. అక్కడ ఆధునిక యువ రచయితలతో కలిసి, వారి వైవిధ్య కార్యక్రమాలకు నాయకత్వం వహించి చైనా జపాన్ కవిత్వమైన ఫెనలోసా సంపుటికి ఎక్సి క్యూటర్ బాధ్యత చేబట్టాడు. 25వ ఏట మరో రెండు చిన్న పుస్తకాలు "పర్సోనే", "ఎక్సల్టేషన్స్" రాసి ముద్రించాడు. తర్వాత "కాన్జోని", "రిపోజిల్స్" కూడా రాసి మొత్తం అయిదు పుస్తకాలను 27 ఏళ్ళకే ప్రచురించాడు. 29కి డోరోతీ షేక్స్ పియర్‌ను పెళ్లి చేసుకొని ఒక కొడుకుకు తండ్రి అయ్యాడు.

పౌండ్ రాసిన మొదటి కవితలు ప్రాచీన ఫ్రెంచ్ ఆధునిక ఇంగ్లీష్ ప్రభావ సమ్మేళనాలే. ప్రోవెన్షియల్ కవులు, మధ్యయుగపు ప్రేమగీతాలతో బ్రౌనింగ్, విలియం మారిస్, స్విన్ బరన్, ప్రి రాఫలైట్స్ కవిత్వాల రంగరింపు ప్రాముఖ్య యాసతో ఉంది. మధ్యలో అనేక వైరుధ్యాలు, కొత్తదనం తాజాదనం కృత్రిమ ఆకర్షణతో ఉంది. బాలడ్స్ సేస్టినా, ఫ్రెంచ్ కవితల అనువాదం పాత వాసనతో కొత్తగా, వాడుక భాషలో స్వీయ చైతన్య స్ఫూర్తితో ఉంది. ఉదాహరణకు– "come, my songs, let us speak of perfection --we shall get ourselves rather disliked --the gilded phaloi of the crocuses --are thrusting at the spring air"

వాల్ట్ విట్మన్ కవిని ఒకప్పుడు ద్వేషించినా, ఇప్పుడు ఆయనతో సయోధ్య కుదుర్చుకొనే ప్రయత్నం చేశాడు. "లీవ్స్ ఆఫ్ గ్రాస్" కవిత్వం రాసిన కుర్రాడు బాగా ఎదిగిపోయాడని మెచ్చి, "కొత్త కట్టెను విరగ్గొట్టిన నువ్వు ఇప్పుడు ఆకర్రతో నగిషీలు చెప్పే సమయం వచ్చింది" అని ప్రోత్సహించాడు. కొన్నేళ్ళకే ఎజ్రా పౌండ్ తనకు తగిన ప్రదేశాన్ని ఎంచుకొని ఇంగ్లాండ్ వెళ్లి మొదట్లో అక్కడి వారిని ఆకర్షించలేకపోయినా, క్రమంగా వారికి దగ్గరయ్యాడు. 19వ ఏట కొంచెం నెర్వస్‌గా, ఉద్రిక్తంగా, కుదుపులతో రెడ్డిష్ బ్రౌన్ అమెరికన్‌లాగా ఉండేవాడని విందాం లెవిస్ రాశాడు. గ్లాసు నీటిలో నూనె చుక్కలాగా ఉండేవాడు. ఆయన ఎవరితోనూ కలవని రకం. ఆకట్టుకోవటానికి ప్రయత్నించేవాడు. దీనిలో మాత్రం విజయం సాధించాడు. ఆయన అహంకారం,

పాండిత్యాలు చరిత్రనే సృష్టించాయి. కళలలో నూతన పరిశోధనాలను వివరించి చెబుతూ విక్టోరియన్ యుగ లక్షణాలను ప్రేల్చి వేస్తూ ఉపన్యాసాలిస్తూ, తాను చికాగోలో పెట్టిన "పొయిట్రి" మేగజైన్‌కు "యూరోపియన్ విలేకరి అయ్యాడు. అహంకార పూరిత ఎర్ర గడ్డంతో కంద గడ్డ లాంటి మొహంతో దూరంగా తిరుగుబాటు మాండరిన్‌గా ఉండేవాడు. శిష్యుల్ని ఆకర్షిస్తూ నిరాకరిస్తూ ఘాటుగా చివాట్లు పెడుతూ ఉన్నా వినాశకరంగా ప్రవర్తించేవాడు మాత్రం కాదు. పౌండ్ విమర్శలకు లాభ పాడినవాడు టి.ఎస్.ఇలియట్ కవి. ఆయన సలహాపై తన "వేస్ట్ లాండ్" కావ్యాన్ని సగానికి సగం తగ్గించి ఆకర్షణీయం చేశాడు. పౌండ్ రాసిన "సెలక్టేడ్ పోయెమ్స్"కు ఇలియట్ ముందుమాట రాస్తూ "అతని ప్రభావం చాలా గొప్పది. ఆయన కవిత్వాన్ని ఉపన్యాసం చేశాడు. తర్వాత కవిత్వాన్ని పాటను చేశాడు.

1914లో సమకాలీన రొమాంటిక్ కవిత్వాన్ని నిరసించే కవి బృందాన్ని పోగేసి, వారికొక మేని ఫెస్టో తయారుచేసి ఆ గ్రూప్‌కు "ఇమేజిస్ట్"లని ఒక పేరు కూడా పెట్టాడు. వీళ్ళు భావ చిత్రాలకు ప్రాధాన్యమిచ్చి, రోమాంటిజం బంధనాలలోంచి కవిత్వపు చెర విడిపించినందుకే ఈ పేరు పెట్టాడు. ఇమేజిస్ట్‌లు సాధారణ భాషను, సరైన వర్ణనాత్మక పదాలతో రాస్తూ, ఛందస్సును వదిలి కొత్త లయతో, కొత్త మూడ్స్‌తో అనిబద్ధ కవిత్వం రాస్తూ, కఠిన స్పష్టమైన కళంక రహిత, అనిర్దిష్ట కవిత్వ సృష్టి చేశారు. ఈ సిద్ధాంతాల వలననే ఉత్తమ కవిత్వం మాత్రమే కాక సాహిత్య సృష్టి జరుగుతుందని నమ్మారు. ఈ సిద్ధాంతాలు జనంలో కల్లోలం నిరసన అవహేళన సృష్టించాయి. ముఖ్యంగా ఆమిలోవెల్ అనే కవయిత్రి ఇమేజిస్ట్‌గా మారి పౌండ్ బాటలో నడిచి నూతన కవిత్వాన్ని రాసి ప్రసిద్ధి పొందింది. అయితే పౌండ్ తమ గ్రూపును ఆమె డామినేట్ చేసి రాస్తోందని, ఆమె కవిత్వం తాము ఆశించిన స్థాయిలో లేదని ప్రాణంలేని జీవి చిత్రంలా ఆమె కవిత్వం ఉందని మండిపడ్డాడు. లోవెల్ భార్య అయిన ఈమె రాసింది ఇమేజిస్ట్ కవిత్వం కాదని దాన్ని "అమీజిస్ట్" కవిత్వం అనాలని అన్నాడు. తాను ఏర్పరచిన గ్రూప్ నుంచి విడిపోయి, ఆ సిద్ధాంతాలకు ఇక తానేమీ బాధ్యుడిని కానని ప్రకటించాడు. తర్వాత "దిలిటిల్ రివ్యు" పత్రికకు ఎడిటర్ అయి మొదటి ప్రపంచ యుద్ధం అయ్యాక లండన్ వదిలి పారిస్ చేరాడు.

సృజన సాహిత్య కుదుపులతో విపరీత ధోరణితో పారిస్‌లో కూడా తన సహాయకులను చికాకుపెడుతూ, ఉద్దీపన కలిగించాడు. తన విపరీత పాండిత్యంతో కవులను మెడలో బిళ్ళల్లాగా చేసుకొని వినోదించాడు. ఈ కాలంలోనే కొత్త వగరు శైలిని, సంభాషణా రూపంతో, విరుద్ధ భావనలతో రూపొందించు కొన్నాడు. 35వ ఏట "హఫ్ సెల్విన్ మాబర్లి" అనే మిరుమిట్లు గొలిపే వ్యంగ్యం, చమత్కారం, రోత కలిగించే పుస్తకం

ప్రచురించాడు. సాంకేతిక పరిణతి ఉన్న గొలుసులా, వినసొంపైన భాగాలతో, తెచ్చిపెట్టుకొన్న మొరటుతనంతో, ఇంద్రియ పరోక్ష వివరాలతో కూడిన మహా ప్రవాహంగా మధ్య మధ్యలో సంబంధంలేని గుర్తుకొచ్చే విషయాలు అడ్డు పడుతుండగా కొత్త తరహా కవిత్వం చెప్పాడు. దీనినే ఇలియట్ కవి “a'positive document of sensibility. it is compact of a certain man in a certain place at a certain time, and it is also the document of an epoch --it is genuine tragedy and comedy and it is in the best sense of Arnold' s worm phrase a "criticism of life” అని విశ్లేషించాడు.

పౌండ్ రాసిన “కాంటోస్” ఒక శృంఖల రచన. అందులో విడిపోతూ కలుస్తున్న ఆశావహ ఏక పాత్రాభినయాలు (మొనోలాగ్స్) ఉన్నాయి వాటిని పాతికేళ్ళుగా రాస్తూనే ఉన్నాడు. కొందరు దాన్ని ఆయన సాహిత్య శిఖరారోహణం, ఒక ఎపిక్ అన్నారు మరి కొందరు అర్థం పర్ధం లేని సంబంధంలేని సాహిత్య దిగజారుడుతనం అన్నారు. ఇది 100 అధ్యాయాలు. మొదటి 16 అధ్యాయాలు 1925లో, వెలువడితే మిగిలినవి ఆ తర్వాత 20 ఏళ్ళలో వచ్చాయి. 1945లో పౌండ్ పీసా జైలులో నిర్బంధించ బడినప్పుడు వచ్చిన 10 అధ్యాయాలను “పీసాన్ కాంటోస్” అన్నారు. ఈ మహా కావ్యాన్ని చదవటానికి కుస్తీ పట్టినవాళ్ళు మింగుడు పడక అది కోడ్ భాషలో ఉందని దాన్ని ఛేదించి చెప్పే వివరణ ఉంటే కాని బుర్రకు యెక్కదని బుర్రలు పగలకొట్టుకొన్నారు. వాళ్ళు పొరబడ్డారు కాని పూర్తిగా అబద్ధం మాత్రం కాదు. సంపూర్ణమైనది కాకపోయినా చాలా స్పష్టంగానే ఉంటుంది. ఈ కావ్యాన్ని దున్నాలంటే యెన్ సైక్లో పీడియాలు, పరభాషా డిక్షనరీలు, సంస్కృతిక రాజకీయ చరిత్రలు, పౌండ్ సమకాలికుల గురించి విస్మృత పుకార్లు, ఆయన కున్న పరిచయాలు, ఆయన రచనలలోని తికమకలు, క్రమరాహిత్యాలు, ముఖ్యంగా వ్యక్తిగత సంబంధాలు ఆధారాలుగా ఉండాల్సిందే. ఈ కాంటోస్‌పై స్పందన వెను వెంటనే కాకుండా నిదానంగా, భావోద్రేక రహితంగా వచ్చింది. దీనిపై రిచార్డ్ ఎబెర్ హార్ట్ రాస్తూ “the student is recommended to read them about six times before their flavor can diffuse through the blood “పౌండ్ కున్న జాతీయాల వెదుకులాట, ఆయనకున్న బహుభాషా పాండిత్యం మనకు అర్థమై మనం కూడా తప్పకుండా ఉపయోగిస్తాం.

బాగా భాషా పాండిత్యం ఉన్న వాళ్ళే ఇందులోకి చొరబడగలరు. గ్రీకుల, రినైసేన్స్‌ల మొదటి ప్రపంచ యుద్ధకాలపు విషయాలు “ఇంఫెర్నో”లోను, డబ్బు బాంక్ లావాదేవీలలో అవినీతిని “ప్యురాగేటోరియో”లో, వాతావరణ అంతాన్ని “పారాడిసో”లో వర్ణించాడు. మన సంస్కృతికి పుట్టినిల్లు అయిన ప్రపంచం యొక్క యదార్ధ స్థితిని తీరం నుంచి

గమనించి రాసిన సాటిలేని చరిత్ర. ఎడ్వర్డ్ ఫిట్జ రాల్డ్ "there hangs a dismal mist of un resolved confusion" అని చెప్పాడు. మామూలు భాషను కవిత్వంతో రంగరించటమే పౌండ్ శైలి అయింది. యేట్స్ కవి పౌండ్‌ను "సెక్స్ లెస్ అమెరికన్ ప్రొఫెసర్" గొప్ప మార్పు తెచ్చినవాడు అంటూ "a brilliant improvisator who had more style than form, a style continually interrupted, broken, twisted into nervous obsession, night mare, stammering confusion" అని తేల్చాడు. ఈ కన్ఫ్యూజన్ ఆయన శిష్యులు కూడాపడినా ఆయన శైలి తమ పాలిటి గాస్పెల్-దైవ వాక్యంగా భావించారు. వాళ్లకు కావలసిన అత్యవసర విషయాలన్నీ పౌండ్ అందించాడు. ఆయన రాసిన "స్పిరిట్ ఆఫ్ రోమాన్స్", ఇన్ స్టి గేషన్స్, పోలిట్ ఎస్సేస్, సోషల్ క్రెడిట్, యాన్ ఇంపాక్ట్" మొదలైన రచనలన్నీ సంప్రదాయ రొమాంటిక్ విధానాలకు వ్యతిరేకాలే.

ఫ్రాన్స్ వదలి ఇటలి 1924లో చేరి రివేర్రా దగ్గర రాపల్లోలో ఉన్నాడు. 1939లో కొద్దికాలం అమెరికా వెళ్లి వచ్చాడు. అక్కడ ఫాసిజాన్ని మెచ్చుకొని ముసోలిని జెఫర్సన్‌తో పోల్చి వ్యతిరేకతను కొని తెచ్చుకొన్నాడు. ఆయన అనుయాయులు విస్తుపోయారు. చాలాకాలం అమెరికాకు దూరంగా ఉండటం వలన మతిభ్రమణ వలన తమ "గురూజీ" ఇక్కడి పరిస్థితులను తెలుసుకోకుండా గుప్పించిన కామెంట్‌లన్నారు. విమర్శను తట్టుకోలేని రక్తం పౌండ్ ది. ఇటలీకి మళ్ళీ చేరి ఫాసిస్ట్ ధోరణి మితిమీరగా 1941లో రోమ్ నుంచి షార్ట్‌వేవ్ రేడియో ద్వారా ప్రచారం చేశాడు. అమెరికాను, దాని విధానాన్ని దుమ్మెత్తి పోశాడు. ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ ప్రజాస్వామ్యాన్ని హతమారుస్తున్నాడని చెప్పాడు. చివరికి ఇవన్నీ అతన్ని అమెరికా దేశ ద్రోహిగా ముద్రవేసే స్థితికి తెచ్చుకొన్నాడు. 1945లో పౌండ్‌ను బంధించి అమెరికాకు చేర్చింది ప్రభుత్వం. వాషింగ్టన్ జైల్లో పెట్టి విచారణ చేసింది. విచారణకు నిరాకరించాడు. నలుగురు మానసిక వైద్యులు పరీక్షించి పౌండ్ మానసికస్థితి ఆరోగ్యంగా లేదని రిపోర్ట్ ఇచ్చారు. మరణశిక్ష పడితేకాని పిచ్చి కుదరదు అన్నారు. కాని తర్వాత సెయింట్ ఎలిజబెత్ హాస్పిటల్లో 14 2- 1946న మానసిక రోగిగా అంటే ఉన్మాదిగా చేర్చి వైద్యం అందించారు. 12 ఏళ్ళు కేసు నడిచింది. పౌండ్ ఇక ఏమాత్రం విచారణకు నిలబడ లేదని ప్రజలు, ప్రజా సంఘాలు కవులు, రచయితలూ వాల్ట్ విట్మన్ కవి నాయకత్వంలో పెద్ద పెద్ద నిరసనలు చేసి విడుదల చేయమని ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. 1958లో హాస్పిటల్ నుండి విడుదలై ఇటలీకి వెళ్ళిపోయాడు. ఇటలీ తన పెంపుడు తల్లి అంటూ ఫాసిస్ట్ పద్ధతిలో సెల్యూట్ చేసి "అమెరికా ఒక పిచ్చివాళ్ళ శరణాలయం" అని స్టేట్మెంట్ ఇచ్చాడు.

63వ ఏట ఇంకా నేరగానిగా విచారణ జరుగుతుండగానే పౌండ్‌కు "పిసాన్ కాంటోస్"

రచనకు గాను వెయ్యి డాలర్ల బోలింజన్ ప్రైజును ఫెల్లోస్ అందజేశారు. దీన్ని స్వీకరించటానికి ప్రభుత్వ అనుమతి అవసరమైంది. ఈ ఫెల్లోస్‌లో ఎక్కువ మంది అమెరికన్ కవులే ఉన్నారు. వాళ్ళు పౌండ్ రాజకీయాలతో తమకు సంబంధం లేదని, ఆయన కవిత్వానికిచ్చిన అవార్డ్, రివార్డ్ అనీ తెలియ జేశారు. కొన్ని నెలలు దీనిపై ప్రతిష్టంభన ఏర్పడింది. వస్తువా, విధానమా అనే ఈ వివాదం యాండ్రూమేల్లాన్ బెల్లిన్జెన్ ఫౌండేషన్ ఏర్పాటు చేసిన నాటి నుంచే ఉంది. పౌండ్ రాజకీయ భావనలు క్షణికోద్రేకమైనవే కాని ఆయన చేసిన కవితా తపస్సు అద్వితీయమని, అమోఘం అనితర సాధ్యం అని గుర్తించారు. ఆయన నవ రచయితలలో చాంపియన్ మాత్రమేకాదు మార్గదర్శి. నిర్లక్ష్యానికి పౌండ్ పూర్తి వ్యతిరేకి, దానిపై నిరంతర పోరాటం చేసినవాడు. "పౌండ్ అంతం ఆయన ఆది" అవుతుందని క్రిటిక్స్ అన్నారు. ఆయన రాసిన "I am weathered the storms --I have beaten out my exile" అనేది అందరికి ఆదర్శమైంది. పౌండ్ తన అనుయాయులకు కొత్తగా ఏదీ బోధించలేదు కాని వాళ్ళు కవిత్వాన్ని ఎలా చెప్పాలో ఉదాహరణ పూర్వకంగా నిరూపించిన మార్గదర్శి. కవిత్వాన్ని సంగీతంలో రంగరించి రాశాడు. "కౌంటర్ పాయింట్"కు ప్రాధాన్యమిచ్చాడు. అనువాదకుడుగా పౌండ్ గొప్ప చరిత్ర సృష్టించాడు. చివరికి మనచలం లాగా చెంపలేసుకొని "the worst mistake I made was that stupid, suburban prejudice of anti Semitism" అన్నాడు పశ్చాత్తాపంతో.

పౌండ్ చెప్పిన కవితా సిద్ధాంతాలు–సామాన్య భాషలో సరైన మాటను ఉపయోగించి దానికి తళుకులు బెళుకులు అద్దకుండా రాయాలి. రిథంను పాత పద్ధతిలో కాకుండా, కొత్త రైమ్స్‌ను కొత్త మూడ్స్ ననుసరించి ఫ్రీ వెర్స్‌లో రాయాలి. కవిత్వ ఉత్పత్తి అస్పష్టంగా ఉండిపోవాలి. అంతర్జాతీయ భావనా పరమావధిగా రాయాలి. టెక్నిక్ కు ప్రాధ్యాన్యం ఎక్కువ ఉండాలి. కమ్యూనికేషన్ కంటే శైలికే అధిక ప్రాధాన్యమివ్వాలి. ఈ సెంటిమెంట్ కల్లోలం సృష్టించి "ఫ్రీ వెర్స్ ఫ్యూరోర్" అనిపించుకొన్నది. తన కాంటోస్‌కు రాసిన సూచికే 320 పేజీలు ఉంది. ఇదంతా చైతన్య స్రవంతి అంటే స్ట్రీం ఆఫ్ కాన్షస్ నెస్ రచన అప్పటికి అది చాలా కొత్త. హ్యూమన్ కామెడీని అనేక గొంతుకలతో, అనేక పరిమాణాలలో కోణాలలో చెప్పానని చెప్పుకొన్నాడు పౌండ్. ఒక నిర్దుష్ట ప్రణాళిక తోనే రాశాడు ఆషామాషీ వ్యవహారం కాదు. ఇందులో వస్తువు వ్యతిరేక వస్తువు, చరిత్ర పునరావృత్తాలు ఉంటాయి. కొన్ని కవితా పంక్తులు– "hang it all Robert Browining --there can be but the one "Sordello" and my Sordello --lo sordels sifo di Mintovans --so shu --churned in the sea"❀



## 79. ఆధునిక కవిత్వ మార్గదర్శి- టి ఎస్ ఇలియట్ (1888 -1965)

అరవైవ ఏట నోబుల్ బహుమతి గ్రహీత, అనేక విలువైన గ్రంథ రచయిత, అద్భుత వ్యాసకర్త, చురుకైన కరపత్ర రచయిత, రాజీలేని ఆధునిక కాల సీరియస్ కవి, మార్గదర్శి- హాస్య రచనలు రాయటం మొదలు పెట్టాడు. ఇది చాలా ఆశ్చర్య జనకమైంది. అంతకంటే ప్రత్యేకత మరొక్కటి ఉంది- అదే అప్పటిదాకా రాసిన అస్పష్ట గూడార్ధ రచనల నుంచి ముఖ్యంగా కవిత్వం నుండి వైదొలగి, అద్భుత విజయవంతమైన వినోదాత్మక ప్రసిద్ధి చెందిన నాటకాలు రాసి అట్లాంటిక్ సముద్రానికి అటూ ఇటూ పేరు ప్రఖ్యాతులను పొందినవాడు. అమెరికాలో జన్మించి బ్రిటిష్ పౌరుడైన థామస్ స్టి యార్న్స్ ఇలియట్ అంటే టి.ఎస్.ఇలియట్.26-9-1888న అమెరికాలోని సెయింట్ లూయీకి చెందిన మిస్సోరిలో జన్మించాడు. ఆరుగురు సంతానంలో చివరివాడు. తండ్రిది న్యు ఇంగ్లాండ్‌కు చెందిన ప్యూరిటన్ వంశం. తాత బోస్టన్ నుంచి వచ్చి వాషింగ్టన్ యూనివర్సిటిని, మొదటి యునిటరేనియన్ చర్చిని సెయింట్ లూయీలో స్థాపించాడు. సివిల్ వార్ ముందు పారిపోయే బానిసల కోసం అండర్ గ్రౌండ్ రైల్వేను ఏర్పాటు చేసిన వారిలో ఒకడు. తల్లి పౌర సేవక నాయకురాలు సంస్కర్త, కవయిత్రి సవోనారాల అనే నాటక కవిత్వం రాసింది. ఆమె ప్రతిభ కొడుకుకు వారసత్వంగా లభించింది. అందుకే న్యు ఇంగ్లాండ్‌లో ఇలియట్‌ను చేర్చి చదివించారు. మిల్టన్ అకాడెమి, హార్వర్డ్ యూనివర్సిటీలలో చదివి బి.ఏ. తర్వాత ఎం.యే పాసై ఇంగ్లాండ్ వెళ్లి సార్బొన్నేలో, ఆక్స్ ఫర్డ్‌లో మెర్టన్ కాలేజిలో చదివి స్కూల్ మాస్టర్‌గా పని చేశాడు. అయిష్టంగానే మేస్టర్ గిరీ నాలుగేళ్ళు బ్యాంక్ గుమాస్తాగా ఎనిమిదేళ్ళు లాగాడు. 27వ యేట బాలట్‌పై మోజున్న వివిన్నే హైఘను పెళ్ళాడి లండన్ పబ్లిషింగ్ హౌస్‌లో మంచి ఉద్యోగంలో

చేరి, తర్వాత భాగస్వామి అయి, 1927లో బ్రిటిష్ పౌరుడయ్యాడు. కారణం అడిగిన వారికి "ఇక్కడ బతుకుతున్నాను, ఇక్కడే స్నేహితులతో సరదాగా గడుపుతున్నాను. చట్ట విరుద్ధంగా ఉండటం నాకిష్టం లేదు. పూర్తి బాధ్యతతో ఇక్కడే ఉండాలనుకొన్నాను" అని బదులు చెప్పాడు. తాను మత రీత్యా ఆంగ్లో కేథలిక్‌నని, రాజకీయాలలో రాయలిస్ట్‌నని సాహిత్యంలో క్లాసిసిస్ట్‌నని చెప్పుకొన్నాడు ఇలియట్.

క్లాసిసిస్ట్‌లలో ఇలియట్ అదో రకం. మొదటి రచనలలో రొమాంటిక్ కవిత్వమే కాక రొమాంటిక్ ప్రయోగాలు కూడా చేశాడు. 19వ ఏట లిరిక్స్ రాశాడు. హార్వర్డ్ నుంచి గ్రాడ్యుయేట్ అవక ముందే ఫ్రెంచ్ సింబాలిస్ట్‌ల పరిచయం కలిగింది. 22వ ఏట హార్వర్డ్ పేపర్ "ఆడ్వోకేట్"లో హ్యూమరస్ కవిత అచ్చయింది. తర్వాత రాసిన "స్ప్లీన్" కవితలో వేరాలైన్, బాదర్లె సంగీతం ఎక్కువైంది. "ప్రు ఫోర్క్"లో ప్రత్యేక లక్షణాలు కనిపించాయి. అందులోని కొన్ని లైన్లు–

"And life, a little bald and gray --languid, fastidious, and bland --waits, hat and gloves in hand --punctilious of tie and suit --on the doorstep of the Absolute" తర్వాత సింబాలిక్ ప్రభావాన్ని గ్రహించాడు. అందుకే "సింబాలిస్ట్ మువ్ మెంట్ ఇన్ లిటరేచర్" పుస్తకంలో ఇలియట్ "లాఫోర్జ్, లిమ్బాడ్‌లను వినలేదు కాని, వేరలిన్‌ను ఇంకా చదవలేదు. ఆయన్ను చదివాక కోర్బరీని తెలుసుకోలేదు. కనుక సైమన్స్ పుస్తకం నన్ను మార్చింది అని చెప్పక తప్పదు" అని రాశాడు. అండర్ గ్రాడ్యుయేట్ కవిగా ఉన్నప్పుడే తన మోడల్స్ కవితలను కేవలం పునః రచన చేయలేదు. ఫ్రెంచ్ సింబాలిస్ట్‌ల వస్తు భావ తీవ్రతలకు చెదిరిన స్థితులను జాగృతం చేశాడు .మానసిక విశ్లేషణలను భావ వ్యక్తీకరణకు జోడించాడు .ఇదంతా ఒక దీర్ఘ వలయాకారమైంది. ఆనాటి దిగజారుడు విధానాలను ఎలుగెత్తి చూపాడు. శైలి విషయంలో ఇంకా నిర్దుష్టత రాలేదు. ఇంకా సగం పాండిత్యం, సగం వ్యావహారికంగానే ఉంది. 21లో అతి ముఖ్యమైన కవిత "ది లవ్ సాంగ్ ఆఫ్ జే ఆల్ఫ్రెడ్ ప్రూ ఫోర్క్" రాశాడు. "The symbolists had indicated a method 'Ñof transmuting ideas into sensations, of transforming an observation into a state of mind" బాదర్లేర్ కొత్త ప్రతీకల సముదాయాన్ని అందించాడు. సామాన్య జీవితంలోని ప్రతీకలను కాకుండా వాటిని ఉద్ధరించి, అసలు అర్థానికి మరింత వివరణాత్మకం చేయాలి అన్నాడు ఇలియట్. స్వాభావిక వ్యంగ్యాన్ని మరింత సాంద్రం చేశాడు. "ప్రుటార్క్ అండ్ అదర్ అబ్సర్వేషన్స్" కవితా సంపుటిలో వ్యంగ్యంతో టెక్నిక్‌ను జటిలం చేసి రాశాడు. "ది సేక్రేడ్ వుడ్" కవిత్వాన్ని వివరిస్తూ "the use of poetry"లో "the essential advantage for a poet is not to have a beautiful world

with which to deal --it is to be able to see beneath both beauty and ugliness --to see the boredom, and the horror and the glory"

ఇలియట్ అన్వేషణ 34వ ఏట వెలువడిన "వేస్ట్ లాండ్"లో ఫలవంతమైంది. 17వ శతాబ్ది మెటాఫిజికల్ కవుల, ప్రతీక కవుల వ్యంగ్యాన్ని కలబోసి రాశాడు దీన్ని. సెటైర్ ఉన్నా మూడ్ చాలా వాస్తవంగానే ఉంది. జ్ఞాపకాన్ని కోరికను కలిపి రాశాడు. ఇందులో ఆయన వాడిన జాతీయాలు ఆంగ్ల కవిత్వంలో బహు నూతనమైనవి. కవిత వాడుక భాషను ఆచూకీలతో మిశ్రమం చేసి రాశాడు. "the verse was a curious amalgam, colloquial speech joined to and jarred by recondite references, blending with subtle emotions, the horrifying and the ridiculous" అని వివరించారు. అందుకే వేస్ట్ లాండ్ అనేక అర్థాల నిచ్చే కవిత అయింది. కొందరు దీన్ని అనేక కొటేషన్‌ల అందమైన అల్లికగా ఉండి చిన్న ఎపిక్ అయింది అన్నారు. మరొక వర్గం సుదీర్ఘ మార్మిక పునః సృష్టి అన్నది. మూడవ ముఠా దీన్ని క్రిస్టియానిటీపై పునః విశ్వాస ప్రకటన అన్నది. నాల్గవ సమూహం ఈ కావ్యం ఊసర క్షేత్రమైన సమకాలీన ప్రపంచ దిగజారుడు, అవినీతికి, ఏకాంత నివాసానికి, నైతిక విలువల దివాలా తనానికి అద్దం పట్టింది అన్నది. హెమింగ్వే వచనంలో "ది సన్ ఆల్సో రైజేస్" రాసిన దాన్ని ఇలియట్ వేస్టాండ్‌లో కవిత్వ పరంగా చెప్పాడు. ఇదే "కోల్పోయిన తరానికి" మానిఫెస్టో. మేధావి వర్గం, యువత దీన్ని తమ బైబిల్ అన్నారు. లూయీ మాక్ నీస్ అనే విశ్లేషకుడు "వేస్ట్ లాండ్ కవిత్వం యొక్క కీలక భావనలను పూర్తిగా మార్చేసింది నిజం చెప్పాలంటే జీవితాన్నే మార్చేసింది. 18 ఏళ్ళ వయసువారు ఎన్నో ఊసర క్షేత్రాలను చూశారు. అవన్నీ ఇందులో చిత్రరూపాలను పొందాయి. కనుక వీరికి అదొక మహాద్భుత కావ్యమైంది. మనసులలోకి దూరింది. ఇలియట్ మహాకవి చేసిన అద్భుత సృష్టి" అన్నాడు.

ఊసర క్షేత్ర రచనపైవచ్చిన విమర్శలకు సమాధానంగా ఇలియట్ "one of the surest tests of a poet' sensibility is the way in which a poet borrows, Immature poets imitate, mature poets steal, bad poets deface what they take, and good poets make it into something better or at least something different" అన్నాడు. నర్సరీ రైమ్స్‌లాగా పూర్తి చేస్తూ పూర్తి నిరాశతో వ్యంగ్య ప్రార్ధనగా ఉందనిపిస్తుంది. ఆయన అనుచరులు సగం వర్ణనాత్మక సగం లిరికల్ శైలికి ముగ్ధులయ్యారు. అందరికి పరిచయంలేని సాహిత్యం, ఎప్పటిదో అయిన ఫిలాసఫీ, అరడజను భాషలలోని కొటేషన్లుతో గందర గోళం కలిగించాడని కొందరు, కాదు కాదు ఆయన కవిత్వం ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని కలిగించి ఊహలను

గిలక్కోట్టాయి అని కొందరు అన్నారు.

తరువాత ఆయన చాలా మార్పులతో రచన చేశాడు. నాటక రచన చేశాడు. రెచ్చగొట్టే వ్యాసాలూ రాశాడు. పుస్తక సమీక్షలు చేశాడు. "పిల్లి ప్రేమికుల" కోసం "ఓల్డ్ పాస్యూమ్స్ బుక్ ఆఫ్ ప్రాక్టికల్ కాట్స్" రాశాడు. పెజియంట్ నాటకంగా "ది రాక్" రాశాడు. సెయింట్ థామస్ ఆత్మ బలిదానంపై "మర్డర్ ఇన్ ది కేథడ్రిల్" రాశాడు. ఇలియట్‌ను చూస్తే సంప్రదాయ బ్యాంకర్ అనిపిస్తాడు కాని కవి అనిపించడు. ఆరడుగుల అందగాడు. కాని సన్నగా అలసిపోయినట్లు ఉండేవాడు. డేగ చూపు. కొంచెం వంగి నడిచేవాడు. చక్కని గంభీర స్వరంతో తన కవితలలో చాలాభాగం చదివి రికార్డ్ చేశాడు. సిగ్గుపడుతూ సిగ్గుపడేవారి పక్షాన నిలిచాడు. కాని ఆయన సమక్షం ఎందుకో అందరికీ నచ్చేదికాదు. దీనిపై ఎడ్వర్డ్ లియర్ కవి ఒక కవిత అల్లాడు-

"How unpleasant to meet Mr.Eliot --with his features of clerical cut --and his brow so grim --and his mouth so prim --and his conversation so nicely --restricted to what precisely -and if and perhaps and but --"

యాభై వచ్చేలోపు "ఫోర్ క్వార్టర్స్" రాశాడు. ఇందులో గొప్ప ఫిలసాఫికల్ కుమ్మరించాడు. 20వ శతాబ్ది అత్యుత్తమ రచన అనిపించింది. సింఫనీ మాంత్రికుడు బీథోవెన్ సంగీత పరిధి దాటి సంగీతం కూర్చినట్లు ఉంది అన్నారు. 50 ఏళ్ళు దాటాక తుళ్ళిపడే శైలితో రాశాడు. ఆయన రాసిన "కాక్ టైల్ పార్టీ" ఇంగ్లాండ్, అమెరికాలలో మంచి పేరు తెచ్చాయి. పూర్వపు యోధుడు ఇప్పుడు దైవ అన్వేషకుడుగా మారాడు. "ట్రడిషన్ అండ్ ఇండివిద్యువల్ టేలెంట్" అనేగొప్ప సాహిత్య విమర్శ గ్రంథం రాశాడు. 60వ ఏట "కన్జర్వేటివ్ ఎల్డర్ స్టేట్స్ మన్" అనిపించుకొన్నాడు. ఈ వయసులోనే ఆధునిక కవిత్వానికి మార్గదర్శనం చేసినందుకు నోబెల్ పురస్కారం అందుకొన్నాడు. ఈ సందర్భంగా "the process of advancement is interesting one seems to become a myth, a fabulous creature that does not exist, one does not feel any different though, it is not you get bigger to fit the world, the world gets smaller to fit you" అని ఫైల్లసాఫికల్‌గా స్పందించాడు. నాలుగవ జార్జి ఆర్డర్ ఆఫ్ మెరిట్ ప్రదానం చేశాడు. 65వ ఏట అందరూ చెప్పుకొనే కవిగా, విమర్శకుడుగా ఇలియట్ ఎదిగిపోయాడు. అప్పటికే ఆయనపై డజను పుస్తకాలు వివరణాత్మకంగా విశ్లేషణాత్మకంగా వెలువడ్డాయి. వివాదాలకు కేంద్ర బిందువూ అయ్యాడు. ఆయన వివేకాన్ని ఎవరూ ప్రశ్నించలేదు. కవిత్వాన్ని గురించి "poetry may make us see the world afresh, or some

new part of it. It may make us from time to time a little more aware of the deeper un named feelings to which we rarely penetrate" భాష్యం చెప్పాడు ఇలియట్. 70లో ఇలియట్‌పై ఒక సింపోజియం నిర్వహించారు. కొత్త క్రిటిక్స్‌ను ఆయన లెమన్ స్క్వీజేడ్ క్రిటిక్స్ అన్నాడు. "good poetry must exhibit several qualities in proportion of which one is good sense" అని కవిత్వ పరమావధి గురించి చెప్పాడు. "సెలక్టేడ్ ఎస్సేస్"లో కవిత్వం గురించి చాలా రాశాడు "కవిత్వం ప్రపంచాన్ని కొత్త దృష్టితో చూపిస్తుంది. కొత్త భాగాలను తెలియజేస్తుంది. లోతుల ఆవిష్కరణ చేస్తుంది నిజంగా దూసుకుపోయే సమర్ధత కవిత్వానికి ఉన్నది. ఆనందంతోబాటు జాగృతి కలిగిస్తుంది" అన్నాడు. ప్రపంచంలో ఎక్కడ యే రచన వచ్చినా దానిపై ఇలియట్ యేమని కామెంట్ చేశాడని అందరూ ఎదురు చూసేవాళ్ళు. ఆయన విమర్శకు అంత విలువ ఉండేది.

ఒక రకంగా చెప్పాలంటే ఇలియట్ "ఊసర క్షేత్రం"లో కవితా సస్య కేదారాలు పండించాడు. ప్రతి చోటా ఉన్న చావును ఆవిష్కరించాడు. కవితను ముక్కలు ముక్కలు చేసి రాశాడు. అందులో గుప్పించిన క్రియా సౌభాగ్యానికి మురిసిన వారున్నారు. శిధిల చిహ్నాలు చూపించాడు. బోలు మనుషుల నిజరూపం కళ్ళ ముందు నిలిపాడు. కదలలేని కుళ్ళి కంపు కొడుతున్న సమాజాన్ని చూపించాడు "this is the way the world ends --this is the way the world ends --this is the way the world ends --not with a bang but a whimper" అంటూ మూడు మాటలు గంట కొట్టినట్లు కొట్టి ప్రపంచ పరిసమాప్తిని తెలియజేశాడు.

చివరి కాలంలో "ఆల్కహాలిక్" అయి "రిం జిమ్ రిం జిమ్" అంటూ జిమ్‌ను జాం జాం అంటూ తెగ తాగేవాడు. 4-1-1965న ఇలియట్ మహాకవి మరణించాడు. ఆయన ద్విశాబ్దికి లండన్ పోఎట్స్ కార్నర్‌లో వెస్ట్ మినిస్టర్ ఆబ్బేలో ఒక పెద్ద శిలను ఉంచి గౌరవించారు. వర్జీనియా ఉల్ఫ్, జేమ్స్ జాయిస్ వంటి వారిని ప్రభావితం చేశాడు. ఇలియట్ "దం, దాంతం, ధమత్వం" మొదలైన భారతీయ పదాలను వేస్ట్ లాండ్‌లో చొప్పించి ఘనత చేకూర్చాడు. ఆధునిక ఆంగ్ల కవిత్వ మార్గదర్శి టి.ఎస్.ఇలియట్.❁



## 80. నాటక రచనకు మొదటి నోబుల్ బహుమతి అందుకొన్న అమెరికన్ నాటకకర్త -యూజీన్ ఓ నీల్ (1888-1953)

"నాటకాంతాని సాహిత్యం" అన్న భారతీయ భావాన్ని అర్థం చేసుకొన్నారో యేమో కాని నోబుల్ పురస్కార ప్రదాతలు మొట్ట మొదటిసారిగా నాటక రచనను గుర్తించి బహుమతిని అందజేశారు. ఆ అరుదైన తొలి పురస్కారాన్ని 1953 డిసెంబర్ 3న అందుకొని ప్రఖ్యాత అమెరికన్ నాటక రచయిత, ప్రయోగశీలి యూజీన్ ఓ నీల్ చరిత్ర సృష్టించాడు. అప్పటికే నాటక రచనకు మూడు పులిట్జర్ బహుమతులు పొందాడు. కాని అంత్యక్రియలు చిన్న ఆచ్ఛాదన లేని శవపేటికలో పెట్టి జరిపిస్తే హాజరైన వారు కేవలం ముగ్గురే అవటం మనకు ఆశ్చర్యం కలిగిస్తుందేమోకాని ఆయన మనస్ఫూర్తిగా కోరుకొన్న కోరిక అదే. ఎలాంటి ఆర్భాటం "శోకన్నాలు", ప్రార్థనలు, ఆయనపై ఉపన్యాసాలు లేకుండా అత్యంత నిరాడంబరంగా శవ పేటికను భూమిలో ఉంచాలి అన్న ఆయన తుది కోర్కెను తీర్చి ఆత్మశాంతి కలిగించారు...

అసలు పేరు యూజీన్ గ్లాడ్ స్టన్ ఓ నీల్. 16-10-1888న అమెరికాలోని న్యూయార్క్ సిటి ఫామిలి హోటల్ మూడవ ఫ్లోర్ వెనుక గదిలో జన్మించాడు. వెండి తెర వేలుపు అయిన తండ్రి జేమ్స్ ఓ నీల్‌కు రెండవ కొడుకు. తండ్రి "కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో" నాటకంలో ప్రముఖ పాత్రధారి. తండ్రి టూరింగ్ నాటక ట్రూప్‌తో కొడుకు కూడా ఏడేళ్ళ దేశమంతా తిరిగి తండ్రి ప్రదర్శనలలో పాల్గొన్నాడు. ఎనిమిదవ ఏట రోమన్ కేథలిక్ బోర్డింగ్ స్కూల్‌లో చేరాడు. 13వ ఏట కనెక్టి కట్‌లో స్టాం ఫోర్డ్‌లోని బెట్స్ అకాడెమిలో చేరి చదివాడు. కుటుంబ సభ్యులెవరూ వచ్చి చూసిన పాపాన పోలేదు. సెలవులలో కూడా ఒక్కడే అక్కడే ఏకాంతంగా గడిపాడు పాపం. 18లో ప్రిన్స్ టన్‌లో చేరి, ఒక్క ఏడాదిలోపు మాత్రమే ఉన్నాడు. అనుకోని ఉద్రేకం ఏవగింపులతో ఒకసారి స్కూల్ మాస్టారి బీర్ బాటిల్‌ను కిటికీలోంచి బయటికి విసిరేశాడు. దీని ఫలితం యూనివర్సిటి నుండి బహిష్కరణ. దీనితో క్రమ బద్ధ విద్య పూర్తిగా దూరమైపోయింది. 19వ ఏట ఇల్లు పట్టకుండా దేశ ద్రిమ్మరిగా తిరిగాడు. బంగారు

గనుల అన్వేషణ చేసే మెయిల్ ఆర్డర్ ఫర్మ్ ఉద్యోగానికి రాజీనామా చేసి అదృష్టాన్ని వెతుక్కుంటూ హోండూరస్‌లో బంగారం కోసం అరణ్యాలు గాలించాడు. ఉష్ణమండల జ్వరంతో బాధ పడి అమెరికాలో కొంపకు చేరాడు. కేథలీన్ జెంకిన్స్‌ను పెళ్లి చేసుకొని, కొడుకును పొంది, తండ్రి నాటక కంపెనీలో అసిస్టంట్ స్టేజ్ మేనేజర్ అయ్యాడు. ఇంట్లోనూ బయట నాటక కంపెనీలోను ఇమడలేక ఒక సామాన్య సముద్ర ప్రయాణీకుడుగా బయల్దేరి బ్యూనస్ ఎయిర్స్ చేరాడు. దక్షిణ అమెరికా నుండి ఆఫ్రికాకు వెళ్ళి వచ్చేనావలో నావికుడుగా ఒక ఏడాది కాలక్షేపం చేశాడు. మళ్ళీ న్యూయార్క్ చేరి బాటిల్ దించకుండా మందుకొడుతూ దేవదాసయ్యాడు. ఈ మద్యపానకేళి తండ్రి న్యు ఆర్లియన్స్‌లో ఆడుతున్న నాటకంతో ఆగిపోయింది. తండ్రి కంపెనీలో నటుడు అయి, నాలుగు నెలలు మాత్రమే ఉండి, మళ్ళీ పుర్రెలో తొలిచిన పురుగుతో, ఉత్తరానికి వెళ్లి “న్యు లండన్ టెలిగ్రాఫ్” పత్రికకు రిపోర్టర్ అయ్యాడు.. మళ్ళీ నాలుగు నెలలకు దీనికీ నామం పెట్టేసి, వార్తా సేకరణ బోర్ కొట్టి, నిర్బంధంలో పని చేస్తున్నందుకు ఆరోగ్యం పాడైందని చెప్పాడు. డాక్టర్ పరీక్షలో నీల్‌కు కొద్దిగా క్షయ వ్యాధి సోకిందని తేలగా కనెక్టికట్‌లోని వాలింగ్ ఫోర్డ్ శానిటోరియంకు పంపించారు. అయిదు నెలలున్నాడు. తన స్థిమితం లేని గతం ఒక్కసారి ఫ్లాష్‌బాక్‌లాగా వెలుగులోకి వచ్చింది. గతకాలపు స్మృతులు, అనుభవాలు అనుభూతులు ఒకదానిపై ఒకటి పడి పరావర్తనానికి సమయం లేకుండా పోయిందని తలచాడు. చదవటం ప్రారంభించి ముఖ్యంగా నాటకాలు ఎక్కువగా చదివాడు. స్ట్రిండర్ బెర్గ్ తనకు మొదటిసారిగా నాటకాలకు మార్గదర్శి అయ్యాడని, ఆధునిక నాటకం ఎలా ఉంటుందో తెలిసిందని, ఆయనే తనను థియేటర్ కోసం రాయమని ఆదేశించాడని చెప్పుకొన్నాడు.

ఆరోగ్యం కుదుటబడి ఆస్పత్రి నుంచి డిశ్చార్జ్ అయి ఆ ప్రేరణతో వెంటనే నాటక రచనకు ఉపక్రమించి 11 ఏకాంకికలు రాశాడు. వీటిపై స్వీడన్ నాటక రచయిత ప్రభావం బాగా కనిపించింది. రెండు దీర్ఘ నాటకాలూ రాశాడు. తీరా ఒకసారి చదివి చూసుకొంటే అవి ప్రదర్శనకు కాని ముద్రణకు కాని పనిరాని చెత్త అనిపించింది. కొన్నిటిని చించి పారేస్తే తండ్రి అందులో ఆరు నాటికలను కొడుకు సంతృప్తికోసం ముద్రించి “థర్ స్ట్ అండ్ అదర్ ప్లేస్” శీర్షికతో విడుదల చేశాడు. 26వ ఏట తన దేశ ద్రిమ్మరి కొడుకు తన అవిశ్రాంత శక్తిని సృజనాత్మకవైపు మళ్ళిస్తున్నాడని సంతోషపడ్డాడు. హార్వర్డ్‌లోని జార్జి పియర్స్ బేకర్స్ డ్రామా వర్క్ షాప్‌లో ఒకఏడాది ఫీజు కట్టి చేర్పించాడు.

28 ఏళ్ళ వయసులో నీల్ చేతినిండా స్క్రిప్ట్ లే. ప్రావిన్స్ టౌన్‌కు వెళ్లి తన మొదటినాటక ప్రదర్శన “బౌండ్ ఈస్ట్ ఫర్ కార్డిఫ్” చూసుకొన్నాడు. వేర్ఫ్ థియేటర్ దీన్ని ప్రదర్శించింది బ్రహ్మాండమైన విజయం లభించింది. ఈ థియేటర్ తర్వాత న్యూయార్క్ గ్రీన్ విచ్ విలేజ్‌కి మారి ప్రావిన్స్ టౌన్ ప్లేయర్స్‌గా ప్రసిద్ధమైంది. 1917

నుండి 20 దాకా మూడేళ్ళు నీల్ రాసిన పది ఏకాంకికలను ప్రదర్శించింది. అవే "ఇల్", "ది మూన్ ఆఫ్ ది కర్రబీస్", "ది లాంగ్ వాయెజ్ హోం". ఈ మూడిటిని "ది స్మార్ట్ సెట్"గా ముద్రించాడు. తరువాత పూర్తి నిడివిగల నాటకం "బియాండ్ ది హోరైజన్స్" 1920లో ప్రదర్శించారు. అధిక ప్రేక్షకాదరణతో ఇది వందకు పైగా ప్రదర్శనలు నిర్వహించారు. దీనికి మొదటిసారిగా పులిట్జర్ బహుమతి పొందాడు. దీనికి ముందటి నాటకాలు మోటుగా ఉన్నా అవి ''టైలర్ మేడ్'' వినోదాలు అనిపించుకోలేదు. సామర్ధ్యంగా రాసినవే. అవి ఆకర్షణీయంగా లేకపోయినా, సుఖాన్ని కలిగించక పోయినా చీకటిలో, హింసాత్మక, వికార అందాన్ని ప్రదర్శించాయి. ఒక్కోసారి హీనంగా మరోసారి భయంకరంగా ఉన్నా అప్రధానంగా మాత్రం లేవు. ప్రపంచ బాధ, అందులోని చెడును చూసి కుంగిపోలేదు. అతని హీరోలు "నిస్సహాయులు, విషాద వదనులు. "అన్నా క్రిస్టీ"కి రెండోసారి 1922లో పులిట్జర్ ప్రైజ్ వచ్చింది. "స్ట్రేంజ్ఇంటర్ లూడ్" నాటకం బహుళ ప్రజాదరణ పొంది దేశవ్యాప్తంగా నీల్ కీర్తి వ్యాపించి మూడో పులిట్జర్ పొందింది. రెండేళ్ళ తర్వాత అమెరికన్ రచయిత సింక్లెర్ లెవిస్ నోబుల్ బహుమతిని స్వీకరిస్తూ హుందాగా "ఈ ప్రైజ్ యూజేన్ ఓ నీల్కు ఇచ్చి ఉంటే చాలా గొప్పగా ఉండేది..సమాజంలోని వికృతిని భయంకరంగా నేల బద్దలయేట్లు అగ్నివర్షం కురిపించినట్లు, తన నాటకాలను దాదాపుగా పది ఏళ్ళ నుంచి రాస్తూ కొత్త లోకాలను చూపిస్తున్నాడు" అని మెచ్చుకొన్నాడు. విధ్వంసకర అగ్ని అనిపించాడు నీల్.

నాటకరంగ సంప్రదాయాలనన్నిటిని తుంగలో తొక్కాడు. "ది ఎంపరర్ జోన్స్" సుదీర్ఘ స్పీచ్లకు స్వస్తి పలికింది. మోనోలాగ్లతో రక్తి కట్టించాడు. పాతకాలపు ఫాంటసి నుంచి ఆధునిక వాస్తవికతకు నాటకాన్ని మార్చాడు. "ది హేయిరీ ఏప్"లో ఫాంటసిని భావ వ్యక్తీకరణ వాద సింబాలిజంగా మార్చాడు. "ది గ్రేట్ గాడ్ బ్రౌన్"లో మాస్క్లను ప్రవేశపెట్టాడు. ఒరాస్ పాటల శబ్దాలతో "లాజరస్ లాఫ్డ్"ను తీర్చిదిద్దాడు. పూర్వ గ్రీకు ట్రాజెడిలను ఆధునిక విధానాలతో శోభ కూర్చాడు. ఆయన నాటకాల లాగానే ఆయన జీవితమూ మారింది. అనేక మూడ్స్లో అనేక ప్రదేశాలలో ఉన్నాడు. ఎక్కడా ఎక్కువ కాలం ఉండలేక పోయాడు. న్యు ఇంగ్లాండ్, బెర్మూడా, ఫ్రాన్స్, సీ ఐలాండ్స్, టావో హౌస్, సాన్ ఫ్రాన్సిస్కో, న్యూయార్క్, కేప్ కాడ్ లన్నీ తిరిగాడు. మొదటి పెళ్లి మూడేళ్లకే పెటాకులైతే 30వ ఏట యాగ్నెస్ బోల్టన్ను పెళ్ళాడి ఒక కొడుకు షేన్ను కూతురు ఊనాకు తండ్రి అయ్యాడు. 1929లో విడాకులిచ్చి 42వ ఏట అందమైన నటి కార్లోటా మాంటరిని పెళ్లి చేసుకొని తొమ్మిది నాటకాల శృంఖలానికి నాంది పలికాడు. 1775 నుంచి 1932 వరకు అమెరికా కుటుంబం పొందిన ఉత్థాన పతనాలను వీటిలో గొప్పగా చూపించాడు. ఆరోగ్యం పూర్తిగా లభించి జుట్టుకొంచెం

తెల్లబడి చలన పూర్వక పెదవులతో, తీవ్ర ఆలోచన ఉన్న కనులతో, ఎముకలు పొడుచుకు వచ్చే దవడలతో అనేక ప్రశ్నల సమాహారంగా కనిపించేవాడు.

45లో అభిమానులను ఆశ్చర్య పోయేట్లు "ఆ వైల్డర్ నెస్" అనే సెంటిమెంటల్ కామెడితో చేశాడు. భౌతిక సంపద మోహాన్ని తిరస్కరించాడు. "ఆల్ గాడ్స్ చిల్లన్ గాట్ వింగ్స్" నాటకం జాతి అల్లర్లు సృష్టిస్తుందేమోనని భయపడ్డారు. "ది ఫైర్ ఉందరర్ ది ఎల్మ్స్"కి బుజాలు తడుముకొన్న అవినీతి పరులు న్యు యార్క్ థియేటర్‌లో ఆడనీకుండా అడ్డుపడి మూసేయించారు. బోస్టన్‌లో కూడా జరగనివ్వ లేదు. లాస్ ఏంజిల్స్‌లో కొన్ని ప్రదర్శనల తర్వాత అందులో పాల్గొన్న నటులందర్నీ అరెస్ట్ చేశారు.

1936లో ఓ నీల్‌కు వచ్చిన నోబెల్ బహుమతి ఫిలిస్టిన్‌లకు చెంపపెట్టు, ఆధునిక అమెరికన్ నాటక రచయిత ఓ నీల్‌కు గొప్ప ప్రశంస. ఆరేళ్ళక్రితం సింక్లైర్ లెవిస్ ఇచ్చిన వివరణ గుర్తుకొచ్చి నీల్ కూడా "ఈ అత్యున్నత పురస్కారం నాకు మాత్రమే కాదు అమెరికాలోని నా సహచరులందరిదీ. ఈ నోబెల్ బహుమతి రాబోయే అమెరికా థియేటర్‌కు చిహ్నం. నా నాటకాలకు రావటం అదృష్టం కాలమూ కలిసి రావటం. మొదటి ప్రపంచ యుద్ధానంతరం నాటకాలురాసిన అమెరికన్ మిత్ర రచయితలందరి పాత్ర ఇందులో ఉంది" అని చాలా నిగర్వంగా ప్రకటించాడు. నీల్ చాలా వినయంగా ఈమాటలు అన్నప్పటికీ అప్పటికి ప్రపంచం మొత్తం మీద షేక్స్ పియర్ బెర్నార్డ్ షాల తర్వాత ఎక్కువ పేరు ప్రతిష్టలు పొందినవాడు ఓనీల్ మాత్రమే..వారిద్దరి నాటకాల తర్వాత ఇంగ్లీష్ నాటకాలలో జనం అమితంగా చదివింది నీల్ నాటకాలనే.

అకస్మాత్తుగా నీల్ అదృష్టకాలం రచనాశక్తి దెబ్బతిన్నాయి. శారీరకంగా సృజనాత్మకంగా తగ్గిపోయాడు. ఆయన పని "ఆకాశంబున నుండి పాతాళం"లోకి పడిపోయింది. "డేస్ వితౌట్ ఎండ్"తో బాగా ఇబ్బంది పడ్డాడు. 12 ఏళ్ళ తర్వాత "ది ఐస్ మాన్ కమెత్" కూడా ఫైల్యూర్ అయింది. 1946లో మళ్ళీ థియేటర్‌కు వచ్చాడు. "ఎ మూన్ ఫర్ ది మిషె గాటన్" కూడా దెబ్బ తిన్నది. అప్పటికే ఒక మిలియన్ డాలర్లు సంపాదించిన నాటక రచయిత నీల్ 50వ ఏట జబ్బుపడి సంతోషం కోల్పోయాడు. కుటుంబ జీవితం ముక్కలైంది. కూతురు ఊనా హాస్యనటుడు చార్లీ చాప్లిన్‌ను పెళ్లి చేసుకోవటం క్షమించలేక పోయాడు. చిన్న కొడుకు షేన్ మత్తుమందుకు బానిసై ఆస్పత్రి పాలైనాడు. టీచర్, గ్రీక్ స్కాలర్ అయిన పెద్దకొడుకు 1950లో ఆత్మహత్య చేసు కొన్నాడు..నీల్ వీటన్నిటి వలన మరింత ఆరోగ్యం కోల్పోయి చిక్కి శల్యావశిష్టమైనాడు. బతికి ఉన్న అస్థి పంజరమా అనిపించాడు. కళ్ళు నల్లబడి గుంతల్లా ఉన్నాయి. ఎముకల పోగుకు చర్మం అంటించినట్లున్నాడు. 56వ ఏట కండరాల జబ్బు కూడా వచ్చి రాయటం అసాధ్యమైపోయింది. తర్వాత చేతితో కలం పట్టుకోలేక పోయాడు. ఆస్పత్రి వైద్యం కూడా ఫలించలేదు. క్రమంగా శారీరక

కార్యక్రమాలు బలహీనపడ్డాయి. పార్కిన్సన్ వ్యాధి వచ్చిందని నిర్ధారించారు. ఆయన వ్యాధిని "ప్రి సేనైల్ ఆర్టీరియల్ స్క్లెరో టిక్ కండిషన్"గా నిర్ణయించారు. ఆయన రాత అతి చిన్నక్షరాలుగా ఉండేది. ఇప్పుడు చెప్పి రాయిద్దామని ప్రయత్నించాడు. కాని ఇక తనకు సృజనశక్తి కరువైపోయిందని గ్రహించాడు. ఇరవై ఏళ్ళ క్రితం రాయటం ప్రారంభించిన చక్రీయ నాటకాలనన్నిటిని తగల బెట్టించాడు. స్వీయచరిత్ర లాంటి "లాంగ్ డేస్ జర్నీ ఇంటూ నైట్" మాత్రం ఉంచాడు. దీన్ని తాను మరణించిన 25 ఏళ్ళ తర్వాత మాత్రమే ప్రచురించబడాలి అని కోరుకొన్నాడు. పాపం ఆయన, ఆయన వ్యాధికి బందీ అయిపోయి పదేళ్ళు అలాగే బతికాడు. పూర్తిగా శక్తి హీనుడైపోయాడు. దీనికి తోడు బ్రాంకియల్ న్యుమోనియా వచ్చి ఆధునిక అమెరికన్ నాటక మార్గదర్శి యూజీన్ ఓ నీల్ 65వ ఏట 27-11 -1953న మరణించాడు.

"టైం మాగజైన్" నీల్ గురించి రాస్తూ "ఓ నీల్ కు ముందు అమెరికాలో థియేటర్ మాత్రమే ఉంది. ఓ నీల్ వచ్చాక అందులో నాటకం వచ్చింది" అన్నది. గ్రీక్ ట్రాజెడీ అంతా విధికి తలొగ్గిన ట్రాజేడి. అదృష్టం అంతా నక్షత్ర ప్రభావం. షేక్స్పియర్ ట్రాజేడి పాత్రల ట్రాజేడి. మానవుని అదృష్టం అతని మనసుని బట్టి ఉంటుంది. బాధా చావుల వలన గ్రీకుల షేక్స్ పియరన్ ట్రాజేడిలలో ట్రాజేడి హీరోలు దేవతలను సంతృప్తి పరచి ముక్తి పొందారు. కాని ఓ నీల్ ప్రేక్షకులు మాత్రం దేవుడు, మనసు, విదిలపై అనుమానం ఉన్నవారు. నీల్ రాసినదంతా పర్సనల్ సైకాలజీ. మనిషి అదృష్టం జీన్స్‌లో హార్మోన్స్‌లో ఉంటాయని చెప్పాడు. ఆయన నాటకం "ది గ్రేట్ గాడ్ బ్రౌన్"లో ట్రాజిక్ హీరో "మనిషి ముక్కలు ముక్కలై జన్మిస్తాడు. దాన్ని అతికించి బాగుచేస్తూ జీవిస్తాడు. దేవుని దయ ఒక జిగురు మాత్రమే" అంటాడు. "మార్నింగ్ బికం ఎలెక్ట్రా" నాటకంలో గ్రీక్ లెజెండ్ క్లైమాక్స్‌ను సంప్రదాయ కేదార్సిస్‌ను చుట్టేసి ముఖ్య పాత్ర చేత "నన్ను శిక్షించటానికి ఎవరూ మిగల్లేదు నన్ను నేనే శిక్షించు కొంటాను"అని అరిపిస్తాడు. ఓ నీల్ నాటకాలు అపజయం పొందటానికి అధిక ప్రయోజనమే తప్ప, ఆయన మేధో దారిద్ర్యం మాత్రం కాదు. ఉన్నత శిఖరం నుంచి అప్పుడప్పుడు ఆయన జారిపోవటానికి కారణం అవి జనానికి అందుబాటులో లేవు అనే అభియోగాన్ని ఆయన త్రోసి పుచ్చాడు. కాని కారణం ఆయన ఆ ఉన్నత శిఖరం మీదనే ఉండి చనిపోవాలను కొన్నాడేకాని అందరూ ఎప్పుడూ ఎంతకాలం నడిచిన రోడ్డుమీదకు వచ్చి మాత్రం కాదు. "పాతా దేవుడి మరణం" సైన్స్, భౌతికత ల అపజయం ఆయన్ను కలత పెట్టాయి. నీల్ పాత్రలపై జాన్ మేసన్ "Neil' characters were not merely in conflict with one another. They were with war with the agents were not indifferent to them. This link between mortals and forces shaping their lives was the mighty concern which gave a kind of

majesty to the feeblest of his plays" అని రాశాడు. "నాటక సాహిత్యంలో ఆయన స్థానం ఏమిటో ఇంకా తేలలేదు కాని ఆయన రెచ్చగొట్టే ఆవిష్కర్త, (ప్రోవోకేటివ్ ఇన్వెంటర్). పాత సంప్రదాయాలను విచ్చిన్నం చేసినవాడు, నవీన సంప్రదాయ నిర్మాత. కాని నేటికాలంలో ఆయన చిన్న నాటకాలను మాత్రమే ఎవరో కొందరు ఎక్కడో అక్కడ ఆడుతూనే ఉన్నారు. షేక్స్ పియర్, షాల నాటకాలులాగా నీల్ పెద్ద నాటక ప్రదర్శనలు ఎక్కడా లేవు. ఆయన నాటక నైపుణ్యం ,స్థాయి ,ప్లాట్ ల స్ఫూర్తి ,పాత్రల ప్రామాణ్యత, విశ్వసనీయత లపై ఇంకా చాలా చర్చ జరగాలి.కాని ఆయన ప్రభావ ప్రాధాన్యత మాత్రం ప్రశ్నింపరానిది" అంటాడు రచయిత లూయీ అంటర్ మేయర్.

20వ శతాబ్ది అమెరికన్ నాటకాలలో నీల్ రాసిన "లాంగ్ డే స్ జర్నీ ఇంటూ నైట్" అత్యంత విలువైన నాటకమని పేరు పొందింది. అమెరికా ప్రాంతీయ భాషను నాటకాలలో వాడిన మొదటి నాటకకర్త నీల్. ఆయన పాత్రలు ఎదురు తిరుగుతాయి పోట్లాడుతాయి కాని చివరికి నిరాశ నిస్పృహలతో ప్రక్కు తప్పుకొంటాయి. ఆఫ్రికన్ అమెరికన్ నటులపై నీల్ ప్రభావం అత్యధికం. పాల్ రిలే రోబ్ సన్ బాగా ప్రేరణ పొందాడు. వారెన్ బీట్టీ తీసిన "రెడ్" సినిమాలో నీల్ పాత్రను జాక్నికల్సన్ పోషించాడు. కనెక్టికట్లో నీల్ దియేటర్ ఏర్పాటు చేశారు. ఆయన న్యు ఇంగ్లాండ్లో నివసించిన ఇల్లు జాతీయ చారిత్రిక ప్రదేశంగా గుర్తింప బడింది. ఆయన పేరుమీద చాలాకాలేజీలు సంస్థలు ఏర్పడ్డాయి. నీల్ 32 పెద్దనాటకాలను, 21 ఏకాంకికలనుతో పాటు కొన్ని ఇతర రచనలూ చేశాడు.

O'Neill' s tragic view of life was perpetuated in his relationships with the three women he married—two of whom he divorced—and with his three children. His elder son, Eugene O' Neill, Jr. (by his first wife, Kathleen Jenkins), committed suicide at 40, while his younger son, Shane (by his second wife, Agnes Boulton), drifted into a life of emotional instability. His daughter, Oona (also by Agnes Boulton), was cut out of his life when, at 18, she infuriated him by marrying Charlie Chaplin, who was O' Neill' s age. నీల్ను అమెరికన్లు బాగానే ఆరాధించారు అంతకంటే ఎక్కువగా స్వీడన్లు ఆరాధించారు. కారణం ఆయన్ను ప్రేరేపించినవాడు స్వీడన్ నాటకకర్త ఆగస్ట్ స్ట్రిండ్ బెర్గ్ అవటం కూడా ఒక కారణం. ఆయన విషాద కథలు నీల్ నాకాలలో ప్రతిధ్వనిస్తాయి. అమెరికా రంగ స్థలాన్ని ఒక సాహిత్య క్షేత్రంగా గుర్తించి నాటక రచన చేసిన మొదటి అమెరికన్ నాటక కర్త ఓ నీల్. సాహిత్యంలో నాటకానికి అమెరికాలో నోబెల్ పొందిన మొదటివాడు కూడా నీల్ ఒక్కడే. 1920లో అమెరికన్ థియేటర్ సాంస్కృతికంగా ప్రాచుర్యం పొందటానికి నీల్ ఒక ముఖ్య కారకుడు.❋



## 81. ప్రపంచ ప్రసిద్ధ నవ్వుల రేడు- చార్లీ చాప్లిన్ (1889-1977)

అనేక మంది నైతిక ప్రవర్తనను అక్షేపించినవాడు, రాజకీయంగా వివాదాస్పదుడు, ఉంటున్న దేశంనుండి బహిష్కరింప బడినవాడు, చార్లీ చాప్లిన్ అని మనం పిలిచే చార్లెస్ చాప్లిన్. విశ్వవ్యాప్త కీర్తి ప్రతిష్టలు పొందిన ఏకైక నటుడు ముఖ్యంగా హాస్య నటుడు. నవ్వు, జాలి, కరుణ, అమాయకత్వంతో వెండి తెరను ఏకచ్ఛత్రాధిపత్యంగా యేలినవాడు. ఏది చేసినా ఏది చెప్పినా అత్యంత అతిశయోక్తిగా చెప్పాడు. చార్లీ చాప్లిన్ ప్రపంచ వ్యాప్తంగా అత్యధికమైన జనాలను నవ్వించినట్లు యే ఇతర నటుడూ నవ్వించలేదు అన్నది నిర్వివాదాంశం. అంతే కాదు ఆయన ఒక తరానికి చిహ్నమై భాసించాడు. 20వ శతాబ్దిలో అందరివాడుగా అగ్రభాగాన ఉన్నాడు. మూకీచిత్రాల రాజాధిరాజు అయ్యాడు. ప్రేక్షక జనావళికి ఆరాధ్య దైవమయ్యాడు. ఆధునిక కాలంలో ఏకైక విశ్వ పౌరుడుగా గుర్తింపు పొందాడు మాక్స్ ఈస్ట్ మన్ అన్నట్లు "In the history of Great Fame. ,no chapter will be more astounding that in which this little modest actor of one role became in three short years known and loved by more men and more races ,and classes of men, than an one, even the great religious leaders ever had been before" అంతటి ప్రతిభాసంపన్నుడు, ప్రభావశీలి చాప్లిన్.

16-4-1889న లండన్‌లో చార్లెస్ స్పెన్సర్ చాప్లిన్ పుట్టాడు. చాప్లిన్ అనేది పెట్టుకొన్న పేరు అంటారు తండ్రి సంగీత భవన గాయకుడు. తండ్రి పేరు కూడా చార్లెస్ చాప్లిన్. ఫ్రెంచ్ జ్యూలకు చెందినవాడు. తర్వాత ఆంగ్ల దేశీయుడైనాడు. తల్లి హన్నా కొంత ఐరిష్ కొంత స్పెయిన్ దేశాల రక్తం ఉన్న గాయకురాలు, డాన్సర్. పూర్వపు భర్త వల్ల ముగ్గురు మగ పిల్లలను కన్నది. అందులో సిడ్నీ, చార్లీ కంటే నాలుగేళ్ళు పెద్దవాడు. మారుటి తండ్రి పేరే పెట్టుకొన్నాడు. చాప్లిన్ కుటుంబం ఎప్పుడూ ఆర్ధిక చిక్కుల్లో ఉండేది. తండ్రి పెద్ద తాగుబోతు. తల్లికి సంసారం

ఏమైపోతుందో అనే దిగులు. ఈ ఇద్దరు పిల్లల్ని బజారులో పాడించి డబ్బు సంపాదించేవాడు తండ్రి. అప్పటికి చార్లీకి మాట, ఆట, నడక రాదు. అయినా తండ్రి చెప్పినట్లు చేసేవాడు. అయిదవ ఏట తల్లికి అకస్మాత్తుగా జబ్బు చేస్తే ఆమె బదులు ప్రదర్శన ఇచ్చాడు. ఆ లేత వయసులోనే ప్రేక్షకులను విపరీతంగా ఆకర్షించి ఆతను ఉంటే తప్ప చూడరు అన్న భావన కలిగించాడు. ఏ దాది తర్వాత తలి దండ్రులు విడిపోయారు. తండ్రి తాగుడుతో చనిపోయాడు. బాధ దిగులు తల్లి స్టేజి వృత్తిని దెబ్బతీశాయి. ఏమాత్రం ఆర్ధిక స్తోమత లేక గత్యంతరం లేక ఆమె కొడుకు లిద్దర్ని చారిటి హోంలో చేర్చింది..ఆమె ఆరోగ్యం బాగయ్యాక పిల్లల్నిద్దర్ని తెచ్చుకొని కుట్టు పని చేస్తూ పోషించింది. 7వ ఏట చాప్లిన్ బాలల మ్యూజిక్ హాల్‌లో నటిస్తూ కొంత సంపాదిస్తూ తల్లికి ఆసరా అయ్యాడు. తర్వాత హీర్న్ బాయ్స్ కాలేజ్‌లో రెండేళ్ళు చదివించే ఒప్పందం కుదిరింది. ఇక్కడ చదివిన చదువే ఆయనకు మిగిలింది. మళ్ళీ యే స్కూలు గుమ్మమూ తొక్క లేక పోయాడు చాప్లిన్.

అన్న సిడ్నీ సముద్రంపై ఉద్యోగం. తమ్ముడు చాప్లిన్ స్కూల్ చదువులో ఉండగా తల్లికి మానసిక జబ్బు వచ్చింది. మూలిగే నక్కపై తాటి పండు పడ్డట్లు అయింది ఆ కుటుంబ పరిస్తితి. తల్లిని మానసిక హాస్పిటల్‌లో చేర్చారు. ఒంటరివాడైన చాప్లిన్ జీవితం వీధుల్లోనే గడిచింది. ఇతరులకు చిన్న చిన్న పనులు చేసి పెడుతూ యేవో కొన్ని పెన్నీలు సంపాదించి బతుకుతున్నాడు. తర్వాత ఎప్పుడో ఈ అనాధ కోటికి పడగ లెత్తినా కూడా డబ్బుకోసం ఇబ్బంది పడ్డాడు. దరిద్రం అంటే భయపడ్డాడు. హాలీ వుడ్ విలాసాలకు ఎప్పుడూ అర్రులు చాచలేదు. లండన్‌లో వీధుల్లో పెన్నీ లేకుండా తిరిగిన రోజులు ఎప్పుడూ ఆయన మనసులోనుంచి పోలేదు. గాఢ ముద్ర వేసి నిలిచే ఉన్నాయి.

సిడ్నీ కొంత డబ్బు సంపాదించి తిరిగి వచ్చాడు. తమ్ముడు చాప్లిన్‌ను వెదికి పట్టుకొని ఆ డబ్బుతో ఇద్దరూ కలిసి ఏదైనా చేసి తమ ప్రజ్న నిరూపించుకోవాలనుకొన్నాడు. ఒక ఏజెంట్‌గా మారి పదేళ్ళ తమ్ముడు చాప్లిన్‌కు లండన్ హిప్పోడ్రోంలో నటించే అవకాశం కల్పించాడు. కొన్నేళ్ళకే అందులో చాప్లిన్ గొప్ప నటుడుగా ఎదిగి పోయి ఇంగ్లాండ్‌లో బాలనటులలో ప్రముఖుడని పించుకొన్నాడు. తల్లిని హాస్పిటల్ నుంచి తీసుకొని వచ్చి స్వస్థత హోంలో చేర్చారు కాని ఆమె పరిస్తితి ఏమీ మెరుగు పడలేదు. కొడుకుల్ని గుర్తించ లేని పరిస్తితిలో ఉంది. స్వరం మారి కౌమార దశకు చేరిన చాప్లిన్ ఇక తాను బాల నటుడిగా కాక అనేక వినోద ప్రదర్శనలతో తన సామర్ధ్యాన్ని నిరూపించుకోవాలని అనుకొన్నాడు.. మూకీ వినోద ప్రదర్శనగ్రూప్ "ఫ్రెడ్ కార్నో కంపెని"లో చేరి అన్నా తమ్ముళ్ళు రాణించారు.

ఇంకా ఇరవై ఏళ్ళు కూడా రాకుండానే చాప్లిన్ అత్యంత ప్రఖ్యాతిగల హాస్య నటుడుగా అమెరికా వెళ్ళాడు. తానో టూరింగ్ ట్రూప్‌లో తాగుడుతో నవ్వించే వికట నటుడుగా అందర్నీ ఆకర్షించాడు. 20 ఏళ్ళకే వారానికి 50 డాలర్లు సంపాదించేవాడు. ఇతని నటనా సామర్థ్యానికి అబ్బురపడి కీ స్టోన్ ఫిలిమ్స్ వాళ్ళు వారానికి 150 డాలర్ల జీతంతో ఆహ్వానించారు. కార్నో కంపెనీతో కాంట్రాక్ట్ పూర్తికాగానే చాప్లిన్ కాలిఫోర్నియా చేరాడు. అతి వేగంగా అభివృద్ధి చెందుతున్న చిత్ర పరిశ్రమలో గొప్ప మార్పులు చోటు చేసుకొన్నాయి. మొదట్లో విజయాలు తర్వాత యూరోపియన్‌ల ఆధిపత్యంతో అమెరికన్ స్టుడియోలపై ప్రభావం చూపింది.. విడుదల తగ్గించేశారు. చిన్నసినిమాలు ఫీచర్ సినిమాలపై దృష్టి పెట్టారు. సిసిల్ డిమిల్లీ, సాన్ గోల్డ్విన్, జెస్సి లాస్కిమొదలైన వాళ్ళు "స్క్వవుమన్" మొదలైన నాటకాలను సినిమాలుగా మార్చే ప్రయత్నం చేశారు. గ్రిఫ్ఫిత్ సెమి డాక్యుమెంటరి డ్రామా "ది బర్త్ ఆఫ్ యే నేషన్"ను తెరకెక్కించారు. కాని కామెడి పై ఇవేవీ ప్రభావం చూపలేక పోయాయి. ఒకటి రెండు రీళ్ళతో వారానికి ఒకట తీయటం మొదలు పెట్టారు. మాక్ సేన్నేట్ అనే హాస్య నటుడు కీ స్టోన్ అధినేత గ్రిఫ్ఫిత్ నుండి మూవీ టెక్నిక్‌ను నేర్చుకొన్నారు. పిచ్చపిచ్చగా ఇష్టం వచ్చినట్లు అసంబద్ధంగా, తలా తోకా లేకుండా తీసి పారేశాడు హాస్యం పేరుతో అపహాస్యం సృష్టించాడు. సేన్నేట్ చాప్లిన్‌లోని ఒరిజినాలిటిని గుర్తించి, అతనిలాగా నవ్వించ గలవారెవ్వరూ లేరనే నిర్ణయానికి వచ్చాడు.

చార్లీ చాప్లిన్ వేసుకొనే వికారపు డ్రెస్‌కు ఒక ఫ్లాష్ బాక్ ఉంది. సాన్నేట్ చాప్లిన్‌ను లొకేషన్‌కు నవ్వు పుట్టించే డ్రెస్ వేసుకొని రమ్మన్నాడు. హడావిడిలో చేతికి ఏది అందుబాటులో ఉంటే దాన్నే ధరించి హడావిడిగా వెళ్ళాడు చాప్లిన్. ఆనాడు లావుగా ఉండే కమెడియన్ వేసుకొనే బాగీ పాంటు, మరో హాస్యగాడు వేసే కాళ్ళకు పెద్దసైజు ఉన్న బూట్లు, తలకంటే చిన్నదైన మాసిన డేర్బి, బక్కోడే అయినా బాగా బిగుతుగా ఉన్న కోటు, కొంకె లాంటి పేము కర్రా, చిన్న టూత్ బ్రష్ మీసంతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఈ డ్రెస్ కోడ్ వేషధారణపై దియోదర్ హాఫ్ రాస్తూ "personifies shabby gentility --the fallen aristocrat at grips with poverty. The cane is a symbol of attempted dignity, the pert mustache a sign of vanity" అని విశ్లేషించాడు. ఆకర్షణీయ, తరచుగా కనిపించే విషాద ఆకృతి ఇంకా రావాలి. మొదటి ఏడాదిలో నటించిన 35 సినిమాలలో ఆయన పాత్ర ఎందుకూ పనికిరాని అసమర్థుడు, జాలి లేని వాడు గా కనిపించినా గిలిగింతలు పెట్టే హాస్యంతో కడుపుబ్బా నవ్వించాడు. కేవలం 13 వారాల తర్వాత చాప్లిన్‌నే స్వయంగా రచన చేసి, దర్శకత్వం కూడా చేయమని కోరారు. కీ స్టోన్ కాంట్రాక్ట్ 12 నెలలు

హాయిగా గడిచి పోయింది. సంవత్సరం పూర్తికాగానే సేన్నేట్ వారానికి నాలుగు వందల డాలర్లు ఇస్తానని చెప్పాడు కాని పోటీ సంస్థ ఎస్సనే కంపెని వారానికి 1250 డాలర్ల స్టైపెండ్ అంటే పది రెట్లు ఎక్కువ ఇస్తానని లాక్కుపోయింది. ఈ కంపెనీలో ఒక ఏదాదిపని చేయగానే చాప్లిన్ విలువ మళ్ళీ పది రెట్లు పెరిగింది. ఇప్పుడే మ్యూచువల్ కంపెని వారానికి పది వేల డాలర్లు, సంవత్సరానికి లక్షా యాభై వేల డాలర్ల బోనస్ ఆఫర్‌తో తీసుకొన్నది. అతికష్టం మీద చాప్లిన్‌ను ఒప్పించి ఆయన లాస్ ఏంజెల్స్‌లో మురికి కూపం ప్రదేశంలో మకామున్న చిన్న హోటల్ నుంచి మంచి ప్రదేశానికి మార్పించింది.

ఎస్సానేలో ఉన్న ఏడాదే చాప్లిన్ “the immortal and world famous --character of the tramp --the tragic, comic vagabond so perfectly symbolizing the universal underdog --came into being --possibly the most significant artistic arch type of this century” అనిపించాడు మ్యూచువల్ ఫిలిమ్స్‌లో ఈ పాత్రను 12 సినిమాలలో పోషించి చిరంజీవిని చేశాడు. కథను బట్టి తన పాత్రకు వివిధ కొణాలో న్యాయం చేసి మూకాభినయంతో అమరునిగా ఆ పాత్రను నిలిపాడు. 1916 –17 యుద్ధంలో గాయపడ్డ లక్షలాది ప్రపంచ జనాలకు ఈ పాత్ర ద్వారా ఆనందాన్ని పంచి తానూ విపరీతంగా అభిమానం పొందాడు. “ఫ్లోర్ వాకర్”, ది కౌంట్”, “ది ఇమ్మిగ్రంట్”, ఈజీ స్ట్రీట్ “సినిమాలు క్లాసిక్స్.. ప్రింట్‌లు బాగా లేకపోయినా ఇప్పటికీ చాప్లిన్ ఫెస్టివల్స్‌లో ప్రదర్శిస్తూనే ఉన్నారు. ఆయనంటే పడని వాళ్ళు మాత్రం ఆయన అమెరికాలో బాగా డబ్బు దండు కొన్నప్పటికీ, అక్కడ పౌరుడుగా నమోదుకాలేదని కనీసం పేరు రాయించుకొనే ప్రయత్నమూ చేయలేదని అంటారు. పని తప్పించుకొనే స్లాకర్ అని ఇంగ్లాండ్ వాళ్ళు అంటారు. ఆయన .ఇంకా బ్రిటిష్ పౌరసత్వాన్ని ఉంచుకొన్నాడు .అసలు విషయం ఆయన ఆర్మీ ఫిజికల్ రిక్వైర్ మెంట్‌ను పాస్ కాలేకపోయాడు. రెండు నెలల బాండ్ సెల్లింగ్ వినోదం ఆయన విమర్శకులను శాంత పరచలేక పోయింది.

ఇదే సమయంలో ఫస్ట్ నేషనల్‌తో మిలియన్ డాలర్లు పది హేను వేల డాలర్ల బోనస్ కాంట్రాక్ట్‌పై సంతకం చేశాడు చాప్లిన్. ఇప్పుడే తానే నిర్మాత, తనదే స్వంత స్టూడియో లాభాలలో వాటా కూడా.. ఈ కాలంలో “షోల్డర్ ఆర్మ్స్”, “ది కిడ్” వంటి అత్యంత ప్రముఖ సినిమాలతో సెలిబ్రిటి అయ్యాడు. ది కిడ్‌లో “జాకీ కూగాన్” అనే కుర్రనటుడిని పరిచయం చేసి అతనితో అద్భుత నటన రాబట్టాడు. 30వ ఏడు వచ్చేదాకా చాప్లిన్ జీవితం ప్రశాంతంగా, కుంభ కోణాలు లేనివాడుగా గడిచిపోయింది. దేనిపైనా సీరియస్‌గా జోక్యం లేనివాడుగానే ఉన్నాడు. ఎడ్నాపర్వియన్స్‌ను దేశస్థాయిలో నటిగా

గుర్తింపు తెప్పించాడు. ఆమెను వివాహం చేసుకొంటాడని అందరూ అనుకొన్నారు. కాని మనవాడు అందం, డబ్బు, కీర్తి ఉన్నా బ్రహ్మచారిగానే ఉండిపోయాడు. కాని పదహారేళ్ళ పడుచు, నాటక సినీ నటి మిల్డ్రెడ్ హారిస్ పొగడ్తలకు ఆకర్షణకు లొంగిపోయాడు. అకస్మాత్తుగా 23-10-1918న ఇద్దరూ పెళ్లి చేసుకొన్నారు. పిల్ల పుట్టాక మూడు రోజులే కాపురం చేశారు. పడుచు పెళ్ళాం నుంచి దూరమై ఒకరిపై ఒకరు ఆరోపణలు ప్రత్యారోపణలతో, డబ్బు వ్యవహారంలో పట్టుదలలు పోయి చివరికి విడాకులు పొందారు. క్రమంగా ఎమోషనల్‌గా అస్థిర చిత్తంతో ఉంటున్నాడు. అహంకారం పెరిగింది. తాను సాధించిన దానికి ప్రత్యేక విలువలు కావాలని కోరుకోనేవాడు. ఆయన ప్రేక్షకులు ఎప్పుడూ ఆయన్ను నిరాశ పరచలేదు. 1921లో పేపర్ వాళ్ళ ఊహాగానాలకు దూరంగానూ తగ్గిన తన సృజనకు పదును పెట్టుకోవటానికి యూరప్ వెళ్ళాడు. అక్కడ ఆయనకు "తిరిగొచ్చిన హీరో"గా అపూర్వ స్వాగతం పలికారు.

చాప్లిన్ వింత స్వభావం చెదురుమదురు బాధ్యతా రాహిత్య పరంపరలు అన్నీ కలిసి ఆయన స్వీయ జీవితాన్ని కష్టాల పాలు చేశాయి. యాభైలలో ఆయన శృంగారం వివాహ జీవితం అడ్డూ ఆపూ లేకుండా గడిచింది. 1924లో తరచుగా లీటా గ్రే అనే లోలితా మెక్ ముర్రేతో కనిపించేవాడు. ఈమె కూడా పాత పడుచు పెళ్ళాంలాగా 16 ఏళ్ళ కన్నె పిల్లే. మళ్ళీ అకస్మాత్తు పెళ్లి 1924లో, అయి పొసగని సంసారమై చార్లెస్ స్పెన్సర్ జూనియర్‌కు తండ్రి అయి మరుసటి ఏడాది రెండోకొడుకు సిడ్నీ ఎర్లె పుట్టాకి పేపర్లు మళ్ళీ వీళ్ళిద్దరి మధ్య గొడవలున్నాయని గాసిప్పులు ప్రచారం చేశాయి. ఇదంతా అబద్ధం అని బుకాయించారు ఇద్దరూ. తర్వాత లీటా తనను భర్త లైంగికంగా వేధిస్తున్నాడని బజారున పడితే చాప్లిన్ అసలామె కుటుంబమే మంచిది కాదని తనను అమాయకంగా ముగ్గులో దింపారని తన నుంచి భారీగా డబ్బు రాబట్టు కోవటానికి చేసిన కుట్ర, ద్రోహమని ఆరోపణ చేశాడు. 42 పేజీల ఆరోపణ పత్రాన్ని ఆమె విడుదల చేస్తే వేలాది మంది డబ్బులిచ్చి కొనుక్కున్నారు. ఆర్టిస్ట్ ప్రైవేట్ జీవితాన్ని వీధిలోకి లాగ కూడదని, దాన్ని నటనతో ముడి పెట్టరాదనీ ఆక్రోశించాడు. ఆడవాళ్ళ క్లబ్బులు అన్నీ చాప్లిన్‌కు వ్యతిరేకంగా మోహరించాయి. చివరికి అతని సినిమాలను కొన్నిటిని బాన్ చేశారు. ఈ ఒత్తిడిని చాప్లిన్ తట్టు కోలేక పోయాడు. భంగపడిన చాప్లిన్ ఆమెతో ఆరు లక్షల డాలర్లకు, ఇద్దరు పిల్లలపోషణకు ట్రస్ట్ పేరిట రెండు లక్షల డాలర్లకు రాజీ కుదుర్చుకొన్నాడు. అటార్నీ ఫీజు కూడా కలుపుకొంటే "ఈసున్నం" మొత్తం ఒక మిలియన్ డాలర్లకు దేకింది 'లల-లీటా'కు మాంచి జాక్ పాట్ పాక్ట్ కుదిరి చాప్లిన్ జేబుకు పెద్ద బొక్కపడింది. ఈ పెళ్లి పెటాకులైన లీటా ఆ తర్వాత మరో రెండు పెళ్ళిళ్ళు చేసుకొని లాభ పడింది..

ప్రపంచం తీరును ఇప్పుడిప్పుడే గమనిస్తున్నాడు చాప్లిన్. బంగారు బాతుగా ఆయన్ను భావించి ఎవరో ఒక అమ్మాయితో సంబంధం ఉందని పుకారు పుట్టించటం ఆ రొంపిలోంచి బయట పడటానికి డబ్బుతో పరిష్కరించు కోవటం పరిపాటై పోయింది పాపం. పోలిష్ నటి పోలా నేగ్రి, కలైర్ విండ్సర్‌లతో జతకట్టాడని ఆరోపణ. క్లేర్ షెరిడాన్ అనే శిల్పిణితో కలాపం సాగిస్తున్నాడనీ చాటింపు. పాలెట్టి గొడ్దార్డ్ అనుబంధంతో ఆయనకు ఊరట కలిగింది. ఎనిమిదేళ్ళు దీన్ని రహస్యంగా ఉంచాడు. ఇద్దరూ ఎప్పుడు ఎక్కడ పెళ్లి చేసుకొన్నారో అంతు చిక్కలేదు. తర్వాత ఇద్దరూ బహిరంగంగానే ఉన్నారు. 1942లో ఇద్దరూ విడిపోయాక, విడాకులు పొందాక మాత్రమే వాళ్ళిద్దరి పెళ్లి చైనాలోని కాంటన్‌లో 1936లో జరిగిందని వెల్లడించాడు.

మరొక విచిత్రమైన కేసులో ప్రతివాదిగా మారాడు చాప్లిన్. జోన్ బెర్రీ అనే స్టేజి సహాయ నటి తన బిడ్డకు చాప్లిన్ తండ్రి అని కోర్టుకెక్కింది. తర్వాత కొంతకాలాని చాప్లిన్ ఆమెతో కాంట్రాక్ట్ కుదుర్చుకొని జర్మన్ డైరెక్టర్ మాక్స్ రీన్ హార్ట్ దగ్గరకు పంపాడని తెలిసింది. ఒక ఏడాదిలోనే ఆమె విపరీతమైన కోరికలకు విసిగిపోయాడు. ఆమె నెమ్మదిగా చాప్లిన్ ఇంట్లో ప్రవేశించి చంపేస్తానని. ఆత్మ హత్య చేసుకొంటానని బెదిరించింది. ఆమె దేశదిమ్మరితనానికి అరెస్ట్ అయింది. ఆమెకు పిల్లాడు పుట్టాక రక్త పరీక్షలలో ఆమె ఆరోపించినట్లు చాప్లిన్ కొడుకు కాదని రుజువైంది. కాని ఆమెతో ఆయనకున్న సాన్నిహిత్యం వలన కోర్టు ఆ పిల్లాడి పోషణ భారం చాప్లిన్ దేనని తీర్పు ఇచ్చింది.

బారీ కేసు మధ్యలో ఉండగా చాప్లిన్ నాలుగో పెళ్లి అభిమానులను కలవర పరచింది. నాలుగో పెళ్లి కూతురూ బాగా చిన్న పిల్లే. ఆమె ఎవరో కాదు ప్రముఖ నాటకకర్త యూజీన్ ఓ నీల్ 18 ఏళ్ళ కూతురు. ఈ పెళ్లిని తండ్రి ఒప్పుకోలేదు. పైగా తనకూ కూతురుకు సంబంధమే లేదు పొమ్మన్నాడు. అల్లుడు చాప్లిన్ మామ నీల్ వయసువాడు. 1943లో జూన్ నాలుగున జరిగిన పెళ్లి నాటికి చాప్లిన్ వయసు 54, కొత్త పెళ్లి కూతురు ఊనా వయసు కేవలం 18 ఏళ్ళు. ఆమెలో చాప్లిన్ మంచి జీవిత భాగస్వామిని చూడటమే కాక దాంపత్య సౌఖ్యాన్ని బాగా అనుభవించాడు. ఈ పెళ్లి తర్వాత ఆయనపై స్కాండల్స్ ఆగిపోయాయి. ఇప్పటిదాకా పడిన అపనిందల సుడి గుండాల నుంచి బయటపడి సిటిజన్ షిప్ రాని లోటు దీనితో తీరి, సుఖమయ ఆనందమయ జీవితం గడుపుతున్నాడు. ఈ ఇద్దరికి ఒక కొడుకు యూరప్‌లో ఉండగా పుట్టాడు.

వివాదాలను శత్రువులను చాప్లిన్ సృష్టించు కొంటున్నాడు తన ప్రవర్తన, పనికి రాని ఎమోషన్, రాజకీయాలతో. పూర్వపు పనులన్నీ గొప్ప కీర్తి ప్రతిష్టలు తెచ్చిపెట్టాయి. లండన్ వీధుల్లో గూడులేక కూడు లేక తిరిగిన రోజుల్ని మర్చిపోలేదు. 1922 తర్వాత

ఈ అథోజగత్ సహోదరుల గురించి డాక్యుమెంటరీలు తీశాడు. ఇందులో మొదటిది "వుమెన్ ఆఫ్ పారిస్" ఇందులో తాను కనిపించడు కాని ఇతివృత్తం బలీయంగా దర్శనమిస్తుంది. "ది గోల్డ్ రష్"ను స్వయంగా దర్శకత్వం వహించాడు. ఇది ఆయన మేగ్నం ఓపస్ అన్నారు. అందులో విషాదాన్ని హాస్యంతో జోడించాడు. ఈ కథను ఎందుకూ పనికిరాని ఒక క్లౌన్‌తో అసంబధంగా వ్యంగ్య భరితంగా సస్పెన్స్‌తో చెప్పించాడు.. "సిటి లైట్స్" అన్ని లెక్కల్నీ తారుమారు చేసింది. మాట్లాడే సినిమాలు తీశాక మూడేళ్ళకు మళ్ళీ మూకీలు తీసి అయిదు మిలియన్ డాలర్లు లాభం పొందాడు. మళ్ళీ సంప్రదాయాన్ని మార్చి హాస్యానికి ట్రాజెడి కలిపాడు. సిటీ లైట్స్‌లో ఒక గుడ్డి పిల్ల ఒక తాగుబోతు, డిప్రెషన్‌తో ఉన్న మిలియనీర్ దగ్గరుండే ఒక సంచారిని ప్రేమిస్తుంది. ఆమెకు చూపు తెప్పించటం కోసం అతడు ప్రయత్నించి సాధించి ఆమెకు చూపు రాగానే ఆమెను కోల్పోతాడు. ముగింపు సందిగ్ధంగా, తప్పనిసరి అనిపిస్తుంది. తీవ్రమైన స్వీయ సానుభూతి ఎక్కడా తగ్గకుండా తర్వాత వచ్చే కామిక్ సీన్లు నిలబెట్టాయి.

ఇప్పుడు చాప్లిన్ అనేక రకాల సృజనశీలి అయ్యాడు.. సీనరిస్ట్, డైరెక్టర్, నటుడూగా ఉన్నాడు. సంగీత దర్శకుడూ అయ్యాడు. సిటి లైట్స్ తర్వాత వాటికి కదా సంగీతం ఆయనే కూర్చాడు. సీరియస్ విషయం డామినేట్ చేయకుండా ఆచార వ్యవహారాలపై వ్యంగ్య విమర్శలతో తీశాడు. మళ్ళీ "మోడరన్ టైమ్స్" మూకీ తీశాడు.. ఇది పారిశ్రామిక వేత్తల మితి మీరిన వస్తు ఉత్పత్తి, విపరీత చేష్టలపై గొప్ప సెటైర్ లలది "గ్రేట్ డిక్టేటర్"లో హిట్లర్ వేషం ధరించి అతని ఆయుధ పిచ్చిని, క్రౌర్యాన్ని ఎండగట్టాడు. జ్యూయిష్ బార్బర్‌గా తాను తీసిన అన్ని సినిమాలకు భిన్నంగా మొదటిసారి నోరు విప్పి మాట్లాడాడు. కొందరు చాలా ఎక్కువగా వాగాడు అన్నారు. చివరికి వచ్చే మోనోలాగ్‌ను తీవ్రంగా విమర్శించారు. క్లౌన్ క్లౌన్‌గానే ఉండాలి కాని ఈ హిత బోధ ఏమిటి అన్నారు. దీనికి సమాధానంగా చాప్లిన్ "I am a human being who wants to see this country a real democracy ,free from the infernal regimentation which is crawling over the rest of the world" అని సమాధానం చెప్పి నోరు మూయించాడు.

తరువాతి సంవత్సరాలలో రాజకీయాలపై మాట్లాడి వివాదాలకు కేంద్రమయ్యాడు. ఆయన సెక్సువల్ స్కాన్డల్స్‌కు వచ్చినంత ప్రచారం దీనికీ వచ్చింది. ఫాసిజం ఓడిపోయి 1942లో రెండవ కూటమి ఏర్పడాలని చెప్పాడు. అప్పుడు హెన్రి వాలెస్ వామపక్షంలో ఉన్నాడు. రష్యాతో అవగాహనకు రావాలని సూచించాడు. చాప్లిన్‌ను కమ్యూనిస్ట్‌గానో లేక దాని సానుభూతి పరుడిగానో భావించారు. అసలే సుమారు ఇరవై ఏళ్ళనుంచి అమెరికాలో ఉంటూ డబ్బు మేటలు వేస్తూ ఉన్నా పౌరసత్వం తీసుకోక పోవటంతో ఈ

అనుమానం మరీఎక్కువైంది. దీనికి ఆయన సమాధానం "నేను అంతర్జాతీయ వాదిని, అన్ని దేశాలకూ చెందిన వాడిని. అందుకే నేను యే దేశంలోనూ పౌరసత్వం తీసుకోలేదు" అన్నాడు. "మాన్సూర్ వేర్డాక్స్" ప్రదర్శించినపుడు చిన్న ట్రాంప్ వేషం నుంచి బ్యాంక్ క్లెర్క్ వేషంలోకి మారి సుఖంగా బతకాలంటే తాను ధనం కూడబెట్టి, దానితో కుటుంబాన్ని పోషించుకోవాలని భావించి సంపన్నులైన ఆడవాళ్ళను పెళ్లి చేసుకొంటూ వాళ్ళను హత్య చేస్తూ జీవించేవాడి కథాను చెప్పాడు. మొదట దీనికి "లేడీ కిల్లర్" పేరు పెట్టాడు. ఈ సినిమాను బడా వ్యాపారస్తులపై క్రూర పారబుల్. ఇందులోని ముఖ్యపాత్ర ఆనాటి కాలంలోని భావాలను వెల్లడించిందని, సంక్షోభం నుండి తనలాంటి వాళ్ళు పుట్టారని, డిప్రెషన్ యొక్క మానసిక రుగ్మతకు అతడు ఒక ప్రత్యేక ఉదాహరణ అని చాప్లిన్ చెప్పాడు. విధానం, హత్య, మార్బిడ్‌గా ఉంది. దీని పరిష్కారం తర్క బద్ధంగా కామిక్‌గా ఉంది. "ఈ సినిమా చాప్లిన్ సుదీర్ఘ వృత్తిలో ఒక లాండ్ మార్క్ మాత్రమే కాక అమెరికన్ సినీ పరిశ్రమలో పెద్ద ముందడుగు అని జేమ్స్ ఆగీ అన్నాడు. దీనితో చాలామంది ఏకీభవించలేదు. సినిమా చాలా సింబాలిక్‌గా ఉంది, అర్థం కావటం కష్టం బాడ్ టేస్ట్‌కు ఉదాహరణ అన్నారు. కేథలిక్ వార్ వెటరన్స్ పికెట్ చేశారు. చాలా సినిమాహాళ్ళు దీన్ని ప్రదర్శించటానికి నిరాకరించారు. కాని యూరప్‌లో దీనికి అనేక అవార్డులు వచ్చాయి. ఆర్థికంగా ఆయనకు పెద్ద బొక్క. ఇదే చాప్లిన్ జీవితంలో మొదటి ఫైల్యూర్. ఇంకేముంది చాప్లిన్ పని ఖాళీ అన్నారు.

"మోషన్ పిక్చర్ల వల్ల అభివృద్ధి చెందిన జీనియస్" అని బెర్నార్డ్ షా మెచ్చిన చాప్లిన్ నిరాశ పడకుండా మళ్ళీ శక్తిని ఉత్తేజాన్ని నింపుకొని కొత్త పాత్రలో "లైం లైట్"లో 63వ ఏట ప్రకాశించాడు. రచన నటన దర్శకత్వంతోపాటు బాలెట్ కూడా చేశాడు. "ఈ పాత్ర ఒక రకంగా ఆయన జీవిత చరిత్ర. ఇందులో ఒక కమెడియన్ మూల జీవిత ఫిలాసఫీ జీవితం ప్రేమ, ప్రేక్షకులు, హాస్యం మొదలైన వాటిపై అభిప్రాయాలు, భావోద్విగ్న అనుభవాలుతో, ఐడియాలతో నిండిన సినిమా" అని "ది సాటర్ డే రివ్యు" రాసింది.. "ఇది మానవత్వంపై సినిమాటిక్ కవిత్వం" అన్నాడు ఓటిస్. ఎల్ గుర్నేం–"న్యు యార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్"లో. ఆయనే "if it does not scan mathematically, it touches the heart with dramatic images of longing" అనీ చెప్పాడు. మిగిలినవారు అహంకారంతో చేసిన మాటల అల్లిక, పాత పద్ధతి, పాత సెంటిమెంట్‌లతో ముంచేశాడు అన్నారు. చాప్లిన్ అపజయాన్ని జయంగా మార్చి నిలబడ్డాడు పెద్ద హీరోలాగా.

అందరూ ప్రేమించే చాప్లిన్‌కు, ప్రజలు అనుమానించిన చాప్లిన్‌కు తేడా ఉంది. నిర్బంధ సమాజంలో వ్యక్తిత్వాన్ని బెదిరిస్తున్న శక్తులను ఇది వరకు బయటపెడితే,

ఇప్పుడు సీరియస్‌గా ఉన్న ఆలోచనా పరుడిగా కనిపించాడు. ఇప్పుడూ జనం ఆయన్ను అనుసరించారు, మాట విన్నారు. "my adversaries was suffering from delusion of intelligence" అని చెప్పుకొన్నాడు. లైం లైట్ విడుదలయ్యాక కుటుంబంతో దూర దేశాల టూర్‌కు వెళ్ళాడు. షిప్ యెక్క బోతుండగా అమెరికన్ అటార్నీ జనరల్ వచ్చి మళ్ళీ అమెరికాలో కాలుపెట్ట వద్దని, ఆయన రాజకీయ నైతిక జీవితంపై నేర పరిశోధన జరుపుతున్నామని తెలియజేశాడు. దీనిపై ప్రపంచ వ్యాప్తంగా తీవ్ర నిరసన వెల్లువెత్తింది. 1953 ఏప్రిల్ 17న స్విట్జర్లాండ్ నుంచి తాను అయిష్టంగానే తన నిజాయితీపై బురదజల్లే ప్రయత్నం చేస్తున్న అమెరికా అధికారుల తీరుపై ఏవగింపుతో అమెరికా నివాసాన్ని వదిలేస్తున్నానని చెప్పాడు. రేడియో ద్వారా ప్రపంచమంతా ప్రసారమైన ఈ స్టేట్ మంట్‌పై ఎల్మెర్ డేవిస్ వ్యాఖ్యానిస్తూ "ఇక్కడ నలభై ఏళ్ళకు పైగా నివసించిన నటుడు బాగా లబ్ధిపొంది, ఈ దేశాన్ని వదిలేస్తానంటే మేము భయపడాల్సిన అవసరం లేదు. అటార్నీ మెక్ గ్రానీ చర్యను మరిచి పోవచ్చేమోకాని అమెరికాలో ఎదిగి, ప్రఖ్యాతుడై అమెరికాకు పేరుప్రతిష్టలు నటనతో తెచ్చిన మహానటుడు చార్లీ చాప్లిన్‌ను మాత్రం మర్చి పోలేము" అన్నాడు.

తీర్పు ఎలా వచ్చినా చాప్లిన్ ఆ పేజీలలో ప్రత్యేక స్థానం పొందుతాడు. తన సృజనతో కొత్త మాధ్యమంలో ప్రజా సమస్యలను అందరి దృష్టికి తెచ్చిన గొప్పనటుడు దర్శకుడు చాప్లిన్ అన్నది నిర్వివాదం. రాజకీయ కారణంతో కూడా సెలిబ్రెటీ అయ్యాడు. చర్చిల్, రూజ్ వెల్ట్, హిట్లర్‌లతో సమాన స్థాయి పొందాదు. "ది గ్రేట్ గాడ్ పాన్"లో రాబర్ట్ పెయిన్". ChaplinÑ s descent from the goat footed demi-god through Deburuau, Grimaldi and the great clowns of the past to his position as the greatest jester of his day --half God half man and always vagabond, brother to St. Francis and the moon" అని గొప్పగా విశ్లేషించి మెచ్చాడు. చాప్లిన్ చిరుతప్పుల్ని మర్చిపోతే, సినీ తెర మీద ఆయన నీడ జీవంతో కదులుతూ, మనకు విషయ ప్రచారం చేస్తూ, మనకు తెలియని ఇంకా పుట్టని ఎన్నో ప్రేమ, ఆశ మానవత్వాల విషయాలను తవ్వి పోస్తూనే ఉంటాడు.

చాప్లిన్ కోటబుల్ కోట్స్ చాలా ఆలోచనాత్మకంగా ఉంటాయి. కొన్ని చూద్దాం– "life is a tragedy when seen in closeup but a comedy in long shot"

2. A day without laughter is a day wasted

3. we think too much and feel too little

In 1998, the film critic Andrew Sarris called Chaplin "arguably the single most important artist produced by the cinema, cer-

tainly its most extraordinary performer and probably still its most universal icon". [414] He is described by the British Film Institute as "a towering figure in world culture", [415] and was included in Time magazine' s list of the "100 Most Important People of the 20th Century" for the "laughter [he brought] to millions" and because he "more or less invented global recognizability and helped turn an industry into an art".[416]

As a filmmaker, Chaplin is considered a pioneer and one of the most influential figures of the early twentieth century. [1] He is often credited as one of the medium', first artists. [422] Film historian Mark Cousins has written that Chaplin "changed not only the imagery of cinema, but also its sociology and grammar" and claims that Chaplin was as important to the development of comedy as a genre as D.W. Griffith was to drama. [423]He was the first to popularise feature-length comedy and to slow down the pace of action, adding pathos and subtlety to it.[424][425] Although his work is mostly classified as slapstick, ChaplinÑ s drama A Woman of Paris (1923) was a major influence on Ernst Lubitsch 's film The Marriage Circle (1924) and thus played a part in the development of"sophisticated comedy". [426] According to David Robinson, Chaplin' s innovations were "rapidly assimilated to become part of the common practice of film craft. "427] Filmmakers who cited Chaplin as an influence include Federico Fellini (who called Chaplin "a sort of Adam, from whom we are all descended"), [339] Jacques Tati ("Without him I would never have made a film"), [339] René Clair ("He inspired practically every filmmaker"), [338] Michael Powell, [428] Billy Wilder, [429] Vittorio De Sica, [430] and Richard Attenborough. [431] Russian filmmaker Andrei Tarkovsky praised Chaplin as "the only person to have gone down into cinematic history without any shadow of a doubt. The films he left behind can never grow old.

"[432]

In the 21st century, several of Chaplin' s films are still regarded as classics and among the greatest ever made. The 2012 Sight & Sound poll, which compiles "top ten" ballots from film critics and directors to determine each group's most acclaimed films, saw City Lights rank among the critics' top 50, Modern Times inside the top 100, and The Great Dictatorand The Gold Rush placed in the top 250. [437] The top 100 films as voted on by directors included Modern Times at number 22, City Lights at number 30, and The Gold Rush at number 91. [438] Every one of Chaplin' s features received a vote. [439] In 2007, the American Film Institute named City Lights the 11th greatest American film of all time, while The Gold Rush and Modern Times again ranked in the top 100.[440] Books about Chaplin continue to be published regularly, and he is a popular subject for media scholars and film archivists. [441] Many of Chaplin' s film have had a DVD and Blu-Ray release. [44

చాప్లిన్ స్మృతి చిహ్నాలు ఎన్నో వెలిశాయి ఆయన పుట్టిన లండన్‌లో ట్రాంప్ ఆకారపు విగ్రహాన్ని జాన్ డబుల్ డే శిల్పించగా 1981లో ఆవిష్కరించారు. ఒక వీధికి "చార్లీ చాప్లిన్ వాక్" అని పెరేట్టారు. స్విట్జర్లాండ్‌లోని ఆయన స్వగృహాన్ని నేషనల్ మ్యూజియంగా మార్చారు. ప్లానెట్ 3623కు చాప్లిన్ పేరు పెట్టారు. పారిస్‌లో ఆయన పేర ఆఫీసుంది. జీవితం చివరి రోజుల్లో ఎన్నో అవార్డులు రివార్డ్‌లు అందుకొన్నాడు. లండన్‌లో న్యుయియర్ ఆనర్ నైట్ హుడ్ ఆనర్, ఆక్స్‌ఫర్డ్ నుంచి డి.లిట్. ఫ్రెంచ్ ప్రభుత్వం నుండి లీజియన్ ఆనర్, వెనిస్ ఫిలిం ఫెస్టివల్‌లో గోల్డెన్ లయన్ ఆనర్, జీవిత సాఫల్య పురస్కారం, మూడు అకాడెమి అవార్డులు, బెస్ట్ స్కోర్ అవార్డ్ బెస్ట్ యాక్టర్ బెస్ట్ స్క్రీన్ ప్లే బెస్ట్ పిక్చర్ బెస్ట్ డైరెక్షన్‌లకు అవార్డులు, కాక ఇంకా ఎన్నో పొందాడు. ఆయన సినిమాలు ఆరింటిని – ది ఇమ్మిగ్రేషన్, ది కిడ్, సిటి లైట్, గోల్డ్ రష్ మోడరన్ టైమ్స్, ది గ్రేట్ డిక్టేటర్‌లను, నేషనల్ ఫిలిం రిజిస్ట్రి"లో భద్ర పరచారు. చాప్లిన్ డైరెక్ట్ చేసినవి 11 సినిమాలు.❁



## 82. బలమున్నవాడిదే రాజ్యం అన్న జర్మనీ నియంత అడాల్ఫ్ హిట్లర్ (1889-1945)

స్కూల్‌లో చదవని ఆస్ట్రియన్ అడాల్ఫ్ హిట్లర్ వియన్నా మురికి వాడలవాడు, చెదిరి పోయిన జర్మనీని క్రూర ప్రపంచ శక్తిగా ఉద్ధరించి అసలే జబ్బుతో ఉన్న యూరప్‌ను కోలుకోలేని సంక్షోభంలోకి నెట్టినవాడు. 20-4-1889 న ఆస్ట్రియా బవేరియా దేశ సరిహద్దులో ఉన్న బ్రానువా అనే చిన్నపట్నంలో పుట్టాడు. తండ్రి ఆలోయిస్ అనే ఒక రైతు కన్నెపిల్ల మేరియా శికిల్ గ్రుబర్‌కు అక్రమ సంతానంగా పుట్టినవాడు. తలి ్లపేరును 30వ ఏడాదివరకు కొనసాగించి తర్వాత హిట్లర్‌గా మార్చుకొన్నాడు. హిట్లర్ లేక హీడ్లర్ లేక హీట్లర్ కుటుంబం తరతరాలుగా సంచారులే. కాని హిట్లర్ తల్లి వైపు వాళ్ళు పోల్జులు తరతరాలుగా పొలం కూలీలు. హిట్లర్ తండ్రి చిన్న ఆఫీసర్. మూడుసార్లు పెళ్లి చేసుకొన్నాడు. మొదటి పెళ్ళాం అతనికంటే 14 ఏళ్ళు పెద్దది. పిల్లలు లేరు. 16 ఏళ్ళ తర్వాత పెళ్లి రద్దు చేసుకొని ఒక హోటల్‌లో వంట చేసే అమ్మాయిని పెళ్లి చేసుకొని ఒక కొడుకు కు తండ్రి అయ్యాడు. ఏడాది తర్వాత ఆమె టి.బి.వచ్చి చనిపోయింది. ఆమె చనిపోయిన ఆరు నెలల తర్వాత సెకండ్ కజిన్‌ను తనకంటే 23 ఏళ్ళ చిన్నదైన అమ్మాయిని ముచ్చటగా మూడో పెళ్లి చేసుకొని 5 గురు పిల్లలను కన్నాడు. ఇందులో ముగ్గురు బాల్యంలోనే చనిపోయారు. మూడో పెళ్లికి మూడో కొడుకే అడాల్ఫ్ హిట్లర్. తండ్రి రెండవ పెళ్ళాం హాఫ్ సిస్టర్ ఏంజెలా రాబాల్‌తో మాత్రమే హిట్లర్‌కు అనుబంధం ఉండేది. ఆమె కూతురు జీలితో విచిత్రంగా విషాదంగా ప్రేమలో పడ్డాడు హిట్లర్.

ఆరవ ఏట స్కూల్‌లో చేరి ఇతర ఆస్ట్రియన్ పల్లెటూరి పిల్లలలాగానే అరవైవ ఏడులోకి ప్రవేశిస్తున్న తండ్రిని తండ్రిగా కాక తాత అనే భావంతో చూశాడు. సాధారణ చదువే చదివి, తాను సివిల్ సర్విస్ ఉద్యోగం కోసం చదవనని పెయింటర్ అవుతానని

చాలెంజ్ చేశాడు. మొదట్లో కొడుకు ఇంటికి సున్నాలు రంగులు వేసే వాడు అవుతాడేమోనని అసంతృప్తి చూపి విపరీతంగా కోప్పడ్డాడు. కాని ఫలితం లేక పోయింది. ఆయన కోపం బూడిదలో పోసిన పన్నీరులా వృధా అయింది. ఇదే హిట్లర్ మొదటి విజయం. దీన్ని ప్రయోజనంగా భావించి లింజ్‌లో సెకండరి స్కూల్‌లో చేరి, చదవనని భీష్మిస్తే సర్టిఫికేట్ ఇవ్వటానికి నిరాకరించారు. "నాకు ఏది సంతోషంగా ఉండేదో దాన్నే చదివాను. ఇష్టం లేని దానివైపు కన్నెత్తి కూడా చూడలేదు" అని హిట్లర్ తన జీవిత చరిత్ర "మీన్ కాంఫ్ అంటే" "నా పోరాటం"లో రాశాడు. 1903లో తండ్రి చనిపోగా, రెండేళ్ళ తర్వాత స్కూల్ మానేశాడు. అతని ప్రోగ్రెస్ కార్డ్‌లో అన్నీ "అత్తిసెరు" మార్కులే కనిపిస్తాయి. ఫ్రీ హాండ్ డ్రాయింగ్ మాత్రం బాగా ఉంది. రాత దరిద్రపు గొట్టు. జర్మనీ గురించి ఆయనకు తెలిసింది సంతృప్తికరంగా లేదని ఆ రిపోర్ట్ సారాంశం.

స్కూల్‌లో నూ తలిదండ్రుల పరంగానూ క్రమ శిక్షణ లేని హిట్లర్ లింజ్‌కు దగ్గరలో ఉన్న ఉర్ఫార్ లో జులాయిలా తిరుగుతూ యే పనీ చేయని సోంబేరి అయ్యాడు. తానేం కావాలో తెలియక ఇతరులపై అనుమానం పెంచుకొని, ఎవరితోనూ స్నేహం చేయక, యే సంస్థలోనూ చేరక ఎవరి తీర్పుకూ ఇష్టపడకుండా కాలక్షేపం చేశాడు. కొన్ని నెలలు మ్యూనిచ్ ఆర్ట్ కాలేజిలో చేరి చదివాడు. 18వ ఏట తల్లి ఆసరాతో వియన్నా ఫైన్ ఆర్ట్స్‌లో చేరుదామను కొన్నాడు. ఎందరో ఆర్టిస్ట్ నిష్ణాతులను కలిసినా ఎవరూ చేర్చుకోలేదు. మరుసటి ఏడాదీ ప్రయత్నించి దారుణంగా విఫలుడయ్యాడు. పరీక్ష రాయటానికి కూడా ఎవరూ ఒప్పుకోలేదు. జీనియస్ ఆర్టిస్ట్ లందరూ తనలాగా తిరస్కరింప బడిన వారే అని తనను తాను ఓదార్చు కొన్నాడు. ఇరవై ఏళ్ళు వచ్చేలోపే తల్లీ చనిపోయింది. ఏం చేయాలో, ఎక్కడికి వెళ్ళాలో పాలుపోలేదు. "నార సంచీలో ఉన్న బట్టలు సర్దుకొని, మొక్కవోని దైర్యంతో వియన్నాకు బయల్దేరాను. నేను "ఏదో కావాలి" అనే నిశ్చయం నా మనసంతా నిండి పోయింది. కాని సివిల్ ఉద్యోగిని మాత్రం కాకూడదు అని గట్టిగా నిర్ణయించుకొన్నాను" అని రాసుకొన్నాడు హిట్లర్.

వియన్నాలో అనేక చిన్న చిన్న ఉద్యోగాలు చేశాడు. తర్వాత తిండి తినటానికి సరిపడ డబ్బును పెయింటింగ్ ద్వారా సంపాదించానని గర్వంగా చెప్పుకొన్నాడు. కాని "గురుడికి" మనిషి బొమ్మ వేయటమే రాదు. ఒక చిన్న సృజనాత్మకమైన బొమ్మ వేయ లేక పోయాడు. ల్యాండ్ స్కేపులు బిల్డింగ్‌లను కాపీ చేశాడు. వియన్నాపై పోస్ట్ కార్డ్ భావాలు గిలికాడు. ఈ తిరుగులాటలో బోహిమియన్ దేశ ద్రిమ్మరితో అనుకోకుండా పరిచయమైంది. కొద్ది రోజుల్లోనే వాడితో పోట్లాడి వదిలించుకొన్నాడు. మంచు ఆటలలో పెన్నీలు సంపాదిస్తూ, రైల్వే స్టేషన్‌లో సామాన్లు మోస్తూ, కార్పెట్ల దుమ్ము దులుపుతూ, తాగుబోతుల దగ్గర అడుక్కొంటూ ఏదో కొంత సంపాదిస్తూ బతికేస్తున్నాడు.

పార్క్ బెంచీలమీద పడుకొంటూ, చేతిలో "గవ్వలు" ఆడుతుంటే చిన్న మురికి గదిలో ఉంటూ వచ్చాడు. ఉచితంగా ఇచ్చే సూప్ కప్ కోసం బారులు తీరిన క్యూలో గంటల తరబడి నిలబడే వాడు. ఒక్కోసారి అదృష్టం కలిసొస్తే బ్రెడ్‌తో హార్స్ సాసేజ్ దొరికేది.

హిట్లర్ చూడటానికి ఆకర్షణీయంగా ఉండేవాడు కాదు. ముఖం మృదువుగా గుండ్రంగా ఉండేది. రంగు పాస్టేగా ఉండేది. జుట్టు దువ్వ కుండా, నుదుటిమీద పడుతూ ఉండేది. పొడుగాటి జుట్టు. 21కే గడ్డం మీసం మొలిచి క్రిస్టియన్‌లలో ఒక విపరీతమైన వాడుగా కనిపించేవాడని స్నేహితులు చెప్పారు. అతని పరిస్థితి చూసి స్నేహితులు హిట్లర్‌ను బాధిత పీడిత జన బాంధవుడు అనుకొన్నారు. కాని వారిని ద్వేషించి అసహ్యించుకొనే వాడని పాపం వాళ్లకు తెలియదు. "వర్కర్లు మురికితో రోతపుట్టిస్తారు. ఇష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తారు. పొట్టకు కూడు తాగుడు, అమ్మాయిలూ తప్పవాళ్లకు ఇంకేమీ అక్కర్లేదు. ఏ విషయం పైనా ఈ మూక జనాలకు అవగాహన, నిర్ణయాలు ఉండవు" అని "హిట్లర్ గురూజీ" సూక్తులు పలికాడు. కార్మిక సంస్థలలో హిట్లర్ సభ్యత్వం తీసుకోలేదు, ఉద్యమాలలో చేరలేదు. "పేద జనం నిరంతరంగా పెరిగే ప్రజల్ని భయపెట్టే బెదిరించే సైన్యం" అన్నాడు. "ఏ వ్యక్తీ అయినా తన గమ్యం చేరాడు అంటే దానికి అతని ఒరిజినాలిటి బ్రూటాలిటీ యే కారణం" అని గర్వంగా ప్రకటించాడు.

హిట్లర్‌కు ఒరిజినాలిటీ కంటే బ్రూటాలిటిపై మోజెక్కువ. దాన్నే ఆయుధంగా చేసుకొని గద్దె నెక్కాడు. అధికారం చెలాయించాడు, ప్రపంచాన్ని భయపెట్టాడు. సాధారణ అసంతృప్తి అంతా కలిసి లేబర్‌ను, లిబరల్స్ సాంఘిక ప్రజాస్వామ్యవాదులు ముఖ్యంగా యూదులు అంటే ద్వేషాన్ని ఆయనలో రెచ్చగొట్టి పాశవికంగా ప్రవర్తించేట్లు చేసింది. హిట్లర్‌కున్న "యాంటి సెమిటిజం" ఆయనకు పగటి కల ఫాంటసి అయి ఆయన రక్తమాంసాలలో జీర్ణమై, అంతరాత్మకు చోదక శక్తియై కోప ద్వేష కారణమై నడిపించింది. సామాన్య జ్యూను, నల్లజుట్టుతో, పతనం చెందించే యువకుడిగా చిత్రించాడు. తన చరిత్ర మీన్ కాంఫ్‌లో "యూదులే నీగ్రోలను రీన్ లాండ్‌కు తెల్లజాతిని జారత్వంలోకి దించటానికి తెచ్చినవారు" అని రాశాడు. ఇలాంటి యూదు జాతితో కలిసి ఉండలేక పోయాననుకొన్నాడు.. తానూ అత్యంత ఉన్నత జాతి వాడినని కాలరెగరేసి చెప్పుకొన్నాడు. అందుకే సమానత్వాన్ని బోధించే వాళ్ళందర్నీ ద్వేషించాడు హిట్లర్. మార్క్స్‌ను కొంత చదివాడు కనుక జ్యూలు అందరూ కమ్యూనిస్ట్ లే అనే పొరబాటు అభిప్రాయానికి వచ్చాడు. కనుక హిట్లర్ కున్న యాంటి సేమిటిజానికి మానవత్వ వాదులు అంతర్జాతీయ వాదులు, సంస్కర్తలు, మేధావులు , ప్రకృతి సిద్ధ తేడాలు సహజం అనే యాంటి సేమిటిజాన్ని ప్రశ్నించేవారు అంటే ద్వేషం నర నరానా జీర్ణించుకు పోయింది. మేధావులు

సమర్ధించే జ్యూలు కొన్ని జాతులు సర్వోత్కృష్టమైనవి అనే అభిప్రాయంతో మానవ అస్తిత్వ మూలాలనే కూల్చేయాలనుకొనే వారిని అంగీకరించ లేదు.

అలాన్ బులాక్ రాసిన "హిట్లర్ ఎ స్టడి ఇన్ టిరనీ" పుస్తకంలో "మీన్ కాంఫ్ అనే తన స్వీయ చరిత్రలో పేజీ లన్నిటి లోను పిచ్చివాడి ప్రపంచమే కనిపిస్తుంది. అందులో మనుషుల నీడలే కనిపిస్తాయి. జ్యూలు మనుషులే కాదు. తననొక పురాణ పురుషుడుగా అభివర్ణించుకొన్నాడు. ఆయన అవినీతికి మారు రూపం. ఈ కోణం నుంచే ప్రపంచాన్ని చూశాడు. కామెర్ల వాడికి లోకమంతా పచ్చగా కనిపించినట్లు ఆయనకు ప్రపంచమంతా ద్వేషం కోపం అనుమానం భయంగా మాత్రమే కనిపించింది. ప్రతి అన్యాయానికి తనకు ఇష్టంలేని ఆధునికతకు సంగీతానికి ఆర్ట్‌కు జ్యూలే కారణంగా కనిపించారు హిట్లర్‌కు. పోర్నోగ్రఫీకి వ్యభిచారానికి జాతి వ్యతిరేక ప్రెస్ విమర్శకు, సోషలిజంపేరుతో మాస్ జనాలపై ఒత్తిడికి, చివరికి తన వైఫల్యాలకు యూదులే ముఖ్య కారణమనుకొన్నాడు. మూడవ నెపోలియన్ తనను ఆస్ట్రియా నుంచి సాగనంపి పాన్ జర్మన్‌గా మార్చటానికీ వాళ్ళే కారణం అనే భ్రమ ఆయన్ను పీడించి ఆడించి ఓడించింది" అని రాశాడు. బలహీన ప్రపంచ పౌరుడు ఒక ఫెనటిక్, యాంటి సెమెటిక్ యోధుడిని చేసింది.

ఈ జాతీయ భావం, నాయకత్వ లక్షణం హిట్లర్‌కు 24 ఏళ్ళు రాక ముందే మనసులో బలపడ్డాయి. వియన్నీస్ వర్కర్లు పెద్ద ప్రజా ప్రదర్శన చేసినప్పుడే ఈ మూక జనం బలమైన శక్తి సంపన్నమైన దేనికీ లొంగని పాలకుడికి విధేయంగా ఉంటారని అనుకొన్నాడు. పడగొట్టే వాడికంటే పరిపాలకుడికే జై కొడతారని ఊహించాడు. ఈ జనం భయపెట్టిన కొద్దీ లొంగి ఉంటారని, వాళ్ళ స్వాతంత్రేచ్ఛ కాల రాచిన వాళ్ళు ఏమీ అనుకోరని తలచాడు. ప్రజల దృష్టిని ఏదో ఒక దానిపై ఏకీ కృతం చేస్తే వాళ్ళ దృష్టి మరో దాని పైకి పోదని అనుకొన్నాడు. అప్పుడు వాళ్ళను విడదీయటం కష్టమే అని అర్ధం చేసుకొన్నాడు.. మేధావి నాయకుడు వివిధ వ్యతిరేకుల్ని ఒకే కేటగిరీలోకి తెచ్చి పిడికిలిలో బిగిస్తాడని అభిప్రాయ పడ్డాడు. అబద్ధాలు బాగా చెప్పాలి. యెంత తప్పు చేస్సినా ఒప్పుకోకుండా దబాయించాలి. రిజర్వేషన్‌లను ఆపెయ్యటానికి సందేహించ రాదు. మూకల్ని బాగా అవినీతి పరులను చేయటం తేలిక. వాళ్ళు సహజంగా చిన్న చిన్న అబద్ధాలు చెబుతారు అలాంటి వాళ్ళతో పెద్దవి బొంకించటానికి మరింత పెద్ద తప్పుల్ని చేయించటానికి శ్రమ పడక్కర లేదు.. బల ప్రయోగంతో మూకను ఒప్పించ వచ్చు. ఎంత గట్టిగా నొక్కి చెబితే అంత బాగా నమ్ముతారు. నెత్తిన మొట్టిన కొద్దీ వంగి వంగి సలాం చేస్తారు" అని "హిట్లరోపనిషత్" విప్పి చెప్పాడు. "the driving force which has brought about revolutions has never been a body of scientific teaching, but always a devotion to which has in-

spired them and a kind of hysteria which urged them into action - -who ever wishes to win over the masses must know this key, It is not objectivity but a determined will backed up by power where necessary" అన్నాడు. దీనిపై విశ్లేషకులు స్పందిస్తూ "the greatest damage in history Hitler fused the cool cynicism of Machiaivelli with the agitating oratory of a mob spell binder, plus a compulsive ruthlessness that was all his own" అని చెప్పారు.

24వ ఏట అధికార దాహం తో ఉన్న హిట్లర్ వియన్నాను వదిలాడు. 24 ఏళ్ళ తర్వాత మళ్ళీ అక్కడ విజేతగా కాలుపెట్టాడు. 1913లో మ్యూనిచ్‌కి స్ప్రింగ్‌లో వెళ్ళాడు. ఇంతకాలం ఎలా పొట్ట పోషించు కున్నాడో ఎవరికీ తెలియదు. కొన్ని పెయింటింగ్‌లు వేసి అమ్మి జీవించి ఉండవచ్చు. పిచ్చి పట్టిన వాడుగా రోడ్లమ్మట పగలూ రాత్రి తన సమ్మోహన స్వరంతో జనాలను చైతన్యం చేస్తూ తిరిగి ఉండవచ్చు. పాత చరిత్ర తవ్వి తీసి నార్డిక్ సుప్రీమసిని జాగృతం చేస్తూ ట్యుటానిక్ మైథాలజిని గొప్ప చేస్సి చెప్పుతూ జర్మనీని కొత్త సైన్యంతో సమాయత్త పరిచి ఉండవచ్చు. 1914 ఆగస్ట్ 14న అతని కల మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభంతో నెర వేరే అవకాశాలు లభించి బవేరియన్ సైన్యంలో పేరు నమోదు చేసుకొన్నాడు.

సైనికుడిగా హిట్లర్ పాత్ర ఏమిటో తెలియదు కాని తన స్థానాన్ని పదిలం చేసుకొన్నాడు. యుద్ధం పూర్తి అయేసరికి హిట్లర్ ఒక కార్పోరల్‌గానే ఉన్నాడు. అతని ముఖ్యమైన పని ఉత్తరాల బట్వాడా మాత్రమే. దీనికే "ఐరన్ క్రాస్" బహుమతి పొందాడు. జర్మని ఓడిపోవటం అతనికి పాలకుల నిర్వాకంపై మరింత ద్వేషం పుట్టించింది. సంధి పత్రంపై సంతకం చేసిన వాళ్ళను విద్రోహులు అన్నాడు. జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ అంటే ఆతనికి ఎలర్జీ. మూక జనంపై ద్వేషంతోనే యుద్ధానికి దిగాడు. దీనిపై "డేర్ ఫ్యూహ్రేర్" పుస్తకంలో కాన్రాడ్ హీడేన్ "నాయకులపై ఏహ్యంతోనే వదిలాడు. తాను నీచ జనం అన్నవాళ్ళకు భయపడి ఒణికి లొంగిపోయారు" అని ఎద్దేవా చేశాడు అని రాశాడు. ఉన్నత వర్గాలపై ద్వేషం పెంచుకొన్నాడు. పది పన్నెండు వేల సోషలిస్ట్ ఉద్యమకారుల్ని గాస్‌తోనో విషంతోనో అధినాయకులు చంపలేక ఊచకోత కోయలేకపోయిన వాజమ్మలు దద్దమ్మలు అని ఆక్రోశించాడు. అదే వాళ్ళు చేసి అతి పెద్ద ద్రోహం, తప్పు, బ్లండర్ అన్నాడు.

అప్పటికే ప్రజాస్వామ్య వ్యతిరేకవాదుల ఉద్యమాలలో ప్రదర్శనలలో బాగా పాల్గొన్న హిట్లర్ ఇక తన స్వప్రయోజనం కోసం ప్రాపగాండా ప్రారంభించాడు. జర్మన్ నేషనల్ సోషలిస్ట్ వర్కర్స్ పార్టీ అంటే "నాజీ పార్టీ"లో చేరాడు. దాని గుర్తు స్వస్తికం. రౌడీల,

ధగ్గుల ముఠాలను ఇందులో చేర్చుకొని ఊరేగింపులు, ఉద్యమాలను చెదర గొట్టటం, బెదిరించటం చేయించాడు. వ్యతిరేకుల్ని భయ భ్రాంతుల్ని చేయించాడు. ఒక మీటింగ్‌లో తాను అన్ని రకాల సమావేశాలను, ఉపన్యాసాలను అడ్డుకొంటానని శ్రోతలను దీని ద్వారా భయ భ్రాంతులకు గురిచేస్తానని ప్రేక్షకులకు తెలియజేశాడు. నాజీ మూకతో ప్రతిపక్షానికి దడ పుట్టించాడు. "మా దండు రాజకీయ పోరాటానికి కే తప్ప డిబేటింగ్ సొసైటీలకు కాదు" అని తేల్చి చెప్పాడు. రోమన్ ఇంపీరియలిజానికి గుర్తుగా ముసోలిని ప్రవేశ పెట్టిన ఫాసిస్ట్ సాల్యూట్‌ను హిట్లర్ కూడా ప్రవేశపెట్టి, ముసోలిని ఫాసిస్ట్ విధానాలను అమలు చేస్తూ ప్రజల్లో వెర్రి ఆవేశాన్ని రగిలించాడు. "మేము పోరాటాన్ని బోధిస్తాం. పార్లమెంటరీ పద్ధతికి తీవ్ర వ్యతిరేకంగా పోరాటం సాగిస్తాం. దీనితో జర్మనీ పూర్తిగా కూలి పోవచ్చు లేక ఒక కొత్త హీరో ఆవిర్భవించి దాని భవితను నిర్ణయించవచ్చు. ఆ నాయకుని బూట్లు మురికిగా ఉండచ్చు కాని అతనికి ఉక్కు పిడికిలి, సంకల్పం ఉంటాయి. అతను ఊక దంపుడు ఉపన్యాసాలకు స్వస్తి చెప్పి స్వస్తిక మార్కు గుర్తుతో జాతిని కార్యోన్ముఖం చేస్తాడు" అని ఉద్రేక పూర్వకంగా ప్రసంగించాడు. రెచ్చగొట్టాడు. తన దారికి తెచ్చుకొన్నాడు.

తీవ్రవాదుల పార్టీల కార్యక్రమాలు బాగా వేగంగా ఊపు నందుకొన్నాయి. డిప్రెషన్, ఇన్ ఫ్లేషన్ పరిస్థితులను మరీ దిగ జార్చాయి. 1918లో జర్మని కరెన్సీలో డాలరుకు 4 మార్క్‌లు వస్తే, 1922లో డాలర్ కొనాలంటే 75 మార్కులు 1922లో 100 మార్క్‌లు చెల్లించాల్సి వచ్చింది. ఆ తర్వాత కూడా ప్రతి నెలా మార్క్ పతనం కొనసాగింది. 1923 జులైకు పరిస్థితి మరీ దిగ జారిపోయి 1 50 000 అయి, ఆగస్ట్ నాటికి మిలియన్ మార్క్‌లకు దేకింది. కరెన్సీ పతనం నాజీలకు బాగా కలిసి వచ్చింది. ఆహార కొరత, నిరుద్యోగం, సాధారణ దివాలా, కూడా వాళ్లకు పంట పండించింది. ఈ గండాలనుంచి దరి చేర్చటానికి ప్రజల్ని ఆదుకోవటానికి నాజీ పార్టీ ఒక్కటే సరైనది అనే అభిప్రాయం బాగా కలిగించారు దేశాన్ని దివాలా స్థానం నుంచి ఉద్ధరించటానికి, ప్రాంతీయ అలజడులు అంతర్జాతీయ దాడుల నుండి కాపాడ గలిగే పార్టీ నాజీ పార్టీ ఒక్కటే అనే గట్టి నమ్మకాన్ని హోరెత్తే ప్రచారంతో కలిగించారు. వేర్సేల్లీస్ ఒప్పందాన్ని రద్దు చేయాలనే డిమాండ్‌ను బాగా ప్రచారం చేసి శక్తివంతమైన జర్మనీ నిర్మాణం చేయాలన్న ఆలోచనకు మద్దతు సంపాదించారు. ప్రజల్ని ఎలా మాటల మాయతో మభ్యపెట్ట వచ్చో హిట్లర్‌కు బాగా తెలుసు. ముఖ్యంగా ప్రజల ఫ్రస్ట్రేషన్‌తో ఎలా ఆడుకోవచ్చో తెలుసు.. వాళ్ళకోరికలు తీరుస్తానని, జర్మనీ కీర్తి విశ్వవ్యాప్తమవుతుందని పూర్తి నమ్మకం కలిగించాడు. రహస్య క్రూర పోలీసు దళాలతో, దారి తప్పిన ప్రజల్ని దారిలోకి తెచ్చుకున్నాడు. విప్లవానికి పరిస్థితి బాగా పక్వమైందని గ్రహించి పార్టీని

సివిల్ వార్‌కు పురిగొల్పాడు. 1923 నవంబర్‌లో బవేరియాన్ ప్రభుత్వాన్ని పడగొట్టి అధికారం లాక్కోవాలని ప్రయత్నించాడు. సరైన ప్రయత్నం, ముందు జాగ్రత్తలు తీసుకోక పోవటం వలన అది ఫలించలేదు. సైనిక తిరుగుబాటు జరుగుతుందని ఊహించాడుకాని జరగలేదు. పైగా హిట్లర్ అరెస్ట్ అయ్యాడు. ఇదొక పెద్ద అపజయం.

ఇప్పటికి 35 ఏళ్ళు వచ్చాయి హిట్లర్ దొర గారికి. జర్మనీలో ప్రతి వారి నోటినుంచి హిట్లర్ హిట్లర్ అనే నామం మంత్రోచ్చారణగా వినిపించి మహా ప్రసిద్ధుడైపోయాడు. ఆయనపై జరిగిన 9 నెలల విచారణ, జైలు జీవితం హిట్లర్‌ను త్యాగవీరుని చేశాయి. జైలులో ఉండగానే "మీన్ కాంఫ్"లో చాలా భాగం రాశాడు. అదే నాజీలకు పవిత్ర బైబిల్ అయింది.. జైల్లో ఉంటూ పార్టీ నాయకులతో సంప్రదిస్తూ పార్టీని మరింత పదును పెట్టాడు. హిట్లర్‌కు క్షమాభిక్ష ఇచ్చి విడుదల చేశాక తన స్థానాన్ని పదిల పరచుకొనే ప్రయత్నం గట్టిగా చేశాడు. అయిదేళ్ళు వ్యూహాత్మకంగా వ్యవహరించి తనకు అడ్డు వస్తారనుకొనే వాళ్ళనందర్నీ పురుగుల్ని నలిపినట్లు నలిపి పారేశాడు. తనకున్న లేబర్ వ్యతిరేక విధానాలతో ముఖ్య పారిశ్రామికవేత్తల మద్దతు సంపాదించాడు. సైనికాధికారులూ అతన్ని సమర్ధించి మరింత శక్తివంతుడిని చేశారు. దేశంలోని అసంతృప్తిని బాగా కాష్ చేసుకొని తన అధికారానికి అవకాశవాదంతో అధికార పీఠంపై కూర్చోవటానికి రాచబాట వేసుకొన్నాడు.

45వ ఏట అధికారం చేతిలో ఉంటే దేనినైనా సాధించవచ్చు ననుకొన్నాడు. ముందుగా రాజ్యాధికారం పొందాలి. కనుక ఎన్నికలకు పార్టీని సిద్ధం చేశాడు. మాటల గారడీ, ట్రిక్కులు, ఆశలు కల్పించి ఎన్నికల ప్రచారం నిర్వహించాడు ఇల్లు లేనివాళ్ళకు ఇల్లు, నిరుద్యోగికి ఉద్యోగం, అతి ముఖ్యంగా అదో జగత్ సహోదరులు తనలాగే పైకి వచ్చే అన్ని రకాల అవకాశాలు కల్పిస్తానని ఆశ పెట్టాడు. అన్నీ కలిసి వచ్చాయి. అతనికి వ్యతిరేకంగా ఉన్న లెఫ్ట్, రైట్ నాయకులు ఒక్కటి కాలేకపోయారు. చట్టప్రకారం రాజ్య భోజ్యానికి చేసిన కుట్ర ఫలించింది. 45వ ఏట ఎందుకూ పనికిరాని ఒక పోస్ట్ కార్డ్ పెయింటర్, వియన్నా వీధుల్లో తిండికి, నిద్రకు అలమటించి తిరిగినవాడు అయిన హిట్లర్ – రిపబ్లిక్ ప్రెసిడెంట్ ముసలి యుద్ధ వీరుడు మార్షల్ హిన్డేన్ బర్గ్‌పై ఒత్తిడి తెచ్చి తనను చాన్సలర్ నియమంచమని కోరాడు. 1933 జనవరి 30 అయిన ఆ దుర్దినం నుంచి అతనిమాట, చర్య పరమ భీకరంగా మారి జర్మనీకి అన్నివిధాల తానే ప్రభువును అనే స్థితిలోకి వచ్చి, యూరప్ అంతా తానే పరిపాలిస్తానని భయపెట్టాడు. "To day Europe tomorrow the whole world" అనే స్లోగన్‌తో అందర్ని కంగు తినిపించాడు.

చాన్సలర్ నుండి డైరెక్టర్‌కు వెంటనే ఎదిగిపోయాడు. తన సహచరులు గోరింగ్,

గోబెల్స్‌కు సర్వాధికారాలు ఇచ్చి విపక్ష వర్గాన్ని ఏవిధంగానైనా అణచి నాశనం చేసి పారెయ్యమన్నాడు. హిట్లర్ వాణి అయిన గోరింగ్ పార్టీ అధినేత, డైరెక్టర్ కూడా అయి నరకాసుర పాలన చేబట్టారు. గోబెల్స్ పబ్లిక్ యెన్ లైటెన్ మెంట్ మంత్రిగా ముఖ్య ప్రాప గాండ చేశాడు. రీచ్ స్టాగ్ బిల్డింగ్‌ను తగల బెట్టించిన ఈ ఇద్దరు ప్రభుద్దులు కమ్యూనిస్ట్‌లే ఆ పని చేశారని ప్రచారం చేశారు. అందుకే అప్పటినుంచి అసత్య ప్రచారాలను "గోబెల్స్ ప్రచారం" అనటం ఆనవాయితీ అయింది ప్రపంచంలో. దీనితో అన్ని ప్రైవేట్ ఆస్తుల విధ్వంసానికి నాంది అయింది. స్వీయస్వేచ్ఛ, వాక్ స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, పోస్టల్ కమ్యూని కేషన్‌లో ఉన్న రహస్యం అన్నిటికి భంగం కలిగించి స్వేచ్ఛకు సంకెళ్ళు వేశారు. తన నిర్వాకాన్ని తెలియజేస్తూ గోరింగ్ బోరింగ్‌గా "నా చర్యలు న్యాయ వ్యవస్థ పరిధిలో ఉండవు. న్యాయంపై నాకు చింత లేదు. నా సంకల్పం సర్వనాశనం, దుంపనాశనం, నిర్మూలనమే" అని నిర్లజ్జగా ప్రకటించాడు. రీచ్ వ్యవస్థ చేసే దురాగత ప్రజా వ్యతిరేక చర్యల నుంచి రక్షించటానికే అనే బూటకంతో హిట్లర్ రాజ్యాంగాన్ని కూడా ప్రక్కకు పెట్టేశాడు. విశ్లేషకుడు అలాన్ బులాక్స్ వివరించినట్లు "కొత్త రాజ్యంలోని సంపత్తిని అంతటినీ వీధి రౌడీ గాంగ్‌లు స్వాధీన పరచుకొని పెత్తనం చేశారు. మురికి నాయాళ్ళు అందలమెక్కారు". 1933 జులై 14న జర్మనీలో నాజీ పార్టీ ఒక్కటే రాజ్యాంగ బద్ధమైన పార్టీ అనే చట్టాన్ని తెచ్చాడు. దీనితో పెట్రేగి పోయిన నాజీ మూకలు భీభత్సం, హత్యాకాండ, దమన కాండలతో రక్తపు టేరులు పారించారు. హిట్లర్ ఇప్పుడు "ఫ్యూహ్రేర్" అంటే సర్వాధికార నియంత అయ్యాడు. రాజ్య పాలకుడిగా సైన్యంపైనా అధికారం పొందాడు. సైనికులందరి చేత ఎలాంటి భేషజం లేకుండా "హిట్లరే మా నాయకుడు, ఆయనకే లొంగి ఉంటాము" అనే పవిత్ర శపథం చేయించి జర్మనీ సామ్రాజ్యానికి అరివీర భయంకరుడయ్యాడు. తన దేశాన్ని లోబరుచుకొన్న గట్టర్ హీరో హిట్లర్ ఇప్పుడు ఉపఖండాన్ని జయించాలనే ఉబలాటంలో ఉన్నాడు.

మొదటి ప్రయత్నంగా లీగ్ ఆఫ్ నేషన్స్‌కు గొళ్ళెం పెట్టాడు. మొదట్లో బ్రిటన్ గొణిగినా తర్వాత జర్మనీకి కొత్తాయుధ వితరణ ఇచ్చింది. అంతర్జాతీయ పరిస్థితిని హిట్లర్ బాగా అవగాహన చేసుకొని దాన్ని ప్రయోజనంగా చేసుకొనే ప్రయత్నం చేశాడు. శత్రువుల బలహీనతలను పసిగట్టే మేధావి హిట్లర్. వారి విభేదాలను తనకు అనుకూలంగా మార్చుకొనే మహా తెలివితేటలున్న వాడు. తన దేశం జర్మనీలోని విభేదాలను తుంగలోతొక్కి అధికారానికి వచ్చిన వాడుకనుక సామ దాన భేద దండోపాయాలన్నీ తెలుసు. ఏది ఎప్పుడు ఎలా ఎక్కడ ప్రయోగించాలో తెలిసిన కౌటిల్యుడు. ఇంగ్లాండ్‌ను ఫ్రాన్స్‌కు వ్యతిరేకంగా చేశాడు. ఫ్రాన్స్‌ను పోలాండ్‌కు

వ్యతిరేకం చేశాడు. రష్యాను పశ్చిమ దేశాలకు వ్యతిరేకిని చేశాడు. జెనీవాలో జరిగిన ఆయుధ విసర్జన సమావేశం ఫలప్రదం కాకుండా అడ్డుపుల్ల వేశాడు. జర్మనీలో నిర్బంధ సైనిక విధానం అమలు పరచి అందర్నీ సైన్యంలో చేర్చే ప్రయత్నం చేశాడు. విద్య, వ్యాపారం వాణిజ్యం, జర్నలిజం థియేటర్లలో బాగా స్థిరపడి ఉన్న జ్యూల నందర్నీ దేశ బహిష్కారం చేసి వారి స్థానాలలో తన "చెంచా గాళ్ళ"ను కూర్చోబెట్టాడు. ఏది ప్రసారం చేయాలో ఏది కూడదో నిర్ణయిస్తూ సమాచార వ్యవస్థను స్వాధీనం చేసుకొన్నాడు. దీనితో విధ్వంసానికి కోట గోడ కట్టాడు. దేశద్రోహ గ్రంథాలు అనే ముద్ర వేసి విలువైన సాహిత్యాన్ని అంతా తగుల బెట్టించాడు. ముందుగా కమ్యూనిస్ట్ సానుభూతి రచనలను, తర్వాత జ్యూ ల ఫ్రాయిడ్ యొక్క , హీన్ యొక్క రచనలన్నీ తగలబెట్టించి భోగి మంటలు వేయించి ఆనందంగా చలి కాచుకొన్నాడు. ఆర్య వ్యతిరేకమైనవన్నీ భస్మీపటలమైపోయాయి. ఇంతటితో ఆగక సోషల్ డెమొక్రాట్ల, యుద్ధ వీరుల, అసమ్మతి సైంటిస్ట్ల, అధిక అధికారం చెలాయించే వారిపై రాసిన విమర్శల నన్నిటినీ తగల బెట్టి వినోదం పంచుకొన్నారు ఆ కిరాయి మూకాసురులు.

1936లో యూరప్ సమస్యలతో సతమతమైంది. ఫాసిస్ట్ ఇటలి సంధిని ఉల్లంఘించి ఇథోపియాను బాంబుల దాడితో నామ రూపాలు లేకుండా చేసింది. లీగ్ చేతగాక ముసోలినే సమర్థించి దెబ్బతిన్న దేశాన్ని వదిలేసింది..స్పెయిన్లో అంతర్యుద్ధం చెల రేగింది. తిరుగుబాటు దారులను జర్మని ఇటలీలు వెనకేసుకొస్తే లాయలిస్ట్లకు జనరల్ ఫ్రాంకో, రష్యాలు మద్దతు నిచ్చారు. బ్రిటన్ అమెరికాలు దూరంగా ఉండిపోయాయి. పరిస్థితులన్నిటిని జాగ్రత్తగా గమనించిన హిట్లర్ ఇప్పుడు అంతర్జాతీయ రాజకీయ గాంబ్లింగ్ ఆడాడు. తన జర్మన్ సైన్యాన్ని రీన్ లాండ్పైకి ఉరికించాడు. దీనితో జర్మని పూర్వపు ఒప్పందాలన్నిటినీ ఉల్లంఘిస్తుంది అని చాటి చెప్పాడన్నమాట. మిగిలిన దేశాలు లీగ్కు ఫిర్యాదు చేశాయి. కాని ఇదివరకటి లాగానే ఏమీ చేయలేక పోయింది లీగ్. 1937 జనవరిలో ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్లు స్పెయిన్లో పోరాడుతున్న విదేశీ వాలంటీర్లు అందరిని వెనక్కి రావాలని కోరాయి. ఇటలీ జర్మనీలు నిర్ద్వంద్వంగా తిరస్కరించాయి. స్పానిష్ ఫాసిస్ట్లకు హిట్లర్ ఇంకా ఎక్కువ సాయం చేయాలని నిర్ణయించాడు. ఇంకాస్త ముందుకెళ్ళి వేర్సైల్లిస్ ఒప్పందాన్ని తప్పు పట్టి జర్మనీకి జరిగిన అన్యాయాన్ని చాటుతూ కోల్పోయిన కాలనీలన్నిటిని తిరిగి ఇచ్చేయాలని కోరాడు.

తన విరోధులను మాయ మాటలు, తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యం, నియంతృత్వపు తీవ్రతలతో భయపెట్టాడు. ఇష్టంలేని శాంతి ఒడంబడికను పూర్తిగా 1938లో కాల రాచి పారేశాడు. విముక్తి మంత్రంతో పెద్ద ఎత్తున ప్రచారం చేస్తూ తనను "నీట్జేస్చేన్ సూపర్ మాన్"గా "క్రిస్టియానిటి ముసుగులో ఉన్న క్రూర నియంత"గా ప్రత్యక్షమై,

తాను జర్మనీ దేశ భవిష్యత్తును నిర్ణయించే విధాతగా ప్రకటించుకొని "దేవుడు నన్ను ప్రపంచ ప్రజల విముక్తి కోసం పంపాడు. ప్రజల మానసిక దౌర్భాగ్యం నుంచి విడుదల చేస్తాను. ప్రతి వ్యక్తికి స్వాతంత్ర్యాన్నిచ్చి కాపాడుతాను" అని నమ్మించాడు. ముందుగా ఆయన విముక్తి చేసింది జర్మనీనే. తర్వాత ఆస్ట్రియా. బవేరియా సరిహద్దులలోకి దండును పంపుతూ, భయ పడేట్లు చేసి ఆస్ట్రియన్ చాన్సెలర్ కర్ట్ వాన్ స్కూస్నిజ్‌ను రాజీనామా చేసేట్లు చేశాడు. మార్చి 12న వియన్నాలో ప్రవేశించి, అక్కడ ముందే రిహార్సల్ చేయించిన జనం చేత జయజయ ధ్వానాలు పలికించుకొన్నాడు. కొన్ని నెలలాగి మళ్ళీ కొత్త డిమాండ్‌లు చేశాడు. జెకోస్లో వేకియాలోని జర్మన్లకు ఆపద్బాంధవుడని పించుకొన్నాడు. ఇంతలో గ్రేట్ బ్రిటన్ ఫ్రాన్స్‌లు జెక్‌లను సూడేటేన్లాండ్‌ను అప్పగించమని కోరాయి. సెప్టెంబర్ 13న హిట్లర్ మరో ట్రంప్ కార్డ్ ప్రయోగించాడు. మ్యూనిచ్‌లో దీనితో ఇప్పటిదాకా తాము రక్షకులమనుకొంటున్న జక్‌ను బ్రిటన్ ఫ్రాన్స్‌లు వదులుకోవాల్సి వచ్చింది. బ్రిటిష్ ప్రధాని చాంబర్లేన్ లండన్‌కు పీచే మూడ్ అయ్యాడు. వెళ్లి లండన్‌లో "మ్యూనిచ్‌లో మనకాలంలో శాంతి ఒప్పందం కుదిర్చాను" అని ప్రకటించుకొన్నాడు.

50వ ఏట హిట్లర్ "కొరక రాని కొయ్య" అయ్యాడు. అతని ముఖంలో హిప్నటైజ్ చేసే కళ్ళు, వాటిలో తీక్ష్ణ దృష్టి తప్ప ఇంకేమీ ప్రత్యేకతలు లేవు. ముఖం కుదించుకొని గట్టిపడినట్టు, చెత్తగా నటించే విదూషకుడిగా, సాధారణ నుదురు గడ్డం మూతి కనుబొమలు చార్లీ చాప్లిన్ మీసంతో వికృతంగా ఉండేవాడు. చాప్లిన్ విషాద నవ్వు పుట్టించే ముఖం బదులు ద్వేషం ప్రతిధ్వనించేది. చెడు అలవాట్లు లేని రాక్షసుడు హిట్లర్. పొగ తాగేవాడు కాదు. తాగుడు అలవాటు లేదు. మాంసం తినేవాడు కాదు. మగువపై మోహం లేదు. అంటే మకార త్రయానికి దూరం. జెలి అనే యువ నీస్‌కు మాత్రమే స్వంతమైనవాడు. ఆమెను తన అపార్ట్‌మెంట్‌లో ఆమె వయసు ఇరవైలోపు ఉండాగానే కాల్చి చంపేశాడు. దీనికి కారణం ఏమిటో తెలియదుకాని ఆమెది ఆత్మహత్య అని ప్రచారం చేయించాడు. తర్వాత ఈవా బ్రౌన్‌తో సంసార జీవితం సాగించాడు. హిట్లర్‌కు చర్చ కాని వ్యతిరేక అభిప్రాయం కాని నచ్చదు. "ఈ సీతయ్య ఎవరిమాటా వినడు" అన్న నందమూరి హరికృష్ణ డైలాగ్ లాగా హిట్లర్ ఎవరిమాటా వినేవాడుకాదు. ఆయనకు ఇష్టమైనది మిలిటరీ బాండ్ దానితో పాటు జర్మనీ సంగీతకారుడు వాగ్నర్ కూర్చిన "నార్డిక్ మ్యూజిక్" మాత్రమే ఇష్టం.

50 వయసులో హిట్లర్‌కు విజయాలు ఒకదాని వెంట ఒకటి వచ్చి మీద పడ్డాయి. 1939లో తన కిష్టమైన "బలమే మొదటి చట్టం బలమే హక్కును సృష్టిస్తుంది" అనే సింహనాదం చేశాడు. స్లోవాకియాను మాతృదేశం నుండి విడిపోమ్మని కోరాడు.

మేమెల్‌కు చేరి లొంగదీసుకొని రీచ్‌కి కట్టబెట్టాడు. ఏప్రిల్‌లో 'పోలాండ్‌తో కుదుర్చుకొన్న' యుద్ధ వివరణ ఒప్పందాన్ని", ఇంగ్లాండ్‌తో చేసుకొన్న సముద్ర సరిహద్దు ఒప్పందాన్ని ఉల్లంఘించాడు. రూజ్ వెల్ట్‌ను కాదని డాన్జింగ్‌ను ఇవ్వమని కోరాడు. మేలో జర్మని ఇటలీలు మిలిటరీ ఒప్పందం చేసుకొన్నాయి. ఆగస్ట్‌లో రష్యాతో దురాక్రమణ రహిత ఒప్పందాన్ని కుదుర్చుకొన్నాడు. ఈ రకంగా జర్మనీని రెండు వైపులా యుద్ధాన్నుంచి తప్పించాడు. తనకు అందరూ భయపడ్డారని భావించి తూర్పు నుంచి ప్రమాదం లేదని తలచి పోలాండ్‌ను సెప్టెంబర్ 1న జయిఛి డాన్జింగ్‌ను స్వాధీన పరచుకొని, కావాలనే వార్సా మొదలైన సిటీలపై బాంబుల వర్షం కురిపించాడు. రెండు రోజుల తర్వాత బ్రిటన్ ఫ్రాన్స్‌లు ఈ వివాదంలో చేరాయి. దీనితో భయంకర రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది.

1940లో హిట్లర్ స్టార్ తిరిగి ఎగ బాకింది. అతని సైన్యాలు పోలాండ్‌ను తుడిచి పెట్టేశాయి. కొద్దికాలం ఓపిక పట్టి పశ్చిమ రాజ్యాలతో శాంతి ఒప్పందం కుదుర్చునేట్లు అభినయించాడు. కాని జర్మనీ భాషలో "సిట్జ్ క్రీగ్" అనే "సిట్ డౌన్ వార్" ఒక్కసారిగా అకస్మాత్తుగా "బ్లిట్జ్ క్రీగ్" అంటే "మెరుపుదాడి"గా పరిణమించింది. నాజీలు నెదర్లాండ్, బెల్జియం, లక్సేన్ బెర్గ్‌ల పని పట్టారు. హాలండ్ బెల్జియంలు మేలో తామే లొంగిపోయాయి. బ్రిటిష్ సైన్యం బందీ అయింది. డన్కర్ బీచ్ నుండి చాలా భాగం బ్రిటిష్ సైన్యాన్ని తప్పించేశారు. చాలా టాంక్‌లు, ఆయుధ సామగ్రి నష్టమైంది. జూన్ 13న నాజీలు పారిస్ నగరంలోకి దూసుకు పోయారు. మూడు రోజుల తర్వాత మార్షల్ పీటైన్ఫ్రాన్స్ ప్రధాని అయి హిట్లర్‌తో శాంతి చర్చలు జరిపాడు. జులైలో జర్మని ఇంగ్లాండ్‌పై భారీ విమాన దాడి చేసి పౌర నగరాలపైనా కేథడ్రిల్ల పైనా అకారణంగా బాంబుల వర్షం కురిపించింది. పనిలో పనిగా ఇటలీ దెబ్బతిన్న ఫ్రాన్స్‌పై యుద్ధానికి దిగింది. దీన్నే ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ "వెన్ను పోటు" అన్నాడు. రుమేనియా హంగేరీలు జర్మనీతో చేతులు కలిపాయి. సంవత్సరాంతానికి "స్వస్తిక పతాకం" యూరప్ లోనార్వే, డెన్మార్క్‌లతో సహా చాలా దేశాలలో రెప రెప లాడింది.

1941 మరొక గణనీయమైన విజయ పరంపరను హిట్లర్‌కు అందజేసింది. హిట్లర్ గ్రీస్, ఇంగ్లాండ్‌లపైకి ఉరికాడు ఇంగ్లాండ్ దాడి నుండి తప్పించుకొని రక్షించుకోవటానికి చాలా తక్కువ ప్రయత్నం చాలా ఆలస్యంగా చేసింది. యుగోస్లావియా సయోధ్య కుదుర్చుకొన్నది. ఇక పడమటిలో తనను నిలవరించేవారెవ్వరూ లేరని, రెండు వైపులా యుద్ధం ఎందుకని తూర్పు దేశాలపై ఒక్కసారిగా విరుచుకు పడ్డాడు. ముందుగా రష్యాపై దాడి చేసి స్టాలిన్ శ్రేణిని నాశనం చేసి, తర్వాత కీవ్, మాస్కో, లెనిన్ గ్రాడ్‌పై పడ్డాడు. యుద్ధ నిపుణులు రష్యా సైన్యాన్ని మూడువారాల్లో మట్టు పెట్టగలరని మొత్తం

రష్యాను ఆరువారాల్లో ఊదేయగలరని జోస్యం చెప్పారు. కనుక హిట్లర్ నాజీ సైన్యం రష్యా లోపలి భాగాల్లోకి దూసుకువెళ్ళి కీవ్, ఒరెల్‌లు పట్టుకొని లెనిన్ గ్రాడ్‌ను చుట్టుముట్టాయి. ఇంకేముంది రష్యా పని అయిపోయింది జర్మనీ చేతిలో రష్యా ఓడిపోయింది ఇక కోలుకోలేదు లేవలేదు. పూర్తిగా నాశనమైపోయింది అని హిట్లర్ ప్రగాల్భాలతో ప్రకటించాడు.

జపాన్ పెరల్ హార్బర్‌పై దాడి చేసినపుడు అమెరికా కూడా యుద్ధానికి దిగాల్సి వచ్చింది. పుచ్చిపోయిన ప్రజాస్వామ్యం "అంటే ఏవగింపు ద్వేషం ఉన్న హిట్లర్ అమెరికాపై యుద్ధం ప్రకటించాడు. దీనితో అల్ప జాతులనూ, పనికి రాని ప్రజాస్వామ్యాలను ఒక్క దెబ్బతోతన నాజీ కాన్సేంట్రేషన్ కాంప్‌లతో, అత్యంత పాశవిక చర్యలతో తుడిచిపెట్టి నాశనం చేయచ్చు అనుకొన్నాడు. జబ్బులు, ఆహార లేమి, భయోత్పాతం చేయలేని పనిని ఇంజెక్షన్లు, తగల బెట్టడాలు, గాస్ చేంబర్లతో పాశవిక మారణ హోమాన్ని సాధించాడు. న్యూరేం బెర్గ్ విచారణలలో, యుద్ధ ప్రారంభ సమయంలో తొమ్మిదిన్నర మిలియన్ల యూరోపియన్ జ్యూస్ ఉండేవారని, యుద్ధం తర్వాత మూడు మిలియన్ల మంది మాత్రమే మిగిలి ఉన్నారని తేలింది. ఇవన్నీ హిట్లర్ ను సాడిస్ట్, అమానుష స్ట్రాటజిస్ట్ అనటానికి దోహదం చేశాయి. 'Brutality is respected. 'The plain man in the street respects nothing but brute strength and ruthlessness. The people need fear. They want some one to frighten them and make them shudderingly submissive. They need something that give them a thrill of horror .terror is the most effective political instrument. I shall not permit my self to be robbed of it simply because a lot of stupid mollycoddles choose to be offended by it" ఇవీ హిట్లర్ ధర్మ పన్నాలు. "ది వాయిస్ ఆఫ్ డిస్ట్రక్షన్"లో "హీర్మాన్ రాస్చేనింగ్"లో హిట్లర్ తన అధికారుల్ని బండబూతులు తిట్టేవాడని, కాళ్ళతో తన్నేవాడని, పిడికిళ్ళు టేబుల్ పైన కొట్టేవాడని, దెబ్బతిన్న పిల్లాడో పిచ్చిపట్టిన స్త్రీ యో చేసినట్లు రాక్షసంగా ప్రవర్తించేవాడని రాశాడు వాళ్ళందరూ ఏడుస్తూ రోదిస్తూ అన్నీ భరించేవారట. "The most horrible warfare is the kindest .The important thing is the sudden shock of an overwhelming fear of death. These so called atrocities spare me a hundred thousand individual actions against disobedience and discontent. People will think twice before opposing us when they hear what to expect in the camps" ఇదీ హిట్లరీయం, హిట్లర్ మార్క్ పాలన. రావణా పాలన.

విపరీతంగా అన్నిరకాల నష్టం పొందుతున్నా, నెపోలియన్ వాటర్లూ పరాభవ గాధ తెలిసినా, ఏమాత్రం జంకూ గొంకూ లేకుండా మొండిగా తన నాజీ సైన్యాన్ని మరింతగా రష్యా లోపలి భాగాలలోకి చొప్పించాడు. మిలియన్ కంటే ఎక్కువ సైన్యంతో స్టాలిన్గ్రాడ్ వద్ద మోహరించాడు. ఇటలిలో పొందిన నష్టాన్ని పూడ్చుకోవటానికి డేరింగ్ డాషింగ్ వీరుడు రామ్మేల్‌ను ఆఫ్రికాకు పంపాడు. మొదట్లో కొంచెం విజయం సాధించినా అతను నిలువరింపబడ్డాడు. నాజీ ఆక్రమణ నుంచి రక్షించుకోవటానికి ఫ్రాన్స్ తన నావికాదళాన్ని ఉపసంహరించింది. చరిత్రలో అంతవరకూ ఎన్నడూ జరగని విధంగా అమెరికా ఇంగ్లాండ్‌లు ఉత్తర ఆఫ్రికాలో అతి పెద్ద సైన్యాన్ని దింపేసి యుద్ధం చేశాయి. సిసిలీ నుంచి బేస్‌గా తీసుకొని దక్షిణ ఇటలీపై అమెరికా యుద్ధం చేసింది. "ఫ్యూహ్రేర్" హిట్లర్ జాతకం తిరగబడింది. 1943లో అమెరికా యూరప్ కోటలను ధ్వంసం చేస్తే, రెడ్ ఆర్మీ హిట్లర్ సైన్యాన్ని చావు దెబ్బతీసి వెనక్కి తరిమేశాయి. ముస్సోలినీ పతనం చెందగానే ఇటలి యే హామీలు లేకుండానే లొంగిపోయింది. నాజీలు రోమ్‌ను ఆక్రమించగానే ఇటలీ జర్మనీకి ఎదురు తిరిగింది. అమెరికా యుద్ధ విమానాలు పగలూ రాత్రి నాన్ స్టాప్‌గా జర్మనీ పారిశ్రామిక వాడలపై బాంబు వర్షం కురిపించాయి. ఒకే ఒక రాత్రి అమెరికా అయిదు వందల యుద్ధ విమానాలతో బ్రేమిన్ ఆయువుపట్ల పై దాడిచేసి కోలుకోకుండా చేసింది. బెర్లిన్‌పై వందకు పైగా దాడులు చేసింది. హాంబర్గ్ పీనుగుల పెంట అయింది.

1944లో హిట్లర్ సైనికాధికారులు తాము చావు దెబ్బతిన్నట్లు తెలుసుకొన్నారు. కాని హిట్లర్ అహం ఇంకా చావలేదు. ప్రజల బతుకుకంటే తన ప్రిస్టేజ్ ప్రధానమని భావించాడు. శాంతి అసాధ్యమని ప్రతి సైనికుడు వెనక్కి తిరగ కుండా పోరాడి చావాల్సిందేనని హుకుం జారీ చేశాడు. రష్యా అన్నిచోట్లా ఎదురు తిరిగే స్థాయిలో ఉంది. ఒడేస్సాను సేవెస్ట పోల్, మిన్స్క రుమేనియాలను తిరిగిపొంది హంగరీని యుద్ధాన్ని ఆపు చేయమని ఒత్తిడి తెచ్చింది. అమెరికా బ్రిటన్ కెనడాల బలగాలు ఫ్రెంచ్ తీరాలపై మోహరించాయి. రెండు నెలల తర్వాత ఫ్రాన్స్ దాక్షిణ భాగాలను స్వాధీనం చేసుకొన్నాయి. సెప్టెంబర్‌లో అమెరికా సైన్యం జర్మనీలో ప్రవేశించింది. 1945 ఫిబ్రవరిలో బెర్లిన్ సైన్యాన్ని తూర్పుకు తరుముతుంటే రష్యా తూర్పునుంచి దాడి చేసింది. హిట్లర్ పైనా, ఆయన జనరల్స్ పైనా దాడి చేశారు. గాయపడిన హిట్లర్ చావు నుండి తప్పించుకొన్నాడు. ఇంత జరిగినా అపజయాన్ని అంగీకరించ లేకపోయాడు హిట్లర్. మానవత్వం, హృదయమూ లేని ఆజ్ఞలను జారీచేసి వేలాది మంది అమాయకుల ప్రాణాలను బలి తీసుకొని, చివరికి గత్యంతరంలేక అన్ని కార్యక్రమాలకు దూరమయ్యాడు. బాంబులతో ధ్వంసమైన నగరాలనైనా కనీసం వెళ్లి చూడలేదు. శాంతి కోసం ప్రయత్నం చేయలేదు.

మిగిలిపోయిన సైన్యానికి నాయకత్వం వహించి చావో రేవో అంటూ పోరాడనూ లేదు. బాంబ్ ప్రూఫ్ షెల్టర్‌లో తలదాచుకొన్నాడు. భార్య, కొద్ది మంది వీరాభిమానులతో ఉన్నాడు. 1945 ఏప్రిల్ తర్వాత రష్యా జెండా రీచ్ స్టాగ్‌పై ఎగిరింది. హిట్లర్ దాక్కున్న సురక్షిత బంకర్‌పై రష్యా సైన్యం బాంబుల వర్షం కరిపించింది. తనకు చావు దగ్గర పడిందని గ్రహించి హిట్లర్ ఆయన దర్పానికి గర్వానికీ, ఆత్మ ద్రోహానికి మాస్టర్ పీస్ అనిపించే ఒక వీలునామా తయారు చేయించాడు. జరిగిన తీవ్ర నష్టానికి ప్రాణాలకు సానుభూతికూడా చెప్పకుండా, ఇంకా తాను జర్మనీ సంరక్షకుడిని విముక్తిదారుడిని అనే అనే భ్రాంతిలో పడి “actuated solely by love and loyalty” అంటూ “ఆరేళ్ళ యుద్ధం వలన అనేక రకాలుగా ఇబ్బందిపడినా దెబ్బతిన్న జర్మనీ దేశ గౌరవాన్ని పెంచే దాని ఆకాంక్షను తీర్చే గొప్ప ఘనకార్యంగా చరిత్రలో నిలిచి పోతుంది అని రాశాడు. తరుమబడిన సైనికులు కొందరు ఇంకా ఆయన కోసం, ఆశయం కోసం పోరాడుతూనే ఉన్నారు. కాని ప్రపంచాన్ని భయంతో దౌర్జన్యంతో, విచక్షణా రాహిత్యంతో అమానుషంగా వణికించిన జర్మనీ నియంత హిట్లర్ పిరికి వాడుగా తనను కాల్చుకొని 1945 ఏప్రిల్ 30న 56వ ఏట చచ్చిపోయాడు. కొన్ని గంటల క్రితమే ఆయన్ను పెళ్లి చేసుకొన్న మిస్ట్రెస్ విషం తీసుకొని చనిపోయింది. గాసోలీన్ మంటల్లో హిట్లర్ కాలి మసి అయ్యాడు. అవే పాపం ఆయనకు జరిగిన అంత్యక్రియలు.

హిట్లర్ చేసినట్లుగా చెప్పబడే అకృత్యాలు ఈనాడు నమ్మ శక్యంగా ఉండవు. దేశాన్ని ప్రేమించి జాతిని ఉద్ధరిస్తానని మాట ఇచ్చి జర్మనీ ఐక్యత సాధించి ప్రపంచం ఆర్యజాతి సర్వోత్కృష్టతకు మురిసి దేశోద్ధారకుడిని అని ప్రకటించుకొన్న హిట్లర్ అంత క్రూరుడా అనిపిస్తాడు. కాని ఆయనలో ఉన్న ద్వేషం, పగ ప్రతీకారం, దౌష్ట్యం, అధికార దాహం అమానుషత్వం చరిత్రలో మచ్చలుగా మిగిలిపోయాయి.

హిట్లర్ చావును చాలామంది ఆహ్వానించారు. చావుతో ఆయన పేరు కూడా ఖననం అయ్యింది. కొద్దిమంది మాత్రమే ఆయన కోసం ఏడ్చారు. చాలా మందిని ఆయన ఏడ్పించాడు కనుక వాళ్ళకళ్ళల్లో ఆనందం విరిసింది. Hitler' actions and Nazi ideology are almost universally regarded as gravely immoral;[355] according to Kershaw, "Never in history has such ruination—physical and moral—been associated with the name of one man". [356] Hitler' s political programme brought about a world war, leaving behind a devastated and impoverished Eastern and Central Europe. Germany itself suffered wholesale destruction, characterised as Stunde Null (Zero Hour). [357] Hitler

s policies inflicted human suffering on an unprecedented scale;[358] according to R. J. Rummel, the Nazi regime was responsible for the democidal killing of an estimated 19.3 million civilians and prisoners of war. [325] In addition, 29 million soldiers and civilians died as a result of military action in the European Theatre of World War II. [325] The number of civilians killed during the Second World War was unprecedented in the history of warfare. [359] Historians, philosophers, and politicians often use the word "evil" to describe the Nazi regime.Error: [360] shortcode requires URL to be set Many European countries have criminalised both the promotion of Nazism andHolocaust denial
Historian Friedrich Meinecke described Hitler as "one of the great examples of the singular and incalculable power of personality in historical life

English historian Hugh Trevor-Roper saw him as "among the 'terrible simplifiers' of history, the most systematic, the most historical, the most philosophical, and yet the coarsest, cruelest, least magnanimous conqueror the world has ever known". [363] For the historian John M. Roberts, Hitler' s defeat marked the end of a phase of European history dominated by Germany.[364] In its place emerged the Cold War, a global confrontation between the Western Bloc, dominated by the United States and other NATO nations, and the Eastern Bloc, dominated by the Soviet Union.[365] Historian Sebastian Haffner avers that without Hitler and the displacement of the Jews, the modern nation state of Israel would not exist. He contends that without Hitler, the de-colonisation of former European spheres of influence would have been postponed.[366] Further, Haffner claims that other than Alexander the Great, Hitler had a more significant impact than any other comparable historical figure, in that he too caused a wide range of worldwide changes in a relatively short time span.[367]

According to a U.S. Office of Strategic Services report, "The Nazi Master Plan", Hitler planned to destroy the influence of Christian churches within the Reich.[380][381] His eventual goal was the total elimination of Christianity. [382] This goal informed Hitler"s movement early on, but he saw it as inexpedient to express this extreme position publicly. [383]According to Bullock, Hitler wanted to wait until after the war before executing this plan.[384] Speer wrote that Hitler had a negative view of Himmler"s and Alfred Rosenberg 's mystical notions and Himmler's attempt to mythologise the SS. Hitler was more pragmatic, and his ambitions centred on more practical concerns. [385][386]

Researchers have variously suggested that Hitler suffered from irritable bowel syndrome, skin lesions, irregular heartbeat, coronary sclerosis, [387] Parkinson" disease,[273][388]syphilis, [388] giant cell arteritis with temporal arteritis, [389] and tinnitus. [390] In a report prepared for the Office of Strategic Services in 1943, Walter C. Langer of Harvard Universitydescribed Hitler as a "neurotic psychopath". [391] In his 1977 book The Psychopathic God: Adolf Hitler, historian Robert G. L. Waite proposes that Hitler suffered from borderline personality disorder. [392] Historians Henrik Eberle and Hans-Joachim Neumann consider that while Hitler suffered from a number of illnesses including Parkinson' disease, he did not experience pathological delusions and was always fully aware of, and therefore responsible for, the decisions he was making.[393][261] Theories about Hitler' medical condition are difficult to prove, and placing too much weight on them may have the effect of attributing many of the events and consequences of Nazi Germany to the possibly impaired physical health of one individual. [394] Kershaw feels that it is better to take a broader view of German history by examining what social forces led to the Nazi dictatorship and its policies rather than to pursue

narrow explanations for the Holocaust and World War II based on only one person. [395]

Hitler followed a vegetarian diet. [396] At social events he sometimes gave graphic accounts of the slaughter of animals in an effort to make his dinner guests shun meat. [397]Bormann had a greenhouse constructed near the Berghof (near Berchtesgaden) to ensure a steady supply of fresh fruit and vegetables for Hitler throughout the war.[398] Hitler publicly avoided alcohol. He occasionally drank beer and wine in private, but gave up drinking because of weight gain in 1943. [399] He was a non-smoker for most of his life, but smoked heavily in his youth (25 to 40 cigarettes a day). He eventually quit, calling the habit "a waste of money". [400] He encouraged his close associates to quit by offering a gold watch to any who were able to break the habit. [401] Hitler began using amphetamine occasionally after 1937 and became addicted to it in late 1942. [402] Speer linked this use of amphetamine to Hitler' increasingly inflexible decision making (for example, rarely allowing military retreats). [403] Prescribed 90 medications during the war years, Hitler took many pills each day for chronic stomach problems and other ailments. [404] He regularly consumed methamphetamine, barbiturates, opiates, and cocaine.[405][406] He suffered ruptured eardrums as a result of the 20 July plot bomb blast in 1944, and 200 wood splinters had to be removed from his legs. [407] Newsreel footage of Hitler shows tremors of his hand and a shuffling walk, which began before the war and worsened towards the end of his life.[404] Ernst-Günther Schenck and several other doctors who met Hitler in the last weeks of his life also formed a diagnosis of Parkinson' disease. [408] ❁



## 83. జాజ్ యుగపు మూస అమెరికన్ నవలా కదా రచయిత- స్కాట్ ఫిట్జరాల్డ్ (1896-1940)

సాహిత్య చరిత్రకారులు ప్రతి యుగానికి ఒక లక్షణాన్ని ఆపాదిస్తారు. కాని, ప్రస్తుత యుగ లక్షణాన్ని "ఏజ్ ఆఫ్ యాం గ్జైటీ" అన్నవాడు ఎఫ్.స్కాట్ ఫిట్జెరాల్డ్. 4-9-1890న అమెరికా మిన్నెసోటా రాష్ట్రం సెయింట్ పాల్‌లో ఫిట్జెరాల్డ్ పుట్టాడు. తల్లి తరపు దూరపు చుట్టంపై గౌరవంతో ఫ్రాన్సిస్ స్కాట్‌కీ ఫిట్జెరాల్డ్‌గా చర్చిలో పేరు నమోదయింది. మంచి కుటుంబమేకాని దరిద్రంతో అల్లల్లాడింది. తండ్రి చేతకాని దద్దమ్మ. కొడుకుకు పదేళ్ళు రాకుండానే ఉద్యోగం పోగొట్టుకొన్నాడు. 30 ఏళ్ళ తర్వాత ఫిట్జెరాల్డ్ తన ఓటమిని గ్రహించి ఈ విషయాన్ని తండ్రి ముందే గ్రహించాడని తెలుసుకొన్నాడు. ఈ విషయాలన్నీ రాసుకొన్నాడు. ఓటమి, దురదృష్టం అనే రెండు అంశాలమీద ఫిట్జెరాల్డ్ సాహిత్యమంతా నడుస్తుంది. జాన్ ఓ హరా అనే రచయితకు "సగం బ్లాక్ ఐరిష్, సగం పాత అమెరికన్ రక్తంతో గతకాలపు గొప్పల్ని నెమరేసుకొంటూ, ఏదో సాధించామని ప్రగల్భాలు పలకటం అలవాటైంది" అని చెబుతూ "being born in an atmosphere of crack, wise crack and counter crack, I developed a two cylinder inferiority complex. I I spent my youth in alternately crawling in front of kitchen maids and insulting the great"అని చెప్పుకొన్నాడు.

కుటుంబం బీదరికంలో మగ్గుతున్నా తల్లికి ఫిట్జెరాల్డ్ అంటే ప్రాణం. ఒక ఆంట్ ఆతను న్యుజెర్సీలోని న్యూమాన్‌లో ఉన్న కేథలిక్ బోర్డింగ్ స్కూల్లో చేర్పించటానికి సాయం చేసింది. అక్కడ రాణించ లేక పోయాడు. చాలా అందంగా ఆకరణీయంగా, మంచి రంగుతో, నీలి కళ్ళతో అందమైన ముద్దు గుమ్మలాగా కనిపించేవాడు. ఫుట్ బాల్

ఆడేవాడుకాదు. పుట్టుకతో వచ్చిన వక్తృత్వంతో ప్రతి వాడితోనూ వాదించేవాడు. "బీద వాడు- ధనవంతుల స్కూల్" అనేది మనసుపొరల్లో ఎప్పుడూ మసిలేది. 17వ ఏట ప్రిన్స్ టన్‌లో చేరి, అండర్ గ్రాడ్యుయేట్ సాహిత్యకారులతో ముఖ్యంగా జాన్ పీల్ బిషప్‌తో బాగా దోస్తీగా ఉన్నాడు. ఈ స్నేహం జీవితాంతం ఉంది. ఎడ్మండ్ విల్సన్ జూనియర్ ఇతనికి సాహిత్య చేతనగా నిర్వహణకారుడుగా ఉండేవాడు. న్యూమాన్ చేసే తప్పులు చేయక, ఫుట్బాల్ ఆటలో చేరి అయిదు అడుగుల ఏడు అంగుళాల ఎత్తు, 135 పౌండ్ల బరువుతో కొత్త స్క్వాడ్ ఏర్పరచాడు. తర్వాత తనలోని సృజనకు పదును పెడుతూ నాటకాలపై దృష్టి పెట్టాడు. ట్రెయినింగ్ క్లబ్ కోసం ఒక "ఒపరెట్టా" రాశాడు. ప్రదర్శనలో లేకపోయినా గ్రేడులు మాత్రం దారుణంగా రావటంతో కట్టిపెట్టాడు. కాస్ట్యూమ్‌తో ఉన్న అతని ఫోటోను పబ్లిసిటి డిపార్ట్మెంట్ అందరికి చూపించి 'ప్రిన్స్ టన్ కొత్త మ్యూజిక్ నాటకంలో" బహు సొగసైన షో గర్ల్" అని ప్రచారం చేసింది.

సెలవులలో ఇంటికి తిరిగి వచ్చి 19వ ఏట మొదటిసారి జినేర్వా కింగ్ అనే ఒకమ్మాయిని ప్రేమించాడు. ఆమె అందమైన ధనికుల పిల్ల. ఆమెకు అయస్కాంత ఆకర్షణ ఉందని, అన్నిరకాలా ఫిట్జెరాల్డ్‌కు జోడీ అని, అతని పేదరికం, అనిశ్చితత్వం, ఊహలకు తగినదని ఆయన చరిత్రకారుడు ఆర్థర్ మిజేనర్ రాశాడు. ఆమె అన్నిటా విజయాలను సాధించినా అనాఘ్రాత పుష్పం అన్నాడు. ఫిట్జెరాల్డ్ చివరి రోజులలో ఆమెను వదిలిన 20 ఏళ్ళకు కూడా జినేర్వా గురించిన ఆలోచన వస్తే కళ్ళ వెంట కన్నీరు కారేది. తర్వాతెప్పుడో ఆమెను హాలీవుడ్‌లో చూసి మళ్ళీ అదే ప్రేమ మైకంలో పడ్డాడు. వారిద్దరిమధ్య రోమాన్స్ చోటు చేసుకోలేదు. ఆమె దక్కక పోయినా గ్రేడ్లు కూడా దక్కక ఒక ఏదాది చదువు ఆగటమేకాక గ్రాడ్యుయేట్ కాలేక పోయాడు. యూనివర్సిటీ అభిమానమూ పొందలేక పోయాడు. ట్రయాంగిల్ క్లబ్‌కు ప్రెసిడెంట్‌గా ఎన్నిక కాలేక పోయాడు. జేనేర్వా ఇక జన్మలో తనను పెళ్లి చేసుకోదు అనే నిర్ణయానికి వచ్చాడు ఫిట్జెరాల్డ్. ఇది చాలా బాధాకరమైంది. తన నోట్ పుస్తకాలలో "that is the stamp that goes into my books so that people can read it blind like Braile" అని రాసుకొన్నాడు.

మొదటి ప్రపంచ యుద్ధం ఫిట్జెరాల్డ్‌లో దేశభక్తి కాని ఉత్సుకతను కానీ కల్పించలేదు. "ఈ అనివార్య యుద్ధం నన్ను ఇరిటేట్ చేస్తోంది" అన్నాడు. ప్రజల సెంటి మెంటాలిటి తనకు పక్కలో బల్లెంగా ఉందన్నాడు. సైన్యంలో చేరటాని అప్లై చేశాడు. 21 వయసు దాటిన నెలకు అది వచ్చింది. యుద్ధానికి వెళ్ళాడు. తల్లికి జాబు రాస్తూ "cold bloodedly and purely for social reasons" మిషతో యుద్ధానికి వెడుతున్నానని తెలియజేశాడు. ఆతన్ని తీరాలు దాటి పంపలేదు. దానిబదులు చాలా కాంప్‌లలో పని

చేశాడు. ఫోర్ట్ లీవెన్ వర్త్‌లో "the worldÑ s worst second lieutenant" అని చెప్పుకొన్నాడు. "ది రొమాంటిక్ ఈగోయిస్ట్" అనే నవల ఇప్పుడే రాశాడు. దీని రాత ప్రతి తిరస్కరింపబడిన తర్వాత తన ప్రేమికురాలు జినేర్వా పెళ్లి చేసుకో బోతోందని తెలిసింది. అదే సమయంలో ఒక కాంప్ డాన్స్‌లో జేల్డా సేయ్రా అనే అందం ఆకర్షణ, చొరవ వ్యక్తిత్వం ఉన్న బాల్ డాన్స్ బెల్లీ అయిన 18 ఏళ్ళ అమ్మాయితో పరిచయమై ఇద్దరూ ప్రేమ రొంపిలో దిగి భవిష్యత్తుపై కలలు కన్నారు. 1919 ఫిబ్రవరిలో ఫిట్జెరాల్డ్‌ను ఘనంగా ఆర్మీ నుంచి విడుదల చేశారు.

మళ్ళీ సాధారణ పౌరుడై జర్నలిస్ట్ ఉద్యోగం వెతుక్కొని జేల్డాను పెళ్లి చేసుకొందామనుకొన్నాడు..న్యుయార్క్ చేరి ఏడు పత్రికల చేత తిరస్కరింప బడి "నేను ఆఫీస్ బాయ్స్‌ను ఇంప్రెస్ చేయటంలో విఫలమయ్యాను" అనుకోని ఒక అడ్వర్ టైజింగ్ కంపెనీలో కాపీలు రాసే పనికి నెలకు 90 డాలర్లకు చేరాడు. రాత్రిళ్ళు తన కథలకు కేటాయించుకొన్నాడు. అవన్నీ తిరుగుటపాలో క్షేమంగా తిరిగొచ్చేవి. "బేబ్స్ ఇన్ ది వుడ్స్"ను హెచ్.ఎల్.మెంకేన్, జార్జి జీన్ నాథన్‌లు చిన్న సెట్‌గా 30 డాలర్లకు ప్రింట్ చేసేసరికి, 122 ప్రింటెడ్ రిజేక్షన్ స్లిప్పులు అందుకొన్నాడు. జేల్డాకు జాబులు రాస్తూనే ఉన్నాడు. ఈ పరిస్తితుల్లో ఆమె దక్కదేమో అనుమానం పీడించింది. ఆ భయంతో అలబామాలోని మాంట్ గోమరిలో ఉన్న జేల్డాను చూడటానికి ఉన్న కొద్ది డబ్బు ఖర్చు పెట్టి వెళ్ళాడు. ఆమె త్వరగా పెళ్లి చేసుకోవటానికి కాని, అసలు పెళ్లి చేసుకోవటానికి కాని ఇష్టపడలేదు "షేక్స్ పియర్ మొహం" వేసుకొని మళ్ళీ న్యుయార్క్ చేరాడు. చెదిరిన మనసుతో దేవదాస్‌లాగా పూటుగా తాగి రోజులు గడిపాడు. మళ్ళీ స్వంత ఊరు సెయింట్ పాల్ చేరాడు. అప్పటికే రాయటం మొదలెట్టి ఆపేసిన నవలను పూర్తిచేసే ప్రయత్నం చేశాడు. రొమాంటిక్ ఈగోయిస్ట్‌లోని మంచి పేరాలనన్నిటిని తీసుకొని మళ్ళీ ఆ ఎపిసోడ్‌లను తిరగ రాశాడు. కాని సంతృప్తి కలగక విసిరి పారేస్తే ఒక స్నేహితుడు దాన్ని "ది కలేక్టే డ్ వర్క్స్ ఆఫ్ ఫిట్జ రాల్డ్" అనే పేరు సూచించాడు. 23వ ఏట "దిస్ సైడ్ ఆఫ్ పారడైజ్" పేరు పెట్టి పంపాడు. ఎడిటర్ మాక్స్ వెల్ పెర్కింగ్ వెంటనే దాన్ని అంగీకరించి అందులో ఉన్న జీవశక్తికి అభినందించాడు. దశ మారుతుంది అనుకొన్నాడు కాని జేల్డా ఇంకా పచ్చ జెండా ఊపలేదు. పబ్లిషర్ త్వరలోనే అచ్చు పూర్తిచేసి అమ్మకాలకు పెడతానన్నాడు. ఈలోపు పాత కథలు కొన్నిటిని రిపేర్ చేసి కొత్త రూపు తెచ్చాడు. 1919 చివరి మూడు నెలలలో తొమ్మిది రాశాడు. అన్నీ బాగా అమ్ముడుపోయాయి. రేట్లు పెంచి అమ్మారు. "ది సాటర్ డే ఈవెనింగ్" పత్రిక రెండు కథలకు వెయ్యి డాలర్లు ఇచ్చింది. వీటినే రెండేళ్ళ క్రితం డజన్ పత్రికలు నిర్దాక్షిణ్యంగా తిరస్కరించాయి.

"దిస్ సైడ్ ఆఫ్ పారడైజ్" అనే పాక్షిక జీవిత చరిత్ర–అంటే కాలేజి జీవితం, ఖుషీపార్టీలు అడ్వర్టైజ్ ఏజెన్సీ, విఫలప్రేమ, మూడు వారాల తాగుబోతు దేవదాసు జీవితం అన్నీ కలగలిపి రాసిన రచన, అంచనాలకు మించి విజయవంతం అయింది. విమర్శ మిశ్రమంగా వచ్చింది. అరువు తెచ్చుకొని, క్షమించరాని తప్పులతో ఉందని కొందరు అన్నా, అందులోని ఉత్తేజాన్ని ఎవరూ కాదనలేక పోయారు. ఈ నవలలో రచయిత చేయాల్సిన పాపాలన్నీ చేశాడు కాని క్షమించరాని తప్పు ఒకటి ఉంది –అదే బతకటానికి విఫలం కాకూడదని. కాలేజి జీవితానికి చెందిన అత్యంత రొమాంటిక్, నిరాశాలను కాచి వడపోసిన అమెరికన్ నవల అని పించుకొన్నది. కొన్ని నెలలలోపే ఈ పుస్తకం అండర్ గ్రాడ్యుయేట్ల "బైబిల్" అయింది ఆరాధ్యమై కూర్చుంది. నవలాకారుడు ఫిట్జెరాల్డ్ జాజ్ యుగపు ఉడుకు లెత్తే యువ రక్త నాయకుడు అయ్యాడు. స్టాక్ మార్కెట్ స్పెక్యులేషన్‌కు, రాజకీయ అవినీతికి అది బంగారు కాలం. నిష్ఫలమైన మద్యపాన నిషేధాలు, బలిసి దొంగ లిక్కర్ తయారు చేసే బడా వ్యాపారులకు అది అంది వచ్చిన కాలం. ఈ యుగానికి ఫిట్జెరాల్డ్ ప్రతినిధి అయ్యాడు– అద్భుత భవిష్యత్ ఉన్న "గోల్డెన్ బాయ్" అని పించుకొన్నాడు.

చాలా ఏళ్ళ తర్వాత భయంకరమైన బీదరికపు హద్దులు, మరీ భయపెట్టే ధన ప్రభావాల గురించి స్వగతాలు రాశాడు. డబ్బు యావ మాత్రం అతన్ని వదలలేదు. అది జేల్డా చుట్టూ తిరుగుతూనే ఉంది. జేబులో గలగలమంటూ డబ్బు ఉంటే ఆమెను ఒక ఏడాది తర్వాత పెళ్లి చేసుకొని అపనమ్మకం, వైరాను దూరం చేసుకొని, ఒక విప్లవ కారుడిగా కాకుండా రగిలిపోయే రైతుగా ఉండాలనుకొన్నాడు. తనతోబాటే ఉంటున్న తన స్నేహితులకు అంత డబ్బు ఎలా ఎక్కడి నుంచి వస్తోందో అర్థం కాలేదు. అంత డబ్బున్న తన స్నేహితులలో ఎవరికో ఒకరికి ఆ అమ్మాయిని ఇచ్చి కట్ట బెడితే? ఇలాంటి ఆలోచనలన్నీ బుర్ర నిండాసుళ్లు తిరుగుతున్నాయి.

మొత్తం మీద కల నెరవేరి యువ దంపతులై ఒక కూతురు ఫ్రాన్సెస్‌ను కన్నారు. ఆ నిరాశా జనక కాలంలో కూతురు తండ్రి బొమ్మలను ఆరాధిస్తూ గడిపింది. అవి హీరో హీరోయిన్‌ల గురించి అతిశయోక్తులకే అతిశయోక్తులుగా ఉన్నాయి. రగిలే యువతకు ప్రతి రూపాలు. బొమ్మల కొలువులో వాళ్ళు రాజు, రాణిగా ఉండి ఫిక్షనల్ పాత్రలై అలరించాయి. టాక్సీలపై వీటిని పెట్టుకొని తిప్పుతుంటే న్యూయార్క్ నగర వాసులకు చీమ కుట్టినట్లుగా కూడా లేకపోయింది. ఎవరినీ ఆకర్షింపలేక పోయాయి. అవి కనబడిన ఫౌంటెన్‌లలోకి దూకటం, బట్టలు దాదాపు విప్పుకు తిరగటం డిన్నర్ టేబుల్స్ దగ్గర డాన్సులు చేయటం, ఫైర్ అలారాలను మోగించటం, దాని రక్షకులు ఎక్కడ మంట ఎక్కడ మంట అంటూ పరిగెత్తుకు రావటం జేల్డా తన రొమ్ముల్ని చూపించి

ఇక్కడే అనటం–ఇదంతా ఒక కౌమార ఆటగా అసంబద్ధ ఉల్లాస భరిత కలగా ఫిట్జెరాల్డ్ ప్రతిధ్వనింప జేశాడు. ప్రపంచాన్ని జయించిన తర్వాత అలెక్సాండర్, అనుభవించిన దుఃఖం, ఒక రోజు ఫిఫ్త్ ఎవేన్యుపై స్వారి చేస్తుంటే విజయం, నష్టాల అసంబద్ధత (పారడాక్స్) అనుభవించటం "నేను గట్టిగా అరిచాను–కారణం నాకు నేను కోరింది అంతా దొరికింది. ఇంత ఆనందం నేను మళ్ళీ పొందలేను అని" రాశాడు.

పార్టీలకు డబ్బు కట్టాలి చిన్న కథలు బాగానే ఆదాయాన్నిస్తున్నాయి కాని అప్పుల్లో కూరుకుపోయి రాయబోయే, రాబోయే 10 పుస్తకాలను తాకట్టుపెట్టి పదహారు వందల డాలర్లు ప్రింటర్స్ దగ్గర అప్పు తీసుకొన్నాడు. జేల్డా విపరీత దుబారా ఖర్చు రాబడిని తెలుసుకోకుండా చేస్తున్న అనవసర ఖర్చు భరించలేక మళ్ళీ తాగుడుకు బానిసై ఇంటికి దూరమై బతుకుతున్నాడు. ఫిట్జెరాల్డ్ దంపతులు స్థిరంగా ఒక చోట ఉండలేక ఊళ్లు ఇళ్ళు మారుతున్నారు. ఈ కాలపు మొదటివివరాలన్నీ "ఫ్లాపెర్స్ అండ్ ఫిలాసఫర్స్" అనే చిన్న కథల సంపుటిలో చూపాడు. 25 ఏళ్ళ రచయితకు రావాల్సిన కీర్తి రాలేదు. కాని రెండవ నవల "ది బ్యూటిఫుల్ అండ్ డామ్మేడ్" డబ్బు పెద్దగా రాల్చక పోయినా గొప్ప అన్వేషణ ఉంది. జీవితం అంటే ఏమిటి అనే ప్రశ్న వేసుకొని సమాధానం వెతికాడు. విషాదాంతమే అయినా నూటికి నూరు శాతం అర్థరహితం అన్నాడు విల్సన్. హీరో హీరోయిన్ ఇద్దరూ పరమ డిబాచరర్‌లుగా ఉండి, మొదటి నుంచి చివరదాకా యే సీరియస్ పనీ చేయక, ఆ పిచ్చిమాలోకాలు హేతువాదులుగా అనిపిస్తారు. వాళ్ళు సామాన్య జీవితాన్ని స్పర్శించినప్పుడల్లా మానవ వ్యవస్థలు ఏవగింపు కలిగే ఫార్స్‌గా, పనికిమాలిన అసంబద్ధమైనవిగా చూపిస్తారు. చివరగా సైన్యం డబ్బు పిచ్చి లోకం, వ్యాపార దృష్టిలను బహిర్గతం చేస్తారు గౌరవమర్యాదలూ విషయమూ ఏమీ లేకుండానే అని రాశాడు విల్సన్.

డిగ్నిటి మీద వ్యామోహంతో ఫిట్జెరాల్డ్ లాంగ్ ఐలాండ్‌లో డబ్బు మంచినీళ్ళ ప్రవాహంలా ఖర్చుచేశాడు. ఒక్క ఏడాది లోనే 36 వేల డాలర్లు తగలేశాడు. ఇంకో అయిదు వేల డాలర్ల అప్పులో మునిగాడు. అప్పు చేసి పప్పు కూడు అంటే ఏమిటో రుజూ చేశాడు. "స్కాట్ గురువు" స్కాచ్ తాగి "వెజిటబుల్స్" అనే నాటకం రాశాడు. అందులో కొంచెం రాజకీయ వ్యంగ్య వాసన ఉండటంతో ఫెయిలయింది. చిన్న కథల రెండవ సంపుటి "టేల్స్ ఆఫ్ ది జాజ్ ఏజ్" విడుదల చేశాడు. ఇందులో "లీస్ ఆఫ్ హాపినేస్, మే డే", "ది డయమండ్ యాజ్ బిగ్ యాజ్ రిట్జ్" అనే మూడు కట్టు కథలు –ఫేబుల్స్ ఉన్నాయి. అప్పటికి వయసు 27 మాత్రమే. కొన్ని నెలల తర్వాత ఫిట్జెరాల్డ్‌లు అన్ని విలాసాలకు దూబరా ఖర్చులకు దూరమవ్వాలని యూరప్‌కు మకాం మార్చారు. ఫ్రాన్స్‌లో జేల్డా ఒక యువ ఫ్లయర్‌తో ప్రేమాయణం సాగించింది. ఫిట్జెరాల్డ్ అహం

దెబ్బతిన్నా, అతని ప్యూరిటన్ భావాలకు విఘాతం కలిగినా నోరు మెదపలేక పోయాడు. దీనివలన తాను పరిణతి చెందానని అనుకొని పబ్లిషర్‌కు జాబు రాస్తూ "నేను చాలా అసంతృప్తితో ఉన్నాను. కాని నా పనికి ఆటంకం లేదు. నేను ఎదిగాను" అని రాశాడు. రోమ్‌కు చేరారు. అసహనం పెరిగి అందరితో పోట్లాడుతూ ఫిట్జెరాల్డ్ ఒక టాక్సీ డ్రైవర్‌తో తగాదాపడి వాడిని కొట్టి దెబ్బలు తిని అరెస్టయి జైలుకు వెళ్ళాడు. కాప్రి స్వర్గం అనుకొన్నాడు. పెద్ద ప్రేగు వాచి ఇన్ఫ్లుఎంజా బారినపడి ఇద్దరూ మళ్ళీ ఫ్రాన్స్ చేరారు "వెయ్యి పార్టీలు-పని నిల్"అని రాసుకొన్నాడు.

తాగుడుకు ఏదీ అడ్డం కాలేదు. నాన్ స్టాప్‌గా పెగ్గు మీద పెగ్గు లాగిస్తూనే ఉన్నాడు. తాగి ఎక్కడికి వెడుతున్నాడో తెలీక వెళ్లి ఎవరి దయా దాక్షిణ్యాలతోనో తిరిగి వచ్చేవాడు. ఇదీ అయ్యగారి "పాన కత". అయిదేళ్ళలో లక్షా పదిహేను వేల డాలర్లు సంపాదించి అంటే ఏడాదికి ఇరవై మూడు వేల డాలర్లు పోగేసుకొంటూ కూడా సాధారణ రచయితలు కలలు కనే సుఖమయ జీవితాన్ని అనుభవించ లేకపోయాడు. పబ్లిషర్‌కు రాస్తూ "మా జీవిత స్థాయిని తగ్గించుకోలేం. ఈ ఆర్థిక అరక్షణను ఎదుర్కోలేను" అని తెలియజేశాడు. ఇంకా తాను హాండ్‌సమ్‌గా అండర్ గ్రాడ్యుయేట్‌గా అడాలసెంట్‌గా ఉన్నాననే భ్రమపడుతూ, అవతల వారిని ఆకర్షించలేక, చిలిపి పరిహాసం, జోకులతో, ఒక్కోసారి అవి వెనక్కి పేలగా ఇబ్బంది పడుతూ చివరికి పరిస్థితిని యెంత దాకా తెచ్చుకొన్నాడు అంటే స్నేహితులందరూ "సారీ"తోనూ హోటళ్లు అన్నీ "నో ఎంట్రీ" బోర్డులతోనూ వెనక్కి పంపించే దాకా. ఇందులోంచి బయట పడెయ్యటానికి జేల్డా కొత్త ఉత్సాహ ప్రేరకంగా అనేక చిట్కాలు ప్రయోగించి చివరికి ఆత్మహత్య దాకా వెళ్ళింది. స్కాట్ మరింత బరి తెగించి డిప్రెస్ అయ్యాడు. "నాకు ఇంకా 22 ఏళ్ళే. నారచనే నన్ను సంతోష పెడుతుంది. నేను మెంటల్‌గా ఫిజికల్‌గా హాంగోవర్‌లో ఉన్నాను" అని రాశాడు.

పరిస్థితులు ఇలా ఉన్నా కూడా ఫిట్జెరాల్డ్ మరో రెండు పుస్తకాలు "ది గ్రేట్ గాట్స్ బి", "ఆల్ ది శాడ్ యంగ్ మెన్" విడుదల చేశాడు. రెండవది 1926లో వచ్చింది. ఇందులో అతని పాత కథలు రెండు-రిచ్ బాయ్, వింటర్ డ్రీమ్స్" ఉన్నాయి. గాట్స్ బి మాత్రం ఫిట్జెరాల్డ్ రచనలలో మాస్టర్ పీస్. ఇంకా తప్పించుకొనే వారి గురించి సహజ ముద్దులు గురించే రాస్తున్నాడు. బైరానిక్ లవ్ ఆఫ్ రోమాన్స్‌ను రొమాంటిక్‌లపై రియలిస్ట్‌ల వెక్కిరింతల్నీ, పేదవాడు ధనికులను ఆరాదించటాన్ని ఆర్టిస్ట్‌లు డబ్బును ఏవ గించుకోవటాన్ని రాస్తూ ఒక వైపును సమర్ధించటమూ చేశాడు. విశ్లేషకులు ఫిట్జెరాల్డ్ ప్రోగ్రెస్‌ను వివిధ కారణాలతో సమర్ధించారు. హెచ్ ఐ మెంకాన్ "The Great Gatsby is an exposure of the florid show of American life

--the high carnival of those who have too much money to spend and too much time for the spending of it" అంటే టి ఎస్ ఇలియట్ "the first step that American fiction has taken since Henri James" అని మెచ్చుకొన్నాడు.

అమెరికాకు తిరిగొచ్చాక తాను ఏదో ప్రశాంతమైన స్థలంలో ఉండి తనమనసులో ఉన్న విషయాలపై రచన సాగిస్తానని ప్రకటించాడు ఫిట్జెరాల్డ్. మళ్ళీ నిలకడ లేనితనం, బాధ్యతారాహిత్యంతో ఉండిపోయి పదేళ్లకు కాని ఏదీ రాయలేక పోయాడు. హాలీఉడ్ కు ఆఫర్ వచ్చి "బంగారు లప్ప" ఏదో దొరుకుతుందని తిరస్కరించకుండా వెళ్ళాడు. అక్కడా పార్టీల హోరు ప్రాక్టికల్ జోకులతో యే పనీ చేయలేదు. ముడ్డి మీదకు ముప్ఫై ఏళ్ళు వచ్చినా పాత పద్ధతి మారక "ఆడాల సెంట్ స్థాయి" నుంచి ఎదగ లేదు. "తాగుబోతు నాయాల"గానే ప్రవర్తించాడు. కాన్స్టాంట్ టల్మాడ్గే అని జాజ్ యుగపు విఫల వ్యక్తిపై కథ రాస్తే తిరస్కరిస్తే భార్యతో కలిసి తూర్పుకు వెళ్లి డేలావార్ విల్లింగ్టన్ దగ్గర ఒక పాత ఇంటిని కొని ఇంటినీ వ్యవహారాన్ని బాగుచేసుకొని బాగున్నారు. విదేశాలలో ప్రారంభించిన కొత్త నవల దాదాపు ఇక్కడ పూర్తి చేశాడు. కొంప చాలా పెద్దదవటం నిర్వహణ కష్టమవటంతో రోజూ జల్డాతో పోట్లాడేవాడు. ఇరుగు పొరుగుతో నిత్యం తగూ పడేవాడు. పనిలో కూరుకు పోయేవాడు. ఏడాదిలోపే దీన్ని వదిలేసి మళ్ళీ పారిస్ చేరారు. వయసు పెరిగి ఇక డాన్స్ చేయలేక జేల్డా తన వ్యాపకం ఏదో చూసుకోవాలని అనుభవం లేక పోయినా 28 ఏళ్ళకు ప్రొఫెషనల్ బాలెట్ డాన్సర్ అయింది. అంతకు ముందు ఏడాది ఫిట్జెరాల్డ్ రాబడి సుమారు ముప్ఫై వేల డాలర్లు. అయినా గురుడు అప్పుల అప్పారావే అయ్యాడు. తరువాత రెండేళ్ళు యూరప్, అమెరికాల మధ్య ఆసులో గొట్టం లాగా తిరిగాడు. జేల్డా ఉత్సాహం తెచ్చుకొని వృత్తిలో నిలబడితే అయ్యగారు మొరోజ్‌గా తన పాత కథల రిపేర్‌లో పడ్డాడు. భార్యపైనా తనపైనా ఇర్రిటేషన్ ఆపుకోలేక తరచుగా డిప్రెషన్‌లో పడి కయ్యానికి కాలు దువ్వుతూ మానసిక క్షోభ పడుతూ ఆమెకూ కలిగించి, ఇక తగ్గడు అన్నట్లుగా ప్రవర్తించాడు. జేల్డా డాన్సర్‌గా ఫెయిల్ అయి, బాగా దెబ్బ తింది. 1930లో ఆమె బాగా కుంగిపోయింది. స్విట్జెర్లాండ్‌లో మానసిక చికిత్స కోసం ఆమెను తీసుకువెళ్ళాడు. ఆమె "స్కిజియో ఫ్రేనేక్"తో బాధ పడుతున్నట్లు నిర్ధారణ అయింది. ఇక జీవితాంతం మానసిక దెబ్బతిన్న ఆమెను కనిపెట్టుకొని ఉండాల్సిన స్థితి కలిగింది. శానిటోరియంలలో కొంత నయమనిపించినా మళ్ళీ తిరగ బెట్టేది. పూర్తిగా ఎప్పుడూ కోలుకొనే లేదు. అయనా ఆమె ఇంటలిజేంస్ లెవెల్ ఏమాత్రం తగ్గలేదు. 1932లో బాల్టిమోర్ హాస్పిటల్‌లో చేర్చాడు. ఈ హాస్పిటల్‌లో

ఉండగానే అక్కడ జరిగిన అగ్నిప్రమాదంలో జేల్డా మరణించింది.

1932 లో ఆల్కహాల్ బానిసత్వం నుండి బయట పడాలనుకొన్నాడు. కాని మందు ఎందుకు తాగాడో కారణాలు బాగా చెప్పటం ప్రారంభించాడు. ఒక స్నేహితుడితో పోట్లాడి, డిప్రెషన్‌లో తనంతకు తానే స్నేహితులులేని లోకంలో జీవించసాగాడు. హెమింగ్ వే గురించి చెబుతూ "ఆతను ఎప్పుడూ విజయాల గురించే గట్టిగా చెబుతాడు. నేను సాధికారికంగా ఓటముల గురించి చెబుతాను" అన్నాడు. ఏదో విధంగా తంటాలు పడి తొమ్మిది చిన్న కథలు గిలికాడు. ఎక్కువ ధర కావాలని డిమాండ్ చేయలేదు. ఇప్పటిదాకా రాసిన పుస్తకాలపై రాయల్టీలు ఇప్పటికి సున్నకు సున్నా హళ్లికి హళ్ళి. "టెండర్ ఇన్ ది నైట్" 1934లో కొన్ని వేలకాపీలు మాత్రమే అమ్ముడయ్యాయి. విమర్శకులు సానుభూతి చూపకుండా దారుణంగా విరుచుకు పడ్డారు. చదువరులు మాత్రం దెబ్బతిన్న సమాజాన్ని బాగా చూపించాడని భవిష్యత్తుపై ఆశ కల్పించాడని అనుకొన్నారు. "All gods dead, all faith in man shaken" అని రాస్తూ సి హోర్టి గ్రాటేన్ "the feverish beauty of a class in decay ,the polished charm of a decadence that is not yet self conscious" అన్నాడు. "the story of a psychiatric husband and a psychoneurotic wife who ruin each other" అనిపిస్తుంది ఇలియట్ తన వేస్ట్ లాండ్‌తో పోల్చాడు. టెండర్ ఈజ్ ది నైట్‌లో గుండెపగిలే బుర్ర తిరిగే సంఘటనలు ఉన్నా, ఆదుర్దా, అలసటలు ఉన్నాయి వీటినే ఫిట్జెరాల్డ్ "ఎమోషనల్ దివాలాతనం" అన్నాడు. ఇదే ప్రతిచోటా కనిపిస్తుంది.

38వ ఏట పాత ట్రాక్ నుంచి దారి మార్చుకొని ఇదివరకెప్పుడూ ప్రయత్నించని విధానంలో 19వ శతాబ్దపు హిస్టారికల్ రోమాన్స్ "ది కౌంట్ ఆఫ్ డార్క్ నెస్" రాశాడు. 39లో ఇదివరకు అచ్చుకాని కథలను పోగేసి "టాప్స్ ఎట్ రివెల్లి" పేరుతో ప్రచురించాడు. పసలేని పుస్తకం అయింది. విమర్శకులు విపరీతంగా విరుచుకుపడి "దారుణం అలా ఉండ కూడదు" అన్నారు. నలభై వ పడిలో ఫిట్జెరాల్డ్ తన పని అయిపోయిందనుకొన్నాడు. ఇప్పుడు రాసిన కథలు ఇది వరకెప్పుడూ లేనట్లుగా తిరిగొచ్చాయి. నిరాశా నిస్పృహలతో జీవిత చరిత్ర శకలాలు రాస్తున్నాడు. తాత్కాలిక ఉపశమనానికి రక్షణకు మళ్ళీ హాలీవుడ్ వెళ్ళాడు. 41 ఏడు సమీపిస్తుండగా నలభై వేల డాలర్లు బాకీ పడ్డాడు. అసలే "లాస్" అయి జరిగిన నష్టాన్ని పూడ్చుకోవటానికి "లాస్ ఏంజెల్స్" వెళ్ళాడు. కొత్త ఆశ కొత్త జీవితం కొత్త మాధ్యమం కోసం ఎదురు చూశాడు. కాని "వెనకటి గుణ మేల మాను వినరా సుమతీ" అన్నట్లు పాత కథ మళ్ళీ మొదలెట్టి తాగి తందనాలాడాడు. సృజన

పోయి అవతలి వాడి రచనలకు మార్పులూ చేర్పులూ చేస్తూ గడిపాడు. కాని అయ్యగారి ట్రీట్ మెంట్ స్పందన కలిగించ లేకపోయింది. తను ఎంతో గొప్ప రచన అని గర్వంగా చెప్పుకొనే ఒక నవలను హాలీవుడ్ జనం పూర్తిగా మార్చేసి ఫిట్జెరాల్డ్ సంభాషణలలో కిక్, వినోదాలు లేవని "డ్రై"లాగులు" కుట్టారు. అతని గౌరవం ఒక్కసారిగా కూలిపోయింది. పబ్లిక్ అతన్ని అసలు పట్టించుకోవటం మానేశారు. అతనితోపాటు స్క్రిప్ట్ రైటర్‌గా ఉన్న బడ్ శుల్ బెర్గ్ "స్కాట్ ఫిట్జేరాల్డా! అతడు చనిపోయాడను కొన్నాను" అన్నాడు. అదీ హాలీవుడ్‌లో ప్రముఖ రచయిత ఫిట్జెరాల్డ్ పరిస్థితి. అతని ఏజెంట్‌లు ఫిట్జెరాల్డ్ ఏదీ రాయ లేదని, స్వయంగా ఇక ఏదీ రాయలేదని కథలకు అడ్వాన్స్‌లు ఇవ్వటం మానేశారు. హాలీ వుడ్‌లో ఉద్యోగం ఏది రాదు. హాలీవుడ్‌లో ఏదీ రాకపోయినా "ఆల్కహాల్"లో అన్నీ ఉన్నాయని తెగ తాగి అందరి చేత ఛీ కొట్టించుకొంటూ, మనిషి కనిపిస్తే పురుగును చూసినట్లు దూరం పారిపోతూ వెగటు పుట్టించే స్థితి కొని "సారీ" "తాగి" తెచ్చుకొన్నాడు. "నేను ముసలివాడినై జబ్బుతో ఉన్నాను" అని ఫిర్యాదు చేశాడు. నలభై మూడుకే ముసలితనం! విడ్డూరం. ఈ హాలీవుడ్ భాగోతాన్ని బయటపెడుతూ ఒక నవల రాయాలని ప్రయత్నంలో ఉండి వందలాది విషయాలను నోట్ చేశాడు.

1940లో మొదటిసారి హార్ట్ ఎటాక్ వచ్చింది. భయపెట్టింది కాని ధైర్యం తెచ్చుకొని ఆ హాలీవుడ్ నవలపై మళ్ళీ దృష్టి పెట్టాడు. దీనికి "ది లాస్ట్ టైకూన్" పేరు పెట్టాడు కాని పూర్తి చేయలేకపోయాడు. దీన్ని అత్యంత విస్తృతంగా మనసు పొరల్లోకి దూసుకుపోయేట్లు రాయాలనుకొన్నాడు. "I want to write scenes that are frightening and inimitable" అని చెప్పుకొన్నాడు. మరో నెలకు మరో సారి విపరీతమైన గుండె జబ్బువచ్చి 21-12-1940న 44 దాటిన మూడు నెలలకే స్కాట్ ఫిట్జెరాల్డ్ చనిపోయాడు.

ఫిట్జెరాల్డ్‌లాగా యే రచయిత రచనా, జీవితం ఒకటై భాసించలేదు. ఎక్కడ తన కథ ముగిస్తాడో ఎక్కడ లేజేండరి పాత్ర ప్రారంభిస్తాడో తెలీకుండా రాసే నేర్పు అతనిది. వేదింపబడిన రచనా సృష్టికర్తను, సంతోషంలేని పాత్రలనుండి వేరు చేయలేము. అతను అతని ఫిక్షన్ ఫిగర్లు పరిణతి చెందని కలల బేహారులు. విజయం పొందినప్పుడు పొందిన ఆదుర్దా, అపజయంలో వేదనలను ఒకే తీరున పంచుకొంటారు. హాలీవుడ్‌కు వెళ్ళక ముందు "ఎందుకు నేను వ్యధను కోరుకున్నానో వేదన పొందానో ఆలోచించటానికే , విచార భావం విచార ప్రవర్తన, ట్రాజెడీపై ట్రాజిక్ ప్రవర్తన, ఎందుకు నేను నా భయానక పరిస్థితి, జాలి, దయలతో ఏకీభవించి పోయానో ఆలోచించటానికే నేను పూర్తి ప్రశాంతతను కోరాను" అని చెప్పాడు. ఫిట్జెరాల్డ్ చనిపోయే నాటికే అతని రచనలన్నీ ప్రచురితమైనాయి.

అయిదేళ్ళ తర్వాత ఫిట్జెరాల్డ్‌ను మళ్ళీ కనుగొని ఆవిష్కరించారు. ఫిట్జెరాల్డ్ తిరిగి రాక ఎడ్మండ్ విల్సన్ ఎడిట్ చేసిన "ది క్రాక్ అప్" ప్రచురణతో జరిగింది. ఇందులో అత్యంత స్వీయ ఒప్పుకోళ్ళు, వ్యాసాలూ, నోట్స్, ప్రక్షిప్తాలు, కూతుళ్ళకు ప్రేమ ఆప్యాయతా ఉట్టిపడేలా రాసిన ఉత్తరాలు ఉన్నాయి. దీని తర్వాత డోరోతి పార్కర్ ఎడిట్ చేసిన "ఎఫ్. స్కాట్. ఫిట్జెరాల్డ్–ది మాన్ అండ్ హిస్ వర్క్" 1950లో వచ్చింది. అతని గ్రేట్ గాట్స్ బి నవల వ్యక్తి సంక్షోభానికి అదే విశ్వవ్యాప్త సూత్రతకు డాక్యుమెంట్‌గా నిలుస్తుంది.

ఫిట్జెరాల్డ్ ప్రభావం ఆయన మొదటి రచన ప్రచురణ అయిన నాటి నుంచే ఉంది. గాట్స్ బి నవల చదివి ఇలియట్ ఆయనకు ఉత్తరం రాస్తూ హెన్రి జేమ్స్ తర్వాత అమెరికన్ ఫిక్షన్‌ను పండించినవాడు అతనే అన్నాడు. Don Birnam, the protagonist of Charles Jackson 's The Lost Weekend, says to himself, referring to The Great Gatsby, "There' no such thing …… as a flawless novel. But if there is, this is it. "[53] In letters written in the 1940s, J. D. Salinger expressed admiration of FitzgeraldÑ s work, and his biographer Ian Hamilton wrote that Salinger even saw himself for some time as "Fitzgerald' successor". [54] Richard Yates, a writer often compared to Fitzgerald, called The Great Gatsby "the most nourishing novel [he] read …… a miracle of talent …… a triumph of technique". [55] It was written in a New York Times editorial after his death that Fitzgerald "was better than he knew, for in fact and in the literary sense he invented a generation …… He might have interpreted them and even guided them, as in their middle years they saw a different and nobler freedom threatened with destruction".

21వ శతాబ్దంలో గాట్స్ బి మొదలైన ఫిట్జెరాల్డ్ రచనలు మిలియన్‌ల కొద్దీ కాపీలు అమ్ముడయ్యాయి. గాట్స్ బి ఎప్పుడూ బెస్ట్ సెల్లర్‌గానే ఉంది' స్కూళ్ళు కాలేజీలలో దాన్ని బోధిస్తున్నారు ఆయన 5 నవలలు, 3 నావెల్లాలు, 10 చిన్నకథా సంపుటాలు రాశాడు. ఆయన నవలలు సినిమాలుగా వచ్చాయి. ఎన్నో సంస్థలు ఆయన పేరు పెట్టి గౌరవించాయి. ఆయన రాత ప్రతులు బహు భద్రంగా భద్ర పరచబడ్డాయి.❁



## 84. అమెరికా దక్షిణప్రాంత సాహిత్య లహరికి నోబెల్ పొందిన- విలియం ఫాక్నర్ (1897-1962)

టి.ఎస్.ఇలియట్ లాగా విలియం ఫాక్నర్ "అతి" వలన పరాజయం పొందిన, దాని అపరాధానికి అంతమైన, దాని గర్వానికి, మాయ నటనకు నాశనమైన, శిధిలమవుతున్న ప్రపంచంలో ఎదురు చూపులు చూస్తూ, చావును కోరుకొంటూ బతికినవాడు. ఇలియట్ లాగానే రాసిన శక్తివంతమైన కొన్ని, ఆ కాలపు పెసిమిస్టిక్ సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందాడు. ఇలియట్‌లాగా కాకుండా తను పుట్టిన తనకు అన్నం పెట్టిన మట్టినే నమ్మి తాను ఎంచుకొన్న తన "ఊసర క్షేత్రం 'సౌత్ లాండ్‌ను" పండించే ప్రయత్నం చేస్తూ, జన్మ భూమిని, సంస్కృతిని, పౌరసత్వాన్ని ఎప్పుడూ నిందించని వాడు ఫాక్నర్.

25-9-1897న నలుగురు సోదరులలో పెద్దవాడుగా అమెరికాలో న్యు ఆల్బనిలోని మిసిసిపిలో పుట్టాడు. బాల్యంలోనే తండ్రి "గౌరవ మర్యాదల" కోసం హత్య చేయబడ్డాడు. తాతగారు చేయించిన ఈ ఘాతుకంలో ఎవరూ చావ లేదు. తల్లి కుటుంబాన్ని యూనివర్సిటి టౌన్ ఆక్స్‌ఫర్డ్‌కు మార్చింది. కుటుంబంలో ఈ హత్యలు మామూలే. ఫాక్నర్ తాత విలియం కూబర్ట్ ఫాక్నర్ చాలా ఊహా ప్రపంచ జీవితం గడిపాడు. 14వ ఏటనే ఇంట్లోంచి పారిపోయి, మెక్సికన్ యుద్ధంలో చేరి, కెప్టెన్‌గా తిరిగొచ్చి, లా చదివి, చిన్ననాటి స్వీట్ హార్ట్‌ను పెళ్ళాడి, సివిల్ యుద్ధకాలంలో ఒక వాలంటీర్ దళాన్ని ఏర్పరచి, యుద్ధం తర్వాత గొప్ప లీగల్ ప్రాక్టిస్ చేసి 40లో ప్రసిద్ధుడయ్యాడు. 50నాటికి

లెజెండరివ్యక్తి అయి, ఒక బ్యాంకర్‌తో భాగస్వామి అయి, రైల్ రోడ్ నిర్మించి, రచయితగా పేరు పొంది "వైట్ రోజ్ ఆఫ్ మెంఫిస్", "లిటిల్ బ్రిక్ చర్చ్"లను "అంకుల్ టామ్స్ కేబిన్"కు దీటుగా రాసి స్టేట్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యాడు. ఈ బహువిధ జీవన వ్యాపారం తన భాగస్వామితో జరిగిన పోట్లాటలో ద్వేషంగా మారి కాల్చి ఆయన్ను చంపి పారేసే దాకా వచ్చింది. అందరూ తాతను కల్నల్ అని పిలిచేవారు. ఆయనే ఫాక్నర్‌కు ఆదర్శం. తాను రాసిన నవలలో కథల్లో ఆ పాత్రను అద్భుతంగా పండించాడు కూడా.

తాతకాలం నుండి కుటుంబానికి గౌరవ ప్రఖ్యాతులు పుష్కలంగా ఉండేవి. ఫాక్నర్ తండ్రి స్వంత ఫామిలి రైల్ రోడ్‌కు కండక్టర్. ఫాక్నర్ గతకాలపు స్మృతులలో తేలుతూ వర్తమానాన్ని పట్టించుకొనే వాడు కాదు. స్కూల్‌లో చదవటం ఇష్టం ఉండేది కాదు. హైస్కూల్ చదువు కూడా పూర్తి చేయలేదు. చదువులో దిశా నిర్దేశం లేక, తప్పుల్ని సరిదిద్దేవారు లేక చాలా అతిశయంతో కీట్స్ కవి స్వచ్ఛ రోమాన్టిజం నుంచి ఫ్లాబర్ట్ రియలిజం దాకా దేకాడు. యవ్వనంలో ఉన్నప్పుడే కవిత్వం రాశాడు. మొ. ప్ర. యుద్ధం ప్రారంభమవగానే విమాన దళంలో చేరాడు. అమెరికా వాయుసేన విమానాలు నడపటానికి తిరస్కరించాడు. "యాంకీల" బాసిజాన్ని నిరసించే భేషజం ఉన్నవాడు. 21వ ఏట బ్రిటిష్ ఎయిర్ ఫోర్స్‌లో చేరి, ఫ్రాన్స్ యుద్ధంలో గాయపడి, యుద్ధం పూర్తి అయినా ఫ్లైట్ ట్రెయింగ్‌లోనే ఉండి, తాను గొప్పలు చెప్పుకొనే గాయం యుద్ధంలో కాక ఆర్మిస్టిక్ డే ఉత్సవాలలో తగిలిన గాయమే అది అని తెలిస్తే ఎవరైనా నవ్వి పోతారు. "నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు" రకం.

ఆక్స్‌ఫర్డ్‌లో చేరి చిన్న ఇంటికి పెయింటింగ్, కప్పు బాగు చేత, కార్పెంటరి ఉద్యోగాలు చేస్తూ బతికాడు. అప్పుడే రైతులు, కౌలుదార్లు నీగ్రోలు చెప్పిన అనేక కథలను విన్నాడు. వాటిని సేకరించాడు. అనేక పుకార్లు నమ్మాడు. మళ్ళీ ఒకసారి బడి చదువు ప్రయత్నం చేశాడు ఆక్స్‌ఫర్డ్‌లో మిసిసిపి యూనివర్సిటిలో చేరి లెక్కలు ఇంగ్లీష్‌లలో తప్పి, రెండో ఏడాది చదవకుండానే బయటికొచ్చాడు. యూనివర్సిటిలో ఉన్న మిసిసిపి రచయిత స్టార్క్ యంగ్ ఫాక్నర్ ఆశించేది న్యుయార్క్‌లో దొరుకుతుంది అని సలహా ఇవ్వగా ఉత్తరానికి వెళ్ళాడు. అక్కడ ఏమీ దోరకలేదు. యాంగ్‌తో కలిసి ఉండి గ్రీక్ హోటల్‌లో బొచ్చెలు కడిగి ఏవో కొన్ని రాళ్ళు సంపాదిస్తూ, డిపార్ట్మెంట్ స్టోర్స్‌లో పుస్తకాలు అమ్ముతూ గడిపాడు. ఆరు నెలల పస్తుల బతుకు తర్వాత తన స్వగ్రామం ఆక్స్‌ఫర్డ్‌లో పోస్ట్ మాస్టర్‌గా పని చేద్దామని తిరిగొచ్చాడు. ఏ పని సమయానికి చేసేవాడు కాదు. ఉత్తరాలు సార్ట్ చేయాలంటే బద్ధకం. అకౌంట్ పుస్తకాలు జాగ్రత్తగా నింపటం, రికార్డ్‌లను భద్ర పరచటంలో అలసత్వం చూపుతూ తన ఇష్టం వచ్చినప్పుడు పోస్టాఫీస్‌ను తెరుస్తూ

మూస్తూ పబ్లిక్ సంగతి పట్టించుకోకుండా చెత్త పోస్ట్ మాస్టర్ అనిపించుకొన్నాడు. కస్టమర్లుపైకి ఫిర్యాదుచేయగా రాజీనామా ఇచ్చేశాడు 'దీనిపై రాస్తూ' I am glad I will no longer have to be at the beck and call of any one who happens to have two cents" అన్నాడు.

రెండేళ్ళు వ్యవసాయం, చేపలు పట్టటం, వేట చేసి 27వ ఏట విసుగెత్తి యూరప్ వెళ్ళాలనుకొని న్యు ఆర్లియన్స్ చేరాడు. తనకిష్టమైన చిన్నకథా రచయిత షేర్ వుడ్ యాండర్సన్‌ను కలిసి, మొదటిసారిగా రచయితలతో కలిసే అవకాశం పొందాడు. "పార్శియన్ బోహేమియన్స్ ఆఫ్ ది లెఫ్ట్ బ్యాంక్"కు బదులుగా "న్యు ఆర్లియాన్స్ ఫ్రెంచ్ క్వార్టర్" ఏర్పాటు చేశారు. వీళ్ళ "ది డబుల్ డీలర్" పత్రికకు, సిటీలో పేరున్న మరో పత్రికకు "మస్కిటోస్" అనే సెటైర్‌ను "సోల్జర్స్ పే" అనే అనే ఉడుకు రక్తపు రిపోర్ట్ రాశాడు, హీరో హీరోయిన్‌లు లేకుండా రాశాడు. పెద్దగా క్లిక్ కాలేదు. కొన్ని చిన్న కథలు రాసి అమ్మాడు. రచనతో పొట్ట గడుపుకోలేను అనుకొన్నాడు. "సార్టారిస్", "ది సౌండ్ అండ్ ది ఫ్యూరీ"లలో తన సొంత సాహిత్య సీమను సృష్టించుకొన్నాడు. ఒక ఊహాదేశం "యోక్న పటా వఫా" సృష్టించుకొన్నాడు..ఇదే అసలైన అమెరికన్ ఆదిమానవుల యోకనా రివర్ పేరు. ఒకప్పుడీ ప్రాంతం బంగారు పంట పండిన ప్రదేశం, ఇప్పుడు భవంతులతో పాట సంస్కృతీ వినాశనంతో వెల వెల పోతోందని భావించాడు. ఎస్టేట్లు నాశనమై తెల్లబంగారం అనబడే పత్తి క్షేత్రాలు కనుమరుగై, రైతుల నడుములు విరిగి, అవినీతి నిలయమైన పట్టణాలతో, చిత్తడినేలలు, అడవులతో అమెరికన్ యూనియన్‌లో అత్యంత పేదరిక ప్రదేశమైనందుకు బాధపడ్డాడు ఫాక్నర్. అచ్చంగా "వేయి పడగలు" నవలలో విశ్వనాధ పడిన ఆవేదనే పడ్డాడు ఫాక్నర్.

ఈ సౌండ్ అండ్ ఫ్యూరీ నవల ఫాక్నర్ రచనలలో ఉత్కృష్టమైనదిగా, చెదిరిన సంస్కృతీ విలసిననానికి దర్పణంగా భావిస్తారు. అతని రచనా పాటవానికి అబ్బురపడతారు "లైఫ్ బీయింగ్ యే టేల్.టోల్డ్ బై యాన్ ఇడియట్ సిగ్ని ఫైయింగ్ నథింగ్" అన్న షేక్స్ పియర్ సూక్తికి ఇది సజీవ నిదర్శనం. ఫాక్నర్ శీర్షికతోనే కాక విధానంతో కూడా చదువర్లు దారి తప్పారు. సామాన్య వివరణకు భిన్నంగా దీన్ని రాయటం అతని ప్రత్యేకత. "Faulkner disrupted the usual sequence of events ,he juggled the sections to show the violent disintegration of a family sharpened characterization by the use of interior monologs in the Joycean "stream of consciousness "and made time seem as way ward as the mind of the idiot Benjy Compson the symbol of ultimate ruin. చాలా మంది ఈ విధానం అస్పష్టం అని వెనక నుంచి

చదువుకోవాలని మళ్ళీ మళ్ళీచదివితే కాని బుర్రకు ఎక్కదు అన్నారు. దీనికి భిన్నంగా పెద్ద పెద్ద సిటీల జనం అతని శైలీపరిణతికి నిశ్చేస్టులయ్యారు. రాతలోని దూకుడు, దాని ప్రభావం అనిర్వచనీయం. అంతకు ముందు కాని ఆ తర్వాత కాని ఈ పుస్తకం ప్రజల మనసులలో దూరినంతగా, యే పుస్తకం చేరలేదు. "It presented a marvelous and unprecedented amalgam of innocence and depravity of sick delusions maturity 's yearning for the security of early family affection, and child hood 's memories lost in hopeless longings or as in the case of Benjy twisted into madness"

ఫాక్నర్ అంతగా ప్రసిద్ధి చెందకపోయినా ఆయన గురించి జనం బాగా చెప్పుకొనేవారు. ఆయన డార్క్ మేజిక్, దెయ్యాలు తిరిగే తీర భూముల భీకర అందాల గురించి చర్చించుకొనేవారు. ఆ ప్రదేశం ఎందుకు దెయ్యాల ఆవాస భూమి అయిందో పాక్నర్ ఎప్పుడూ విడమరచి చెప్పలేదు కాని చావు, పతనం ఆయన రాసిన వాటిలో ఉన్నాయి. అందుకే ఆయన రచనలు "dark grandeur of destruction" అనిపించాయి. ఆ భూములు వాటి యజమానులు బానిసత్వం వలన బలసి పోయారని అన్నాడు. అరిస్టాక్రసి, ధనదాహంతో వాళ్ళు ధైర్యం గౌరవాలను పోగొట్టుకొన్నారు. దీనిని వ్యతిరేకించే ఆయన, వాళ్ళ ఓటములను కథలుగా చెప్పాడు. వాళ్ళందరూ శాపోపహతులు అంటూ ఫాక్నర్ "this whole land the whole of South is cursed" అన్నాడు. అందులోని పాత్ర మెక్ కాల్సిం "అక్కడి నుంచి వచ్చిన మేమంతా నల్లవాళ్ళు తెల్ల వాళ్ళు పోషింపబడి ఆ శాపంలోనే ఉండిపోయాం" అని అరుస్తాడు.

32వ ఏట ఇద్దరు పిల్లల తల్లి ఎస్టెల్లా ఓల్డ్ హాం ఫ్రాంక్లిన్‌ను పెళ్ళిచేసుకొన్నాడు. ఈ పెళ్లి వలన ఒక శిశువు పుట్టి చనిపోయింది. తర్వాత కూతురు జిల్ పుట్టి ఆయనకు గర్వ కారణమైంది. తరువాతి నవల "ఆస్ ఐ లేడైయింగ్"ను బొగ్గు ప్లాంట్‌లో పని చేస్తుండగా వీల్బారో వెనక కూర్చుని రాశానని చెప్పుకున్నాడు. ఇందులో బండ్రెంస్ అనే పేద తెల్ల వాడి గురించి ఆడీ బ్రన్ డ్రేన్ అనే కొండ జాతి అమ్మాయి గురించి, ఆమె కుటుంబ బాధల గురించి, ఆమె శరీర మాంసం శిథిలమై పోతుండాగా ఆమెను జెఫర్సన్ సేమిటరికి చేర్చటం, ఆమె శరీరాన్ని పీక్కు తినటానికి ఆకాశంలో గద్దలు రాబందులు తిరుగుతూ భయోత్పాతాన్ని కల్పించటాన్ని ఆమె కొడుకు పిచ్చివాడిగా మారటం భర్త పెట్టుడు పళ్ళతో తనకు భార్య శవాన్ని పూడ్చటానికి పలుగూ పారా అప్పుగా ఇచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకోవటం పరమ హృదయ విదారకంగా రాశాడు ఫాక్నర్. విషయం నిరాసక్తమైనదే అయినా ఆయన నిర్వహించిన తీరుతో అది, గుండెలోకి సూటిగా దూసుకుపోయే శబ్దజాలంతో, ముడి కవిత్వంతో "బాక్ వుడ్స్ ఎపిక్" అయింది.

సమాప్తానికి ముందు అందులోని ఒక పాత్ర మానవుని నిష్ప్రయోజకతను వ్యక్తీకరిస్తుంది ఇది ఫాక్నర్ గొంతు అని భావం అని మనం గ్రహించాలి–అతడే మన్నాడో ఆ పాత్ర మాటల్లో ఇంకా గొప్పగా ఉంటుంది చూడండి– "How do our lives ravel into the no wind, no sound, the weary gestures wearily recapi tulant echoes of ld compulsions with no hand on no strings --in sun set we fall into furious attitudes, dead gestures of dolls "ఇలాంటి స్టేట్మెంట్ కౌంటర్ పాయింట్‌గా "ఇలియట్ రాసిన "హోలో మెన్"కు దీటుగా అనిపిస్తుంది–ఒక్కసారి ఇలియట్ కవిత్వంలోకి దీనికోసం తొంగి చూద్దాం–

"shape without form ,shade without color --paralyzed force ,gesture without motion --remember us --if at all --not as lost --violent souls  but only --as the hollow men --the stuffed men"

వయసు 30 మధ్యలో ఉండగా సీరియస్ నవలలతో విజయం సాధించాలనుకొన్నాడు. "సాన్ క్ట్యుయరి" రాసి అబ్బే చాలా చీప్‌గా కాసుల కోసం కక్కూర్తిగా రాసినట్లుంది అనుకొన్నాడు. నమ్మశక్యం కాని దృశ్యాలు హింసాత్మకంగా, వేశ్యా గృహంలో పూర్తిగా జరిగే కథగా దారుణ వాస్తవికంగా రాశాడు. ఇది కూడా అతని సౌత్ లాండ్‌లో జరిగే నిత్యకృత్య రేపులు, దిగాజారుడులే. సెన్సార్ వాళ్ళు కత్తెర వేశారు కాని కనక వర్షం కురిపించింది. దీన్ని అదనుగా తీసుకొని హాలీవుడ్ స్క్రీన్ ట్రీట్ మెంట్ రాయటానికి ఆహ్వానించింది. అక్కడ కథ అంతా మారి పల్చనై "ది స్టోరీ ఆఫ్ టెంపుల్ డ్రేకర్"గా విడుదలైంది. మిగిలిన కొన్ని కథలను సినిమాలు తియ్యటం కోసం ఆయన్ను పెట్టుకొన్నారు. డబ్బు ఎప్పుడు అవసరం వస్తే అప్పుడు చలో హాలీవుడ్. కనుక బతకటానికి వేరే ఉద్యోగం అక్కర్లేకుండా పోయింది. పోస్ట్ మాస్టర్‌గా ఎలా నిర్వాకం చేశాడో ఇక్కడ స్క్రిప్ట్ రైటర్‌గా అలానే చేశాడు. ఒక దానికి స్టూడియోలో కాకుండా ఇంటి దగ్గరే రాయటానికి అనుమతి తీసుకొన్నాడు. ఈయన అద్దెకున్న ఇల్లు వెదికి డైరెక్టర్ వెడితే మనవాడు మిసిసిపికి జంప్ జిలానీ అయ్యాడని తెలిసి పర్మిషన్ అడగటం ఒక సాకు మాత్రమే అని అర్థమైంది.

పూర్తిగా ఊహా ప్రపంచాన్ని సృష్టించాలన్న కోరికతో "యాక్న పటా వాఫా" సాగా సీరియల్‌గా రాయదలచి అతి భీకర, మహా విపత్ భరిత, అత్యంత వేదనా భరిత నవల. ఇది వరకెన్నడూ అమెరికాలో రాయని విధంగా రాశాడు. అందులో "లైట్ ఇన్ ఆగస్ట్"లో కుళ్ళి శిధిలమై పోతున్న నాగరకతను కళ్ళకు కట్టించాడు. ఇందులో రెండు కథలున్నాయి. ఒకటి గర్భిణి అయిన ఒక పర్వత ప్రాంత అమ్మాయి కడుపులోని బిడ్డకు తండ్రి అయిన వాడిని వెదకటం, సెక్స్ కోరికలతో సతమతమవుతూ నీగ్రోలకు

సాయం చేసే తన ప్రేమ గూడులో చిక్కిన ఒక కుర్ర వాడిని చెడగొట్టి తాను నాశనం అయ్యే ఒక ముసలి మెయిడ్ కథ. "అబ్సలాం అబ్సలాం" అనేది ఒక మెలో డ్రామా ఇందులో కోరిక, సమ్మోహన బుద్ధి, వావి వరసలు లేని శృంగారంలతో పతనమైన ఒక వంశ చరిత్ర ఉంది. కథను అనేక పాత్రల ద్వారా అసందర్భంగా చెప్పించినా నిర్మాణం వెనుకా ముందూ ప్రస్తావనలతో ఫాక్నర్‌లోని ద్వైవీ భావాన్ని బయట పెడుతుంది. మానవత్వ హుందాతనంతో పాటు నీగ్రో, అన్నా ఆమె అన్నా అయిష్టత గోచరిస్తుంది "ది అన్ వాన్క్విషెడ్"లో మరో కుటుంబ కథ ఉంది. రాసిన ప్రచురితమైన అనేక కథలలో తన తాత గారి వ్యక్తిత్వ ఆరాధనా ఆయన "సార్టోరిస్" వంశానికి చెందిన వాడుగా నిలబెట్టాడు. "వైల్డ్ పామ్స్", "ది హామ్లెట్", "ఇంట్రూడర్‌ఇన్ ది డస్ట్" మొదలైనవి ఈ శ్రుమ్ఖలానికి చెందినవే. మాల్కం కౌలీ "ది పోర్టబుల్ ఫాక్నర్"లో "part of the same living pattern. In this pattern and not the printed volumes in which part of it is recorded that Faulkner 's real achievement..he has little need to construct.,he needs only to call upon what is already waaiting for him" అంటూ చక్కగా చెప్పాడు.

50వ ఏట ఫాక్నర్ జాతీయ వ్యక్తి అయ్యాడు. ప్రముఖ రచయితగా గుర్తింపు పొంది రచయితల సంఘాలకు, సాహిత్య సమావేశాలకు దూరమైనాడు. విమర్శను దూషించేవాడు కాదు. న్యు క్రిటిక్‌లపై యే అభిప్రాయం ఆయనకు లేదు. కళా ఈస్తెటిక్స్ మొదలైన వాటికి దూరంగా ఉండేవాడు. "నేనొక సామాన్య రైతును. ఏదో అప్పుడప్పుడు కథలు రాస్తాను" అని చెప్పుకునేవాడు. ఈ రైతు రచయితకు ఎంతో విశిష్టమైన నోబెల్ సాహిత్య బహుమతిని నవంబర్ 1949లో అందజేసి గౌరవించింది నోబెల్ పురస్కార సంస్థ. ఈ వార్తను భార్య ఆయనకు చెప్పేదాకా తెలియనే తెలియదు.

స్టాక్ హోమ్స్‌లో పురస్కార ప్రదానోత్సవం నాడు ఫాక్నర్ మాట్లాడిన తీరు అందరూ మాట్లాడే రీతికి భిన్నంగా చాలా హుందాగా, వినయపూర్వకంగా, చాంపియన్ షిప్‌గా ఉండి అందర్నీ ఆశ్చర్య పరచింది. అందులో కొన్ని బంగారు పలుకులు ఆయన మాటల్లోనే – "The old universal truths ,lacking which any story is ephemeral and doomed ..Until the writer re learns these things, he will write as though he stood among and watched the end of man. I believe that man will not merely endure --he will prevail..He is immoral, not because he alone among creatures has an inexhaustible voice but because he has a soul, a spirit capable of compassion and sacrifice and endurance The poet', the writer',

duty is to write about these things. It is his privilege to help man endure by lifting his heart, by reminding him of the courage and honor and hope and pride and compassion and pity and sacrifice which have been the glory of his past". ఈ స్టాక్ హోమ్స్ ఉపన్యాసం అందరూ మెచ్చుకొన్నారు. విషాద, నిరుత్సాహ వాతావరణంలో ఎప్పుడూ మాట్లాడే ఫాక్నర్ ఇంత గొప్పగా మాట్లాడుతాడని ఇంతటి ఆశను చిగురింపజేస్తాడని ఎవరూ ఊహించలేదు. వాళ్ళకిప్పుడు గొప్ప ఊరట కలిగింది. మనుషులను ఓదార్చి వాళ్ళ కడగండ్ల నుండి ఉద్ధరించటం రచయిత బాధ్యత. వాళ్లకు బలమైన పునాదులతో ఆశా సౌధం నిర్మించాలి అనే ఆయన సిద్ధాంతానికి బలం చేకూరింది. ఎంత నీచ అల్ప విషయమైనా దానికి జీవం చేకూర్చే పని ఫాక్నేర్ చేయగలడు అని నమ్మారు. ఫాక్నేర్ నేచురలిజంను ఫ్రెంచ్ రచయిత బాడర్లేర్ "డయ బాలిజం"తోనూ రష్యా రచయిత డాస్టోవ్ స్కి "గిల్ట్ సఫరింగ్ డ్రైవ్"తోనూ పోల్చారు.

నోబెల్ ప్రైజ్ పొందిన నాలుగేళ్ళకు "ఎ ఫేబుల్" రచన ప్రచురించాడు. పాత గొలుసు నవలలకు భిన్నంగా తన జీవిత ఆకాంక్షను తెలియ జేస్తూ రాశాడు. ఇందులో జాలి దయ, ఆశ నింపాడు. ఇది ఒక నవలలాకాక ప్రతీకల సమూహంగా ఉంది.

'ది బేర్"లో ఒకే వాక్యంలో రెండు వందలకుపైగా పంక్తులు రాశాడు. మరో గొప్ప విషయం ఏమిటంటే ఆయన జీవన కాలంలో ఆయన్నుమించి రాసిన వారెవరూ లేకపోవటం "he combines the novel of direct action with the novel of analysis"..ఏది రాసినా దానికొక పరమార్థం ఉండేట్లు రాశాడు. మొత్తం మీద "threatened with disaster and at times dementia, Faulkner 's world is scarcely alluring, but it is unmistakably a world, and it is unquestionably his own"

The manuscripts of most of Faulkner' works, correspondence, personal papers, and over 300 books from his working library reside at the Albert and Shirley Small Special Collections Library at the University of Virginia, where he spent much of his time in his final years. The library also houses some of the writer' personal effects and the papers of major Faulkner associates and scholars such as his biographer Joseph Blotner, bibliographer Linton Massey, and Random House editor Albert Erskine.

Southeast Missouri State University, where the Center for Faulkner

Studies is located, also owns a generous collection of Faulkner materials including first editions, manuscripts, letters, photographs, artwork, and many materials pertaining to Faulkner' time in Hollywood. The university possesses many personal files and letters kept by Joseph Blotner, along with books and letters that once belonged to Malcolm Cowley, another famous editor for William Faulkner. The university achieved the collection thanks to a generous donation by Louis Daniel Brodsky, a collector of Faulkner materials, in 1989.

Further significant Faulkner materials reside at the University of Mississippi, the Harry Ransom Center, and the New York Public Library.

radine ("Spotted Horses") and Arliss Howard ("That Evening Sun", "Wash"). Winner of AudioFile Earphones Award.

William Faulkner Reads: The Nobel Prize Acceptance Speech, Selections from As I Lay Dying, A Fable, The Old Man. Caedmon/Harper Audio, 1992. Cassette. ISBN 1-55994-572-9

William Faulkner Reads from His Work. Arcady Series, MGM E3617 ARC, 1957. Faulkner reads from The Sound and The Fury (side one) and Light in August (side two). Produced by Jean Stein, who also did the liner notes with Edward Cole. Cover photograph by Robert Capa (Magnum).

From 1957 to 1958, William Faulkner was the University of Virginia', Writer in Residence (the first). There are audio recordings of his time at the University of Virginia, and they have now been made available online at Faulkner at Virginia

64 ఏళ్ళ వయసులో ఫాక్నర్ 6-6-1962న మిసిసిపిలోని బైహాలియాలో చనిపోయాడు. నోబెల్ ప్రైజ్ తోపాటు పులిట్జర్ ప్రైజ్ నేషనల్ బుక్ అవార్డులు కూడా పొందాడు Faulkner was known for his experimental style with meticulous attention to diction and cadence. In contrast to the minimalist understatement of his contemporary Ernest

Hemingway, Faulkner made frequent use of "stream of consciousness" in his writing, and wrote often highly emotional, subtle, cerebral, complex, and sometimes Gothic orgrotesque stories of a wide variety of characters including former slaves or descendants of slaves, poor white, agrarian, or working-class Southerners, and Southern aristocrats.

In an interview with The Paris Review in 1956, Faulkner remarked: Let the writer take up surgery or bricklaying if he is interested in technique. There is no mechanical way to get the writing done, no shortcut. The young writer would be a fool to follow a theory. Teach yourself by your own mistakes; people learn only by error. The good artist believes that nobody is good enough to give him advice. He has supreme vanity. No matter how much he admires the old writer, he wants to beat him..

"ఎ మార్బుల్ ఫాన్", "ది గ్రీన్ బో" అనే రెండు కవితా సంపుటులను కూడా ఫాక్నర్ రాశాడు. న్యు క్రిటిక్స్‌కు ఆయన ఆరాధనీయుడు.. He donated part of his Nobel money "to establish a fund to support and encourage new fiction writers", eventually resulting in the PEN/Faulkner Award for Fiction, and donated another part to a local Oxford bank, establishing a scholarship fund to help educate African-American teachers at Rust College in nearby Holly Springs, Mississippi. The government of France made Faulkner a Chevalier de la Legion d' Honneur in 1951.

పోస్ట్ మాస్టర్ ఉద్యోగానికి రాజీనామాచేస్తూ పై అధికారులకు ఆయన రాసిన ఉత్తరం ఎలా ఉందో చూద్దాం- As long as I live under the capitalistic system, I expect to have my life influenced by the demands of moneyed people. But I will be damned if I propose to be at the beck and call of every itinerant scoundrel who has two cents to invest in a postage stamp.

This, sir, is my resignation.❋



## 85. అమెరికా ప్రజారంజక సంప్రదాయ స్వరమాధుర్య సంగీత కారుడు-జార్జ్ జెష్విన్ (1898 -1937)

"తనకు తగిన తేజస్సుతో జీవించాడు" అని మెచ్చుకొనే అమెరికా ప్రజారంజక సాంప్రదాయ స్వరమాదుర్య సంగీత కర్త జార్జ్ జెష్విన్. 38 ఏళ్ళకే అకస్మాత్తు సంఘటనలో మరణించే దాకా అమెరికాలోని ప్రజాదరణ సంగీతాన్ని గొప్ప మలుపు తిప్పటమే కాక పశ్చిమ దేశాలలో సంగీత నాడిని వేగం చేసినవాడు. అమెరికాలో న్యూయార్క్‌లోని బ్రూక్లిన్‌లో 26-9-1898 న జన్మించాడు. తల్లి మార్రిస్. తండ్రి రోజ బ్రస్కిన్ జెర్ష్విన్. చిన్నతనం అంతా మాన్ హాటన్‌లోని లోయర్ ఈస్ట్ సైడ్‌లో గడిచింది. తండ్రి అనేక పనులలో అంటే రెస్టారెంటులు, రష్యన్, టర్కిష్ బాత్‌లు, బేకరీలు సిగార్ స్టోర్స్, ఫ్పోల్ పార్లర్‌లలో ఇప్పుడు గ్రాండ్ సెంట్రల్ స్టేషన్ అని పిలిచే బ్రిటన్ బీచ్ రేస్ ట్రాక్ దగ్గర పనులు చేసేవాడు. ఎక్కడా స్తిరంగా ఉండక ఎప్పుడూ ఏదో చోటికి మారు తూ ఉండేవారు. ఒక వ్యాపారాన్ని అమ్మేసి ఇంకో దాన్ని ప్రారంభించినప్పుడు ఆయనతోపాటే కుటుంబమూ "జెండాపై కపిరాజు" అంటూ అక్కడికి వెళ్ళేదన్నమాట. అన్న ఇరా, తమ్ముడు జార్జ్ తాము దాదాపు 25 చోటుల్లో, అపార్ట్ మెంట్‌లలో మారుతూ బతికామని చెప్పుకొన్నారు. సెకండ్ ఎవెన్యులోకి మారినప్పుడు తల్లి ఒక పియానో కొన్నది. అప్పటికి జార్జ్ వయసు 12.

ఈ పియానొ అన్న ఇరా కోసమే కొన్నా, తమ్ముడు జార్జ్ దాని దగ్గర కూర్చుని ఎడమ చేత్తో చక్కగా వాయించేవాడు. తర్వాత చార్లెస్ హాం బ్రిడ్జర్ వద్ద చోపిన్, డేబూసీల సంగీతాన్ని నేర్చాడు. ఈ చార్లెస్ జార్జ్‌కి సంగీతంలోని ప్రాధమిక విషయాలు టెక్నిక్‌లు క్షుణ్ణంగా నేర్పాడు. దీనితో హైస్కూల్ ఆఫ్ కామర్స్‌లో ఉదయం అసెంబ్లీకి సౌసా మార్చ్ సాంగ్‌లు వాయించే నైపుణ్యం వచ్చింది. 15వ ఏటనే ప్రొఫెషనల్ అయిపోయి, ఒక మ్యూజిక్ పబ్లిషింగ్ సంస్థలో వారానికి 15 డాలర్ల జీతంతో చేరాడు. సాంగ్ స్లొగ్గర్‌లతో కలిసి వాడే విల్లీ హౌసెస్‌లకు వెళ్లి అక్కడ జరిగే వాటిని రిపోర్ట్ చేస్తూ, ఆచరణ యోగ్యమైన స్వరాలు కట్టేవాడు. మూడేళ్ళ తర్వాత స్వంత ఒక పాట

పబ్లిష్ అయింది. 21వ ఏట "లాలా లూసేల్లి" అనే కామెడికి 1919లో మొత్తం సంగీతాన్ని కూర్చాడు. అదే ఏడాది టిన్ పాల్ అల్లేలో పాటగాడు ఆల్జాల్సన్ స్వీనీతో రాక్ పాటలు పాడటంతో జార్జ్ పేరు దేశమంతా మారు మోగింది.

స్వీనీ ఒక నమూనా (ప్రోటో టైప్) పాట ఆనాటి మూస సెంటిమెంటల్ మ్యూజిక్ కామేడీలకు అతి భిన్నంగా ఉండి విప్లవాత్మకమైంది. ఇది అప్పటిదాకా ఉన్న పాత వియన్నీస్ ఒపెరెట్టాఫాషన్‌లకు కాపీగా కాకుండా, పూర్తిగా మార్పు చేసి వేగవంతమైన, విపరీత ఆశ్చర్యాన్ని కలిగించేట్లు, ఉత్తేజం, వినోదాల సంగీత విందు ఇచ్చింది. ఇందులో అన్నీ పరమ ఆశ్చర్యకరాలే. అందులోని స్వదేశ భావన ఆరాధన హాస్యపు గుబాళింపుతో మేళవించి, పదాలు, సంగీతం చాలా సరదాగా కలిసిపోయి, విపరీతమైన శ్లేషతో ఆది నుంచి అంతం దాకా నమ్మకాన్ని విశ్వాసాన్ని అందించింది. ముఖ్యంగా ఇందులో స్వదేశీయ అమెరికా హృదయ ధ్వని భాసించి ఇదీ మా అసలైన సంగీతం అని రుజువు చేసింది.

దీని తర్వాత వచ్చిన పాటలన్నీ చాలా హాయిగా తేలిగ్గా లాభదాయకంగా ప్రవహించాయి. ఇలాంటి స్వరాలు మాధుర్యం ఇంతకూ ముందు ఎన్నడూ అమెరికన్ థియేటర్‌లో వినిపించనే లేదు ఇదొక విప్లవం. అమెరికన్ మూలాలలో పాదాలు ఉంచి నరాల ఉత్తుంగ ఉత్తేజంతో బ్రాడ్వే మ్యూజికల్స్‌కు అనేక ప్రైవేట్ పాటలకు స్వరాలు కూర్చి స్వదేశీ భావసుమాలకు పరిమళాలు అద్ది రసభరితం చేశాడు. అలాంటి వాటిలో "ఐ గాట్ రిథం", "సమ్ బడి లవ్స్ మి", "మే బి", "లిజా", "అవర్ లవ్ ఈజ్ హియర్ టు స్టే" చాలా ప్రసిద్ధమైనవి. శారీరకంగానూ ఆయన చాలెంజింగ్‌గానే ఉన్నాడు. ఎత్తుగా సన్నగా ఉన్న పర్సనాలిటి. ముఖం నలుపు సన్నం. నుదురు ఎత్తుగా ఉండేది. మొత్తం మీద చూస్తే అసీరియన్ శిల్పంలాగా ఉండేవాడు. వేగవంతంగా నవ్వేవాడు. తనకు తగిన తేజంతో గోచరించేవాడు. ప్రజలను నమ్మక పోవటం లేదుకాని వాళ్ళను అర్థం చేసుకొనే అవసరం ఉండేది కాదు. జీవితాంతం పెళ్లి చేసుకోనే లేదు. పియానోనే ఆయన పెళ్ళాం ఆంతరంగిక సహచరి. పియానో ఉంటే అన్నీ మర్చిపోయి అందులోనే ఆనందం తృప్తీ పొందేవాడు. ఇతర పియానిస్టులు గదిలో ఉన్నా ఆయన దృష్టి అంతా తన పియానో మీదే ఉండేది. అంతటి తాదాత్మ్యం ఆయనది. "చూడండి–నేను వాయిస్తుంటే అందరూ హాపీ, కాని ఇతరులెవరైనా వాయిస్తుంటే నేను దయనీయంగా ఉంటాను" అని చెప్పాడు. సంప్రదాయ సంగీతకారుల సంగీతంపై బాగా ఇష్టం ఉన్నా, సమకాలికుల స్వరాలు కొన్ని నచ్చినా, మెచ్చుకొన్నా, పియానో దగ్గర ఉంటే మాత్రం వాళ్ళను ఎవర్నీ మెచ్చిన దాఖలాలు లేవు. "ఆయనతో సాయంత్రం గడపటం అంటే అది జేష్విన్ సాయంత్రమే" అన్నాడు ఆయన స్నేహితుడు, సాటి పియానిస్ట్ ఆస్కార్ లేవెంట్. మరోసారి తన పాటకు మెరుగు పెట్టు కొంటూ "నా

సంగీతం ఇంకో వందేళ్ళ తర్వాత ఎవరైనా వాయిస్తారా?" అని ఆస్కార్ ను అడిగితే "తప్పకుండా నువ్వు వాళ్ళ మధ్య ఉంటే" అని నీరసంగా జవాబు చెప్పాడు ఆస్కార్.

వయసు ఇరవైలలో ఉండగా ఆయనకు నాటకీయంగా కొత్త జీవితం ప్రారంభమైంది. బాండ్ లీడర్ పాల్ వైట్ మన్ డాన్స్ మ్యూజిక్‌ను ఉద్ధరించాలనుకొన్నాడు. ఆధునిక సంగీత ప్రయోగం పేరుతో ఒక సంగీత కచేరిని లింకన్ పుట్టిన రోజు 1924లో ఆలోలియన్ హాల్‌లో నిర్వహించాడు. అంతకు ముందే జనవరిలో వైట్ మాన్ ప్రెస్ వాళ్లకు జేష్విన్ తన స్వంతపాట పాడుతారని ప్రకటించాడు. అందరి కంటే జేర్ష్విన్ ఎక్కువ ఆశ్చర్యపోయాడు. "నువ్వు ఏదో ఒకరోజు నాకు ఒక కాన్సర్ట్ పీస్ రాయాలి" అని అడిగాడు. "ఏదో ఒకరోజు రాస్తాలే" అన్నాడు యథాలాపంగా. పేపర్లో ప్రకటన చూశాక ఆ సంఘటన జ్ఞాపకమొచ్చి, వెంటనే పనికి ఉపక్రమించాడు. ఒక సరదా విషయం తీసుకొని నోట్‌బుక్‌లో రాసుకొని దాన్నే ప్రారంభ గీతంగా పాడాలనుకొన్నాడు. అది క్లారినెట్‌పై సుదీర్ఘంగా ఉదాత్త అనుదాత్తాలతో సాగింది. అలాంటి పాట ఆకాలంలో ఎవరూ వాయించటానికి సాహసించేవారు కాదు. అతి కష్టమైనది కూడా. జేష్విన్ దాన్ని గొప్ప పద బంధంతో, పై స్థాయిలో "రాప్సోడి ఇన్ బ్లూ"తో మొదలయ్యేటట్లు రాశాడు.. ఈ రాఫ్సోడిని మూడు వారాల్లో పూర్తిచేశాడు. దీన్ని అప్పుడు అక్కడ ప్రదర్శిస్తే దాని ప్రభావం చెప్పతరం కాక విపరీతంగా విజయవంతమైంది. సాగతీత, పాత వాసనలతో విసుగెత్తిన జనాలకు ఇది కొత్త ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని ఇచ్చింది. సీరియస్ సంగీతంపై పిచ్చ అభిమానమేర్పడింది. దాని వేగం, తీక్షత అందులోని పరోక్ష ఇతి వృత్తానికి అన్ని తరగతులవారు మురిసిపోయారు. అందరూ కొంతకాలం దాకా దీన్ని గురించే మాట్లాడుకొనేవాళ్ళు. రాఫ్సోడి అమెరికన్ ట్రేడ్‌మార్క్ అయి పోయింది. అమెరికా చరిత్రలో ఇంత అద్భుతమైనది అంతకు ముందుకాని ఆ తర్వాత కాని రాలేదు, అంత తరచుగా వినబడలేదు, అంత ప్రపంచ ప్రసిద్ధం కాలేదు. "సన్ ఆఫ్ ది సాయిల్ ఇన్ మ్యూజిక్" అని పించుకొన్నాడు జేర్ష్విన్.

ఇంకా విస్తరించాలి అని అభిమానులు కోరుకున్నారు. అందుకే చిన్న కమ్మర్షియల్ బిట్స్ దగ్గర్నుంచి పెద్ద పెద్ద వాటిదాకా పనిచేసి అందరికి సంతృప్తి కల్గించాడు. వైట్ మాన్ అరెంజర్ అయిన ఫెర్డే గ్రోఫే రాఫ్సోడికి ఆర్కెస్ట్రా సమకూర్చాడు. ఇక స్వంత ఏర్పాటు చేసుకోవాలనుకొన్నాడు జార్జ్.. కాలక్షేపానికి ఎప్పుడైనా టెన్నిస్ ఆడేవాడు స్పోర్ట్స్‌కు దూరం. దీనికి బదులు స్టుడియోలలో రాబిన్ గోల్డ్ ఆర్క్, జోసెఫ్ శిలింజర్ వంటి ముఖ్య సంగీతకారులతో కూర్చుని కాలం గడిపేవాడు. జార్జ్ కూర్చిన "టిన్ పాన్ అల్లే" శిల్లిన్జర్‌కు బాగా నచ్చి అందులో వింత ట్రయేడ్, టేట్రాడ్స్ వలన కలిగిన గణిత కీలక భావనలు అంతకు పూర్వం తెలియని హై పిచ్ స్కేల్స్, అవి తీగల నిర్మాణంతో సంబంధం కలిగి ఉండటం ఆశ్చర్యం కలిగించి "rhythmic groups resulting from the

interference of several synchronized periodicities", "groups with the fractioning around the axis of symmetry" అని రాశాడు.

రాఫ్సోడి ప్రదర్శన తర్వాత "కంసేర్టో తీ' లో సోలోయిస్ట్ అవతారమెత్తాడు. దీన్ని వాల్టర్ డాం రాష్ న్యుయార్క్ సింఫనికి చేశాడు. "యాన్ అమెరికన్ ఇన్ పారిస్", "సెకండ్ రాఫ్సోడి", "రాఫ్సోడి ఇన్ రివర్స్" వంటివి ఎన్నో చేశాడు. The rhapsody in blue was amounting adventure in excitement full of the flamboyant youth and pulsing energy of the nation. The jazz driven "concerto "widened Gershwin ;s gamut" దీనిలో ఏముంది అంటే – "the nerves, repressions and complexities of the modern world" అమెరికన్ జాతీయాలను యాన్ అమెరికన్ ఇన్ పారిస్, సెకండ్ రాఫ్సోడి"లు మరింత విస్తృతం చేశాయి. ఈ పాటలతో నగరాలు పల్లెలు వీది వీధినా మారుమోగాయి.

లిబ్రటిస్టలయిన జార్జెస్ ఎస్.కాఫ్మన్, మోరీ రిస్కిండ్‌ల ప్రోత్సాహంతో జేష్విన్ మరో కొత్త ఇదివరకు ఎన్నడూ ప్రయత్నించని అమెరికా సంస్కృతీ–మ్యూజికల్ సెటైర్‌పై తన ముద్ర వేశాడు. యుద్ధం, రాజకీయం, బడా బిజినెస్, ఉన్నత విషయాలలో డోల్లతనాలను సరదాగా నవ్విస్తూ "స్ట్రైక్ అప్ ది బాండ్ ఆఫ్ దీఐ సింగ్" ద్వారా బయటపెట్టాడు. దీనికి "పులిట్జర్ ప్రైజ్" వచ్చింది. మొదటి సారిగా ఒక మ్యూజికల్ కామెడీకి ఈ బహుమతి రావటం చారిత్రాత్మకమైనది. అలాగే "లెట్ దెం ఈట్ కేక్" అనేది మరొకటి. వీటికి అన్న ఇరా లిరిక్స్ రాశాడు. ఈ రెండు 1930–33 మధ్య వచ్చాయి. ఈ త్రయం కొత్త కోణాలలో భావాలతో పూర్వం కేవలం వినోదం అన్నదానికి భిన్నంగా గొప్ప సృజనాత్మకంగా థియేటర్ సంగీతానికి సొగసులద్దారు.

1933లో జేర్విన్ "పోర్జీ అండ్ బెస్స్" అనే మొదటి అసలైన అమెరికన్ మ్యూజిక్ డ్రామాకు స్కెచెస్ తయారు చేశాడు. "దు బోస్ హేవార్డ్" నవల ఫోక్ ఒపేరా ఆధారంగా దీన్ని రెండుఏళ్ళలో తయారుచేశాడు. ఇందులో ఆర్కెస్ట్రే జేషన్‌కే తొమ్మిది నెలలు పట్టింది. కోరికలు భయాలు, సంతోషాలు కలిసి గొప్ప వైవిధ్యంతో రూపుదిద్దాడు. అలాగే జోలపాట "సమ్మర్ టైం" బాగా పాప్యులర్ అయింది. అరడజను దాకా రాసినా పూర్తి శాస్త్రీయబద్ధ సంగీతంలో రాయలేదు అన్నాడు ఆస్కార్ లెవంట్. "he could never accustom to such restraints as sonatas, rondos, or any of the classic molds. the thematic fluency, the easy going rhythmic freedom of the rhapsody or un restricted fantasy was his natural genre" అన్నాడు ఆస్కార్. వయసు 30కి రాకముందు 30 మ్యూజికల్ కామెడీలు స్టేజ్‌కి సినిమాలకు రాశాడు. 1936లో సోదరు లిద్దరూ మళ్ళీ కాలిఫోర్నియా చేరారు. అప్పటికే నాలుగవ సినిమా "ది గోల్డ్విన్ ఫాలీస్"కు సంతోషంగా సంగీతం కూరుస్తున్నాడు.

అకస్మాత్తుగా తలనెప్పి వచ్చి బాధపడ్డాడు. మొదట్లో స్నేహితులు దీన్ని సీరియస్‌గా తీసుకోలేదు. ఇవి హాలీవుడ్‌కు వ్యతిరేకమైన డిఫెన్స్ మెకానిజానికి చెందిన సైకో సోమాటిక్ న్యూరోటిక్ ప్రొటెస్ట్‌లనుకొన్నారు. ఒక్కసారిగా అతని పియానో టెక్నిక్ విఫలమవటంతో స్టూడియోలోనే కుప్పకూలాడు. డాక్టర్ దగ్గరకు వెంటనే తీసుకువెళ్ళారు. అక్కడ కూడా ఆయన దీన్ని సీరియస్‌గా భావించలేదు. అతన్ని పరీక్షించి నెర్వస్ బ్రేక్ డౌన్ అని చెప్పారు. రెండవసారి వచ్చింది. ఎక్స్ రే రిపోర్ట్ అత్యవసరమైంది. మెదడులో కణితి పెరిగిందని గుర్తించారు. ఎమర్జెన్సి ఆపరేషన్ చేశారు. కాని కోలుకోలేదు. లాస్ ఏంజెల్స్‌లో 11 -7-1937న 39వ ఏట సంగీత శిఖరారోహణ చేసిన జార్జ్ జేష్విన్ అకస్మాత్తుగా అమరుడైనాడు. మరిన్ని సృజనలతో మెరిపించి మురిపించాల్సిన సంగీతకర్త బ్రెయిన్ ట్యూమర్‌తో మరణించాడు.

ఆయన చనిపోయిన సుమారు 20 ఏళ్ళకు కూడా ఆయన సంగీతం తరచుగా వినటం మెచ్చుకోవటం జరుగుతోంది. అతని పెద్ద రచనలు అంతగొప్పవి కావని విమర్శకాభిప్రాయం. కాని ఆయన జీనియస్‌ను ప్రశ్నించే దమ్ము ఎవరికీ లేదు. రికార్డ్ కంపెనీలు ఆయన పాత పాటలను దుమ్ముదులిపి బయటికి తీసి కొత్త తరానికి అందిస్తూ ఆనందించేట్లు చేస్తున్నాయి. ఎన్నో సంగీత స్వరాలను కూర్చి పరవశింప చేయటమేకాక పూర్వం ఎప్పుడూలేని సరికొత్త విధానం ప్రవేశపెట్టాడు. పాప్యులర్, క్లాసిక్ సంగీతానికి మధ్య ఉన్న అడ్డంకులను తొలగించి లేక ఫార్మల్ నాన్ ఫార్మల్ సంగీత హద్దుల్ని చెరిపేసి విలువైన అమర సంగీతాన్ని అందించాడు. 1955లో "పోర్గి అండ్ బీస్"ని ప్రదర్శిస్తూ యూరప్ అంతా చుట్టిన కంపెనీకి ప్రజలు బ్రహ్మరథం పట్టారు. అంటే ఇప్పటికీ సంగీత ప్రపంచంలో రష్యాతోపాటు అనేక దేశాలలో అతని కీర్తి స్థిరంగా సురక్షణలోనే ఉంది అని తేలింది. "He had pronounced the tone and the tempo of his age --he had given music a new racy speech and for the first time in history an American accent".

అతని ఎస్టేట్ అన్నకు, తల్లికి సంక్రమించింది. అతని సంగీతంపై వచ్చే రాయల్టీ, కాపీరైట్ హక్కులు ఆ కుటుంబానికే దక్కాయి. అతను సంపాదించిన డబ్బును లెక్కేసి గార్డియన్ పత్రిక అన్ని కాలాలోని సంగీతకారుల కంటే అత్యంత సంపన్నుడు అని తేల్చింది. మిచిగన్ యూనివర్సిటిలో అతనిపేర ఒక సంగీత కళాశాల ఏర్పరచారు. ఆయనకు వచ్చిన అవార్డులు చాలా విలువైనవి -కంగ్రేషనల్ గోల్డ్ మెడల్, స్పెషల్ పులిట్జర్ ప్రైజ్, ఇరా జార్జ్ సోదరులకు జీవన సాఫల్య పురస్కారం, లాంగ్ ఐలాండ్ మ్యూజిక్ హాల్‌లో పేరు చేర్చారు. ఆర్కెస్ట్రాతో చేసినవి 10, సోలో పియానోలు 2, ఒపెరాలు 2, లండన్ మ్యూజికల్స్1, బ్రాడ్వే మ్యూజికల్స్ 18, సినిమాలకు 5 జేర్విన్ సంగీతం సమకూర్చాడు.❋



## 86. అమెరికన్ క్లాసిక్ సాహిత్యంతో నోబెల్ పొందిన-ఎర్నెస్ట్ హెమింగ్వే (1899-1961)

ఇరవైవ శతాబ్దపు సాహిత్యంలో ముఖ్య పారడాక్స్, కోల్పోయిన యుగానికి ప్రతినిధి, బాధ్యతా రాహిత్యాన్ని మతంగా మార్చుకొని ప్రేమలో వినాశనం, చావులో అలసట పొంది, అమెరికా రచనకు కొత్త జీవాన్ని సమకూర్చినవాడు ఎర్నెస్ట్ హేమిగ్వే. యువ రచయితలలో సగం మంది ఆయన్ను అనుకరిస్తే మిగతా సగం మంది అనుకరించటానికి ఇష్టపడలేదు. 21-7-1899న అమెరికాలో ఇలినాయిస్ రాష్ట్రంలో చికాగో శివారు ఓక్ పార్క్‌లో జన్మించాడు. ఎర్నెస్ట్ మిల్లర్ హెమింగ్ వేగా చర్చిలో పేరు నమోదైంది. తండ్రి డాక్టర్, క్రీడాకారుడు. కొడుక్కి పదేళ్ళ వయసులో మనిషంత సైజున్న తుపాకి ఇచ్చాడు. తల్లి ఔత్సాహిక సంగీత విద్వాంసురాలు. కొడుకు సెల్లో వాయిద్యంలో దిట్ట (సెల్లిస్ట్) అవుతాడని ఆశించింది.

స్కూల్ చదువు తక్కువ కాలమే లాగింది. 15వ ఏట ఇంటి నుంచి పారిపోయి మళ్ళీ 1917లో హైస్కూల్ చదువుకోసం తిరిగి వచ్చాడు. వెంటనే కాన్సాస్ వెళ్లి రిపోర్టర్ అయ్యాడు. 18 రాకుండానే ఫ్రాన్స్‌కు వెళ్లి అంబులెన్స్ యూనిట్‌లో చేరి, ఇటాలియన్ కాల్బలంలోకి బదిలీ అయి విపరీతంగా గాయపడి 200కు పైగా బులెట్ ముక్కలు జీవితాంతం శరీరంలో ఉండిపోయాయి. దీనికి ఆయనకు క్రాస్ డీ గుయేర్రా, ది మేడాగ్లియ డి అర్జెంటో అల్ వెలోర్ అవార్డులు పొందాడు. ఇంటికి తిరిగి వచ్చి హాడ్లి రిచర్డ్ సన్‌ను 1921లో పెళ్లి చేసుకొన్నాడు. టొరంటోలో జర్నలిజంకు ప్రయత్నించి, యుద్ధపు గుర్రంలాంటి ఉద్యోగంలో దూరం నుంచే యుద్ధ వాసన పసిగట్టి కెప్టెన్ల

అరుపులు, కేకలు ఆసియా మైనర్‌లో విన్నాడు. శాంతి దుర్భరమని భరించలేనిదని అనిపించింది. గ్రీకో –టర్కిష్ యుద్ధ వివరాలను రిపోర్ట్ చేశాడు. వాటిని చదివిన వారెవరూ ఆ యుద్ధ భీభత్స దృశ్యాలను మరవలేదు, ఓడి వెనక్కి వెళ్ళే గ్రీక్ సైనికులు వాళ్ళ కంచర గాడిదల ముందు కాళ్ళను విరగ్గొట్టి ఖాళీ చెరువుల్లో వాటిని వాటిమానాన వదిలేసి వెళ్లారట. ఇవన్నీ కళ్ళకు కట్టినట్లు హెమింగ్వే అక్షర బద్ధం చేశాడు.

ఇరవైలలో ఉండగా పారిస్ వెళ్లి అమెరికాలో రచన, జీవించటం చాలా ఖర్చుతో కూడుకొని ఉందని స్వదేశంలో ఈ వైఖరి కూడదని ఒక రకంగా బహిష్కృతమైనట్లుగా ఉందని ఆందోళన కోసం ఒక ఏర్పాటు చేశారు. జేట్రూడ్ స్టెయిన్ ఎజ్రా పౌండ్, షేర్ వుడ్ ఆండర్సన్ మొదలైన ప్రయోగశీల రచయితలూ, యువ రచయిత హెమింగ్వే ముగ్గురు కలిసి దీనిని దీన్ని స్థాపించారు. ఆండర్సన్ హెమింగ్వేకు ప్లాట్ జాతీయం లేకుండా కథ ఎలా రాయాలో చూపాడు. జేట్రూడ్ అలంకార ప్రాయమైనదాన్ని, వర్ణనాత్మమైన దాన్ని వదిలేసి భాషమీద పట్టుతో ప్రతిమాటా ఒక కావ్యంగా రాయమని చెప్పింది. పత్రికలకు రాయటానికి ఆయన దగ్గర చాలా మార్గాలున్నాయి. చాలా కాలం తర్వాత "డెత్ ఇన్ ది ఆఫ్టర్ నూన్"లో "ఏం జరిగిందో నువ్వు ఏదో ఒక ట్రిక్ తో చెప్పావు. అది సమయానుకూలంగా కావలసిన చలనాన్ని విషయాన్ని చేరవేస్తుంది. దాని జీవితం ఏడాదో పదేళ్లో ఉండచ్చు. అదృష్టం బాగుంటే నువ్వు స్వచ్ఛంగా తగినంత చెబితే అది నా పరిధిని దాటి దాన్ని పట్టుకోవటానికి నేను చాలా కష్ట పడాల్సి వస్తుంది" అన్నాడు.

హెమింగ్వే ఒక కొత్త దృగ్విషయంగా ఉండేవాడు. ఈస్టేటేస్‌లో అతను అథ్లెట్. ఆరడుగుల పొడవు సింహం తల, పురుషాహంకార చాతీతో ఒక ప్రైజ్ రింగ్‌లోకి ప్రేవేశించినట్లు రూమ్‌లోకి ప్రవేశించేవాడు. ఆయన గొప్ప బాక్సర్ మాత్రమే కాదు దానిలో శిక్షణ కూడా ఇచ్చే గురూజీ కూడా. దవడ కింద చలాకీగా కొట్టటం ఆయన నేర్చిన గొప్ప పాఠం. 25లో జర్నలిస్ట్ కంటే రచయిత కావాలనుకొని మొదటి చిన్న పుస్తకం వదిలాడు. ఏదో ఒక అనామక ప్రెస్‌లో అంతగా ఆకర్షణ లేని విధంగా అది ప్రింట్ అయింది. దానికి "త్రీ స్టోరీస్ అండ్ టెన్ పోయెమ్స్" అని పేరుపెట్టాడు. కొద్దికాలానికే రెండవది "ఇన్ అవర్ టైం" అచ్చు వేశాడు. ఎక్కువగా సంప్రదాయాన్ని పట్టుకు పాకులాడినట్లనిపించింది. యుద్ధానంతర పరిస్థితి, ఎపిగ్రాఫ్‌లతో ఉంది. దీన్నే కొంత మార్చి 1924లో న్యుయార్క్ నుండి "ఇన్ అవర్ టైం"గా ప్రచురించాడు. ఇందులో ఆయన శక్తివంతుడైన సృజనాత్మక రచయిత అనిపిస్తాడు. కాని ఇంకా పరిపక్వానికిరాని, జీవితం, కళ అంటే ఏమిటో తెలీనివాడుగా కనిపించాడు. ఇదొక నవలగా ఉంటుంది. ప్రతి అధ్యాయానికి శీర్షిక, పాత్రల మధ్య సమన్వయం ఉంటుంది. నిజంగా ఇది

చిన్నకథల సమాహారమే కాని ఒకదానికొకటి సంబంధం కలిగి పాత దానికి శబ్ద చిత్రం అనిపిస్తుంది. ఏక సూత్రత ఉండటం విశేషం. చూడగా ఈ రెండూ వేరు వేరుగా అనిపిస్తాయి. ఇందులో యుద్ధం, హింస అకస్మాత్తు చావులు ఉంటాయి. మరోరకంగా అతని బాల్య స్వీయ చరిత్ర తండ్రితో చేపలు పట్టే విశేషాలు న్నాయి.. యుద్ధానికి ముందు కూడా లోకంలో శాంతిలేదని బాధపడటం చూస్తాం. 25లో ఉగ్రవాదం, పెద్ద పెద్ద విషాద సంఘటనలలో ఏర్పడిన క్రౌర్యం అంటే ఆయనకు మోజుగా ఉండేది. ప్రతి రోజు జీవితంలో విషాదం, క్రూరత్వం, హృదయం లేని భావం అతన్ని బాగా పీడించేవి. వీటినన్నిటిని "టోరెంట్స్ ఆఫ్ స్ప్రింగ్"లో రాశాడు. ఇది షేర్ వుడ్ ఆండర్సన్‌కు నివాళిగానే కనిపించినా పరిహాసమూ ధ్వనిస్తుంది. ఆండర్సన్ చెప్పే సెక్సువల్ మిస్టిసిజం ''లాస్ట్ జెనరేషన్''కు పూజనీయమైంది. శాంతికోసం ఆరాటం అందులో కనిపించకపోవటం ఆ సిద్ధాంతంలో హెమింగ్వేకు కనిపించింది.

హెమింగ్వే ఆకస్మాత్ ప్రాభవానికి ఆయన దృక్పథం, శైలి ముఖ్యకారణాలు. ఈ రెండు కూడా ఆగ్రహంలోంచి వచ్చినవే. వేలాది యువకుల నిరాశా నిస్పృహలు, స్థితి తృణీకరణం, ఆశల వైఫల్యంపై ఆయనకు కోపం ఎక్కువ. ఈ కోపం స్టాయిజం ముసుగులో కాని ఆ తరం సాంఘికంగా విలువల పరంగా తగినంత స్థాయిలో లేకపోవటం ఆయనకు బాధ కలిగించింది. కూలి పోయిన ప్రపంచంలో స్త్రీ పురుషులు ఏదో రకంగా సర్దుకుపోతూ, చిద్రమైన బోహిమియనల లాగా జీవించటం చూసి "ది సన్ ఆల్సో రైజేస్" రాసి పెద్ద సంచలనమే సృష్టించాడు. మంత్రముగ్ధంగా బిగపట్టిన నరాలతో హింసాత్మకంగా, పిచ్చి సంగీతం కోసం, మరింత కిక్కిచ్చే మద్యం కోసం అరవటం కనిపిస్తుంది. ప్రేమ లేని సెక్స్, సెక్స్ లేని ప్రేమ ఇందులో పుష్కలం.

ఇందులోని హీరోలు బుల్ ఫైటర్లు, హంటర్లు, క్రీడాకారులు, ఆదిమానవులు. వీరంతా 20వ శతాబ్ది బలహీన సంస్కృతికి ప్రతినిధులు. హెమింగ్వే వారి ప్రవక్త. వారి కస్టాలు బాధలు వేదనల కన్నీరు నిరాశా నిస్పృహలపై సానుభూతి చూపాడు. వీళ్ళను తాను అధిగామించినవాడు. ఆయన రచయిత మాత్రమేకాక, ఫైటర్, ప్రిమిటివ్, భౌతిక కార్యాన్ని ఘనంగా చెప్పినవాడు. చాలా ముక్కు సూటిగా అత్యంత సరళంగా, యే అలంకారం లేని విధంగా రాయటం ఆయన ప్రత్యేకత. "his tone was dry and flat but the implications were exciting. -the dialogues were as as artlessly plastic as conversation but they were un cannily precise and almost unbearably intense". ఈ దివాలా ప్రపంచాన్ని సమాజాన్నీ ఆయన తిరస్కరించాడు. తన స్వంత శబ్ద ప్రపంచాన్ని సృష్టించుకొని శబ్దబ్రహ్మ అనిపించాడు. ఆయనది ఒక భాషా విద్యాలయమే అయింది. సాహిత్య విప్లవం

కోరుకొన్నాడు. ఆయన విధానాన్ని రచయితలూ అనుకరించటానికి ఉబలాటపడ్డారు. కొందరు మాత్రం ఆయన రచనలు చదవ లేదని ప్రగల్భాలు పలికారు. ఆయన అండర్ స్టేట్‌మెంట్‌లు ఉడికే రక్తానికి ప్రతినిదులయ్యాయి. ఫాషన్ కూడా అయింది. "sick brutality and twisted sentimentality"లను వింతగా జోడించి రాయటం ఆయన ప్రత్యేకత. At twenty --seven Hemingway had set the keynote for a new kind of literature .it was felt half the young writers tried to imitate him and the other half tried not"

పారిస్‌లో ఉంటూ, టైరోల్‌లో స్కైయింగ్ స్పెయిన్ వెళ్లి బుల్ ఫైట్‌లతో కాలక్షేపం చేసేవాడు హెమింగ్వే. ఈ కాలంలో ఆయన అత్యుత్తమ కథలను రాశాడు. 1927లో మొదటి పెళ్లి విడాకులతో పూర్తి అవగానే పాలీన్ పీఫెర్‌ను పెళ్లి చేసుకొని ఇద్దరు మగ పిల్లలని కన్నాడు. అమెరికా వెళ్లి మరో చిన్న కథా సంపుటి "మెన్ వితౌట్ వుమెన్" ప్రచురించాడు. వెస్ట్‌కు వెళ్లి నైపుణ్యం గల చేపల వేటకాడయ్యాడు. అధిక శ్రమవలన ఆయన పాత గాయాలు మళ్ళీ ఇబ్బంది పెట్టాయి. 1928లో "ఫేర్ వెల్ టు ఆర్మ్స్" నవల పూర్తి చేశాడు. చిన్నకథను పుస్తక ప్రమాణంగా ద్వైవీ భావంతో ప్రేమ, యుద్ధ పతనాలను జోడించి రాశాడు. చిన్న కథలోని సమాప్తం నవలలో దుఃఖ విచారాలయ్యాయి. "మరణ మృదంగం" అని ఆయన విమర్శకులు అన్నట్లు ఆయన రచనల్లో అది పూర్తిగా ఆక్రమించింది. దీనినే "డెత్ ఇన్ ది ఆఫ్టర్ నూన్‌లో బుల్ ఫైటింగ్‌ను ఒక కళగా, అదొక ప్రత్యేక ఉన్నత శైలి వధగా వర్ణించాడు. ఏదో రకమైన ప్రమాదం ఉన్న ప్రేమను వదిలి బుల్ ఫైటింగ్‌లో పడ్డాడు. కాని అనుభవ రాహిత్యం ఇబ్బందిపాలు చేసింది. బొక్కలు (బొమికలు) విరిగి ఒళ్ళు పుళ్లు అయి అసలే నిప్పుల బాధలో ఉన్నవాడికి మరింత ఇబ్బంది కలిగింది. ఈ బాధల్లోంచే ఒక్కోసారి వినోదం, మరోసారి ప్రకాశవంతం కలిగిస్తూ రచనలు చేశాడు. "విన్నర్ టేక్ నథింగ్", "గ్రీన్ హిల్స్ ఆఫ్ ఆఫ్రికా"లలో బుల్ ఫైటింగ్ బదులు వేటకు ప్రాదాన్యమిచ్చాడు. "టు హావ్ అండ్ హావ్ నాట్"లో చావు, కరిగిపోవటంలను కలిపి రాశాడు. ఈ కథ కీ వెస్ట్‌లో జరిగింది. ఇక్కడ చావు మరో తరహాగా ఉంటుంది. 39లో ప్రవేశించిన హెమింగ్వే స్పానిష్ రిపబ్లిక్ కూలి పోవటంతో ఆ ధ్వని ప్రపంచమంతా ప్రతిధ్వనించినట్లు అనిపించింది. హెమింగ్వే ఫాసిస్ట్ వ్యతిరేకి. ''ప్రపంచ రక్షకులు'' అనిపించుకొంటున్నవారిని ఇంకా పూర్తిగా సమర్ధించ లేదాయన. అతని హారీ మార్గాన్ ఒక మోసకారి స్మగ్లర్ పేద్ద హీరోగా కుళ్ళిపోతున్న సమాజానికి ఉద్దారకుడిగా, ఆత్మ బలిదానం చేసిన అమర వీరుడయ్యాడు. ఇందులో లక్ష్య నినాదం "ఇప్పుడెవరూ ఒంటరికాదు". వేధించే సాంఘిక సమస్య హెమింగ్వేకు కొత్త. కనుక పుస్తకం రెండు

భాగాలుగా రాసి ప్రచురించాడు.

చావు కోరిక, పునరుత్పత్తి సిద్ధాంతంలను కలిపి “ది ఫిఫ్త్ కాలం” నాటకంగా రాశాడు. దీన్ని నవల చదివినంత హాయిగా చదువుకోవచ్చు. యుద్ధ పరిణామాలలో విఫల ప్రేమ ఉంది. హీరోకు చంపటంలో అర్థం ఉందనిపిస్తుంది. 1938లో ఈ నాటకంతో కలిపి కొన్ని ఆయన ప్రసిద్ధ కథలతో చేర్చి “ది ఫిఫ్త్ కాలం అండ్ ది ఫస్ట్ ఫార్టీనైన్ స్టోరీస్”గా తెచ్చాడు. ఇవి హాలీవుడ్ సినిమాలకు గొప్ప వరమైనాయి. వీటిలోనూ చావువాసనే వుంది. 45వ ఏట హెమింగ్వే అతని అతిపెద్ద, అతి ప్రాముఖ్యమైన నవల “ఫర్ హూం ది బెల్ టాల్స్” రాశాడు. పూర్వపు ఆలోచనే అయిన చావు, జీవితం దీనిలోనూ ప్రాధాన్యం పొందింది. స్పెయిన్‌లో ఫాసిస్ట్‌లపై లాయలిస్ట్‌ల పోరాటం గుర్తించాడు. మానవ స్వేచ్ఛకు బాధ్యతకు భంగం కలిగించే వాటిపై నిరసన గళమే ఆయన. పూర్వం ఆయనకు కీట్స్ కవి చెప్పిన “many a time I have been half in love with easeful death” భావనకు వ్యతిరేకి. జీవితాన్ని ప్రమాద పరచే ప్రేమ అంటే ఆయనకు చాలా ఇష్టం. చావు నిరాశామయమని, చావుకు అర్థం లేదని అనుకొనేవాడు. ఇప్పుడు ఆయనకు జీవిచటంలో మరణించటంలో ప్రయోజనం ఉందని తెలిసింది. దానికి కారణం కూడా ఉంటుందని అన్నాడు. స్పానిష్ యుద్ధంపై ఆయన రిపోర్ట్‌లో స్పానిష్ ప్రజలపై అధ్యయనం పెద్దగా లేదని కాని అది ఎపిక్ ధైర్యాన్ని, అనుకంపను కలిగిస్తుందని అంటారు. గెరిల్లాలపై సానుభూతి చూపాడు. మానవత్వంపై పెద్ద ఆశ కనిపిస్తుంది. అంటే కాదు మొదటిసారిగా సోదరత్వం గోచరిస్తుంది.

కాని లాయలిస్ట్‌ల ఓటమి త్యాగం, సంతోషం, సహవాసాలు ఆయన్ను సిగ్గుపడేట్లు చేశాయి. చివరికి ఇవి ఆయనలో పూర్తిగా మృగ్యమైపోయాయి. ఎనిమిదేళ్ళ తర్వాత “అక్రాస్ ది రివర్ అండ్ ఇంటూ ది ట్రీస్” రాశాడు. ఎంతో ఆశగా ఎదురు చూసిన జనానికి చుక్కలు చూపించి నిరాశ కలిగించింది. రచనా విధానం పేలవమై విసుగు పుట్టించింది. కాని చావు మళ్ళీ ప్రత్యక్షమైంది “ది ఓల్డ్ మాన్ అండ్ ది సీ”లో. 54 వయసు. చిన్న నవలే కాని మనిషి అదృష్టంతో ఢీ కోనటం కథ. జీవించటానికి, మరణింప చెయ్యటానికి ప్రబలమైన ప్రకృతి శక్తులతో మనిషి పోరాటాన్ని గొప్పగా చిత్రించాడు. ట్రాజిక్ డిగ్నిటికి పట్టం కట్టాడు. ఇలాంటి కథను ఇంతకూ ముందు హెమింగ్వే కాని ఆయన సమకాలికులు కాని రాయనే లేదు. క్లాసిక్ అయింది. నవలలో ఓల్డ్ మాన్‌తో చెప్పించిన మాటలు గొప్ప జీవిత సత్యాలు అన్వేషణా ఫలితాలూను– “Now we are joined together And no one to help either one of us. Fish I love you and respect you very much. You are my brother --you are killing me, fish. but you have a right to. Never

have I seen a greater, or more beautiful or calmer or more noble thing than you.,brother .Come on and kill me. I do not care who kills who". ఆ మహా మీనాన్ని చంపెదాకా టెన్షన్ బాగా పోషింప బడింది. గొప్ప భావోద్రేకాన్ని, మహా ప్రతీకాత్మకంగా తెలియజేశాడు. 1953లో దీనికి పులిట్జర్ బహుమతి లభించినందుకు అతని అభిమానులు యెగిరి గంతేసి పాతికేళ్ళు ఆలస్యంగా వచ్చిందని అంటే వ్యతిరేకులు ఆశ్చర్యంతో ముక్కున వేలేసుకొన్నారు. మరుసటి ఏడాదే నోబెల్ పురస్కారం అయన "style making mastership" శైలీ విన్యాసంలో అద్వితీయతకు లభించింది. ఆయన తనను తానూ కాల్చుకొని చనిపోకముందే నోబెల్ సంస్థ ఆయన్ను సత్కరించాలను కొన్నది. 1954 జనవరిలో రేడియోలో అకస్మాత్తుగా హెమింగ్వే మరణ వార్త ప్రసారమైంది. భార్యతో ఆఫ్రికాకు సఫారి కోసం వెళ్ళాడు. వీళ్ళు ప్రయాణం చేసే విమానం ముక్కలై ఎగువ నైలు నదీ ప్రాంతంలో కూలి పేలి పోయింది.. ఇంకేముంది ప్రసార మాధ్యమాలు "మహా గొప్ప నవలా కారుడు హెమింగ్వే మరణించాడని" మరణాన్ని ఆనందంగా అనుభవించాడు అని శీర్షికలు పెట్టి ప్రసారం చేశాయి. అప్పటిదాకా హెమింగ్వే రచనలను చదవని వేలాది మంది చావు ఆయన సాధారణ కథా విషయం అని ఎప్పటికప్పుడు చావు సమీపానికి వచ్చి తప్పించుకొంటాడని తెలుసుకొన్నారు. మర్నాడు ఉదయం పత్రికలూ ఆయన చావ లేదని రెండుసార్లు మృత్యువు కోరలలోంచి బ్రతికి బయటపడ్డ రచయిత అని పతాక శీర్షికలతో రాశాయి. కూలిన విమానంలో నుంచి నెమ్మదిగా ఇద్దరూ పాకుకొంటూ బయటపడ్డారు. ఒక మోటార్ లాంచ్ రక్షించింది..రక్షణ విమానం వచ్చి తీసుకొని వెడుతుండగా అది అగ్నిప్రమాదానికి గురై మళ్ళీ భార్యాభర్తలిద్దరూ బ్రతికి బయటపడ్డారు. అప్పుడు ఆయన "My luck --she is still running good" అన్నాడు.

హెమింగ్వే ఏదిరాసినా సంచలం సృష్టించింది. విమర్శకులు తమపని తాము చేసుకుపోతున్నారు. ఆయన క్యూబాలో పూర్వపు యుద్ధ విలేకరి నాలుగవ భార్య మేరీ వెల్ష్‌ని 1946లో పెళ్లి చేసుకొని తో హేపీ హేపీగా ఉన్నాడు. అతని శైలి గొప్పతనం గురించి చెప్పలేకపోతున్నారు. ఫోర్డ్ మాడాక్స్ ఫోర్డ్ "Hemingway 's words strike you, each one as if they were pebbles fetched fresh from a brook ..They live and shine each in its place" అని గొప్ప విశ్లేషణ చేశాడు. జీవద్భాషతో ఆయన మాటలు ఒక దానితో ఒకటి పోటీ పడతాయి. "His style is distinctly the man hard, clean, close clipped persistently masculine --his very adjectives are appropriately, even aggressively athletic and accurate" ఇంతటి గొప్ప రచయిత అయినా ఆయన చదువురాని

బాస్కెట్ బాల్ ఆటగాడిలా మాట్లాడేవాడు. ఇది ఆయనలో పెద్ద లోపం. తాను చావును చావుకోసం చూడనని చంపటం అనేది తిరుగుబాటుకు, దాని అమలుకు పోరాట భావన అన్నాడు.

1950 చివరిదాకా రచన చేస్తూనే ఉన్నాడు. 1959లో స్పెయిన్ వెళ్లి లైఫ్ మేగజైన్‌కు బుల్ ఫైటింగ్‌పై పరిశోధనాత్మక వ్యాసాలు రాశాడు. 1960లో క్యూబా వెళ్లి "లైఫ్" కోసం పది వేలమాటల రచన ప్రారంభిస్తే అది విపరీతంగా పెరిగిపోయింది. హాచ్నర్ సాయంతో దాన్ని నలభై వేల మాటలకు కుదించాడు. కాని ముద్రాపకులు పూర్తి స్క్రిప్ట్ ఇవ్వమని అడిగితే లక్షా ముప్పై వేల మాటలతో రాసిచ్చాడు. హెమింగ్వే దారి తప్పుతూ కంగారుగా ఉన్నట్లు అనిపించేవాడు. 1960 జులైలో భార్యతో కలిసి క్యూబా వదిలాడు మళ్ళీ రాలేకపోయాడు. లైఫ్ మేగజైన్ ఫ్రంట్ కవర్ పేజి కోసం స్పెయిన్ వెళ్ళాడు. కొద్దిరోజుల్లో తీవ్రమైన జబ్బు చేసిందని చావు బతుకులలో ఉన్నాడని వార్తా ప్రసారమైంది. కాని భార్యకు ఆయన కులాసాగానే ఉన్నాడని కేబుల్ వచ్చింది. అక్కడ ఒక్కడే పక్కకే అంకితమై ఉన్నాడు. తాను బ్రేక్ డౌన్‌లో ఉన్నానని గ్రహించాడు. లైఫ్ మేగజైన్‌లో "డేంజరస్ సమ్మర్" 1960 సెప్టెంబర్‌లో మంచి రివ్యూలతో వచ్చింది. అక్టోబర్‌లో స్పెయిన్ వదిలి న్యూయార్క్ చేరాడు. భార్య మేరి అపార్ట్‌మెంట్ వదిలి వెళ్ళనన్నాడు తనమీద ఎవరో నిఘా ఉన్నారని అనుమానపడ్డాడు. వెంటనే ఆమె ఇడాహోకు తీసుకువెళ్ళి డాక్టర్‌కు చూపించింది. డబ్బు కోసం రక్షణ కోసం ఇబ్బందిపడ్డాడు. అమెరికా ఎఫ్ బి ఐ అనపై నిఘా పెట్టిందనుకొన్నాడు. మేయో హాస్పిటల్‌లో ఉన్నాడు. ఆరోగ్యం తగ్గగా జూన్‌లో డిశ్చార్జ్ అయ్యాడు. 1961 ఏప్రిల్‌లో కేట్చెం చేరారు. మేలో ఆతని వద్ద పెద్ద షాట్ గన్ ఉన్నట్లు భార్య గ్రహించింది. భయపడి సన్ వాలీ హాస్పిటల్‌లో చేర్పించింది. మళ్ళీ మేయోలో చేరి షాక్ ట్రీట్మెంట్ తీసుకొన్నాడు. జూన్‌లో డిశ్చార్జ్ అయి 30కి ఇంటికి వెళ్ళాడు. 1961 జులై 2న తన డబుల్ బారెల్ షాట్ గన్‌తో కాల్చుకొని చనిపోయాడు.

చనిపోయే ముందు హెమింగ్వే పరిస్థితి తండ్రి ఆత్మహత్య చేసుకొన్నా దాని లాగానే ఉంది. హీమో క్రోమాటిస్ అనే మానసిక వ్యాధి తండ్రి నుంచి ఆయనకు సంక్రమించింది. హీమో క్రోమోటాసిస్ కూడా ఉందని ఆయన అమితంగా తాగేవాడని ఆ తర్వాత రిపోర్ట్‌లలో తేలింది. ఆయన సోదరి సోదరుడు కూడా ఆత్మహత్యతోనే చనిపోయారు.

Hemingway', style was fundamentally shaped "in reaction to [his] experience of world war". After World War I, he and other modernists "lost faith in the central institutions of Western civilization" by reacting against the elaborate style of 19th-century

writers and by creating a style "in which meaning is established through dialogue, through action, and silences—a fiction in which nothing crucial—or at least very little—is stated explicitly". [18] Hemingway learned to "get the most from the least, how to prune language, how to multiply intensities and how to tell nothing but the truth in a way that allowed for telling more than the truth. "[168] Hemingway called his style the Iceberg Theory: the facts float above water; the supporting structure and symbolism operate out of sight. [168] The concept of the iceberg theory is sometimes referred to as the "theory of omission". Hemingway believed the writer could describe one thing (such as Nick Adams fishing in "The Big Two-Hearted River") though an entirely different thing occurs below the surface (Nick Adams concentrating on fishing to the extent that he does not have to think about anything Hemingway habitually used the word "and" in place of commas Fiedler believes Hemingway inverts the American literary theme of the evil "Dark Woman" versus the good "Light Woman". The dark woman—Brett Ashley of The Sun Also Rises—is a goddess; the light woman—Margot Macomber of "The Short Happy Life of Francis Macomber "— is a murderess. [181] Robert Scholes admits that early Hemingway stories, such as "A Very Short Story", present "a male character favorably and a female unfavorably". [184] According to Rena Sanderson, early Hemingway critics lauded his male-centric world of masculine pursuits, and the fiction divided women into "castrators or love-slaves".❋



## 87. కొత్త జర్నలిజం, అమెరికా విస్తృత జీవిత శక్తుల ప్రతీక- థామస్ ఉల్ఫ్ (1900-1938)

అమెరికా విస్తృత జీవనశక్తికి ప్రతీక థామస్ ఉల్ఫ్. అమెరికా దేశపు హీరో. నిర్మించినది ప్రతిదీ అతి విస్తృతమై ఉండేది , నిప్పులు రాల్చే కళ్ళతో నల్ల జుట్టుతో, కాల గమన హింసతో, ఏకాకి జీవిత వ్యథతో, కోల్పోయిన దిగులుతో ఉండేవాడు. వాల్ట్ విట్మన్‌లాగా అమెరికాను అన్నికోణాల్లో దర్శించినవాడు, ఆ జీవితాన్ని ప్రతి స్థాయిలోను అనుభవించి, అమెరికా ప్రేమికుడై ఆరాధనతో నాలుగు నవలలతో సాహిత్య చిరంజీవియై 38 ఏళ్ళు రాకుండానే మరణించినవాడు. అమెరికా లో నార్త్ కారోలీనా ఆష్విల్‌లో 3-10-1900న జన్మించి థామస్ క్లేటన్ ఉల్ఫ్‌గా నామకరణం చేయబడ్డాడు. తండ్రి రాళ్ళు చెక్కేవాడే అయినా సాహిత్యం అంటే మోజున్నవాడు. కవిత్వాన్ని గట్టిగా ఆనందంగా పఠించేవాడు. ఉల్ఫ్ చిన్నతనం షేక్స్ పియర్ సాలి లోక్విల రిథం బట్టీ పట్టటం, గ్రే కవి "ఎలిజీ" అప్పగించటంతో గడిచింది. ఈ రెండూ కూడా వేదనా భరితమైనవే. తల్లి ఒక బోర్డింగ్ హౌస్ కీపర్. టాం ఏడుగురు పిల్లలలో చివరివాడు. కుటుంబ బాధ్యత కూడా మీద పడింది. బాల్యంలోనే ఇంటింటికీ పేపర్లు వేసి, ఎవరైనా పని చెబితే చేసి, కొన్ని పెన్నీలు సంపాదిస్తూ నీగ్రో క్వార్టర్‌లకు వెళ్లి ఒక నీగ్రో వాడిని బోర్డింగ్‌కు కుదిర్చేవాడ ..15వ ఏట టాంను నార్త్ కరోలినా యూనివర్సిటికి పంపే స్తోమత వచ్చింది. అక్కడ కాలేజ్ మేగజైన్‌కు న్యూస్ పేపర్‌కు ఎడిటర్ అయాడు. జర్నలిస్ట్ కాని లాయర్ కాని కావాలనుకోనేవాడు. కాలేజీ లో చివర రెండేళ్లలో చాలా ఏకాంకిక నాటికలు రాశాడు. కాని తాను ప్రోఫెషనల్ రచయిత అవుతానని కలలో కూడా అనుకోలేదు. అతను రాసిన నాటిక ఒకటి కాలేజి స్టేజ్‌పై ప్రదర్శింపబడింది. 18వ ఏట వర్జీనియాలో న్యు పోర్ట్ న్యూస్‌లో ఉద్యోగంలో చేరాడు. కవితలు, నాటక కథలు మనసులో సుళ్లు తిరిగేవి. 1920లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి హార్వర్డ్ వెళ్లి

అక్కడ ప్రొఫెసర్ జార్జ్ పియర్స్‌కు చెందిన ప్రసిద్ధ “47 వర్క్ షాప్”లో చేరాడు. దీనిలోనే ఆ తర్వాత ప్రముఖ నాటకకర్త యూజీన్ ఓ నీల్ కూడా చేరాడు.

టాంకు రాయటం అవలీలగా వచ్చేసింది. పదాలు నదీ ప్రవాహంలాగా దొర్లుకొంటూ వచ్చేసేవి. అవి తమంతటికి తామే వచ్చి ఎక్కడ ఉండాలో అక్కడ చేరినట్లు ఉండేవి. టాం కోసమే తాము సిద్ధంగా ఉన్నట్లు అనిపించేది. ఆ ప్రవాహం అడ్డూ ఆపూ లేకుండా మహా వేగం ఉధృతితో చేరి కుదిరి సార్థకంయ్యేవి. 20వ ఏట రోజూ తనను మోసుకుపోయే ఈ శబ్ద ప్రవాహం అకస్మాత్తుగా పొంగి ప్రవహించింది. కొత్త నాటికలు రాస్తున్నాడు. బాగున్నాయని అంటున్నారు కాని తిరస్కరింపబడేవి. అందరూ మెచ్చుకోనేవాళ్ళే కాని ప్రదర్శించటానికి ఎవరూ ముందుకొచ్చేవారు కాదు. ఇదంతా అతని సహనానికి పరీక్షగా ఉండేది. ఈ సందర్భంగా అతనిలో ఒక రకమైన తాత్విక చింతన ప్రారంభమై ఇలా రాసుకొన్నాడు. “I am acquiring patience. i am quite willing to wait for the unveiling exercises. All that really matters right now is the knowledge that I am twenty -- three and a golden May is here. The feeling of immortality in youth is upon me. I am young and I can never die. DonÑ t tell me that I can. Wait until I am thirty. Then I believe you”

కాని అంతగా ఓపిక పట్టలేక హార్వర్డ్ లో ఎం.యే.చేసి, న్యుయార్క్ వర్సిటి వాషింగ్టన్ స్క్వేర్ కాలేజి ఇన్‌స్ట్రక్టర్ ఉద్యోగం పొందాడు. చాలా నిబద్ధతతో చదువు చెప్పాడు. తనది ఉద్యోగంగా భావించి నాటకకర్త కావాలనుకొన్నాడు. ఇంగ్లీష్ డిపార్ట్ మెంట్ చైర్మన్ హోమర్ వాట్‌కు “నా దృష్టి అంతా నాటకాల మీద ఉంది. కొద్దిరోజుల్లో నేను థియేటర్ నాటకాలు రాయగలను అనే దైర్యం ఉన్నవాడిని. అది తప్ప నాకింకేదీ చెయ్యాలని లేదు” అని ఉత్తరం రాశాడు. వాళ్లకు చీమకుట్టినట్లుగా కూడా అనిపించలేదు. తన పరిసరాలను, చుట్టూ ఉన్నవాళ్ళను పెద్దగా పట్టించుకొనే వాడుకాదు. వీళ్ళను “ఆఫ్ టైం అండ్ ది రివర్”లో “స్కూల్ ఫర్ యుటిలిటి కల్చర్స్” శీర్షికతో వ్యంగ్యంగా ఏకేవాడు. ఆరేళ్ళు న్యుయార్లో టీచింగ్‌లో ఉన్నా క్లాస్ రూమ్‌ల నుండి విశ్రాంతిగానే గడిపాడు. విదేశాలకు వెళ్ళినప్పుడు ఒక నవల ఇతివృత్తం మనసులో మెదిలింది. మళ్ళీ టీచింగ్‌లో చేరాల్సివచ్చి, చేరి మళ్ళీ పారిపోయి 1926లో లండన్‌లో కనిపించాడు. విదేశంలో ఒంటరిగా ఉంటూ రాయటం మొదలుపెట్టాడు. రెండున్నర ఏళ్ళ తర్వాత న్యుయార్క్ వచ్చి, పగలు చదువు బోధించటంలో రాత్రుళ్ళు రచనలో గడిపి పుస్తకం పూర్తి చేశాడు. “పుస్తకం నన్ను కట్టి పడేసింది నన్ను స్వంతం చేసుకొంది” అని రాశాడు. ఈ నవల పేరు “ది స్టోరీ ఆఫ్ ఎ నావెల్”. దీన్ని గురించి “నవల దానికదే రూపు దిద్దుకున్నది. నాకు ప్రతి యువకుడూ ఇష్టమే. నేను ఆరాధించే రచయితల

ప్రభావం నాపై ఉంది. అప్పుడు జేమ్స్ జాయిస్ యులిసెస్"తో చాలా ప్రసిద్ధుడు. ఈ పుస్తక ప్రభావం నా నవలపై పడింది. అయినా నాదైన యువశక్తి, అగ్ని దానిపై బాగా పని చేశాయి. జాయిస్‌లాగానే నేనూ నాకు తెలిసిన వస్తువుల గురించి, ఇప్పటి జీవితం అనుభవం గూర్చి చిన్ననాటి విషయాల గురించి రాశాను. జాయిస్‌కున్న సాహిత్య అనుభవం నాకు లేదు. ఇంతకూ ముందు యే పుస్తకామూ నేను ప్రచురించలేదు. నాకు రచయితలూ, పబ్లిషర్లు, పుస్తకాలు, దూరపు ప్రపంచం ఏవీ తెలియవు. చిన్నతనంలో ఎలా రొమాంటిక్‌గా లేదో, ఇప్పుడూ అలాగే అంది. కాని ఈ నవలలో నేను సృష్టించి చిత్రించిన మనుషులు, రంగులు విశ్వ వాతావరణం అన్నీ నన్ను తమవాడినిగా చేసుకోన్నాయి. అందుకే నేను ఆ దీపశిఖతో ఒక యువకుడు ఇంతకూ పూర్వం ఏదీ ప్రచురించనివాడు రాసినట్లు ఇక ముందు అంతా మంచి జరగాలని జరుగుతుందని ఆశతో రాశాను" అని చెప్పాడు.

ఈ నవల నమ్మశక్యం కానంత బృహత్ నవల. మూడులక్షల యాభై వేల పదాల నవల. దీన్ని "ఓ లాస్ట్" అని పిలవాలనుకొన్నాడు. దీని ప్రచురణకు ఇద్దరు మిత్రుల సాయం అందుకొన్నాడు. చివరికి ఈ పుస్తకానికి "లుక్ హోమ్వర్డ్ ఏంజెల్" అని పేరుపెట్టాడు. 29వ పుట్టిన రోజు విడుదల చేశాడు దీన్ని. తనను తాను మరీ నగ్నంగా ప్రదర్శించుకొన్నానేమో అనుకొన్నాడు. కాని విమర్శకులు చాలా గొప్పగా పెద్ద పెద్ద విశేషణాలతో మెచ్చుకొనే సరికి మహదానందం పొందాడు. కొందరు దీన్ని వీధి మూలల్లో తిట్టటం, అతని అభిమాని ఒకామె ఫిర్యాదు చేయటం మనసును కల్లోల పరచింది. "బాబోయ్! ఇది ఫిక్షనే కాని ఎవరి జీవిత చిత్రణా కాదు మొర్రోయ్" అని చెప్పుకొన్నాడు. అయినా అది ఆయన జీవిత చరిత్రే అనటంలో సందేహం లేదు. దీనిపై ఉల్ఫ్" మన జీవితాలలో అన్ని క్షణాల మొత్తమే మనం. మనలో ఉన్నదే వాళ్ళలోనూ ఉంది మనం తప్పించుకోవటంకాని, దాచటానికి కాని ఏదీ ఉండదు. జీవితం మట్టిలోనుంచే ప్రావిర్భావం చెందుతుంది. అందరూ దీన్ని ఉపయోగించాల్సిందే. తప్పించుకోలేరెవ్వరూ. ఒక లైబ్రరీలో సగం చదివి కాని ఒక మనిషి ఒక పుస్తకం రాయలేడు అన్నాడు డాక్టర్ జాన్సన్. అదే విధంగా నవలాకారుడు నగరంలో సగం మంది జనాన్ని పరామర్శిస్తే కాని ఒక పాత్రను మలచ లేడు" అని చెప్పుకొన్నాడు.

పుస్తక విజయం ఆనందంకన్నా ఆందోళన కలిగించింది ఉల్ఫ్‌కు. మరోటి రాస్తే యే రకంగా విమర్శకులు స్పందిస్తారో అనే ఆందోళన ఎక్కువైంది. నవల అమ్మకాలు మహా జోరుగా ఉండటంతో న్యుయార్క్ ఉద్యోగానికి రాజీనామా చేశాడు. గుగ్గెన్ హీం ఫెలోషిప్ అవార్డ్ పొందాడు. మళ్ళీ విదేశాలకు వెళ్లి పారిస్‌లో "హోం సిక్" అయి బుర్రనిండా రాయబోయే రచనల ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరై తుఫానుకు కదిలిపోయినట్లు

కదిలిపోయాడు. రెండవది అదే వేగంతో రాసేశాడు. "నేను రాయలేదు. నవలే నన్ను రాసింది" అన్నాడు పోతనలాగా. దీన్ని "అక్టోబర్ ఫైర్" అందామనుకొన్నాడు. కాని తట్టుకోలేని ఒడ్లను కూలుస్తూ సాగే ఆ భావాల వరద, ఉరవడి అతడిని వివశుడిని చేసి పేరు "ఆఫ్ టైం అండ్ ది రివర్"గా మార్చాడు. మొదట్లో దానికి రూపం నిర్మాణం ఏవీ లేవు. ఆతను అన్నది నిజమే. అది ఉద్ధరింపబడని అనంత ఉత్సాహ పూరిత మహా ప్రవాహమే. "అమెరికాలోని చీకటి వెలుగుల గురించే రాశాను. పది వేల చిన్న పట్టణాల జనాల గురించి రాశాను. నిద్ర మోతు మొహాల గురించి చెప్పాను. నదులు చీకటిలో ఎలా ప్రవహించాయో రాశాను. పదివేల మైళ్ళ తీరం, దానిపై వరద ఉద్ధృతి, ఘోరారణ్యాలపై చంద్రకాంతి మిలమిల, పిల్లి కళ్ళలోని పసుపు రంగు మెరపు, చావు, నిద్ర, మనం సిటి అని ముద్దుగా పిలుచుకొనే శిలా సదృశ మానవ జీవితం, అక్టోబర్ నెల సోయగం, పెద్దపెద్ద రాళ్ళూ రాక్షస అరుపులతో రాత్రిళ్ళు పరిగెత్తే రైళ్ళు విధం, ఉదయంలో స్టేషన్లు, షిప్స్ గురించి, హార్బర్‌లో జనం, షిప్‌ల వద్ద ట్రాఫిక్" అన్నీ రాశాను" అని చెప్పాడు ఉల్ఫ్.

అమెరికాకు 1931లో తిరిగొచ్చాక మళ్ళీ మనసంతా నువ్వే అన్నట్లు మనుషులు, కేకలు, దీప ప్రభలు, అదృశ్య ముఖాలు సూర్యరశ్మి రావటం పోవటం పొదలపై ఆకుల రెపరెపలు, రాయి రప్పా, ఆకు అలము, తలుపు చెక్కా–ఒకటేమిటి సమస్త జీవం అతని కళ్ళముందు మనసులో నిండి పరవళ్ళు తొక్కుతూ పరవశం కలిగిస్తున్నాయి. సౌత్ బ్రూక్లిన్‌లో అసీరియన్ క్వార్టర్‌లోని బేస్ మెంట్‌లో ఉంటూ తన హీరో యూజీన్ గాంట్ జీవితంపై పేజీలపై పేజీలు గుట్టలు గుట్టలుగా రాసి పారేస్తున్నాడు. అవి లెడ్జెర్ మీద లెడ్జెర్‌గా అనేక పెద్ద పెద్ద పాకింగ్ కేసుల నిండా నింపేశాడు. పుస్తకానికి ముగింపు పలకలేక పోయాడు. పెర్కిన్సన్ ఏదో సలహా ఇవ్వటం దాన్ని అంగీకరించి మరో ఎపిసోడ్ రాయటం, బ్రూక్లిన్ వచ్చి రాసింది నెమరేసుకొని "అరే! ఇదేమీ చాలినట్లు లేదే" అనుకోని మళ్ళీ దాన్ని పెంచి రాయటంతో అంత విస్తృతమైన నవలగా రూపొందింది. పెర్కిన్సన్ సహాయంతో మళ్ళీ తగ్గించుకొంటూ వచ్చాడు. అయినా ఒక మిలియన్ పదాలతో మహా నవల అయింది సాధారణ నవలకు రెట్టింపు అన్నమాట. టాల్‌స్టాయ్ తాత "వార్ అండ్ పీస్"కు ద్విగుణీకృతం. వర్జీనియా రాత్రి రైల్ ప్రయాణంతో నవల మొదలు పెదదామనుకొన్నాడు. కానీ ఉపోద్ఘాత అధ్యాయమే లక్ష పదాలయింది. అంటే చిన్న సైజు పుస్తకం. దాన్ని త్యాగం చేయాల్సి వచ్చింది చివరికి. "ఈ రక్తపాత హత్య నేను భరించలేక పోయాను" అన్నాడు దాన్ని తీసేస్తూ. యాభై వేల పదాలున్న చాప్టర్‌లను కుదించాడు. పుస్తకం పూర్తి అయింది. ఇక ప్రెస్‌కు పంపటమే తరువాయి అనుకొన్న సమయంలో "అబ్బే! ఇదేమీ సంపూర్ణంగా లేదే అసమగ్రంగా ఉందే" అనిపించి నరికేసినవి మళ్ళీ కుట్టాడు. ఇంకా ఎన్నో చెప్పలేక రాయలేకపోయానే అనే దుగ్ధ ఎప్పుడూ

ఉండేది. ఉల్ఫ్ చికాగో వెళ్ళిన సందర్భంలో పార్కిన్సన్ నవలను సంక్షిప్తంగా ఎడిట్ చేసి ప్రింటర్ చేతిలోపెట్టి ఉండకపోతే ఆ నవల ఎన్నటికీ వెలుగు చూసేదికాదు. ఉల్ఫ్ తిరిగొచ్చి నెత్తీ నోరూ మొత్తుకొని తనకింకా ఆరు నెలల సమయం కావాలన్నాడు. "నువ్వేమైనా ఫ్లాబర్ట్ లాగా పెర్ఫెక్షన్ కోసం నగిషీల కోసం రాస్తున్నానను కొంటున్నావా?" అని చివాట్లు పెట్టినా, ప్రూఫ్ పేజీల మీదే తాను రాయాలనుకొన్నది అంతా రాసి ఉల్ఫ్ కోరిక తీర్చుకొన్నాడు. ఇలా రాస్తూ తిరిగి రాస్తూ "ఆఫ్ టైం అండ్ ది రివర్" నవలను పూర్తి చేయటానికి ఆరేళ్ళు తీసుకొన్నాడు. 1935 మార్చ్‌లో ఇది వెలుగు చూసింది.

ఈ నవల స్పందన ఎలా వస్తుందో అనే లోపల భయం ఉంది ఉల్ఫ్‌కు. "నేను నా జీవితాన్ని వినాశకరంగా ఆవిష్కరించు కున్నాను. దయనీయమైన తెలివి తక్కువ వాడిగా ప్రవర్తించాను. ఏదో ప్రలోభం, బుద్ధి చాంచల్యంతో రాశానేమో" అన్నాడు. పబ్లిష్ అయిన రోజు దేశం వదిలి పారిస్‌లో ఉన్నాడు. మొదటిభాగం లాగానే రెండవదీ విజయం సాధించింది అని వినగానే నమ్మ లేకపోయాడు. తరువాత రాసిన పుస్తకాలలో స్వీయజీవిత చరిత్రను రాయటం తగ్గించేశాడు. తన హీరో యూజీన్ గాంట్‌ను అతని ఆకృతులను మార్చేశాడు ఉల్ఫ్. తరువాత రెండు నవలలు మొదటి రెండిటి గొలుసు నవలలే అయినా నాలుగూ కలిసి ఒకటే పుస్తకం ఒక శిఖరాయమాన స్వీయ జీవిత చరిత్ర అయింది. ఇప్పుడు హీరోకు జార్జ్ వెబర్ పేరు పెట్టాడు. గాంట్‌ను మానసిక వికలాంగ ముఖం" అని అంటే ఇప్పుడు వెబర్‌ను "చతికిల పడ్డ మనిషి" అన్నాడు. వెబర్‌ను స్నేహితులు "మాంక్" రుషి అని పిలిచేవారు. వెబర్ అంటే రూపం మార్చుకొన్న కఠినంగా మారిన గాంట్ అనిపిస్తాడు.

ఉల్ఫ్ మరణానంతరం ప్రచురింపబడిన "వెబ్ అండ్ ది రాక్", "యు కం నాట్ గో హోం అగైన్"లోను గాంట్-వెబర్ పాత్రను కాలంతో బాటు మారి ముసలితనంతో ఉన్నట్లు చిత్రించాడు. ఆ పాత్ర దయనీయంగా, వాస్తవ విరుద్ధంగా, ఒక్కోసారి పారనయిక్‌గా కనిపిస్తుంది. అతడు అతనికంటే ఎక్కువ వాడనిపిస్తాడు. తన బలహీనలతలు తెలిసినవాడు. ఆత్మ సానుభూతిని అవహేళనతో జోడించాడు. అతను అమెరికా ఆర్టిస్ట్‌గా కాక అమెరికా చిహ్నంగా దర్శనమిస్తాడు. పాతను నిరాకరిస్తూ, తమది కాని సంప్రదాయాన్ని కాదంటూ ఎమర్సన్ విట్మన్‌ల లాగా దుఃఖిస్తూ ఆ దేశంలోనే ఆ మట్టితోనే తమ జీవితాలను తామే వెలిగించుకొంటూ, శక్తి సామర్థ్యాలు సమకూర్చుకొంటూ, తమ భాషా సంస్కృతులను కాపాడుకొంటూ, తమ కళా సారాన్ని అనుభవిస్తూ జీవించాలి అనే సందేశం కనిపిస్తుంది.

ఈ విషయాన్ని రూపు చెందించే సమయం ఆయనకు లేకపోయింది. తన ఆకలి హృదయాన్ని సంతృప్తి పరచలేక పోయాడు. "Billion forms of America, the savage violence, and the dense complexity of all its swarming

life"ను రూపొందించ లేకపోయాడు. 1938 జులైలో జబ్బుపడి మందుకు అలవాటు పడ్డాడు. న్యుమోనియా వచ్చి కోలుకొంటూ కాంప్లికేషన్స్ పెరిగి సెరిబ్రల్ ఇన్ఫెక్షన్ ఏర్పడి ఆపరేషన్ చేయాల్సి వచ్చి బాల్టిమోర్‌లో జాన్స్ హాప్కిన్స్ హాస్పిటల్‌లో 15-9-1938న 38వ పుట్టిన రోజు15రోజుల్లో వస్తుందనగా థామస్ ఉల్ఫ్ చనిపోయాడు. ఆయన తప్పులు చాలా ఉన్నాయి వాటి నిగ్గు తేల్చాల్సింది విమర్శకులే. "one can only respect Wolfe for his determination to realize himself on the higher level and to be satisfied with nothing short of greatness" అన్నాడు బెర్నార్డ్ డీ వోటో. అతని రచనా సర్వస్వం ఆవేశాత్మక ప్రక్రియ (ఫోర్సింగ్ ప్రాసెస్). అతను చెప్పిన ప్రతి మాటలో ఇంతకూ ముందు యే మానవుడూ భూమి మనిషి గూర్చి చెప్పని అద్భుత ఆశ్చర్యకర విషయాలున్నాయి. ప్రపంచం మొత్తం మీద వీటిని ఇంత గొప్పగా అర్ధం చేసుకొని ఇంత అద్భుతంగా చెప్పిన వారు లేరు అనిపిస్తాడు. అతనిది హింసాత్మక ప్రయత్న చరిత్ర అంటారు (వయలెన్స్ ఎండేవర్). అతని వెబ్ అండ్ ది రాక్ అతని రచనల్లో గొప్పది అన్నాడు జేబీ.ప్రీస్టి.

తప్పులెన్ని ఉన్నా రచనలో శిఖరారోహణ చేశాడు. "I believe that we are lost in America" అని అరిపిస్తాడు నిజమైన అమెరికాను ఆవిష్కరించే పని మనది అన్నాడు. The true discovery of America is before us. I think the true fulfillment of our spirit, of our people, of our mighty and immortal land, is yet to come" అని కలవరించిన వాడు థామస్ ఉల్ఫ్. ఎంతో కష్టపడి ఎంతో దూరం ప్రయాణించి సంపూర్ణత్వం సాధించాడు. ఆయన కాల దేశాలకు అతీతమైన భావన ఉన్నవాడు. శైలిని తృణీకరించి, అనుభవ సారాన్ని మానవ హృదయ భారాన్ని ఒక గుండు సూది మొనమీద నిలబెట్టిన వాడు. "నేను కవిగానే ఉంటాను తప్ప ఇంకా ఏదీ కాను" అన్నాడు. ఉల్ఫ్ మరణానంతరం విడుదలైన రెండు పుస్తకాలు "ది ఫేస్ ఆఫ్ ఎ నేషన్" అనేది కవితా సంపుటి. "ఎ స్టోన్, ఎ లీఫ్, ఎ డోర్" అనే వచనాలను కవిత్వీకరించిన సంపుటి. సహజ కవి అయినా వచన మాధ్యమాన్ని ఎంచుకొన్నాడు. తాను కవి అని ఆయనే గుర్తించలేక పోయాడు. "లుక్ హోం వర్డ్ ఏంజెల్"లో నగ్న సౌందర్య కవిత్వాన్ని ఒలక బోశాడు. ఆ కవితా వైభవాన్ని చూద్దాం- "Which of us has known his brother? which of us has -- -looked into his father', heart? which of us has not --remained forever prison pent? which of us is not-forever a stranger and alone" అతని కవితా శైలిపై లూయీ అంటర్ మేయర్ "Wolfe 's diffuse style, such a passage is so perfectly shaped, so classic in design, that its clear and almost formal rhythms reveal, the spirit free of the heavy flesh.

They speak for the clairvoyant poet, beyond life out living death, completed and fulfilled" అని ఖచ్చితంగా ఎస్టిమేట్ చేశాడు. తన తరానికి మహా గొప్ప ప్రతిభ ఉన్నవాడు ఉల్ఫ్ అన్నాడు విలియం ఫాక్నర్. బీట్ జెనరేషన్‌కు చెందినజాక్ కరౌక్, రే బ్రాడ్ బరి, ఫిలిప్ రాత్ బెట్టి స్మిత్ లపై ఉల్ఫ్ ప్రభావం చాలా ఎక్కువ. స్వీయచరిత్ర రాసిన వారిలో సర్వ ప్రధముడు ఉల్ఫ్. నార్త్ కరోలీనాకు చెందిన మహా రచయిత. అతని ప్రసిద్ధ పదబంధం "ఫియర్ అండ్ లోదింగ్" భయం, ద్వేషం".

ధామస్ ఉల్ఫ్ సొసైటీ ఏర్పడి ఆయన సాహిత్యాధ్యయనానికి కృషి చేస్తోంది. నార్త్ కరోలినలోని ఆయన ఇల్లు ఎస్టేట్ జాతీయ సంపదగా రక్షింపబడుతోంది. ఎన్ సైక్లో పీడియా బ్రిటాన్నికాలో "Wolfe was gifted with the faculty of almost total recall, and his fiction is characterized by an intense consciousness of scene and place, together with what is often an extraordinary lyric power. In Look Homeward, Angel and Of Time and the River, Wolfe was able to imbue his life story and the figures of his parents with a lofty romantic quality that has epic and mythopoeic overtones. Powerful emotional evocation and literal reporting are combined in his fiction, and he often alternates between dramatically effective episodes of recollection and highly charged passages of rhetoric. Though The Web and the Rock and You Can' t Go Home Again contain episodes of great vividness, they are too often uncontrolled in their form and fail to sustain the epic tone of Look Homeward, Angel, which has become an American classic"అని రాశారు. ఆయన కోటబుల్ కోట్స్ కొన్ని చూద్దాం-

Culture is the arts elevated to a set of beliefs.

One belongs to New York instantly. One belongs to it as much in five minutes as in five years.

The reason a writer writes a book is to forget a book and the reason a reader reads one is to remember it.❋



## 88. విధిపై మానవ విజయాన్ని, కళ కథ మానవ కథే అని చెప్పిన ఫ్రెంచ్ రచయిత, మంత్రి– ఆంద్రే మాల్రక్స్ (1901–1976)

యాభై రెండేళ్ళ వయసులో నవలాకారుడు రాజకీయవేత్త, వామ భావాలనుండి, రియాక్షనరి కుడి భావాలకు మారి, అమెరికా వెళ్లి రాజకీయాలు మానవ మనుగడను భయపెట్టి బెదిరిస్తున్నాయని, కళ ఒక్కటే అందర్నీ కలిపి ఉంచే ఏకైక సాధనమని చెప్పిన వాడు ఫ్రెంచ్ నవలాకారుడు ఆంద్రే మాల్రక్స్. ఈ విషయాన్ని తన "ది వాయిస్ ఆఫ్ సైలెన్స్" మ్యూజియం వితౌట్ వాల్స్"లో చెబుతూ సంపూర్ణ కళ తప్ప అన్ని సంపూర్ణ విషయాలు అదృశ్యమైపోతాయి అన్నాడు. నూతన మానవత్వం, ఆధ్యాత్మిక వాస్తవం, కళ "నూతన మతంలో ఒక భాగం. ప్రతి ఉద్గ్రంధమూ సూటిగానో, బహిర్గతంగానో గుడ్డి విధిపై మానవ విజయాలను తెలియ జెప్పేవే. కళాకారుడు తన శక్తితో తెలుసుకొని ఆవిష్కరిస్తాడు. దానికి మానవత్వ పలుకుబడిని కలిగిస్తాడు. కాల గర్భంలో కలిసి పోకుండా నిలిచినా అవన్నీ గడచిపోయిన మానవ నాగరకత యొక్క లోపలి స్వరాలే (ఇన్నర్ వాయిస్). ఈ సజీవ, ఇంకా అమరం కాని దేవతలను చేరే స్వరం దాని సాఫల్యత కోసం అవిశ్రాంత మరణ వాద్య బృందమే అవుతుంది. అన్ని నాగరకతల కళలో ఇది సర్వ సాధారణం. అది దైవ ఘటనకు వ్యతిరేకమైన రక్షణనే వ్యక్త పరుస్తుంది" అన్నాడు మాల్రక్స్.

మాల్రక్స్ చెప్పే "డిఫెన్స్ ఎగైనెస్ట్ ఫెటాలిటి" అతనిలో భిన్న రూపాల ద్వారా వ్యక్తమైంది. అనేక జీవుల ఉద్ధరణకు దారి తీసింది. 3–11–1901న మాల్రక్స్ పారిస్‌లో పుట్టాడు. తండ్రి సమర్ధుడైన సంపన్నుడైన సివిల్ ఉద్యోగి. కొడుకు ఉన్నత

విద్యలో రాణించాలనుకొన్నాడు. లైసె కాండో ర్సేట్‌లో క్లాసిక్స్ చదివి పారిస్ స్కూల్ ఆఫ్ ఓరియెంటల్ లాంగ్వేజెస్‌లో చేరి సంస్కృత, చైనా భాషలతోపాటు ఆర్కియాలజీ కూడా క్షుణ్ణంగా నేర్చాడు. ఇరవైవ ఏట మొదటి వచన పద్యాన్ని రాసి ప్రచురించాడు. జర్మన్ జ్యూయిష్ ఫైనాన్సర్ కూతురు క్లారా గోల్డ్ ష్మిత్‌ను పెళ్లి చేసుకొన్నాడు. 23వ ఏట ఇండో చైనాకు తండ్రితో వెళ్లి ఆర్కియాలజికల్ పరిశోధనలో గడిపాడు. పురాతన స్థలాలను త్రవ్వించి శిధిల దేవాలయాలను, భూ గర్భంలోని బౌద్ధ శిల్పాలను వెలికి తీయించాడు. ఏడాది కాలం ఈ పనిలో గడిపి గతంపై బోర్ కొత్త వర్తమానంపై అభిరుచితో కాలనీ ప్రజల స్థితిగతుల అన్వేషణలో పడ్డాడు. "అన్నమైట్ తిరుగుబాటు"కు ఆకర్షితుడై "అన్నాం లీగ్"లో చేరి దాని స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వామి అయ్యాడు. చైనా సరిహద్దు దాటి లోపలి ప్రవేశించి మాల్రక్స్ రాజకీయాలలో పూర్తిగా మునిగిపోయాడు. 1925 నేషనల్ లిబరేషన్ ఉద్యమంలో పాల్గొని సన్యట్ సేన్ స్థాపించిన కోమిటాంగ్‌లో చేరి అసోసియేట్ సెక్రెటరి జనరల్ అయ్యాడు. చాంగ్ కై షేక్ సహ సభ్యుడుగా ఉన్న కమిటీ ఆఫ్ ట్వెల్వ్‌లో పని చేస్తూ కాంటన్ తిరుగుబాటులో పాల్గొని కోమిటాంగ్‌కు కమ్యూనిస్ట్ పార్టీల సయోధ్య కుదిర్చాడు. అతని వాగ్ధాటి, ఉత్సాహం గుర్తింపబడి క్వాంటంగ్ క్వాన్ గ్సి ప్రాంతాల ప్రాపగాండా కమీషనర్‌గా నియమింపబడ్డాడు. 26వ ఏట పూర్తి తిరుగుబాటుదారుడని పించుకొన్నాడు.

ఇండో చైనా, షాంఘై, హాంగ్ కాంగ్‌లలో చూసిన దారుణ పరిస్థితులన్నీ మొదటి మూడు నవలలో చేరాయి. అధికారానికి డిమాండ్‌లు దానికోసం కార్యాచరణ వీటిలో కనిపిస్తాయి. "ది కాన్కరర్స్"లో హీరో చైనాలో సోవియెట్ ప్రతినిధి. 1925లో హాంగ్ కాంగ్ సమ్మెకు ప్రాపగాండా చేస్తాడు. దీన్ని ట్రాట్స్కి "romanticized chronicle of revolution" అన్నాడు. కాని మాల్రక్స్ అది వ్యక్తికీ సామూహిక చర్యకు ఉన్న సంబంధమేకాని సామూహిక చర్య మాత్రమే కాదు అన్నాడు. ఏడాది తర్వాత వచ్చిన "ది రాయల్ వే"లో కంబోడియాలోని పురాతత్వ విషయాలున్నా అందులో మాల్రక్స్ ఏకాకి జీవితం, మావుడు చావును జయించలేని స్థితి, దానిపై తన అజాగ్రత్త వినాశకర శక్తితో పోరాటం ఉన్నాయి.

మూడవ నవల "మాన్స్ ఫేట్" మాల్రక్స్‌ను అంతర్జాతీయ వ్యక్తిని చేసింది. మాస్టర్ పీస్ అనే పేరొచ్చింది. కాన్కోర్ట్ ప్రైజ్ సాధించింది. అన్ని జీవద్భాషలలోకి తర్జుమా అయింది. హెమింగ్వే లాగానే మాల్రక్స్ కూడా చావు, హింసలనే ఎంచుకొన్నాడు. హెమింగ్వే లా కాక ప్రతి చర్యను సమర్ధించాడు. దానికి కారణాలు అన్వేషించి చెప్పాడు. జనరల్ చాంగ్ కై షేక్‌కు, కోమిటాంగ్ కమ్యూనిస్ట్ పార్టీకి మధ్య జరిగిన చారిత్రాత్మక

పోరాటాన్ని నేపథ్యంగా రాసిన నవల ఇది. షాంఘైలోని 1927 నాటి రెండు రోజుల సంక్షోభాన్ని చాలా అన్వేషణాత్మకంగా, నాన్యతో దర్శనీయంగా రాశాడు" డాస్టోవి స్కి, గోర్కీల తర్వాత ఇంత వివరంగా ప్రజా సంక్షోభాన్ని వర్ణించిన పుస్తకం ఇదే" అన్నాడు ఫిలిప్ హేండర్సన్.. "Malraux 's people are however not merely the products of their environment, bitterly fighting their way to opposite goals but shares a philosophy --an acceptance of cruelty and its barriers against communication, a determination to force the moment to its utmost, and desperate affirmation of terror, loneliness and sacrifice for some un definable but greater future" ఇందులో జరుగుతున్నకాలం నిర్ణయాత్మకమైన కాలం అని, ఒక జాతి భవిష్యత్తు మొత్తం కొద్ది మంది యుద్ధానికి సన్నద్ధ మౌతున్న ప్రచారకుల (ప్రాపగాం డిస్ట్)ల చేతుల్లోనే ఉంది అనిపిస్తుంది.

మూడవ ఇంటర్నేషనల్ నుండి 1927లో చాంగ్ కై షేక్ విడిపోయి కమ్యూనిస్ట్‌లతో కలిసిపోయినప్పుడు మాల్రక్స్ యూరప్ తిరిగి వెళ్లిపోయాడు. అక్కడ చేతులు ముడుచుకొని కూర్చోలేదు. యాంటి ఫాసిస్ట్ ఉద్యమ నాయకుడై, యూరప్‌లోని అండర్ గ్రౌండ్ వర్కర్లకు, అన్ని ప్రదేశాలలోని ''సామాన్య జన సమూహానికి సేవ చేయటానికి అంకితమయ్యాడు. "డే ఆఫ్ రాత్"లో ఫాసిజం సమస్యను నాటకీయంగా రాశాడు. ఇది మాన్స్ ఫేట్ కంటే విపరీతంగా కిక్ అయింది. ఇందులో కేంసేన్ పాత్ర అండర్ గ్రౌండ్ జర్మన్ మనిషి. కమ్యూనిస్ట్‌ల జాబితాను ఇవ్వమని ఆయన్ను అడిగినప్పుడు తిరస్కరిస్తే తొమ్మిది రోజులు కటిక చీకటి జైలులో పెట్టారు. ఎవరో ఒక బకరా కమ్యూనిస్ట్ తానే కాస్నేర్ అని ఒప్పుకున్నందున అసలు వాడిని విడుదల చేశారు. మాల్రక్స్ సాంఘిక సేవ పేపర్లకే పరిమితం కాలేదు. పెద్ద పెద్ద బహిరంగ సభల్లో ఆవేశంగా నాజియిజం నిజాన్ని గురించి, ముసోలిని బ్లాక్ షర్ట్ సాహసాల గురించి మాట్లాడే వాడు. అబిసీనియాపై క్రూర దాడిని నిరసించాడు. ''ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ రైటర్స్" సంస్థను సంస్కృతీ పరిరక్షణ కోసం ఏర్పరచాడు.

1936లో మాల్రక్స్ మళ్ళీ విప్లవోద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. స్పెయిన్‌కు ఫ్రాంకో డిక్టేటర్ అయినప్పుడు మాల్రక్స్ లాయలిస్ట్‌లతో కలిశాడు. ఒక విమానం తీసుకొని మాడ్రిడ్ వెళ్లి విమానం నడిపే అనుభవం ఎక్కువగా లేకపోయినా ధైర్యంగా ఫాసిస్ట్ సామ్రాజ్యంపై 65 దాడులు చేశాడు. ఆ దాడిలో రెండుసార్లు గాయపడ్డాడు. స్పెయిన్ ముందుకు దూసుకు రాకుండా ఆపగలిగాడు. ఫ్రాన్స్, అమెరికాలలో

ప్రయాణించి లాయలిస్ట్‌లకు అండగా నిలవాలని ఆదేశాలను ఒప్పించి వారికి ధన సహాయం కోసం విరాళాలు సేకరించాడు. స్పానిక్ సివిల్ వార్ మొదటి దశ విషయాలన్నిటిని "మాన్స్ హోప్స్"లో రాశాడు. వీధి యుద్ధాల భీభత్సం, సాయుధ శ్రేణుల వీరోచిత పోరాటం అసలైన హీరో అయిన రిపబ్లిక్ ఆర్మీ విషయాలను చాలా ఖచ్చితంగా వర్ణించాడు. అనేక మంది ఇతర రచయితలలాగా రెండు పడవలలో కాళ్ళు పెట్టాడు అన్నారు.

మాల్రక్స్‌కు ఈ మారటాలు మామూలే. స్టాలిన్‌ను కొన్ని రోజులు, ట్రాట్ స్కి ని కొన్ని రోజులు సమర్ధించాడు. మార్క్సిస్ట్‌ల విజయోత్సవాలను, వాళ్ళ పరాజయపరంపరలనూ చూశాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో టాంక్ దళంలో పేరు నమోదు చేయించుకొని, అరెస్ట్ అయి, తప్పించుకొని, అండర్ గ్రౌండ్ మార్క్విజ్‌లతో చేరి పనిచేశాడు. యుద్ధం పూర్తి అవగానే మాల్రక్స్ పూర్తి రైటిస్ట్ ప్రభుత్వాన్ని సమర్ధించి తన అభిమానుల్ని అనుచరుల్ని విపరీతంగా ఆశ్చర్యంలో పడేశాడు. నియంత చార్లెస్ డిగాల్లీని సమర్ధించటం మరీ విడ్డూరం అనిపించింది. విప్లవవాది డీగల్లీకి వ్యతిరేకి అయి యుద్ధాన్ని ద్వేషించాడని ఆయన యుద్ధ ప్రేమికుడని నింద మోపినప్పుడు మాల్రక్స్ "నేను మారలేదు ప్రపంచం మారింది" అని సమాధానమిచ్చాడు. బాహ్యంగా ఆయనలో పెద్ద మార్పేమీ లేదు. 50 ఏళ్ళ వయసులో ఆయన నీలి కళ్ళు ఇంకా జ్వలిస్తూనే ఉన్నాయి. జుట్టు నల్లగా నిగ నిగ లాడుతూ, మూతి మాత్రం ఇదివరకటి కంటే బిగుసుకుపోయి కనిపించాడు.

భార్య క్లారాతో వివాహ జీవితం సమాప్తమై విడాకులు తీసుకొన్నారు. రచయిత్రి జోసేట్టి క్లోటిస్‌ను పెళ్ళాడాడు. ఇద్దరు పిల్లలు పుట్టారు. ఆమె రైలు ప్రమాదంలో చనిపోయింది. మూడో పెళ్లి హాఫ్ బ్రదర్ రోలాండ్ భార్య మేరీ మెడలీన్‌ను చేసుకొన్నాడు. రోలాండ్ గెస్టపోలో, మరో హాఫ్ బ్రదర్ క్లాడ్ రెసిస్టన్స్ మూవ్‌మెంట్‌లో చనిపోయారు. 1953లో అంతగా ఉత్తేజం ఇవ్వని "ది వాయిసెస్ ఆఫ్ సైలెన్స్" ప్రచురించాడు. మనిషి, అతని ఆర్టిస్టిక్ కళా చిత్రాన్ని నియో లిథిక్ కాలం నుంచి ఆధునిక కాలం వరకు రాసి "ది సైకాలజీ ఆఫ్ ఆర్ట్" పేరుతో ప్రచురించాడు. "All art Malraux implies is a revolt, a protest against extinction, a rebellious act against death and man' tragic mortality. మాల్రక్స్ దృష్టిలో కళ కథ అంటే మనిషి కథ కూడా.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మాల్రక్స్ చివరి నవల "ది స్ట్రగుల్ విత్ ది ఏంజెల్" రాశాడు. యుద్ధం తర్వాత ప్రెసిడెంట్ డీగల్లి 1945లో మాల్రక్స్‌ను ఇన్ఫర్మేషన్

మినిస్టర్‌ను చేశాడు. సైకాలజీ ఆఫ్ ఆర్ట్‌పై మూడు పుస్తకాలు రాశాక మూడిటిని కలిపి కొంత మార్చి ఒకే పుస్తకంగా తెచ్చాడు. 1958లో డీగాల్లి మళ్ళీ ప్రెసిడెంట్ అయ్యాక మాల్రక్స్‌ను మొట్టమొదటిసారిగా కల్చరల్ ఎఫైర్స్ మినిస్టర్‌ను చేశాడు. నల్లకప్పేసిన పురాతన ఫ్రెంచ్ బిల్డింగ్‌లను శుభ్రపరచి రంగులతో శోభాయమానం చేశాడు. ఫ్రాన్స్ దేశ జాతీయ వారసత్వాన్ని కాపాడే అనేక చర్యలు తీసుకొన్నాడు. 1957లో "మెటా మార్ఫసిస్ ఆఫ్ ది గాడ్స్" మూడు భాగాలలో మొదటిది ప్రచురితమైంది. మిగిలిన రెండు భాగాలు ఆయన మరణానంతరం వెలువడ్డాయి. బంగ్లాదేశ్ విముక్తి ఉద్యమాన్ని మాల్రక్స్ సమర్ధించాడు. 1971లో భారత ప్రధాని ఇందిరా గాంధి పారిస్ సందర్శించినప్పుడు మాల్రక్స్ ఆమెతో బంగ్లా దేశ సమస్యను చర్చించాడు. యుద్ధానంతరం పాక్షిక జీవిత చరిత్ర భాగాలు రాసి ప్రచురించాడు. పారిస్ దగ్గర క్రిటేల్‌లో 23-11-1976న మాల్రక్స్ 75వ ఏట మరణించాడు.

మాల్రక్స్ అనేక అవార్డులు పొందాడు అందులో ముఖ్యమైనవి-ప్రిక్స్ కాన్కర్ట్ అవార్డ్, మేడేల్లె డీ లా రెసిస్టన్స్, టాక్స్ డీ గేర్రే. అంతర్జాతీయ మాల్రక్స్ సొసైటీ అమెరికాలో ఏర్పడింది. పారిస్‌లోనూ ఇలాంటి సంస్థ ఏర్పడింది. మాల్రక్స్ కొటేషన్‌లు కొన్ని చూద్దాం-

1) man is dead ,after God .
2) the artist is not the transcriber of the world ,he is its rival
3) what is man ? a miserable little pile of secrets .
4) Art is an object lesson for the gods
5) The art museum is one of the places that give us the highest idea of man.

మాల్రక్స్ దాదాపు 20 గ్రంథాలు రాశాడు.❁



## 89. అస్తిత్వ, దృగ్విషయవాది ఫ్రెంచ్ ఫిలాసఫర్ -జీన్ పాల్ సాత్రే (1905-1980)

ఫ్రెంచ్ నాటక నవలాకర్త, ఫిలాసఫర్, రాజకీయ నాయకుడు, జీవిత చరిత్రకారుడు, అస్తిత్వవాద దృగ్విషయవాద సిద్ధాంత మూల పురుషులలో ఒకడు, 20వ శతాబ్ది ఫ్రెంచ్ ఫిలాసఫీ మార్క్సిజంలో నిష్ణాతుడు జీన్ పాల్ సాత్రే. ఆయన రచనా ప్రభావం సోషియాలజి, క్రిటికల్ థీరీ, పోస్ట్ కలోనియల్ థీరీ, లిటరరీ స్టడీస్‌లపై గొప్ప ప్రభావం చూపాయి.

సోరెన్ కర్క్ గార్డ్ ఫిలాసఫీ అనేక విరుద్ధ విషయాలను ప్రతిపాదించింది. ముఖ్యంగా మానవుడు దేవుని సమీపిస్తున్నకొద్దీ శూన్యం దగ్గరకు చేరతాడు, ఈ శూన్యం అతని అస్తిత్వ వాదసాఫల్యమే. కర్క్ గార్డ్ మరణించిన వందేళ్ళకు మానవ అస్తిత్వ సమస్య ఆధునిక యుగంలో రెండు విభిన్న సిద్ధాంతాలకు దారి తీసింది. అందులో మొదటిది-మానవునికి ప్రాధమికంగా విశ్వాసం ఉండాలని మత సాంప్రదాయాలను పాటించాలన్నది, దాని సారాంశం గ్రహించాలన్నది. రెండవది -అసలు దేవుడూ గీవుడూ జాన్తా "నై' 'అంటూ అన్ని సువార్తలను, మెటా ఫిజికల్ జ్ఞానాలను పూర్తిగా తిరస్కరించి అస్తిత్వవాదననే నమ్మటం అనేది. రెండవ సిద్ధాంతానికి మళ్ళీ రెండు భిన్నమార్గాలు ఏర్పడి విమర్శకులు కూడా రెండు గుడారాలలో చేరారు. ఫిలాసఫీలో కొత్త నిష్క్రమణ అని, అసలు ఫిలాసఫీ తిరస్కరించటమేనని అన్నారు. కొత్త విభేదం వచ్చినప్పుడల్లా అస్తిత్వవాదం మహా వేగంగా పెరిగింది. దాని మూల ద్వేషం నిరాశ మూలాలపై ఆధారపడింది. 1940లో రెండవ ప్రపంచ యుద్ధంతో ఏర్పడిన ఆశారాహిత్యంతో ఇది వెంటనే ప్రాభవం పొందింది. దీనికి ప్రేరణ జీన్ పాల్ సాత్రే వల్లనే జరిగింది.

5-6-1905న పారిస్‌లో జన్మించిన సాత్రే బాల్యం నుంచి ఫిలాసఫీని ఇష్టపడటం విశేషం. ఈకోల్ నార్మేల్‌లో చదివి 25 ఏళ్ళకే డిగ్రీ పొంది, పారిస్ లోని లీ హార్వే, లయాన్‌లలో ఫిలాసఫీ బోధించాడు. 30లలో జర్మని, ఇటలి స్పెయిన్, గ్రీస్, ఇంగ్లాండ్ లలో పర్యటన చేసి, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఆర్మీలో చేరాడు. 1939లో ఆల్సేస్‌లో ఆర్టిలరి అబ్సర్వర్‌గా ఉన్నాడు. ఏడాది తర్వాత బందీ అయి జర్మన్ జైలులో 9 నెలలు గడిపాడు. ఎలాగోలా తప్పించుకొని ఫ్రాన్స్ అధీనంకాని జోన్‌కు చేరి, 35వ ఏట టీచింగ్ చేశాడు .నాజీ ప్రభుత్వం ఫ్రాన్స్ దేశాన్ని కబళించినప్పుడు సాత్రే పారిస్ లోనే ఉండిపోయి అండర్ గ్రౌండ్‌లో రెసిస్టన్స్ మూవ్మెంట్ 'వాళ్లకు రిస్క్ తీసుకొని సహాయం చేశాడు.

ఈ పరిస్థితులోనే సాత్రే తన స్వంత "పారడాక్స్ ఫిలాసఫీ"పై ఆలోచించి రూపుదిద్దాడు. ఇందులో ముఖ్య విషయం "బయటి అణగార్చే తనం వలననే విముక్తి శక్తి ఏర్పడుతుంది. అది మానవులోని లోపలి మనిషిని తనకు రోజూ ఏది కావాలంటే అది చేసుకోనేట్లు చేసి తెగించే నిర్ణయాలను చేయిస్తుంది. సాత్రే "రిపబ్లిక్ ఆఫ్ సైలెన్స్" గ్రంథం రాశాడు. ఇందులో "జర్మన్లు ఆక్రమించినప్పుడు మేము పొందిన స్వేచ్ఛ అంతకు ముందు ఎప్పుడూ పొందలేదు. మా హక్కులన్నీ హరించేశారు. మాట్లాడే హక్కుతో సహా. ప్రతి రోజు మమ్మల్ని మా ముఖం మీదే అవమానిస్తున్నారు. వాటిని మేము మౌనంగా భరించాం ఏదో ఒక నెపంతో వర్కర్లుగా జ్యూలుగా రాజకీయ ఖైదీలుగా మమ్మల్ని సామూహికంగా దేశం నుంచి బహిష్కరించారు. నోటీస్ బోర్డులపైనా, వార్తాపత్రికలలో, సినిమాహాళ్ళలో మమ్మల్ని అతి నీచంగా అవమానకరంగా చిత్రించి మేము ఆ అణగార్చే ముఠాకు లొంగిపోయేట్లు, వాళ్ళ మాటవినేట్లు చేసే ప్రయత్నాలన్నీ చేశారు. అందుకే వీటన్నిటి వలన మేము ఫ్రీగా ఉన్నాం. నాజి విషం మా ఆలోచనల్లోకి ఎక్కిపోయింది. ప్రతి సరైన ఆలోచనా ఒక విజయమే అయింది. అన్నిరకాల అంతమంది పోలీసులు మా నోళ్ళు మూయించటానికి విశ్వ ప్రయత్నం చేసినా, మాలోంచి వచ్చిన ప్రతిమాట ఒక సిద్ధాంత విలువగా ప్రకటితమైంది. మమ్మల్ని వేటాడి పడగొట్టటం వలన, మాలోని ప్రతి కవళిక ఒక గట్టి నిబద్ధతకు బలాన్నిచ్చింది" అంటాడు తీవ్ర స్థాయిసిజంతో. "వాళ్ళ హింసలు ,దౌర్జన్య దురాగతాలు కూడా మాకు హాయిగా జీవించే స్థితి కల్పించాయి. భ్రమ, అబద్ధపు అవమానం, భయంకర బతకలేనితనం అన్నీ మాకు మానవ అదృష్టంగా కలిసి వచ్చాయి" అన్నాడు సాత్రే.

ఐక్యత, ఒంటరితనం రెండూ ముఖ్యమైనవే అని కాని ప్రతిగంటకు అత్యవసరమైనవే అని సాత్రే అంటాడు.. "అండర్ గ్రౌండ్ కార్యకలాపాలలో ఉన్నవారి పోరాట స్థితులు

కొత్త తరహా అనుభవాలనిచ్చాయి. వాళ్ళు సామాన్య సైనికులులాగా బయట పోట్లాడరు. అన్ని పరిస్థితులలోనూ వారు ఒంటరివారే. ఆ ఏకాంతంలోనే వేటాడబడి, ఏకాంతంలోనే అరెస్ట్ అయినవాళ్ళు. పూర్తి నిరాధార, స్నేహరహితంగా హింస, దౌర్జన్యాలలో నగ్నంగా ఏకాంతంగా అనుభవిస్తూ, నున్నగా గొరగబడి, బాగా తిండి పెట్టబడి, మంచి వస్త్ర ధారణతో, బలిసిన ఒళ్ళు చూసుకొని మురుస్తూ కనిపించే ప్రతిదీ సరైనదిగా భావిస్తారు. ఒంటరిగా స్నేహ రహితంగా, ప్రోత్సాహం కలిగించే ఒక్కమాటా లేకుండా, ఒంటరితనపు అగాధాల్లో ఇతరులను ఆ ఇతరులనే తమ కామ్రేడ్‌లనే నిలవరించటానికి ఎదిరిస్తూ బతికారు. సంపూర్ణ బాధ్యత సంపూర్ణ ఒంటరితనంలోనే. ఇది కాదా మన విముక్తికి నిర్వచనం? వ్యక్తిగతంగా,కమాండర్ ఇన్ చీఫ్ పరంగా రిస్క్‌తో కూడిన సమానత్వాన్ని పొందుతున్న ఇలాంటి సైన్యం ప్రపంచంలో ఎక్కడా ఉండదు. క్రమశిక్షణలో అదే ప్రమాదం అదే పూర్తి బాధ్యత, అదే త్యాగం, అదే సంపూర్ణ స్వేచ్ఛ. ఈ విధంగా చీకట్లో, రక్తంలో ఒక రిపబ్లిక్ సర్వశక్తి వంతమైన రిపబ్లిక్ ఏర్పడింది. స్వేచ్ఛలో తనకుతాను ఎంచుకొంటూ, అందరి స్వేచ్ఛనూ ఎంచుకొన్నాడు" అని రాశాడు సాత్రే.

ఫ్రాన్స్ విముక్తమయ్యాక టీచర్, పోరాట యోధుడు అయిన సాత్రే మరింత శక్తివంతమైన రచయిత అయ్యాడు. పోరాటంలో తాను అనుభవించిన కష్టాలు బాధలు అన్నీ ఆయనకు బాగా గుర్తుండి శారీరక మానసిక వేదనలను గ్రహించి మానవ సమాజ ప్రవర్తన, వారి దయనీయ స్థితిగతులపై రాశాడు. సానుభూతిలేని స్వచ్ఛతతో మనిషి ఈ వేదనామయ ప్రపంచంలో తన ఉనికికి ఏదీ సహకరించని పరిస్థితులను అన్వేషించి రాశాడు. మనిషి స్వేచ్ఛాయుత మనసే అతని జీవితానికి దారి అన్నాడు. మనిషి నిరాశా నిస్పృహలను వేదనను "ది ఏజ్ ఆఫ్ రీజన్", "ది రిప్రీవ్", ది లాస్ట్ చాన్స్, నాసియా" మొదలైన వాటిలో రాశాడు. నాటకాలుగా "ది ఫ్లైస్", నో ఎక్సిట్‌లను నరకం భూమికగా రాసి, ది రేస్పెక్ట బుల్ ప్రాస్టి ట్యూట్ "మెలోడ్రామా రాశాడు ఇవన్నీ అభిమానుల్ని అలరిస్తే థియేటర్ వాళ్ళు అధిక్షేపించారు. 38వ ఏట సాత్రే తన ప్రముఖ ఫిలసాఫికల్ రచన "బీయింగ్ అండ్ నాన్ బీయింగ్" రాశాడు.

కర్క్ గార్డ్ దృష్టిలో ఆదర్శ జీవితం అంటే నిరంతర అన్వేషణ, దైవ సాక్షాత్కారానికి అనంత తపన. ఇద్దరికీ బహుదూరం కనుక జీవితమంతా కడగండ్ల అనుభవమై చివరికి దక్కుతుంది. దీన్ని సాత్రే పూర్తిగా వ్యతిరేకించాడు. అందుకే "The self that existentialism seeks is each person' individual self, which he must forge for himself out of such senseless circumstances, such meaningless limitations as are given him. This self creation --the

making of ones essence from mere existence --is demanded by each of us because according to existentialism,there is no single essence of humanity to which we may logically turn as standard or model for making ourselves thus or so. And there is no single concept of humanity because there is no God" అని వివరించాడు.

మనిషి తను చేస్తున్నదానికి తానున్నదానికి పూర్తి బాధ్యుడు. మనిషికి మించిన విలువలు లేవు. కనుక సమయ సందర్భాలను బట్టి తనకు కావలసింది ఎన్నుకొని తన మార్గంలో ప్రవర్తించాలి. హ్యూమనిజానికి మరో పేరు అస్తిత్వవాదం. మనిషి మాత్రమే మూలమూ సృష్టికర్త అన్ని విలువలకు. మానసికంగా పరిపక్వం చెంది ముందుకు మానవుడు నడవాలి అని సాత్రే వేదాంత సారాంశం. ఎవరికి వారే స్వతంత్రులు కనుక వేరొకరిపై బలవంతంగా దేనినీ రుద్దరాదు. అయితే తన స్వేచ్ఛను ఆషామాషీగా భావించ కూడదు. స్వాతంత్ర్యం అంటే వరం కాదు అదొక భరించరాని బాధ్యత. ప్రపంచంలో మనిషి విరుద్ధ ద్వంద్వాలలో ఇరుక్కుని ఉన్నాడు. విముక్తికోసం నిరంతరం పోరాటం చేస్తాడు. అలారం గడియారాలు, సైన్ బోర్డ్లు, పోలీసులు వంటివి భయపెట్టే ఎన్నో అడ్డంకులు. నాకు నేను తెలియబడితే వీటి అర్థం తెలుస్తుంది" అంటాడు సాత్రే. అస్తిత్వవాదం విరుద్ధత ఏమిటి అంటే జంకని పెసిమిస్ట్ మోరలిస్ట్ అవటం, అన్నిటినీ కాదనే నిరీశ్వరవాది మాంచి ఆధ్యాత్మిక గురువు అవటం. అయితే సాత్రే మాత్రం ప్రపంచాన్ని ప్రశ్నించే ఎదిరించే వారి ప్రతినిధి. యంత్ర ఉత్పత్తికి, మెటాఫిజిక్స్కు వ్యతిరేకి. అందుకే ఆయనను "ది ఎమోషనల్లి అన్ ఎంప్లాఎడ్" అన్నారు.

ఇంకా అసలైన అస్తిత్వవాద సిద్ధాంతం ఏర్పడలేదు. ఎమిలీ జోలా, ఇబ్సెన్ల కాలం నాటి నేచురలిజంను మించినది అస్తిత్వవాదం. అస్తిత్వవాదానికి కొన్ని మంచి లక్షణాలే ఉన్నాయి. కాని దాని అచేతనత్వమే అందర్నీ భయపెడుతోంది. అది అచేతనత్వానికి విరుగుడు మాత్రం కాలేకపోయింది. విశ్వ వ్యాప్త రుగ్మతపై అది కొత్త మతాన్నికాని స్పష్టమైన మానవజాతిని కాని నిర్మించలేక పోయింది. కాని ప్రపంచ వ్యాప్తవేదనను అస్తిత్వవాదులు అర్థం చేసుకొన్నారు.

సాత్రేకు సైమన్ డీ బోవియర్తో సన్నిహిత సంబంధాలుండేవి. ఇద్దరూ కలిసి సాంఘిక సాంస్కృతిక భావాలను ఎదిరించారు. 1964లో సాత్రేకు సాహిత్యంలో నోబెల్ బహుమతిని ప్రకటిస్తే తీసుకోవటానికి తిరస్కరిస్తూ "A writer should not allow himself to be turned into an institution" అన్నాడు. తనకు అధికారిక మర్యాదలు ఇష్టం లేదన్నాడు. పారిస్లో 15-4-1980న 74వ ఏట జీన్ పాల్ సాత్రే

జీవనయాత్ర ముగించాడు.

In 1975, when asked how he would like to be remembered, Sartre replied:

I would like [people] to remember Nausea, [my plays] No Exit and The Devil and the Good Lord, and then my two philosophical works, more particularly the second one, Critique of Dialectical Reason. Then my essay on Genet, Saint Genet……. If these are remembered, that would be quite an achievement, and I donÑ t ask for more. As a man, if a certain Jean-Paul Sartre is remembered, I would like people to remember the milieu or historical situation in which I lived, …… how I lived in it, in terms of all the aspirations which I tried to gather up within myself.[52]

గుస్తేవ్ ఫ్లాబర్ట్ జీవిత చరిత్ర రాశాడు సాత్రే. సాత్రేను "పబ్లిక్ ఇంటలెక్చువల్" అంటారు. వామభావ పక్షపాతి. దాదాపు ఇరవైకి పైగా కల్పనా సాహిత్య పుస్తకాలు, 10 ఫిలసాఫికల్ వ్యాసాలూ, 4 జీవిత చరిత్రలు, 15 విమర్శన వ్యాసాలూ రాశాడు.

The war opened Sartre', eyes to a political reality he had not yet understood until forced into continual engagement with it: "the world itself destroyed Sartre' illusions about isolated self-determining individuals and made clear his own personal stake in the events of the time. "[70]Returning to Paris in 1941 he formed the "Socialisme et Libert" resistance group. In 1943, after the group disbanded, Sartre joined a writers' Resistance group, [71] in which he remained an active participant until the end of the war. He continued to write ferociously, and it was due to this "crucial experience of war and captivity that Sartre began to try to build up a positive moral system and to express it through literature". [7] ❁



## 90. కవిత్వానికి విముక్తి కల్గించిన వామభావ ఆంగ్ల కవి- డబ్ల్యు.హెచ్.ఆడెన్ (1907-1973)

35 ఏళ్ళలోపు విస్టన్ హఫ్ ఆడెన్ కలవరపరచే విషయమైనాడు. అట్లాంటిక్ సముద్రానికి రెండువైపులా ఆయన అత్యంత ప్రభావం కలిగించాడు. ఆయన కవిత్వం ఒక మైలు రాయిగా ఉండటమే కాక, ఒక అత్యంత గొప్ప మలుపు కూడా తిప్పింది. ఆధునిక కవులపై రాసిన ఉద్గ్రంథం "ఆడెన్ అండ్ ఆఫ్టర్" గొప్ప విశ్లేషణాత్మకమైన గ్రంథం. దీని ఉప శీర్షిక "కవిత్వ విముక్తి 1930-43" కూడా అంతటి ప్రాముఖ్యం పొందింది. దీన్నిబట్టి ఆయన ఒక యుగకర్త అనిపిస్తాడు.

21-2-1907న ఇంగ్లాండ్‌లోని యార్క్‌లో ఆడెన్ జన్మించాడు. తండ్రి రిటైర్డ్ మెడికల్ ఆఫీసర్. హోల్ట్‌లోని గ్రేషమ్స్ స్కూల్‌లో చదివి, ఆక్స్‌ఫర్డ్‌లో క్రైస్ట్ చర్చ్ కాలేజిలో చేరి, 23వ ఏట నుండి అయిదేళ్ళు మాల్వేర్న్‌లోని స్కూల్‌లో బోధించాడు అతని "ఓడ్ -టు మై ప్యూపిల్స్" లండన్ అంతా ప్రతిధ్వనించింది. మరుసటి ఏడాది ఒక ఫిలిం ఫర్మ్‌లో పని చేశాడు. 30లో కింగ్స్ పోయెట్రి మెడల్ అందుకొన్నాడు. స్పెయిన్ వెళ్లిస్పానిష్ విప్లవ సమయంలో లాయలిస్టల కోసం ఒక అంబులెన్స్ నడిపాడు. రెండేళ్ళ తర్వాత ఎరికా మాన్ అనే థామస్ మాన్ కుమార్తెను పెళ్లి చేసుకొని అమెరికాకు తాను రాసిందంతా తీసుకొని వెళ్ళాడు. 1946లో అమెరికా పౌరుడయి, అప్పటికే నాలుగు కవితాసంపుటులు, మూడు నాటకాలు, 3 వచన సంపుటాలు, యాత్రపై రెండు, 3 ఆంథాలజీలు రాసి రచయితగా పేరొందాడు.

ఆడెన్ మొదటి కవితా సంపుటిలోనే ఆయన కవితా చాతుర్యం మనసులోని ఫిలాసఫీ వ్యక్తమయ్యాయి. "పాత ముఠా"ను నిర్దాక్షిణ్యంగా ఖండించాడు. వారి కవిత్వం

ఏడుపుగొట్టు విషాదభరితమన్నాడు. కాని తానూ కొత్తదారి తొక్క లేకపోయాడు. యుద్ధపు కరుకుదనంలో శాంతిలో అలక్ష్యం చేయబడిన వారి పక్షాన చేరాడు. వాళ్ళలో ఒకడు కాకపోయినా మనసారా సానుభూతి చూపాడు. ఆయన పూర్తిగా పాల్గొనక పోవటానికి కారణం కవిత్వంలో బిగుసుకుపోవటం అడ్డంకి అయింది. తనకోసం తన చుట్టూ ఉండే కొద్ది మంది కోసమే ఆడెన్ రాశాడు అని ఆయనపై అభియోగం ఉంది. తన పరిధి దాటి ఇతరులతో కలవటానికి చేసే ప్రయత్నం, అంతశ్శోధన, అనిశ్చిత ముగింపులు కనిపిస్తాయి.

ఆడెన్ 30వ ఏట రాసిన "ఆన్ దిస్ ఐలాండ్"లో మూడేళ్ళ తర్వాత వచ్చిన "అనదర్ టైం"లో సాంఘికవిషయాలు చోటు చేసుకొన్నాయి. భాష చాలా సరళంగా విషయం సూటిగా ఉంది. అప్పటి వరకు ఉన్న మూస పదబంధాలను త్రోసిరాజని కొత్త ఉదాత్త భావజాలాన్ని చొప్పించాడు. నిత్య జీవిత విషయాలు కవిత్వంలో చోటు చేసుకొన్నాయి. పాటకజన పాటలు, జానపద గీతాలు, లయతో ఊగిపోయేట్లు రాశాడు. సైన్స్ ఆవిష్కరణలను కొత్త నాటక శైలిలో రచించాడు. డిగ్నిటి తోపాటు రౌడి యిజం కూడా ఏకకాలంలో కన్పించటం ప్రత్యేకత. ఉన్నత విద్యావేత్తగా ఒక ప్రక్క కనిపిస్తూనే ప్రజాకవిగా వెలుగొందాడు. ఈ ద్విముఖ కవితా మార్గం ఆశ్చర్యపరచింది. "The poet was essentially a wit after the caustic mockery of "Law" అనిపిస్తాడు అంటాడు గార్డనర్స్. ఉదాహరణకు ఒక కవిత–

"Law says the judge as he looks down his nose --speaking clearly and most severely --law is as I have told you before --law is as you know I suppose --law is but let me explain it once more --law is the law"

సామాన్య లిరికల్ కవి మాత్రమే రాయగలిగిన ఒక లవ్ పోయెం రాసి మరీ ఆశ్చర్యపరుస్తాడు ఆడెన్–

"Lay your sleeping head, my love-human on my faithless arm --time and fevers burn away --individual beauty from --thoughtful children, and the grave --proves the child 's ephemeral --but in my arms till break of day --let the living creature lie --mortal ,guilty but to me --the entirely beautiful"

ఆధునిక కవులయిన ఆడెన్ ఒక్కడే పాత ఫాషన్ బాల్లడ్‌లో లేక విలానేల్లెలో భావవ్యక్తీకరణ చేసే సామర్థ్యమున్నవాడు. ఫ్రెంచ్ సంప్రదాయాలైన సేస్టినా మొదలైన

ఫారంస్‌లో కూడా ఆడెన్ ఒక్కడే ఇలా చేయగలిగాడు. ఆడెన్ ఇంగ్లాండ్‌లో అందరితో కలిసి పోయాడు. ఒక్కొసారీ "మరీ ఎక్కువ భారం వేశాడు" అనిపిస్తాడు. ఆడెన్ కవిత్వంలో "A vitality ,an explosive violence, that leaves his contemporaries dazed" అన్నాడు స్పెండర్. ముష్పైలలో "ది డబుల్ మాన్", "ఫర్ ది టైం బీయింగ్"లలో ఆయన ఎంత విరుద్ధ భావ ప్రేరణ కవియో, తన తరాన్ని ఎంత గొప్పగా ప్రబావితం చేశాడో తెలుస్తుంది. "ది డబుల్ గేమ్" 700 లైన్లు ఉన్న సుదీర్ఘ కవిత. ఇందులో ఆడెన్ మల్టిపుల్ మాన్‌గా కనిపిస్తాడు. అంటే-బ్రావేరా పెర్ఫార్మర్‌గా, ఫినికల్ క్రాఫ్ట్ మన్‌గా, జాంటి ఐకనో క్లాస్ట్‌గా, రిజర్వేడ్ క్లాసిసిస్ట్‌గా కనిపిస్తాడన్నమాట. దీన్ని చూసి ఆయన మళ్ళీ లైన్‌లో పడ్డాడని సమకాలీన కవులలో ప్రయోగశీలి అని, పోప్ మార్గగామి అనిపిస్తాడు. కాని "ది టెంపుల్స్"లో క్లాసిక్, కలోక్వియల్‌లను కలిపి చాలా అందంగా పారడాక్స్‌గా రాశాడు. ఇదీ, దీని తరువాత రాసిన వాటిల్లో ఒక అపూర్వతను సాధించాడు-అదే లైట్ వర్స్‌కు ఆరేటరికి, ఉన్నత భావాలకు, ఉన్నత తీవ్రతకు మధ్య ఉన్న అడ్డంకులను తొలగించి పారేశాడు.

ఇలియట్ కవిలాగా ఆడెన్ నిరాశా నిస్పృహ సంక్షోభాలనులతో కవిత్వంతో ప్రారంభించి, పరిపక్వత పొందాక తన స్వీయ భావ జాలంతో క్రూరత్వానికి నిరసనగా రాశాడు. మంచితనంలేని సౌందర్యాన్ని మెచ్చలేదు. గాయపడిన మానవ హృదయ ఘోష వినిపించాడు. ఆధునిక మానసిక శాస్త్రాన్ని, సాంఘిక శాస్త్రంతో జోడించాడు. ఇలియట్ పాత సంప్రదాయంలో పాతుకు పోతే ఆడెన్ భవిష్యత్తుపై దృష్టి నిలిపాడు. కొన్నిసార్లు సలహాలిచ్చాడు. మరికొన్ని సార్లు కర్క్ గార్డ్, ఫ్రాయిడ్, హెన్రి జేమ్స్, మాథ్యూ ఆర్నాల్డ్, యేట్స్, రిల్కే ఐన్ స్టీన్ ఎడ్వర్డ్ లియర్‌ల అవసర మూల విషయాలు అభివర్ణించాడు. కాని వాటిల్లో పూర్తిగా మునిగి పోలేదు. ఇలియట్ రాసిన మాస్టర్ పీస్ "వేస్ట్ లాండ్" లాంటిది ఆడెన్ రాయక పోయినా ఇలియట్ తర్వాత అంత ప్రభావం చూపిన కవిగా చరిత్రలో నిలిచిపోయాడు. దీనికి భౌగోళిక, కవితాత్మక న్యాయం. ఉంది ఆడెన్ ఇంగ్లాండ్‌లో పుట్టినా అమెరికాలో స్థిరపడ్డాడు. ఇలియట్ అమెరికాలోని మిస్సోరిలో పుట్టి, బ్రిటన్ చేరి బ్రిటిష్ పౌరుడయ్యాడు. ఇలియట్ లాగానే ఆడెన్ సినిసిజం నుంచి మిస్టిజంకు, నాగరకతా వ్యామోహాన్ని త్యజించి మత విశ్వాసానికి చేరువయ్యాడు. తన తరానికి "ఏజ్ ఆఫ్ యాన్ఝై టీ" అని పేరుపెట్టి రాసిన దానికి పులిట్జర్ బహుమతి 1948లో పొందాడు. 1940 నాటి భాషను వాడుతూ అందులోని వింతైన యాసకు ప్రాణం పోశాడు. ఇది పూర్వపు ఆంగ్లో సాక్సన్ రోజుల్లోకి తీసుకువెడుతూ కొత్త అందాన్ని కల్పించింది.

40లలో ఆడెన్ రచయిత సంపాదకుడు కొల్లాబరేటర్, అనేక కవితా సంపుటుల నాటకాల, వ్యాసాలకర్త అయ్యాడు. తన తర కవులకు తన సామర్థ్యం వలన శత్రువూ అయ్యాడు. అతని అభిమాన బృందాన్ని "A circle of merchandising, cooperative than a literary school" అన్నారుఈర్ష్యతో. మార్క్సిజం పట్ల ఆరాధన ఆయనలో ఎప్పుడూ పూర్తిగా పాదుకొని లేదు. మర్చేపోయాడు తర్వాత. పబ్లిక్ స్కూల్ బాయ్ గా, గార్డెన్ పార్టీలతో జేరాల్డ్ హెర్డ్‌తో కాలక్షేపంతో బి.బి.సి.కి సైన్స్ పాప్యులరైజర్‌గా "అమెరికన్ హోలి ఉడ్ వీరీ రెలిజియాసిటికి" వ్యాఖ్యానకర్తగా బిజీ బిజీగా గడిపాడు. బారుగా, స్ట్రా ఎల్లో రంగు జుట్టుతో, తేలిక మిరుమిట్లు గొలిపే కళ్ళతో ఒక "పక్" అనిపించేవాడు. ఈ పక్కిజమే అతని అభిమానుల్ని కలవరపరచింది. కవిత్వ టెక్నిక్‌లో అనితర సాధ్యుడు ఆడెన్. చివరి రోజుల కవిత్వం "నోన్స్"లో "అనదర్ టైం"లలో మానవత్వంపై మమకారం, వినయం కనిపిస్తాయి. కోపం స్థానంలో జాలి చోటు చేసుకొన్నది. ప్రపంచ వికృత స్థితిపై రాసిన కవిత-

"Intellectual disgrace --stares from every human face --and the seas of pity lie --locked and frozen in each eye" వేదనామయ కాలం నుండి, చావు ఆలోచనలనుండి ఐక్యతా అనుభవంలోకి ప్రవేశించాడు. అతని ప్రస్థానం "from doom is dark and deeper than any sea dingle" నుంచి "we must love one another and die"లోకి ప్రవేశించింది. తన కాలపు కవుల్లో పూసల్లో మణిలాగా వెలిగాడు ఆడెన్. ఏట్స్ కవి మరణాన్ని భావ గర్భితంగా గొప్పగా వర్ణించాడు-

"in the deserts of the heart --let the healing fountain start --in the prison of the days --teach the free man how to praise"

గడచిన రెండు శతాబ్దాలలో అమెరికా బ్రిటన్ దేశాలలో కవులు రెండు వందలకుపైగా ఉన్నారు. ఇందులో విస్మృతులెవరో సంస్మృతులెవరో కాలమే నిర్ణయించాలి. అందులో 16 గురు కవులు మాత్రం తమ కాలసమస్యల్ని ఒత్తిడులను తట్టుకొని నిలిచారు. 20వ శతాబ్దం రెండు ప్రపంచ యుద్ధాల తాకిడికి తట్టుకొని నిలిచింది. వీటివలన శాంతి యేర్పడ లేదుకాని ఘర్షణ వాతావరణం ఏర్పడింది. మూడో ప్రపంచ యుద్ధం రావచ్చుననే భయం దేశాలమధ్య కొంత సయోధ్యతనుచే కూర్చింది. సహిష్ణుత పెరిగింది. హెన్రి డేవిడ్ థోరో నమ్మినట్లు "the mass of men lead lives of quiet desperation was now obvious to every one". ఈ కవులు బయటి సంఘర్షణలు, లోపలి టెన్షన్‌లకు గురైన వాళ్ళు. కొందరు ఈ కుదుపులను రికార్డ్ చేస్తే కొందరు

అలవికాక విసిరి వేయబడ్డారు. మరికొంత మంది పలాయనం చిత్తగించారు. నిలిచి వెలిగిన ఆందోళన కాలపు కవే ఆడెన్. ఆధునిక మానవుని భయాందోళనలు, కలవరం అసూయ నిరాశాలకు ఆడెన్ ప్రతి రూపమే అయ్యాడు. తనకాలాన్ని అందరికంటే ఎక్కువ ప్రభావితం చేసిన మేధావి రచయిత ఆడెన్.

వ్యక్తిగా కవిగా తనకొక స్థానం కల్పించింది అమెరికాయే నన్నాడు ఆడెన్.. అమెరికా తనను రాయటానికి ఆకర్షించిన దేశం అని మురిసిపోయాడు. 'అమెరికన్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ లెటర్స్' పురస్కారం పొందాడు. అందులో సభ్యుడై గౌరవం పొందాడు కూడా. చాలా కాలేజీలు, యూనివర్సిటీలలో బోధించాడు. 1956లో లండన్ వెళ్లి ఎమ్డెన్‌గా లెక్చర్లిచ్చాడు. నార్మన్ హోమ్స్‌తో కలిసి "పోఎట్స్ ఆఫ్ ది ఇంగ్లీష్ లాంగ్వేజ్", "ఎ బుక్ ఆఫ్ మోడరన్ అమెరికన్ వెర్స్" గ్రంథాలు రాశాడు. "ది ఎంచేఫ్ట్ ఫ్లడ్" కూడా రాశాడు. కాల్రిడ్జి, లూయీ మాన్లి, హాప్కిన్ మెల్విల్లీ, బాదర్లేర్, జూల్స్ వెర్న్ మొదలైన ప్రముఖులపై సాధికారిక ఉపన్యాసాలిచ్చాడు. ఫ్రాయిడ్, కర్క్ గార్డ్, పాస్కల్, ఓల్టేర్, మాంటేగ్, ఐన్ స్టీన్‌లపై కమ్మని కవితలల్లాడు. "కాదేదీ కవితను అనర్హం" అని చాలాసార్లు రుజువు చేసి మన శ్రీశీకి దారి చూపాడు. న్యూయార్క్‌లోని ఏడు తరాల మానవుల్ని ఏడు దశల్లో చూపాడు. ఆయన కవిత్వం సాధనకు దారి చూపింది. ప్రేమ రాజకీయం, మతం నీతి, పౌరసత్వం, సైకాలజీలపై గొప్ప శైలీ, టెక్నిక్‌తో కవిత్వం రాశాడు. ఆయన భావాలపై ఎన్నో డాక్యుమెంటరీ ఫిలిమ్స్ తీశారు. "ఫునెరల్ బ్లూస్", "అన్ నోన్ సిటిజెన్", "సెప్టెంబర్ ఫస్ట్", "రెఫ్యూజీ బ్లూస్" కవితలను ఇప్పటికీ జనం చదివి ప్రేరణ పొందుతున్నారు. అమెరికా హృదయంలోకి దూసుకు వెళ్లి, ఆధునిక కవులలో శ్రేష్టుడుగా ఉన్నాడు ఆడెన్. నోబెల్ ప్రైజ్‌కు నామినేట్ అయ్యాడు కాని అందలేదు. 29-9-1973న 66వ ఏట ఆస్ట్రియాలోని వియన్నాలో ఆడెన్ మరణించాడు. లండన్ వెస్ట్ మినిస్టర్ ఆబ్బేలో స్మారక చిహ్నం ఏర్పాటు చేశారు. 20వ శతాబ్దపు గొప్ప రచయిత అనిపించుకొన్న ఆడెన్ "ఒపేరా లిబర్టోస్" రాసి బలంగా భావ ప్రదర్శన చేశాడు. ❋




## 91. జ్వలించే విప్లవ భావం, సాటిలేని శయ్యా సౌభాగ్యశాలి నియోరొమాంటిక్ సర్రియలిస్ట్ కవి డిలాన్ థామస్ (1914-1953)

ఇరవై ఒక్క ఏళ్ళ వయసులో డిలాన్ థామస్ జ్వలించే విప్లవ భావ, సాటి లేని శైలీ శయ్యా సౌభాగ్యాలతో ప్రపంచంపై విరుచుకు పడ్డాడు. రాయగానే స్వాగతించక పోయినా, వారసత్వ కవితా లక్షణాలు లేకపోయినా, తన కాలపు ఉత్సాహ ఉద్రేక కవి అయ్యాడు. దురదృష్టవశాత్తు చిన్న వయసులోనే చనిపోయినా సాహిత్య లోకంపై బలమైన ముద్ర వేశాడు. కొన్ని కవితలు, కథా సంపుటాలు కొన్ని, స్వీయ చరిత్రలాంటి స్కెచ్‌లు మాత్రమే రాసి లబ్ధ ప్రతిష్టుడయ్యాడు. అతని "పోర్ట్రైట్ ఆఫ్ ఎ పోయెట్ అస్ ఎ యాంగ్ డాగ్"తోపాటు మరొక నాటకం ఆయన్ను సాహిత్యంలో చిరంజీవిని చేశాయి. వీటితో ఆంగ్ల సాహిత్యాన్ని సుసంపన్నం చేసి, అనుపమ సంగీత సౌభాగ్యం కలిగించి, కొత్త దృశ్యాలను చూపించి నూతన శబ్దాలు వినిపించి, సమకాలీన సాహిత్యానికి జవ జీవాలు కల్పించి సంచలనం సృష్టించాడు.

27-10-1914న వేల్స్‌లోని వెల్ష్ సీ పోర్ట్‌లోని స్వాన్సేయాలో ఇంగ్లీష్ టీచర్ కొడుకుగా డిలాన్ థామస్ పుట్టాడు. టౌన్‌లోని గ్రామర్ స్కూల్‌లో చేరి క్లాస్ రూమ్ పాఠాల కంటే, స్థానిక జానపద గీతాలపై ఆసక్తి పెంచుకొన్నాడు. "చిన్నప్పుడు నేను చిన్న, సన్న, చురుకైన వెంటనే మురికి అయ్యేట్లు, ఉంగరాల జుట్టుతో ఉండేవాడిని" అని చెప్పుకున్నాడు. సాధారణ చదువు పూర్తయి, గ్రామర్ స్కూల్ వదిలి నటుడిగా రిపోర్టర్‌గా, రివ్యూ రాసేవాడిగా, స్క్రిప్ట్ రైటర్‌గా ఇంకా అనేక చిన్నా చితకా ఉద్యోగాలు చేస్తూ పొట్ట కూటికి డబ్బు సంపాదించాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో "యాంటి ఎయిర్ క్రాఫ్ట్ గన్నర్"గా పని చేశాడు. ఈ అనుభవాలన్నీ కవితల్లోకి చేరాయి. 21కి కైర్లిన్ మాక్నమారాతో వివాహమై, లివిలీన్ కాలం అనే ఇద్దరు అబ్బాయిలు, ఐరాన్ అనే కుమార్తెను కనీ, లాఫర్నే, కర్మర్తాన్ షైర్ అనే చేపలు పట్టే గ్రామంలో స్థిరపడ్డాడు. అక్కడ తన ఇల్లు "బోట్ హౌస్" మాత్రమే నని చెప్పుకొన్నాడు. ఈ గ్రామం ఒకప్పుడు ఫెర్రీల రేవుగా ఉండేది. ఇరవైలలో ఉండగా తాను రాసిన కవితలను బి.బి.సి. రేడియోలో చదివి వినిపించేవాడు. 1950లో మొదటిసారి అమెరికా వెళ్లి రెండేళ్ళ తర్వాత తిరిగొచ్చి మళ్ళీ 1953లో వెళ్ళాడు. అక్కడ తనవి, తనవి కానివి పాటలు పాడి రంజింపజేసేవాడు.

అతను పాడేది అతని స్వంతమో ఇతరులదో ఎవరికీ తెలిసేదికాదు. "కాళిదాసుకవిత్వం కొంత నా పైత్యం కొంత" అన్నట్లు ఉండేది. అతని గానమాదుర్యం, తాదాత్మ్యతతో పాడటం అందరినీ ముగ్ధులను చేసేవి. అతనిలో షెల్లీ మళ్ళీ కనిపించినట్లు ఉండేది. మంత్ర ముగ్ధమై విని పరవశించేవారు. కాగితంపై ఉన్న ఆయన కవిత్వం అర్థం కాక పోయినా ఆనాటి హృదయాకర్షణ పాటకుడు అనిపించాడు. అమెరికా స్వంత ఇల్లు అయింది. "నాకు న్యూయార్క్ అంటే నమ్మకం లేదు కాని సౌత్ ఎవెన్యును ప్రేమిస్తాను" అనేవాడు. సీమెన్స్ బార్ అంటే ఇష్టం. అక్కడ అతన్ని వెల్ష్ జాతివాడిగా గుర్తించి మాట్లాడేవారు. అది సాహిత్య సాంఘిక కార్యకలాపాల క్లబ్‌గా ఉండేది.

35వ ఏట "నేను ముసలి, చిన్న, నల్ల, తెలివైనవాడుగా మిలమిల మెరిసే కళ్ళతో జుట్టురాలిపోయి పళ్ళూడి పోయిన వాడిగా ఉన్నాను" అని చెప్పుకొన్నాడు. బలంగా, లావుగా ఉన్నా చురుకుగా కదిలేవాడు. మూడోసారి అమెరికా వెళ్ళినప్పుడు ఇగార్ స్ట్రావిన్స్కితో కలిసి ఒక ఒపెరాకు పని చేయాలనుకొన్నాడు. కథ ముందే సిద్ధం చేసుకొని సంగీతం కాలిఫోర్నియాలో కూర్చాలనుకొన్నారు. అతని "కలేక్టేడ్ పోయెమ్స్" అప్పుడే సెన్సేషనల్ విజయం సాధించింది. న్యూయార్క్ లో 39వ పుట్టిన రోజును ఘనంగా సంతోషంగా జరుపుకొన్నాడు. సంబరాలు అంబరాన్ని అంటుతున్న సమయంలో తీవ్రంగా జబ్బు పడ్డాడు. వెంటనే సెయింట్ విన్సెంట్ హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళారు. అక్కడ మెదడుకు సంబంధించిన "యెన్ సెఫలో పతి" అనే జబ్బుతో బాధ పడుతున్నట్లు నిర్ధారించారు. సుమారు రెండు వారాలలోపే డిలాన్ థామస్ 9-11-1953న మరణించాడు.

థామస్ ఇరవై ఏళ్ళ లోపే "యైటీన్ పోయెమ్స్" అచ్చు అయింది. స్విన్ బరన్ కవిత్వమా అనిపించింది. అణ గారిన నాగరకత, సాక్సన్ వెలుగున్న సెల్టిక్ నీడ అతని కవిత్వంలో కనిపిస్తుంది. అతని ముందు మూడు పుస్తకాలను కలిపి "ది వరల్డ్ ఐ బ్రీత్" పేర ఒకే పుస్తకంగా తెచ్చారు. డిలాన్‌ను అత్యద్భుత నవ కవిత్వ సృష్టికర్తగా గుర్తించి అతని కవిత్వాన్ని సర్రియలిజం కవిత్వం అన్నారు. వీటిలో పగటికలలు, సబ్ కాన్షస్‌లో విహారం కనిపిస్తాయి. ఫ్రాయిడ్ ప్రభావమూ ఉంది. "poetry is the rhythmic, inevitably narrative, movement from an over clothed blindness to a naked vision. Poetry must drag further into the clear nakedness of light more even of the hidden cause than Freud could realize" అంటాడు థామస్. చనిపోవటానికి ఏదాది ముందు అచ్చు అయిన "ఇన్ కంట్రీ స్లీప్ అతనే చెప్పినట్లు" "record of my individual struggle from darkness toward some measure of light. To be stripped of darkness is to be clean, to be stripped of darkness is to be clean, to strip of darkness is to make clean".

చివరి రచన "అండర్ మిల్ వుడ్" బి.బి.సి.లో ప్రసారం కావాల్సింది. అమెరికాలో ప్రాభవం పొందింది. ఇందులో ఒక మచ్చుతునక- "it is spring moonless

night in the small town starless and --bible black, the cobble streets silent and hunched --courtiers and rabbit' wood limping invisible down to --the slow back, slow, black crow black, fishing boat hobbing sea"

లారెన్స్ బిన్యాన్ బ్లేక్ ద్విపదులలాగా కప్లెట్స్ రాశాడు- "the spirit born to bless --lives but in its own excess"

పేదరికంలో గడిపిన థామస్ డబ్బు సంపాదించటం ఎట్లాగో తెలియదు. తాను "I want to write only poems of God "s world --by a man who does not believe in God" అంటాడు డిలాన్. వేర్నార్ వాట్కిన్సన్ ఇచ్చిన పారితోషికానికి కృతజ్ఞత తెలుపుతూ జాబు రాస్తూ "మీరిచ్చిన గుండ్రని సిల్వర్ ట్రాష్"ను నేను అమ్ముకొంటే నెల రోజుల గ్రాసం లభిస్తుంది. నాలాంటి వాడు చేతిలో పెన్నీ లేకుండా జీవించటం దారుణం" అన్నాడు. థామస్ చనిపోయాక ప్రాభవం మరింత పెరిగింది, అతని చిన్న కథలు బాగా క్లిక్ అయ్యాయి. అతని రచనలో బాల్యం, సెక్స్ సామర్ధ్యం, కల్లోల మతం చావు లే విషయాలు. "My world was christened in a stream of milk and earth and sky were alone airy hill --I dreamed my genesis in swear of sleep" అంటాడు. అండర్ మిల్క్ వుడ్ బి.బి.సి.లో ప్రసారం కావాల్సింది 1953లో అమెరికాలో అయింది. ఇందులోని రెండు భాగాలను థామస్ స్వంత గొంతుకతో చదివాడు. తనకవిత ప్రతిదాంట్లోనూ మనిషి ప్రేమ, దేవుని ప్రస్తుతి ఉంటాయని అవే లేకపోతే తాను నిరర్ధక జీవినే అవుతానని చెప్పుకొన్నాడు. అతడు చదువుతుంటే విశ్లేషణకు అందనంత వేగంగా దూసుకు పోతుంది కవిత్వం. అదే ఆయన ప్రత్యేకత.

థామస్‌ను చిరంజీవిని చేసిన కవితలు "డు నాట్ గో జెంటిల్ ఇన్ దట్ గుడ్ నైట్", "ఎ డెత్ హావ్ నో డొమినియన్" నాటకాలు "ప్లే ఫర్ వాయిసెస్", "అండర్ మిల్క్ వుడ్"లు, ఏ సాహిత్య ముఠాకు చెందనివాడు థామస్. నియో రొమాంటిక్, ఫ్రాయిడ్ ప్రభావం వెల్ష్ జాతీయ ప్రభావం ఉన్నవాడు. అమెరికా వెళ్ళినప్పుడు థామస్ హార్డీ కవితల్ని ఆయనకే చదివి వినిపించినవాడు. వెల్ష్ జాతీయుడేకాని దాని జాతీయతపై అంతగా ఇష్టం లేనివాడు. ఆ జాతీయతను "హిల్ ఫారం మొరాలిటీ" అంటాడు. శబ్ద ప్రయోగంలో అందేవేసిన కవి. పోతన కవి లాగా చెవులకింపైన పద ప్రయోగం చేసి మనసులను ఆకర్షిస్తాడు. థామస్ సమాధిపై ఆయనే రాసుకొన్న కవితను చెక్కించి ఘన నివాళి సమర్పించారు- "Not for the proud man apart from the raging moon I write on these spindrift pages not for the towering dead with their right angles and psalms but for the lovers, their arms round thee griefs of the ages who pay no heed my craft or art"

## సమాప్తం